శ్రీ హయగ్రీవాయ నమః









# శ్రీమదాంధ్ర మహాభారతము







శ్రీమాన్
బుక్కపట్టణము
రామానుజయ్య
గారిచేఁ
బరిశోధితము.

వేమూరు - ... కృష్ణయ్య సెట్టి అండ్ సన్సుచేఁ
బ్రకటింపఁబడుచున్నది.



గుత్తూరున్ను
ఎ. కణ్ణాన్ సెట్టి అండ్ కంపెనీవారిచేఁ
ముద్రింపఁబడినది.

ప్రకాశకులు :

బుక్సెల్లర్సు & పబ్లిషర్సు
286, తైనాబజారు రోడ్డు.
మద్రాసు.

1939.

# పీఠిక

ఈపర్వమును దొలుతఁ బరిశోధించునపుడు రెండు మూఁడు శబ్దములకుఁ బ్రసిద్ధముగా వ్యవహరింపఁబడుచున్న రూపములందు మాఱుపాటులు వ్రాఁత ప్రతులం దెల్ల నొక్కతీరునఁ గానిపించుచు వచ్చినవి. అయినను లాక్షణికు లగు నితరకవుల ప్రయోగములును వాని కుపోద్బలకములుగాఁ గనుపట్టువఱకు నా మాఱుపాటులను నంగీకరింప నేరకుండి పిదపఁ బెక్కు లితరకవిప్రయోగములు గనుపట్టఁగా నామాఱుపాటుల నిందుఁ దెలుపువాఁడ నయితిని.

పట్టుఁగొమ్మ :—ఇది 'పట్టుఁగొమ్ము' అనియె వ్రాఁతప్రతులఁ జూపట్టు చున్నది. కొమ్ముశబ్దము 'కొమ్ము' అనునవపదమునుండి నిష్పన్నము కానోపు. కనుక 'పట్టుఁగొమ్ము' అనఁగా ఊఁతకఱ్ఱ (ఆలంబనదండము) అని యర్థ మగు చున్నది. ఇందుఁ బ్రథమాశ్వాసమున

'ఘనభుజవిక్రమోన్నతుఁడు, కౌరవకోటికిఁ బట్టుఁగొమ్ము (౭-పద్య.)

అని యున్నది.

శ్రీనాథుని హరవిలాసమునందును

క. తిమ్మ ధనార్థుల పట్టుం
గొమ్మ వివేకాదిసకలగుణరత్ననిధా
నమ్ముఁ ద్రిపురారియనుఁగుం
దమ్ముఁను బుధజనము సంతతమ్మును బొగడున్. (౧-ఆశ్వా.)

శ్రీరామాభ్యుదయమందు

చ. దయకుం గందువ, దానకేలి కిర, వంతశ్శుద్ధికిన్ జన్మభూ
మి, యుదారత్వమురచ్చపట్టు, జయలక్ష్మీలీలకుం బట్టుఁగొ
మ్మయవిస్ఫూర్తికి నాస్పదం, బఖిలవిద్యాతారతమ్యజ్ఞతా
శ్రయ మీగొబ్బురినారసింహమనుజేంద్రస్వామి సామాన్యుఁడే. (౧-ఆశ్వా.)

ఈప్రయోగములంబట్టి 'పట్టుఁగొమ్ము' అని గ్రహించుటయే సాధువుగాఁ దోఁచుచున్నది.

ఏటికిన్—ఇది 'ఏఁటికిన్' అని సబిందుకముగానే యన్నిగ్రంథముల వ్రాఁతప్రతులను జూపట్టుచున్నది. ఇది 'ఏమిటికిన్' అనుదానిసంక్షిప్తరూప మై యందలి మకారమునననునాసిక శ్రుతికి మాఱుగా ననుస్వారము నొంది యుండు నని తోఁచుచున్నది. ఇందులకు భాగవతమున,

క. ఏఁటిది నీరాచటికం, బాఁటది మొఱవెట్టఁ బశువు లాతురపడ నో
యాఁట దని లేచి దొంగల, గీఁటవు వెడలంగఁ బశువుక్రియ నుండెదే.

కేయూరబాహుచరిత్రమున

క. నేఁటి కివి గంటి వెట్టఁగ, నేఁటికి నీబోయ వింట నిడ్డనరము లీ
పూఁటఁ గడపఁ జాలవె యొక, నాఁటం బ్రాణంబు సనునె నవసినమాత్రన్.

(3-ఆశ్వా-౧౪౩.)

పోతనయు మంచనయు సబిందుకనిర్బిందుకములకుఁ బ్రాసమైత్రి ఘటింపరు. పోతనరచనలయం దాయాయెడ నిందులకుఁ గనుపట్టువిపర్యయ మితరకవిపూరణములంబట్టి యైనది.

పోక–ఇది 'పోకు' అని చూపట్టుచున్నది. అఱవమున 'పోక్కు' నుండి యిది కలిగియుండును. పూర్వరాజ్యవిభ్రమణములయందును నూతనరాజ్యస్థాపనములయందును భాష లొండొంటితో సంపర్కము నొందుటవలన నాయాభాషలం దన్యభాషాపదప్రవేశరూప మగుసాంకర్యము చూపట్టుచున్నది. దీనిచే భాషకును వన్నె తగ్గదు; అతిశయమును గొఱవడదు.

తేరసి–ద్వాదశికి 'బారసి' యనునట్లె త్రయోదశికి 'తేరసి' యని రూపము గన్పట్టుచున్నది. 'బారసి' యనుటకు 'త్రయోదశ్యామ్' అని మూలము. ఇదియే 'బారసి' యని పూర్వముద్రణములం దున్నది. ఈమాఱుపాటు లితరకవిప్రయోగానుగృహీతములుగాను మూలానుగుణములుగాను నుండుటంబట్టి సమంజసములుగాఁ దోఁచెడిని. గుణదోషములు తెలుపఁ బండితులు ప్రార్థితులు.

ఇట్లు,
తం. తేవప్పెరుమాళ్లయ్య.

---

ఏలూరు రామా అండ్ కంపెనీవారు, ఈ శాంతిపర్వమును ముద్రింపించుచు దీని భారమును నాయం దుంచినారు. నేనును మాతృభాషాసేవ శ్రీ పరమేశ్వరీసేవగా భావించువాఁడ నగుటం జేసి యతిజాగ్రత్తగానే సరిచూచి, పూర్వముద్రణమునందలి యచ్చుపొరపా ట్లెన్నియో సవరించితిని. ఇంకను ఎందేని లోపము లుండినచో, చదువరులు మన్నింతురుగాక! 'ఏటికిఁ' అనుపదమును గుఱించి పీఠికలోఁ గొంత చర్చించి, అది సబిందుకమే అని నిర్ణయించినారు. ఆపద మీ శాంతిపర్వమునఁ బ్రాసములోఁగాక పద్యము మధ్య నెక్కడనో 'ఏఁటికిఁ' అని యున్నది. నే నింతవఱకు నది సబిందుకముగాఁ జూచియుండలేదు. కాన, అది యచ్చుపొరపా టనుకొని, అఱసున్న తొలఁగించితిని. తరువాత వారు వ్రాసినపీఠిక చూడఁదటస్థించినది. వా రిచ్చిన భాగవతప్రమాణము చూచి, భాగవత మంతయుఁ దిరుగవేసితిని. ఆనవమస్కంధములోనే 408-వ పద్యమున 'ఏటికిఁ' అనుపద మితరులు ముద్రించిన ప్రతులలోఁ బ్రాసస్థానమున నిర్బిందుకముగానే యున్నది. పోతన్నగారు సబిందునిర్బిందుకములకుఁ బ్రాస ముంచలే దన్నారు. కాని, ఆస్కంధములోని 408-వ పద్యమునందలి ఆటవెలఁది పద్యముత్తరార్థమున "తోఁటలందు రత్నకూటంబులందును" అని సబిందు నిర్బిందుకములకుఁ బ్రాస మున్నది. ఇంతకును భారతకవులు 'ఏటికిఁ' అన్నపదమును ప్రాసములోఁ బ్రయోగించినది దొరకువఱకు నది నిర్బిందుకమే యని నాయాశయము.

ఇట్లు
భాషాసేవకుఁడు,
పురాణం సూర్యనారాయణతీర్థులు.

# విషయసూచిక.



## శాంతిపర్వము-ప్రథమాశ్వాసము.



## శాంతిపర్వము-ద్వితీయాశ్వాసము.

## శాంతిపర్వము-తృతీయాశ్వాసము.

## శాంతిపర్వము-చతుర్థాశ్వాసము.

## శాంతిపర్వము-పంచమాశ్వాసము.

# వి జ్ఞా ప న ము.

ఇంచుమించుగా నర్ధశతాబ్దికిఁ బూర్వము మద్రాసువాస్తవ్యులయిన శ్రీ
హరి వేంకటకృష్ణమశ్రేష్ఠి అండ్ సన్సువారు, శ్రీమదాంధ్రమహాభారతము,
మదాంధ్రభాగవతము మొదలయిన కొన్నియుద్గ్రంథములను మంచిస్థితికిఁ దెచ్చి
ద్రింపించి వానిని "ఆనందాశ్రమగ్రంథమాల" అనుపేరఁ బ్రకటించుచు
నారు. తరువాత నాగ్రంథమాలభారమును, మద్రాసువాస్తవ్యులయిన
యుతులు, ఏ. కణ్ణశ్రేష్ఠిగారు తమవశము చేసికొని చిరకాలము ప్రకటిం
ప వచ్చుటయేకాక యింకను కొన్ని క్రొత్తగ్రంథములనుగూడఁ జక్కఁగా
ద్రింపించి ప్రకటించియున్నా రన్నసంగతి యాంధ్రమహాజను లెఱింగినవిష
మేకదా!

ప్రస్తుతము శ్రీకణ్ణశ్రేష్ఠిగారు సదరు ఆనందాశ్రమగ్రంథమాలా
ంథముల యావదధికారమును లిఖితపూర్వకముగా మాపరము చేసియున్నారు.
బట్టి, ఇంతటనుండి సదరు గ్రంథములవిక్రయము, పునర్ముద్రణము మొదలగునవి
మే చేయించుచున్నా మనియును, పునర్ముద్రణసమయమునందు మేమును
జాగ్రత్తతో ముద్రింపించుచుందు మనియును విన్నవించుచున్నాము. కావున
ధ్రమహాశయులెల్లరును మాచేయఁబూనుకొన్న యీభాషాసేవకుఁగూడ సర్వ
ముల సాహాయ్యపడుచుందు రనియు, ఇంకను ముఖ్యగ్రంథములను ముద్రిం
ప్రకటించుచుండుటకు మాకుఁ దమసలహాల నిచ్చుచుందు రనియు నాంధ్ర
జనులసమక్షమునందు సవినయముగా విన్నవించుచున్నారము.

హెడ్డాఫీసు
ఏలూరు
మగోదావరి.

ఇట్లు
భాషాసేవకులు,
రామా అండ్ కంపెనీ.
ప్రచురణకర్తలు,
286, ఎస్ప్లనేడు, మద్రాసు.



శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము,

## శాం తి ప ర్వ ము, ప్ర థ మా శ్వా స ము.





సంక్రామణనిపుణవి
లాసకటాక్షా నివృత్తిశలంపటచిత్తో
ల్లాసనదక్షా వేద
వ్యాసవచోవిభవలక్ష్మ్య శ హరిహరనాథా. 1

### మహర్షులు పాండవులం జూడ వచ్చుట.

దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు సకలబంధుమిత్త్రజనంబులకు నుదకకర్మం బాచరించి పాండవులు గంగాతీరంబున నశుచిత్వం బపనయించుటకయి యొక్క సమస్థలంబునం బటకుటీరసంవిధానంబు సేయించి ధృతరాష్ట్రవిదురసర్వభరతభార్యాసమేతంబుగా నచ్చట మాసమాత్త్రంబు నిలిచి రట్టియెడం గృష్ణద్వైపాయన నారద దేవల దేవస్థాను కణ్వులు మొదలుగాఁ గలమునీంద్రులనేకులు శిష్యవర్గసహితంబుగా ధర్మనందనుసందర్శనంబునకుం జనుదెంచిన నజ్జననాథుండు ప్రత్యుత్థానప్రణామపాద్యాసనాకలనంబులను దత్కాలోచితార్చనంబులను నమ్మహాత్ములం బ్రీతులం గావించి కృష్ణనిజానుజయుక్తంబుగా వారల నుపాసించి యుండ వారలు బహువిధంబు లగుప్రియవచనంబుల నక్కురువంశసత్తము సంభావింప నారదుం డమ్మహనీయద్విజులం గలయం గనుంగొని యక్కౌంతేయాగ్రజుతోడం దాను గుశలప్రశ్నంబు లగుమాటలాడం గలవాఁడగుట వారి కెఱింగించి యమ్మహీపతియాననం బాలోకించి. 2

శా. గోవిందుం డనిశంబు శోభన మెదం శ గోరంగఁ బార్థుండు ద
[1]ర్పావేశోజ్జ్వలబాహుసారమహనీశయ[2]స్ఫూర్తిసంశోభిగాం
డీవోల్లాసవిభాసి యై సమరపాంశడిత్యంబు వాటింప సం
భావింపన్ జగ మెల్ల రాజ్య మిటు లొశప్పం [3]గాంచె రాజోత్తమా. 3

చ. భువనభయంకరంబు లగుశపోరులఁ దమ్ములతోడఁ గూడ నీ

---

1. క. ర్పావేశంబున బాహు. 2. గ. జ. స్ఫూర్తి శోభిల్ల గాం. 3. జ. గాంచె.

వు వెడలఁ బాటు[1] లెస్స యల।వుం జలముల్ వెలయించుచోట ధ
ర్మువున కొకింతయుం దొలఁగ। ద్రొక్కమి యెంతయు మేలు దీనఁ గౌ
రవకులముఖ్య యుష్మలిక। గ్రాఁచితె చిత్తము ప్రీతిఁ బొందెనే. 4

అనిన విని యజ్జనవిభుం డమ్మునివిభున కిట్లనియె. 5

కృష్ణుండు మామీఁద।గృప సేయుటయు బ్రాహ్మ, ణానుగ్రహంబున।ననిలపుత్ర
పార్థులపటుబాహు।బలమున మేదిని, యంతయుఁ జేకుఱు।నట్టి దయ్యె
నైనను నతిఘోర। మగునఖిలజ్ఞాతి,వధ యొనరించుట।వలన నధిక
గుణుని సౌభద్రునిఁ। గులభూషణంబుఁ బాం, చాలీతనూజపం।చకముఁ గోలు
పోకఁ జేసియు గెల్పు గె।ల్పుగ మదీయ,బుద్ధి గైకొన దయ్యెడు। సిద్ధముఖ్య
యదియుఁగాక వేఱొక్కండు।మదిఁ గలంచు, చున్నయది దాని నేర్పడ।విన్నవింతు.
ఘనభుజవిక్రమోన్నతుఁడు। కౌరవకోటికిఁ బట్టుఁగొమ్ము మ
మ్మని మొనఁ దూలవుచ్చినమ।హాత్ముఁడు కర్ణుఁడు గొంతితొల్తచూ
లని యుదకప్రదానసమ।యంబున నాయమచేత వింటి నా
తని కుదకంబు లిచ్చుటకుఁ। దా మముఁ బంచుట గోరి చెప్పినన్. 7

అప్పుడు దొడంగి యంతరంగంబు నిప్పులం[2] బొరఁటినట్లయ్యెడి నక్కుంతీమహాదేవి దాను దివాకరువరంబున నప్పురుషవరుం బడసి పాఱవైచుటయుం బిదప నతండు ధార్తరాష్ట్రులపాల దొర యై యుండ మాకును వారికిం గలహంబు పుట్టిన నది మాన్పించుటకై యక్కొడుకుకడకుం జని యేకాంతంబునం బుట్టువు దెలుపుటయు లో నయినతద్విషయవార్త లనుదినంబునుం జెప్పుచుండు. 8

ఆయమ దనపుత్రుఁ। డవుట యెఱింగించి, తమ్ములలోనికి। రమ్ము నీవు
నావుడు నాతండు। నాకుఁ గృతఘ్నత, వాటిల్లదే కురు।పతిఁ దొఱంగి
వచ్చిన నది గాక। వాసవితోడిక, య్యంబున కితఁ డోడె। ననరె యతఁడు
బెరయనొండెను నను। బెరసి యొండెను నేవు, రింతియ కాని। నీ వెపుడు నీకుఁ
దనయు లార్వు రనకు। మనియె నద్దేవి ద, క్కనుజులెల్ల వారి।కభయ మొసఁగు
మనిన నట్ల కాక। యని మమ్ము నలువురఁ, బట్టెఁ గాని తెగఁడ।ప్రాణములకు.
తొల్లి తాన దాఁచెఁ। దల్లి పదంపడి, యతఁడు సెప్పవలవ।దనఁగ దాఁచె
నిట్లు[3] గాఁగ నెఱుఁగ।[4]మేవురమును నతం, డిట్టిఁ డగుట దాన। నింత పుట్టె. 10

ఆతఁడు దుర్యోధనునకుఁ, బ్రీతిగ జూదంబునాఁడు। పెక్కాడెను ధ
ర్మేతరములు వానికి మ, చ్చేతోగతి [5]కోపభరము। చెందక యుండున్. 11

అతనిమేను కుంతి।యట్టులకై వడి, యరయ నేను జూచి। యాత్మ నెద్ది
కారణంబొ యిట్లు। గా ననుచుండుదు, నేమి సేయువాఁడ। నింకఁ జెపుమ. 12

కౌరవులు సేయునవమతి, కారణముగఁ గోప మెత్తుఁ। గర్ణునివదనాం

---

1. నెవి. 2. గ. పొరపి-జ. బొరలి-నట్లయ్యెడి. 3. క. గాన. 4. గ. మే మేవురమునతం. 5. జ. రోషభరము.

భోరుహముం గనుఁగొన శమ, మారఁగ నావశము గాక | యంతన బుద్ధిన్. 13

ఉ. గాండివి నొవ్వఁ బల్కి [1]తిటు | గర్ణునిఁ జంపక వచ్చితేనిఁ ద
మ్ముండవు గావు నాకు నని | మూర్ఖత సోదరఘాతి నైనక
ష్టుండ మనంబునం [2]బెఱుగు | శోకము నెట్లు సహింతుఁ దప్పె నా
తండును నేము నైన విబు | ధప్రకరంబును మాకు నడ్డమే. 14

వ. అని పలికి మునీంద్రా యమ్మార్తాండనందనురథచక్రంబు భూమిం గ్రుంగుటకు
గారణం బెద్ది దాని నవ్వీరుండు పరశురామునిచేత శప్తుండయిన తెఱంగును నెఱిం
గింపవలయు భువనంబులవర్తనంబులు నీకుం దేటపడనియవి లేవు గావున నిన్నడి
గెద నని ప్రార్థించుటయు నవ్విధం బంతయు వివరించెద విను మని యమ్మహీపతి
కమ్మహాత్ముం డిట్లనియె. 15

నారదుండు ధర్మరాజునకుఁ గర్ణునిచరితంబు చెప్పుట.

సీ. మునిదత్తమగుమంత్ర | మున గొంతి కన్నియ, నాఁడు వేడుక దిన | నాథుఁ దనకుఁ
బ్రత్యక్షముగఁ జేసి | పడయుటఁ దా సిగ్గు, పెంపున సుతు వెల | యింప దయ్యెఁ
గన్యాత్వవికలత | గా కుండ నాసూర్యు, వరము గల్గుట జేసి | వంశవర్య
యై పొల్చె దేవర | హస్య మిత్తెఱఁ గిట్లు, పాఱ వైవఁగఁబడ్డ | పట్టి సూతుఁ
తే. డెత్తికొనిపోయె సూతజుం | డితఁ డనంగఁ, బెరిఁగి కర్ణుండు నీనేర్పు | భీములావు
నరునివిలుబల్మి యతని కి | హరికిఁ గలుగు, చెలిమిగని తద్దవగఁ బొందుఁ | జిత్తమెరియ.

క. నకులసహదేవనయశా, స్త్రకళావేదిత్వమునకు | జను లనురాగా
ధికు లై మిమ్ముం గొనియా, టకు నాఁతఁడు మనసు గీడ్ప | డం జింతిల్లున్. 17

వ. అది తదీయస్వభావం బట్లుం గాక దైవఘటనంబు నట్టిద యమ్మాత్సర్యంబున న
క్కర్ణుండు మీయెడ నీసు గలవాఁ డయి దుర్యోధనుం గూడికొనియెఁ బందపడి
ధనంజయుధనుర్విద్యాతిశయం బుపలక్షించి కుంభసంభవుపాలికిం జని యేకాంతం
బునం దనకు బ్రహ్మాస్త్రంబు సాంగోపాంగంబుగా నుపదేశింపవలయు నని యడిగి
యేను సమరంబున సవ్యసాచికి సమానుండ నగుటఁ గోరి వచ్చితి నీవు సర్వశిష్య
సమాదరుండవు భవత్ప్రసాదంబునం గృతాస్త్రుండ నయి వెలయ వలదే యన
వుడు నద్దిననాథనందనునకు నగ్గురుం డిట్లనియె. 18

తే. వ్రతసమన్వితభూసుర | వర్యుఁ డొండె, నిరుపమానతపఃపుణ్య | నృపతి యొండెఁ
గాని యన్యులు బ్రహ్మాస్త్ర | దానమునకుఁ, బాత్రములుగారు నీకు నీ | బాడి[4]గాదు.

వ. అనుటయు నట్ల కాక యని నిజమందిరంబునకుం జని మఱునాఁడు గదలి
మహేంద్రమహీధరంబున కరిగి పరశురామునిం గాంచి వినయంబున బ్రణమిల్లి
యేను బ్రాహ్మణుండ భృగువంశజాతుండ నస్త్రవిద్యాపేక్ష నిన్నాశ్రయింప
వచ్చితి ననిన నమ్మునివరుండు ప్రీతుం డై కర్ణుం బరిగ్రహించి పరిశ్రమంబు

1. క. తిట. 2. గ. గదురు; జ. బరఁగు. 3. గ. చేద్వపం. 4. చ. లేదు.

సేయించు చుండె నట్టియెడ నాశ్రమపరిసరంబున నొక్కచోఁ దనయంతన లాఘ
వాభ్యాసంబు సేయు చుండ నొక్కమహాద్విజునిహోమధేనువువత్సం బడ్డంబు
వాఱి బాణగోచరంబై మృతిం బొందినం గని యవ్విప్రుండు గోపంబున శాపం
బిచ్చిన దానం దేరు ధరణిం గ్రుంగె జామదగ్న్యుండు శపించిన తెఱంగునుం
జెప్పెద నవ్వీరుం డతనికి భక్తుండై పరిశ్రమం బాచరింప నతండు బ్రహ్మాస్త్రంబు
లోనుగా ననేకాస్త్రంబు లొసంగెఁ బదంపడి యొక్కనాఁడు. 20

కర్ణునుత్సంగమున మస్తకంబుఁ జేర్చి, గురుఁడు నిద్రింప వికృతాతిఘోరరూప
మళికమని యెడునొకకీటమద్దినేంద్ర, తనయు[2] క్రీఁదొడఁ దొలిచె సత్వరముగాఁగ.

అతండును గురునకు నిద్రాభంగం బగుట కోర్వక ధైర్యంబునం గీటకృత్యంబున
కోర్చి యచలుండై యుండె నెత్తురొండొండ పఱఁగి పరశురాముశరీరంబు సోఁ
కిన నమ్మహాత్ముండు మేల్కని రక్తం బెక్కడిదని యడిగినఁ దొడయెత్తి కీటంబుం
జూపి యిది దొలుచు చుండ మీనిదుర సెడుటకుం జాలక కదలకుంటి ననియె
నమ్మునిగనుంగొనిన నక్కీటంబు. 22

మృతిఁ బొంది రాక్షసుం డై, ఖతలంబుననుండి పలుకుఁ గరుణాకర నీ
కతమున దారుణశాప, ప్రతిహతి వాటిల్లె నిపుడు ప్రకృతి వడసితిన్. 23

గ్రస్తుం డనుపేరం బరఁగునొక్కరక్కసుండ భృగుపత్ని నపహరించి తదీయ
శాపంబునం గీటంబ నై యుండి భవదీయవిలోకనామృతసేకంబున సుఖి నైతి నని
చెప్పి నమస్కరించి నిజేచ్ఛం జనియె రాముండు రాధేయుధైర్యంబు మనంబున
నిరూపించి యతనితోడ. 24

ఈతాల్మి లేదు బ్రాహ్మణ, జాతికి నీ వెవ్వఁడవు నిజం బనవుడు నే
సూతజుఁడ ననియె వెఱచుచు, నాతం డామునివరేణ్యుఁ డతికుపితుం డై. 25

నీవు బ్రాహ్మణుండ నని కపటంబున మత్పరిగ్రహంబు వడసితి తత్ఫలం బనుభ
వింపు మని యస్త్రవిభవంబు [2]వికలంబుగా శపియించెఁ గర్ణుడునుం జేయునది
లేక వగచుచు వచ్చి దుర్యోధనుం గాంచి. 26

అధిప పరశురాము నాశ్రయించితిఁ గృతా, స్త్రుండ నైతి నున్న ఖండనమున
మార్కొనంగ లేరు సమగ లిజ్జగంబున, ననుడు నతఁడు ప్రముదితాత్ముఁ డయ్యె.

ఇవి మీయన్న వోయినపోకు లిట్లు దుర్యోధనునకు ననుంగై యుండం గళింగపతి
యగుచిత్రాంగదుండు శుభాంగి యనునిజపుత్త్రికి స్వయంవరమహోత్సవంబు
సేయించువాఁ డై చాటించిన శిశుపాలుండును నీలుండును జరాసంధుండును
రుక్మియు లోనుగా రాజు లనేకులు తదీయరాజధాని యగు రాజపురంబునకుం
జనిరి దుర్యోధనుండును దోహలంబున సముచితచతురంగబలసమేతుండును గల్పి
తరథారూఢుండును గర్ణసహాయుండును నై యరిగె నట్లు గూడినభూపతులకుం

1. క. గ. చ. జ. 'అళక' అ. అలర్క. 2. క. గ. చ. క్రిందొడ. 3. గ. విఫలంబుగా.

దగుసంవిధానంబు లాచరించి. 28

సీ. కాళింగుఁ డాత్మీయకన్యాస్వయంవర, కార్యంబు నడప నక్కన్యసఖులు
దాదులు ¹పేర్వేర ధరణీపతులఁ జూపి, చెప్పంగఁ జూచుచుఁ జేతఁ బుష్ప
మాలిక యొప్పఁ దర్మ్యవీథికి నల్ల, నడచుచోఁ గురుపతిఁ గడచి పోయె
నతఁ డల్గి యచ్చపలాక్షిఁ బోనీ కాఁగి, పట్టి రథంబుపైఁ బెట్టఁ ²బనిచి

ఆ. యేఁగుచున్నరాజు లెల్ల సంక్షోభించి, కూడుకొని యుదగ్రఘోరభంగిఁ
దాఁకి రవ్విభుండుఁ దలఁకక బలశౌర్యములు పొగడ్త కెక్కఁ బోరె నధిప.

వ. అట్టియెడ. 30

శా. భల్లంబుల్ పరఁగించి యుగ్రముగ భూపాలోత్తమాంగంబులన్
డొల్లం జేయుచుఁ జిత్రలాఘవము నాటోపంబు దర్పంబు రా
జిల్లం గుంభిఘటారథవ్రజహయశ్రేణీపదాతిప్రతా
నోల్లాసంబుల రూపుమాపుచు ననార్యుం డయ్యెఁ గర్ణుం డనిన్. 31

వ. ఇవ్విధంబున విక్రమించునవ్వీరవర్యుని శౌర్యబాహువీర్యంబులకు భయంబుఁ గొని హతశేషు లయినభూపతులు వఱచినం బ్రీతుం డగుచు నక్కురుకుమారుండు గన్యారత్నంబుఁ గొని కరినగరంబున కరుగుదెంచె నప్పగ మనంబునఁ బెట్టికొని పదంపడి జరాసంధుం డక్కమలబంధుపుత్రు నెక్కటిపోరికిం బిలిచినం బోయి. 32

సీ. ఎక్క టెక్కటి పోరి యిద్ధదివ్యాస్త్రసం, చయవంతుఁ డగుజరాసంధు బాణ
ధనురాదివివిధసాధనములు దనచేతఁ, దనయస్త్రశస్త్రసంతాన మెల్ల
నాతనిచే మడియంగ రథంబులు, డిగ్గి పెంపారెడునగ్గలికల
నాతండుఁ దాను బాహాసంగరమునకుఁ, జొచ్చి పెనంగఁగ నొచ్చి యతని

ఆ. యంగసంధి వికల మగుటయుఁ బోరు సాలించి యతఁడు గారవించి తనకు
మహితవిభవ మైనమాలినీనగర మీ, నధికతేజ మెసఁగ నరుగుదెంచె. 33

వ. ఈరెండవదానంబులు నీవును గొంత యెఱుంగుదిట్లు ప్రసిద్ధబలపరాక్రముండైన కర్ణునుదీర్ణత్వంబు సెఱుచుటకునై కవచకుండలంబులు భిక్షించి పుచ్చుకొని నాకలోకపతి నీకు హితం బాచరించె దానంజేసి ధనంజయుం డతనిం దెగటార్పం జాలె నని చెప్పి వెండియు. 34

చ. వినుము నరేంద్ర విప్రుఁ డలివెన్ జమదగ్నిసుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము సేసె వరం బని కోరి కుంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్ధరథుఁ జేసి యడంచెఁ గలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి యయ్యె నరుం ³డనిఁ జంపెఁ గర్ణునిన్. 35

వ. అట్లుం గాక. 36

క. హరసురపతియమవరుణులుఁ, గురుకృపులును దివ్యబాణకోటు లొసఁగుటన్

---

1. అ. వెవ్వేఱ. 2. క. బనిచె, సెఱిఁగియున్న; గ. బనుచు టెఱిఁగి యచటి. 3. చ. డటు; జ. డిటు.

సరుశక్తి కర్ణతేజ, స్స్ఫురణము నార్పంగఁ జాలెఁ జువ్వె నృపాలా. 37

వ. అనిన విని శోకవ్యాకులుండై యన్నరపతి గన్నీరొలుక నిట్టూర్పు నిగిడించినం దత్సమీపంబున నున్నకుంతి గనుంగొని యడ లుడుపుటకై యతనితో ని ట్లనియె. 38

చ. జననముఁ [1]జెప్పి యేఁ దెలుప సత్యము సుమ్మర కుంతిభాషణం
బని తనుజత్వజాతకృప నంబుజమిత్త్రుఁడు వల్కె నేమిటన్
గొనకొననేరఁ డయ్యె నినుఁ గూడ సుయోధనుఁ బట్టి యట్టిక
ర్ణునకయి నీకు నేఁటికి మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్త్రకా. 39

వ. అనుటయు నవ్వచనంబులు దనకు నసహ్యంబులైనం గటకటంబడి యద్దేవి నాలోకించి భవదీయమంత్రకార్యగోపనంబునం గాదె యింత పుట్టె నని పలికి యంత నిలువక. 40

ధర్మరాజు స్త్రీలకు రహస్యరక్షణంబు లేకుండ శపియించుట.

తే. అంగనాజనమ్ములకు రహస్యరక్ష, ణంబునందలిశక్తి మనంబులందుఁ
గలుగకుండెడు మెల్లలోకముల నని శ, పించె నాధర్మదేవతాప్రియసుతుండు.

వ. ఇట్లు మహాతేజోధనుం డగునజ్జననాథుం డట్లు శపియించి కుంతి చేసినకర్ణగోప నంబు ప్రసంగంబుగా నంతరంగంబు గృతపడినకార్యంబులదెస నిగుడం దనకతం బున మృతిఁబొందినయుభయపక్షబంధుమిత్త్రకోటులం దలంచి యుమ్మలించి విశే షించి కర్ణుచావునకుఁ దూర వగచి విహ్వలించి వివ్వచ్చునాననం బాలోకించి యి ట్లనియె. 42

క. మన కేటిరాజ్య మొండొక, జనపదమున కేఁగి భైక్షచర్యావిధి జీ
వనము నడిపికొని యుండుద, మనఘా యట్లయిన సుఖుల మవుదుము సుమ్మీ.

వ. అని వెండియు. 44

సీ. జ్ఞాతుల నందఱఁ జంపితి మది యాత్మ, వధము గాదే రాజవర్తనంబుఁ
గాల్పు మహింస నిక్కము దాల్మి మత్సర, వర్జన మిది వనవాసజనుల
కాగమవిహితంబు కలదె యింత యొప్పునే, వనమున వసియింపవలయు వింటె
యసుఖదం బైనరాజ్యామిషంబునకుఁ గు, క్కలభంగిఁ దమలోనఁ గాటులాడి
తే. కులము నెల్లను బొలియింపఁ గుత్సితంపు, బ్రదుకు వచ్చె నెయనువగపాలువడఁగఁ
బ్రమద మొసఁగదు త్రైలోక్యరాజ్యమైనఁ, గాన యేనొల్ల మహిమీరకై కొనుండు.

మ. ధృతరాష్ట్రుండు తనూజుకీడు సమబుద్ధిం జూడ కన్నీచుఁ డే
గతిఁ జన్నం జన నిచ్చెఁ గాని మగుడం గాఁ దివ్వఁ డయ్యెన్ [2]నిరా
కృతశీలుం డగునాసుయోధనుఁడు సంరక్షీణంబు సేసెం గులం
బతనిం జంపఁగఁ గోపమాత్త మది శోకాక్రాంత మయ్యెం దుదిన్. 46

1. క. తెల్పి. 2. జ. నిరాకృతిశీలుం.

వ. ఆదుర్జనుండు గర్జం బెఱుంగక దుర్మానంబు వాటించిన సైరించి తొలంగనైతి రాజ్యపరిగ్రహపరత్వంబు మచ్చిత్తంబునం గలిమిం జేసి కిల్బిషం బత్యంతంబు నాచరింపవలసెఁ బరిగ్రహదోషంబు పరిగ్రహత్యాగంబునం గాని పోదు పరిగ్రహత్యాగశీలుండు జన్మమరణదుఃఖంబులం బొరయం డని శ్రుతులు సెప్పెడు నొకనికి సకలధర్మంబులు ననుష్ఠింప శక్యం బగునే యపరిగ్రహం బొక్కటన శుద్ధుండ నయ్యెద మీరు భూమిపాలనపరిగ్రహతత్పరత్వంబున వర్ణాశ్రమరక్షణంబు సేయుం డేను గాననంబునకుం జని మునిజనసకాశంబున సుఖినై యుండెద ననిన విని యింద్రాంశసంజనితత్వకలితతేజోధనుం డగునద్ధనంజయుండు దన యూష్మలత్వంబున నవ్వాక్యంబులు దుస్సహంబులైనం బదరి దరస్మితంబునఁ దద్వికారంబుఁ గప్పి యప్పుడమితేనికి ట్లనియె. 47

—అర్జునుఁడు ధర్మజున కుచితవచనంబుల మనస్తాపోపశమంబు సేయుట.—

క. ఓహో యిట్టివి గలవే, బాహాదర్పమునఁ బరులఁ । బరిమార్చి తుదిన్
మాహాత్మ్యం బెడలఁగ భి, క్షాహారత నొందఁ దలఁప । నగునె నరేంద్రా. 48

సీ. ధర్మపథంబున । ధరణి సేకుఱినఁ బా, లింపక సత్త్వంబు । పెంపు మాలి
విడుచుట యొప్పునే । విను మిట్టులైనము, న్నేల భూపాలుర । నెల్లఁ జంపి
తడలి రాజ్యము దక్కి । యడవికిఁ జనిన బే, [1]లందురుగాక మే । లంద్రె జనులు
కిల్బిషశంక గ । ల్గిన నశ్వమేధాది, పుణ్యకర్మంబులఁ । బోదె వంశ

ఆ. ధర్మ మెడలఁ గృపణ । కర్మంబుఁ గోరి త, ర్థంబు సువ్వె సకల । ధర్మకారి
యొడమి లేనివాఁడ । నడపీనుఁ గనునహు, షోక్తి వినమె దాని । నూఁదవలదె.

క. సరిగా నెన్నుదు రార్యులు, దరిద్రునిం బతితునిం [2]గృ । తఘ్నుని జడునిన్
దొరకొను ధర్మముఁ గామము, బరమగతియు నర్థమునన । పౌరవముఖ్యా. 50

క. కలిమియ చుట్టలఁ జేర్చుం, గలిమియ చెలులను ఘటించుఁ । గలిమియ శౌర్యో
జ్జ్వలుఁ డనిపించుం గలిమియ, పలువురు సద్బుద్ధి యనఁగఁ । బరఁగం జేయున్. 51

క. ఏవానిబంధుమిత్త్రులు, జీవధనంబులును దప్పెఁ । జెందును గృశునిం
గా వాని నెన్నఁగాఁ దగుఁ, గేవలతనుకార్శ్యయుతుఁడు । గృశుఁడె నరేంద్రా.

వ. కావున నర్థోపార్జనంబును బంధుమిత్త్రపరితోషణంబును భూపతులకుం బరమపురుషార్థం బదియునుం గాక. 53

తే. జ్ఞాతినాశనమునఁ గాదె । సకలదేవ, తలు ప్రవర్ధన మొందుట । ధనము లడిచి
పొడిచియొప్పనివారిచేఁ । బుచ్చికొనక, యడఁగియుండంగఁ జేరు నే । యంద్రు బుధులు.

వ. వేదంబులు నిట్లు సెప్పుఁ బృథివి బలువునం గైకొని పార్థివు లర్థంబు లుపార్జించి పర్జన్యాదు లగునాదిత్యుల నధ్వరక్రియాజాతంబునం బ్రీతులం జేసి యుత్తమలోకంబులు వడయుదు రిత్తెరువు వట్టి దిలీపనృగనహుషాంబరీషమాంధాతలు

1. ఆ. లంద్రుగాకేల మేలంద్రు. 2. జ. గృతప్రజ్ఞులకున్.

నడచుట వినమె తత్పదవి నీ కొదవి యున్నయది తదీయప్రకారంబున బహుళ
దక్షిణావిధానంబుగాఁ బ్రభూతంబైనయజ్ఞంబు సేయవై తేనిఁ జూవె సకిల్బిషుండ
వగుట యశ్వమేధంబు సేసినరాజు లెల్ల నవభృథంబునం బరిపూతాత్ము లగుదు
రని పలికిన నయ్యజాతశత్రుండు. 55

క. వెడవెడ యప్పలుకులు చెవి, నిడి కొండొకసేపు చింత యెసకంబునపా
ల్పడి యూరకుండి చిత్తం, బడలునఁ జిక్కువడ నిట్టు లను నర్జునుతోన్. 56

క. నేమపుఁ దెరు వొక్కటి గల, దే మెచ్చితి దాని నడుగు మెయ్యది యని సు
త్రామసుత యడుగ కున్నను, నేమి వినుము చెప్పెదను మునీంద్రుల కెక్కన్.

సీ. సారహీనము లగు సంసారసుఖములు, విడిచి యేకాకి నై యడవి కేఁగి
తాపసవాక్యామృతములు వీనులఁ గ్రోలి, చెలిమి వేర్పా టను చిరమరలకుఁ
జొరకనిందాస్తుతుల్ సరిగాఁ గొనుచుఁ గత్తి, నొకఁడు వ్రేసినను వే రొక్కరుండు
చందనం బలఁదిన డెంద మయ్యిరువుర, యెడ సమంబుగ మూఁగ జడుఁడ నగ

తే. మెలఁగి తగువేళఁ బర్ణశాలలకు నరిగి, యెత్తఁగా భిక్ష యెవ్వార లెట్టు లేమి
యిడినఁ గైకొని నాలుగే నెడలమాత్రఁ, గన్నదానఁ దృప్తుండనై యున్న మేలు.

క. అటు గాక కర్మగతిలం, పటుఁడ నగుదు నేని నల్ప[1]ఫలభాగితమై
నట యిట దిరుగుచు మోక్షుని, కటవృత్తికి బాహిరుండ గానె కుమారా.59

వ. కావున నాకు దొరకొన్నవిమల[2]ప్రజ్ఞామృతంబనుభవింపక తక్కుదునే యిది
శాశ్వతపదప్రదం బనిన విని యనిలతనయుం డతని కిట్లనియె. 60

క. శ్రుతివిహితకర్మజాత, స్థితి యోగ్యుఁడ వైననీకుఁ జేయఁగ వశమే
యతితోకజ్ఞానసమ, న్వితయతిజనకృత్య మటు వివేకింపు మెదన్. 61

చ. అడలున రాజధర్మములయందు జనించె ననూయ నీకు ని
ప్పుడు మును నిస్స్పృహుండ వయి పోవఁగఁ గన్నఁ గులంబువారు ని
ప్పుడమినృపాలురుఙ్ బ్రదికి పోదురు నెమ్మది నట్టులైన నే
ముడుగుదు మస్త్రుజీవనసముద్ధతిఁ జొత్తుము భైక్షవృత్తికిన్. 62

క. వాఁడి యగునలుక లోకము, పోఁడిమి సెడఁ గయ్య మట్లు వొడిచి వనటమై
నేఁ డింక నడవికిం జను, వాఁడం గాకనినఁ బుడమివారలు నగరే. 63

సీ. పనివడి త్రవ్వి కూపమునందు నుదకంబు, పానంబు సేయని వానిభంగి
యున్నతతరు వెక్కి జున్ను సేకుఱఁ గొని, తేనియ యానని వానిభంగి
యాఁకొని యొడఁగూర్చి యన్నంబు దళియకు, వచ్చినఁ గుడువని వానిభంగి
తమకించి యొకభంగిఁ దనవశంబుగఁ జేసి, మానినిఁ గవయని వానిభంగి

ఆ. గాదె కురువరేణ్య ఘనశక్తిశౌర్యసం, పన్నులైనపగఱ భండనమున
నోర్చి పూజ్యరాజ్య మొల్లక యడవికి, నేఁగు టీవ యెఱుఁగు దిత్తెఱంగు.64

1. క. ఫలభోగముమై. 2. చ. జ్ఞానామృత.

క. నీ వడవి కరుగ నోడఁబడి, నీవెనుకన వచ్చునపుడు । నిందింతురు మ
మ్మీ వెఱ్ఱు లితని మాన్పం, గా వలఁతులు గార యని జఱగజ్ఞను లధిపా. 65

క. భోగములఁ బాపి నిందా, భాగులఁగాఁ జేసి యడవిఱపా ల్వాతిచెదవే
నీగారవంపుఁదమ్ములఁ, సాగరవృతధరణిఁ గలుగుఱజనములు వగవన్. 66

వ. అని వెండియు. 67

క. కేవలనిష్కర్మత మో, తావహ మగునేని గిరులు । నవనీజములుఁ
భూవర ముక్తిం బడయుం, గా వలవదె యడవి నునికి । కైవల్యదమే. 68

క. ఫలములయెడ బ్రహ్మార్పణ, కలనపరుం డగుచుఁ గార్యఱకర్మము నడపఁ
వలయుం దత్త్వజ్ఞానము, దలకొనినం గర్మశమము । దానై కలుగున్. 69

వ. కావునం గర్మహీనత్వం బపవర్గకరంబు గా దనవుడు నర్జునుండు ధర్మనందను
నుద్దేశించి దేవా యొక్కయితిహాసంబు గల దవధరింపు మని యి ట్లనియె. 70

సీ. కొందఱు బ్రాహ్మణుల్ । [1]గొండుక లాత్మకు,లోచితాచారంబు । లుడిగి కాన
లకుఁ జన్న వజ్రి వాఱరికిఁ గృప చేసి ప,తత్త్రిరూపమునఁ దఱత్పూర్వమునకు
నరిగి మీకై కొన్నఱ తెరు వొప్ప దనవుడు, విని వా రఖిలమార్గఱ వేది యద్భు
తాస్పద మీపక్షి । యని దాని కభిముఖు, లై సత్పథం బెద్ది । యనఘ చెపుమ

తే. యనిన[2] నలుగాలివానగోఱవును నశేష, శబ్దములమంత్రమును లోహఱజాతిఁగాంచ
నమును మనుజుల విప్రుండుఱసమధికత్వ,భాజనము లండ్రు వేదప్రఱపంచవిదులు.

వ. ఇ ట్లుత్తముం డైనవిప్రుం డుత్తమమంత్రోపాశ్రితంబు లగువిహితకర్మంబులు
నడపుట రత్నకాంచనసాంగత్యంబునుంబోలె సంస్తుత్యం బై యుండు నాలస్యంబు
నఁ [3]గ్రోధంబున శోకంబునఁ దదనుష్ఠానంబు విడుచుట పాతకం బజ్ఞాను లగునర్థ
హీనులు సన్న్యాసకాలవివేకంబు లేక వేగిరపడి యుభయభ్రష్టు లగుదురు గృహ
స్థధర్మంబున వర్తించి యతిథి దేవ పితృ [4]సంతృప్తి సేయుచు శిష్టాన్నభోజనపరు
లగుపుణ్యులకుం బుణ్యలోకంబు లఱచేతిలోనివి గావె బ్రహ్మార్పితం బయిన
సత్కర్మకలాపంబు మహానందంబుఁ జేయు ననుటయు. 72

క. విని వారు దెలిసి మరలం, జనిరి గృహస్థత్వధర్మఱసదనుష్ఠానం
బునకు నటు లగుట నేలుము, జనవల్లభ పుడమి నడుపు । జన్నము లెలమిన్. 73

వ. అని చెప్పె నప్పుడు నకులుం డన్నరనాథున కి ట్లనియె. 74

—— నకులుఁడు ధర్మజునకు మనస్తాపోపశమంబు సేయుట. ——

సీ. దేవతల్ వేదవిఱధిప్రవర్తకులు బ్రా, హ్మణులును వారలఱయట్ల శ్రుతుల
కింకరు లై కాదె । కిల్బిషంబులఁ బాసి, వారిచందమున శాఱశ్వతవిభూతి
గొందుట యజ్ఞాదు । లుడుగుట సంపరి,త్యాగమే పాడిమై । నర్థముల ను
పార్జించి దేవతాఱబ్రాహ్మణపూజగా, నిడుచుఁ దత్ఫలకోటి । విడుపు గాక

1. క.ఖ. చ. గొండుక. 2. జ. నలుకాళిలోన. 3. గ. గోపంబున. 4. చ. పూజలు.

ఆ. క్రోధశోకహర్ష । కోటుల గృహముతో, విడిచి యోగ మూఁది । వృక్షమూల
వాసనిరతి నుండు [1]వాఁ డొకసంయమి, త్యాగి నృపుల కది । సమర్థ మగునె. 75

క. తక్కినయాఁ డాశ్రమములు, నొక్కెడ గృహస్థధర్మ । మొకదెసఁ దులయం
దెక్కింప వానితో న, య్యొక్కటి సరిదూఁగె నందు । రుర్వీశ బుధుల్. 76

వ. కావున గృహస్థధర్మంబ యాచరణీయం బట్లుం గాక. 77

క. జతనంబున నర్థము సం,చితముగఁ గావించి క్రతువి । శేషంబుల దే
వతలం దృప్తులఁ జేయుమి, యతికిల్బిషకారి యందు । రాగమవేదుల్. 78

చ. వినుము తమోమయం బయిన । విశ్వముఁ దా వెలిఁగించు నీశ్వరుం
డన నొకరుండు వర్ణతతి । నాశ్రమకోటిని వాఁడు గాదె చే
సె నిఖిలకర్మయోగసవి । శేషత గల్గుటయుం దదీయక
ల్పనమ తదాజ్ఞకుం దొలఁగఁ । బాడియె శోకము గారణంబుగన్. 79

వ. హింస దోషంబు గలుగు ననుశంకకుం బని లే దవధరింపుము. 80

క. పరుల వధింపక యెవ్వఁడు, ధర యేలెం జెపుము పూర్వ । ధరణీశులలోఁ
బొరయరు పాపము సుగతిక, యరిగిరి వా రీవు నట్ల । యగు టొప్పు నృపా. 81

క. రక్ష ప్రజ గోరు నిజయో,గక్షేమార్థముగ జనసు । ఖస్థితి నడపన్
దక్షుఁ డగురాజు నడపకు, పేక్షించినఁ బాప మొందు । దే కురుముఖ్యా. 82

తే. గోవులను ఘోటకంబులఁ । గుంజరముల
దాసులను బ్రీతి ని మ్మొల్ల । ధాన్యములను
గ్రామముల మందిరముల ని । ష్కముల వేడ్క
నొసఁగు తత్తత్సుపాత్ర త్వ । యుక్తవిధుల. 83

వ. వీని నిన్నింటి రిత్త వో విడిచి పోయెద ననుట నీయట్టిమహానుభావునకుం దగునే యని పలికినం దదనంతరంబ సహదేవుం డమ్మహీపతి కిట్లనియె. 84

సీ. [2]వెలివెలి వస్తువుల్ । [3]విడిచెఁ బో నరుఁడు గ,ర్మిష్ఠతం గాదె శ । రీరయాత్ర
నడపువాఁ డది మోక్ష । ణంబు గా నేరదు, శారీరసౌఖ్యసం । సక్తి వదలి
బాహ్యపదార్థముల్ । పాటించి నిజవంశ, ధర్మముల్ వదలక । తగఁ జరింపు
మమత బంధంబు ని । ర్మమత మోక్షంబును, జేయు నింత యెఱింగి । చేసి రధిప

తే. రాజ్యమెలమి మన్వాదు ల । రణ్యమునకు, నరిగి నీవందువలయు ద్ర । వ్యములమీఁదఁ
జేయవలదె మమత్వంబు । వేయు నేల, యదియు సంసారచక్ర ప్ర । వాహకము గాదె.

తే. నీవ చుట్టంబు బక్కంబుఁ । నీవ చెలియు, నీవ తల్లియుఁ దండ్రియు । నీవ గురువు
నీవ దైవంబుఁ గావున । నావిషాద, భాషణంబులు సైరింపు । భరతముఖ్య. 86

క. తథ్యము లైనను దలఁప న,తథ్యము లైనను సభక్తి । తాత్పర్యము లై
తథ్యంబుఁ బొరయకుండఁగఁ, బథ్యంబుగఁ గొనుము నాదు । పలుకులు కరుణన్.

1. గ. వాఁడకో; చ. వాఁడొకో. 2. చ. వెడవెడ వస్తువుల్. 3. చ. వీటిఁబో... గాక శరీర.

వ. అనియె నిట్లు దమ్ము లందఱును బోధించుపలుకులు విని ధర్మనందనుం డూరక యుండె నతనియెడ సవిశేషబహుమానయు నతనిచేత సంతతోపలాలితయు [1]ధర్మార్థనిదర్శనశీలయు నగుపాంచాలి భద్రగజప్రతిమాను లైనయప్పవమానతనయధనంజయనకులసహదేవులమధ్యంబున యూథపతివోలె నున్నయన్నరేంద్రు నల్లన చేరి యేనును నాయెఱింగినంత సెప్పెద నని యనుజ్ఞఁ గొని యవ్విభు వదనంబున నిజవిశాలలోచనరోచులు పరఁగ వినయం బాననంబున నతిశయిల్ల.

ద్రౌపది ధర్మజునకు హితవచనంబుల మనస్తాపోపశమంబు సేయుట.

సీ. శోకాగ్ని దనికిన [2]సాగయునీతమ్ముల, నుపపన్నవాక్యామృతోపయుక్తిఁ
దేర్పుము గానలం ద్రిమ్మరునాఁడు వీ, రాయాసములఁ బడు టవధరించి
సమయకాలము సన్నఁ జని సుయోధనుఁ జంపి, భోగంబులను బహుత్యాగములను
యాగంబులను సద్విహారముల్ సలుపుద, మని యాఱడింపవే యరిగణంబుఁ
తే. ద్రుంచి రాజ్యంబు [3]సేకొంటి తొలఁగిపోదుఁ, గాక యని యిప్పు డుడికింప నీకుఁ దగు నె
ధర్మమును సత్యమును నుచితంబు నిన్నుఁ, గడవ నెఱిఁగెడువారలు గలరె యధిప.
వ. అని ముట్ట నాడి మఱియును. 90
క. పేదమన సగుట ధర్మువు, గాదు నరేంద్రునకు జగము గావం ద్రోవం
గాదె నృపు లోకపాలాంశోదితుఁ గాఁ జేసెఁ బద్మయోని చతురతన్. 91
క. నరరూపంబునఁ [4]బరఁగెడు, పరదేవత గాక నృపుఁడు బాలుఁ డయినన
ప్పురుషు నెడ నేమి వొమ్మని, తిరిగినదుర్మతులఁ బొందదే కీడధిపా. 92
ఉ. నేరక చేర నొక్కనిన నీఱుగఁ జేయుఁ గృశానుఁ డిద్ధధా
త్రీరమణాగ్ని గాల్చు నతితీవ్రత వంశము నెల్ల నిట్లుగాఁ
గౌరవకోటి దర్పమునఁ గానక నిన్నుఁ బరాభవించి దు
ర్వారభవత్ప్ర[5]కోపశిఖిఁ గ్రాఁగె మదిన్ వగ పేల దీనికిన్. 93
సీ. నృపునందు విధి దండనీతి ప్రతిష్ఠించెఁ, గావున నపరాధగతి యెఱింగి
దండించునృపతికి రెండులోకంబులుఁ, జేకుఱు దోషంబు సేయ నుదుట
నచ్చొత్తి వెడలంగ నడుచు విప్రుని నైన, భూవరుం డిది మెచ్చు దేవకోటి
సభ కేకవస్త్ర రజస్వల యనక నన్, దల వట్టి యీడ్చినతప్పుఁ దనదు
తే. తొడలు సూపినతప్పును దుష్టకష్ట, తరవచనములఁ బఱచినతప్పు ననుజు
నందు దుర్యోధనునియందు ననుఁగునందుఁ, గాంచి దండించి తిట్టిది కల్మషంబె.
క. గరదుని గృహదాహకు మం, త్రరహస్యవిభేది వధవిధాయిఁ బరసతీ
హరు బంధుఘాతిఁ బరధన, హరణపరునిఁ జంపి పుణ్యుఁ డగు నృపుఁ డనఘా.
క. దండార్హు లైనవారల, దండింపక యున్నఁ జువ్వె ధాత్రీవిభు నా
ఖండలసన్నిభు నైనఁ బ్ర, చండపుఁగిల్బిషము వొందు జగతీనాథా. 96

1. క. ధర్మార్థనిదర్శన. 2. క. ఖ. గ. సాగియు. 3. జ. సేకొని. 4. క. దిరిగెడు. 3. చ. కోపమున.

క. పేదలకును సాధులకును, వేదములకుఁ దాపసులకు । వే యేల సమ
స్తాదిత్యులకును దండమ, కాదె బ్రదుకుఁ జేయు రాజు । గావింపంగన్. 97

వ. కావున. 98

ఆ. ఉచితదండవృత్తి । నుర్వీప్రజాభిర,క్షణము నోపి చేతఁ । గాక రాజ
వంశజునకు ధర్ము । వా భూసురార్హంబు, లైనశమదమాదు । లాత్మ నిడుట. 99

వ. అని యంత నిలువక చనవు మెఱసి మేలంపుఁజందంబున. 100

ఉ. వైదికధర్మచారి జన।వత్సల నీమదిఁ బట్టుకొన్నయు
న్మాదము హీనమానవుమ।నంబునఁ బుట్టినవెఱ్ఱిపోలె న
స్యాదులఁ దీర్చు టొప్పదు ని।జానుజవర్గముమీఁదఁ గల్గున
త్యాదరసాంద్రసారకరు।ణామృత మానఁగ నిమ్ము [1]నెమ్మదిన్. 101

వ. అని పలికి యి ట్లనియె. 102

క. నాయట్లు వడినయంగన, లేయెడలం గలరె యిట్టి।యేనును ధర్మా
పాయము నీకగు [2]ననువెఱఁ, బాయన గృహధర్మవృత్తిఁ । బౌరవముఖ్యా. 103

వ. అని వెండియు. 104

క. కౌరవులు దమదురితమునఁ, దా రెరిసిరి కల్మషంబు । దానఁ గలదె భూ
భారము వహింపు బహుయ, జ్ఞారంభణ మాచరింపు । మఖిలహితముగన్. 105

క. సురగురుఁడును శుక్రుండును, బరిపాటిఁగ దండనీతిఁ । బలికిరి దానం
బరిణతుఁడవు నీ వనుజులు, పరికరముగ నడపు ధర్మ।భాసుర దానిన్. 106

వ. అనినం బాంచాలితో మఱుమాట లాడక యున్నయన్నరేంద్రునకు నింద్ర
నందనుం డి ట్లనియె. 107

సీ. దక్షుఁ డై భూపతి । దండనీతి నయింప, కున్న సన్న్యాసులు । నుత్పథప్ర
వర్తను లగుదురు । వావిరి నన్యోన్య, ధన ధాన్య పశు భూమి । దారహరణ
మాచరింతురు జను । లప్పాప మవ్విభు, నొందు దండము హింస।యుఁగఁదలంప
వలదు దుర్వృత్తుల । వధియించు రుద్రుని, గోవిందు వాసవు । గుహునిఁ జూడు

తే. మామహాత్ములు దక్షు ను।న్మార్గచరుల, దండితులఁ జేఁతవినమెయ।ధర్మమడఁగు
ధర్మమెసఁగుదండమున న।ర్థంబుఁ గామ, మును నదూష్యంబు లై సిద్ధిఁ।బొందు నధిప.

వ. దండంబున సకలజనశ్రీరక్షణంబు సేయం బూనినభూనాథునక యేల యోగ్య
హింసకుం దొలంగ నెట్టివారికి వశంబు గా దవధరింపుము. 109

ఉ. కాయలఁ బండ్ల నీళులను । గల్గవె సూక్ష్మపుజంతువుల్ మునుల్
సేయరె హింస వాని నుపజీవితఁ ద్రవ్వరె కందమూలముల్
నీయెడఁ జూడు ప్రాణములు । నిల్వఁగ నేర వహింస నేరికిన్
వేయును నేల భక్ష్యముగ । వేధ విధింపఁడె ప్రాణికిన్. 110

1. చ. బుద్ధికిన్. 2. జ. నని వెఱఁ. 3. గ. వాని కుపజీవితఁ.

క. విను పశుహింసాకృతయాగనిరూఢుని ధర్మపరుని ✽ గా వేదంబుల్
గొనియాడెడు సముచితహింసన మరయ నహింస గాన ✽ జగతీనాథా. 111
క. అరివీరుల ఘోరం బగు, దురమున వధియించు టేల ✽ దోసం బయ్యెన్
ధరణీశ పాండుపాలిత, ధరావలయ మానసపడుట ✽ దగదే నీకున్. 112
క. ఇల [1]నీకై కొన్న తెఱఁగు, దలపఁగ ధర్మంబో కాదో ✽ దైవం బెఱుఁగున్
వలవనిచింత యుడిగి ధృతి, దలకొని పాలింపు యజ్ఞదక్షుఁడ వగుచున్. 113
క. అని పలుకుపార్థుపలుకులు, విని పలుకక యున్నమనుజవిభు దెసఁ గోపిం
చినతనమది వెడఁ గుడుపుచు, ననిలసుతుం డిట్టు లనియె ✽ నాతనితోడన్. 114
ఉ. నీవు సమస్తధర్మపరినిశ్చయవేదివి నీచరిత్ర మే
మే వసుధేశ వంక యని ✽ మెచ్చక చక్కఁగఁ జేయువార మే
[2]నీవచనప్రపంచమున ✽ కింకఁ జొరం జొర నంచు నుండియున్
వావిరిఁ జెప్పఁగా వలసె ✽ వాలినదుఃఖము దాల్మిఁ గ్రాఁచినన్. 115
వ. అవధరింపుము. 116
క. ఒడఁగూడినసామ్రాజ్యము, నడలున దిగఁద్రావి చనిన ✽ నఖిలజనులు నిన్
గడుఁ బేదమనసువాఁ డని, నెడ నాడుదు రనిన మము నికసీ యను టరుదే.
మ. కపటద్యూతమునం బరాభవము రాఁ ✽ గా సూనృతం బూఁది భూ
మిప మమ్ముం జులుకంగఁ జేసి నినుఁ బేర్మిం బాపికొంచున్ దురం
తపుదుఃఖంబుల కోర్చి పోయి తది యుద్ధక్రీడ నప్పాపక
ర్మపుజాతిం దెగటారఁ జేయఁగఁ బ్రకీర్త్యం బయ్యె లోకంబులన్. 118
వ. దుర్జయు లగువిరోధుల నిర్జించి యుపార్జించినపృథివీప్రముఖపదార్థంబులు నిర
ర్థకంబులు సేసి వనంబునకుం జనుచులుకఁదనం బేమిటం బాపికొనువాఁడ
వట్లుం గాక. 119
సీ. ఆసభలోఁ బడినట్టిబన్నంబును, నడవులఁ దిరిగెడునపుడు దుష్ట
దైత్యులచేత సైంధవునిచే [3]నోఱపులఁ, బడ్డవిషాదంబుఁ ✽ బరమదైన్య
మున కోర్చి కొలిచి మాత్స్యునిపాలనున్నదుఃఖంబును ద్రోహులఁ గనుపుగొట్టి
వెలువరించెద ననితలఁచి కృష్ణునినిశ్చయం బూఁది ధర్మంబ ✽ యగుట దెలిసి
తే. రణ మొనర్చితి నిను ధార్తరాష్ట్రులొండె, నీవు వారలనొండెను ✽ జావఁజూడ
వలయుటప్పు డెఱుంగవే వసుమతీశ, యిప్పు డడలుట నింద్యంబయింత నిజము.
క. పసు లేము సేయఁగా దు, ర్జనులం జెఱుచుచును సాధుజనుల మనుచుచున్
జననాథ మహాయజ్ఞము, లొనర్చుచును వెలయు కురుకులోత్తంసమవై. 121
వ. అనిన విని ధర్మతనయుం డిట్లనియె. 122
చ. మదమును రాగమున్ భయము ✽ మానము లోనగుకిల్బిషంబులన్

1. గ. నీచేకొన్న. 2. జ. యీవచనప్రపంచమున ♦ కింకఁ, 3. గ. నొరవులఁ.

హృదయముఁ జొన్పి భూజనుల నేలుట మే లని పల్కెఁ దార్త్రి కా
స్పద మని రాజ్య లామిషము లైతగు లిమ్మహి యెల్ల నేలినం
దుది నరకం బొకండ నృపతుల్ సుఖులే యుపశాంతి యొప్పదే. 123

తే. కామభోగముల్ మేలనఁ గాదు వాని,విడిచి చూడుము పొందెదు విపులసుఖము
కాయ లాకులు నీళ్లును గాలి యనుభ,వించి యున్నమునీంద్రులు వెఱ్ఱివారె.

క. దుర్మతు లామిషగత మగు, కర్మము వాటించి బంధ కలితు లగుదు ర
య్యార్మి గడచి సువిచారులు, నిర్మమతను ముక్తి వడయ నేర్తురు వత్సా.

వ. జనకునివచనంబులు వినమే వాని నేనుం జెప్పెద నాకర్ణింపుము. 126

ఆ. ఒకటిదెసను దృష్ణ యొలయదు గావున, నేమియర్థములును లేమి లేదు
కాలఁ జొచ్చె మిథిల గాలదు నాకు [1]నం, దొక్కఁ డైన నింత నిక్కువంబు.

క. అని పలుకుజనకుఁ డెగడిరె, జను లుల్లము శాంతిఁ బొంది సంసారం బొ
ల్లనివాఁడు నింద కర్హుం, డని పలుకుట నీక యొప్పు నధికవిచారా. 128

తే. వినుము ప్రజ్ఞాధిరూఢుఁ డై వనటదక్కి, సంసృతిక్లేశపరుల భూస్థలిఁ జరించు
వారి నచలంబుపై నున్నవాఁడుసూచు,నట్లుచూచుటసూవె నేర్పమలహృదయ.

—జనకున కతనిసతితో నైనసంవాదం బర్జునుఁడు ధర్మజునికిఁ జెప్పుట—

వ. అని పలికి మఱి పలుక కున్నయప్పుడమి తేనికిం గవ్వడి యి ట్లనియె. 130

క. జననాథ నీవు సెప్పిన, జనకనృపాలునకు నతివిశదమానస యా
తనిభార్యకు నీక్రియ న,య్యెను సంవాదంబు దాని నేర్పడ వినుమా. 131

వ. అమ్మహీపతి పూజ్యరాజ్యంబు [2]విడిచి భిక్షావృత్తికి వెడలఁ జూచినం దదీయ
భార్య యతని కి ట్లనియె. 132

సీ. పుడమి యేలుట డిగ్గ విడిచి భిక్షార్థి వై, పోయిన నతిథిసంపూజనంబు
దేవతర్పణపితృదేవతర్పణములుఁ, గలుగునే కాషాయములు ధరించి
ముండుఁ డైనతఁ డన్నమునకు గృహంబుల, కరుగక యున్నె గృహస్థుఁ డెల్ల
వారికి నన్నంబు గారుణ్యమునఁ బెట్టు, నన్నదానము సేఁత యధికధర్మ

ఆ. మనుట వినమె పెట్టునతనిఁ జేయొడ్డెడు, వానిఁ దలఁప నందు వరుఁడు పెట్టు
వాఁడ యగుట నిక్కువం బింత సూడక, యిట్లు దీనవృత్తి [3]కేఁగఁ దలఁతె.

క. త్రైవిద్యు లగుమహాత్ములు, నీవలనన బ్రదుకఁ దలఁప నిష్క్రియత మెయిఁ
నీ విందఱఁ జెఱిచెద విది, దేవా ధర్మంబు గాదు దీని నుడుగవే. 134

తే. అధిప మీ[4]తల్లియుల్లంబు నడలువెల్లి, ముంచి సతి శోకసంతాప మూర్తిఁ జేసి
వంశవిహితధర్మంబుల వదలి వెడలి, పోయి యేగతిఁ బొయెదవో యెఱుంగ.

క. [5]చలిపందిరిచందంబున, ఫలభరితం బైనతరువు భంగిఁ బ్రజలడ
ప్పులు దీర్ప నమరి యుండెడు, నలఘుచరిత్రునకు లఘుత యగునే కోరన్.136

1. చ.నిం,దొక్కఁ. 2. జ.నొల్లక భిక్షావృత్తి వెడ. 3.గ. నేఁగ.4. క.తల్లిదండ్రుల. 5.క.గ.చలివిందిరి.

వ. ఇది ధర్మవిరోధంబు దీన మోక్షంబు గలుగు ననుట నాకుం జూడ సందియం బని
చెప్పి నప్పుడు నయ్యజాతశత్రుండు పురుహూతపుత్త్రున కిట్లనియె. 137

మ. శ్రుతివాక్యంబులు కర్మనిష్ఠ [1]వినుతింపంగ నిష్క్రియత్వంబు స
ద్గతిఁ గావించుట యూఁది చెప్పు నిటు చిత్తప్రక్రియన్ రెంటఁ జో
దితముల్ వానిని వింటి మన్నకలుచన్ దీపించునే తత్త్వసం
గతబోధంబు సుకర్మతం గలుగు నాకం బార్త్తవీరవ్రతా. 138

తే. తత్త్వబోధంబు గలుగునతండు నన్నుఁ, దెగడనేరఁడు నీవు భావితత్త్వసాహ్వ
దమునఁ గర్మంబు విడుచుట ధర్మ మనిన, పలుకు ప్రియమ జగన్న్యాయ [2]పథము గనుట.

సీ. వడముడియును నీవు వాయువాసవుల శ, క్తులు ధరియించిన దుర్జయులరు
హరికరుణాతిశయమునఁ దత్తేజంబు, మీయందుఁ దగ సంక్రమించి యుండు
మీరు సంగరశాస్త్రసారపారగులరు, గాక తత్త్వజ్ఞానఘనమతులరె
యనఁ టెకంబమునట్ల యనిరి నిస్సారత, సంసార మనఁగ నిస్సంప్రబుద్ధు

తే. లది ప్రసిద్ధము విను తృష్ణ యడఁచి కర్మ, వృత్తి విడిచి నిరాలంబచిత్తుఁ డైన
యాతఁడో సుఖ దోషదుఃఖాకరంబు, లగుధనంబులు గోరెడునతఁడొ చెపుమ.

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రములయర్థము లారఁగఁ గ్రోలి తత్త్వసం
వేదసుధారసంబు సచవిం జిరసౌఖ్యముఁ బొంద నేర కి
మ్మేదిని నెందునుం దిరిగి మే లని కర్మము [3]చెల్లఁ జెప్పుచుం
గా దని శాంతి యొప్పనిది గాఁ జెడ నాడుదు రల్పబోధనుల్. 141

క. విమలజ్ఞానులు శమమును, దమమును ద్యాగంబు శాశ్వతప్రచురానం
దమునకు మూలము లండ్రు ని, జముగాఁ గైకొందు రవి ప్రసన్నవివేకుల్.

వ. అనిన విని దేవస్థానుం డమ్మానవపతి కిట్లనియె. 143

దేవస్థానుం డనుముని ధర్మజునకు హితోపదేశంబు సేయుట.

సీ. ధనము లుత్కృష్టంబు లనుధనంజయుమాట, పాటిగాఁ గొనుము సోపానభంగి
నున్నది మార్గంబు యోగసమారోహ, ణమునకు దానన నడచి కాక
వడి నుల్కి పడ నీకు వచ్చునే ధనసంగ్ర, హంబు భోగార్థకృతంబు దుష్ట
మగుటయుఁ గలదు యజ్ఞార్థకృతం బైన, నదియ నిచ్చెన బ్రహ్మపదము నొంద

తే. యజ్ఞపరిశిష్టధనభోగమాత్మకలఁక, యుడుపు నమ్మోయి శమదమయుక్తి గలుగు
శమము దమమును దత్త్వవిజ్ఞానదములు, గాన దక్షిణాధికయజ్ఞకర్త వగుము.

చ. హరుఁడును సర్వమేధ మనుయాగమునం బ్రచురప్రకాశతం
బొరయఁగ వేడ్కఁ జేసె విధిపూర్వదిగీశముఖామరుల్ మహా
ధ్వరములఁ గాదె పేర్కొనుట ధాత్రి సధర్మత నేలి యజ్ఞత
త్పరత వెలుంగరే నృపులు పార్థివముఖ్య మరుత్తముఖ్యులున్. 145

1. చ. వినిపించుచున్. 2. గ. పదము నగుట. 3. జ. యూఁది.

వ. వినుము దివస్పతి యడుగ బృహస్పతి సన్మార్గనిర్దేశకుం డై చెప్పి[1]మార్గంబు.

ఉ. కామముఁ గ్రోధమున్ మనసు గాఢముగాఁ బొలియుట మాన్పి యింద్రియ
స్తోమవిమార్గవర్తనము ద్రుంచుచు నెవ్వగ లేక రక్షణం
బేమఱ కెవ్వరిం జెనకి యించుక నొంపక లోక మేలఁగా
నామహితాత్ము సర్వమహిమాతిశయంబును జెందు వాసవా. 147

వ. అని మఱియు నాకర్ణింపుము. 148

ఉ. కర్మము మేలు నా విగతకర్మము మే లన రెండు నొప్పునే
కర్మఫలంబు నర్పితము గాఁ దగ నీశ్వరునందుఁ జేత స
ద్ధర్మము గాకనంగ [2]వివిధం బగుధర్మపథంబులోన మేల్
ధార్మికవర్య యేర్పఱుపఁ దా వశమే వగ బుద్ధి గుందఁగన్. 149

ఉ. కావున సిద్ధ్యసిద్ధుల వికారముఁ బొందక ద్రోహ మెయ్యెడ
న్వావిరిఁ జేయ కేలు భువనంబు భవత్కులధర్మరక్షి వై
భూవరు లిట్లు సేసి తుదిఁ బుత్త్రుల గద్దియలందు నిల్పి కా
దే వనవాసు లైరి దృఢదీప్తనిరంజనబోధసంపదన్. 150

వ. అనిన విని నిర్విణ్ణమానసుం డై యున్నయన్నకు నర్జునుం డి ట్లనియె. 151

సీ. క్షత్త్రియధర్మనిష్ఠాపరత్వంబున, సమరంబు సేసితి శస్త్రనిహతిఁ
బూతాత్ము లై రిపుల్ వోయిరి సద్గతి, కమ్మెయి [3]రాచకర్మ మ్మొనర్చు
విప్రున కైనను సుప్రశస్తం బది, రౌద్రం బగుట బొలుపరకును దెల్ల
మైనను ని ట్లుండు నార్యోక్తినృపనీతి, దురితంబు సేయునే యొరుఁడు వెట్టఁ

ఆ. గుడువ నృపతిమాత్రకునకును గా దన్నఁ, గౌరవాన్వయాగ్రగణ్యుఁ డైన
నీకుఁ దగునె విడువ శోకంబు వజ్రస,న్నిభము గాదె నృపులనెమ్మనంబు. 152

వ. అట్లుం గాక. 153

ఉ. వైరివధంబు నీకును నవశ్యముఁ జేయక పోవరాని దై
వైరులకున్ భవత్సమరవాంఛన సద్గతి కేఁగఁ బొలి దై
చేరె విధాతృసంఘటనఁ జింతకుఁ గారణ మేమి ధర్మవి
స్తారవిదుండ వీ వకట ధైర్యసమగ్రుఁడ వై వెలుంగవే. 154

వ. రాజధర్మోపాత్తం బై భవదాయత్తం బైనపూజ్యసామ్రాజ్యంబుఁ బరిపాలిం
చుచుఁ బుణ్యక్రియానుష్ఠానపరుండ వగు మని పలికిన మఱుమాట వలుక కున్న
యన్న కేంద్రునకు మునీంద్రవర్యుం డగుపారాశర్యుం డి ట్లనియె. 155

సీ. అర్జునుపలుకు సత్యంబు సమీచీన, మార్యజనంబు గృహస్థధర్మ
ముత్తమం బని చెప్పు నుర్వీశ పశుపతుం, లాదిగా జీవుల కాశ్రయంబు
నృపులకు నది దక్షఁ దపమును దమమును, బ్రహ్మచర్యమును ధర్మములుగావు

1. చ. వాక్యంబు. 2. గ. విదితం; జ. ద్వివిధం 3. గ. రాజకర్మ.

ధనములఁ దనియుట ✽ యని కోహటించుట, ప్రజల రక్షింపమి ✽ రాజకోటి
ఆ. కరయఁ బాతకంబు ✽ లండ్రు నీ వక్కట, వేదచోదనాప్రవీణ మయిన
మనసు నేల యి ట్లమార్గవృత్తికిఁ జొర, నిచ్చె దోపి ధరణి ✽ యేలు మనఘ.

క. నీ వార్యబోధితుండవు, గావే వర్ణాశ్రమప్రకారములు వినం
గా వలయునె ధర్మంబులు, భూవరునకు దండనీతిఁ ✽ బోలం గలవే. 157

వ. సుద్యుమ్నుం డనుధరణీశుండు దండనీతిన కాదె యపవర్గంబు వడసె ననుటయు నజాతశత్రుం డాసుద్యుమ్నవృత్తాంతంబు విన వలతు నాన తిమ్మనిన నమ్మహీపతి కమ్మునిపతి యి ట్లనియె. 158

—పారాశర్యుండు సుద్యుమ్నచరితంబు ధర్మజునకుఁ జెప్పుట—

క. విను శంఖుండును లిఖితుం, డన నిరువురు విప్రవర్యు ✽ లన్నయుఁ దమ్ముం
డును గలరు బాహుదాతీ, రనివాసులు ధర్మతత్పరమనోవృత్తుల్. 159

సీ. వారియాశ్రమముల ✽ భూరిపుష్పఫలాభి, వృద్ధి నొప్పారెడి ✽ వివిధభూరు
హంబులు గల వొకయపుడు శంఖుండు గృహమ్మున లే కుండ ✽ ననుజుఁ డచటి
కరగి యం దొక మ్రాన ✽ నారఁ బండినపండ్లు, గని వేడ్కమైఁ గోసి ✽ కొనితినంగ
నయ్యన్న యే తెంచి ✽ యనుజ యీఫలము లెక్కడియవి చెప్పు నా ✽ వుడునువార్చి

తే. ప్రణతుఁ డై యిచ్చటివ యని ✽ పలికె లిఖితుఁ
డాతఁ డనుమతి లేక కోయంగఁ దగునె
ముచ్చిమియ కాదె యిది పాప ✽ మచ్చుపడియె
నృపతిచే దండితుండ వై ✽ నీఁగికొనుము. 160

వ. రయంబున రాజసన్నిధికిం జని భవత్కార్యం బుపన్యసించి దండించుట వేఁడు మని పలికినం దెలిసి యట్ల కాక యని లిఖితుండు సుద్యుమ్నుఁ గానం బోయి నగరి వాకిట నిలిచినం బ్రతిహారులమ్మహాత్మునరుగుదెంచుట యమ్మహీపతికెఱింగించిన నతండు సంభ్రమంబున సామాత్యుం డై యాసంశితవ్రతుం డున్నయెడకుం జని వినయంబు సేసి మీర లిచ్చటికి [1]వేంచేసినప్రయోజనం బేమి యానతిండు మీ చెప్పినట్ల చేసెద నని విన్నవించిన నావిప్రవర్యుం డాతని కి ట్లనియె. 161

ఆ. చెప్పినట్ల యేను ✽ జేసెద నని యొడం, బడినవాఁడ వింకఁ ✽ బలుకు దిరుగఁ
గామి మఱవ కుండఁ ✽ గా నీకు వలయుఁజుమ్మయ్య దండధారక ✽ కాగ్రగణ్య. 162

వ. అని యూఁదిపలికి మద్గురునియనుమతి లేక తదీయతరుఫలంబులు గోసికొని యుపయోగించితి నది ముచ్చిమి ముచ్చుల దండించుతెఱంగున దండించి నన్ను గత[2]కల్మషుం జేయుము రాజదండితునకు యమదండంబు లేదని పెద్దలు సెప్పుదురు నిన్నును దండధారణవైకల్యకిల్బిషంబు వొరయ కుండ వలయు నని తేటపడ

1. క. విజయంచేసి. 2. జ. కిల్బిషం.

నాడిన నమ్మాటలకు మనంబున విషాదంబు నొంది యమ్మేదినీవరుండు భూసుర
వరుం బ్రార్థించి. 163

ఆ. అనఘచరిత యిట్లు నను నియోగించుట
యుడుగు మని యమాత్యయుతము గాఁగ
భక్తి మెఱసి యెన్నిభంగులఁ జెప్పిన
నియ్యకొనక యున్న నెట్ట కేని. 164

లిఖితుండు సుద్యుమ్నునిచేత నికృత్తకరుం డగుట.

వ. నిశ్చయించి[1] సముచితదండనీతివ్రతశీలుండగునన్నరపాలుం డమ్మహాద్విజునిం గర
యుగచ్ఛేదనంబున దండితుం జేసిన నతం డతని దీవించి మగిడి చని శంఖునిం గని
నికృత్తంబు లైనహస్తంబులు సూపి సమ్యగనుభూతదండితుండ నైతి ననిన
నాతండు ప్రీతుం డై. 165

తే. ధర్మమార్గ ముల్లంఘింపఁ దగదు గాన
వలసె నిష్కృతి కుల మెల్ల వెలసె నీక
తమున సురమునిపితృతర్పణములు సేయు
మరిగి బాహుదాపుణ్యతోయముల ననఘ. 166

వ. వినుము. 167

తే. కల్లు ద్రావుట గురుపత్నిఁ గవయుటయును
విప్రుఁ జంపుట బ్రహ్మస్వవిషయ మైన
ముచ్చిలుటయును నివి గలక్రూరజనులఁ
బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు. 168

వ. ఇమ్మహాపాతకంబు లేనింటిలోన నెద్ది సేసిన నేజాతివాఁడును దండనీయుండ
విశేషించి తస్కరుండు శారీరదండయోగ్యుండు రాజదండితులు సుకృతవంతుల
భంగిఁ బుణ్యలోక ప్రాప్తులగుదురు నీ వమ్మహారాజుచేత దండింపంబడుటం బుణ్యా
త్ముండవును వంశోద్ధరణసమర్థుండవు నైతివి సంతోషింపుము పొమ్మనినం బోయి
లిఖితుండు. 169

తే. బాహుదానదియం దవగాహనంబు, సేయఁ బ్రభవించె నాతనిచేతు లపుడు
విస్మయం బంది యతఁడు వేవేగ వచ్చె, నన్నపాలికి మగుడఁ బ్రహర్ష మెసఁగ.

వ. వచ్చి యరుణకమలంబులం దెగడుతనకరంబులం జూపిన నతండు దీనికి నచ్చెరు
వడ నేల యిది మదీయతపోవిభవంబున దైవకృతం బైనవిశేషంబు నీవు శుచి
వగుట దైవంబున కెక్కె సుద్యుమ్నుండును నీపుణ్యానుష్ఠానంబున నిజపితృవర్గ
సహితంబుగా నిర్మలాత్ముం డయ్యె ననియె న ట్లగుటం జేసి. 171

చ. జననుత నీవునుం దగఁ బ్రజాపరిరక్షణ మాచరింపు నీ

1. క. సముం చితదండ.

యనుజునిమాట వేదవచనార్థనిరూఢము రాజనీతి దం
డనమునఁ గాని [1]యొండున నొడంబడ దెన్నఁడు నార్యకోటియం
దును వగ దక్కు మేలు మిలఁ దుష్టిగఁ జేయుము మేటిజన్నముల్. 172

వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 173

సీ. అడవుల మీఁ దున్నయపుడు సీతమ్ములు, వివిధమనోరథావేశకలిత
హృదయులై యుండుదు రదయత వీరి ను,పేక్షింప కిల నేలి యెల్లభోగ
ములకును భాజనంబులుఁగా నొనర్పుము, తురగమేధాదిక్రతుప్రయుక్తిఁ
బరఁగుము వీరలు బహుయజ్ఞములు సేయు, వారటమీఁద సద్వృత్తి
తే. వెడలెదవు గాక విను మేము వెట్టివార, మే మహీశ్వర నీమది మేలు గంటి
మతిథిసురపితృవిషయమునప్పు[2] త్రిక్కు, గలిగియుండంగ వదినీకుఁ గాదు గాని.

ఆ. న్యాయశాస్త్రవేది యై యింగితాకార, చేష్ట లెఱిఁగి జనుల శిష్టదుష్ట
తావిశేష మరసి దండనీతి యొనర్పు, పతికి నెల్లమేలుఁ బడయ వచ్చు. 175

క. అరి యాఱవపాలు గొనుచుఁ, గరుణ గలిగి ప్రజలఁ దండ్రిగతి మాధ్యస్థా
చరణంబునఁ బాలించుట, పరమపదముఁ జేర్చు విడుచు భయసంశయముల్.

ఆ. ఇవ్విధంబు గాక క్రొవ్వి కామక్రోధ,కలితచిత్తవృత్తిఁ [3]దొలఁగ నడచు
పతికి నగుఁ జతుర్థభాగంబు ప్రజ సేయు, పాపములఁ గులప్రదీపచరిత. 177

చ. క్రమమున నైన శాస్త్రవుల గ్రమ్మన నైనను జావఁ జేత ధ
ర్మము విను పాపకర్ము లగురాజులతోఁ దగ సంధి సేఁత దో
షము విభుఁ డుర్వి [4]యమ్ముకొని సంగరముం దొలఁగింపఁ గూడునే
సమరజితావనీభరణశాలితఁ బోలునె యొండుధర్మముల్. 178

వ. కావున. 179

క. పో రుడుగను సమకూరద, కౌరవపతి యపుడు సంధి గావింపక హిం
సారుచి నైతి ననుట యవి,చారత నృపవంశకలితజని యగునీకున్. 180

శా. భూవిస్తారము నాక్రమించి ప్రజలం బ్రోవంగ దండింపనుం
గావణ్ నేర్చి మఖక్రియల్ నడపి సంగ్రామాగ్ని కాజ్యాహుతుల్
గా వైరిక్షతజంబు వ్రేల్చి తనుపంగ క్షేపకుం డై హయ
గ్రీవుం డుత్తమసిద్ధిఁ బొందె రణముల్ [5]గీడే నృపశ్రేణికిన్. 181

వ. సంగరంబునం జంపుటయుం జచ్చుటయును బ్రజాపరిపాలనంబును దగినతెఱంగున దండించుటయును నుత్తమక్షత్త్రధర్మంబులు గావున హింసాశంక విడిచి యాన్వీక్షికీ త్రయీ వార్తా దండనీతు లనురాజవిద్యలయందును బ్రవీణు లగు సహాయులతోడం గూడి సర్వవ్యవహారంబులు నిర్వహింప నిర్యాణం బనతిదూరం బగుఁ గలంక దక్కు మని పలికె సకలలోకగ్రాహ్యవచనుం డగునమ్మహాముని

---

1. జ. ముండన మొడంబడ 2. గ. చిక్కు. 3. క. గలుగ. 4. చ. యోమికొని. 5. క. గీడల్.

యిట్లు సెప్పం దెలివొందక యున్నధర్మనందనుం గనుంగొని పురందరనందనుం
డుల్లంబునం గోపంబు గదుర మొగంబునం దోఁప నీక యుండె నప్పాండవాగ్ర
జుం డత్తపోధనవర్యువదనంబునం జూడ్కి నిలిపి నిభృతంబుగా నిట్లనియె. 182

క. పతులు మృతులైనఁ బొగిలెడు, సతులవిలాపములు శోకసంతాపం బు
ద్ధితముగఁ జేయఁగ నే వసు,మతి యేలినకలుచఁ గలఁక మానునె బుద్ధిన్.

వ. అనుటయు నమ్మునివరుం డతని కిట్లనియె. 184

సీ. దుఃఖంబుఁ బొమ్మని త్రోవ సుఖంబు ర, మ్మని తెచ్చికొన వశ మయ్యె వానిఁ
దొలుబాముసందలి దుష్కృతంబును సుకృ,తంబు హేతువులుగఁ [1]దగిలిచేయుఁ
బురుషుని కాలంబు దిరములు గావవి, పోరిఁ బోరి వచ్చుచుఁ బోవు చుండు
నర్థముల్ దుర్బుద్ధి కైనను సిద్ధించు, నగుకాలమున నార్యు లయ్యుఁ గాని

ఆ. కాల మవి ఘటింపఁ గా నేర రనిలవ, ర్ణాతపేందురుచులు నధిపకాల
కల్పితములు మంత్రశిల్పౌషధంబులు, మేలుసేఁత కాలకీలితంబు. 185

క. కమలంబులుఁ దొవలు వికా,సముఁ బొందుట లతలుఁ దరులు సకుసుమఫలభా
వముఁ బొందుట పక్షులును మృ,గములును మదకలము లగుట కాలకలితముల్.

వ. మఱియు జననమరణంబులును హానివృద్ధులును లోనుగా సకలంబును గాలాధీ
నంబ కావున నీకు శోకింపం బనిలేదు తొల్లి సేనజిత్తనుమానవపతి శోకార్తుండై
యుండి తనలోనన తెలిసి సజ్జనసన్నిధి నుపన్యసించినవాక్యంబు లాకర్ణింపుము.

పారాశర్యుఁడు ధర్మజునకు సేనజిత్తువాక్యంబు లుపన్యసించుట.

సీ. తారు గొందఱకు బాధకు లయి నడచుట, పరులచే బాధలఁ బడుట గలుగు
నివి కాలభావ్యంబు లెఱుక గల్గిననొరుఁ, బఱిచితి నొరునిచేఁ బడితి ననుచుఁ
బురుషుండు ప్రియశోకములఁ బొందఁ డర్థదా, రాపత్యబాంధవహాని కాత్మఁ
గుందంగ నడలుట మందబుద్ధిత్వంబు, వగఁ గీడు మానునే వలవ దడల

తే. శోకభయకారణంబులు లోకమున న
నేకములు దానఁ దలసూపు శోకములకు
భయములకు బుద్ధి నెడ యీఁడు పండితుండు
మూఢుఁ [2]డవి త్రోవ నేరండు మునుఁగు వగల. 188

క. వినుఁడీ సుఖమును దుఃఖము, ననిత్యములు గాన వానియాగమకాలం
బున ముదమును శోకము మొగ,కొనమియచు మ్ముఱవు శాంతి గోరుజనులకున్.

తే. మూఢతమబుద్ధు లగువారుఁ బ్రౌఢతమవి, వేకులును సుఖు లట్టులు గాక కొంత
ప్రజ్ఞ గలవారలై యపప్రతిభులైన,జనులు దుఃఖార్తు లగుట నిస్సంశయంబు.

వ. అనియె నాసేనజితుం డుదాత్తవివేకనిరూఢుం డతనివచనంబులు విద్వాదరణీ
యంబులిందలియర్థంబులునీచిత్తంబుననలవరింపుమువగయుజ్జగింపుమని వెండియు.

---

చ. దాను జేయుఁ; జ. దగులఁ జేయుఁ. 2. చ. డీత్రోవ.

తే. వర్ణముల నాశ్రమంబుల వలను మెఱసి, యరసి చక్కని తెరువున నరుగఁజేసి
ధరణి పాలింపు సముచిత దండధరణ, మాచరింపుము నీ కిది యర్హవృత్తి.

క. దివికిం జనినను నెవ్వని, వివిధగుణము లఖిలజనులు వినుతింతురు వాఁ
డవనీశ్వర సత్పురుషుం, డవు నని కయికొందురు బుద్ధి నార్యజనంబుల్. 193

వ. కావున సకలజన ప్రియహితం బగు పృథ్వీపరిరక్షణంబు నీకుం గులధర్మం బైక కర్త
వ్యం బగుట యుఱవుగాదె యనినయమ్మునీంద్రునకు నమ్మనుజేంద్రుం డిట్లనియె.

తే. మఱవ వచ్చునె నా కభిమన్యు ద్రౌప, దేయులను గర్ణు మత్స్యభూనాయకుండు
ద్రుపదనృపతియు ధృష్టకేతుండు మాన, సమునఁ బాయుదు రే యెట్లు శాంతిగలుగు.

సీ. తొడలపై నర్మిలి నిడికొని నన్నుప, లాలించు చుండు బాల్యమున నట్టి
భీష్మునిఁ జంపితి బీభత్సుభల్లముల్, దనువు సెక్కంగ నాతేఁడు శిఖండిఁ
జూచుచు నుండుటఁ జూచితి నది యుల్ల, మలమటఁ బెట్టెడి నట్లు గాక
యాభంగి నున్నప్పు డాతఁ డాద్రుపదజు, నేయుమిఁ దలఁచిన నెరియు మనసు

తే. పరశురాముని నోర్చిన బల్లిదుండు, కాశిరాజకన్యకలకుఁ గాఁగఁ బుడమి
నరపతుల నెల్ల గెలిచిన బిరుసు [1]గలన, నాఱడియ పడు టూహింప నడలుగదురు.

ఆ. అల్పకాలభోగ్య మైనరాజ్యమునకుఁ, గా ననల్పకీర్తిఘనుని జరత
సింహకల్పు వంశశేఖరజన్ముఁ ద్రుంచితి మనంబు వగలఁ జివుక కున్నె. 197

మ. జనసంపూజ్యపదారవిందుఁ డగు నాచార్యుండు శోకించి నం
దనుచా ప్పారయ వేఁడి పెద్దయు నను దా నమ్మి యర్థింపఁ జా
వనివానిం గరిచావు బుద్ధి నిడి యశ్వత్థామ సచ్చెన్ నిజం
బని యే బొంకితి మేదినీభరణ మర్హంబె గురుద్రోహికిన్. 198

ఆ. రాజ్యలాభలోభరతుఁడ నై కడుఁబాప, మైనబొంకుమాట లాడి గురునిఁ
గూల్ప నేర్చినట్టి క్రూరాత్ముఁ డేగతిఁ, బోవువాఁడు సెపుమ బుధవరేణ్య. 199

క. భ్రాత మహాత్ముఁడు గర్ణుం, డాతనిఁ జంపించి యేలు నవనీరాజ్యం
బాతురత సేయుఁ గాక సు, ఖాతిశయము మతికి నొసఁగు నయ్య మునీంద్రా.

చ. కడిఁదిమగండు కుంభజుఁడు గావఁగ [2]నొడ్డినమంటవోలె నుం
డెడిమొనఁ జూచి చూచి యిది డెప్పర మన్వగ లేక పంచితిం
గొడుకుఁ జొరంగ నత్తెఱఁగు క్రూరత సైఁప సుభద్రయుట్లుఁ గ
వ్వడి క్రియ నేర్తురే యొరులు వల్లభుఁ డే లగు [3]నట్టిఁ దుర్వ్యకిన్. 201

చ. [4]అడలడిఁ బొందఁగాఁ దగని యట్టిది ద్రోవది మేరుకల్పులం
గొడుకుల నేవురన్ జముఁడు గొన్న నలందురఁ జూడ నేర్తునే
పుడమి గిరీంద్రపంచకము [5]పొల్సినఁ బా డఱినట్టు లున్నయ
ప్పుడఁతుక యెట్టు లోర్చు గృహభారము నెమ్మది నిర్వహింపఁగన్. 202

1. జ. మగఁడు. 2. గ. నొట్టినమంట. 3. క. కట్టిఁ దుర్వ్యకిన్ 4. క. అడజడి. 5. గ. వోయిన.

క. [1]ప్రాయోపవేశమున ని, ర్కాయంబు దొఱంగుతలఁపు ♦ గదిరెడి సంతా
పాయత్తచిత్తు నకటక, టా యని పో నిండు నను దృఢవ్రతయుక్తిన్. 203

వ. అని పలికి బంధుమరణశోకవ్యాకులుం డయి యున్నయన్నరనాథవరేణ్యుతో నమ్మునినాథవరేణ్యుం డి ట్లనియె. 204

ఆ. ఇట్లనంగఁ దగునె ♦ యిమ్మెయి [2]నడల నీ, యట్టిధైర్యఘనున ♦ కగునె యనఘ
బుద్ధి సెప్ప వలసెఁ ♦ బునరుక్తభాషలఁ, జెవులు మదియుఁ గూడఁ ♦ జేర్చి వినుము.

తే. పొదలుఁ దఱుఁగుటకై పొడ ♦ [3]వొదవ్రుఁ బడుట, కై కడుం జేరుఁ బాయుట ♦ కై జనించుఁ
బొలియుటకునై సుఖంబులఁ ♦ బొందు దుఃఖ, మొందుటకునై పదార్థము ♦ లెందు నధిప.

ఉ. మిత్రుల[4]చెయ్దులన్ సుఖము ♦ మేకొను నంటయుఁ జెందు దుఃఖముల్
శత్రులచెయ్దు లంటయును ♦ సన్మతి దా ధనమూల మంటయున్
గోత్రవరేణ్య భోగములకున్ ధనముల్ గరణంబు లంటయుం
జిత్రచరిత్రుఁ డైనవిధి ♦ చేష్ట దొఱంగిన నీటివ్రాలగున్. 207

వ. కావున నెవ్వగ నొందం బనిలేదు. 208

ఆ. ధాత నిన్ను నేమి ♦ ధర్మంబు నడపుట, కై సృజించె దాని ♦ నాచరించి
యుండు నీవు నీక ♦ యొడయుండవే ధాత్రి, [5]నోదితప్రవర్త ♦ నుఁడవు గాక. 209

వ. అని పలికి యప్పారాశర్యుండు వెండియు ని ట్లను విదేహరా జగుజనకుండు వివేకపరిపాకంబు నొందక మున్నొక్కసమయంబున బంధువియోగంబు వాటిల్ల విషాదంబు నొంది గృహంబు దొఱంగి వెడలువాఁ డయ్యె నట్టియెడ నతనిపాలికి నశ్మకుం డనువిప్రవర్యుండు వచ్చిన నవ్వసుమతీపతి సముచితప్రకారంబునం బూజితుం జేసి. 210

జనకున కశ్మకుండు చెప్పిననీతి వ్యాసుఁడు ధర్మజునకుఁ జెప్పుట.

తే. అర్థములు బంధువులుఁ గల్గి ♦ నపుడు తద్వి, యోగమైనట్టియెడను మ ♦ ర్త్యునకు నెద్ది
తలఁపుమైనున్న మదవిషా ♦ దంబు లడర, కుండుఁ జెప్పవె యదికృ ♦ పాయుక్తి ననఘ.

వ. అని యడిగిన నాతం డి ట్లనియె. 212

సీ. దుఃఖంబు సుఖమును ♦ దోడివ సంసార, మునకుఁ దద్వశగతిఁ ♦ బోవు నరుని
యాత్మ నంబుదము గా ♦ ద్వపహరించినవిధం, బున నవి సెఱుచు నే ♦ పున సుఖైక
భాగియు దుఃఖైకభాగియు లేమి లో, కంబునం దెలియంగఁ ♦ గనుట మందు
వానికి విను జర ♦ రా నీక త్రోవంగఁ, జావక యుండ వ ♦ శంబె జలధి

తే. వలయవేష్టితక్షితి నేలు ♦ వానికైన, నధిప యెద్ది వాటిల్లిన ♦ ననుభవించు
నపుడు ప్రాప్తవ్య మిది యని ♦ యంతరంగ, విభ్రమము లేక యునికి వి ♦ వేకసరణి.

క. నరవర సరసాన్నంబులుఁ, బరిమళసద్వస్తువులును ♦ బరమశయనవి
ష్టరములుఁ గాలాధీనత, నరుఁ బొందుం బాయు వాని ♦ నమ్మమియ యుఱున్.

1క. ప్రాయోపవేశనంబునఁ, గాయం. 2జ. నడవ. 3గ. వెరుగు. 4జ. చేఁతలన్. 5జ. చోదితప్రవర్తి♦జాఁడవు.

చ. వల నధికంబుగాఁ గలుగు । వైద్యులు శాస్త్రము లభ్యసించి మం
దుల నొడఁగూర్ప నేర్చి తను । దోషము లారయుబుద్ధి గల్గి యా
ర్తులకుఁ జికిత్స సేసెదరు । రోగము వాయమి లేదె వారు రో
గు లగుట గాన నెట్లు ప్రతి । కూలవిధిన్ నరు నేర్పు ప్రోచునే. 215

సీ. సద్వంశజన్మంబు । సౌందర్యమును బలం, బును సుభగతయును । భోగములును
భవితవ్యతానురూ । పంబులు పేద లై, పెంచుట కలయంగఁ । బెల్లు పుట్టు
దురు ప్రజ లెంతయు । సిరి గలవారు గో,రంగఁ బుట్టరు దరి । ద్రప్రజనంబు
లాఁకటం దిని రాలు । నఱిగించుకొందురు, భోజ్యసంపన్నులు । భోజనంబుఁ

తే. బూర్ణముగఁ జేయఁజాలరు । భూపవర్య, వెలఁది జూదంబు పానంబు । వేఁట యతిని
[1]షేవితములుగాఁ దగ దని । చెప్పవినుచు, వలను గలవార చెడుదురు । వానివలన.

వ. అట్టివి దైవకృతంబులు గావున నిష్టానిష్టప్రాప్తులకుం గారణంబులు గనికొన లేవు బాంధవలాభంబును దద్వియోగంబును వఱదం గాష్ఠంబులు సంగతంబు లై పదం పడి పాసినచందంబు. 217

తే. మాతృపితృదారపుత్రక । భ్రాతృశతస, హస్రకంబులు సంసృతి । ననుభవింపఁ
బడియె నందులో నెవ్వరి । కడలువాఁడు, నరుఁడనిత్యతయూహించు । టరయ నుఱవు.

క. జననజరామరణగ్రా, హనిబిడకాలాబ్ధిమగ్న । మని జగము నెఱిం
గినవాఁడు ధర్మవర్తన, మున నుండుం జింత దక్కి । భూపవరేణ్యా. 219

క. తనయొడ లెరవని [2]నను మను,జునకును బంధుతతి సతమె । శోకించిన వ
చ్చునె చచ్చినజంతువు నె,మ్మన మధికము నొచ్చుఁ గాక । మహితవివేకా. 220

ఉ. కావున నెవ్వగల్ విడువు । గైకొను మాత్మకులార్హకర్మసం
సేవనతత్పరత్వము వి । శిష్టజనంబులసంగతిన్ భవ
ద్భావము కల్మషంబు దెగఁ । బాచి [3]శుచిత్వముఁ బొందు లోకసం
భావితకీర్తి వయ్యెదు నృ । పాలక నాపలు కూఁదు [4]పాటిగాన్. 221

వ. అనుటయుం దెలిసి జనకుం డమ్ముని నామంత్రితుం జేసి నిజకర్మతంత్రనిర్వాహణంబున కై గృహంబున నిలిచె నీవు నట్ల యుమ్మలికం బుజ్జగింపు ముత్తమక్షాత్త్రసరణిసాధితం బైనభూవలయంబుఁ బాలింపుము తక్కటితలంపులు దక్కు మని పలికిన విని పలుకకున్నయగ్రజుం జూచి సవ్యసాచి జనార్దనునితో నిట్లనియె. 222

క. బహుబంధుమరణశోక, ప్రహతవివేక మయి ధర్మ । రాజునకు మనో
మహిమ వికలమయ్యెం బర, మహితవచోవృత్తిఁ దేర్పు । మహితవిచారా.

వ. అనిన నచ్యుతుండు పాండవాగ్రజుఁ జేరం జని యభివందనం బాచరించి యతని కరంబు వట్టికొని వదనంబు విరిదమ్మిచందంబు నొంద మధురాక్షరవిన్యాసంబుగా నిట్లనియె. 224

---

1. చ. షిద్ధములు గాన దగ వని. 2. జ. మనుమనుజునకును. 3. చ. సుఖిత్వము. 4. క. పాడిగాన్.

మ. పురుషవ్యాఘ్ర మనంబు గుంద వగలం బొందంగ నీ కేల సం
గరకేలిన్ భవదీయబంధు లతిలోకం బైన[1] పెంపొప్పఁ బో
యిరి నాకంబున కట్లు గాక కల గాదే రాజవృత్తంబు దా
నరయన్ రాజుల యేల యోజనులు నిత్యాయుష్యులే చెప్పుమా. 225

వ. అని పలికి వెండియు. 226

తే. తొల్లి సృంజయుఁ డనుమహీవల్లభుండు, పుత్రశోకాతురత్వంబుఁ బొంది యున్న
నుపశమంబుగఁ బ్రాక్తననృపులఁ జెప్పి, తెలిపె నిమ్మౌని యంతకు బలిమికలిమి.

వ. అని యెఱింగించి నారదుం జూపి యిమ్మహాత్ముం డట్లు మరుత్తసుహోత్రాదు లగు రాజులపరమోత్కృష్టకర్మంబులును నట్టివారికిం గాలవశత్వంబునం బొందకుండరామియుం దెలియ నుపన్యసించినవాక్యంబు లభిమన్యుమరణశోకవ్యాకులుండ వగునీకుం దాపోపశమంబుగాఁ గృపాతిశయంబునం బరిపాటి వీరలు సెప్పి రని పారాశర్యమునీశ్వరు నిర్దేశించి వీరివచనంబుల యేనునుం జెప్పెద నాకర్ణింపు మని యిట్లనియె. 228

ధర్మరాజునకుఁ గృష్ణుఁడు షోడశరాజులచరిత్రంబులు సెప్పుట.

సీ. సంవర్తుఁ డనుమహాసంయమి దేవతా, గురుతోడియీసున నరుగుదెంచి
పూని యుపద్రష్ట యై నడపంగ హి, మాచలపాదంబునందు శక్ర
వరుణప్రభృతు లైనసురలు మహామునీం, ద్రులును సహాయులై మెలఁగుచుండ
శాలాప్రముఖభవ్యసాధనమ్ములు గన, కమయంబులుగ వస్త్రకాంచనాజ్య

ఆ. దధిపయఃఫలాదితర్పణద్రవ్యస, మృద్ధి సకలజనులు మెచ్చఁ బెక్కు
లధ్వరములు సేసె నట్టిమరుత్తుండు, నిత్యపదవి నుండ నేర్చె నయ్య. 229

సీ. సన్మార్గమున రాజ్యసంపద నొంది భూ, సురపూజ లొనరించి సువ్రతమున
బృందారకులఁ బ్రీతిఁ బొందింపఁ దన కర్థిఁ, బర్జన్యుఁ డేఁడేఁటఁ బసిఁడివాన
కనకమయము లైనకర్కటఝషనక్ర, కూర్మచయముతోడఁ గురియుచుండ
నయ్యర్థ మెల్ల ధనార్థుల కిచ్చుచుఁ, గురుజాంగలంబునఁ బరమనిష్ఠ

ఆ. నశ్వమేధముఖము లైనరాజార్హయ, జ్ఞములు పెక్కు సేసి సకలజనులు
పొగడు[3]నట్టిపాటి నెగడె సుహోత్రుఁడ, వ్విభుఁడు దెగియె ననుట వినమె యధిప.

సీ. కాంచనాలంకారకాంతంబు లై రూఢి, కెక్కు నగజములు పెక్కువేలు
జవసత్త్వరూపాదిసకలగుణములఁ బెం, పెసఁగినహయము లనేకలక్ష
లమలినస్వర్ణమయము లగుకొమ్ములుం, గొమరారుపశువులు గోటు లూర్జి
తాంగకవిలసదజావికంబులు గణ, నాతీతములు గన్య లప్రమేయ

ఆ. లఖిలరత్నవిరచితాభరణంబు, లనల్పములు మహీసురావళులకు
నిచ్చి చేసెఁ గ్రతువు లెన్ని యేనియు నంగుఁ, డతఁడు నన్యలోకగతుఁడు గాఁడె.

---

1. క. తెంపొప్ప. 2. గ. నిత్యాయుర్ధనుల్. 3. చ. నట్టిపాటు.

సీ. ఏడుదీవులయందుఁ గ్రీడాగతులఁ దన, రథము చరింప సారాతు లనఁగ
వినియు నెఱుంగక విభవ మార్జించుచోఁ, బ్రజల నొప్పింపని పరమపుణ్య
కర్మంబునకు మెచ్చి గారవంబునఁ దన, కక్షయధనము ఫాలాక్షుఁ డొసఁగ
నశ్వమేధములు జాహ్నవిపొంత శిష్టజ, నాకీర్ణములుగఁ బెక్కాచరించెఁ
ఆ. దారకములు వృష్టిధారలు లెక్కింప, వచ్చుఁ గాని యతని యిచ్చుగోవు
లెన్నఁ గొలఁది గాదు సన్నుతిపాత్ర మా, శిబికి నుర్వి నునికి సెల్లె నెట్లు. 232
సీ. యౌవనంబునఁ దప మాచరింపఁగఁ దండ్రి, పంపున నరిగిన వెంపుకలిమి
సేతువు జలధిఁ బ్రఖ్యాతంబుగా నొన, ర్చిసమర్త్యలోక[1] పావనవిభూతి
త్రైలోక్యకంటకు దశముఖు బంధుయు, క్తంబుగాఁ జంపిన కలితనమ్ము
బాలురమరణంబు వాటిల్ల కుండంగఁ, జేసినయత్యంత చిత్రమహిమ
ఆ. గలిగి యశ్వమేధములు మున్నగా ననే, కాధ్వరము లొనర్చి యఖిలజనులఁ
దల్లివోలె నరసి దశరథరాముండు, గాలవశత నొందెఁ గాదె యధిప. 233
సీ. పూర్వవంశ్యులఁ గావఁ బూని వియద్గంగ, నవని భాగీరథి యనఁగఁ బఱపి
శక్రుండు మెచ్చఁ బరాక్రమంబునఁ బేర్చి, యప్రతిహతముగ నశ్వమేధ
యాగంబు లొనరించు నప్పుడు వేయు వే, లరదంబులందుఁ గన్యల నలంకృ
తలఁ జేసి యునిచి రథంబు రథంబున, కిభములు నూఱు నూ ఱేసి యేనుఁ
తే. గేనుఁగునకు గుఱ్ఱములు వే యేసి[2] పాటి, హయము హయమునకట్ల గోచయ మమర్చి
భూరిభూరియుతంబుగ భూసురులకు, నొసఁగినట్టి భగీరథుం డున్నవాఁడె. 234
సీ. అర్థి విశ్వావసుం డాదిగాఁ గలుగు గం, ధర్వులు హృద్యవాదన మొనర్ప
నప్సరోనికురుంబ మాటలుఁ బాటలు, నై వినోదింపఁగ నమరగణము
బహువిధాలంకారభంగుల[3] విన్నాణు, వులు సూప దివ్యమునులు నుతింప
మనుజలోకం బెల్లఁ గనకాన్నవస్త్రభూ, షణదానములఁ దృప్తిసనఁగ నశ్వ
ఆ. మేధసమితిఁ జేసి మెప్పించె నింద్రుని, శతతమాధ్వరమున నతఁడు హయము
నాసపడిన నిచ్చె నాదిలీపునిఁ జూవు, మా ధరిత్రి నిపుడు మనుజనాథ. 235
సీ. జనన మాదిగఁ బాకశాసనుకరమునఁ, బ్రభవించు నేయును బాలుఁ ద్రావి
ద్వాదశదినము లాతఁడు గారవింపఁగ, వర్ధిల్లి పండ్రెండువత్సరముల
ప్రాయమై రాజ్యసంప్రాప్తికి నేతెంచి, యర్కునియుదయంబు నస్తమయము
నగుపట్లు పొలిమేర లైనమహాక్షేత్ర, మంతయు నొక్కండ యనుభవించె
ఆ. నన్నపర్వతముల నాజ్యనదుల విప్ర, భోజనము లొనర్చి రాజసూయ
ములును నశ్వమేధములుఁ జేసె మాంధాతృఁ, డింద నిలిచెనే నరేంద్రముఖ్య.
సీ. అనిమిషాసురయుద్ధమున నసురావలి, సమయించి వర్ణాశ్రమముల నేర్ప
రించి భూమి యలంకరించి యగ్నిష్టోమ, హయమేధవాజపేయాతిరాత్ర

1. గ. పాలన. 2. చ. వాసి. 3. క. విన్నాణములు.

పౌండరీకము లనఁ బరఁగినయధ్వరం, బు లనేకములు సేసి భూసురులకు
నఖిలభూములఁ గలయర్థంబు లెల్లను, దన కని యేమియు నునుప కిచ్చె
ఆ. శుక్రునల్లుఁ డనఁగ శోభిల్లి తనయందు, ధర్మతత్త్వ మూర్జితముగ నియమ
నిష్ఠుఁడై యయాతి నెగడె శాశ్వతుఁ డయ్యె, నే నృపాల యమ్మహీశ్వరుండు.
సీ. ఓర్వక పెక్కండ్రు దుర్వీశు లొక్కటఁ, బై నెత్తి వచ్చిన భండనమున
వారిహేతిచ్ఛత్రవాహనధ్వజములు, నఱికిన [1]నడునడ నడఁకి వార
లభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి, యేచి యీపెన్నేల యెల్లఁ దాన
కొని యధ్వరములు [2]పెక్కొనరించి వేడుకఁ, బాయసంబులునపూపములు మోద
ఆ. కములు లోనుగాఁగఁ గలవంటకముల ను, ర్వీసురావళులకుఁ బ్రీతిఁ జేసి
దక్షిణలుగ మణివితానంబు లిచ్చిన, యంబరీషుఁ డేమి యయ్యెఁ జెపుమ. 238
సీ. లక్షభార్యల నుపలాలించి యొక్కొక్క, వెలఁదికి వేవురు వేవు రాత్మ
జులుగాఁగఁ బదికోటులలఘుమూర్తులఁ గాంచె, వారును దోర్బలోజ్జ్వలులు నార్య
చరితులు నై పేర్చి తురగమేధంబు లం, దఱు బహుదక్షిణోదాత్తభంగిఁ
జేయుచుఁ దనపంపు సేసి వర్తింపంగఁ, దానును విశ్రుతాధ్వరము లొప్పఁ
తే. బెంపుసొంపును సువ్రతసంపదయును
నిర్మలశ్రద్ధయును గర్మనిపుణతయును
నెఱయ శశిబిందుఁ డొనరించి నెగడె నతఁడు
పడయఁ జాలెనె యెన్నఁడుఁ జెడనియొడలు. 239
సీ. అధికతపంబున నగ్ని నారాధించి, ప్రత్యక్ష మగుటయు బ్రహ్మచర్య
వృత్తంబు దమమును వేదవిత్త్వము నహిం, సయుఁ బాత్రదానంబు శమము వరము
గాఁ గోరికొని వేదికాస్థలి మణికన, కాత్మిక మై ముప్పదాఱుయోజ
నముల దైర్ఘ్యమునంత కమరువిస్తారంబుఁ, గలుగంగ నొనరించి క్రతువు సేసి
తే. విప్రవితతికి దాని నతిప్రియమున
నిచ్చెఁ దనపేర గయ నుతి కెక్క వటము
పొగడు వడయంగఁ బుణ్యుఁడై నెగడె గయుఁడు
భూవరోత్తమ యతఁ డెందుఁ బోయెఁ జెపుమ. 240
సీ. ఇరువదివేవురు పరిణతపాచకు, లభ్యాగతులకును నతిథులకును
బాటించి క్రొత్తగాఁ బవలును రేయును, వలయునన్నము లిడ [3]వెలసి పశువు
లర్థి నుత్తమగతి కై తార చను దేర, [4]విశసించు చమరులు వేడ్కతోడఁ
బొడసూపి కడుపారఁ గుడువ హవిర్భాగ, ములు వెట్టు చివ్విధంబున మహోద్భ
తే. తముగ నొనరించె సత్త్రియాగము తదుత్స, వంబు గొనియాడవచ్చినవార లెల్లఁ
బ్రచురపుణ్యాత్ముఁ డన నొప్పె రంతిదేవుఁ, డవ్విభునకును వలసె లోకాంతరంబు.

1. క. ఖ. గ. చ. నడునడ 2. చ. పెక్కులొనర్చి. 3. క. వెలసె. 4. గ. విశసించు నమ... వెట్టునివ్విధ.

సీ. శరభసిం[1]హాత్యుగ్రసత్త్వచయంబుల, నేడిక లెట్లట్ల యెక్కి యాడి
కట్టుచు విడుచుచుఁ గణ్వాశ్రమంబున, దమియింపఁగా సర్వదమననామ
మిడిరె నమ్ముని పదంపడి మహారాజ్యప, దస్థుఁడై కాళిందితటమునందు
భాగీరథీతీరభాగంబునను సర,స్వతిసమీపమునను వాజిమేధ

తే. రాజసూయాదివివిధాధ్వరము లొనర్చి, కనకనిర్మితకరితురంగమరథంబు
లసదృశప్రీతి విప్రులకొసఁగెభరతుఁ, డన్నరేంద్రచంద్రుండును జన్నవాఁడ.

సీ. మిఱ్ఱుఁ బల్లంబు నైనమెలఁగంగఁ దనరథ, ప్రముఖవాహనములఁ బఱప ననువు
గా కున్న మేదినిఁ గని సమస్థలియుఁగ, వెరవున నొనరించి విశ్రుతముగఁ
దనపేరఁ బృథివి నాఁ జనఁ జేసి గోరూప, మైనయివ్వసుమతి నమరనగముఁ
బనిచి యోషధులును బహురత్నములుఁబిది,కించి జనంబుఁబోషించెఁ బృథుఁడు

తే. సేసె నానాధ్వరము లవి సెప్ప నేల, సకలధాత్రి బ్రాహ్మణులకు సత్కరించె
నమ్మహానుభావునకును నతులయశము, కాక సుస్థిర మయ్యెనే కాయ మనఘ.

సీ. బ్రహ్మవిద్వేషంబుఁ బరికించి కోపించి, యవిజేయుఁడై నసహస్రబాహుఁ
బరిమార్చి నృపతులఁ దర మిడి తునుమాడె, నిరువదియొక్క[3]మాఱెల్లచోట
నందఱ మేలెడు నన్ని భూములుఁ దాన, యేలె ధర్మోజ్జ్వలపాలనమున
రాజ్యయోగ్యములు ధరాసురార్హంబులు, నగు నధ్వరములు పెక్కాచరించెఁ

ఆ. గశ్యపునకు నిచ్చి కాశ్యపి యనుపేరఁ, జనఁగఁ జేసె నుర్వి జామదగ్న్యుఁ
[4]వినమె యామహాత్ముఁడును ససంతోషవి,భ్రాంతి గలిగె నేని బ్రదుక లేఁడు.

వ. అని చెప్పినయప్పుండరీకాక్షునితోఁ బాండవాగ్రజుండు సృంజయసుతుం డైన సువర్ణష్ఠీవిజన్మంబును వాఁడు మృతుం డయినవిధంబును వినినది యయినను సువ్యక్తంబుగా విన వలతుం జెప్పవే యనిన నతం డతని కిట్లను నీకు నాఁడు కృష్ణద్వైపాయనుం డక్కుమారువృత్తాంతంబు నారదునధీనం బగుటం జేసి తద్వ్యాపారంబు సెప్పెఁ బర్వతునిం జెప్పండు గాని పర్వతుండును సహకారి యత్తెఱం 245
గాకర్ణింపుము.

శ్రీకృష్ణుఁడు ధర్మజునకుఁ బర్వతనారదులవృత్తాంతంబు సెప్పుట.

సీ. అధిప నారదు చెలియలికొడు కప్పర్వ,తుం డిద్దఱును మహీమండలమునఁ
ద్రిమ్మరు వేడుక దివినుండి యెక్కటఁ, జనుదెంచి తమలోన సమయ మధిక
నిష్ఠమైఁ జేసిరి నిజచిత్తవృత్తు లొం, డొరులకు దాఁపక యుండువార
మటు గాక దాఁప శాపార్హత వాటిల్లఁ, గలయది యని యిట్లు గలయఁ బలికి

తే. యుచితవర్తనమునను నుండి యొక్క నాఁడు, సృంజయునిఁ గాంచి యతఁడు విశిష్టభక్తి
నర్చనము చేసినను భవదాలయమున, ననఘ వసియింతు మే కొన్నిదినము లనిరి.

వ. అని పలికిన నాపృథ్వీపతి ప్రియం బంది సుకుమారి యను పేరం బరఁగిననిజ

1. క. హవ్యాఘ్ర. 2. జ. లట్టుల. 3. చ. మాఱెల్ల. 4. క. వినవె.

నందన రావించి యిక్కన్నియ మీకుం బరిచర్య సేయ సమధానంబున నుండుం
డని యన్నెలంతతో నీవు దేవోపచారంబుల వీరి నారాధింపు మని నియో
గించి వలయువస్తువులు సమగ్రంబులుగా సమకట్టినం బ్రీతు లై యమ్మునులు
సుఖం బున్నసమయంబున. 247

సీ. అల్లఁదనంబున | యనువు మైకొనఁ జూచు, నడపు కాంతికి వింత | తొడవు గాఁగ
వెడవెడ నూఁగారి | వింతమై యేర్పడు, దేరనివళులలో | నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు | నెలవులకలమేర, లెల్లను బిగి యెక్కి | యేర్పడంగఁ
దెలుపును గప్పను | వెలయంగ మెఱుఁగెక్కు, తారకంబులఁ గల్కి | తనముదోడరఁ

ఆ. జరణములును నడుముఁ | జన్నులుఁ గన్నులు, జవ్వనంబు చెన్ను | నివ్వటిల్లు
చునికిఁ దెలుప సృంజ | యునిపుత్రి మెలఁగువి,ధంబు నారదునకుఁ | దగులొనర్చె.

క. నారదుఁడు మదనబాణా,సారము దనుఁ బొదువ ధైర్య | సార మెడలి దు
ర్వారమనోవ్యథ వంతం, గూరి క్రమంబునఁ గృశాంగ | కుం డయ్యె నృపా. 249

వ. అట్లు కాముబారిం బడి నలంగియుఁ దనతో నుగ్గడింప సిగ్గువడి. 250

చ. వెనుఁబడుచిత్తవృత్తియును | వెల్వెలఁబాఱునాననంబు నై
యనిశముఁ గుందుమామఁ గని | యల్లుఁ డితం డిటు లేల వంతఁ బొం
దెనో యనుచింత నొంది తన | దివ్యమతిం బరికించి కాంచి కూ
డునె సమయంబు దప్పఁగఁ గ | డుం గుటిలాత్ముఁడ వైతి నాయెడన్. 251

ఆ. రాచకూఁతుమీఁద | రాగంబు పుట్టుట, నాకుఁ జెప్పవైతి | నీకు శాప
మిత్తు నమ్మృగాక్షి | నీవు వరింపక, నిలువ లేవు మరుఁడు | బలియుఁ డగుట.252

వ. పాణిగ్రహణానంతరంబ వానరవదనుండ వగు మనవుడు నారదుండు నీకు నాకలో
కంబునకుం జనుట లేకుండెడు మని ప్రతిశాపం బిచ్చినం బర్వతుం డచ్చోటు వాసి
పోయి భూజనంబులు పూజింపఁ బ్రవర్తిల్లుచుండె. 253

శా. శాపప్రాప్తికి నోర్చి తా నడిగి యా | చంద్రాస్య నన్నారదుం
డాపృథ్వీపతి యీఁ బ్రియంబున వివా | హం బయ్యె నమ్మాత్రలో
భూపా యమ్ముని వానరాననత మైఁ | బొల్పేద నక్కాంత త
ద్రూపప్రాప్తి విరక్త గాక తగఁ బ్రీ | తుం జేయుచుండెం బతిన్. 254

వ. ఇట్లు పతివ్రతయై సుకుమారి నారదు నారాధించుచుండెఁ బదంపడి యొక్కనాఁ
డేమేనియుం బనికి వనంబునకు నారదుండు వోయినయెడం బర్వతుం డచ్చోటు
గాంచి నమస్కరించి నా కిచ్చినశాపంబు మరల్పవే యనుటయు నారదుండు నీ
వు గావె మున్ను శపియించినవాఁడవు ముందర మరల్పం దగు నని పలికిన నతం
డట్ల కాక యనియె నివ్విధంబున నొడంబడి యిరువురు నొండొరువులశాపంబులు
మరల్చి రయ్యల్లుండును మామతోడన వచ్చి మందిరప్రవేశంబు సేయుసమయం

బున నారాజనందన నిజపురుషుం జూచి పరపురుషుండ కాఁదలంచి మఱి చూడక
మాఱుమొగంబు వెట్టికొని పోవుటయు. 255

ఆ. నగుచుఁ బర్వతుండు నానాతి నీపతి యగు, విశ్వసింపు మని సవిస్తరముగ
శాపములును మోక్షసంవిధానములును, చెప్పి తీర్చె దానిచిత్తవృత్తి. 256

వ. ఇట్లు నారదుండును బర్వతుండును బరస్పరప్రియకారులైరి కౌరవోత్తమా
నీయడిగినసువర్ణష్ఠీవివృత్తాంతంబు నిమ్మునివరుండు దేటపడం జెప్పెడు నని
సృంజయపుత్త్రకథనంబు నారదుకృత్యంబుగాఁ బలుకుచు నతనిం జూపిన
నాతం డిప్పుడు శౌరి చెప్పినంతయు నిట్టిద యక్కుమారు తెఱంగుఁ జెప్పెద
నాకర్ణింపు మని యప్పాండవాగ్రజున కభిముఖుండై యిట్లనియె. 257

సీ. అవ్విధంబున నేను నల్లుండు సంప్రీతి, సృంజయుపాల వసింపఁ గొన్ని
సంవత్సరంబులు సనినఁ దదాశ్రిత, బ్రాహ్మణోత్తములసంప్రార్థనంబు
గలుగంగ మాకును గమనేచ్ఛ పుట్టంగ, నారాజునకు నుపకార మొకటి
సేయఁ దలంచి యే మాయనసన్నిధి, కరిగి కోరుము వర మంటి మనిన

ఆ. నతఁడు మీరు ప్రీతు[1]లయినకంటెను నొండు, గలవె వరము లనినఁ గారవించి
యనిమిషులను మిగులుతనయునిఁ బడయంగ, వలచియుండు దట్టివానిఁ గనుము.

వ. అంటి మట్టియెడ నింద్రతేజోరక్షణాయత్తచిత్తుం డగునప్పర్వతుం డప్పుడమితేని
తో విను మక్కుమారుండు దీర్ఘాయురుపేతుండు గాకుండు ననియె దానికి నమ్మాన
వపతి యుమ్మలించి యమ్మహాత్మునాననంబునం జూడ్కి నిలిపి యిట్లేల యుమ్మదనుగ్ర
హం బనూనంబు గా వలవ దే యని ప్రార్థించిన నమ్మాట కమ్ముని మఱుమాట
వలుక కున్న నే నన్నరనాథుపైఁ గలుగుకరుణావిశేషంబున. 259

తే. వలదు శంకింప నింద్రునివలనఁ బుట్టు, నెడరు వొందకయుండఁగఁ గొడుకు నోపి
నంత గావుము గావంగ నైన చావు, నపుడు నన్నుఁ దలంపు మే నది మరల్తు.

వ. అక్కుమారుండు నిజనిష్ఠీవనాదులు సువర్ణమయంబు లగుటం జేసి సువర్ణష్ఠీవి
యనం బరఁగుఁ బ్రమోదంబునం బొందుము. 261

క. అని యూఱడిల్లఁ బలికిన, విని యాతఁడు సంతసంబు వెల్లిం దేలెం
జని యే మీప్సితవర్తన, మున నుండితి మవ్విభుండు పుత్త్రునిఁ గాంచెన్. 262

వ. వాఁడును మలమూత్రలాలాశ్రుస్వేదంబులు గనకమయంబు లయి తొరుఁగం
బెరుఁగు చుండె నాసమయంబున వేచి వెంగలు లగుమ్రుచ్చు లబ్బాలుం
బట్టి నోరం జీర దుఱిగి యడవికిం గొనిపోయి యొడలు జల్లించి పసిండి గానక
పీనుంగు వైచి పోయిరి సృంజయుండును దనకొడుకు నింద్రుం డపహరించె
ననుతలంపున శోకార్తి నొంది పలవించుచు నన్నుం దలంచినం బోయి నీకుం
బుండరీకాక్షుం డిప్పుడు సెప్పినయాదిరాజవిషయంబు లగు శోకోపశమనవచ

1. క. లయినంతకంటెను, గలవె.

నంబులు సెప్పి యంకిలి దేర్చి యవిచారులగుతస్కరు లాశిశువుం జంపుట
యెఱింగించి. 263

క. మ్రుచ్చులమూఢత్వమునం, జచ్చి నరకవాసమునకుఁ । జనినతనయు నేఁ
దెచ్చి మగుడంగ వేసీ, కిచ్చెద వగ పుడుగు మింక । నేనియు నధిపా. 264

వ. అని చెప్పి యేనును. 265

—మ్రుచ్చులచేఁ జచ్చిన సువర్ణష్ఠీవి నారదువలనఁ బునర్జీవితుఁ డగుట.—

క. భావమున నమ్మెయికిఁ దగు, దీవన యిచ్చుటయు నరుగు। దెంచె సువర్ణ
ష్ఠీవి గడు నద్భుతమ్ముగ, నావిభుఁడుఁ బ్రమోదసంభృ। తాత్ముం డయ్యెన్. 266

తే. అతని వీఁడ్కొని సంప్రీతి। నరుగుచుండి, యింద్రుచేతఁగాదిది వినుమి। క్కుమారుఁ
జంప నింద్రుండు వేచు ర। క్షణము మఱవ, వలదు నీ వని చెప్పితి । వసుమతీశ.

వ. ఏను బోయినకొండొకకాలంబునకు నాఖండలుం డక్కుమారుండు దన్ను మిగులు
నని శంకించి చంపింపం దలంచి నన్నుం బర్వతునిం దలంచి పుయిలోడి బృహ
స్పతితో విచారించిన నతం డతనిభయం బుడిపె నతండును దివ్యం బగుట
సబుద్ధికం బైన వజ్రంబు నాలోకించి నీవు శార్దూలరూపంబున సృంజయసుతుం
డగుసువర్ణష్ఠీవిం జంపు మనుటయు నప్పని పూని యది సనుసమయంబున. 268

సీ. సృంజయుం డుజ్జ్వల। శ్రీసముల్లాసప్ర,హర్ష మొప్పంగఁ బ్రి। యాంగనలును
దానుఁ గుమారయు। క్తముగ భాగీరథీ, తీరకాంతారప్ర। దేశనిత్య
వసనేచ్ఛ మెయి నుండి । కుసుమాపచయముఖ, బహువిధకేళిత। త్పరత నొంది
యొందుదలంపు లే। కుండ నద్దంభోళి, వంచన నయ్యెడఁ । బొంచి నిలిచి

తే. తెఱపిగాంచిశార్దూలమై। యుఱికివార, సేంద్రసమయానునమ్మాన। వేంద్రతనయు
వ్రచ్చియతర్హితంబయ్యె। జచ్చెవాఁడు, దాదియాక్రోశమునయా। ర్తనాదమెసఁగ.

క. విని సృంజయుండును బ్రియా, జనములు వే పాఱుదెంచి । చచ్చినబాలుం
గని బహులశోకపూరం, బున మునిఁగిరి విప్రలాప।ములు పెల్లెసఁగన్. 270

ఆ. అట్టియవసరమున । నమ్మహీపతి నన్నుఁ, దలఁచె నప్పు డేను । బలవిరోధి
మది విరోధ ముడిపి । మసలక వచ్చి య, బ్బాలుప్రాణ మెత్తి । ప్రమద మెసఁగ.

వ. ఉచితసల్లాపంబుల నించుకసేపు నిలిచి యన్నరపతి యనుమతి సేయ నరిగితి
సువర్ణష్ఠీవియుం దండ్రికి సంతసం బెసంగు తెఱంగునం బ్రవర్తిల్లి యతనిపిమ్మటం
బృథ్వీభారంబు పూని శిష్టానుగ్రహదుష్టనిగ్రహంబులు నడపుచు జన్నంబులు
సేయుచు శతాధికసహస్రవర్షంబులు రాజ్యంబు సేసె నని చెప్పి నారదుండు
వెండియు. 272

చ. హరియుఁ బరాశరాత్మజుఁడు । నాదరణాతిశయంబునన్ సవి
స్తరత నుపన్యసించినవ। చఃప్రకరంబు మహార్థగాథ మి
ప్పరమహితోపదేశములు । పాటిగఁ బట్టి వసుంధరాధురా

ధరణ మొనర్పు మయ్యెడు నుదాత్తయశంబును ధర్మవృద్ధియున్. 273

వ. అనిన నజాతశత్రుం డూరకున్నం బరాశరపుత్రుండు పరమకరుణావిధేయచిత్తుం డై యతని నుద్దేశించి. 274

సీ. క్షత్త్రియులకుఁ బ్రజాసంరక్షఁ గడచిన, ధర్మంబు గలుగునే దానివలన
వేదసంచోదితవిప్రకర్మంబులు, లెస్స లయ్యెడు నవి లేక యున్నఁ
జెడియెడు లె స్సైనఁ జెడినను రాజున, కగుఁ బుణ్యపాపంబు లగ్గలములు
గాన జనాభిరక్షణ మొనరింపుము, నావుడు నన్నరనాథుఁ డిట్లు

తే. మీరు సెప్పంగ నరియాట మేలె రాజ్య, కాంక్షమిగిలియొఁ జంపంగఁ గానియట్టి
వారిఁ బలువురఁ జంపినక్రూరతావి, శేష మాత్మ దహించుటఁ జేసి కాక. 275

వ. అనిన విని యమ్మునిపతి యమ్మహీపతి కి ట్లనియె. 276

చ. మనుజులు సేయ రెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడు
న్వినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ బాప మొం
దునొకొ కుఠారముల్ జనులు దోసముఁ బొందరు కర్త యీశ్వరుం
డనియెడినిశ్చయంబు దృఢ మై మది నిల్చినఁ జాలు భూవరా. 277

వ. కర్మఫలం బీశ్వరునియదియ తదర్పణబుద్ధిసహితంబుగాఁ బ్రబుద్ధులు వేదచోదిత కర్మంబు లనుష్ఠింతురు. 278

తే. ఒప్పకున్నను నాత్మకులోక్తకర్మ, మూర్ధ్వగతిఁ జేర్పుఁ బరకర్మ మొప్పెనేని
నార్యజనములు గిల్బిష మండ్రు దానిఁ, గాన నడపుము నిజవంశకర్మ మధిప.

క. అరివధము పాప మని మది, మెరమెర గలిగినను దగిన మొయిఁ జేయుము భూ
వర ప్రాయశ్చిత్తము గృహ, [1]ధుర యుడుగుట మేలె కీడుతోఁ [2]జా నగునే.

వ. అనుటయుఁ గాంతేయాగ్రజుండు సాత్యవతేయునాననం బాలోకించి పుత్త్రులుం బౌత్త్రులు నన్నలుం దమ్ములు జనకులుం దాతలు మామలు గురువులు సంబంధులు సఖులు నల్లురు బావలు మఱందులు మఱియుఁ బవిత్త్ర లగు ధాత్రీపతులు నాచేత మడిసిరి తదీయస్త్రీజనంబులు పతి సుత సోదర పితృమరణశోకసంతాపాతిశయంబునం బలవించి పలవించి ప్రాణంబులు విడుతురు గావున దాని సూక్ష్మంబుగా విచారించిన వనితావధపాతకంబునుం బొటిల్లు నెయ్యది కడగా నిష్కల్మషుండ నగుదు నను వెగడున మునింగినమనంబు మహీభరణంబున కెట్లు సొచ్చు నుగ్రం బైనతపంబునం దనువు దొఱంగుట దక్క నొండువిధంబు నాకుం జూడ లే కున్నయది యనిన విని యమ్మునీశ్వరుండు నిజబుద్ధి నిపుణంబుగా నిరూపించి యన్నరపతి కి ట్లనియె. 281

సీ. విడువు మున్మలికంబు వినుము నీచెప్పిన, యందఱు భూముల కాసపడియుఁ
బెంపును దేజంబుఁ బేరును గోరియు, నీసున సమరంబు సేసి చచ్చి

---

1. గ. ధుర మడుగుట. 2. జ. జన నగునే.

రాపని కిల్బిషంబగునె నీ కట్లును, గాక వారల నెట్టికర్మగతులు
మృతులఁగావించెనో మతి నెఱుంగుదె వాని, నెఱుఁగుఁ గాలుఁడు చావనేరి కెద్ది

తే. తఱి యతం డప్పు డెగటార్చు దాని నీవు, సేసినాఁడవుగా మదిఁ జింత సొనిపి
యుడుకుటొక వెఱ్ఱి దీనిపై నొల్లగృహము, విడుతుఁ గాకను టిది పెద్ద వెఱ్ఱి యధిప.

క. నేర్పరి పెక్కువిధంబుల, నార్పఁగ బొమ్మలు గడంగి యాడెడుచందం
బేర్పడఁ గాన్పుము కాలస, మర్పితకార్యకరు లైనమానవుల దెసన్. 283

వ. నీకుం బాపంబునకుం బని లేదు పని గా కుండుం గాక. 284

క. ఇచ్చఁ గృపకల్మి యొప్పెడె, చచ్చిననరపతులయేలు జనపదములు నీ
విచ్ఛేదవుగాక మసమునఁ, బొచ్చెము లేక తగ వారిపుత్త్రుల కధిపా. 285

ఆ. కొడుకు లేనిచోటఁ గూఁతుఁ బ్రతిష్ఠింపు, దానఁ జేసి వారితల్లు లధిక
హర్ష మొందుదురు ప్రియంబును నీ కగుఁ, బుణ్యమును యశంబుఁ బొందు నిన్ను.

మ. అనిమానింపకు తోడఁబుట్టువులు గారా తు న్నితూఁటాడె నెం
దును [1]గ్రొన్నెత్తురు లేఱు లై పఱవ నింద్రుం డుగ్రతన్ దైత్యులన్
మును లవ్వీరు భజింపరే క్రతువు లామోదంబుతో నమ్మహా
త్మునిఁ జేయింపరె యూర్ధ్వలోక మది గాదో యేలఁడో నాకమున్. 287

శా. నీవున్ ధర్మవిరోధు లైనజనతానింద్యాత్ములం బుణ్యమా
ర్గావష్టంభము దేజరిల్ల నృపవంశాచార మొప్పారఁ ద్రో
డై వీరానుజు లుల్లసిల్లఁగ మహోగ్రాజిం దెగం జూచి తా
దేవాధీశుఁడపోలె శిష్టపరిషత్సేవ్యుండ వై తాపనిన్. 288

ఆ. వలయునేని నధిప వాసవుచాడ్పునఁ, గ్రతుపరుండ వగుము రాజధర్మ
కలిత మైనపుడమిఁ గైకొమ్ము తొలిదొలి, యశ్వమేధయాగ మాచరింపు. 289

వ. అనిన విని యంకిలి దేఱినడెందంబుతో ధర్మనందనుం డెట్టికర్మంబులు పాపంబు లేపాపంబున కెద్ది ప్రాయశ్చిత్తంబు మునీంద్రా యెఱింగింపవే యనుటయు నతనికి నమ్మహాత్ముం డి ట్లనియె. 290

## కృష్ణద్వైపాయనుఁడు ధర్మజునకు ధర్మాధర్మంబు లెఱింగించుట.

ఆ. ఆగమోక్తకర్మ మాచరింపమియు ని,షిద్ధ మైనదానిఁ జేయుటయును
బ్రాహ్మజనులు ధరణిపాలవరేణ్య చె,ప్పుదురు పాపములుగ బోధ్యతతికి. 291

వ. ఇది కల్మషసామాన్యనిర్దేశంబు విశేషంబు వినుము. 292

సీ. ఆదిత్యునుదయాస్త[2]మయకాలములనిద్రఁ, బొందుటయును బాత్రభూతుఁడింటి
కరుగుదెంచినఁ బూజ యాచరింపమియును, బరదారగమనంబు గురుల కెదురు
సేఁతయు గ్రామంబు సెఱుచుటయును వేద, విక్రయంబును రసవిక్రయంబు
భృత్యుఁ బ్రోవమియు నసత్యోపచారంబు, గహనదాహము నన్యకర్మకృతియుఁ

---

1. క. గ్రొన్నెత్తురుటేఱు లై. 2. జ. మగుకాలముల.

తే. దనదుకర్మంబు విడుచుటయును వృథాప
శుప్రహరణంబు మేదినీసురులకలిమిఁ
గొనుటయును శరణార్థిఁ జేకొనమి విప్ర
వధయుఁ బాపంబు లందురు బుధజనములు. 293

వ. పాపంబులుంబోలె నుండియు దూష్యంబులు గానివానిం జెప్పెద నాకర్ణింపుము.

క. దురమునఁ గైదువుఁ గొని తనుఁ, బొరిగొన నేతెంచునట్టిపురుషుని వేదాం
తరహస్యవేది యయినను, బొరిగొనినను గిల్బిషంబు వొందదు వత్సా. 295

క. ధరణీసురవిత్తము నప, హరింపఁగాఁ గని వధించునతఁడు దురితముం
బొరయఁడొకయించుకయు నని, నరేంద్ర చెప్పుదురు ధర్మనానార్థవిదుల్. 296

క. జీవితసంశయవేళను, భూవర యొం డన్నపానములు దొరకమిఁ గల్
ద్రావినఁ గల్లగు టెఱుఁగక, త్రావిన నద్దురిత మధికధర్మమునఁ జెడున్. 297

క. గురుసంరక్షణమునకును, బరమాపద యైనయెడను బ్రాహ్మణధనముల్
విరహితములు గాఁ బెఱచోఁ, జొరఁగా నగు ముచ్చిమికి వసుమతీనాథా. 298

తే. ప్రాణహాని దప్పించుచోఁ బరిణయంబు, నందు గురుజనకార్యార్థ మయ్యు నంగ
నాజనముతోడిసంభాషణమున సర్వ, ధనముఁ జెడియెడు నెడబొంకఁ జనును నృపాల.

క. కలలోనఁ జరమధాతు, స్ఖలనము గలిగినను బ్రహ్మచర్యము సెడ దు
జ్జ్వలవహ్ని నేయి వేల్చినఁ, దొలఁగుం గిల్బిషము దురితదూరచరిత్రా. 300

ఆ. అన్న పతితుఁడైన నటు గాక సన్న్యాసి, యయ్యెనేనిఁ దమ్ముఁ డాతఁ డుండ
దారసంగ్రహంబు దాఁ జేసి పాపంబుఁ, బొరయఁ డండ్రు బుధులు కురువరేణ్య.

తే. అడవి గోవులకై కాల్చుటధ్వరమునఁ, బశువుఁ జంపుటయును దానపాత్రభూతుఁ
డగు టెఱుంగక యిచ్చుట దగనిబంటుఁ, బ్రోవకుండుట [1]గీడులు గావు వత్స.

వ. తపంబుల దానంబుల మఱియునుం దగినపుణ్యకర్మంబులనుం బాపంబులు పరిక్షీ
ణంబు లగుననునివి సామాన్యవచనంబులు ప్రాయశ్చిత్తవిశేషంబు లెఱింగించెద.

వ్యాసుఁడు ధర్మజునకుఁ బ్రాయశ్చిత్తవిశేషంబు లెఱిఁగించుట.

సీ. వినుము కర్మము దెల్పుచును గపాలంబున, నెత్తినభైక్షాన్న మేకకాల
మశనంబు గొనుచుఖట్వాంగ చిహ్నము బ్రహ్మ, చర్యంబునై యధశ్శయనమాచ
రించుచు నిట్లు పండ్రెండువర్షంబులు, వ్రతవృత్తి నడపంగ బ్రహ్మహత్య
కిల్బిషంబు దొఱంగుఁ గృచ్ఛ్రముల్ నడపిన, నాఱువత్సరముల నడఁగు మూఁడు
తే. హాయనంబులు నడపఁ జాంద్రాయణములఁ, బోవు నిష్ఠానిరతి మాసభోజి యైన
నబ్దమునఁ బాయునటుగాక యశ్వమేధ, యాజి యగునేని వలదు భిక్షాదు లధిప.

క. అవనీశ యశ్వమేధము, నవభృథమున నీరఁ గ్రుంకి యన్యుఁడు శుద్ధుం
డవుఁ బాపుఁడైనఁ దత్క్రతుశేషము లోకపూజితం బగు టరుదే. 305

1. క. గీఱులు.

తే. పుష్టగోలతఁ నొండెఁ గాంభోజవాజి, శతక మొండెను భూసురతతికి నొసఁగఁ
బాయు బ్రాహ్మణార్థాహవప్రాణహాని, నైన నొండెను జెడు బ్రహ్మహత్యకీడు.
సీ. కల్లు ద్రావినపాతకం బది యగ్నివ, ర్ణము గాఁగఁ గాఁచి పానంబు సేయఁ
గను[1]మారి యుఱుకంగ ననలంబుఁ జొర మహా, ప్రస్థానమాచరింపంగఁ బాయు
నట్లును గాక బృహస్పతిసవన మ, న్క్రతు వొనరించిన నతివిశిష్ట
భూమిదానమునను బోవు నక్కి ద్గురు, తల్పగుం డనల ప్రతప్త మైన
ఆ. యాయసాంగనాంగ మాలింగనము సేసి, నైనఁ గోసి కరమునందు మేహ
నము ధరించి యంబరముఁ జూచుచరిగి యే, నియును జచ్చి యఘముని స్తరించు.
క. గురుతల్పగుండు రణమున, గురునకు నై చచ్చియేని గురువర ధరణీ
సురులకు సర్వధనము భ, క్తి రతి నొసఁగి యేనిఁ బాతకిత్వముఁ దొఱఁగున్.
క. ధరణీసురుస్వర్ణము నప, హరించినతఁ డంతకనక మట్టి దవినియో
త్తరుఁ డై మగుడఁగ నిచ్చినఁ, బరిహృత మగుఁ గల్మషంబు పౌరవముఖ్యా.
క. అనృతోపచారకలనం, బునఁ బుట్టినపాతకంబు వోవుం దా నె
వ్వని నపచరించెఁ దగ నా, తనిఁ బ్రీతుం జేయ ధర్మతత్త్వప్రవణా. 310
క. గురువునకు మాఱు వల్కుటఁ, బొరసినకల్మషము వాసిపోవు నతనికిం
బరితోషముగా వినయపు, వెరవున నుపహార మిచ్చి వినతుం డయినన్. 311
క. పరదారగమనదోషము, పరిహృత మగు నొక్కయేఁడు పరమనియతుఁ డై
చరియించినఁ గృచ్ఛ్రంబులు, గురుకులజలనిధిశశాంక గుణమణినికరా. 312
ఆ. వావి గానియట్టివనితఁ బొందినపాప, మాఱునెలలఁ [2]బాయు నార్ద్రవస్త్ర
ధరణభస్మశయన పరతఁ బాటించుచు, నియతి నుండెనేని నృపవరేణ్యా. 313
క. పరపురుషసంగమంబునఁ, బరిహృతమై యున్నయట్టిభామిని శుద్ధిం
బొరయు రజస్వల యై కం, చరయఁగ భస్మమున శుద్ధ మైనవిధమునన్. 314
ఆ. నఱకఁ దగనిమ్రాను నఱకిన దిర్యగ్వ, ధంబుఁ జేసినను నఘంబుఁ బాచి
కొనునరుండు మూఁడుదినములు దనచేఁత, పలుకుచును సమీరభక్షుఁ డయిన.
వ. అని చెప్పి వెండియు. 316

క. మితభోజి యై వివిక్త, క్షితి సావిత్రీజపంబు సేయు టది యహ
స్థితియు [3]నిశాసీనత్వము, మతి నేమఱ కట్టు లైన మాను నఘంబుల్. 317
తే. పుణ్యకర్మముల్ సేయుచు భూసురులకు, వివిధధనములు ప్రీతితో వినయ మొప్ప
నొసఁగుచుండెడివారు పూర్వోపచితము, లైనకిల్బిషములఁ బాతు రవనినాథ.
క. విను మాస్తికతాశ్రద్ధా, వినయంబులు గలుగువారు వీనికి నెల్లన్
జననాథ యర్హు లవి లే, ని నరులు పాపములఁ దొలఁగ నేర్తురె యెట్లున్. 319
వ. ఆస్తికతాశ్రద్ధావినయంబులు నీకు సహజంబులు గావే కావునఁ బ్రాయశ్చిత్తంబు

1. క. మాసి. 2. జ. వాఱు. 3. గ. జ. న్నిశాశనత్వము.

లల్పంబు లైననుం బాపంబులం బాపనోపుఁ బాపంబోయని శంకించుకర్మంబును భారతయోధవధంబ కాదె యది యాత్మరక్షణంబునకై చేయుటం జేసియు నుత్తమ క్షత్త్రియధర్మం బగుట నిరూపింపం [1]బాపత్వంబుం బొరయకున్న యది యట్లుం గాక భవదంతఃకరణంబున జనియించినకరుణయుం బశ్చాత్తాపంబును నిన్నుం బరిశుద్ధునిం జేసె నీవు ప్రాణబాధకంబు లగుతపశ్చరణంబులకుం జొరం జూడకుము కురుకులచూడామణిత్వంబునకు మూలం బయినమహీపాలనం బాచరింపు మనిన నబ్బాదరాయణుతో నమ్మేదినీరమణుం డపేయంబులు నభోజ్యంబులు నెయ్యవి యపాత్రభూతపురుషు లెట్టివారు మహాపురుషా యెఱింగింపవే యని యడిగిన నతం డిట్లనియె. 320

క. తురగియు నుష్ట్రియు ఖరియును, గురిసినదుగ్ధములు నింద్యకోటిగణితముల్ ధరణీసురాదిజను ల, ప్పొరువునఁ బోయిన నఘంబుఁ బొందుదు రధిపా. 321

సీ. మానుషీక్షీరంబు నీనినపదినాళ్ల, లోనిధేనువులపాలును నపేయ
ములు ప్రేతవిషయాన్నమును సూతకాన్నంబుఁ, దలవరియన్నంబుఁ గులటయన్న
మును వనితోపజీవనశీలునన్నంబు, నాడెడుపాడెడునట్టివాని
యన్నంబు జూదరియన్నంబు [2]సూనరి, యన్నంబు బహివెట్టినతనియన్న

ఆ. మును నిజాగ్రజునకు మునువెండ్లియాడిన, పురుషునన్నమును నభోజ్య మండ్రు వందియన్న మధికనిందాస్పదంబు ప, ర్యుషితశుష్కములను నుడుగ వలయు.

క. విను సురతోఁ గూడఁగఁ దెచ్చినయట్టిది యెద్దియును భుజింప రభోజ్య త్వనిరూపణనిపుణత గల, మనుజోత్తము లఖిలలోకమాన్యచరిత్రా. 323

క. పులగముఁ బాయస మట్టులుఁ, బలలము నర్చనకుఁ [3]గాక పక్వము లయినం గలుగు నభోజ్యత్వము వి, చ్చలవిడి వంటకము సేసి చనదు భుజింపన్. 324

వ. అని వెండియు. 325

తే. అతిథిపితృదేవతాపూజ లాచరించి, కాని గృహమేధులకు భోజ్యమైనఁ గుడువఁ దగదు యజ్ఞశిష్టం బమృతంబు గాఁగ, నార్యజనములు సెప్పుదు రధిపవర్య.

క. ఆలును బిడ్డలు బంధులు, నై లీలఁ జరించుచును గృహస్థుఁడు దత్త ల్లోలత్వరహితచిత్తత, మేలుగ నలవఱుప వలయు మీఁ దెఱిఁగి నృపా. 327

—కృష్ణద్వైపాయనుఁడు ధర్మజునకు నపాత్రపురుషుల నెఱింగించుట.—

వ. అని యిట్లు చెప్పి యపాత్రభూతపురుషుల నాకర్ణింపు మని పలికి. 328

సీ. పాడియు నాడియుఁ బ్రదుకువారలఁ బరిహాసకు దుర్జను నంగహీను
మత్తుని మ్రుచ్చు నున్మత్తు నపుంసకుఁ, జెనఁటిమాటలఁ దేల్చుమనుజుఁ గులము
చాలమి వేదంబు చదువమి నిజవృత్తి, హాని దుర్వృత్తి గలట్టివాని
దానపాత్రంబులు గా నియ్యకొనరు పె, ద్దలు దీనుఁడును విపద్వ్యాధితుండు

1. గ. బాపత్వంబునం బొరయదు. 2. జ. సూనరన్న యంబును బహి. 3. చ. గాఁగఁ బక్వ ... గలుగును భోజ్యత్వము

తే. నీఁగి కర్ష్మలు దయపేర్మి । నిచ్చుచోట, నైన నవగుణ మెక్కుడై । కానఁబడిన
నిందితాత్ముల కిచ్చుట । నిష్ఫలంబు, పాత్రనిశ్చయ మిట్టిది । పౌరవేంద్ర. 329

క. శిల చేవప్రాను దెప్పఁగ, జలనిధిఁ గడవ దొరఁకొనిన । చాడ్పునఁ బాత్రం
బును గానియెడల దానం, బులఁ బాపము నిస్తరింప । బుద్ధిఁ దలఁచినన్. 330

ఆ. పునుకఁ గుక్కతిత్తిఁ । బోసినపాలు నీ, ళ్లధికనిందఁ బొరయు । నట్లు దుష్ట
మై యపాత్రవిషయ । మగునీగివృథవోవు, నిచ్చుచోటఁ బాత్ర । మెఱుఁగవలయు.

తే. పండునకు బిడ్డ నిచ్చిన । చంద మొందు, బూదిలో నేయి వేల్చుటఁ । బోలు నోటి
కడవ నీళ్లు వెట్టిన । కరణి యగు న, పాత్రజనులకుఁ బెట్టుట । పౌరవేంద్ర. 332

క. దానవిధి యరయ నసమీ, చీనం బగు నేనిఁ గీడు । సేయుం గురుధా
త్రీనాథ మఱియుఁ బాత్రం, బైనను గొన్నతని కిచ్చు । నతనికి నెట్లున్. 333

క. కావున విను పాత్రము మే, లై విహితాచరణసౌమ్య । మగుదానము ధా
త్రీవర దాత్రాదాతలఁ, దా వెలయించు భువనద్వి । తయరంజకతన్. 334

వ. అని చెప్పి యేను నీకు బుద్ధులు సెప్పం జొచ్చి సంక్షేపరూపంబునం గీడుమే లెఱిం
గించితి నిప్పలుకులు పాటిగాఁ గొని విహితానుష్ఠానపరుండ వగు మనుటయు
నమ్మనుజపతి యమ్మునిపతితో మహాత్మా భవదనుగృహీతంబు లైనయివ్వాక్యం
బులు హర్షంబు నావహించె నెప్పాట ధర్మం బగుమార్గం బవలంబించి రాజ్య
తంత్రంబు నడపి యశుభంబునం దొడరక జయింతు నట్టి తెఱంగు గలుగం
గృపసేసి రాజధర్మంబులుం దక్కనుంగలుగువర్ణాశ్రమధర్మంబులు నాపద్ధర్మంబు
లును లోనుగా నెఱుంగం దగుధర్మంబు లెల్ల నెఱింగింపవే నాకు రాజ్యం
బును ధర్మచర్యయును బరస్పరవిరుద్ధంబు లయిన ట్లున్నవి గావున నివ్విధంబున
విన్నవింప వలసె నని చెప్పుటయు నత్తాపసోత్తముండు ప్రీతచిత్తుం డై యతండు
విన నారదుతోడ నీభూపతి భీష్ముపాలికిం బోవలయు నయ్యార్యవరుచేత సకల
ధర్మంబులు వినువాఁ డగుట యర్హప్రకారం బనవుడు నారదుం డిది లెస్స యని
పలికిన నప్పరాశరపుత్త్రుం డయ్యజాతశత్రున కిట్లనియె. 335

ఆ. కురుపితామహుండు । గురుబుద్ధి నింద్రాదు, లకును మాననీయుఁ । డకుటిలాత్మ
కుండు పరశురాము । కోదండవిద్యాది, సుగుణములకు నెల్లఁ । జొచ్చినిల్లు. 336

క. సురతటినీపుణ్యతమో, దరమున జన్మించినాఁ డు । దాత్తవ్రతత
త్పరుఁ డతని కెల్లధర్మముఁ, గరస్థలామలకసన్ని । కాశం బధిపా. 337

క. చ్యవనుఁడు మార్కండేయుం, డు వసిష్ఠుఁడు లోనుగాఁ బ । టుప్రాజ్ఞులు గా
రవమున వినిపింపఁగఁ దెలి, య వినియె ధర్మప్రపంచ । మతఁ డఖిలంబున్. 338

తే. శాంతమానసుఁడై నయా । శాంతనవుఁడు, విస్మయావహచరితుండు । వినుమువలసి
నపుడువిడుచుటకై ప్రాణ । మాఁగినాఁడు, గాదెయొరులంతవా రెందుఁ । గలరెనరులు.

చ. అతనికి నీపయిం గరుణ । యగ్గల మ ట్లగుటం గురుక్షమా

పతివర ప్రొమ్ము నీ వతని~పాలికి నాతఁడు నిన్ను సంప్రశ్నో
ధీశుఁడుగఁ జేయు ధర్మములు ~ దేటపడంగ నుపన్యసించు మా
మత మిది దీనఁ గీర్తియు స~మంచితధర్మముఁ బెంపు గాంచెదున్. 340

వ. అయ్యుత్తమోత్తమునకు నూర్ధ్వలోకగమనంబునకు సమయం బాసన్నం బగుచు వచ్చెం దడయ కట్లు సేయు మనిన విని యవ్వసుమతీపతి మునీంద్రా బహుబంధువధపాతకం బాచరించి యమ్మాననీయాత్ము నెదిరి కెట్లు వోదు నట్లుం గాక యకృత్రిమసమరశీలి యగుసద్గుణశాలిం గృత్రిమసమరంబునం గూల్చి క్రమ్మఱ నమ్మహాత్ము మొగంబు సూచి నాకు ధర్మంబు లుపదేశింప వేయవి యడుగనేర్తునే యనుటయు నజ్జననాథునకు జనార్దనుం డిట్లనియె. 341

తే. ఇంతనిర్బంధ మేటికి ~ నిమ్మునీంద్రు, పనుపు సేయుదు గాక, యి~ప్పాట నెల్ల
పెనుపులకుఁ బాత్రమయ్యెద ~ వనటతోడ, నెద్దియును నేలపురమున~కేఁగుమిపుడు.

వ. మరల గాంగేయుకడకు వత్తు వది మేలు లె మ్మని పలికి వెండియు. 343

తే. తమ్ములును విప్రవరులును ~ ధరణిఁ గల్గు, బహువిధంబులప్రజలును ~ బార్థివేంద్ర
చాతకప్రకరములు పర్జన్యుఁ గోరు, నట్టు నినుఁ గోరు టతికృప ~ నాదరించి.

వ. ఈసర్వజనంబులమనోరథంబులు సఫలంబులు సేయు మని ప్రార్థించె నివ్విధంబునం గృష్ణ కృష్ణద్వైపాయన నారద దేవల దేవస్థాను విష్ణులు లోనుగాఁ జెక్కండ్రు పెక్కుదెఱంగులఁ జెప్పినవాక్యంబులఁ జిత్తంబుకలంక దేఱి కౌంతేయాగ్రజుండు రాజ్యభారనిర్వహణోత్సాహం బంకురింప శిశిరాగమసమయకమలంబు ననుకరించునాననంబుతో నప్పారాశర్యప్రముఖమునివరులకుం బ్రదక్షిణంబును బ్రణామంబును నాచరించి వారలవలన వసుమతీవహనానుజ్ఞయు వివిధాశీర్వాదంబులుం బడసి వెలింగె వారును నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ. 345

సీ. దేవభూదేవపూ~జావిశేషము లాచరించి యక్కురుకుల~శ్రేష్ఠుఁ డుర్వి
నెడనెడ బ్రుంగుడు~వడి యున్నరాజులు, ననుదెంచి కనునవ~సరము వేచి
యునికి కృష్ణునిచేత ~ విని పూసి తోడి కట్టి, కొలువిచ్చి మణిహేమ~కుంజరాశ్వ
కాంతాదు లగుతగు~కానికల్ గైకొని, యానృపాలురకుఁ బ్రి~యం బొనర్చి

తే. యమ్మకుందుండు వారును ~ దమ్ముగమియుఁ
దక్కఁ గలబంధుమిత్త్రులు ~ ధౌమ్యముఖ్య
సూరిజనములు బలయంగఁ ~ దారకముల
మధ్యమునఁ బొల్చుచంద్రుని~మాడ్కిఁ బొలిచె. 346

వ. మఱునాఁడు కల్యంబునం గాలోచితకృత్యంబు లాచరించి ధవళానులేపనమాల్యవస్త్రాభరణంబుల నలంకృతుం డై. 347

క. నవ మగురథమున షోడశ, ధవళహరులఁ బూన్పఁ బనిచి ~ ధరణీపుఁడు విధుం

1. జ. బెరయఁగఁ.

డవిరళసుధారథం బె,క్కువిధము దోఁపంగ నెక్కెఁ గురువంశనిధీ. 348

శా. సారథ్యంబు వహింప భీముఁడు సితచ్ఛత్త్రంబు గాండీవి సె
ల్వారం బట్టఁగఁ జామరల్ గవ లిడన్ హారిప్రభం బయ్యె న
త్తేరం దేవరు నగ్నిపంచకము వేదిం బోల్చున ట్లొప్పి రం
భోరాశిధ్వనివోలెఁ దూర్యనికరంబుల్ మ్రోసె నొక్కుమ్మడిన్. 349

ధర్మరాజు సపరివారంబుగాఁ గరినగరంబు ప్రవేశించుట.

వ. ఇట్లు నితాంతకాంతిప్రకారుం డై పాండవాగ్రజుండు పాండురాజాగ్రజు నతని దేవిం బ్రభూతాందోళికారూఢులం జేసి పురస్కరించుకొని శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబు లనువాహంబులఁ బూన్చినరథంబున సాత్యకిసహితుం డయి వెలుంగువెన్నునిం బిఱిందిదెసం బెట్టికొని యతనికెలన మనోజవంబు లగు హయంబులం బూన్చినయవదాతస్యందనంబున యుయుత్సుం డరుగు దేర నుచితవాహనారూఢుం డై విదురుండు కుంతీప్రముఖకురుస్త్రీజనంబుల నందలంబుల నిడికొని వెనుక నడవ నరేంద్రులు నానాముఖంబులం దమతమసేనలతోడం గూడఁ గొలిచి చనుదెంచుచుండం జనునప్పుడు. 350

క. ద్విరదంబుల నరదంబులఁ, దురగంబులఁ గాల్బలములఁ దూర్యంబుల [1]సీ
గిరులన్ గొడుగులఁ బడగలఁ, బరిస్ఫురిత మయ్యె నతనిపయనంబు గడున్. 351

వ. మఱియును. 352

క. వందిజనులుఁ [2]బాఠకులుం, గ్రందుకొనం బొగడఁ జదువఁ గా మాగధు లా
నందముగఁ బాడ నుచితపు, మందత్వము గమనమునకు మహిమ యొసర్పన్.

వ. అన్నరనాథుండు నడచి నాగనగరంబు ప్రవేశించె నంతకు మున్న యందలిజనంబులు [3]గలువడఁగలను దోరణంబులను గ్రముక కదళీస్తంభ పూర్ణకుంభస్థాపనంబులను గస్తూరికలయంపులను గర్పూరపుమ్రుగ్గులను బుష్పోపహారంబులను బ్రాలంబమాలికలను నొప్పు మిగుల నప్పురం బలంకరించి యాబాలవృద్ధంబుగాఁ బరమాంబరానులేపనమాల్యభూషణంబులం బొలిచి బహులప్రమదంబున సమదంబు లగుసంచారంబులం జారుత్వవిశేషంబుల వహించి రక్కురురాజోత్తముండు రాజమార్గంబు దఱిసి చనుసమయంబున. 354

తే. హర్మ్యములనుండి పణ్యపుణ్యాంగనాని,కరము లక్షతయుతమౌక్తికములసేస
లలుకఁ గల్పలతానిచయములు పుష్ప,వృష్టి పెల్లుగఁ గురిసినవిధము దోఁచె.

వ. అట్టియెడఁ జూడం బఱతెంచినపౌరజానపదజనంబులు. 356

సీ. దిగ్విజయంబునం దేజస్వి యయ్యును, జాతశత్రుం డనఁ జను నితండె
రాజసూయమహాధ్వరము సేసి విప్రులఁ, గనకరత్నాదులఁ దనిపె నితఁడె

1. చ. జ. సీవిరులం. 2. గ. బఠాకులు. 3. క. గ. చ. కలువడంబులను.

నిత్యవ్రతంబుగా సత్యంబు పాలించు, నిష్ఠ యస్ఖలితగా నెఱపె నితఁడె
ధర్మైకనిరతుఁడీతం డొక్కరుఁడచువ్వొ,యని పల్కుటకుఁబాత్రమయ్యె నితఁడె
తే. బలముఁ దగవును ధర్మంబు వెలయఁ బగఱ, నశేషంబుగాఁ దెగటార్చె నితఁడె
యనఁగ మఱియును వివిధకీర్తనల హర్ష,వచనముల నుల్లసిల్లురవంబు మిగిలె.
క. లావులు వెరవులుఁ దాల్ములుఁ, జేవలు నస్ఖలితములుగఁ జెల్లుపనులు నా
నావిధములఁ జేర్కొనుచుం, బావని నరుఁ గవలఁ బొగడుపటురవ మెసఁగెన్.
క. వ్రతచర్యయు భాగ్యంబును, ధృతియు మతియు నరయ ద్రౌపదికి నెన యగుభూ
పతివల్లభాజనము లీ, క్షితిఁ గలరే యనురవంబు సెలఁగెం గలయన్. 359
వ. ఇట్లు పెల్లయినమోదితను దరంగితంబు లైననెరవులపెంపునఁ బురంబు చంద్రో
దయఘూర్ణమానం బైనమహార్ణవంబు ననుకరించె నాధర్మరాజు రాజమందిర
ద్వారంబు సేరం జనియె నప్పుడు బహువిధంబు లగుశోభనద్రవ్యంబులు గరంబు
లం గొని భవ్యభూసురులును బుణ్యాంగనలును నెదుర్కొన వాని నెల్లం గైకొ
నుచుం బ్రవేశించి యతం డేనుంగుమొగసాల నరదంబు డిగ్గి ధౌమ్యధృతరాష్ట్రపుర
స్సరంబుగా నభ్యంతరనివాసంబు సొచ్చి గృహదేవతలం బూజించి మగుడ బహి
రంగభూమికి వచ్చి నగరదేవతాపూజలు సేయింపం దగువారలం బనిచి బ్రా
హ్మణసంఘంబులం గానిపించుకొని కనకంబులును గోవులు మొదలైనవివిధవస్తువు
లునొసంగెనప్పు డాశీర్వాదనాదంబులను శంఖభేరీప్రముఖమంగళతూర్యరవంబుల
ను రోదసి పిక్కటిల్లెఁ దదనంతరంబ నిశ్శబ్దం బై యున్నసకలజనంబులును నజ్జన
పాలునాననం బాలోకించుచుండి రట్టియెడ దుర్యోధనసఖుం డైనచార్వాకుం
డనునొక్కరక్కసుండు విప్రాకారంబు గైకొని త్రిదండివేషం బలవడ నయ్యవని
దేవతాకోటిలో నిల్చి యన్నరనాథు కి ట్లనియె. 360

చార్వాకుం డనురాక్షసుఁడు బ్రాహ్మణనిగ్రహంబునఁ జచ్చుట.

చ. వినుము నరేంద్ర సర్వ మగువిప్రజనంబును గూడి నన్నుఁ బం
చినవిధ మీతఁ డేటిపతి సేసినపాపము పెద్ద చంపుచో
జనకుఁడు భ్రాత పుత్త్రుఁ డనుశంక యొకించుక లేదు సద్గురుం
డనియెడికొంకు బుద్ధి నిసుమంతయుఁ బుట్టదు వీనిఁ గాల్పనే. 361
వ. అను మని రని పలికి వెండియు. 362
ఆ. ఇట్లు శిష్టజనము లేవగింపఁగఁ జేయు, రాజ్య మేల బంధురాజి నెల్లఁ
బొలియఁ జేసి యెట్టి[1]భోగంబు లనుభవిం,చెదవు కల్మషంబు చిక్కె నీకు.
వ. అనిన విని యవ్విప్రు లత్యంతవ్యథితాంతఃకరణు లగుచు నొండొరులమొగం
బులు సూచి యిట్లు వుట్టం బని యేమి యనువచనంబులతోఁ దిరుగుడువడిరి ధర్మ
నందనుండు లజ్జావనతవదనుం డై యూరకుండి వారలవలను గనుంగొని కేలు

1. క. తెట్టి.

మొగిచి ఫాలభాగంబునఁ గదియించి యిట్లనియె. 364

తే. మ్రొక్కి వేఁడెద ననుమీరు ధిక్కరింప, కాదరింపుఁడు మునిసమూహానుమతుఁడ
వై వినిశ్చయపరికలితాంతరంగ, వర్తనముతోడ నిచటికి వచ్చినాఁడ. 365

వ. అప్పుడు భయసంభ్రమభరితు లగుచు నాభూసురులు దేవా యీవాక్యంబులు మావలనం బుట్టినవి గా విది యేమియో కాని నీ వుత్తమక్షత్త్రధర్మంబున సముపార్జించినయుజ్జ్వలశ్రీ[1]సుస్థిరతం బొందెదు మని యతనికి నాశ్వాసం బొనర్చి యమ్మాయాభిక్షువు నాలోకించి పరమబోధంబున నప్పురుషాధము నెఱింగి యమ్మహీపతితో వీఁడు దుర్యోధనసఖుం డగురాక్షసుండు సన్న్యాసి వేషంబున నేతెంచి యతనికి హితం బాచరించువాఁడై యీదుర్వచనంబు లాడె నీకుక్క మొఱఁగినయంతన పాలమున్నీరుం బోనినీకుం గలంగ నేల ధర్మాత్ము లగుతమ్ములు పనుపు సేయం బూజ్యం బగుసామ్రాజ్యంబు వహింపు మని యాదరించి. 366

క. ఆరాక్షసుఁ గనుఁగొని క్రో, ధారంజితనేత్రు లగుచు నవ్విప్రులు హుం
కారముఖరు లగుటయు నతి, ఘోరాకృతితోడ వాఁడు గూలెం బుడమిన్. 367

తే. బ్రహ్మతేజోనిహతి నిట్లు పడి మహాశ
నిప్రహతిపాతితోర్వీజనిభత నొంది
యున్నయద్దానవునిఁ జూచి యన్నరేంద్రుఁ
డెలమిసొంపు వహించెఁ దమ్ములును దాను. 368

వ. ఇట్లు ప్రీతుం డై యజాతశత్రుం డవ్విప్రసమూహంబునకు సవిశేషార్చనం బొనర్చి వీడుకొలిపె నప్పు డచ్యుతుండు బ్రాహ్మణస్తుతి సేసి యజ్ఞపతితో నిట్లనుఁ గృతయుగంబునం జార్వాకుం డను దైత్యుండు తపం బొనరించి పద్మభవుండు ప్రత్యక్షం బయిన నఖిలభూతంబులవలనను నభయంబు వేఁడిన నద్దేవుండు భూదేవతల [2]కనిష్టంబు లైనపనులు సేయకుండువాఁడవు చేసితేని నదియ నీకుఁ దుది యని పలికి యవ్వరం బొసంగె నట్లు లబ్ధవరుం డై వాఁడు గర్వించి గీర్వాణుల బాధింపందొడంగిన వారు విరించిం గాంచి యారక్కసుండు సేయుబాధలు సెప్పిన నమ్మహాత్ముం డేను మున్న యెఱింగి యొనర్చినవాఁడ దుర్యోధనుం డనురాజునకు నెచ్చెలి యై యచ్చపలుండు తత్కార్యం బాచరింపం జొచ్చి మహీసురులకు మనోవ్యథాకరం బగుకర్మంబు సేయు నప్పని కారణంబుగా వారలకోపంబునం గూలం గలవాఁ డని పలికె నద్దానవుండు నేఁ డిట వచ్చి తనదుర్వినయంబున బ్రహ్మదండనిహతుం డై పడి యున్నవాఁ డనిఁ చెప్పి యప్పీనుంగు వెడల వైపించి యాభూపాలు నుద్దేశించి వెండియు. 369

ఆ. మాఱుకొన్నవారి నీఱు సేయుము ప్రజ, నరసి మనుపు ధరణిసురులఁ బ్రోవు

1. జ. సుస్థితిం. 2. గ. కరిష్టంబు లైన. 3. క. గూలు నని.

మఖిలబంధుజనుల నాశ్రితులను సుఖ, వృత్తిమనుపు పెంపు వెలయ నధిప.

వ. రాజ్యాభిషేకశోభనం బనుభవింపు మని పలికి యాభిషేచనికద్రవ్యానయనం
బునకుం దగువారిం బనిచి బయలిపెద్దకూటంబున నమ్మహీపతికి మహోన్నత
హేమమయసింహాసనంబు వెట్టించి వలయువారల కెల్ల సముచితసమంచిత
పీఠంబులు పచరింపం గవ్వడి నియోగించిన నప్పాండవాగ్రజుం డుల్లంబుకలంక
యెల్ల డిగ్గం ద్రావి యిచ్చం దెలివొంది చెలువొందునిజపీఠంబునం బూర్వాభి
ముఖుం డై కూర్చుండె నతనికట్టెదురం గనత్కాంచనాసనంబున సాత్యకిసమే
తంబుగా శౌరియు వలపటను దాపటను మణిపీఠంబుల వడిముడియుం గవ్వడి
యును వెనుకం గనకాయుతకుజ్జాసనంబులం గవల నిరుపక్కంబుల నునిచికొని
కుంతీమహాదేవియు దామోదరుదక్షిణదిక్కున సర్పిస్సముజ్జ్వలం బగునాసనం
బున ధృతరాష్ట్రుండును దదీయప్రక్కప్రదేశంబునం బ్రస్ఫురితపీఠంబుల విదురుం
డును ధౌమ్యుండును ధృతరాష్ట్రునిపిఱుంద నర్హపీఠంబుల గాంధారీయుయుత్సు
సంజయులునుం గూర్చుండి రాసమయంబున నంబుజాక్షుండు కృపావిశేషంబునం
గృపాచార్యుం దగుతెఱంగున నయ్యజాతశత్రుం గానిపించి యోగ్యాసనంబున
ధౌమ్యసమీపంబున నతని నునిచె నంత నప్పుడమిఱేఁడు సితకుసుమాక్షతకాం
చన రజత రత్నగర్భాస్పర్శనం బాచరించెఁ దదనంతరంబ. 371

సీ. విద్వత్సమూహంబు వివిధదేశాధీశ, సంఘంబుఁ గార్యవిచారపరులు
నర్థార్జనాది కృత్యంబులవారలు, బహుపరిచర్యలఁ బరఁగుజనులు
వైశ్యప్రముఖపౌరవర్గంబులును ముఖ్య, హాలికాదిజానపదావలులును
వైణికగాయకవాంశికాదివినోద, కరులును వారసుందరులు లోను

ఆ. గాఁగఁదగినవారు గాంచి యవ్విభునిన, త్కారములఁ బ్రమోదితంబు లగుచు
భావములు దలిర్ప సేవించియుండ న, క్కొలువుసాల నొప్పెఁ గురువరేణ్యా.

ధర్మరాజుపట్టాభిషేకమహోత్సవము.

వ. అంత నాభిషేచనికద్రవ్యసంచయంబు సన్నిహితం బగుటయు మాధవాను
మతుం డై ధౌమ్యుండు ప్రాగుదీచీప్లవనం బైనవేదికాతలం బలంకరించి యందు జా
తరూపనవరత్నఖచితంబును దృఢపాదంబు నగుభద్రపీఠంబు ప్రతిష్ఠించి శార్దూల
చర్మాస్తరణశోభితంబు సేసి యర్చించి కాంచనదామజుష్టం బగునుత్కృష్టఘన
శంఖంబు సమంచితస్థండిలంబున నిలిపి పూజించి దానను దానిచుట్టునుం బార్థి
వంబులు హైమంబులు రాజతంబులు రత్నమయంబులు నగుకుంభంబు లొనర్చి
వానను గాంగంబు లగుజలంబులు నినిచి యన్నింటికి రత్నమంగళతరుత్వక్పల్లవ
కుసుమంబులను బంచగవ్యంబులను సమంత్రకముగా సంస్కారంబు నిర్వర్తించి.

సీ. వీర్యవంతము లగువివిధమంత్రంబుల, తోఁ గూడ సద్ద్విజస్తోమపరివృ
తునిఁ జేసికొని రాజుఁ దోడ్కొని యేఁగి యా, వినుతపీఠంబున నునిచి శోభ

నాలంకరణమున నభిరాము డైనపాం,చాలిఁ దద్వామపార్శ్వమున సహాస
మాసీనఁ గావించి యగ్నిముఖము సేసి,కొని హోమతంత్రవర్తన మొనర్చి
తే. నంత నూర్జితశుభవేళ యగుడు శంఖ,చక్రధరుఁ డాసమర్చితశంఖ మెత్తి
పృథివి కధిపతి వగు మని ప్రీతి నాపృ,థాసుతుని నభిషిక్తునిఁ జేసె నధిప.

వ. అప్పుడు చిత్తం బుత్తమప్రకారంబై యాంబికేయుండు ప్రసన్నవదనుం డగుచుం
బ్రతిష్ఠితంబు లయినకలశంబులలో నుజ్జ్వలం బగునొక్కటి ధౌమ్యుం డంది
యీ నెత్తి యాభూపోత్తము నభిషేకించె మఱియుం బ్రభూతాత్ము లగురాజులును
బ్రకృతులలోనం దగువారును దదభిషేకశోభనం బాచరించిరి శంఖానక దుం
దుభిప్రభృతి మంగళతూర్యంబులు గంభీరనాదంబులం జెలంగె నివ్విధంబున
సుహృజ్జనహృదయంబు లానందింప ధర్మనందనుండు సామ్రాజ్యపదస్థుం డై
భూసురదీనానాథప్రముఖపాత్రంబులకు వివిధబహుధనంబు లొసంగె నట్టియెడ
విద్యావిశిష్టబ్రాహ్మణాదిపురుషసత్తము లక్కురుసత్తమున కభిముఖు లై దేవా
దైవమానుషంబులకలిమి నతిమానుషం బగు నీవిజయంబును వసుధాధిపత్య
సంప్రాప్తియు నింత యొప్పెనే యనిన విని వారలతో నవ్వసుంధరావల్లభుండు.

సీ. కలిగె లే కుండె [2]ని ట్లలఘుగుణంబులు, వాక్రుచ్చి మీయంతవార లిట్లు
గొనియాడఁ బాండునందనులు ధన్యాత్ముల, యని పల్కి యంబికాతనయుఁ జూపి
తండ్రియు గురువును దైవంబు నీతఁడ, మాకు మీ రెల్ల నీమనుజవిభుని
పనుపు సేయుటయు నీతనికిఁ బ్రియంబు గా,వించుటయును మమ్ము వేనవేల
తే. విధులఁ బ్రీతులఁ జేతయు ర్వీజనములుఁ, బౌరులును మీరలును దొంటిభంగిఁ దప్ప
కిమ్మహారాజునెడ వినయమ్ముతోడ, నడచుచుంట యెంతయు నాకుఁ బ్రియము.

క. జ్ఞాతివధ మట్లు సేసియు, నీతనిఁ గొల్చుటకుఁ గాఁగ నీగృహధర్మో
పేతత్వముఁ బొరసితి [3]భూ,భూతికి మనకు విభుఁ డీప్రభువ మఱవకుఁడీ. 377

వ. అని చెప్పి నిజేచ్ఛ వర్తించి సుఖం [4]బుండువారుగా వినయంబుతో ధృతరాష్ట్ర
గాంధారుల నగరిలోని కనిచి పౌరులను జానపదులను బోవం బనిచి సగౌర
వంబుగాఁ గృపాచార్యు నిజనివాసంబున కరుగ వీడ్కొలిపి యువరాజపదం
బున భీమసేను నిలిపి కర్తవ్యవిచారంబునకుం దదీయనిశ్చయంబునకును సంధివిగ్ర
హాదిషాడ్గుణ్యచింతనంబునకును విదురునిం బ్రియవచనపూర్వకంబుగా నియో
గించి వలయుపనులు వెనుక ముంద రరసి యెఱింగించుటకును నాయవ్యయంబు
లెఱింగించుటకును సంజయుం జొనిపి సేనలకొలందులు గనుంగొనుటకు భృత్యు
లకు జీవితంబులు వెట్టుటకుఁ గర్మకలాపంబులు సేయించుటకు నకులు నాజ్ఞా
పించి దర్పితుల మర్దించుటకుఁ బరచక్రంబు లాక్రమించుటకు నర్జును నిర్దేశించి
బ్రాహ్మణకార్యంబులకు శ్రౌతస్మార్తకృత్యసమనుష్ఠానంబునకు ధౌమ్యుం జాలించి

1. గ. సహాసుఖాసీనఁ. 2. జ. నిట్టలపుగుణం. 3. గ. నీభూతికి. 4. గ. లుండునట్లుగా.

సహదేవుం జూచి నీవు మదీయగోపనపరుండవై సర్వావస్థలయందును మత్సమీపంబున నిల్చునది యని పలికి మఱియుం గరణీయంబు లగునధికారంబుల నెల్లను [1]గల్పించి [2]వారలమీఁదన పెట్టి యుయుత్సుం గనుంగొని విదుర సంజయుల నాలోకించి మీర లనుదినంబును నవధానంబు గలిగి రాచవారియోగక్షేమంబు లే నెట్లట్ల నిర్వహింప వలయుఁ బురజనంబులభూజనంబులకర్జంబులు రాచవారి కెఱింగించి పంచినట్లు నడపం గలవార లని యప్పగించి యభ్యంతర మందిరంబునకు విజయంచేయు మని కుంతీదేవిని బాంచాలీసహితంబుగాఁబుచ్చి.

తే. ప్రేమసంప్రీతివినయమిశ్రితవిలోక, నంబు గృష్ణునిముఖకమలంబునందు
మానసరం బగువికసనమధువునకు మధువ్రతం బయి యెగడ నాసువ్రతుండు.

వ. అమ్మహాత్ముని సాత్యకిసహితంబుగా వీడుఁబట్టున కనుప ననుజన్ముల ననిచి యుచిత వర్తనంబున నుండి పదంపడి ఖండనంబునం జచ్చినవారిం జిత్తంబున నిరూపించి తొడంగి. 380

తే. బ్రాహ్మణానుజ్ఞతోఁ గూడ బంధుజనుల, కందఱకు వేఱువేఱ మహావిభూతి
వెలయ నంచితశ్రాద్ధక్రియలు సభక్తి, కముగ రత్నహేమాదిదానములు మెఱయ.

వ. అనుష్ఠించి ద్రోణాచార్యద్రుపదతద్బంధు విరాట తదీయజ్ఞాతులకును బ్రత్యేకంబ కర్ణాభిమన్యుప్రభృతుల కెట్లట్ల సర్వదక్షిణాసామగ్రి వెలయం బరలోకక్రియలు నిర్వర్తింపం జేసి దుర్యోధనాదులకు నంతకంటె విభవం బెసంగ ధృతరాష్ట్రుం డౌర్ధ్వదైహికవిధు లాచరించునట్లుగా నొనర్చె తా నెఱింగినవారల కెల్ల లగ్గు సేయుటకుఁ దగుబంధులు లేనివసుంధరాధిపుల నెల్ల నుద్దేశించి యుచితదానం బులతోఁ జేయ ధౌమ్యుం బనిచె మఱియును. 382

క. చలిపందిరులును సత్త్రం, బులుఁ బెట్టించెను దటాకములు దేవగృహ
మ్ములుఁ గల్పించెను బంధుజ, నులకు సుగతి యగుటకై వినుతభంగి నృపా.

క. లోకమునఁ గలుగుభూసుర,లోకమునకు నెల్ల గోవులుం బసిఁడియు నా
నాకల్పంబులు బంధుల, కై కోటివిధముల నిచ్చె నతులితభక్తిన్. 384

వ. ఇట్లు సకలబాంధవసుహృజ్జనంబులకుం బారలౌకికక్రియలు సేసి యనృణత్వంబున వెలింగి జగంబులచేతం బొగడు వడసి కృతకృత్యతం బొందె నివ్విధంబునం బ్రాప్తసామ్రాజ్యుం డయినపాండవాగ్రజుం డొక్కసముచితావసరంబున గోవిందున కభిముఖుం డయి వినయంబునం గేలు మొగిచి. 385

ధర్మజుఁడు శ్రీకృష్ణు నుచితవచనంబుల స్తుతియించుట.

తే. అమలభవదీయసుప్రసాదమునఁ జేసి, పితృపితామహక్రమయోగ్యపీఠ మైన
వినుతసామ్రాజ్యమున కేను విభుఁడనై కృ, తార్థతానందపూర్ణుండ నైతిఁ గృష్ణ.

1. గ. దలఁపించి; చ. ఘటించి; జ. గలాపించి. 2. 'వీరలువీర లని వారివారిమీఁదన-వారలమీఁదన-పెట్టియుండక యుయుత్సునిం గనుంగొని నీవును, నిర్వహింపు మని పనిచి' అని కొన్నిప్రతులు.

వ. అని మఱియును. 387

క. బావలు మఱఁదులు ననుచును, నీవు కృపాతిశయ మెసఁగ నెమ్మది మమ్ముం
గావను బ్రోవను దలఁచి ర,మావర కలిసికొని తిరిగి [1]మన్నించుటలన్. 388

వ. తేఁకువ లేక మెలంగితిమి గాక భవదీయమహానుభావం బున్నరూ పెఱుంగను
దగం గొనియాడను నే నెంతటివార మని పలికి వెండియు. 389

క. ఆదిమపురుషుఁడ వగుటను, వేదంబులు సెప్పు నవియు వెఱచుఁ బలుకఁగా
నీదృక్ప్రకారుఁ డని దా, మోదర నీపెం పెఱుంగ నోరుల కలవియే. 390

క. దురితములఁ జెఱుప శుభములఁ, బెరిఁగింపం జాలునట్టి పేళ్లులు నీకుం
బురుషోత్తమ కడుఁబెక్కువి, పరమార్థద్యోతకములు భావింపంగన్. 391

తే. ప్రయతు లగుసద్ద్విజులు వానిఁ బరమభక్తి
యుక్తి నెపుడుఁ బఠించుచు భుక్తిముక్తి
దాయి వగునిన్ను సతతంబుఁ దలఁచుచును న
మస్కృతులు సేసి యవ్యయమహిమఁ గంద్రు. 392

వ. అని విష్ణు విశ్వాత్మ జిష్ణు శర్వ హంస దామోదర శంభు ప్రముఖంబు లగుప్రభూత
నామంబులం బ్రస్తుతించినఁ బ్రీతుం డై పుష్కరాక్షుండు పుష్కలం బైనవా
గ్విశేషంబుల నాధర్మనందను నభినందించెఁ దదనంతరంబ కొల్చియున్నజనంబుల
నిజనివాసంబులకుం బోవం బనిచి యక్కురుసత్తముండు దమ్ముల నాలోకించి.

మ. అటవీదేశములందు గాఢబహులాయాసంబులం గంది దు
ర్ఘటమత్స్యేశ్వరుసేవఁ గుంది బహుసంగ్రామంబులన్ విద్విష
త్పటునానాస్త్రమహోగ్రశస్త్రచయనిర్భగ్నాంగతం బొంది యు
త్కటదుఃఖంబుల మీర లొందితి రభేద్యస్థైర్యులై నాకుఁగాన్. 394

వ. నన్నుం గృతకృత్యునిం జేసితిరి కృష్ణప్రసాదలబ్ధం బయినయీరాజ్యశోభనంబు
నిజేచ్ఛాకలితసుఖావాప్తి లీల ననుభవించుచు నాత్మప్రియప్రకారంబుల వర్తిం
చుచు నవధానంబుతో రాజ్యాంగసప్తకం బరయుం డని చెప్పి యాంబికేయు
ననుజ్ఞతోడ. 395

సీ. బహురత్నమయఘనప్రాసాదమండప, దాసదాసీజనోద్భాసితంబుఁ
దత్తుల్యవైభవతదధికధనధాన్య, ముఖవస్తుసంచయసుఖకరంబుఁ
గిన్నరవల్లభగృహసమానత్వమ, హావిభూతిస్ఫురణాంచితంబు
సర్వ[2]సంపత్స్ఫూర్తిచారు[3]వామాక్షీప్ర,చారసంశోభితస్థలచయంబు

తే. నైనవాని రారాజునిల్లనిలజునకు, దుస్ససేనుమందిరము పార్థునకు వరుస
తోడ దుర్మర్షణునియును దుర్ముఖునియు,నిండ్లు గవలకు సంప్రీతి నిచ్చె నృపతి.

1. చ. మరగించుటలన్. 2. గ. సంపత్ప్రాప్తి. 3. జ. వామాక్షీసం, కులపరిశోభిత.

వ. మఱియు విదురయుయుత్సుసంజయధౌమ్యులవదనంబు లాలోకించి మీమీనికేతనంబులు మీరలు గైకొనుండని నియోగించి పెద్దనగరిలోన ధృతరాష్ట్రుండుము న్నున్నగా వసియించుహర్మ్యంబున నజ్జనపతి నునిచె నివ్విధంబున గృహంబులు విభజించి యిచ్చి కృష్ణసాత్యకుల సవ్యసాచిసదనంబున నిల్చునట్లుగా నిర్దేశించి యందఱం బోవం బనిచి యభ్యంతరమందిరంబున కరిగె నాభీమసేనాదు లమ్మహనీయనివాసంబులు సేకొని యందుఁ బ్రభూతాన్నపానాద్యనుభవంబుల సుఖించి యుండ నవ్విభుండు నిజేచ్ఛ విహరించె నని యిట్లు ధర్మపుత్రు చరిత్రంబు సెప్పిన విని యబ్భంగిం బ్రాప్తసామ్రాజ్యుండై పాండవాగ్రజుండు పదంపడి యెత్తెఱంగున వర్తించె సకలజగద్గురుం డగుకృష్ణుండు మఱి యెట్లుండె నెఱింగింపు మనుటయు.

శా. భక్తాంభోరుహబాలసూర్య దనుజప్రధ్వంసనాచార్య సు
వ్యక్తావ్యక్తనిజప్రకార సదయవ్యాపార దాంతిక్షమా
సక్తస్వీకృతనిత్య వేదపరిషత్సంస్తుత్య మాయావిని
ర్ముక్తద్యోతన తార్క్ష్యకేతన మహామూర్తిస్ఫురత్కేతనా. 398

క. భవదుఃఖభరనిరాస, [1]ప్రవీణనానాభిధాన పారాశర్య
స్తవనీయగుణ[2]నిధాన [3]స, మవబోధనిరంతరా విదాత్మాధీనా. 399

మాలిని. ప్రకృతిపురుషయోగీ భక్తతాత్పర్యరాగీ
సకృపహృదయపద్మా శాంతచిత్తైకసద్మా
వికృతిరహితమూర్తీ విశ్వభూతప్రవర్తీ
సుకృతఫలమయాత్మా సుస్థిరానందవర్త్మా. 400

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయినశ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 401



1. గ. ప్రవణప్రగుణాభిధాన. 2. క. గ. చ. వితాన. 3. సమవబోధ-గ. నిరంతతానిధాత్మాధీనా-జ. నిరంతరాచ్యుతాత్మాధీనా.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శాంతిపర్వము, ద్వితీయాశ్వాసము.





శుచితాధృతికరణక
లాశౌండకటాక్షలీల లౌల్యరహితలో
లాశక్తిత్రయసమయు
క్త్యాశోభితరూపహేల హరిహరనాథా. 1



ధర్మనందనుని ప్రవర్తనము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయునకి ట్లనియె నట్లు సమధిగతసామ్రాజ్యుం డై ధర్మనందనుండు తేజోవిశేషంబున మహోజ్జ్వలత్వంబు నొంది మహీసురుల నాశ్రితజనంబుల నర్థులం గృతార్థులం గావించి ధృతరాష్ట్రగాంధారీవిదురులకు రాజ్యంబు సమర్పించి మీర లింతటికి నొడయుల రేను మీపనిచినపని సేసి పెట్టినయట్లు గుడిచి యుండం గలవాఁడ నని పలికి నిత్యంబును వారలయనుమతి గొని భవ్యమార్గంబునం బ్రజలం బాలించుచు వారికిం బూర్వప్రకారంబుకంటె నతిశయిల్ల నెల్లవర్తనంబులు సంప్రీతిం జెల్లించుచు విపతులైనసతుల నుమ్మలికంబు వొరయకుండం గరుణ నరయుచుఁ గృప యుయుత్సు సంజయులకుం గౌరవామాత్యులకు మన్ననలు నలుపుచుఁ గుంతీదేవికి శుశ్రూష యాచరించుచుఁ బాంచాలికి సౌమనస్యం బాపాదించుచు ధౌమ్యునకు సగౌరవంబుగా సకలసంపదలు నొసంగి తన్ముఖంబున దేవపితృపూజనంబులు నతిథితర్పణంబులు వైదేశికవిప్రార్చనంబులు దీనానాథపోషణంబులుం బరమసంతోషంబుతో నడపుచుం గృష్ణు నారాధించుచు సమస్తపౌరజనపదకోటులమనంబులం బ్రమోదంబు పరిపూర్ణం బగునట్లుగా నవ్విధంబునఁ బ్రవర్తిల్లు చుండి యొక్కనాఁడు రేపకడ కృష్ణునియున్నమందిరంబునకుం బోయి. 2



ధ్యానాసక్తుఁడైనశ్రీకృష్ణునిం గని ధర్మజుఁడు సంభాషించుట.

సీ. మణిహేమపర్యంకమహితోపవేశుని, సురుచిరాభరణవిస్ఫురితగాత్రుఁ
గౌస్తుభరత్నవికాసివక్షస్స్థలుఁ, బీతకౌశేయసంవీతమూర్తి

మేరుతటీగత మేఘసంకాశు న, క్షత్త్రగణావృత గగనసదృశు
నూతనోదితరవి ద్యోతితోదయగిరి, నిభు నుక్మ బద్ధేంద్ర నీలతుల్యు
ఆ. నమ్మురారిఁ గని కృతాంజలి యై భక్తిఁ, జిత్తవృత్తి గరము సొత్తిలంగ
నంత కంత కానతాననాంబుజ మలరంగ, నిట్టు లనియెఁ దియ్య మెసక మెసఁగ.
తే. కడపితే రాత్రి సులభ సౌఖ్యంబుగా మ, నంబు గాఢ ప్రసన్నమే యంబుజాక్ష
దైవి యగునీదుబుద్ధికతమునఁ గాదె, ధర్మగతిఁ బ్రాభవంబుఁ బొందఁగఁగంటి.
వ. త్రిభువనవ్యాప్తవిక్రముండ వగునీకటాక్షంబునకలిమిం గాదే జగత్త్రయసంభావ
నీయుండ నై వెలింగితి ననుచుం జేరం బోయి. 5
క. తనయుచితాలాపములకు, మనుజేశ్వర మాధవుండు మఱుమాట యొకం
డును బలుకక భవ్యధ్యా, ననిరూఢత నున్నయపుడు నరపతి యతనిన్. 6
వ. నిరూపించి యి ట్లనియె. 7
సీ. పంచాత్మకం బైనపవనంబు నిగృహీత, మైనది భవదింద్రియములు మనము
నం దాఁగఁబడ్డవి యవియును, నదియును. బుద్ధియం దొదిఁగించి శుద్ధ మైన
నాలవ తెరువున లోలతారహితములై, గాఁగ నిన్నియును సంకలితములుగ
నంచితక్షేత్రజ్ఞునందుఁ గూర్చినవాడ, వీపరమధ్యాన మేమికతన
తే. నాలసెనొకో లోకములకు నొండొక్కవింత, లేక నెమ్మదియున్నది[1] యేకరంబు
విస్మయముఁ బొందె నామది కవినఁగవర్ష్మ, మేని వినిపింపవే నాకు నిత్తెఱంగు.
వ. అని యిట్లు ధర్మనందనుండు నివాతనిశ్చలదీపప్రకారంబున నున్నయప్పరమపురు
షుం బ్రార్థించి మఱియును. 9
తే. క్షరము నక్షరమును నీవ కర్తయును వి, కర్తయును నీవ యాద్యంతగతులు నీవ
యొక్కఁడై వెలిఁగెడుపురుషోత్తమాభి, ధానవాచ్య వినమ్రవాత్సల్యకల్య. 10
వ. ప్రసన్నుండ వగుము నాడెందంబుసందియంబు వాయం జేయవే యని విన్నవించినం
బాంచజన్యధరుండు బుద్ధియు మనంబు నింద్రియంబులును గోచరత్వసంప్రాప్తం
బులు గావించి కొంచెపునగవున నెమ్మొగం బొప్ప నప్పుడమిఱేని నాలోకించి
యి ట్లనియె. 11
సీ. గంగ యెవ్వనిఁ దనగర్భంబునం దల్చి, శ్లాఘాసమేత యై సంభరించె
భార్గవుం డెవ్వనిఁ బరమశిష్యుఁడుగాఁగఁ, బడసి గురుత్వ మెక్కుడుగ నెగడె
నారాముఁ డెవ్వనితో రాసి యిరువది, మూఁడుదినములకు వాఁడి[2] దొఱఁగెఁ
గాశీశుకన్యలు గారణంబుగఁ బోరి, యెవ్వని కోడి రనేకనృపులు
తే. వేదములు నాలుగును ధనుర్వేదమును మ
హాస్త్రములుఁ జెంది యెవ్వనియందు వెలిఁగె
నట్టిభీష్ముండు నన్నిప్పు డాత్మఁ దలఁచు

1. గ. యేకతంబు. 2. చ. దఱిఁగె.

చునికిఁ దద్గత మయ్యె నామనము నధిప. 12

క. అనలము శమించుచాడ్పున, ననఘు యతండు పరమోన్ముఖాత్ముం డై తా
ననుఁ దలఁచె నింద్రియంబులు, మనమునఁ దగ నిగ్రహించిమహితసమాధిన్.

క. శరతల్ప[1]గతుం డతఁడే, శరణంబుగ నాశ్రయించి సద్భావవ్యా
ప్తిరతుం డగుటను విను త, త్పరత నతనియందు నాదుభావం బెలసెన్. 14

వ. ఇది మదీయధ్యానంబు తెఱంగు మహాత్ముండు వసిష్ఠశిష్యుండు భూతభవిష్యద్వర్త
మానవేది సర్వవిద్యాధారభూతుం డాతం డస్తమించిన ధాత్రి యస్తమితసుధా
గభస్తి యగురాత్రియుంబోలె నగు సకలజ్ఞానంబులు ననాశ్రయంబులై పోనుం
గుపడుం గావున నీవతనిపాలికిం బోయి నీయడుగందలంచినయఖిలధర్మంబులు
నడిగి చెప్పించుకొని నిశ్శేషనిరస్తసంశయుండవు గావలయు నని యానతిచ్చిన
నమ్మానవపతి గద్గదకంఠుం డగుచు నావైకుంఠున కిట్లనియె. 15

ఉ. శంతనుసూనుగౌరవము సర్వము మున్నను వింటి విప్రుల
త్యంతము వేడ్కఁ జెప్ప నతఁ డట్టిఁడ యాతని నీవు మున్నుగా
నెంతయు భక్తిఁ గాంచుటకు నే మదిఁ గోరెద నమ్మహాత్ముఁడున్
సంతస మందు నీ దయినసన్నిధిఁ గాంచిన భక్తవత్సలా. 16

వ. ఉత్తరాయణంబు వేచికొని యున్నయన్నరోత్తముండు బ్రహ్మమయనిధి యయిననీ
సందర్శనంబు గోరు నామీఁదియనుగ్రహంబునను నతనియెడం గలుగుపరిగ్ర
హంబునను దేవా నీ విట్లు సేయవలయు ననుటయు నద్దేవకీనందనుండు సమీప
గతుం డగుసాత్యకిం గనుంగొని రథంబు సమకట్టు మని దారుకునకుం జెప్పుము
భీమార్జున నకుల సహదేవులను గృప యుయుత్సు సంజయులను రావింపు మనిన
నతం డట్లు చేసె దారుకుండునుం దే రాయితంబు గావించె. 17

క. అది రత్నరుచులపెల్లున, నుదితార్కునిఁ బోలి వెలుఁగుచుండెను జవసం
పదుదీర్ణసత్త్వసారా, స్పదసుగ్రీవాదిరథ్యసంశోభిత మై. 18

వ. ఆసమయంబున నక్కడం బారాశర్య నారద దేవల దేవస్థాణు వాత్స్య దేవరాత
ప్రభృతిపరమమునీంద్రపరివేష్టనంబు గలిగి గాంగేయుండు గ్రహగణపరివృతుం
డైనచంద్రునుంబోలెఁ దల్పీభూతశాతశరశతంబులచేత శోభిల్లి సందర్శనీయ
గభస్తివితానుం డగున స్తమయసమయభానుం బ్రేణిసేయుచుఁ గృష్ణుం జిత్తం
బున నిరతిశయనిష్ఠ నిలిపికొనియుండి చేతులు మొగిడ్చి సుప్రష్టస్వరంబున
ని ట్లని స్తుతియించె. 19

భీష్ముఁడు శ్రీకృష్ణుని భక్తియుక్తుం డై స్తుతియించుట.

సీ. శుచియును హంసుండు శుచిషత్తుఁ బరముండుఁ
బరమేష్ఠియును నగు భవ్యుఁ గొలుతు

1. చ, గుఁ డగునతఁడే.

మునులును సురలు నెవ్వనియున్నరూపెఱుం
గరు సర్వవిదుని నప్పురుషుఁ గొలుతు
శ్రుతులు సెప్పఁగ మహామతులు దుఃఖౌషధం
బుగ నెఱింగెడుపుణ్యమూర్తిఁ గొలుతు
లోకంబు లెల్లఁ గల్గుట నిల్చు టడఁగుట
తనయంద యగుమహోత్తరునిఁ గొలుతుఁ

తే. పక్షి రత్నచయంబుఁ బుష్పవ్రజంబు, పంజరముత్రాడునార యుపాశ్రయముగ
నుండుచాడ్పున విశ్వంబు నుండుటకు సు,ఖాస్పదం బగుపుండరీకాక్షుఁ గొలుతు.

ఆ. హరి సహస్రశీర్షుఁ బరము సహస్రాక్షు, వేదమయు సహస్రపాదు నలఁతు
లైనవారికంటె నలఁతి పెద్దలకును, జాలఁ బెద్ద యగుదయాళుఁ గొలుతు. 21

క. అమృతమయు ఋగ్యజుస్సా, మములయుపనిషద్వచస్సమాజములకు వా
చ్య మయినపురుషోత్తము ని, క్కము రూపగువాని భక్తిగమ్యుఁ దలంతున్.

ఆ. అరణి నగ్ని వొడమునరణి దేవకియందు, విప్రకర్మయజ్ఞవేదగుప్తి
కై జనించె నెవ్వఁ డవ్వసుదేవనం, దను భజింతు నేకతానురూఢి. 23

తే. ఒకఁడు పండ్రెండుమూర్తులై యుండునట్లు, గా హిరణ్యవర్ణం బగుగర్భ మదితి
దాల్చియెవ్వానిఁగనియె దైత్యఘ్నునట్టి, దేవసూర్యాత్మకునిఁ బ్రణుతింతువిష్ణు.

క. సురపితృకోట్లం, బూర్వా, పరపక్షదినముల నమృతపానప్రీతిం
బొరయం జేయుచు వెలిఁగెడు, హరి సోమాత్మకునిఁ గొల్తు నాత్మేశ్వరునిన్.

తే. విశ్వసృజు లనుమునులచే వితత మగుస, హస్రవత్సరకలితమహాధ్వరమునఁ
గశ్యపబ్రహ్మ యెవ్వానిఁ గనియెఁ గనక, పక్షుఁ దార్క్ష్యాత్ముఁ దలఁతు నప్పద్మనాభు.

క. సువ్యక్తక్షేత్రంబున, నవ్యక్తాకృతినిరూఢి నాసీనుం డై
భవ్యత నుండెడుక్షేత్రా, త్మవ్యపదిష్టుఁ బ్రణుతింతు దామోదరునిన్. 27

క. ప్రకృతివికృతు లనుషోడశ, వికారముల బెరసి ప్రకృతివికృతిత్వము లొం
దక యుండఁ గాంతు రెవ్వని, సకలమునులుఁ దలఁతు నట్టిసాంఖ్యాత్ము హరిన్.

క. అంతశ్చరమారుతములు, శాంతములుగఁ జేసి యనలసత్త్వము శమముం
దాంతియుఁ గలజనములు గను, నంతర్హితుఁ గొలుతు జలశయను యోగాత్మున్.

క. ఉపరమముం బ్రాపించిన, యపుణ్యాపుణ్యములు గలుగునతిశాంతులు భ
వ్యపుగతిఁ బొందెడునానం, దపురూపుని విష్ణుఁ దలఁచెదను మోక్షాత్మున్. 30

తే. చరణనాభిశీర్షంబులు ధరయు నంత, రిక్షమును దివమును జగచ్చక్షురగ్ని
దిశలు దృఙ్ముఖశ్రోత్రముల్ దీప్తు లెవ్వ, హాంగునకు నట్టిహరిని లోకాత్ముఁ దలఁతు.

క. భూతముల మ్రింగి లోక, వ్రాతము జలమయముఁ జేసి వశ్యాత్మ తని
ద్రాతిశయంబున బాలుం, డై తేలెడువానిఁ దలఁతు హరి మాయాత్మున్. 32

తే. అంబుదంబులు కేశంబు లెందు నదులు, సర్వతనుసంధులందును జలధు లుదర

దేశమునయందు నున్నట్టి దేవదేవుఁ, గొలుతుఁ దోయాత్ము దేవకీ కొడుకుఁ గృష్ణు.

తే. వదనబాహూరుపదములె వ్వాఁడు విప్ర, రాజవైశ్యశూద్రులకు సంప్రభవదేశ
ములుగ వెలుఁగొందు నమ్మహామూర్తివిభవ, దీప్తవర్ణాత్మకునిఁ బ్రణుతింతు విష్ణు.

క. మాసర్త్వయనాబ్దమయో, ద్భాసితరూపుఁ డయి సృష్టిఁ బ్రళయంబుఁ దగం
జేసి పొలు పారుశౌరి ను, పాసింతును యోగిభోగ్యబలుఁ గాలాత్మున్. 35

క. మునిదివిజాదికలోకము, లనంతుఁ డన జగతి కెల్ల నాధారం బై
పెను పొందెడు శేషాత్ముని, వినుతింతుఁ విష్ణుభక్తివిభవవిధాయిన్. 36

క. ఆదిత్యమరుద్వసురు, ద్రాదిదివిజగణము లెల్ల నవయవరూపో
త్పాదకలితు లెవ్వానికి, నాదేవుని సంస్తుతింతు హరి దేవాత్మున్. 37

క. సర్వమునందును దానుఁ, సర్వముఁ దనయందు నుండు సంచారంబుఁ
సర్వమునకుఁ దనవలనన, సర్వాత్మకు నట్టివృష్ణిసత్తముఁ దలఁతున్. 38

క. మీనయి తానతలగతం, బైననిగమచయముఁ దెచ్చి యజునకు నొసఁగం
గా నేర్చినసుమనస్స, [1]మ్మానితవిగ్రహు భజింతు మత్స్యాత్ము హరిన్. 39

క. అమృతమథనమున మంథన, గము లీలోద్ధరణకేలిఁ గైకొని సురసం
ఘమునకుఁ బ్రియమొనరించిన, యమేయుఁ గూర్మాత్ము నంబుజాక్షుం గొలుతున్.

క. వారాహరూపమునఁ బెం, పారినతనదంష్ట్ర నొకట నవని సగిరికాం
తారంబుగ నెత్తినయా, శౌరిం గ్రోడాత్ముఁ దలఁతు సమ్యగ్భక్తిన్. 41

ఆ. నారసింహవపురుదారభావము నొంది, ఘను హిరణ్యకశిపు ఖరనఖముల
వ్రచ్చి దీప్తమూర్తి వఱలు నృసింహాత్ము, నాత్మభవుని భక్తి నాశ్రయింతు. 42

క. వామనరూపంబున ను, ద్దామబలుఁ బలి నడంచి త్రైలోక్యాతి
క్రామితఁ బేర్చినయద్భుత, ధాముం భ్రాంతాత్ముఁ దలఁతు దామోదరునిన్. 43

ఆ. పరశురాముఁ డనఁగ భవ్యుండు జమదగ్ని, కుద్భవించి యిరువదొక్కమాఱు
మనుజపతుల నెల్లఁ దునిమినక్రోధాత్ము, నధికభక్తి శార్ఙ్గి నాశ్రయింతు. 44

క. క్షత్త్రాత్ముఁ గొలుతు దశరథ, పుత్త్రుఁ శ్రీరాముఁ డనఁగఁ బొలిచినదేవుఁ
శత్రుభయదు రావణు నొక, మాత్రం దునుమాడినట్టి మధుసూదనునిన్. 45

క. హలముసలధరునిఁ గరుణా, నిలయహృదయు రాము రౌహిణేయు సితాంగుఁ
జలదనిభాంబరుని శుచిం, దలఁతును గోవిందు శౌర్యధను భోగాత్మున్. 46

మ. యదువంశంబున వాసుదేవుఁ డనఁ గ్రీడార్థంబు జన్మించి దు
ర్మదదైత్యావలిఁ గూల్చి పార్థునకు సారథ్యంబు త్రైలోక్యస
మ్మద మారంగ నొనర్చి దేవమునిసమ్మానోద్ధృతిఁ భూభరం
బు దొలంగించినచక్రి నంబురుహనాభుం గొల్తుఁ గృష్ణాత్మునిన్. 47

క. కలికాలచలితధర్మము, నిలుపం గలయట్టివిష్ణు నిం గల్క్యాత్ముం

1. గ. మ్మానవతత్పరు.

దలఁతుఁ దురగవాహను మ్లేచ్ఛుల నెల్లం గీటడంచు శుభచారిత్రున్. 48

ఆ. క్షరము లైనభూతసంఘంబులం దెల్ల, నక్షరస్వరూపుఁ డై వెలుంగు
సకలబుద్ధివృత్తి సాక్షి సాక్ష్యాత్ము న, స్పందశోకఘను ముకుందుఁ దలఁతు.

సీ. పరమేశ పుణ్య సుబ్రహ్మణ్య భక్తవ, త్సల మహాదేవ [1]విశ్వప్రకాశ
కరణ హృషీకేశ వరద నారాయణా, రాజీవనయన హిరణ్యనాభ
యఖిలలోకనమస్కృతాంఘ్రిసరోరుహ, యజ్ఞాంగ యచ్యుత యమృతరూప
నీకు మ్రొక్కెదఁ గరుణింపవే యతసీక,సుమవర్ణ పీతాంబరము ధరించి

ఆ. యున్ననిన్ను నెవ్వ రుల్లంబునందుఁ ద, లంతు రట్టివారలకు భయంబు
గలుగ దెందు నేమి కార్యంబులం దెప్డు, వినుతమంగళాయతనమ వగుట. 50

క. మంగళము విష్ణుదేవుఁడు, మంగళ మెమ్మెఁ దలంప మధురిపుఁ డుద్య
న్మంగళ మంభోజాక్షుఁడు, మంగళ మఖిలము విహంగమధ్వజుఁ డరయన్. 51

క. నారాయణపరములు నిజ, మారయ బ్రహ్మంబుఁ బరము సంచితసత్యో
దారతపంబులుఁ గావున, నారాయణపరత వీని నాల్గిటి నిచ్చున్. 52

తే. విష్ణుమయమగ్ని హవియును విష్ణుమయము, విష్ణుమయము సర్వంబును విశదబుద్ధి
ని ట్లగుటఁ గందుఁ గావున నెంచు కేనిఁ, గల్మషము నాకు లే కున్కి గానవచ్చు.

క. శరణాగతుండ భక్తుఁడఁ, బరమపదవి గోరెదను శుభంబుగ నన్నుం
బరికించి యేది క్షేమ మ,య్యిరవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా. 54

తే. తపమునకు విద్యకును జన్మస్థాన మైన, జనకరహితుని యజ్ఞాత్ము శౌరి వాఙ్మ
యాధ్వరార్చితుఁ జేసితి నా జనార్ద, నుండు మద్భజనమునఁ బ్రీతుండు గాత.

క. అని యిట్లు తులస్తోత్రం, బున హరిఁ బూజించి గంగపుత్త్రుఁడు మదిలో
న నమః కృష్ణాయ యనుచు, వినతశిరస్కుఁ డయి మ్రొక్కె విశ్రుతభక్తిన్. 57

వ. అని పలికె నని చెప్పి వైశంపాయనుం డిట్లనియె.

క. స్తవరాజం బనఁగ ముని, స్తవనీయం బైనయీ వృషాకపిభవ్య
స్తవనామృతార్ణవము సం, స్తవనంబున నిచ్చు సుగతి జగతీనాథా. 58

క. విను జనమేజయభూవర, యనుత్తమం బయినయిమ్మహాస్తవము పఠిం
చిన వినినను వ్రాసిన శ్రీ,యును నాయువుఁ బెంపుఁ బేరు నొసఁగు జనులకున్. 60

వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు నిట్లనియె.

తే. అట్లు హరిఁ బ్రస్తుతించి శాంతాత్మవృత్తి, నూరకున్న శాంతనవుని భూరితేజు
నమ్ముకుందునిఁ గీర్తించి రచటనున్న, పరమమునులు గద్గదికతోఁ గురువరేణ్య. 62

వ. అంత నిక్కడ.

ఉ. ఆదివిజాపగాతనయు నంచితభక్తికిఁ బ్రీతిఁ బొంది దా
మోదరుఁ డప్డు డన్నరవరోత్తముచిత్తమునందు సర్వలో

1. చ. విశ్వప్రకాశ, శరణు.

కాద్భుతదివ్యబోధమహిమాతిశయం బుదయింపఁ జేయుచుం
దా దయతోడ సెజ్జ డిగి ధర్మజుమోమునఁ జూడ్కి పర్వఁగన్. 63

వ. భీష్ముపాలికిం బోదము రమ్మని పలికి కృతపరికరబద్ధుం డై వెడలి రథం బెక్కి సాత్యకిం దనపిఱిందివలనం బెట్టికొనియె ధర్మనందనధనంజయు లొక్క తేరును మారుతినకులసహదేవు లొక్కయరదంబును గృపయుయుత్సుసంజయు లొక్క స్యందనంబును నెక్కి తదీయంబు లగు నేమినినాదంబులు దిక్కులం బిక్కటిల్ల నుచితపరివారపరివృతు లై నడచి రట్లరిగి యస్థికేశబహులంబును బహుద్వీప [1]కుంభఖండనరకపాలపాళీనిబిడంబును నై ప్రేతపత్యనుభూతోజ్ఝితం బైన యాపానభూభాగంబు ననుకరించుకురుక్షేత్రంబు దఱియుసమయంబున నయ్యం బుజాక్షుండు పాండవాగ్రజుతోడ. 64

తే. దూరమున నై దుముడువులు దోఁచుచున్న, యవి నరేశ్వర మునుపీనియందుఁ గాదె
పరశురాముండు సేసెఁ దర్పణము నృపుల, రక్తమున భూరితరపితృభక్తి వెలయ.

మ. క్షితి నెందుం జరియించి భూపతుల నిశ్శేషంబుగా నేకవిం
శతివారంబులు ద్రుంచి యాతఁడు దుర్దాంతత్వముం బొందె సు
వ్రతుఁ డై నావుడు నమ్మహీశుఁ డతఁ డీక్రౌర్యంబు సేయంగ నే
ల తోడంగెన్ నృపు లెట్లు గల్గి రిల యెల్లం గైకొనం గృష్ణఅన్. 66

వ. అనుటయు నచ్యుతుండు నప్పరశురాముజన్మప్రపంచంబును దదీయక్రోధకార ణంబును నృపలోకమారణంబును భూపాలవంశపునస్సంభవప్రకారంబును ము నులవలన వినినచొప్పునం జెప్పెద నని యజ్ఞపతి కి ట్లనియె. 67

—శ్రీకృష్ణుఁడు ధర్మజునకుఁ బరశురామునిచరిత్రంబు చెప్పుట.—

సీ. కలఁడు జహ్నుండనఁ గాఁదొల్లి యొకమహీ, పతియజహ్నుండుదత్సుతుఁడు వాని
కుదయించెఁ బల్లవుం డుర్వీశ యాతని, కొడుకు తపోనిష్ఠుఁ గుశికుఁ డింద్రు
మెచ్చించి జగములమేటి నాఁ దగుపుత్రు, వేఁడిన దాన నవ్విభున కుద్భ
వ మ్మయి కౌశికుఁ డిమ్మహి గాధినా, మమ్మునఁ బరఁగె నమ్మనుజవిభుఁడు
తే. సత్యవతి యనుతనకన్య సంప్రమోద, మున ఋచీకున కిచ్చె నమ్ముని సుకర్మ
నిరతి సంతానవాంఛమైఁ జరుయుగంబుఁ, దనకు మామకు నై కల్పితముగఁ జేసె.

వ. ఆభృగునందనుం డచ్చరువులు నిజభార్యముందట నిడి క్షత్రియా జేయుం డును క్షత్రియసూదనుండును నగుక్షత్రియోత్తముం డిచ్చరువున జన్మించు దీని మీతల్లికి నిమ్ము తపోధృతిశమంబుల నుత్కృష్టుం డగుద్విజశ్రేష్ఠుండు దీని వలనం బుట్టు నిది నీ వుపయోగింపు మని వాని నేర్పరించి భవజ్జననీజనకు లిప్పు డ వచ్చెద రని చెప్పి నదీస్నానార్థి యయి యరిగెం దదనంతరంబ తదాశ్రమం బునకుం దీర్ఘయాత్రాపరుం డయి గాధి గృహిణీసహితంబుగాఁ జనుదెంచిన సత్య

1. క. కుంభతురగాంగరథావయవనవరత్నకనకమయభూషణగణఖండ.

వతియును నిజభర్త గావించినచరుద్వయంబు మాతకుం జూపి తత్ప్రభావభేదం
బుపన్యసించినం బ్రీతయై యద్దేవి పరమపావనస్నానం బాచరించి చరు వుపయో
గించునప్పు డజ్ఞానంబునం దనచరువు కూఁతున కిచ్చి కూఁతుచరువు దా నుపయో
గించె నయ్యువతియుం దలంపు లేమి నాలేమ యిచ్చినభంగిన కుడిచె నంత భార్గవుం
డు వచ్చి పత్నిం జూచి దివ్యబోధంబున నెఱింగి క్షత్త్రియాంతకరం బగుగర్భంబు
ధరియించినదాన వనవుడు నత్తరుణియుఁ దత్పాదంబులకుం బ్రణత యై మీ రి
ట్లాన తీఁ దగునె యని వడవడ వడంకుచుఁ గేలుమొగిచి నిలిచిన నత్తపోధనుం
డత్తెఱవతో నత్తెఱంగు నాతలంపున వచ్చినది గాదు భవన్మాతృబుద్ధిహానిం జేసి
చరువ్యత్యాసంబున నయ్యె నీకుఁ గ్రూరకర్ముండును మహాబలుండును నగుపుత్త్రుం
డుద్భవించు నాయమకు బ్రహ్మభూతుండును దపోధనుండును నగువాఁ డుదయిం
చు నేను దపంబున విశ్వబ్రహ్మంబు నచ్చరువున నావహించినవాఁడ నని పలు
కుటయు. 69

క. అమ్ముగ్ధ యతని కిట్లను, నిమ్మాఁడుజగములు మీర లితరంబులుగాఁ
గ్రమ్మనఁ జేయఁగఁ జాలుదు, రెమ్మెయి నైనఁ గృప సేయరే నామీఁదన్. 70

వ. క్రూరుం డగుకొడుకుం గనుట కోర్వ ననుటయు ననుగ్రహాతిశయంబున నమ్మహా
ముని యవ్విశేషంబు నాపుత్త్రునకు లేకుండెడుఁ బౌత్త్రునియం దావహిల్లెడు
నీ కెట్లు ప్రియం బట్ల కాఁ గలయది యనియె నట్ల యత్తన్వి తపోనిరతుండును
దాంతుండును శాంతుండును నైనజమదగ్నిం గనియె బ్రహ్మర్షిసదృశుం డగు
విశ్వామిత్త్రుని గాధిపత్ని గాంచె. 71

క. జమదగ్ని సర్వవిద్యా, సమేతుఁడు నుదారగుణుఁడుఁ జాపాగమవే
దిమతియు నగురామునిఁ గాం,చె మహీపతిహననశీలు శిఖినిభమూర్తిన్. 72

వ. అక్కాలంబునందు హైహయవంశవరుండు. 73

ఉ. దుర్జయవిక్రమోజ్జ్వలుఁడు దోషవివర్జితబుద్ధి కార్తవీ
ర్యార్జునుఁ డేడుదీవులు నయాన్వితశూరత నేలు చుండు ధ
ర్మార్జనలోలబుద్ధియు మహాస్త్రబలంబు సహస్రబాహుతా
స్ఫూర్జనముల్ వెలుంగఁగ నృపుల్ దనయాజ్ఞఁ దలల్ వహింపఁగన్. 74

క. ఆరాజు నగ్నిదేవుఁడు, గారవమున నడుగ నతఁడు గడుఁబెంపున నా
హారముగ నిచ్చె గిరినగ, రారణ్యగ్రామఖర్వటాదు లతనికిన్. 75

వ. ఇచ్చిన నగ్నిదేవుం డాహారంబుగాఁ గొనుతరువాత మిత్త్రావరుణనందనునాశ్రమ
కాననం బతండులేనిసమయంబున సమసినమ్మహాత్ముం డెఱింగి వచ్చి యాసర్వ
భక్షకునకు రక్షణం బాచరించుచు వర్తించుకార్తవీర్యునిం గని కనలి నీవు మదీ
యతపోవనంబు పరిహరింపక గహనసామాన్యబుద్ధిం గాల్చితి నీబాహులు

రాముండు నఱకువాఁ డని శాపం బిచ్చె సహస్రబాహుండును దానికి విషాదంబు
నొంది యధికతాత్పర్యంబుతో ధర్మకార్యంబుల నడపు చుండె. 76

క. శాపము గారణముగ నా, భూపతి కవినీతు లైన పుత్త్రులు సబలా
టోపాత్ములు పలువురు సిం, హోపములు జనించి ధాత్రి నుద్భటవృత్తిన్. 77

వ. ఎందునుం జరియించువా రొక్కనాఁడు జమదగ్న్యాశ్రమంబునకుం బోయి య
తండును జామదగ్న్యుండును నయ్యెడ లేకుండ హోమధేనువును వత్సంబునుం
దమమందిరంబునకుం గొని వచ్చి రిట్లు దెచ్చుట సహస్రబాహుం డెఱుంగఁడు.

క. అట రాముఁ డెఱిఁగి పరమో, ద్భట మగుకోపమునఁ జాపపరశుముఖమహో
త్కటశస్త్రాస్త్రంబులతోఁ, బటుగతి వచ్చెను సహస్రబాహునిమీఁదన్. 79

పరశురాముఁడు కార్తవీర్యార్జునునిఁ జంపుట.

ఆ. వచ్చి ముట్టి కయ్య మిచ్చిన నవ్విభు, నొంచి బాహువనముఁ జంచదుగ్ర
పరశుఘోరధార పాల్ సేసి పోయి ని, జేచ్ఛ నుండె మేదినీశవర్య. 80

చ. అతఁడు సమిత్కుశాభిహరణార్థము గానకు నేఁగి యుండఁగా
నతికుపితాత్ము లై కడఁగి యర్జునసూనులు వోయి ముట్టి త
త్పితృశిరమున్ వెసం దునిమి ప్రీతిమెయిం జనుదెంచి రమ్మహో
ద్ధతుఁ డట వచ్చి వారిచరితం బెఱిఁగెం దమతల్లి సెప్పఁగన్. 81

వ. అ ట్లెఱింగి. 82

శా. రాముం డుద్ధతరోషపావకశిఖాప్రస్ఫీతుఁ డై తున్మురున్
భూమీశాలిఁ గుఠారధార నని విస్ఫూర్జద్గతిన్ హైహయ
స్తోమం బాదిగఁ జొచ్చి రాజకులముం దున్మాడి చేసెన్ సము
ద్దామక్రీడను రౌద్ర మొప్ప నిల రక్తస్యందసంసిక్తఁ గన్. 83

వ. ఇట్లు సేసి పరమకృపావిష్టహృదయుం డై తపోవనంబునకుం జనియెఁ బదంపడి
బహువత్సరంబులు సనినపిమ్మట విశ్వామిత్రపౌత్రుం డైన పరావసు వనురాజు దు
ర్వినీతుం డై గర్వోద్రేకంబునం బరశురాము నధిక్షేపించి రాజులకు వెఱచిడాఁగి
యున్నవాఁడ వని విశిష్టజనసన్నిధిం బలికి బాల వృద్ధభావంబున నుపేక్షితు లై
యతనిచేత మున్ను చావక యున్న ప్రతర్దనాదుల నుగ్గడించి. 84

ఆ. నృపులు గారె వారు నీవు మిథ్యాప్రతి, జ్ఞాభిమాని వనుడు నతఁడు మగుడ
రోష మెత్తి కడఁగి క్రూరత నాబాల, వృద్ధముగ నరేంద్రవితతి నఱకె. 85

వ. గర్భంబుల నున్నయర్భకులను మఱియు వివిధప్రకారంబులఁ బోరం దప్పి పోయి
పుడమి యేలురాజులం గాలాంతరంబుల వెదకి వెదకి వధియించె ని ట్లిరువదియొ
క్కమాఱు నేల నిఃక్షత్త్రంబుఁ గావించి యశ్వమేధయాగంబు సేసి దక్షిణగా
నీక్షితి యంతయుఁ గశ్యపున కిచ్చెఁ బదంపడి యమ్ముని యాజామదగ్న్యుతో
ని ట్లనియె. 86

తే. అశ్వమేధయాగంబున నవని యెల్ల, నాకు దక్షిణగా నిచ్చినాఁడ వింక
నాధిపత్యంబు నీకు లే దరుగు దక్షి, ణాబ్ధిపారదేశమునకు ననఘచరిత. 87

వ. అని పలికి యెందేని నేమేనియుం దెఱుఁగక శేషించినరాజసింఘంబునకు నిశ్శేష
త్వంబు వాటిల్లకుండం బరిహరించుబుద్ధిం బలికిన నప్పురుషసింహుండు నల్ల కాక
యని పోవ నతనివలని వెఱపున నవ్వలనిసముద్రుండు శూర్పాకారప్రదేశంబు
బెరయం గొంత దేశం బతనికి విహారస్థానంబు గావించె నివ్విధంబునం గశ్యపము
నీంద్రుండు పరిగ్రహించి భూమి భూసురప్రకరంబుల కిచ్చి తపోవనంబున కరిగె
భూమియు నతనిపేరం గాశ్యపి యన నెగడెఁ గొండొకకాలంబునకు వైశ్యశూ
ద్రప్రముఖులు దర్పితులై వివిధప్రకారంబుల విప్రదారధనధాన్యాదు లపహ
రింపం దొడంగిరి. 88

సీ. పదపడి విప్రులు పథము దప్పి వధంబు, మద్యపానంబు సన్మార్గవర్తు
లైనసాధులధన మపహరించుటయును, మొదలు గాఁగ నకృత్యములకుఁ జొచ్చి
రధ్వరాదికసత్క్రియల్ ప్రవర్తింపక, తెక్కలి బంది వే దిక్కులందుఁ
దఱు చయ్యె నిమ్మెయి ధర్మంబు సెడి యధర్మంబు వర్తించి యరాజకత్వ

ఆ. దోషజాత మైనదురితబాహుళ్యంబు, గుత్తిలపెట్ట భూమి యతలమునకుఁ
బోవ నెఱిఁగి కశ్యపుఁడు నిజోరువు నెఱి, గ్రుచ్చి దాపు గాఁగ నిచ్చి యెత్తె.

వ. అది కారణంబుగా ధరణి యుర్వి యనం బ్రసిద్ధి వహించె నయ్యుద్ధరణసమయం
బునం గాశ్యపి గశ్యపుని వేఁడుకొని యుత్తమక్షత్త్రియులు దండనీతిప్రయోగం
బునం జేసి ధర్మంబు రక్షించి తన్ను సురక్షితం జేయువారు గా వరంబు వడయు
టకై యమ్మహామునితో ని ట్లనియె. 90

భూదేవి కశ్యపునితోఁ బరశురామునిచేఁ జావనిరాజులఁ జెప్పుట.

క. నాయం దచట నచట రా,మాయతబాహావిభూతి కగపడనిఘనుల్
ధీయుక్తులు గల రన్నర, నాయకులను వినుము పనుపు మనను రక్షింపన్. 91

వ. అని పలికి యద్దేవి దనసురక్షితత్వంబున హైహయులు గొందఱు చావునకుం దప్పు
టయుఁ బౌరవాన్వయప్రభవుం డగువిదూరథసుతుండు ఋక్షవత్పర్వతంబున
ఋక్షంబులచేత రక్షితుం డగుటయు సౌదాసవంశజనితుం డొక్కరుండు పరాశర
సంయమివరునధ్వరకాలంబునం జేరినఁ గారుణ్యాతిశయంబున నమ్మహాత్ముండు వాని
శూద్రప్రవర్తనంబున సర్వకర్మంబులుఁ జేయించుకొని రక్షింప సర్వకర్ముం డనం
బరఁగుటయు శిబిమనుమఁడు గోపతి యనువాఁడు వనంబున గోవులు రక్షించిన
బ్రదికి యునికియుం బ్రతర్దనపుత్త్రుండు వత్సాభిధానుండు వత్సంబులు గోష్ఠంబున
రక్షణం బాచరింప సంచరించుటయు దివిరథతనయుం డగుదధివాహనుకొడుకం గుం
డనువాఁడు గంగాకూలంబున గౌతమమునీంద్రునిరక్షం జేసి నిర్భయుం డై వర్తిల్లు
టయు బృహద్రథకులజాతుండు భూరినామధేయుండు గృధ్రకూటశైలంబున గో

లాంగూలంబులు రక్షించుటవలనఁ గలిగి యుండుటయు మరుత్తసంతానసంభవులు చతుర్వర్షవయస్కు లగువారు మువ్వురు సముద్రుండు రక్షకుండై పెనుపం దత్తీరంబునం బెరుఁగుటయుం జెప్పి వా రుత్తమక్షత్రియులు వారలు సమ్యక్పరిపాలనంబున న న్నరయువారు గా ననుగ్రహించిన నచలిత నై యుండెద.

క. వారలపెద్దలు నాకై, పోరఁ బరశురామునిచేతం బొలిసిరి నాకుఁ
వారి నధిపతులఁ జేయుట, గోరం దగుఁ గాన యిట్లు గోరితి ననఘా. 93

తే. అనిన విని వారి రావించి యమ్మునీంద్రుఁ, డందఱునుజూచి యాధిపత్యమునకిమ్మ
హాభుజులు దగువా రని యవనిఁ దగిన,యట్లు విభజించి యభిషేక మాచరించె.

క. ఆనృపులవంశముల నా,నానృపతులు పుట్టి రిట్లు నరవర నృపసం
తానములు పెక్కు గలిగి మ,హీనాథత్వమున వ్రాలె నెందును గలయన్. 95

క. అప్పరుసునఁ బెరిగిననృపు, లిప్పుడు భారతరణోపహృతు లై పలువుర్
గుప్పలు గొనఁ బడి రనికిం, దప్పినవాఁ డొకఁ డొకండ ధర నంతంతన్. 96

వ. నీ వడిగినపూర్వవృత్తాంతంబు చిత్తాయత్తంబుగా నెఱింగించితి ననవుడు ధర్మనందనుండు గోవిందునితోడఁ బరశురాముఁ డింతటివాఁ డగు నే కోపంబును విక్రమాటోపంబును జిత్రంబుగా ధాత్రి నిఃక్షత్రంబు సేసె నని పలికి వెండియు.

తే. ధరణియును ఋషులుఁ బరాశరుఁడు గోస
మూహములు వత్సములు గౌతముఁడుఁ గపులుఁ
దోయధియు నింతపుణ్యంబు సేయునే జ
నంబు భాగ్యంబు నభివర్ణనమున కెక్కె. 98

వ. అని యిట్లు సల్లాపంబులు సేయుచు మాధవధర్మజు లరిగి యోఘవతీతీరంబున శరతల్పగతుం డై గాంగేయుం డున్నెడ కనతిదూరంబున రథావతరణంబు సేసిన భీమసేనప్రముఖులుం గృపాదులు నరదంబులు డిగ్గి రి ట్లందఱు నంతరంగంబు లేకాగ్రంబులు సేసికొని చేరం జని సాత్యవతేయప్రభృతిమునీంద్రులకుం బ్రణమిల్లి మఱి భీష్ముం గాంచి రట్లు సముచితప్రకారంబునం గని యతనిం బరివేష్టించి యాసీను లై రప్పుడచ్యుతుం డమ్మహాత్మునాలోకించి యుమ్మలించుచు నతనితోడ.

సీ. నీకు మున్నోలె నవ్యాకుల మై యున్న, యదియె చిత్తంబు దేహంబుపీడ
ఘనము మనఃపీడకంటె నందురు బుధు,లాకముల్కి యొడలిలో నున్న నలఁత
సేయు నెమ్మెయి బహుసాయకకీలిత, మైనయంగంబునో వ్వడుగ నేల
యిట్టు లుండియు నించుకేనియు దుఃఖంబుఁ, బొరయమి పితృవరస్ఫూర్తిఁగాదె

ఆ. దేవతలకు నైన నీ వుపదేశింతు, కలిమిలేములకు వికార మొంద
కుండ బోధవృద్ధులోరులు నీ దేర్పంగ, వలవ కునికి నిజ మహావార్యతేజ.100

క. భూతంబులసంసరణము, భూతభవద్భావికార్యములుఁ గర్మసము
ద్ద్యోతనభంగియు నీయఱి,చేతివి గావె కురువంశశేఖరజన్మా. 101

వ. అని వెండియు. 102

ఉ. రాజవు రాగహీనుఁ డవు రాజితసుందరమూర్తి యట్టి వి
భ్రాజితసంపదున్నతివిభాసితవర్తనుఁ డట్టి కామినీ
రాజమనోజ్ఞభంగిచతురత్వధనుం డవు బ్రహ్మచర్యదీ
క్షాజితమన్మథుండ వవు జన్మము లిట్టివి యొందఁ గల్గునే. 103

క. సురలును నసురులు యక్షులు, నురగులు గంధర్వులును మహోద్ధతిఁ బైపై
నురవడి వచ్చిన నొక్కఁడవ, పరాజితులఁ జేయు దుగ్రబాహాస్ఫురణన్. 104

చ. దమమును సత్యముం దపము దానము వేదములందుఁ జూపవే
దమునను గల్గునైపుణియు ధర్మవిధిజ్ఞతయుక్ విరోధిభూ
రమణవిమర్దనక్రమవిరాజితశౌర్యము నీకుఁబోలె నై
జము లగువాఁడు వే ఱొకఁడు శంతనునందన పుట్టఁ డెన్నఁడున్. 105

క. వే యేల సంభవించునె, సాయకతల్పమున నుండి చావఁగ నొల్లన్
నాయిచ్చఁ గాక యనునరుఁ, డీయుగమునఁ జూడ వినఁగ నెచ్చట నైనన్.

తే. వసువులందును బెద్దవు వాసవాది,సురుల మిగులుదు గుణముల ధరణిసురులు
సెప్ప విందు నీమహిమ నాచిత్తమునను, గందు ననుపమతేజ గంగాతనూజ.

వ. అని పలికి పాండవాగ్రజుం జూపి. 108

కృష్ణుఁడు ధర్మజునకు ధర్మము లుపదేశింప భీష్ము నియమించుట

ఉ. నీవు తపోవిశేషమహనీయతఁ జేసి జగంబు లన్నియుక్
భావమునం గనుంగొన నృపాలమహోత్తర చాలుదీతఁడ
త్యావిలచిత్తుఁ డయ్యె సుహృదాప్తమృతిన్ దురటిల్లు నెవ్వగం
బోవఁగఁ ద్రోవు నీ దయినపుణ్యతమస్ఫుటవాక్యపద్ధతిన్. 109

వ. నాలుగువర్ణంబులకును నాలుగాశ్రమంబులకు నిట్టిట్టివి యర్హంబు లని నాలుగు వేదంబులం జెప్పినధర్మంబులు నీకు విదితంబులు ప్రవృత్తినివృత్తులును సాంఖ్యయోగంబులును బురాణేతిహాసంబులు ధర్మశాస్త్రంబులు నవగతంబులు సర్వసంశయచ్ఛేదనదక్షుండ వీ వీక్షితిపతి నాదరింపుము శోకమోహగ్రస్తం బగుజనంబు విస్తరింపం జేయుట గదా మిముబోఁటులబుద్ధివిస్తారంబునకు ఫలం బనిన విని మొగం బించుక యెత్తి కృతాంజలి యై గాంగేయుండు గోవిందున కి ట్లనియె.

క. కర్తయును భర్తయును సం,హర్తయు జగములకు నీవ యాశ్రితజనఘో
రార్తినిరాసనిపుణ సం,కీర్తన యోగీశ్వరేశ కృష్ణ వరేణ్యా. 111

వ. అని మఱియు ననేకప్రకారములం బ్రశంసించి నాకు మే లెయ్యది దానిని నీదివ్యచిత్తంబునం దలంపు మనవుడు నద్దేవుం డి ట్లనియె. 112

తే. అచలభక్తి నిత్యంబు నాయందు నీకుఁ, గలిమిఁ జేసి నీయంతరంగమున నాదు
దివ్యరూపంబు నెలయించితిం బ్రమోద,భాజనం బైతి భీష్మ తపస్స్వరూప.

వ. మేలు వేఱ తలంప నేల యని వెండియు. 114

క. భక్తియు నార్జవమును సం,యుక్తము లై యున్నయట్టి యుల్లంబున నా
సక్తి నిలుతు నిం దొకఁడు వి,యుక్తం బైనను వసింప నుర్వీనాథా. 115

తే. అనఘ యినుఁ డింక నేఁబదియాఱుదివస
ములకుఁ దా నుత్తరాయణమునఁ జరింపఁ
దొడఁగు నీ వప్డు దేహంబు విడిచి యేఁగు
దపునరావృత్తిపదమున [1]కభినుతముగ. 116

వ. వీరె వసువులు విమానంబులతో నంతరిక్షంబున నంతర్హితు లై నీరాక ప్రతీ
క్షించి యున్నవా రది య ట్లుండె నీవు సన్న నీలోకంబున నెఱుక పోనుంగుపడుం
గావున వీ రెల్ల సకలధర్మవివేకలబ్ధికి నయి యరుగుదెంచి పరివేష్టించి యున్నవా
రని తత్కాలసమాగతయోగ్యజనంబులం జూపి ధర్మపుత్త్రు నుపలక్షించి శోకోప
హతబహుశ్రుతుం డగునితండు దెలి వొందునట్లుగా ధర్మార్థసమాధియుక్తంబు
లగునుక్తివిశేషంబుల ననుగ్రహింప వలయు ననుటయు నద్దేవకీనందనునకు దేవ
వ్రతుం డి ట్లనియె. 117

క. శివ నారాయణ యచ్యుత, భవదీయము లై నమధుర భాషణములు నా
చెవు లానిన నమృతరస, ప్లవనంబునఁబోలెఁ బ్రమదభరితుఁడ నైతిన్. 118

తే. వాగ్విభుఁడ వై నసీవచోవైభవంబు, లో సమస్తంబు నుండుట లోకనాథ
నీదుసన్నిధిఁ బలుకంగ నేర రాదు, పద్మభవునకు నే నెట్లు పలుకువాఁడ. 119

వ. విషానలసదృశంబు లగుశరంబులు సేయువేదనం జేసి యంగంబులు నంతరంగంబు
నవశంబు లై యున్నయవి ప్రతిసంభాషణక్షమ లేదు దౌర్బల్యంబున నెలుంగును
నాలుకయుం బ్రస్ఫుటవర్తనంబులు గా వే నెవ్విధంబున భాషింప నుత్సహింతుఁ
బ్రతిభాషాశక్తి లేమి సహించి నాదెసం బ్రసన్నుండ వగుము ధర్మపుత్త్రున కెయ్యది
హితం బది నీవ చెప్పుము నీ వుండ నేను జెప్పుట గురుం డుండ శిష్యుండు సెప్పిన
విధంబు గాదె యనిన విని భక్తార్తిహరుం డైనహరి యతనితో ని ట్లనియె. 120

క. కురువంశధురంధరుఁ డగు, పరమార్థజ్ఞునకు వినయఫణితిం దగుని
ర్భరశరవేదన సెప్పితి, వరములు మూఁ డిత్తుఁ గొనుము వసుధాధీశా. 121

క. శరములవలనను మూర్ఛం, బొరయక యొక్కింతడప్పిఁ బొరయక నొప్పిం
బొరయక యవిద్ధగాత్త్రుని,కరణి సుఖాత్ముఁడవు గమ్ము కౌరవనాథా. 122

ఆ. అనఘ నీరువట్టు నాఁకలియును నెప్డుఁ
బొరయ కుండునట్టిభూరిశక్తి
నీకుఁ గలుగ నేను నెమ్మనంబునఁ దలం
చితిఁ దదీయపీడఁ జెంద కుండు. 123

1. చ. కభిముఖముగ.

క. విను సకలభూతములవ, ర్తనములు గనునపుడు బుద్ధిఁ దవ్వులఁ బడక యెం
దును బరఁగి [1]దివ్యబోధం, బున నలవడునట్టిపెంపుఁ బొందు మనింద్యా. 124

వ. మత్ప్రసాదంబున నీదృశప్రభావనిరూఢుండ వయి నెగడు మని పల్కుటయుం బారాశర్యాదిపరమార్యు లప్పద్మనాభుఁ బ్రశంసించిరి దివంబున దేవదుందుభులు మొరసె మురారిభీష్మధర్మజులమీఁదం గుసుమవర్షంబు గురిసె నప్సరోగణగానంబు వీతెంచె నచ్చటియందఱు నాశ్చర్యప్రమోదభరితహృదయు లైరి తదనంతరంబ యంబుజాప్తుం డపరగిరిశిఖరం బలంకరించె నప్పుడమ్మును లచ్యుతగాంగేయకౌంతేయాగ్రజుల నామంత్రితులం జేసి గమనోన్ముఖు లగుటయు నమ్మాధవయుధిష్ఠిరులును సాత్యకియును భీమార్జునయమకులును గృపయుయుత్సుసంజయులును వారలకుం బ్రణమిల్లిరి వారలును రేపు వచ్చెద మని నిజస్థానంబులకుం జనిరి కృష్ణాదులును దేవవ్రతున కభిముఖు లగుచు నట్ల పలికి వలగొని యరిగి యరదంబు లెక్కిరి వారిపిఱుంద మున్ను వచ్చినవారణరథతురగపదాతులు బలసి క్రొల్చి పోవం బురంబునకు వారు వోవుసమయంబున. 125

చ. దినమున నెల్ల నుష్ణకరదీప్తులు పర్వి రసంబుఁ బీల్చి వం
దినసకలౌషధిప్రవితతిం దెలి వొందఁగఁ జేయునేర్పు గ
ల్గినతనరశ్మిజాలమునఁ లీలఁ జకోరములన్ మదింపఁ జే
య నుదయ మై వెలింగె నమృతాంశుఁడు సేనకుఁ దన్పు సేయుచున్. 126

వ. ఇట్లుదయించిన సుధామరీచి లోచనప్రీతి యాచరింపం బెంపు సుభగంబుగా శౌరిప్రముఖులు పురప్రవేశంబు సేసి నిజనివాసంబుల నుచితవర్తనంబుల నారాత్రి గడపిరి ప్రభాతం బగుటయు. 127

తే. మంజుపాఠకరవమునుఁ మధురమాగ, ధస్వనంబును వినుచు మాధవుఁడు మేలు
కాంచి తత్కాలసముచితకర్మజాత, మాచరించి భూసురులకుఁ నర్చ లిచ్చి.

వ. మంగళప్రకారంబున నలంకరించి నిజాకృతి యాదర్శంబునందు దర్శించి యప్పుడు సన్నిహితుం డైనసాత్యకివదనం బవలోకించి భీష్ముపాలికిం బోవుటకుం బాండవాగ్రజుం డాయితం బగుట యెఱింగి మన వెలువడు చునికి యెఱింగింపు మని పనిచె నంతకు మున్న యక్కురుపుంగవుండుఁ బుణ్యసంకీర్తనాశీర్వాదంబులను భద్రగాననాదంబులను వీనులు వికసిల్ల మేలుకాంచి సమయకృత్యంబు లనుష్ఠించి యుండ నాకృష్ణానుజుం డతనిం గని గాంగేయుకడ కరుగుటకై రథంబు సన్నద్ధంబు సేయించి నీరజనాభుఁడు నీరాక వార్చియున్నవాఁ డని చెప్పుటయు నమ్మనుజపతి పార్శ్వగతుం డగుపార్థుం గనుంగొని మనయరదంబు సంఘటింపుము నేఁడు మొదలుగా నయ్యెడకు సైనికుల రానీకు మంతఃపరివారంబు వచ్చుటుడుపుము శాంతనవుండు సందడిం బడ నర్హుండు గాఁడు విశేషించి పరమగుహ్యార్థంబు

1. గ. దివ్యరూపం.

లగువాక్యంబులు మనకు ననుగ్రహింపంగలవాఁడు గావున నిస్సమ్మర్దంబుగా నుపాసింప వలయు నని పలికి యొక్కింత విచారించి తగురాజులం గొందఱం బేరుకొని ధృతరాష్ట్రవిభుండును వారును వచ్చువారు వారిం బిలువం బంపు మనవుడుఁ బిలిపించి యతండు. 129

—ధర్మరాజు కృష్ణాదులతోడ భీష్మపాలికిం బోవుట.—

క. అరదము వన్నిన నాభూవరుఁ డతఁడును దాను నెక్కి వడముడి వే ఱొ
క్కరథమునఁ బిన్నతమ్ముల, నిరువురఁ గలపికొని మెలఁగు నేతేరంగన్. 130

క. వినుము మహాభూతము లే,నును సమధికరూపమున వినుతభంగిఁ దగం
జను తెఱఁగు దోఁప నెలమిం, జనియెను వసుదేవసుతుని సదనంబునకున్. 131

వ. రథగమన[1] రవంబునం గృపయుయుత్సుసంజయులుం గూడుకొని రంత. 132

క. దారుకుఁడు పన్ని తెచ్చిన, తేరను వెలువడియె వాసుదేవుండును న
త్తేరులు నాలుగు నేమిక,లారవ మెసఁగంగ బెరసి యరిగె నరేంద్రా. 133

క. జనమేజయనృప యంతకు, మును నారదముఖ్యులైన మునివర్యులు శాం
తనవుని పాలికి వచ్చిరి, వనజభవుని కడకు సురలు వచ్చువిధమునన్. 134

వ. అట్లు సంయమివరపరిషత్పరివృతుం డై యున్నయద్దేవవ్రతునికడ సేర నరిగి శౌరిప్రముఖులు రథంబులు డిగ్గి. 135

ఆ. తత్సమీపమునకు ధర్మనందనపుర,స్సరత నరిగి తొలుత సకలమునులఁ
బ్రణతిఁ దెలచి కదిసి బలసి యుపాసించి, రన్నదీతనూజు నధికభక్తి. 136

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 137

మ. శరతల్పంబునఁ బొల్చుభీష్ముకడకుం సంప్రీతి నక్కౌరవే
శ్వరుఁడుం దమ్ములుఁ గృష్ణుఁడుం జని మునివ్రాతంబుతోఁ గూడ న
ప్పరమోదాత్తుని చుట్టు నున్నయెడ నెబ్బంగిం బ్రవర్తించె వి
స్తరమాధుర్యమనోజ్ఞసత్కథలు విస్పష్టంబుగాఁ జెప్పవే. 138

వ. అని యడిగిన నమ్మహీవిభునకు వైశంపాయనుం డిట్లనియె మున్ను ధర్మపుత్త్రుండు రావించిన ధృతరాష్ట్రుండును రాజులు నతనిపజ్జ నరిగి వారును గాంగేయు నుచితప్రకారంబునం గాంచి కొల్చి యుండి రట్టియెడ నారదుండు ధర్మపుత్త్రాదుల నమ్మేదినీపతులం గలయం గనుంగొని. 139

క. శంతనునందనుఁ డపరది,గంతప్రాప్తరవియట్టిఁ డయ్యె నితఁడు లో
కాంతరగతుఁ డగుటకు ము,న్నంతఃకరణముల సంశయము వాయంగన్. 140

వ. సకలధర్మప్రకారంబులు నడిగి తెలిసికొం డనినఁ బ్రశ్నపాటవంబు లేమి నందఱు నొండొరువుల మొగంబులు సూచుచుండఁ బాండవాగ్రజుండు పుండరీకాక్షున కి ట్లనియె. 141

---

1. క. రయంబునం.

తే. నీవు దక్కఁగ మందాకినీతనూజు, తోడిసల్లాపములకు [1]నుక్తులు ముకుంద
కలరె యెందును ధర్మవేదులకు నెల్ల, గురుఁడ వీవ సంభాషణపరుఁడ వగుము.

వ. అనుటయు నచ్యుతుండు భీష్మున కత్యాసన్నుండై శారీరమానసకుశలప్రశ్నంబుఁ
జేసిన నతండు. 143

ఉ. దేవ భవత్ప్రసాదమునఁ దీఱె శరీరమునొప్పి దప్పి మ
ద్భావము నింద్రియంబులును బాటవసంపద నొందె వేదవి
ద్యావిభవంబు నాకుఁ బరతత్త్వపరిస్ఫుటబోధయుక్తమై
భావిత మయ్యె నాత్మఁ బరిపక్వదయాకరచిత్త మాధవా. 144

వ. దేవర దివ్యచిత్తంబున నన్నుం దలంచినదానం జేసి బృంహితుండ నయ్యెను గొం
డుకప్రాయంబువాఁడునుం బోలె నయితిఁ జెప్పవలయువాని నెల్లం జెప్పెదఁ
బాండవశుభకరం బైనదాని నీ వేల చెప్పవు నీతలం పేమి సెప్పవే యనినఁ
గృష్ణుండు గాంగేయున కిట్లనియె. 145

తే. అనఘ శ్రేయస్సునకు యశంబునకు నేను, మూలకందంబ విను చంద్రముండు శీత
కిరణుఁడనుమాటవిస్మయకరమె చెప్పుమ, యశముపార్జింపఁ గ్రొత్తపెంపగు నెనాకు.

క. పరమ మగుయశము నీకును, ధరణిం గలిగింపఁ బూని తాత్పర్యమునం
బురుషవర నాదుబుద్ధి, స్ఫురణము నీమనమునందుఁ జొనిపితి నెనయన్. 147

తే. ధరణి యెందాఁక నుండు సుస్థిరత నీదు, కీర్తియుందాఁక నక్షయస్ఫూర్తిఁ దాల్చి
నడవఁగలయది నీవుసెప్పెడిసువాక్య, ములును వేదతుల్యంబులై వెలయుచుండు.

క. ధర్మజునకు నీచెప్పెడు, ధర్మస్థితివాక్యసమితి తాత్పర్యముతో
నిర్మలులై కొనియాడెడు, ధార్మికులకు నుభయజగదుదాత్తత గలుగున్. 149

వ. కావున నిట్లు సేసితి భవదీయధర్మవేదిత్వంబును సవిశేషప్రకారంబుగా నీమను
మలు ధర్మజభీమార్జుననకులసహదేవులు భద్రభాజనంబులుగా నీయున్నమహీ
పతులు విని కృతార్థజన్ములుగా నఖిలధర్మప్రకారబోధకంబు లగువాక్యంబులు
సెప్పు మనుటయు శాంతనవుం డట్లు చేసెద నని పలికి యాదరభరితుం డయి
యి ట్లనియె. 150

సీ. ఎవ్వఁడు పుట్టిన నెల్లమునీంద్రులు, నత్యంతసంప్రమోదాత్ము లైరి
పరమధార్మికు లైన భరతులయందును, నెవ్వరు నెవ్వని నెనయ లేరు
సత్యంబు దాంతియు శౌచంబు శాంతియు, నలవడి యెవ్వనియందు వెలయుఁ
బాత్రదానాధ్వరబంధురతాదిధ, ర్మంబు లెవ్వనికిఁ బ్రియంబు లెపుడుఁ

తే. గామమున నైన విపులార్థకారణమున, నైన భయమున నైనను నపథవర్త
నంబునకుఁ జొరఁ డెవ్వాఁడు నన్న నేమి, యడుగఁదలఁచె నాధర్మజుం డడుగుఁగాక. 152

వ. అనుటయు నతనితో నచ్యుతుండు.

1. గ. శక్తులు; అ. ప్రతి. యుక్తులు.

చ. గురులను బంధుమిత్త్రులను ♦ ఘోరశరంబులఁ గూల్చె నుగ్రతన్
నరుల ననేకకోటుల రణంబునఁ దాఁ దెగటార్చెఁ గాన యి
క్కురుపతి నీసమక్షమునకుం గదియం బుయిలోడెడుం గృపా
విరహితకార్యకర్ముఁడు ♦ వీఁ డని యాడుదొ యర్థతలంపునన్. 153

వ. అనిన విని వాసుదేవునకు దేవవ్రతుం డిట్లనియె. 154

సీ. విప్రుల కధ్యయనప్రదానాధ్వరాద్యము లగుకర్మములట్లు రాజు
లకు సంగరము తండ్రులను బుత్త్రపౌత్త్రుల, గురుల నైనను బాపపరులఁ బోరఁ
జంపుట ధర్మంబు ♦ సమయంబు విడిచి లోభంబున నన్యాయపథమునందు
వర్తించువారి నెవ్వరి నాహవంబునఁ, బొరివుచ్చఁ గలిగినఁ ♦ బుణ్యకృతియ
ఆ. యట్లుఁ గాక శోణితాంబుపూరముఁ గేశ, శైవలంబుఁ గాఁగ ♦ సమరభూమి
నక్కజపునదీచయం బొనర్చినరాజు, ధర్మవిదుఁ డనంగఁ ♦ దగు ముకుంద. 155

భీష్ముఁడు ధర్మరాజును సప్రేమంబుగా గారవించుట.

చ. అన విని ధర్మసూనుఁడు కృతాంజలి యై తగ భీష్ము డాయ న
ల్లన చని కేలఁ బాదకమలంబు లమర్చి శిరంబు సోఁక వం
దన మొనరించినం బిలిచి ♦ తా నభినందితుఁ జేసి మస్తకం
బునఁ గడునర్మిలిం దనదు మో మిడి మూర్కొని సాదరంబుగన్. 156

వ. భీష్ముం డాభీమాగ్రజుం గూర్చుండం బనిచి శంకింపక నన్నేమి యైన నడుగు మ
నిన నమ్మహీపతి మాధవునకుం బ్రణమిల్లి పారాశర్యప్రభృతిమునివర్యులకు నభి
వాదనం బాచరించి సర్వకౌరవులయనుమతి వడసి యప్పితామహున కభిముఖుం
డై నమస్కరించి యి ట్లనియె. 157

చ. అరయఁగ రాజధర్మము సమాశ్రయ మై నడవుం ద్రివర్గమున్
గురుతరమోక్షధర్మమునకుం దలఁపం దనప్రాప యూఁత భూ
వర విను ఘోటకంబునకు ♦ వాగెయు దంతికి నంకుశంబు నే
కరణి నివారకంబులు జగంబుల కట్టుల తాను నెమ్మెయిన్. 158

క. వ్యాకులతఁ బొంది రూపఱు,లోకస్థితి తొంటిరాజలోకముచే నం
గీకృత మగుధర్మ మనం,గీకృత మగు నేని వీతకిల్బిషచరితా. 159

క. తరణి పొడిచి తమము నెఱచు, కరణిని లోకమునఁ గలుగుకల్మష మెల్లన్
ధరణిపతి ధర్మ మార్త్మ,స్ఫురణంబునఁ జెఱచు విమల[1]బోధనచరితా. 160

ఆ. అనఘ నీదుబుద్ధి ♦ యతిలోక[2]మగుటయుఁ, దెలిసికొనఁగ నాకు ♦ వలయునట్టి
ధర్మకోటి నీవ ♦ తగఁ జెప్ప వినవల,యుటయుఁ జెప్పె నంబుజోదరుండు. 161

ఆ. ధర్మవిదులు రాజు ♦ ధర్మస్వరూపుఁ గాఁ, జెప్ప విందుఁ దద్విశేషవృత్తి
భరముగాఁ దలంతు ♦ నరవర చెప్పవే, మున్ను రాజధర్మముల తెఱంగు. 162

1. ఖ. శోభనచరితా. 2. జ. యగుటయుఁ.

చ. అనుటయు నాపగేయుఁడు మహత్త్వసమంచిత మైనధర్మము
న్వినుతవిధాతృభావమహిమ సేయునిఁ గృష్ణుని వేదమూర్తి నా
జనుధరణీసురావళిఁ బ్రసక్తిఁ దలంచి నమస్కరించి య
జ్జనపతివక్త్రమాదరరసప్లుతదృష్టిని జూచి యిట్లనున్. 163

క. నృపధర్మము లన్నియు నీ, కుపదేశించెద విసంశయోక్తుల నాఁ జేయున్
విపులఫలవంత మగుధర్మపథంబును నడిచి నెడఁ గ్రమము వివరింతున్. 164

వ. అవహితమతి వై యాకర్ణింపుము. 165

ఆ. మేలు దనకుఁ గోరు మేదినీశుఁడు మున్ను, దేవతలకు భూమిదేవతలకుఁ
బూజ యాచరించు నోజ యత్నముఁ జేయు, వలయు రెండుఁ గార్యఫలకరములు.

మ. విను ముద్యోగము రెంటియందుఁ బర ముర్వీనాథ యుద్యోగవం
తునకున్ దైవము తోడ్పడంగ ఫలసిద్ధుల్ సేకుఱున్ మానుషం
బున కొక్కొక్కెడ సిద్ధి దప్పిన వగల్ పొందంగ రా దీక య
ప్పని దైవోపహతంబుగాఁ గనుట భూపాలార్హవృత్తం బగున్. 167

క. దాంతియు [1]విజితాత్మత్వము, శాంతియు శీలంబుఁ గలుగు జగతీశుఁడు శ్రీ
మంతుండు యశస్వియు నై, యెంతయు సౌఖ్యంబు నొందు నిభపురనాథా.

తే. ప్రకృతు లేడింటి నెఱి నడపంగవలయు, దాని కార్జవసత్యములు దావలములు
దండనీతివిధాన మంతటికి రక్ష, యర్థ మగు మెల్పుతోఁ జేయు నది వెలుంగు.

వ. అదియును బుద్ధిమంతులు బ్రాహ్మణులవలనఁ బ్రయోగింప నయ్యర్థంబునకు
మనువాక్యంబులు గల వాకర్ణింపుము. 170

ఆ. ఇనుము రాత నీర ననలంబు విప్రుల, వలన రాజు లుద్భవంబుఁ బొందు
టిది నిజంబు తత్ప్రసిద్ధతేజము లెందుఁ, జెల్లుఁ బుట్టినెడలఁ జేరు నొందు. 171

క. శిల ద్రెంపఁ బోయి యినుమును, జలములు గొని కాల్పఁ గడఁగి చని యనలంబుం
బొలియును రాజును విప్రుల, కలిగి చెఱుపఁ బోయి తాన యనయంబుఁ జెడున్.

శా. ఈవాక్యంబులు రెండుఁ జిత్తమున నీ వెల్లప్పుడున్ నిల్పి భూ
దేవశ్రేణియెడం గృపాన్వితుఁడ వై దీప్తార్హదండంబు స
ద్భావం బొప్పఁగ నొండెడన్ నడపు శాంతత్వోన్నసురోదారజి
హ్వావిశ్రాంతము బ్రహ్మ మట్లగుట దైవం బండ్రు విప్రున్ బుధుల్. 173

వ. విప్రుని దండించు నెడలునుం గలవు శుక్రుండును జెప్పినవాఁడు వినుము. 174

భీష్ముఁడు ధర్మజునకు విప్రులలో దండార్హుల నిరూపించుట.

క. శాంతుఁడు గాక ని నాయుధవంతుం డై కవియు విప్రు వసుధేశుఁడు వే
దాంతి నయిన హింసించుట, యెంతయు ధర్మంబు శ్రుతులు నిట్లని చెప్పున్.

క. గురుతల్పగు [2]భ్రూణహను, నరేంద్రవిద్వేషి బ్రాహ్మణఘ్నునిఁ బెలుచన్

---

1. చ. ప్రియవాదిత్వము. 2. క. భ్రూణహునిన్.

ధరణి వెడల నడువవలయు, శరీరనిగ్రహము సేయఁ జన దెయ్యెడలన్. 176

వ. దుర్గంబు లనేకవిధంబులు గలవు వానియందు నరదుర్గంబు వరిష్ఠంబు గావున వర్ణంబులు నాలిగింటిమీఁదను మేదినీశ్వరుండు దయ గలుగ వలయుఁ గేవల క్షమావంతుం డగుటకు సాదుటేనుంగుచందం బై యుండు నివ్విషయంబున బృహస్పతివచనంబులు గలవు తదీయార్థంబులు వివరించెద. 177

సీ. మేదినీపతి యతిమృదు వైన మావంతుఁ, డేనుంగు నెట్లట్ల యెక్కి యాడఁ
జూచుఁ దేఁకువ సెడి నీచవుఁ బ్రజ క్రూరుఁ, డగునేని లోకంబు [1]బెగడు గుడుచుఁ
గాన వసంతంబు భానునిచాడ్పునఁ, దగియెడుపాటితో ధరణిప్రజల
నుచితవర్తనముల నొందించునది యిది, రాజధర్మములకు రాజు సుమ్ము

ఆ. కౌరవేంద్ర యదియుఁ గాక దండము పరీక్షావిశుద్ధిపూర్వకముగ వలయుఁ
దనతలంపు వెంటఁ దమకించి ప్రజకు నొవ్వఁగఁ జరించుటయును దగదు పతికి.

క. విను గర్భిణి ప్రజ బ్రదుకున, కనురూపము లైనయట్టి యాహారంబుల్
గొనుగతిఁ బతి ధరణీప్రజ, మనికికిఁ దగ నడచునది తమకి గా కెపుడున్. 179

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడం బ్రహ్లాదముం బొందుభూ
వరునాజ్ఞం జన రీగి మెచ్చరు పనిం బంచింతు రెగ్గాడఁ జొ
త్తురు కౌతూహలవేషభాషణములం దుల్యత్వముం బొంది [2]యే
తురు వా రెల్లపదంబు వేఁడుదురు సింకతుర్ భూమి [3]మాఱ్ఱొడ్డులన్. 180

వ. కావున భృత్యులయెడ నత్యంతహర్షంబునం దేలి తేఁకువ సెడఁ జరింపవలదు సప్తాంగంబులయెడ విరోధం బాచరించువాని నెవ్వని నైనను విడువ వలయు నని చెప్పి వెండియు. 181

క. అవలేపంబునఁ గర్తవ్యవివేకము లేక వలసినట్టుల యెవ్వం
డవినీతి సేయు ధరణీధవుఁడు విడువవలయుఁ దన కతఁడు గురుఁ డైనన్. 182

వ. అని మరుత్తుం డనుమహారాజునకు బృహస్పతి యొడంబడం బలికె నట్లగుట గురుండు మిత్త్రుండు పుత్త్రుం డని మన్నింపవలవదు తప్పు గలిగిన ధరణీపతులకు దండింపవలయు సగరుండు దనకొడుకు నసమంజసునిం బౌరబాలబాధకుండు గాఁ దెలిసియు నుద్దాలకముని నిజతనయు శ్వేతకేతుని విప్రులయెడ మిథ్యోపచారకుం డని యెఱింగియుఁ బరిత్యజించె రన వినమె యిట్టిచరితంబుల రాజు [4]ప్రజారంజకుండు గావలయు నిక్కంబును జక్కటియునుం గలిగి జనులచిత్తంబులు నొప్పింపక పెట్టవలయునట్టివి దఱితోన పెట్టుచు సైరణ గలిగి వర్తిల్లుభూవల్లభుం డభివృద్ధి నొంది యతిశయిల్లు. 183

క. తనకీడు వైదికపువర్తనములఁ గొని యడఁప వలయు దానిం గడవక
జనపతికి మేలు గలదే, వినుము చతుర్వర్గపరత విహిత [5]మతనికిన్. 184

1. జ. వెగడు. 2. క. హెత్తురు. 3. జ. మాటొడ్డుటన్. 4. జ. పరిజారక్షకుండు. 5. క. యతనికిన్.

ఆ. సకలవర్ణధర్మసంకరరక్షయు, సంధివిగ్రహాదిషడ్గుణములు
నలయ కరయుటయును నర్థసమ్యగుపార్జనమును నృపతి యెపుడు నడపవలయు
క. పొనరిచి యాడెడుమాటలఁ, గొనఁ దలఁపక మర్త్యసితకోటిధనంబుల్
దన కెక్కినట్టితప్పులఁ, గొని సుజనుల కీఁగి నృపతి గుణ మండ్రు బుధుల్. 186
క. కడు నమ్మి యునికియును నె, క్కుడునమ్మమియును సుశీల కుశలత గా దె
య్యెడ నైనను బుద్ధి సొనిపి, తడవి కనికొనంగ వలయుఁ దగవుఁ దగమియున్.
క. ధన మపహరించుటయు తన, కనిశముఁ బవిగాఁగ బ్రమకు నతిలుబ్ధునకుఁ
విను శత్రులచే నొటకు, మును దనప్రజచేన చేటు మూఁడు నరేంద్రా. 188
ఆ. ధర్మరతులు నర్థనిర్మాణచతురులు, లౌల్యరహితులును నలంఘితాజ్ఞు
లును సునీతినిపుణులును గులజులు నగు, పరిజనములఁ బెనుపు పతికి హితము
చ. కపటము లేక వైభవము గప్పక యొండొరుమీఁద రాజుపై
నపరిమితప్రియం బెసఁగ నల్గక యుండు ముదంబుఁ బొంది యే
నృపువిషయంబునం బ్రజ వినిర్మలవృత్తతఁ బుత్రభంగి నా
నృపు నృపుఁ డండ్రు గా కితరుని దగువా రెద నియ్యకొందు రే. 190
క. ధనదారాదికముల నె, వ్వనికిని రక్షించికొనఁగ వశమే రక్షా
ఘనుఁ డగుపతి గల్గినఁ గా, కనఁడే శుక్రుండు సుమతు లభినందింపన్. 191
క. [1]అనధీయానుం డితఁ డనఁ, జనుఋత్విజునట్లు చూవె సంరక్షాక
ల్పనహీనుఁ డైనన్నృపుఁ డని, మనువు పలికెఁ గాదె బుద్ధిమంతులు మెచ్చన్
వ. మఱియు బృహస్పతి మహేంద్ర భరద్వాజప్రముఖు లగురాజధర్మానుశాసకులు
రాజత్వమూలకారణంబు ప్రజాసంరక్షయ యనిరి గావున నెత్తెఱంగున నైనను
లోకరక్షణంబు రాజున కవశ్యకర్తవ్యంబు. 193
తే. సంతతోత్సాహవంతుఁ డై శత్రుకోటి, నార్జవంబున నైన ననార్జవమున
నైనఁ జెఱుపన వలయు నత్యల్పుఁ డైనఁ, బగతుఁ డగ్నివిషంబులపగిది నొంచు.
క. విను నృప రాజ్యామిషముం, గొనఁ [2]బలువురచేతఁ బ్రాణగొడ్డం బై యు
న్నను ధీరుఁ డేమఱమి నది, దనకును దక్కించుకొను బుధస్తుత్యముగన్. 195
వ. అని చెప్పి భీష్ముం డేను రాజధర్మప్రకారంబు సంక్షేపరూపంబున నెఱింగించితి
నీకు సందేహంబు గలయట్టిది యెయ్యది యడుగు మనిన ధర్మనందనుం డమ్మ
హాత్మునితో నరుణగభస్తి యస్తగిరి సేరెడు నేఁటికిం బనివినియెద రేపు వచ్చి య
డిగెద ననుచుం దత్పాదంబులకుం బ్రణతుం డై వీడ్కొనియెఁ బద్మనాభప్రము
ఖులును వీడ్కొనిరి వార లందఱును మునులకు నభివాదనంబు లాచరించిరి ము
నులు నిజస్థానంబుల కరుగం దారును దృషద్వతి యనుమహానదిం గృతసంధ్యా
వందనులై చని కరిపురప్రవేశంబు సేసి సుఖవృత్తి నారాత్రి గడపి కల్యాణంబునం

1. క. అనధీతాధ్యయనుం డనఁ. 2. చ. బలువురు చేఁతఁ- జ. బలువురు చేచి.

గాలోచితకృత్యంబు లాచరించి భీష్ముపాలికిం బోయి యంతకు మున్న వచ్చి యు
న్నమునిలోకంబునకు నమస్కరించి సవినయంబును సకుశలప్రశ్నంబునుం గా
నగ్గాంగేయునిం గదిసి బలసి కూర్చుండి రాసమయంబునఁ బాండవాగ్రజుండు
ప్రాంజలి యై యతని కిట్లనియె. 196

సీ. రాజనామమునకు భాజనం బై మహా, ద్భుతచరిత్రుం డగుపురుషుఁ డొకఁడు
గలిమికి మూలంబు ఘనవిశేషము గల్గ, నోపుఁ గౌరవకులదీపజనన
యది యెఱింగింపవే యవయవంబులుఁ బ్రాణ, మానసంబులు జన్మమరణములు శ
రీరయాత్రలు నెల్లవారికి నెట్లట్ల, కాని [1]విభేదంబు గాన మిట్టి

ఆ. రాజొకండు శూరతేజస్వి బుద్ధిమ
జ్జనుల నెట్లు దనవశంబు సేయ
నిలుపఁ జెఱుప నెల్లయిలయును నేల దై
వనిభుఁ డగుచు మ్రొక్కఁ గానఁగఁ జాలె. 197

భీష్ముండు ధర్మజునకు దండనీతిజన్మప్రకారం బెఱింగించుట.

వ. అదియును వినవలతు నని యడిగిన నమ్మనుజపతి కమ్మహాత్ముం డిట్లనియె. 198

క. విను తొల్లి కృతయుగంబున, మనుజులయెడ దండనీతిమంతుం డై రా
జన నొకఁడు గలిగి యరయుట, మనుజేశ్వర లేదు ధర్మమతి నుందురు తగన్.

క. ఒండొరులకు రక్షకు లై, యుండుదు రట్లుండ దైన్య మొదవిన లోభం
బొండొండ పెరిఁగి ధర్మము, ఖండిత మై మొదలుకొని రకార్యంబులకున్. 200

క. క్రమమునఁ గామము రాగము, దమమనముల నొదవఁగా మదం బెక్కిన వి
భ్రమ మొందుచు విచ్చలవిడి, విమార్గచరితముల వేదవిధ్వంసకు లై. 201

క. మనుజులు ధర్మముఁ బొడవడఁచిన వేదముఁ గర్మములును జెడుటకు భయ మం
దినయింద్రాదులు గమలా, సనుఁ గానఁగ మునులుఁ దారుఁ జనిరి నరేంద్రా.

వ. చని యద్దేవునిం గని మనుజలోకంబున వేదంబులు ధర్మంబులుం బొడ వడంగిన
నధ్వరరాహిత్యంబున నేమును దుర్బలుల మై భయం బంది వచ్చితిమి రక్షింపు
మని యవ్విబుధులు విన్నవించిన విరించి దానికిం బ్రతివిధానంబు సేసెద మీరు
వెఱవ వల దని పలికి స్వామ్యమాత్యరాష్ట్రదుర్గకోశసుహృద్బలంబులు నాన్వీ
క్షకీత్రయీవార్తాదండనీతులును నరిమిత్రోదాసీనాదికద్వాదశరాజమండలంబు
ను సంధివిగ్రహయానాసన ద్వైధీభావ సమాశ్రయంబులును మొదలు
గా వలయువానికిం బ్రబోధకంబు లగునానావయవంబులుం గలిగి ధర్మార్థ
కామమోక్షంబులకు సాధకంబు లయి యుండునట్లుగా నూఱువే లధ్యాయంబుల
నఖిలలోకహితం బగునీతిశాస్త్రంబు రచియించి యిది లోకచరిత్రనిర్మలీకర
ణంబునకుం గారణం బగు నని యనుగ్రహించె నాలోకపితామహులలాటంబున

1. చ. విశేషంబు.

ననాదినిధనుండును విశ్వజగత్కర్తయు సర్వభూతాత్మకుండును సనాతనుండును నగువిహాపాక్షుండు విశాలాక్షుం డనునామంబున నావిర్భవించి యాగ్రంథం బధిగమించి దాని నభ్యసించుటకు మర్త్యుల కాయుర్బంధములు సాల వని యుమ్మలించి యమ్మహనీయతంత్రంబు సంక్షేపరూపంబునం బదివే లధ్యాయంబుల వై శాలాక్షం బన నిర్మించె. 203

ఆ. హరునివలనఁ బడసి ♦ యాశాస్త్ర మమరేంద్రుఁ
డయిదువేలు సేసె ♦ నమరగురుఁడు
దేటపడ నొనర్చెఁ ♦ ద్రిసహస్రకాధ్యాయ
రూపసమ్మితముగ ♦ భూపవర్య. 204

వ. దాని శుక్రుండు సహస్రాధ్యాయపరిమితంబుఁ గావించె మఱియు మనుష్యులశక్తి యెఱింగి మునులు క్రమంబున సంక్షిప్తరూపంబులుగా గ్రంథంబులు గావించి రిది నీతిశాస్త్రప్రవర్తనప్రకారం బట్లు సుర లమ్మేలువడసి విశ్వలోకేశ్వరుండగు విష్ణుపాలికిం జని తగం గని కార్యంబు విన్నవించి నీతిశాస్త్రసముద్భవం బెఱింగించి దీని నధిగమింపను దదీయాచారంబు నడపను శక్తుం డగువాని నొక్కరుని నిర్దేశింప వలయు నని యభ్యర్థించిన నద్దేవుండు నిజతేజోమయుండుగా నొక్కమానసపుత్త్రు నిర్మించి విరజుం డనుపేరిడియె నతండు భూమికిం బ్రభువుగా నొల్లకుండెఁ దత్సుతుండు కర్దముండు ననపేక్షితరాజ్యుం డై తపంబున కరిగెఁ దదీయపుత్త్రుం డనంగుండు దండనీతి నయించి భూప్రజలం బాలించె నతనికొడుకు నీతి యనువాఁ డమ్మహారాజ్యంబున కభిషిక్తుం డై యింద్రియవశత్వంబు నొంది మృత్యుపుత్త్రి సునీథ యనుకామినిం గమనీయాకార సతిమనోహరగుణవిభాసినిం బరిణయం[1] బై సదానియందు వేనుండు గలిగి మాతామహదోషంబునం జేసి రాగద్వేషంబులం బ్రజకు విరుద్ధుం డయ్యె నట్లగుటయు మహామునులు గూడి యేతెంచి మంత్రపూతంబు లగుకుశసంచయంబుల నతనిం బ్రశమితుం జేసి తద్దక్షిణోరుతలంబు మథించిన. 205

క. విను కాలినకొఱవి తెఱంగున నల్లఁదనంబు మిగులుకొనుచు మొడలు నెఱ్ఱనికన్నులు నై యశుచిత్వనిరూఢుం డొకఁడు పుట్టె ♦ ధర్మతనూజా. 206

వైన్యుం డనురాజుచరిత్రంబు భీష్ముఁడు ధర్మజునకుం జెప్పట.

వ. వానిం జూచి యాఋషులు నిషీద యని పలికి వర్జించుటం జేసి తత్సంతానజాతులు నిషాదు లనం బరఁగి వింధ్యాదిగిరివనప్రదేశంబులఁ గ్రూరత్వంబున వర్తిల్లి రమ్మునులు మఱియు నారాజుదక్షిణబాహువు మథించిన నుజ్జ్వలత్కవచశరశరాసనభాసమానుండును వేదవేదాంగధనుర్వేదపారగుండును నగుపరమాకార

1. 'బై దానియం దాసక్తుం డయ్యె నయ్యాత్మాసక్తిం జేసి రాగ...' అని పెక్కుప్రతులు.

వంతుం డుదయించె సకలదండనీతియు నప్పురుషు నాశ్రయించె నతం డమ్మహా
త్ముల కభిముఖుండునుం బ్రాంజలియు నై వినయంబున. 207

తే. వినుఁడు ధర్మార్థతత్త్వప్రవీణ యగుచు, సూక్ష్మదర్శిని యైనది - సుకృతులార
నాదుబుద్ధి మీ కెప్పని - నడపవలయు, దీనఁ గొని నన్నుఁ బనుప రే - దాని కనిన.

వ. వారునుం దత్సమయసమాగతు లయినవిబుధులును నవైన్యాభిధాను నభి
నందించి. 209

సీ. మానలోభములఁ గామక్రోధములఁ బాసి, సర్వజంతువులకు - సముఁడ వగుచు
నియతధర్మము నీవు - నిశ్శంకనడపుము, ప్రియము నప్రియము నుపేక్షఁ గూర్పు
దండనీత్యాశ్రయధర్మంబు నాపని, దీనిఁ జేయుదు సావధానవృత్తి
రక్షింతు శ్రుతుల వర్ణముల సంకరములు, సొర నీ నదండ్యులు - ధరణిదివిజు

తే. లరయువాఁడ నే భూప్రజ - నని ప్రతిజ్ఞ
యనుమహోన్నతపద మెక్కి - మనుడు నాతఁ
డవనిసురులు సహాయత్వ - మాచరించి
రేని నట్లగుఁ గా కని - యెం గుమార. 210

వ. అనిన విని వారలు ప్రీతచిత్తులై యతనికి మహీసురులు సహాయత్వం బాచరించు
వారుగా ననుమతి సేసి రయ్యవసరంబున వాత్సల్యంబున సకలదివ్యపరివృతులై
వచ్చి విష్ణువిధాతలు నమ్మునీశ్వరులును నక్కుమారు నఖిలధరణీసామ్రాజ్యాభి
షేకంబు నిర్వర్తించి రవ్విభునకు శుక్రుండు పురోహితుండును వాలఖిల్యుల
యందు సారస్వత్యగణం బమాత్యులును గర్గుండు సాంవత్సరికుండు నై నడచిరి
మున్ను మహి విషమ యగుటయు నమ్మనుజపతి సమమూర్తి గావించుటయు
విందుము కరచరణాద్యవయవంబులతో నవనియు సాగరంబులును మహాగిరులు
ను నగ్గురుప్రభావుని భజియించె. 211

క. సురపతి విభవము మేరువు, హిరణ్యమును గిన్నరేశుఁ - డీడితసంప
ద్గురుతయు నొసఁగిరి రథకరి, తురగభటావళులు దలఁపుతో నొడఁగూడెన్. 212

వ. ఇట్లు మహనీయప్రభుత్వపదస్థుండై యమ్మహాత్ముండు శాస్త్రోక్తమార్గంబున దండ
నీతిపరిపాలనంబు ధర్మతాత్పర్యసమీచీనంబుగా నాచరించె. 213

క. ఉరగాదులవలనిభయముఁ, బొరయక యొండొరులతోడఁ - బొసఁగి రుజలుఁ జి
త్తరుజలు లేక యతనితఱి, ధరణిప్రజ సస్యసంపదయుఁ గల్గి మనున్. 214

తే. బ్రాహ్మణక్షతత్రాణతత్పరతఁ జేసి, క్షత్త్రియాభిధానంబు రంజనము నెల్ల
ప్రజకుఁ జేయుటకతమున - రాజనామ,మును బ్రవర్తిల్లె నాన్నృపాలునకు నధిప.

వ. తత్సంతతిజాతు లెల్లను దత్కల్పులై రాజత్వంబు వహించి దండనీతి పాలించిరి
రాజని యొకండు గలిగిన తెఱంగును రాజ్యస్థాపనంబును రాజు మిగిలి వర్తింపం
దక్కినజనంబులకు రాకుండుటయు విష్ణువిహితంబులు విష్ణుండు రాజులనిజతే

జోంశంబులం బ్రవేశించియుండు నట్లగుటం జేసి దైవనిభుం డగుచు రా జెల్లవా
రిచేతను మ్రొక్కంగొనం జాలుఁ దద్రక్షణంబును నాచరించు నొక్కవివశం
బున లోకం బంతయు వర్తిల్లుటకు దేవసంబంధకలితం బయినగుణంబు వెలిగా
నొండు కారణంబు గలదే యాకర్ణింపుము. 216

మ. హరిఫాలంబునఁ బుట్టి ధర్మమున కాౝలై యక్షమన్నుత్రకక్
సిరి గాంచెక్ దగ వారు ముప్పురును సుక్షేమోన్నతిన్ సంక్రమిం
తురు భూపాలకు నాతఁ డన్యజనతాౝతుల్యోద్భవుం డెట్లు ని
ర్జరలోకార్హసమగ్రపుణ్యవితతిౝ బ్రాప్తుండు గా కారయన్. 217

వ. దివంబుననుండి దండనీతి నయించుటకు వచ్చి వాసుదేవమహత్త్వభావితుం డైన
మహానుభావుండుగావున వర్ణంబులు నాశ్రమంబులుం దదాచారప్రవర్తంబులైన
వేదపురాణేతిహాసంబులును రాజున కధీనంబులు తదీయమాహాత్మ్యంబున నతని
యందు సౌందర్యశౌర్యచాతుర్యాదిగుణంబులు గలుగ జనంబులు దలంతురు
తదాజ్ఞకు లోనై వర్తింతు రిది రాజులు దేవసములైన తెఱంగు మఱియు వడుగ
వలయువాని నడుగు మనిన నయ్యాపగానందనునకుం బ్రణమిల్లి యప్పాండునంద
నుం డి ట్లనియె. 218

తే. అనఘ నాలుగువర్ణముౝ లాశ్రమములు, నెన్ని గల వెవ్విధంబులౝ నన్నిటికిని
వర్తనమ్ములు వేర్వేఱౝ వానిఁ దెలుపు, విశ్వరాజధర్మములనుౝ విస్తరింపు. 219

భీష్ముఁడు ధర్మజునకు వర్ణాశ్రమధర్మంబు లెఱింగించుట.

వ. అని యడిగిన నాదేవవ్రతుం డన్నరదేవోత్తమున కి ట్లనియె. 220

క. కోపంబు లేమి సత్యా, లాపము నిజదారపరవిౝలాసము శుచితా
గోపన మద్రోహం బవ, నీపాలక సర్వవర్ణౝనియతగుణంబుల్. 221

ఆ. బ్రాహ్మణునకు దమముౝపరమధర్మం బవ, శ్యంబుఁ గృత్య మధ్యౝయనము దాన
సర్వకర్మములును ౝ శాసితంబులు వాని, నడప వలయు నిష్ఠ ౝ యొడప కతఁడు.

ఉ. కానిపథంబునం జనకౝ కారుణికత్వము గల్గి శాంతిమైఁ
దా నడవంగ విప్రున కుౝదాత్తధనం బొడఁగూడె నేని సం
తానముఁ గూర్చ నర్హులకుౝ ధర్మనిరూఢతఁ బంచిపెట్ట దు
ర్మానవిదూరుఁ డై పరఁగఁ ౝ బ్రాప్తుఁడు కౌరవవంశదీపకా. 223

చ. యజనము దానకర్మమును ౝ నధ్యయనంబును దస్యుహింసయుం
బ్రజ కనురాగ మొందఁ బరిౝపాలన సేఁతయు సంగరంబున
న్విజితవిభీతిమై నురవౝణించుటయుక్ నృపధర్మముల్ గురు
వ్రజతిలకాయమాన సమౝరంబు సుధర్మువు వీనిలోపలన్. 224

తే. అధ్యయనదానయజ్ఞంబుౝలధిపవైశ్య, నకునుగృత్యముల్ శుద్ధార్జౝనమున ధనము
సంచితవ్యంబు పసుల రౝక్షించువాఁ డ, తండు వానికి నిది మహాౝధర్మ మనఘ.

క. ఈమూఁడువర్ణములకును, దా [1]మంచిగఁ బనులు సేఁత ధర్మువు కురుధా
త్రీమహీశ్వర శూద్రున, కామెయి జీవనము వాని కజుఁడు విధించెన్. 226

క. ధనధాన్యంబులు గూర్చుట, జనపతి యనుమతము లేక చన దతనికి దా
ననిరూఢి శ్రద్ధ గలిగినఁ, జను నది సుపవిత్ర యగుట జగతీనాథా. 227

తే. అధిప త్రైవర్ణికులకును యజ్ఞవిధుల, శ్రద్ధ గలిమికి మిగుల ధర్మంబు లేదు
యజ్ఞమునకంటె నధికమైనదియుఁ గలదె, యజ్ఞకర్తయచూవె సర్వాధికుండు.

వ. ఆశ్రమధర్మంబు లాకర్ణింపుము. 229

మ. గురుశుశ్రూషయు నాగమాధ్యయనముఁ గోష్ఠీనిరాసంబుఁ ద
త్పరతన్ మేన్ దొడయంగఁ దాఁ జొరమియున్ భైక్షాశనత్వంబు ష
డ్వరకర్మంబులయందు రాగభరగాఢద్వేషముల్ లేక యె
వ్వరితోడం బగ గాక యున్కియును భవ్యబ్రహ్మచర్యోక్తముల్. 230

మ. నిజదారైకపరత్వముం గరుణయున్ నిక్కంబునుం దాల్మియున్
సుజనాసంగము దేవపిత్రతిథిసంశుద్ధార్చనల్ హవ్యభు
గ్భజనంబున్ సకలాశ్రమస్థులను శక్యప్రక్రియం బ్రోపుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములు గాఁ గల్పించె నుర్వీశ్వరా. 231

శా. తానున్ భార్యయు నేఁగుఁ బేరడవికిం దా నొక్కఁడైనం జనున్
మానాహంకృతు లూడ్చు నింద్రియములన్ మర్దించు నచ్చో జడల్
పూనుం దాపసశాస్త్రముల్ సదువుఁ జల్పున్ గోష్ఠి తజ్జ్ఞాలితో
వానప్రస్థవిధాప్రవిష్టుఁడు ప్రజావాత్సల్య[2]నిష్ణాత్మతన్. 232

శా. ఎచ్చోనైనను నిల్చు నాఁకటికి నేమేనిం గొనున్ రాత్రియై
నచ్చో నెమ్మి శయించు నగ్నిపరిచర్యం బాసి వర్తించుఁ దా
నిచ్చం గోరఁ డొకండు నింద్రియజయం బేపారుభోగంబులన్
మెచ్చున్ [3]మ్రొక్కను నొల్ల కుండు యతి పేర్మిన్ నిర్మముండై నృపా. 233

క. ఈనాలు గాశ్రమములకుఁ, బూని చొరం దగినవాఁడు భూదేవుఁడు రా
జైనను వీనను వైశ్యుం, డేనియు వర్తించు శుద్ధహృదయతకల్మిన్. 234

తే. సుమతిఁ ద్రైవర్ణికులకు శుశ్రూష సేసి, యాప్తసంతానుఁ డయ్యు నిలాధినాథు
ననుమతంబున శూద్రున కాశ్రమాంత, రంబుదగుఁ గాదు యతిగాఁ గరాజముఖ్య.

క. నిజధర్మవర్తి యగుస, ద్ద్విజుఁడును బాత్రంబు దానవిధిమఖముల క
ట్లజనేశ్వర నృపముఖులకు, నిజవిత్తము లీయ మాననీయత గలుగున్. 236

తే. వర్ణములు నాశ్రమంబులు వసుమతీశుఁ, డుక్తపథమున నడపించి యుభయలోక
సిద్ధి గనుఁ దప్పఁ ద్రొక్క నిశిష్టజనులు, గలనరేంద్రున కింద్రుండు గదలఁప సరియె.

1. ఖ. మచ్చిక. 2. జ. నిష్ఠాత్మకా. 3. గ. మ్రొక్కను లేక యుండు.

వ. అదియునుం గాక. 238

సీ. ఏనుంగుహజ్జలో నెల్లసత్త్వంబుల, హజ్జలు వడఁగినయట్లపోలె
రాజితక్షత్త్రధర్మమునకు లోనయి, సర్వధర్మంబులుఁ జను మఖములు
వేదంబులును శుభవృత్తంబులును దండ, నీతి మాసినఁ జెడు భూతలంబు
సంస్కారరహితమై చాల హీనతఁ బొందు, నట్లైనఁ బ్రజకుఁ జేటావహిల్లు

తే. రాజు లరసిన నెమ్మది బ్రదుకుఁ గాన, రాజు సర్వోత్తముఁడు ధర్మరాజియందు
రాజధర్మంబ యెక్కుడు రా జనంగ, ధర్మదేవత యన వెలు ధర్మతనయ.

వ. ఆకర్ణింపుము. 240

తే. తొల్లిమాంధాతృఁ డనుమహీవల్లభుండు, విష్ణుసందర్శనము సేయ వేఁడి యొకమ
హాధ్వరము నిష్ఠమైఁ జేయ నమరవిభుఁడు, సన్నిహితుఁ డయ్యెఁ బ్రీతి సజ్జనవిభునకు.

వ. అ ట్లింద్రుండు ప్రత్యక్షుం డగుటయు. 242

క. అన్నరపాలుఁడు దానున్, జన్నమునకు వచ్చినట్టి జగతీశులు భ
క్తి న్నమ్రులైరి దేహము,లు న్నలయు ముదము మనములు గలయంగన్.

వ. అట్లు దండప్రణామంబులు సేసి లేచి చేతులు మొగిచి నిలిచిన సురేంద్రుఁ డన్నరేం
ద్రునితో ని ట్లనియె. 244

ఆ. విష్ణుఁ జూడ నీవు వేడుక పడితి నా, కైన నజున కైన నరిది విష్ణు
దర్శనంబు నీదుతలఁ పెద్ది యెఱిఁగింపు, మది యొనర్చెదను మహానుభావ.

క. అనవుడు సాంసారికవ, ర్తన ముడుపుము భైక్షచరణతత్పరత మనం
బున దృఢముగ నొందింపుము, ననుఁ జరితార్థునిఁగఁ జేయు నావుడు నగుచున్.

మ. ధరణీశా నృపధర్మ ముత్తమము సద్ధర్మంబులం దెల్ల నే
తెరువున్ రా జరయంగఁ గాదె తగ సిద్ధిం బొందఁ గామంబుఁ గ్రో
ధరయంబున్ మగిడించి దండము సమత్వవ్యాప్తిఁ జెల్లించుచున్
ధరఁ బాలించినరాజు వొందుగతిఁ బొందన్ శక్యమే యేఱికిన్. 247

వ. అని పలికి పురందరుం డందఱు రాజులం గలయం గనుంగొని. 248

తే. లోకపాలాత్ములరు మీరు మీకు భైక్ష, చరణ మర్హమే ప్రజఁ బ్రోపు సమరముక్త
దేహు లగుటయు నమ్మేలు దెచ్చు సంశ,యంబు వలవదు మీపద మధికతరము.

వ. అని చెప్పి దేవేంద్రుండు దివంబునకుం జనియె. 250

చ. అది యొకఁ డేల వేదములయందుఁ బురాణములం బ్రసిద్ధకో
విదులు బహుప్రదేశముల వేమఱుఁ గాంచి మనుష్యు లెల్ల భూ
మిదయితుకంటెఁ దక్కువ యమేయసుధర్మము లీడు గావు ని
ర్మదకృతదండనీతి కనరా మన మెల్ల వినంగ నెప్పుడున్. 251

ఉ. కావునఁ గామరోషములఁ గ్రాఁచుచు నాశ్రమకోటిఁ గాచుచున్
భూవలయప్రజన్ సమతఁ బ్రోచుచు రాజ్యము సేఁత మేలు భి

క్షావిధి లోను గాఁ గలుగు సారపుధర్మములన్ ఘటించు మేల్
వావిరి నప్రయత్నమున వానికి వచ్చు నృపాల యెమ్మెయిన్. 252

చ. అతిథుల దీనకోటుల ధనార్థిత లేనియతివ్రజంబు స
మ్మతిఁ బరికింపు హర్ష మదమానవిషాదములం జొరంగ నీ
క తొలఁగఁ ద్రోవు నాయొడలు గావక భూప్రజఁ గాతు నన్విని
శ్చితదృఢబుద్ధి గల్గు మిది సేయు సమస్తసుధర్మసిద్ధులన్. 253

వ. అనిన విని యజాతశత్రుండు మహాపురుషా వర్ణాశ్రమవిధంబులుం దద్రక్షణంబు
జెప్పను దాన వచ్చు పెంపును నెఱింగించితి రాష్ట్రజనంబు లెయ్యది యాచ
రించి సుఖు లగుదు రెఱింగింపవే యని యడిగిన నమ్మహీకాంతునకు శాంతనవుం
డి ట్లనియె. 254

రాష్ట్రజనుల కర్మధర్మంబులు భీష్ముఁడు ధర్మజునకుఁ దెలుపుట.

సీ. రాజు నుత్తమగుణభ్రాజిష్ణు నభిషిక్తుఁ, గావించుకొని యెల్ల కార్యములును
దన్ముఖంబునఁ జెల్లఁ దద్దయు సుఖ ముండఁ, బడయుదు రొకఁడు భూపాలనంబు
సేఁత లేకున్న దుశ్చేష్టితు లై జను, లన్యోన్యదారధనాపహరణ
మాచరింతురు మీలయట్టుల బలవంతు, లల్పులఁ దమకు నాహారములుగఁ

తే. గొండ్రు భూపతి లేకున్న మండ్రె జనము, లధిపకృషి సేయుటయును బేహారమాడు
టయును గోరక్ష గావించుటయును మొదలు, గాఁగ బ్రదికెడు తెరువులు గాసి గావె.

వ. వినుము. 256

సీ. జనులొక్క తఱిఁ దొల్లి సమయంబు దమలోనఁ, జేసి క్రూరతయు ముచ్చిమియు ఱంకు
సైఁపక యట్టిదుర్జను నందఱును గూడి, శాసించువారుగా జాలి తమకు
నధిపతియగ నొరు నాసపడక యుండి, నడవడి బహుకారణములఁ జిక్కు
వడిన విషణ్ణులై బ్రహ్మ గానఁగఁ బోయి, మాకు రక్షకుఁడుగ మహిపుఁ డొకఁడు

తే. వలయు రూపింపు మాతనిఁ గొలిచి బ్రదుకు, వారమనుటయు నజుఁడును వారివలని
కరుణ మనువు నిరూపించె నరు లసత్య, చరితు లని పాలనమునకుఁ జొరఁడయతఁడు.

వ. చొరకున్న నజ్జనంబు లమ్మహాత్మునితో నీకుం బుయిలోడ నేల ప్రజలచేతఁ
బశువులయందును బసిండిని నేఁబది యగు నంశంబును ధాన్యంబున దశమ భాగం
బును భండారంబుగాఁ బుచ్చికొని శస్త్రోపజీవుల నెల్ల నీవారిం జేసికొని బలవం
తుండ వై దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనం బాచరింపు మే మందఱము ననుసరించి నీ
పనుపు సేయంగలవార మధర్మవర్తనులు నీచేతం జెడువారు ధర్మవర్తనులు సేసిన
ధర్మంబున నాఱవపాలు నిన్నుం జేరం గలయది గా నొడంబడితి మింద్రుండు
దేవతల రక్షించుమాడ్కి మమ్ము రక్షించుకొని సుఖం బుండు మనుటయు. 258

క. అతఁ డొడఁబడి యత్తెఱఁగున, నతిబలవంతుఁ డయి నీతి నంచిత మగును
ద్ధతవిక్రమమునఁ దగ నీ, క్షితిఁ బాలించె సుఖు లై రశేషజనములున్. 259

ఉ. కావున మేలు సేయదె జగజ్జనకోటికి రాజునాజ్ఞమైఁ
బోవుట యాతనిం దగినపూజలఁ దృప్తునిఁ జేత దేవసం
భావనఁ గొల్వతం డొకటఁ బాడి దొఱంగిన సైఁచు టిట్లు సం
భావితుఁ జేయఁగా నతనిపం పొనరింతురు మ్రొక్కి శత్రులున్. 260

క. తనవారు పెద్ద సేయని, మనుజేశు నరాతిజనులు మదిని సరకుగాఁ
గొన రది భూప్రజ కొప్పదు, విను కావునఁ బతికిఁ బ్రజలు వెఱచుట యొప్పున్.

తే. వాహనాసనశయ్యానివాసములును, భోజ్యగంధమాల్యాంబరభూషణములు
గుప్తియును నరపతికి నెక్కుడుగ వలయు, ననుతలంపుతో మనుట భూజనుల [గుణము.

చ. అతఁడును మందహాససహితాలపనంబును సత్యభాషణ
వ్రతమును సంవిభాగనిరవద్యతయుం సమభావముం గృత
జ్ఞతయు జితేంద్రియత్వముఁ బ్రసాదఫలంబును గల్గి భూమికిం
బితృసముఁడై విరోధిజనభీషణసారత నొప్పఁ బెం పగున్. 263

వ. అనుటయుం గాంతేయాగ్రజుండు మనుష్యుల కెల్ల రాజధిపతియును దైవం
బునుం గా విప్రులు సెప్పి రట్లగుట యేమిటనో యని యుండుదు నది మీ వ
లనం బ్రస్ఫుటంబుగా వింటి నని పలికిన గాంగేయుం డింకనుం జెప్పెదఁ దొల్లి
వసుమనుం డనుమానవేంద్రుఁడు నీవపోలె వితర్కించి బృహస్పతి నడిగిన నతం
డతనికిఁ జెప్పినభంగి యాకర్ణింపు మని యి ట్లనియె. 264

బృహస్పతి వసుమనుం డనురాజునకుం జెప్పినరాజధర్మప్రకారము.

తే. లోకములు లోకధర్మంబులును నృపాల, రాజమూలముల్ రాజవిరహితమైన
పుడమి జనులకు నింకినమడువులోని, జలచరంబులు పడుపాటు సంభవిల్లు. 265

క. తరణిశశాంకులతేజ, స్స్ఫురణము లేకున్నయట్లు భూజనములు ని
ర్భరదురితతఁ జేడ్పడుదురు, నరపాలకవిహితపాలనము లేకున్నన్. 266

క. తనధన మిది యని యాఱడి, మనఁ బరిణయమాదివైనమహితోత్సవముల్
గొనియాడ నెవ్వరికి వచ్చునె జనపాలుండు లేనిచో నిర్భయతన్. 267

తే. విభుఁడు లేకున్న జనములు సభయహృదయు, లగుచు హాహానినాదంబు లడరఁ దల్ల
డిల్లుదురు రాజు లేమియ యెల్లవారు, లేమి కల్మియ కల్మి దుర్లేపరహిత.

క. యాగములును భోగములును, ద్యాగములును బహువిధములధర్మములు మహా
భాగా నరపతిరక్షా, యోగంబునఁ జెల్లుఁ బ్రజకు నుల్లాసము గన్. 269

క. ఒకరునికి నలిగి యాతని, సకలహిరణ్యంబు రత్నసంచయమును బు
చ్చుకొనుం దనవలచినవా, నికి నిచ్చు ధనేశుఁ డంద్రు నృపు నట్టితఱిన్. 270

తే. చారచక్షుఁడై కను నెల్లజగము నపుడు
సూర్యుఁ డంద్రు నరేంద్రు నకార్యకరులఁ

దనుము నయ్యెడ జముఁడు నాఁ గ జను నతండు
దేవతాత్మకుఁ డగుట సంగ్రదియమె యధిప. 271

క. విను నృప సమ్రాట్టు విరా, ట్టనియెడుశబ్దములఁ బొగడు గ నాగమములు నె
ట్టన భూపాలకు ననిన న,తనిఁ దగ నర్చింప కుండఁ గ దగునె యొరులకున్. 272

క. నియతిమెయి నెవ్వఁ డింద్రియ,జయమును భక్తియును జిత్తగసారము దృఢసం
శ్రయతయుఁ గలిగి కొలుచు నృపు, నయసంపన్నుఁడుగఁ జేయుగనధిపతియతనిన్.

క. రాజునకుఁ బ్రజ శరీరము, రాజు ప్రజకు నాత్మ గానగ రాజుం బ్రజయున్
రాజోత్తమ యన్యోన్యవి,రాజితులై యుండ వలయు గ రక్షార్చనలన్. 274

వ. అని యిట్లు బృహస్పతి యుపదేశించినం గౌసల్యపతి యగునవ్వసుమనుండు ప్ర
యత్నంబునం బ్రజాపాలనం బాచరించె నని చెప్పుటయు ధర్మనందనుండు రాజు
జనపదపరిపాలనంబును శత్రువధంబును మొదలైనకృత్యంబులు నడపు తెఱం
గెఱింగింపవే యనుటయు భీష్ముం డిట్లనియె. 275

క. తనుఁ దాన లోలుత గెలువక, మనుజపతికి వలయుఁ బిదప గ మార్తుర గెలువన్
మనమునఁ దలంచునది మును, దను గెలువనిపతికి గెలువఁగదరమే పగఱన్. 276

ఆ. వినుము తన్ను గెలుచుగటన వే ఱొకండె పం,చేంద్రియములఁ దూలగనీక కొలఁది
నాఁగుటయ జితేంద్రిగయత్వంబు గలరాజు, రిపులఁ జెఱుపఁజాలు గనృపవరేణ్య.

క. ఆరామాదికనిజసం,చారస్థలములకు దేశగసంధులకుఁ బురీ
ద్వారములకు నగరికిని ధ,రారమణుఁ డొనర్ప వలయు గ రక్షలు నియతిన్. 278

తే. అరులకడ నిజభూమియం గ దనుజతనుజ,బాంధవామాత్యమిత్త్రులగపాల వేష
ధరుల వేగులఁగాఁ బెట్ట గధరణిపునకు, వలయు నొండొరు నెఱుఁగనిగవారిఁగాఁగ.

క. తను హీనుం డని యెఱుఁగక, మును ప్రబలునితోడ శీఘ్రగమున సంధానం
బొనరింపవలయు నతనికి, ధనం బొసఁగి యైనఁ బతికిఁ గ దగు నిలఁ గావన్. 280

క. మత్తుఁ బ్రమత్తుని విప ద్యా,యత్తుని దుర్బలునిఁ జూచి గ యట్టిపగతుపై
నెత్తునది శిఖివిషాదుల, నుత్తలపెట్టునది యతనిగయుర్వి గడంకన్. 281

ఆ. కయ్యమునకు వలదు గ కాల్దువ్వ నధిప సా,మమున భేదమునను గమార్తు మనము
మెత్తఁ జేసి [1]చెఱుచు గమెయివడిఁ దప్పించు,కొను తెఱం గెఱింగి గకొనుట మేలు.

చ. జనకుఁడుఁబోలె నర్థిఁ బ్రగజం బరికించుచు షష్ఠభాగముం
గొనునది వారిచేత నరిఁ గ గోటివిధంబుల నాప్తదక్షులం
గని వనగోకులాకరనగగ ప్రముఖార్థకరంబు లారయం
బనుచుచు నన్నిటన్ ధరణిగపాలుఁడు గ న్నిడి యున్నఁ బెం పగున్. 283

సీ. కోట యేమఱ కెప్డుఁ గ బాటించి గడ్డియు, ధాన్యంబుఁ గొల్చును గ గట్టియలును
నేయునూనియయును గనాయుధమ్ములునౌష,ధములునాభీలయంగ త్రములుఁ గూప

1. చ. చెఱిచి.

ములు లోనుగా నందుఁ గలయువాని సమగ్రములుగ సంపాదించి భూరిధైర్య
శౌర్యాదిగుణములఁ గడి సన్నయాత్తయోధులఁ బెల్లపుర్బలఁ యలఘుమతి

ఆ. పగతుఁ డలిగి నడచుఁ బథమునఁ దృణకాష్ఠములును ఖాద్యతోయములును లేక
యుండఁ జేసి మిత్రమండలేశుల నెత్తి, యురుగుదేరఁ బనుచుఁ గద విభుండు.

వ. మఱియు రాజునకు రక్షింపవలయునది స్వామ్యమాత్యజనపదకోశసైన్యమిత్ర
దుర్గంబు లనురాజ్యాంగసప్తకంబు గన్నిడి యరయవలయునది సంధివిగ్రహ
యానాసనద్వైధీభావసమాశ్రయంబు లనుషాడ్గుణ్యంబు నడపవలయునది
ధర్మార్థకామంబు లనువర్గత్రితయంబు పాటింపవలయునది మంత్రప్రభుత్వోత్సా
హంబు లనుశక్తిత్రయంబు నిజవశవర్తిం జేయవలయునది సత్త్వరజస్తమంబు లను
గుణత్రికంబు విశేషించి ధర్మసేవ సంతతంబు నాచరింపవలయునది ప్రమాదంబున
నర్థకామంబులు హీనంబు లైనను ధర్మనిష్ఠం జేసి ధరణీపరిపాలనంబు సుస్థిరం బై
చెల్లు నాంగిరసభార్గవాదు లగుపెద్ద లిట్లని చెప్పిరి త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రా
ణంబులనుబుద్ధీంద్రియంబులును వాక్పాణిపాదపాయూపస్థంబు లనుకర్మేంద్రియం
బులును మనంబునుం గూడ నేకాదశసంఖ్యం బైనయింద్రియజాతంబు జయించి
కామజంబు లగునక్షమృగయాస్త్రీపానార్థదూషణంబులునుం గ్రోధజంబు లగు
వాక్పారుష్యదండపారుష్యంబులును నైనసప్తవ్యసనంబులం దగులక యజ్ఞాధ్యయన
దానతత్పరుం డగుచు దుర్మంత్రులకుటిలవాక్యంబులకు లోను గాక నయవిక్రమ
క్రమజ్ఞులైనయమాత్యులతో దైవమానుషచింతనంబు సేయుచు దేవబ్రాహ్మణ
ప్రణామతర్పణరక్షణంబులం జేసి యశుభనిరాసనంబును శుభాధానంబును నొన
ర్చుచుఁ బ్రజలం బాలించుభూపతి యుభయలోకసిద్ధులం బొందు. 285

తే. అనిన విని ప్రీతి ధర్మనందనుఁడు రాజు, దండనీతియు ననఁగ నుదాత్తయుక్త
వస్తువులు రెండు నార్యప్రశస్తకార్యసిద్ధి గావించుతరములు సెప్పు మనఘ.

వ. అని యడిగిన నప్పుడమిఱేనికి సరిత్సూనుం డి ట్లనియె. 287

క. భూరమణుఁడు గాలమునకుఁ, గారణ మెట్లన్న ధర్మగతి పూర్ణత నొ
ప్పారంగ దండనీతిసమారంభము నడపుఁ గృతయుగాగతి నధిపా. 288

వ. అందు. 289

క. ధర్మంబు పెరుఁగు వైదికకర్మఫలము లెసఁగు ఋతునికాయము ప్రజకుఁ
శర్మం బొనర్చు నాయువు, పేర్మిఁ బొరయు దునక పెద్ద పృథివి ఫలించున్. 290

తే. రాజు మూఁడుభాగముల ధర్మంబు నడపుఁ, ద్రేత నమ్మెయి నది ప్రజాప్రీతిసలుపు
ద్వాపరంబున నర్ధంబ యోపి చెల్లఁ, జేయు నక్కాల మన్మాత్రఁ జెందు మేలు.

క. నరపతి ధర్మోపేక్షాపరుఁ డగుఁ గలియుగమునందుఁ బాయును ధర్మ
స్ఫురణ మధర్మం బెందును, బరఁగును వర్ణాశ్రమములపథములు దప్పన్. 292

వ. కాలప్రభావం బిట్టిద యైనను. 293

ఆ. విభునిసకలధర్మవృత్తి నత్తఱి కృత,యుగముఁ బోలు ధర్మయుక్తిమాత్ర
లరయ విభుల కెట్టు లయ్యె [1]నమ్మ్యేతలు, లవులయుగములట్లు యగు నృపాల.

వ. అనుటయు నెట్టివాఁడైన విభుని శుభంబులు వొందు ననుటయు ధర్మనందనునకు
మందాకినీనందనుం డి ట్లనియె. 295

మ. అరయుం దప్పు కృతం బెఱుంగు మదలోభావేశముల్ లేవము
ష్కరుఁ డాత్మస్తుతి లేదు సేయు నియతిం గార్యంబు లీగుల్ ఘన
స్థిరముల్ శూరుఁడు గర్విగాఁ డశఠుఁ డస్త్రీలోలుఁ డక్రోధనుం
డరి [2]నొవ్వం గొనఁ డన్వగర్ధుఁ గనురాజత్యంతదీప్తుం డగున్. 296

వ. అని చెప్పి వెండియు. 297

ఆ. సాంగవేదవేదియగుపురోహితుఁ డెప్డు,నగర మెలఁగవలయుఁదగవుఁ గృపయుఁ
జక్కటియును గలుగుసచివు నప్పనములు, నరులు నరయఁబనుచునది విభుండు.

క. పరుసఁదనముమెయి నరిగొనఁ,జొరఁదగ దది పొదుఁగు గోయుచొప్పగువినుపా
ల్గురియించుకొనఁ దలంచిన, నరయ వలదె గోవుఁ బ్రజయు నట్టిద యధిపా.

ఆ. కోరి తోఁటవాఁడు కుసుమఫలంబులు, గోయునట్లు రాజు గొనఁగ వలయు
నప్పనములు నఱికి యంగారములు సేయు,భంగి నైన భూమి పాడు గాదె.

క. దయఁ బ్రజ రక్షించుటకు నె,నయె తపములు నధ్వరములు నరవర దానన్
జయమును లక్ష్మియునుం గీ,ర్తియు సుగతియుఁ గలుగు వసుమతీనాథునకున్.

వాయుదేవుఁడు పురూరవునకుఁ జెప్పినరాజధర్మప్రకారము.

వ. విశేషించి పురోహితుం బాటింప వలయు వినుము తొల్లి యైలుం డగుపురూర
వుండు వసుధ విప్రక్షత్త్రియులం దెవ్వానిధనం బై యుండు నని వాయుదేవు
నడిగిన నమ్మహాత్ముండు చతుర్ముఖునిముఖబాహూరుపాదంబులు బ్రాహ్మణక్షత్త్రి
యవైశ్యశూద్రులకుఁ బ్రభవస్థానంబు లగుట సెప్పి యిట్లుత్కృష్టప్రభవుం డై
సర్వవర్ణంబులకునీశ్వరుండగుబ్రాహ్మణుండీపృథివీధనధాన్యాదిసమస్తవస్తువులునుం
దా ననుభవింపను నొడ్లకు నొసఁగను నుక్తుం డగుట దండనీతిధారణంబునకు
క్షత్త్రియుం జొనిపె బ్రాహ్మణశాంతిపరత్వంబున క్షత్త్రియాధిపత్యప్రాప్తి పతి లేమి
నంగన దేవరునిం బ్రతిగ్రహించినట్లున్నది యిది భూమి తెఱంగి ట్లగుటం జేసి నిజధ
ర్మశిప్తుండును విద్వాంసుండును శాంతుండును నగుపురోహితునకు సర్వసంపద
లును సమర్పించి జనపతి శుశ్రూషాపరుండును నహంకారరహితుండును నై
దండనీతి నయించి యుభయలోకంబులనుం బెంపు వహించు. 302

క. రసగంధాద్యనుభవములు, పొసఁగవు భీత మగుచిత్తమున భయముం బా
ప సమర్థుఁడు గావున నృపుఁ, డసమానప్రభుతఁ బొందె నవనీనాథా. 303

క. అని వాయుదేవుఁ డి ట్లు,జ్జనపతి బోధించె ననుడు శాంతనవున క

1. క. నట్టి తెఱంగు. 2. గ. నొవ్వంగఁ గొనం డనం బరఁగురా.

మ్మనుజపతి యిట్టు లను నే,పనులఁ బురోహితుఁడు మాన్య। భావము నొందున్.

వ. అనిన నాధర్మతనయుతో నద్దేవవ్రతుండు పురోహితవిషయంబులుగా శుక్రుండు చెప్పినవాక్యంబులు గల వుపన్యసించెద నాకర్ణింపు మని యిట్లనియె. 305

తే. అమరగరుడగంధర్వవి। ద్యాధరాది, దివ్యులకు నధ్వరంబులఁ। దృప్తి సేసి
పరమశుభములఁ బొందుభూ। వరుఁడు దాని, కెల్ల మూలంబుదగుపురో। హితునిబుద్ధి.

క. రక్షఃపిశాచ[1]గుహ్యక, యక్షాదులు బాధ పెట్టు। నవనినాథుఁ
దక్షపురోహితమంత్రను, రక్షాసంస్కారవిధివి। రహితుం డైనన్. 307

క. వివిధోత్పాతంబులకుఁ, నవళులలోఁ దోఁచుకీడు। నకుఁ దోస్తో శాం
తివిధానంబున నిరసన, మవును బురోహితునిచేత। ననవద్యముగన్. 308

వ. ఈవాక్యంబులం దాత్పర్యంబు గలుగుము బృహస్పతియును శాంతికంబును బౌష్టికంబును శత్రునాశంబును మంత్రాఢ్యపురోహితసాధ్యంబు లనియెం గావున నీవును సంభావితపురోహితుండ వగుము. 309

క. పరిశుద్ధి లేనికుత్సిత, పురోహితులు నీచదశలఁ। బొందుదురు మహీ
వర యల్పమె శుద్ధుం డై, పురోహితత్వంబు సేఁత। భూపతినగరన్. 310

క. ఆరోగ్యము గలయుత్తముఁ, బౌరోహిత్యంబు నడపఁ। బనుచునది ధరి
త్రీరమణుఁ డతఁడు దాను స, మారంభము లెల్ల నేక। మతిఁ గను టొప్పున్.

క. బ్రహ్మక్షత్రము లొంది య, జిహ్మము లై కృత్యములు వి। శిష్టత నడపన్
బ్రహ్మాదులు హర్షింతురు, బ్రాహ్మణముఖవర్ణసమితి। ప్రమదముఁ బొందున్. 312

వ. ఈయర్థంబునం దైలకశ్యపసంవాదం బనునితిహాసంబు గలదు విను మైలుండు గశ్యపుని బ్రహ్మక్షత్రప్రకారం బడిగిన నమ్మనుజపతికి నమ్మునీంద్రుం డి ట్లనియె.

ఆ. క్షత్రమునకుఁ బుట్టు। గాఁ బట్టు బ్రహ్మంబు, బ్రాహ్మణునకు యోని। రాజు గాన
యుభయవర్ధనంబు। నొండొంటి విడువమి, వెలుఁగు రెండు మాయు। విడిచెనేని.

క. తమలోనఁ బొందు గలవి, ప్రమహీశులఁ బ్రజయుఁ బొమవుఁ। బ్రజచే మాన్య
త్వము వడయఁగ నేరరు భే, దము గలిగిన నలఁతు రొలసి। దస్యులు ప్రజలన్.

తే. అట్టిదశఁ బుట్టు రుద్రుని। యలుక దాన, సకలమునకు వినాశంబు। సంభవిల్లుఁ
గాన యెల్లవిధంబులఁ। గలసి యుండ, వలయు నృపుఁడు బురోధయు। వసుమతీశ.

క. వినుము విశేషించి జనన, జనితోన్నతి విప్రుఁ డతని। జనపతి వినయం
బున నడపవలయు దానను, మనుగడ యిరువురకుఁ బ్రజకు। మహనీయ మగున్.

కుబేరునకు ముచుకుందునకుఁ గలిగినసంవాదము.

వ. అని చెప్పి[2]పురోహితునివిశేషంబు ముచుకుందుం డనురాజునకు వైశ్రవణునకుం గలిగినసంవాదంబునం బ్రకటం బయ్యె న త్తెఱం గెఱింగించెద. 318

---

1. జ. జృంభక. 2. ఖ. పురోహితునివిషయంబు.

మ. విను మారాజు సమస్తదిగ్విజయముల్ విస్ఫూర్తిమైఁ జేసి తాఁ
దనలా వారయుబుద్ధి నైశ్రవణుమీఁదం బోవ నాతండు దై
త్యనికాయంబులఁ బంచినం దెరువునం దత్సైన్యముల్ రాజుమూఁ
క నతిక్షుభ్యము గాఁగఁ జేయుటయు స్రుక్కం బడ్డచిత్తంబుతోన్. 319

క. నృపతి పురోహితు దూఱినఁ, దపముల మంత్రముల దేవతాపూజల వీ
ర్యపటుత్వ మతనిసేనకు, నపరిమితము సేసె నమ్మహాత్మ్యం డధిపా. 320

ఆ. బ్రహ్మశక్తిఁ బేర్చి రాజుసైన్యము దైత్య, సేన బడలువడఁగఁ జేయ నాతఁ
డతిరయమున ముట్టె నలకఁ గుబేరుండు, ననికి వెడలె నిజబలాన్వితముగ.

వ. వెడలి సమరంబు సేయుసమయంబునం గిన్నరేశ్వరుం డన్నరేశ్వరు నాలోకించి.

శా. దక్షుండై తిటు బ్రహ్మశక్తిన భవద్బాహావిలాసం బమి
త్రక్షోభం బొనరించెనే యనుడు నాతం డిట్లు నీవంటి బ్ర
హ్మక్షత్రంబుల కేకయోనిజననం బవ్వేధ [1]గల్పించె యో
గక్షేమాకలనంబు సంగతము లై కావింపఁ బంపండొకో. 323

వ. అనుటయు ధనదుండు సాంత్వనస్వరంబున. 324

ఉ. నాకును నీకు నేటికి రణం బొనరింపఁగ నేను బంప నీ
వేకముఖంబుగా ధరణి యేలుము నావుడు నవ్వి యవ్విభుం
డీ కుపతిత్వ మొల్ల నొరుకనిగి మహత్త్వకరంబె విద్విష
ద్భీకరమద్భుజార్జితమ పెం పొనరంగ భుజింతు దిక్పతీ. 325

వ. అనిన విని పౌలస్త్యుండు నీ వధికుండ వట్లు సేయు మని గారవించిన ముచుకుం
దుండు ముదితుండై చని సకలోర్వియు నిర్వక్రవిక్రమంబున నేలె నని
చెప్పిన విని యజాతశత్రుండు రాజధర్మంబులయం దైశ్వర్యప్రీతిపుణ్యాలోకంబులు
నిరతిశయంబుగాఁ జేయం జాలునది యెయ్యది యని యడిగిన. 326

ఆ. అతని కిట్టు లనియె నమరతరంగిణీ, సూనుఁ డధికభీతు లైనసజ్జ
నులకు నభయ మొసఁగియలఘుసౌఖ్యాత్ములఁ, జేత యెంతయును విశిష్ట మధిప.

వ. అని వెండియు. 328

క. విను పర్జన్యుఁడు భూతము, లను బండినమ్రాను పక్షులను బ్రోచువిధం
బున నీవు బంధువుల స, జ్జనయుతముగఁ బ్రోవు మది ప్రశస్తం బనఘా. 329

వ. అనిన విని ధర్మనందనుండు విప్రప్రభృతులకు నిజధర్మవర్తనంబుల జీవనంబులు
నడవక తక్కిన నెట్లని యడిగినఁ బితామహుం డతనితో నాపద దనికిన నితర
జాతివృత్తంబు గర్హితంబు గా ద ట్లయినను నాయుధోపజీవనాదిక్షత్రధర్మం
బులం జేసి బ్రాహ్మణ్యంబు [2]వట్రపడి బ్రాహ్మణులు క్షత్రసము లగుదురు వాణిజ్య
ప్రముఖవైశ్యక్రియ లాచరించి వైశ్యసము లగుదురు నిత్యానుష్ఠానంబులు లోను

1. క. గల్పించి. 2. గ. బట్టువడి; జ. వల్లపడి.

గాఁ గలయవి డిగవిడిచి ధనలోభతాత్పర్యంబున [1]శూద్రప్రాయులై చరించి శూద్రసములగుదురు దక్కినజాతులవారందఱుఁ దమతమతారతమ్యంబులతో నిట్లు నిజజాతివిహీనులగుదు రట్టివారు జాత్యుక్తమకృత్యంబులకుఁ బాత్రంబులు గారు భూకాంతుం డింతయు నెఱింగి యథాప్రకారంబులం బ్రజ నడపి రక్షించినం బ్రజాకృతం బగుధర్మంబునందుఁ జతుర్థాంశంబునకు నర్హుం డగుఁ బ్రజలఁ బాతకంబులం బొరయకుండ నరయం జాలక దండ్యదండనరహితుం డైనమహీవిభుని వారలచేసినపాతకంబుల నాలవపాలు వొందుఁ గొందఱు బుధు లంతయుం బొందు నని చెప్పుదు రనుటయు నప్పనుజనాథుండు. 330

ఆ. వినుము వివిధసుఖము ♦ లనుభవింపఁగ రాజ్య, విభవయుక్తిఁ దిరుగ ♦ వేడ్క లేదు
నాకు ధర్మరక్షణముమీఁదిభరముఁ ద, ల్లోపభయము మనముఁలోనఁ బెద్ద. 331

వ. కావున. 332

చ. అనఘ యనేకదోష మగు ♦ నట్టిమహీవహనంబు నొల్ల దం
డనపరుషత్వ మేటికి దృఢ ♦ ప్రశమంబున నేను గానకుం
జనియెద నన్న భీష్ముఁ డిది ♦ జాడ్యము గాక నృపాలధర్మమే
మనుజవరేణ్య నీమనము ♦ మార్దవ మగ్గల మిట్లు లొప్పునే. 333

వ. ని న్నొక్కటి చెప్పెదఁ బాండువిచిత్రవీర్యశంతను లున్నవారే నాబుద్ధి వినుము. 334

ఆ. ఈఁగ కాలియంత ♦ యైనయు వీసర, వోవకుండ ధర్మ ♦ మునన నడచి
రయ్య దొంటిరాజు ♦ [2]లర్థకామప్ర, యుక్తదండధరణ ♦ మొప్పఁ గాక. 335

క. దానాధ్యయనయజనముల, తో నుర్విజనులఁ గావఁ ♦ దొడఁగుట పరికిం
దా నజకల్పితధర్మము, దీనివిడువు నరకమునకుఁ ♦ దెరు వగు నధిపా. 336

క. కావున వర్ణాశ్రమముల, నేవిధమున నైన నడపు ♦ లెడలక యుండం
గావంగ నోపు నృపతికి, లే వలజ ల్లుభయలోక ♦ లీలలయందున్. 337

వ. ఇ ట్లగుటం దెలుపునది యొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. 338

కేకయరాజరాక్షససంవాదప్రకారము.

క. పరమనియతిమైఁ గేకయ, నరపతి యధ్యయనవిధి యొ ♦ నర్పఁగ నటవీ
పరిసరమున కేఁగినయెడ, ధరణీశ్వర పట్టె నొక్క ♦ దానవుఁ డతనిన్. 339

వ. పట్టినఁ బ్రబలుం డగునద్దనుజునిం దొలఁచిపోవం జాలక యమ్మహీపాలుండు వానికి ట్లనియె. 340

సీ. మ్రుచ్చిమియును అంకు ♦ నెచ్చోట నైన నా, భూమిలోపల లేదు ♦ భూమిసురులు
వేదాధ్యయనయజ్ఞ ♦ విధిదానతత్పరుల్, రాజులు బ్రాహ్మణా ♦ రాధనంబు
జన్నముల్ సేఁతయు ♦ సమరానివర్తన, వ్రతమును గలరు గో ♦ రక్షణాది
వార్తావినీతులై ♦ వైశ్యులు నడపుదు, రమ్మూఁడుజాతుల ♦ కధికభక్తి

1. క. సేవావృత్తి నడచిన శూద్రి. 2. జ. లర్థకామత్వ, యుక్త... మొప్పెఁ.

తే. తోడ శుశ్రూష సేసి శూద్రులు చరింతు, రేమిరంధ్రంబు గాంచి నీ విట్లు వెరవు
మాలి పట్టి తత్పద్ధత లీల నన్నుఁ, దలఁప నిది నీకుఁ బథ్యమే దానవేంద్ర.

చ. అనుటయు నమ్మహాదనుజుఁ డాతని కిట్లను నట్టివానిఁ గా
నినుఁ గని వర్ణరక్షణము నిర్మలచిత్తతఁ జేయురాజు కీ
డునఁ బడ కున్కి దెల్పఁగఁ గడుం బ్రియమై చనుదెంచితిన్ మహీ
జనపరిరక్ష యస్ఖలితసామ్యత నిట్ల యొనర్పు భూవరా. 342

వ. అని పలికి సఖ్యంబు చేసి చనియె నని చెప్పినం గౌంతేయాగ్రజుండు సంతోషించి జీవనాభావం బైనచో క్షత్త్రియకర్మానుష్ఠానంబునకు నశక్తుం డగు విప్రుం డెట్లు బ్రదుకువాఁ డని యడిగిన భీష్ముం డిట్లనియె. 343

చ. మనఁ జను నుప్పు నువ్వులును మాంసము గోవు వృషంబుఁ గూడుఁ గ
ల్లును ఘృతతైలమాక్షికములున్ ధృతకేసరమైనజంతువుల్
ధన మధికంబుగాఁ బడయు దానికి నేనియు విక్రయింపఁ గా
దనుమతి యూఁ వైశ్యకృతి నైనను విప్రున కాపదాగతిన్. 344

వ. అనిన విని ధర్మతనయుండు యజ్ఞంబు లెట్లయిన సమీచీనంబు లగు నని యడిగిన ననిమిషనదీనందనుం డతని కిట్లనియె. 345

ఆ. శ్రద్ధ వలయు మిథ్య చనదు వేదంబులఁ, బరిభవింపఁ దగదు భవ్యయజ్ఞ
కర్త కెపుడు నదియుఁ గాక దక్షిణలు మం, త్రార్థపోషకంబు లందు రధిప.

క. ఈగతి యెఱింగి చేసిన, యాగము సోమాప్తుఁ జేయు నప్పురుషునిఁ ద
ద్యోగ మొనర్చు మహాసుఖ, యోగము సోమాధిరాజ్య యుక్తము శ్రుతులన్.

ఆ. అధ్వరంబుకంటె నధికంబు దపము ద, పం బనంగ మేని ప్రన్నఁదనము
నివురఁ జేఁతగా దహింసయు సత్యవా, క్యంబు దమము దయయుఁ గాని యరయ.

వ. అనిన. 349

చ. ప్రియమున ధర్మనందనుఁడు భీష్మునితో నృపుఁ డెట్టిభంగివా
నియెడఁ గరంబు నమ్మఁ దగు నిక్కపుమిత్త్రుఁడు లేనిభర్తకున్
నయగతి సెల్ల నేర దనినన్ విని యిట్లను నాతఁ డేకబు
ద్ధియుతుఁడవై వినన్ వలయుఁ దెల్లముగా నెఱిఁగింతు భూవరా. 350

క. నమ్మమి మృత్యువు పెద్దయు, నమ్ముట యపమృత్యు వగుట నరపతి మిత్త్రున్
నమ్మి పనులు గొనునది ని, త్యమ్మును సూక్ష్మమతిఁ దాను నరయఁగవలయున్.

తే. తనకు మేలొనరించినాతండు మిత్త్రుఁ, డతఁడు నడపంగ నెల్లకార్యములు శుభము
నొందు నేమిట నేమఱకునికితోడ, నృపుఁడు మిత్త్రుపైఁ గార్యముల్ నిలుపవలయు.

ఉ. మన్ననకున్ మదింప కవమానము వచ్చిన స్రుక్క కొక్కభం
గి న్నెఱిఁ గార్యముల్ విగతకిల్బిషుఁడై తగఁ జేయునట్టిమి

త్రున్నరనాయకుండు దనకుఁ బ్రాపు[1]గ నగ్గల మైనశ్రీయు న
త్యున్నతియుఁ ఘటించి మహోజ్జ్వలుఁ జేత సుఖావహుం బగున్. 353

క. విను మట్టిమంత్రి గామం, బునఁ గ్రోధంబునను లోభమున భయమునఁ గా
ర్యనిరూపణంబు వదలక, వినుతుఁడై నడచు నధికవిభవముఁ జేయున్. 354

వ. అని చెప్పి వెండియు. 355

క. అన్నలుఁ దమ్ములుఁ గలుగుట, యున్నతిఁ జేయు నృపు నెంతయుఁ బిల్లయు నగ్గ
మన్ననయు నీగియును సంపన్నంబులు గాఁగ వారిఁ బాటించు నరున్. 356

వ. అది యెట్లం టేని. 357

క. బలఁగము గలభూపాలుఁడు, గెలనిమహీశ్వరులబుద్ధికిని వ్రేఁగగుచున్
బలియుఁడగు లేనివానిం, జులుకంగాఁ జూతు రెట్టి శూరుం డైనన్. 358

క. ఎక్కువతక్కువమాటలు, నుక్కివములు బంది నీడు గొలందించుటలుం
బెక్కు దనయన్నదమ్ముల, దిక్కున నన్నియును సైఁపఁ దేజము సేయున్. 359

క. లోపల [2]రాఁజుచుఁ బొగయుచుఁ, బాపంబులు దలఁతు రోపికబలిమియు [3]వెలుపుం
జూపక తక్కరు కెలనికి, నేపాటను వారి నడపు కెంతయు నొప్పున్. 360

తే. చాలుదురు వారు నృపతికి మేలు సేయఁ, గీడొనర్పంగఁ గావునఁ గిల్బిషములఁ
బొరయకుండంగ వారలఁ గనరసికొనుచుఁ, బొదివి నడపుట కార్యంబు భూవిభునకు.

వ. అనుటయు ధర్మజుండు ధనార్జనం బేమిటం బ్రస్ఫుటం బై నడచు నని యడిగిన
నతనికి భీష్ముం డి ట్లనియె. 362

## కాలకవృక్షీయక్షేమదర్శిసంవాదప్రకారము.

క. ఆయతికాఁడు వలయు నర, నాయకునకు వాని కెల్లఁ గనరులుం జేటుం
జేయఁ దలంతురు దానవ, ధాయకుఁ డై కావ వలయుం ధరణిపుఁ డతనిన్. 363

వ. ఈయర్థంబున నితిహాసంబు గల దాకర్ణింపుము కాలకవృక్షీయనామధేయుం డ
గు నొక్కముని క్షేమదర్శి యనియెడుకోసలభూవిభునిభూమికిం బంజరస్థంబుఁ జేసి
కొని యొక్కకాకంబుఁ దెచ్చి యిప్పక్షి త్రైకాల్యవేది యని యెల్లజనంబులకుం
జెప్పుచుం దిరిగి క్రమంబున రాజుం గని యతని కక్కాకంబుఁ జూపి నీయం
దర్థార్జనాదినృపకార్యంబులవలన చేముటుట గలదు దానం బుట్టినసేగి యెల్ల నిప్పు
లుఁగు సెప్పి నీకుం దప్పినముచ్చులం బట్టింపఁ జాలు ననుపలుకులు వలికి యమ్మహీ
వరునాదరంబు వడసి వీడుఁబట్టున కరిగిన. 364

క. ఆరాత్రి యవ్విభునియద్ధి, కారులు సంపి రొకభంగిఁ గాకము మఱునాఁ
డారాజున కవ్విప్రుఁడు, గోరి రహస్యంబుఁ జేసికొని యెఱిఁగించెన్. 365

వ. అట్లు నియోగులకపటోపాయంబునం గాకి మృతంబగుట సాభిజ్ఞానంబుగా నెఱిం
గించి తనపేరు సెప్పి యేను మీతండ్రిసఖుండ నతనిపిమ్మట నిచ్చట నిలువ నొల్లక

---

1. గ. నకగ్గల మైన. 2. జ. రాయుచుఁ బొగలుచుఁ. 3. ఖ. వెరవుం.

వనంబున కరిగి తపంబు సేయుచుండి నీమీఁదియధికస్నేహంబునం జేసి నీ దగు యోగక్షేమంబు లరయ వేఁడి వచ్చి యీరాష్ట్రంబునం బురంబునను వర్తించుచు భవదీయరాజ్యలక్ష్మి మధురభంగి యయ్యును నధము లగునానియుక్తుల వలనం జోరజనసంవృతం బైన కావేరియుంబోలె నుపయోగ్య గాకునికి యెఱింగి నీ కెఱింగించుట కై మిథ్యాభివర్ణితం బైనకాకంబునెపం బిడి చొచ్చితి దుర్మతు లైనద్రోహులు దానిం జంపుటకతంబున లోనం గీడు గలుగుట నీకుం గొంత గానవయ్యెఁ గను గలిగి యరసిన నింకనుం దేటపడియెడు నా యాప్తియును గార్యవివేకంబుకలిమియు నమ్మి మదీయోపదేశంబు నాదరింపు మిప్పుడు నన్నాదరింపక విడిచినవాఁడ వగుము వంచకు లైనయధికారపురుషులకు నేర్పుమైఁ గ్రమంబునఁ బరస్పరవిరోధంబుఁ గలిగించి సంప్రీతి సెఱిచి నీవలసిన ట్లొక్కనొకని దండింపు మని వారలఁ బేరు [1]గ్రుచ్చి యుపదేశించిన. 366

క. ఆరాజు నట్ల చేసి మ,హారాజ్యస్థితికి నెల్ల నవ్విప్రు, మహో
దారగుణు మంత్రిఁ గాఁ గొని, సారధనప్రీతిసుఖయశంబులు వడసెన్. 367

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు మంత్రి యెట్టివాఁడు గావలయు నెఱింగింపు మనుటయు గాంగేయుం డతని కిట్లనియె. 368

సీ. జ్ఞానపరుఁడుఁ బౌరజానపదాప్తుండుఁ, గార్యజ్ఞుఁడును ధైర్యశౌర్యఘనుఁడు
నక్రూరుఁడును విశుద్ధాత్ముండుఁ బతియెడ, భక్త్యనురాగసంభ్రమము లెసఁగ
సమసుఖదుఃఖుఁ డై చెమరు నెత్తురుగాఁగఁ, దలఁచుచు [2]నరయక తప్పుమీఁదఁ
బెట్టిన నలుకమైఁ దిట్టినఁ గలఁక దా, నొందక తేర్చుచోఁ బొందు సెడక

తే. మెలఁగువాఁడును నిజరంధ్రములకు మాటు
సేయఁ బరరంధ్రములు గని చిక్కువఱుపఁ
జాలునిపుణుండు నై నవిశాలబుద్ధి
గావలయు మంత్రిముఖ్యుండు కౌరవేంద్ర. 369

వ. అని చెప్పి. 370

క. మృదుమధురవాక్యముల నిం, పొదవెడుచిఱునవ్వుతోడ నుర్వీశుఁడు స
మ్మదము సచివులకుఁ బ్రజలకు, నొదవింపఁగ వలయు నది మహోన్నతిఁ జేయున్.

తే. ఈగియును బ్రియవచనసంయోగమునన, కాని జనులకు సంతోషకారి గాదు
పుచ్చికొనునప్పుపల్కులపొందుకలిమి, యెదిరిమదిఁ గందనీదింత యెఱుఁగు మధిప.

వ. అనుటయు ధర్మతనయుండు జనంబులవివాదం బుడుపునప్పుడు పుడమిఱేఁడు దూఱునుం బాపంబును బొరయకుండు తెఱంగు దెలుపవే యనిన దేవవ్రతుం డి ట్లనియె. 373

1 ఇది 'క్రుచ్చి' యని పఠపాఠదిగానే కానంబడియెడి. 2. చ. నలయక.

సీ. వ్యవహారశుద్ధి సర్వప్రజాప్రియకారి, యదియ భూపతికి ధర్మార్థకామముఁ
గీర్తియుఁ జేయు సత్క్షీణసత్యులు ధర్మపరులును నైనభూసురులు విప్రు
ద్రాసులుం బోనిచిరత్తంబులతో డుతఁ, బ్రజవివాదము లెఱఁ గ బత్తు ముఖ
విని ధనవాంఛమైన ధనికులదెస వ్రాలి, తీర్పక ధర్మంబు కెరువు దప్ప
ఆ. కుండఁ బాడిఁ దీర్చి దండింపఁ దగు నెడ, ననుగుణంపుదండ మాచరింపు
మొఱఁగ బలికితేని నుండమ ప్రజ డేగఁ, గనినపులుఁగు పింకుకరణిఁ జెదరు.
వ. దండించుట దానును. 375
క. నఱకుట యర్థముఁ గొనుటయుఁ, జెఱ నునుచుట కట్టి యడిచి చేజ్వాకొందం
బఱచుట మొదలుగఁ గలపలు, దెఱఁగులఁ దగవుమెయి నడచు క్షీరవిచారా.
వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లనియె. 377
క. తనకడకు వచ్చి మొగ మోడనివాఁ డగుదూత పల్కుకటకుఁ గోపింపం
జనదు జననాథునకు దూతునిఁ జంపిన నరక మగుట ధ్రువ మనిరార్యుల్.
తే. కులముశీలంబు హితవాక్యములును నేర్పుఁ, గార్యవాదిత్వసద్వచోగౌరవంబుఁ
దలఁపుగలుగుట దక్షతయలఘుగుణము, లంత్రు దూతకు నివ్వే యార్యజనులు.
క. మొన దీర్చువెరవు యంత్రము, లనేకము లొనర్చునేర్పు నాయుధముల వి
న్ననువును బోటులకర్జంబును సేనాపతికి నైజములు గావలయున్. 380
క. తనయుల నైనను నమ్మిన, జనపతి సిరి గోలుపోవుఁ జతురతమై న
మ్మినవాఁడవోలె నమ్మక, యునికి సకలజనులయెడల నురనై యుండున్. 381
తే. అనిన విని పాండవాగ్రజుండనఘ పురము, భంగియెట్లైన మేలు సెప్పంగవలయు
ననుడు నమ్మహీవిభునకు ననిమిషాపగాతనూభవుఁ డిట్లనుఁ బ్రీతితోడ.
సీ. పరవు లోఁతును గలపరిఖతోఁ బాడవును, ఘనమును నగుకోట గలిగి తగిన
వాకిళ్లు బలుపుఁ గాకవలి నొప్ప రమ్యగృహవ్రాతములు గోమరారువీథు
లందంబు లగుమేటిరయంగళ్లు నెల్లవస్తువులును శోభిల్ల సుజనబహుళ
మైధాన్యములును ఘృతాదిరసద్రవ్యములును నానాయంత్రములును బహువి
ఆ. ధాయుధములు బిరుదు లగుయోధులును బండి
తులు విలాసినులును దూతముఖ్య
పరిజనములు నెఱయఁ బరమోత్సవంబులు
మెఱయఁ బురము చెలువు మిగుల వలయు. 383
ఆ. అట్టిపురవరంబునందు రత్నస్వర్ణముఖము లగుపదార్థములకు బంధు
తతికిఁ బతి సురక్షితస్థితి సేయునాఁ, డధిప వినుము భూమియరయు తెఱఁగు.
వ. అని పలికి మఱియు. 385
క. స్థలముఖ్యము లయ్యేడుపే, ర్కలయూళ్లల నెల్ల వెరవు గలిగినవిశ్వా
సులఁ బ్రభుత యిచ్చి భూపతి, నిలుపవలయు వర్ణరక్షణీయత వెలయన్. 386

క. చోరులచేఁ జెడ కుండం, గ్రూరులచేఁ జావ కుండఁ గువలయజనులన్
జారులచేఁ బడ కుండ ధ,రారమణుఁడు నేర్పు గలిగి రక్షింపఁ దగున్. 387

క. అవు బేహారముఁ గృషియు, న్నవరణలును పనులపొంపునన యట్లగుటన్
భువిఁ బసులు గలుగుకాఁపుల, నవనీశుఁడు గన్న ప్రజలయ ట్లరయఁదగున్. 388

క. అరి మిగులఁ గొనుట క్రేపులఁ, బొరిమాలం బిదికినట్ల భూవర కడుపున్
వెరవునఁ బెనిచినయట్లగు, నరపతి ప్రజచేత నప్పనము దగఁ గొనినన్. 389

బండారంబు వృద్ధి సేయు తెఱంగు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట.

వ. అనిన విని పాండవాగ్రజుండు బండారంబు గలిగించు వెర వెట్టిది తెలుపు మని యడిగిన నాపగాతనయుం డతని కి ట్లనియె. 390

క. విను కర్షకులును వణిజులు, ననఘా గోరక్షకులు ధరాధీశునకున్
ధన మొదఁగూడెడుచోటుల, కనేకవిధములకు నెల్ల నాద్యస్థలముల్. 391

తే. ధనములకు ధాన్యములకు నుత్పత్తితలము
లయినవాని కించుకయును హాని గాక
యుండఁ దనకును బండార మొదవఁ దగును
పార్జనము సేయ వలయు భూపాలకుండు. 392

క. పులి గూనలఁ దినుచందము, గలిగిన నంతటన నిలుచుఁ గాక ధనంబుల్
గలుగునె మీఁదం గావున, జలగ దిగిచినట్లు గొనఁగఁ జను నిల సొమ్ముల్. 393

క. అరయుటఁ బ్రజ వర్ధింపఁగ, నరి [1]యేటఁ గ్రమప్రవృద్ధ మానట్టులుగా
నరపతికిఁ గొనఁగ వచ్చు, న్వెరవులఁ బెంపంగఁ జాల నెఱయు ధనంబుల్. 394

క. దమియింపఁ దగినవారల, సమయమున దమించి వారిసంపదలు మహీ
రమణుండు దనదుబండా,రముగా సమకూర్చు జనము రాగిల్లంగన్. 395

క. అపనికిఁ గీడు రోయుచు, భూపాలుఁడు ధనము గలుగుపురుషులసిరిఁ దాఁ
జూపోపక కొనఁదగదు ద,యాపరుఁడై పెంపవలయు నఖిలజనములన్. 396

క. ప్రభువుల నుపచారంబుల, విభుఁ డనురాగిల్లఁ జేసి [2]వెదగొనుఁ గాఁపుల్
సభయులు గాకుండ ధనం, బుభయజగత్సిద్ధి[3]పొంటె నుర్వీనాథా. 397

క. ఆయతి కిమ్మైయిఁ గలుగును,పాయంబులు ధర్మమార్గఫలితంబులు గాఁ
జేయుటయ మేలు నృపతికి, మాయాకృతినిపుణుఁ డగుట మతి గాదు సుమీ.

క. ధనము నవరించినఁ బ్రయో,జన మేమి యపాత్రములకుఁ జల్లి చెఱుచునే
ని నరేంద్రముఖ్య వ్యయములు, వినుఁ రక్షయ సిరికిఁ బాత్రవిషయము లైనన్.

వ. ఈభంగి నైనం గోశమిత్త్రరాష్ట్రబలంబులు వృద్ధిఁ బొందునీ విట్టి తెఱంగువాఁడ వై ప్రజల రక్షింపుము రణంబుల కలయక విరోధుల వధింపుము మఖంబు

1. గ. తోఁటేఁటం బ్రవృద్ధ. 2. క. వెడగొను; గ. వెదకుం. 3. చ. ( బొంటు.

లోనరింపుము దరిద్రులైనధరణీసురాదిసాధుల నరసి కుటుంబరక్షణంబు సేయుము మాంధాతృనకు నాంగిరసుం డగునుతథ్యుండు సెప్పినహితవాక్యంబు లుపన్యసించెద నాకర్ణింపుము. 400

మాంధాతృన కుతథ్యుఁడు సెప్పినహితవాక్యముల ప్రకారము.

తే. భూతవృద్ధులు ధనలాభములును గలుగు,ధర్మమునను రాజనువాఁడు ధర్మరక్ష
కై జనించెను గావున నతఁ డశేష,కాముఁడై ధర్మనిరతుండు గాఁగ వలయు.

క. విను ధర్మమునకు బ్రాహ్మణ,జనము జననదేశ మగుట జనపతి భక్తిం
గొనియాడి యనూయావ,ర్జనుఁడై తగువిప్రకోటి సంభావింపన్. 402

చ. అనిమిషులున్ విభీతు లగునట్టిపదంబునఁ జేర్చి మున్ విరో
చనతనయుండు భూమిసురజాతిసువృత్తి కసాయ చేసి నె
ట్టన సిరిఁ బాయఁడే బలి దృఢం బగుభక్తివిశేష మూఁదఁ గా
ననఘ యతండు దాఁ బిదప నవ్యయసౌఖ్యవిభూతి నొందఁడే. 403

ఆ. ధర్మమునకు సిరికిఁ దగ జనించినయది, దర్ప మనిమిషులు నుదాత్తమునులు
నైన నగ్గుణమున నూనినఁ జెడుదురు, దాని గెలువ వలయు ధరణిపునకు.

మ. పరనారీగమనాదిదోషములు భూపాలుండు సేయంగఁ ద
ద్ధరకున్ వర్షము లేక యుండుఁ బ్రజకున్ దైన్యంబు వాటిల్లుఁ జె
క్కురుజల్ పైకొను నెందునుం గలయ నుక్కుం దేజము దక్కు ను
ద్ధురసైన్యంబుల శత్రు లొత్తుదురు బంధుశ్రేణికిం జేటగున్. 405

క. కాని చెయిదములు సేయ క,నూనపుధర్మమున నడచునుర్వీశుఁడు సం
తానము బంధులుఁ బ్రజయును,దానును సేనలును శుభము దలకొనఁ బేర్చున్.

వ. అనియిట్లుసెప్పినవాక్యంబులం దెలివొంది ధర్మతత్పరుండై మాంధాతృండు మహావిభూతిం బొంది నెగడె నీవును నట్లు నెగడు మనిన ధర్మతనయుండు ధర్మంబున నెగడ దొరకొనుట యెట్టిభంగిం గలుగు నని యడుగుటయు నతనితో నక్కురుపితామహుండు దొల్లి కౌసల్యుం డగువసుమనుం డనురాజు వామదేవమహాముని నిట్లు యడిగిన నతం డతనికి నుపదేశించిన తెఱంగెఱింగించెద వినుమనియిట్లనియె.

వసుమనుం డనురాజునకు వామదేవుండు సెప్పినధర్మప్రకారము.

ఆ. అర్థసిద్ధికంటె నరయ నెక్కుడు ధర్మ,సిద్ధి దాన సకలసిద్ధులును బ్ర
శస్తభంగిఁ జేరు శాశ్వతకీర్తియు, సంభవించుఁ గలుగు సద్గతియును. 408

క. ధనమునకై ధర్ముదెస, ననాదరము సేసెనేని నానృపతికి న
ద్ధనమును జెడు దుర్యశముం,బనుగొనుఁ దుది దుర్గతియును బొటిలు ననఘా.

క. లాభంబు ధర్మముఖ్యము, గా భరపడి మార్గశుద్ధి గనుఁగొని కైకో
ల్దా భూవరునకు నిహపర,శోభనములు సేఁత చెప్పు శ్రుతివాక్యంబుల్. 410

క. ధర్మప్రవృత్తి యయ్యును, ధర్మము నా కింతకంటెఁ దత్తద్విధులం

బేర్మిం బొరయవలయు నను,ధార్మికతాతృష్ణ నత్యుదాత్తుఁడు వొందున్. 411

వ. అని తనవచనంబులం దెలివొందినవసుమనుం డనురాజుతో వామదేవుండు రాజ్యతంత్రంబున కెల్ల నాధారభూతంబు లగుసామభేదదానదండంబులం బ్రయోగించు తెఱం గెఱింగించెద నాకర్ణింపు మని యి ట్లనియె. 412

క. మూలబలము సంతుష్టం,బై లాలిత మగుచు నున్నయప్పు డసదుఁజో
టాలోకించి నడవ భూ,పాలకునకు దండ మతిశుభం బొనరించున్. 413

చ. సమరము సాహసం బధికసంపద లమ్మెయిఁ దెచ్చికోలు ప
థ్యమె రిపు లేల కల్గుదు రహంకృతిపెంపును నుత్కటంపుఁగో
పము మగిడింపఁ జాలునరపాలున కట్లగుటన్ హితంబు సా
మము దనయంతవాఁ డయినమానవనాథు నెడన్ మహీశ్వరా. 414

క. తనభటులు గలఁగినప్పుడు, ధన మిచ్చి విరోధి నల్పేతరు నైనను శాం
తునిఁ జేయవలయు దానము,నన యధికునిఁ దేర్చు టురవు నరపతి కెపుడున్.

తే. ఆయుపాయముల్ మూఁటికి ననువుగాని,యట్టిపగతునియెడ భేద మాచరింప
వలయురంధ్రముల్ దగ వేచువలనుగలిగి,తత్పరతఁ జేయఁజాలుసాధకులఁ బనిచి.

వ. శుక్రమతంబునం బంచమోపాయం బైనయుపేక్ష వర్తిల్లు దానిం బ్రయోగించు భంగియుం జెప్పెద. 417

మ. కలహంబుల్ దమలోనఁ జేసిన నుపేక్షానైపుణం బొప్ప శ
త్రులఁ జూడం దగు భూతదానవులపోరుం జూచిన ట్లిమ్మెయి
న్ములు ముంటం దగఁ బుచ్చుభంగి గలుగు న్భూనాథ కీ ద్దైనమం
త్రులయేపున్ విభుఁ డిట్లమాపునది నేర్పుం బెంపుఁ బొల్పారఁగన్. 418

వ. అని యత్తెఱంగున వామదేవుండు సెప్పినహితవచనంబులు వాటించి కోసలపతి భాసమానుం డయ్యె నీవును నట్ల వర్తిల్లి వెలయు మనినఁ బాండవాగ్రజుండు సమరంబున శత్రుల జయించునప్పటిపాడి యె ట్లుండు ననుటయు భీష్ముం డతని కి ట్లనియె. 419

ధర్మజునకు భీష్ముండు సమరంబునపాడి చెప్పుట.

సీ. పగవాఁడు బలములఁ బన్ని తోఁచినఁ దాను,సబలుఁడై యొంటిమై సంగరంబు
గోరిన నమ్మెయి గొనకొని మాయ లొ,నర్చిన మాయలఁ బేర్చి గెలుపు
గొనునది వెన్నిచ్చినను బ్రమాదంబునఁ, బడినను గైదువు భగ్న మైన
శర ణన్న మ్రొక్కినఁ దురగాలి యొడలిన, నోరుతోడఁ బోరుచున్న నెట్టి

ఆ. పగతు నైనఁ జంపఁ దగ దధర్మంబునఁ, జంపుకంటె ధర్మసమరకేళిఁ
జావు మేలు రాజు శయ్యఁ జచ్చుట గొఱ, గాదు గాన యోడఁగాదు పోర.

క. విను చిల్లి యుడినయాయుధ,మును విషలిప్త మగుశస్త్రమును నెట్టియమి
త్రునిపై నైనఁ బ్రయోగిం,చిననరపతి నరకమున వసించు నృపాలా. 421

క. తనకుం దోడ్పడి యని నొచ్చినవానిం గాంచి కడఁగి చేపట్టంపక యు
న్ననరేంద్రుఁ బొందుపాపం, బునకుఁ గొలఁది గలదె భరతకులపుంగవ తలఁపన్.

వ. అని చెప్పి వెండియు. 423

చ. అరిపయిఁ బోయి వానిపురి మగ్గలికం జెఱుపంగఁ దద్ధరం
బరఁగుప్రజం జలంబుమెయి బాధలఁ బెట్టు నధర్మ మట్టిని
ష్ఠురత యొనర్చు టప్పటికిఁ జూడఁగ మానఁగ రాదయేని భూ
సురగృహదేవగేహములకు మాఱ నవశ్యము మాన్చు టొప్పగున్. 424

వ. అనిన విని యజాతశత్రుండు రాజధర్మంబుకంటెం బాపకర్మంబు లేదు పొమ్మని
పలికి యిట్లని రాజున కెట్లును నథోగతి వాటిల్లుఁ గదే యనుటయు నాపగాతన
యుం డిట్లనియె. 425

క. శరణాగతుఁ గాచియు నని, నరిపోటులఁ బడ్డఁ దెచ్చి యరసియు ధరణీ
సురులం బోషించియు నానాధ్వరములు సేసియును రాజు దలఁగు దురితముల్.

క. అన విని యమ్మనుజేశ్వరుఁ, డని నవివర్తులయి శౌర్య మభినుతి కెక్కం
దనువు దొఱంగినవారికి, ననఘా యెబ్భంగిలోక మగు నని యడిగెన్. 427

వ. అడుగుటయు నమ్మహీకాంతునితో శాంతనవుండు శక్రాంబరీషసంవాదంబు
చెప్పెద దాన నీయడిగినయది దేటపడు నని యిట్లనియె. 428

ఇంద్రాంబరీషసంవాదప్రకారము.

సీ. అంబరీషుండు నానాధ్వరంబులు సేసి, కడచని వాసవుకడకు నేఁగి
యచట నుజ్జ్వలవిమానారూఢుఁడును మనో, హరిసంక్రీడనోదారచరితుఁ
డును నై వెలింగెడుతనదుబంటును దేవుఁ, డనువానిఁ జూచి యయ్యనిమిషేంద్రు
తోడ మదీయభృత్యుఁడు వీఁడు క్రతుముఖ్య, కర్మముల్ సేయఁడెక్కారణమున

తే. ననఘ నాకంబెఁ గడుఁ బేర్చి యునికి గలిగె, ననుడు నాజిష్ణుఁ డిమ్మహాత్ముని తెఱంగు
సెప్పఁ జిట్టలు వినఁగ వాంఛించితేని, వినుము చెప్పెద నని యిట్టులనియెఁ బ్రీతి.

వ. శతశృంగుం డనియెడుదానవునితనూజులు సదముండును విదముండును దముం
డును నని యెడువారలు. 430

శా. బాహాగర్వము సూపఁ గోరి పటుదర్పం బొప్ప నుగ్రాహవో
త్సాహం బూర్జితభంగి గా భయదఘోషస్ఫీతనానావిధ
వ్యూహంబుల్ ధరణీప్రకంపనము లై యుద్దామసర్వాంగస
న్నాహత్వంబునఁ బేర్చి తోడ నడవ న్సంరంభశుంభద్గతిన్. 431

ఉ. మంచిమగండ వై ననిను మార్కొనువారయి దాసివెట్టి యొ
క్కించుక శంక లేక ప్రజ యెల్లను బెగ్గిల ముట్టి యర్థముల్
గొంచు ధరిత్రి గైకొనుటకుం గన లగ్గల మొంది యాతనిం
బంచితి సైన్యయుక్తముగఁ బార్థివ యిట్లని పల్కెఁ దత్తతిన్. 432

మ. పసగన్ వే చని దోర్బలంబున రణప్రావీణ్యముం జూపి నీ
వసురానీకముఁ ద్రుంచి భూప్రజలకున్ హర్షంబు గావించి రా
కసుమీఁ రాక జయంబు లేక ప్రజ దుఃఖం బొందఁగా రాక నీ
యసువర్గంబులపోక గా నెఱుఁగు పెక్కాడంగ నిం కేటికిన్. 433

మహాస్రగ్ధర. అనినన్ సంగ్రామకేళీవ్యసనరసికుఁ డై యట్ల కాకంచు నిన్ వీ
డ్కొని యాతం డేఁగి తా నప్డు దనుజతతియాటోపమున్ గూఢచారుం
డనుదృష్టిం జూచి తా నిట్లను మనమున సైన్యంబుచే శూల శత్రుం
గొన నీ నేలా పురారిం గొలుతు నతనికిం [1]గోసి యిత్తున్ శిరంబున్. 434

మ. అని నిశ్చాయకుఁ డై రణం బుడిగి సైన్యం బంతయుం గ్రమ్మఱం
జనఁగాఁ జేసి పరేతభూమికి దృఢోత్సాహంబునం బోయి శం
భునిఁ జిత్తంబున నిల్పి వాలును గళంబుం గూర్చినన్ సత్కృపా
ఘనుఁ డద్దేవుఁడు ముందటన్ నిలిచి ఖడ్గంబుం దొలంగించుచున్. 435

మ. చనునే సాహస మిట్లు సేయ నిది కర్జంబే కతం బేమి యి
ప్పనికన్నం గని చక్కఁ జాఁగి ధరయున్ ఫాలంబునుం బొంద వం
దనముం జేసి యితండు నీపలుకులున్ దైతేయులం దాఁక నో
ల్లనివాఁ డైన తెఱంగుఁ జెప్పె శివునుల్లం బార్ద్రితం బొందఁగన్. 436

ఉ. ఆపరమేశ్వరుం డితని కప్పుడు దివ్యరథోత్తమంబునుం
జాపము నస్త్రకోటియుఁ బ్రసన్నత నిచ్చి రణంబునందు నీ
యేపున కోర్వ దేవతల కేనియు దైత్యుల కేని రాదు పొ
మ్మేపగఱని గెల్వుము మహిం జరణం బిడకుండు మాజిలోన్. 437

మ. అని వీడ్కొల్పిన నీతఁ డుబ్బు మదిఁ బొంగారంగఁ దేరెక్కి వే
చని దైత్యధ్వజినీప్రతాపమహిమోత్సాహంబులం జీరికిం
గొన కుగ్రోద్ధతిఁ దాఁకి పీనుఁగులపెంగుప్పల్ గొనం జేసె న
[2]య్యనిఁ బైఁ ద్రోచిన నిద్దఱం దునిమె దైత్యాధీశులన్ ద్రెళ్లిడిన్. 438

వ. ఇవ్విధంబున సదముండును దముండునుం బడినం గని కోపోద్దీపితుం డై. 439

స్రగ్ధర. వీరోదారోగ్రలీలన్ విదముఁడు సమరోర్విన్ బలోల్లాస మొప్పం
జేరెన్ బాహాసముల్లాసితఘనరుచిరాసిప్రభాభాసురుం డై
యారక్షోనాథుపైఁ బేరలుగ మఱపుఁ జేయంగ నీతండు డిగ్గం
దే రుద్యత్ఖడ్గదీప్తుల్ దెసల నిగుడ దైతేయవీరుల్ చలింపన్. 440

వ. ఇట్లు విధాతృవశంబునఁ బాదచారి యై. 441

మ. దనుజుం దాఁకి కృపాణఖేలనము చిత్రం బై వెలుం గొందఁ ద
త్తనుసంఛేదనకేలి సల్ప నతఁడుం దన్నుం బటుప్రస్ఫుర

1. క. గోరి. 2. చ. య్యని పైఁ దోఁచినయిద్ధఱం.

ధ్వజకౌక్షేయకధారఁ జేరఁబడియెం గదా నాతని, గూల్చెఁ న
క్యానదైత్యావలి విచ్చె నల్లడఁ బరికీర్ణోద్యమత్వంబునన్. 442

వ. ఇట్లు నిశ్శేషంబుగాఁ బరపీడలం బరిమార్చిన నిరాజ్యంబు పూజ్యంబై వెలసె భూప్రజయుం బ్రమోదంబు నొందె నిత్తెఱంగున నీసుదేవుండు సుకృతవంతుండై యింతటిపదంబున కర్హుం డయ్యె నేయజ్ఞంబులును సంగ్రామయజ్ఞంబునకు సదృశంబులు గావు వినుము వీరమస్తకరాశి వేదికగాఁ గృపాణబాణాదిసాధనంబులు సమిత్స్రుక్స్రువంబులుగా శోణితం బాజ్యంబుగా మాంసంబు పురోడాశంబుగా వీరవ్రతదీక్షితుండు సమరాధ్వరంబు సలిపి రుధిరపూరయు నస్తిమజ్జకర్దమయుఁ గేశశైవాలయు [1]నాంత్రఫేనయు ఛత్రమండూకయు హేతిమీనయు గజకళేబరపులినయు [2]నగుసమరపుణ్యనదినవభృథస్నానంబు సేసి మఱియులోకంబున సుశ్లోకుండై నిత్యస్థితి నత్యుదాత్తపదవిం బ్రవర్తిల్లుఁ బుణ్యాత్ముం డగుటకుం దనువు దొఱంగ వలయు నని లేదు తెగువతోడియనివర్తనగతియ చాలు నిట్టి రణాచరణప్రభావం బెనును బ్రబలదైతేయవ్రాతశాసనసుకృతంబునం గాదె యీదేవేంద్రత్వంబు నొందితి నని పలికిన నంబరీషుండు సమరశూరులసమధికపుణ్యత్వంబు దెలిసి సంభావించె నని చెప్పి దేవవ్రతుండు వెండియు. 443

సమరానివర్తనంబువలనిఫలము.

క. జనకుఁడు ప్రతర్దనునకుం, దనకును రణమైనయపుడు తనయోధులకున్
విను నాకంబును నరకముఁ, గనుఁగొనుఁ డని చూపి చెప్పెఁ గౌరవముఖ్యా.

తే. పుణ్యతమము భోగాస్పదంబును మనోహ
రాంగనాజనబహుళంబు నైనయది ర
ణంబు బిరుసులై చేసిననరులనెలవు
దూరఁబందలచోటిది దుఃఖమయము. 445

వ. అని తనమాహాత్మ్యంబునం జూప నోపినయుభయస్థలంబునుం జూపం జూచి మెచ్చి యవ్వీరులు దెంపు సొంపిరివోవం దఱియ నుఱికి వైరుల జయించిరి సమరంబు తెగువ దీప్తలక్ష్మిం గరం బొనర్చుఁ బుణ్యతమలోకంబు లిచ్చుం గావున శూరుం డధికపుణ్యోదారుం డని యిట్లు దేవవ్రతుండు ధర్మసూనునకు సమరానివర్తనజనవిశేషం బెఱింగించె నని చెప్పిన విని యటమీఁద వారలసంప్రశ్నోత్తరంబులు ప్రవర్తిల్లినవిధంబులు వినిపింపు మనుటయు. 446

మ. పరమాయుఃపరమార్థసిద్ధిపరమప్రావీణ్యసంపాదనా
దరసంభావితభక్తలోక నిగమాంతస్ఫీతహర్మ్యాగ్రసం
చరణప్రౌఢమయూర చిత్రమహిమా సర్వాత్మవిజ్ఞానసం
పరిపాకప్రకటాకృతీ శమదమోద్యద్భావాహితస్వీకృతీ. 447

1. క. నాతపత్రఫేనయు. 2. చ. నగుపుణ్యనది. 3. అ. దురముపందల.

క. యమనియమాద్యష్టాంగ, క్రమాభ్యసననిర్మథితవికారసుచేతః
కమలామోదమయాత్మా, [1]సమతారాహిత్యశస్యః సర్వ[2]నమస్యా. 448

మాలిని. సమధికనిరవద్యైః స్వైరనిత్యప్రభుత్వా
విమలమహిమహేలావిర్భవత్సర్వసత్త్వా
నమదమలినచిత్తైర్నిత్యదీవ్యన్మహత్త్వా
దమమహితతపస్సద్భావసంవేద్యతత్త్వా. 449

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందు ద్వితీయాశ్వాసము. 450



1. చ. సమానరాహిత్య. 2. క. సమస్యా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శాంతిపర్వము, తృతీయాశ్వాసము.





శ్రీధుర్యకరణ సమ్య
గ్బోధాత్మవిహరణ దివిజపూజ్యచరణ సా
రాధకభరణ [1]నిరాధి
వ్యాధికరణ సౌమ్యకిరణ హరిహరనాథా. 1

కాలనిరూపణాద్యుపాయంబుల ప్రకారము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు శూరులు పుణ్యాత్మపురుషు లని విని కుంతీనందనాగ్రజుండు గంగానందనుతోఁ గాలనిరూపణాద్యుపాయంబు లెఱింగింపు మనుటయు నతండు భరితాదరుం డై. 2

సీ. వానయు సీతును౯ వర్జించి మంచు వే, సవి గాక మున్న సస్యములపంట
లొదవెడుతఱి నెత్తనది శత్రుపయిఁ బూరి, గట్టియల్ నీళ్లులుఁ గలుగు తెరువు
గాఁ జూచి నడచుట గర్జంబు సిడములుఁ, గంకటంబులును బక్కలును విండ్లు
మొద లగునాయుధంబులు రథ గజ హయం, బులసవరణలు నపూర్వభంగి

తే. నొప్పి యరిభీకరంబులై యుండవలయు, శంఖకాహళపటహనిస్స్వాణముఖము
లైనతూర్యముల్ మంచివియైన లెస్స, యధిప విడిదల సమతల మగుట మేలు.

క. చరులఁ బనిచి యరుల తెఱం, గరయుచు వా రెదురు నడచునట్టి దయిన దె
ప్పరవుం దెరువున డప్పిం, బొరసినయెడ విడియుచోటఁ బొడుచు టురవగున్. 4

ఆ. నిదుర వోవుచోట నీరు దవ్వై వడఁ, బడినయెడను [2]గూడు దడసి [3]సొలసి
నపుడుఁ జెదరి యున్నయవసరమునఁ బగ, వారిఁ బొడిచి చెఱుపవలయు నధిప.

సీ. చెట్టును డాయును మిట్టయుఁ బల్లంబుఁ, గలిగినచోటు గాల్బలము నేల
వినుము నీళ్లును రొంపియును లేక సమవిశా, లము నైనచోటు గుఱ్ఱముల నేల
కమ్మి క్రుంగక [4]గదుగదుప రొంపులు గలు, గమి నొప్పుచోటు రథముల నేల
యెడ నెడ మ్రాకులు మడువులుఁ గలచోటు, కురునాథ యెఱుఁగుము కరుల నేల

1. ఖ. నరాధి, వ్యాధిహరణ. 2. క. జాలి. 3. గ. యలసి; చ. పొలసి. 4. క. గ. చ. గద♦గదప; అ. కడ♦కడవ.

ఆ. యేబలంబు దనకు నెక్కుడు గలిగె న, బ్బలమునేల పోరుగలను గాఁగ
నినుఁడు సీతు గాలి వెనుకగా మొన నడ, పించి పొడువ సంభవించు జయము.

చ. పలకలవార లగ్రమునఁ బన్నఁగ విండులవారి ఘోటకం
బులఁ గరులన్ రథంబులను భూవర వెన్వెనుకం గ్రమంబునన్
నిలిపినఁ గూడి నిల్చినయనీకమునం గడుమంచియోధులం
గలయఁగ నెందు నయ్యయిప్రకారమువారల నిల్పఁ బల్పుగున్. 7

ఆ. బంటు లుత్సహించి పగఱ పోయిరి పోయి, రంచుఁ గడఁగి బొబ్బలార్పు లెసఁగ
నతిరయమున నడరునట్లుగ దొర సము, ద్ధతి యొనర్ప వలయు దాఁకుదలల. 8

వ. అనుటయుఁ గౌంతేయాగ్రజుండు శాంతనవునితోఁ బం క్తెట్టివారు గావలయు నని
యడిగిన నతం డి ట్లనియె. 9

తే. ఏనుఁ గేనుంగుఁ బేర్చినసైసక మొసఁగు, నంగములసొంపుఁ బులికిని సింగమునకు
వట్టినట్టియుగ్రతయును గట్టి మెఱయ, వలనుఁ గలయోధవీరులు వలయు ననికి.

వ. దేశవిశేషంబు లాకర్ణింపుము గాంధారసింధుసౌవీరులు కఠారంబుల సబళంబులం
బరిశ్రమంబు గలిగి బలశౌర్యసమగ్రులై సర్వసమరంబులకుఁ జాలి యుండుదు
రౌశీనరు లెల్లకైదువులకు నేర్చి సత్త్వవంతులై యుండుదురు ప్రాచ్యు లేనిక
కయ్యంబునకు నేర్తురు కపటయోధులై యుండుదురు యవనులుఁ గాంభోజులు
ను మథురచుట్లదేశంబులవారును గుజ్జుపుబవరంబులకు నలవడి యుండుదురు
ఘూర్జరులు బ్రద్దపరుల నడిదంబులం బరిణతులై యుండుదురు మాళవులు
రథంబులు మొదలైనచతురంగబలంబులసంగరంబులం జతురులై యొక్కఁడో
క్కండ పెక్కండ్రకైన నోర్చి యుండుదురు గొందఱు కొందఱ నిర్దేశించితి మఱి
యు ననేకదేశంబులవారు వివిధప్రకారంబుల నుండుదు రయ్యై తెఱంగు లెఱింగి
పెసంగించి జయంబు గొనునది యనిన ధర్మనందనుండు జయించుసైన్యంబులం
దోఁచులక్షణంబులు విన వలతు ననవుడు భీష్ముఁ డతని కి ట్లనియె. 11

ధర్మజునకు భీష్ముఁడు శకునావశకునములు దెలుపుట.

క. సైనికులమనము లుత్సా, హానూనము లగుచు నుండు హయఘోషణముల్
వీనులకును సొగియించు గ, జానీకము లుబ్బు విజయ మగుసైన్యమునన్. 12

క. మృగములుఁ బక్షులు ననులో, మగతిం జరియించు వెనుక మందానిలుఁ డిం
పుగ వచ్చి మెలఁగుఁ గడుమే, లగుమాటలు వాడము గెలుచునట్టిబలమునన్.

క. వెలలునెడఁ దెలివితో న, గ్నులు వలపల సుడియు శిఖలఁ గోమ రగుఁ దూర్యం
బులు గంభీరధ్వనులుం, జెలఁగును జయము గొనునట్టిసేనఁ గుమారా. 14

క. అని చెప్పి మఱియు నతఁ డి, ట్లను ముట్టినపగఱసొంపు నడఁచుట యొప్పన్
విను కయ్యమునకుఁ గాల్ద్రి, వ్వినఁ బాటెలు దురిత మెట్టివిభునకు నైనన్. 15

క. చెఱువునడు మవిసినను బెను, వెఱమెకములు సెదరినను వివేకనిధీ యు

క్కుఱి బహుళసైన్యమఱిముఱిఁ, బఱచిన నాఁగంగ రాదు పఱియుర కైనన్.
క. విను కొండ లైనఁ గుఱుచ లౌ,నను మాకొన్ని కడిమి నేర్పు నొంగి యుడిగినన్
మొన యెంత యైన విఱుగుఁ, జనునే కయ్యంబు [1]పొందుప శక్తుల కైనన్. 17
క. క్షమ మే లగు నైన నత్రి,క్షమ దైన్యముఁ దెచ్చు నదుకు గర్వించినఁ గ
య్యము పొడిచి గెలిచి యరిశే,షము నెడ సదయక్షమావిశేషం జగు నొప్పన్.

రాజు పగఱయెడ నుండవలయువిధము.

వ. అనిన నప్పాండవోత్తముండు పుడమిఱేఁడు పగఱయెడ నెట్టివాఁడు గావలయు ననవుడు నాభాగపతిత్తో భీష్ముండు బృహస్పతి దివస్పతి కెఱిఁగించినతెఱంగు నుపదేశించెద నని యిట్లనియె. 19

చ. విను మఱిఁ జంపనుం జెఱుప నేచుట లెస్స ప్రతాపభావముం
బున వెడ నుల్లికుట్టులను బొంకుల వానిఁ గలంగఁజేసి నేఁ
చినఁ దనపూఁవు దప్పు నఱ సేయనిచందము నమ్మి యున్నచా
ప్పును మెఱయంగఁ బల్కుచుఁ గరకున్ మది నమ్మక యుండఁగాఁ దగున్. 20
చ. అరిపయి వీఁక నెత్తి చనునప్పుడుఁ దేనియ లుట్టునట్లుగా
నరపతి వానివారలు విరనం బ్రియ మాడుట మేలు పక్షిఁ దాఁ
దిరముగఁ [2]జేయఁగా మృగముల్ తేఁకువ వాపను వేఁటగాఁడు త
త్స్వరములు నూపి కాదె తుదిఁ జంపఁ దెగుఁ దనబారిఁ బాఱినన్. 21
ఉ. వేమఱు శత్రునిం బరిభవించుట రిత్తకు రిత్తవైరముం
దా మదిఁ బెట్టికోలు సుఖతంత్రము గాదు సుసంధికాలమున్
సీమ దగంగ [3]రూపడఁగఁ జేయుటయున్ వల దగ్గ మైన వాఁ
డేమెయి [4]నైన వధ్యుఁ డనునిట్టి వినిశ్చయ మాత్మఁ [5]గల్గుటన్. 22
క. కాలవిపర్యయమున నర,పాలుఁడు దా మొక్క యైనఁ బగతుఁ గలసి త
చ్ఛీల మెఱిఁగి తఱి యైనం,గాలునిపురి కనుచునది సుకరముగ వానిన్. 23
క. అనదతనంబును బెడిదపుఁ,దనమును లేకుండఁ బరఁగి దరి యొత్తెడునే
అనుబోలె నోత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురం గ్రమంబున నధిపా. 24
క. పెక్కండ్రతోడ నీరస, మొక్కటఱిన కొనక తఱిఁగి యున్నపగతుతో
ను క్కాడి బంధుభావముఁ, దక్కటిపగఱయెడ వలయుఁ దా నెఱపంగన్. 25

కాలకవృక్షీయమహాముని క్షేమదర్శికిఁ జెప్పినహితవాక్యములు.

వ. అనిన శంతనుపుత్త్రుతో నజాతశత్రుండు నిజపరివారదోషంబున నైనను బరులచేత నేనియు సంపద సెడుట నాపదం బొరసినధరణీశుండు నెవ్వగ నెవ్విధంబునం బాపికొను నెఱింగింపు మనుటయుఁ దొల్లి కోసలపతి యైన క్షేమదర్శి విదేహపతి

---

1. క. నొడు పశక్తుల కైనన్. 2. గ. జేరఁగా. 3. క. రూపిడక; గ. రూపికడ; చ. రూపడక. 4. క. నేన-నైన-వధ్యుఁ డగు; చ. నైన వంధ్యుఁ డగు. 5. ఖ. గల్గినన్.

చేత భూమి గోల్పోయి వగం బొంది మున్ను దనకు మంత్రి యై యుండి తాను
రాజ్యంబు సేయుచుండం బరమశాంతి నొంది వనంబునకుం జనినకాలకవృక్షీయు
నాశ్రయించి యిట్లు యడిగిన నమ్మనుజపతికి నమ్మునిపతి సెప్పినవాక్యంబులు
సెప్పెద విను మని యక్కురుపితామహుం డి ట్లనియె. 26

తే. అర్థవంతుఁ డై భోగంబు లనుభవించు, చున్న యప్పుడ యిది యిట్టు లుండ నేర
దస్థిరమ తాను లోనుగా నని యెఱుంగు, నతఁడు వగఁ బొందఁ డేది యెట్లైన నధిప.

క. కానియటు లుండి [1]నెఱిఁబడు, నైన తెఱఁగు దోఁచి మాయ మగు నిబ్భంగిన్
మానసమున కుబ్బు వగయుఁ, దేనోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటన్. 28

క. జననీజనకులును సుహృ, జ్జనులును దెగునపుడు గావఁ జనమి దెలియ దే
ధనములు వారలకంటెనె, మనుజేశ్వర వగపు వాని మగిడించునొకో. 29

క. గతమునకును వగవ కనా, గతమునకును నోరు దెఱచి కడుఁ గోరక దీ
నతఁ బొందక దైవం బే, గతిఁ బుచ్చిన దానఁ బోదుఁగా కనవలయున్. 30

క. వెరవును లావును గలిగిన, పురుషులు లే రెట్లు లోకమున నెవ్వారికిన్
సిరి శాశ్వతంబె యని వగఁ, బొరయఁడు ధీరుండు కలిమిపోకకు నధిపా. 31

క. సారపు[2]సిరి చేటు నరుఁడు, [3]గోరకయే వచ్చునట్లు కోరక యుండన్
శ్రీ రాక గలుగు దైవము, కారుణ్యము గలిగెనేని గాఢవివేకా. 32

క. సిరి విడుచును బురుషుని విను, పురుషుఁడు సిరిఁ దొరఁగు నివియ పూర్వమె ఫలమూ
లరతుం డై వాఙ్నియతిం, బొరసి యునికి యట్టిచోటఁ బురుషున కమరున్. 33

క. కలఁగిన పెద్దమడువు విను, తెలివిఁ బొరయు నెట్లు దా నధీరుం డట్ల
గ్గలము లయిన దురితంబులఁ, గలఁగియుఁ దనయంతఁ దేఱు గౌరవ మొప్పన్.

వ. అని చెప్పి యిది యుపశమనప్రకారంబు నీతి యెఱింగించెద నాకర్ణింపు మనుట
యు నమ్మునివరుతో నమ్మనుజవరుండు మహాత్మా నిన్నుఁ జేరి యేను దురితంబులం
దొలంగ వలదె యాన తి మ్మనిన నతం డతని కి ట్లనియె. 35

సీ. తద్దయు శాంతుఁ డై తక్కువ కోర్చి, శత్రునిఁ గని యొడఁగూడి మనఁగవలయుఁ
[4]మన్నె రాజులభూమి మర్దించి సైన్యము, ల్లిన కూర్చి వైరిపైఁ జనఁగవలయుఁ
ప్రబలునిఁ జేరి యారాధించి యాతని, సేన తోడుగ నరిఁ జెఱుపవలయు
విషమున మాంత్రికవిధిఁ బంపుపోటున, నలయక రిపుఁ దెగటార్పవలయుఁ

తే. బొంచి భేదం బొనర్చి కలంచి యేని, నంగనలఁ గొని వారిమాయలఁ దగిల్చి
యైన మఱియును బహువిధోపాయములను, దెగువడింపక పగతు సాధింపవలయు.

వ. అని చెప్పె నని చెప్పి గాంగేయుండు వెండియుం జెప్ప నాకౌసల్యుం డధర్మో
పాయవిధాయకంబు లగునుపాయంబులకుం జొరం జాల ననిన నమ్ముని తద్విరోధి

1. చ. నెఱినగు. 2. గ. సిరి చెడు నరుఁడుం. 3. క. చ. జ. గోరిన నే వచ్చు. 4. గ. సవ్యరాజులభూమి ♦ నర్దించి.

యగు విదేహవిభు రావించి యేకాంతంబున నాక్షేమదర్శిం జూపి యీ వత్సుని రాజ్యంబు గొనియున్నవాఁడ వన్నరపతి యొండుమైఁ గార్యంబు పూచుట యొప్పదు సంధి సేయు మని వెరవుకలిమి నొడంబఱిచి యిరువురకును సంధి యొనర్చి నెయ్యంబు వాటించి వీడుకొల్పినఁ గోసల్యుం డొక్కొని చని యతనికిఁ దనకూఁతు నిచ్చి కరితురగాదివివిధపదార్థంబు లొసంగె విదేహజనవల్లభుండవ్వసుమతీవల్లభుని నిజపురంబునఁ గవిచిపుచ్చె రాజులకు జయాపజయంబు లనుభావ్యంబులు మదవిషాదంబు లనాదరణీయంబు లనవుడు ధర్మనందనుండు పరిజనంబుల యందు గణంబులై యున్నవారిఁ బరిపాలించుసమ్యక్ప్రకారంబు సెప్పు మనుటయు నమ్మహీకాంతునకు శాంతనవుం డి ట్లనియె. 37

ధర్మరాజునకు భీష్ముండు గణజనులం బాలించు ప్రకారంబు సెప్పుట.

క. విను మర్థార్జకులును గార్యనిపుణమానవులు నాయుధాజీవులుఁ ద
క్కనుగలపనులజనులుఁ గల, రనఘా యొక్కొండ్లవార లై నజనంబుల్. 38

క. వారు గదా గణములు పతి, వారలలోఁ గలసి మెలఁగునవడువున నయ్యై
వారి తెఱఁ గెఱుఁగ వలయును, వారికి నెమ్మి గలిగించునవల నొదవుటకున్. 39

సీ. కుల మొక్కఁడైనఁ దేఁకువ లేక బుద్ధియు, శౌర్యంబుఁ జెంపును సరకుగొనక
యెట్టివారలతోడ నెవ్వరైనను మత్సరంబు గల్గుమరు గణంబుజనులు
దాన నంతర్భేద మైన శత్రులు వాపి, కొంద్రు గొండఱ నది గ్రొచ్చు రాజ్య
మూలంబుఁ గావున మున్ను భూపాలుండు, వారి నందఱఁ దగునవచనరచన

తే. నీగి మన్ననఁ గలఁగంగనీక పొదివి
యధికముగ గణముఖ్యుల నాదరించి
పనులు గొనునది తమలోనఁ బాయ కుండఁ
[1]బ్రోవు లెడలిన రాజ్యంబు పొలుపు దప్పు. 40

క. ఏకకార్యములను గణజను, లొక్కటి యై మెలఁగుచున్న నుర్వీశునకున్
మిక్కిలి సిరి యగుఁ గావునఁ, [2]దక్కొనియనయంగవలయుఁ దగ గణవిధముల్.

ధర్మజునకు భీష్ముండు ధర్మసూక్ష్మతెఱం గెఱింగించుట.

వ. అనుటయు ధర్మజుండు ధర్మంబులు బహు[3]శాఖలం గలిగి యుండు నన్నియు ననుష్ఠింప వచ్చునే యెయ్యది యాచరించి పురుషుం డైహికాముష్మికసుఖంబులం బొందు ననిన మందాకినీనందనుం డతని కి ట్లనియె. 42

సీ. విను తల్లియును దండ్రియును గురుండును సేవ, నీయులు సద్భక్తి నిత్యనిరతి
వారలఁ గొలుచుచు వా రెద్ది సెప్పిన, నది యాచరించుట యధికధర్మ
మాగమత్రయమును నగ్నిత్రయంబు లోకత్రయంబును దేవతాత్రయంబు
ననువస్తువులు వారలందును జనని గౌరవమున నెక్కుడు రాజవర్య

1. క. బ్రోలు వెడలిన. 2. గ. దక్కక. 3. జ. ముఖంబులు.

తే. యీ జగంబునదివమునం బూజవడయు, మాతృభక్తుండు పితృభక్తి మానసుండు
నట్ల యవ్యయానందసంప్రాపణంబు, గురుపదాబ్జసమారాధకుండుఁ గాంచు. 43

వ. అనవుడు నజాతశత్రుండు గంగాపుత్రునితో సత్యానృతంబులు జగంబులం బరఁగి యుండుఁ బురుషుండు వానియెడ నెబ్భంగివాఁడై ధర్మపరుం డగు నని యడిగిన నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె. 44

సీ. సత్యంబు వలుకుట సర్వధర్మములకు, మిక్కిలి యనృతంబు మేటిపాత
కము తద్విశేషంబు గలదు చెప్పెద నోరు, నర్థంబుఁ బ్రాణంబు నపహరింపఁ
జూచుపాతకులతో సూనృతం బాడుట, పాపంబు బొంకులు పలికి యట్టి
వారి హింసించుట వరధర్మ మిది యొక్కఁ, డేల భూతములకు హితము సేయు

తే. బొంకు లెల్లను ధర్మముల్ భూతబాధ
కంబు లగునిక్కములు పాతకములు వినుము
భూతముల దుష్టశిష్టత్వములు వివేక
సూక్ష్మతావేద్యములు వానిఁ జూడవలయు. 45

## పాపనిస్తరణప్రకారము.

వ. అనినం గౌంతేయాగ్రజుం డెట్టివారు దురితంబులు నిస్తరింప నేర్తు రని యడిగిన సురనదీసూనుం డిట్లనియె. 46

సీ. వర్ణాశ్రమాచారవంతులు నవిషయాసక్తులుఁ బ్రతికారశక్తు లయ్యుఁ
[1]దిట్టులు వడి సైఁచు ధీరు లుదారులు, నతిథిపూజకులు నధ్యయనరతులు
నగ్నిహోత్రపరులు నాజిఁ బిఱిందికి, నడుగు వెట్టక తెగి నడచువారు
సత్యవాదులు సాధుజనపోషకులు సర్వ, దేవతాసములు నై భావ మెందు

తే. నిలిచె నమ్మూర్తి భక్తిమైఁ గొలుచువారు, దురితదుర్గముల్ నిస్తరింతురు పురాణ
పురుషుఁ డవిచింత్యుఁ డచలుండు పుండరీక, లోచనుండు సద్భక్తులఁ గాచు నధిప.

క. విను మగ్గోవిందుఁడు సఖుఁ, డును బంధుఁడుఁ గార్యకర్తుఁడు నై నిన్నుం
గొనియాడుచుండ దురితం, బను పేరును గలదె నీకు ననఘచరిత్రా. 48

ఆ. ఇంద్రుఁ డజుఁడు విష్ణుఁ డెవ్వాని వైదిక, స్తోత్రములఁ బ్రసాదితునిఁగఁ జేసి
యెలమిఁ గొలుతు రమ్మహేశ్వరుఁ గొలుచువా, [2]రెందు నెపుడుఁ గీడు నొందరధిప.

క. విను మివ్వాక్యము లెవ్వఁడు, గొనియాడుఁ బఠించు విప్రకోటికిఁ జెప్పుం
జననాథ వాఁడు దురితం, బనుదుర్గము నిస్తరించు నక్లేశమునన్. 50

వ. అనిన విని ధర్మనందనుండు. 51

## వ్యాఘ్రగోమాయుసంవాదము.

క. సౌమ్యు లసౌమ్యులభంగి న, సౌమ్యులు సౌమ్యులవిధమున జనవర చిత్తా
గమ్యతఁ దోఁతురు వారిని, సమ్యఙ్నిశ్చయతఁ గాంచు చందము సెపుమా. 52

1. క. దిట్టాటవడి. 2. గ. రెందు నిందు.

వ. అనుటయు నాపగాతనయుం డేతత్ప్రయోజనం బైనవ్యాఘ్రగోమాయుసంవాదం
బనునితిహాసంబు గల దాకర్ణింపు మని యి ట్లనియె. 53

ఆ. పురిక యనంగఁ బరఁగుపురిఁ బౌరికుం డను, నృపతి క్రూరకర్మనిష్ఠఁ బరఁగు
నవ్విభుండు సచ్చి యధిప గోమాయు వై, పుట్టెఁ బుట్టినాంగకబుద్ధితోడ.

వ. ఇబ్భంగిం బుట్టినయానక్క మహితవ్రతశీలం బయి మాంసంబు దినక హింససే
యక వనంబునం బతితఫలంబులుఁ బత్త్రంబులు నాహారంబులుగా వర్తింపు
చుండఁ గోడినక్క లిది యేటివ్రతంబు మాంసం బేము దెచ్చి యిచ్చెద ముప
యోగించి సుఖివై యుండు మని ప్రార్థించిన నమ్మెయికిం బోక కృపానిష్ఠుండయుం
బై యుండె నంత నొక్కనాఁడు మృగంబుల కెల్ల ముఖ్యం బైనశార్దూలం బత్తె
ఱం గెఱింగి వచ్చి యగ్గోమాయువుతో ని ట్లనియె. 55

క. విను సౌమ్యుఁడ వని యెఱిఁగితి, ననఘా నను జెంది నిలిచి యతులసుఖము లం
దిన మేలు నన్నుఁ గూర్తుం, డను లోకం బిదియు నుడుపనగు నెఱిఁగిన్. 56

వ. నాతోడిబాంధవంబు సేయు మనిన నగ్గోమాయు వి ట్లనియె. 57

క. నీ వాశ్రయణీయుండవు, గావే విను భోగపరము గాకున్నది మ
ద్భావం బటు గావున నా, కీవచనము లింపు సేయ విద్ధగుణాఢ్యా. 58

వ. అది య ట్లుండ భోగంబులు గా కున్న నేమి నీకుం గార్యాకార్యంబులు నా యె
ఱింగినతెఱంగున నుపదేశించుచు మైత్త్రి పాటించి యునికి గర్తవ్యం బై భవ
దీయమూలభృత్యు లసూయ సేసి భేదింతురు దాన నొప్పమి వచ్చు నీవు వారలు
గలంచినఁ గలంగ కుండుటకును నాబుద్ధి పాటించుటకును సమయంబు సేసి
నన్ను మన్నించికొని యుండు మ ట్లైన నీకడ వర్తించి యుండెద ననుటయు
నావ్యాఘ్రం బాభంగి నడపం గలయది యై. 59

ఆ. సంతసంబుతోడ సమయంబు సేసిన, నెలమిఁ బొంది నక్క పులికి బుద్ధి
సెప్పికొనుచుఁ దగ వసించెఁ దదీయని, కేతనమునఁ బులియుఁ బ్రీతి సలిపె.

వ. కొండొకకాలంబునకు నమ్మృగరాజు మన్నించువిధంబును నగ్గోమాయువు దదీయ
హితాహితంబు లరసి బుద్ధిసాచివ్యంబు సేయుతెఱంగును జూచి చూపోపక
యప్పులిమూలభృత్యులు దమలోనం గూడికొని యొక్కనాఁడు. 61

క. పులి నమలెడుమాంసము వెర, వలవడఁ దా మపహరించి యానక్కకు ని
మ్ముల నిల్వం గావించిన, నిలయంబున గొందిఁ బెట్టి నేర్పారంగన్. 62

వ. ఉన్నంత భక్ష్యపదార్థపరిరక్షణంబును దాన చేయునది గావున నగ్గోమాయు
వప్పనికిం జొచ్చి మాంసంబు గానక యెవ్వరేని ముచ్చిలి కొనుటగా నెఱింగి
నది యై శార్దూలంబున కెఱింగించిన నాముచ్చిమి యప్పులి యరయం దొడం
గిన నెప్పటికపటభృత్యులు గపటోపాయంబు వన్ని. 63

క. నెమకుపరివార మమ్మాం, సము గను తెఱఁగును ఘటింప శార్దూలముచి

త్తము నక్కవలన విరసత్వము నొందిన నెఱిఁగి భృత్యతతి యిట్లనియెన్. 64

ఆ. నక్క కేటివ్రతము స్రుక్కక యిమ్మాంస, మపహరించినపుడ యబ్బె నేని
నేమి నైనఁ జేయు నిది పాపశీలంబు, గపటధర్మకంచుకంబు సువ్వె. 65

క. తా నటె మాంసముఁ దిన దటె, యీనక్కయు బేలుపెట్టె నిన్నాళ్లును నీ
యాన మఱుమాట వలుకం,గా నోడితి మిదియు నడపఁ గార్యములయెడన్.

క. అనుటయు మృగపతి మనమునఁ, [1]గన లడరిన నక్కఁ బట్టఁగాఁ బంచి వధిం
పను బుచ్చె దాని నంతయు, విని యప్పులితల్లి గరము వెసఁ జనుదెంచెన్. 67

వ. చనుదెంచి యావ్యాఘ్రవరునితో ని ట్లనియె. 68

క. [2]ఇట్టివి కృత్రిమములు గల, వట్టిదె యానక్క బేల వైతివి భృత్యుల్
పుట్టినకోలెను గుటిలత, లెట్టెట్టివి సేయ రకట యెఱుక గలఁగనే. 69

తే. బుద్ధిమంతునివలన దుర్బుద్ధు లధికు,వలన హీనులు రూపసివలనఁ జెనఁటి
వారసూయలు సేయుదు రీరసమున, నింత యెఱుఁగంగవలవదే యీవు గొముక.

క. ధర్మ మధర్మముభంగి న,ధర్మము ధర్మంబుమాడ్కిఁ దనయా తోఁచున్
నిర్మలమతి నరయ వలయు, ధార్మికతన కోరువాఁడు దన కేర్పడఁగన్. 71

క. విను మీగోమాయువు వచ్చినయంతటనుండి మనకుఁ జేసినహితముల్
గనికొన వలవదె యీతర,మునవాఁ డిటు సేయఁ డనుసరమూహయు వలదే.

క. హితుఁ డగుమంత్రిం గుటిలుల,యతికపటోపాయములకు నగపడి చెఱుపన్
మతిఁ దలఁతురె పతి సుపరీ,క్షితంబు గావింప కొకటి సేయం దగునే. 73

చ. అనవుడు నక్క రాఁ బనిచి యప్పులి కౌఁగిటఁ జేర్చి బాష్పము
ల్గనుఁగవఁ గ్రమ్మ నుంబలుకులం దగఁ బెద్దయు గారవించి స
న్వినుము మృగేంద్ర మున్నటుల నీవు సభన్ నను వీఁడు మంచివాఁ
డని కొనియాడి యిప్పు డెగటార్చితి పెంపును నాదుమానమున్. 74

వ. అని పలికి యగ్గోమాయువు వెండియు. 75

క. నను నీవు పదస్థునిఁగా, ననఘా చేయంగఁ దలఁచినప్పుడ నీభృ
త్యనికాయముకఱపులఁ బడ, కునికియు నాబుద్ధి వినుటయును మఱవమికిన్.

వ. బాస సేయవే యట్లుం గాక. 77

ఆ. ఎఱిఁగి నైన నెఱుఁగ కేనియు నొక్కని, భంగపెట్టి పిదప సంగతుఁడుగఁ
జేసికొనుట మేలె సిరి గలవారికి, నట్టినిలుపువాని కగునె హితము. 78

క. అని పాసి యరణ్యమునకుఁ, జని యనశనదీక్ష నొంది సద్భావఖ్యా
తి నెఱయఁ బరమస్థానం,బున కగ్గోమాయు వరిగెఁ బురుషవరేణ్యా. 79

వ. ఈకథ పూర్వాపరవాక్యంబులయందలితాత్పర్యంబు నిరూపించి. 80

క. వావిరిమాటలఁ దేలక, భావంబునఁ గీడు మేలుఁ బరికించి యన

1. క. గనలు గదిరి. 2. గ.ఇట్టియకృత్యంబులు.

ద్భావుని సద్భావుని నవసేవక [1]వేఱ్పఱుప నెఱుఁగ నేరఁగ వలయున్. 81

భీష్ముఁడు ధర్మరాజునకు సహాయసంపన్నత్వం బావశ్యకం బగుట చెప్పుట.

వ. అనిన విని సంతోషించి కౌంతేయాగ్రజుం డేమిభంగి వర్తనంబునఁ భూపాలుండు సుఖి నై యుండు ననుటయు నన్నరపతికిం గురుపితామహుం డిట్లనియె. 82

సీ. ఆలస్యమును ననహాయత్వమును బొప్ప, బవి లేనిపతి సుఖి నై చరించు
విను తొల్లి యొకయుష్ట్ర మహితతపశ్చర్య,మును సేయఁగ మెచ్చి బ్రహ్మ వచ్చి
యర్థించినది యేమి యనిన నాలో ట్టెను, గొప్ప నా మెడ శతయోజనప్ర
మాణం బగుట కోర్కి వానికి నాప్రభు, నట్లగుం గాక యని యతఁడు చనియె

తే. యదియు వరగర్వమున సహాయంబు నొల్ల
[2]కలనభావంబుతో నుండి వలచి యొక్క
నాఁడు దనయుష్ట్రు నాఁచి కాననములోన
[3]డీనుకొని మేయఁగాఁ జెనువాన వచ్చె. 83

క. వచ్చినఁ దనమెడ సాఁగిన,యచ్చటి గుహలోన నుత్తమాంగం బిడి తా
నిచ్చమెయి నిదురవోవఁగ, విచ్చలవిడి నొక్కనక్క వెలఁదియుఁ దానున్.

వ. అగుహ సొచ్చిం జొచ్చి యాఁకటిపెల్లున వాలుం దానును నొక్కట నాలో ట్టె
నుఁగుకుత్తుక కబళించి నెత్తురుం గండలు నొండొండ మ్రింగం దొడంగిన నది
మేలుకని మెడ [4]వొరల్చునంతకు నానక్కలు దిరంబులు త్రెవ్వం గఱచిన నెఱి
దప్పి యయ్యుష్ట్రంబు నిర్గతప్రాణం బయ్యె నట్టిచందంబు గాక నీవు నాలస్యరం
డవును సహాయసంపన్నుండవును నై నెగడు మనిన యజ్జగతీశుం డతనితో
శత్రుం డధికుం డైన నల్పబలుం డగురా జేయోజ నాపద నిస్తరించు ననవుడు
నతండు సముద్రసరిత్సంవాదం బాకర్ణింపుము దాన నీయడిగినయర్థంబు దేట
పడియెడు నని పలికి యిట్లనియె. 85

సముద్రసరిత్సంవాదము.

తే. ఉదధి సుఖగోష్ఠి నున్నఘనదులతోడ. మీతటంబులతరువులు మీరు పొంగి
తఱిమి పాఱినఁ గూలు వేతసము లేల, పెఱికిపోవవి మీ కేమిక్రియ మొనర్చె.

వ. వాని నున్మూలింప మీకు శక్యంబు గామిం జేసియో వానికిం జేటు వాటిల్ల దిది
యేమి యనవుడు గంగ యిట్లనియె. 87

క. బిగు వెడలక నిలిచి పడుక, నగములు వేతసచయంబు నమ్రం బై పె
ల్లగుమా వేగము గడపి యె, [5]సఁగుఁ బూర్వస్థితిన బ్రదుకు సమకూరంగన్.

వ. అనియె నా[6] ప్రబ్బలిచెట్ల తెఱంగు కనికొని. 89

ఆ. అరినృపాలుపెంపు నాత్మీయశక్తియు, నెఱఁగి మూర్ఖవృత్తి నెదురుపడక

1. చ. నీ వేర్పరింప నేరఁగ. 2. జ. గ. చలన...నుండు ♦ నొలసి. 3. గ. వంగికొని. 4. గ. మరల్చె. 5. ఖ. సగొనుఁ బురాస్థితిన. 6. క. గ. 'పలిచె-జ. పలిచ- చెట్ల.'

యుచితవృత్తి నతని | యుద్ధతి మేవడిఁ, గడపి హీనబలుఁడు | సెడక నిలుచు. 90

వ. అనిన విని యుధిష్ఠిరుండు దగుపదంబులకుఁ గులవంతు లగుపరిజనులు దొరకొనకున్న నరనాథుం డేమి సేయంగలవాఁ డనియడిగిన నప్పుడమితేనికి భీష్ముండిట్లనియె.

కుక్కురనిచత్వముం దెలుపునట్టియితిహాసము.

సీ. వినుమొక్కయితిహాస | మనుపమంబగుతపం, బునఁ బేర్చువాఁడొక్క | మునివరేణ్యు
నాశ్రమంబునఁ దద్ద | యావిశేషంబున, నఖిలజంతువులును | నచట నచట
వసియించి సుఖముండు | వానిలో నొక్కకు,క్కుర మెడ్డ భక్తిమైఁ | గొలిచితిరుగు
నమ్ముని మెలఁగిన | యచట నెల్లను దాను, వర్తింప నొకదువ్వ | వైర మెత్తి
తే. కఱవ వచ్చిన నమ్ముని | కడకుఁ బాఱు, దెంచె నాకుక్క నాతఁడు | దీప్తరూప
మైనదువ్వఁగాఁ జేసిన | నదిగడంగి, కవియ భయ మంది పాఱె ము | న్కవియుదువ్వ.
సీ. అట్లు బెబ్బులి వచ్చి | యడరిన బెబ్బులిఁ, గాఁ జేసి గెలిపించెఁ | గరుణ మెఱయ
నొకమత్తకరిఁ జూచి | యోటమై నొదిగిన, నుద్ధతకరిఁ జేసి | యొసఁగె జయము
సింహంబుదెస భీతిఁ | జెంది పార్తెంచిన, ఘనసింహముఁగఁ జేసి | గర్వ మిచ్చె
శరభంబుధాటికిఁ | జకిత మైన నుదగ్ర,శరభంబుఁ జేసి యు | త్సాహిఁ జేసె
తే. నిట్లు దివసక్రమంబున | నెక్కుడైన,సత్త్వముఁగఁ జేయఁగాఁ గుక్క | శరభభావ
మండితం బయి తిరుగుచు | నుండి పూర్వ,వాసనానీచ మగుమనో | వర్తనమున.

వ. ఇట్లని విచారించె. 94

చ. ననుఁ గని యొందుసత్త్వము మ | నంబున బెగ్గిలి పాఱునప్పు డీ
మ్మునివరుఁ డిట్లపోలెఁ గృప | మొక్కల మై శరభంబు గాఁగఁ జే
యునొ తగ దాని నట్లయిన | నుద్ధతి నాకుఁ జరింప లేదు గా
వున నితనిన్ వధింతు వెర | వున్ బలమున్ సరి నుల్ల సిల్లఁగన్. 95

తే. అనువిచారంబు దివ్యబో | ధాఢ్యుఁ డైన
యమ్మునీశ్వరుఁ డెఱిఁగి యీ | యధమజాతి
యున్నతస్థితి మెఱుఁగునే | మున్నపోలెఁ
గుక్క యయి యుండుఁ గా కన్నఁ | గుక్క యయ్యె. 96

వ. కావునం గులహీనులు మాననీయులు గా రట్లుం గాక విశేషం బాకర్ణింపుము. 97

చ. కుల మని పట్టి చిత్తమునఁ | గూరినకీ డరయంగ లేక య
గ్గలపువిభూతి దుష్టునకుఁ | గల్గఁగఁ జేయుట గర్జ మెట్లు భృ
త్యులమది యున్నరూ పరసి | యుత్తమమధ్యమహీనరూపమా
త్రలకుఁ దగంగ నయ్యయిప | దంబుల నిల్పుట నీతి భర్తకున్. 98

క. శౌర్యము సత్యంబును స,త్కార్యజ్ఞానమును భక్తి | తాత్పర్యము గాం
భీర్యముఁ గలిగినఁ గురుకుల,వర్య కులం బేల సిరికి | వాఁ డుక్తుఁ డగున్. 99

క. ఇది సిద్ధాంతం బన రా, దుదితయశా యెట్టు లైన | నున్నతవంశున్

విదితగుణుం డగుపురుషు న్వొడకే నిలుప వలయు నరాధిప యుదమునన్. 100

వ. అది యె ట్లంటేని. 101

ఉ. ఒక్కటి యేను జెప్పెద మహోగ్రపుఁ గేసరి కైనఁ దోఁచఁ గా
నుక్కును లావునుం గలుగు నుజ్జ్వలసత్త్వచయంబుఁ జెప్పఁ గా
నెక్కుడుకృత్యముల్ నడప నె ట్లగు నిట్టివి సాలు నంచుఁ దాఁ
గుక్కలఁ గూర్చి చేయఁ దనకుం దలఁపుల్ దలకూడ నేర్చునే. 102

చ. వలనుఁ గులంబు లేనిపరివారము గోటియు నేల నేర్చుఁ ద
గ్గలికయు [1]భక్తిపెంపు మదిఁ గల్గి సుహృజ్జనమిత్త్ర మాబలం
బిలువడి గల్గెనేని నిల యెల్లను నేలఁగ జాలు వేయు ర
జ్జులు విను రాజు నేర్పరియు శూరుఁడుఁ గా వలయుం జుమీ నృపా. 103

వ. అని చెప్పి వెండియు. 104

సీ. వినుము మయూరంబువిధమున బహుచిత్ర, భంగులఁ బ్రజయంతరంగ మాత్త
వశము సేయుచు మృదువాక్యముల్ వలుకుచు, మంత్రంబు నెడఁ దనమాట వెడల
కునికి శరత్సమయోచితక్రియచాడ్పు, గాఁగ ధర్మంబు శిఖాప్రకార
మొంది తనర్పు సముల్లాసిపక్షమై, యానంబు గైకొంచు నధికతరస

తే. మున్నతత్వంబు సంశ్రయయోగ్యమగుటఁ, గాంచుచును దజీవచ్చినఁ గారుగాల
మేఁచు తెఱఁగున నేఁచుచు నీచకుటిల, గతులఁ దునుముచు నెగడుట పతికి నీతి.

క. కిరణములభంగిఁ జతురపుఁ, బరిజనముల నెందుఁ జొనిపి పరకృత్యంబుల్
నిరతంబును గనుఁగొనుచును, దరణికరణి వెలుఁగు టొప్పు ధరణీశునకున్. 106

తే. అలుక గూరిమి ఫలదంబు లగుచు నుండఁ
గృత్యములఁ దా నెఱుంగుచు నిత్యవిధుల
నాయములును వ్యయంబులు నరసి కోశ
సంపదలు గాంచి యునికి రాజన్యగుణము. 107

వ. అనిన విని యుధిష్ఠిరుండు రాజులకు దండంబు [3]సర్వసాధారణంబు తదీయస్వరూ
పంబు విన వలతుం జెప్పు మనిన నన్నరదేవునకు దేవవ్రతుం డి ట్లనియె. 108

భీష్ముఁడు ధర్మజునకు దండనీతిప్రభావం బెఱింగించుట.

సీ. అసితోత్పలచ్ఛాయమై దంష్ట్రికాచతు, ష్టయమును భుజచతుష్టయము జిహ్వ
కలు రెండుఁ బాదాష్టకంబును శంకుకర్ణములును బహునయనములుఁ గల్గి
యూర్ధ్వరోమంబులు నుగ్రారుణాస్యంబుఁ, గపిలజటాజాలకంబు నొప్ప
నసి గదా శక్తి శరాసన ముసల చక్ర, ప్రాస శర తోమర త్రిశూల

తే. పరశుముఖసాధనంబులఁ బాపజనులఁ, దరతరంబ సంఛేదనతాడనాదు
లైనవివిధప్రహతుల నేపడఁచుచును జరించుదండంబు సుజనులు ప్రియమునొంద.

1. గ. నొప్పభక్తి. 2. క. వేయురాజులు-చ. వేయు నాజులు. 3. గ. సర్వసాధనంబు.

సీ. పరుఁ డసంగుండు ధర్మపాలుండు ధర్ముండు, విజయుండు శాస్త్రంబు విశసనుండు
గ్రహ మక్షరుఁడు ప్రజాగరము దురాసదుఁ, డసి సత్యగుండు నిత్యగుఁడు శాస్త
ప్రాగ్వచనుండు శస్త్రంబు ప్రహ్వము తీక్ష్ణ,వర్ముండు మనువు శివంకరుండు
కౌమారిసుతుఁడు శ్రీగర్భుండు వ్యవహార,తంత్రంబు సంగుప్తమంత్ర మనఁగఁ

తే. బరఁగుపేళుల నొప్పి యధ్వరమయాత్ముఁ, డై నవిష్ణుండు దండ మైయావహిల్లు
శ్రీ సరస్వతి యనునివి శిష్టదండ,నీతినామాంతరంబులు నృపవరేణ్య. 110

వ. ధర్మాధర్మంబులు సుఖదుఃఖంబులు నయానయంబులు నర్థానర్థంబులు బలాబలంబులుఁ బ్రమాదాప్రమాదంబులు మొదలైనసకలావస్థలును దండంబున సమ్యగసమ్యక్ప్రకారంబులం గలుగుం గావున సమ్యక్ప్రకారంబుచేత దండంబున రక్షింపంబడినప్రజ రాజు నభివృద్ధి నొందించు నట్లగుట దండంబు రాజునకుం బరాయణంబు. 111

క. సత్యప్రకారధర్మము, నిత్యానుష్ఠేయ మది సునీత మగుచు నా
దిత్యపతిఁ బ్రీతుఁ జేయఁగ, నత్యున్నతి నెసఁగు నాతఁ డన్నప్రదుఁ డై. 112

వ. దానంజేసి దండంబు ప్రసన్నం బై వెలుంగుఁ దదీయాభిధానంబులు మఱియును గల వాకర్ణింపుము. 113

ఆ. పురుషుఁ డీశ్వరుండు భూతాత్మకుండు జీ,వుండు ప్రాణుఁ డక్షయుండు సత్త్వ
మనఁగ నేడుపేరు లష్టమంబు ప్రజాప,తి యనఁ బరఁగు దండదేవుపేరు. 114

### వసుహోముఁడు మాంధాతృనకుఁ జెప్పినదండోత్పత్తిప్రకారము.

వ. దండంబు సాక్షాద్దేవుం డట్లగుటఁ దెలిపెడునది యొక్కయితిహాసంబు గల దంగదేశాధీశుండు వసుహోముం డనురాజు హిమశైలంబున ముంజపృష్ఠం బనం బ్రసిద్ధం బగుశృంగంబునకు దేవీసహితంబుగాఁ జని యందు వసియించి మునిగణపూజితం బగువృత్తంబున నుదాత్తుం డయి యుండు నమ్మహీపతికడకు మాంధాతృం డనుదెంచి సవినయంబుగాఁ బ్రణమిల్లిన నబ్భూవల్లభునకు నతం డర్ఘ్యపాద్యాదు లగునుపచారంబు లాచరించి వచ్చినపని యేమి యని యడిగిన నప్పుడమిఱేఁడు సవిస్తరంబుగా దండప్రకారంబు వినుటకై నిన్నాశ్రయింప వచ్చితి ననవుడు నమ్మహాత్ముం డతని కిట్లనియె. 115

సీ. అజుఁ డధ్వరంబు సేయంగఁ దలంచి ఋత్విజు నాత్మసదృశుని వెదకి యెందుఁ
గానక తా నొక్కగర్భంబు ధరియించి, వేయేండ్లకును దుమ్మి వెలువరించె
క్షుతసంభవతఁ జేసి క్షుతుఁ డనుపేరిటఁ, బరఁగెడునా ప్రజాపతియు ఋత్వి
జుండుగఁ గ్రతువొనర్చుచునుండ నంతర్హి,తం బయ్యె వలచుచందమున నడచు

ఆ. నట్టి దగుట దండ మధిప కార్యాకార్య,తంత్రభేద మెడలె దానఁ జేసి
మహి గలంగెఁ గడు నమర్యాద వర్తించెఁ, గమలజుండు విష్ణుకడకుఁ జనియె.

క. చని సంప్రార్థించి యతనిఁ, గొని రుద్రునిఁ గాంచి నీసఖుం డీతఁడు వ

చ్చితకార్యము గృపతోడను, వినుము దండంబు తెఱంగు విశదింపఁ దగన్.

వ. అట్లు లోకరక్షకుం డగుపుండరీకాక్షుం డండగొని దండాభావంబున జగంబు గలంగు చెడిఁగించిన నవ్విరించిపలుకులు మనస్కరించి మహాదేవుండు నిజప్రభావంబు దండంబుగాఁ గల్పించి దండనీతి శాస్త్రయుక్తం బై పరఁగు చుండె. 118

సీ. వినుము ఋగ్వేదాదిక వేదములు నాలుగుఁ, గల్పాదు లైనయంగంబు లాఱు
నెరసి విద్యలు పది యేర్చుపురాణంబు, లవియును లోకవిద్యయ యనఁ ధర్మ
వివరణ సెప్పెడుశాస్త్రకవితతి యంతయు లోక,విద్య యన్వీక్షికయు దర్కంబు
నొకటి మీమాంస యొకటొక్కటి యట్టిలు. వివరింప నాలుగు విద్యలయ్యె

తే. వైద్యకోదండగాంధర్వవిద్య లర్థ,శాస్త్ర మనఁ బేరువిద్య లతత్సహితవృత్తి
వెలయఁగాఁ బదునెనిమిదివిద్య లభవుఁ, డేర్పరించె జగత్త్రయహితముగాను.

వ. ఇట్లు సమకట్టి దండంబును దండనీతిప్రపంచంబు లంబుజయవ్విద్యలకు విష్ణువశగతంబులు సేసె నాసర్వేశ్వరుం డత్యద్భుతాలికిఁ దమ్ము ఘటించి యాభవుఁ ప్రజాపతిప్రసవంబు గావించె దండనీతి సమగ్రమహిమ యై చెల్లె నెల్లజగంబులుం బ్రియం బందె నరవిందభవుని యాగంబును సుప్రయోగం బై నడచె విష్ణుండు దండనీతిశాస్త్రంబు సకలంబు నాంగిరసున కిచ్చె నాంగిరసుం డింద్రమరీచులకు మరీచి భృగునకు భృగుం డనేకమునులకు నిచ్చె నిక్రమంబున నది జగంబులం బరఁగె దండంబుజాగరణంబున లోకంబు మర్యాదామహితం బై వర్ధిల్లెఁ గపర్ది శంకరుండు రుద్రుండు భవుండు స్థాణుం డుమాపతి యను పేళ్లం బరఁగునద్దండదేవుని నతులధర్మంబున నయించుభూపాలుం డైహికాముష్మికసిద్ధులం బొందు.

క. అని వసుహోముఁడు సెప్పిన, విని మాంధాతృండు దండవిభవజ్ఞుం డై
యనఘ మహీపరిపాలన, మొనరించెను నీతి దండయుక్తి వెలయఁగన్. 121

క. ఈయాఖ్యానము విని భూ,నాయకుఁ డెవ్వాఁ డిలాజనంబుల నతుల
న్యాయంబునఁ బాలించుఁ జి,రాయుష్యిరవున్యాభాగి యగు నతఁడు నృపా. 122

భీష్ముఁడు ధర్మరాజునకు ధర్మార్థకామంబుల తెఱం గెఱింగించుట.

వ. అనిన విని ధర్మనందనుండు ధర్మార్థకామంబులనడవడి యెట్లయిన మేలై చెల్లు నని యడిగిన భీష్ముం డిట్లనుఁ దొల్లి యాంగిరసుం డనునరవరుండు కామందకనాముం డైనముని ని ట్లని యడుగ నతం డతనికిఁ జెప్పినభంగిం జెప్పెద నాకర్ణింపుము.

చ. అనయముఁ బేర్చు కామమున నర్థము ధర్మముఁ గ్రాఁగఁ గామతం
త్రనిరతుఁ డైనవాఁడు సుపథప్రతిపన్నుఁడు గాఁడు దుష్టుఁడం
డన మొనరింపఁ డట్టిపతి డాయరు సాధులు నార్యులున్ సుహృ
జ్జనులును దానఁ జేటు నగుఁ జావును బాటిలు నెల్లభంగులన్. 124

ఉ. కావున ధర్మసిద్ధికి ముఖం బగునర్థమునందు నిష్ఠమై
నేవిధి నైన ధర్మరతి యెక్కుడుగా మదిఁ జొన్పి కొప్పఁ గా

మావిలబుద్ధి గాక యుచితాగతసౌఖ్యము లాచరించుచుఁ
భూవిభుఁ డెప్డు భూమిసతిఁ బొంది రమింప మహోన్నతుం డగున్. 125

క. అన విని ధర్మతనూజుఁడు, జనమ్ము శీలమ్ము నధికసంస్తుత్యముగాఁ
గొనియాడుఁ దత్స్వరూపం, బనఘా వివరింపవే దయారతి నాకున్. 126

వ. అనుటయు నాపగాతనయుండు విను మని యతని కి ట్లనియె. 127

క. మున్నింద్రప్రస్థంబున, నున్నతిమెయి ననుజతనుజయుక్తంబుగ నీ
వున్న తెఱఁగు దుర్యోధను, కన్నులు గమరింప నతఁడు గడు వగ నొందెన్. 128

వ. భవదీయసభ యొప్పునకును రాజసూయంబు చెల్లినయుల్లాసంబునకును నట్లసహ్యపడి ధృతరాష్ట్రునితో భవద్గృహంబున నిచ్చలుం బదివేవురు భూసురులు పసిండిపళ్లెరంబులం బాయసాహారంబులు గొనుట మొదలు గాఁగ లక్ష్మిపెం పుగ్గడించి తనవగపు గోపం బలికిన నతం డతని కిట్లను మధురాన్నపానమణిభూషణవరవాహనాదులం జేసి యుజ్జ్వలం బై యున్నది గాక నీయైశ్వర్యం బసదే పాండవాగ్రజుం డెక్కుడు మెఱసి యునికియుం గలదు వినుము చెప్పెద. 129

ఆ. శీలవంతు లైన సిరిఁ బొందుదురు ధర్మ, తనయునింటిసిరికి నెన యనంగ
నెక్కు డనఁగ లక్ష్మి యెసకం బెసఁగ నీవు, శీల ములవరింపు చిత్తమునను. 130

వ. మాంధాతృండు నాభాగుండు మొదలయిన మేదినీపతులు శీలంబునం గాదె యీలోకంబునం బెంపు వడసి రివ్విషయంబునకు నొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. 131

క. దనుజవిభుఁడు ప్రహ్లాదుం, డనిమిషపతిరాజ్యలక్ష్మి యతులితశీలం
బునఁ గొని త్రైలోక్యంబును, దనకు వశగతంబు సేసె ధర్మం బలరన్. 132

క. దానికి రోసి బృహస్పతి,తో నమరేంద్రుండు మేలు దొరకొనువిధ మె
ట్లో నావుడు భార్గవునిం, గానఁగఁ జను మతఁడు సెప్పుఁ గరుణాన్వితుఁ డై.

క. అని గురుఁడు పంప నింద్రుఁడు, సని భార్గవుఁ గాంచి మేలు సమకూరు తెఱం
గనఘా యుపదేశింపవె, యనినం బ్రహ్లాదుఁ జెందు మతఁ డెఱిఁగించున్. 134

ఆ. అతని నాశ్రయించి యవ్వార విప్పించి,కొనిన మేలు వొందు ననియె భార్గ
వుండు వజ్రి బ్రాహ్మణుం డయి ప్రహ్లాదుఁ, జేరి శిష్యవిధులు సేయుచుండె.

వ. అంత నద్దానవేంద్రుండు ప్రసన్నుం డై భూసురాకృతి యయిన సురపతితో సంభాషించిన నతండు నీకుఁ ద్రైలోక్యరాజ్యంబు సంప్రాప్తం బైన కారణం బేమి యెఱింగింపవే యనుటయు. 136

ఆ. దనుజనాథుఁ డిట్టు లను రాజ నను గర్వ,మున ధరామరులకు మనసు గందఁ
జేయ నెపుడు నే నసూయాదు లమ్మహా,త్ములకు ధనము లిత్తు నెలమితోడ.

వ. వారలు మెచ్చునట్టిశీలంబునం బ్రవర్తిల్లుదు దానం జేసి మహోన్నతుండ నైతి. 138

క. అనవుడు నీశీలము నా, కనఘా దయ నొసఁగవే మహాత్ములఁ దగఁ జెం

దినవారు బ్రదుకవలదే, యని దీనత నోఁప నరిమిత్రసాహాయ్యుఁ డకటా. 139

క. విని ప్రహ్లాదుఁడు కృప దన, మనమునఁ గదురంగ విప్రవరాత్ముఁడు గాఁ జీ-
తనిభంగిఁ జూడ ననువెఱవునఁ బుట్టఁగ నిచ్చె శీలము౦ బెంపెసఁగన్. 140

తే. పడసి యింద్రుండు శీలసంపన్నుఁ డగుచుఁ
జనియెఁ దదనంతరంబ యసద్దనుజవరుని
తనువునందుండి తేజస్స్ఫురితనువిలాసుఁ
డైనపురుషుండు వెడలిన నతఁడు సూచి. 141

వ. నీ వెవ్వండ వని యప్పురుషుఁ డేను శీలంబ నీ విచ్చినయవ్విప్రుపాల వసియింపఁ జనియెద నని చెప్పి పోయెం దదనంతరంబ క్రమంబున దేజోమయరూపంబులు నిజదేహంబుననుండి నిర్గమింప నద్దానవేశ్వరుం డడుగుచు. 142

క. ఉత్తమధర్మము సత్యము, వృత్తంబు బలంబు నగుట నెవినఁబడి బడి ద-
చ్చిత్తము విషాద మంద మ,హోత్తరమూర్తి యొకవారిజానన వెడలెన్. 143

క. వెడలిన నీ వెవ్వత వని, యడిగిన నాతనికి నిట్లు నెలఁత దీనత న-
ప్పుడఁతి సిరి నేను బల మె,క్కడ కరుగు నందుఁ బోవఁ గడఁగి వెడలితిన్.

చ. అనిన భయంబు నొంది యతఁ డాసతితోఁ బరమేశ్వరీ మహా
వినయమతిన్ ననుం గొలిచె విప్రవరుం డతఁ డెవ్వఁ డన్న న-
వ్వనిత సురాధినాథుఁడు భవద్ఘనరాజ్యవిభూతి యింతయుం
గొనుటకు నిన్నుఁ జెందె నిటు గోల్పడి తీవును నీదుశీలమున్. 145

వ. వినుము చెప్పెద శీలంబున ధర్మంబు వెలయు ధర్మంబున సత్యంబు దొరకొను సత్యంబున వృత్తంబు సొప్పడు వృత్తంబున బలంబు వాటిల్లు బలంబున నేను గలుగుదుం గావున సమస్తంబునకు మూలంబు శీలం బని చెప్పి సిరి పురందరు పాలికి ధర్మాదులతోడఁ గూడం జనియె ననుటయు దుర్యోధనుండు శీలం బెట్టి దనిన ధృతరాష్ట్రుం డతని కి ట్లనియె. 146

క. ఒలసి మనోవాక్కా,యంబుల ద్రోహభావ మఖిలభూతములయెడం
గలిమి విను శీల మది మే, లొలయించును దాన నుల్ల మూన్పుము పుత్రా.

క. పరహితము సిగ్గుపాటుం, బొరయక యుండంగ నెదిరి బోధించుటయున్
నరసముదయంబు వొగడెడు,చరితము శీలమున కంగసంపద వత్సా. 148

క. అనియె నని చెప్పి భీష్ముం, డను ధర్మజుతోడ నీకు నది నైజమ యో
నును బోధించితి శీలము, మనమ్మునం దిరము సేయు మనుజాధీశా. 149

వ. అనిన విని యజ్జనపతి భీష్మునితో నాశ యనునది యనంత మై యుండు నది నిరర్థక మైన నయ్యెడుదుఃఖం బంధికం బది దుర్యోధనుం బేర్చి కలసియుండం జూచితి నమ్మహాత్ముండు దేఱక మదీయాశఁ గుంఠితంబుఁ జేసి నన్ను దుర్బుద్ధిం గావించె నది విషాదంబు సేయు నాశ నడంచుట యరిది గదే యనుటయు నాశాదోష

నిరాసకం బైనయొక్క యితిహాసంబు గలదు విను మని యక్కురుసత్తముం డి
ట్లనియె. 150

భీష్ముఁడు ధర్మజునకు సుమిత్త్రుఁ డనురాజుచరిత్రంబు సెప్పుట.

సీ. హైహయుండు సుమిత్త్రుఁ డనురాజు వేఁటపో, యినచోట దనచేత నేటువడిన
మృగ మమ్ముతోఁ బాఱఁ దగిలె వెన్వెంటన, యదియును నొకమరి యగ్రమయ్యు
నొకమరి దవ్వయ్యు నొకమరి దృష్టిక, గోచరం బయ్యును ఖురపదంబు
లరసి పాఱిన నింతనంతఁ దోఁచియు నాశఁ, బెనుచుచుఁ జని మహావనము సొచ్చె
ఆ. నవ్విభుండు డస్సి యచ్చట నొకముని, పల్లె కేఁగి మునులు ఫలజలములఁ
దృప్తుఁ జేయ డప్పి దేఱి యున్నెడ ఋష, భాఖ్యుఁ డైనతపసి యతనితోడ.
క. వనమున నెక్కటి నీ వే, పనికై చనుదెంచి తేల పరమవిషాదం
బునఁ బొందెదనిన నాతం, డను నొక మృగ మమ్ముతోడ నరుగఁగ వెనుకన్.
క. ఆసాసల వచ్చితి నను, గాసిం బెట్టి యది యడవిఁ గలసెను మృగయా
వ్యాసక్తుఁడు వగచుం దన, యేసినమృగ మనఘ తప్పి యేఁగుటకుఁ గడున్.
వ. ఆశ యింత దుర్నివార యగునే యనిన నమ్మునిపతి యమ్మనుజపతి కి ట్లనియె.
క. విను తీర్థయాత్ర సని యే, ననుత్తమం బైనబదరికాశ్రమమున నొ
క్కనిఁ గాంచితిఁ గృశగాత్త్రునిఁ, దనుఁ డనుపేరింటివానిఁ దాపసవర్యున్. 155
క. కని భక్తిం బ్రణమిల్లుడు, ముని యాతిథ్యం బొనర్ప మోదంబున నా
తనిపాల ధర్మఫణితులు, వినుచుండఁగ నొక్కధరణివిభుఁ డేతెంచెన్. 156
వ. విషాదవివర్ణుం డగుచు సపరివారంబును సదారంబునుగాఁ జనుదెంచి యజ్జనపతి మునిపతిం గాంచిన నతం డతిథిపూజాసత్కారంబులు సేసి యాగమనకారణం బడిగిన నన్నరనాథుండు. 157
చ. తనయుఁ డొకండ వాఁడు గుణధాముఁడు క్రీడనవాంఛ సాంద్రకా
ననమున కేఁగి కాడుపడినం దడవం జనుదెంచి యెందుఁ గా
నన మదియాశ ద్రిప్పికొనినన్ వెగ డందుచు వచ్చినాఁడ న
న్న నతఁడు వల్కకుండె వదనం బొకయించుక వాంచి చింతతోన్. 158
క. చింతించు నతనితో భూ, కాంతుం డి ట్లనియె మఱియు గాఢతరాశా
క్రాంతత దుర్లభఫల యగు, టింత యసహ్య మగునయ్య యెడఁద మునీంద్రా.
వ. అనుటయు నత్తాపసోత్తముం డమ్మహీపతియాననం బాలోకించి. 160
క. ఏనరుఁడు మానసము ధృతి, నూన నుచితవృత్తి నుండు నుదిలగొనక యెం
దైనను నెయ్యది యేనియు, వానికి దుర్లభము లేదు వసుధాధీశా. 161
క. అర్థాదు లగుఫలంబులు, ప్రార్థించినచోట సిగ్గు వఱుపక తగ న
య్యర్థి సులభార్థుఁ జేయుకృ, తార్థుఁడు దుర్లభుఁడు దలఁప నఖిలజగములన్.
వ. అని పలికి పూర్వాచారస్మారకత్వంబున ని ట్లనియె. 163

క. వినుము గుణవంతుఁ డాకరుఁడు, ధనవంతుం డైనయొక్కఁ డధరణీనాథుం
దనకూడుసిరకై కాం,చన మడిగి తదీయబాలిశత్వముఁ జెప్పెన్. 164

క. విహతాశుం డై లజ్జా,మహితం బగువారి దొఱఁగు మదితో సకల
స్పృహయును నెవ్వనియందును,వహింప నని యతుల మైనవ్రతముం బూనెన్.

వ. అని చెప్పి యప్పార్థివుం దొల్లి తాను ధన మర్థించి యఫలితప్రయత్నుం డై
తత్కాలజనితనై రాగ్యంబునం దపస్వి యగుట దేటపఱిచి వెండియు. 166

చ. ఒడఁబడి యీనివానియెడ నుల్లము నందుఁ గృతఘ్నుతం గడుం
జెడు గుసుదుర్వినీతు నెడఁ జిత్తము కోర్కికిఁ బట్టు సేసి తే
వశి యగునీచకాంతయెడ వారక యాసలు సాఁగు నిట్లు పె
క్కెడలను బాయునాసగమి యెల్లఁ దొఱంగుము సౌఖ్య మొందెదున్. 167

వ. అని యాసపజ్జం బోవమి సుఖకరం బగుటం దెలిపి యవ్విరమ్యమ్మునకుం గరు
ణించి యతనికొడుకు భూరిద్యుమ్నుఁ దనతపోమహిమ నాకర్షించి వీడుకొలిపె
నని చెప్పి ఋషభుండు సుమిత్రునిచిత్తంబు మృగయాశాయత్తంబు గాకుం
డునట్లుగా బోధించెఁ బాండవాగ్రజా నీవును నివ్వాక్యంబు లాదరించి సుస్థిరుం
డవై నిరాశత్వంబున సంతాపంబు దక్కి సుఖివి గ మ్మని పలికిన భీష్మునితో న
బ్భూపతి భవదీయవచనామృతాస్వాదనంబున మనంబు దృప్తి గనె నింకను
ధర్మప్రకారంబులు వివరింపు మనిన నతం డతని కి ట్లనియె. 168

క. తనభూమిఁ బరులభూమిని, ధనము లుపార్జింప వలయు ధరణీశునకున్
ధనములు మూలము రాజ్యం,బునకును మూల మగు ధర్మమునకు నరేంద్రా.

క. అది పెట్టిదంపువెరవున, మృదుభూతోపాయమునను మెయికొనద ప్రజం
బొదువ వలయు నాజ్ఞాసంపద [1]గలసాకతముతోడఁ బతి యవహితుఁ డై.

క. విను బండారము వెఱుఁగని,జనపతికి బలంబు మిత్రసంపదయును గ
ల్గునె బలమిత్రవిహీనున, కొనరునె రాజ్యంబు విభవ మున్నత మగునే. 171

ఉ. కావున సర్వసంపదలు గల్మియ యింతకు మూల మైన ను
ర్వీవరుఁ డాత్మశక్తి కతిరిక్తము లైనసముద్యమంబులం
దా వలియం ధలంచి సముదగ్రతఁ గైకొను నొప్ప దవ్విధం
బావిభుతొంటికల్మికిని హాని యొనర్చు హరించుఁ బ్రాణముల్. 172

క. తనకొలఁది నుపాయంబులు, వొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము ని
ర్ధనుని నిజప్రజయును గై,కొనదు విరోధులును సరకుగొనరు కుమారా. 173

క. తెరవాటున మ్రుచ్చిమి ను,ద్ధురు లగుక్రూరులకు మూఁక దోరం బగు న
వ్వారవరిదారల బలంబుగ,ధరణీశుఁడు గూర్చుకొనుట దైన్యము దెచ్చున్. 174

క. అన్యాయంబునఁ బొదలిన, సైన్యముచే సమరజయము సమకూర దనూ

---

1. ఖ. గలస్వాగతముతోడ.

నన్యాయపరులు గాంతురు, మాన్యత్వము దస్యు లైన మనుజాధీశా. 175

వ. ఇట్లగుటకు నుదాహరణం బగు నొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము. 176

భీష్ముఁడు ధర్మజునకుఁ గాపవ్యోపాఖ్యానము సెప్పుట.

సీ. అవనిలోఁ బారియాత్రాచలంబున నుండు, నొకబోయ ధర్మసంగతుఁడు శుద్ధ
వింట నేర్పరి మృగావితతి ప్రకారజ్ఞుఁ, డారణ్యదేశసంచారశాలి
తల్లికిఁ దండ్రికిఁ దద్దయు భక్తుఁడై, ఫలమూలసుమనస్సమానసంబు మేలి
కూడుగూరలు దొరకఁ గొల్పి వారికిఁ దృప్తి, యొనరించుచు నిజాశ్రమంబులను

తే. లగుపదార్థముల్ స్వాద్యంబు లగుగ నొసర్చు
వలయు నాహారములు మునివరుల కిచ్చుఁ
బగఱఁ దోఁచినఁ బరిమార్చు భండనమున
నొకఁడు వేవుర నైన నుగ్రాగ్రగతుల. 177

క. కాపవ్యుం డను పేరను, దీపించిన యతని భూరితేజము గని త
ద్వ్యాపారుఁడు వలయు మన కని, యాపాలమునఁ గల్గు దస్యు లందఱు దనుజారీ.

ఆ. అతనిఁ దమకు నెల్ల నాధిపత్యము సేయు, వానిఁగా వరించుకొనఁగ
నిశ్చయించి కూడి నెమ్మిమైఁ జనుదెంచి, కాంచి యిట్లు లనిరి గౌరవమున. 179

క. బలవిక్రమసంపన్నుఁడ, వలఘుచరిత్రుఁడవు నమ్ము నందఱ బ్రహ్మాస్త్ర
తలకొని రక్షింపుము నీ, వలచినపని గొనుము పుత్త్రవర్గముఁ బోలెన్. 180

వ. అనిన విని యతండు వార లకి ట్లనియె. 181

సీ. శిశుజనమునిజనస్త్రీజనంబులఁ జంపఁ, గా పెట్టి వాఁడైనఁ గడఁగి మీఁదఁ
గవియక పోఁడుచుట కల్మషం బగుటఁ, బెఱపట్టఁ దగదు విశేష మొకఁడు
వినుఁ [1]డెల్లసత్త్వంబులను బెంటిఁ జంపుట, పాపంబు గోవుల బ్రాహ్మణులను
సంకటపెట్టంగఁ జనదు తదీయహితము గోరి పూని యుద్ధంబు సేఁత

తే. యధికపుణ్యంబు సస్యక్రియావిఘాత
మాచరించుట గడుదోష మవనిప్రజకు
బాధ గావించి కుడిచి శవంబు దోలుచు
ప్రవృత్తిగతి నది వోలియుంగఁ బోలియు నతఁడు. 182

వ. అని చెప్పి మీర లీధర్మాధర్మంబు లెఱింగి నాపంచిన యట్లగునె బ్రదికెద రేని
మీకు ముఖ్యుండ నయి సఖ్యంబు సౌఖ్యంబుఁ బెనుప మీయోగక్షేమంబు
లరసెద ననియె దానికి వార లందఱుఁ బ్రీతిం బొంది యాతని [2]వశంబున వర్తించి
వర్ధిల్లి రిట్లు కాపవ్యుండు సాధులకు హితం బగునట్లుగా దస్యులం బాపంబులకుం
బాపి తానును వారును నిహపరసిద్ధులం బ్రశస్తి వహించె. 183

క. కాపవ్యోపాఖ్యానము, పాపహరము దీని శ్రవణపఠనము లటవీ

1. క. డెట్టిసత్వజాతిని బెంటి. 2. ఖ. వచనంబున.

వ్యాపారక్షేమంకర,రూపము లగు దస్యువృగవి|రోధము లడఁచున్. 184

భీష్ముఁడు ధర్మజునకు దీర్ఘదర్శి మొద లగుమత్స్యముల తెఱంగెఱింగించుట.

వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును ననుమత్స్యంబులు మూఁడు జలచరబహుళం బగునొక్కయేటి మడువునఁ దమలోనం బొందు గలిగి యుండునవి వేసవి సొచ్చిన దీర్ఘదర్శి దక్కటి రెంటిని గూడం బిలిచి. 185

క. మడు వింకఁగఁ బాతెడు సి, రెడ త్రెవ్విన నొండుసోటి | కేఁగఁగ రా దె
ప్పుడు నింకనినీళ్లులు గల,మడువునకుం బోవ వలదె | మన కిట్టియెడన్. 186

తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డి|ట్లనియె నేది, ప్రాప్తమయ్యె నక్కార్యంబు|భంగి నెఱిఁగి
యప్పటికిఁ దగునట్లు సే|యంగ వలయు, మానితోపాయవృత్తి నే|మనుట లేక.

వ. అనిన నయ్యిరువురదెఱంగులపలుకులు విని దీర్ఘసూత్రుం డి ట్లనియె. 188

క. జడనిధిచందంబున ని,మ్మడు వొప్పఁగ నిప్పు డేమి | మూఁడెనె యిమ్మై
నడిచిపడ రిత్తనెవ్వగ, లుడుగుఁడు మఱి చూచికొంద | మొయ్యన తఱితోన్.

క. అనుటయు నిది కర్జము గా, దని పల్కుచు దీర్ఘదర్శి | యంబుస్రోతో
జనితాభయ మగుపథమునఁ, జని చొచ్చెం బెద్దమడువు | సమ్మదలీలన్. 190

వ. తక్కినరెండును నంద నిలిచె నిట్లు నిలిచినయమ్మత్స్యద్వయంబునకు భయంబు జనియింపం గతిపయదివసంబులకు. 191

క. పాతెడునీ రెడ త్రెవ్వఁగఁ, దాఱ బెడిద మైనయెండ | దనుకఁగ నివురం
బాఱె మడు వంత వేడుక,కాఱులు జాలరులు సొచ్చి | క్రందుకొనంగన్. 192

క. వెరవున నూఁతల నెత్తెలఁ, గరముల మత్స్యములఁ బట్టి | కడుసంతసముం
బొరయుచుఁ దాళ్లం గ్రువ్వఁగఁ,గర [1]మూహించి మదిఁ బ్రాప్త|[2]కాలజ్ఞుండున్.

క. ఇం దొకత్రాడు గఱచి యె, న్నొందం గా గ్రుచ్చినట్ల | యుండెద వీ రీ
క్రందుకొనుట మానంగ న,మందత నది యెడల విడిచి | మడువు దఱిసెదన్.

క. అని యొకగుదివీలనడుమ, నెనయంగాఁ దూఱి కఱచి | యిరుదౌడలఁ ద్రా
డొనరంగఁ బట్టుకొని గ్రు,చ్చినచందము దోఁప మూర్ఛఁ | జెందినభంగిన్.

వ. ఉన్నంత వేఁట దీఱె యగ్గది గలయతండు. 196

క. తెలినీట రొంపి వోవం, [3]దొలుచునెడం ద్రాడు విడిచి | దురితంబునకుం
దొలఁగి పొరదప్పి యం దొక,జలచర మున్నయెడ కేఁగె | సంభ్రాంతగతిన్.

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం, డి ట్టట్టరుగఁగ నుపాయ | మేది యొకనిచేఁ
బట్టువడెఁ దనదుడెందము, పట్టు [4]వదలి చకితవికల|భావేంద్రియుఁ డై. 198

క. విను దాదవ్వులఁ గార్యము, గనికొని వలయుపని మున్న | కావింపఁగ నే
రనిజడుఁడు దీర్ఘసూత్రుం, డనునమ్మత్స్యంబుభంగి | నాపద నొందున్. 199

1. చ. మూహించుకొని. 2. గ. కాలజ్ఞుఁ డనున్. 3. గ. దొలఁచునెడం. 4. చ. గదల జనితవికల.

సీ. అప్పటికిఁ దోఁచినట్టులు దప్పకుండ, ననువుతో ధృతి గల్గి కార్యంబు నడపు నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యుఁడనఁగఁబోలెఁ, బరమసంశయ మయ్యెడు బ్రదుకు గాంచు.

. ధురతః ననాగతము లగు, కార్యము లూహించి పని తగఁ జేయునతఁడు చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును, నార్యస్థితి దీర్ఘదర్శి యనుపేరను క్రియన్.

—పలితరోమశ లనుమూషికమార్జాలంబులసంవాదప్రకారము.—

. అనిన విని ధర్మనందనుండు పెక్కండ్రు పగఱకు నగ్గమై హీనబలుండైన నరపతి యెవ్వరును నాపద నిస్తరించువాఁ డని యడిగిన నప్పుడమితేనికి భీష్ముండు మార్జాలమూషికసంవాదం బనునితిహాసంబు గల దది నీ దగుప్రశ్నంబునకు నదుత్తరం బగు విను మని యి ట్లనియె. 202

. అడవిలో నొకమఱ్ఱియు దగునుఁ గలఁ, బలితుండు నా నొక్క పిల్లి యుండు నమ్మహీజముమీఁద నవినంబు రోమశుం, డనువెల్లి వసియించు నాసమీప మున నంజకడ నిత్యము వ్యాధులు గంబుల కురు, లొడ్డి వేఁకువ వచ్చియొక్కనాఁడు పడ్డవానిఁ గొంచ చరుగు నొకప్పు డా, హారంబునకుఁ బిల్లి యచటఁ దిరుగ

కం. బోయి యురిఁ బడి యుండఁగఁ బొంచి చూచి భయము దక్కి యచ్చోటన పలితుఁ డెరకుఁ గ్రమ్మరఁగఁ జంద్రకుం డనుగూబవులుఁగు హాలికుఁ డనుముంగిసయు నింత నంతఁ దోఁచె. 203

. ఎరలకై వచ్చి యిట్లు దోఁచిన నయ్యేలుక యారెంటిబారికిం దప్పి పోవ రామి దలంచి బెగ్గలించియు ధైర్యంబుకలిమిం గార్యం బూహించి యప్పిల్లిం గొండొక చేరం జనుచు దానితో ని ట్లనియె. 204

. ఉరి ద్రెవ్వఁ గొఱికి యిప్పుడ, వెర వారఁగ నీకు నేను విడుగర సేయం దొరకొనుట నీదుభాగ్యం, బరిత్వము దొఱంగి మైత్రి యలవఱుపు మదిన్. 205

. ముంగిసి గూబకు నగపడి, యంగంబులు వడఁకుచున్నయది నా కిమ్మై సంగతి గలిగిన నీయుత్సంగంబున నుండి భయము దక్కుదు నేనున్. 206

సీ. అనవుడుఁ బిల్లి యిట్టు లను నార్తశరణ్యుఁడ వయ్యె దిట్టినీ కనఘ హితంబు సేయ వలదయ్య జగత్పతి సాక్షి గాఁగ ని ప్పుని దగఁ బూనితిన్ వెఱవుఁ బాచి ననుం గదియంగ రమ్ము వ చ్చిన నకులంబు గూబయును జేరఁగ నేరవు నాకు నోడుటన్. 207

. అనిన నట్ల యగుట నాత్మ నెఱింగియు, గాదె సంధి యైన నాదు బ్రదుకు నీదువిడుగరయును నిజ మగు టూహించి, నిన్నుఁ జెందె బుద్ధినిశ్చయంబు.

. అని పలికి పిల్లి పొదిగిట, ననయము నిశ్శంకవృత్తి నయ్యెలుక వసిం చినఁ జూచి యయ్యులూకం, బును నకులము నచటు వాసి పోయె నిజేచ్ఛన్.

క. నకులము నులూకమును బో, కకు సంతస మంది యుండి । గ్రక్కున నమ్మూ
షిక మయ్యురిచేరులు గొఱు, కక యలసత నల్ల నల్లఁ । గఱచుచు నుండెన్.

వ. అమ్మెయిఁ బలితుండు గొనకొని యయ్యురిం గొఱుకకుండుట యెఱింగి రోమశుం
డి ట్లనియె. 211

క. తగునే యిట్లు కృతార్థుఁడ, వగునీ కురి గొఱుక కిట్టు । లాలస్యము సేఁ
త గటా కృతఘ్నతకు నెల, వగు టొప్పనె కొఱుకు కడఁక । నద్రోహుఁడవై.

చ. అనుటయు నెల్క యిట్టు లను । నాశ్రితరక్షణశీలు నిన్నుఁ గీ
డునఁ [1]బొరయింతునే యిది క।డుం జెడుగుండన మేను భీతి నూ
నినమదితోడ నమ్మమిన । నెట్టన యియ్యురిఁ ద్రెంప [2]నయ్యెదన్
మనమున నెగ్గుగాఁ గొనకు । మాలనిఁ గాంచినయప్డ త్రెంచెదన్. 213

క. ఉరిఁ బాసి యేమి దలఁతో, యరిత్వమున వినుము ప్రబలుఁ । డైనయతనితో
వెరవున సంధి యొనర్చియుఁ, గరంబు నమ్మమియ నీతి।గాఁ గొంద్రు బుధుల్.

ఉ. మాలనిరాక చూచి భయ।మర్దిత మైనమనంబుతోడ న
క్కాలమునందు నీకుఁ జనఁ।గా వలయున్ వెస మ్రానిపైకి నా
యాలయముం జొరన్ సమయ। మప్పుడ నాకును గాన యత్తఱి
న్మేలొనరింతు నమ్ము మిది । నిక్కము గర్జము నీ వెఱుంగవే. 215

క. అనవుడు న ట్లేల తలఁప, వినుము భవత్ప్రాణరక్ష । వెసఁ జేసితి నే
ననఘా నీవును నమ్మెయి, నను నాపదఁ బాప వలదె । నమ్మి రయమునన్. 216

ఆ. అనినఁ బిల్లి కిట్టు । లను నెల్క వేగిర, పడకు ముచితకాల।భావ్య మైన
యత్నవిధి గదా స।మగ్రఫలత్వంబు, నొందు నొందు దలఁప । కూరకుండు. 217

వ. అని యి ట్లప్పలితుండును రోమశుండును నొండొరులతో మాటలాడుచుండ
వేకువ యయ్యె నట్టియెడ. 218

క. తనతోఁ గొండఱు గుక్కలఁ, గొని యేతేరంగఁ గేలఁ । గ్రూరకృపాణం
బును భీకరభంగిగ వెసఁ, జనుదెంచెన్ మాలఁ డధిక।సంరంభమునన్. 219

ఆ. పరిఘునాముఁ డైన।పాపాత్ముఁ గని భయ, మడరఁ బిల్లి యిట్టు । లనియె నింక
నేమి సేయువాఁడ । నిదె వచ్చె జముదూత, వోలె సత్వరముగ । మాలవాఁడు.

క. అనిన విని యోడ కోడకు, మనుచుం దెగఁ గొఱికె వేగ । మయ్యురిఁ బలితుం
డనయముఁ జకితాత్ముం డై, చనియెన్ రోమశుఁడు నవని।జముపైకి వెసన్. 221

చ. ఎలుకయు [3]బొక్కలోపలికి । నేఁగి ముదంబునఁ బొంచి చూడ సం
కులముగ నేఁగుదెంచి పరి।ఘుం డురి నుగ్గగు టెల్లఁ జూచి ని
ష్ఫలతకుఁ జిత్త మెంతయు వి।షాదము వొందఁగఁ బోయెఁ బిల్లి య
య్యెలుకకు ని ట్లనుం జెవికి । నింపగురీతి నుదాత్తభంగిగన్. 222

---

1. క. బొరయంగ నిత్తునె క।డుం. 2. జ. నియ్యెడన్. 3. క. గ. చ. బ్రొక్క.

ఆ. మేలు సేసి తగినమిత్త్రునిఁ బడసి తత్సుచరితముల నిచ్చసుఖము లనుభ
వింపఁ జూచు టుడిగి వేర్పడి యుండుట, యరయ నీతివిదుల తెరువు గాదు.

చ. అనఘ భయంబు నొందు టిది యారయ బేలఁదనంబు నమ్మి మే
మును నను నమ్మి చెంది భయమోక్షణముం గని నాకుఁ జాల మే
లొనరఁగఁ జేసి తీవు దుది నుల్లము సందగ విశ్వసింప క
ట్లునికి సుఖంబె నాదుసిరి [1]కుత్సితుఁడ వయ్యెదు రమ్ము ప్రీతితోన్. 224

క. బలవంతులైన చుట్టంబులు నేనును నీకు మేలు పొనరింపంగ ని
మ్ముల మనుట యొప్పదే నను, గలసి మెలఁగు విడువు శంకఁ గను [illegible].

వ. అనిన విని యప్పలితుండు లోమశునితో నీపలుకు లుచితంబులు నామాటలు
విను మని యి ట్లనియె. 226

చ. అరులను మిత్త్రులం దెలియ నారయ నెంతయు సూక్ష్మకృత్య మ
వ్వైర వతిదుర్లభం బరులు వీరన నుండియు మిత్త్రభావముం
బోరయుటయుం సుహృజ్జనులపోలికి గల్గియు శత్రుతాగుణ
స్ఫురణ మొకప్పు డగాపుటయుఁ జూతుము గాదె ధరిత్రి నెల్లెడన్. 227

వ. కావున నిన్నుఁ బెద్ద గదియుట కర్జంబు గాదు నీవును మద్వేగతఁ బొందినట్టుఁ
జూచి తేనియు నేమఱం జన దె ట్లంటేని. 228

క. బలవద్రిపులు ప్రయోజనములకై లోఁబడుట గల్గుఁ బోలముల నేనుం
గులు దీమంబులపజ్జఁ దగిలి నెట్టన పట్టువడిన క్రియఁ జతురమతీ. 229

చ. అరియెడ మిత్త్రభావ మొకయప్పుడు కార్యముపొందుఁ గల్గిన
న్వైరవుఁ బాముఁ బట్టునెడ నిక్కము నమ్మక దానివానికిన్
గరము దొలంగఁ జేయునరు కర్జము వట్టి చరించు నొప్పదే
పొరుగున నుండి నీకు హితముం దగఁ జేసెద నెవ్వు పంచినన్. 230

మ. విను నీ కామిష మేను నీయెడఁ గడుం విశ్వాసముం బూని చే
రిన నీచిత్త మొకప్పు డుద్గతవికారీభూత మై దుర్వినో
దనహింసా[2]రుచి నొందు నీసుతసుహృద్బంధువ్రజం బేని ముం
ననుఁ గన్నం సహియింప దాత్మఁ గరుణన్ స్సన్నింపు మి ట్లుండెదన్. 231

వ. అని యంత నిలువక. 232

క. [3]బలుపుటెరిఁ జిక్కి పేరాఁకలితో రే యెల్ల నున్నకతమున నీకుం
జలిది వలసి పిలిచెద విటు, వలయునె నీపలుకు నమ్మి వత్తునె చేరన్. 233

ఆ. అనుడు నిట్టు దలఁప నగునె మత్ప్రాణరక్షకుఁడ వైన నిన్ను శత్రుఁ గాఁగఁ
దలఁతునే కృతజ్ఞతయుఁ బౌరుషంబును, గలుగ నేను వెఱవ వలవ దనఘ.

వ. అనిన రోమశునకుఁ బలితుం డి ట్లనియె. 235

1. 'కుత్తుఁడ' వనియే పెక్కుప్రతులు. 2. చ. రతి. 3. గ. బలితపుటురిఁ బడి పేరాఁ.

క. నీవలన నేను బ్రదికితి, నీవును నాకతన మాల।నికి నగపడ వై
తీవిధమునఁ గల్గుసుహృ,ద్భావమ చాలు నినుఁ జేరఁ। దగ దిటమీఁదన్. 236

వ. ఇవ్విధంబునకు శుక్రవాక్యంబులుం గల వాకర్ణింపుము. 237

క. బలవంతుఁ డైనశత్రుని,వలనఁ బ్రయోజనము గలిగి। వలను కలిమిఁ దాఁ
గలసియు నది గడచనఁగాఁ, దొలఁగ వలయు నమ్మ నేనిఁ। దుదిఁ గీడొలయున్.

ఆ. నమ్మఁ దగనివారి। నమ్మక యున్నది; తగినవారి నైనఁ। దద్ద నమ్మి
యుండఁ దగదు తన్ను। నొరులు నమ్మెడునట్లు, యుండి యొరుల నమ్మ।కునికి నీతి.

వ. ఇట్టిద బ్రదుకుఁదెరు వగుటంజేసి. 240

క. నినుబోంట్లను నమ్మక యే,నును బ్రదికెద ననఘ నీవు।నునుం గని చండా
లునియట్టివారిమాయలు, నినుఁ బొందక యుండ బ్రదుకు। నెఱిఁ బొమ్మింకన్.

క. అనిన విని సిగ్గువడి తన,చనుచోటికిఁ జనియెఁ బిల్లి। సమ్మతిఁ బలితుం
డును వేఱొకతగులాఁగకుఁ, జని సముచితవర్తనమున। సౌఖ్యముఁ బొందెన్.

క. బలుపగఱవలనియాపద, దలఁగుటకును రిపుని హీన।తరు నైనఁ దనుం
గలపికొని బ్రదుకుటకు ని,య్యెలుకయుఁ బిల్లియును వెరవు। లెఱిఁగించెఁ దగన్.

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో నెవ్వరియెడ విశ్వసింప కున్నం
జిత్తంబునకు విశ్రామంబు గల్గదు విశ్వసించిన దురితంబులు దొడరు నట్లగుటంజేసి
విశ్వసించుటయు విశ్వసింపక యుండుటయు ననురెంటిలోనను బరమకర్తవ్యం
బెయ్యదియో నిశ్చయింప నేర ననుటయు నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె
నీయర్థంబు దేటపఱుచునట్టియితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 244

బ్రహ్మదత్తునితోఁ బూజని యనుశకుని కైనసంవాదప్రకారము.

సీ. బ్రహ్మదత్తుం డనఁ। బరఁగిననరపతి,నగరఁ బూజని యను।నామ మొప్పఁ
జతురభాషిణి యొక్క।శారిక వర్తించు, నది పిల్లఁ బెట్టి యిం।పారుపండ్లు
దెచ్చి యర్మిలి దాని।కిచ్చుచో మేలెఱి, యధిపుపుత్త్రున కిచ్చు। నందుఁ గొన్ని
వాఁడును మచ్చిక। వచ్చి యప్పిల్లతోఁ, జర్లాట మాడుచు। సంచరించు

ఆ. నొక్కనాఁడు దాది। యొద్ద లేకుండ న,ద్దారకుండు పిల్ల।తల నొగిల్చి
చంపె దానితల్లి। సనుదెంచి కని మది, నిట్టు లనియె శోక। మొసక మెసఁగ.

తే. అకట కూడి మెలంగి యే।మొకటిమైన, నర్థి నిదియును దానును।ననుభవించుఁ
బట్టి యాడుచు నుండు ని।ష్పాపజాతి,పడుచు సంపునె యిటు దీని।మిడుకమిడుక.

ఆ. రాచకొడుకు గాఁడె। రాచవారికి నేటి
పరిచయంబు వేగ। కరుణ విడుచు
హితవు మఱచు రాజు। లెందు నమ్మికకుఁ బా
త్రములె సమదమతులు। క్రౌర్యరతులు. 247

వ. అని నిందించి. 248

క. ఈపగ దీర్చెద నంచుం, గోపంబున రాజుకొడుకు గ్రుడ్లు రెండుం
బోపడునట్లుగ గోళ్లఁ, జే పెఱికి రయమున గగనవీథికి నెగసెన్. 249

వ. ఎగసి యచ్చోట నిలిచి బ్రహ్మదత్తుండు విన నిట్లనియె. 250

క. చేసె నఘము దత్ఫలముం, జేసేతం గుడిచెఁ గాని శిశువు నెడ నా
చేసినకార్యము లే దేఁ, జేసితి నా కింతగీడు సందదు నన్నున్. 251

చ. అనవుడు బ్రహ్మదత్తుఁ డది యట్టిద నీ వెసఁ గీడు సేసి నీ
ననుటకు నామనం బతివిషాదముఁ బొందెడుఁ బొంటియట్ల న
న్నిన నిలు మన్నఁ బూజని శ్రమించు నె యొండొరుచేతఁ బడ్డయీ
పెనుపగ నొంచి మాటపన చెల్పడి క్రమ్మఱఁ జేరు కావ్వనే. 252

వ. అనిన విని యతండు. 253

క. చేసినదానికి మాఱుగఁ, జేసినఁ బగ యంతతోడఁ జెడుఁ గాక నృపాల్
[1]డాసిన నమ్మేలు విడిచి, దోసముఁ బట్టుదురె యెట్టి దుష్టులుఁ బతగా. 254

వ. అనిన నతనికి శారిక యి ట్లనియె. 255

క. నెయ్యము సెడినను మాటల, తియ్యందనము వట్టి పగ మఱది మఱచినఁ జా
వయ్యెం జేటయ్యెఁ గలఁక, యయ్యె నొకటి మూఁడుఁ గాక యది మే లగునే.

ఆ. వినుము నేల [2]ద్రోఁచికొనినను దాయాదు, లైన మాటమాట కేసి నాఁడు
వారియెడను గీడు వారక చేసినఁ, బగ జనించు నిట్లు భంగు లైన. 257

ఆ. [3]పగయుఁ గల్గెనేని పాయునె గూఢ మై, మ్రాన సగ్ని యున్నమాడ్కి నుండు
గాన నమ్మి బేల కాలాంతరంబున, నైనఁ జెడును సందియంబు వలదు. 258

క. జననీజనకసహోదర, తనూభవుల సఖుల నమ్మఁ దగ దనినను నె
మ్మనమునఁ బగ గలవారలఁ, జను నే నమ్మంగ వినుము చతురవచనముల్. 259

వ. అనుటయు బ్రహ్మదత్తుం డి ట్లనియె. 260

క. కాలవశంబునఁ గీడు, న్మేలును జనులకును మూఁడు నీకును నాకుం
వాలి యవి సేయ వచ్చునె, బేలనె యే నంత యేల పెడఁబాయంగన్. 261

వ. అనిని విని శారిక యతనిమొగంబు దేఱకొనం జూచి. 262

క. విను చల్లనిమాటలలో, మునిఁగి యలుక గుబ్బతిలు సముద్రజలములో
నన యుండి యాఱు కెప్పుడు, గనగన మను బాడబాగ్ని కరణి నరేంద్రా. 263

క. అని పలికి యవిశ్వాసము, మనమున నెలకొల్పి రాజుమాటలకుం దే
లనివెరవుతోడ నాపూజని దన కిమ్మైనయెడకుఁ జనియెఁ గుమారా. 264

వ. అదియునుం గాక. 265

క. జననాథునకు నవిశ్వాసనిరూఢత వలయు నెల్లజనములయందుం
దనుఁ దనసిరిఁ గాచుటకై, యని నీతులు సెప్పుదురు బృహస్పతిముఖ్యుల్. 266

---

1. చ. డాసినయమ్మేలు. 2. గ.చ.జ. ద్రోఁచికొనినను. 3. గ పగయ కలుగునేని. 4. క.గుబ్బటిలు

కణికుఁడు శత్రుంజయున కుపదేశించినహితవచనములప్రకారము.

వ. అవ్వాక్యంబు లాదరింప వలయు నని పల్కి వెండియు భీష్ముండు పాండవాగ్రజుతో సౌవీరపతియగుశత్రుంజయునకు భారద్వాజవంశవర్యుండై నకణికుండుపదేశించిన హితవచనంబులు గలవు వానిం జెప్పెద నాకర్ణింపు మని యి ట్లనియె. 267

క. వికచముఖుఁ డగుచు శాత్రవు, లకు హితు లగునట్టివారలం గని భూపా లకుఁ డెడ్డ కత్తెరయు నా, లుక బెల్లము నై [1]మనంబులలుం గన వలయున్. 268

ఉ. జ్ఞాతుల [2]నమ్మి తోడుకొని శత్రుల నోర్చి యహీనరాజ్యముం
బ్రీతి యెలర్పఁ జేకొనినలిప్పుట సౌఖ్యసమృద్ధితోషిత
జ్ఞాతినికాయుఁ డై మది నజస్రము నమ్మక సర్పసంయుతం
బై తనరారురమ్యనిలయంబున నున్నటు లుండఁగాఁ దగున్. 269

వ. అని మఱియును. 270

క. వినుము తఱి వేచి రిపు మూఁ, పున మోవఁగ వలయు సమయమ్ముం గనికొని గ్ర క్కునఁ గడవ శిలాస్థలి నై, చినచాడ్పున నేర్పు మెఱయఁ జెఱుచుట యొప్పున్.

క. పానము జూదము వేఁటయు, మానినియును భూపతులకు మధురవినోద స్థానము లగు నైనను దగ, నైనవిధము దక్కఁ దగుల మాపద దెచ్చున్. 272

క. విని వినవివాఁడపోలెం, గని కానవివాఁడపోలెఁ గావలయు విభుం డొనరింపఁ దలంచినపని, కను వగునంతకు నభేద్యుఁ డై జనులయెడన్. 273

క. ఒల్లనికార్యం బాసల, నల్లన కాలగతిఁ గడపునది కాలముచేఁ బె ల్లొదవు విఘ్నములు భూ, వల్లభునకు నెపము వెట్టవచ్చుం బిదపన్. 274

తే. బహుళ మగుగర్వమునఁ గార్యభంగియును న
కార్యసరణియు నెఱుఁగ కనార్యవృత్తిఁ
గాని తెరువున నడచు చున్నని గురుని
నైన శాసింపఁగాఁ దగు నంత్రు బుధులు. 275

క. తెగఁ దీర్పక [4]తగ నార్పక, తెగటార్పక కడమ కొంత డ్రిక్కఁగ నున్నన్ జగతీశ యప్పు నగ్నియుఁ, బగయును గడుఁ బెరుఁగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్.

ఆ. మార్దవమున మృదువు మర్దింపఁగా వచ్చు, మార్దవమున ఖరవిమర్దనంబుఁ జెల్లు మార్దవమునఁ జెల్లనియది లేదు, గాన మృదువ తలఁప ఖరము సువ్వె.

వ. అనిన విని యజాతశత్రుండు ధర్మంబు నడవక యవగ్రహాదిదురితంబులు దుస్తరంబు లయిన నాహారంబులు దొరకొననియట్టిచో ద్విజాతు లేమిభంగిం బ్రాణంబులు రక్షించుకొనువా రనుటయు నాపగానందనుండు విశ్వామిత్రచండాలసంవాదం బనునితిహాసంబు భవత్ప్రశ్నంబునకు నుత్తరం బై యుండు నాకర్ణింపు మని యి ట్లనియె. 278

---

1. గ. మనంబులుం గొనవలయున్. చ. కలయఁ బలుకఁ గావలయున్. 2. గ. నెమ్మిఁ. 3. గ. దప్పు. 4. గ. తెగ

విశ్వామిత్రచండాలసంవాదము.

క. ఏపారి తొల్లి త్రేతా, ద్వాపరములసంధి నొక్కవఱపు ధరిత్రిన్
తాపంబుఁ జేసె జనముల, పాపంబున వత్సరములు పంద్రెం డనిపా. 279

సీ. ఏఱులుఁ జెఱువులు నివురఁ గర్షనము లెం,డును బడఁ దగులతొరుచులును గమర
భూమియుఁ బస మాల గోమహిషాదిజీ,వధనంబు సొలియ భూవరులు మేర
దప్పి లోకములోని ధాన్యముల్ గొన నధ,ర్మం బంతకంతకుఁ బ్రబ్బ నధికు
లనదలఁ జెఱుపంగ యాగముల్ దేవతా,పూజలు నెడలంగ భూసురప్ర

ఆ. ముఖము లైనవర్ణములచొప్పు దప్ప నా,హారరహితజనము లచట నచటఁ
బడఁగఁ జూడ ఘోరభంగిగాఁ దఱి చయ్యె, నొక్కటలున్నవారి కెక్కుభయము.

వ. అట్టిసమయంబున. 281

క. మునిపతి విశ్వామిత్రుఁడు, దనయాఁకలి కెందు మెలఁగి దైన్య మెడలి యో
దనమాంసమూలఫలములు, జనుల నడిగి యెందుఁ బడయఁ జాలక డస్సెన్.

వ. తూఁగాడుచుం జనువాఁడు. 283

చ. పసరపుఁ జెంపపోవులును బందులవ్రొక్కలుఁ గుక్క[1]గుట్టలుఁ
ముసుఁగువడంగ భూమితలము దఱిఁ జారఁగఁ గప్పుచున్ మనిం
బస యొకయింత లేక పెఱప్రాణులనుం బొరిగొంచు నెప్డు ను
ర్వ్యసనతఁ గూరి యున్న వెలివాండ్రపల్లియఁ జేరి యయ్యెడన్. 284

వ. ఆర్తి నొంది యిట యట పోవం జాలక నేలం బడి యుండి ప్రాణంబులు వోవుట యుపేక్షింపం దగదు ప్రాణరక్షణంబ పరమధర్మం బని వితర్కించి తగనుపాయంబు చింతించువాఁ డప్పుడు చంపి [2]తిత్తొలిచి గాలిగొన వైచినకుక్కకడిమం బుఁ గనుంగొని. 285

క. ఇది దప్ప నిప్పు డియ్యెడ, నొదవదు ప్రాణంబు గావ నొం డొకఁ డిదియున్
మది నూహింపఁగ మ్రుచ్చిమి, [3]నొదవించి కొనంగ వలసియున్నది నాకున్.

తే. ప్రాణములు వోవకుండంగఁ బరిహరింప
నొం డుపాయ మెయ్యదియు లేకుండెనేని
మ్రుచ్చిమియు ధర్మ మగు నధమునిధనంబు
గొనుట యెందును ముఖ్యమై చనుట గలదు. 287

వ. కావునఁ జండాలధనం బగుసారమేయమాంసం బపహరించి ప్రాణహాని పరిహరించి కొందు నని నిశ్చయించి యుండ నర్ధరాత్రం బగుటయుఁ జండాలు రెల్ల నిద్రింప నల్లన లేచి చని యమ్మాంసంబు వట్టి తిగిచిన నచ్చేరువ నిద్రించుచండాలుండు విధివశంబున మేలుకని నీ వెవ్వండవు మాంసంబు మ్రుచ్చిలించెదవు నిద్రవోవం జుమ్ము నిన్నుఁ బొరిగొనియెద ననుటయు భయంపడి గ్రక్కున నమ్మునిపతి

1. గ. పుట్టెలఁన్. 2. క. తోలొలిచి. 3. క. నొదలించి.

నేను విశ్వామిత్త్రుండ నని పలికిన వాఁడు వినయంబున శయ్య డిగ్గి కరుణం
గన్నీ రొలుకం బ్రణమిల్లి కేలు మొగిడ్చి మహాత్మా నీతలం పేమి యని యడిగిన
నతండు సాంత్వనవచనంబుల ని ట్లనియె. 288

చ. దరికొనునాఁకలిం దనువిదాహము వుట్టినఁ బ్రాణహానికిం
బరిహరణంబు సేఁత కిది పాపమ యైనను గుక్కనంజు డే
భరపడి మ్రుచ్చిలించెద విభావసుఁ డెంత శుచిత్వసంపదం
బొరసియు సర్వభక్షకతఁ బొందును నన్నును జూడు మట్లగున్. 289

వ. అనిన విని చండాలుండు. 290

తే. కుక్క మృగములలో నెల్లఁ గుత్సితంబు
దీనిఁ దిని ధర్మమున కేల హాని సేయ
నోం డుపాయంబు వెదకికొ మ్ముజ్జ్వలాత్మ
యనుడు వానికి ముని యిట్టు లనియె నధిప. 291

క. విను బ్రహ్మవహ్ని నాకుం, బెనుఁప్రా పై యుండ నేను వెఱతునె యే నై
ననుఁ బోవనీక ప్రాణము, దనువున నిల్పుటయ చూవె ధర్మం బరయన్. 292

ఆ. బ్రదికి యున్న నేఁ దపంబున విద్యను, బాచికొనఁగ నేర్తుఁ బాతకంబు
నట్టు లగుట జీవితాధార మైనయీ, నంజు డిప్పు డెట్లు నమల కుడుగ. 293

చ. అనుటయు నంత్యజుండు నగి యట్టివిధం బధమంబు గాక నె
ట్టన యది ధర్మమే కటకటా మిముబోంట్లకు నిట్లు సేయఁగాఁ
జనునొకొ యన్న నమ్ముని ప్రశస్తుఁ డగస్త్యుఁడు దైత్యమాంసముం
దినఁడె నశించెనే యతనితేజముఁ బెంపును నంతనుండియున్. 294

వ. అనవుడు వాఁ డి ట్లనియె. 295

క. పరహితము సేయఁ బూనిన, పురుషుఁడు పాపంబు సేసి పొందఁడు కీడుం
బరమముని యగునగస్త్యుఁడు, పరోపకారార్థకృతి నభవ్యుం డగునే. 296

క. నావుడు మదాత్మ బ్రాహ్మణ, తావిద్వత్తాస్పదంబు దానికిఁ గా నే
నీవిధి యొనరించుట పా, పావేశము లేదు దీని కడ్డపడకు వే. 297

క. అని ముని పల్కిన నత్యంజుఁ, డను మాంసము విడువనోప కనుటగఁ దలఁపం
జనునె భవదీయతేజో, ధనహానికిఁ గరుణ పుట్టదా యెవ్వరికిన్. 298

వ. అనవుడు గాధినందనుండు. 299

తే. కరుణ గలవేనిఁ బ్రాణంబు గాచికొనఁగఁ
దలఁచునాకు నిమ్మాంస మి మ్మలఘుచరిత
యట్టు లైన మ్రుచ్చిమియు లే దనృత మెడలి
పడయువస్తువు సేయదు పాతకంబు. 300

వ. అనిన విని చండాలుం డి ట్లనియె. 301

క. అతిశయితపుణ్యదీప్తులు, ప్రతిగ్రహము నీచనరుని ♦ పాలం జేయన్
మతిఁ దలఁపఁ గూడునే వి, శ్రుతగుణ యే వెఱతు నింకఁ ♦ గుజనుల దూఱఁ బల్కన్.

వ. నీవలచినయట్లు సేయుమని సారమేయమాంసం బిచ్చినఁ బుచ్చికొని దానం బ్రాణంబులు రక్షించుకొని విశ్వామిత్రుండు సనియె నింద్రుండు తదనంతరంబ లోకంబులవడ దేఱ వర్షించె నంత హర్షించి యత్తపస్వివర్యుండు దపోవిశేషంబున దోషంబు నీఁగికొని మునిజనస్తుత్యం బగునిత్యవ్రతంబున విలసిల్లె నాపత్సమయసమాచారం బిట్టిద యని చెప్పిన భీష్మునితో భూవల్లభుండు ధర్మసూక్ష్మప్రకారం బింతదురవగాహంబగునే యీయితిహాసం బాకర్ణించుట నానందంబు విషాదంబు నొందె ననవుడు నతండు ధర్మంబు బహుశాఖాసమన్వితం బై యుండు రాజులకు నెల్లతెఱంగులు నెఱుంగవలయు విషాదం బేల యనవుడు నజ్జనవిభుండు. 303

భీష్ముండు ధర్మజునకు శరణాగతరక్షణసుకృతం బెఱింగించుట.

క. శరణాగతసంరక్షణ, పరులకు సమకూరు నెట్టి ♦ సాటిఫలము స
ర్వ్వరకరుణాకర పరమా, దరమున నెఱిఁగింపు నాకు ♦ దాని నెఱుంగన్. 304

ఆ. అనిన భీష్ముఁ డిట్టు ♦ లను ముచుకుందుండు, నాఁగఁ బరఁగుధరణి ♦ నాయకుండు
దనుజమంత్రిచేత ♦ వినినది యొకకథ, యఖిలపాపహరణ ♦ మాచరించు. 305

వ. అయ్యితిహాసంబు సెప్పెద దాన నీయడిగినయర్థంబు దెలియు ననవహితుండ వై యాకర్ణింపుము. 306

సీ. పాపాత్ముఁ డొకబోయ ♦ పక్షుల వధియించి, తినియును బెక్కు పట్టి ♦ కొనియు నదియు
బ్రదుకుగా దానికి ♦ బహుసాధనంబులు, సవరించుకొని మహా ♦ టవిఁ జరింప
నొకనాఁడు పెనువాన ♦ యును గాలియును ముట్టి, సకలజీవులకు నా ♦ శంబు పుట్టు
నట్టిది యై కాన ♦ యంతయు జలమయం, బైన బెగ్గిలి యున్న ♦ గాఢముగను

తే. [1]వేగ వట్రోడి యెల్లను ♦ వెడలి మిఱుత, నొకవనస్పతి చోఁపయై ♦ యున్న దానిఁ
జెంది రాతిరి యగుటయు ♦ శిలయ సెజ్జ, గాఁగ శీతార్తుఁడై యుండెఁ ♦ గౌరవేంద్ర.

క. ఆలుబ్ధకుఁ డత్తరువర, మాలోకించి కడుభక్తి ♦ ననియె నిచటిభూ
తాలిం గొలిచెదఁ గరుణా, శీలత నను గాచుటకు వి ♦ శిష్టవిభూతిన్. 308

వ. అని యిట్లు పక్షిధ్వంసకుండు శయనంబు ప్రాపించి యుండ నమ్మహీరుహంబుకోటరంబున వసియించి యుండునది యొక్కకపోతంబు దనవల్లభ యెటకేని మేఁతకుం బోయి రాక తడసిన శోకించి. 309

సీ. ఎచట నున్నదియొక్కొ ♦ యింతప్రొద్దొకచోట, నుండునే ననుఁ బాసి ♦ యుజ్జ్వలాంగి
యమ్మేను లేకున్న ♦ నిమ్మేనికలిమి ని, రర్థకం బధికాను ♦ రాగయుక్త
యగుసతిగుణముల ♦ నైహికాముష్మిక, సుఖసాధనంబులు ♦ సువ్రతికి
యేకారణంబున ♦ నే మయ్యెనో వాన, యేపునఁ దెగియెఁ గా ♦ నోపు నకట

1. చ. పెల్లు వట్రోడిఁ బడి యంత ♦ నుల్లి మిఱుత.

తే. నేమి సేయుదు మందిరం ౯ బిపుడు పాడు,వాఱుచున్నది యనఁగ నఱప్పలుకులెల్ల
బోయవలలోన నున్నకఱపోతి విని మ,నంబు సంతోషపూర్వమఱగ్నంబు గాఁగ.
క. పతిమదికి నింత యెక్కిన,యతివ గదా పుణ్యవతి ప్రియాలాపము లీ
గతి వినఁ గాంచితి జన్మము, గృతకృత్యం బయ్యె నాకు ౯గలిచితి జమునిన్. 311
వ. అని యుల్లంబునన యుగ్గడించి పతికిం దన తెఱం గెఱింగించి విధికృతంబునకు వగ
వం బని లే దని మఱియు ని ట్లనియె. 312
చ. శరణము సొచ్చినం దగఁ బ్రసన్నతఁ గైకొని రక్షణంబు నా
దరముగఁ జేయు టత్యధికధర్మముగా బుధకోటి సెప్పు సి
వరసి మహార్తు వీని శరణాగతు నోపినభంగి నాపదం
బొరయక యుండఁ జేయుము ప్రభూతపునీతునఁ గొంకు వోయెడున్. 313
క. అని యేర్పడ భాషించిన, విని శోకము డిగ్గ విడిచి ౯ విహగము గరుణం
దనజాతి సెప్పి తగ ని, ట్లనియె మనుజభాషణముల ౯ నాలుబ్ధకుతోన్. 314
క. ఓయన్న డస్సినాఁడవు, మాయింటికి నతిథి వైతి ౯ మసలక నీకుం
జేయ వలయు నాతిథ్యం, బేయది భవదీప్సితార్థ ౯ [1]మెఱిఁగింప వనా. 315
చ. అనవుడు నుల్ల మెంతయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి నీ
తున సకలాంగకంబులుఁ బ్రతున్నము లయ్యెడు దీనిఁ బాపవే
యనిన విహంగమంబు రయ ౯ మారఁగ నచ్చటిపుల్ల లెల్ల ము
క్కునఁ గొని తెచ్చి ప్రో విడి యఱకుంఠిత మైనదయాగుణంబునన్. 316
వ. ఆపొంతపల్లియకు రయంబునం జని పుల్లతల సంగతం బైనయింగలంబు. 317
క. కొని వచ్చి పుల్లప్రోవునఁ, దనుకంగాఁ జేసి నెమ్మి ౯ దళుకొత్తఁగ ని
ట్లను బోయతోడ మే నీ,యనలంబునఁ గాఁచికొనుట ౯ కై లె మ్మనఘా. 318
చ. అనవుడు వాఁడు గువ్వహృదయం బలరం దనయంగకంబు ల
య్యనలశిఖాకలాపమున ౯ నల్లన యల్లన కాఁచి శీతబా
ధన ముడుగంగఁ జేయఁగఁ బఱదంపడి యాఁకలి చాలఁ దోఁచెఁ దోఁ
చిన నెఱిఁగించె గువ్వ కది ౯ సేయ నుపాయము లేక యాత్మలోన్. 319
వ. వగచి వెలువెలంబాఱి తలంచికొని వాని కి ట్లనియె. 320
తే. ఖగములకు జీవనం బనఁ ౯ గలదె సంగ్ర,హించినట్టిది యాఁకలి ౯ కేమి యైన
మాకు దొరకొన్నఁ దిందుముఱగాక యైన, నీవు డస్సితి వాతిథ్య[2]నియతి వలయు.

—కపోతంబు దనశరీరమును బోయ కాహారంబుగా నిచ్చుట.—

వ. నాశరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము. 322
క. అని పలికి యగ్ని వలగొని, తనదేహము దానిలోనఁ, ౯ దడయక యిడినం
గని బోయ విస్మయంబున, మనమూనఁగఁ గొంత సేపు ౯ మ్రాన్పడి యుండెన్.

1. చ. మెఱిఁగింపు తగన్. 2. గ. నీతి.

వ. పదంపడి. 324

మ. కలదే యిమ్మెయిపౌరుషంబు జగతిం గారుణ్యమేపారి ని
ప్పులుఁ గిట్లిచ్చునె మేను నాదుచరితంబుల్ నిందకుం బట్టులై
తలఁపన్ వచ్చిన నింతికిన్ దగునె యేతత్కాంతతాఘోరచే
ష్టలు మానంగలవాఁడఁ బక్షి గురువై సంధించె సద్బోధమున్. 325

వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరం బగుటయు సంతి నిలువక. 326

మ. ఇది యిట్లాలిని బంధులం దొఱఁగి తాన్ సీయగ్నిలోఁ గూలె నా
ప్పిద మై యుండఁగ నిట్టితెంప యొలయం బెంపారు వైరాగ్యసం
పద పాపంబుల నెల్లఁ ద్రుంపఁగ మహాప్రస్థానపుణ్యాత్వ మొం
దెద నే నిప్పుడ యంచు మానసము శాంతిం బొంద నిర్వ్యాకులస్థై. 327

క. వలలోన నున్నపులుఁగుల, వెలువడఁగా విడిచి వలయుఁ బంపేయుఁ దనసం
గలపక్షినిహతిసాధన,ములు సచటనె యుండఁ బోరుఁ బోయు నియతుఁడై.

ఆ. అక్కపోతి నాథుఁ డగ్నిలోఁ బడుటకు, శోకవహ్నిఁ జిత్త మెసఁగఁ గులముగ
నెలుఁగు రాలుపడఁగ నిట్లని పలవించె, నశ్రుజలతరంగితాస్య యగుచు. 329

క. నాయాఁకలి కోర్వ వెప్పుడు, వేఁ డైనను నేఁ గొసంగ నుండి యనుభవిం
తాయాసపడుటఁ గనుఁగొని, నోయుదు నన్నుఁ బాసి యిటు సనుట దగ వగునే.

వ. అని వెండియు. 331

సీ. ఇగురుజొంపంబులనిం పారువిరులను, బలుపైనపొదలక్రేవలకుఁ దార్చి
సెలయేఱులందలితెలినీటఁ దనుపుసొం, పెలసినగిరుల తెరప్పలకుఁ జేర్చి
మావిమ్రోకల నెలవీదివలఁ జెన్నొందు,తోఁటలకడ సలిలతోడఁ గ్రిందు
యలరు నెత్తమ్ములకలిమిఁ జెల్వగుడిగ్గి,యలతీరభూముల నల్లఁ బొందు

తే. నన్ను మనమునఁ దేల్చి యానంద మొందఁ, గెలిసలిపెడుసీ దగుకేలిల మఱవ
నావశంబె ప్రాణేశ ప్రాణంబు లిపుడ, నిన్నుఁ గూర్చి యేఁ తెంతు సీకసన్నకడకు. 332

వ. అట్లుం గాక. 333

క. తేనియనుమరణమునఁ దన, మేను విడిచినట్టికాంత మేలిపదవిఁ గ
దాను నతండును నరిగి య,నూనస్థిరసుఖము లందుచుండుట విందున్. 334

క. అని పలికి యపుడ యనలము, ఘనముగ దరికొల్పి మది వికాసముఁ బొందం
దనవల్లభుఁ దలఁచుచు వల,గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్. 335

క. స్ఫురితవిమానముమీఁద న,మరతతి వేష్టింప రత్నమయభూషణసుం
దరదివ్యమూర్తి వెలిఁగెడు,వరునిఁ గలసి పరమసౌఖ్యవైభవ మెసఁగన్. 336

తే. లీల మీఱఁబో నచ్చరలేమపిండు, బలసి యభినందనము సేయఁ బొలిచె నిట్లు
సనినపక్షియుగ్మంబువర్తనముదోఁచెఁ, బుణ్యవర్తనుఁ డగుట నాకబోయకపుడు.

1. క. తెంపలకుఁ. 2. గ. నర్థితోడఁ.

వ. తోఁచిన నతండు. 338

క. ఏనును నిట్లగుదు ననుచు, నూనినకౌతూహలమున నుల్లము వొదలన్
మే నెల్ల ముంప్లు సింపఁగఁ, గానఁ దఱిసి గళితరక్తకలితాకృతి యై. 339

తే. అరుగు చుండువాఁ డాకపో దరవానలంబు, గట్టెదిరి కాననం బెల్లఁ జుట్టి మండ
సంప్రమోదితచిత్తుఁడై చక్కఁజొచ్చియొడలుదొఱఁగి దేవత్వంబు వడసియొప్పె.

ఉ. ఈయితిహాస మర్థిమెయి నెజ్జనముల్ వినినం బఠించినం
బాయు నుదాత్తగోహననపాతక మైనను భూరిసౌఖ్యముల్
వేయివిధంబులం బొరయు విన్ము తగన్ శరణార్థిఁ దోషితుం
జేయనినాఁడు కల్మషముఁ జెందు నొకప్పుడుఁ బాయ దేమిటన్. 341

వ. అని యిట్లు శరణాగతరక్షణఫలవిశేషప్రకటనం బగులుబ్ధకకపోతాఖ్యానంబు
సెప్పిన విని యప్పితామహునిమీఁదం బ్రీతివినయవిస్తారవిలోకనం బెలయ న
ప్పాండవాగ్రజుండు. 342

క. పాపంబు బుద్ధిపూర్వ,వ్యాపారము గాక తొడరినప్పుడు మనుజుం
డేపాట దాని నంతయుఁ, బాపికొనం జాలు సుజనబాంధవ చెపుమా. 343

వ. అని యడిగిన నయ్యార్యవర్యుం డాధరణీభరణధుర్యునకు నిట్లనియెఁ దొల్లి పరి
క్షిత్తనయుం డగుజనమేజయుం డనుమహారాజు దనకబుద్ధిపూర్వకబ్రహ్మహత్య
వాటిల్లినం దత్కిల్బిషంబు వాపికొనియె నది పురాణకథ యై మునులవలన వినం
బడు నత్తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 344

క. పాపంబు దొడరుటయు నా,భూపాలకుఁ బ్రజయు విడిచె భూసురులును నిం
దాపాత్రంబుఁగఁ జేసిరి, తాపము మదిఁ గదిరి యతఁడు దల్లడ మందెన్. 345

తే. అట్లు జనమేజయుఁడు వగ నారఁ గూరి
పురము వెడలి యొక్కరుఁడును బోయి కాన
నాంతరము సొచ్చి శౌనకుం డనుమునీంద్రు
నాశ్రమము రోసికొని చని యమ్మహాత్ము. 346

వ. కాంచి దండప్రణామం బాచరించి సవినయంబుగఁ గరంబులు మొగిచి నిల్చినం
జూచి యతండు. 347

చ. పెనుపొల వల్చుచున్నయది పీనుఁగుఁ జూచినయట్లు లయ్యెడున్
నినుఁ గనుఁగొన్న నీమెడకు నీ విది యేటికి వచ్చె దెక్కడేఁ
జనుము శిరంబు క్రిందుగ నజస్రము వ్రేలఁ గలాఁడ వీభవం
బునతుదిఁ గ్రూరకాకచయముల్ దొలువన్ నరకాధివాసి వై. 348

చ. అనుటయు గర్వ్హ కర్హుఁ డగునట్టిదురాత్మునిఁ బూజితవ్రతుల్
గని యిటు లంట యుక్త మటు గాన కదా భవదీయపాదవం
దన మొనరించి మీవలన దారుణపాపము వాచికొందు నే

ననుమది వచ్చినాఁడ సదయం బగుచూడ్కిఁ బరిగ్రహింపవే. 349

వ. అనిన విని కరుణాయత్తచిత్తుం డగు న త్తపోధనసత్తముం డి ట్లనియె. 350

క. విను కొంద ఱల్పబుద్ధులు, నను నెంతయు ధిక్కరింప । నవ్వాఁగ వారిం
గొనక బుధు లైనవిప్రులు, ననిమిషులును మెచ్చుచుండ । నలరెద నింకన్.

క. హీనప్రజ్ఞుఁ డకార్యము, లైనవి సేసి తుది వగచు । నతులప్రజ్ఞా
సానుమదాహూఢుఁడు వగ, నూనఁడు దురిత మనువఱితి । కోడక యునికిన్. 352

వ. ప్రజ్ఞాకార్యంబు లై యనుష్ఠింప వలయువాని జెప్పెద నీకుం బాపంబు నెడ ననుతాపంబు గలిగి ధర్మప్రవణుండ నై తే యనుటయు నన్నను[illegible]. 353

క. తాపసవర తీవ్రం బగు, పాపాగ్నిజ్వాలచయము । పాలుపడఁ బరి
తాపము నొందుచు ధర్మ, వ్యాపారజలాభిలాషి । నై యున్నాఁడన్. 354

వ. భవదీయకృప నాశ్రయింప వచ్చితి నన్ను రక్షింప వేయు[illegible] నన్ను[illegible]గ్రహింపుఁడు.

క. భీతి యొకటి గోరుటయును, నీతలఁపులలోన దీని । కిది గల దనుచుం గా
నే తెరువును గలుగవు మ, చ్చేతోగతి ధర్మవృత్తిఁ । జిక్కుట దక్కన్. 356

క. ఆతురత నీవు నాకడ, కేతెంచినదానఁ జేసి । యెలసినధర్మ
ద్యోతనకౌతూహలమున, నీతోఁ బడ వలసె వినుము । నిశ్చలుఁడ వై. 357

క. భూవిబుధుల కెయ్యది హిత, మావిధమున నడచువాఁడ । వగునది గ్రోషిత
భావంబు ప్రతిజ్ఞాతం, బై వెలయఁగ వలయు నీకు । నాజన్మమునన్. 358

చ. అనవుడు ధర్మవృత్తము మహాత్మకు నైజము దోషవృత్తికిన్
మునివర యేను భీతుఁడ సముజ్జ్వలవిప్రకులంబు నాకు ను
న్ననలకుఁ బాత్ర మెవ్విధము నం దెగి ద్రోహము దానియందు నా
మనము దలంప దింతకును । మాన్య భవచ్ఛరణంబు లంటెదన్. 359

వ. అనుచుం దదీయపాదస్పర్శనంబు సేసి యవ్విధంబునం గృతశపథుం డగుటయుఁ గరుణాగోచరంబగుచిత్తంబుతో న త్తపోధనవర్యుం డాదరమేదురం బవలోకనం బా భూపాలునిమీఁద నోలయ ని ట్లను న ట్లేనిం జెప్పెద నవహితుండ వయి యాకర్ణింపుము. 360

సీ. శ్రీమంతుఁడును బలశ్రేష్ఠుండు నగురాజు, భోగంబు దర్పంబుఁ । బోవ విడిచి
ధర్మంబు గైకొని । తపమును దానంబు, నధ్యయనంబును । యాగవిధులు
నాచరింపఁగఁ జూచి । యచ్చెరువడి యను, గ్రహము సేయదె భూతరాజి యతని
కధిప యయాతివాక్యమునర్థ మెఱిఁగింతు, వినుము సరస్వతియును దృషద్వ

తే. తియును ననుపుణ్యనదులందుఁ । దిరిగి తీర్థ, సేవ సేయుచు నధ్యయనావధాన
దాననిర్ధూతరాగత్వదయులు గలిగి, పరఁగఁ బాపకళంకలేపంబు వాయు. 361

వ. అదియునుం గాక యొక్కపరమస్మృతి సెప్పెద వినుము. 362

చ. దురితము సేసి తాపమునఁ । దూలిన నిం కిటు సేయ నన్మతిం

బొరసిన ధర్మసంచరణబుద్ధియ మే లని యూఁదినం గ్రియా
పరుఁడయి మేలు సేసినను బాదముపాదముగాఁ గ్రమంబునన్
విరియు సమస్తముం దదభివిష్టకళంకము నిర్భయంబుగన్. 363

చ. నరవర వాసవుం డడిగినన్ గురుఁ డిట్లని చెప్పె బుద్ధితోఁ
బొరయనిపాతకంబులు నబుద్ధికపుణ్యములన్ నశించు నం
బరమునఁ బట్టినట్టిమలపంకము గారములోన నద్దఁగా
విరిసినయట్లు నమ్ము మిది వేదము సెప్పిన నేనుఁ జెప్పితిన్. 364

వ. అని యిట్లు బహుప్రకారంబులం గారుణికోత్తముం డగునత్తాపసోత్తముం డా
భూవరు బోధించి తీర్థసేవాదిపునశ్చరణంబులం బరిపూతాత్ముం గావించి యశ్వ
మేధంబు సేయించిన నుజ్జ్వలుం డయి యజ్జనమేజయుండు నిజరాజ్యంబు పరి
పాలనంబు సేసె నని చెప్పి వెండియు. 365

భీష్ముఁడు ధర్మజునకు గృధ్రజంబుకోపాఖ్యానము సెప్పుట.

సీ. గాంగేయుఁ డిట్లనుఁ గౌంతేయపూర్వజు,నకు విదిశాపట్టణమున నొక్క
బాలుండు మృతుఁడైన బంధులు ప్రేతభూ,మికిఁ గొనిపోయి యమేయశోక
వివశాత్ములై పలవింపఁగా గ్రద్ద యొ,క్కటి వచ్చి మీర లిక్కడ భయంబు
దక్కియేడ్చుచునుండఁదగ దిదె క్రుంకెడుఁ, బ్రొద్దు రాక్షసులును భూతములుఁ బి

తే. శాచములు ప్రచ్చి తిన నిపు డేచి వచ్చు,జననమరణముల్ వింత లె చన్నశిశువు
తోన యందఱుఁ జనుటకుఁ బూని యుండు,వారలే పొందు పీనుంగు వైచి వేగ.

క. తెగి పోయినవా రేడ్చిన, మగుడుదురే వెఱ్ఱులార మానుఁడు మీరుం
దెగుదురు దడసిన నావుడు, నగు నట్టిద కర్జ మనుచు నందఱు భీతిన్. 367

వ. శవంబు విడిచి పోవం జూచిన నొక్కనక్క [1]బొక్కలోనుండి వెడలి వారలతోడ.

సీ. గ్రద్దమాటల కేల కడు భీతిఁ బొందితి, రక్కటా బాలుని నబ్జవదను
నిటు వైచి పోవఁగా నెట్లాడె నేడ్వఁడు, శోకంబు వోవ నిచ్చోటఁ గొంత
ప్రొద్దంతలో విధి క్రూరుండు గాకున్నఁ, బ్రాణంబు గ్రమ్మఱ రాక గల్గు
నో యెఱుంగుదురే యినుండును నస్తాద్రిఁ, జేరఁడు వెఱవక మీరు నిలువుఁ

తే. డనిన వారును మనమున నాస వుట్టి, మగిడి వచ్చిన గ్రద్ద యిమ్మందబుద్ధి
యైననక్కమాటలు విననగునె వికృత, మయ్యెఁ బీనుంగువచ్చునే యసువు లింక.

క. కడుబెట్టిదుండు కాలుఁడు, మిడుకమిడుక నపహరించు మీ రీయాసల్
విడువుఁడు బాలునికి సుగతిఁ,బడయుఁడు దానాదులైన బహుధర్మములన్. 370

వ. అని పలికిన నాగృధ్రంబువచనంబు లాక్షేపించి యజ్జంబుకంబు వారలనుద్దేశించి.

క. క్రూరంబు గృధ్రి మిట్టికు,మారకునిం జూచి చూచి మసలక పోవన్
మీ రెట్లోర్చెదరో క,న్నీ రిటు నను బోఁటులకును నిలువ కొలికెడున్. 372

1. క. గ. చ. బ్రొక్క.

క. దయ మాలి పోవ నేటికిఁ, బ్రయత్నమునఁ బొనుప వైదికబలమున మీకుం
బ్రియ మొనఁగ బ్రదుకు బ్రదుకం, డయినను మఱిపోవ రాదె యని చెప్పుటయున్.

వ. గృధ్ర యి ట్లనియె. 374

ఆ. ఏను బుట్టి వేయి నిన్నూఱు, మున్నూఱుఁ, గలవు వత్సరములు గాన నెందు
జాలు యావనస్థుఁ బ్రాణుని వృద్ధునిఁ, జచ్చి పోయి మగిడి వచ్చువాని. 375

క. ఒకటి గలదె వత్తురు వే, లొకగర్భంబునకు మృతులు [1]నుక్కి వ ...
క్కడు నేటిబుద్ధి పీనుఁగు,నకు బ్రదుకు కలుగు నిట్టిసత్వ్యాలు గలదే. 376

సీ. అనవుడు [2]నెగ వెక్కి యాబిడ్డ వైచి పో, దెడువారలకు సద్దుసేయుచు నక్క
వినుఁడు రాఘవుఁడు నేర్పున బ్రదికింపఁడే, మృతుఁ ద్విజసుతుని సుతుని మునుపు
సృంజయుకొడుకు నచ్చిన నారదుఁడు ప్రభావంబునఁ గ్రమ్మఱ వానిఁ దేఁడ
యట్టుల యొకసిద్ధుఁ డమరుండు మీయేడ్పు, లాలించి దయ బాలు మగుడఁగ

ఆ. నేని మేలు కాదె యిది యేల పోయెద, రనిన వారు మగిడి యుగము ఁగంచి
శిశుశవముచుట్టుఁ జేరి పెల్లేడ్చిరి, పసవి పసవి యంత నినుఁడు గ్రుంకె.

వ. ఆగృధ్రంబును జంబుకంబును నాఁకలిచేత వందురుచుండి తొలఁగ ... నాహారంబు గొనుటకై యివ్విధంబున దమతమపలుకు నేర్పున సజ్జనంబుఁ గ్రమ్మఱించెఁ బొద్దు గ్రుంకినం దా నచ్చోట నిలువ నేరదు గావున గృధ్ర యట మున్న వారు పోవునట్టి తెఱంగుమాట లాడె రాత్రి యైనం దనకు మేలు గావున నక్క వారలు దడయుటకుం దగినచందంబుఁ జెప్పె నది వాని కెఱుంగు ప్రేతవనవిహారనిరతుం డగుశంకరుండు కరుణాకింకరుండు నగుట నప్పుడు. 378

ఆ. అట్లు పసవి యేడ్చుసజ్జనంబులకుఁ బ్రత్యక్షమై వరంబు లడుగుడఁ డనిన
సంప్రమోదభక్తిసంభ్రమభరితులై, చక్క నపనిఁ జాఁగి మ్రొక్కి వారు.

క. బాలమరణశోకంబునఁ, దేలక యుండంగఁ గావు దేవోత్తమ నీ
వాలించిన బ్రదికితిమి దయాళుహృదయ పార్వతీప్రియా చంద్రధరా. 380

వ. అనుచు లేచి నిలుచుటయు శివుం డాశిశువుప్రాణంబు లొసంగి ... యున్నంపన్నుం డగువాఁ డని యాన తిచ్చి యాగృధ్రజంబుకంబులకు నాఁకలి యెన్నండును లేక యుండం బ్రసాదించి యంతర్హితుం డయ్యె సంతోషంబున నంతరంగంబులు నంగంబులుం బొదల సజ్జనంబులు బాలు నెత్తికొని పలుమఱుం జూచుచుఁ గౌఁగిలించుచుం జనిరి గృధ్రంబును జంబుకంబును ముదంబునం బొంగుచుం బోయి తమతమకులంబులలోఁ బ్రభూతంబులై ప్రవర్తిల్లె స్వార్థజనబాష్పప్రమార్జనంబు ప్రభువులకుం గర్తవ్యం బగుటకును నిజకార్యార్థు లగుకపటులనేర్పుమాటలతెరువు లెఱింగికొనుటకును నుదాహరణం బైనయీగృధ్రజంబుకోపాఖ్యానంబు. 381

1. క. యుక్తి వహమె; చ. యుక్తి నిజమె. 2. గ. నెక వెక్కి; జ. ఏకి వెక్కి.

క. వినినఁ బఠించిన వ్రాసినఁ, గొనియాడిన దురితపీడ గకుం దొలఁగి నరుం
డనుపమధర్మములకు భాజన మగు నాయుఃప్రవృద్ధి సంపద నొందున్. 382

భీష్ముఁడు ధర్మజునకుఁ బవనశాల్మలీతరుసంవాదంబు సెప్పుట.

సీ. అని వినతుండగు నా ధర్మసుతునకు, ముదమునఁ జెప్పి భీష్ముండు మఱియు
నిట్లను నిది యొక్క యితిహాస మధిప యాకర్ణింపు హిమవన్నగంబునందుఁ
గల దొక్క బూరుగు గడుఁబెద్దకాలంబు, ముదురు శాఖాశోభి మూలదృఢము
నారదముని యొక్కనాఁ డత్తరువుపొంతఁ, జని చని వేడ్క నిట్లనియె నెమ్మి
తే. బూరువా యింతపఱపును బొడవుఁ గల్గి, నీవు మృగపక్షిసంశ్రయణీయ మగుచు
నునికి గని ప్రీతి నడిగెద ననిలుచేతఁ, బడు[1]నొకప్పుడు తరులు నీపడమి యెట్లు.

క. పవనునకును నీకును బాంధవము గలదొ యతఁడు నిన్ను దయ రక్షింపన్
సవినయవృత్తిని బ్రదికితొ, చెవులకు నింపెసఁగ నిజము సెప్పుము నాకున్.

క. అనిన విని బూరు విట్లను, ననిలునిబల మస్మదీయ మైనబలముతో
నెనగా దేర్పడ వినుము పదు, నెనిమిది యగు నంశమునకు నెనయ దరయఁగన్.

వ. అని పలుకుటయు నమ్మునీంద్రుండు. 386

ఆ. అమ్మ చెల్ల యిట్టు లనకుము కొండలు
లోను గాఁగఁ బవనుచే నపాస్త
మహిమ గలుగు లెఱుఁగుమా భూతములచేష్టి
తములు వాయువశగతములు గావె. 387

క. అనుటయుఁ బెలుచని యెలుఁగున, ఘనమూలప్రబలశాఖ కాదుర్జయు న
న్నును దాఁకిన నతని ప్రభంజనుఁ డను నామంబునకు నసత్యత వచ్చున్. 388

వ. అని గర్వంపుమాట లాడిన యాశాల్మలిం జూచి సురమునిప్రవరుండు. 389

చ. మఱవక యుండు నీబిరుదు మాటలు నీవిటు లంట మారుతుం
డెఱిఁగెడు నెట్లు నంచు వెస నేఁగి సమస్తముఁ జెప్ప నాతఁ డే
డ్తెఱఁ జనుదెంచి నీవటు కడిందిమగండవు నిన్నుఁ దాఁకినం
జెఱుతఱు పేరు బూరుగ నశించితి గాకిట పల్క లేటికిన్. 390

మ. అని కోపంబునఁ బల్క నప్పవనుతో నా భూరుహం బింతపె
ల్చన నీ వాడెడునంతతక్కువనె పేలా లోకసామాన్యవృ
క్షనికాయంబును నన్ను నొక్కటిగ నిచ్చం జూచితే యన్న న
ల్లనినవ్వొప్పఁగ నాసమీరణుఁడు హేలాస్ఫారుఁడై యిట్లనున్. 391

క. ఒకనాఁ డజుండు నీనీడకు డబ్బాటరుగుదెంచుటయు నమ్మేలా
త్మకు ప్రేఁగై మన్నించిన, మెకమెకపడి తిట్లపలుకుమీ తగ రేపున్. 392

వ. అని పలికి బలుమొగంబుతోడం బోయిన నబ్బూరువు దలంకి. 393

1. చ. మహీజము లెల్ల నీ.

చ. మనుగడ దప్పినొక్కొ మునిమాటలు గైకొన నైతి నాబలం
బన నది యెంత యుగ్రత మహాబలు డాకను నోర్వఁ జాల నా
తని నొకభంగి గెల్తు నని తాఁ దలపోసి హరించె వానలుం
గొనలును జొంపముల్ నిడుదకొమ్మలు నే యగుడున్ రయంబునన్. 394

వ. అట్లు తన్నుం దాన విఱుచుకొని యున్నంత వేగుటయు. 395

చ. ప్రతినకు నీడుగా భయదభంగిఁ బ్రభంజనుఁ డేఁగుదెంచి యా
క్షితిరుహముం గనుంగొని యిసీ యిది నాపని నీవ చేసి తీ
ధృతి మతి సంతసింపు మిటు తేజముఁ బొందుము నీకు శాంతధన
ప్రతతికి నిర్వ్యథంబున దురపాయము మే లెఱిఁగింపు మంపునన్. 396

వ. అని యుల్లసం బాడి సముల్లసద్గతి నాసదాగతి సనియె నట్లు శాల్మలి పవనుచేత భంగంబు నొంది వగం గుందఁ బ్రబలునితోడ దుర్బలుండు గడఁగ మత్సరగ్రస్తుం డయిన నపాస్తవిభవుం డగు నని తెల్పునప్పవనశాల్మలీసంవాదంబు పుణ్యప్రదం బయిన యుపాఖ్యానం బని చెప్పిన. 397

ఆ. పాండవాగ్రజుండు పాపంబునకుఁ నధిష్ఠాన మెద్ది భరతసత్తమాగ్ర
గణ్య దాని నెఱుఁగఁగాఁ జెప్పు మనుడు నాతనికి భీష్ముఁ డిట్టు లనియెఁ బ్రీతి.

సీ. వినుము పాపముల కెల్లను నధిష్ఠానంబు, లోభంబ యది గాన లోలతయును
గ్రోధంబు మత్సరద్రోహంబులును బర,ధనదారవాంఛలు దైన్యపాటు
వ్రీడాక్షమాసత్యవిముఖభావంబును, గలిగించి ధర్మంబు గలఁచి నరుని
బ్రయి మాలి యేమిటి కయినను [1]గర్ధించు,వానిఁ గా నమకట్టుఁ గాన లుబ్ధ

ఆ. జనులఁ దొఱఁగి లోభ మనుతిరిం బడనిస,త్యవ్రతులను బరమధార్మికులను
బాపభీతమతులఁ బనిగొను లోభంబుఁ, జెందనీకు నీదుచిత్తవృత్తి. 399

వ. అనిన విని యజాతశత్రుం డజ్ఞానం బాపదలకును దుర్గతికిని మూలం బని వింటి దాని తెఱం గెఱింగింపు మనిన నాపగాతనయుం డమ్మనుజపతి కి ట్లనియె. 400

క. రోషము శోకము రాగ,ద్వేషము లభిమానదర్పవేగాలస్య
శ్లేషము లజ్ఞాన మని మ,నీషిజనము సెప్పు మాననీయచరిత్రా. 404

క. విను లోభము నజ్ఞానం,బును సదృశఫలప్రదముల పుట్టును లోభం
బున నజ్ఞానము గావున, జననాయక లోభ ముడుగ సౌఖ్యము లొందున్. 402

ఆ. అనిన ధర్మపుత్త్రుఁ డనఘ ధర్మంబు నా,నాప్రకారగతి విరసంగఁ బడు మ
దీయచిత్తమునకుఁ దేటపడంగ వి,శిష్టధర్మ మెద్ది సెప్పు మనుడు. 403

వ. ప్రియం బంది భీష్ముం డతని కి ట్లనియె. 404

భీష్ముఁడు ధర్మజునకు దమంబుపరిభావం బెఱింగించుట.

క. తమతమ కలవడువిజ్ఞా,నములతెరువు లాదరించి నానాగతులన్

1. అ. నర్ధించు.

సుమతులు ధర్మము దెలిపిరి, దమము పరాయణము ధరణీతమ యన్నిటికిన్. 405

తే. దమము నిశ్రేయసము పుణ్యతమము ధర్మ
సార మది వెలిగా ధర్మసంచయంబు
సిద్ధిఁ బొందునె దమముతో బుద్ధి పొందు
గనినఁ బొందనియున్నతుల్ గలవె యధిప. 406

క. దమముం గడచినసద్ధర్మము లే దని విందు నాశ్రమము లన్నిటికిన్
దమవంతుఁడు గామముఁ గ్రోధము లోభము మత్సరంబు దర్పము గెల్చున్.

క. శీలంబు మైత్రి కరుణ య,లోలుపభావము తితిక్ష లో నగునునిలో
కాలంబనీయసద్గుణ,జాలంబు దమంబురూపసంపద యధిపా. 408

క. గుహయందు నిహితి మనియెడు,మహనీయ బ్రహ్మపదము మహితదమత్వో
పహితుం డగువానికి స,న్నిహితం బని చెప్పుదురు మనీషిజనంబుల్. 409

వ. అని విశదంబుగా వివరించె. 410

ఆ. అట్లు దమముమహిమ యాదరంబున విని, యమృతసేవ సేసినట్లపోలె
హర్షమయమనస్కుఁ డై భీష్ము నడిగె నా,ధర్మనందనుండు తపమువిధము.

వ. అడిగిన నతం డతని కిట్లనియె. 412

భీష్ముఁడు ధర్మజునకుఁ దపంబువిధము సెప్పుట.

క. తపము నిదానము ధర్మ,ప్రపంచమున కెల్ల దానిఁ గ్రమమున వ్రతతం
త్రపరాయణులొనరింతు ర,ధిప ఫలమూలాంబువృత్తిఁ దృప్తిఁ బొరయుచున్.

క. విను మశనని గ్రహము దప, మనునభిధానంబు గలమహాధర్మము త
ద్ధనవంతుచిత్తవశగతిఁ, జను నఖిలస్థావరములు జంగమతతులున్. 414

తే. పంచవిధవృత్తు లగుమహాపాతకములు
లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు
లగుఁ దపంబున సత్యశౌచాదు లోలయు
నఖిలసిద్ధులు నటచేత నావహిల్లు. 415

వ. అనిన విని దేవపితృభూదేవగణంబులు సత్యంబు ప్రశంసించుఁ దదీయస్వరూపం
బును నది దొరకొను తెఱంగును నెఱింగింపు మని యడిగిన నజాతశత్రునకు
శంతనుపుత్త్రుం డి ట్లనియె. 416

భీష్ముఁడు ధర్మజునకు సత్యస్వరూపాదులు సెప్పుట.

క. సమతయు దమముఁ దితిక్షయు, నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య
త్వములు నహింసాదాన,క్షమాత్యాజన సూనృతములు సత్యముమూర్తుల్. 417

క. సత్యాకృతు లగుగుణములు, నిత్యానుష్ఠితసమగ్రనిర్మలయోగ
స్థిత్యభిముఖునకు సులభము, లత్యంతసుఖప్రదంబు లవి కార్యంబుల్. 418

చ. కుదురు సమస్తధర్మములǂకుదుర విను సత్యము యోగమోక్షస
త్పదములు సత్యకార్యములు ǂ పాప మసత్యము కంటె నొండు లే
దు దలఁప నశ్వమేధములు ǂ దొమ్మిదినూఱులు వెండి నూఱు నై
యొదవిన నీడు గావు భరǂతోత్తమ సత్యముతోడ నారయన్. 419

వ. అనిన విని ధర్మతనయుం డరిషడ్వర్గం బేమిట నుదయించు నెట్లు నశించు నెఱిం
గింపవే యనుటయు ననిమిషనదీనందనుండు ధర్మనందనున కిట్లనియె. 420

భీష్ముఁడు ధర్మజున కరిషడ్వర్గాదులు దెలుపుట.

సీ. మనుజేంద్ర సంకల్పǂమునఁ బుట్టుఁ గామంబు, గూపలు దేహాభిǂమానమునఁ
బరులదోషంబునఁ ǂ బ్రభవించుఁ గ్రోధ మ,క్కీడుతోడనయియు క్షీǂ ణీసు గాలియు
భూతాస్థిరత్వంబు ǂ బుద్ధిఁ గానమి లోభ, మనఘ జనించుఁ గాంǂచిన సడంగు
నజ్ఞానమున మోహ ǂ మావహిల్లు నధర్మ, లేపనజ్ఞనమున ǂ లేక తొలఁగుఁ

తే. గులమునను విద్య ధనమునఁ ǂ గలుగు మదము
మరలి వానిపెం పూహింప ǂ మ్రుంది పోవు
సాత్త్వికుఁడు గామిఁ బొడము మాǂత్సర్య మదియుఁ
జెడుఁ గురూత్తమ సాధుసంǂసేవనమున. 421

క. ఈయాఱింటను సకలా,పాయంబులు మానవులకుఁ ǂ బాటిలు వీనిఁ
బాయంగ జడియ నోపిన,ధీయుతునకు శుభము సద్గǂతియు సమకూరున్. 422

క. ఇవి దోఁడేళులభంగిం, గవియుఁ బురుషుధైర్యహానిఁ ǂ గనికొని ధైర్యం
బవలంబించిననరుఁ జే,రవు వీనికి నిదియ తెఱఁగు ǂ రాజవరేణ్యా. 423

తే. అధిప యివి ధార్తరాష్ట్రులǂయందుఁ జాలఁ
గలిగి యుండు నీబుద్ధి నొǂక్కండుఁ జొరదు
సారధీరతాసంపదుǂదారమతివి
గాన యింకను నిర్జింతు ǂ వీని నెల్ల. 424

వ. అని వెండియు. 425

క. హింసావిహారి యైనన్నృ,శంసుం డీయాఱుఁ గలుగుǂజనుకంటెను గీ
డంసప్రదేశలలితో,త్తంసీకరణోపలాల్యǂధరణీవలయా. 426

క. మే లనుభవించుఁ జుట్టము, లాలోకింపంగఁ గుజనుఁ ǂ డదియు నృశంసా
శీలమ పంచి కుడుచునతఁ, డేలోకంబునకుఁ జేర్చి ǂ యెసఁగ సుఖించున్. 427

వ. అని చెప్పి వెండియు. 428

ఆ. విను కుటుంబభృత్యǂజనజీవనంబుఁ ద్రి,వర్షములకుఁ గల్గుǂవాఁడు సధిక
మొదవినట్టియతఁడు ǂ నుర్వీశ యర్హులు, మాననీయసోమǂపానమునకు. 429

క. క్రతువు లొనరించుభూసుర,తతికిఁ గ్రియాశేషయోగǂదానాదులు దు
ర్గతిఁ గొఱఁతవడిన ధరణీ,పతి నెఱపఁగ వలయు వానిఁ ǂ బరికించి తగన్. 430

క. ధనధాన్యపశుసమగ్రుం, డనఁ బరఁగెడునట్టివైశ్యుఁ । డధ్వరముం జే
యనినాఁడు బ్రాహ్మణాధ్వర,మునకు నతనిసొమ్ము రాజు । పుచ్చి యిడఁ దగున్.

క. కుడువక పెట్టక శూద్రుఁడు, కడునెక్కుడు గూర్చినట్టి । కనకముఁ గొలుచుం
బుడమిపతి ధర్మకృతులకు, నిడునది సగము గొని మేది । నీశ్వరవర్యా. 432

క. విను విప్రులు పేద లగుట, మనుజేంద్రుఁడు బుద్ధిలేమి । మాతాపితృభా
వన నతఁడు వారిఁ బ్రోచినఁ, గనుమేలున కెల్ల గలదె । కౌరవనాథా. 433

క. ఆమద్రవ్యము మణియును, రామయు శుచు లగుటఁ గాదె । రామారత్నా
రామత దగ వగు దుష్కుల, మై మెచ్చుమి దోఁచెనేని । ననిరి మునీంద్రుల్. 434

క. అమృతము విద్యయుఁ బరమహి,తము సేయుటఁ బుచ్చికొండ్రు । దానిని దానిన్
సుమతులు విషమువలన నై,న మహీశ్వర నీచ మగుజ । నముచే నైనన్. 435

క. భూపాలక విను పంచమ,హాపాతకకరులుఁ బతితు । లక్కడులఁ బ్రా
ణాపాయాంత ప్రతికృతిఁ, బాపుదు రత్యధికపుణ్య । పరతను బాయున్. 436

క. యానాసనాన్నపానవి,ధానాదులఁ బతితు బెరసి । తాఁ బతితుఁ డగున్
మానవుఁడు దపోముఖధ,ర్మానుష్ఠానములఁ బాచు । నక్కిల్బిషమున్. 437

క. అనృతము పాతక మగు నై,నను వనితలయెడను బెండ్లి । [1]నవ్వున మృతి వ
చ్చిన సర్వధనముఁ జెడుచో, విను మది పాపంబు గాదు । విమలచరిత్రా. 438

క. ఏపాపమేని లేనిది, కాపురుషత నొకనిమీఁదఁ । గలిగించిన న
ప్పాపము సేసినవాఁ డగు, నాపోలువ యనంగ విందు । మార్యులచేతన్. 439

ఆ. తల్లిఁ దండ్రిఁ బాయఁ । దగ దకారణమునఁ, బాసెనేని వాఁడు । పతితుఁ డాస
నంబు సెజ్జ భోజ । నము చీర వటుకుమా,రులకుఁ బ్రీతి నొసఁగఁ । బొలియుఁ గీడు.

వ. అనియె నట్టియెడం గృపాణరణనిపుణుం డగునకులుండు సకలాస్త్రశస్త్రసార విశారదుం డైనయబ్భాగీరథీసుతునకు సవినయంబుగాఁ బ్రణమిల్లి ధను వుత్తమాయుధం బని చెప్పుదు రది సర్వజనసమ్మతంబు ధనువునకు బాణంబులకు వైకల్యంబు వాటిల్లినయెడం బరవీరప్రహరణంబునకు నాత్మత్రాణంబునకుం గృపాణంబు మే లని యుండుదు నాతలం పెట్టిదియో తెలిసికొన వలయుఁ దత్ప్రభవ[2] ప్రభావంబులుం దదీయపూర్వాచార్యునిం జెప్పవే యని యడిగిన. 441

భీష్ముఁడు నకులునకు ఖడ్గప్రభావంబు తెఱంగెఱింగించుట.

సీ. అతనికి నాతఁ డి । ట్లను బ్రహ్మ జగములు, సృజియించి భూతసం । సృష్టి సేయ
దివిజమర్త్యాదిజం । తువు లమ్మహాత్ము వి,ధించిన తెరువులఁ । దిరిగి బ్రదుకు
చుండ దైత్యులు సము । ద్దండత నన్యాయ,వర్తు లై సురముని । వ్రాతములకు
బాధ లొనర్ప న । ప్పరమేష్ఠి హిమశైల,తటమున వేయువ । త్సరము లధిక

తే. నియతిమెయిఁ దపమొనరించి । నిష్ఠఁ గ్రతువు, సేసె నయ్యగ్నిఁ[3]బుట్టె న । శేషలోక

1. క. నాఁడును. 2. చ. ప్రకారములుం. 3. క. సేయ నయ్యగ్ని.

భీతికర మగు నుగ్రంపు భూత మొకటి, ప్రాంశుకృష్ణమై దంష్ట్రలు ప్రజ్వరిల్ల. 442

ఆ. అప్పు డినుఁడు మాసె ననిలుండు సుడివడి, వీచె నుల్కలుగిలె నేలఁ దలఁకె
సురల మునులఁ జూచి సరసిజభవుఁ డిగి, నాదుమతను బొలయించు గాదు వినుఁడు.

వ. ఇది రాక్షసనాశంబునకుం దోఁచిన యుత్పాతంబు [1]లోకంబుల రక్షింపను రాక్షసుల వధియింపను సాధనంబుగా ఖడ్గంబుఁ గల్పించితి నని పలుక నాభూతంబు భూరూపంబు విడిచి ఖడ్గాకృతి గైకొని తనమెఱుంగులు దిక్కులు దీటుకొనం బొల్చెన.

క. కమలాసనుండు నిజచిత్తము భక్తిమయంబు సేసి తలఁచె సగుని ఫా
లముకంటిమంటతో నయ్యమరవరుఁడు డేగుదెంచె ననటికి నెప్పన. 445

ఉ. వచ్చినఁ దత్పదాంబురుహవందనపూర్వము గాఁగఁ బద్మజుం
డిచ్చెఁ గృపాణ మవ్విభుఁ డహీనసముద్యమలీలఁ గ్రాలుచుం
బుచ్చికొనంగ నాసభ యపూర్వమనఃప్రసుదంబునొందె పై
రచ్చెరువాటు నొందె నటు లయ్యసిఁ గైకొని మేను పెంచుచున్. 446

తే. హరుఁడు బెట్టుగ నవ్వె పెల్లార్చుటయును
విని సముద్ధతరయమున దనుజకోటి
మునుగఁ బఱతెంచి తాఁకిన మునుముకొని వ
ధించి యిల యెల్ల నెత్తుట ముంచె నతఁడు. 447

ఉ. దైత్యుల నిట్లు గీటడఁచి ధర్మము నిల్పి ప్రసన్నమూర్తిసాం
గత్యము నొంది యప్పరమకారుణికుండు త్రిలోకరక్షణా
దాత్త్యమునన్ వెలుంగుహరిఁ దద్దయు వేడుకఁ బిల్వఁ బంచి సం
ప్రీత్యభిరాముఁడై యొసఁగెఁ బెంపుగ నమ్మహనీయఖడ్గమున్. 448

వ. అట్లొసంగినం గైకొని దుష్టదమనం బాచరించుచు నుండె నవ్విష్ణుండును మహాస్త్ర రూపం బగు నయ్యాయుధంబు పదంపడి మరీచి కొసంగె మరీచి భార్గవునకు భార్గవుం డనేకమునులకు మును లింద్రునకు నింద్రుండు లోకపాలురకు నొసంగెఁ గ్రమంబున మనుప్రభృతు లైన మానవేంద్రులు వడసి నిజసంతతికి నిచ్చుచు వచ్చి రందు దుష్యంతుండు భరతున కిచ్చె నాభరతువంశంబునందు ఖడ్గ సంప్రదాయంబు గలిగి వచ్చె నొకముని యనుగ్రహింప ద్రోణుం డధిగమించి కృపున కిచ్చెఁ గృపునిచేత మీ రేవురుం బడసితిరి విశేషించి యీవిద్యయం దత్యంతాదరణవంతుండ వగుటం జేసి దీనివలన వెలసితివి నిస్త్రింశంబునకు నక్షత్రంబు గృత్తిక యగ్ని యధిదేవత గురుండు రుద్రుం డని చెప్పి వెండియు ని ట్లను నసి విశసనంబు ఖడ్గంబు [2]తీక్ష్ణధారంబు దురాసదంబు శ్రీగర్భంబు విజయంబు ధర్మపాలం బన నెనిమిది పూజ్యనామంబులం బరఁగి కృపాణంబు ప్రహరణంబులలోనం బ్రధానం బై నెగడుచుండు. 449

1. గ. సురల రక్షింపను. 2. చ. తీక్ష్ణవర్మంబు.

క. సుమహిత మగునీకథ్గా,గమ మగుపుణ్యకథ వినఁగఁ గాంచినపురుషుం
డమితయశంబును నధిక,ప్రమదంబును సద్గతియును బడయుఁ గుమారా. 450

క. అని యిట్లు నకులునకు భీ,ష్ముని చెప్పినకథ సుచిత్రమున విని కుంతీ
తనయాగ్రజుండు పురికిం, జని యెడు ప్రొద్దగుడు వినయసంభృతుఁ డగుచున్.

వ. సముచితంబుగా నమ్మహాత్ముని వీడ్కొనిచని యోగ్యవర్తనంబులాచరించి వినోద
గోష్ఠి నుండి విదురునిం దమ్ముల నుపలక్షించి ధర్మార్థకామంబులయం దుత్తమ
మధ్యమాధమత్వనిరూపణంబు సేయుఁడు చూత మని పల్కిన నవ్విభునకు
విదురుం డి ట్లనియె. 452

—— ధర్మజునితో విదురాదులు ధర్మార్థకామంబుల తారతమ్యంబు చెప్పుట. ——

క. విను ధర్మంబున ధన మగు, ధనమున సిద్ధించుఁ గామతంత్రం బటు గా
వున మధ్యమంబు నధమము, ధనకామము లుత్తమంబు ధర్మం బధిపా. 453

చ. అనవుడుఁ బార్థుఁ డిట్టు లను నర్థము మూలము ధర్మకామవ
ర్తనముల కట్లు గాకయు విరక్తత నొంది జటాదిధారణం
బునఁ జరియించువారికిని భూవర యర్థము దేహకృత్యసా
ధన మసురేజ్యకర్మ్యలును దానిన మే లని పూని చెప్పరే. 454

వ. కావున నర్థంబు ప్రధానం బనుటయు నకులసహదేవు లేకవాక్యత ని ట్లనిరి. 455

తే. అర్థధర్మంబులితరేతరాశ్రయములు, గాన వానిలో నొకఁడూఁదుమాన వేంద్ర
జగము పోకులఁ బుచ్చునసంభృతార్థుఁ, డైనవానికిఁ గామ మప్రాప్య మరయ.

క. తమలో సరి ధర్మము న,ర్థము నర్థంబునకుఁ గామతంత్రము ఫలరూ
పము గావున నప్పురుషా,ర్థమునుం గొనియాడ వలయు ధరణీనాథా. 457

వ. అనిన విని పవననందనుం డి ట్లనియె. 458

క. దధిసారముచందంబున, నధిపా ధర్మార్థసార మగుకామరసం
బధమ మనుతలఁపు సుఖసం,విధానబాహ్య మని నీవివేకమ యెఱుఁగున్. 459

క. విను మళి యలరునఁ దేనియఁ, గొనుగతి నత్యంతసుఖము గొన నగుఁ గామం
బున నధికసుఖము లొందని, జనుసిరి యెనుకొల్చు లేనిసస్యమ కాదే. 460

తే. అనఘ ధర్మార్థకామంబులందు నొకట, నర్థిఁ దగిలినమానవుం డధముఁ డొకటి
మాని వర్తించునాతఁడు మధ్యముండు, నడపు నన్నింటి నుత్తమనాయకుండు.

క. అని యి ట్లందఱుఁ జెప్పఁగ, విని చిఱునవ్వున ముఖారవిందము చెలువం
బినుమడిగా ధర్మజుఁ డి, ట్లను వారలఁ గలయఁజూచి యాదర మెసఁగన్. 462

వ. ఏ నడిగిన తెఱంగునకు విదురునివాక్యంబు సిద్ధాంతంబు దక్కటివారివచనంబులు
నొక్కొక్కమెయి నాదరణీయంబు లది య ట్లుండె నామతంబు వినుండు. 463

క. భూతములు జరామరణో,పేతంబులు గాన మోక్ష మెదఁ గోరుట మే
లాతతవర్గత్రయసం,జాతమనోదుఃఖభారసహుఁ డగుకంటెన్. 464

వ. అది గోరిన దొరకొను నే యందు మేని. 465

క. మనమున ధర్మము నర్థం,బును గామముఁ గెలుకొనక ✽ పొరపొచ్చెము లై
చన సుఖదుఃఖంబుల మద,మును దైన్యముఁ బొందక మునికి ✽ నాయుష్కర మగున్.

వ. అనిన విని వార లందఱు నభినందించిరి మఱునాఁ[1]డు నదీనందనుం గొలిచి యుండి ధర్మనందనుండు నరపతులకు వలయువారును వలవనివారును నెట్టివా రని యడిగిన నమ్మహాత్ముం డమ్మహీపతి కి ట్లనియె. 467

ఉ. తాలిమిఁ బేర్చువారలును ✽ ధర్మవిధిజ్ఞులు సత్యవంతులున్
లోలత లేనివారు మదలోభనిరర్థకకోపహీనులు
శీలసమేతులుం బలుక ✽ నేర్చుట కార్యము కొన్న పంపునం
జాలుట గల్గుభృత్యులును ✽ సంపద సేయుదు రాత్మభర్తకున్. 468

ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడుఁ ✽ గొండెయుఁడున్ జడుఁడుం గృతఘ్నుఁడున్
నేరనివాఁడు బొంకరియు ✽ నిందకు నోర్చునతండుఁ బందయున్
ధీరత లేమి దుర్నయ మతివ్యసనత్వముఁ గల్గువారలుం
జేరువ నున్కి భూపతికిఁ ✽ బెట్టి యొనర్చు నరేశ్వరోత్తమా. 469

క. ఒప్పనిగుణములఁ బరఁగెడు,నిప్పురుషాధములలోన ✽ నెల్లఁ గృతఘ్నుం
డొప్పఁడు గడు ని ట్లగుటం, జెప్పెద నితిహాస మొకటి ✽ నిప్పుడ నృపా. 470

వ. అది కాశ్యపగౌతమాఖ్యానం బనం బెద్దలగోష్ఠిం బ్రవర్తిల్లు. 471

భీష్ముఁడు ధర్మజునకు నాడీజంఘుని చరిత్రంబు సెప్పుట.

చ. విను మొక బ్రాహ్మణుండు కులవృత్తము [1]పెంపుఁ దొఱంగి బోయవా
ని నొకత [3]గర్తిఁ జేసికొని ✽ నెమ్మిఁ గిరాతులఁ గూడి వేఁటకుం
జనుఁ దిను మాంస మద్దురితసక్తుఁడు భోగపరుండు గావునన్
ధనము ఘటింపఁగాఁ దగువిధం బని చూచి వణిగ్జనంబుతోన్. 472

వ. చెలిమి సేసి కొందఱు గోమట్లు బేహారంబు వెంట దేశాంతరంబునకుం జనఁ దానును వారితోడం గూడి పోవం బోవ గిరిగహనదుర్గమస్థలంబున నొక్క వనగజంబు. 473

ఆ. సాతులోని కుఱికి ✽ జనముల నుస్మద,లీల నేలఁ బెట్టి ✽ కాలఁ జదురఁ
జొచ్చుటయును భీతి ✽ విచ్చి సర్దిక్కులఁ, బఱచి రెల్లవారుఁ ✽ బగఱయమున.

క. ఆయనయుఁ గాందిశీకుం, డై యుత్తరదిక్కు వాఱి ✽ నతిదూరముగా
నాయెడ నొకమార్గము గని, పోయెను దాను నట పోవఁ ✽ బోవం గెలనన్.

తే. పొదలతఱచున జొంపమై ✽ పొడవుఁ బఱపుఁ,గలిగి వట్రువఁదనమునఁ ✽ జెలువుమిగిలి
యున్న వటభూరుహముఁ గని ✽ యుల్ల మచట, నిలువఁ గోరిన నాస్త్రాని ✽ నీడఁ జేరి.

క. వనలతలకుసుమగంధము, గొని సుడివడుగాడ్పు డప్పిఁ ✽ గొండొక దేర్పం

1. క. డుచితకృత్యంబులు దీర్చి సురనదీనందను పాలికిం బోయి కొలిచి. 2. జ. తెల్లఁ. 3. క. గల్సి; గ. గల్చి; అ. ఆలి

దను పారునచటఁ గూర్చుం, డె నతం డట్లుండ నచ్చ-టికి లలితగతిన్. 477

వ. ఒక్కమహాబకంబు వచ్చె నది పద్మభవునకుం బ్రసాదపాత్రంబగుచు నాడీజంఘుం డను రాజధర్ముండు ననుపేళ్లం బరఁగు నాకొక్కరకు సమ్మిత్రనివాసం బై యుండు నప్పక్షి యక్కెతెంచి యవ్విప్రునిం గాంచి ప్రియంబు దలకొనుచూడ్కి నాదరించి. 478

క. ఎందుండి యేమిపనికై, యెందుల కరిగెదవు భూసు-రేశ్వర ప్రీతిం
బొందితి నినుఁ గని తగియెదు,విండ వయితి నాకు నీమ-ర్విధముం జెపుమా. 479

వ. అని యడిగిన నతం డేను మధ్యదేశీయుండ గౌతముండ నొక్కమహనీయచరిత్రుని పుత్త్రుండ నాలస్యంబున వేదాధ్యయనాదివిప్రకర్మవిరహితుండనయి కామలోలత్వంబున బోయత యిల్లాలుగా బోయలం గలసి యుండి పేదఱికంబునకు నలసి బేహారంబువెంట నొక్కసాతుం గూడి పరదేశంబునకరుగుచోట గిరిగహనదుర్గమప్రదేశంబున. 480

క. వనకరి యొక్కటి యాసా,తునకుఁ గవిసి జనచయంబు-ద్రుంపఁ దొడఁగుడుఁ
విను మెల్లవారునుం గను,కనిఁ బఱచిరి భీతి నేను -గాననభూమిన్. 481

ఆ. పఱచి దిక్కు దప్పి -భాగ్యంబుకల్మి నీ, దైననిలయమునకు -నరుగుదేరఁ
గంటి ననిన మేలు-గాక నీదారిద్ర్య,మపనయింతుఁ జింత -యపనయింపు. 482

వ. అంతకు నియ్యాతిథ్యంబుఁ గయికొను మని రుచిమంతంబు లగుమందాకినీమీనంబులు సుపక్వంబులు సేసి మధురంబు లగువన్యఫలంబులు దెచ్చి తృప్తి యగున ట్లుగా నతనికి నాహారవిధియొనర్చి రాత్రియగుటయుం బల్లవపుష్పసాంద్రంబగు శయనంబు గల్పించి యబ్బకపతి యద్ధరణీసురునితోడిసముచితసల్లాపంబులను సుఖనిద్రను నారాత్రి గడపి వేగుటయు నవ్విప్రు నాలోకించి. 483

క. విను మిత్త్రుండును రజతముఁ, గనకము బుద్ధియును నాల్గు-కారణములు మ
ర్త్యునిదారిద్ర్యము వాయుట,కని దేవగురుండు సెప్పె -నన్నిటిలోనన్. 484

క. మిత్త్రం డెక్కుడు కాశ్యప,పుత్త్రుఁడ నగునేను నీకు -భూసురవర స
న్మైత్రి యనుష్ఠించెద నటె, పాత్రము గాకుండు దే య-పారశ్రీకిన్. 485

తే. నాసఖుండు విరూపాక్షు-నామధేయుఁ, డతనిపురము మధువ్రజ-మదియుమూఁడు
యోజనము లిచ్చటికి దాని-[1]కుల్ల తెరువు,వట్టి వే చనియాదైత్య-భర్తఁ గనుము.

క. కాంచి యతనితో నేఁ బు,త్తెంచితి నని చెప్పు మతఁ డతి-ప్రీతుం డై
కాంచనమును రత్నంబులు, నంచితుఁ గాఁ జేసి యిచ్చు -నప్పుడ నీకున్. 487

క. అని యప్పురిదెస సెప్పినఁ, జని యాతం డతనిఁ గాంచి -సముచితభంగిన్
వినిపించె రాజధర్మున, కనుగల మగుసఖుఁడ ననియు -నతనిపనుపునన్. 488

తే. అరుగుదెంచితి ననియు ధ-నార్థి ననియు

---

1. క. కున్న తెరువు.

వ. అట్లగ్నిసంస్కారంబు సేసి నీవు వచ్చినయనంతరంబ తచ్చితాసమీపంబున. 516

క. కడు నర్మిలిఁ గ్రేపుం జను, గుడుపఁ దొడఁగె నొక్క సురభి[2] గురుపాల్సేరయం
బడువత్సవక్త్రఫేనము, సుడిగాలిం దూలి పడియె సొదపై ననఘా. 517

వ. దానంజేసి యన్నాడీజంఘుండు సంజీవితుం డయి యెప్పటియట్ల యొప్పెడునా
కారంబుతో నరుగుదెంచుచున్నవాఁ డిట్లగుటకుం గారణంబును సద్దేవునిదివ్య
చిత్తంబుమహానుభావంబ. 518

క. అని చెప్పె నంత బకపతి, ననుదెంచెను దనుజపతికి సమ్మద మొసఁగన్
మును వాసవుఁ డజువాక్యము,నన పాశనిబద్ధుఁ జేసినాఁ డవ్విప్రున్. 519

క. ఆనాడీజంఘుండును, దాని నెఱిఁగి భూసురునకుఁ దనకతమున న
ద్దీనదశ యగుట కోర్వక, వానివిడుపు గోరి వేఁడె వరముగ నింద్రున్. 520

చ. అతఁడును దివ్యబోధమున నాసమయంబున బ్రహ్మసత్కృపా
న్వితుఁ డగు టేర్పడం గని వినీతతముం డగురాజధర్మవాం
ఛిత మొనరించె విప్రునకుఁ జేర్చిరి తెచ్చినవారు తద్ధన
ప్రతతియు దైత్యనాయకుఁడు పంప బకాధిపుఁ బ్రస్తుతించుచున్. 521

వ. అవ్విప్రుండు ధనసంచయంబు మోచికొని మరలి మరలి చూచుచు సంభ్రమం
బునం బోయెఁ దదనంతరంబ. 522

క. సురపతియుఁ ద్రివిష్టపమున, కరిగె బకాధీశుఁడును నిజాలయమునకున్
గరిమంబు మెఱయఁ జనియెం, బరితుష్టుం డగుచు దైత్యపాలుం డనుపన్. 523

క. అని చెప్పి తాత యిట్లను, మనుమనితో నాదరమున మఱియును బ్రహ్మ
ఘ్నునకును నిష్కృతి గలుగును, వినుము కృతఘ్నునకు లేదు విమలచరిత్రా.

క. ఆరయ మిత్త్రద్రోహము, దారుణ మగుపాతకము కృతఘ్నతకంటెన్
వైరము గొని విడువవలయు, నారెండుదెఱఁగులవారి నాప్తుల నైనన్. 525

క. మిత్త్రం బైహికములు నా,ముష్మికములు నైనభద్రములు దలకొలుపున్
మిత్త్రధనంబులలోనను, మిత్త్రుఁడ యెక్కుడనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్. 526

క. ఉత్తమకులజుఁడు సుగుణా,ఢ్యుఁడు నస్నేహమతియు నగుమిత్త్రునకుం
విత్త మెలర్చు తెఱంగున, బొత్తు మనఁగ వలయు శుభముఁ బొందవలసినన్.

వ. అని యిట్లు కృతఘ్నతయు మిత్త్రద్రోహంబును నధికపాతకంబు లగుటయు సన్మి
త్త్రుఁ బాటించుట శుభంబుఁ జేయుటయు భీష్ముండు భీమాగ్రజునకుం జెప్పె
ననిన విని యయ్యుత్తమపురుషులయడుగుటలును నుత్తరం బిచ్చుటలును
నింతలెస్సలై చెల్లెడునే యట మీఁదఁ జెల్లిన తెఱంగు లెఱిఁగింపు మనుటయు.

చ. శ్రయభయదర్పితక్షుభితసామజమర్దనరక్షణక్రియా
శ్రయణవిలాసభాసురభుజా చరణప్రణతామరవ్రజా

2. క. గురిపాల్సేరయం; బ. గుచివాల్సేరయం.

జయ[1]విభవప్రభుత్వ[2]ధనసంపదుదాత్తచరిత్రకీర్త్యపా
నయనకృతార్థసేవకజనా మునిసంభృతయోగపూజనా. 529

క. తరణిశశినేత్ర జగదుప,[3]కరణచణచరిత్ర బోధగాత్ర తపస్సం
భరితశమమునిమనోజ్ఞా, భరణీయప్రాజ్ఞ విశ్వభారవిధిజ్ఞా. 530

మాలిని. వరదచరణలీలా వైకృతాగమ్యశీలా
విరతినిరతసేవ్యా వేదవిద్యావిభావ్యా
నిరవధికవిభూతీ నిశ్చయాతీతరీతీ
భరితకరుణదృష్టీ భక్తమాధ్వీకవృష్టీ. 531

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందుఁ దృతీయాశ్వాసము. 532



1. క. విజయ. 2. జ. ఘన. 3. చ. కరణీయచరిత్ర.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శాంతిపర్వము, చతుర్థాశ్వాసము.





శ్రితవక్షస్స్థలగౌ
రీశ్రితవామాంగసుభగరేఖాసంప
త్త్యాశ్రాంతతనూలలిత స
మాశ్రితజననిత్యఫలిత హరిహరనాథా. 1

### భీష్ముండు ధర్మజునకు సర్వోత్తమం బగుధర్మంబు సెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు బహుప్రకారంబుల శాంతనవుండు వివరింప రాజధర్మంబులు విని ధర్మనందనుండు దమ్ములుం దానును బ్రియం బందె నమ్మందాకినీనందనుం డతనితో నాయెఱింగినతెఱంగునం బ్రజ్ఞాకరంబు లగువాక్యప్రకరంబు లుపన్యసించితి నింక నేమి విన నిచ్ఛ సేసెద ననిన నా దేవవ్రతునకు నన్నరదేవోత్తముండు వినయం బెసంగ వినతుండై. 2

క. రాజోచితధర్మంబుల, యోజ విశదభంగిఁ జెప్పి తుజ్జ్వలవిసర
త్తేజోధన నాకు సకల, భూజనపరమహితధర్మముం దెలుపు దయన్. 3

క. ఉత్తమ మెయ్యది నావుడు, నత్తటినీనందనుఁడు సమాదరసన్య
క్చిత్తుఁ డగుచు నక్కురుభూ, పోత్తమునకు నిట్టు లనియె నుర్వీనాథా. 4

తే. విను మనేకవిధంబుల విస్తరిల్లు, ధర్మములయందు నొకండును దలఁప నిష్ఫ
లంబు లే దాత్మమోక్షావలంబి యైన, ధర్మ ముత్తమ మండ్రు తత్త్వజ్ఞు లధిప.

క. ప్రియములు నప్రియములును హృ
దయమునఁ బోరయమియ మోక్షదం బగుధర్మం
బయ మహితా తద్బోధవి
షయ మగునితిహాసముం బ్రసన్నాకృతిగన్. 6

వ. చెప్పెద నాకర్ణింపుము సేనజితుం డనురాజు పుత్త్రశోకార్తుం డయి యున్నయెడఁ దదాప్తుం డగువిప్రుం డతని కిట్లనియె. 7

క. ఇది యేమి శోకమున వం, దెదు పుట్టినవారి కెల్లఁ ◊ దెరు వారయఁగా
నిదియె భవత్సుతుఁ డొకనికె, వదలు వనట మూఢునట్లు ◊ వనరం దగునే. 8

వ. అనిన విని యజ్ఞనపతి వీ వేమిటం జేసి వగపు వారిం తనవుడు నతం డతని కి ట్లనియె. 9

క. కదియుం గాఢముఁ గాఢము, నదిలో మఱి కొంతసేపు◊నకుఁ బాయును నె
మ్మది నట్లుగఁ దలఁపఁగ వల, వదె పితృపుత్త్రాదిబంధు◊వర్గము నధిపా. 10

క. తనకుం దా నెర వనినను, విను బంధులు నతమె [1]యన్వి◊వేకంబున నే
పనులపయిఁ జేయ నర్హిలి, నను వగ వొంద దది కార◊ణముగ నరేంద్రా. 11

క. నరనాథ సుఖము దుఃఖముఁ, బరువడిమెయిఁ బొరయుఁ గాక ◊ పన్నుగ నరుసిం
బొరయునె యం దొక్కటి యవి, పొరసిన వల దూఁద మోద◊మును ఖేదంబున్.

క. ఇది నాయది యనునూఁత, స్సది నెయ్యది పట్టుకొల్పి◊నను వాసిత మై
తుదిఁ జేటు నొంది వానికి, నది శోకము నావహించు ◊ నత్యంతంబున్. 13

క. వినుము పురాతనజన్మం, బునఁ జేసినయట్టికర్మ◊ములఫలములు ప్రా
జ్ఞని నైనఁ బొందు వానికి, మనుజేశ్వర యందు ధైర్య◊మహిమయ చుమ్మీ. 14

క. పరమసుఖము దృష్ణ యుడుగు, టరయఁగ ని ట్లగుట పింగ◊ళాలాపములం
బరిబోధిత మగు ధరణీ,శ్వర చెప్పెదఁ దెలియ వినుము ◊ వాని తెఱంగున్. 15

వ. పింగళ యనువేశ్య దనకూర్చువానిరాక వార్చి పెద్దయుం బ్రొద్దు వోవునంతకు నుండి వాఁడు రాకుండుటయును. 16

ఆ. ఏను వేఁచు అగుడు ◊ వాని నివ్వేఁదుఱ, [2]పట్టఁ జదురు గలదె ◊ భ్రాంతిదొఱఁగి
యొంటికంబ మొప్పు◊నింటివాకిళులుదొ, మ్మిదియు నెఱయ మూసి ◊ నిదుర వోదు.

క. పొంతకు వచ్చినవానిన, కాంతునిఁ గాఁ గొనుచు నొగునిఁ ◊ గాంక్షింపక యే
నెంతయు నూఱడి మనమునఁ, జింత యొకఁడు లేకయున్నఁ ◊ జెందు సుఖంబుల్.

క. ఆశయ యింద్రియజయము వి, నాశముఁ బొందించుఁ గావు◊నం దొఱఁగెద నే
నాశను సౌఖ్యము నిచ్చు [3]ని, రాశయ యని పలికి యట్టి ◊ దై నిద్రించెన్. 19

వ. అని విప్రుం డుపదేశించినవాక్యంబులం గలంక దేఱి సేనజిత్తు సుఖి యయ్యె నీవును నందలితాత్పర్యం బనుసంధించి శాంతి నొందు మని చెప్పినఁ గుంతీతనయాగ్రజుండు శాంతనవుతో భూతక్షయావహం బగుకాలం బతిక్రాంతం బగుచున్నయది యట్లుండ జనంబుల కెయ్యది కర్తవ్యంబు లుపదేశింపు మనిన నమ్మనుజపతిం బ్రీతిం గనుంగొని యమ్మహితాత్ముండు పితాపుత్త్రసంవాదం బను నితిహాసంబు గల దాకర్ణింపుము దాన నీయడిగినయది దేటపడు నని పలికి యి ట్లనియె. 20

1. గ. యవ్వివేకంబున. 2. చ. పట్టఁ జదువు గలదె; జ. పట్టి చదువఁ గలదె. 3. క. నిరాశత.

మేధావి యను బ్రాహ్మణకుమారుఁడు తనతండ్రితోఁ జేసినసంవాదము.

సీ. వేదవిదుం డగువిప్రనందనుఁడు మే, ధావినామకుఁడు మేధావివరుఁడు
సత్సమయంబున జనకుతో నాయువు, జనులకు వేగంబ చనుచు నుండు
దీనిపైఁ గనువెట్టి ధీరత దలకొల్పి, మేలు వాటిల్ల నేమ్మెయిఁ జరించు
వారొకో యనవుడు వానికి నిట్లనుఁ, దండ్రి యాలును నపత్యంబుఁ గలుగు
ఆ. తెఱఁగు నడపి యజ్ఞతృప్తనిర్జరుఁ డయి, శమము నొంది కాననమున కేఁగి
సౌమ్యవృత్తి ముక్తి సాధించి మృత్యువు, నలఘునియతి గెలువవలయు ననఘ. 22
వ. అనిన విని మేధావి దండ్రి కిట్లనియె.
సీ. నిక్కము కాలంబు నీకుఁ గొంత గలట్లు, పలికెదు నీవు గర్భంబు సొచ్చి
నప్పటనుండియు నన్వేషణము సేయుఁ, గొనిపోవుటకు మృత్యు వని యెఱుంగు
మివిరెడు [1]నీటిమీనవు గావె దారపు, త్రాదిసక్తుం డగునతనిఁ గాన
నమున సుప్తుండైన నరుఁ బులి గొనిపోవు, నట్టులు సూ మృత్యు వపహరించుఁ
తే. జేసినది సేయుచున్నది సేయవలయు, నది యనం గల కార్యంబులందుఁ దగులు
వానిమృత్యు[2]వేపునఁ దనవశముఁ జేయుఁ, గాన కాలంబు [3]నేమనఁ గాదు తండ్రి.
క. భీరుఁడు శూరుఁడు జడుఁడు వి, శారదుఁ డబలాత్మకుండు సబలుం డన లే
దేరి నయిన మృత్యువు దు, ర్వారం బై యపహరించు వైదికవర్యా. 24
క. విను సంసృతి మృత్యువుప, ట్టనఘా నిస్సంగవృత్తి యమరగృహము నె
ట్టన నిట్లగుటం గనికొని, తునుముము సంసారరజ్జు దురితవిదూరా. 25
క. అమృతము మృత్యువు నన స, త్యము మోహము గాన విను మహాత్మా యే స
త్యమునన మృత్యువు గెల్చెద, సమసుఖదుఃఖుండ నగుచు శాంతిపరుఁడనై. 26
తే. నాకుఁ బ్రజగతి నిచ్చునసంగ వలవ, దేన ప్రజ నయి పొడమెదఁ గాన యేను
నన్నుఁ గనుచున్న నదిమోక్షణంబు సేయు, నాశపడనట్టు లగుటఁ బ్రజాభియుక్తి.
క. విను పశుయజ్ఞము హింసన, మనంతఫలదంబు గా దహంకృతిసహితం
బనఘా వాఙ్మనస[4]నియమ, మనుయాగం బిచ్చు నవ్యయానందంబున్. 28
వ. కావున నీవును. 29
క. కామక్రోధాద్యము లగు, నీమానసవికృతు లుడిపి యేకాంతగుహా
రాముఁడ వై నిను వెదకుట, సూ మేలొం డెల్ల నుడుగు సులభవివేకా. 30
క. అని పుత్త్రుం డుపదేశిం, చిన జనకుం డట్లు చేసి చెందె సుఖంబుం
మనుజేంద్ర యవ్విధముఁ గని, కొని యూఁదుము సత్యధర్మకుశలత్వంబున్. 31
వ. అని చెప్పిన నజాతశత్రుండు శంతనుపుత్త్రునితో జగంబున ధనవంతులు నధను
లుం గలిగి యుండుదురు వారలలోన సుఖు లెవ్వరు దుఃఖు లెవ్వ రని యడిగిన
నక్కురుపితామహుండు శమ్యాకుం డనునొక్క శాంతిపరాయణబ్రాహ్మణుండు

---

1. క. నీట్ట. గ. నింట-మీనవు. 2. గ. దేవత దసి. 3. క. నేమఱఁ. 4. క. యమం, బను; జ. మయం, బను.

సంసారంబు వదల విడిచి కూడుసీరకు నవసి యుండునట్టివాఁడు దొల్లి నాకడకు వచ్చి గోష్ఠీప్రసంగమున నుపదేశించినవచనంబులు గలవు వాని విను మవి భవత్ప్రశ్నంబునకు నుత్తరంబులై యుండు నని పలికి యిట్లనియె. 32

తే. ధనము కలిమియు లేమియుఁ దద్ద్రాసునందు,నిలిపి యెత్తంగములు సూపె నిర్ధనత్వ
మెక్కుడై దానిదిక్కున నెట్టు లన్న,వినుము గుణదోషములభంగి విస్తరింతు.

క. ధనము గలవాఁడు మృత్యువ,దనమున నున్నట్లు భయము దనచిత్తమునం
దనుకఁగ నుల్లల నుడుకును, విను శిఖిచోరాదిముఖ్యవిషయాపదకున్. 34

క. కోపంబును లోభంబును, నేపారి మనంబు గలఁప నెప్పుడుఁ జింతా
తాపంబు నొందు సధనుం, డాపద గా కవ్విధము సుఖావహ మగునే. 35

క. ఎచ్చోట నైన నధనుఁడు, విచ్చలవిడి నుండు లేదు వెఱ పించుకయుం
బొచ్చెపుఁజందం బొల్లఁడు, మెచ్చరె సురలైనఁ బలుకు మృదువై యుండున్.

క. లోకముచందము గనికొని, యీకానఁగ నగుధనాఢ్యు లెల్లను గాల
వ్యాకులతఁ బొందఁగలయవి, గాకుండమి యెఱిఁగి విడుపు గడుఁ జను రెండున్.

క. ధనవత్త్వము దుఃఖకరం, బని కని తత్కాంక్ష విడుచు నతని కధనతా
జనితాత్మాధీనత్వం, బనుపమసౌఖ్యంబు సేయు నక్షీణముగన్. 38

——భీష్ముఁడు ధర్మజునకు మంకి యనుబ్రాహ్మణుని చరిత్రంబు సెప్పుట.——

వ. అని చెప్పె ననిన విని ధర్మతనయుండు పితామహుతో ధనతృష్ణాభిభూతుం డగు పురుషుం డేమిట సుఖి యగు ననుటయు నయ్యమరనదీనందనుండు ధనార్జనంబు తోడివినువుటం బుట్టినవిడుపున సుఖంబు గలుగు నయ్యర్థంబుఁ దెలిపెడునది యొక్కయితిహాసంబు గలదు విను మని యిట్లనియె. 39

సీ. మంకి నాఁ బరఁగుబ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై, వర్తించు శిక్షింప వలయునట్టి
గుజ్జుదోయిని జట్టిగొని ప్రీతి లంకించి, యుండ లంకియతోన గండు మీఱి
పాఱె నక్కోడియల్ పడి యున్న గనపలొ, ట్టెనుంగుపై నది యెగసి పఱవ
నుభయపార్శ్వంబుల నురివోసిన ట్లవి, వ్రేలి చచ్చినఁ జూచి విప్రుఁ డడలి

తే. రత్నములుఁబోనివత్సతరంబు లకట
వ్రేలు చున్నవి లొట్టెన్గు వెంటఁ దవిలి
యనుచు నిర్వేద మొంది యి ట్లనియెఁ దన్నుఁ
గరుణతోడఁ గనుంగొను నరులతోడ. 40

తే. సారమతిఁ బరికింపంగఁ బౌరుషంబు,కంటె దైవంబు ముఖ్యంబు గార్యసిద్ధి
కేచట నేనియుఁ బౌరుష మెసక మెసఁగె,నేని నదిదైవదత్తంబ యింతనిజము.

వ. కావున. 42

క. మనమునకు సుఖము గోరెడు,జనులకు సర్వక్రియావిశారదభంగుల్
బోనుపడ విడిచి భరము లే, కునికియ యూహించి చూడ నురవెఱ్ఱంగిన్. 43

వ. అని పలికి యుద్దామం బైనకామంబు విసువు వడకున్నఁ జిత్తంబునకు నిర్వృతి గలుగునే యనువిచారంబు పుట్టి తదీయోత్సారణం బూహించి యాచిత్తధర్మంబు నుద్దేశించి. 44

క. నీమూలం బే నెఱిఁగితిఁ, గామమ సంకల్పమునన ♦ కలిగెదు సంక
ల్పామర్శరహిత మగుచే,తోముద్రం దాల్తు నేను ♦ దుది యది నీకున్. 45

వ. అని కామం బనునది గోర్కి గావునఁ గోర్కియొప్పమి దేటపఱుపం దలంచి. 46

తే. సొమ్ము గోరినయంతన♦సుఖము గలుగ, దది యుపార్జింపఁగా సిద్ధి♦యగుటనిజమె
కలిగెనేని ననేకచింత♦లనొసర్చుఁ, జెడుట చావుతోఁ దుల్య [1]మ♦య్యెడుమ యేల.

వ. ఇచ్ఛానిరసనంబు సుఖం బని వెండియు. 48

క. శోకశ్రమతృష్ణలకుఁ, నీకలిమియ మూల మగుట ♦ నీ కగపడువాఁ
డేకర్తవ్యము గానం, గో కామమ నిన్నుఁ దొఱఁగి ♦ యుండెద సుఖినై. 49

క. నీ వాసపఱుప ధనములు, గావించెదఁ బో [2]వినాశ♦కముల నుడుపఁగా
నీవశమె కాస నీచెకు, నీవగఫుం దేదు పెనుప ♦ దేదైన్యంబున్. 50

చ. సులభమొ దుర్లభంబొ యని ♦ చూడక నెఱుంగవు గన్నదానిపై
నలముదు కామమా యుడుమ ♦ లందఁగఁ జేయుదు నిందు లేమిటం
గలుగదు నీకు నీ తెఱఁ గ♦గాధరసాతలభంగి నీవు స
న్నొప్పెలమునఁ బోవ కుండి నినుఁ ♦ బుచ్చెద బచ్చెనరూపుపోకులన్. 51

తే. ధనముచేటున విసివి నా♦మనసము నిన్ను, నీడవిడిచె నో కామమ ♦ యేను శాంతి
దాంతిసత్యక్షమాభూత♦దయలఁ జెంది, నాఁడ లోభాదు లొందవు ♦ నన్ను నింక.

తే. కామసుఖదివ్యసుఖములు♦కాంక్షఁ దొఱఁగు, మేలిషోడశాంశంబునఁ ♦ బోలలేవు
గాన కామమ నిను శత్రు♦కరణిఁ జంపి, బ్రహ్మపురమున నుండెద ♦ రాజుఁబోలె.

## అజగరచరిత్రవ్రతము.

వ. అని పలికి మంకి యివ్విధంబునం గోడెలు సచ్చినం బుట్టినని ర్వేదనంబున సకల కామంబులం బరిత్యజించి దేవసముండై యుండె నని చెప్పిన విని పాండవాగ్రజుం డేమివర్తనంబున నరుండు వీతశోకుం డగుచుఁ జరించు నెద్దానం జేసి పరమగతి వడయు ననుటయు ననిమిషనదీనందనుం డజగరచరితం బనునితిహాసంబు వినుము దాన నీయడిగినయర్థంబు దేటపడు దానిం జెప్పెద నాజగరనామధేయుం డగు నొక్కబ్రాహ్మణునిఁ బ్రహ్లాదుండు శమప్రకారం బుపదేశింపు మని యభ్యర్థించిన నతం డతని కిట్లనియె. 54

క. అనిమిత్తము భూతంబుల, జననం బవి రూపు సెడుట ♦ సంపన్నములై
యునికి విషాదము మోదం, బును జేయఁగ లే వనిత్య♦ములుగ నెఱిఁగినన్. 55

తే. [3]వఱదఁ గాష్ఠముల్ గూడిన♦వడువ బంధు, సంగమం బవి వాసిన♦చాడ్పు తద్వి

1. క. దు♦ర్యోడు న దేల. 2. గ. వినాశ♦కత నుడుపం-గా. 3. చ. వఱుతఁ.

యోగ మింత సూచిన వాని నుష్మలికము, వొరయనేరదు దానవవరతనూజ.

వ. ఈతెఱంగు లే నెఱుంగుదు నాదెసఁ బ్రశాంతిం గని కాదె నీవు శమోపదేశం బర్థించితివి వినుము. 57

క. మే లర్థింపను గీడును, జాలింబడి తూలఁగఁ ద్రోవ సరిఁ దూష్ణీంభా
వాలంబిమనస్కుఁడ నై, యాలంబుగఁ జేసి నడతు నయ్యురుదెఱఁగున్. 58

క. సరసాన్నముఁ బిణ్యాకము, సరిగాఁగ భుజింతు మృదులశయ్యాతలముం
ధరణియు శయనరుచికి నా, కరయంగా నొక్కరూప యసురప్రవరా. 59

ఆ. నారచీర యేనిఁ జారుచీనాంబరం, బైనఁ గట్టికొనినయపుడు హృదయ
మొప్ప దొప్పు ననక యుండు రూపాదుల, నలమికొనవు చక్షురాదికములు.

వ. అని వెండియు. 61

ఆ. చలన మేది పుట్టుఁ జావునుం బిరువెట్టి, యామిషార్థిజనుల నపహసించు
చెలిమితోడ లేమి కలిమి వాటింపని,రమణ నునికి యజగరవ్రతంబు. 62

ఆ. అనియతంబు లైనయాహారవిహరణ,శయనముల విధాతృసంప్రయుక్త
భంగిఁ బరఁగు నంతరంగ[1]నిర్భారవ,ర్తనము కలిమి యజగరవ్రతంబు. 63

ఆ. నిత్యతృప్తి శౌచనిరతి తాల్మి సమత్వ, మారఁ గలిగి చిత్సుఖానుభవము
ప్రచుర మగుట యజగరవ్రత మది విను, మజ్ఞదుర్లభంబు ప్రాజ్ఞభూమి. 64

వ. ఇది శమప్రకారం బనియె నని చెప్పి భీష్ముండు. 65

క. అజగరచరితము దనకును, నిజముగ నలవఱుప నేర్చు నిర్మలమతికిన్
వృజినభయమన్యుశోకము, లజేయములుగావు మోక్ష మాయత్త మగున్. 66

వ. అనిన విని యజాతశత్రుండు బంధు[2]మత్త్వకర్మవిత్తప్రజ్ఞలయం దెయ్యది నరునకు సుప్రతిష్ఠం జేయు నని యడిగిన నాపగాతనయుం డతని కిట్లనియె. 67

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము, ప్రజ్ఞయ నాకం బనంగఁ బ్రజ్ఞయ చువ్వే
ప్రజ్ఞయ కైవల్యంబును, బ్రజ్ఞాసాధ్యములు గాని పనులుం గలవే. 68

వ. బలి ప్రహ్లాద మంకిప్రభృతులు ప్రజ్ఞనకాదె సమాధానసంపన్ను లయిరి కాశ్యపనామధేయుం డగుధరణీసురోత్తముం డొకయుద్ధతపురుషునిరథంబు దాఁకి పడి తదవమానదూయమానమానసుం డై యసుపరిత్యాగపరవ్యవసాయుం డగుటయు నింద్రుండు సృగాలరూపంబున నమ్మహాద్విజునిపాలికి వచ్చి ప్రజ్ఞా[4]సంబోధకం బగు సంవాదంబునం జిత్తప్రసాదంబు గావించె నని యిందు మెల్లభంగులఁ బ్రజ్ఞయుత్తమాధికారం బనిన విని ధర్మతనయుండు. 69

క. నరవర దానముఁ దపమును, గురుశుశ్రూషయును యజ్ఞకోటియు నెల్లై
పరిణతిఁ బొందంగలయవి, పురుషున కిత్తెఱఁగు దెల్లముగ విన వలతున్. 70

1. క. నిర్బాధవ. 2. జ. మమత్వ. 3. చ. కైవల్యదమును. 4. క. సంపాదకం.

వ. అనుటయు దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లను మేలు లనుబంధించుమేలు లట్ల కీళ్లును ననుస్యూతంబు లయి తొడరు నాకర్ణింపుము. 71

క. కలవుపయిఁ గలవు వొరయుచు, వెలవుపయిన్ వెలవుదోఁపక విడువనియిడుమం దొలఁగమిపైఁ బురుషుఁ డిడుమఁ, దొలఁగమిఁ జేడ్పడుచునడచు దుష్కర్మములన్. 72

వ. అని మఱియును. 73

ఆ. ఉత్సవంబుమీఁద నుత్సవ మందుచు, సుఖముమీఁద సుఖము సొప్పడంగఁ బుణ్యపదముమీఁదఁ బుణ్యపదంబున, కరుగు నరుఁడు సుకృతి యైన నధిప. 74

క. పులుఁగులలోఁ బూత్యండక, ములు సారము లైనధాన్యములలోనం బొ ల్లలుఁబోలెను జూవె మను, ష్యులలో ధర్మరహితాత్ము లుర్వీనాథా. 75

క. చనినఁ జను నున్న నుండు, న్ననుజుఁ డొకటి సేయఁ జేయు నరనాయక తో డన తగిలి నీడవోలెను, విను చేసినకీడు మేలు విడువవు వానిన్. 76

క. సమయం బైనను గుసుమఫ, లము లెట్టులు దోఁచుఁ దరువులం దటితోఁ గ ర్మములం బొడమున్ సుఖదుఃఖము లట్టుల నిష్ప్రియత్న కలితోద్భూతిన్. 77

క. తెలిసికొనఁ బడయ రొరు లా, ర్యులపోయెడి తెరువు లరసియును జదలం బ క్షులు నీళ్లలోన మీనం, బులు వోయెడుత్రోవ లెఱుఁగఁ బోలునె యధిపా. 78

క. ఐనను గాఢనిరూపణ, మానసుఁడై యార్యజనులమహితవచనముల్ వీనుల నినుచుచు ధర్మము, లైనవి సేయంగఁ దప్ప కగుఁ దత్ఫలముల్. 79

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో భూతసృష్టి యెవ్వానివలన నెబ్భంగి నైనయది యెఱింగింపు మనవుడు నతం డిదియును మఱియుం గొన్నియర్థంబులు భరద్వాజుం డడిగిన భృగుండు సెప్పె నప్పరిపాటి యుపన్యసించెద నాకర్ణింపు మని యతని కిట్లనియె. 80

భీష్ముఁడు ధర్మజునకుఁ బృథివ్యాదిభూతోత్పత్తిక్రమం బెఱింగించుట.

సీ. కైలాసశైలశిఖరమునఁ దేజోవి, రాజితు భృగు భరద్వాజుఁ డధిక వినయంబుమైఁ జేరి మునినాథ భూతసృ, ష్టిప్రకారము నాకుఁ జెప్పు మనిన నమ్మహితాత్ముఁ డిట్లను విను నారాయ, ణుం డవ్యయుం డనంతుండు భూత సృజనంబు దలఁచి మున్ సృజియించెఁ దనదుస, హస్రాంశకమున నవ్యక్తుఁ డనఁగ

తే. మనసునన యజరామరు ననుపమాను నతనివలన మహత్తత్త్వ మావహిల్లె నతఁడు దివ్యతేజోమయం బైన పద్మ మొకటి గలిగింప బ్రహ్మ యం దుద్భవించె. 81

తే. అతనితలఁపునఁ బ్రభవించె నాకసంబు, దానియందుజలంబు లుద్భవమునొందె సలిలమున నగ్నిమారుతజనన మొనరె, ననలపవనయోగమున మేదిని జనించె.

వ. ఆ బ్రహ్మ యఖిలభూతాత్మకుం డె ట్లనిన నతనికి శైలంబు లస్థులు మేదిని మేదో మాంసంబులు సముద్రంబులు రుధిరం బాకాశం బుదరంబు పవనుండు నిశ్వాసం బగ్ని తేజంబు సరిత్తులు సిరలు రవిచంద్రులు నయనంబు లూర్ధ్వలోకంబు శిరంబు పాతాళంబు పాదంబులు దిశలు బాహువు లి ట్లనంతాత్మకుం డగు వాఁడు విష్ణుం డిత్తెఱంగున విశ్వంబు విష్ణునివలనం గలిగె ననిన విని భరద్వాజుం డాకాశాదిభూతంబు లేనింటి ప్రమాణంబులు నడిగిన భృగుం డవి యనంతంబులు దేవతలకుం గొలఁది వెట్ట రాకుండు నొక్కచోటు నిరూపించి యీభూతం బింతనుండి యట లే దనరాదు పంచభూతంబులు నిరవధికంబు లది యెత్తెఱం గనిన విష్ణునకు గొణం బై యనంతుం డనునామంబు గలదు గాదె విష్ణుండు జగన్మూర్తి విష్ణుతనుభూతం బయినమహాభూతపంచకం బప్రమేయంబు గాక తక్కనే యని యెఱింగించిన. 83

సీ. విని భరద్వాజుండు ♦ మునినాథ పుష్కరం, బునఁ బుట్టె నన్నష్ట ♦ పుష్కరంబు బ్రహ్మకు నాది నాఁ ♦ బ ట్టయ్యె నెట్లొకో, నావుడు విష్ణుమా ♦ నసభవుఁడు బ్రహ్మయాద్యుఁడుపుష్క ♦ రముదదాసనరూప,ముగఁగల్పితంబయ్యె ♦ మున్నుపిదప ననునిశ్చయంబు లే ♦ కునికిఁ బద్మజుఁ డన, వలసియు నుండు న ♦ య్యలఘుతేజుఁ

తే. బద్మమదిభూతధాత్రి య ♦ ప్పద్మమునకు, నగసమూర్ధితమగుమేరు ♦ నగము రుచిర చారుకర్ణికయందుండి ♦ సకలజంతు,సృజనధుర్యత్వమహిమ న ♦ య్యజుఁడువెలుఁగు.

వ. అని భృగుండు సెప్పిన విని భరద్వాజుండు భూతంబు లై దగుట యేమిట నని యడిగిన నతం డతని కి ట్లనియె. 85

క. వాయువు చేష్టారూపము, వ్యోము నెడ సఖంబు ద్రవము ♦ మునివర జల మూష్మాయిత మనలము గాలి,న్యాయితము ధరిత్రి యిట్టు ♦ లైదుదెఱంగుల్. 86

వ. ఈయయిదింటన కాదె జంగమంబులు స్థావరంబులు నైనయవి యనుటయు భరద్వాజుండు స్థావరంబులయందు భూతగుణంబు లేమిటం గంటి మని యడిగిన భృగుం డి ట్లనియె. 87

సీ. *అశనినిర్ఘోషంబు ♦ నాకర్ణనము లేక, వికృతి నెట్టులు వొందు ♦ వృక్ష; మాక సముశక్తిసూవెశ్రోత్రము; నిదాఘుంబుచోఁ,కునవాడుఁ;జోఁకెఱుం ♦ గుటసమీర శక్తి; మార్గముఁ గని ♦ చాఁగెడుఁ; గనుట తే,జశ్శక్తి; పాదప ♦ సంజ్ఞఁ బరఁగుఁ బాదజిహ్వలఁ గొని ♦ పానంబు సేయుట; జలశక్తి జిహ్వ; నై ♦ జంబు లైన

తే. కుసుమధూపాదిగంధముల్ ♦ గొనుట నెలమిఁ
బాల్చు నని చెప్పఁ దరువు వేదంబు; ఘ్రాణ
మూర్విశక్తి; యి ట్లయిదును ♦ నుల్లసిలుట
ననఘ భూజంబు పంచభూతాత్మకంబు. 88

* ఈపద్యమున (;) నిట్టి సంజ్ఞలచే వాక్యవిభాగమును దెలియునది.

వ. శైలాదులయందు నిట్లు యూహింపఁ బెఱభంగులుం గలిగి యుండుఁ బంచభూ
తాత్మకంబు గానిభూతంబు లేదనుట వేదనిశ్చయం బనిన విని భరద్వాజుండు.

క. భూముఖ్యం బగుభూత, గ్రామంబుగుణంబు లైనగంధాదులఁ దే
జోమహిత యనుభవించుట, యేమెయి నెద్దాని కావహిల్లుచు నుండున్. 90

తే. అనిన భృగుఁ డిట్టు లను విషయములు నింద్రి
యములు మనసును గ్రమసాధనములు గాఁగ
నంతరాత్మ ప్రదర్శి యై యనుభవించి
తత్కృతము లగుమోదఖేదములఁ బొందు. 91

వ. అప్పురుషుండు. 92

క. క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల, గాత్రవ్యాప్తత్వమహిమ గలిగి సమీరా
సూత్రణమున జీవుండును, గోత్రము నై [2]సర్వవర్తకుం డగుచుండున్. 93

క. అగు నీతత్త్వము సత్త్వా, దిగుణత్రయవికృతి కత్యతీతం బై పూ
ర్వగురుత్వంబునకుం జన, విగతత్వంబునకు నెలవు విమలవిచారా. 94

ఆ. బుధుఁడు సూక్ష్మవిమలబుద్ధి నప్పురుషుని, నరసి కాంచి యతనియంద మనసు
డిగ్గ విడిచి యెగ్గు లగ్గను బొందక, శుద్ధశాంతిఁ బరమసుఖముఁ బొందు. 95

వ. అని వెండియు. 96

భృగుమహాముని భరద్వాజునకుం జెప్పినవర్ణాశ్రమాచారక్రమము.

సీ. ఆగమసత్యధర్మాచారతపముల, కునికిపట్టులు గాఁగ వనజభవుఁడు
గలిగించె మును బ్రాహ్మణుల మఱి కల్పించె, నృపవైశ్యశూద్రుల నిర్మలాత్మ
బ్రాహ్మణాదికముగఁ బరఁగునన్నాలుగు, జాతులయుజ్జ్వలచ్ఛాయ లొలి
సొంపారుఁ దెలుపును గెంపునుబసపుచా, యయుఁ గప్పు నయ్యు నం ద్రార్యవర్య

ఆ. లాత్మకర్మ మెడలి యనులోమవృత్తి నె, జ్జాతి సొచ్చు నన్యజాతిపనికి
దాని కట్టిభంగి దలకొనుఁ బెక్కులు, పనులఁ జేసి జారతనము వచ్చు. 97

క. సితరక్తపీతనీలము, లతులమతీ మొదలు దొడఁగి యంతంతకు హీ
నతఁ దాల్చుఁ గాన యెఱిఁగిం, చితి నీపరిపాటిఁ [4]గర్మశీలతకొఱకున్. 98

వ. అని మఱియును. 99

క. సత్యమ బ్రహ్మము దపమును, సత్యమ ప్రజలను సృజించు సత్యమ లోక
స్థిత్యాధానము జేయును, సత్యం బనృతంబుచేత సంపిహిత మగున్. 100

వ. అట్లుం గాక ధర్మాధర్మంబు లనఁ బ్రకాశతమంబు లన బోధాజ్ఞానంబు లన
స్వర్గనరకంబు లన సుఖదుఃఖంబు లనఁ బరఁగు బుధజనవ్యావహారికశబ్దంబు
లకు నర్థంబు లై సత్యానృతంబులు ప్రవర్తిల్లుం గావున. 101

క. అనఘా దుఃఖాత్మక మగు, ననృతం బడఁగించుటకుఁ బ్రయత్నమున సుధీ

1. చ. యేమిట. 2. జ. సర్వవర్త్మకుం. 3. క. గత్యతీతం. 4. గ. ధర్మ.

జను లాచరింతు రనిశం,బును మోహవిఘాతినియమ।ములు నిష్ఠమెయిన్. 102

క. ఒలయు జరావ్యాధిప్రభృ,తులు శారీరములు గాఢ।తోదకశోకా
దులు మానసములు దుఃఖం,బులు రెండువిధముల నిట్లు । పురుషు నలంచున్.

క. శారీరమానసము లగు,నీరెండువిధములు దన్ను । నేఁపక యుండం
గోరికొని నియమములఁ బ్రతి,కారం బొనరింపఁగా సు।ఖం బొందు నరున్.

క. విను దుఃఖంబులఁ దెగఁ ద్రో,చినపురుషుఁడు సౌఖ్యస క్త।చిత్తుఁడు గా[1] కా
రినవైరాగ్యముఁ జెందిన, ననుపమ మగుపరమపదము । నమ్మెయి నేర్చున్.

వ. అనిన విని భరద్వాజుం డాశ్రమధర్మప్రకారంబులు సువ్యక్తంబులుగా నెఱిం
గింపు మనుటయు భృగుం డిట్లనియె. 106

సీ. గురునకు భక్తుఁ డై । పరమాదరమున వే,దాభ్యాస మెప్పుడు । నాచరించు
చును శౌచశీలత । వినయంబు త్రిషవణ,స్నానంబు భాస్కరా।నలసపర్య
పాటించు చుండుట । బ్రహ్మచారికవృత్తి, ధనధాన్యములు గర్హి।తంబు గాని
తెరువునఁ బడసి య।తిథిపూజ మున్నుగా, నన్నపానాదిభో।గానుభవముఁ

తే. బొందువాఁడు గృహస్థుండు।గంధమూల, శాకఫలము లాహారంబు।శయ్య భూమి
వననివాసికి నిస్సంగ।వర్తనమున, భిక్షబ్రదుకుగ యతి శాంతిఁ । బేర్చియుండు.

క. ఫలకాంక్షి గాక నియతిం, జలిపిన నీయఖిలకర్మ।జాతంబును ని
ర్మలమోక్షపదముఁ జేర్చుట, గలుగు నవశ్యంబుఁ బుణ్య।కరణప్రవణా. 108

వ. అనిన విని భరద్వాజుండు పరలోకం బన నొకండు గల దం డ్రీలోకంబునకును
నాలోకంబునకును విశేషం బెట్టిది యెఱింగింపవే యని యడిగిన భృగుం డతని
కి ట్లనియె. 109

క. ఇది కర్మభూమి భోగా,స్పద మాలోకంబు ధర్మ।పరులకు సులభం
బది సత్యశౌచసౌజ,న్యదయాదులు లేనివారి । కప్రాప్య మగున్. 110

క. ఈలోకము దుఃఖబహుళ, మాలోకము భూరిసుఖని।రంతర మం దే
జాలియును లేక యొండొరు,లో లెస్సగఁ బొంది యుండు।దురు జను లనఘా.

తే. హస్తిమశకాంతరము గల । దరసి చూడ, వాసగృహశయనాసన।వసనగంధ
మాల్య[2]తౌర్యత్రికారామ।మానినీజ,నాదిసుఖసాధనములకు । నందు నిందు.

వ. అని వెండియు. 113

క. ఇవి పుణ్యలోకవిషయ,వ్యవసితవచనంబు లధమ । మగులోకము ధ
ర్మవిదూరజనులు వొందుదు, రవిరతబహుదుఃఖనిలయ । మది విప్రవరా. 114

క. విను మమకారవివర్జిత,మనస్కులకుఁ బుణ్యపాప।మార్గంబులు లే
మిని లోకంబులఁ ద్రిమ్మర, [3]రనఘా పొందుదురు శాశ్వ।తానందంబున్. 115

వ. అనిచెప్పి భృగుండు బ్రహ్మవిహితంబు లగుధర్మంబులు సంక్షేపరూపంబున నెఱిం

1. క.కాదినవై రాగ్యము;చ.కాదినవై కార్యము... మ్మెయి నేర్చున్. 2.తూర్యత్రయా. 3.చ.కనఘా.

గించితి ననిన భరద్వాజుండు ప్రముదితాత్ముం డగుచు నమ్మహాత్ముం బ్రశంసించి వినతుండై వీడ్కొనియె నతనిచేత విన్నంతవట్టును నీకుం జెప్పితి నీ వింక నెయ్యది విన వలతు ననుటయు ననిమిషనదీనందనుతో ధర్మనందనుం డాచారవిధి విను వాంఛ నామనంబునం బేర్చి యుండు ననవుడు నతం డతని కి ట్లనియె. 116

భీష్ముఁడు ధర్మజునకు నాచారవిధి యెఱిఁగించుట.

సీ. సజ్జను[1]లందు నాచారవంతుల దురాచారంబు గష్టత్వకారి యగ్లు
గావున నాచారగతి వింట గడు లెస్స, రాజమార్గంబున రచ్చ మంద
మూత్రపురీషవిమోక్షంబు సేయమి, శౌచి యై వార్చి నిర్ఘను జలంబు
సొచ్చుట సంధ్యల సూర్యు సేవించుట, యర్కోదయాస్తమయముల నిద్ర
తే. వోవకుండుట పంచార్ద్రభావ మొంది, కుడుచు టన్నంబు దెగడమి దడిపదములు
గలుగ నిదురకుఁ జొరమి సత్కర్మవేది. నారదుఁడు వివరించె నాచారములుగ.

తే. ఉదయ మగుసూర్యుఁ గనుఁగొను టొప్ప దన్య
వనిత నగ్న యై యుండంగ వలదు చూడఁ
దనపురీషంబు సూచుట ధరణినాథ
కీడు నిజపాపసుప్తి యకృత్య మరయ. 118

క. సురతంబు గుప్త మగుటయు, గురుశుశ్రూషయును బ్రహ్మకులభజనము నా
యురవాప్తిఁ జేయు లక్ష్మీ,కరంబు లగు నూర్ధ్వలోకగతియు నొనర్చున్. 119

వ. అనిన విని యుధిష్ఠిరుం డధ్యాత్మవిద్య విన వలతుం జెప్పవే యనిన నతనికి దేవవ్రతుం డి ట్లనియె. 120

సీ. జలధితరంగలచాడ్పునఁ బొడముచు, నడఁగుచు నుండు భూతాత్మనందు
భూమిప్రభృతిభూతములు వానిగుణములు, గంధాదు లింద్రియగ్రాహ్యకోటి
యనఘ శ్రోత్రంబాదియగు నింద్రియశ్రేణి, దర్వియుఁబోలె సాధనత నొందు
మన సింద్రియములకుఁ బెనుప్రాపు బుద్ధి త,న్ముఖమున నిశ్చయంబునకుఁ జేరుఁ
తే. బురుషుఁ డవ్విషయంబులఁ బొందు నిట్లు
గాక యుండ నింద్రియములఁ గ్రమ్మఱించి
మనసుతోఁ గూర్చి బుద్ధిలోనన యడంప
బుద్ధి నిర్విషయస్థితిఁ బురుషు నొందు. 121

క. విను మాత్ముఁడు క్షేత్రజ్ఞుం, డన భూతాత్ముఁ డనఁ బురుషుఁ డనఁ బరమేశుం
డన బుద్ధిసాక్షి యన నం,జనరహితుం డనఁగఁ బరఁగు శాంతిప్రవణా. 122

క. తనయందఁ దోఁచువిషయము, లనుభవగోచరము లగుట [2]యది మాయాసం
జనితస్వప్నం బైయా,త్మునికిం దనుఁ గాన [3]లేనిమోసము దెచ్చున్. 123

క. విను గుణములు మాయకు నొడ,లని యెఱిఁగి తమోరజస్సులడఁచి సుసత్త్వం

1. క. లంద దాచార. 2. చ. నది. 3. 'లేమి' యని పెక్కుప్రతులు.

బున నిలిచి సద్వివేకం,బున నదియుం ద్రోచి విమలబోధాత్ముఁ డగున్. 124

తే. అరసి చూడ సత్త్వంబు సుఖాత్మకంబు, సాంద్రదుఃఖమయంబు రజస్సు బోధ
మాంద్యమూర్తితమస్సు సమత్వమూఁది, యీయవస్థలఁ బొరయమి యపాయపోక.

వ. అని యధ్యాత్మప్రకారంబు నిర్దేశించి భీష్ముండు వెండియు యోగంబు సెప్పెద నాకర్ణింపు మని యమ్మనుజపతి కిట్లనియె. 126

—— ధర్మజునకు భీష్ముఁడు యోగప్రకారంబు సెప్పుట. ——

సీ. తెలి వొందిన మనసు నిశ్చలవృత్తి నేకాగ్ర, మై యున్కి గోరి నిష్ఠాతిశయము
కలిమి కృత్యంబు మేఘంబున మెఱుఁగును, నలినపత్త్రంబున సలిలకణముఁ
బోలె మంతవ్యంబు పొంతఁ జరించుమ,నంబు దానికిఁ బవనంబు గతియ
గతి గాన హితము మారుతధారణము పవ,మానంబు గ్రమమునఁ గాని నిలువ

ఆ. దలయ వినుపఁ గాదు తలకొని యమనియ,మాదు లెనిమిదియును నభ్యసింపఁ
గా విచార మొలయుఁ గలుగు వితర్కంబు, మఱి వివేక మనిలు నెఱికిఁ దెచ్చు.

క. విను మంతర్నాడిం జనఁ, బనుపడి పవనంబు బ్రహ్మపద మొందఁగ శాం
తినిరూఢ మైనచిత్తము, గను నానందంబు సందకలయుం బిదపన్. 128

వ. అనిన విని కురుపతి కురుపితామహునితో జపవిధిప్రకారంబును జపశీలు రగువారు వోవుగతియును నెఱింగింపవే యనుటయు నమ్మహీవిభునకు నమ్మహాత్ముం డిట్లనియె జప్యంబు విషయంబుగా యమ కాల మృత్యు భూసు రేక్ష్వాకులకు సంవాదంబు ప్రవర్తించె నయ్యితిహాసంబునుం జెప్పెద మున్ను నా యెఱింగిన తెఱంగునుం జెప్పెద నాకర్ణింపుము. 129

—— యమ కాల మృత్యు భూసు రేక్ష్వాకుల సంవాదము. ——

సీ. వేదాంతవిదు లనుమోదించునట్టిది, జపకర్మ మత్యంతశౌచశాలి
యై కుశాస్తీర్ణసమావనీతలమునఁ, గుశముష్టి సేకొని విశదచిత్త
వృత్తి నింద్రియములు విషయసక్తంబులు, గాకుండ నిలిపి తదేకపరత
మత్సరాహంకారమానదంభాపగ,మంబును బ్రహ్మచర్యంబుఁ గలిగి

తే. జపము సెల్లించుపురుషుండు సర్వలోక,విజయనిస్స్పృహమగుజపవిధి విశోక
హర్షరాగాదికంబును నవ్యయంబు, నైనపదముఁ బొందించు నృపాగ్రగణ్య.

క. శౌచాదిగుణము లెడలుట, నీచత్వము వాటిలంగ నిశ్చలమతి దు
ష్టాచరిత మైనజపవిధి, నాచెప్పినసుగతి దేదు నరకము దెచ్చున్. 131

వ. అని చెప్పి వెండియు నిట్లనియె. 132

సీ. వేదవేదాంగసంవేది గౌశికుఁ డను,ధరణీసురుఁడు సంహితాజపంబు
విహితశీలతఁ జేయ వేయు వత్సరములు, సనిన సావిత్రి యమ్మునివరునకుఁ
బొడసూపి తనుఁ జెప్పఁ గడు భక్తితో నతం, డెఱిఁగిన నిచ్చెద నిష్ట మడుగు
మనిన నాతండు జపాతినిష్ఠయ కోర, నది యిచ్చి దేవి నీ కత్యుదాత్త

తే. గతియు నగుధర్మ మర్థి నీకడకు వచ్చు
యముఁడుఁ గాలుండు మృత్యువు నరుగుదెంతు
రనఘ నీకును వారికి నావహిల్లు
వాద మని చెప్పి చనియె భూవరవరేణ్య. 133

క. ధరణీసురుఁడును జపతత్పరుఁ డై దివ్యాబ్దములు శతంబు గడపె న
ప్పురుషవరుకడకు ధర్మము, పరమప్రీతిఁ జనుదెంచెఁ గౌరవముఖ్యా. 134

తే. అట్లు సాకార మై వచ్చి యతనితోడ, నీజపంబున సిద్ధించె నిరతిశయము
లైనపుణ్యలోకములునీకవందుఁజనుము, తనువుఁ[1]జిత్తంబువిడిచియుత్సవమెలర్ప,

వ. అనిన విని యమ్ముని ధర్మంబున కిట్లనియె. 136

క. తనువు దొఱఁగి ననులోకము, లనఘా యే నొల్ల మేల నైనను దుఃఖం
బున కోర్చి నాతలంపున, కనుగుణమై యుండ దీని నగునె తొఱంగన్. 137

వ. అనుటయు ధర్మంబు. 138

క. ఒడ లెట్లు విడువ వలదే, కడురమ్యము నాక మింత గానవొకో నా
వుడు మేను వెలిగ నట వో, నొడఁబడ నని పలికె బ్రాహ్మణోత్తముఁ డధిపా.

వ. అని పలికిన ధర్మం బతనితో నీ వొడలు విడువ నొల్లవు పో యమకాల[2]మృత్యు
వులు వీరె వచ్చిరి చూడు మనియె నయ్యవసరంబున వారలు వచ్చి యమ్మహీ
సురవరుముందఱ నిలిచి తమ్ముం బేర్కొని రాతని నుద్దేశించి యముండు నీజ
పంబుఫలంబు సిద్ధించె ననియుఁ గాలుండు నీకు నాకలోకారోహణంబునకుం
గాలం బై సందోఁచితి ననియును మృత్యువు గాలచోదిత నై నిన్ను నేఁడు
గొనిపో వచ్చితి ననియునుం బలుకుటయు నమ్మాటలు గీటునం బుచ్చుచు
వారలవదనంబులు విలోకించి సవినయవ్యాహృతస్వాగతుం డయి యవ్విప్రుం
డేను మీకు నెప్పని సేయువాఁడ నని పలికె నట్టియెడఁ దీర్థయాత్రాపరుం
డై నయిక్ష్వాకుం డచ్చటికి నేతెంచి వార లందఱకుం బ్రణతుం డయ్యె బ్రాహ్మ
ణుం డతిథింగా నిరూపించి యాదరభరితుం డై. 140

కౌశికునకు నిక్ష్వాకుమహారాజునకు నయినసంవాదము.

క. నాకలిమితోడ నిచ్చెద, నీ కెయ్యది యిష్ట మనిన నృపతి నృపులు దా
నైకపరులు గొనువారలె, యేకామ్యము లైన నిత్తు నీ వడుగు తగన్. 141

వ. అనిన విని విప్రుం డవ్విభున కిట్లనియె. 142

క. కొనువారు ప్రవృత్తులు గా,క నివృత్తులు గొందు రయ్య కామ్యంబులు నా
మనమున లే వేనేమియుఁ, గొన నిత్తున కాన యధిప కోరుము తగఁగన్. 143

వ. పూజారూపంబున నిచ్చినయది యతిథి గైకొనుట యెగ్గు గాదనుటయు నమ్మనుజ
పతి నీ విచ్చువాఁడవయేని నీసకలజపంబుఫలంబును నిమ్మనిన నమ్మహీదేవుండు.

1. క. జింతయు. 2. గ. మృత్యువు లిడె వచ్చిరి.

క. జపఫలమున సగ మిచ్చెద, నృప యంతయు నైనఁ గొనుము నీ వనవుడు న
జ్జపముఫలం బెయ్యది యని, నృపుఁ డడిగిన నాతఁ డేను నిరపేక్షుండన్.

క. కావున ఫల మిట్టిది యని, భావింప నెఱుంగ నోరులఁ బనివడి యడుగన్
నీ వాఫలంబు గొను మది, దా వినఁబడుఁ బిదప ధర్మతత్త్వజ్ఞులచేన్. 146

వ. అనుటయు నియ్యనతసయుండు ఫలం బెట్టి దని యెఱుంగ వేనిం గొన నొల్ల నన
వుడు నతం డతని కిట్లనియె. 147

క. నీ వడిగి తేను నిచ్చితి, భూవల్లభ యింక సత్యమున కూనము గా
దే వరియింపమి నావుడు, నావసుధాధీశుఁ డద్ధరామరవరుతోన్. 148

వ. రాజులకు యుద్ధంబు సుకర్మంబు గావున నీతో వివాదయుద్ధంబు సేసితి ననిన
నతండు నీ వేమి సేసి తేమి యది య ట్లుండనిమ్ము. 149

క. విను మిచ్చెద నని యీమియుఁ, గొనియెద నని పలికి పిదపఁ గొన కునికియు న
త్యనృతంబులు సత్యవ్రత, మునకుం దొలఁగంగ మనకు భూవర తగునే. 150

క. సత్యమ తపమును యజ్ఞము, సత్యమ వేదంబు దాంతిశాంతులు నగుటన్
సత్యము దొఱఁగుట నిర్మల, నిత్యానుష్ఠానములును నిష్ఫలము లగున్. 151

వ. అనిన విని ధర్మంబు వారలనుద్దేశించి యమాదులు విన వీరికి వివాదంబు వలదు
విప్రుండు దానఫలంబును రాజు సత్యఫలంబునుం బొందువా రనియె నట్టియెడ
నాకంబు నరాకృతి దాల్చి వచ్చి త న్నెఱింగించి యయ్యిరువుర నాలోకించి
వా దేల మీ రిద్దఱుం దుల్యఫలప్రాప్తుల రయ్యెద రిట్లు సేయుం డని పలికె నవ్వి
భుం డ ట్లేని నితండును నాయిచ్చునది గొనవలయు ననుటయు నమ్ముని యేను
దపస్స్వాధ్యాయనిరతుండం బరిగ్రహ[2]విధియందు విరతుండ. 152

క. అనవుడు నరనాథుఁడు నా,కును నీకును సరియ కాఁగఁ గోరెద సత్క
ర్మనిరూఢి మత్సుకృతఫల, మనఘా కొనవే యనుగ్రహంబు దలిర్పన్. 153

వ. అని ప్రార్థించె నప్పుడు వికృతవేషు లగుపురుషు లిరువురు దమలో వివాదంబు
సేయుచు వచ్చి యవ్విభుండు మనల శాసింప నోడయండు·వా మ్మనుచు నిక్ష్వా
కుముందర నిలిచిరి వారితెఱంగు వినుము. 154

తే. ఒకఁడు గోదాన మొనరింప నొక్కరుండు
తత్ఫలము వేఁడఁ బ్రీతి నాతండు నొసఁగఁ
గొనినవాఁ డిది దక్కువ దనకు నని త
లంచి యుత్తమగోయుగళంబు విలిచి. 155

వ. సత్పాత్రదానక్రియ నిర్వర్తించి తత్ఫలంబు మున్నుదనకుగోదానఫలం బిచ్చిన
యతని కిచ్చువాఁ డయిన నతండును గొనువాఁ డయి యుండి కొనక యెడ సేసి
తిరుగం దిరుగ నప్పుడు ముట్టం బట్టినవాదు పుట్టిన వచ్చినవారై రత్తెఱం గెల్ల

1. చ. గర్మ. 2. గ. వృత్తి.

నుక్తిప్రత్యుక్తుల నప్పుడమిఱేనికి నేర్పడం జెప్పి రట్లు సెప్ప విని యవ్విభునితో
డఁదొలుత నొసంగినవాఁ డితం డడిగిన నెమ్మిం బ్రతిగ్రహింపఁగా నొసంగితిఁ బ్రతి
గ్రహం బొల్లనినన్ను నితండు నిర్బంధింపందగునే యని చెప్పినఁ బిదపటియాతం
డితండు గొనియెద నని యొడంబడి కొనమి పాతకం బగుట కర్మకాండవిదు లెల్ల
నెఱుంగుదు రవ్వుడుఁ గౌశికుం డిక్ష్వాకు నుద్దేశించి వింటె యిప్పురుషునివచనం
బు లని పలికి వెండియు. 156

క. నృప నీవు మదీయం బగు,జపముఫలం బడిగి తేను । సమ్మతి నీఁగా
విపరీతఫణితు లాడిన, శపియింతుఁ జుమీ యెఱుంగఁ । జాటితి నీకున్. 157

తే. అనిన నాతఁడు భయ మంది । యాత్మలోన
నొరులయీఁగికి నకట చే । యొడ్డకుండు
నట్టినా కిది వలసెనే । యనుచుఁ గరము
సాఁచె నవ్విప్రుదెసకు నిశ్చయముతోడ. 158

వ. [1]అతండు ననేకవర్షంబులు సేసినజపంబుఫలం బంతియు నీ కిచ్చితి ననుచు ధార
వోసిన నమ్మహీసురవరునాననం బాలోకించి భూపాలుండు నాకరంబున జలంబు
లు వడియె మనకు నిద్దఱకును సత్కర్మసమత్వంబు గలుగవలదే నాయది యైన
యాగఫలం బేనును నీ కిచ్చెదఁ గైకొనుమని పలికె నట్టియెడ వికృతవేషు లగున
ప్పురుషు లిరువురు నన్నరనాథు నుద్దేశించి యేము కామక్రోధులము ధర్మయ
మాదులచేతను మాచేతను మీ రిద్దఱుం బరీక్షితుల రైతి రింతియ కాని యి
చ్చుటయుఁ గొనుటయును నివి దైవాచరితంబులు మీకుం బని గా దని పలికిన
విని యవ్విప్రుండు భూవిభునితో ని ట్లనియె. 159

ఆ. శ్రద్ధయును బలంబు । జపవిధియందు సా,విత్రి నాకు నిచ్చె । వేఱు జపము
నాచరింపఁ[2]దగదు । నైనను నిందఱ,యెదుర నీవు గోరి । తివ్విధంబు. 160

క. కావునఁ బ్రార్థన సెఱుపం, గా వెఱచెద నట్లుఁ గాక । కైకొంటి ధరి
త్రీవల్లభ నీ సుకృతం, బేవెంటం దిగిచె నరుగు । మీ వగ్గతికిన్. 161

వ. అనియె నయ్యిరువురసత్కర్మనిష్ఠావిశేషంబునం బ్రీతు లయి బ్రహ్మాదిదేవతలు
వారలమీఁదం బుష్పవృష్టి గురియించుచు నయ్యెడకు నరుగుదెంచి యభినం
దించిరి దేవతూర్యంబులు మొరయ నప్సరోగణంబు లాడుచుం బాడుచు నుల్ల
సిల్లె నయ్యవసరంబునం గౌశికు నిక్ష్వాకు నుద్దేశించి నాకంబు. 162

తే. అనఘులార సంసిద్ధుల । రైతి రింకఁ, దడయ నేటికి నిర్మలో । దాత్తగతికి
నుత్సహింతురు గా కన్న । మత్సరాది,బంధకంబులఁ బోఁద్రోచి । బ్రాహ్మణుండు.

వ. ధర్మయమాదులను నాదిత్యసంఘంబును సవినయప్రణామసహితంబుగా నామం
త్రితులం జేసి. 164

1. ఖ. ఇట్లు సాఁచిన నాభూసురోత్తముండు ననేక. 2. చ. దగునె ♦ యైనను.

### కాశికేక్ష్వాకులు బ్రహ్మపదప్రాప్తు లగుట.

క. వాయువుల నియతవృత్తి మ, నోయంత్రణ బొమలనడుమ నాల్కొలిపి విచే
ష్టాయితశరీరుఁ డై మూ, ర్ధాయోజితములుగఁ జేసి యత్తలఁ జేర్చెన్. 165

వ. అప్పుడు తదీయబ్రహ్మరంధ్రోద్గతుండును మహాజ్యోతిర్జ్వాలాకృతియుం బ్రాదేశమాత్రుండును నగుపురుషు నెదుర్కొని పరమేష్ఠి సమాధానంబున వచ్చితే యని పలికి వెండియు. 166

తే. జాపకులకు యోగులకును సమము పుణ్య, గతివిశేషంబు ప్రత్యక్షకలిత మందు
జాపకులు నిర్భరోత్థానశక్తి నధికు, లనుచు వక్త్రంబు విచ్చి రమ్మనియె నధిప.

వ. అనుటయు. 168

తే. బ్రహ్మరంధ్రనిర్గతుఁడై నబ్రాహ్మణుండు, బ్రహ్మవదనంబు సొచ్చె భూపతియు నట్ల
వెడలి తద్వక్త్ర మెప్పటివికసనంబుఁ, బొంద నందుఁ బ్రవేశించె భూపవర్య.

క. దేవత లచ్చెరువడి య, ద్దేవుని నయ్యిరువురును నుతించి రజుఁడు సం
భావించె ధర్మమును నవ, సీవర యప్పరమవిభుఁడు నిరుపమలీలన్. 170

వ. తదనంతరంబ యంతర్హితుం డయ్యెఁ దక్కినవారును నిజస్థానంబుల కరిగిరి జాపకప్రకారంబును దదీయసుగతివిశేషంబు నెఱింగించితి నీ వింక నెయ్యది విన వలతనవుడు నాపగాసుతునితోడం గుంతీతనయాగ్రజుండు నిరతిశయజ్ఞానయోగంబువిధంబు వినువాంఛ నాకుం గలదు సెప్పవే యనిన నప్పురుషుం డప్పౌరవోత్తమున కి ట్లనియె మనుబృహస్పతిసంవాదం బనునితిహాసంబు గల దది నీయడిగినయర్థంబునకు బోధకం బయి యుండు నాకర్ణింపుము మను వాత్మీయగురుం డగు దేవగురునకుం బ్రణమిల్లి. 171

### మనుబృహస్పతిసంవాదము.

సీ. జ్ఞానయోగము కృపాసంపన్నబుద్ధి నా, కెఱిఁగింపవే యన్న నెలమిఁ నాతఁ
డతనికి ని ట్లను ననఘ సత్కర్మయో, గశ్రద్ధ దానికిఁ గారణం బ
నిష్టంబు ద్రోవను నిష్టంబు దేరను, నరుఁడు గర్మాచరణం బొనర్చు
నెయ్యవి సుఖము లొక్కింతకాలమునకు, నవియ దుఃఖంబులై యావహిల్లు

ఆ. నింత యెఱిఁగి ఫలము నెడ నిరపేక్షుఁ డై, [1]నతఁడు సౌఖ్యదుఃఖమయముఁ ద్రోచి
కామముఖ్యవిపదకంపితజ్ఞానవి, శేషబుద్ధిఁ బరమసిద్ధిఁ బొందు. 172

వ. అని వెండియు. 173

క. అసమాలంబ మశబ్దము, రసగంధస్పర్శరూపరహితం బగుటం
బ్రసరించునింద్రియములకు, వసంబు గా దొందఁ బరమవస్తువు పుత్రా. 174

క. స్త్రీపున్నపుంసకత్వము, లాపరతత్త్వమున లేమి నది విను తత్త
ద్వ్యాపారాపేతం బయి, దీపించుచు నుండు బోధదేహత్వమునన్. 175

1. క. సమత సౌఖ్యదుఃఖచయముఁ.

తే. వెలుఁగు చుండెడిదీపంబు । వేఱ వస్తు
వులఁ బ్రకాశింపఁ జేయున । ట్లలఘునిత్య
బోధనజ్యోతి యింద్రియం । బులను మాన
సమును దన ప్రభ విగతజా । డ్యములఁ జేయు. 176

క. విను పురుషున కింద్రియములు, మనంబుఁ గలిగించుఁ గ్రియల । నును జేయునకుం
దనతన తెఱుఁగునఁ గార్యము, లనేకములు సూపుసచివు । లట్టుల పత్కాం. 177

వ. అని మఱియును. 178

చ. అనలము దోఁచునే తరువు । నందుఁ గుఠారముఖంబు లైనసా
ధనములఁ బ్రవ్వ సజ్జనహి । తా తగఁ దర్చినఁ గాక యట్ల యి
త్తనువు నలంగఁ జేసి పర । తత్త్వముఁ గాంతు మనంగ రాదు వి
న్ననువున నాగమోక్తమధ । నం బొనరించినఁ గాని యారయన్. 179

క. డెందమున కింద్రియములకు, నొందఁగ రా కున్న లేక । యున్నే తత్త్వం
బెందు నపరభాగంబునఁ, బొందవు చూడ్కు లది లేక । పోవునె సుమతీ. 180

క. వల యురి యోదము గాలము, గలిగి కదా మృగముఁ బక్షి । గజము ఝషము ద
క్షులు వట్టుదు రట్టుల తజ్, జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ । జూతురు పురుషున్. 181

క. పా మెఱుఁగుఁ బాముకాళులు, ధీమంతుం డెఱుఁగ నేర్చు । ధీసాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని, ధీమలనిర్మోచనంబు । తెఱఁగు నెఱిఁగినన్. 182

క. కలుగుం దోఁపమి యమవసఁ, గలుగునె యంతటన యమృత । కరునకు నాశం
బలఘుపరవస్తువునకుం, గలదె యభావంబు మనసు । గాననికలుచన్. 183

క. రవిబింబము రాహువు పయిఁ, గవిసినఁ బాసినను దోఁప । కయుఁ దోఁచియు నుం
డువిధమ యజ్ఞానంబున, యవిరతివిరతులయధీనుఁ । డగు టాత్మునకున్. 184

క. విను మానస ప్రసన్నతఁ, దనుఁ గనుపురుషుండు గలుష । తం గానఁడు దే
ఱిననీట రూపు సూడఁగ, నను వై కలఁక నది లేని । యట్టులపోలెన్. 185

తే. ఇంద్రియంబులు దమయిచ్చ । నిట్టునట్టుఁ, దిరిగనేనియు దుఃఖముల్ । దెచ్చునవియ
కట్టువడిసుఖ మొనరించుఁ । గానయాత్మఁ, గావవలయునింద్రియచోర । గణమువలన.

క. పాపక్షయమున బోధం, బాపాదింపఁబడి మెఱుఁగు । టద్దముకరణిం
జూపునకు వచ్చుఁ దనుఁ దా, నాపురుషుఁడు గాంచుపనికి । నై తన్మయతన్.

తే. ధ్యానయోగనిశ్చల మగు । నంతరంగ, మెడల విడుచు గుణంబుల । నిద్ధశాంత
మైననిర్గుణవస్తువు । నందుఁ గలయుఁ, బరమపద మది దానికిఁ । బరము లేదు.

వ. అని పలికి సమ్యగ్జ్ఞానంబునకు మాయ మాటు గావున దాని మొఱంగు తెఱంగు
దేటపఱుపం దలంచి యి ట్లనియె. 189

—బృహస్పతి మనువున కుపదేశించినమాయాప్రకారము.—

క. విను మాయావిధ మిట్టిది, యని యారయ వెరవు గలుగ । దవనిం జరణం
బనఘా మోహనిజంతువు, సనుచో ప్పరయంగ రాని । చందం బొందున్. 190

క. గుణమూర్తి మాయ దానిని, గణుతించెద నన్నఁ దెగడు । గ్రాహ్యత్వంబున్
గుణములఁ బెడఁబాపంగా, గణనాతీత మగువెలుఁగు । గనుఁ దాన తనున్. 191

తే. వినుము నృప సత్త్వమును రజస్సును దమస్సు
ననఁగ గుణములు మువ్విరి । గొనుచు నాత్మఁ
జుట్టుకొను నొండుమెయిఁ దెగ । విట్టలముగ
నొలయువైరాగ్య మనుకొడవలిన కాని. 192

వ. అని నిర్దేశించి వెండియు. 193

ఆ. మణిమయములుఁ గనకమయములు రజతమ
యములు మఱియు మృణ్మయాదికములు
నైనపెక్కుపూసలందుఁ ద్రా డున్నట్లు
భూతకోటియందుఁ । బురుషుఁ డుండు. 194

క. ఏకరసమయక్షేత్రము, నేకౌషధిరసమయం బయినయట్లు సుమీ
యేకవిధ మైనబుద్ధి య,నేకము లగుకర్మములమెయిం బోక నృపా. 195

ఆ. జలము పృథివికంటె । జలముకంటెను దేజ, మంతకంటె వాయు । వాకసంబు
దానికంటెఁ బెద్ద । వాని కెల్లను బెద్ద, మనసు బుద్ధి పెద్ద । మనసుకంటె. 196

తే. ధరణి మొదలైనపంచభూతములకంటె
మనసుకంటెను బుద్ధికంటెను మహత్త
రంబు గాలంబు గాలతత్త్వంబు మిగిలి
యుండువిభుఁ డిజ్జగంబుల । కొడయుఁ డతఁడు. 197

క. ఆదియు మధ్యము నంతము, నాదేవేశునకు లేమి । నవ్యయుఁ డతఁ డీ
వేదములకు నానావిధ,వాదములకుఁ [2]జేరుగడ భగవత్షేపి నృపా. 198

క. అనుభవము మ్రింగు శాంతిం, గనునది నిర్భేదసత్ప్రకాశం బది దా
విను తలఁపునకును బలుకున,కు నగమ్యము గర్మముల కగోచర మనఘా. 199

క. మనసు గొని మనసు బుద్ధిం, గొని బుద్ధిని దర్శనంబు । గొని దర్శనమున్
విను క్రమమున నొదిఁగించినఁ, గను బుధుఁ డక్షరుని విష్ణు । ఘనబోధమయున్.

క. అమృతం బచ్యుత మమలం, బమేయ మవ్యయ మనంత । మవ్వెలుఁగు యమా
ద్యముల నలవడినచిత్తము, శమాతిరేకమునఁ బొంద । సంవేద్య మగున్. 201

క. అని గురుఁ డుపదేశించిన, విని మనువు గృతార్థుఁ డయ్యె । విద్వన్నుత నీ
వును నలవరింపుమీ మన,మున నివ్వాక్యములయర్థ । ముం దత్పరతన్. 202

1. క. దాన తనన్. 2. చ. దేరుగడ.

వ. అనిన విని పరమహర్షంబునం బాండవాగ్రజుండు పితామహుం బ్రశంసించి మ
 హాత్మా మహనీయుం డగుకృష్ణునిమాహాత్మ్యంబు వినవలతుం జెప్పవేయని యడి
 గిన నతం డమ్మహీపతితో నారదజామదగ్న్యమార్కండేయవ్యాసవాల్మీకిప్రభృ
 తిమునీంద్రులు సెప్ప వినిన తెఱం గెఱింగించెద నాకర్ణింపు మని యి ట్లనియె.

క. కృష్ణుఁడు ప్రభవిష్ణుం డగు,విష్ణుం డనిలాగ్నితోయవియదిలలఁ గ్రియా
 నిష్ణాతత్వవినోదన,తృష్ణం గల్పించెఁ దనదుదివ్యవిభూతిన్. 204

తే. అట్లు కల్పించి జలములయందు భవ్య,తల్పగతుఁ డైన నాభిఁ బద్మంబు దోఁచె
 నందజుఁడు వుట్టి సృజియించెనందనుల మ,నంబునన సప్తసంఖ్యులనరవరేణ్య.

వ. మరీచియు నత్రియు నంగిరసుండును బులస్త్యుండును బులహుండును గ్రతువును
 దక్షుండు ననంబరఁగువారలయందు మరీచికిం గశ్యపప్రజాపతి జన్మించె నతనివలన
 సురాసురగరుడనాగాదిజాతిసంభవంబునుం గలిగె నతనికి సూర్యుండును నత్రికి సో
 ముండును నుదయించి రాజవంశంబులకుఁ గూటస్థులైరి సూర్యసోమాన్వయజాతు
 లై నన్నృపతు లనేకు లనేకదేశంబు లేలిరి దేశకాలవిశేషంబుల నృపకులంబులు
 బహుశాఖంబులై వర్తిల్లు వాని నెల్లం దనవలసినయప్పుడు విష్ణుండు పరస్పరవి
 రోధజనితసంగ్రామంబులు నిమిత్తమాత్రంబులుగాఁ గలవిశేషప్రకారంబులనుప
 సంహరించు నద్దేవుండు వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధాత్మకంబులగుచతు
 ర్విధదివ్యస్వరూపంబులు గలిగి జగద్భరణం బాచరించుచు నిట్లు లీలాజన్మంబు
 లం బొంది క్రీడ సలుపు నని కృష్ణునిం జూపి యీభూతేశ్వరు మానుషసామా
 న్యదృష్టిం జూచుట యజ్ఞానంబు గృష్ణుండు భక్తపరతంత్రతం జేసి యుత్కృష్ట
 చరితులయారాధనంబులకు భాజనం బయి భోగమోక్షంబులు గరుణామయక
 టాక్షంబుల నొసంగు ననినం బ్రీతుండై భీష్మునకుం బ్రణమిల్లి యుధిష్ఠిరుండు.

క. మునిజనవినుతచరిత్రా, మనుజుం డెవ్వానిఁ దలంచి మహనీయనిరం
 జనసిద్ధిఁ బొందఁగను నే,యనువు దలఁపు [1]నలవరించు నని యడుగుటయున్.

భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రప్రభావంబు తెఱం గెఱింగించుట.

వ. ఆధర్మతనయుతోడ నద్దేవవ్రతుం డి ట్లను నారదునిచేత వినినతెఱంగు వివరిం
 చెద నాకర్ణింపుము. 208

తే. పరము నక్షరు విష్ణునిఁ [2] బ్రస్తుతించి, నారదమునీంద్రుఁ డంజలినమిత మైన
 మస్తకముఁ జేర్చి భక్తిసమగ్రచిత్త,వృత్తి నల్లన యి ట్లని విన్నవించె.209

క. దేవా మోక్షార్థిజనము, లేవెరవున నిన్నుఁ దలఁతు రేజప్యము సం
 భావింతురు నా కానతి,యీవే భక్తపరతంత్ర యేర్పడఁ గరుణన్. 210

తే. అనిన నద్దేవమునిపలు కాదరించి, వరదుఁ డగువిష్ణుఁ డి ట్లనుఁ బరమభక్తి
 నిర్మలశ్రద్ధ యింద్రియనిగ్రహంబు, మన్మయధ్యానమునకు నమాత్యకోటి.

1. క. నిలువరించు. 2. గ. బ్రిస్తరించి.

క. విను వీతకల్మషున కవి, పనుపడుఁ గల్మషము లెల్లఁ । బాపఁగ నామె
చ్చినయట్టిపరమసాధన, మనుస్మృతి జపించునది ని।యతిమెయి దానిన్. 212

తే. ప్రణవపూర్వక మగునమః।పదముపొంత, షడ్గుణైశ్వర్యవాచక।సర్వవసన
నిర్వచనశబ్దములు గ్రమ।సిద్ధమెయిఁ జ,తుర్థిఁగూర్పంగమంత్రంబు।దోఁచుబెరసి.

క. తొలితొలి యిమ్మంత్రము ని,శ్చలమానసుఁడై జపించి । జపియింపంగా
వలయు ననుస్మృతి దానం, గలుగుఁ జతుర్వర్గసాధ।కత పురుషునకున్. 214

క. అని మఱియు దయ ననుస్మృతి, యనుపేరం గలుగుదాని । నమ్మునిపతి కి
ట్లని చెప్పె నచ్యుతుఁడు నిజ. మనఃప్రియంబై నయట్టి।మహిత స్తవమున్. 215

సీ. అవ్యక్తు శాశ్వతు । నఖిలప్రభవభూమి, భక్తవత్సలు విష్ణుఁ । బరమపురుషు
నక్షయుఁ బ్రాంజలి । నై యాశ్రయించెదఁ, బుండరీకాక్షుని । భువనసాక్షి
నిత్యుఁ బురాణు వ।ర్ణించెదఁ బరు సహ,స్రాక్షు నక్షరుని లో।కైకనాథు
భవ్యుఁ గొల్చెద భూత।భవ్యభవత్ప్రభు, సర్వతోముఖు భూత।సంప్రవర్తి

ఆ. నమృతు నచ్యుతుని న।నంతు హృషీకేశు, రవిసహస్రనిభు హి।రణ్యగర్భు
నబ్జనాభు సత్యు । నాద్యంతరహితు భూ,గర్భుఁ బ్రభువు భక్త।గమ్యుఁ దలఁతు.

తే. అచలు సూక్ష్ము వరేణ్యు స।హస్రశీర్షు, నభయకారి నశీర్షు నా।రాయణుని స
నాతనుని యోగమూర్తి లో।కాతిరిక్తు, ధ్రువునీశ్వరుహరిభక్తి।తోడఁ గొలుతు.

క. ఎవ్వఁడు సచరాచరగురుఁ, డెవ్వనినాభీసరోజ । మీనె విధాతక
నివ్వటిలు జగము లన్నియు, నెవ్వనిచే నమ్ముకుందు । నెప్పుడుఁ గొలుతున్. 218

తే. స్థావరములుజంగమములు।ధాతలోను, గాఁగఁ బ్రళయంబునొందిన।కాలమునను
నిలుచునెవ్వఁడొకండయా।నిత్యసత్యు,లలితుశార్ఙ్గిఁబ్రసన్నుఁగా-।గొలుతునియతి.

క. కాలముఁ బర్జన్యుండును, నేలయు సస్యంబుఁ గ్రియయు । నిష్క్రియయును ధ
ర్మాలోకము నై మహిమ, న్లీల సలుపువాసుదేవు।నిం బ్రణుతింతున్. 220

క. అనలునకు రవికిని శశాం,కునకును గ్రహతారకముల।కును దేజం బె
వ్వనివలన నావహిల్లెడు, ననుపాధిక తేజుఁ గొల్తు । నవ్విశ్వాత్మున్. 221

తే. నాలుగింటను వెండియు । నాలుగింట,రెంట నైదింట మఱియును । రెంట వేల్చి
యజ్ఞశీలు రారాధించు।నట్టివిష్ణుఁ, డిష్టదాయి ప్రసన్నుఁ డ।య్యెడును నాకు.

ఆ. యజ్ఞధరుఁడు పంచ।యజ్ఞుండు లక్ష్మికి, నునికిపట్టు యోగ।మునకు నెలవు
సర్వమునకు నిష్ట।సదనంబు గా నొప్పు,వాని నాశ్రయింతు । వరదుఁ బరము.

క. అగమనునిం బొంథు నఖిల,జగద్భరణపరు నమూర్తి । సాగరనిభబో
ధగరిష్ఠుఁ బంచకాల,జ్ఞు గుణాత్మకు నిర్గుణత్వ।శోభితుఁ గొలుతున్. 224

క. వ్యక్తమునకుఁ బ్రభవం బ,వ్యక్తం బాతత్త్వమునకు । నవ్వుల యనువచో
యుక్తికిఁ బరాయణం బగు,భక్తపరాధీను భవ్య।భావ్యు నుతింతున్. 225

క. జ్ఞానధ్యానపరాయణు, లైనమహాత్ములు జితేంద్రి।యత్వమహితు లె

వ్వానిం బొందిన మరలరు, వాని శరణుఁ జొచ్చి బ్రదుకువాఁడ సుకృతి నై.

క. లోకం బంతయు నెవ్వం, డేకాంశంబునన నిర్వహించుచు నగ్రా
హ్యాకారుం డై వెలుఁగు ద,యాకరు నప్పద్మనాభు నభివర్ణింతున్. 227

తే. అయిదు దెఱఁగులఁ బ్రకృతిఁ బంచాననముల, ననుభవించు క్షేత్రజ్ఞు సత్త్వాదిగుణచ
యంబు లీల భుజించుమహత్త్వకలితు, సంశ్రయింతు మదాత్మప్రసత్తిఁ గోరి.

క. మతిగతసాంఖ్యులు యోగా,న్వితులు నగుమహాత్ము లెవ్వనిం గని పునరా
గతి లేనిసుగతి వడయుదు,రతర్క్యువైభవునిఁ దలఁతు నప్పరమాత్మున్. 229

క. ఇనునడుమ వెలుంగుచు సో,మునిమధ్యమునం జలత్వమును బొందనిని
ల్పున వెలయుదీప్తియగువా,ని నిరంజను నంతరాత్మునిం బాటింతున్. 230

క. సోమార్కాగ్నిమయముఁ దా,రామయమును నిత్యసుస్థిరంబును నగుతే
జోమయతత్త్వము నాత్మా,రామత్వంబున నిరంతరంబును జూతున్. 231

క. గుణములకు నాది యై ని,ర్గుణములకు నాద్యుఁ డగునరూపుని లక్ష్మీ
ప్రణయపరము నజు సూక్ష్మునిఁ, బ్రణుతింతుఁ బ్రసన్నుఁ గాఁ బరము సర్వగతున్.

క. కలయంగ నెల్లయెడలుం, దలలును లోచనములును వదనములు నగుని
ర్మలు నిర్వికారు నిన్నుం, గొలిచెద సర్వైకసాక్షి గోవింద హరీ. 233

క. నిను నెఱుఁగ కున్న సంసా,రనిమగ్నత వోదు గోచరము గావు మనం
బునకు నఖిలేంద్రియములకు, నను నే మనువాఁడ వింక నారాయణుఁడా.

క. రోషముఁ గామము రాగ,ద్వేషములును లేక భక్తి దిర మై యేకా
శ్లేషిణిగాఁ గొలుతు రవి,శ్లేషమనోనిలయవృత్తి సిద్ధులు నిన్నున్. 235

క. ఫలములు గోరక కర్మం,బులు నడపుచు వాని విమలబోధాగ్ని[2]హుతిం
బొలియించుచు నిర్ద్వంద్వత, నెలకొను నేకాంతిజనులు నినుఁ గందు హరీ.

క. దేహస్థు నదేహు నఖిల, దేహిసమున్ నిన్ను భక్తిఁ దెలుతురు దురిత
వ్యూహమ్ముఁ బుణ్యచయము న,మోహత నిరసించుయోగిముఖ్యులు కృష్ణా.

చ. ప్రకృతియు బుద్ధ్యహంకృతులు భావము భూతచయంబు నింద్రియ
ప్రకరముఁ గేశవా భవదుపాశ్రయ[3]భావితవర్తనంబు లా
సకలమునందు నీవును బ్రసన్నత నిల్తది నీకు నీవు దా
నికి నిలువంగఁ బట్టగుట నిక్కము [4]గా దిటు లై వెలుంగుదే. 238

క. ఏకత్వం బన్యత్వ మ,నేకత్వము గలుగునీమహిమ చందం బా
లోకింప నిపుణు లగుసు,శ్లోకులకుం బరమపదము సులభము శార్ఙ్గీ. 239

తే. అచరములును జరంబులు నైన భూత,సముదయంబులు మణులు సూత్రమున నున్న
కరణి నీయంద యున్నవి గాన సమత, నేకభక్తినేఁ గొలిచెద నిమ్ము దేవ. 240

క. హేతురహితుఁడ వకర్తవు, భూతస్రష్టవు సమస్తభోక్తవతత్త్వం

1. క. పొందు. 2. క. వడిం. 3. గ. భాసిత. 4. గ. నిటు లై వెలుంగవే.

బై తత్త్వము నగుదు జగ, న్నేతవు కూటస్థుఁడవును సేవ ముకుందా. 241

సీ. ద్వేష్యంబుఁ బ్రియ మను వేర్పాటు లేదుభూ,తములయం దెల్లను సముఁడ నాకు
భూతసంయోగంబు బుద్ధ్యహంకారయు,క్తియు గుణత్రయసంగతియును లేవు
ప్రారంభణంబు ధర్మాధర్మములు నింద్రి,యములపొందును విషయాభిరతియుఁ
బరిహృతంబులు జరామరణమోక్షార్థి నై, శరణంబు వేఁడెదఁ గరుణ నాదు

తే. ఘ్రాణజిహ్వలు మహి నుదకమున దృక్కు
త్వక్కు దేజంబునందును వాయువునను
శ్రోత్ర మాకాశమునఁ గ్రమసూత్రితముగ
బొందఁ జేసి గోవింద యానంద మిమ్ము. 242

సీ. ఇల జలంబుల జలంబులు శిఖి శిఖి వాయు,వున వాయు వంబరంబునను నంబ
రంబు చిత్తమునఁ జిత్తం బహంకృతి సహం,కృతి బుద్ధిఁ దగ నొదిఁగించి యింత
వట్టును గూడ నవ్యక్తంబుఁ జేర్చి య,వ్యక్తంబు నిజభంగి నైనఁ ద్రిగుణ
సామ్యవ్యవస్థితి నడిసన్నఁ గారణ,భూతతన్మాత్రలు పొదువ కుండఁ

తే. దొలఁగఁబెట్టుట వారకొన వలయు దానఁ, బరమమున కేవలమున గుపదము గలిగి
యేన నీవను నైక్యంపు బలుకవాఁడ ముఁ,గాత గమనాగమనములు గ్రాఁగిపోవ.

క. హరియం దేనును నాయం, దరయంగా హరియుఁ గలము హరి నాకును నా
హరి కేను ననశ్వరులము, హరిప్రసాదోదయము మహత్తరమహిమన్. 244

తే. బుద్ధియును బ్రాణమును నిన్నుఁ బొరయఁ జేయఁ
జాలుభక్తి నా కొసఁగుము జలధిశయన
పూర్వకర్మఫలంబులు పొందుఁగాక
యవి ఋణంబులు గడ తేఱు నై సుఖింతు. 245

తే. నిన్ను నెప్పుడుఁ దలఁచెద నన్ను నీవు, వత్సలుఁడ వయి వీఁడు నావాఁడ నంగ
వలయుఁ జుమ్మయ్య మఱవక వాసుదేవ, దేవదేవ మునీశ్వరభావనీయ. 246

క. తనుఁ దనయంద నిలిపి పే, రనువున బుద్ధికడ వెలుఁగు నచ్యుతుని సనా
తను సగ్రాహ్యునిఁ జిన్మయు, ననుస్మరించునది యపునరావృత్తికి నై. 247

క. పరమాత్ముని నారాయణుఁ, జిరంతనుని భక్తిశేముషీనిష్ఠాస్వీ
కరణైకాయనుని నమ,స్కరణంబునఁ దలఁతు సతుల షడ్విధభూతిన్. 248

తే. అని జపించి సర్వావస్థలందు నను వి,శిష్టభక్తి ననుస్మరించిన యతండు
సకలపాపంబులను బాసి శాంతి నొంది, యవ్యయానందపదమున నతిశయిల్లు.

తే. వైష్ణవియుఁ గల్మషప్రజధ్వంసినియును, నైనయీయనుస్మృతి ప్రాజ్ఞుఁడైన సజ్జుఁ
డైన నెవ్వాఁడు పఠియించు యజ్ఞదాన,సమయములవాఁడు తత్ఫలశతమువడయు.

క. సురపితృపూజలఁ బావక,పరిచర్యలయందు నన్ను భక్తిఁ దలఁచుచుం
బరమనియతి నివ్వాక్యో,త్కరముఁ బఠించినయతండు గనుఁ బుణ్యగతిన్. 251

క. వినిపించునది యనుస్మృతి, నను భక్తిం గొలుచుబహుజనములకమావా
స్యను బున్నమ బారసిని న,వినయంబుగ దాన నెల్లవిభవముఁ గలుగున్.
క. జనము లనుస్మృతిఁ జదువఁగ, విని మ్రొక్కిసయంత్యజునకు విశ్రుతగతి గ
ల్గు ననిన సద్భక్తి జపిం,చినయుత్తమజాతిజునకుఁ జెప్పఁగ నేలా. 253
ఆ. అఖిలకర్మఫలము నంతవంతంబు మ,ద్భక్తులకు ననంతపదము గలుగు
నట్టు లగుటఁ దలఁపు మమరమునీంద్ర ని,న్నది మదీయపదమహార్థిఁ జేయు.
క. జ్ఞానము కేవలకృప న,జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రజనితము సేయం
గా నది సకలధరిత్రీ,దానంబునకంటె నధికతరఫలద మగున్. 255
క. కావున నీ కేఁ జెప్పిన,యీవిధ మంతయును శుద్ధహృదయులకుఁ గృపా
శ్రీ వెలయఁ జెప్పుమీ పు,ణ్యావహశీలురకు సులభ మగుసర్వంబున్. 256
తే. అశ్వమేధసహస్రంబు లాచరించి, పడయరానిమహోన్నతపదము సత్స
దీయభక్తి రసైకపరాయణుండు, వడయనేర్చు సుకరముగ బ్రహ్మపుత్ర. 257
సీ. అని చెప్పె నిట్టు లయ్యనిమిషమునిపతి, యడుగంగ శంభుఁ డయ్యాదినమాద
రంబున నెఱిఁగించె రాజవంశోత్తమ, తెల్లంబుగా నది యెల్ల నీకుఁ
జెప్పితి నేకాగ్రచిత్తుండ వై పర,మాత్ము నన్నారదునట్ల భక్తి
సంభృతశ్రద్ధానుషంగతాత్పర్యంబు,తోఁ దలంపుము కృతార్థుండ వగుదు
తే. పరమవరదరహస్యానుభావపూజ్య
మానమూర్తి యనుస్మృతి దీనిజపము
బుద్ధిఁ బెనుచు మఘంబులఁ బోవఁ ద్రోచు
బంధములఁ బాపు నిత్యశుభంబు నొసఁగు. 258
క. అని భీష్ముం డుపదేశిం,చిన విని యానందభరితచిత్తుం డై పాం
డునృపాత్మజుఁ డప్పుణ్యా,త్మునకుం బ్రణమిల్లె వినయమునఁ దను వొప్పన్.
వ. ఇట్లు ప్రణామంబుసేసి యాధరణీవరుండు గురుపితామహునితో మోక్షమార్గబో
ధనప్రపంచం బుపదేశింపవే యని యడిగిన నతండు వార్ష్ణేయాధ్యాత్మం బను
నితిహాసంబు గల దాతంత్రంబు నీయడిగినది యై యుండు నని పలికి వినుము
వార్ష్ణేయనామధేయుం డగువాఁడు. 260

భీష్ముండు ధర్మజున కధ్యాత్మవిద్యాప్రకారం బెఱింగించుట.

క. మానితముని యొకఁడు సుఖా,సీనుండై యున్న నతనిశిష్యుఁడు వినయం
బూని నిలిచి మోక్షము తెరు,వానతియీవే దయామయా నా కనుచున్. 261
వ. పాదములకుం బ్రణమిల్లినఁ బ్రబోధమహితాత్ముం డగునమ్మహాత్ముండు. 262
ఆ. భక్తి గలవు నాకుఁ బ్రజ్ఞానఘనుఁడ వ,ట్లవుట నీవు యోగ్యుఁడవు కుమార
సదుపదేశమునకు సమవధానుండ వై, వినుము నాదు వాక్యవృత్తి తెఱఁగు.

వ. అని పలికి యిట్లనియె. 264

తే. కాలచక్రంబు నిరవధికంబు దీని
సర్గములుఁ బ్రళయంబులుఁ జనుచు నుండుఁ
బ్రళయమునఁ బరమాత్ముండు ప్రకృతిఁ బొంది
యఖిలమును సృజియించుఁ గల్పాదియందు. 265

తే. భూతజాలంబుతో మునిపుంగవులును
డోఁచి మును ప్రళయంబునఁ దోఁ పడంగ
చనినసర్వవేదంబులు శాస్త్రములును
బడసి రద్దేవుదివ్యానుభావమునను. 266

క. న్యాయాద్యనేకతంత్రము, లాయంచితమతు లొనర్చి యఖిలజనాను
ష్ఠేయాచారములుఁ బరి,జ్ఞేయములుగ విశదభంగిఁ జేసిరి పుత్త్రా. 267

క. అవి వినఁగ నెఱుఁగఁ జేయను, నవుఁ బరమబ్రహ్మబోధ మమరులకు ముని
ప్రవరులకును దుర్లభ మ,య్యవగతము జనార్దనునక యలవడియుండున్. 268

ఆ. సకలదుఃఖభేషజం బగున త్తెరు, వప్పురాణపురుషు నగ్గలంపుఁ
గరుణ నతనివలనఁ గనిరి మునీంద్రులు, క్రమముతోడ నర్హగమ్య మయ్యె.

క. చైతన్యశక్తిఁ బురుషున,మేతత్త్వవిశేషమున వహించుఁ బ్రకృతి త
జ్జాత యగును బుద్ధి తదు,ద్భూత మహంకార మదియుఁ బొరయుం జిత్తున్.

క. కలిగె వినుమహంకారము,వలన నభము దానఁ జేసి వాయువు క్రమసం
కలితజననములఁ దేజము,జలము నిలయుఁ దత్తదాత్తజన్యత్వమునన్. 271

వ. బుద్ధికి మహత్తనుతత్త్వనిర్దేశంబునుం గలిగి యుండు. 272

క. వికృతులు మహదాదికస,ప్తక ముభయవిధేంద్రియములు పదియు విషయపం
చకమును మనసును గూడఁగ, వికారషోడశక మిది వివేకాభ్యక్షా. 273

క. ఈసర్వము దేహాత్మా, భాసిత మిది దేహి యైనపరమాత్ముని వి
న్యాసమునకుఁ గానోదవి యు,పాసించుం గరణరూప మై యాకర్తన్. 274

తే. పుత్త్రవినుమునవద్వారపుణ్యపురము,నం దచింత్యసంవ్యాపకుఁ డై శయించు
నీసమస్తభావంబుల నెనసి యట్టు,లగుటఁ బురుషుండు నాఁ జను నవ్విభుండు.

క. అమరుం డవ్యయుఁ డజరుం, డమేయుఁ డమలస్వభావుఁ డప్పురుషుఁడు దే
హమున మహీజమునం దన,ల మున్నగతి నుండు మథనలక్ష్యుం డగుచున్. 276

ఆ. వినుము యోగమథనమునఁ దోఁచు నత్తేజ,మది ప్రబోధసాంద్ర మఖిలభూత
గణసమాశ్రయంబు గావున శ్రవణద,ర్శనముఖక్రియాకరంబు దాన. 277

క. భూతము లవ్యక్తంబున, జాతము లగు నంద పెరుఁగు సమయుఁ దదీయ
స్ఫీతత్త్వమునన పురుషుం, డేతద్విధసాక్షి తాన సమిద్ధుఁడు వత్సా. 278

భీష్ముఁడు ధర్మజునకుఁ గాలచక్రప్రభావం బెఱిఁగించుట.

ఆ. వ్యక్తసప్తధార మవ్యక్తనాభంబు, షోడశకవికారసుపరిమండ
లంబు ధ్రువ మధిష్ఠితం బాత్మచేతఁ జ, క్రంబు దిరుగుచుండుఁ గాలవశత.

క. ఈచక్రంబున సకలచ, రాచరమయ మైనలోక మవశానిష్ఠా
గోచర మై చరియించుట, సూచికొనఁగ వలయుఁ దత్త్వశోధనదృష్టిన్. 280

తే. పోఁడమ సత్త్వరజస్తమంబులు విశుద్ధు, లంతరాత్ముఁ బాంసువ్రాతమనిలుఁ జెందు
నట్లు సద్వివేకమునఁ దదంతరంబు, బుధుఁడు గాంచి యగ్గుణములఁ బొరయకుండు.

క. వేదాంతవిదుఁడు దుర్లభుఁ, డాదరము ప్రవృత్తిలక్షణాన్విత మగుధ
ర్మోదయమంద కలుగు నది, లే దరయ నివృత్తిసౌఖ్యలీసత్త్వమునన్. 282

క. ఆర్యులుఁ బ్రవృత్తిలక్షణ, కార్యంబులచేతఁ జేసి గ్రాహ్యము సగుత
ద్ధుర్యత్వమును విడువ ర, నార్యము లగుమదనమదభయక్రోధాదుల్. 283

తే. వినుము దేహాభిమానికి వీని నెల్లఁ, దొఱఁగ దొరకొన దెంత శాంతునకు నైనఁ
గాన యేమిట దేహాభిమాన మెడలు, నట్టిచూ పభ్యసించు వేదాంతవిదుఁడు.

ఆ. అడవి సొచ్చి యంతకంతకు నవులకు, నతికుతూహలమున నరిగి యరిగి
చూచుచుండునట్లు సూవె సంసారకా, ననమునందుఁ దిరుగుజనులనడవు. 285

క. విను తెవులుడుపఁగ భేషజ, మునకుం దలకొనినచందమున మది సత్యం
బును శౌచము శమమును దమ, మును నెలకొలుపంగవలయు మోహచ్యుతికిన్.

తే. భూమి మొదలుగఁ గలభూతములకు నింద్రి
యముల కన్నింటికిని సత్త్వ మాది యైన
గుణములకు నెల్ల జగములకును దదీశ్వ
రునకు నరయ నహంకార మునికిపట్టు. 287

తే. స్మృతియు సంప్రీతియును బ్రసన్నతయు మఱియు
నీదృశములును సత్త్వగుణోదితములు
రాగలోభరోషాదులు రాజసములు
దర్పశోకప్రముఖములు దామసములు. 288

క. జ్ఞానమునకు నగ్గుణసం, తానం బడ్డంబు గాన తత్ప్రతిహతికై
పూని మును సాత్త్వికమునను, మానస మూన్పంగవలయు మహనీయధృతిన్.

క. విను సాత్త్వికములు మది నెల, కొని రాజసతామసములకును విగతత్వం
బొనరించుఁ బదంపడి స, త్త్వనిరూఢత బోధసంపదకు హేతు వగున్. 290

తే. క్రియలహంకారమునఁ గల్గుఁ గ్రియలవలన, దేహసంబంధ మెడలక తిరుగవలయు
జన్మపర్యాయములయందు జన్మ మనఁగ, మిళితనవశుక్లశోణితకలితవృత్తి.

ఆ. మూత్రమునఁ బురీషమునను నానుచును గర్భ, మునఁ బ్రవర్ధనమ్ముఁ బొంది వెడలి
సంతతానుబంధసంసారదుఃఖని, ర్మగ్నుఁ డగుచు నుండు మానవుండు. 292

క. ఇంతకు మూలము దృష్ణా, తంతులతయ వత్స వినుము దానికి నడరం
గాంతాజనంబు దొలుప్రాఁ, కింత యెఱుఁగి తృష్ణ దొఱఁగు టిచ్చు విముక్తిన్.

క. జ్ఞానాజ్ఞానంబులకుం, దాన యుపాశ్రయము బుద్ధి తత్త్వాహంకా
రానూనలక్షణాఢ్యం, బైనయెఱుక దాని జీవుఁ డని చెప్పు శ్రుతుల్. 294

ఆ. అతఁడు కాలకలిత మైనకర్మమున సం, సారవర్తనంబు సలుపు చుండు
స్వప్నసంప్రవృత్తి సలిపెడునరువాడ్కి, నింద్రియములతోడ నెనయ బెరసి.

క. రాగపరిలిప్తమానస, యోగంబున నింద్రియంబు లుల్లసితములై
భోగు లగుట యుడిపిన నప, రాగతసంసారదుర్విరామము సేయున్. 296

క. పురుషు లఖిలభూతములను, బురుషులలో భూమిసురులు భూమిసురులయం
దరయంగ మంత్రవేదులు, వరు లధికులు బోధయుతులు వారలకంటెన్.

క. జ్ఞానంబు దృష్టి నరునకుఁ, గాన నయనహీను నడపుకరణి యగుటఁ బ్ర
జ్ఞానవిహీనుని నడవడి, దీని నెఱుఁగ వలయు నెఱుక దెచ్చికొనంగన్. 298

క. క్షమయును సత్యంబును శౌ, చమును సుధర్మములు బ్రహ్మచర్యం బత్యు
త్తమధర్మము వానికిఁ జి, త్తము నలవఱుపంగవలయు ధైర్యముపేర్మిన్. 299

క. పరిహాసము భాషణమును, నిరీక్షణము లోను గాఁగ నింద్యంబులు సుం
దరులయెడ దీని [1]కేమని, చొరఁ దగ దక్లైన మనసు సొత్తురు సుదతుల్.

క. విను మాంసాస్థిమయం బని, వనితాంగము సద్వివేకవైభవమునఁ గాం
చిన నందు మది దగుల దా, పనికిని నాడీవిశుద్ధి ప్రాపగుఁ బుత్రా. 301

క. శారీరస్థితికిఁ బ్రథమ, కారణ మై యుండు నాడికాదశకము సం
చారిక లగునింద్రియముల, కారయ నాడికలు మఱియు నైదమలమతీ. 302

తే. స్థూలభంగులు పదియును సూక్ష్మభంగు
లైదు నివి వీనికంటె నత్యంతసూక్ష్మ
భంగి హృదయంబునడుముగాఁ బరఁగి యున్న
నాడి యది సర్వగత యగుఁ జూడఁజూడ. 303

క. ఆచూపు మరగి చిత్తం, బేచవికిం బోదు పోయెనేని మరలుపఁ
గోచర మగు వెలిచవులం, బాచిన లోచవిన నిలిచి పరమాత్మఁ గనున్.

క. ఆవిధము శుక్లగతి గను, భావమునకుఁ గాని పట్టు వడదు వినుము శు
క్లావేశము సంకల్పజ, మావాసము శుక్లమునకు నఖిలాంగకముల్. 305

క. అరయఁగ సంస్పర్శమునన, తిరుగుడు వడు శుక్ల మనుట తెఱఁగే సంక
ల్పరతిం గలదే చోఁ కెడఁ, జరింప కుండంగ వలయు సంకల్పంబుల్. 306

తే. అత్రిముని యింద్రదైవత్య మని జనులకుఁ
దెలిపె నది కారణముగ నింద్రియ మనంగఁ

1. గ. కేమతి.

బరఁగుఁ జూవె నృబీజంబు పరమ మెల్ల
ధాతువుల కది విను పుత్త్ర దానివిధము. 307

ఆ. శుక్లమునకు మనసు సూక్ష్మరూపము మనో,బలము నిల్వరింపఁ బక్వబుద్ధి
యోపుఁ దరుణవృద్ధు లోప రజ్ఞానదా,ర్బల్యమూఢవికల భావు లగుట. 308

క. కావున శుక్లస్థితికిం, గావించినయట్టిపుణ్యకర్మము లగుస
త్సేవితయమనియమాదుల,త్రోవ సొరఁగవలయు విషయదూరాత్మకుఁ డై.

క. అరయఁగ విషయము లెంతయు, దురంతములు వానియందుఁ దొడరినఁ జేటుం
బొరయుదురు దొడర కున్నం, బరమపదవి యమ్మహానుభావులకు నగున్. 310

క. జననము జరయును మరణం,బును మొదలుగఁ గలుగుదుఃఖములు లోకమునం
గనుఁగొని బుధుండు మోక్షం,బున కుద్యోగించునియతిఁ బూతహృదయుఁడై.

తే. వాఙ్మనఃకాయములు శౌచవంతములుగఁ, జేసికొని యనహంకారశీలశాంత
బుద్ధియై నిరపేక్షతఁ బొంది యఖిల,భూతదయ గల్గి మెలఁగంగ బోధమొందు.

క. మనసును వాక్కును గాయం,బు నియంత్రితములుగఁ జేసి పొందుదురు ధనం
బునకై మ్రుచ్చులు దానిం, గనుఁగొనఁగా వలదె మోక్షకాంక్షికి వత్సా.

ఆ. బుద్ధిఁ గొని మనంబు వో నీక నిలిపి [1]మ,నోభియుక్తి నింద్రియముల నాఁగి
విషయసమితి నెడల విడిచినవానికి, ననిమిషులు ప్రసన్ను లగుదు రనఘ. 314

క. విను దేవతాప్రసాదం,బున నిర్మలయోగతంత్రములు పనుపడుస
య్యానువున నిశ్చలమతి ని,ల్చునది శిథిలితాన్నపానసుఖతృష్ణుం డై. 315

క. శాకకణమూలఫలపి,ణ్యాకాదుల భైక్షమైన యన్నంబున ని
శ్శోకత నాఁకలి వుచ్చుచు, [2]లోకాలోకంబున నచలుఁడు గావలయున్. 316

క. జ్ఞానమ యింధనముగ వి,జ్ఞానాగ్నిం బ్రబలఁ జేయ జరయు మరణముం
నానావిధదుఃఖంబులు, లేనియమృత మక్షరంబు లెస్సై తోఁచున్. 317

క. విను నిద్రాదోషంబునఁ, గనుకలల రజస్తమోవికారంబులచే
మనసు దిరుగఁబడగాఁ గఱ,చినవి మఱచి యపుడ దుష్టశీలుండ యగున్. 318

వ. అది యోగి కొప్పదు గావున. 319

క. వినుతజ్ఞానాభ్యాసం,బున సమధికజాగరత్వముం బడసి సకృ
జ్జనితం బగునిద్రాభర,మునఁ బొందును యోగి యదియుఁ బోఁద్రోచుఁ దుదిన్.

వ. అని వెండియు. 321

### భీష్ముఁడు ధర్మజునకు స్వప్నాద్యవస్థల తెఱఁ గెఱింగించుట.

క. విలయం బింద్రియములకుం, గలుగఁగ విషయానుభవము గలిగినభంగిన్
మెలఁగును స్వప్నంబున మెయి, గలయట్టుల దేహి భావగతి యెయ్యదియో,

క. అని యిట్లొలయువితర్కం,బు నెడ హృషీకేశుఁ డైనపురుషోత్తముఁడ

1. క. మ. నమునశక్తి. 2. చ. లోకాలోకంబునం జ[illegible]లుఁడు.

ర్శనమును గ్రమమున నెఱిఁగిన,మునివర్గము శిష్యవర్గమునకు బోధించున్.

క. క్రమమున నింద్రియములు లీ,నము లగునది నిద్ర కల యగు సందర్శనాకా-
రము మిథ్యావిషయప్రా,ప్త మగుట యప్పుడును దేహి దా సాక్షి యగున్.

తే. అనిలముఖదోషములను సత్త్వాదిగుణవి
కారముల జాగరంబునఁ గలుగునట్టి
తోఁపు బెరయంగఁ గల యయి తోఁచు నది శు
భాశుభములకు సూచక మనియుఁ గలదు. 325

క. స్వాపావస్థం బ్రకృతి క,దీపిత వాటిల్లునపుడుఁ దెలి వెడలక తా
దీపించుఁ బురుషుఁ డిమ్మెయి,చూపు ప్రబోధంబుపరమ[1]సూక్ష్మత పుత్త్రా. 326

తే. తెలియ మేల్కనియుండుట గలలునిద్ర,యనునవస్థాత్రయంబునునవులఁబెట్టఁ
జాలు విజ్ఞాననిర్మల[2]సత్యబోధ,రూపనిర్భరానందస్వరూపుఁ డనఘ. 327

తే. వ్యక్త మవ్యక్తమును రెండు నవగతములు
గాక మోక్షంబుమార్గంబు గాన రాదు
వ్యక్త మది మృత్యు వవ్యక్త మమృత మనియె
నతులవిజ్ఞానఘనుఁడు నారాయణుండు. 328

క. అనఘా విను మవ్యక్తం, బనునది త్రైలోక్యమునకు నాధారము దా
ని నివృత్తలక్షణం బగు,ననుపమధర్మ మని చాటు నాగమఫణితుల్. 329

తే. వినుము బ్రహ్మోదితంబు ప్రవృత్తిధర్మ, మది గతాగతవ్యాప్తులనావహించు
బ్రహ్మమంద్రునివృత్తిధర్మంబునమ్మ, హాశ్రయముమోక్షదంబనునాగమములు.

క. కట్టినచీరయునుం బైఁ, బెట్టినచీరయును మాలి విగి యారంగాఁ
జుట్టినచీరయుఁ బోలెను, నెట్టన పొదివినది దేహిని గుణత్రయమున్. 331

క. విను సత్త్వరజస్తమముల,పెనఁకువ కవుల వెలుఁగొందు పెంపు గలుగుతు
ర్యనిరంజనతత్త్వము పర, మనఘా యది భావనీయ మను వేదంబుల్. 332

క. వాకును మనసును గాయము, నేకాయనవృత్తి శౌచ మెడలనితపముం
జేకొనునది యది బోధ,శ్రీకి ఘృతంబునకు వెన్న క్రియ జనక మగున్. 333

తే. బ్రహ్మచర్యమహింసనాఁ బరఁగుపరమ,ధర్మములురెండుసువ్యోయుత్తమతపంబు
దానిఁ గలవాఁడు నిర్మలజ్ఞానయోగ,వంతుఁడై చూడనేర్చు సర్వంబు ననఘ.

క. ఆతతసంసారము తృ,ష్ణాతంతుస్యూతిబంధనంబున దృఢమై
చేతస్సంగతిఁ బాయమి, కాతెఱఁగుతపంబు పుత్త్ర యౌషధము సుమీ. 335

క. వికసితతృష్ణాలతికకు, నకుటిల మగుతపము దాత్ర మై నఱకంగా
వికృతులఁ బ్రకృతిని బురుషుని, నకలంకజ్ఞానదృష్టి నవలోకించున్. 336

క. అని యమ్మునిపలు దెఱఁగులఁ, దను బోధించినఁ గృతార్థతం బొందెఁ దపో

1. క. సూక్ష్మిత పుత్రా. 2. గ. విజ్ఞాని నిర్మల.

ధనుఁ డాశిష్యుఁడు నీవును, గనికొను మేతద్వచోనికాయార్థంబుల్. 337

తే. అనిన విని ప్రీతుఁ డై పాండవాగ్రజన్ముఁ, డాపగాసూనుతో మిథిలాధినాథుఁ
డైనజనకుండు మోక్షంబునననఘ యేమి, కృత్యమునఁగాంచెనదియెఱింగింపుమనుడు.

వ. అతం డతని కి ట్లనియెఁ దత్సంబంధి యైనయితిహాసంబు సెప్పెద. 339

క. విను మాచార్యులు నూర్వురు, జనకనృపాలునకు వారు సతతంబును న
జ్జనపతి వినిపింతురు త, త్త్వనిరూపకశాస్త్రములు పృథగ్విధములుగన్. 340

క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన, నావసుధాధిపుఁడు దాని ననుమోదించున్
భావము సంతోషశ్రీ, భావిత మగు చుండఁ గురునృపాలప్రవరా. 341

వ. అట్టియెడఁ దత్త్వజ్ఞానఘనుండును నిర్ద్వంద్వుండును సంశయరహితుండును నగు పంచశిఖుం డనుమునివరుండు మహిం దిరుగు చుండి మిథిలకుం జనుదెంచె నతండు కపిలాభిధాన యగుగురుకుటుంబినిచన్ను గుడిచి పెరిఁగినవాఁ డగుటం గాపిలేయుండు ననంబరఁగు నమ్మహాత్ముండు హేతుమద్వాక్యవిశేషంబుల నయ్యాచార్యుల నూర్వుర నయ్యుర్వీపతిసన్నిధిన నిరుత్తరులం జేసిన నాతం డతనివిశేషజ్ఞత యెఱింగి వారల విడిచి తన్నుం బ్రబోధించుటకై ప్రార్థించి యతనికిం బ్రణతుం డైన నమ్మానసీయుం డనూనదయాయత్తచిత్తుండు గావున నాభూవల్లభునకు మోక్షోపాధిబోధప్రదంబు లగువాక్యంబు లి ట్లని యుపదేశించె. 342

## పంచశిఖుం డనువిప్రుండు జనకునకుఁ దత్త్వోపదేశంబు సేయుట.

ఆ. విను మవిద్య కామమునకుఁ గామము కర్మమునకుఁ బుట్టఁ బట్టులనఘ యింత
వట్టుఁ గారణముగ వచ్చుఁ బునర్జన్మ, మంద్రుతత్త్వవేదులైనమునులు. 343

ఆ. [1]ఒలసి లోభమోహములు దోషసంసేవ, నం బొనర్పఁగా ఘనతన్వగాఢ
యగునవిద్య భూమి యై బహుకర్మబీజముల కంకురాదిశక్తు లొసఁగు. 344

క. ప్రియములు నప్రియములును హృ
దయమును జిక్కువడఁ దివ్వఁ దత్తదనేక
క్రియలకుఁ జొచ్చు నరుఁడు మేన్
[3]వ్రయ మగు టెఱుఁగఁడు వితతజరావ్యాధులచేన్. 345

క. ధనములు బంధులు భోగము, లనియెడునస్థిరము లెల్ల నాత్మ కెరవు సే
సిన శాంతి యలవడును మన, మున శాంతిశ్రీసమృద్ధి మోక్షము నిచ్చున్.

వ. అనిన విని జనకజనవల్లభుం డమ్మునివల్లభునితోడ. 347

క. కేవలవైరాగ్యము మోక్షావహ మగునేని నట్టులైన విరక్తిన్
భావమున నరుఁడు దాల్చెడిఁ, బోవాఁ డవ్యయపదంబుఁబొందునె యనుడున్.

వ. అవ్విప్రవరుం డతని కి ట్లనియె. 349

క. విను నృప హర్షంబు ప్రియం, బనూనసుఖయుక్తి నిర్భరానందము శాం

1. క. ఎలసి. 2. చ. దయమునఁ...దిప్పఁ. 3. గ. వ్యయ.....జ♦రాదివ్యథలన్; జ. జ♦రాధివ్యాధిన్.

తినిరూఢి యనఁగ మనమునఁ, బనుగొనునవి సాత్త్వికాఖ్యభావంబు లగున్.

క. పరితాప మనభితోషము, నరేశ్వరా శోచనము జనవ్యాపారా
దర మక్షమ యనియెడునివి, యరయంగా రాజసంబు లగుభావంబుల్. 351

క. తలఁపులు గ్రందుగఁబొడముట, గలగను టేమఱుట భ్రమముగదురుట జాడ్యం
బలసత యనునీభావం,బులు దామసకోటి యంద్రుబుధులు నరేంద్రా. 352

క. కారణము గలిగియును ని,ష్కారణకలితంబు లయ్యు జనియించు ధరి
త్రీరమణ మూఁడుదెఱఁగులు, నారయ నివి యస్థిరంబులై తిరుగఁబడున్. 353

చ. జనవర సౌఖ్యముం బొరసి సాత్త్వికభావసముద్గమంబు సు
మ్మనియును దుఃఖముల్ గదిరినప్పుడు రాజసభావభంగి సు
మ్మనియు జడత్వసంగసమాశ్రయంబునఁ దామసభావవృత్తి సు
మ్మనియు జడత్వసంగసమాశ్రయంబునఁ దామసభావవృత్తి సు
మ్మనియును దోఁచి వానఁ బడ కాత్మరతిన్ నిలు పిచ్చు మోక్షమున్. 354

వ. ఇవ్వెరవునకు వైరాగ్యంబు మూలం బని చెప్పి వెండియు. 355

తే. వినుముసత్త్వాదిగుణములనఘయాత్మ,తత్త్వమునలీనములఁజేయఁదన్మయత్వ
దర్శనము దాన నవి మహోదధి నడంగు,నేఱులట్టుల రూపఱు వేఱు లేక.

తే. నరుఁడుసుఖదుఃఖములవెంటఁబొరయనీక,మలఁచియాత్మునిఁజేర్చినమానసంబు
లీన మగు నంద జలములలోన నిడిన, లవణకణముచందమ్మున నవనినాథ. 357

క. తోలు దిగవిడిచి నాగము,లీలఁ బొలుచుమాడ్కిఁ గర్మలేపముఁ దనతోఁ
గీలుకొన నీక వెలుఁగు ని,రాలంబనబోధఘనుఁడు రాజవరేణ్యా. 358

వ. అని బోధించె నిట్లు పంచశిఖునిచేత బోధితుండై కాదె జనకుండు దనపురం బైన మిథిల గాలునప్పుడు దుఃఖంబులం బొరయమింజేసి తన కేమియుం గాల దని పలికెం గాంతేయాగ్రజా యాకర్ణింపుము. 359

క. అమలం బగునీయితిహా,సము భక్తిఁ బఠించినం బ్రశాంతి యొలసి దుః
ఖములం దొఱఁగి మనుష్యుం, డమృతత్వావాప్తిమహితుఁడై వెలుఁగొందున్.

వ. అనిన విని ధర్మతనయుండు దేవవ్రతుతో నెట్టివాఁడు సుఖియును మంగళవంతుండును నిర్భయుండును నై వర్తించు నని యడిగిన నప్పుడమిఱేని కప్పురుషవరుండి ట్లను దమసంపన్నునకు నీచెప్పినచందంబు గలుగు నాకర్ణింపుము. 361

తే. సర్వవర్ణాశ్రమములకు [1]శమము దమము,గలిగి యునికి విశిష్టప్రకారమగుట
బ్రాహ్మణునకు విశేషించి రాజవర్య, దమసమాహితవృత్తి పెద్దయును వలయు.

వ. దమంబు సుద్గుణంబులరాశి యవి యెయ్యవి యంటేని. 363

సీ. శౌచ మక్రోధంబు సంతోష మార్జవ, మనసూయ విగతదైన్యత్వవృత్తి
యప్రమాదంబు దురభిమానరాహిత్య, మతివాదవర్జన మఖిలభూత
దయ గురుపూజ నిందాస్తుతిప్రవణతా, త్యాగం బపైశునత్వంబు సాధు

---

1. క. సమము దమము.

జనసంగమం బమృషాభాషణంబు ని,స్స్పృహత యహింస సుశీలభావ

తే. మింద్రియగ్రామజయ మివి యెల్ల దమము
నాకృతులు వీనిఁ గలపుణ్యుఁ డభయుఁ డైహి
కములవలనను నాముష్మికములవలన
శాంతిమంగళనిధి బోధసౌమ్యమూర్తి. 364

వ. అనినం బితామహునితోఁ బాండవేయాగ్రజుండు వ్రతస్థు లొక్కొక్కయెడ భోజనంబులు సేయుదురు వారలకు వ్రతహాని లే కుండునే యని యడిగిన నతనితో నతండు. 365

తే. వినుము విప్రకామార్థభోజనము లోను, గాఁగఁ గలుగు వేదోక్తప్రకారభోజనములు వ్రతహాని సేయవు నరవరేణ్య, యనినిరూపించిపలికియిట్లనియెమఱియు.

వ. సదోపవాసియు సదాబ్రహ్మచారియు నమాంసభోజియు విఘసాశనుండును నమృతాశియు నస్వప్నుండునుం గావలయుఁ దత్స్వరూపంబు లెట్టి వంటేని. 367

సీ. ఇరుప్రొద్దు గుడుచుచు నెడ నెడఁ గుడువక, యుండునాతండు సదోపవాసి
ఋతుకాలమున నాత్మసతియంద రతి సల్పు, భవ్యశీలుఁడు సదాబ్రహ్మచారి
దేవపిత్రతిథిపూజావిధులం దిడి, మఱి నంజుపురుషుఁ డమాంసభోజి
దనయట్లు పంక్తివారును భుజింప భుజించు, నంచితాత్ముఁడు విఘసాశనుండు
తే. భృత్యవర్గంబు గుడిచినపిదపఁ గుడుచు, నాతఁ డమృతాశిదివసంబునందునిదుర
వోనిపుణ్యుఁడస్వప్నుఁడిప్పోలములగుమ, హాధిక వ్రతములు దేహబాధకములు.

## ఇంద్రప్రహ్లాదసంవాదప్రకారము.

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితోడఁ గర్మంబులు సంస్కారయోగంబున శుభాశుభంబులం బురుషుం బొందించు వానికిం గర్త యప్పురుషుండ యగుట గాకుండుట నిశ్చయింప రాకుండు నా కేర్పడం జెప్పవే యనుటయు నప్పాణ్యుం డక్కురువరేణ్యున కిట్లను నింద్రప్రహ్లాదసంవాదసమాకర్ణనంబున నది దేటపడు నాకర్ణింపుము సత్త్వస్థుండును సంయమనిరతుండును ననహంకారుండును నమర్షక్రోధదూరుండును దుల్యనిందాస్తుతియును సమలోష్టకాంచనుండును నారాయణధ్యానపరాయణుండును నగుప్రహ్లాదుం డొక్కయెడ నొక్కరుండ యాసీనుం డై యుండ నింద్రుం డతనియంతరంగం బారయ వేఁడి చేరం బోయి.

క. సంపద లేమికి మది శో,కింపవు శత్రువులచేతికినిలో నగుటూ
హింపవు నిను నూరకునికి, పెంపని పాటించెదిట్టిబేలవు గదవే. 370

వ. అనిన విని హిరణ్యకశిపునందనుం డప్పురందరున కిట్లనియె. 371

ఆ. కలిమి లేమి యనఁగఁ గల వొకరెండవి, యత్నగౌరవము వియత్నతయును
గలుగ వచ్చు ననుట గాదది సూ బేలఁ, దనము వినుము తెలియ ననిమిషేంద్ర.

క. తేరక యుండఁగఁ జేరుం, దేరంగాఁ బోలియు విధియశక్షసంబులు గా
కారయ విత్తంబులు పురుషారంభాయత్తములె మహాబుద్ధినిధీ. 373

క. [1]శత్రుజనులు చెఱుచుటయును, మిత్రులు బ్రతికించుటయును - మిన్నక మాస
[2]త్పాత్రతయును సంపదయు వి,ధాత్రుఁడు సంధించుఁజూవె తత్క్రతోఁ బురుషున్.

ఆ. భావములు నిజస్వభావంబునన తోఁచు, నడఁగు నట్లు గాన - యస్థిరతకు
నెలవు లని యెఱుంగ - నేర్చిన భావంబు,లందుఁ దగులునెట్లు - డెంద మనఘ.

ఆ. ఏను గర్త ననుట - యెఱుఁగమి దాఁ గర్త,యేని నేమిఫలము - నెడల కుండ
నఖిలకర్మములును - నాచరించుచు నున్న,వాఁడె కాన కర్త - గాఁడు దాను.

వ. అని పలికి వెండియు. 377

క. అనఘా విధివిహితంబుం, దనచేతగఁ దలఁప ఫలము - దగులు నహంకా
రనిరూఢున కనహంకా,రున కది లేమి ఫలయుక్తిఁ - ద్రోవం జాలున్. 378

క. విను విధికృత్యము లూరక, కనుఁగొనుచును సిద్ధ్యసిద్ధికల్పితసుఖదుః
ఖనిరూఢిఁ బొంద కుండఁగ, మనముం దొలఁగించువెరవు - మహనీయ మగున్.

క. కావున భూతానిత్యత, భావించుట యెపుడుఁ గలిగి - బంధచ్ఛేద
ప్రావీణ్యము సంపరితో,షావహముగ నున్నవాఁడ - నమరప్రవరా. 380

క. దాంతుఁడుఁ బ్రజ్ఞావంతుఁడు, శాంతుఁడు నగువానిమానసం బాయాస
శ్రాంతము గా దెమ్మెయి ని,శ్చింతుఁడ నై యుండుదును విశిష్టవిచారా. 381

క. అనవుఁడు ననిమిషపతి యే,యనువున నీశాంతి నీకు - నగపడియె మహా
జనపూజ్య చెప్పవే నా, కని యడిగిన నిట్టు లనియె - నతఁ డాతనితోన్. 382

తే. ఆర్జవంబు ప్రసన్నత - యాత్మవత్త్వ, మప్రమాదంబు వృద్ధసేవాభినిరతి
మేలు సేయుఁ బ్రజ్ఞాశాంతిశాలియగుట, కాలపాకంబుతోఁ దానకలుగు ననఘ.

క. అనిన విని విస్మయము నె,మ్మనమునఁ దళుకొత్తఁగా నమరపతి యభివం
దన మొనరించి పొగడుచుం, జనియె నిజావాసమునకు - జగతీనాథా. 384

వ. అని చెప్పిన విని యప్పాండవాగ్రజుండు భూపాలునకు లక్ష్మీభ్రంశం బేమిటం గలు
గు ననుటయు నయ్యాపగానందనుం డతని కిట్లనియె. 385

తే. వాసవునకును బలికి సంవాద మనఘ, కలిగె నయ్యితిహాసంబు - గర్ణగోచ
రంబుసేయుము నీదగుప్రశ్నమునకు, నుత్తరం బది సెప్పెదఁ - జిత్త మలర. 386

సీ. ఇంద్రుఁ డబ్జజుకడ - కేతెంచి వినతుఁ డై, బలి మహాసంపద - వెలుఁగుచుండె
నతని నిప్పుడు గాన - మాతఁ డెచ్చో నున్న,వాఁడొకో యనుడు నవ్వారిజాస
నుండు నీతలఁ బొప్ప - కుండుట యెఱిఁగితి, నైనను జెప్పెద - నన్నృతవాది
గాకుండుమీ యుష్ట్రఖరగోహయంబుల,యందుఁ దా నొక్కటియందు నొంది

---

1. జ. శత్రుజనులఁ జెఱు...మిత్రుల. 2. గ. త్పాత్రత సంపద యనఁగ వి,ధాతాజ్ఞం గలుగుఁ జూవె తతిఁ బురుషునకున్. 3. చ. విధికృతంబు.

తే. యడఁగి యున్నాఁడు వధియించు । టనుచితంబు
వాని నని పల్కి నటు సేయ । వాఁడఁ గాను
మాట వెట్టుదుఁ గన్న చో । మాననీయ
వాక్య యని వీడుకొనియె న । వ్వాసవుండు. 387

వ. వీడ్కొని చని జగతిం జరియించి యొక్కచోట ఖరరూపంబున సంప్రీతుండయి యున్నయబ్బలిం గని బలారాతి యిట్లనియె. 388

ఇంద్రబలిచక్రవర్తిసంవాదప్రకారము.

క. ఏనుఁగులు [2]సుట్టి రాఁ బే, రేనుఁగుపై మణిమయంపు । రెల్లులు మెఱయం
గా నీ వేతెంతువు నుముఁ, గానికిఁ గొన వప్పు డిపుడు । గాడిద వైతే. 389

క. కనకమయయూప మొప్పఁగ, ననూనవిభవమున నీవు । యాగం బొనరిం
చినయొప్పను నిప్పటినీ,యునికియునుం జూచి నాకు । నుమ్మల మయ్యెన్. 390

ఆ. ఉముక దినుచు నిట్లు । లుండి నీవొల్లింటి,లీలఁ దలఁచి యుమ్మ । లింతొ లేదొ
యున్నరూపు సెప్పు । వన్న గార్దభరూప, ధారణైకనిపుణ । దానవేంద్ర. 391

సీ. అన విని బలి దేవ । తాధీశుతోఁ నీకు, నావిభవంబు గా । నంగ రాదు
గుప్తమైయున్నది । గుహయందు నా కిచ్చు, పుట్టిన నప్పుడ । పొలిచి తోఁచు
నది యటు లుండె నీ । వధికుండ వల్పుల,యెదుర రజ్జులు వల్కి । టేటి పెంపు
పొమ్ము దుశ్చ్యవన నీ । పోము తెరు వన్న, నాతండు నవ్వుచు । నతనిఁ జూచి
ఆ. మున్ను వలికినట్ల । [3]కన్నోట లేక ప,ల్కుటయు నతఁడు భూత । కోటి మంచు
వోలెఁ దోఁచు విరియు । బుద్ధిమంతులు దాని,కిచ్చ వగవ రింత । యెఱుఁగ వెట్లు.

వ. అని వెండియు విరోచననందనుండు. 393

క. పొరి నర్థంబు ననర్థము, మరణము జీవితము సుఖస । మాగమమును దు
స్తరదుఃఖసంగమంబును, దొరకొనునే నెపుడు సమత । తోడన నిలుతున్. 394

చ. బలమును నొప్పుబుద్ధియును । ప్రౌఢతయుం గలవారు లేనివా
ర లనక యొక్కభంగిఁ దఱి । రాకయ చూచి హరించు చుండు వి
చ్చలవిడిఁ గాలుఁ డట్లగుట । సారమతిం గని యున్నవాఁడ ను
మ్మలికయుఁ నుబ్బు నాదుమది । మందున కైనను లేదు వాసవా. 395

ఉ. గాడిదరూపు దాల్చి యము । కల్ దిను చుండఁగఁ జూచి యుల్లసం
బాడెదు శక్ర శాంతిసమ । యం బగుటన్ విను మింకఁ గొన్ని నీ
వాడిన నాదుచిత్తమున । నల్క యొకింతయుఁ బుట్ట దిట్లు నీ
వాడితె మున్ను ని[4]న్నెఱుఁగ । నా వలదా నను నీ వెఱుంగఁగన్. 396

క. ఎలమియు వాడుటయును దన,వలచినయట్టివె యెఱుంగ । వా విధిచరితం

1. గ. మాటు వెట్టుదు. 2. చ. సుట్టు. 3. చ. మోమోట. 4. ‘న్నెఱుఁగఁగా వలదో నను నీ వెఱుంగవో’ అనియే పెక్కుప్రతులు.

బులు బలవంతంబు లగుట, వలదె వివేకంబు పెద్దవారికి నింద్రా. 397

క. ఇటు గర్వించుట నీచత, యెట వోయెదొ పొమ్ము నాను ॥ మిా వలవనిత్రు
ళ్లుట వజ్రము నీవును బిడి,కిటితాఁకున నొఱగు దేను ॥ గినిసితినేనిన్. 398

క. ఇది మేలపుమాట సుమీ, మది నుద్ధతి లేదు నాకు ॥ మహితాశ్చర్యా
స్పద మగువిధాతృచెయ్దుం, దుది నీవును దుస్సవోదు ॥ త్రుళ్లు టుడుగుమీ. 399

వ. శాంతుఁడ వగు మని పలికె నట్టియెడ నవ్విరోచననందనుశరీరంబుననుండి సు
రూపయు [1]సుగౌరయు నగునొక్కమగువ నిర్గమించినం గని కౌశికుండు విస్మయ
వికసితాక్షుం డగుచు నతనితో నివ్వనిత యెవ్వత యనిన నాతం డే నెఱుంగ
నీవ యీయమ నడుగు మనుటయు నయ్యనిమిషపతి యమ్ముద్దియమొగంబు
గనుంగొని మాకు ని న్నెఱింగింపు మనవుడు నద్దేవి యతనితోడ. 400

క. శ్రీయును భూతియు లక్ష్మియు, నాయభిధానములు మీరు ॥ న న్నెఱుఁగమి [2]పె
ద్దే యింద్ర యెజ్జగంబుల, నేయుగములయందు నెఱుఁగ ॥ రెవ్వరు ననినన్.

క. అనవుడు నతండు నీ వీ,దనుజేశ్వరుఁ బాయుటకుఁ గతం బేమియొకో
యనిన విని లక్ష్మి సత్యం,బును ధర్మము దమము దానమును నాయిక్కల్.

క. అవి గలిగి పరాక్రమయుతుఁ, డవుపురుషునిపాల నిలుతు ॥ నమరాధిప యీ
దివిజారి దొల్లి యట్టిఁడ, యవినీతత నిపుడు బ్రాహ్మణాసూయమెయిన్. 403

క. తొల్లిటిసచ్చారిత్రము, లెల్లను దిగవిడిచెఁ గాన ॥ యీతనికడ నే
నొల్ల నిలువ వచ్చెద సుర,వల్లభ నీపాల నెలమి ॥ వసియింపంగన్. 404

ఆ. ఆగుణములు మఱియు॥నాగమోదితసమా,చారములును గలిమిఁ॥గోరి యింద్ర
నిన్నుఁ బొంది యేను ॥ నిల్చెద నేమిట, నేమఱంగ వలవ ॥ దెపుడు నీవు. 405

వ. అని పలికె నిట్లు లక్ష్మిచేతం బరిత్యక్తుం డైనబలి యాఖండలు నాలోకించి. 406

క. అయనవశంబునఁ దేజో,[3]వియుక్తుఁడై రవి ప్రతాప॥విరహితుఁ డగునా
క్రియఁ బొనుఁగుపడినఁ బొంగకు, జయింతు నిను దేవదనుజ॥సంగర సుగుణున్.

వ. అనుటయు మహేంద్రుండు. 408

క. అది యట్లు లుండె నీతోఁ, బదరం బని లేదు నాకుఁ ॥ బద్మభవునిమా
ట దలంప పలయు నీపై, భిదురం బిడ దనుజనాథ ॥ ప్రియ మందు మెదన్. 409

క. అనిన విని యొండు వలుకక, దనుజాధీశ్వరుఁడు వోయె ॥ దక్షిణదిశకుం
జనియె నుదఙ్ముఖుఁడై దివి, కనిమిషనాథుండుఁ గౌరవా॥న్వయముఖ్యా. 410

వ. అని చెప్పి యనిమిషనదీనందనుండు వెండియుఁ బాండవాగ్రజున కిట్లను నింద్ర
నముచిసంవాదం బనునితిహాసంబు హృదయప్రసాదకరంబు దాని నాకర్ణింపుము.

ఇంద్రనముచిసంవాదప్రకారము.

సీ. సిరిఁ బాసియును నొక్క॥చింతయు లేక పీ, చులక్రం దడంగిన॥జలధివోలె

1. 'సగౌరవయు' అని పెక్కుప్రతులు. 2. చ. లే, దే. 3. గ. వియుతుం డై.

నముచి యేకాంతస్థలమున నుండఁగ నింద్రుఁ డచటికి నేతెంచి యతనిఁ జూచి
పేదపడ్డాఁడవు శ్రీయు జనంబును బరివారంబు లే దివ్యవస్త్ర కేళ
నగ చెదవో దానవశ్రేష్ఠ నావుడు. నాతండు నగవు నిరర్థకంబు

తే. వలయువస్తువు వగచినఁ బచ్చునయ్య, సామి[1] యొక్కటియే శరీరంబు నెదయు,
దాపమునఁ[2] బొందు వగపునఁ దధ్ధర్మమేను. నింత యెఱుఁగుదు వగవ నేనేమిటికినిఁ

తే. సకలభూతంబులకును శాసకుఁడు గలఁడు, గాదె యొక్కరుఁ డాతనిశాసనమునఁ
బ్రాప్తమైనది నీళ్లులు పల్లమునకు. వచ్చుక్రియఁ దాన వచ్చు గీర్వాణముఖ్య.

క. ఇది నా కయ్యెం గాఁగల, యది యై యనుగాఢనిశ్చయం బెవ్వని నె
మ్మదిఁ గలుగు నుబ్బు వగ సం,పద యాపద గలుగ వట్టిభవ్యున కింద్రా. 414

క. ధైర్యంబున వీర్యంబున, శౌర్యంబునఁ బ్రజ్ఞఁ బడయఁ జాలు నె నరుఁ డె
క్కార్యము నప్రాప్య మయిన. నార్యుం డది యెఱుఁగుఁ గాన యడలఁడు శక్రా.

తే. మేలుఁ గీడును నరుఁ బొందుఁ గాలముల న,వశ్యమును వానిఁ గోరినవచ్చుటయును
వినుము త్రోచినఁ బోవుటయును సురేంద్ర, కలదె వానికిఁ గావున వలదు చింత.

క. అని యిట్లు నముచి పలికిన. విని మెచ్చుచు దివికి నమరవిభుఁ డరిగెం బా
వనచరిత యింక నెయ్యది, వినవల తనవుకును భరితవినయుం డగుచున్. 417

క. ఆ నరపతి శాంతనవుని, తో ని ట్లను నెద్దియేని దుర్దశ యైనన్
మానవుఁ డెట్టిఁ డగుట మే, లానతి యీవే దయామయా శేటపడన్. 418

వ. అని యడిగిన నయ్యుధిష్ఠిరునకు బుధశ్రేష్ఠుం డి ట్లనియె. 419

క. ఏవిధమున దుర్దశలకు, భూవర ధైర్యంబ మందు భూరిధృతిమెయిం
జేవ గలుగు దృఢనిశ్చయ, భావము[3] నెవ్వగలఁ గొట్టువడ దెబ్బంగిన్. 420

క. ధృతి యారోగ్యము నొసఁగును, ధృతి యుజ్జ్వలలక్ష్మిఁ దెచ్చు ధృతి కీర్తిసము
న్నతిఁ జేయుఁ గాలగత్యవ, గతి గలిగినఁ గలుగు ధృతి విశారవిహారా. 421

### ఇంద్రబలిసంవాదప్రకారము.

వ. ఏతద్విషయం బైనయది యొక్కటి యింద్రబలిసంవాదం బను నితిహాసంబు గల
దాకర్ణింపుము దేవాసురులకు సమరంబు సెల్లిన నందు విష్ణునిమహానుభావంబున
దేవతలకు గెలుపై రుద్రాదిత్యమరుద్వసుగంధర్వసిద్ధాదులు పరివేష్టింప నింద్రుం
డైరావతారూఢుం డై లీలం బై త్రైలోక్యంబును జరించుచుండి యొకప్పుడు సము
ద్రోపాంతంబున నొక్కగిరిగహ్వరంబునయంగణంబున వైరోచనుం డగుబలిం
గని చేరం జని యద్దనుజపతి దన్నుం జూచి నిస్సంభ్రముండును వైమనస్యరహి
తుండును నై యునికి నిరూపించి యతనితో ని ట్లనియె. 422

క. హీనస్థానమున విభవ, హీనత ని ట్లుండి రిపులయెలమిఁ గనియు నీ
మానసమున శోకింపమి, దానవకులనాథ యెవ్విధంబునఁ గలిగెన్. 423

1. చ. యొకటియె తన శరీరంబు. 2. చ. గుందు. 3. గ. నెవ్వగలతోడఁ బడ-జ. దొడరువడ.

ఆ. శౌర్యమునఁ గో వృద్ధసంసేవవలనఁ గో, తపమునఁ గో యుదాత్తతానిరూఢి
గలిగి మమ్ము నరకుఁ గాఁ గొనకున్నాఁడ, వేమికతము దీని కెఱుఁగఁ జెపుమ.

వ. అనిన విని బలి యతని కిట్లనియె. 425

ఆ. నరకుసేయ వను చదసద్దమాటలు గొన్ని, యాడినంత నేమి యయ్యె నింద్ర
నీదుశక్తి వింతయే దైవవశమున, నెట్టిపాటివారు నెట్లుఁ గారె. 426

క. నీవు మును హీనుఁ డగుటయు, నావలనం గాదు నీకు నను హీనదశా
భావితునిఁ జేయు టా దివి, దైవకృతము లిట్లు గాక ధైర్యము వలయున్. 427

క. విను పర్యాయంబున సుఖ,మును దుఃఖముఁ జెందు జనులఁ బురుషుండు ధైర్యం
బున గర్వంబు విషాదం,బు నడంగింపఁ దగు నంద్రు బుధు లది నిక్కమే. 428

క. చెలులుం జుట్టలును సహా,యులు విభవము పెంపకాలయుక్తి నవస్థం
దొలఁగించుట గలదె మదిం, దెలిసి ²మనుము మనికి యిట్టిదియ ³కాదెపుడున్.

క. నిను నే గెలుచుట కాలము,నన నీవును గాలయుక్తి నను గెలిచితి గా
వున నశుభమునకు శుభమున,కును గాలము నూవె కర్త కుశికతనూజా. 430

ఆ. నాకు నీకు నేల నాకేశ శత్రుత్వ, మేరి కైనఁ గలదె యెందుఁ బాక
మునకుఁ దెచ్చుచుండు జనులఁ గాలము వృత్తి, ఫలవిధముగ రజ్జుపలుకు లుడుగు.

వ. అని చెప్పి యంత నిలువక. 432

క. కా దిది విక్రమకాలము, లే దిప్పుడు నాకు నలుక లీలాత్మక రో
షాదరము గలిగినను నిను, నీ దగుపరిజనముఁ గూల్పనే పెడచేతన్. 433

వ. అని పలికి వెండియు. 434

క. సిరిపెంపునఁ గను నొప్పెదు, సురనాయక యిపుడు నీఁడఁ జూచెద నీకుం
బరిభవము దెచ్చుటకునై, కరము వెసఁ వచ్చుఁ జేటు కాలము తెఱఁగున్. 435

తే. ఇంద్రు లెందఱు వో రింద్రు లేల బ్రహ్మ
లుండుదురె తఱితోఁ దెగుచున్నవారు
గాక దానవసంఘంబు గాలవశతఁ
బొందు చేటికి ⁴సెగ్గింపఁ బొమ్ము నీవు. 436

క. క్రతువులు సేతయు దేవ,వ్రతములు సల్పుటయు వృత్తవంతుఁ డగుటయుం
గతమే కాలము ద్రోచుట, కతర్క్యవర్తనము గాల మది గొనకు సుమీ. 437

క. అని యిట్లాడినమాటలు, విని దనుజునిఁ జూచి యమరవిభుఁ డుల్లములో
నన సంరంభంబు నుడిపి,కొనుచు నతని కిట్టు లనియెఁ గురువంశవరా. 438

క. అకట భవచ్చిత్తము ని,ర్వికార మై భరితధృతివివేకవినయశాం
తిక మగుచు వెలింగెడు దీ,నికిఁ గారణ మైననిష్ఠ నెఱి యెట్టిదియో. 439

---

1. గ. నేర్పఁ-♦. 2. 'మనువుమనికి యిట్టి♦దియ, అని పెక్కుప్రతులు. 3. చ. కానెపుడున్. 4. గ. శంకింప.

క. అనిన నతఁ డతని కిట్లను, విను మనిమిషనాథ యేను వేఁ కచోటం
గోని వచ్చితినే చిత్తం,బున కపికృతిధృతివివేకముఖ్యగుణంబుల్. 440

వ. కాలప్రకారం బెఱుంగుదుం గావునఁ గలంగ కుందుదు. 441

తే. చెప్పుచున్నాఁడఁ గాలంబు చేత నెల్ల,విధముఁ బొప్పదు జనులకు వినుము కాల
మప్రమాదవర్తన మధికప్రమాద,సంగ[1]మత్తులు వారెల్ల భంగపడరు. 442

క. కళలుం గాష్ఠలు లోనుగఁ, గలచిదురలఁ గూర్చుకొనుచుఁ గాలంబు జనం
బుల వడ్డి కిచ్చునాతని, వలె నలవడఁ బొదివి తనకు వశ్యులఁ జేయున్. 443

క. కాల మడఁగించు జనుఁ గ, ల్లోలిని గిరిఁ ద్రెంచుకరణి లోభక్రోధా
శీలత్వకామభయములఁ, దేలుజనుఁడు గాలవృత్తి దెలుఁగు నెఱుఁగునే. 444

క. ఇంతకు మును సూచితి నతఁ, డెంతయు నొప్పు గొని యుండె నిది గనుఁజిత్తం
బెంత వెసఁ జచ్చె ననుఁ దనుఁ, జింతింపఁడు జనుఁడు మోహచిత్తత్వమునన్. 445

క. విను భావాభావంబులు, గని యత్యుత్తమతపంబు గైకొనువిద్వ
జ్జనుఁడు గనుఁ గాలగతి యె,ల్లను గరతలశోభితామలకముం బోలెన్. 446

క. కాలగతి గనుట శాంతికి, మూలం బై యంతరంగమున నాత్మమయ
త్వాలంబనంబు నిచ్చుఁ ద,దాలీనుం డై నపురుషుఁ డక్షోభ్యుఁ డగున్. 447

వ. అనిన విని పాకశాసనుం డతనివివేకపాకంబున కచ్చెరు వొంది యభినందించి
యతని కిట్లనియె. 448

ఆ. దనుజనాథ యివ్విధంబునఁ గాలచా,రిత్రవేది వై పవిత్రశీల
యుతుఁడ వైతి నీవు కృతకృత్యుఁడవు నీదు,వృత్తి గోర నలయు నుత్తములకు.

తే. లోక మెల్లను నఱచేతి లోన నున్న
యట్లు గనికొని సత్త్వాదు లైనమూఁడు
గుణములను బాయఁ బెట్టి నిర్గుణత వెలుఁగు
నాత్మఁ గనుచున్నవాఁడ వే మందు నిన్ను. 450

క. కెలనికిఁ జూడఁగ దైన్యా,కలనం బగుచున్న యిపుడు గనిరి నదశయుఁ
దొలఁగుం గావుత నఁ గడుమే, లెలసి పరమసుఖముఁ బొందు మిచ్ఛావృత్తిన్.

క. అని పలికి యుచితముగ వీ,డ్కొని విభవం బెసఁగ నభ్రకుంజరముపయిన్
వినువీధిఁ జనియె సురలును, మునులును వేష్టింప భూతములు వినుతింపన్.

తే. అమృతపానంబుఁ జేసినయంతకంటె
నద్దనుజపతిమధురవాక్యామృతమున
సంభృతానందుఁ డై సురేశ్వరుఁడు దనదు
పురమునకు నేఁగి సుఖ ముండెఁ గురువరేణ్య. 453

1. క. వర్తులు.

వ. అని యిట్లు ధర్మతనయునకు భీష్ముండు పురస్సాతంబై నయింద్రబలిసంవాదంబు సెప్పె నని చెప్పిన విని మఱియేమి సత్కథలు సెప్పెఁ జెప్పు మని యడుగుటయు. 454

చ. పరమమునీంద్రసంయమనసత్పక్వవివేకవిభూతిరమ్య వి
స్తరమహనీయతార్కికవరచంకలనాఁభిగమ్య దేవతా
సురపరిరక్షణోస్మథనసౌశోభికలాకువిహార నిత్యనుం
దరశుభకాంతిపూర దురితప్రవిదారణ వీతకారణా. 455

క. ఆదిత్యమరుద్వసురుద్రాదిసకలదేవతామహాత్మక శ్రీసం
పాదనవిధావిచక్షణ, పాదసరోజా మహర్ధిభక్తసమాజా. 456

మాలిని. అమలహృదయవేద్యా హవ్యకవ్యప్రసాద్యా
శమసుఖమయమూర్తీ సర్వలోకప్రవర్తీ
కమలభవనిషేవ్యా కామదూరానుభావ్యా
యమనియమవికాసీ వ్యాసచేతోనివాసీ. 457

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము. 458



శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శాంతిపర్వము, పంచమాశ్వాసము.





కరణనిపుణచరణ
వ్యాకోచాంభోజనిత్యా। వాసముదితసు
శ్లోకమునిచిత్తభృంగమ
హాకరుణామిళదపాంగ। హరిహరనాథా. 1

### శ్రీశక్రసంవాదప్రకారము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె నట్లింద్రబలిసంవాదరూపంబునం
గాలప్రకారంబు విని యుధిష్ఠిరుండు దేవవ్రతునితోడ. 2

క. ఏమిట రూపగుఁ బురుషుం, డేమెయి రూపు సెడు నాకు। నెఱిఁగింపుము తే
జోమహిత యనిన నతఁడా, భూమిపతికి నిట్టు లనియె। భూపప్రవరా. 3

వ. ఇవ్విషయంబునకు నొక్కయితిహాసంబు శ్రీశక్రసంవాదం బనం గలదు దానిం
జెప్పెద నాకర్ణింపుము నారదమునీశ్వరుం డెందును నిజేచ్ఛం జరియించుచుండి
యొక్కనాఁడు మందాకినికిం జని కృతస్నానుం డై. 4

క. ఆనదియం దాచరిత,స్నానుం డై నియతి నున్న। శక్రుం గని య
చ్చో నయ్యిరువురు సల్లా,పానందముఁ బొందుచుండ। నాకాశమునన్. 5

తే. బాలభానుబింబంబు గీ।డ్పఱచునట్టి
దీప్తిమండలి దోఁచె న।ద్దేవపతియు
మునిపతియుఁ జూచుచుండ గ్ర।క్కున విమాన
మవతరించి యాసన్న యై। యతివ యోర్తు. 6

క. పురుహూతున కభిముఖియై, కరములు మోడ్చుటయు సతఁడు। గారవమున ని
వ్వర వబ్జానన యెచటికి, నరిగెద వెందుండి రాక। యనియె నరేంద్రా. 7

అనవుడు నద్దేవి। యాదరభరిత యై, బాలార్కబోధిత।పద్మజాత
యైనట్టిదాన శ్రీ। యన లక్ష్మి నా భూతి, యనఁగ వెలుంగుదు। ననఘ యేను

స్వాహా స్వధా మతి శ్రద్ధా ధృతి స్మృతి, మేధల దనుజుల మెచ్చి వారిఁ
కడ నుండి మెచ్చ కిప్పుడు నీకడకు నేఁగు,దెంచితి ననిన నద్దివిజనాథుఁ
తే. డేమికారణమున మెచ్చి తేకతమున, మెచ్చవైతి దానవుల నీ మెచ్చుచొప్పు
మాకు నెఱిఁగింపు మనిన నమ్మాననీయ,వాక్య యిట్లని చెప్పె నవ్వాసవునకు.
క. దానాధ్యయనాతిథిస,మ్మానాదివిశిష్టగుణసమగ్రతకలిమిఁ
దానవుల నియ్యకొంటిని, వాని విడిచి గర్వు లగుట వారి విడిచితిన్. 9
వ. సత్యధర్మపరుండ వగుటంజేసి నీపాల వసియింప రుచి పుట్టి వచ్చితి నని చెప్పి
వెండియు. 10

సీ. గురుభక్తినిరతులు సురపితృపూజన,పరులును సత్యసంభాషణులును
దానశీలురుఁ బరధనపరదారప,రాఙ్ముఖచిత్తులు బ్రాహ్మణప్రి
యులు దివానిద్రావియుక్తులు వృద్ధదు,ర్బలదీనయోషిత్కృపారతులును
శౌచులు నతిథిభోజనశిష్టభోజులు, నేను మెచ్చుజనంబు లిట్లు గాక
తే. ధర్మ మెడలి కామంబుఁ గ్రోధంబుఁ జాలఁ,గలిగి గర్వులై బలియుభైక్షుంబునిడక
పరుషవాక్కులఁ గ్రూరంపుఁ జరితములను,మిగిలి వర్తించువారునా మెచ్చుగారు.
క. బుద్ధియు ధృతియును నీతియు, శ్రద్ధయు సన్నతియు క్షమయు శాంతియు ననఁగా
వృద్ధశ్రవ యేడ్వురు మ,ద్వృద్ధిప్రద దేవతలు శ్రుతిస్మృతికథితల్. 12
క. అష్టమి యగు దేవత నేఁ, గష్టాత్మత యసురులందుఁ గని విడిచితి మ
త్తుష్టికరచరితు లగుటఁ ద్రి,విష్టపసదులకడ నిలిచి వెలసెద ననినన్. 13
క. అభినందించిరి దేవ,ప్రభుఁడును నారదుఁడు నపుడు పవనంబును సౌ
రభసుఖసంస్పర్శంబుల, నభిరామం బగుచు వీచె నల్లన యచటన్. 14

ఆ. కురిసెఁ బుష్పవృష్టి మొరసె గీర్వాణదుం,దుభులు సిరి వరింప నభినవోజ్జ్వ
లత్వ మొంది దివిజులకు నేత్రపర్వమై, పొలిచి యింద్రుఁ డాత్మపురికి నరిగె.
క. శతమఖకమలావాసా,ప్రతిమసమాగమవిశేషబహుమత మగునీ
యితిహాసము శ్రుతమైనఁ బ,ఠితమైనను నెఱియ సంఘటించును లక్ష్మిన్. 16
క. ఇందులతాత్పర్యము నీ, డెందము నొందించి యతిదృఢీకృతశీలా
స్పందితుఁడ వగుము తిరమై, యిందిర నీకడ వసించు నిభపురనాథా. 17
క. అనిన విని ధర్మజుఁడు శాం,తనవునితో జనుల కెవ్విధమునాచారం
బున నెట్టిపాటిశీలం,బున నేవిద్యను మహాత్మ ముక్తి దొరకొనున్. 18
క. అనవుడు నతనికి నతఁ డి,ట్లను విను మితిహాస మొకటి యది నీప్రశ్నం
బున కుత్తర మగు నేర్పడ, వినిపించెద గాఢతరవివేకనిరూఢా. 19

## దేవలజైగీషవ్యసంవాదప్రకారము.

వ. అసితుం డగు దేవలుండు జైగీషవ్యుం డనుసంయమితోడ నీవృత్తం బెఱింగికొన
వలయు నెఱింగింపవే యనిన నమ్మహాత్ముం డమ్మునివరున కిట్లనియె. 20

ఆ. శాంతిమంతు లైనసౌమ్యుల కెయ్యది, నిష్ఠ దానియందు । నిరతిశయస
మాదరంబు గలదు । నాదుచిత్తంబున, వినుము తద్విధంబు । విస్తరింతు. 21

క. వినుతించిన నిందించిన, ననఘా మనమునఁ బ్రియంబు । నప్రియమును లే
కునికియు వ్రేసిన నైనను, గనలు వొడమమియుఁ బ్రబుద్ధ।గణ్యగుణంబుల్. 22

ఆ. ఒకటి గోరి దాని । కుల్లంబు గందంగ, జాలిఁ బడమి యేమి । సంభవించె
నేని దానఁ దృప్తి । నూనుట దప్పిన,పనికి వగవ కునికి । భవ్య[1]గుణము. 23

క. హర్షంబును మానంబు న,మర్షము నపరాధమును స।మదభావము ను
త్కర్షాపకర్షచింతలు, నార్షసమాచారమున నిర।స్తగుణంబుల్. 24

క. అవమానమునకుఁ దృప్తుం, డవు నమృతము ద్రావినట్ల । యంచితసన్మా
నవిధికి నుద్వేగముఁ బొం,దు విషంబునఁబోలె శమర।తుఁడు మునినాథా. 25

క. చుట్టము పగ యనుభేదం, బెట్టిజనులవలనఁ దగుల । డెల్లప్పుడు నె
ప్పట్టున నెద్దానను మదిఁ, బుట్టదు సంతోషహాని । బుద్ధాత్మునకున్. 26

ఆ. ఇంద్రియముల గెల్చి । హృదయంబు శాంతిసు,ఖంబుఁ బొంద నిర్వి।కారవృత్తి
యైనవానిపొందు । మానితగతి దేవ,తలకుఁ బొంద నరిది । ధర్మనిరత. 27

క. అని చెప్పె ననుడుఁ గుంతీ,తనయాగ్రజుఁ డాత్మసమ్మ।దముఁ బొంద నదీ
తనయునితో నెవ్వఁ డఖిల, జనప్రియుఁడు సకలసత్త్వ।సమ్మతుఁ డనినన్. 28

ఉగ్రసేనశ్రీకృష్ణ సంవాదప్రకారము.

వ. అమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లను నారదునివిషయంబుగా నుగ్రసేనునకుఁ గేశవునకును సంవాదంబు గలిగె నది నీయడిగినయర్థంబుఁ దేటపఱుచు దాని నాకర్ణింపుము. 29

క. నరనాథ యుగ్రసేనుఁడు, హరితో నిట్లనియె జనము । లభివర్ణనత
త్పరు లగుదురు నారదునెడ, నరయఁగ నతఁ డంతవాఁడె । యంబుజనాభా. 30

వ. అనుటయు నాకృష్ణుం డగ్గురుమతి కిట్లనియె. 31

సీ. శ్రుతము నాచారంబు । నతిశయవంతంబు, లెడ నహంకార మొ।క్కింత యేని
లేదు శీలము గడు । లెస్స వేషము నిర్వి,కారం బమత్సర।గర్వమదుఁడు
[2]జననంబుఁ దపముఁ దే।జంబును బుద్ధియు,వినయంబు నయమును।విశ్రుతములు
ధైర్యంబు వచనమా।ధుర్యంబు శౌర్యదై,న్యక్రోధలోభని।రాసకత్వ
ఆ. వోజ యతనియందు । నైజంబు లీర్ష్యయు, నుద్ధతియు నసూయ।యును నవజ్ఞ
యును నెఱుంగఁ డట్టి।మునివరు నారదు, నఖిలజనులుఁ బొగడు।టరుదె యధిప.

వ. అని చెప్పె నగ్గుణంబు లఖిలజనప్రియకరంబులు సకలసత్త్వసమ్మతంబు లనిన విని ధర్మతనయుండు శంతనుతనయుతోఁ గాలావయవప్రకారంబులును యుగప్రమాణంబులును భూతవిధంబులు నెఱింగింపవే యని యడుగుటయు నతండు శుకుం

1. చ. విధము. 2. క. జ్ఞానంబుఁ

డడుగ వేదవ్యాసమునీశ్వరుండు సెప్పినయర్థంబులు నీయడిగినవియును మఱియు
ననేకంబులుం గలవు సెప్పెద విను మని యజ్జనపతి కిట్లనియె. 33

క. అనఘుఁ బరాశరసూను స, వినయంబునఁ జేరి భక్తివినతుం డై త
త్తనయుండు బుద్ధిసంప, ద్ఘనుఁడు శుకుం డిట్టు లనియెఁ గౌరవనాథా. 34

తే. కాలవిధములు భూతసంక్షయప్రకార, ములును లోనుగ నెఱుఁగంగ వలయు వాని
బహుళకారుణ్యసంపద పల్లవింప, నాకు నెఱిఁగింపవే మునినాథవర్య. 35

వ్యాసుఁడు శుకునకుఁ జెప్పినకాలావయవనిరూపణము.

వ. అనిన విని భరితాదరుం డై వేదవ్యాసమునీశ్వరుం డమ్మహనీయున కిట్లనియె.

క. కాలములకు భూతములకు, నాలంబనభూత మగుమహామహిమఁ గ్రియా
లీల వెలింగెడునప్పర, మాలోకం బెందు నిష్క్రియాత్మక మయ్యెన్. 37

వ. అది భావనీయంబు. 38

క. వినుము నిమేషంబులు పదు, నెనిమిది యగుఁ గాష్ఠ కాష్ఠ లిరువదియుం దో
డన పదియుం గళ యఱువది, యును మూన్నూఱుఁగళలై ముహూర్తమునడ [చున్.

తే. మూఁడుపదులు ముహూర్తముల్ మోహదూర
యగు నహోరాత్ర మట్టివి యన్ని గూడ
మాస మవి రెండు ఋతు వనుక్రమహితసంజ్ఞఁ
బరఁగు ఋతువు లాఱైన వత్సరము వత్స. 40

తే. అందు మూఁడేసిఋతువులు కయననామ, కంబు లగునుత్తరాఖ్యమొకండు దక్షి
ణాభిధానమొక్కటియుగుణాభిరామ, యవియహస్సునురాత్రియునననఁగఁబరఁగు

వ. అది యోగిజనంబులనిర్దేశంబు. 42

తే. అనఘయుత్తరదక్షిణాయనములమ్మ, హాత్ములగ్నియుధూమంబు నంద్రుమఱియు
వినుము శుక్లంబుఁ గృష్ణంబు ననుటఁ గలుగు, [1]సుగతికి గతికి హేతువులగుటఁ జేసి.

క. నరులనెలలు నేఁడులుఁ బితృ, సురులకు దినము లగు నంద్రు సూరులు వరుసం
బరఁగుకృతత్రేతాద్వా, పరకలియుగవత్సరములభంగిఁ దెలిపెదన్. 44

వ. ఆకర్ణింపుము. 45

చతుర్యుగసంవత్సరపరిమితిప్రకారము.

సీ. విబుధులపండ్రెండువేలేండ్లు సనునంత, నాలుగుయుగములు నోలి నడచుఁ
గృతయుగమ్మునకందుఁజతురంశకములుఁ, ద్రేతకుమూఁడుపాళ్లును ద్వాపరంబు
భాగద్వయంబునఁ బర్యవశిత మగుఁ, గలియుగ మంశ మొక్కటన తీఱు
నిబ్భంగిపాళ్లగు నిన్నియుగముల కం, బరయుగ్మవసువార్ధిపరిమితములు

తే. ఖద్వయర్తుగుణంబులు గగనయుగళ
వేదనేత్రంబులును నభోద్వితయకరసు

1. ఖ. సుగతిదుర్గతిహేతువు.

ధాంశులును వచ్చు మున్నూటఱువదింటఁ
బెంప మానుషాబ్దంబు లై పేర్చి యుండు. 46

వ. ఇట్లు కృతయుగంబునకుఁ బదియేడులక్షలు నిరువదియెనిమిదివేలును త్రేతాయు[1]గంబునకుఁ బండ్రెండులక్షలుఁ దొంబదియాఱువేలును ద్వాపరంబునకు నెనిమిదిలక్షలు నఱువదినాలుగువేలును గలియుగంబునకు నాలుగులక్షలు ముప్పదిరెండువేలును మనుష్యవత్సరంబు లయ్యె నిందు సంధ్యలును సంధ్యాంశంబులు ననుపేళ్లఁ గొంతేసికాలంబు సెల్లు. 47

క. క్రమమున సంధ్యలు సంధ్యాం,శములు ననం బరఁగుఁ బుత్త్రసకలయుగాద్యం
తములును యుగయుగమునకుం, దమలోన [1]వి సరియ కాలతత్త్వం బరయన్.

వ. అది యెట్లంటేని దేవసంఖ్యం జెప్పెద. 49

క. నన్నూఱులు మున్నూఱులు, నిన్నూఱులు నూఱులును మహితవర్షము ల
య్యన్నియుగమ్ములకుఁ గ్రమా,సన్నత సంధ్యలను వానిసంధ్యాంశములన్. 50

వ. ఇట్లు కృతయుగంబునకు సంధ్య లక్షయునలువదినాలుగువేలు దానిసంధ్యాంశంబు నంతియ త్రేతకు సంధ్య లక్షయునెనిమిదివేలు దానిసంధ్యాంశంబు నంతియ ద్వాపరంబునకు సంధ్య డెబ్బదిరెండువేలు దానిసంధ్యాంశంబు నంతియ కలియుగంబునకు సంధ్య ముప్పదియాఱువేలు దానిసంధ్యాంశంబు నంతియ యివి మానుషవత్సరంబులు. 51

క. వరుసఁ గృతత్రేతాద్వా,పరకలియుగములఁ దపంబు భవ్యజ్ఞాన
స్ఫురణము యజనము దోషా,దరమును మానవులకుం బ్రధానతఁ గలుగున్.

క. న్యాయంబులు ధర్మంబులు, నాయువులుఁ దనూబలములు నంతంతకు వ
త్సా యెంతయుఁదఱుఁగుం ద్రే,తాయుగముఁ దొడంగి మనుజతతి కరయంగన్.

తే. ఆయుగంబులు నాల్గు మహాయుగంబు
నాఁగఁ జనుఁ దత్సహస్రంబు నలువపగలు
దానికోలఁదియ రేయును దీని నెఱుఁగు
ప్రౌఢజనములు సు మ్మహోరాత్రవిదులు. 54

తే. అతఁడు రాత్రి నిద్రించు నిద్రావసరమ
ప్రళయ మగు లోకములకుఁ బ్రభాత మగుడు
మేలుకను దివమున భూతజాలసృష్టి
పరతఁ బొందుఁ బర్యాయ మిప్పాటఁ జెల్లు. 55

వ. అని వెండియు. 56

తే. అనఘ బ్రహ్మంబు తేజోమయంబు శుక్ల, మగ్రభాసిత మెద్దానియతులసార
రసము విశ్వంబు నది యహర్మహితకాల, బుద్ధమై చేయు బహువిధభూతసృష్టి.

1. గ. విపర్యకాల. 2. చ. బ్రధానగుణంబుల్.

వ. తత్ప్రకారం బెట్టి దనిన నమ్మహనీయతత్త్వంబువలన. 58

ఆ. విను మహాత్మ నోగ గగనపవనానల,సలిలభూము లనఁగ సంభవించు
మహితవిభవములు క్రమంబున నేడు రూ,పములు జన్యజనక భావ మొంది.

క. క్రమయుక్తిని శబ్దస్ప,ర్శములును రూపరసగంధసద్భావములుం
దమగుణములు గా నాకా,శము మొదలగుభూతములు ప్రశస్తి వహించున్. 60

క. నరనుత విను మీసప్త,స్వరూపములు పురుషు లంద్రు సంయమివరు లీ
పురుషులు గూడిన సృష్టికి, [1]వెరవరు లది సంఘటిలదు వేర్పడి రేనిన్. 61

వ. ఇట్టిమహిమ గలిగి. 62

క. తేజోరూపము బ్రహ్మము, ప్రాజాపత్యం బనంగఁ బరఁగి పురుషుఁ డు
ద్భ్రాజిష్ణుసత్యనిత్యా,వ్యాజమహిమ వెలుఁగు చుండు నకలంకమతిన్. 63

క. వ్యాపకుఁడు స్రష్ట బ్రహ్మ ప్ర,జాపతి నాఁ బరఁగి నిత్యసత్యాత్మత్వో
ద్దీపితుఁ డై పురుషుఁడు ని,ర్లేపుఁ డనిర్దేశముం గలిగి వెలుఁ గొందున్. 64

క. సురసంయమిగరుడోరగ,నరకిన్నరగిరిసరిద్వనపయోధులఁ ద
త్కారణీయములం జేయుం, బురుషుఁడు దివ్యాంతరంగమునఁ దలఁచి సుతా.

వ. ఇట్లు గలిగి వర్తిలు చున్నలోకంబులందు. 66

ఆ. పౌరుషంబు సూవె ఫలద మందురు గొంద, అనఘ దైవ మిచ్చునంద్రు కార్య
ఫలము గొంద ఱెల్లఫలము భూతస్వభా,వంబ యంద్రు గొంద [2]అమితతేజ.

వ. ఇవి కర్తస్థులతెఱంగులు సత్త్వస్థులు సమదర్శను లయి యుండుదురు విశేషంబు
వినుము. 68

క. శివకరము తపము మేధా,ధవ సకలజనంబులకును దానికి మూలం
బవిరళశమదమసంపద, లవుట నివి మనంబుతోడ నలవడ వలయున్. 69

వ. స్వాధ్యాయంబు తపంబునకు బలం బిచ్చి తత్ఫలంబు గావించు. 70

క. అరయంగా శబ్దంబును, బరంబు నన రెండు సూవె బ్రహ్మములు గుణో
త్తర శబ్దబ్రహ్మభజన,పరుఁడు పరబ్రహ్మమహితపదముం బొందున్. 71

క. పరమబ్రహ్మము భూతో,త్కరముం గలిగించు మ్రింగుఁ దా నిష్క్రియతా
స్ఫురితం బయ్యును బ్రకృతి,స్ఫురణను శబలత్వ మొంది పురుషవరేణ్యా. 72

వ. సృష్టితెఱంగు మన్నెఱింగించితి సంహారప్రకారంబు సెప్పెద నాకర్ణింపుము.

తే. స్థావరములు జంగమములుఁ దన్నుఁ గలయ
విలయ మొందిన ఘటపృష్ఠవిధము దాల్చు
భూమి నంబువుల్ మ్రింగు నంబువుల నగ్ని
యగ్ని ననిలుం డనిలుఁ ద్రావు నాకసంబు. 74

ఆ. ఆకసమును మనసు హరియించు గంధాది, యగుగుణాళితోడ నఖిలభూత

1. చ. వెర వగు నది. 2. జ. అంబుజాక్ష.

ములును నిట్లు లయముఁ బొందిన గ్రసియించు, మనసు నాత్మగుణము నెనసి విధుఁడు.

క. అతనిఁ బొదువు సంకల్పం, బతులజ్ఞానంబు దాని నడఁచును విజ్ఞా
నితఁ దద్బలముఁ బురుష దే, హితనుం గాలంబు వరుస నెడలం జేయున్. 76

క. కాలం బెడలిన విద్యో, స్మిలిత మగుబోధ మస్యమిశ్రత్వంబుం
దూలించి వెలుఁగు చుండు వి, శాలమతీ బ్రహ్మ మది ప్రశస్తము శ్రుతులన్. 77

క. విను మీసంహరణంబును, దనవస మాతత్త్వ మవ్విధంబున దివసం
బులు రాత్రియుః భూతములకు, జననము వినయమును జేయు సంక్రీడ మెయిన్.

వ. అని చెప్పి పారాశర్యుం డార్యవర్యుం డగుశుకునితో వెండియు ని ట్లనియె. 79

సీ. జనియించి విప్రుండు జాతకర్మంబును, జౌలంబు నుపనీతిసంస్కృతియును
బడసి యాచార్యునిపాల నధ్యయనంబు, సేసి తా నాతనిచే సనుజ్ఞ
గాంచి తక్కటివిమూఁడంచితాశ్రమముల, యందునొక్కటిపూననగు గృహస్థ
ధర్మ మాశ్రయ మండ్రు తక్కినమూఁటికిఁ, గావున నది పూని దైవపైతృ

తే. కంబు లైనఋణంబులఁ [1]గ్రాఁచు వడుగు
నాఁటినడవడి ఋషులఋణమ్ము దీర్చి
వచ్చి కాన కాషాయపక్వతఁ [2]బ్రశుద్ధిఁ
బొంది మఱి యుత్తమాశ్రమ మొందు టొప్పు. 80

తే. క్రతువు సేఁత సేయించుట శ్రుతులు గాఢ
నియతిఁ జదువుట చదివించుటయును ధనము
లీగి కొనుట షట్కర్మంబు లింతవట్టు
నర్హకృత్యంబు లండ్రు ధరామరులకు. 81

దానగుణంబు సర్వవర్ణసామాన్యంబుగా నిరూపించుట.

వ. దానానుష్ఠానంబు సర్వజాతిసామాన్యం బయినయుత్తమధర్మంబు పుణ్యపరులకు దాతవ్యంబు గానివస్తువు లేదు కాశ్యుం డనురాజు దనప్రాణంబు లిచ్చి బ్రాహ్మణుప్రాణంబులు గాచె నౌశీనరుం డగుశిబి యాత్మాంగంబుల నౌరసపుత్త్రునిని బ్రాహ్మణార్థంబుగా నొసంగెఁ గాశీపతి యగుప్రతర్దనుండు బ్రాహ్మణునకై నిజనయనంబు లిచ్చె విదేహుండును జామదగ్న్యుండును గయుండును నొక్కొక్కతఱిసకలవసుంధరయును బ్రాహ్మణులకిచ్చిరి పాంచాల్యుం డగుబ్రహ్మదత్తుండు శంఖనిధి విప్రోత్తములకు దానంబు సేసె మఱియును బ్రాహ్మణులకుఁ బ్రాణశరీరమణిహిరణ్యకన్యాగవాదిప్రశస్తవస్తువు లనేకు లర్థుల కొసంగిరి వారల కెల్లను సమకూరినసద్గతులవిశేషంబులం జెప్పం బెద్ద యని వెండియు. 82

క. దానాధ్యయనయజనముల, నానావిధపాపములు వినాశముఁ బొందుం
గాన యవి మేలు హింసా, హీనత ధర్మవిధి లేని యెడఁ గడు వలయున్. 83

1. చ. గ్రాఁచి...వచ్చెఁ గాన; జ. గ్రచ్చువడక...2. జ. ప్రసిద్ధిఁ.

ఆ. ధూతపాపుఁ డై పూతాత్ముండు ల,ఘ్వాశి యగుచు నింద్రియముల గెల్చి
మనసులోనఁ గామమును గ్రోధమును జొర,నీక బ్రహ్మపదము నిచ్చఁ గోరు.

ఆ. ఇట్టివాఁడు వెడల నీఁదు నింద్రియజల,మన్యుపంకలోభమయతటాది
ఘోరరూప యగుసంసారవి,శాలనదిఁ బ్రశాంతశాలిహృదయ. 85

తే. ఘనతర ప్రజ్ఞ యను తెప్ప గలుగువాఁడు,సంసరణనదిఁ గడవంగఁ జాలుఁ గాక
కామమును గ్రోధమును మదిఁ గలిగి ప్రజ్ఞ,చించునేని నక్కడచుట చిక్కువడదె.

క. గతహర్ష భయక్రోధుఁడు, ధృతిమంతుఁడు నప్రమత్తధీమహితుఁడు సం
శ్రితధర్ముఁడు దాంతుఁడు నగు,నతఁ డవసాదంబు నొందఁ డతులవివేకా. 87

క. ధర్మ మధర్మమువోలె న,ధర్మము దా ధర్మవిధివిరోధంబునఁ దోఁచుం
గర్మసమితి నొక్కొకయెడ, ధర్మగతి యెఱుంగవలయుఁ దచ్ఛాస్త్రములన్.

వ. అని యుపదేశించి మఱియును. 89

క. జ్ఞానంబు వడయుటకు వా,ఙ్మానసములు సునియతములు గావింతురు స
న్మానితశాంతికొఱకు వి,జ్ఞానంబున నాత్మనియతి సల్పుదురు బుధుల్. 90

క. ఈతెరువున వేదవిదుఁడు, వీతామ్నాయుండు ధర్మవేదియుఁ బాప
స్ఫీతుఁడు సరి యై కడతు ర,నాతురత జరామరణమహాంభోరాశిన్. 91

వ. ఆచారనేమియుఁ బ్రాణయుగంబును నపానాక్షంబును [1]హ్రీవరూథంబును నుపా
యాపాయకూబరంబును ఘ్రాణశ్రవణవాహనంబును జ్ఞానసారథికంబును సర్వ
తంత్రప్రతోదంబును ద్యాగరశ్మియును నగుయోగరథంబు నెక్కి వెరవుగలవాఁ
డక్షరపదంబు సొరం జనఁ జాలు నారథికుం డాతంత్రంబుప్రభావంబునం జేసి.

క. వరుసన ధరణీపవనాం,బరజలతేజముల గెలుచు బల మెక్కి యహం
కరణంబు ద్రోచు బుద్ధిం, బరువడి నడఁగించుఁ బ్రకృతిపనిఁ బెడఁబాపున్. 93

ఆ. భూమిజయము దొడఁగి పురుషుఁ డంతంతకు, వృద్ధిఁ బొందియోగసిద్ధిఁ బొందుఁ
బొగయుమిడుఁగుఱులును బొనుఁగులేనిశిఖియు,బహులశిఖలు నైనపగిది ననఘ.

తే. విను మహంకారజయము పృథ్వీముఖంబు,లైనదానిని బుద్ధిప్రధానమును జ
యించు నట్టిసంస్కారంబు నిచ్చుదాన, నగుమహానుభావంబు సంశయమివరులకు.

వ. ఇది యోగప్రకారంబు. 96

తే. అనఘ యింద్రియముల విషయములమీఁద
నిగుడనీక మనంబుతో మగుడఁ దిగిచి
యాత్మఁ గూర్చుట సాంఖ్యులయనువు సాంఖ్య
యోగములు రెండు నారయ నొక్క తెరువ. 97

క. ఈరెండుప్రకారంబుల,వారలకును మమత విడువ వలయుట సరి ని
స్సారపుసంసారమునకుఁ, గారణము మమత్వ మగుటఁ గవిజనముఖ్యా. 98

---

1. చ. జ. హృత్కూబరంబును శ్రవణదర్శనవాహంబును...ధర్మప్రతోదంబును.

వ. భూతతారతమ్యంబులు సెప్పెద నాకర్ణింపుము జంగమస్థావరంబులయందు జంగమంబులు లెస్స యవి జరాయువు నండంబును నుద్భిదంబును స్వేదంబును నను జనకవిశేషంబుల జనియించి బహుపాదంబులును ద్విపాదంబులును నై యుండు నందు మనుష్యులు మేలు మనుష్యులయందు జాతిధర్మోపధారకు లెక్కుడు జాతిధర్మోపధారకులయందు విప్రు లుత్తములు విప్రులయందు వేదజ్ఞు లుదాత్తులు వేదజ్ఞులయందుం బ్రవచనశీలు రుత్కృష్టులు ప్రవచనశీలురయందాత్మజ్ఞులధికులు వారలు సర్వధర్మవిదులు సత్యసంకల్పులు నధిభూతాధిదైవవేదులు నగుదురు వారలం జూవె దేవతలు బ్రాహ్మణు లంద్రు వారెల్లవారికి నమస్కారాద్యుపచారాదరణీయులు వారికి సరిలేరు వారాధారంబుగా సమస్తజగంబులుం బ్రవర్తిల్లు చున్నవి యని చెప్పి యమ్మహాత్ముండు వెండియు. 99

తే. బ్రాహ్మణునకుఁ బ్రధానవర్తనము వినుము, నిర్మలజ్ఞానయుక్తుఁడై కర్మసమితి
నలఘునిష్ఠమైఁజలుపంగవలయుదాన, సంశయము లెల్లఁ బాయుఁ బ్రసాద మొందు.

క. ఇయ్యఖిలము సృజియింపఁగ, నెయ్యది ప్రభు వమ్మహామహితభూతముపొం
దయ్యెడిశుభంబు దపమునఁ, జయ్యన సిద్ధించు నది విగతసంశయ మనఘా. 101

క. మైత్రిం బోలెడుధర్మము, ధాత్రీదివిజులకు లేదు దాని నడపినం
బుత్రా యేకర్మంబుప, విత్రతయును వలవ దది వివేకముఁ జేర్చున్. 102

వ. అనిన విని శుకుండాసంయమివరున కిట్లనియె. 103

—వ్యాసుఁడు శుకున కుపదేశించినపరబ్రహ్మప్రాప్తిసాధనప్రకారము.—

క. పరమబ్రహ్మపదము న, ధ్వరముననో ప్రజ్ఞ పెంపువలననొ యోగా
చరణముననో సాంఖ్యసమా, చరణముననో పొందవచ్చుఁ దత్త్వజ్ఞవరా. 104

చ. అనుటయు నమ్మునిప్రవరుఁ డాతని కిట్లను నీవు పేరు గ్రు
చ్చినయవి యెల్ల మేల సవిశేషతపంబును నింద్రియప్రవ
ర్తనముల నిగ్రహించుటయు రాగము లోభముఁ ద్రోవఁ జాలు నే
ర్పును దృఢవిద్యయుం గలుగుపుణ్యుఁడు పొందఁగ నోపు బ్రహ్మమున్. 105

క. విను మందు నొకవిశేషం, బనఘా బుద్ధీంద్రియంబు లైదును బరముం
గనువెలుఁగున కడ్డము వా, ని నడంగింపంగ మనసునిపుణత యొప్పున్. 106

క. మనసు నియమింప భూతా, త్మనియత్నం [1]బోపు నియమమునకుఁ లోనై
మన సింద్రియములఁ గుదియిం, చిన శబ్దాదులు దొఱంగి సిద్ధి దొరకొనున్.

ఆ. కనుట వినుట యాదిగాఁ గలయింద్రియం, బుల కగోచరంబు బుద్ధి [2]దీప
రూపు గాఁగఁ దోఁచు రూపశబ్దాదిగు, ణత్త్వరహితమైనతత్త్వ మనఘ. 108

చ. వినయము విద్యయుం గలుగువిప్రునియందును గోవునందు నొ
ప్పు నెఱయుహస్తియందు నొకపోఁకకుఁ బోవనికుక్కయందు దా

1. క. బొప్పు. 2. చ. దెసను.

ని నడచి తెచ్చి వండి తినుగనీచపుమాలనియందుఁ దుల్యద
ర్శనులు తదంతరాత్ముని నిరంజనునిం గనునట్టిపండితుల్. 109

క. స్థావరముల జంగమముల, నావిభుఁడు వసించు నతని యందు నవి నిస
ర్గావాసత నుండును ద,ద్భావన మెఱుఁగుట తదైక్యపదముం జేర్చున్. 110

తే. క్షరము నక్షరమును ననం గలవు రెండు
మూర్తు లాత్మ కఖిలభూతములను బూర్వ
మొలయు మృత మన దివమున నుండు నమృత
మనఁగ నపరంబు రెంటిని గను బుధుండు. 111

క. ఈలోకంబుల నెల్లం, గాలము పక్వంబు సేయఁగా నెవ్వాఁ డ
క్కాలము పక్వము సేయుం, జాలు నతం డమృతు నజరు సత్యుఁ గనుటకున్.

తే. విను నవద్వారపురమున వెలుఁగుచుండు
హంసుఁ డతనిన యక్షరుఁ డమృతుఁ డం్రు
పరమయోగు లాతత్త్వంబు భంగిఁ గాంచు
యోగ్యసత్క్రియాభ్యాసవైరాగ్యపరుఁడు. 113

వ. అని చెప్పి యప్పారాశర్యుండు వెండియు. 114

తే. అనఘ విను కామమును గ్రోధమును భయంబు
నిద్రయును లోభమును జాల నిందితములు
యోగిజనులకుఁ గావున నుడుగ వలయు
వీని నైదింట నచలావధానవృత్తి. 115

శా. కామంబుం బెడఁబాచుఁ బండితుఁడు సంకల్పంబు వర్జించి ని
ద్రామోహంబు నడంచు సత్త్వగుణచింతన్ లోభముం బ్రాజ్ఞ సే
వాముద్రం దొలఁగించుఁ గ్రోధము శమవ్యాప్తిన్ మగుడ్చున్ మతి
శ్రీమాన్యా భయ మప్రమాదమున నిర్జించున్ దృఢస్వాంతుఁ డై. 116

తే. శిశ్నము నుదరమును ధృతి; జేయుఁగాలుఁ,జూడ్కిఁ;జూడ్కిని వినికిని శుద్ధమాన
సమున; మానసవాక్కుల విమలవిద్య, నవహితుండు రక్షించుఁ గులాగ్రగణ్య. 118

వ. మఱియు నొక్క తెఱంగు సెప్పెద.

తే. ఇంద్రియములలో నొక్కటి యేనిఁ బట్టు, వడక వెడలిన నాఁగంటి ప్రజ్ఞగాఱు
నట్లుగావునమనసుమున్నాఁగివినికి,యాదియగునైదుఁగ్రమమున నాఁగవలయు.

క. మనసును నింద్రియములనుం, దనయం దొడఁగంగఁ [1]జేయుఁ దానుఁ దెలివి నొం
ది నిరంజనత్వసిద్ధిం, గని [2]యపధూమానలంబు కరణి వెలుంగున్. 120

మ. మన సేకాగ్రతఁ బొందఁ జేయ జనసమ్మర్దంబు వర్జించి శూ
న్యనికేతాద్రిగుహావివిక్తవన దేవాగారముఖ్యంబు లై

1. చ. జేయఁ దాను; జ. జేయుఁ దానఁ. 2. గ. గతధూమా.

ననివాసంబుల నుండఁగా వలయుఁ దమ్మన్నించినం గీడు సే
సిన హర్షంబు నమర్షముఁ హృదయమునం జెందింప కక్షోభ్యుఁడై. 121

క. సమదృష్టిని ఱాయియుఁ గనకముఁ జూచుచు సత్సమాధికలితం బగువృ
త్తము నడపిన శబ్దబ్రహ్మము, షణ్మాసముల యోగి యతివర్తించున్. 122

క. సుత విను శబ్దబ్రహ్మము, నతివర్తించి భువనత్రయమునను యోగా
న్వితుఁడగుముని గను నజు శాశ్వతు నచలుఁ బురాణతము నజరుఁ బరమాత్మున్.

వ. అనిన విని శుకుండు వేదవ్యాసమునీశ్వరుతో ని ట్లను వేదంబు కర్మంబుల నాచ
రించుటయుం బరిత్యజించుటయుం జెప్పు నివ్విధంబులు పరస్పరవిరుద్ధంబులై
యున్నయవి యిం దెద్దాన నెట్టిగతి సిద్ధించు నేర్పడ నెఱింగింపవే యనుటయు
నతం డతని కి ట్లనియె. 124

ఆ. విను ప్రవృత్తి కర్మ మనఘ నివృత్తి, నిష్కర్మ మరయ బంధకంబు మోక్ష
ణంబు నగుట బోధనత్వసంపన్నులు, సొరరు కర్మతంత్రకరణమునకు. 125

క. కొందఱు కర్మకరణ మభి, నందింతురు వారలకు జననమరణములం
బొందక పోరాదు మహా, నందముఁ బొందుదురు నిత్యనైష్కర్మ్యపరుల్. 126

ఆ. చిత్తశుద్ధిమాత్రఁ జేసె నేనియు నవి, ద్యాత్మకంబ చూవె యరయఁ గర్మ
మది దొఱంగు టంచితాత్మవిద్యాత్మక, ధర్మ మదియ మోక్షదంబు సుమ్ము.

ఉ. గుమ్మడిపువ్వుఁ దేనియయుఁ గూపము నైందవరేఖకాంతియుం
జు మ్మరయంగఁ గర్మఫలశోభనసంపద జున్ను నేఱుఁ బూ
ర్ణ మ్మగుచంద్రబింబము ననం దగు నిర్మలవిద్య గాఢపా
కమ్ము ఫలోదయం బది యఖండసుఖాత్మపదంబు పుత్త్రకా. 128

వ. కర్మంబునం గానిది యై విద్య నయ్యెడునట్టి తెఱం గెఱింగించెద. 129

క. విను రేఖామాత్రపుఁజం, ద్రునియట్టుల జీవుఁ డతనిదుష్పక్షముఁ బో
లినయజ్ఞానమునపగమ, మున బోధానందసాంద్రపూర్ణతఁ బొలుచున్. 130

బ్రహ్మచర్యంబు బ్రహ్మవిద్యాప్రాప్తికి ముఖ్యకారణం బని చెప్పుట.

వ. అని చెప్పిన విని విద్య యెట్టివారికి నలవడు నెఱింగింపవే యనిన నందనునితో
గంధవతీనందనుం డి ట్లనియె. 131

తే. బ్రహ్మచర్యసమేతతపంబు విపుల, కాననమున వానప్రస్థగణముపొంత
నిలిచి చేయుచుఁ బర్ణశాలలకు నుచిత, కాలమునఁ జని యెత్తి భిక్షలు భుజించి.

క. నుతియు నమస్కృతియును లే, క తిరిగి శుభ మశుభ మనువగం బొందక గో
ష్ఠి తెరువు సొర కుండుట సు, వ్రత మది యధ్యాత్మవిద్యఁ బ్రచురముఁ జేయున్.

ఆ. అనుఁడు నతఁడు కర్మ మఖిలంబు నీడఁబో, విడుచు టొప్ప దండ్రు వేదవిదులు
దాని నాదరింపఁ దగదొకో సంయమి, ప్రవర సందియంబు వాప వలయు.

1. గ. మాత్ర మోక్షదంబు.

వ. అనినం గర్మంబు విడువమియు విడుచుటయుం గలిగియుండుం దదీయయోగ్యతా విశేషంబు లెఱింగించెద. 135

సీ. విను మని ముని యిట్టు లను బ్రహ్మచారి గృహస్థవానప్రస్థయతులు విహిత కర్మనిష్ఠత సిద్ధిం గాంతు రాశ్రమచతుష్కముం జతుష్పట్టికాఘటిత మైన నిఃశ్రేణి తుదిముట్ట నెల వెక్కుటకు నిట్టి, క్రమవర్తనము సుకరంపుమార్గ
[1]మాయువు మొదలినాలవుపాలు గురుపాల, దానునియట్ల సంతతముం బనులు

తే. ప్రీతిం జేయుచుం గుడిచినపిదపం గుడిచి, శయ్యం జెందిన నాతనిచరణయుగము కరయుగంబున నొత్తుచుం గలితనిద్రుం, డైన నిద్రించు బ్రహ్మచర్యాన్వితుండు.

క. రసగంధప్రముఖంబుల, దెస వేడుక లేక గురుమతికి వచ్చినయ ట్టిసమయములం దగ వేదా, భ్యసనంబులు సేయుచుండు నాతండు నియతిన్.

వ. ఇది బ్రహ్మచారిప్రకారం బాతం డాశ్రమాంతరగతుం డయి వర్తించువిధంబు సెప్పెద. 138

సీ. సవినయంబునం దనశక్తితో గురునకు, దక్షిణ యిచ్చి యాతండు వనుపం గా సమావర్తనకార్యంబు నడపి వి, వాహ మై హవ్యకవ్యముల నతిథి తోషణబాంధవపోషణంబుల సత్య, భాషల నిజదారపరతం బుత్ర సంశిక్షం గ్రతువిశేషంబుల నొకయాయు, రంశంబు గడపి గృహస్థధర్మ

తే. వృత్తిం గృతకృత్యుం డగు నగ్ని విడువ కడవిం
బూరిపంటల ఫలమూలములను భిక్షు
పూజ సలుపుచుం బరిశిష్టములు భుజించి
తపము సేంత వానప్రస్థధర్మసరణి. 139

క. వానప్రస్థప్రక్రియ, దా నొకపా లాయువునం బరిదంపడి తుదిపా లైనను సన్న్యాసాను, ష్ఠానమునకుం జొచ్చు వాండు శాంతాత్మకుం డై. 140

వ. ఇట్లాయురంశంబులు నాలుగుం జెల్లుట యుత్తమధర్మస్వరూపం బంశత్రయకా లాచరితంబై నయాశ్రమత్రితయంబు ప్రవర్తనంబులం గషాయపక్వంబగుటయుం జతుర్థాశ్రమంబుం జెందుట కృత్యంబు దాని తెఱం గెఱింగించెద నవహితుండ వై యాకర్ణింపుము. 141

సీ. ఆత్మయం దగ్నిసమారోపణము సేసి, యజన మాంతరముగ నకృతసంధి విగ్రహుం డగుచుం బరిగ్రహవిముఖుం డై, ముండుండు నని కేతనుండు వృక్ష మూలవాసియును గపాలధారుండు నే, కాకియు నక్రోధ కామ శోకుం డునుగాం గవలయు భిక్షునకునిందాస్తుతుల్, దనయందయుడం గంగందానుబరుల

తే. దిక్కువలుకక దివిమెల్లం బిక్కటిలంగం, దాన యున్నట్లు గనుచు నేమేనిం గుడిచి యెద్దియేనియుం గట్టి యెంత దేశయించు, నతని దేవతల్ బ్రాహ్మణుం డండ్రు పుత్ర.

1. చ. మాయువు మొదల నాలవుపాలు.

క. జననికరములకుఁ దొలఁగును, ఘనభుజగంబులకుఁ బోలెఁ గనుఁ బీనుఁగుఁగా
వనితం దనుఁ బాటించిన, ననఘా నరకముగఁ దలఁచు నతఁడు మనమునన్.
తే. అతనివలన భూతములకు నభయ మగుట
భూతములదెస నభయంబ యాతనికిని
బుత్త్ర యాగు లెల్లవియును భూతములకు
నభయ మిచ్చుటఁ బోల వం డ్రార్యజనులు. 144
ఆ. జంతుపదము లెల్ల దంతిపదంబులో, నడఁగు క్రియ నహింస యందు సకల
ధర్మములు నడంగుఁ గర్మసంత్యాగికి, నైన భూతదయ సమర్వగుణము.145
వ. కావున. 146
క. జగమున కెల్ల శరణ్యుం, డగుచు నమృతసిక్త మైన యట్టి మనసుతో
విగతాఖిలలేపస్థితి, గగనమున ట్లుండు నతఁడు గణనాధికుఁ డై. 147
వ. అని చెప్పి యప్పరాశరనందనుండు వెండియు ని ట్లనియె. 148

వ్యాసుఁడు శుకున కుపదేశించినయంతర్యాగప్రకారము.

తే. హృదయవేదికయందు సమిద్ధమూర్తి, వెలుఁగుచుండు తేజమునందు వేల్చుఁ బ్రాణ
ములను యాజియట్లంతరమున నొనర్చు, యాగమున వీతకల్మషుఁ డై వెలుంగు.
క. విను మాత్మతీర్థసంసే, వనము తెఱం గెఱుఁగునట్టివానికిఁ దిరుగం
జన వలయునె పెఱచోటుల, కని చెప్పుదు రాశ్రితులకు నధ్యాత్మవిదుల్.150
తే. అవనిఁ బొందదు దినమున నప్రమేయ, మండజంబు హిరణ్మయమండమధ్య
మున వెలుంగు నుజ్జ్వలపక్షఘనత దాని, నెఱుఁగుసంతతయోగ సమేతుఁ డనఘ.
క. విను నూఱంచులుఁ బండ్రెం, డనుపమధారలును నై నిజాస్యము విశ్వం
బును బొదువఁ దిరుగుకాలం, బనుచక్రము దురవబోధమది యడఁగు గుహన్.
ఆ. మనసు నింద్రియములఁ బనిగొని పురుషుండు, ప్రచురశిక్ష లేని రథ్యసమితి
నడపు రధికుమాడ్కి నడవడి నవి యీడ్చు, నట్టు లైన నశుభ మావహిల్లు.
క. తనకు మహితప్రసాదం, బొనరక యున్నేనిఁ గీళ్లు లోలయు నది దృఢ
త్వనిరూఢ మైనఁ జేకుఱు, ననంతపదసిద్ధి దాని కను వెఱఁగింతున్. 154
తే. సర్వసంకల్పరహితుఁ డై సత్త్వమున వి, నిశ్చలంబుగఁ జిత్తంబు నిలుపవలయు
సత్త్వసక్తచిత్తంబు ప్రసాద మొసఁగు, దానఁ గాలంబు నడపుటుత్తమవిధంబు.
క. వినుము నివాతస్థానం, బునఁ గంపనరహితదీపము వెలింగెడుచా
డ్పున నంతరాత్మ వెలుఁగుచు, నునికి ప్రసాదంబుభంగి యుత్తమధిషణా. 156
క. విను తత్ప్రసాదవంతుఁడు, దనయందు నిరంజనముగఁ దన్ననిశంబుం
గనుఁగొనుచు నియతి నియతా, శనుఁ డై యుండుట యొనర్చు శాశ్వతపదమున్.
తే. అతులవేదాంతశాస్త్రమహాంబురాశి, ద్రచ్చి పుచ్చిననవనీత మిచ్చితిని స
మాదరంబునఁ గైకొను మనుసరించు, నిర్మలాత్మ తపస్వికి నీవు నొసఁగు. 158

ఆ. సకలరత్నపూర్ణ సర్వవసుంధరా,చక్రదానవిధియు సరి యనంగ
రాదు విశ్వవేద రాశిసారాధ్యాత్మ,విద్య యిచ్చుటకు వివేకధుర్య. 159

వ. అని యుపదేశించి యింక నేమి విన వల తనిన శుకుండు దీనికంటె విన వలయు
నది గలదె దీనిన సుదృఢంబుగా ననుగ్రహింపవే యనుటయు ననుకంపావిధే
యుం డగుసాత్యవతేయుం డతని కిట్లనియె. 160

క. భూతంబులఁ బచరించుచు, భూతాత్ముఁడు వానిఁ దనవిభూతి నడంచున్
భూతాహరణంబు నిజ,ద్యోతనము తదీయవృత్తి దుర్దశ పుత్త్రా. 161

క. అవయవము లెట్లు కూర్మము, నివిడించును లోని కడఁచు నెఱి నట్టుల భూ
తవితతి భూతాత్ముండును, బ్రవర్తననివర్తనముల పాల్పడఁ జేయున్. 162

క. మాయాశబలుం డై యటు, సేయక పోరామి భూతసృష్టి యొనర్చున్
మాయఁ బెడఁబాప భూతని,కాయాభావ మగు నదియ కవిజనముఖ్యా. 163

తే. గగనపవనతేజోజలక్ష్మాగుణములు, సూవె శబ్దాదికంబును శ్రోత్రముఖ్య
కంబులై చెల్లువిషయచయంబునింద్రి,యవ్రజంబునుసర్వంబునడఁచుశమము.

క. విను మైదింద్రియములకును, మనంబు షష్ఠంబు సప్తమత్వము బుద్ధిం
బనుగొను భవ్యక్షేత్ర,జ్ఞునియం దష్టమత గల్గు సుగుణాభరణా. 165

తే. తలఁచు మనమందు నిశ్చయదశ యొనర్చు
బుద్ధి సర్వైకసాక్షిత్వమున వెలుంగు
నంతరాత్ముండు క్షేత్రజ్ఞుఁ డనఁగ వాని
మెఱుపు సత్త్వాదిగుణము లై మెఱయు వత్స. 166

తే. స్వస్థతయు దుస్స్థతయు జడత్వమును గ్రమవి
గణన సత్త్వరజస్తమోగుణము లవి స
మీరితము లగు టడఁగుట యింద్రియంబు
లడరు టూదుఁగుట బుద్ధికృత్యములు పుత్త్ర. 167

తే. అనఘ యింద్రియములు విషయములు మనసు
బుద్ధియును నాత్మయును గ్రమంబునన యెక్కు
డాత్మ బుద్ధి యనంగ నల్పాంతరంపు
వస్తువులు బుద్ధి యిన్నింట విస్తరిలుట. 168

క. కనుఁ గన్నై వినుఁ జెవి యై, కొనుఁ జవి జిహ్వయయి మూరుకొను నాసిక యై
తను వై స్పర్శము గైకొను, ననవద్యా బుద్ధి యాత్మయంద నిలుచుచున్. 169

క. ప్రీతిం గడుఁ బొదలు విషా,దాతురత న్స్రుక్కుఁ దద్ద్వయము లేక సమ
త్వాతిశయంబున నిలుచును, నేతృత్వంబునను బుద్ధి నెఱపు గుణములన్. 170

ఆ. తత్స్వభావ మెఱిఁగి తా నింద్రియాదిస,క్తకము వెంటఁ బోక తన్నుఁ గనుచు
నున్నవానిఁ బొంద నోపునె దుఃఖదై,న్యంబు సుఖమదంబు నప్రమత్త. 171

ఆ. జలములందు నిలిచి ♦ జలపక్షి మునుఁగదు, మేడిపండు మశకకీటకఁ బొరయ
దట్లు విషయసమితియందుఁ దా నది దన,యందు నుండు వికృతికనొంద దాత్మ.
వ. అని చెప్పి మఱియును. 173

క. విను మూర్ణనాభి తంతువు, జనియింపఁగఁ జేసినట్లు ♦ [1]సత్త్వము గుణసం
జనకం బగు నది పురుషుఁడు, గనుట యుదాసీనతన వికారము గలదే. 174

ఆ. ఆదినిధనరహితుఁ ♦ డగునిరంజనుఁ జెంది, గుణము లెడల విడిచి ♦ క్రోధలోభ
ములకుఁజొరవయినికమునిహృదయ గ్రంథి,విరియనడఁచిమోక్షవిభవ మొందు.

క. శమసంపద బ్రాహ్మణజన్మమునకు సామగ్ర్య మవ్విశనయసారము చి
త్తమున కలవడ్డమునికి భయము శోకము మదము హర్ష ♦ మనునివి గలవే.

క. శమనిరతియు నాత్మజ్ఞానముఁ జూవ్వే బుద్ధలక్షణంబులు పర్యా
ప్తము లివి రెండు నరయ మోక్షము సాధించుటకు వేఱ ♦ కల్పన లేలా. 177

వ. అనిన విని శుకుండు ధర్మంబుల కెల్లఁ బరమం బయినధర్మం బెఱింగింపవేయను
టయు వాత్సల్యపరాయణుం డగునబ్బాదరాయణుండు సనాతనంబును మునిసత్త
మసంస్తుత్యంబును నగునుత్తమధర్మంబు సెప్పెద నేకాగ్రచిత్తుండ వయి యా
కర్ణింపు మని పలికి యి ట్లనియె. 178

ఇంద్రియనిగ్రహం బుత్తమధర్మంబుగా నిరూపించుట.

తే. ఎల్లకడలకు వెలువడుకనింద్రియముల, బాలపుత్త్రులఁ దండ్రియుఁబోలె నాఁగు
మవియుమనమును నిశ్చలైకాగ్రభావ, మొందుటుత్తమతపమది యయ్యజ్ఞ్వాలాత్మ.

క. అది ధర్మంబుల కెల్లం, దుది యగుధర్మంబు మనసుతో దానిఁ దగం
గుదియించి మేధతోడం, గదియింపుము నియతిఁ బుత్త్ర ♦ కడు గాఢముగన్.180

తే. ఇంద్రియంబుల నాఱింటి ♦ నిట్లు విషయ
ములకు నొలయక యుండంగ ♦ నిలువరించి
తలఁపు లుడిగి తేనియఁ బ్రమదమున నాను
భంగిఁ దృప్తుఁడ వై [2]యుందు ♦ పరముఁ గాంతు. 181

వ. అని వెండియు. 182

చ. తనకుసుమంబులన్ ఫలవితానము మూర్ధ్నాన నాన మ్రాను నే
రనిక్రియఁ గాన నేరదు పరంబగుతత్త్వము నైజభంగి వి
న్ననువున నంతరాత్మ గను ♦ నైష్ఠికతం గను మింతవట్టుఁ బా
మెనసినతోలు వాయుక్రియ ♦ నీవు దొలంగుదు పాపపుంజమున్. 183

వ. ఇవ్విధంబున శాంతి నొంది యవ్యక్తసంభవయు సంకల్పకూలయుఁ గ్రోధపంకయు
నింద్రియగ్రాహయుఁ గామభుజంగయు మోహతృణచ్ఛన్నయు సంసారసాగర

1. చ. సత్త్వగుణము సం. 2. యుండు-చ. పద్మము-జ. పరము.

గామినియు నై ఘోరప్రకార యగుచు నకృతాత్ములకుం గడవ రానియట్టి భ
వాహిని సత్యతీర్థంబున నుత్తరించి. 184

క. సుత నీవు సుప్రసన్నా, త్మతం బొంది నగాగ్రగతుండు మహివారలం జూ
చు తెఱంగున నీభూత, ప్రతతిం గనుంగొనుచు నుండు పరితృప్తుండ వై. 185

క. శాంతము ధర్మప్రచయం, బంతటికి విశిష్ట మిమ్మహావిద్య మదీ
యాంతఃకరణము సాక్షిగ, నెంతయుసంప్రీతి నీకు నిచ్చితిం బుత్త్రా. 186

వ. అని యిట్లుపదేశించి పరమసంవిదేకాయనుం డగుకృష్ణద్వైపాయనుండు కృతా
ర్థీభూతచేతస్కుం డగునందను ప్రతిపత్తికి నభినందనవిశేషంబుగా నధ్యాత్మవిద్యా
విలాసవిషయంబు లగువాక్యంబులు మఱియు ననుగ్రహించె వానిం జెప్పెద.

క. వేదములం దదంగములు స, మాదరమునం జదివినను సుయజమానత్వా
పాదకుం డైనను బ్రాహ్మణ, తాదశ దక్కునె ప్రశాంతిం దక్కం గుమారా.

క. ఒరులకుం దా వెఱవక తన, కొరులు వెఱవ కుండునట్టియొప్పెడుసమతం
దిర మైననడవడిం గల, పరిణతచిత్తుండు సూవె బ్రాహ్మణుం డనఘా. 189

తే. బంధనంబులలో నెల్లం బరమబంధ
నంబు కామంబు తద్వర్జనమున నాత్మ
యభ్రపటలంబు వాసినయమృతకిరణ
పూర్ణమండలమునుబోలెం బొలుచు ననఘ. 190

క. పరతత్త్వోపాసనత, త్పరుం డై సంక్షీణకామభావత నున్నం
బురుషు సుఖ మొందువృద్ధిం, బొరయుచు వపు వమృతకిరణుంబొందినమాడ్కిన్.

క. పొరిం బొరి భూతముల గుణో, త్కర మవిశేషాన్వితముగం గనుంగొనుసంవి
త్పరదుఃఖంబు సుఖముచే, విరియుం దరణిచేతం దమము విరిసినభంగిన్. 192

ఆ. తనది యనక యేమిధనమునం బ్రియమందు, నెద్ది గుడువ కుండ నెసంగుదృష్టి
యిచ్చం బొందులేక యెయ్యది బల మిచ్చు, దానిం గనుట శ్రుతులతలంపు గనుట.

క. పరిపాటిం గర్మ మెడలంగ, వరుస గుణము లడంగ విషయవర్గముపొందుం
బొరయక యుండెడుబ్రాహ్మణు, జరయును మృత్యువును బొరయ జాలవు వత్సా.

తే. అనఘ దేహంబుకంటె వే అయినదేహి
సూక్ష్మరూపము శాస్త్రోక్తసుకృతములం బ్ర
శాంతజనములు గాంతురు సాధనముల
నాదరింపరు దర్శనానంతరమున. 195

క. ఇనురూపము జలములం దోం, చినక్రియ బుద్ధిం బ్రతిబింబసిద్ధత వెలుం గొం
దినయాత్మను బరమార్థత, గనుసత్త్వస్థులకు నిజము గానంగ నగున్. 196

క. అనఘ దివసంబు రాత్రియు, ననునివి భానునకు లేనియట్టులు సతతం
బును బరమయోగయుతుం డగు, మునికి వివేకావివేకములు లేకుండున్. 197

క. కరణంబులు దొడరిన ని,ష్కారణత నున్నను శమంబు గలయోగికి సు
స్థిర మగు సమాధి యని ముని,[1]వర శాండిల్యుండు శిష్యవరులకుఁ జెప్పెన్.

సీ. విను మోహబీజసంజనితంబు కామద్రు,మంబు ప్రమాదజలంబు దనకుఁ
బరిషేచనంబుగఁ బెరుఁగు నజ్ఞానస్థి,రాధారకలిత మై యం దసూయ
పత్రసంపద యది చిత్రతరంబు మా,నస్కంధదృఢత నున్నతి వహించు
శోకశాఖంబు ననేకచింతోపశా,ఖంబుఁ బురాకృతకర్మసార

తే. ఘనముఁ దృష్ణాలతాపరిగతము నగుచుఁ
బొలుచుఁ దత్ఫలములకు లుబ్ధులు గడంగి
ప్రాఁకి పడుదురు విడుపు శస్త్రముగ నది వి
ఖండితము సేసి బుధుఁడు దుఃఖములఁ దొఱఁగు. 199

సీ. పురము శరీరంబు బుద్ధి తత్స్వామిని, సర్వార్థచింతనసచివపదవి
నడుచుచు నుండు మనంబు శబ్దాద్యంబు, లై చెల్లువిషయంబు లైదుఁ దగుపు
రోహితవర్గంబు శ్రోత్రాదు లగునింద్రి,యంబులు పౌరజనంబు లిట్లు
పరఁగెడురాజ్యంబు పరిభోగమునకు దూ,షకు లైనవారలు రజస్తమములు

తే. [2]వారికలపులఁ బడు బుద్ధి నేర కుండి
మనసుతోడ వేర్పడినఁ దానును మనంబు
నేకముఖతఁ గార్యము సూచు నేని దుష్టు
లడఁగుదురు భోగ మవ్యయ మగుఁ గుమార. 200

వ. అని చెప్పె ననిన విని పాండవాగ్రజుండు భీష్మునితోఁ గార్యబలంబును వీర్య
బలంబును మనోబలంబునుం గలుగునుత్తమక్షితిపతు లనేకు లీకయ్యంబున
మృతు లైరి నిజప్రాణంబునకు నొక్కరుండు నొడయుండు లేక తక్క మృత్యు
వనునది యెయ్యది యేమిటం గలిగె నెట్లు ప్రజల సంహరించు నెఱింగింపవే
యనుటయు నతం డి ట్లనియె. 201

భీష్ముఁడు ధర్మరాజునకు మృత్యుదేవతతెఱం గెఱిఁగించుట.

సీ. విను మకంపనుఁ డనుమనుజేంద్రుఁ డాత్మజుఁ, డాహవంబున మృతుఁ డైన వగపు
గదురంగ నుండి నారదు నలవోక వ,చ్చినవానిఁ గని సవిశేషభక్తి
యుతముగా నాతిథ్య మొనరించి తనవగ, పెఱిఁగించుటయు నమ్మునీశ్వరుండు
కరుణ శోకనిరాసకారణం బైనయా,ఖ్యాన మొక్కటి సెప్పె దాని తెఱఁగు

తే. దేటపడునట్లుగాఁ బరిపాటితోడ, నఖిలమును నెఱిఁగించెద నవహితుండ
వై వినంగ నీయడిగినయర్థమునకు, బోధకం బగు నది కురుభూపవర్య. 202

వ. అజుండు జగంబులు సృజియింప జంతుసంతానంబు వెరిఁగి సమ్మర్దం బధికం బై
యూర్పు వోవనియ ట్లయిన నద్దేవుండు సంకటపడి సంహారప్రకారంబు

1. చ. వరుఁ డగుశాండిలుఁడు 2. జ. వారికఱపులఁ.

విచారింపం దదీయచిత్తంబు కార్యదాహంబున మహాదహనుండు జనియించి
జగంబులు దహింపం జొచ్చిన. 203

తే. త్రిణయనుఁడువచ్చియాతనిఁ దేర్చెనాతఁ, డాతెఱంగెఱింగించియక్కయ్యగ్ని నుడిపె
నపుడుపుట్టెఁదదీయేంద్రియవ్రజమున, నొక్కయంగన రక్తాక్షి యుజ్జ్వలాంగి.

వ. పుట్టి దక్షిణాభిముఖియై పోవం గని కమలసంభవుండు పిలిచి మృత్యువ ప్రజలఁ
బ్రబలదుర్బలభేదంబు లేక సంహరింపు మనుటయు నవ్వనిత వడవడంగన్నీ రొలుక
నీకుద్భవించి క్రూరకర్మంబు సేయుదునే ధర్మకార్యంబునకుం బనుపు మని పలికిన
నయ్యశ్రుబిందువులు దోయిటం బట్టి యద్దేవుం డమ్ముద్దియతో నిదియ పనిగా
నుదయించినదానవు నీవు ప్రజాసంహారంబు సేయ వలయు ననవుడు నాబాల
గాలిం దూలుతీవయుంబోలెఁ గంపంబు నొందుచు. 205

క. మనుజుల హరించి బాంధవ, జనమునశోకంబుఁ జూడఁ జాలుదునె తపం
బున కేఁగెద సదయంబుగ, [1]ననుజ్ఞ సేయంగ వలయు నని ప్రణమిల్లెన్. 206

వ. దానికి నరవిందసంభవుండు మందస్మితంబుతో ని ట్లె లగు జంతుసంహారంబు
నీ కవశ్యకర్తవ్యంబు దానిం జేయుమి సువ్వే యధర్మం బని నిర్బంధించిన నూర
కుండి యన్నాతి పదంపడి యల్లన నరిఁగి ధేనుకాశ్రమంబున కరిగి యత్యంత
దీర్ఘకాలంబు ఘోరతపంబు సేసి కౌశికి గంగ నంద యనునదులకుం బోయి
వాయు వాహారంబుగా నతిదుష్కరవ్రతంబు లనేకవర్షంబు లాచరించి హిమ
శిఖరిశిఖరంబునకుం జని చతురానన ప్రీతికరం బగునిష్ఠాతిశయంబున సంయ
మంబు దాల్చి యుండ నద్దేవుండు. 207

క. సన్నిధి సేసి తపముమెయి, నున్నఁ బ్రయోజనము గలదె యుడుగుము పుత్త్రీ
యన్న శరణంబు వేఁడెద, నన్ను దయం గావు మనియె నాతి యతనితోన్.

వ. అనిన విని యమ్మహాత్ముండు. 209

తే. ప్రజల హరియించు టిది నీకుఁ బరమధర్మ, మేను బొంకెదనే దీని నెల్లభంగి
నాచరింపన వలయు మత్ప్రార్థనంబు, భగ్నమొనరించు టొప్పదుపద్మనయన.

వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద నీయశ్రుజలంబు లే నంజలిపుటంబునం బట్టు
కొఱుంగుదు గాదె యవి నానావ్యాధిరూపంబుల మానవుల బాధించుఁ గామ
క్రోధంబులు వానికిం దోడుపడు వారు దానన తెగుదురు నీవు నిమిత్తమాత్రం
బంతియ నీకు వరం బిచ్చెద. 211

తే. పురుషుఁడునునంగనయును నపుంసకుండు, నగుముపుత్త్రిక పురుషునినంగనను న
పుంసకునిఁ జంపువేళలఁ బొందకుండు, పాపమును నిది ధర్మమై పరఁగు నీకు.

వ. అని పలుకుటయు నప్పొలంతి శాపంబునకు వెఱచియు నది యట్టిద కాక యను
తలంపు దోఁచియుఁ బ్రజాసంహారంబు సేయునధికారంబు పూనె మృత్యుదేవత

1. క. ననుమతి.

ప్రాణాపహారిణి యగుఁ బ్రాణిజాలంబు దేహంబులం బాసి దేవాదిభావంబులం
బొంపుచు మగుడ మనుష్యత్వంబు నొందు చుండు. 213

తే. భీమనాదుండు భీముఁ డుదగ్రధాముఁ డప్ర
తర్క్యతేజోమయుఁడు జగత్త్రాణుఁ డొడలు
మనుపఁ జెఱుపంగ నోడయుండు సనుత మగుడ
నరుగుదెంచుట వింత గా దతని కెందు 214

వ. అనినం దొల్లియు నిది వింటి నాఁ డత్యంతశోకాక్రాంతుండ నగుట నవ్వినికి
రిత్తవోయె నేఁ డీయుపాఖ్యానంబునయర్థంబు పరిజ్ఞాతం బయ్యె. 215

క. అని పలికి యధిప కుంతీతనయాగ్రజుఁ డిట్టు లనుఁ బితామహుతోఁ స
జ్జనకోటి ధర్మమునకును, మనమున వెఱచు నది యింతసూక్ష్మం బగునే. 216

వ. ధర్మంబు తెఱం గిట్టి దని నిరూపించి యనుగ్రహింపుము. 217

సీ. అనుటయు నతఁ డిట్టులనియె వేదంబుల,మీఁదిభక్తియు ధృతి స్మృతియు సమ్య
గాచారమును రుచిరాకారములు ధర్మ,మునకుఁ గొందఱు బుధజనము లర్థ
మగుఁ జతుర్థాకారమం డ్రయినను బాడి, దప్పియు బొంకియు ధనము గూర్చు
చెల్లపాపములకు నెక్కుడు బొంకమి, పరులసొమ్ముల కాసపడమి సర్వ

ఆ. ధర్మములకు నధికతరములు విధివిహి,తంబు గానియట్టి ధర్మ మనఘ
చవుట నిడినవిత్తు[1]చాడ్పున రూపించి, చేయ నిహపరములఁ జెందు సుఖము.

వ. ధర్మంబు తెఱంగు సూక్ష్మంబు ధర్మంబులు బహువిధంబు లట్లు గావున [2]ధర్మ
సర్వస్వ నైజస్వరూపనిరూపణంబు సేసి కరతలామలకంబుగాఁ బలికెద నాక
ర్ణింపుము. 219

క. ఒరు లేమేమి యొనర్చిన, నరవర యప్రియము దనమనంబున కగుఁ దా
నొరులకు నవి సేయ కునికి, పరాయణము పరమధర్మపదముల కెల్లన్. 220

వ. అని చెప్పినం బ్రీతుం డై తాతకుం బ్రణమిల్లి పాండవాగ్రజుండు ధర్మస్వరూప
నిరూపణం బింత యొప్పునే యని యభివర్ణించి యాగ్రహంబున నేమేనియు
నడుగుచున్నవానింగా నన్నుం దలంపవలదు వలవనియట్టిది యడుగం దెలిసికొను
టకై వలయునది యడుగుదు నట్లుంగాక యడిగినదానిన యడుగుటయుం గలుగుఁ
గృప నాదరింపుము సమ్యగాచారంబు ధర్మప్రకారం బని నిర్దేశించితి వుత్తమా
చారప్రకారం బెఱింగింపవే యనుటయు నమ్మనుజపతికి నమ్మహాత్ముం డిట్లనియె.

తే. వేద మాచారములఁ జెప్పు వివిధగతుల,సకలహిత మగునట్టి యాచార మరయ
ననఘ వేఱొండు గలదె మహాత్ము లెద్ది,యాచరించిరి దానిఁ జేయంగవలయు.

వ. అని పలికి తొల్లి జాజలి యనుమునికిఁ దులాధారుం డనువణిగ్వరునితో సంవాదం
బు గలిగె నది యితిహాసరూపంబునఁ జెల్లు నేతద్విషయం బయి యుండు దానిం

1. చ. చాడ్పు నిరూపించి. 2. చ. ధర్మస్వరూపనిరూపణంబు, కరతలా.

జెప్పెద నాకర్ణింపుము. 223

### జాజలితులాధారులసంవాదప్రకారము.

సీ. చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నాసీనుఁ డై యుండఁ బిచ్చికలు గూఁడు
గావించెఁ దన్మస్తకంబున నమ్మిథునము కారణముగ నండములు గలిగి
పిల్ల లై వర్తించి యెల్లెడ కెర గొన, నరుగుచు మరలుచు నవియు నవియు
నగ్గూఁట వసియింప నతఁడు దయాళుఁ డై, వానిఁ జోపక యుండి వత్స తనదు

తే. నియతి కెద మెచ్చి యీధర్మనిష్ఠ యెందుఁ
గలదె యనుటయు మ్రోసె నాకాశవాణి
ధర్మపరుఁ డైనయత్తులాధారుఁ డింత
[1]యాడఁ డిట్లాడ నే లని యద్భుతముగ. 224

వ. అట్లు మ్రోసిన విని వెఱఁగుపడి యత్తులాధారుం గాన వలయు నని తలంచినం దులాధారుండు వారాణసీపురంబున నున్నవాఁ డనువాక్యంబును నంబరంబున వీతెంచె నమ్మునియును మత్సరభరితుఁ డగుచు నప్పురంబునకుం బోయి జనసంపూజ్యవాణిజ్యంబునం బ్రవర్తిల్లునతనిం గాంచిన నతండు సముచితసత్కారం బాచరించి యి ట్లనియె. 225

తే. పిచ్చికలు గూఁడు శిరమునఁ బెట్టి తారుఁ, బిల్లలును సుఖలీల వర్తిల్లుచుండఁ
జిత్తవికృతి లే కెట్టులు సేయు దయ్యె, తపము సంభావనీయవర్తనుఁడ వీవు.

వ. అనినఁ దదీయబోధనంబునకు విస్మయం బందుచు విప్రోత్తముండు నీవు వణిగ్వర్తనంబున నుండ నెవ్విధం బగుధర్మంబున నివ్విశేషంబు గలిగె ననవుడు నతం డతని కి ట్లనియె. 227

సీ. విలుచుట నమ్ముట నొలయదు వంచన, యర్ఘలాభంబుల ననుభవింతు
సరి సిద్ధ్యసిద్ధుల సమలోష్టకాంచన, మై యుండు మనసు నిందాభినుతులు
హింసయు నాత్మప్రశంసయు లేవు భూతంబులయం దెల్ల దయ ఘటిల్లు
నభయదక్షిణ మగు నంచితసత్యయాగము సెల్లుఁ గోర భోగమును యశము

తే. నెవ్వరికి మేలు సేసిన నింత సేసినాఁడ ననుబుద్ధి మమత యెన్నండు నాకుఁ
గలుగ దేమిట నేనియు వలపు నొల్లమియును బుట్టదు నిక్కమింతయు మహాత్మ.

క. లోకం బెల్లను నేఁ జిత్రాకారము గాఁగఁ జూతు నట్లగుట మనం
బే కార్యములం దగులదు, కోకనదదళాంబుబిందుగుణ మొనరంగన్. 229

వ. అనిన విని జాజలి తులాధారున కి ట్లనియె. 230

తే. తపములును యజ్ఞములు నీవు ధర్మములుగఁ, బలుకవైతివి యార్యసంభావనీయ
పదము లగుకర్మములలోనఁ బరిగణింపఁ, బడవొకో వేదశాస్త్రతత్పరులచేత.

చ. అనవుడు నాతఁ డిట్లను నహంకృతియుక్తముఁ గామసంశ్రితం

---

1. ఖ. యాతఁ డిట్లాడ.

బును నగునేని నట్టితపఽమున్ ఫలకాంక్ష యొనర్చుయజ్ఞమున్
ఘనతరలోభవృత్తి యనుఽకాన్పున మెచ్చదు దేవకోటి వా
న నగు గతాగతంపుభ్రమఽణంబులు గీల్లులు గాక మేలులే. 232

ఆ. నిత్యతృప్తుఁ డై నఽసత్యయజ్ఞునియెడ, దేవతలును నధికఽతృప్తు లగుచు
రమరతృప్తివలన ఽ నవ్యయానందంబు, సంఘటిల్లుఁజూవె ఽ సంయమీంద్ర. 233

తే. అనిన జాజలి య ట్లనిఽ ననఘ నీవు, కర్మ ముడుగమి కెయ్యది ఽ కారణంబు
మాకు నెఱిఁగింపుమనుటయుఽమహితబోధుఁ, డగుతులాధారుఁ డిట్లనుఽనతనితోడ.

క. ధర్మారాముఁడుసంతత,ధర్మసఖుఁడు నై యసంగఽతానిష్ఠమతిన్
నిర్మలుఁ డగువానికి ని,ష్కర్మత్వానందసిద్ధి ఽ గలుగు మునీంద్రా. 235

ఆ. నగము లెల్లఁ బుణ్యఽనగములు నదు లెల్లఁ, బుణ్యనదులు వినుముఽభూసురాగ్ర
గణ్య [1]యకలుషం బఽకర్దమ మనఁ జాలు,నాత్మతీర్థ మెఱుఁగుఽనకలుషునకు.

క. కారణములవలనఁ గృత,ప్రారంభం బైనకర్మ ఽ మంచితగతికిం
గారణమే కర్తవ్య,త్వారబ్ధక్రియలయట్టు ఽ లనఘచరిత్రా. 237

వ. అని చెప్పి యంత నిలువక. 238

క. విను మంచివారిచే నై,నను నితరులచేతనేని ఽ నాయెఱిఁగినయీ
యను వొప్పదొ మేలో యను,ననుమానము వాపుదమె మఽహాధర్మనిధీ. 239

వ. అప్పని మనచేత నయ్యెడి నీవు దండ్రివోలెం బెనిచిన మరగి నీతో నరుగుదెంచి నీశిరంబుచక్కటిచదలం జేరువం బొలయునిప్పులుఁగులం బిలిచి కరంబుల ధరియించి యుపలాలింపుమా యనుటయు జాజలి వానిం బిలిచిన నవి దివిన నిలిచి యతనితో ని ట్లనియె. 240

చ. మునివర ధర్మదేవత మఽముం బనుపన్ విను నారయంగ వ
చ్చినభటసంఘ మేము విను ఽ చెప్పెద మీసు గలంక పోరితం
బనునివి మత్సరంబు గలఽయట్టిమనంబునఁ బుట్టు హింస వీ
నన జనియించు సంయమిజఽనంబు విమత్సర మైన మే లగున్. 241

తే. స్పర్ధ సద్ధర్మమునకు నాఽశని సుధర్మ,నాశమునఁ జేసి నరుఁడు విఽనష్టభావ
మొందుఁ గావున సంస్పర్ధ ఽ యుడుగవలయు,నిర్మలశ్రద్ధగైకొనిఽనిపుణుఁడనఘ.

క. శ్రద్ధ రవితనయ సాత్త్వికి, బోద్ధవ్యావాప్తి శుభముఁ ఽ బొనరించు మన
శ్శుద్ధిస్వరూప దానిఁ బ్ర,బుద్ధుఁడు వాటించుఁ జూవె ఽ పురుషాత్మికఁ గన్. 243

క. అమరులు విమలశ్రద్ధా,సమేతములు గానితాపఽసత్వముఁ గ్రతుమ
త్త్వముఁ గైకొన రాసువిశే,షము గలిగిన మెత్తు రది ప్రఽశస్తం బనఘా. 244

క. విను మునివర వాగ్వృత్తియు, మనఃప్రవర్తనముఁ గాచు ఽ మహితశ్రద్ధా
ధనసంపద శ్రద్ధ యనం, జనునది జీవాత్మసుప్రఽసన్నత సుమ్మీ. 245

1. చ. యపరుషం.

### తులాధారుఁడు జాజలికిం జెప్పిన బ్రహ్మగీతలు.

వ. అని మఱియు నిట్లను బ్రహ్మగీత లనువాక్యంబు లాకర్ణింపుము. 246

క. యాగంబునందు శ్రద్ధా, యోగము గలయశుచి శ్రద్ధ యొనరనిశుచి ప్ర
త్యాగమసంపదఁ దుల్యులు, గా గణుతించిరి నిరూపకత నమరవరుల్. 247

క. విను మనుజుఁడు శ్రద్ధ యతిపావని యది గలవాఁడు గారవశ్రేష్ఠుం డా
తనియన్నము భోజ్యతరం, బని నిర్దేశించె నెల్లయమరులు వినఁగన్. 248

ఉ. వారక వడ్డి కిచ్చి కుడువ వెర వారినదానశీలు నె
వ్వారికిఁ జేయుఁ జూపక ధ్రువంబుగ లోభగుణంబ పట్టి ని
స్సారత నుండు వేదవిదుసామ్యముఁ జేర్చి రమర్త్యు లందు న
వ్వారిజసూతి దాని యగువాఁ డధికుం డనియెం హవిర్విధిన్. 249

ఆ. దానగుణము శ్రద్ధ లేనివానికి లేదు, గాన యివ్విధమునఁ గమలభవుఁడు
నిశ్చయించె నీవు నిర్మలశ్రద్ధాభి, పూతమతివి గమ్ము పుణ్యచరిత. 250

ఆ. వినుము శ్రద్ధ గలుగుమనుజుండు పాపంబుఁ, దొలఁగఁ ద్రోవ నేర్చుఁ దోలు డిగ్గ
నూడ్వ నెరవు గలుగునురగంబుచాడ్పునఁ, గాన మేలు శ్రద్ధధానుఁ డగుట.

వ. అని వెండియు. 252

ఆ. మత్సరాదిచిత్తమాలిన్యములు శ్రద్ధ, గలమనంబునందు నిలువ నేర
వనినఁ దేటి యిట్లు లనియె జాజలి తులా, ధారుతోడ నిభృతిఁ గౌరవేంద్ర.

క. మునులవలనఁ దత్త్వం బే, విన కుండుటఁ జేసి యిట్టివిధము గలిగె నా
కనఘా నీవాక్యంబుల, మనంబు దెలివొందె శాంతి మరగెద నింకన్. 254

వ. అనిన నభినందించి తులాధారుండు. 255

క. తనతన తెరువునఁ గర్మం, బనుష్ఠితం బైన మేల యనఘ నివృత్తిం
గని శ్రద్ధఁ గూర్పఁగా నే, ర్పెనయంగా వలయు దాని[1]యెడయం దతఁడున్.

ఆ. అట్ల కాక యని ప్రియంబుమై వీడ్కొని, జాజలియును జనియె రాజవర్య
యిహపరముల నెసక మెసఁగ సౌఖ్యము తులా, ధారుఁడును సమున్నతత్వ మొందె.

క. ఆవణిజుఁడు ధర్మస్థితి, దేవతలును మెచ్చునట్లు దెలియఁగఁ బలికెం
నీ వీవాక్యము లన్నిట, భావం బలవఱిచి కసటు వాపుము వత్సా. 258

వ. అని చెప్పినం బ్రమదంబు నొంది. 259

క. సురసరిదాత్మజుతోఁ గురు, నరపాలోత్తముఁడు వినయనమ్రుం డగుచుం
జిరమో కార్యసమీక్ష య, చిరమో వలయునది కరుణఁ జెప్పు మనవుడున్.

వ. అతం డతని కిట్లనియె. 261

క. త్వరితము సేయక కార్యము, చిరంతనవిమర్శనముగఁ జేసి యొనర్పం
ధరణీశ్వర యోటువడఁడు, పురుషుఁడు సిద్ధియును వానిఁ బొందు దృఢముగన్.

1. చ. యెడ నను దతఁడున్.

క. తాలిమి లేనిజనంబులు, మే లెఱుఁగక యట్టివానిమీఁదను బాడ్యం
బాలస్యం బిది యని దో,షాలోచన మాచరింతు రది మతి యగునే. 263

వ. అని చెప్పి వెండియు ని ట్లను నీయడిగినయర్థంబు మేధాతిథి యనుమునిసుతుండు
చిరకారి యనువానివృత్తంబు వినినం దెలియు దానిం జెప్పెద. 264

## చిరకారి యనుమునికుమారునిచరిత్రము.

క. అతఁడు చిరకాలసునిచా,రితంబుగాఁ జేసి యాచరించుం గురుభూ
పతివర్య యెద్దియును నది, కతముగఁ జిరకారినామకంబునఁ బరఁగున్. 265

సీ. విను మొక్కకారణంబున ముని పత్నిపైఁ, గోపించి చంప నక్కొడుకుఁ బనిచి
యెటయేని వెడలి పోవుటయును బను లెల్లఁ, జిరవిచారముతోడఁ జేయుఁగాన
యచ్చిరకారి యి ట్లని విచారించె జ,నకుపంపు సేఁత మానంగ రాదు
తల్లిఁ జంపుటయును దగదు తండ్రితలంపు, దప్పింతుఁ గాక యని తలఁతునేనిఁ

తే. గల్మషం బండ్రు దాని సత్కర్మవిదులు, మాతృరక్షకర్తవ్యమెమ్మాడ్కి నైనఁ
బుత్త్రభావ మస్వాతంత్ర్యమునకు నెలవు, పాప మడఁగింప నెవ్వలనోపునొక్కొ.

క. జననీవధంబు సేసిన, ననుమానమె నరక మగుట యని యుడిగితిఁ బో
జనకావమాన మొనరిం,చినవానికి నరకమున వసింపఁగ వలదే. 267

తే. తల్లి [1]భర్త్రిక బీజంబు తండ్రి వెట్టు, వంశధరణార్థముగ నిది వారిభంగి
యేను బొత్తులవాఁడ నయ్యిరువురకును, వీరలం దిప్పు డెవ్వరి విడుచువాఁడ.

వ. అని విచారించి తలంచుకొని. 269

క. జనకుఁడ యే నై జన్మిం,చినవాఁడను జనకుపంపు సేసినఁ బాయుం
దనయునిపాపము లనియును, విని యుండుదుఁ దలఁపు లింక వేయును నేలా.

క. జనకుఁడు దపమును ధర్మం,బును విద్యయుఁ బరమదైవమును గావున నా
తనికిఁ బ్రియం బగుపని సే,సిన దేవత లెల్లఁ బ్రీతిఁ జెందుట గల్గున్. 271

వ. అని వితర్కించియుఁ దల్లి తెఱంగుఁ దలంచి. 272

చ. కరచరణాదిసంఘటితకాయము సంజననంబు వహ్నిపు
ట్టరణికిఁబోలెఁ దల్లిదెస నైనది గాదొకో యట్లుఁ గాక దు
ర్భర మగుగర్భఖేదమును బట్టికినై నిజదేహచింతపై
భర మొకయింత లేక పడుపాటులు నక్కట యెక్కు [2]డింతకున్. 273

ఆ. వచ్చి పోయి చూచువాఁడు గా కిడుమలఁ, బడునె తల్లివోలెఁ బట్టితోడఁ
దండ్రి చెప్పు నిట్లు ధర్మశాస్త్రంబులు, నంబ గౌరవమున నధిక యగుట.

ఆ. బాలుఁడైనఁ గొడుకు ప్రౌఢుఁడైనను వృద్ధుఁ,డైన నొక్కవిధమ యర్మిలియును
నరయుభరముఁ దల్లి కాపదార్థంబు జ,గంబుకలిమి కెల్లఁ గారణంబు. 275

ఆ. క్షుద్రజంతువులకు గురులకు నెమ్మెయిఁ, దలఁప నొక్కరూప తల్లి వలయు

---

1. గ. ధాత్రిగ; జ. ధాత్రిక. 2. డెంతయున్.

నూఱడిల్లఁగలదె యొండుపోటుల సువస్తువు నివాస మైనచోటఁ గాక. 276

క. అప్పుడ యసమర్థుం డగు, నప్పుడ దుఃఖి యగు శూన్యుఁ డై తోఁచు జగం
బప్పుడ మాతృవియోగం, బెప్పుడు వాటిల్లె నపుడ యెంతయుఁ దూలున్.

క. కలవాఁడు లేనివాఁడు స,బలుఁ డబలుఁడు మూఢబుద్ధి ప్రాజ్ఞుం డనఁగా
వల దెవ్వరి కైన జనని,కలిమియ యత్యంతసౌఖ్యకర మై యుండున్. 278

తే. ఇట్టిజనని వధించుట యెల్లభంగి, నధికపాపపయోరాశి యందు ముంచు
దీని నెఱుఁగండె పసులవాఁ డైన వధకు, నేల తెంపు వాటిలఁ జేతు లెట్టులాడు.

వ. అని యిట్లు పెక్కుభంగుల నూహించుచుఁ జిరకారి యగుట నతండు శీఘ్రకారి
గాక యుండం దడ వెంతయేనియుం గలిగె నంతకుం దదీయజనకుండు. 280

క. వెడపనికి నాలిఁ జంపం, గొడుకుఁ బనిచి వచ్చినాఁడఁ గ్రూరత్వమునం
గడవంబడునొక్కొ పని యని, కడువెసఁ జనుదెంచె నశ్రుకణములు దొరఁగన్.

వ. అట్లు సనుదెంచునప్పుడు. 282

క. చిరకారి [1]యెట్లునుం దన, చిరకారితఁ జూపుఁ గాక శీఘ్రపుఁజేఁతన్
దురటిల్లఁ జేయునే నను, వెరవరి వాఁ డిట్టిపనికి వేగిరపడునే. 283

వ. అని పుత్త్రు నుద్దేశించి. 284

చ. చిరముగ గర్భవాసమునఁ జెందితి పుత్త్ర చిరంబు గాఁగ ని
న్నరసెఁ గదయ్య తల్లి యనయంబును నేఁ బనుపంగఁ బూనియుం
జిర మగునట్టియి త్తెఱఁగు సేఁత దలంచితయేని సత్కృపా
పర చిరకారి నాఁ బరఁగు భాసితనామము సార్థకం బగున్. 285

ఆ. నాకు నాతపంబునకు నింద రాకుండ, దురితభయము నిన్నుఁ బొరయకుండ
నెమ్మిఁ జేసి తన్ను నీచిరకారిత, సకలభూతములును సంస్తుతింప. 286

వ. అనుచుం జనుదెంచి నివాసంబు ప్రవేశించినం గని చిరకారి నిజకరంబున నున్న
వధసాధనంబు డిగ్గ విడిచి యగ్గౌతమవంశవర్యుచరణంబులు శిరంబు సోఁకఁ బ్రణా
మంబు సేసెం బత్నియుం జాఁగి మ్రొక్కె నయ్యిరువుర నెత్తి శోకబాష్పంబు
లానందాశ్రువులు గా నమ్మునివరుండు దనయుని గాఢాలింగనంబును [2]మూర్ధ
ఘ్రాణంబునుం జేసి దీవనలం బొగ్గడల నభినందించి తానును వారును సుఖాసీనుఁ
డై యుండి యిట్లనియె. 287

క. కార్యవిచారము చిరముగ, ధైర్యముతో నడప వలయుఁ దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁ డని, యార్యులు సేయుదురు నిశ్చయమును [3]జిరముగన్.

క. మిత్త్రత్వము శత్త్రుత్వముఁ, బాత్త్రతయు నపాత్త్రతయును బరికించు సుచా
రిత్త్రుఁడు చిరతరగణనా,సూత్త్రితముగ దాన నెల్లశుభములు నొందున్. 289

వ. అని నిర్దేశించె నట్లు చిరకారి చిరకారిత్వంబు సఫలత్వంబు నొంది వినుతిం బొందె.

1. జ. యెప్పుడుం. 2. క. మూర్ధఘ్రాణంబు. 3. చ. దిరముగన్.

క. కావునఁ గురువంశోత్తమ, నీవును సదసత్ప్రకారఽనిశ్చయము చిరం
బై వఱలఁ జేయుమీ యది, గావించుం జిరము లైనఽకార్యఫలములన్. 291

క. విను మచిరవృత్తిఁ జేసిన, పని కర్తకు నావహించుఁ ఽ బశ్చాత్తాపం
బనఘా చిరభావిత శు, ద్ధనిరూపణకృతము శుభముఁ ఽ దేజముఁ దెచ్చున్. 292

వ. అనిన విని ధర్మపుత్త్రుండు ప్రజల శిక్షించువెర వెట్టి దని యడిగిన నాపగానం దనుండు దొల్లి ద్యుమత్సేనుం డనురాజునకు నిజతనూజుం డగుసత్యవంతుతోడ సంవాదంబు గలిగె నది నీయడిగినయర్థంబునకుం బ్రకాశకం బగుఁ జెప్పెద నాక ర్ణింపుము వా రిద్దఱుం బ్రజాశిక్షఁ దెఱంగు మాట లాడుసమయంబున. 293

సీ. వధము ధర్మంబుగాఽబుధులు సెప్పుదు రని, యనుశాసనము సేయుఽజనకుతోడ
సత్యవంతుఁడు హింస ఽ కృత్యకర్మం బగు, నేని నకృత్య మిం ఽ కేది యనుడు
మ్రుచ్చులు ప్రల్లదుల్ఽనచ్చువారల యట్లు, గాకున్న [1]బాధలు ఽ లోకమునకుఁ
బుట్టవె యనిన నఽభూపతి యమ్మాట, కతఁడు సంపుట దక్క ఽ నన్యదండ

తే. విధిన శిక్ష సెల్లించుట ఽ వెరవుగాదె, నావుడును బతి యట్లేల ఽ నడచు దృష్టి
దండవాగ్దండధనదండఽతనువికార, దండములు సేయునది తప్పఽ[1]దర మెఱింగి.

క. విను చంపఁ దగినతప్పున, కనఘా చంపుటయు వలయు ఽ నాప్తుఁడు బంధుం
డనుజుఁడు తనుజుఁడు నను మ, న్ననయును దుష్టునెడ రాజుఽనకుఁ బాప మగున్.

తే. తాను మున్ను వినీతుఁ డై ఽ తనదుమంత్రి
వరులఁ బుత్త్రుల భృత్యుల ఽ వరుసతోడ
వినయవంతులఁ జేసి భూఽవిభుఁడు ప్రజకు
రక్షణము సేయ నిహముఁ బరంబుఁ గల్గు. 296

క. దోష మరసి కామంబును, రోషంబును లేక తగినఽరూపునఁ జేయం
బోషక మగుధర్మమునకు, వైషమ్యవిహీన మైనఽవధము కుమారా. 297

క. చంపఁగఁ జూచియు లోభము, పెంపునఁ గ్రోధమునఁ గామఽపీడను మది శం
కింపక దుష్టులు గీడొన, రింపఁగఁ జూడమె కలంక ఽ రేఁగు సహింపన్. 298

ఆ. విను మహింస విప్రఽజనులకు నెల్లభం, గులను వలయుఁ బ్రజలఽవలనఁ గరుణ
గలిగి వారిఁ గీడు ఽ గదురక యుండంగఁ, గాపు పతి కహింసఽకత్వ మనఘ. 299

## కపిలగోసంవాదప్రకారము.

వ. అనియె నని చెప్పిన విని యజాతశత్రుండు తాతతో నవశ్యకర్తవ్యంబు గృహస్థ ధర్మంబో పరిత్యాగంబో నిరూపించి చెప్పవే యనిన నతండు రెండును మానసీ యధర్మంబుల కపిలగోసంవాదం బను నితిహాసంబు వినుము దాన నీవితర్కంబు వినిశ్చయదశం బొందు నని పలికి యిట్లనుఁ గపిలుం డనుసంయమిసత్తముం డుత్త మాకృతియు భీతిరహితయు నహుషసంభావితయు నగునొక్కగోవుం గాంచి నీవు

[1]. క. సాధులు. 2. గ. తల మెఱింగి; జ. దల యెఱింగి.

వేదస్వరూపవుగా వే యని పలికె నమ్మాట వేదంబులవలనియాదరంబు లేమింజేసి వెడలినదిగా నూహించి యప్పుడు గెలన నున్న స్యూమరశ్మి యనుముని సూక్ష్మ రూపంబున నగ్గోవునందుఁ బ్రవేశించి. 300

క. వేదములు డాంబికత్వా, పాదనములు గాఁగ యతులు ♦ వలుకుదు రవి స
ర్వాదరణీయంబులు నీ, కాదరపాత్రములు గావొ ♦ యని పలుకుటయున్. 301

వ. అగ్గోవున కతం డి ట్లనియె. 302

క. వేదములవలన నాకు న, నాదరమును నాదరమ్ము ♦ ననురెంటను లే
వేది కతంబుగ నడిగితొ, నీదుతలం పెఱుఁగునట్టి ♦ నేరిమి గలదే. 303

వ. అయినను నాయెఱింగినంత సెప్పెద నాకర్ణింపుము. బ్రహ్మచర్య గృహస్థధర్మ వానప్రస్థవృత్తి పరివ్రజనంబు లనునాలుగాశ్రమంబులును దేవయానంబులయ త్తెరువుల నడచుట సంసారులకుం గర్తవ్యంబు గావున. 304

క. వారలకు వేదవిహితా, చారంబులు వలయునది ప్రశస్తము హింసా
ప్రారంభ మాచరించుట, యారయఁగా మేలొ కీడొ ♦ యంచితమూర్తీ. 305

వ. అనుటయు స్యూమరశ్మి యతని కి ట్లనియె. 306

క. అలఘుమతిని యజ్ఞార్థం, బులుగాఁ బశువులను ధాన్యములఁ గల్పించెన్
జలజభవుం డది గాకయుఁ, దలఁకొని యజ్ఞంబు లతఁడు ♦ దాఁ జేయఁడొకో.

క. విను మజ్జునకును బ్రాజ్ఞున, కును గలయది దివ్యసుఖము ♦ గోరుట దివ్య
త్వనిరూఢి యాగకరణం, బునఁ దక్కఁగ నొంటఁ గలుగఁబోలునె చెపుమా.

క. అమలినగృహస్థధర్మో, త్తమముం గల్మషహరంబు ♦ దైవతసంభా
వ్యమ్ము నైనయజ్ఞకర్తృ, త్వము మునివర హింస గాఁగఁ ♦ దలఁపం దగునే.

చ. అనుటయు ని ట్లనుం గపిలుఁ ♦ డాత్మసుఖైకపరాయణుండు మె
చ్చునె పెఱసౌఖ్యకోటి గతశోకుఁ డకాముఁ డసంగశీలుఁ డా
తని కవి యెల్ల నేటికి మరదప్రదలోకము లొల్లమిన్ సనా
తన మగుమోక్షముం గొఱలి ♦ తా విడుచున్ గృహధర్మవర్గమున్. 310

వ. అనిన విని స్యూమరశ్మి యాసిద్ధప్రవరున కి ట్లనియె. 311

ఆ. ప్రజలు దల్లిఁ జెందుపగిది గృహస్థధ, ర్మంబు నెల్లయాశ్రమములుఁ జేరి
కాదె జీవనంబుగావించుకొను గృహ, యుక్తుఁ డోషధులకు ♦ నొడయుఁడగుట.

క. విను మోక్షము గార్హస్థ్యం, బునఁ గాదని యెన్నఁ డెచటఁ ♦ బురుషుం డెవ్వం
డు నిరూపించి పలికె స, ర్వనిధానము గృహము వేదవాక్యఫలజ్ఞా. 313

క. అలసులు ధనహీనులు నై, సొలసి క్రియలు విడుతు రది విరసూత్రత దానం
గలదే సద్గతి వేదం, బులు విడిచి [1]యఘుంబుపరతఁ ♦ బోవరె తండ్రీ. 314

క. విదితము గర్భాధానము, మొదలుగ శ్రుతికలితమంత్రములు నిర్మలసం

1. చ. యఘుంబు వఱుత.

పద లెల్లను బ్రాహ్మణునకు, నొదవించుట దగునె శ్రుతుల నొల్లక యుండన్.

ఆ. అనిసఁ గపిలుఁ డిట్టు లని వివరించు నా,చారములను దేవసమితి నెల్ల
భూమిసురులు దృష్టిఁ బొందింతు రమృత మా,నంగఁ బ్రీతి నిచ్చు భంగి యొలయ.

వ. అది యట్లుండె వినుము చెప్పెద. 317

క. పాణి యుపస్థం బుదరము, వాణి యనఁగ మూఁయ రాని వాకిళ్లివి గీ
ర్వాణులకు వీని బుధుఁడు పు,రాణపురుషరక్షకై తిరంబుగ మూయున్. 318

తే. పుచ్చికొనఁడు ముందటఁ బైఁడి ప్రోక యున్న
నలుక వొడమియుఁ బొడువను నడువఁ దొడఁగఁ
డట్టియానైష్ఠికుని చేత నడఁగ కున్నె
పాణి యని యెడు వాకిలి బంధురముగ. 319

క. ఏవిధము కాంత నైనం, దా విహరణమునకు నెపుడుఁ దార్పఁడు తనయం
దావిష్టము భార్యావ్రత, మావెర వడ్డం బుపస్థ మను వాకిటికిన్. 320

క. తనుయాత్రకుఁ గా నశనము, గొనుఁ బూర్ణముగాఁ గొనండు గోరఁడు లౌల్యం
బున రానిదాని నమ్మెయి, ముని యుదరద్వార మోపి మూసెన కాదే. 321

క. పలుకఁ డసత్యము దూఱం, బలుకఁడు బెట్టిదము గాఁగఁ బలుకఁడు వాదం
బులకుఁ జొరఁడు వాణి యనం, గల వాకిలి యట్టి బుధుఁడు గప్పం జాలున్.

తే. ద్వారములు నాల్గు మూయంగ దక్షుఁ డైన
వాఁడ చూవె బ్రాహ్మణుఁ డట్టి వాని కేల
తపములును యజనంబులు దానములును
వ్రతములును వేదకింకరత్వంబు దొడఁకు. 323

తే. ద్వంద్వములు లేక పేర్మికి వ్రస్సి పడక
ప్రకృతివికృతులఁ గనుచుండు బ్రాహ్మణత్వ
శాలి యాసదాచారంబు సలుప లేని
వాఁడు ఫలకాంక్షి యై కర్మవశతఁ బొందు. 324

వ. అని నిర్దేశించిన గోవునం దడంగి యునికి దక్కి సన్నిహితుండై స్యూమరశ్మి తన
పేరు సెప్పి యేను ధర్మనిర్ణయం బెఱింగికొన వలసి గోవిలీనుండనై పలుకుచుం
డితిఁ గాని యొండు గాదు మహాత్మా నిన్నాశ్రయించితి వేదంబులు ప్రమాణం
బు లగుట యాఁది వర్ణాశ్రమవిహితాచారంబులు నడపుటయుం బరిత్యాగంబు
నుం గల దెయ్యది యత్యంతవిధేయంబు సువ్యక్తంబుగా నెఱింగింపవే నీవు ధర్మ
సూక్ష్మత్వదర్శి వేను శుశ్రూషకుండ నన్ను శాసింపు మనవుడుఁ గపిలుండు
ప్రీతుం డై యతని కిట్లనియె. 325

క. జ్ఞానంబు నాశ్రయించిన, వానికి నేపనులఁ గీడు వాటిల్లదు ప్ర
జ్ఞానరహితుండు కామా, ధీనత మెయిఁ గర్మసమితిఁ ద్రిప్పువఁ జిక్కున్. 326

క. అనహంకారుఁడు నక్రో,ధనుఁడు నతృష్ణుండు నైనతఁడు శుభ మశుభం
బనుభేదముఁ బొరయఁడు విడు,వున సమతాసుఖమయత్వముం గనుచుండున్.
క. విను మెఱుక గలర మీ రెల్లను నేకాత్మత్వసిద్ధిలాభం బొందే
ని నొకని కలవడు నాతం, డనుమానింపఁ డఖిలక్రియలుఁ బోఁ ద్రోచున్. 328
వ. అనిన విని స్యూమరశ్మి యమ్మునివరున కి ట్లనియె. 329
ఆ. వేదశాస్త్రసరణి విడుచు టున్మార్గవ,ర్తనము మోక్షపదము రాదు దాన
ననఁగ విందు నంచితాత్మ వేదంబులం, గైకొనమియు కీడు నాకుఁ జూడ. 330
వ. నామనంబుసందియంబుఁ బాపవే యనినం గపిలుం డమ్మహాద్విజునితో వేదం
బుల నేలకైకొన కుండ వచ్చు నవియ చూవె లోకంబులకుం బ్రమాణంబు లని
పలికి యి ట్లనియె. 331

కపిలుఁడు స్యూమరశ్మికి వేదంబులు ముఖ్యప్రమాణంబులుగాఁ జెప్పుట.

క. అరయంగా శబ్దంబును, బరంబు నన రెండు సూవె బ్రహ్మములు గుణో
త్తర శబ్దబ్రహ్మాభజన,పరుఁడు పరబ్రహ్మమహితపదముం బొందున్. 332
క. మనమున నెద్దియుఁ గోరం, డనసూయయు శమము దమము నతులజ్ఞానం
బును గలగృహపతి ధర్మం, బని నడపును వేదచోదితాచారములన్. 333
క. భూతదయయు ననహంకా,రాతిశయముఁ గలుగువిమలుఁ డప్రాయశ్చి
త్తాతురుఁడు సూవె విధులు సు,నీతము లైనను దృఢాత్మనిష్ఠకతమునన్. 334
క. విను శాంతు లైనవిప్రులు, మనుజేంద్రులు గృహమునందు మహితవ్రతసం
జనితపరిజ్ఞాననిరం,జను లై పడయుదురు సూవె శాశ్వతపదమున్. 335
తే. బ్రహ్మచర్యాదు లగునాల్గుఁ బాదమహిమ
గాఁగఁ బరఁగెడుధర్మ మొక్కటియ చూవె
యెవ్వఁ డెందు వర్తించిన నేమి సకల
కర్మఫలరూపకత్వ మొక్కటియ కాదె. 336
క. సంతోషామృతసుఖిత,స్వాంతుం డగు నేని నట్టివాఁడు గృహంబుం
గాంతార దేశమును నొ,క్కంతగ నిశ్చింతవృత్తి నక్షోభ్యుఁ డగున్. 337
క. విను తృష్ణారాహిత్యం,బున నాలవునాశ్రమంబుఁ బొందుదురు మహా
జను లది యుపనిషదుక్తం, బనక యవైదిక మనంగ నగునే నీకున్. 338
క. జ్ఞానము ధర్మమున కధి,ష్ఠానము మూలంబు పరమసంతోషము భ
వ్యానూనత్యాగము రూ,పానందము ప్రాఁకు దాని కను వేదంబుల్. 339
క. ఏదియుఁ దలఁప నసేవ్యము, గా దాశ్రమసమితిలోనఁ గావున శుచు లై
యేదాన నున్న సంసా,రోదధియాదరికిఁ బోవ నోపుదురు బుధుల్. 340
క. సంతోషంబున నేగతి, శాంతాత్మున కొదవు దాని సద్గతిగా వే
దాంతవిదులు గొనియాడుదు, రింత నిజము దీని నీవు నెఱుఁగు మనింద్యా.

తే. వేదతాత్పర్య మారసి వేదితవ్య, మెఱుఁగువారలు వేదజ్ఞు లిట్లు గాని
వారు వేదపాఠకులు సర్వంబు నరయ, వేదపరినిష్ఠితము సూవె విప్రవర్య.

క. త్యాగ మొక నెలవు శమసం, యోగం బుత్తరము దాని కూర్ధ్వము సంతో
షాగమము మోక్షలాభో, ద్యోగికి నివి గమ్యభూము లుత్తమధిషణా. 343

వ. అని యి ట్లుపదేశించి. 344

సీ. వేదితవ్యం బన విదితంబు నా ఋతం, బనఁగ సత్యం బన నతిశయిల్లి
సంభృతస్థావరజంగమం బనఁగ స, ర్వాత్మకం బన శుభం బనఁగ వెలసి
యవ్యక్త మనఁగ బ్రహ్మంబు నా నుత్తర, మనఁగ శివం బన వినుతి కెక్కి
ప్రభవం బనంగ నవ్యయ మన శాంతి నాఁ, దేజంబు నా నెందుఁ దేజరిల్లి

తే. క్షమ యనఁగ నంబరం బనఁగా ధ్రువంబు, నా ననామయ మన నొప్పి లీనరూప
బుద్ధిసంప్రాప్య మగుతత్త్వమునకు వేద, మానితబ్రాహ్మణులకు నమస్కరింతు.

వ. అని పలుకుటయు స్యూమరశ్మి ప్రీతుం డగుచుఁ గపిలునిం బ్రశంసించె నియ్యి
తిహాసంబుతాత్పర్యంబు నీవుం గనికొను మని చెప్పినం దద్దయుఁ బ్రియం బంది
ధర్మనందనుండు ధర్మార్థకామంబులు మూఁడును వేదశంసితంబులు వీనిలో నెద్దా
నిలాభంబున విశేషంబు గలిగి యుండు నెఱింగింపవే యనిన గాంగేయుండు కుం
డధారుం డనువాఁడు నిజభక్తున కుపకారంబు సేసిన ప్రకారం బితిహాసరూపం
బునం బ్రవర్తిల్లు నది భవత్ప్రశ్నంబునకు నుత్తరం బై యుండు వినుము చెప్పెద
నని యప్పుడమితేని కి ట్లనియె. 346

కుండధారుం డనుదేవానుచరునివృత్తాంతము.

సీ. యజ్ఞార్థ మొక్కబ్రాహ్మణుఁడు ధనార్థియై, తపము సేయఁగఁ గుండధారుఁ డనఁగఁ
బరఁగెడు దేవానుచరుఁ డచ్చటికి వచ్చి, యభిలాష మేరూప మనుడు నర్థ
సిద్ధిఁ గోరెద నని చెప్పినఁ బ్రీతి నా, తఁడు మాణిభద్రుని ధనదభృత్యు
నియతిఁ దలంప సన్నిధి సేసె నయ్యక్షుఁ, డతఁడు మదాశ్రితుం డైనయితని

తే. ధనసమగ్రునిఁ జేయవే యనిన నెంత, ధనము వలసిన నిచ్చెద నని మాణి
భద్రుఁ డమ్మహాత్ముఁడు మర్త్యభావ మస్థి, రత్వదూషిత మనువిచారంబు వుట్టి.

క. ధన మేటికి నీవిప్రుని, మన మొలయఁగ వలయు ధర్మమార్గంబున దా
నన సర్వసంపదలు నగు, నని నిశ్చయ మొంది వినయ మతిశయ మందన్.

ఆ. యక్షవరునితోడ నవ్విచారము మృదు, వచనరచనఁ జెప్ప వాఁడు దాని
కాత్మఁ బ్రీతిఁ బొంది యనుమతి సేయంగ, నధికభక్తినిరతుఁ డై యతండు.

క. దేవతలను బ్రార్థించిన, నావసుధామరునిచిత్త మాప్రొద్ద తప
స్సేవనతత్పర మగుడు, న్దేవానుచరునకు ని ట్లనియె నతఁ డధిపా. 350

క. అనఘా భవదీయదయ, న్మనంబు దెలి వొందె నిపుడు నా కే నొల్లన్
ధనము తపంబ యొనర్పఁగ, ననుజ్ఞ సేయంగ వలయు నాదరణమునన్. 351

ఆ. అనిన నట్లు కాక యాచరింపుము ధర్మ, మనుచు నరిగె నిర్జరానుచరుఁడు
భూసురుండు మూలములును బత్త్రములు నా,హారములుగఁ జేసె నధికతపము.

క. క్రమమున జలపవనము లశ,నములుగఁ గొని తపము సేసి నం గాయముఁ జి
త్తము మానుషంబు లగుచుం,దములు విడిచి దివ్యమహిమధామము లయ్యెన్.

వ. అట్లు సిద్ధుం డగుటయు. 354

క. నను నెవ్వ రాశ్రయించిన, ధన మొసఁగుదు రాజ్య మిత్తుఁ దద్దురితములం
దునుముదు ననునగ్గలికలు, మనమున జనియింపఁ జొచ్చె మనుజాధీశా. 355

వ. అవ్విధంబున మహానుభావుం డై. 356

తే. అతఁ డతిభక్తిఁ దలఁచె దేవానుచరుని, నపుడ యక్కుండధారుఁడు నరుగుదెంచె
నరుగుదెంచిన నతఁడు నిజానుభావ,జనితగంధపుష్పములఁ బూజన మొనర్చె.

ఉ. చక్కఁగఁ జాఁగి మ్రొక్కుటయుఁ జయ్యన నెత్తి మనం బెలర్పఁగా
నక్కున నం జేర్చి యి ట్లనియె నద్దివిజానుచరుండు శంక దాఁ
దక్కి ధనంబుఁ గామమును ధర్మముతోఁ గలయంగ నెన్ను నే
యక్కట యిట్లు వేద మని యప్పురుషార్థము [1]నోలి మే లగున్. 358

వ. అని ధర్మం బగ్గించి. 359

క. [2]అసుకృతము గడ మెద్దియు మ,హాసత్త్వా యోగసేవనారామత ను
ద్భాసితుఁడ వగుచు [3]నిష్ఠా,వ్యాసంగవిహారి వగు మనామయలీలన్. 360

క. అని యతఁడు నిజనివాసం,బున కరిగెను విప్రవరుఁడు మునిజనములు పూ
జనము లొనరింప ఖేచరు, లనుమోదింప విహరించె నప్రతిహతుఁ డై. 361

## నారదప్రవర్తితం బగునితిహాసము.

వ. అని చెప్పి యప్పురుషవరుం డప్పాండవాగ్రజుతో వెండియు నిట్లను నొక్కధర్మ సూక్ష్మత సెప్పెద నాకర్ణింపు ముంఛవృత్తి యగువిప్రుం డొక్కరుండు భార్యా సహితుం డై వనంబున నుండి యజ్ఞాచరణంబునకుం దొడంగి యహింసాపరుం డగుటం బశువిధి యుడిగి ఫలమూలంబుల హవిస్తంత్రంబు నడపం జూచె నది విహితాచారంబు గామి యెఱింగియు శాపభయంబునం దత్పత్ని యమ్మహీసుర వరు నెదుర నిలిచియుం బలుకకుండెఁ బాకశాసనాదులు హవిర్భాగంబులు గొనం గడంగమి నగ్నియుం బచనశక్తిం దొఱంగె నట్టియెడ నాసమీపంబునం దిరుగు హరిణంబు మనుష్యవచనంబులం దత్పత్ని దూఱి యమ్మహీసురవరు నెదుర నిలిచి తన్ను హింసించి యాగంబు సెల్లింపు మనిన నతం డట్లు సేయం బొమ్మనవుడుఁ గొన్ని యడుగులు వోయి మగిడి యాకృష్ణమృగంబు నాయిచ్చు దివ్యదృష్టిం గనుం గొను మేను జెప్పినట్లు సేసిన నిన్నభినందించువారై యప్సరసకాంతలును గంధర్వులును వీరె విమానంబుల నేతెంచినవా రనుటయు నవ్విప్రుండు విలోకించి

1. గ. నోఁద. 2. జ. నాసుకృతము. 3. గ. నిష్ఠవ్యాసంగ.

దివ్యత్వసిద్ధికై దాని హింసించువాఁడగుటయు దానం దదీయతపంబునకు నుత్పా
తంబులు పుట్టె నేణరూపంబున వర్తించునాధర్మదేవత యాభూదేవునకు సన్నిధి
సేసి నీయజ్ఞశ్రద్ధకు సంతోషించి ధర్మసూక్ష్మత్వంబు దెలుప వచ్చితి నర్హంబగు
హింసావిశేషం బహింసావ్రతహానిం జేయదు క్రతువుగదా యని యనర్హహింస
కర్తవ్యంబు గా దని నిర్దేశించి తత్పత్నీసమాధానంబునం దపశ్శక్తిప్రత్యాసత్తి
యుం జేసి యాగవిశేషవిధానంబు వరప్రదానంబున నిర్వహించె నయ్యితిహాసం
బు నారదప్రవర్తితం బని చెప్పిన నప్పుడమిఱేఁడు ప్రీతుం డై. 362

భీష్ముఁడు ధర్మజునకు ముక్తిమార్గము దెల్పుట.

క. పురుషుం డేమిటఁ బాపా,చరణమునకుఁ జొచ్చు ధర్మచర్యకు మూలం
బరయఁగ నెయ్యది రెంటిం, బొరయం డెద్దాన నెట్లు వొందును ముక్తిన్.
వ. అని యడిగిన నతనికి భీష్ముం డిట్లనియె. 364
సీ. గంధరసాదులకాంక్ష లోభము మోహ,మును దెచ్చు సద్దోషములకు మనసు
లోనైన ధర్మవిలోపంబు వాటిల్లు, దానఁ బాపము సేయుతలఁపు లొదవుఁ
బ్రజ్ఞ నక్కీడులు భావించి సద్గోష్ఠిఁ, బరఁగంగ విషయతత్పరత మాను
నది ధర్మబుద్ధికి నాలవాలం బగు, ధర్మాచరణములఁ దనివి సనక
తే. హృద్గతద్వంద్వముల నెల్ల నెడల [1]విడుచు
ననఘ యనపాయ మగునుపాయమున ముక్తి
వడయుఁ బదపడి యేను నీయడిగినంత
వట్టు దెలిపితి ధర్మనిర్వాహి వగుము. 365
తే. అనుడు ననపాయ మగునుపాయం బనంగఁ
జెప్పి తొక్కటి మోక్షంబుఁ జెందు తెఱఁగు
దానిఁ దెలియంగ నెఱిఁగింపవే నరేంద్ర
ముఖ్య యనియె నక్కురువంశముఖ్యుఁ డధిప. 366
వ. అనుటయు నమ్మహీకాంతునకు శాంతనవుం డిట్లనియె. 367
క. వినుము ఘటము సేయుట సా,ధనములు లేకున్న నగునె ధరణిప పూర్వాం
బునిధికిఁ జనుమార్గ మపర,వనరాశికిఁ జనునె [2]పెరవు వలయుం దెలియన్.
వ. అడిగి మేలు సేసి తాకర్ణింపుము. 369
సీ. క్షమఁ గ్రోధ మకృతసంకల్పతఁ గామంబు, చిరనిద్ర సత్త్వసంసేవనమున
గాఢధైర్యమున రాగద్వేషములు భయ,మప్రమాదమున మోహంబు భ్రమము
వినివర్తనాభ్యాసమున రోగములు నుప,ద్రవములు హితము మితంబుఁ గాల
యోజితంబును నగుభోజనంబున జీవ,సందర్శనమున నిశ్శ్వాస మఖిల
తే. విషయములు నంతవిరసతావేక్షణమున,నిత్యసంతోషమున లోభనిరతి కృపన

ధర్మ మచితకృతావేక్షధర్మమవులఁ, ద్రోవనేర్చుట ముక్తికిఁ ద్రోవ యధిప.
తే. తానుగ్రోధాదు లెడలించుఁగానిముక్తి, దెచ్చియీదొకభంగిముక్తికిఁబథంబు
నగుట ననపాయ మగునుపాయం బనంగ,వలసె [1]సీ నేర్పు పేరిమిని వంశవర్య.
చ. అనుడు నజాతశత్రుఁ డిటు లన్నలుఁ దమ్ములు లోను గాఁగఁ దృ
ష్ణ నఖిలబంధుకోటులను జంపెడు తెం పొలసెఁ మహాత్మ యే
యనువునఁ దృష్ణ త్రోపు వడు నట్టిసమంచితచిత్తధర్మముం
బనుబఱుపంగఁ జాలుకలభాషణపంక్తి ననుగ్రహింపవే. 372
క. అనుటయు దేవవ్రతుఁ డ,మ్మనుజపతికి నిట్టు లనియె మాండవ్యునితో
జనకుఁడు సెప్పినమాటలు, విను మవి తృష్ణ నడఁగించు వెరవు నొనర్చున్.373

జనకరాజమాండవ్యమహామునుల సంవాదప్రకారము.

వ. జనకునికడకు మాండవ్యుండు వచ్చి వితృష్ణత్వశిక్షఁ గోరిన నమ్మేదినీశ్వరుం డా
దరభరితుం డై. 374
సీ. అర్థముల్ దుఃఖదోషాకరంబులు విను, మేమిటిపై నాశ లేమిఁ జేసి
పొరయవు నను దుఃఖములు మునినాయక,మిథిల గాలంగ నేమియును నాకుఁ
గాలనియ ట్లుండెఁ గామసుఖంబును, దివ్యసుఖంబును దృష్ణ విడుచు
సుఖముఁ బోలునె యర్థసులభతతోడన, గోవృతోఁ బెరిఁగెడుకొమ్ములట్లు
తే. తృష్ణదానును బెరుఁగుఁ దదీయసక్త,మమత గలుగు మాబంధులుమాధనములు
మానివాసంబు లనమి మమత్వ మెదఁ ది,రంబుగాకున్న నింకుఁదృష్ణాంబురాశి.
క. దొరకొన్న ననుభవించుచు, దొరకొనమికిఁ జింత నొంది దురపిల్లక ని
ర్భరుఁ డై యున్నను దృష్ణకుఁ, జొర వచ్చునె యతనిమనసు సువ్రతశీలా. 376
తే. విడువరాదు దుర్మతులకు నొడలు ముదియఁ
దాను ముదియదు ప్రాణాంత మైనరోగ
మనఘ తృష్ణ వర్జితకాముఁ డై నతండు
దానిఁ బోఁద్రోచి సౌఖ్యసాంద్రత్వ మొందు. 377
క. శోకప్రముదాదిద్వం,ద్వాకులుఁడవు గాక శాంతి నంతఃకరణ
శ్రీకిఁ బరిరక్ష సేయుము, నీకు వితృష్ణత్వసౌఖ్య[2]నిత్యత గలుగున్. 378
క. అని చెప్పిన నమ్ముని య,మ్మనుజపతిం బ్రస్తుతించి మనము ప్రశాంతిం
బనుపడఁగఁ బ్రీతి వీడ్కొని, చని వర్తిల్లెను వితృష్ణసరణిఁ గుమారా. 379

పితాపుత్రసంవాదము.

వ. అనిన విని ధర్మనందనుండు శంతనునందనుతో సర్వభూతభయావహం బగుచుం
గాలం బతిక్రమించు చుండఁ బురుషుం డెద్ది యాచరించుట మేలు దీని మున్ను
నడిగి విన్నవాఁడ నిది పెద్దయు విన వలయునది గావున నడిగెదం జెప్పవే యను

1. చ. నీనేర్పు నెఱిఁ గురువంశ. 2. గ. నిష్ఠత.

టయు నమ్మహాత్ముం డీయర్థంబు దెలియుటకు ముంద రేను జెప్పినపితాపుత్త్రసంవా
దం బనునితిహాసంబు లెస్స యందుఁ గొన్నివాక్యంబు లప్పుడు సెప్పనియవి
యునుం గలవు చెప్పెద విను మధ్యయనపరుం డగునొక్కబ్రాహ్మణపుత్త్రుం డన్వ
ర్థనామధేయుండు మేధావి యనువాఁడు దండ్రి కభిముఖుం డై. 380

సీ. ఆయువు దఱుఁగునం।తంతకు ధీరుఁ డై,య్యాది సేయువాఁ డన్న।నతఁడు బ్రహ్మ
చర్యంబు వేదాభ్య।సనమును సంతాన,సంపాదనంబు య।జ్ఞప్రవర్త
నంబును జేసి వా।నప్రస్థధర్మంబు, నడపి యాచరితస।న్న్యాసుఁ డగుట
కృత్యం బనుడు జరా।మృత్యువుల్ జనన మా,దిగ వెనుతగులం।గదిగులు లేమి

తే. మీను వల దన్నుఁ బొదువుట।గాన కిష్ట, వృత్తి విహరించుచుండెడు।విధమ కాదె
యెల్లిసేసెద నసక మే।లిపుడ చేయు,మనఘ [1]వార్చునె మృత్యువు।జనులపనుల.

వ. అని పలికి పుత్త్రుండు వెండియు. 382

క. కృత మిది యకృతం బిది యిది, కృతాకృతం బనుచు నరుఁడు। కింకర్తవ్య
త్వాతిరోహితాత్మహితసం,స్మృతి యైనఁ గృతాంతుఁ డతనిఁ।జేర్చుఁ దనపురిన్.

క. అనఘా మృత్యువు నమృతం,బును దేహమునంద కలవు। మోహము మృత్యు
త్వనిరూఢ మున్నరూపుం, గను టమృతత్వోపహితము। గాఁగ నెఱుఁగుమీ.

క. ననుబోఁటికిఁ బశుయజ్ఞం,బున హింసకుఁ డగుట దగునె। భూసురవర హిం
సనరహిత మైనశాంతియ,జనమున బ్రహ్మాధ్వరంబు। సలిపెద నియతిన్. 385

క. యోగంబుఁ దపంబుఁ బరి,త్యాగంబును గాక యొండు।లగునె హితంబుల్
రాగముసరిదుఃఖంబును, ద్యాగముఁ బోలెడిసుఖంబు। నరయం గలవే. 386

క. ప్రజ యేన కాన నన్నుం, బ్రజ సుగతికిఁ బుచ్చు నని భ।రంపడి కోరం
బ్రజ విడిచెద నాయం దది, యజేయమును నవ్యయంబు। నగుపద మిచ్చున్.

ఉ. కావున లోకసంశయము। గన్గొని యెల్లెడ నిర్మముండ వై
నీవును శాంతియున్ సమత।నిష్ఠయుఁ బూని గుహాప్రవేశసం
భావన నాత్మదర్శనవి।భాసివి గ మ్మనినం దదీయవి
ద్యావచనంబులం జనకుఁ। డట్టిఁడ యై వెలిఁగెం గృతార్థతన్. 388

క. నరనాథ యమృత మగును,న్నరూపు గను దీవు మరగు। నాచెప్పినయి
ప్పరమేతిహాసవాక్యో,త్కరంబునర్థంబు చిత్త।గత మగు చుండన్. 389

వ. అనిన విని యుధిష్ఠిరుం డెవ్విధంబుశీలంబు గలవాఁడు బ్రహ్మపదంబు నొందు నని
యడిగిన భీష్ముం డత్యాదరంబున. 390

తే. అధిప లఘ్వాశి యై యింద్రి।యప్రపంచ
జయము గలిగి మోక్షార్థో।క్తసారధర్మ

నిరతి నుండెడివానికిఁ బరమ మగుప
దంబు తంగేటిజున్నుచందంబు నొందు. 391

వ. అని పలికి మఱియు నిట్లను హారీతగీత యనువాక్యసంచయం బాకర్ణింపుము దాన మోక్షధర్మంబులు దేటపడుం జెప్పెద హారీతుం డనుమునివరుండు విద్వజ్జనంబులుదనవలనం బ్రవ్రజనంబుసమీచీనప్రకారంబుగా నెఱుంగన పేక్షించిన.

హారీతుండు విద్వజ్జనుల కుపదేశించిన తత్త్వ ప్రకారము.

సీ. [1]వారి కిట్లనియె [2]నిరస్తారంభమతి నిలు, వెడలి కోర్కులకెల్ల విముఖుఁ డగుచు
జనములకీడు వాక్చక్షుర్మనోవర్తనములఁ గూర్పక మైత్రి సమత కరుణ
గలిగి నిందాప్రశంసల ఖేదమును నుబ్బు, లేక పాడింటను నేకతంపు
గుడిప్రానిపొంతను గుహలోన నుండుచు, డంపకములకు వంటకములకును

తే. భోజనములకుఁ దఱి యైన ప్రొద్దు గడపి, భిక్షగొనుఁ బ్రీతి మన్నన పెద్దవెట్టు
నట్టియెడఁ దక్కఁ గ్రొత్తగా నరుగుయతిని, రంతరంబు నాత్మారాముఁ డై చరించు.

తే. అనిన వారు కృతార్థులై యతనిఁ బ్రస్తు
తించి రని చెప్ప విని నరదేవవరుఁడు
దేవతటినీతనూజుతో భావశుద్ధి
కలిమి యొప్పంగదే యని పలికి మఱియు. 394

తే. రాజభావంబు [3]తొడుసునఁ [4]గ్రచ్చుకొన్న
మనసులో నుండ కెన్నఁడో మరలి యింద్రి
యముల నిర్జించి సత్త్వాదు లవులఁ ద్రోచి
యేను శాంతిసుఖంబున కెలయు టనఘ. 395

చ. అనుటయు నాతఁ డిట్టు లను నక్కురుభర్తకు వేగ మేటికిఁ
ఘనభుజ యెల్లచందములఁ గాలముతోడివ చుమ్ము వర్ణధ
ర్మనిరతి చిత్తపాకము క్రమంబునఁ దెచ్చుఁ గషాయపక్వతం
బనుపడ కర్షుఁ డే లగు నృపాలకుమారుఁడు సన్న్యసింపఁగన్. 396

వ. ఇవ్విషయంబున వృత్రగీత యనునితిహాసంబు గలదు వినుము వృత్రుండు భండనంబునం బడిన నెత్తికొని పోయి పెట్టుకొని యున్నయెడ నయ్యవస్థ నొందియు విషాదంబు లేక యున్నయద్దనుజవిభునితో శుక్రుండు వైరిహృతవిభవుండ వైన నీకు మనోవ్యథ లేమికిఁ గతం బేమి యని యడిగిన నతం డతని కిట్లనియె. 397

వృత్రగీత.

తే. కలిమియును లేమియును విను కాలవశగ, తములు బోధవిహీనుల దర్పదైన్య
కలితసుఖదుఃఖములఁ బెట్టుఁ గాక యర్థ, ములయనిత్యత యెఱిఁగినఁ గలదె వికృతి.

వ. అర్థంబులయస్థిరత్వంబ కా దాకర్ణింపుము. 399

1. చ. హారీతుఁడనియె నిరాలంబమతి. 2. జ. నిరారంభ. 3. గ. తొడుకున. 4. గ. గ్రందుకొన్న.

క. దైవతమానుషతిర్య, గ్భావంబులఁ బొందుచును వికారిణి యై భూ
తావలి దిరిగిన వెంటన, వేవిధములఁ దిరుగుఁ గర్మవివశత్వమునన్. 400

క. ఏ నిది యంతయు నెఱుఁగుదుఁ, గాన వగపు నుబ్బు నాకుఁ గలుగ వనుడు ని
మ్మానవిహీనపుమాటలు, దానవకులనాథ నీకుఁ దగునే యాడన్. 401

వ. అని యతనిమనశ్శుద్ధి యెఱుంగుటకు నై భార్గవుండు. 402

క. అనయము నీసు వొనర్చిన, విని యతనికి నిట్టు లనియె వృత్రుఁడు విజయం
బునకు నయితపము సేయనె, మును తత్సుకృతమునఁ గొననె మూఁడుజగములున్.

క. ఆయైశ్వర్యము గ్రమ్మఱ, మాయుటకుం గారణంబు మాన్యచరిత లే
దే యొకదుష్కృత [1]మది యిటు, సేయుం గాకేమి యేల చింతింపంగన్. 404

క. విను మనఘ యింక సుకృతం, బునకుం జొర దుష్కృతంబు పొంతకుఁ బో నే
ననుపము నచ్యుతు నవ్యయు, ననంతుఁ జెందెద ననామయత నవ్విష్ణున్. 405

చ. అనిమిషనాథుతోడి యని యప్పుడు గంటి ననంతు నాద్యు వి
ష్ణుని నలవోకఁ దన్మహిమ సువ్రత నా కెఱిఁగింపు కర్మసం
జనితవిశేషతం గలుగు చాయలలోపల నెద్ది యవ్విభుం
గనుటకు నర్హ మయ్యెఱుక గల్గఁగఁ జేయుము నాదుబుద్ధికిన్. 406

ఆ. అనిన నట్ల కాక వినుము చెప్పెద నని, యసురగురుఁడు పలుకు నవసరమున
నచటి కరుగుదెంచె నఖిలమునీంద్రస, మ్మాన్యుఁ డగుసనత్కుమారుఁ డధిప.

వ. వచ్చి యభిపూజితుం డై సమున్నతాసనంబున నున్నయమ్మహాత్మునితో శుక్రుండు విష్ణునిమాహాత్మ్యంబును వర్ణవిశేషంబులు నిద్దానవేంద్రునకు నెఱింగింపవే యనిన నతండు ప్రసన్నవదనుం డగుచు నిట్లనియె. 408

ఆ. వినుము దనుజనాథ విష్ణునియం దఖి, లంబుఁ గలుగు నిలుచు లయముఁ బొందు
నతనిభక్తి నింద్రియజయంబునను బోలె, దానధర్మవిధులఁ గాన రాదు. 409

వ. అవి ప్రయోజనపడుటయుం గలిగియుండు నదియునుం జెప్పెద మున్ను విష్ణుని మహిమ యాకర్ణింపుము. 410

తే. ధరణి పాదంబు లతనికి శిరము దివము
దిశలు బాహు లతఁడు సర్వదేవమయుఁడు
భూతవిక్షేపసంహారములు తదీయ
మానసస్వైరలీలలు దానవేంద్ర. 411

వ. వినుము జీవావస్థలు ఛాయ లై యుండుఁ గృష్ణంబును ధూమ్రంబును హారితంబును హారిద్రంబును రక్తంబును శుక్లంబును నైనవి యాఱు గల వద్దశావిశేషంబులు.

తే. అనఘ విష్ణువిహారంబు లైనవిషమ, వివిధవిక్షేపసంహారవృత్తులందు
భ్రమణ మొందెడిజీవుని బహుళకర్మ, ములవశంబున నాతనిఁ బొందు చుండు.

తే. తన్ను నుత్తమమధ్యమాధమము లైన
ఛాయ లొందంగఁ బ్రచురపర్యాయవృత్తి
జీవుఁ డమరత్వముఖ్యనానావిధముల
నొంది యెక్కుచు డిగ్గుచు నుండుఁ జూవె. 414

క. మే లొనరింపఁగ దొరకొను, మేలిమి గలచాయ కీసు మెయికొని చేయక్
లోలత్వరహిత చాయకుఁ, జాలం గీడ్పాటు వొరయుఁ చందము వచ్చున్. 415

వ. కావున. 416

క. రసకర్మజ్ఞుఁడు దారము, పసిండి సేఁతకుఁ బ్రయత్నపరుఁ డై శుద్ధ
త్వసమగ్రము సేయుక్రియ, న్విసువక పరిశుద్ధి జీవునికిఁ జేయు టురున్. 417

క. విను కుసుమంబుల వాసిం,చిన నొప్పనికంపు విడిచి చెందును సౌర
భ్యనిరూఢిం దిల లట్టుల, యనఘా సుకృతముల జీవుఁ డకలంకుఁ డగున్. 418

క. అంతంతకు సత్కర్మము, లెంతయుఁ బెను పొంద జీవుఁ డెక్కుడుచాయం
జింతాకలుషము వాయఁగ, సంతోషామృతము నాని సంశుద్ధుఁ డగున్. 419

వ. ఎక్కుడుచాయ శుక్లత్వంబు. 420

క. జీవుఁడు శుక్లచ్ఛాయా, భావితుఁ డైనపుడు విష్ణు భావించుటకుం
దా వెరవరి యగుఁ దద్గత,భావ మొసఁగు గుఱుతు లేనిపం డగు నెలవున్. 421

వ. అనిన విని వృత్రుం డదీనంబులు నమృతస్వరూపంబులు నగుభవదీయవచనంబులు వినికిం జేసి విశుద్ధుండ నైతి నని పలికి ప్రాణంబులు విడిచి విష్ణునిం బొందె నని చెప్పుటయు నప్పాండవేయాగ్రజుండు వృత్రునివిజ్ఞానంబును విష్ణుభక్తియు నింత యొప్పునే యని యగ్గించి యతండును నాఖండలుండును భండనంబు సేసిన తెఱం గెఱింగింపవే యనుటయు ననిమిషనదీనందనుం డతని కి ట్లనియె. 422

—ఇంద్రవృత్రాసురులయుద్ధప్రకారము.—

సీ. ఇంద్రుఁ డుజ్జ్వలరథం బెక్కి దేవానీక,సహితుఁ డై వృత్రుపైఁ జన నతండు
దనుజసైన్యముఁ గొని తాఁకెఁ దత్సంగర, మవ్వాసవునకు భయం బొనర్చెఁ
బర్వతప్రతిమరూపమున నయ్యసురయు, గ్రతఁ జూచి వడఁకుదైవతకు లేంద్రు
నద్దానవుండుమాయాబలంబున మోహి,తునిఁ జేయ సొగయుడుమునిసమాజ

తే. సంస్తుతముగ రథంతరసామశక్తిఁ
జేసి యమ్మూర్ఛ దేర్చి వసిష్ఠుఁ డతని
తోడ నజుఁడును హరియు రుద్రుండుఁ బోరు
గనుఁగొనంగ వచ్చినవారు గడఁగు మనుడు. 423

చ. అతఁడు గడంగ దేవగురుఁ డప్డు మునీంద్రులుఁ దాను నమ్మరు
త్పతివిజయంబు గోరి హరుఁ బ్రార్థన సేయఁ దదీయతేజము

ద్ధతచటులజ్వరం బగుచు । దైత్యపతిం బొదివెన్ సురేశ్వరో
ద్ధతకులిశంబుఁ బొందె హరి । తత్సమయంబునఁ గౌరవేశ్వరా. 424

తే. ఇంద్రునకు రుద్రుఁ డత్తఱి నిట్టు లనియె, ననఘ యఱువది వేలు దివ్యాబ్దములు మ
హాతపం బొనరించె నీ యసుర వీని, కొసఁగెఁ బద్మజుఁ డధికమహోగ్రబలము.

క. అని చెప్పి యబ్బలము నా, ఘనతేజముచేత నడఁగుఁ । గడఁగు మనుడు న
య్యనిమిషనాథుఁడు వజ్రంబున వైవ నతండు వడియె । మునిగణ మలరన్.

క. సుర లార్చిరి తూర్యంబులు, మొరసె ననేకంబు లపుడు । మోదమున మునుల్
[1]హరిహరులం గీర్తించిరి, సురేంద్రు నగ్గించి రధిక । శుభవాక్యములన్. 427

క. విను విష్ణునిసంస్పర్శంబున నప్పుడ చూవె కసటు । వోయిన నతనిం
గనుటయు శాంతిం బొందుటయును గురువర కలిగె వృత్ర । నుల్లంబునకున్.

వ. అని పలికి భీష్ముండు వెండియు నవ్విభున కి ట్లను నట్లు వృత్రుని జయించి. 429

చ. హరునకు మ్రొక్కి మీకరుణ । నార్తి దొఱంగి యనూనసౌఖ్యముం
బొరసితి నంచు [2]వీడుకొని । పోయె మహేంద్రుఁడు బ్రహ్మహత్య యా
సురపతి [3]నప్డు వెన్కొనియెఁ । జొచ్చె బిసాంతర మాతఁ డందునుం
బరిగొని యుగ్రవృత్తి నది । పట్టెఁ జలంబున నమ్మహాత్మునిన్. 430

ఆ. బ్రహ్మహత్య దన్నుఁ । బట్టిన నమరేంద్రుఁ, డజునికడకు నేఁగి । ప్రార్థనంబు
చేసి దీనిఁ బాయఁ । జేయవే యన నతం, డది దొలంగఁ జేయు । ననువు దలఁచి.

వ. అగ్నినోషధివృక్షతృణంబులను వనితాజనంబులను జలంబులను దలంపున రావించి వృత్రునివలన వాసవునకుం బాటిల్లిన బ్రహ్మహత్య చతుర్భాగంబులు సేసితి మీర లొక్కొక్కపాలు గైకొనుం డని పనిచెఁ బనిచిన వారు దేవా నీపంపు సేసెదము మాకు నిష్కృతి యెట్టిది దాని నీదివ్యచిత్తంబున నవధరింప వలయునని పలికిన నగ్నికిని నోషధివృక్షతృణంబులకును వనితాజనంబులకును జలంబులకును వరంబులుగాఁ గ్రమంబున నీవు ప్రజ్వలింపక హవిఃప్రదానంబు సేయువానియందును మీకుఁ బర్వకాలంబుల భేదనచ్ఛేదనంబు లాచరించువానియందును మీరు రజస్వల లై యుండ మీతో సురతంబు సలుపువానియందును మీలో మలమూత్రశ్లేష్మంబులు విడుచువానియందును మీమీకడ నున్న బ్రహ్మహత్య ప్రవేశింపం గలయది యని నిర్దేశించిన దానికిం బ్రియం బంది యగ్నిప్రముఖంబులు శతమఖుబ్రహ్మహత్యాపాళ్లు ధరియించి రిట్లు విరించిప్రసాదంబునం గల్మషంబు దొఱంగి యాఖండలుండు తదనుమతి నశ్వమేధంబు సేసి నాకసామ్రాజ్యంబున సర్వలోకపూజ్యత్వంబు నొంది వెలింగె నని చెప్పి వెండియు ని ట్లనియె.

తే. ఒదవు వృత్రురక్తమున బుద్బుదము లెసఁగి
[4]పుట్టకొక్కు లై యవి జన । భోజ్యభావ

మొంది విప్రాదికద్విజ యోగ్యతాభి
పన్నములు గావు ధర్మసంపన్నచరిత. 433

క. ఆవాసవుచందంబున, నీవును శత్రుజయకీర్తి నీయుఁడ వగుచుఁ
భూవిబుధుల కెపుడుఁ బ్రమో,దావహుఁడవు గమ్ము భారతాన్వయముఖ్యా.

తే. పర్వములయందు విప్రసభను సభక్తి,కంబుగా నెవ్వ డీశక్రకథఁ బఠించు
వానిఁ బాపము లొందవు మాననీయ,ధర్మములయందు రతుఁడగు ధర్మతనయ.

వ. అనిన నతండు ప్రీతుం డై వృత్రుండు జ్వరంబుచేతం బొదువంబడియె నని వింటి
దానిజననంబును దత్ప్రకారంబును నెఱింగింపవే యనుటయు భీష్ముం డాభూపతి
కి ట్లనియె. 436

దక్షుమఖధ్వంసంబునప్పుడు శివునివలన జ్వరం బుద్భవించినప్రకారము.

సీ. రజతాచలంబున రత్నతటంబున, నంబికాసహితుఁ డై హరుఁడు పేర్మి
నమరమునీంద్రయక్షాదులు గొలువంగ, నుండు న ట్లుండంగ నొక్కనాఁడు
దేవర్షికోటు లతిప్రమదంబునం, జనఁ జూచి వీ రేమి పనికి నేచటి
కరిగెద రని పతి నడిగె భవాని యా,తఁడు దక్షుచేయు నధ్వరమునందుఁ

తే. దమహవిర్భాగములు గొనుదాని కనినఁ, బొలఁతి నీ వేల పో వను పలుకు వలికె
నాకుమును భాగపరికల్పనంబు లేమి,నతఁడుఁ బిలువఁ డేనును బోవ ననియె భవుఁడు.

క. తనపతికి భాగకల్పన, మొనరింపఁడు దక్షుఁ డని మహోగ్రపుఁగోపం
బున బొమలు ముడివడఁగ న,వ్వనిత పలుకు మాని యుండె వసుధాధీశా.

సీ. దేవిచిత్త మెఱింగి దేవుండు ప్రమథసం,ఘంబును దాను నాక్రతువు సెఱుప
నరిగె యజ్ఞాంగంబు లన్నింటిఁ బ్రమథులు, గాసిసేయుచును రక్తములు సల్లి
యార్పంగ మృగరూప మై గగనంబున, కెగసె నధ్వరము మున్నీశునుదుట
నలుకఁ బుట్టినఘర్మజలకణ మిలఁ బడ్డఁ, బెనుమంట లెగసిన జనితుఁ డయ్యె

ఆ. నందుఁ బురుషుఁ డొకరుఁ డరుణనేత్రకము నీ,లంబు నూర్ధ్వరోమకంబు ఘోర
భంగికంబు నైనయంగంబుతో సప్త,తంతుదాహి యగుచు ధరణినాథ. 439

క. సురలు మునులు భయమునఁ బఱ,చిరి నలుగడ బ్రహ్మవచ్చి శివుఁగని వినయో
త్తరముగ మ్రొక్కుచు నమరులు, పరికల్పించెదరు నీకు భాగము భక్తిన్.

వ. స్వామీ కోపం బుపసంహరింపుము. 441

క. నావుడు నల్ల నగుచు న,ద్దేవుఁడు కరుణించి మునుల దేవతలను సం
భావింప భాగకల్పన, గావించిరి వార లాజగత్ప్రభువునకున్. 442

వ. అప్పరమేశ్వరుండు సుప్రసన్నుం డై యనిమిషులకు మునిగణంబులకు నానందం
బొసంగె శతానందుం డయ్యిందుశేఖరునితో దేవా నీనుదుటిచెమటం బుట్టిన
యప్పురుషుండు జ్వరం బనునామంబునం బ్రశస్తుం డయి ఎందునుం జరియించు
నీజ్వరం బేకముఖత్వంబునం బృథివికి దుర్భరంబగు బహువిధంబుగా సృజియింపవే

యనుడు నగ్గిరీశుండు కరులకు శిరస్తాపనంబును భుజంగంబులకు నిర్మోకంబును గోవులకు ఖురాంతర్బాధనంబును మృగంబులకు నైజస్వరూపదర్శనప్రత్యవరోధనంబును దురగంబులకుఁ బార్శ్వశోషణంబును మయూరంబులకుఁ బత్త్రోద్భేదనంబును గోకిలంబులకు నేత్రరోగంబును శుకంబులకు హిక్కయు నజంబులకుఁ జిత్తభ్రమణంబును శార్దూలంబులకు శ్రమంబును మనుష్యులకు జననమరణాదులయెడ వేదనావేశంబునుంగా విభాగించె నివి జ్వరప్రకారంబు జ్వరంబు మాహేశ్వరం బగుతేజంబు గావున సర్వజనంబులకు నమస్కార్యంబును మాననీయంబును నై యుండు. 443

క. జ్వరకథ వినినఁ బఠించినఁ, బురుషుం డారోగ్యసిద్ధిఁ బొదలుం దేజస్స్ఫురణముఁ జిత్తసమాధియు,దొరకొనుఁగోర్కులుఫలించుఁ దురితము లడఁగున్.

క. అని చెప్పి యమరతటినీ,తనూభవుం డాదరమునఁ దర్మసుతునితో ననఘా నీ విం కెయ్యది, వినవల తనవుడు నతండు వినయానతుఁ డై. 445

—శాస్త్రతత్త్వం బెఱుంగనివాఁడు సేయవలసినవిధము.—

తే. శాస్త్రతత్త్వ మెఱుంగక సంశయాత్ముఁ, డగుచుఁ బరమార్థ మిట్టిదియనఁగ లేని యట్టివాఁ డేమికర్మంబు నాచరించు,వాఁడు సెప్పవె ధర్మప్రవర్తనజ్ఞ. 446

వ. అని యడిగిన నమ్మహామతి యతని కి ట్లను గురుపూజయు వృద్ధోపసేవనంబును విద్యాశ్రవణంబును నవశ్యకర్తవ్యంబులు మఱియునుం జేయవలయునవి నారదగాలవసంవాదంబు వినినం దెలియు వినుము చెప్పెద నారదు నాశ్రయించి గాలవుండు. 447

క. నానాశాస్త్రంబుల న,ర్థానేకత్వంబు గనుచు నప్రాప్తసువిజ్ఞానపరినిష్ఠ మగుమ,న్మానసముం దేర్పవే సమగ్రవివేకా. 448

వ. అని యభ్యర్థించిన నద్దేవముని యమ్మహాద్విజున కి ట్లనియె. 449

క. చతురాశ్రమములవృత్త,స్థితులు పరీక్షించి యందుఁ జెందఁ [1]దలఁచి తద్గతిసూక్ష్మదృష్టిఁ గనుఁగొని, సతతంబుఁ ద్రివర్గచరితసౌమ్యుం డగుచున్.

తే. పాపకర్మంబు లెల్లను బాయఁబెట్టి, పుణ్యకృత్యంబు లగువానిఁబురుషుఁ డోపినట్లు శుద్ధమనస్కుఁ డై యాచరించు,వాఁడు సజ్జనసంగతి వలయు నెపుడు.

క. విను సర్వభూతములయం,దును మార్దవయుక్తుఁ డై మధురవాగ్వృత్తిం బనుపడఁగ వలయు నార్జవ, మనూనముగ దేవపితృసమర్చకుఁ డగుచున్. 452

క. అనహంకారము నప్రా,ర్థనమును విషయములఁ బెద్ద దగులమియును మేలనఘా పరు నిందించుట, దను వర్ణించుకొను టనుచితము లెయ్యెడలన్. 453

క. విను మలసుండును గర్వియు, ననర్థభాషియును మత్సరాలీఢుఁడుఁ గ్రోధనుఁడును గా వలవదు శ,క్త్యనురూపతఁ జేయ వలయు నాతిథ్యంబున్. 454

క. వేదాధ్యయనంబుఁ దదం,గాదరణము యజ్ఞవిధిసఽమారంభము ధా
త్రీదైవతసమ్మానము, నే దేశమునందుఁ గలుగు ఽ నిర వది నిలువన్. 455

క. ఇత్తెఱంగునఁ బురుషుం డ,త్యుత్తమచరితముల నడచు ఽ చుండఁగఁ బాయుం
జిత్తంబుకలఁక బోధో,త్పత్తికి నది మూల మగు నఽధర్మవిదూరా. 456

క. అని చెప్పి ననుడుఁ గుంతీ,తనయాగ్రజుఁ డమరతటినీఽతనయునితో ని
ట్లనుఁ గాల[1]పాశసంఛే,దనమును ననుబోఁటి యెవ్విఽధంబునఁ జేయున్. 457

వ. అని యడిగిన నతం డతని కిట్లనియె. 458

అరిష్టనేమి యనుముని సగరున కుపదేశించినధర్మప్రకారము.

ఆ. విను మరిష్టనేమి ఽ యనుముని నడిగె నీ,యడిగినట్ల సగరుఁ ఽ డమ్మహాత్ముఁ
డన్న రేంద్రునకుఁ బ్రిఽయంబునఁ జెప్పిన,సౌమ్యవాక్యములు ప్రఽశాంతిఁ జేయు.

వ. వానిం జెప్పెద నవహితుండ[2]వై వినుము సగరుం బ్రబోధించుటకు నరిష్టనేమి యి ట్లను ధనధాన్యపశుకళత్రపుత్త్రాదుల సందడిం బడి డెందం బాకులం బగు నేని ముక్తిమార్గంబు దుర్గమం బై యుండు. 460

సీ. వృద్ధకళత్రంబు ఽ బుద్ధిమత్పుత్త్రుల, విడిచి నిర్భరత విఽవిక్తదేశ
మునకుఁ బోవలయు నఽపుత్త్రుం డపుత్త్రకుం, డనువిశేషంబు లేఽ దతులశాంతి
వైరాగ్యములు గలఽవానికి విను నృప,వర్య బంధులఁ బ్రోవ ఽ వలదె యనుత
లంపున సంసారఽలంపటుం డగువాఁడు, బేల దా మృత్యువుఽపాలు వడిన

ఆ. [3]యపుడవారి నరయ ఽ నబ్బునే యద్దశఁ, దలఁచి ముక్తి గోరఁ ఽ దగదె యట్లుఁ
గాక తనకు వారు ఽ గలుగుదురే యప్పు,డదియుఁ దలఁప వలయుఽనదియ కాదె.

తే. భూతములపుట్టుఁ జేష్టయుఁ ఽ బోలియుటయును
జూచు నేర్పు గలుగువాఁడు ఽ సూడ నేర్చు
మోక్షమార్గంబు చిత్తంబు ఽ మూఢ మైన
సక్తుఁ డగు లోకగతి నెట్లు ఽ ముక్తి కలుగు. 462

క. అనఘ దురన్నము శాల్యో,దనమును భూమియును మృదులఽతల్పము నజిన
మ్మును సురుచిరచీనాంబర,మును సరి యెవ్వనికి నతఁడు ఽ ముక్తిం బడయున్.

తే. నేల యెల్లను నేలినఽనృపుల పుట్టు, నీగి పోకయుఁ జూ పాదిఽగాఁగఁ గలుగు
శక్తు లెడలినఁ జెడు మేనిఽచందమును ద,లంప నేర్చునతఁడు మోక్షఽలక్ష్మిఁ జెందు.

క. ధనయోగము దుర్లభ మని,యును క్లేశము సులభ మనియు ఽ నూహించుచు నె
మ్మనమున మర్త్యత్వము గీ, డని యెఱుంగునతండు గను మఽహానందంబున్.

క. కావున గృహస్థవృత్తిన్, నీ వతిలోలుఁడవు గాక ఽ నెఱిఁ జేయుము ర
క్షావిధి ధరణీప్రజకుం, గైవల్యము దాన నీకుఁ ఽ గలుగుం జులుకన్. 466

1. గ. సంగపాశ. 2. చ. వగుము. 3. చ. వారి నప్పు డరయ వచ్చునే.

క. అని బోధించిన సగరుం, డనయముఁ దెలి వొంది నియతుఁ డై ప్రజ రక్షిం
చె నరేంద్ర నీవుఁ దద్వృ, త్తనమున నెగడుము జనాభిరంజన మొప్పన్. 467

తే. అనినఁ బ్రియ మంది పాండవేయాగ్రజుండు, ధర్మవిద్వేషపరు లగు దానవులకు
మంత్రి యై యుండు శుక్రత్వ మహిమ యెట్లు, గలిగె భార్గవునకుఁ బుణ్య గణ్యచరిత.

శుక్ర నామంబు భార్గవునకుం గలిగినవిధము.

చ. అనవుడు భీష్ముఁ డి ట్లనియె నాతఁడు యోగబలంబు పెంపునన్
ధనదుని మోసపుచ్చి తదుదాత్తధనం బవలీలఁ గొన్న నె
మ్మనమున నొచ్చి చెప్పెఁ బురమర్దనుతోడ నతండు దానికిం
గనలున మ్మహేశ్వరుఁడు గన్నుల నిప్పులు రాలు చుండఁగన్. 469

తే. శూలము గ్రతనెత్తి యెచ్చోటనున్న, వాఁడు భార్గవుఁడనుచు దుర్వారకోప, వివ
శుఁడగుటయు నాతఁడు వెఱచి చాల, దూరముగఁ బోయి [1]తుప్పలఁ దూలియుండె.

క. అమ్మెయి నిలుచుటకును జి, త్తమ్మోర్వమిఁ దల్లడంబు దనికినఁ గడు వే
గమ్మునఁ ద్రిపురహరుని హ, స్తమ్మునఁ జొప్పడియెఁ గని యతఁడు వెస మ్రింగెన్.

ఆ. కడుపులోన నుండి కలగొనఁ బాఱెడు, విబుధవైరిగురుఁడు వెడల కుండు
నట్లుగాఁగఁ దెరువు లన్నియు మూసి శి, శ్నంబు మూయ కంగజన్మరిపుఁడు.

క. వెడలు మని తెరువు సూపిన, వెడలెను భృగునందనుండు వెండియుఁ గోపం
బడరఁగ నాతనిఁ గనుఁగొని, యెదురుద్రునిఁ జూచి దేవి యి ట్లనియె నృపా.

క. నీకడుపున జన్మించుట, నాకుం గొడుకయ్యె నితఁడు నాసుతునకు సు
శ్లోకా యలుగం దగునే, నీకు సుఖం జేయు మీతనిం గృపతోడన్. 474

తే. అనినఁ దేజస్విఁ జేసి చంద్రార్ధమౌళి, శిశ్నమున నిర్గమించుటఁ జేసి యితఁడు
శుక్రుఁడనుపేర వర్తించు సుదతి నీకుఁ, బ్రియ మొనర్చితి ననియె సంప్రీతితోడ.

తే. అనఘ యిది భార్గవుఁడు శుక్రుఁ డైన తెఱఁగు
నావుడును ధర్మజుఁడు శాంతనవునితోడ
నీదువాక్యామృతమున నా నెమ్మనంబు
తృప్తి సనదు సద్ధర్మంబుఁ దెలుపు మనియె. 476

వ. అనవుడు నమ్మహానుభావుం డమ్మహీనాథుతోఁ బరాశరగీతాశ్రవణ ప్రవణుండ
వగు మది ధర్మప్రబోధకం బగు నని పలికి యి ట్లనియె. 477

జనకునకుఁ బరాశరముని యుపదేశించినధర్మప్రకారము.

సీ. జనకభూపతి యడిగినఁ బరాశరముని, ధర్మసంబోధన తానిరూఢి
ని ట్లని యెఱిఁగించె నిహపర సౌఖ్యముల్, ధర్మకార్యము లని తలఁచి నరుఁడు
ఫలము బీజంబున బడయునట్టుల ధర్మ, మున సౌఖ్యసంసిద్ధిఁ బొందవలయు
సుకృతదుష్కృతములు సుఖమును దుఃఖంబుఁ, గుడువఁ జేయక నరు విడువవధిప

1. [illegible]

తే. వాఙ్మనోదృష్టికలితప్రవర్తనములఁ, గాయచేష్టితములను న్యాయపక్షముఁ
బొరయ నీకున్న సత్పథనిరతి గలుగు, సత్యశమదమాహింసలు సత్పథములు.

క. అనఘుం డింద్రియహయభృత,మనోరథరథంబు నాఁగు మహాతజ్ఞాన
త్వనిరూఢరశ్మిశక్తిని, జననాయక దుష్పథమునఁ జన కుండంగన్. 479

ఆ. పడయ రానియాయు వొడలికిఁ గలిగినఁ, బాపకృతుల దానిఁ బడటఁ గలుప
నగునె పుణ్యవిధిసమాచరణములఁ గై,సేయ వలయుఁగాక చెలువు మిగుల.

క. [1]దురితంబులు దొడరుమహిత,కరణంబున మేలు వడయఁగాఁ గోరుట భూ
వర దుస్సలిలస్నానా,దరము తెఱఁగు సూవె యవ్విధంబునఁ దలఁపన్. 481

క. సమదర్శి యై యఖిలభూ,తములను దనయట్ల కాఁగఁ దలఁచుచు నెవ్వం
డమలన్యాయపరుం డగు, నమరు లతని వందనీయుఁ డండ్రు నరేంద్రా. 482

క. ధన మించుకేని ధర్మం,బునఁ బడసినయట్టి దైన భూవర పాత్రం
బున నిడిన నది మహాఫల,జనకం బగు నండ్రు వేదసంవేదిజనుల్. 483

తే. మునులఋణ మధ్యయనమున ననిమిషులఋ
ణంబు క్రతువున నతిథిఋణంబు పూజఁ
దీర్చునది శ్రాద్ధమునఁ బితృదేవతలఋ
ణంబు నరులఋణము రంజన వ్రతమున. 484

క. నారదపర్వతదేవల,భారద్వాజాదు లైనపరమమునులు ధ
ర్మారంభంబునఁ బడసిరి, గారవ మట్లగుట ధర్మకరణము వలయున్. 485

క. విను మర్థ్యుఁ డగు ననర్థ్యం, డనఘా విష్ణుస్తుతిక్రియం దపమున ధ
ర్మనిరూఢి నివి మనంబున, ఘనపరిబోధంబుఁ గూర్చుఁ గావున నధిపా. 486

ఆ: ఆహితాగ్నిఁ బుణ్యుఁడను శ్రుతి జననియు, జనకుఁడును గురుండుసద్గతియును
దేజమును బలంబు ధృతియును బుద్ధియు, నగ్ని యగుటఁ జేసి యమలచరిత.

తే. సుజనసంగతి కృత్యంబు కుజనుఁ డైన, దాన నిర్మలుఁ డయ్యెడుఁ గాన వినుము
శూద్రజాతిభూదేవశుశ్రూష గాదె, యిహముఁ బరమును బడయుట మహితవృత్తి.

క. అనఘా మర్త్యులజీవన, మనిత్య మని యెఱిఁగి సుఖము నప్పుడు దుఃఖం
బునయపుడు ధర్మ మేమఱ, కునికియ యెజ్ఞాతి కైన నుర వూహింపన్. 489

తే. పాప మించుక దొడరినపనియు నెట్టి,ఫలము గలిగిన వల దల్పఫలవిధాయి
యైనపుణ్యమిశ్రితకార్యసమాచరించు,నది శివం బగు దాన నిహమ్ముఁ బరము.

తే. యజ్ఞపరుఁడు రక్షకుఁడు నుపార్జకుండు, విప్రశుశ్రూషకుఁడు, గాని విప్రరాజ
వైశ్యశూద్రులు దక్కటివాని నెట్టి,ధర్మములఁ జేసి రేని నధర్మపరుల. 491

ఆ. ధర్మలబ్ధ మైనధనము పాతిక యేని, బహుళఫలము నిచ్చుఁ బాపవృత్త్యు
పార్జితంబు కోటి యైన నిష్ఫల మండ్రు, దానశాస్త్రవిదులు మానవేంద్ర.

1. క. దురితంబునఁ దొడఁగుమహిత; గ. దురితంబునఁ...నహిత.

క. [1]నృపధర్మ వైశ్యధర్మము, లపాపకర్మములు జీవ।నాభావము పా
లుపడినబ్రాహ్మణునకు నర,కపాత మగు శూద్రకర్మ।కర్తృత్వమునన్. 493

క. రాజునకును ధర్మము శ,స్త్రాజీవిక యొకఁడ వైశ్యుఁ।డాపద నైనన్
రాజవర మధువు మాంసముఁ, దా జట్టి యిడంగఁ బొందు।దౌర్గత్యంబున్.

క. జనవర కృషిఁ బశుపాలన,మున నేనియు బ్రదుకు ధర్మ।ముగ నార్యులు శూ
ద్రునకు విధింతురు జీవన,వినాశమున వాన వృత్తి।వినిహత గామిన్. 495

సీ. విను తొల్లి ధర్మవ।ర్తనము లసహ్యంబు, లైన దానవులు మ।హోగ్రహమున
నరులయం దెలసిన।నరవర వారలు, దర్పరోషముల న।ధర్మవృత్తిఁ
దగిలినఁ గలఁగ వే।దములును గ్రతువులు, సురలు విషణ్ణులై।పురహరునకు
నంతయు నెఱిఁగింప।నతఁడు త్రిశూలంబుఁ, బనుప దైత్యావిష్ట।భావ మడఁచె

తే. నది మహామునుల్ మృడునిఁ బ్ర।జాభిరక్ష
ణమున కై నిల్ప శ్రుతులు జ।న్నములు దొంటి
చందమునఁ జెల్లె నమరులు।సంతసింప
ననఘ నీవును బాలింపు।మట్ల ప్రజల. 496

క. అని చెప్పి తపముపెంపును, వినిపించుట కిట్టు లనియె।విద్యాధరస
న్ముని దేవతాగణంబులు, వినుతతపంబునన మహిత।విభవముఁ బొందెన్. 497

చ. కమలభవుండు దాఁ దపము।కల్మిన కాదె సృజించె నెల్లలో
కములను నాదిరాజు లధి।కం బగు పెంపు వహించు టెల్ల ను
త్తమతప మాచరించుటన।తద్దయుసౌఖ్యకరంబు లైన భో
జ్యములును గంధమాల్యములు।శయ్యలు భవ్యతపఃప్రభూతముల్. 498

తే. దారధనమిత్త్రపుత్త్రకా।ద్యంబు లగుప, దార్థములసంగమునఁ జి।త్తమలఁతఁ బొంది
విసివినప్పుడు నిర్మల।విపులతపము, కారణం బగు నుపశాంతి।కలిమి కనఘ.

క. విను లోభము సంతోషం,బును దుఃఖసుఖప్రదములు।పురుషున కవి సం
జనితము లగుట తపము లే, కునికిని గలుగుటను జూవె।యుర్వీనాథా. 500

తే. అనఘ సుఖదుఃఖములు వచ్చి।నపుడు మదవి
షాదములు లేక సంప్రాప్త।సముపభోగ
రతుఁడు నప్రాప్యవాంఛాని।రాసకుండు
నగుట సారతపోరూప।మండ్రు బుధులు. 501

క. వరధర్మము నర్థంబును, సరసం బగువిషయసుఖము।సద్గతియుఁ దపః
పరిపాకమునన కలుగున్, నరునకుఁ దత్తద్విధార్త।నైపుణుఁ డైనన్. 502

వ. అనిన విని జనకుండు వర్ణంబులయుత్కర్షాపకర్షత్వంబులకు మూలం బెయ్యది

1. క. నృపవరుల వైశ్యధర ము.

దానిని దాన పుత్త్రుండై జన్మించు నంద్రదియు [1]నిసంశయం బగుట నెఱింగిం
పవే యనుటయుం బరాశరుం డతని కి ట్లనియె. 503

తే. పద్మభవముఖబాహూరుపాదసంభ,వములు గాన భూసురరాజవైశ్యశూద్ర
భావములు తారతమ్యసంప్రాప్తి నొందె, జనన దేశగుణంబుల మనుజనాథ.

క. తాన సుతుఁ డగుట దెలియం,గా నగు మును లాత్మవీర్యకలనం బెచ్చో
నైనం జేయఁగ మునిభా,వానూనత ఋశ్యశృంగుఁ డాదిగఁ గనుటన్. 505

ఆ. అనిన జనకుఁ డిట్టు లను వినినవి యైన, వలయుఁ దెలియ వినఁగ వర్ణధర్మ
సమితిఁ గలవిశేషసాధారణత్వంబు, లేర్పరించి చెప్పవే మునీంద్ర. 506

వ. అనుటయుఁ బరాశరుం డిట్టు లనియె. 507

సీ. వినుము ప్రతిగ్రహంబును యాజనంబును, నధ్యాపనమును ధరామరులకుఁ
బ్రజరక్ష నృపునకుఁ బశుపాలనము కృషి, వాణిజ్య మనునివి వణిజులకును
శూద్రజనులకు శుశ్రూషయు శ్రుతులు వి,శేషధర్మములుగఁ జెప్పు సత్య
శౌచంబులును నహింసయు ననసూయయు, శ్రాద్ధంబు నతిథిపూజనము నాత్మ

తే. దారపరతయు సర్వసాధారణంబు, లనఘ వీనను నిజవృత్తులను సమస్త
జాతులును నిహపరసౌఖ్యసంపదలకు,నాస్పదము లగు నింద్యంబులన్యవిధులు.

క. భూవర నాకుం జూడం,గా విష్ణుఁడు దైవ మట్లు గావున నతనిన్
భావించు నెల్లవారికిఁ, గావించును మోక్షమయసుఖము పెన్నింటన్. 509

క. అనిన విని జనకభూవిభుఁ, డనఘ యహింసనము లైనయవి యెయ్యవి య
ప్పను లెఱుఁగఁ జెప్పవే నా, కనుడు నతని కిట్టు లనియె నమ్ముని యధిపా. 510

జనకునకుఁ బరాశరముని వివరించినహింసాహింసలప్రకారము.

ఆ. శమము దమము లేమి జనులకు హింస నో,నర్చుఁ గాన ధరణినాథ విను మ
హింసశమదమములు హృదయంబునకు నెడ్డ,నలవడంగఁ జేతయం ద్రుబుధులు.

వ. అని చెప్పి వెండియుం బరాశరమునీశ్వరుం డి ట్లనియె. 512

క. దురమున జయము గొనుటకై, నరపతులకు వలయు హింసనం బెట్లును ద
త్పరిహరణస్థానములును, ధరణీశ్వర కలవు సెప్పెదను విను వానిన్. 513

క. పడినం బాఱినఁ గైదువు, వడినను వాహనము వడినఁ బార్థివముఖ్యా
పొడువఁ దగదు శత్రుని నె,య్యెడల నహింసనముఁ బోల వేసుకృతములున్.

క. న్యాయమున సంగరంబుం, జేయఁగ శస్త్రాగ్ని దన్నుఁ జెందిన దానం
గాయంబు విడుచుపురుషుఁడు, వే యేటికి మోక్షలక్ష్మివిభుఁ డగు నధిపా. 515

క. తనతోఁ దుల్యుం డైనను, మనుజాధిప యధికబలసమగ్రత్వము గ
ల్గిన నని శత్రుని వధియిం,చిన నరపతి పుణ్యలోకసిద్ధిం బొందున్. 516

వ. అని మఱియును. 517

1. చ. నిస్సంశయంబుగా నెఱిం. 2. గ. అన్నింటన్-జ. లెన్నింటన్.

క. భూతంబులు నింద్రియసం,ఘాతము సత్త్వాదిగుణనికాయముఁ గాయం
బై తోఁచు నెఱిఁగినను ధ,ర్మేతరకృత్యములు సేయునే నరుఁ డనఘా. 518

క. జాతుఁడు మృతుఁ డగుట ధ్రువము, భూతోల్లాసము లనిత్యములు విను సద్యః
పాతి యగుశరీరంబున,కై తొలఁగునె ధర్మపథము నార్యుం డనఘా. 519

తే. ఉత్తరాయణమును సంగరోత్సవాది
కారణంబులుఁ గలుగు సత్కర్మపరుని
మరణమునకు దుష్కాలంబు గరళరజ్జు
జలముఖములుఁ బాటిలు దుష్టచరితుమృతికి. 520

క. మానవులకుఁ దలఁపఁగ న,జ్ఞానమునట్టిపగ లే దసంగతకృత్యా
ధీనుం డై రూపు సెడును, దానం గావున నుదాత్తధర్మవిధిజ్ఞా. 521

క. మానుషజన్మము మే లతి,హీనపుజాతిని జనించెనేనియు సస్యం
బైనజననంబుకంటెను, దాన సుగతి వడయ నగుటఁ దత్త్వప్రవణా. 522

క. దానములఁ బుణ్యతీర్థ,స్నానంబుల నతిథిపూజనంబులను ఫలా
దాననిరతుండు గాక, మానుష్యము గారవించు మతి నిత్యుఁ డగున్. 523

వ. అనిన విని జనకజనేశ్వరుండు పరాశరమునీశ్వరునితో మే లెయ్యది పరమగతి యెయ్యది కృతం బైన నెద్దానికి నాశంబు లేకుండు నెఱింగింపవే యనవుడు నమ్మహీపతి కమ్మహాత్ముం డి ట్లనియె. 524

ఆ. అరయ మే లసంగ మంచితజ్ఞానంబు, పరమగతి మహాతపంబు చేటు
లేనికృత్య మిట్లుగా నెఱుంగుట సర్వ,వేదవాక్యతత్త్వవిత్త్వ మనఘ. 525

వ. అని చెప్పి వెండియు. 526

క. విను సుమతి విషయముల నం,దునికి గలిగెనేనిఁ బొందఁ డుదకంబులఁ బొం
దనిబిసరుహపత్త్రముచా,డ్పున నది విజ్ఞానఫలము భూపవరేణ్యా. 527

తే. అనఘ మహాత్మచిత్తంబునందు విషయ,జాల మత్యంతగాఢసంసక్తినొందు
లక్కరసము దండాదులఁ జిక్కఁ బట్టు,చందమున దీనిఁ గనుట ప్రశాంతికరము.

క. ఇనరుచిఁ బాషాణము ర,శ్మినిరూఢం బైనయట్ల చిత్తము సద్భా
వనమున సదాత్మకం బగు, ననామయస్థితికి మూల మది మనుజేంద్రా. 529

క. ఆరయఁ గదళీగర్భా,సారము సంసార మిట్టిచంద మెఱిఁగినం
జేరవు జననమరణములు, గారించును దీనిభంగిఁ గానక యున్నన్. 530

క. ఒరులపనికిఁగా నిజహిత,విరహితుఁ డగునట్లు గాదె వివిధేంద్రియకా
ర్యరతుం డై యాత్మసము,ద్ధరణంబును జేయ కునికి ధరణీనాథా. 531

క. తనగృహమున నభ్యాసం,బున మెలఁగెడునంధుచందమున సంసారం
బునఁ దిరుగుమూఢుఁ డెఱుఁగఁడు, వినుతం బగుమోక్షపదము విమలవివేకా.

క. వినుము మృణాళంబున నం,టినరొంపి జలంబులం గడిగినను బెడఁబా

సినక్రియ విగులజ్ఞానం,బున సంసారంబు వాయుఁ బురుషు నరేంద్రా. 533

క. నరనాయక శిశ్నోదర,పరాయణుం డగుచు నొందు పరికింపనిమ
ర్త్యరుఁ డెలుకఁ బిల్లివాదివిన,పరుసున జరవాదువముక్తిఁ బడయక పాలియున్.

తే. ప్రేఁగు [1]పెద్దైన నోడ వారిధిఁ దరింప, లేనిభంగి మనోభవాలీఢవృత్తి
యగుచు నుండుజీవుండు భవాబ్ధి యుత్తరింప లేఁ డిది నిజము గరిష్ఠచరిత.

క. పడియెడుదుఃఖము లరయం, గడుఁ బెక్కల్పములు గను సుఖంబులు వినం
బడయుఁగ నగుమే లెయ్యది, [2]విడుప యురవు శుభముపొందు విద్యాప్రవణా.

క. మిత్త్రులు భార్యలు భ్రాతలుఁ, బుత్త్రులు నిజకార్యపరులు బోధము సుస్వా
త్మత్రాణమునకు మూలము, ధాత్రీపతివర్య యెవ్విధంబునఁ జూడన్. 537

ఆ. ధీరుఁ డై యభేదదృష్టియ పాటించు,చుండు నట్టిపురుషు నొక్కమాటు
విడువ దక్కు సంశయవిభవంబుచాడ్పున, బోధలక్ష్మి పెంపు భూపవర్య. 538

క. అని యిట్లు పెక్కుభంగుల, మునివరుఁడు పరాశరుం డమోఘప్రజ్ఞా
ఘనత యొలయంగఁ జెప్పిన, జనకుఁడు ముద మందె భరతసంతతివర్యా. 539

## హంసగీత.

సీ. అనిన ధర్మసుతుండు హర్షమ్ము దనదుచి,త్తమున నిండార శాంతనవుతోడ
దమమును సత్యంబు క్షమయును నెల్లెడ, వినుతింపఁబడు నార్యజనులచేత
నవి యంత లెస్సలే యనవుడు నతనికి, నతఁ డిట్టు లను విను హంసగీత
యది యుత్తరం బగు నధిప నీప్రశ్నంబు,నకు దానిఁ జెప్పెద నలినభవుఁడు

తే. పసిఁడిరాయంచ యై కేలిపరత నొంది,తిరుగ నొక్కెడ సాధ్యు లద్దేవుఁ గాంచి
పక్షివర నీవు విద్యలఁ బ్రౌఢుఁ డగుట, సెప్పఁగా విందుమా శ్రయించెదము నిన్ను.

వ. ఏము సాధ్యుల మని పలికి సవినయంబుగా ని ట్లనిరి. 541

తే. ఉత్తమం బెద్ది నీచిత్తమొలయు నెందుఁ, బురుషుఁ డెయ్యది గల్గినఁ బొందు నఖిల
కర్మబంధమోక్షము నట్టిధర్మ మెఱుఁగఁ,జెప్పవే కరుణాలత చిగురులొత్త.

వ. అని యడిగిన నాదరించి యయ్యంచ వారల కి ట్లనియె. 543

క. క్షమయును దమమును సత్యము, నమేయమహిమాస్పదంబు లన విందుము ధ
ర్మములం దెల్లను నభివ,ర్ణ్యము లవి హృద్గ్రంథిభేదనప్రౌఢంబుల్. 544

వ. అని చెప్పి వెండియు. 545

క. పరమర్మభేదులును నయ,విరహితములు ధర్మకార్యవిముఖంబులు ని
ష్ఠురములు నగుమాటలు స,త్పురుషుం డాడఁ డవి సత్యములు గా కునికిన్.

క. జనములు దను నవమానిం,చిన నిందించినను మాఱు సేయక సైరిం
చినశాంతాత్ముఁడు వారల,మునుచేసినయట్టిసుకృతముల నాఁచికొనున్. 547

1. గ. పెద్దైన. 2. 'విడుప యుఱును భవము పొందు' అని పెక్కుప్రతులు.

క. కీడాడిన మేలాడుచుఁ, జూడక మొఱఁగించిరేని । దరహాసముతో
నీడం బోదును గ్రోధో,త్పీడ వారయ జెప్పుదును మదీయహ్లాదయమున్. 548

తే. వేదసారంబు సత్యంబు । వినుఁడు సత్య,సారమూర్తి దమము దమ । సార మనఘు
లార మోక్షు మీపరిపాటి । గారవమున, నాదరించుజనంబుల । కందు ముక్తి.

క. దమమునఁ గర్మేంద్రియముల, శమియింపఁగఁ జేత యది ని । సర్గగుణం బై
రమియించు నెప్పురుషుచి,త్తము దాన నతండు సర్వ । ధర్మకరుఁ డగున్. 550

క. ఆ తెఱఁగఘములఁ బాచును, బాతకములు వాయ మొగులు । వాసిన సంప్ర
ద్యోతితుఁ డగునమృతాంశుని, భాతి వెలుఁగు నాత్మ మోక్ష । పద మది సుండీ.

క. మనసును వాక్కును రక్షిం, బనుపడు నెవ్వనికి శ్రుతిత । పస్త్యాగము లా
తనిచేతిలోని వగు నని, మునిజనములచేత విందు । ము నిరంతరమున్. 552

క. పలుకు నడినతనిఁ బాపం,బులు విడుచుం బలికినతనిఁ । బొందును బాపం
బులు నోరుపాపము దనపై, నొలయింపఁగ నేల నింద । యుడిగినఁ గాదే. 553

క. కుపితుఁ డగువాని వ్రతమును, జపమును దేవార్చనంబు । శ్రాద్ధక్రియయుం
దపమును దానము యజనము, నపగతములు గాఁగఁ జేయు । సంతకుఁ డలుకన్.

చ. పలుకక యుండుకంటెఁ దగఁ । బల్కుట మేలు వినుండు సత్యముం
బలుకుట ధర్మమార్గమునఁ । బల్కుట సర్వజనప్రియంబుగాఁ
బలుకుట మేలి నెక్కు డగు । భంగులు వీని నెఱింగి యొండుమైఁ
బలుకక నాల్గుచందములఁ । బల్కఁగ మెత్తురు వాని దేవతల్. 555

క. సత్యక్షమాదమంబులు, నిత్యపదంబునకు నెక్కు । నిచ్చెన యవి సం
గత్యనుగతములు సత్సాం,గత్యం బవి గాన ముఖ్య । కార్యము సుండీ. 556

వ. అని సత్యక్షమాదమప్రకారవిషయంబు లైనవాక్యంబులు సెప్పిన విని కృతార్థు
లై సాధ్యులు సంతోషించి వెండియు హంసంబున కి ట్లనిరి. 557

క. ఏమిట లోకం బావృత, మేమిటఁ దా వెలుఁగ కుండు । నేమిట మిత్ర
స్తోమంబు విడుచుఁ దనుఁ గా, దేమిట మోక్షంబు మాకు । నెఱిఁగింపు దయన్.

వ. అనుటయు. 559

ఉ. ఆనతవైరి యిట్లు లను । హంసము వారలతోడ లోక మ
జ్ఞానముచేత నావృతము । సంభృతమత్సరుఁ డైన వే ఱగుం
దాను బ్రకాశసంపదకుఁ । దర్ విడుచుం దెగి మిత్రకోటిలో
భానుగతిర్ విమోక్షపద । మందదు సంగముకల్మి నెమ్మెయిన్. 560

వ. అనిన వారు మఱాళంబున కి ట్లనిరి. 561

క. ఎవ్వఁడు రమించు నొక్కఁడ, యెవ్వఁడు పెక్కండ్రఁ బ్రీతి । నెసఁగఁగఁ జేయుర్
దివ్వటిలు నెవ్వనికి బల, మెవ్వఁడు కలహంబు[1] వెంట । కెంతయుఁ దొలఁగున్.

---

1. చ. వెట్ట కెంతయు మెలఁగున్.

వ. అని యడిగిన హంస యి ట్లనియె. 563

క. ప్రాజ్ఞుఁడు రమించు నొక్కఁడ, ప్రాజ్ఞుడు పెక్కండ్రఁ బ్రీతిఁ బరఁగఁగఁ జేయుం
బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ, బ్రాజ్ఞుఁడు [1]కలహమునఁ దొట్రుపడక తొలంగున్.

వ. అని చెప్పినరాయంచతో సాధ్యు లి ట్లనిరి. 565

తే. విప్రుఁ డేమిట దేవత్వవిభవ మొందు, నేమికతమున సాధుత్వ మెసక మెసఁగు
నతని కెద్దియసాధుత్వ మావహించు, మానుషుం డగు నెద్దానమహితమూర్తి.

చ. అనుటయు హంస మిట్టు లను నధ్యయనంబున దేవభావముం
గను వ్రతవృత్తి సాధు వనఁగాఁ జరియించు జనం బసాధు నాఁ
జనుఁ బరివాదశీలమున శౌచవిహీనత మృత్యుభీతి వొం
దిన మదిలోన నెక్కొనినదీనత విప్రుఁడు మానుషుం డగున్. 567

క. అని పలికి సాధ్యులకుఁ దన,తనువిభవము సూపి సమ్మదంబున వారల్
దనుఁ గొలువ నిజనివాసం,బునఁ గేఁగె నజుండు నగవు మొగమున నెఱయన్.

వ. అని చెప్పి భీష్ముండు. 569

ఉ. సాదరవృత్తి సాధ్యులఁ బ్రహర్షసమేతులఁ జేయఁ బూని సం
వాదము సేసె దేవమునివంద్యుఁ డజుం డిది సేయు నాయురు
త్పాదన మిచ్చు సంతతశుభంబులు కీర్తి యొనర్చుఁ బుత్రపౌ
త్రోదయ మావహించు భరతోత్తమ తక్క వినినం బఠించినన్. 570

వ. అనిన విని ధర్మనందనుండు శంతనునందనుతో సాంఖ్యయోగంబులతారతమ్యం
బులుం దత్స్వరూపంబులు నెఱింగింపవే యనుటయు నమ్మహీపతికి నమ్మహాత్ముం
డి ట్లనియె. 571

భీష్ముఁడు ధర్మజునకు యోగతంత్రప్రకారము సెప్పుట.

క. తెలుపుదురు సాంఖ్యులును యో,గులుఁ దమతమ తెఱఁగు మేలగుట కారణసం
కలితముగ నాకుఁ జూడఁగ, నలఘుగుణా యొక్కరూప యయ్యిరుదెఱఁగున్.

క. ప్రత్యక్షహేతువాదులు, సత్యపరా యోగపరులు సాంఖ్యులు శాస్త్రా
ర్థాత్యంతనైపుణులు స,ద్గత్యాకలనంబు సరియ తదుభయమునకున్. 573

క. ఆ తెరువులు రెంటికి వే, ఱై తోఁచుట దర్శనంబు నంద నరేంద్రా
భూతహితము సద్వ్రతచ,ర్యాతిశయము శౌచమును నియతకృత్యంబుల్.

వ. అనిన విని యుధిష్ఠిరుండు భూతదయయును సద్వ్రతధారణంబును శౌచంబును
దుల్యంబు లై సాంఖ్యయోగంబులకు దర్శనంబు వే ఱగుట యెట్లు వివరింపవే
యనుటయు నన్నరదేవునకు దేవవ్రతుం డి ట్లనియె. 575

క. యోగులకు యోగబలమున, రాగము మోహంబునుం జిరస్నేహముఁ గా
మాగమముఁ గ్రోధమును గుణ,యోగము వరుసఁ బెడఁబాపనున్నతి యొలయున్.

చ. ఘనఝషముల్ సముద్ధతమృగంబును జాలము వ్రచ్చి వాగురా
వినిహతిఁ జేసి యిష్టపదవిం జనుచాడ్పున యోగతంత్రరో
ధన మగులోభజాతదురితవ్రజముం బెడఁబాచి సత్పథం
బునఁ జరియించు యోగి సుఖమూర్తిత సుస్థితగా వహించుచున్. 577

ఆ. యోగబలము లేనియొకభంగి యోగి బల్, ద్రోపు లేనిమీను నేపు లేని
మృగము వలయు నురియుఁ జెగిపోవ నుఱుకంగ, లేనియట్లు భవములోన సడఁగు.

ఆ. అల్ప మైనయగ్ని యడఁగు నింధనములు, మీఁద నైన బలము మిగుల లేని
యోగ మట్లు తనకు నురునట్టిదాసన, సాద మొందు సకలజనమనోజ్ఞ. 579

ఆ. ఇద్ధ మైనయగ్ని యింధనసంపద, నతిశయిల్లునట్టు లధికబలస
మగ్రసారయోగమహిమయు నంతంత, కగ్గలించు వ్రతము లగ్గలింప. 580

క. స్రోతోవేగము పటుగతి, వీతబలుం దిగుచునట్లు విషయము లీడ్చుం
జేతోబలసంభృతయో, గాతిశయుఁడు గానివాని సంచితచరితా. 581

క. నదిరయము వారణేంద్రుఁడు, గుదియించినయట్లపోలెఁ గురువర పైన్యా
స్పద మగువిషయోల్లాసముఁ, గుదియించును యోగసిద్ధి గురుహృద్బలుఁడున్.

తే. కుపితుఁ డగునంతకుండును గ్రోధఘోర
మృత్యువును నైన నియమసమృద్ధయోగ
బలుని దెస వోవఁ జాల రప్రతిహతముగ
నెందుఁ జరియించు నతఁడు నరేంద్రముఖ్య. 583

క. భోగంబుఁ దపముఁ బొరిఁబొరి, రాగవిరాగతల హృదయరంగమునకుఁ గే
లీగతులఁ దెచ్చి యార్చుచు, యోగి యనుభవించుఁ దగిలి యుండఁ డెందున్.

క. జగతీవర యోగస్థా, లగతులు సెప్పితి వినం గలదు సూక్ష్మవిధం
బగుమార్గప్రచయము త, న్నిగదన మవధానమున వినిన మతి దేఱున్. 585

క. ఏమిగతి లక్ష్యభేదముఁ, దా మేలుగఁ జేయు ధన్వి తత్పరుఁ డై యో
గామలచిత్తుఁడు మోక్షం, బా మెయి సాధించువాఁ డహంకృతిదూరా. 586

ఆ. నేతికుండ మోచి యే తెలివున సోప, నాలు ప్రాఁకునై పురణంబు గలుగు
పురుషునట్లు యోగపరిణతుండును నాత్మ, నేమఱక విముక్తి కెక్కవలయు.

తే. రథికునకుఁ గలమరికి సారథియుఁ గర్ణ, ధారుఁడునుబోలె నాత్మకుఁ దాను సుపథ
వర్తనైకవిధాయి గావలయు యోగ, ధారణానిశ్చలుం డగు ధీరుఁ డధిప. 588

క. శిరమును నాభియు హృదయము, నురమును గర్ణములుఁ బార్శ్వయుగళము నాత్మా
దరణీయస్థానము ల, య్యిరవులఁ గను యోగి యాత్మ నిభపురనాథా. 589

వ. అనిన నజాతశత్రుం డాపగాపుత్త్రునితో ని ట్లనియె. 590

తే. యోగి యెట్టియాహారంబు లుడుగవలయు, నాతఁ డెబ్బంగి భోజ్యంబు లనుభవించి

బలము వడయువాఁ డిది నాకుఁ దెలియఁ జెప్పు, వే జనస్తవనీయసమిద్ధబుద్ధి.

సీ. అనవుడు నతనితో నతఁడు సుస్నిగ్ధంబు, లైనయాహారముల్ మానువాఁడు
యోగి నీరసముల నుదకంబులను జాల, నాఁకలి వుచ్చుచు నవియు నుదర
మధికపూర్ణం బగునట్లుగాఁ గొనక వ, ర్తించుట బలము వర్ధింపఁ జేయు
నని చెప్పి వెండియు ననుఁ గామమును గ్రోధ, మును నిద్రయును దృష్ణయును భయంబు

తే. రతియు నరతియుఁ బవనంబుగతియు నుడిపి, ధారణానిశ్చలుం డయి తన్నుఁ దాన
కనుచు నుండెడుయోగి దుర్గంపుఁ జోటు, వెడల నరిగి సుఖస్థానవిభవ మొందు.

క. జనవర యసిధారావ్రత, మనఁ దగియెడుధారణానియతి పనుపడు నె
వ్వనిచిత్తంబున నాయో, గనిరూఢున కరిది యైనకార్యముఁ గలదే. 593

క. యోగనిరూఢుఁడు సంగ, త్యాగానందైకరతుఁ డతనికి జననసం
యోగము మృతి దైన్యంబును, భోగాభోగసుఖదుఃఖములు లే వధిపా. 594

క. అతనికి సరిత్సముద్ర, క్షితిభృద్ద్వీపములు గెలికిం బట్టులు దా
మతిఁ దలఁచెనేనిఁ బరిశాం, తత నున్నను గుడియు గుహయుఁ దగుమందిరముల్.

క. విముఖుం డగుటయుఁ గీడులు, దమయంతన చెందు జనులఁ దా వారలకున్
సుముఖుం డగుటయు శుభములు, సమకూరును శివునియట్ల చరితము లెల్లన్.

వ. అని చెప్పి వెండియు. 597

తే. యోగతంత్రంబు సకలశాస్త్రోదితంబు, విను విశేషించి లోకైకవిభుఁడు సెప్పె
దీని నారాయణుఁడు మునిమాననీయ, మిది మనంబునఁ దెలిసికొ మ్మిద్ధచరిత.

వ. అనిన విని ధర్మతనయుండు యోగతంత్రప్రకారంబు భవత్ప్రసాదంబునం
ప్రబుద్ధం బయ్యె సాంఖ్యస్వరూపం బెట్టిది యెఱింగింపవే యని యడిగిన నతనికి
దేవవ్రతుం డిట్లనుఁ గపిలాదిమహామునిదర్శితం బైనమార్గంబున వివరించెద. 599

భీష్ముఁడు ధర్మజునకు సాంఖ్యస్వరూపనిరూపణంబు సేయుట.

సీ. వినుము దృఢజ్ఞానమున విషయంబుల, భంగి లెన్నఁగ నారయంగ వలయు
నవియుఁ దిర్యఙ్మనుష్యామరపితృసిద్ధ, గరుడగంధర్వకిన్నరులయందు
వేఱ చందంబు లై విలసిల్లు శ్రుతివాక్య, దృష్టంబు లగు[1] దానఁ దెలియ నరయు
పరిచయంబున భేదపరిబోధ మేమిటి, కనరాదు తోఁచినయప్పు డవియు

తే. దురితకరముల యని వానిఁ దొడరకుండ, వలదె[2] లెన్నఁగ నెఱిఁగినవచ్చుఁ దొలఁగ
నేమఱిమి దక్క నొం డొకం డేల చోర, జనులఁ జిట్లంగ నడుచుట కనఘచరిత.

చ. తలఁపఁగ నాయు వింతియ కదా యని సౌఖ్యము దుఃఖముం బొరిం
గలుగవె కాలవృత్తి నని కర్మము లిట్లని వేదచోదనం
బుల బహుభంగు లిట్టి వని బుద్ధికి సత్త్వరజస్తమోగుణం
బులకుఁ బ్రవర్తనంబు లివి పొ మ్మని కాంచుట చాల మేలగున్. 601

1. గ. దానఁ-చ. దానిఁ-జ. దాను-దెలియు నరయు-క. దెలియ నవియు. 2. చ. వేలఁగ.

సీ. ఇంద్రియార్థంబుల నేనింటఁ నైదింద్రి, యములును గోష్ఠంబునందు వహ్ని
పవనుండు బయలను బావకునందుఁ దో, యములును భూమిఁదోయముల బలము
కౌశికునందును గ్రాంతి యుపేంద్రుని, యందును సర్థంబునందు లోభ
మును దమస్సునబుద్ధియును రజస్సునఁదమ, స్సునుసత్త్వమునరజస్సునుగరంబు

ఆ. దగులు సత్త్వ మాత్మఁ దగులు నాత్మండు నా
రాయణుఁడు మహేశుఁ డనఁగఁ బరఁగు
పరముఁ దగులు నతఁడు పరము మోక్షంబుసఁ
దగులు మోక్ష మెందుఁ దగుల దధిప. 602

క. ప్రకృతిపదాఱువికారము, లకు నాశ్రయ మాత్మ కది నెలవు విను మాత్మం
డకుటిలతేజోరూపతఁ, బ్రకృతియు వికృతియును గాక ప్రస్ఫురితుఁ డగున్.

తే. ఆత్మనకు రెండురూపంబు లనఘ కలవు, విషయసంగతి నొక్కటి విస్తరిల్లుఁ
దదుపభోగంబు లేకమఱవ్యస్థభావ, మొందియొక్కఁడు వెలుఁగుచునుండుఁజూవె.

క. పవనం బేకము ప్రాణా, దివిభేదము లైదు విను తదీయంబులు వా
నివిధంబు లరయ నిశ్చల, మవు నది యాసుకృత మంతరాత్మునిఁ జూపున్. 605

క. విను గర్భవాసదుఃఖం, బును జన్మవ్యథయు బాల్యము విమూఢత్వం
బును రాగక్లేశజరా, జనితకృపణతలును జూపు సంగముఁ బాపున్. 606

ఉ. చెందుచు నుండుఁ బుణ్యములు సేసి సురత్వము మధ్యకర్ముఁ డై
యొందు నరత్వముం దురితయోగమునం బశుకీటభావముం
బొందు సుఖంబు దుఃఖమును బొందఁగ జీవుఁడు దీనిభేదశ
క్తిం దెలియంగ నేర్చినమతిం గలయాతఁడు గోరు మోక్షమున్. 607

క. క్షయవృద్ధులఁ జంద్రుఁడు న, బ్ధియు లోనుగఁ బొందుచుండఁ దెలియఁడు బంధు
క్షయమునకు వగచు నజ్ఞుం, డయమహితా దీని నెఱుఁగు టమలతఁ దెచ్చున్.

క. తనదేహముదోషములం, గని వేవురలో నొకండు గలుగు విముక్తిం
గనుపని కుద్యోగించుట, కనఘా పెక్కండ్రు లే రహంకృతికతనన్. 609

వ. అనిన విని యుధిష్ఠిరుండు దేహదోషంబు లెవ్వి యెఱింగింపవే యనుటయు నని
మిషనదీనందనుం డతని కి ట్లనియె. 610

క. విను కామముఁ గ్రోధము భయ, మును నిద్రయు నిశ్వసనము భూవర దేహం
బునఁ గలదోషము లీవై, దును బాపెడితెఱఁగు సెప్పెదం దెలియంగన్. 611

సీ. క్షమ క్రోధమునకు సంకల్పవర్జనము కా, మమునకు నప్రమాదము భయంబు
నకు సత్యసంసేవనము నిద్రకును లఘు, భోజిత నిశ్వాసమునకు వైరు
లని చెప్పి వెండియు ననేకము లగు, దోషముల్ దొలఁగంగఁ ద్రోచు వెరవు
లును బెక్కు లవి గనికొను వివేకము గల, పురుషుండు తన్మార్గపరిచయమున

తే. విష్ణుమాయను దోఁచునీవిష్టపములు, భిత్తిచిత్రంబువిధమున ఫేనభంగి
బుద్బుదాకృతిగాఁగను బుధుఁడు దీని,సరకుసేయక మోక్షంబుతెరువువెదకు.

—ఆత్మ పరమపదంబుఁ బ్రాపించెడుప్రకారము.—

వ. ఇది సాంఖ్యప్రకారంబు బహిస్స్పర్శంబులు తపోదండంబునం దోలంగా జడిసి యానపాత్రరూపంబుగా దీని నవలంబించినయార్యుండు ప్రజ్ఞాకర్ణధారసామర్థ్యంబున దుఃఖోదకంబును వ్యాధిమృత్యుమహాగ్రాహంబును భయోరగంబును హింసావేగంబును రాగపంకంబును దృష్ణా[1]వర్తంబును నానాప్రీతిరత్నంబును సత్యతీరంబును నగుసంసారసాగరంబు నుత్తరించు నాసుకృతి నట సూర్యుండు దనరశ్ముల వహించి నడవుపద్మతంతుసన్నిభంబైనమార్గంబు ప్రవేశించినసంజనసూక్ష్ముండును శీతలుండును సుగంధియు సుఖస్పర్శుండును సప్తమారుతశ్రేష్ఠుండును నగుపవనుం డెదుర్కొని నభఃపరమగతిం జేర్చు నభంబు రజఃపరమగతిని రజస్సు సత్త్వపరమగతిని సత్త్వంబు నారాయణుని నారాయణుండు పరమంబునం జేర్ప నందుం గలసి తన్మయుండై యమృతత్వనిత్యుం డగు నని చెప్పిన విని పాండవాగ్రజుం డట్లమృతస్వరూపశాశ్వతుండగునమ్మహాత్ముండు దనపూర్వవృత్తంబు దలంచునో తలంప కుండునో దానినిశ్చయం బతిగహనంబు మోక్షంబు దలంచి పరమజ్ఞానమగ్నుం డగుటం బురుషున కెద్దిదశయో యనువితర్కంబున నది ప్రవృత్తిధర్మంబుకంటె మేలన రాకున్నది యీరెండుదెఱంగులుం దెలుప నీవ కాక యీలోకంబున నొరులు గలరే యనుటయు నజ్జనపతికి జాహ్నవీనందనుం డి ట్లనియె. 613

క. అడిగితి లెస్సగఁ బ్రశ్నము, గడుసంకట మెట్టిమేటులకు గలవారలు నె
ప్పుడు సంశయించుచో టిది, దడయక యుత్తరము సెప్పెదం దేటపడన్. 614

వ. కపిలదర్శనవిదు లగుమునీంద్రులపరమమతంబిదియవహితుండవై యాకర్ణింపుము.

సీ. పురుషుని నింద్రియంబులెఱుంగ వవి మన,స్సులుగావున మనస్సంగమమునఁ
గను వాని నతఁడు ముక్తత్వంబు లేనియ,ప్పుడుఁ గల్గినను నది పురుషునందు
సమమ నిర్విషభుజంగములట్ల నిశ్చేష్ట, నున్నయింద్రియములం గన్నఁ గాన
కున్నను నేమి యయ్యుదితవిజ్ఞానామృ,తస్వరూపునకు నాతండు దోఁచఁ
తే. గాష్ఠకుడ్యకుసూలాదికములచంద, మొందు నట్లుగాకయు నింద్రియోత్కరంబు
శరధిఫేననిభం బయివిరియు నవ్వి,భూతి యీశ్వరు తెఱఁ గాత్మఁబొందకున్నె.

క. విను మింద్రియసహితముగా, మనుజాధిప బోధపూర్ణమగ్నత్వము గ
ల్గినసుం దత్పూర్వాత్మగతులఁ, గనుఁ బురుషుఁడు గనియు నిర్వికారత నుండున్.

తే. భూతములను గుణంబుల బుద్ధి మనసు
నడఁచికొని జీవుఁ డొందు నారాయణునిఁ ద

1. చ. తరంగంబును.

దీయమాహాత్మ్యమున మానసనియపరమ
పదము గనుఁ గాన నిష్పుణ్యపాపుఁ డతఁడు. 618

క. పునరావర్తనరహితుం, డనఘా పరమాత్ముఁ జెందినట్టిపురుషుఁ డ
వ్వినుతావస్థను మోక్షం, బని చెప్పుదు రంతకంటె నధికము గలదే. 619

వ. అని చెప్పి వెండియు. 620

క. గురునివచనంబు తెఱఁగున, బరమార్థనిరూపణంబు[1]పని నియతిం ద
త్పరుఁడై నడపం జాలిన, పురుషునిఁ దడయక ప్రశాంతి పొందు నరేంద్రా.

చ. జనవర సాంఖ్య మిట్టిది ప్రజాపతిపూజ్యము బ్రహ్మభావభా
జనత ఘటింప దీనిసరి సమ్యగుపాయము లెందు లేవు నె
మ్మనమున సంశయింపక సమాహితచిత్తత దీని నూఁదు ని
స్తనుఁ డగు నమ్మహేశునకుఁ దాఁ దను విం కిట వేయు నేటికిన్. 622

తే. వేదశాస్త్రపురాణసంవేదితంబు, లైనబహువిధసంపరిజ్ఞానములకు
నెల్ల నిది సేరుగడసూవె యేఱులకు స,ముద్రమునుబోలె నుపశాంతిభద్రచిత్త.

వ. యోగులును సాంఖ్యులును జూచువెరవు లాకర్ణించితి కాదె యిది యిట్లగుటం జేసి
దర్శనభేదంబు గల దంటె నదియును నల్పాంతరం బదియునుం గాక. 624

ఆ. యోగిచూచుభంగి నుర్వీశ సాంఖ్యుండుఁ, జూచు సాంఖ్యుఁ డరయు చొప్పు యోగి
వరుఁడు నరయుఁ గాన వారిద్దఱును నొక్క, తెరువువార యండ్రు పరమమునులు.

క. విను సాంఖ్యమ్మును యోగము, ననుపేళ్లుల కాని దీనియం దదియును దా
న నిదియుఁ దోఁచుచు నుండుం, గనుఁ దత్త్వవిచారి యొకఁడ కా నీ రెంటిన్.

క. ఈ తెరువునఁ జరియించుచు, నే తెఱఁగున నైనఁ దప్పనేనియుఁ బురుషుం
డాతతనాకసుఖము గనుఁ, దో తెంచును మగుడ సద్బుధులవంశమునన్. 627

ఆ. మఱియు నిత్తెఱంగు మనసున నెలసిన, వినుతమోక్షలక్ష్మి విభుతఁ గాంచు
నిట్టి తెరువు సూప[2]నెవ్వరి కలవి నా,రాయణునకు కాక యమలచరిత. 628

వ. నారాయణప్రణీతంబై యక్షరప్రదర్శకంబై నయిత్తెఱంగుఁ జిత్తంబున నలవరింపు
మని దేవవ్రతుండు ధర్మనందనునకుం జెప్పె నని యిట్లు వైశంపాయనుండు
జనమేజయునకుం జెప్పిన నటమీఁద వర్తించినవిశిష్టసల్లాపంబును జెప్పవే యని
యడుగుటయు. 629

శా. లీలాస్వీకృతచక్రశూల వినతాళీరక్షణాలోల దు
శ్శీలస్వాంతవిదూర వేదజలదశ్రేణీమయూరా సమి
త్కేళీఖండితదైత్య నిర్జరగణక్షేమక్రియానిత్య ని
స్త్రైలోక్యత్వనిరంజనాగ్రవిహృతీ సంస్థాపకవ్యాహృతీ. 630

క. సురమకుటఘటితరత్న,స్ఫురితచరణ పింఛదామ॥భుజగాభరణా
కరుణామయదివ్యాంతః,కరణ జరామరణనోద॥కపదస్మరణా. 631

మాలిని. జపయజననిషేవ్యా ॥ సంగనిర్ముక్తభావ్యా
విపులదురితభేదీ ॥ విశ్వలోకప్రమోదీ
యపరిమితవిభూతీ ॥ [1]యప్రమాణస్వరీతీ
యుపనిషదవగమ్యా ॥ [2]యోగభావ్యైకరమ్యా. 632

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైనశ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందుఁ బంచమాశ్వాసము. 633



1. చ. యప్రమాణావ్యతీతీ. జ. యప్రమాణాధ్యరీతీ. 2. గ. యోగిభావైకరమ్యా.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శాంతిపర్వము, షష్ఠాశ్వాసము.





సంధానప్రౌఢద
యాసంభృతభక్తమోద యఖిలజగద్ర
క్షా[1]సక్తివినోద శమా
భ్యాస[2]నిరతనిర్విభేద హరిహరనాథా. 1

### భీష్ముని ధర్మజుండు ప్రశంసించి యక్షరక్షరంబుల నడుగుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు యోగసాంఖ్యవిదు లక్షరంబు నొంది యానందస్వరూపు లగుదు రని చెప్పిన విని ధర్మతనయుండు దేవవ్రతునితో నీవు పరమజ్ఞాననిధి వని వేదసంవేదు లగువిప్రులు సెప్ప నప్పలుకులును నిన్ను సాంఖ్యయోగప్రవీణు లయినయోగులును మునిపతులును వర్ణింప నవ్వచనంబులును నాకర్ణించుచుం బ్రమోదంబునం బొందుచుండుదుము దక్షిణాయనశేషదినంబు లింక నల్పంబు లయ్యెండు మరలంబడినం బరమగతిం బ్రాపించెదవు మఱి మే మెవ్వరిచేత వినువారము కురువంశంబునకుం బ్రజ్ఞాఘృతప్రదీపితం బగుదీపంబుగా వెలుగుతేజంబు నాశ్రయించెద మని తనవారలం గలపి కొని పలికి నీవు నిర్దేశించినయక్షరం బనునదియెట్టిది క్షరం బెయ్యదియెఱింగింపవే యనుటయు నతండు వసిష్ఠజనకసంవాదం బనం బరఁగువిశిష్టేతిహాసంబు గలదు దాన నీయడిగినయవియును మఱియు నెఱుంగ వలయునట్టివి యనేకార్థంబులును దెలివిపడు విను మని సుప్రసాదభరితుం డై. 2

సీ. అనఘు సుఖాసీనుఁ డై నవసిష్ఠసం,యమిఁ గాంచి భక్తిఁ బాదముల కెఱఁగి
జనకభూనాథుండు వినయంబుతోడ ను,పాసించి మునివర యక్షరం బ
నాది శివం బన నపునరావృత్తిసి,ద్ధిద మగు చుండు నెయ్యది యెఱుంగఁ
జెప్పవే యనుడు నాశ్రితవత్సలుం డగు,నమ్మహాత్ముఁడు దెలియంగఁ జెప్పె

తే. నద్దయాళుని చెప్పిన। యత్తెఱంగు, ప్రస్ఫుటంబుగఁ జెప్పెదఁ । బాండవాగ్ర
జన్మ నీ కని పలికి య।జ్జాహ్నవీత,నూజుఁ డిట్లను నానాం।భోజ మలర. 3

వసిష్ఠజనకరాజసంవాదప్రకారము.

వ. జనకజనేశ్వరు బోధించుటకై వసిష్ఠమునీశ్వరుం డిట్లనియె. 4

క. నయనముఖపాణిపాదము, లయమహితా యెందుఁ గలిగి । యాద్యంతపరి
క్షయవృద్ధిరహిత మై ని,ర్ద్వయ మగుతత్త్వంబు నక్ష।రం బండ్రు బుధుల్. 5

క. క్షర మండ్రు దానివలనను, క్షరియించినతత్త్వములను । జనవత్సల య
య్యిరువదినాల్గింటిని దర,తరమ విభాగించి చెప్పె।దం దెలియంగన్. 6

తే. అక్షరము విక్రియా।శబలాత్మకత్వ, మొందు నవ్విక్రియకును బే।ళ్లొలసెఁ బ్రకృతి
యనఁ బ్రధానంబునాఁగన।వ్యక్తమనఁగ, దానఁబుట్టుమహాన్నామ।తత్త్వమనఘ.

తే. విను మహంకారమాతత్త్వ।మున జనించు, దాన భూతపంచకమును।దద్గుణంబు
లైన శబ్దాదివిషయంబు।లైదు నింద్రి,యములుఁ బదియును మనసును।నావహిల్లు.

క. క్షర మియ్యిరువదినాలుగు, నరనాథా యక్షరంబు।నకు నెయ్యెడలన్
క్షరభావము లే దయ్యు,క్షరమువిలాసములు సూవె । క్షరతత్త్వమ్ముల్. 9

వ. ఈచతుర్వింశతితత్త్వంబులును విజ్ఞానగోచరంబులు పంచవింశతితమం బైయక్ష
రం బనం బరఁగునిప్పరమతత్త్వంబు విను మవిజ్ఞేయం బవ్యయం బకలంకం బనా
మయం బమృతంబు. 10

క. జననాథ యక్షరం బెం,దును క్రీడఁ జరించుఁ ద్రిగుణ।దోహలపర మై
తనకుఁ బ్రబోధము లేకు,న్నను నానాయోనిగతజ।ననములవెంటన్. 11

క. విను సత్త్వరజస్తమముల,యనుసరణమువలన వివిధ । మగుయోనిగణం
బున నెలసినయాతత్త్వము, దనుఁ జూడఁగ లేక యవియ।తా నని యుండున్.

ఉ. సత్త్వరజస్తమోగుణవ।శస్థితి నక్షర మర్త్యధర్మసం
గత్త్వము మద్యకర్మతయుఁ । గిల్బిషకృత్యము నొంది యొంది ది
వ్యత్త్వనరత్వగోమృగఖ।గాదికతిర్యగనేకహీనజం
తుత్త్వములన్ సుఖంబులును । దుఃఖములున్ నరకంబులుం గనున్. 13

క. జనవర శుక్లము లోహిత,మును కృష్ణము నైనవర్ణ।ముల నక్షర మొం
దును సత్త్వరజస్తమముల,యనుసారంబున నవర్ణ । మయ్యు వికృత మై. 14

క. అగుణం బయ్యును నిమ్మెయిఁ, బ్రగుణతఁ బ్రాపించు నక్ష।ర మహంకార
స్థగుణం బూఁదిన విడిచినఁ, దెగు నన్నియు నిర్వికార।[2]దీప్తంబు నగున్. 15

వ. అని చెప్పి వెండియు. 16

చ. క్రతువులఁ దీర్ఘయాత్రలను । రాత్ర్యశనంబుల భూమిశయ్యలన్
వ్రతపరినిష్ఠలన్ జడలు । వల్కలముల్ వివిధంపుదండముల్

1. చ. యుండి. 2. క. దీపంబు.

సతతముఁ దాల్చుటఁ వపువు గ సంకటపాటునఁ బెట్టు నాద్య మ
చ్యుత మమలంబు దాను దనుఁ గ జూడక యక్షర మప్రబుద్ధమై. 19
క. అమృతము నభవము నజరము, నమలము నగుతన్ను మృతముగనాహితభవముగ
సమధికజరమును మలసహి, తముఁగా నక్షరము మమతగ దలఁచు నరేంద్రా.
ఆ. తనకుఁ దాన బంధ గ మొనరించుకొనియెడు, పొత్తినూలికాయగపురువుభంగి
నగుణమయ్యునగుణగ తావాప్తిఁబొందున, క్షరము ప్రకృతిగుణముగసంక్రమించి
ఆ. అమలవాయుసేవగనము నిర్మలత్వంబు, గలుగఁగాఁ బదాఱుగకళలఁ బూర్ణుఁ
డగుసుధాంశుమాడ్కి గ నక్షర మమలినా, ఖండశాంతిబోధగఘనత వెలుఁగు.
వ. అనిన విని జనకుం డమ్మునీశ్వరున కిట్లనియె. 21
క. వనితకుఁ బురుషునకుం దన, తనయుంతన యూహకం దోగదవఁ జేయుఁగ వి
న్నను వు గలుగ దొండొరువుల, నెనయుటఁ గాని శ్రుతిమతిము గనిట్ల మహాత్మా.
క. వనితగుణంబులు చర్మం,బును మాంసము శోణితంబుఁ గ బురుషగుణతతిఁ
విను మజ్జాస్థిస్నాయువు, లనఘుతపోవిభవ యిట్లు గ యని శ్రుతి సెప్పున్. 23
వ. ఇది తిర్యఙ్మనుష్యాదు లైనసకలయోనులయందును జన్యంబు లావహిల్లెడి
తెఱంగు. 24
క. నరనారీసంబంధము, వరుసగదా పురుషునకును గ బ్రకృతికి నన్యో
న్యరమణ మది సర్వజనన, కర మిట్టుల శ్రుతులు సెప్పుఁ గ గారుణ్యనిధీ. 25
క. వినుము ప్రకృతిపురుషులభం, గి నిరూపింపంగ ముక్తిగకెని మార్గంబుం
గను వెరవు లేక యున్నది, మునినాయక యెఱుఁగఁ జెప్పు గ మోక్షపదంబున్.
క. అనుపమ మజర మతీంద్రియ, మనామయ మనంత మమలగమన వెలుఁగు నొకం
డని వేదశాస్త్రములచే, విని యుండుదు దానిఁ దెలుపగ వే కృప నాకున్. 27
వ. అని వేఁడిన నమ్మునివరుండు సాదరంబుగా నతని కిట్లనియె. 28

వసిష్ఠుఁడు జనకున కక్షరక్షరతత్త్వంబుల తెఱం గెఱింగించుట.

సీ. గ్రంథంబు ధరియింతు గ గాని నీ కర్థబో,ధంబు లే దర్థబోగధవ్యపేత
మగు గ్రంథధారణ గ మప్రయోజన మర్థ,నిశ్చయ మెఱిఁగింతు గ నిపుణబుద్ధి
నవధరింపుము సాంఖ్యగమనుసరించును యోగ,తంత్రంబు నదియునుగ దాని తెరువు
నొందుఁ గావునసాంఖ్యగ యోగంబు లేకంబ,యని కంద్రు ప్రాజ్ఞులు గ మనుజనాథ
తే. సాంఖ్యమునకు యోగమునకు గ జనని శ్రుతియ
పురుషవనితానపుంసకంగబు లనఁ బ్రకృతి
లింగములు గల వాత్మం డగలింగుఁ డతఁడు
జెంద దది యెద్దియును నని గ చెప్పు శ్రుతులు. 29
క. విను బీజంబున బీజం, బును దేహమునందు దేహగమును నింద్రియముల్

దనతనవలనం దానును, మనంబునకు మనసు వుట్టు ॥ మహితవిచారా. 30

తే. ఇతఁడబీజుండదేహుండగనింద్రియుండు,వీతమానసుఁడనియాత్మకవిధముసెప్ప
వేదములు భవదుఃఖకర్మాదికములు, నాతనికి లేవు నిర్గుణుఁ ॥ డగుటఁజేసి. 31

చ. ప్రకృతి యలింగ తజ్జనితభంగులు లింగము లట్టు లయ్యు రం
జకగుణశీల లింగచయసంగతిఁ దాను సలింగ యయ్యె మూ
ర్తికలన లేక యుండియుఁ బరిస్ఫుటపుష్పఫలాదిసూచక
ప్రకరముచేత మూర్త మయి ॥ రంజిలదే ఋతువేళ నూడఁగన్. 32

క. కావున గుణములు ప్రకృతివ, యేవిధమునఁ జూచినను మహేశ్వరుని గుణి
త్వావేశము పొరయ దస,ద్భావము సద్భావ మగునె ॥ భరితవివేకా. 33

వ. ఇది యక్షరక్షరవివేకం బేకం బనేకంబు దర్శనం బదర్శనంబు నిస్తత్త్వంబుతత్త్వం బపవర్గంబు వర్గం బని యక్షరక్షరంబులపర్యాయనిర్దేశంబు లక్షరంబు నప్రబుద్ధులు గానరు ప్రబుద్ధు లగుసాంఖ్యులును యోగులును బుద్ధికిం బరంబై పంచవింశతితమం బయినయాత్మత్త్వంబు నాలోకింతు రని చెప్పిన వసిష్ఠుతో సవ్వసుమతీవల్లభుండు. 34

సీ. కలదు నానాత్వ మేకత్వ మాత్మునకు న,విద్యయు విద్య నా ॥ విందు నదియు
నదియును నెఱిఁగింపు ॥ మక్షరక్షరభేద, మీవు సెప్పితి బుద్ధి ॥ యెంతయేని
నస్థిర గాన యర్థవ్యవబోధమును మాసె, సాంఖ్యయోగంబులచందములును
దెలియంగఁ జెప్పఁగావలయు నాకనుడు న,మ్ముని యిట్టు లనియె నమ్మనుజపతికి

తే. యోగ మనఁగను ధ్యానంబు ॥ రాగరహిత
యదియు వినుము ప్రాణాయామ ॥ మనఁగ నొకటి
మనసునేకాగ్రతావృత్తి ॥ యనఁగ నొకఁడు
పరఁగు సగుణత్వనిర్గుణభావగతుల. 35

వ. తదనుష్ఠానప్రకారంబు సెప్పెద. 36

క. మలమూత్రంబులకాలం,బుల భుక్తి కనంతరమున ॥ భూవర యోగం
[1]బలవఋచురెండుమార్గం,బులును నిషిద్ధంబు లండ్రు ॥ పూర్వాచార్యుల్. 37

సీ. క్రొంచెపుటశనంబు ॥ గొనుచు సంగంబులఁ, బాసి యింద్రియములపజ్జఁ జనమి
శబ్దాది యైనవిషయజాత మంతరం,గంబున సందడి ॥ గాక యుండ
సద్బుద్ధి దృఢ మగుసాధనంబుగఁ గొని, మరలిచి యాత్మన ॥ మనసు నిలిపి
యపగతసంకల్పుఁ ॥ డై యుపలస్థాణు,భంగికస్థితిఁ బనుపడి దివంబు

తే. రాత్రియును యోగసేవానురతి నివాత
దీపమునుబోలె వెలుఁగునాత్మీయమూర్తిఁ
గనుచు నెడనెడ నుపరమకాలములు స

1. క. బలవడదు రెండు.

నంగ వర్తించి యోగి యోగానంద మొందు. 38

వ. ఇది యోగప్రకారంబు సాంఖ్యంబు తెఱం గెఱింగించెద. 39

తే. ప్రకృతివాదు లవ్యక్తంబు ప్రకృతి యండ్రు
ప్రసవధర్మిణి యైనయా ప్రకృతి దన్ను
బుద్ధ్యహంకారములఁ బంచభూతములును
విషయములు నింద్రియములుఁగా విస్తరించు. 40

వ. పురుషునివలన నివి యెల్లనుం గలుగుఁ బురుషుం డింతకు నధిష్ఠాత యై యుండు.

క. అనులోమంబున సృష్టియు, జనవర ప్రతిలోమవృత్తి సంహారముఁ గ
ల్గును జననప్రళయంబులఁ, దనకు బహుత్వంబు నేకతయు శోభిల్లున్. 42

వ. క్షేత్రం బన నవ్యక్తం బనం బ్రకృతి యనం బ్రధానం బనం బరఁగుతత్త్వం బొక్కటియ దానిన సత్త్వంబునండ్రు జీవుండా క్షేత్రంబు నెఱింగెడివాఁడుగావున క్షేత్రజ్ఞుఁడును నవ్యక్తపురంబున వసియించుటంజేసి పురుషుండు నన వెలుంగు క్షేత్రక్షేత్రజ్ఞులు వేఱగుట ప్రస్ఫుటంబవ్యక్తంబు జ్ఞానంబుపురుషుండుజ్ఞేయుండు ప్రకృతి సగుణాత్మిక పురుషుండు నిర్గుణుం డిది సాంఖ్యప్రకారం బిట్లు పరిసంఖ్యానరూపంబునఁ జతుర్వింశతితత్త్వంబుల నేర్పరించి పురుషుండు దన్నుఁ దాన చూడం గైవల్యంబు సిద్ధించు నిట్టిది యపునరావృత్తిపదంబు తత్త్వసమూహం బప్రబుద్ధం బది క్షరంబు పంచవింశతితత్త్వవిశిష్టుం డగుపురుషుండు ప్రబుద్ధుం డక్షరం బనం బరఁగు నిత్తెఱం గెఱింగినవా రెల్లవలనను నిర్భయులు భూవర యోగంబును సాంఖ్యంబును నక్షరంబును క్షరంబును జెప్పితి విద్యావిద్యలు సెప్పెద నాకర్ణింపుము. 43

ఆ. విద్య యనఁగఁ బంచవింశతితమతత్త్వ, మైనయక్షరంబు మానవేంద్ర
విను మవిద్య నాఁగ జనుఁ బ్రధానము దేట,పఱిచెదను విశేషభంగు లెల్ల.

విద్యావిద్యలప్రకారనిరూపణము.

వ. కర్మేంద్రియంబులకు బుద్ధీంద్రియంబు విద్య బుద్ధీంద్రియంబులకు మనస్సును మనస్సునకు భూతపంచకంబును భూతపంచకంబునకు నహంకారంబును నహంకారంబునకు బుద్ధియు బుద్ధికి నవ్యక్తంబును నవ్యక్తంబునకుం బంచవింశతితమతత్త్వంబును విద్య లని చెప్పి వెండియు నమ్మునివరుం డి ట్లనియె. 45

తే. క్షరము నక్షరమును ననఁ గలుగు రెంటి, నేర్పఱిచి మున్ను సెప్పితి నింక నొకటి
సెప్పఁగలదు సమగ్రవిశేషకలిత, మవహితుండ వై విను విదేహాధినాథ. 46

సీ. జీవుండుఁ బ్రకృతియు భూవర యక్షర,క్షరము లీరెంటిని క్షరము లనియు
నార్యులు సెప్పుదు రక్షరంబులు నందు, రాద్యంతరహితంబు లగుట యీశ్వ
రత్త్వంబు గల్గుట తత్త్వాదికము లనఁ, జనుట రెంటికి సదృశంబు సూవె
ప్రకృతిగుణంబు లై పరఁగెడుమహదహం,కారాదికంబులఁ గలసినపుడు

ఆ. క్షరమనంగ వచ్చుఁ బురుషునిఁ బ్రకృతిదా, ననితలంచుఁ గాన యదియుఁ బురుషుఁ
బొందగుణవికారములు లేమి నిర్గుణ, మక్షరం బనంగ సగును దాని. 47

వ. ఎప్పుడు పురుషుండు ప్రబుద్ధుం డయ్యె నప్పు డతండు. 48

ఆ. ఇంతకాలమేని నెఱుఁగక సంగాభి,భూత యగుచు నప్రబోధకలిత
మైనయట్టిప్రకృతియే నంటి నిస్సంగ,బోధమహిమ గానఁ బోలదయ్యె. 49

క. ప్రకృతికి నాకును నుదకము,నకు మత్స్యంబునకుఁ బోలె నైసర్గిక మై
ప్రకటం బైనది వేర్పా, టకట యహంకారవశత నది యే నంటిన్. 50

క. ప్రకృతి గుణంబులఁ గొని బహు,వికృతపురూపముల నట్లు వెట్టిగొలిపె నే
నకలంకుండ నరూపుఁ డఁ, బ్రకృతి దొఱఁగి నిలిచెదను నిరంజనమహిమన్. 51

తే. ప్రకృతి సేసెనె యీయపరాధ మరయ
నాయదియ కాక వేఱొకండె యసంగ
కలితుఁ డగునేను దానితోఁ గలయ నేల
కలిగె బహురూపములు దానఁ గాదె నాకు. 52

క. మమతం గాదే బహుజ,న్మము లయ్యెడు దీని విడిచి నానాయోని
భ్రమణంబుం బాసెద న,త్యమలుఁడ నగునాకుఁ బ్రకృతియాశ్రయ మేలా. 53

తే. ఎన్నిరూపులు గొని వచ్చి యెట్లు పొడవు,సూపెనేనియు దాని నేఁ జూడమమత
నా నహంకార మనఁ గల్గు వానిఁ జేర,నీక తోఁచినఁ బ్రకృతిదా నెట్లుఁ దోఁచు.

క. నిశ్చేతనయును నెంతయు, దుశ్చేష్టయు నైనప్రకృతి దొఱఁగి సముద్య
న్నిశ్చయవృత్తి నిరామయ,నిశ్చలనిర్మలపదైకనిరతుఁడ నగుదున్. 55

వ. అని యిట్లు పరమసంబోధనంబునం జేసి క్షరం బగునవ్యక్తంబు దొఱంగినపంచ
వింశకుం డక్షరం బనం బరఁగు నక్షరంబునకుం బరం బైనదానిం బెక్కం
డ్రెఱుంగరు సాంఖ్యసూక్ష్మత్వదర్శకులు గాంతురు క్షరాక్షరపరంబు లప్రబుద్ధ
బుధ్యమానబుద్ధంబు లనునిర్దేశంబులు గలిగి యుండుఁ బరతత్త్వనిర్దేశంబునం
బొల్పుపడ్వింశకంబు బుద్ధంబును విమలంబును నప్రమేయంబును సనాతనంబు
నునై పంచవింశంబును జతుర్వింశంబునుం గనుచు వెలుంగు నని చెప్పి వెండియు.

క. విను దృశ్యంబు నదృశ్యం,బును నగుజీవపరతత్త్వములు బ్రహ్మసమా
ఖ్యను నెగడుఁ బ్రకృతి కది లే,దనఘా యక్షరము తెఱఁగు నభివర్ణింతున్. 57

ఆ. ప్రకృతి దొఱఁగి తన్నుఁ బరికించుజీవుండు,పరము గాంచునపుడు ప్రకృతిసగుణ
తానిరూఢి యడఁగి తన్మయత్వము నొంది, జీవకేవలత్వసిద్ధి యొలయు. 58

క. విను కేవలుఁ డగుజీవుఁడు, దనుఁ బరముం గాఁగఁ జూచె తల్లీనత్వం
బున వెలుఁగు నది నిరామయ, మనంత మగుపదము సూవె యతులవివేకా.

క. ఈనెఱి పురుషునకుం గల,నానాత్వైకత్వములును నరనాయక శా
స్త్రానూనదృష్టిఁ గనుఁగొనఁ, గా నగుఁ దాత్పర్యశుద్ధికలితాత్మునకున్. 60

క. అనఘా మోక్షము తెలియఁ గిది, విను మోక్షణ మిట్లు పంచవింశకునకుఁగాఁ
గనినది యతండు ప్రకృతిం, దనుఁగాఁ గొని తద్గుణములఁ దగులుటవలనన్.
తే. తగులువాసి షడ్వింశకతత్త్వమునఁ గలయఁ, దనకుమును లేని కేవలతత్త్వమును నిర్మ
లత్త్వశుచితాస్వతంత్రత్వసత్త్వపరత, లొందుఁదద్ధర్మసమవాయ మొలసియధిప.
వ. అని యిట్లు ప్రబోధించి. 63
క. శివమును బరమబ్రహ్మము, నవికృతియు సనాతనంబు నగుపదమును భూ
ధవ యెఱిఁగించితి నిర్భయుఁడవు గ మ్మలవఱుపు మిది దృఢంబుగ నాత్మన్.
తే. దీని నెఱిఁగించునపుడు భక్తియును శమము
దమము సంశ్రయమును వేదతత్పరతయుఁ
గలుగఁ జూచి యెఱింగింపు కానివాని
కీకు మీవిద్య పాత్రదానైకనిరత. 65
ఆ. అఖిలరత్నపూర్ణ యగువసుంధర యెల్ల, నొసఁగ తేని నొసఁగు యోగ్యతాభి
యుక్తి లేనివాని కొసఁగకు మీవిద్య, దగినపాత్ర మైన దడయ కిమ్ము. 66
క. అని చెప్ప నియతుఁ డై విని, జనకనృపాలుఁడు కృతార్థజన్ముం డయ్యెన్
మనుజేంద్రవర్య నీ కే, వినిపించితిఁ దదితిహాసవిధ మేర్పడఁగన్. 67
వ. అని పలికి భీష్ముండు పాండవాగ్రజున కిట్లనియె. 68
క. ఇది బ్రహ్మ వసిష్ఠునకు, న్సదయుం డై చెప్పె నతఁడు నారదునకు సం
విదితంబు సేసె నమ్ముని, మదాత్మకుం దేటపఱిచె మహనీయకృపన్. 69
క. ఏను వసిష్ఠవచనముల, కా నెఱిఁగించితి మనంబు కలఁక విడిచి యీ
జ్ఞానం బలవఱుపుము పర, మానందప్రదము కౌరవాన్వయముఖ్యా. 70
క. క్షరమును నక్షరమును ద, త్పరమును నెఱిఁగితి విశోకభయమోహుఁడ వై
కురువర యానిశ్శ్రేయస, కరప్రబోధంబు నూఁదు గాఢాదరతన్. 71
వ. అని చెప్పి వెండియు. 72
సీ. వేఁటవేడుక నడవికిఁ జని వసుమంతుఁ, డనువాఁడు జనకునితనయుఁ డొక్క
చో భృగువంశతేజోవర్ధనుం డగు, నొకమునీశ్వరుఁ జూచి యుచితవృత్తిఁ
జేరి వినమ్రుఁ డై చిత్తానువృత్తిమై, నిహపరంబుల కెద్ది హితము సెప్ప
వే యన్నఁ గృప నతం డిట్లను భూతహి, తాహితాచరణంబు లధిప సౌఖ్య
ఆ. దుఃఖముల నొనర్చు దుర్వారతృష్ణ త, న్నిరసనంబు మేలు నరులు జుంటి
చవియ కాని నెగులుఁ జఱి రయంబున నెక్కి, తారు విఱుగఁబడుటఁ దలఁప లేరు.
క. ధర్మంబుఁ బరిజ్ఞానము, నిర్మలమతి నభ్యసించి నృప యనిశంబున్
ధార్మికసంగతి గలిగినఁ, జేర్మి యుభయలోకముల నభీష్టుత్య మగున్. 74
వ. అని మఱియును. 75
తే. బ్రాహ్మణప్రార్థితము లైనపనులు సేయు, మిమ్ముధనము పాత్రములకు నిచ్చువగవ

కుండు మక్రోధకామత్వ మొలయఁ జేయు, మతికి ధృతిసాలఁ గల్గుము మనుజనాథ.

వ. ధృతిలేమిం గాదె మహాభిషాఖ్యుం డగునృపముఖ్యుండు త్రివిష్టపంబుననుండి విభ్రష్టుం డయ్యె ధృత్యాలంబనంబునం గదా యయాతి యాపద నిస్తరించె.77

క. అనిన విని యానృపతి య, మ్మునివచనము లూఁది కామమునకుం గ్రోధం బునకుం దొలఁగించి తనదు, మనము ధృతికి ధర్మమునకు మరగం జేసెన్. 78

వ. అని చెప్పినం బ్రియం బంది మందాకినీనందనుతో ధర్మనందనుండు ధర్మాధర్మ వియుక్తంబును సర్వసంశయవిముక్తంబును జన్మమృత్యురహితంబును నిత్యంబును శుచియును శివంబును నవ్యయంబును బరంబును ననాయాసంబును నగునట్టిదాని నెఱింగింపవే యని ప్రార్థించిన నతండు యాజ్ఞవల్క్యజనకసంవాదం బితిహాస రూపంబునం బ్రవర్తిల్లునది వినిన భవదభ్యర్థితం బైనయర్థంబు ప్రతిభాసించు మఱియు వలయునవి యెఱుంగ నగుం జెప్పెద నని పలికి యతని కిట్లనియె. 79

## యాజ్ఞవల్క్యజనకరాజసంవాదప్రకారము.

ఆ. వినుము సకలలోకవిశ్రుతవిజ్ఞాన, ఘనుని యాజ్ఞవల్క్యుఁ డనుమునీంద్రు వినయ మొప్పఁ గాంచి వినతుఁడై మిథిలేశుఁ, డైనజనకనృపతి యతనితోడ.

వ. ఇంద్రియంబులు నవ్యక్తంబును బ్రహ్మంబును బరంబును భూతసర్గప్రళయం బులును దత్కాలసంఖ్యలును దేటపఱచి భయదీయదయాళుత్వంబు నెఱపవే యనిన నమ్మునివరుం డమ్మహీవరున కిట్లనియె. 81

సీ. అధిప సర్గముఁ బ్రళయంబు నవ్యక్తంబు, దా నొనరించుఁ దత్కాలసంఖ్య
వినుకల్పములు పది దినమున కంతియ, రజనికాలంబు సర్గంబు పగలు
సేయు శే ప్రళయంబు సెల్లించుఁ దొలుత న, శేషభూతములకు జీవనముగ
నోషధికల్పన మొనరించుదానికై, హైరణ్య మైనమహాండమున వి

తే. ధాతఁ బుట్టించు నతఁడు భూతముల నెల్ల
జనన మొందించు భూమ్యాదిసారభూత
గంధముఖ్యగుణోత్కరగ్రాహకములు
శ్రోత్రముఖములు తత్స్వామి సూవె మనసు. 82

వ. అది యె ట్లంటేని. 83

క. వినుటకును గనుటకును సా, ధనము లయినచెవియుఁ గన్నుఁ దనతనయంతన్ వినసుం గానను నేర్చునె, మనఃప్రభావమునఁ గాక మనుజాధీశా. 84

తే. ఇంద్రియము లెల్ల నట్టివ యెలసి యొండు, వలన మనసున్నఁ దమతమవర్తనముల నిగుడ నేరమి దెల్లంబు నృపవరేణ్య, యిట్టు లగు టజ్ఞులకు నైన నెఱుఁగవచ్చు.

తే. మనసుచేతివ యింద్రియమహిమ లెల్ల
నుపరతం బైన మనసుతో నుడిగి మడఁగు

నింద్రియము లుపరమ మొందెనేని దాన
మనసు మగుడదు విషయతృష్ణను జరించు. 86

క. కావున నింద్రియచేష్టల, నేవలనికిఁ బోవ నీమి యింతకు ముఖ్యం
బై వడిగొనుమనసు దిగువఁ, గా వలయును మగుడ దీనిఁ గనుఁగొనుమనఘా.

వ. ప్రళయప్రకారంబు వినుము రాత్రి యగుటయు నవ్యక్తం బహంకృతిపురుషు
బోధించిన నతండు పండ్రెండు మూర్తులు గైకొని రశ్మిజాలంబుల జరాయుజ
ప్రభృతిసర్వభూతంబులను రూపుమాపినం గూర్మపృష్ఠంబునుంబోని పృథివి జల
మయం బగు జలంబు లోకంబు లెల్లం దగ్ధమయంబు గాఁ బేర్చి తిన్నుం గాలాగ్ని
మడియింపం గుదియఁ బ్రజ్వలజ్జ్వాలాభీలం బగు నయ్యనలం బనిలంబుచేతం జెడు
నెందునుం దాన యై పరఁగు నమ్మహాబలు నాకసంబు మ్రింగు నతివితతం బగు
నవ్వియత్తత్త్వంబును మనంబు గ్రసియించు మనంబు నయ్యహంకారాధిష్ఠిత
పురుషుండు కబళించు నయ్యహంకృతి నవ్యక్తంబు లోఁగొను నిట్లు రేయి వో
యిన నెప్పటివిధంబు ప్రవర్తిల్లు. 88

క. ప్రీతిగ నధ్యాత్మము నధి, భూతము నధిదైవతంబు భూవర సంప్ర
ద్యోతితములుగాఁ జెప్పెద, నా తెఱఁగు ప్రబోధకారి యగు నూహింపన్. 89

## అధ్యాత్మాధిభూతాధిదైవతప్రకారము.

సీ. పాదపాయూపస్థపాణివాక్కులు విను, మధ్యాత్మములు తత్క్రమానుయుక్తి
గంతవ్యమును విసర్గంబు నానందంబుఁ, గర్తవ్యవక్తవ్యకములు నయ్యె
నధిభూతములు వాని కధిదైవములు వరు, సన విష్ణుమిత్రప్రజాపతులును
శక్రపావకులును జక్షువు జిహ్వయు, ఘ్రాణంబుఁ ద్వక్కు శ్రోత్రంబుఁ జూవె

తే. యనఘ యధ్యాత్మములు రూపమును రసంబుఁ
జాలుపడ గంధసంస్పర్శశబ్దములును . .
దదధిభూతంబు లధిదైవతములు సూర్య . .
జల మహీ వాయు దిశ లండ్రు శాస్త్రవిదులు. 90

క. మన మధ్యాత్మము దానికి, ననఘా మంతవ్య మందు రధిభూతము చం
ద్రుని నధిదైవతముగ బుధ,జనములు సెప్పుదురు శ్రుతివచఃప్రతిపత్తిన్. 91

తే. బుద్ధి యధ్యాత్మ మనఁ జనుభూపవర్య, దాని కధిభూతమండ్రు బోద్ధవ్య మైన
దానిఁ బొల్పు తదీయాధిదైవతంబు, వినుము క్షేత్రజ్ఞుఁ డని చెప్పు వేదచయము.

క. ఆరయ నధ్యాత్మ మహం,కారం బధిభూతనామకం బభిమానం
బారూఢయశఃపర మో, దారా [1]రుద్రుఁ డధిదైవతం బన నెగడున్. 93

తే. ధరణివల్లభ చిత్త మధ్యాత్మ మనఁగఁ, బరఁగుఁ జేతయితవ్యంబు భావితాత్మ
లైన మహనీయు లధిభూతమండ్రు బ్రహ్మ, మంచితాధిదైవతమను నాగమములు.

1. 'బుద్ధి యధిదైవతం' బని మూలము.

వ. అని చెప్పి ప్రకృతిపురుషప్రకారంబులు వినుట మనోనిర్వికారత్వకారణం బగు ననుపలుకు వలికి యి ట్లనియె. 95

క. ప్రకృతి దనయిచ్చఁ గ్రీడా,ర్థకముగ సత్త్వాదిగుణవితానము నానా
వికృతులఁ బొందింప ననం,ఖ్యకవిధ మై పరఁగు చుండునది మనుజేంద్రా. 96

క. దీపమున ననేకము లగు,దీపములు పరంపరానుదీప్తాకృతు లై
వ్యాపించుచందమున గుణ,రూపంబులఁ బరవుఁ బ్రకృతి రోషవిదూరా. 97

సీ. సత్త్వగుణంబులు సంతోష మానంద, మారోగ్య మక్రోధ మార్జవంబు
శుద్ధి ప్రకాశత సుస్థిరత్వ మహింస, నిర్మల శ్రద్ధ విరసితి లజ్జ
సత్యంబు శౌచంబు సమత యాచారం బ, కార్పణ్యమై శూన్య కామవృత్తి
విను రజోగుణములు విగ్రహదర్పాభి,మాన కామక్రోధమత్సరములు

ఆ. కరుణ లేమి భోగకాంక్ష యహంకార, ముమ్మలిక తమోగుణమ్ము లప్ర
కాశ మోహబహుతరాశనవాదప్ర,మాద[1]మౌర్ఖ్యమరణఖేదనములు. 98

క. ప్రకృతికిని గుణములం గొని, యకలంకుం డైనయంతరాత్ముని వేవే
ల్వికృతులఁ బొందించుట వా,యక కలుగుం దత్స్వభావ మది యరయంగన్.

క. పురుషుఁడు చైతన్యాత్ముఁడు, నరనాయక ప్రకృతి చేతనారహిత జగ
ద్ధురఁ బురుషుని వెలుఁగునఁ దా, ధరియించుం బురుషుఁ డిగుచుఁ దన మెయిఁ దిరుగన్.

ఉ. సత్త్వరజస్తమోగుణవశస్థితిఁ గేవలపుణ్యమిశ్రకా
రిత్త్వవిరుద్ధకర్మములఁ బ్రేరిత మై కను నూర్ధ్వలోకసే
విత్త్వము మానుషత్వపదవీకలనంబును రౌరవంబు నా
తత్త్వము దన్నెఱుంగమి ప్రధానముచేతల నావహిల్లినన్. 101

క. తను నెఱిఁగిన నవ్యక్తము,[2]చనవునఁ బోఁ డాత్ముఁ డజరశాశ్వతవిగతాం
జనవిమలాచ్యుతపదముం, గని యక్షరుఁ డగు నిజప్రకాశస్థిరతన్. 102

వ. అనిన విని జనకపతి యమ్మునిపతితో ననాదినిధనంబులు నమూర్తంబులు నచలంబులు నగ్రాహ్యంబులు నగుపురుషప్రకృతితత్త్వంబులయం దొక్కటి సచేతనం బై యుండఁ దక్కినయది చేతనారహితం బగుటకుం గతం బేమి యెఱింగింపవే యనుటయు నతం డతని కి ట్లనియె. 103

క. సగుణం బగుణం బగునే, యగుణము సగుణ మగు నెట్లు లవ్యక్తము ని
త్యగుణసమవేత మై జడ,త గలిగి యుండంగఁ బురుషధర్మము గలదే. 104

క. పురుషునికలరూ పెఱిఁగెడు,పరిబోధము లేక యుండుఁ బ్రకృతికిఁ బ్రకృతిం
బురుషుఁ డెఱుంగును దనకుం, బరంబు లే దనియుఁ గను శుభస్థిరదృష్టిన్. 105

క. కావునఁ బ్రకృతి యచేతన, భూవల్లభ చేతనుండు పురుషుఁడు సమ్య
గ్భావన యలవడినమునీం, ద్రావలి యిమ్మెయి సునిశ్చయంబుగఁ బలుకున్. 106

---

1. చ. మాంద్య. 2. గ. చనవులఁ.

వ. అని వెండియు. 107

ఆ. తాను బ్రకృతిఁ బ్రకృతి దనయందు నిల్చుని,ల్చినను దానవికృతిఁ జెందకుండుఁ
బురుషుఁ డుదకమత్స్యముల యుదుంబరమశ,కములసంగమందుఁ గరణి గలుగ.

ఆ. జలముఁ గదిసి యుండ జలముచే నార్ద్రింబు, గాక యుండునట్టికమలదళము
భంగి నంతరాత్మప్రకృతిఁ బొందియును ద,ద్వికృతిఁ బొందకుండు వీతదోష.

వ. ఇది సాంఖ్యానుభవంబు యోగంబు తెఱం గెఱింగించెద. 110

క. విను సాంఖ్యసమజ్ఞానం,బును యోగసమానబలము భూవర తే నెం
దును నవి రెండును వేఱుగఁ, గను బాలిశుఁ డొక్క పెరువకా [1]నేఁ గందున్.

క. జననాథ మనోధారణ,యును బ్రాణాయామవిధియు నుపయోగ్యము లై
చను నిర్గుణమును సగుణం,బును ననఁగా రెండుతంత్రములు యోగమునన్.

క. ప్రాణాయామము క్రమమునఁ, బ్రాణోత్పీడనము గాని భంగి సపుపుచుర
ఘోణాగ్రస్థితి విషయ,శ్రేణి దొఱఁగి యుండి యోగసిద్ధతఁ బడయున్. 113

వ. ఎట్లంటేని. 114

తే. కరము నియతుఁడై కొంతేసి కాలముల శ,రీరధర్మావిరోధిగా రేయుఁ బగలుఁ
బ్రాణసంయమనము నడపంగవలయు, దానఁ జిత్తంబుఁ దనువుశుద్ధతవహించు.

వ. అది [2]సిద్ధత్వసంపదకు మూలం బిది సగుణతంత్రంబు తెఱంగు నిర్గుణతంత్రప్రకా
రం బెఱింగించెద. 116

తే. ఇంద్రియంబులు మనమునం దివురఁ జేసి, మనసుఁ దిగిచి యహంకారమున నడంచి
బుద్ధిలోన నహంకృతిఁ బుచ్చి బుద్ధిఁ, బ్రకృతిఁ గలుపఁ దద్ధ్యానతత్పరత గలుగు.

క. ధ్యానైకతత్పరాత్ముఁడు, గానఁ బడయు నజరు నిర్వికల్పు విమలు ని
త్యానందసత్యశుద్ధ,జ్ఞానమయుం బరము నచలు శాశ్వతుని శివున్. 118

చ. ఉదితసమగ్రబోధుఁ డగు యోగికి నిశ్చలదీపరూపసం
పద సుఖసుప్తభంగి ఘనపంక్తులు లేనివియత్తలంబునొ
ప్పిద మొదవుం దరంగములు పెల్లునఁ దాఁ జలితంబు గానివా
ర్ధిదశ నతం డకంపుఁ డగు ధీపరివృత్తులు గ్లైనేనియున్. 119

క. భేరీశంఖాదికనా,నారవములు వొడమెనేని నాతఁడు దానం
గారింపఁబడఁడు వీతవి,కారస్థితిఁ బొలిచి యుండు గగనముభంగిన్. 120

క. తేనియకుండఁ గొనుచు సో,పానము లేమఱుట లేక ప్రాఁకిన క్రియ నా
త్మానందరసం బొకకణ, మైనఁ జిలుకనీక తుదికి నాతం డెక్కున్. 121

క. అనఘ యిది యోగపథ మిం, దనలసుఁ డై చనఁగఁ జాలునతఁడు కృతార్థుం
డనితరసులభపదప్రా,ప్తినిరూఢుఁ డనామయుం డభిష్టుతుఁ డెందున్. 122

---

1. క. నే మందున్. 2. గ. శుద్ధతఁ.

వ. అని యుపదేశించి వెండియు. 123

సీ. నరనాథ యుత్క్రమణప్రదేశంబులు, పాద జంఘా జాను పాయు గుహ్య
ములు నూరు పార్శ్వనాభులు బాహువక్షోగ,ళానన శ్రోత్ర నాసాంబకములు
భ్రూఫాలమస్తకంబులు నోలి విష్ణుండు, వసుసాధ్య మిత్రులువసుధయును బ్ర
జాపతి మరు దిందు సంక్రందన స్థాణు,లును నరుం డనుమహామునియు విశ్వ

తే. దేవదిగ్గంధవహులును బావకుండు, నశ్వి పితృ శతానందులు నందు వెలుఁగు
చంద్రుహృన్న్యుపవనక్రమోత్క్రమముల, నొందునద్దైవతలంబుల యోగివరుఁడు.

యాజ్ఞవల్క్యుఁడు జనకునితో మరణసూచకంబులఁ జెప్పుట.

వ. అని చెప్పి మఱియు నిట్లను నరిష్టంబుల తెఱం గెఱుంగ వలయుం గావున నెఱిం
గించెద నాకర్ణింపుము. 125

సీ. ధ్రువమండలమున నరుంధతిఁ గనుశక్తిఁ, గంటికిఁ గలుగంగఁ గానకున్న
ముక్కునవలపటఁ జెక్కవాసినయట్లు, దోఁచినఁ బూర్ణచంద్రుండు మలినుఁ
డై కాన వచ్చిన నాయువు సంవత్స,రంబునఁ గడచను రాజముఖ్య
కాంతి దొల్లిటియట్లు గాక యంతకు నెక్కు,డైనను గడుఁ జెడ్డ నట్లు ప్రజ్ఞ

తే. శ్రోత్రగాఁబెద్ద యైనను గొంచెమైన, నాఱు నెలల మరణదశ యగుట గలుగు
నిందుమండలమున రవియందునడుమఁ, దెఱపిగాంచినఁ దెగు నేడుదివసములకు.

క. విను గుడిలో నున్నసమయ,మున సురభిద్రవ్యములను బొల వల్చుట గ
ల్గిన నాఱుదివసములఁ గ,ల్గును మృత్యుసమాగమంబు గుణరత్ననిధీ. 127

తే. ముక్కు వ్రాలుట కర్ణముల్ మ్రొగ్గఁబడుట
రదనవైవర్ణ్య మక్షి విరాగభావ
మంగ మతికృష్ణ మగు టుల్ల మడరఁ [1]జెడుట
సూచకములు సద్యోమృత్యుగోచరతకు. 128

తే. కారణము లేక దాపలికను ద్రవించు, నెత్తిచక్కటి ధూమంబు నెగయునపుడ
మరణదశ యావహిల్లెడుమానవునకు, జనకనృప యివి బ్రహ్మ సెప్పినవిధములు.

క. విను యోగివరుఁ డరిష్టము, గనుఁగొని యనిశమును యోగగతియుతసాంఖ్యం
బనపాయత నడపుచు నా,త్మునిఁ బరముం జేర్చి కాలముం గబళించున్. 130

వ. ఇవ్విధమున నతండు. 131

ఆ. కాలకబళనైకశీలుఁ డై మృత్యువు, గెలిచి శాశ్వతము నచలము శివము
నచ్యుతము ననామయము నమృతము నవ్య,యంబునగుపదంబు నందు నిలుచు.

వ. అని పలికి యాజ్ఞవల్క్యమునీశ్వరుండు జనకజనేశ్వరుతోఁ బరంబు దేటపఱుపు
మని నీ వడిగి తా ప్రశ్నంబు సూక్ష్మం బుత్తరం బవహితుండ వయి విను మని

1. క. బడుట.

యి ట్లనియె. 133

సీ. మహనీయతపమున • మార్తాండు నాకుఁ బ్ర,సన్నుఁగాఁ జేసితి • సదయదృష్టి
నను జూచి యద్దేవుఁ • డనఘ వరంబు నీ, కిచ్చెద నీకోర్కి • యెద్ది సెప్పు
మనవుడుఁ బ్రణతుండ • నై యజుస్సంప్రాప్తి, గోరెద ననిన న•వ్వారిజాప్తుఁ
డట్లని వాగ్దేవి • నావహించెద విప్ర,తంబుగాఁ జేయు మా•స్యంబు విప్ర

తే. యనియె నవ్వచనము విని • యాననమ్ము
సంతసమున విచ్చితి సర•స్వతియు నాదు
తనువుఁ జొచ్చెఁ బదంపడి • దాహ మొంది
తన్ను నెఱుఁగక వెగ డొందు•నన్ను నినుఁడు. 134

క. కనుఁగొని యించుక సేపునఁ, దనువడు నని పలికెఁ బిదపఁ • దనువడుటయునుం
బనుపడియె నప్పు డద్దే,వునివదనాబ్జమున నాచె•వుల కింపారన్. 135

క. భూసురవర వేదము ప్రతి,భాసిల్లుచు సంతతప్ర•పత్తి గలుగు ను
ల్లాసంబు బుద్ధి నొందు స,మాసన్నంబు లగు సాంఖ్య•మత యోగంబుల్. 136

ఆ. యోగసాంఖ్యసిద్ధి • నొందు నిష్టావాప్తి, ననుము నమ్ముదమున •నను మృదూక్తు
లుద్భవించె మోద • ముత్కట మయ్యె నా, కమృతవృష్టిఁ దోఁగి•నట్టు లైతి.

వ. తదనంతరంబ యద్దేవుం డస్తాచలంబువలని కరిగె నేనుం బగమానందకందళిత మనస్కుండ నగుచు మందిరంబున కేతెంచి సరస్వతిం దలంచు చున్నంత. 138

క. వినుము వినుతస్వరవ్యం,జనభూషిత యగ్రభాగ•సంస్ఫురదోంకా
ర నితాంతహృద్యమధుగ, ర్భ నిజాకృతి విశదముగ స•రస్వతి దోఁచెన్. 139

విశ్వావసునకు యాజ్ఞవల్క్యుఁ డుపదేశించిన తత్త్వప్రకారము.

వ. తోఁచిననత్యంత[1]భక్తిం బ్రపత్తిసేసి సూర్యప్రసాదలబ్ధయుఁ బంచదశ శాఖాసమన్వితయు నిఖిలోత్తరసంహితయు నగునయ్యజుర్వచోమూర్తిధరియించి శిష్యులం బరిగ్రహించి వారల నధ్యయనంబు సేయించుచు నివ్వాఙ్మయ బ్రహ్మంబునందు వేదితవ్యం బెయ్యదియో యని విచారింప విరోచనుమహానుభావంబునం జేసి యోగసాంఖ్యరూపోపాయప్రకారంబు దోఁచెఁ బదంపడి తదుపేయం బగు వేద వేద్యంబును నద్దేవునికరుణావిశేషంబునం బ్రతిభాసించెఁ గొండొకకాలంబునకు విశ్వావసుం డనుగంధర్వేశ్వరుండు నాకడకుం జనుదెంచి తన్నెఱింగించి యేను జేయునతిథిపూజనం బత్యాదరంబునం గైకొని విశ్వావిశ్వంబులు మిత్రావరుణులు జ్ఞానజ్ఞేయంబులుఁ దపో[2]తపంబులు సూర్యాతిసూర్యులు విద్యావిద్యలు వేద్యావేద్యంబులుం జలాచలంబులు ననునవి వేదోదితంబులు వానిం దేటపఱుపవేయని యడిగిన నవహితుండనై వినుమనిపల్కి విశ్వంబు[2]భూతభవ్యభవత్కారంబగువ్యక్తంబవ్యక్తనామ ప్రకృతియ విశ్వంబు నిర్గుణం డగుపురుషుండు మిత్రావరుణులు

1. గ. భక్తిక ప్రతిపత్తి. 2. జ. భూతభవ్యభయంకరం.

పురుషప్రకృతులు జ్ఞానజ్ఞేయంబులుఁదపోతపంబులు సూర్యాతిసూర్యులును బ్రకృ
తిపురుషుల కానెఱుంగుము విద్యావిద్యావేద్యావేద్యాచలచలంబు లనుశబ్దంబు
లు వరుసం బురుషునకుం బ్రకృతికిని వాచకంబు లని చెప్పి వెండియు నిట్లంటి.

ఆ. అజములవ్రణంబులలక్షయంబులతీంద్రి,యములు ప్రకృతిపురుషులనఁగఁబరఁగు
రెండుతత్త్వములు నఖండరూపతఁ బొంది,నపుడు ప్రకృతిపురుషులనట్ల [1]కాన. 142

వ. అని తెలిపి మఱియును.

క. విను వేదవేద్యము నెఱుం,గనియాతని వేదపాఠకలనంబు సుధీ
ధన వేదభారవహనం, బనఁ జను నింతియ నిరర్థకాయాసం బై. 143

ఆ. క్షరము నక్షరంబుఁ గానంగఁ బోలు వే,దార్థచింతనమున నమ్మిథునము
నందుఁ బూర్వ మురివి యపరంబు సేపట్టి, నిలువ వలయు నధికనిష్ఠ గలిగి.

తే. అక్షరం బగుపంచవింశాఖ్యతత్త్వ,తత్పరత నున్నఁ గేవలత్వము ఘటిల్లు
వినుము కేవలత్వమున షడ్వింశదర్శ,నంబు పురుషునకొదవి తన్మయతగలుగు.

క. పురుషుని నవ్యక్తము రెం,డురూపులుగఁ జూచు టొప్పెడు తెఱం గతఁడుం
బురుషోత్తముండు నరయఁగ,నిరుపురు గా రతఁడ యాతఁ డిది నిజము సుమీ.

క. పురుషోత్తమషడ్వింశక,పరమేశ్వరనామకములు పరఁగును విను మా
పరమునకు నదియ నిష్కళ,నిరంజనానందబోధనిత్యం బనఘా. 147

వ. అని చెప్పిన విశ్వావసుండు పంచవింశకతత్త్వంబునకుం బరంబు గలుగుటయు నది
రూపింప నేకం బగుటయు నారద జైగీష దేవల కపిల శుక సుమంతు పైల్యాదు
లైనపరమమునులగోష్ఠీవిశేషంబుల విందు వినినను నిస్సంశయం బగుబోధం
బుదితంబు గామి ని న్నాశ్రయించితి నీవు సంయమిలోక సురలోక బ్రహ్మలోక
ప్రఖ్యాతప్రజ్ఞానసంభావనీయుండవు మదీయసందేహాపనయంబు సేయ వే యను
టయు నాదరాయత్తచిత్తుండ నై. 148

క. మునిగోష్ఠివలనికొఱఁతయె, విను భవదీయాంతరంగవృత్తి కలుష మై
నను సంశయాత్మునింగా, నొనరించుచు నున్నయది సముజ్జ్వలతేజా. 149

వ. ప్రసన్నైకాగ్రచిత్తుండ వై యాకర్ణింపు మని యిట్లంటి. 150

క. పురుషున కవ్యక్తపరి,స్ఫురణ శబలవృత్తి గలుగఁ బోయిన నతనిం
బురుషోత్తముఁ డనరు జనన,మరణాదివికారయుక్తి మాటయి యజ్ఞుల్. 151

వ. అని వెండియు. 152

తే. ప్రకృతి పురుషునిఁ గానదు ప్రకృతిఁ గనుచు
నునికిఁ బురుషుండు పరమునిఁ గనుట లేక
యుండుఁ గనుఁ దద్ద్వయముఁ బరముండు పరమ
[2]వీక్షణము పురుషున కగు వెరవు వినుము. 153

1. జ. కాదె. 2. చ. వేక్షణము.

క. స్నేహసహవాసములు స,మ్మోహము దలకొలుపఁ గాల। మున మునుఁగుచు గా
ఢాహంకారమమత్వము, లీహఁ బెనుపఁ బ్రకృతిఁ బురుషుఁ। డే సను చుండున్.

క. అది లెస్సగ విడిచి ప్రకృతి, కుదకనిభాకలనమును ఝుష। పమ దనకుం
బదిలుఁ డయి చూడ నేర్చిన, విదితం బగు దానితోడి। వేర్పా టనఘా. 155

ఆ. ప్రకృతి దొఱఁగి తన్నుఁ। బన్నుగాఁ జూచువి,వేకదృఢతఁ బంచ।వింశకుండు
సంగరహితమైన। షడ్వింశపదము ని,స్సంశయముగఁ గాంచు। వంశవర్య. 156

క. జననజరామృత్యుభయం,బున యోగసమేతసాంఖ్య।ముం దిరముగ నూఁ
దినయతులు నిర్మమత్వం,బునఁ బడయుదు [1]రప్పదంబు।పొం దచలముగన్.

వ. అపునరావృత్తిపదం బగునప్పదంబుసూవె పరం బని చెప్పి వెండియు. 158

క. నెట్టన చూడమి నవ్యోడు,నట్టిది యొకచూపునం బ।రానందంబున్
గట్టిగఁ జేయఁగ వికృతులు, వుట్టక పురుషుండు తత్ప్ర।బోధాత్ముఁ డగున్. 159

క. పురుషోత్తముండుఁ బురుషుఁడు, నిరువు రగుట గలదు గలిగె।నేనియుఁ బురుషుం
బురుషోత్తమునందుఁ గలపు, వెరవున నేకత్వమహిమ। విజ్ఞాత మగున్. 160

క. ఇది విజ్ఞానముకృత్యము, తుది విజ్ఞానాత్ముఁడు నగు। దుర్లభము ప్రశాం
తిదశాహీనాత్ముల క,ప్పద మది మోక్షంబు మమత। వాసినఁ గల్గున్. 161

వ. అని యుపదేశించిన విని విశ్వావసుండు ప్రమోదంబు నొంది పథ్యంబును హితంబును దథ్యంబును నగు తెఱం గనుగ్రహించితి భవదీయప్రసాదంబునం గలంక దేఱి నిర్మలుండ నయితి నని పలికి సభక్తికంబుగాఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం జేసి నిజస్థానంబున కరిగె నని చెప్పి యాజ్ఞవల్క్యమునినాథుండు జనకజననాథునితో వెండియు నిట్లనియె. 162

క. మానవపతిసత్తమ యీ,జ్ఞానము బ్రహ్మాదిదివిజ।సంయమిమత మె
వ్వానికి మోక్షంబునకుం, దాన తెరువు తెరువు లొండ్లు। దలఁపం గలవే. 163

ఆ. జ్ఞానముననకాని। జన్మజరామృత్యు,వుల జయించు నట్టి।యలఘుమోక్ష
పదము గల్గ నేర దది కారణముగ సు,జ్ఞాన మెల్లభంగి। సాధ్యతమము. 164

క. గురుఁ డెవ్వఁ డైన నగు ని,వ్వెర వుపదేశించువాఁడ। వేల్పుగ శ్రద్ధా
పరమతి గావలయు జనన,మరణంబులు శ్రద్ధ లేని।మనుజునిఁ బొదువున్. 165

క. విను మజ్ఞానంబునఁ గ,ర్మనిగూఢత గలుగు దాన। [2]మలఁగవు జననం
బును మరణము సమ్యగ్జ్ఞా,ననిత్యుఁ డగువాఁడు మోక్ష।ణముఁ జుల్కఁగనున్.

క. ఈవెర వూఁదుము నృప నను, నీ వడిగినయంతయును వి।నిశ్చయకృతి సం
భావితము గాఁగఁ జెప్పితిఁ, బో విడువుము శోకమోహ।ములు నిలుపు ధృతిన్.

క. అని చెప్పిన ముదితుండై, జనకుఁడు శోకాదిభావ।సంగవిరహితం

1. క. రప్పరంబు. 2. చ. మలుఁగవు.

బును బ్రహ్మధ్యానపరం,బును నగుచిత్తంబుతోడ ముదితుం డగుచున్. 168

వ. ఉండెం బాండవాగ్రజా యీయాజ్ఞవల్క్యమునివరువాక్యరూపంబునన యే నిమ్మహనీయజ్ఞానంబు నీ కుపదేశించితి నని చెప్పి భీష్ముం డతనితో నీ విందుల తాత్పర్యంబు గలిగి యార్యగర్హితంబు లగుశోకమోహాదిప్రాకృతభావంబులం దొఱంగి సుఖి వగు మనిన విని యక్కౌంతేయాగ్రజుండు సంతుష్టాంతరంగుం డై యగ్గాంగేయునకుం బ్రణమిల్లి గృహస్థధర్మంబు పరిత్యజింపక మోక్షంబు వడయుట గలుగనోపునే మదీయచిత్తంబు సంశయాయత్తం బగుచుండు నిక్కాలుష్యంబు వాపవే యని యభ్యర్థించిన నతండు జనకసులభాసంవాదం బనునితిహాసంబు గలుగు దాన నేతత్సంశయంబు వాయు దానిం జెప్పెద విను మని పలికి యతని కి ట్లనియె. 169

భీష్ముండు ధర్మరాజునకు జనకసులభాసంవాదంబు సెప్పుట.

క. సులభాభిధాన యగునొక,లలన విమలయోగధర్మలంపటు జనకుం
గెలన విని యతనిబోధము,కొలఁది పరీక్షింపఁ దనకుఁ గోర్కి వొడమినన్.

వ. నియమాచరణకృశం బగుశరీరంబు యోగప్రభావంబున డాఁచి సుందరసుకుమారం బగునాకారంబు వహించి జనకుం గాంచి భిక్షావృత్తిత్వసూచకంబు లగువచనంబు లుపన్యసించిన నతం డాసనపాద్యార్ఘ్యంబు లాచరించి మహనీయం బగుభోజనం బొనర్చిన సంతృప్తిం బొంది యవ్విదేహపతికి నాసన్నం బగునుచితాసనంబున నాసీన యై యుండి యాతండు ముక్తుం డగుగామి గనికొనుతలంపున నిజానుభావంబున నతనిచిత్తంబు ప్రవేశించి మారవికారంబు భావించి.

క. తనలోచనదీప్తుల న,మ్మనుజపతిమొగంబునందు మల్లడిగొనఁ జే
సిన నమ్మహాత్ముఁ డప్పు,ద్మనయనతలఁ బెఱిఁగి జనితమందస్మితుఁ డై. 172

ఆ. ఎచటనుండి యెచటి కేఁగెద వెవ్వరి,దాన వేమి వెంటఁ దగిలి నడతు
సుదతి నాకుఁ జెప్పు మది యట్టు లుండె నా, మాట లీవు విను మాదరమున.

సీ. పంచశిఖుం డనుపరమమునీశ్వరు,శిష్యుండ నతనిచేఁ శిక్షితంబు
కమలాక్షి సాంఖ్యయోగక్షితిపాలనం,బులఁ ద్రివిధం బగుమోక్షధర్మ
మట్లు గావున సంశయము లేక ముక్తకా,మస్థితి నమ్మాడ్కుమార్గములను
నడచి పరంబున కెడపడ కుండుదు, ముక్తి వైరాగ్యైకమూల సూవె

తే. విను విరక్తి దృఢజ్ఞానజనిత గాన, దీపితజ్ఞానమును విరక్తియు ధరింపఁ
బడిన బుద్ధి నిర్ద్వంద్వతఁ బరఁగు నింటి,యంద నిల్చి నిస్సంగుఁడ నై చరింతు.

క. వనితా చందనమునఁ బూ,సినఁ గత్తిని వ్రేసినను సుచిత్తత నా క
జ్జను లిరువురయందును సరి, కనకము లోష్టమును సమముగాఁ గనుఁగొందున్.

తే. జ్ఞానమును గర్మమును రెంటిసంగమంబు,నిష్ఠలుగ మోక్షవిదులు వర్ణింతు రాత్మ
శాస్త్రములుగని మద్గురుశాసనంబు,సుగమపథము తృతీయంబు సూవె యబల.

ఆ. కీడు గని యొకండు గృహధర్మముడిగి స, మాశ్రయించు నాశ్రమాంతరంబు
దాన సంగ ముడుగఁగా నేర దదియొల్ల, మియును వలపుగాన మీనయన.

క. దండముఁ గాషాయంబును, ముండితయుఁ గమండలువును మోక్షమొసఁగవె
ట్లం డేని లింగములకు న, ఖండజ్ఞాన ప్రదత్వకలనము గలదే. 178

క. మగువా దుఃఖము శిథిలం, బగు నని లింగములు దాల్తు రమ్మెయి లే దె
ట్లు గొడుగునందుం గావున, వగవఁగ మోక్షదముగాఁగ వలయుఁ గొడుగున్.

ఆ. జ్ఞానమునకాని మానిని లింగమా, త్రమున ముక్తి యగునె రాజ్యబంధ
రాగబంధనిఖిలభోగబంధములఁ బ్ర, జ్ఞాసిఁ దునిమినాఁడ నది గతముగ. 180

వ. ఇట్లు ముక్తుండ నై యున్న నాయెడ ముక్తత్వాముక్తత్వంబు లారయ వేఁడి వచ్చి
మచ్చిత్తంబు మెత్తన చొచ్చి తది యప్రయోజనం బట్లుం గాక. 181

తే. బ్రాహ్మణివి యోగినివి పరభార్య వబల, భర్త ప్రోషితుఁ డేను నృపాలసుతుఁడ
వినుము గృహమేధి నాచారఘనుఁడ నిట్టి, నేను నీవు రమించుట నిందఁ దేదె.

వ. స్వతంత్ర వై నీవు చేసినయీయవినయంబున నెయ్యది వాటిల్లిన నది నీయంద
నిలుచుంగాక యని పలికి వెండియు. 183

క. నావలనిరాగమున నే, నీ వి త్లైతి నను గెల్చునిపుణతకుం గా
కీవెడమాయల నిప్పుడుఁ, బోవిడువవు యోగశక్తిపొలుపుకలిమి నే. 184

క. నిను డాఁచి కుటిలభావం, బున దుష్టచరిత్ర వైతి ముక్తుల తెఱఁగే
వనిత యిది యే బయలుపఱి, చిన నైనను మానవలదె చెన్నఁటిచూపుల్. 185

క. అని తనవైరాగ్యంబును, ఘనబోధముమహిమయుం బ్రకాశింప మనం
బున సరకుగొనక యి ట్ల, వ్వనితఁ బలికి యన్న రేంద్రవర్యుఁడు మఱియున్.

క. తను వొప్పెడునది యావన, మును నూతన మిట్టినీకుఁ బొలఁతీ యోగం
బున నింతచొరవ యెమ్మెయిఁ, బనుపడియెం జెపుమ డాఁపఁ బనిలే దింకన్.

వ. అనుచు. 188

క. తను సరకుసేయ కి ట్ల, జ్జననాథుఁడు వలుక సవ్వచనములు దెలియఁ
విని సులభ చతురముగ ని, ట్లను నించుక గొంకు లేక యవ్విభుతోడన్. 189

క. శ్రోతకుఁ దనకుం బ్రియ మగు, నే తెరువున నట్టిమెయి సమీరిత మైనం
జూ తగువాక్యం బది నృప, సూతీ పెఱపలుకు బాలిశులచొప్పరయన్. 190

వ. భవదీయవాక్యవైదగ్ధ్యం బట్లుండె నీవు నన్నెవ్వరిదాన వెచ్చటనుండి వచ్చి
తని తొలుత నడిగి తవహితుండ వై వినుము చెప్పెద. 191

జనకునిప్రశ్నంబులకు సులభ ప్రత్యుత్తరంబు లిచ్చుట.

క. విను పాంసూదకములచా, డ్పున జతుకాష్ఠములభంగి భూతంబులకుఁ
మనుజేంద్ర కలుగుఁ బొం దా, పని నన్యోన్యసమధీనభావము గలదే. 192

ఆ. ఒక్కమేనియందఁ యుర్వీశ పంచభూ,తములు దశమితేంద్రి,యములు మనసు
బుద్ధియును బ్రధానముము గలవివియొక్క,డొకటియవియె యేలయొండుసెప్పు.

వ. నిక్కంబునకు నెవ్వరు నెవ్వరివారుం గామి దెలియవే యని పలికి వెండియు.

తే. సకలలోకములను సదశ్వంబుకరణి, ధావనము సేయుచుండుఁ బ్రధాన మింత
యెఱిఁగి జననాథ యెవ్వరి నెచటనుండు,వారలనువార మమ్మాటవలనుసెపుమ.

తే. నీవు నీయందు నినుఁగను నెఱియయొరుల,యందుఁగానంగవలవ దేయధిపతన్ను
నొరుల నొక్కటిగాఁజూచుపురుషుఁడెచట,మీరలుండుదురెవ్వరివార లనునె.

తే. అరులు మిత్రులుదాసీను లనుచు సంధి,విగ్రహాదిషడ్గుణములవెరవు లోకరుఁ
డలవరించుచువిజయంబునాసపడుచు,నుండునటెముక్తి తెఱఁగిటులు న్నెయరయ.

ఉ. కావున నీవు ముక్తుఁడవు గా విటు గాకయు నిన్ను ముక్తుఁగా
భూవర చూచె దిక్కలఁక బుద్ధులు సెప్పి తగం దొలంగఁగాఁ
ద్రోవఁగఁ బాడి[1]బంధులకు దుర్మతి వుట్టినయట్టిమర్త్య వా
రేవిధి నైన మందు లిడి యెప్పటిబుద్ధి ఘటించుచాడ్పునన్. 198

వ. ఏ నెట్లు ముక్తుండఁ గా నంటేని విను మింకనుం జెప్పెద. 199

సీ. వర్గత్రయంబువలనను సప్తాంగ,ములయందుఁ జిత్తంబు మెలఁగుచుండ
రాజులు మజ్జనభోజననిద్రావ,సరములు లోనుగా జనులు సేయు
విజ్ఞాపనము విని యాజ్ఞాపనం బొన,రించుచు మంత్రులుఁ బ్రేమపాత్ర
తరుణులు నస్వతంత్రతఁ జేయ నర్థుల, [2]కొసరితిండియు ధనగుప్తిమీఁది

తే. భరముఁ దమలో విరోధులై పట్టి మనసుఁ
జిక్కువఱుపంగఁ బెక్కండ్రు సిరికి నడువఁ
బరిహరించుచు బహుదుఃఖపరులు నల్ప
సౌఖ్యులును నగు చునికి రాజ్యంబు తెఱఁగు. 200

వ. వారలు ముక్తులు గామి దెల్లం బది యట్లుండె నీకు విశేషించియు. 201

చ. సదయమనీషఁ బంచశిఖసంయమి మోక్షము దెల్పె నంటి నీ
హృదయము నాదుచొచ్చుటకు నెంతయు రోసితి ముక్తచందమే
యిది నిరపేక్షుఁడైన విను మెయ్యది యెట్లయినం బ్రశాంతిసం
పద నొకయింతయుం గలఁగబాఱక యుండెడి నిర్వికారుఁడై. 202

క. విను శూన్యస్థానంబున, నునికి యతికిఁ గృత్య మగుట నుర్వీశ్వర ము
క్తునిమానసంబు శూన్యం, బని చొచ్చితి ముక్తి లేమి నది దప్పయ్యెన్. 203

వ. అట్లుం గాక. 204

ఆ. కాలుఁ జేయు మొదలుగాఁ గలనాయంగ,కములలోన నిన్నుఁగలయ దొకటి
యేని రిత్త యిప్పు డేటికిఁ గటకటం,బడుచు నిట్లు దూరఁ బలికి తధిప. 205

1. చ. బంధు లోకదుర్గతి..., దారేవిధి. 2. చ. కొసరితిండియు.

వ. అని యమాత్యులదిక్కు సూచి. 206

ఆ. వీరు పెద్దవారు వీరలు విన నిట్టి,తులువమాట లాడ దొరకుఁ దగునె
యెదిరిఁ దూలపుచ్చుటే మంచివెరవు గాం, ధీర్యహాని దలఁచు పెంపు లేదె. 207

క. వనితలపురుషులయెడఁ బు, ట్టినయది వెల్లివిరిసేంత డిమ్మరితన మె
ట్టినికృష్టం బైనను ని,ప్పునికిఁ జొరఁడు దగునె యిది నృపాలసుతునకున్. 208

చ. బిసరుహపత్త్రలగ్న జలబిందువుచాడ్పున సంగవర్జితో
ల్లసనమునన్ వసించితి నిలావర నీమది నిట్టిదానిఁగాఁ
బొసఁగ నెఱుంగవైతి నను బొంకగు పేర్పడియెన్ విముక్తిచో
ప్పు సదయవృత్తి నీకు మునిపుంగవుచెప్పుట మాట లేటికిన్. 209

క. నీవు గృహధర్మపరతయుఁ, బోవిడిచితి నీకు మోక్షమును విదితము గా
దేవలనికిఁ గా కిట్లు ధ,రావర మిథ్యాప్రబోధరతుఁ డై తరయన్. 210

క. ముక్తులు ముక్తులఁ గలయుట,యుక్తమ యది నభము సభము నొందు తెఱఁగు నీ
ముక్తత బొంకని దీనిని, సక్తతగా నీవు గనుట సాలదె తెలుపన్. 211

వ. మనము ముక్తులము గాకున్నను మనకు సాంగత్యంబు గలుగుట నింద్యంబుగా
దె ట్లంటేని. 212

సీ. నిఖలజన శ్రోత్రసుఖకరం బగుచరి,త్రమునఁ బెం పారెడు ప్రధననృపతి
కులమునఁ బుట్టితి సులభ నాపేరు మ,త్పూర్వులు శతశృంగమునను ద్రోణ
మునను శక్రద్వారమున మహాధ్వరములు, సేసిరి విను పాకశాసనుండు
దమపాలి కేతేరఁ దద్గోష్ఠిఁ బరమార్థ,చింత సేయుదురు భూకాంత యేను

తే. నాకు నెన యైనపురుషుండు లేకయునికి,మోక్షధర్మప్రవర్తనమునఁ జరింతుఁ
గాన నీచూచువర్ణసాంకర్య మస్మ,దీయసాంగత్యమున లేమి దెల్ల మరయ.

క. నను డాఁప నేల దానం, గనియెడునది గలదె ముక్తి గలదో లేదో
జనకున కరసెదఁ గా కని, చనుదెంచితిఁ దప్పె యది విచారింపంగన్. 214

క. అని యిట్లు వలుకుపలుకులు, విని పలుకక యున్న జనకవిభునాననముం
గనుఁగొని సులభ నగుచు ని, ట్లనియె నతనితోడఁ గౌరవాన్వయముఖ్యా. 215

తే. అగ్ని వెచ్చనో చల్లనో యని మనమునఁ,గరమునందియ మందుట గాదెనిన్ను
నధిప ముక్తుండవో కావో యని తలంచు,టదిమదీయ బాలిశభావమనితలంపు.

చ. జనవర నీసుభాషల నసత్య మొకండును లేదు నీవు స
న్మునిగణకీర్తనీయుఁడవు మోక్షము నీ కఱచేతిలోని దై
యునికి దృఢంబుగాఁ గనియు నొండొకచందముమాటలాడితిఁ
నిను నగియింపఁగా వలసి నీ దగుమన్నన శంక వాసినన్. 217

క. అవి యెల్ల నసత్యంబుల, యవనీశ్వర యరయ వచ్చు టది యొక్కఁడు ని
క్కువ మీయపరాధము భవ,దవిరళసౌజన్యమగ్న మగుఁగాక తగన్. 218

క. సులభానామము సంస్తుతి, పాల మొల్లక తిరుగుటయును । భూలోకవరా
కలరూప నేఁటి కిచ్చట, నిలిచెద నీవు మునిసేవ । నీయెడ వగుటన్. 219

తే. అనినఁ దానును మంత్రులు । నవ్విభుండు, సులభఁ గొనియాడి రాఁడెల్ల । నలఘుగోష్ఠిఁ
బ్రియము గెట్టింపన య్యోగి । నియును దారు, నెమ్మి నొక్కఁడై యుండిరి । నృపవరేణ్య.

వ. మఱియు నాఁ డజ్జనపతి యనుమతిసేయ నమ్మహానుభావ నిజేచ్ఛం జనియె నని చెప్పిన నప్పౌరవోత్తముండు ప్రమోదాయత్తస్వాంతుండయి శాంతనవునితో శుకుని కెవ్విధంబున వైరాగ్యంబు సొప్పడియెం జెప్పవే యనుటయు నతం డా ధర్మసుతున కిట్లనియె. 221

వేదవ్యాసుఁడు శుకున కుపదేశించిన వైరాగ్యప్రకారము.

సీ. ప్రాకృతజనులవ । ర్తనముల వెంటఁ జి, త్తమున జరామర । ణములకలిమి
దలఁపక యేమఱి । మెలఁగెడుశుకుఁ జూచి, విపులధర్మజ్ఞాన । నిపుణధిషణుఁ
డైన వేదవ్యాసుఁ । డాతని కిట్లను, మనసు నింద్రియములు । మర్దితములు
గాఁ జేయు ముత్పథ । గాములు గానీకు, మక్రోధసత్యశ । మార్జవములుఁ

తే. దపము దమము నహింసయు । ధర్మమునకు
నాకృతులు వీనిఁ బాలింపు । మాఁకలియును
నీరువట్టును దగియెడు । నెఱి నడంచి
దేవతాతిథిశేషోప । జీవి వగుము. 222

క. నురువున నొనరించిన పం, జరంబులో నున్న పులుఁగు । చాడ్పున మేనం
బురుషవర జీవ ముండుట, పరికింపక యేమఱంగఁ । బాడియె నీకున్. 223

తే. ఎన్నికొనుచుండఁ జనుచుండు । నేండ్లు లివ్వి, ధమున నాయువు వోఁద్రోఁడఁ । దఱిఁగి జీవ
హాని వాటిల్లఁగాఁ బుత్ర । యనవధాన, నిద్రమోహితుఁడై యున్కి । నీకుఁ దగునె.

క. విను మాంసశోణితవివ, ర్ధన మగు నైహికమునందుఁ । దత్పరులు పరం
బని యొకటికలిమి దలఁపరు, గొనరు బుధులమాట నాస్తి । కులు వినయనిధీ. 225

తే. బుద్ధిమంతుల తెరువునఁ । బోక యుత్ప
థప్రవర్తుల నడచుప । థంబునందుఁ
జనుట విను మప్పటికిఁ జూడఁ । దనకుఁ జాల
నించి యుండు నాపద యొన । రించుఁ బిదప. 226

చ. తనతనధర్మముల్ నడపి । దానన సంతస మంది శాంతభా
వనరతి నుండువారిఁ గని । వారల చెప్పెడు ధర్మవృత్తి ని
చ్చనయుఁగ నూఁది సత్పదముఁ । జెందుట కెక్కుము పొత్తినూలి[1]పు
వ్వునెనయుఁ గాకు బంధకుఁ డ । వుం దన కజ్ఞుఁడు దాన [2]యమ్మెయిన్. 227

తే. అస్థిరేంద్రియసలిలమ । యంబుఁ గామ, రోషదారుణగ్రాహప్ర । దూషితంబు

1. గ. పు,వ్వున కెన గాకు. 2. చ. యెమ్మెయిన్.

నైనసంసారసాగర మతులధైర్య,పోతపాత్రిక నిస్తరింపుము కుమార. 228
క. కామాదితృప్తుఁ డై నగుఁ, డేమఱి యుండంగ గొఱియ నెత్తెడుపులియు
ద్దామత మృత్యువు గొని చను,నామూఢునియట్లు గాకు మతులవివేకా. 229
తే. బ్రాహ్మణత్వంబు గడు దుర్లభంబు దాని, నెట్టకేలకుఁ గనికడ యెద్దుఁజేయ
వలదెతపము దమంబు నిశ్చలవివేక,సంపదయునూఁది నరుఁడుదుస్సంగ ముడిగి.
క. విను విప్రశరీరము సుఖ,మునకే బహునియమదుఃఖముల నిహమునఁ జెం
దను నిత్యసౌఖ్యముం బర,మునఁ బొందను బుట్టెఁ గాక బోధప్రవణా. 231
క. బలితపుటురి గ్రామంబున, నిలుచుట యారజ్జు ద్రెవ్వ సీలిగి సుమతుల్
వెలుడి చని సుఖు లగుదు ర,వ్వల నెఱుఁగరు పడుదురంద వత్స సురాత్ముల్.
తే. తాను దెగునేని బాంధవదారపుత్త్ర, మిత్త్రు లనునజ్జనంబు లేమిటికి విగత
చింతుఁడై గుహ సొచ్చి యశ్రాంతబుద్ధిఁ, దడవి కానంగ వలవదె తన్నుఁ దాన.
తే. జరయు మరణంబు మర్త్యునిజన్మ మాది,గాఁగ వెనువెంటఁదగులునగ్గంబు వేచి
యెల్లి సేసెద ననక మేలిపుడ చేయు, తనయ వార్చు నెమ్మృత్యువుజనులపనులు.
ఆ. ఆశ్మశానగమను లంతియ చుట్టంబు, లగ్నిఁ గలపి మరలు నఖిల మైన
జ్ఞాతిజనము దీనిఁ జర్చింప కందఱు,యందు మమతఁ బెనుచు నజ్ఞుఁ డనఘ.
క. లోకము కాలముచే ని,ట్లాకులపడు చునికి గాంచి యధికధృతిని ధ
ర్మైకాంతతానిరూఢిం,గైకొని త్రోవంగ వలదె కాలవికృతులన్. 236
క. మానుషము దుర్లభము సో,పానం బగు నది విముక్తిపదము గనుటకుఁ
దానిఁ గని తొంటిచందము, రానీక సముద్యమమునఁ బ్రాఁకఁగ వలదే.237
క. అనఘా తపోవనమునన, జననంబును మరణదశయు సంప్రాప్తము ల
య్యెనయేని వాఁడు ముక్తుఁడె, మనంబు బహుకామవికృతిమగ్నంబైనన్.238
తే. భోగములు సంపరిత్యక్తములుగఁ జేసి, కేవలాంగుఁడై నిర్మలభావయుక్తిఁ
దపము గృహమున[1] నేనియుఁదత్పరతఁజ,రించి సంసారజలధిఁ దరించు నరుఁడు.
క. విను దారపుత్త్రమిత్త్రులు, సనిరి కొడుక మున్ను చనినజన్మంబుల నీ
కును వారు వారలకు నీ,వును మఱుపుట్టువులఁ గొఱ యవుట గల్గెనొకో.
అ. ఏన కలను నాకు నెవ్వరివానిఁ గా, నాత్మఁ దలఁతు నన్ను నట్టివాని
నెందు గానఁ గాన యెవ్వరివాఁడను, గా ననంగ వలదె మాననీయ. 241
క. దారాపేక్షం గష్ట,ప్రారంభముఁ బూని యిహమునందుఁ బరమునఁ
వారనిసంక్లేశంబులఁ,గూరు నరుఁడు దానిఁ జేయఁ గొనకొండ్రె బుధుల్.242
చ. ధన మది యేల భోగమును దానము లే దగునేని శత్రుమ
ర్దన మొనరింపఁడేని బలదర్పము లేల సధర్మవృత్తికిఁ
గొనకొనఁడేని విన్కి మునికుంజర యేల జితేంద్రియుండు గాఁ

డనఁ జనునేని నాత్మవిధ । మారయు[1] నాక్రమ మేల చెప్పుమా. 243

క. అని యిట్లుపదేశించిన, విని శుకుఁడు విముక్తిమార్గవిదుఁడై చనియెన్
జనకుఁ దొఱఁగి నిశ్చలధీ,పనిభాత్ముం డగుచుఁ గురునృపాలవరేణ్యా. 244

క. అనిన విని దేవతటినీ,తనయునితోఁ బాండురాజతనయాగ్రజుఁ డి
ట్లనుఁ బ్రీతియు వినయము నా,ననమునఁ దళుకొత్త నరతనయవంశవరా. 245

భీష్ముఁడు ధర్మరాజునకు శుకునిజన్మప్రకారంబు సెప్పుట.

వ. కృష్ణద్వైపాయనపుత్త్రుం డనుమాత్రయ కాని శుకునిజన్మంబు తెఱంగును నతని
తల్లిని నతండు బాల్యంబున మహానుభావుం డగుటకుం గతంబును నతండు సిద్ధి
వొందినభంగియు నెఱుంగ నవి యెల్ల నెఱింగింపుము. 246

సీ. అనవుడు నతఁ డిట్లు । లను నాతనికిఁ గర్ణి,కారవనం బనఁ । గలదు మేరు
తటమున నం దద్రి।తనయయుఁ దానును, బశుపతి లీలమైఁ । బ్రమథగణము
గొలువ నుండఁ దనూజుఁ । గోరి వేదవ్యాస,సంయమి తత్ప్రదే।శమున యోగ
బల మూర్జితముగఁ దపం బొనరించె యో,గమునకు రాజసూ।యములు సర్వ

ఆ. మేధములును నపరి।మితము లైనను సరి, గావు సూవె వినుము । కౌరవేంద్ర
తత్తపోవిశిష్ట।తకు మెచ్చి శివుఁడు ప్ర,త్యక్షు మై యభీష్ట । మడుగు మనిన. 247

వ. అమ్మునీశ్వరుండు భక్తిసంభ్రమభరితుం డగుచు దండప్రణామంబు సేసి. 248

క. జలపవనాంబరవసుధా, నలసమవీర్యుఁ డగుపుత్త్రు । నా కొసఁగంగా
వలయు ననుడు నిచ్చితి నని, పలికి చనియె నమ్మహాకృపామూర్తి నృపా. 249

వ. ఇట్లు లబ్ధవరుం డగుచు సత్యవతీసుతుం డగ్నికార్యపరుం డై యరణి పుచ్చికొని
మథింపం దొడంగిన ఘృతాచి యనునప్సరోవనిత లోచనగోచరం బగుటయుఁ
దానునుం గామగోచరత్వంబు నొందిన నయ్యిందువదన యమ్ముని తెఱం గెఱింగి
వంచనం జిలుక యయి యుండె నతండును ధైర్యం బవలంబించి యరణికార్య
ప్రవణుం డై యుండం బ్రబలుం డగునంగజునిచెద్ది నప్సరోరూపాతిశయసక్త
చిత్తుం డై నయ్యాసంయమిశుక్లం బయ్యరణియందుఁ బడియె నవ్విప్రుండు నిర్విశం
కం బగునంతగికరణంబుతో నరణిమథనం బొనరించిన. 250

తే. అయ్యరణిఁ బుట్టె జనకసమాకృతియును
భూరికాంతియు వెలుఁగంగఁ । బొలిచె శుకుఁడు
యాగకాలసుసంభృతహవిరవాప్తి
మహితతేజస్కుఁ డగుహుతవహునిమాడ్కి. 251

సీ. అపుడు మందాకిని । సాకార యై వచ్చి, మంగళస్నానసమన్వితుఁడుగ
నొనరించె నాకసంబుననుండి పడియెఁ గృ,ష్ణాజినదండంబు । లతనియెదుర
దివ్యదుందుభులును । దేవాంగనాగాన,ములును వీతెంచె నద్భుతము గాఁగఁ

1. చ. నాగ్రహ మేల.

గుసుమవర్షంబులు గురిసె నింద్రాదిదేవతలు గారవమున వచ్చి రంబి

తే. కాసమేతుఁడై యేతెంచి కామవైరి, యతని నుపనీతుఁ గావించె నమరనాథుఁ
డుజ్జ్వలంపుఁ గమండలు వొసఁగె నిచ్చి, రమరు లెన్నంగ మాయని యంబరములు.

క. మృగపక్షిసమూహములు, దిగఁ గల్గుచరాచరముల దివ్యప్రభవుం
డగుశుకుని పుట్టొనర్చిం, బ్రగాఢతమసంప్రమోదభరితంబులు గాన్. 253

క. జనియించినమాత్రన యమ్మునిపకిశోరమును వేదములు వొందెను ద
జ్జనకుని మును పొందిన తెఱఁగున నబ్బాలుఁడు వరించె గురుఁడుగ ధిషణున్.

వ. ఆచారపరిపాటి యవలంబించి యిట్లుపాధ్యాయవరణంబు సేసి. 255

తే. అతఁడు సదివింప వేదవేదాంగధర్మ
శాస్త్రరాజనీత్యాదికసకలవిద్య
లును గ్రమంబునఁ జదివి యమ్మునికుమారుఁ
డచ్చటన యుండె వ్రతిచర్యలందుఁ దగిలి. 256

వ. దేవతలకు లోనుగా మంత్రణీయుండును మాననీయుండును నగుచు నట్లుండు
నయ్యారణేయుండు నిజాశ్రమంబున నున్నతండ్రిపాలికిం జనుదెంచి తదనుసరణ
ప్రక్రియం బ్రవర్తించు నెడ నచ్చేరువం జరియించుమునికుమారులతోడియాట
లు మరగి లోకంబుతోడిపాటియై యాత్మానుసంధానంబు సేయ లేక మెలంగు
చున్నం జూచి యాసత్యవతీసుతుండు సాంఖ్యయోగశాస్త్రంబు లతనికి నధిగతం
బులు గావించె మఱియు దేహంబునందలియహంకారం బంతయు బంధులవలని
మమతయుం బాయునట్టివాక్యంబు లుపదేశించె దానం బ్రబోధం బుదయించు
టం జేసి యమ్మహామతికి బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థధర్మంబు లనునాశ్రమం
బులు మూఁటను బుద్ధి రమింప దయ్యె నయ్యుపరమపరుం డప్పారాశర్యుతో
మోక్షప్రదం బెయ్యది దాని నెఱింగింపవే యనుటయు. 257

ఆ. అతఁడు మోక్షదర్శి యగుట నిరూపించి, యమ్మహామునీంద్రుఁ డతనితోడ
వత్స కానఁ బొమ్ము నైదేహుఁ డగుజనకక్షితీశు వినయగౌరవమున. 258

క. గగనంబునఁ జను టుడుగుము, తగంగఁ బాదప్రచారితన చను మిథిలా
నగరమునకు నమ్మునిమాన్యగుణుం గను మోక్షధర్మ మతఁ డెఱింగించున్.

క. ఆరాజన్యు నెడ నహం,[1]కారిత మమకారితయును గర్తవ్యము గా
దేరికి నైనను బూజ్యుం, డారయ నాతఁడు వినీతి యతగుం జుమ్మీ. 260

ఆ. అనిన నట్ల కాక యని మేరుముఖనగంబులు ననేకనదులుఁ బలుదెఱఁగుల
దేశములును వివిధతీర్థంబులును జుల్కఁ, గడచి వచ్చె భరతఖండమునకు.

వ. వచ్చునప్పు డెయ్యెడ నేపదార్థంబులఁ జూచినం జూడనివాఁడపోలె వచ్చె నిట్లు
వచ్చి విదేహజనపదంబు సొచ్చి మిథిలాపురంబునుపవనంబు దఱిసి చని తదీయ

1. చ. కారము మమకారరహితక రవ్వ.

ప్రాకారద్వారదేశంబు సేరినసమయంబున. 262

ఆ. ద్వారపాలు రచట వారింప శాంతిమై, నూర కున్నఁ జూచి వారు వెఱచి
లోని కెఱుకచేసి లోఁగుచు వారు ద, న్ననుప నరిగె నృపగృహంబు సేర.

క. అచటఁ బ్రతిహారు లాఁగిన, నచలితశమవృత్తి నుండె నవ్వేత్రధరుల్
ప్రచలితమతు లై యా తెఱఁ, గుచితంబుగఁ జెప్ప నృపతియుఁ బురోహితునిన్.

తే. అరయఁ బుత్తెంచె నాతఁడు నరసి పోయి
నిజ మెఱింగింప భక్తివిసితిసంభ్ర
మములు ముప్పిరిగొనఁగ నమ్మనుజనాథుఁ
డఖిలమంత్రులు బుధులుఁ దో నరుగుదేర. 265

చ. శిరమున నర్ఘ్యపాత్ర గొని చెచ్చెర వచ్చి ప్రియం బెలర్ప న
గ్గురుసుతుఁ గాంచి యంతిపురికోటకు లోనగు నొక్కసౌమ్యమం
దిరమున కమ్మునిం గొనుచు దేవసమప్రతిపత్తి నేఁగి ర
త్నరుచిరకాంచనాసనమునం దగ నుంచి సునీతపాద్యుఁ డై. 266

క. లలితాక్షతములఁ గుసుమం, బులఁ బూజితుఁ జేసి యర్ఘ్యమును గోవును న
క్కులపతికి నిచ్చె విధిపరి, కలనజ్ఞుం డైనయతఁడుఁ గైకొనియెఁ దగన్. 267

వ. జనకుండు సవినయంబుగా నిలుచుండి యమ్ముని యనుమతి సేసిన మఱి మహి
యంద సమాసీనుం డై తాను మంత్రులు విద్వజ్జనంబులుఁ గొలిచి యుండె
నట్టియెడ నన్నరపతిపరివారజాతం బెల్లను గౌతుకంబునం జనుదెంచి యంతంత
మ్రొక్కుచుం జూచు చుండ. 268

తే. రూపవిభ్రమముల నప్సరోజనంబుఁ, గ్రేణి సేయువారాంగనాశ్రేణి గీత
నృత్యనిరతి నారాధింప నిర్విశేష, యోజితేంద్రియుఁ డై యతఁడుండె నధిప.

చ. అతనికి నన్నపానముల నంచితభక్తి నొనర్పఁగాఁ బురో
హితు నియమించి యవ్వసుమతీశ్వరుఁ డద్దినశేష[1]యామినుల్
చతురము భక్తియుక్తమును సంప్రమదంబునుఁ గా నయించె స
స్మితమృదుసారభాషణసమీరణతం దదుపాంతవర్తి యై. 270

వ. మఱునాఁ డమ్మహీపాలుండు కాలోచితకృత్యంబు లాచరించి కృతకరణీయుండును
సుఖాసీనుండును నై యున్నయమ్మునిపాలికి సూరిజనసమేతంబుగాఁ జని పరివేష్టిం
చియుండి కేలు మోడ్చి మీ రిట విచ్చేయుటకుం గతం బేమి యని సవినయం
బుగా నడిగిన నమ్మహాత్ముండు మాతండ్రి పంపున మోక్షమార్గబోధార్థి నయి వ
చ్చితి విప్రునకుం గర్తవ్యం బెయ్యది మోక్షం బేమిటం బడయ వచ్చు నెఱింగిం
పవే యనుటయు నతండు సవిశేషసమాదరుం డై. 271

1. చ. యామముల్.

జనకుఁడు శుకున కుపదేశించిన మోక్షధర్మప్రకారము.

సీ. విను ముపనీతుఁ డై విప్రుండు బ్రహ్మచర్యంబు [1]వేదాభ్యాసనంబు నడపి
దారసంగ్రహము సంతానసంపాదనంబును నధ్వరక్రియయును నొనర్చి
దేవపితృతిథిపూజావిధిపరుఁ డగుచుండి వనమునకు హుతవహప్ర
యుతముగఁ జని యందు నతిథులఁ గొనియాడి, వ్రతము కషాయపక్వత నొనర్ప
ఆ. నగ్ను లాత్మయందు నారోపితములుగఁ, జేసి వీతరాగచిత్తవృత్తిఁ
బరమశాంతిఁ బొంది బ్రహ్మాశ్రమపదంబుఁ, బొందువాఁడు లోకపూజ్యచరిత. 272

వ. అనిన విని యమ్మునివరుండు. 273

క. జ్ఞానోదయ మై యుండఁగ, మానక వెండియును నాశ్రమత్రయవాసుం
డై నిలిచి తత్క్రియానుష్ఠానము క్రమవృత్తి నడపుటయు వలయునొకో. 274

తే. జ్ఞానవిజ్ఞానదృష్టి శాశ్వతికతత్త్వఁ
డయ్యెనేనియు విడువ రాదాశ్రమములఁ
గ్రమసమారూఢి యనునె వేదములు దీనిఁ
దెలియఁ జెప్పవె మోక్షవిత్తిలకజన్మ. 275

వ. అనవుడు నతం డతని కిట్లనియె. 276

తే. జ్ఞానవిజ్ఞానములు మోక్షసాధనములు, గురునియుపదేశమున నవి దొరకొనంగ
వాన మోక్షంబు గాంచినవాఁడువిడుచు, నయ్యుపాయద్వయంబును నతులబుద్ధి. 277

క. లోకోచ్ఛేదముఁ గర్మవ్యాకులతయుఁ గాక యుండ వలయుట కై సు
శ్లోకా చతురాశ్రమములుఁ, గైకొని నడపిరి దృఢంబుగాఁ బూర్వమునుల్. 278

తే. అందుఁ దుద ముట్ట నడచిన నందవచ్చు
ముక్తి బహుజన్మసంసిద్ధమోక్షకార
ణముల శుద్ధుఁ డై ప్రథమాశ్రమమునయంద
కాంచు మోక్ష మెందేని నొక్కరుఁడు మునిప. 279

క. వానికి మూఁ డాశ్రమముల, లో నిలువఁ బ్రయోజనంబులుం గలవు తమో
ధీనతను రజఃపరత, న్మాన వలయుఁ గాక సత్త్వనైష్ఠికమతి యై. 280

తే. సత్త్వమార్గాభిరతి యాత్మతత్త్వదర్శ
నంబు గావింపఁ దనుఁ దాన నరుఁడు గాంచు
విశ్వమునఁ దానుఁ దనయందు విశ్వమును వ
సించుటయుఁ జూచుచును ముక్తిఁ జెంది యుండు. 281

వ. ఇవ్విషయంబున యయాతివాక్యంబులు గల వాకర్ణింపుము. 282

ఆ. జ్యోతి యాత్మయందు యున్నది గాన్పశక్యము సమాహితాత్ముఁ డైనమునికి
నొరులవలనఁ దనకు నొరులకుఁ దనచెస, భయము లేక యున్నఁ బరముఁ గాంచు.

1. గ. వేదాధ్యయనంబు.

క. కోరికయు నొల్లమియు లే, కేరూపున భూతములకు । నెగ్గగు తెఱఁగుం
జేరక యకామవృత్తిఁ ద, పోరతి నున్నతఁడు బ్రహ్మ।ముం బ్రాపించున్. 284

క. వినఁ జూడంబడు నందె,ల్లను సమతం బరముఁ గనుచు । లౌల్యనిరసనం
బున సుఖదుఃఖాదిద్వం,ద్వనిరూఢుఁడు గాక యున్న।తఁడు ముక్తిఁ గనున్. 285

క. ఇనుమును గనకము నిందయు, వినుతియు సమములుగఁ గొనుచు । వివిధాంగకముల్
దనలోన నడఁచు కమఠము, ననువున నింద్రియము లడఁచు।నతఁడు గను శివున్.

వ. అని చెప్పి. 287

తే. అవ్విశేషంబు లెల్ల నీ।యందుఁ గలుగు, టనఘ భవదీయజనకద।యాసమృద్ధి
సిద్ధదివ్యబోధంబునఁ। జేసి తోఁచె, నవ్విధముకంటె నీచంద। మధికతరము. 288

క. నీ వట్టిఁడ వగు టెఱుఁగవు, భావంబున సంశయమును । భయమును బాల్యం
బావేశింపఁగఁ జేయ న, భావితనిశ్చయుఁడ వగుటఁ । బరమమునీంద్రా. 289

క. జ్ఞానము విజ్ఞానము నీ, మానితగుణము లగు నవి స।మగ్రము లైనం
గానేరదు మోక్షపదము, గానవు దృఢనిశ్చయుండ। గా కున్నెనిన్. 290

తే. ఒక్కకొఱఁతయు లేదు నీ।వుదితమోక్ష, బోధుఁడవు సంశయము లెల్లఁ। బోవవిడిచి
నిశ్చయింపుము నీ కన్న। నెలవు శాశ్వ, తంపు నెలవుగ విషయావి।కంపితాత్మ. 291

శుకుఁడు హిమవంతంబున నున్న వ్యాసునియొద్దకు వచ్చుట.

క. అని బోధించిన జనకువ, చనములు విని శుకుఁడు విగత।సంశయుఁ డై శాం
తినిరూఢిఁ బరమసౌఖ్యం, బు నొంది తనుఁ దాన కనుచుఁ । బోవుచు నుండెన్.

తే. మారుతముతో సమానధ।ర్మత్వ మొంది
యతఁ డుదఙ్ముఖుఁ డై నిఖి।లామరులును
మునులు గరుడగంధర్వాదు।లును గుతూహ
లమున వసియించు శిశిరశై।లమున కరిగె. 293

సీ. కురువంశముఖ్య య।గ్గిరి పుణ్యవిభవస, మేతంబు విను మ।మ్మహీధరమునఁ
బరమేశ్వరుండు ద।పం బేకపాదస్థుఁ, డై బహువర్షంబు। లాచరించెఁ
బుత్రలాభార్థిత్వ।మునఁ గృష్ణుఁ డుత్కృష్ట, నియమాచరణముల। నిష్ఠ సలిపె
షణ్ముఖుం డాత్మీయ।శక్తిప్రభావంబు, దెలిపి దేవాధిక।తేజుఁ డయ్యె

తే. మఱియుఁ బెక్కండ్రు మునులు న।మర్త్యులును సు
చరితములఁ బెంపు నొంది రా।శైల మావృ
షాంకునకుఁ గూఁతు నిచ్చె యా।గాంగయోని
యగుట నజుఁడు తదాత్మత్వ। మర్థిఁ బొందె. 294

వ. అట్టిమహామహిమ గలుగు నాహిమవంతంబునకు మున్న వచ్చి సుమంతువైశంపా
యనజైమినిపైలనామధేయు లగుశిష్యులం గరుణావిధేయుం డగుసాత్యవతేయుం
డధ్యయనంబు సేయించుచుండఁ బుణ్యతమం బగుతదాశ్రమంబు భానుప్రభా

నిభం బగునిజకాంతివిసరంబున వెలుంగ నయ్యారణేయుం డమ్మునిపాలికిం జని
తాను యోగబలంబున ననేకంబు లైనగిరిసరిదరణ్యంబులు గడచి యెందునుం
దగులు వడక కార్ముకజ్యా నిర్ముక్తశరంబుచందంబున నేతెంచుటకుం బ్రీతుం
డగునప్పరాశరనందనుపాదంబుల కభివందనంబు సేసిన నతం డభినందింప
నాసన్నక్షమాసీనుం డై జనకజననాథసంవాదవిధంబు విన్నవించి విశేషసమ్మ
దం [1]భావహించె ని ట్లరణిసుతుసమాగమంబు నొంది. 295

క. అమ్మునియును శిష్యులతో, నమ్మహితాత్ము నునిచికొని యధ్యాపనశీ
ల మ్మగుచిత్తముతోడ సుఖ మ్ముండఁగ నొక్కనాఁడు గౌరవమొప్పన్. 296

వ. కొలిచి యుండి సుమంతుప్రభృతులు నలువు రతనితో దేవా శుకుండు మొద
లుగాఁ గలయే మేవురమును వేదవిషయప్రఖ్యాతి నెల్లవారికంటె నెక్కుడుగా
వలయు మమ్మంబోలె నొర్ల నాదరాధిక్యంబున భరంపడి సవిశేషంబుగా
నధ్యయనంబు సేయింప కుండుట మాకు వరం బని విన్నవించిన వీతపక్షపాత
చిత్తుం డగునత్తాపసోత్తముండు. 297

తే. భక్తుఁ డగుబ్రాహ్మణునకు వాగ్బ్రహ్మ మఖిల
మును బ్రియంబున నిచ్చునజ్జనునిచేతి
లోనియది బ్రహ్మలోకంబు దీని మీఱ
లేర్పడఁగ నెన్నఁడును విని యెఱుఁగ రెట్లు. 298

క. వినుఁ డెల్లవారు దుర్గంబును గడచి శుభంబు నొంది పురుషార్థములం
గనువార కాక యనియెడునను గ్రహము వలదె యిట్టులనఁ దగ వగునే. 299

చ. అనుటయు వార లొండొరులయాననముల్ గనుఁగొంచు నవ్వి యి
ట్లని రటులేనిఁ బోదుమె దయాపర శైలము డిగ్గి భూమి నెం
దును జరియించి యధ్యయనదోహలులం జదివించి యాజనం
బు నడపి నీకృపారసముపొంగు నిగుడ్తుమె యెల్లచోటులన్. 300

చ. అనవుడు మున్న యిట్టు లనరై తిరి పోవఁగ నీను మిమ్ము నెం
దును గడు వెడ్డు వెట్టితిరి దోహల మిమ్మెయి నుండ జాణ లై
నను నిటు వే ఱొకం డడిగి నావచనంబులు మీమనోరథం
బున కిటు సాధనంబులుగఁ బోకులఁ బోయితి రంచు నవ్వుచున్. 301

తే. తమ్ము సంప్రీతిఁ గనుఁగొనునమ్మునీంద్రు
చరణకమలంబులకుఁ జక్కఁ జాఁగి మ్రొక్కి
రన్నలువురును వారల నతఁడు దివిచి
కరుణ సిగు రొత్త బిగి యారఁ గౌఁగిలించి. 302

వ. దీవించి యెయ్యది సేసిన నప్రమాదాయత్తచిత్తుల రై చేయుండు త్రిలోకంబు

1. ఖ. బాపాదించె.

లందును మీకుం బ్రియం బైనచోటుల వర్తిల్లుం డని వీడుకొలిపినఁ జని వార
లధ్యాపనయాజనవిశేషంబుల నశేషదేశంబులు నలంకరించుచుండి రట్టియెడ.

క. నారదుఁడు వచ్చి ప్రీతిం, బారాశర్యమునిఁ గాంచి బ్రహ్మనినాదం
బీ రున్నచోట లేమికిఁ, గారణ మేమియొకో యనుడు గారవ మెసఁగన్. 304

క. అతఁ డతనితోడ శిష్య,ప్రతతి యిచట లేమి యనుడు బ్రహ్మర్షివరా
సుతుఁడును [1]నీ వైనను ద,ద్వ్రతంబు సెల్లించు చుండవలదే యనినన్. 305

క. నారదునివచనములుఁ జెం, పారం గొనియాడి భువన మంతయు నాదా
పూరితముఁ జేసె నమ్ముని, సారాధ్యయనమునఁ బుత్త్రసంయుక్తుం డై. 306

వ. ఇట్లయ్యిరువురు నధ్యయనంబు సేయ మహావాయువు బెట్టు వీచిన నవ్విశేషజ్ఞుండు
పుత్త్రుతో ననధ్యయనసమయం బగుట సెప్పి తదధ్యయనంబు వారించి తానును
నూరకున్న నయ్యారణేయుండు నియ్యత్యధికమారుతం బెక్కడిది యని యడిగిన
నఖిలభూతవేది యగువేదవ్యాసుండు దేవయానంబున విష్ణుండును బితృయానం
బున భానుండును నూర్ధ్వాధోగమనపర్యాయరూపంబునం బ్రవర్తిల్లుదు రది పవ
నాలంబనకలితంబై చెల్లుఁ బవనుల వినుము చెప్పెద సమానుండు దైవతసంఘ
సంభవుం డతనికి నుదానుండును నుదానునికి వ్యానుండును వ్యానునికి నపానుం
డును నపానునికిఁ బ్రాణుండును జనియించిరి జగంబులు వీరిచేత సంవ్యాప్తంబు
లై యుండుం బ్రవహుం డావహుం డుద్వహుండు సంవహుండు వివహుం డుప
వహుండు పరావహుం డనం బవనులు సప్తసంఖ్యు లదితిపుత్త్రు లఖిలభువనవ్యాప్తు
లై చరియింతురు వారు సమానాదిపవనపంచకమహితాత్ములు వారలవలన వ
ర్షంబులకుం బ్రవర్తననివర్తనంబులు గలుగు చుండు వివిధదైవతవిమానంబుల
కును మహితయానం బావహిల్లు నొక్కొక్కనాఁడు విష్ణునినిశ్వాసవేగంబు. 307

క. అప్పవనములను గలఁచిన, నిప్పరు సగువికృతవాయు విది దీనిరయం
బిప్పుడు మహనీయం బగు, నిప్పర్వతమును జలింప నెసకం బెసఁగెన్. 308

తే. ఇట్టియప్పుడు సదివిన నెల్లభంగి, నెడరు వుట్టుఁ గావునఁ జదు వుడుగ వలసె
ననియెఁబదపడి ప్రకృతిస్థమయ్యెఁబవన,మఖిలభూతంబులకు సౌఖ్యమావహిల్లె.

వ. స్నానకాలం బయ్యె నని పలికి పుత్త్రునకు నీవు సదువుచుండు మని చెప్పి యప్పా
రాశర్యుం డాకాశగంగా[2]ప్రపాతప్రదేశంబునకుం జనియె నయ్యారణేయుండును
నారదుం డాకర్ణింపఁ గొంతసే పధ్యయనంబు సేసిన నద్దేవముని మెచ్చి యత
నితో నీకు మే లొనర్చెద నిష్టంబు సెప్పు మనిన నతం డీలోకంబునం బుట్టిన
వానికి హితం బెయ్యది దానిం జెప్పవే యనుటయు నమ్మహాత్ముండు దొల్లి
సంయములకు సనత్కుమారుండు సెప్పినవాక్యంబు లేతత్ప్రయోజనంబు లయి
యుండు వానిం జెప్పెద విను మని యి ట్లనియె, 310

1. చ. నీవును నైనను, వ్రత మది సెల్లించు. 2. గ. ప్రవాహప్రదే.

నారదుఁడు శుకున కుపదేశించినతత్త్వప్రకారము.

తే. తపము సత్యంబ కన్న విద్యయు సుఖంబు
విడుప దుఃఖంబు రాగంబ వినుఁడు నరుఁడు
ముక్తి కుత్సహింపక భవసక్తుఁ డైన
నొందువుట్టువునం దది యొండ రాదు. 311

క. ఆరయఁ గామముఁ గ్రోధము, వైరులు ముక్తి కవి రెండు వారించిన సం
సార మనాకారం బగు, నేరిమి యొండేల ముక్తి నెలవు గనుటకున్. 312

క. అపరిగ్రహసర్వారం, భపరిత్యాగములు గలుగుపండితునకు దుః
ఖపుఁదెరువు వాటిలదు మో, క్షపదము [1]సొప్పడి తదాత్మకసుఖం బొందున్.

క. భూతంబుల దర్శింపమి, భూతాస్పర్శనము భూతముల[2]యెడ సంభా
షాతరలత నొందమి సూ, రే తెరువు విమోక్షసుఖగరిష్ఠత వడయన్. 314

ఆ. హింస లేక యునికి యింద్రియజయము నై, రాశ్య మచపలత్వ మనుగుణములు
నాల్గుఁ గలుగునట్టి నరునకుఁ గరతలా, మలక మంతరాత్మమహిమ యెల్ల. 315

క. అమ్మునిపతివాక్యములవి,ధ మ్మిది దీనిం బ్రగాఢతత్పరతం జి
త్తమ్మున నిడి తెలిసి నడవు, మిమ్మెయి సమకూరు నీకు నిహపరసుఖముల్. 316

వ. అని చెప్పి వెండియు. 317

ఆ. పుత్త్రదారబంధుమిత్త్రసక్తుఁడు రొంపిఁ, బడినగజమునట్ల యెడరు నొందు
భోగజాలపరుఁడు వాగురాజాలసం, పతితమృగఝషముల భంగిఁ దలరు. 318

వ. ధర్మాధర్మంబులును సత్యాసత్యంబులును దొఱంగ వలయుఁ దొఱంగు టెట్లు
సొప్పడు నంటేని. 319

సీ. విను మధర్మం బహింసనమున నెడలు ధ, ర్మంబు సంకల్పవర్జనముచేత
నవ్యాప్తిఁ బొందు సత్యాసత్యములు బుద్ధిఁ, గొనితోవ నగు నని మునివరుండు
మఱియును జెప్పు నాత్మవిభావనంబున, బుద్ధి విలీనతఁ బొందు శోక
భయహేతువులు నిచ్చ బదివేలు వాటిల్లుఁ, బండితుం డందుఁ బొందండు భూత

తే. ములును నింద్రియములు నొక్క ప్రోవు గట్టి, యున్న వీనికి వగఁ బొందు టూరివారి
కొలయు నెడరుల కెల్లఁ దా నుమ్మలికము, గట్టికొని కుందునట్టులు గాదె వత్స.

చ. అన విని సంశయం బురివి యమ్మునితో నరణీతనూజుఁ డి
ట్లను భవదీయదివ్యవచనామృత మాని యరోగ[3]చిత్తతం
గని కృతకృత్యతం బొరయఁ గాంచితిఁ బొందెద యోగసిద్ధి సూ
ర్యునిమహితప్రసాదమున నూని సమస్తము డిగ్గఁ ద్రావెదన్. 321

క. అని పలికి యమ్మునీశ్వరు, ననుజ్ఞ గొని తండ్రికడకు నరిగి వినతుఁ డై
తననిశ్చయంబు సెప్పిన, విని యతఁ డలరెం దదీయవిజ్ఞానితకున్. 322

---

1. క. సొప్పడఁ దదాత్మసౌఖ్యం బొందున్. 2. క. గడ. 3. చ. చింతతం.

ఆ. సంప్రమోద మందు సాత్యవతేయునిఁ, గని ప్రదక్షిణంబు గాఁగ వచ్చి
నరుగ నుత్సహించె నారణేయుఁడు దానిఁ, గాంచి వత్సలత్వ గౌరవమున. 323

వ. ఆబ్రహ్మర్షిసత్తముండు. 324

క. ప్రమద మొనర్చెదు నానయ, నములకు నంత కటు నిలుము నాఁగా నిఃస్నే
హము నిస్సంశయముం దన, యమలమతిం బల్లవింప నాశుకుఁ డరిగెన్. 325

ఆ. జనకు విడిచి యిట్లు సని సిద్ధచారణ, సముదయోపసేవితమును యోగ
సేవనార్హవిధము నై వెలుఁ గొందుకై, లాసశిఖరితట మలంకరించె. 326

సీ. విను మందు సమము వివిక్తంబు నగుచోటఁ, బ్రాఙ్ముఖాసీనుఁడై పరమయోగ
రతిఁ బదప్రభృతిగాత్రములఁ గ్రమంబుగ, నాత్మధారణము సేయంగ నంత
నినుఁ డుదయించినం గని పాణిపాదసం, యమ మొప్ప నద్దేవు నాశ్రయించి
నిర్విషయం బగుసర్వాత్మతత్త్వంబు, గాంచి విశిష్టయోగక్రమంబుఁ

తే. బొంది నారదముని యలవోక యచటి, కరుగుదెంచిన వినతుఁడై యాత్మయోగ
సిద్ధి యెఱిఁగించి నీకృపఁ జేసి తెరువు, గంటి నరిగెద విగతసంగత్వ మొంది.

క. అని పలికి విమలయోగం, బున నాకసమునకు నెగసి పోయె గరుత్మం
తునిభంగి నపుడు సాధ్యులు, మునులుం గని విస్మయమున మునుఁగుచుఁ దమలోన్.

తే. అచిరకాలంబునన యమ్మహాత్ముఁ డిట్లు, యోగసిద్ధిఁ బ్రాపించు నెయ్యుల్లమెంత
నిర్మలమొ పితృభక్తివినిశ్చలత్వ, సంపదన చూవె యాతఁ డీపెంపు వడసె.

—వ్యాసుఁడు వెనుకొన శుకుఁడు యోగమార్గంబున నదృశ్యుం డగుట.—

వ. అని మఱియు ననేకభంగులం బ్రస్తుతించుచుండి రట్టియెడ శుకుండు మృగపక్షి
శైలసరిత్సరసీతరుగుల్మలతలం గలయం గనుంగొని మాతండ్రి నావెనుకం జను
దెంచి నా దగుపేరం బిలిచెనేని మీ రెల్ల నో యన వలయుం జుండీ యనిన నవి
యట్ల చేసెద మనియె నాబ్రహ్మర్షివరుండు తమోరజస్సత్త్వంబులం గ్రమంబున
డిగ్గఁ ద్రావి యుత్తరాభిముఖుం డయి పోవ నొక్కమహాపర్వతంబుశృంగంబులు
రెం డత్యంతపీతశ్వేతంబు లై మేరుహిమవంతంబులం దెగడుచుం గదిసి యనేక
యోజనాయామవిస్తారంబులు గలిగి మార్గంబున కడ్డపడి యుండె నతం డప్రతి
హతగమనంబునం జన నవి దుత్తుము రై రాలె నద్భుతభంగి యగునాసిద్ధపుం
గవుపైఁ బుష్పవర్షంబు గురియుచు నమరగణంబు బహువిధంబులం బ్రణుతించె
నప్పారాశర్యపుత్త్రుం డయ్యెడం బ్రవహించుమందాకినిమీఁదం జదలఁ జేరువం
జనియె నట్లు సనుసమయంబున. 330

తే. నగ్నలై యప్సరస్స్త్రీజనములు సలిల, కేలి సలుపుచు నుండి శంకింప కమ్మ
హాత్ముఁ [1]గనుఁగొను చెప్పటియట్ల నిర్వి, కారవృత్తి వర్తించిరి కౌరవేంద్ర.

వ. అయ్యవసరంబున సత్యవతీసుతుండు నిజసుతు వెనుక మహాయోగగమనంబు నై

1. చ. గనుఁగొని యెప్పటియట్ల.

కొని తగిలె నంతకు న[1]య్యారణేయుండు వాయుపథం బతిక్రమించి సర్వభూ
తాత్మకుం డయ్యె నప్పుడు. 332

తే. వెనుక నరుగుచు నున్నయన్ వేదమూర్తి, తోడ సిద్ధచారణులు తన్ త్సుతుఁడు శైల
శృంగవిధ్వంసియై పోకన్ సెప్ప నెఱుఁగు, పెంపు మిగుల శుకా యనిన్ బిలిచె నతఁడు.

వ. పిలిచిన నాసర్వగతుండు [2]నిజప్రకారం బంతర్హితం బగుట దేటపడ బయలనో
యనునాదంబు నిగుడునట్లు సేసెం దదనంతరంబ. 334

తే. సకలజంగమస్థావరన్ సమితు లెల్ల
నో యనిన నద్భుతం బెడ్దన్ నుద్భవింప
సత్యవతికొడుకు కొడుకువిన్ శాలమహిమ
దెలిసి యప్పర్వతముమీఁదన్ నిలువఁబడియె. 335

వ. ఇట్లు నిలిచినయవ్వేదవ్యాసమునీశ్వరుం గాంచి జలవిహారంబు సలుపునయ్యా
ప్సరోజనంబులు సిగ్గునగ్గలిక గ్రందుకొన నందఱు నంబరంబులు ధరియించి
రద్దివ్యబోధమహానీయుండు నిజతనయుచనునప్పుడు వారు శంక లేక యునికి
గని యతనిముక్తతయుఁ దనసక్తతయు నిరూపించి ప్రియంబును లజ్జయు నొక్క
టఁ బొడమ నున్నంత. 336

క. సురమునిసిద్ధగణంబులు, పరివేష్టింపంగ నతనిన్ పాలికి గంగా
ధరుఁ డేఁగుదెంచి నెవ్వగఁ, బొరయునతనితోడఁ గరుణన్ పొంపిరివోవన్. 337

వ. అనునయపూర్వకంబుగా నిట్లనియె. 338

క. జలపవనాంబరవసుధా, నలసమవీర్యుఁ డగుపుత్త్రున్ నా కొసఁగంగా
వలయు నని యడిగి తిచ్చితి, నలఘుతపోవిభవ యేనున్ నట్టికుమారున్. 339

వ. వాఁడును మత్ప్రభావంబునను భవత్తపోవిశేషంబునను బ్రహ్మతేజోమయుం డై
దేవతలకుం బొంద రానిపరమగతిం బ్రాపించె దీనం జేసి మోదంబు నందవలదె
విషాదంబునకుం బని యేమి యని పలికి వెండియు. 340

తే. ఇలయుగిరులును శరధులున్ నెంతదాఁకఁ, గలుగు నంతకాలంబునున్ వెలయుచుండు
శుకునికీర్తియు నీదుయన్ శోవిభూతి, యును జనంబులవీనులన్ కుత్సవముగ. 341

వ. అని నిర్దేశించి వలయునేనిఁ బుత్త్రసదృశ యైనఛాయ ని న్నెప్పుడు ననుగమింప ద
ర్శించువాఁడవుగాకనియె నిట్లను గ్రహించియా బ్రహ్మర్షిప్రవరునిసంప్రీతునిం జేసి
వీడుకొల్పి విశ్వేశ్వరుండు నిజేచ్ఛం జనియె నింతవట్టు నారదుండు నాకుం జెప్పె.

క. ఇది యితిహాసవరము దనుఁ, జదివినవారలకు వినినన్ జనముల కాయుః
ప్రద మగు లక్ష్మీకీర్త్య, భ్యుదయంబుల నిచ్చు సుగతిన్ యును గావించున్. 343

వ. అనియె నద్దేవమునిచేత నావినినచొప్పున నీకుం జెప్పితి నీ వింక నేమి వినవలతు న
టయు ధర్మతనయుండు శంతనుతనయుతో బ్రహ్మచర్యాదు లగునాలుగాశ్రమం

బులవారును దమకు నుత్తమపదసిద్ధిం గోరి యారాధించు దైవం బెయ్యది దయ పల్లవింప నా కెఱింగింపుము. 344

క. అనియె నని చెప్పి గురుభ, క్తినిరూఢుఁడు లోకమాన్యతేజుఁడు విద్యా ఘనుఁ డగునా వైశంపా, యనమునివరుఁ డిట్టు లనియె నాతనితోడన్. 345

తే. వ్యాసమునినాథు షడ్గుణైశ్వర్యధుర్యు, నాగమవ్యాసకర్తు నమితతేజుఁ గొలిచి తత్ప్రసాదంబునవలనుఁ బెంపుఁ, గలిగి యేనునారాయణుకథ ఘటింతు.

వ. అని భక్తిపూర్వకంబుగాఁ బలికి జనమేజయున కిట్లనియె నట్లజాతశత్రుం డడిగిన నయ్యాపగాపుత్త్రుం డతనితో నారాయణనారదసంవాదం బనునితిహాసంబు మాతండ్రి నాకుం జెప్పె దాన నీయడిగినయర్థంబు దేటపడుం జెప్పెద. 347

క. అని పలికి యాదరంబున, మనంబు మేదురము గాఁగ మనుజేశ్వర య జ్ఞనపతిపీను లమృతరస,మున నించినయట్టిచందమున ని ట్లనియెన్. 348

భీష్ముఁడు ధర్మజునకు నారదనారాయణసంవాదంబు సెప్పుట.

సీ. విను మవ్యయుఁడు సనాతనుఁడు విశ్వాత్ముఁడు, నైన నారాయణుం డనుమునీంద్రు బదరికాశ్రమమున భక్తిమైఁ గొలిచి నా,రదుఁ డెద్ది సిద్ధి కారాధనీయ మానతి యిమ్మన్న నతఁడు ధ్రువం బచ,లం బింద్రియాగోచరంబు సూక్ష్మ మనుపమ మన సర్వమున కంతరాత్మయై, వెలుఁగుతత్త్వము దక్కఁ వేఱ కలదె

తే. యరయ నారాధ్య మై యజుఁ డాది గాఁగ
సకలభూతంబులకును బూజ్యంబు దాన
యనియె ని ట్లన్న నరసఖుఁ డతికృపార్ద్ర
భావుఁ డై చెప్ప నప్పద్మభవసుతుండు. 349

వ. సంప్రీతుం డై సవిశేషవినయంబున నమ్మహాత్మున కి ట్లనియె. 350

క. లోకేశ నీవు ధర్మ, శ్రీకావలి గాఁగ నవతరించుట విద్వ ల్లోకంబు సెప్పు నమ్మూ,లాకృతి యె ట్లుండునో దయాత్మకమూర్తీ. 351

క. శ్రుతిపరతయు గురుభక్తియు, మతిఁ గల వాకకొంతకొంత మన్నింపఁగఁ బా త్రత గలిగెనేని నాకొసఁ,గు తదీయాలోకనం బరగు తెఱంగు కృపన్. 352

వ. అని వేఁడిన భక్తపరాధీనుం డై నయమ్మహానుభావుం డద్దేవసంయమితోఁ బరమై కాంతి వగుము నీకట్టి పెంపు సంపాదించెదం బొమ్మని యత్యాదరంబున వీడుకొలి పినం బ్రీతుండై వియద్వీథిం జని యమ్ముని కనకనగంబునందు నియతాత్ముండయి యుండిదుగ్ధార్ణవంబునుత్తరంబుచేరువనున్న శ్వేతద్వీపంబునందనాహారులునింద్రి యవృత్తిరహితులు నస్వేదులు సుగంధిశ్వేతాంగులు నగుపురుషులం గాంచెనని విని ధర్మపుత్త్రుం డవ్విశేషంబులు ముక్తలక్షణంబు లై యున్నయవి యప్పురుషుల తెఱం గెఱింగింపవే యని యడిగిన శంతనునందనుం డతని కి ట్లనియె. 353

క. వారలకథ మాతండ్రికి, గారవమున బుధులు సెప్పఁగా నే వింటిం

గౌరవముఖ్య విశిష్టాచారుఁడు నృపుఁ డొక్కఁ డుపరిచరవసు వసుఁగన్. 354

ఆ. కలిగెఁ దొల్లి భూమిఁ గలయంతయును నేలు, సత్యమును దమంబుఁ శమము విష్ణు
భక్తియును నయంబుఁ బలిమియుఁ గ్రతుకుతూహలము బ్రాహ్మణప్రియంబు గలఁడు.

వ. అమ్మహాత్ముండు. 356

చ. అలఘుతపంబు గోరి వసుధాధిపతిత్వము డిగ్గఁ ద్రావి కా
నలఁ జరియించుచుండ సురనాయకుఁ డాతనిపాలి కేఁగి నె
చ్చెలి వయి నాకడం దగ వసింపుము వచ్చుచుఁ బోవుచున్న మే
లిలయును నేలు దివ్యతయు నిచ్చితి మెచ్చితి నీదునిష్ఠకున్. 357

తే. దేవభావంబునకుఁ దగ దీని నెక్కి, తిరుగు మెల్లెడ నని రత్నదీప్తమైన
యొకవిమానంబు సంప్రీతి నొసఁగె నతఁడు, నతనిమాటకు మిగులక యట్లచేసె.

వ. [1]దానం జేసి వసునామధేయుం డైన యతం డుపరిచరుం డనం బరఁగె నదియునుం
గాక వేఱొక్కటి యవ్విభునివిశేషంబు వినుము కల్పాదియందు మరీచి యత్రి
యంగిరసుండు పులహుండు పులస్త్యుండు క్రతువు వసిష్ఠుం డనియెడుమహా
మునులు చిత్రశిఖండినామధేయులు స్వాయంభువుం డనుమనువుం దారు ననేక
వర్షంబులు విష్ణు నుద్దేశించి తపంబు సేసిన నద్దేవుం డదృశ్యరూపంబున వారల
కట్టెదుర నిలిచి వారితో మీరు ధర్మశాస్త్రకరణప్రవణులరై సన్నాశ్రయిం
చితిరి భారతి మీయందు నిలువ నియోగించితి మీచేతం బ్రణీతం బై సకలజ
గంబులకు హితంబును మర్యాదాప్రవర్తకంబును నై శాస్త్రంబు వెలుంగు నం
గిరసువలన బృహస్పతి యనునొక్కమహామతి జన్మించు వానియం దాసంద
ర్భంబు ప్రతిష్ఠించునది యని యానతిచ్చి వెండియు. 359

తే. ఉపరిచరవసు వనునొక్కనృపతి పుట్టు, నాతఁ డర్థిఁ డాశాస్త్రంబు నధిగమింప
నాబృహస్పతి సెప్పంగ నధిగమించి, తత్సమాచారనాయకత్వము వహించు.

వ. అమ్మహితాత్ముండు మద్భక్తుండు మీకు సంభావనీయుం డని పలికి చనియె నత్తె
ఱంగునన యాపెంపు నొందినయట్టియవ్వసువు హయమేధంబునకుం బ్రవర్తించిన
నమ్మరీచ్యాదు లగుసప్తసంఖ్యులును మఱియునుం దత్సము లగుమహానుభావులును
ఋత్విక్కరణంబు లాచరించిరి బృహస్పతి యుపదర్శనంబు నడపెఁ బ్రజాపతిపుత్త్రు
లగు నేకతుండును ద్వితుండును త్రితుండును ననుమునిసత్తములు సదస్యులై
రిట్లు సెల్లు నయ్యధ్వరంబునందు. 361

తే. అన్నరేంద్రుం డహింసకుం డగుటఁ జేసి, పశువిశసనంబు లేకుండఁ బరమనిష్ఠ
నాతఁ డారణ్యకోద్గీతమైనవాక్య, సంచయము విష్ణుగుఱిచి పఠించె నధిప.

క. కరుణావిధేయుఁ డగునా, హరి యతనికిఁ గాన వచ్చునట్టులుగాఁ జె
చ్చెర వచ్చి హవిర్భాగా, హరణం బొనరించి చనుడు నతికుపితుం డై. 363

వ. దివ్యధిషణుం డగుధిషణుండు గన్నీ రొలుక నన్నరపతితోఁ దనకై యెత్తినపురోడాశభాగంబు విష్ణుం డెల్లవేలుపులుంబోలె నాకు దర్శనగోచరుం డై కొనక యదృశ్యుం డై కొనియె నని యుగ్గడించిన నయ్యుపరిచరుండు భరితవినయుం డై యతని ననునయించె సదస్యులు సంభ్రమంబు లేక యన్నాకేశమంత్రితో ని ట్లనిరి. 364

ఏకతద్వితత్రితులు బృహస్పతికి విష్ణుదేవుమహిమ సెప్పట.

సీ. అలుక మానుము హరికై సముద్యత మైన, భాగంబు హరి గొన్నఁ బదర నేల
యతని దర్శింప శక్యమె నీకు మాకును, నజునిమానసపుత్త్రు లైనయేము
హరిదర్శనము గోరి యధికతపం బాచరించుచుండఁగ నశరీరవాణి
దుగ్ధార్ణవంబునం దుదు విశాలరమణీయ, మగునొక్కదీవి దె ల్వారి యుండు
ఆ. నచటి కరుగుఁ డచట నతిసితవర్ణుల, స్వేదు లింద్రియప్రవృత్తివిముఖు
లధికసురభిదేహు లాహారరహితులు, హరిపరాత్ము లైనవరులు గలరు. 365

క. వారలకుఁ జూపు నిజతేజోరూపము విష్ణుఁ డపుడు సూడఁగ నైనన్
మీరును జూతు రనినఁ బ్రియ, మారినచిత్తములతోడ నందఱము వెసన్. 366

వ. శ్వేతద్వీపంబునకుం జని యశరీరవాణి సెప్పినచందంబుమానవులం గంటి మట్టిదీప్తివిశేషంబు లేలోకంబుల నెజ్జాతులకును లేవు వారలు మానసజపపరాయణు లై యున్నవా రే మయ్యెడ నేకాంతికజనుల కింత నంత నున్నంత భానుసహస్రప్రభాభాసితం బగునొక్కదివ్యతేజోరూపంబు వారియగ్రభాగంబునం దోఁచిన వారు గూడుకొని భక్తిమయప్రణామంబులు సేయుచుం జేరి జయ పుండరీకాక్ష జయ హృషీకేశ జయ విశ్వభావన నమస్తే నమస్తే యనునెలుంగులు నింగి ముట్టం గొల్చి రట్టియెడ. 367

క. మానయనంబులు తత్తేజోనిహతము లగుడుఁ దెలియఁ జూడ నశక్యం
బైనం జేడ్పడి యుండం,గా నొక భూతంబు వలికె గగనతలమునన్. 368

క. ఈదేవునిఁ గన్నట్టుల, కాదే యిప్పురుషవరులఁ గాంచుట మీకుఁ
ఖేదంబు వలదు నియమతపోదానము లితనిఁ జూపఁ బూఁటవడియెనే. 369

క. ఏకాంతికభక్తిరతి న,నేకము లగువత్సరముల కివ్విష్ణుని నా
లోకింపంగా దొరకొనుఁ,గా కిటు వేగపడ మీకుఁ గానఁగ వశమే. 370

క. అని పలికిన విని బ్రహ్మజుఁ, జనుదెంచితి మేము విష్ణుచందం బిది నీ
కనఘా యలుగం బని లే, దనూనములు గాఁగ నడపు మధ్వరవిధులన్. 371

వ. అని యిట్లేకతద్వితత్రితులు సెప్పినం బ్రశాంతుం డై పురుహూతపురోహితుం డయ్యాగంబు సుప్రయోగంబుగాఁ జెల్లించె నాభూవల్లభుం డట్లు పుణ్యాపరుం డగుచుఁ బ్రజాపరిపాలనం బొనరించె నట్టియెడ నాకలోకంబున సురమునిగోష్ఠి యందు సుర లధ్వరంబుల నజంబుల విశసింప వలయు నని పలికిన మును

లజంబు లన్నంతన యెల్లయుగంబులను భాగంబులుఁ గాఁ గొనరాదు కృతయుగ విషయంబుగా వేదంబు లజంబు లోషధు లని చెప్పెం గాన యని యిట్లు వివాదం బైనసమయంబున నలవోకవోలె నుపరిచరవసు వయ్యెడకుం జనిన నా రెండుదెఱంగులవారును జయాపజయంబులకు నతనిమాట పాటిగా నూఁది యడిగిన నాతండు. 372

క. భాగము విశసనయోగ్యము, యాగంబుల నెల్లయుగములందును ననియెం
దా గీర్వాణులపక్షం, బై గెలు పది యపుడు వారి కగుటకు నధిపా. 373

వ. అనిన విని వేదార్థాపలాపంబునకుం గోపంబు నొందిన మునులశాపంబున నతండు భూవివరపతితుం డయి యుండ నమరు లేతెంచి యతనియంతరంగంబునకుం దెలివును నంగంబునకు డప్పి లేకునికియు నొసంగి విష్ణుప్రసాదంబునఁ బ్రత్యాపన్నుండ వగు దని యూఱడించి యరిగి రన్నరవరుండును విష్ణుధ్యానజపపరాయణుం డగుచుండ నచిరకాలంబునకు విష్ణుండు విహగపతిం బుత్తెంచి యెత్తించికొనిపోయి శరీరంబుతోడన బ్రహ్మలోకగతుం గావించి సంభావించిన నమ్మహానుభావుండు పరమానందంబు నొంది వెలింగె. 374

క. కురునాథ యుపరిచరవసు, చరితంబు ప్రసంగకలన సంప్రాప్తం బై
బెరసెను నీ వడిగినయ, ప్పురుషులదివ్యానుభావము ముం జెప్పంగన్. 375

వ. అని పలికి భీష్ముం డాభూపతితో నారదువృత్తాంతంబు వివరించెద నాకర్ణింపుము.

సీ. అని చెప్పి యి ట్లను నధిప నారదుఁ డట్టు, లద్దీవియును నద్భుతాంగు లైన
యమ్మానవులుఁ దనయంతరంగంబునఁ, దోఁచినఁ బ్రీతి నందులకు నేఁగి
యమ్మహాత్ములు దన్ను నాత్మల నాదరిం, పంగఁ దా నత్యంతభక్తిఁ బ్రణతుఁ
డై పరమైకాంతు లగువారి కింతంత, నిలిచి దుష్కరతపోనిష్ఠఁ బూని

తే. యూర్ధ్వబాహుతఁ గదలక యుండి వివిధ, గూఢదివ్యనామోక్తిసంప్రౌఢి యచటి
సకలజీవుల నానందసంభృతములఁ, జేయు చుండ విష్ణుస్తుతి సేయు చుండె. 377

వ. ఇవ్విధంబున నేకాంతి యై సంస్తుతింప సితాసితపీతారుణపిశంగహరితవర్ణంబులను బహుశిరోబాహుపాదంబులను వేదికమండలుస్రుక్స్రువాగ్నిధారణంబున నోంకారసావిత్రీచతుర్వేదోచ్చారణంబులను మహాద్భుతం బయిననిజదివ్యరూపంబు నారదునకు దర్శనగోచరంబుగా నిలిచి విష్ణుండు వినయసంభ్రమోపేత భక్తిప్రణతుం డగునప్పరమముని నాదరించి యి ట్లనియె. 378

—— శ్వేతద్వీపవాసి యగునారాయణుండు నారదున కుపదేశించినతత్త్వము. ——

క. ననుఁ గానఁ బడయ రెవ్వరు, ననఘా యేకాంతికులక యర్హాము మద్ద
ర్శన మీ వేకాంతికుఁడవు, ననహంకారుఁడవుఁ గాన యబ్బెం జూడన్. 379

వ. అని పలికి వరంబు వేఁడు మనుటయు నతండు దేవా భవద్దర్శనంబుకంటె మిగుల వరంబునుం గలదే యనుటయు న దేవుండు ... 380

సీ. ఇంద్రియంబుల కందఁ గాకెల్లభూతంబులుఁ, దెగినను దెగకుండుఁ ద్రిగుణరహితుఁ
డఖిలంబునకు నాత్మ యన సర్వసాక్షి నా, నజుఁ డన నిష్కలుం డన వెలుంగు
క్షేత్రజ్ఞుఁ డాతండు జీవుండు వాసుదే, వుండును సంకర్షణుండుఁ జూవె
వారు మనం బహంకారంబు వరుసఁ బ్ర, ద్యుమ్నానిరుద్ధనామోపహితము
తే. లింతయును మన్మయంబ యే నిరువదియును
నాల్గు నగుతత్త్వకోటికి నాథుఁ డైన
పంచవింశకాభిఖ్యుండఁ బరమపురుషుఁ
డనియు నాపేరు నుఱి పర మరయ లేదు. 381

క. విను మేకాంతికుఁ డెవ్వనిఁ, గని నిత్యానందపదము గను నప్పరమా
త్ముని వాసుదేవు నిష్కలు, ననుపముఁగా నను నెఱుంగు టాత్మహిత మగున్.

క. భూతాత్మక మైనయఖిల,ధాతుచయము వెలిగ లేదు తను వామొత్తం
బాతతజీవవ్యాప్తిస, మేతము గా కున్నఁ జేష్ట నెసఁగదు వత్సా. 383

క. జీవశరీరములు పృథ,గ్భావాకలితములు గాఁగఁ గనుటయు వలయుం
జీవునిఁ గంటి ననుట మా,యావిలసన మన్మదీయ మది మునివర్యా. 384

క. జీవుఁడు మత్సమవేతుఁడు, గావు ఱెఱుఁగ వలయు దృఢముగా భక్తిమయం
బై వఱలునాశ్రయంబున, నేవాఁ డొందు నను వాని కిత్తు విముక్తిన్. 385

క. ఆదిత్య మరు ద్వసు రు,ద్రాదిదివిజగణము నంబుజాసనుఁడుఁ జతు
ర్వేదములు మదాత్మకతం, గాదే తత్తద్విశేషగౌరవ మొందున్. 386

తే. కమలగర్భు సృజించి సకలజగద్ధు,రానియుక్తునిఁ గావించి యే నివృత్తి
పరత నేకాకి నై విద్య భవ్య మగుస,హాయముగ సంచరింతు మధ్యస్థవృత్తి.

వ. ఒక్కొక్కకాలంబున జగద్ధితంబుగా జన్మకర్మంబులం బూనుదు వినుము
వారాహరూపంబు దాల్చి హిరణ్యాక్షుని నారసింహమూర్తి ధరియించి హిర
ణ్యకశిపుని భృగువంశంబున జామదగ్న్యుం డన జనియించి సర్వక్షత్త్రంబును
దశరథుం డనురాజునకు రామనామంబునం బుట్టి రావణాసురుం బరిమార్పం
గలవాఁడ భూభారంబు వాపుటకై యాదవకులంబునం బ్రభవించి పురందర
నందనుం డై యవతరించిననరుండు దోడ్పడ నక్కార్యంబు నిర్వహింతు నేను
దొల్లి నరనారాయణు లనియెడునామంబుల మూర్తిద్వయంబును బుషిత్వం
బును వెలయ నొలసి లోకరక్షణం బాచరించు చున్నవాఁడ నమ్మూర్తులపదం
పడి కేలీమానుషత్వంబు గైకొని యిట్లు సేయునయ్యవతారంబునఁ గంస
కాలయవన మురనరక బాణ ప్రముఖు లైనకంటకులం జెఱుతు నందు
బాణాసురుం గాతు నని పూని మహాదేవుండు మహాసేనాదిసహితుం డై యడ్డ
పడ నమ్మహాత్ముని జయించి బాణునిం బరాభవింతు నింతకు మున్ను మత్స్యత్వ
కూర్మత్వంబుల నొంది నిఖిలచ్ఛందోబృందారకహితం బొనర్చితి మచ్చరితంబులు

నీకుం గర్ణగోచరంబులు గాకుండెడునే మఱియు ధర్మరక్షణార్థంబుగా నే నేమి సేయవలయు నవి యెల్లనుం జేయువాఁడ గృత్యంబులు కృతంబులైన మదీయ ప్రకృతిన పొందుదుఁ బరమేష్ఠినందనా నీ వేకాంతికుండ వగుట నీకు నాతెఱం గెల్ల నెఱింగించితి నని చెప్పి యమ్మునిం గని యనాహారులు ననింద్రియులు నస్వేదులు సుగంధిశ్వేతదేహులు నగునమ్మానవులం జూపి వీ రేకాంతికులు మన్మయధ్యానపరులు నై యున్నవారు వీరలకు సమ్మర్దంబుగా మెలంగం దగదు సేవింకఁ బొమ్మని పరమాదరంబునం బలికి వీడ్కొలిపిన నద్దేవమునిసత్తముండు పరమానందభరితుండై బదరికాశ్రమంబునకుం జనుదెంచి నరనారాయణులం గాంచి.

తే. భక్తి వీడ్కొని చని మునిప్రతతి కెందు
నచ్యుతాననోద్గతము వేదార్థమయము
యోగసాంఖ్యాత్మకము నై నవాగమృతము
కర్ణపుటపేయముగఁ జేయు గారవమున. 389

వ. నారదుం డట్లు విష్ణునిదివ్యవాక్యవితతి విద్వజ్జనంబులకు వినిపించుచు బ్రహ్మసభ కరిగి యందునుం బ్రకటించె ననుటయు నప్పద్మభవునకును నది వింతయే యనినయక్కొంతేయాగ్రజుతో శాంతనవుం డాశతానందునకు నపరిజ్ఞాతంబునుం గలదే యతనిం గొలువ వచ్చినట్టిసిద్ధసాధ్యాదులకు వినిపించెదం గాక యని పలికి వెండియు ని ట్లనియె. 390

క. క్రమమున వాఙ్మయ మగున,య్యమృతము లోకమునఁ బరఁగె నది మజ్జనకుం డమితదయఁ జెప్పె నాకును, శమయుత యేఁ జెప్పితిని విశదముగ నీకున్. 391

క. మునులును సురలును దీనిని, విని కొనియాడుదురు విష్ణు వినుతింతురు భక్తినిరూఢు లై జపింతురు, మనమునఁ జర్చింతు రతిసమాహితు లగుచున్. 392

తే. నీవు నిట్టుల చేయు వినీతిపరుఁడు, విష్ణుభక్తుండు శమదమాన్వితుఁడు నైన యట్టివానికిఁ జెప్పు మీయచ్యుతాన,నోద్గతం బైనయుప్పురాణోత్తమంబు.

క. నీవినినయుపాఖ్యానము, లేవియు సరి గావు దీని కిది దీర్ఘాయు శ్శ్రీవిభవారోగ్యములం, గావించుఁ బఠించినం దగం దను వినినన్. 394

క. అని శాంతనవుఁడు సెప్పిన, విని మోదము నొంది పాండవేయులు దీనిన్ వినుచుఁ బఠించుచు విష్ణుం, గొనియాడుదు రధికభక్తిఁ గురువంశవరా. 395

వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు. 396

ఉ. సాత్యవతేయుఁ డీపరమజప్యము భక్తిఁ బఠించుచున్ వియ
ద్గత్యభిరాముఁ డై నియమతత్పరతం జను దుగ్ధవార్ధికిన్
నిత్యము విష్ణుఁ గాంచి మహనీయతరం బగుపూజనంబు సం
స్తుత్యము గాఁగఁ జేతకుఁ గుతూహలసంపద పల్లవింపఁగన్. 397

వ. అనిన విని జనమేజయుండు మోదంబునొంది యమ్మునిసత్తమునితోడ నీవు మో

క్షం బత్యంతసుఖం బని చెప్పుదు సకలజనంబులు నభ్యుదయకరంబు లైనకర్మ
విశేషంబులం దగిలి యుండుదు రొరుల నన నేల దేవతలును దద్ధర్మంబు వాటిం
పక హవ్యభోజనపరత్వం బూని యుండుదు రమ్మహాత్ము లట్లగుట యెట్లొకో
యని యేను విచారించుచుండుదు నత్తెఱంగు దేటపడ నెఱింగింపవే యని
యడిగిన నప్పారాశర్యశిష్యుం డాభూవరున కిట్లనియె. 398

క. విమలాత్ముఁడు పారాశర్యమునీంద్రుఁడు శిష్యులను మహాభారతపం
చమము లగు వేదముల మేరుమహీధరవాసి యై కరుణం జదివించెన్. 399

వ. అట్టియెడ నేనును సుమంతు పైల జైమినులును నీ విప్పుడు నన్నడిగినచందంబున
నమ్మహాత్ము నడిగితిమి దానికి సుముఖుం డయి సర్వజ్ఞుండును సదయహృదయుం
డును నగుసాత్యవతేయుండు మాకు నిట్లని యానతిచ్చె. 400

తే. ఏ నతీతంబులును వర్తమానములు న, నాగతమ్ములు నగుజగదఖిలవర్త
నంబులును గనుదివ్యబోధంబు గోరి, పాలకడలితీరమునం దపంబు సేసి. 401

వ. నారాయణప్రసాదంబునం జేసి సిద్ధమనోరథుండ నైతిం గావునం గల్పాదియం
దుం గమలసంభవప్రముఖబృందారకు లాచరించినకృత్యంబులు గాన వచ్చు
వానిం జెప్పెద దాన మీ యడిగినయర్థంబు దేటపడు వినుండు. 402

క. ఆదిత్య మరుద్వసు రుద్రాదిసురులు మునులు నంబుజాసనుఁ గని మా
కేది కరణీయ మీశ దయాదృష్టిని మమ్ముఁ జూచి యానతియీవే. 403

వ. అని విన్నవించిన విని భరితాదరుం డగుచు నప్పరమేష్ఠి వారితో మీ కెయ్యది
కర్తవ్యంబో యనుతలంపు మున్న నాచిత్తంబునం బొడమి యున్నయది మీరు
నిమ్మాట సెప్పి మేలు సేసితిరి మీకును నాకును బ్రబలత్వం బెద్దానం గలుగు
దాని నుపదేశించుటకుం [1]బురుషోత్తము శరణు సొత్తము రం డని పలికి వారు
నుం దానును దుగ్ధవారాశితీరంబునకుం బోయి ఘోరం బగుతపంబు బహుస
హస్రసంఖ్యంబు లగుదివ్యవర్షంబు లాచరించిన వారలకు గంభీర మధురప్రకార
యగువాణి యిట్లని వీతెంచె. 404

విష్ణుఁ డదృశ్యరూపంబున బ్రహ్మాదిదేవతల కుపదేశించినహితప్రకారము.

క. మీవచ్చినపని యెఱుఁగుదు, నీవనజభవుండు జగము లిన్నిటికి గురుం
డేవిధిఁ బనిచిన నది శ్రుతి, భావితకర్మంబు దానఁ బరఁగుదుఁ దగఁగన్. 405

వ. ఏనునుం జెప్పెద వినుండు వేదహితం బగు నొక్కయాగంబు సేయుం డందు
భాగంబు నాకుం గల్పింప వలయు ననిన వారుం బ్రీతిఁ బొంది. 406

క. కమలజుపంచినక్రియ యాగము వైష్ణవ మనఁగఁ జేసి కల్పించిరి భా
గము విష్ణున కందతఁ డయ్యమరులమునివరులపై దయను గగనమునన్.

వ. అదృశ్యుం డై నిలిచి వారలతో నిట్లనియె. 408

1. చ. లోకసాక్షి.

క. నాపంపునను బ్రవృత్తి,వ్యాపక మైనట్టిసత్క్రియం జేసితి రి
ట్లీపుణ్యంబునకును ఫల,రూపం బగుదాని నే నిరూపింతుఁ దగన్. 409

వ. మరీచి యంగిరసుం డత్త్రి పులస్త్యుండు పులహుండు క్రతువు వసిష్ఠుం డనువీరి లవ్వారిజభవునకు మానసపుత్త్రు లిమ్మహాత్ములు నట్టివార వేదాచార్యులు యజ్ఞకార్యధుర్యులు వీరు విధింప సర్వయజ్ఞంబులును మానవులు మాననీయంబులుగా నడప మీ కెల్లను నయ్యాగంబుల భాగంబులు గలిగి తద్భాగంబుల నాప్యాయితులై యుపబృంహణంబు నొందువారలు సన సనక సనందన సనాతన కపిల సనత్కుమారులు పరమేష్ఠిమనోనిర్మితులు సహజజ్ఞానవిజ్ఞానులు నివృత్తిపరులు నై సాంఖ్యయోగంబులకుం బ్రవర్తకు లగుచుందురు వీరలచేత మోక్షధర్మంబులు సువ్యంజితంబు లగు మీకుం దల్లియుం దండ్రియు గురుండును నివ్విరించియ మదీయానుశాసనంబున నితండు సర్వానుశాసకుండై వర్తిల్లువాఁడు మత్ఫాలప్రభవుం డైనరుద్రుండు సర్వలోకారాధనీయుండును సకలవరప్రదుండునుం జుండీ మీరు వాంఛు వేదోదితకర్మంబు లిక్కమలభవుండును మరీచ్యాది ప్రజాపతులునుం బంచినట్లు నడవం గలయవి యిది కృతయుగం బనుపేరింటి యుత్తమకాలంబు దీనియందుఁ బశువులు హింస్యంబులు గావు సంశయంబు వలవ దని నిర్దేశించిన. 410

క. మునులును సురలును విష్ణు, న్వినుతించి నమస్కరించి నిజపదములకుం
జనిరి పరమేష్ఠి యొకరుఁడ, చన కచ్చట నిలిచె హరియు సన్నిహితుం డై.

తే. హయశిరోభాసితుండును హస్తకలిత,లలితదండకమండలుఁ డుజ్జ్వలుండు సాంగ
వేదముఖరముఖుండు నై యాదరార్ద్ర,దృష్టి నిగుడంగ నిలిచి యద్ద్విజముఖ్యు.

వ. కౌఁగిలించుకొని నీవు సర్వంబునకును విధాతవు గురుండవు ప్రభువవు నయి నడపుము నీయందు సర్వభారంబునుం బెట్టి సుఖినై యుండెద నడపుట నీ కెప్పుడేనిఁ గడిందియై తోఁచె నప్పుడేను దోఁచి సమస్తంబును సునీతంబు సేయంగలవాఁడ ననియెఁ దదనంతరం బావిష్ణుం డంతర్హితుం డయ్యె నిట్లు యజ్ఞంబులం దగ్రభాగార్హుండును యజ్ఞధారియు నై నయప్పద్మనాభుండు ప్రవృత్తిధర్మంబు బ్రహ్మాదులకుం గృత్యంబు సేసి నివృత్తిధర్మంబునందు నిష్ఠుండును విద్యాసహాయుండును నై సర్వగతుం డగుచుఁ జరియించు నని చెప్పి యప్పారాశర్యుండు.

క. మొదలఁ గలిగించి జగములఁ, బదిలంబుగ నునిచి వానిఁ బదపడి తనయం
దొదిఁగించి మఱియు నెమ్మెయి, నుదారగతి నడపుచిన్మయునిఁ గొలుతు హరిన్.

ఆ. అజుని విశ్వరూపు నమరుని సర్వామ,రాధినాథు నాద్యు సాంగవేద
వేదితవ్యు నాత్మవేద్యు నీశాను న,వ్యయుఁ దపగతఫలాత్ము నాశ్రయింతు. 415

వ. అని మఱియు ననేకప్రకారంబుల నప్పరమమునిని యప్పుడు భావంబున నెలకొన్న నారాయణుం బ్రస్తుతించి మమ్ముం గలయ నవలోకించి పూర్వవృత్తాంతంబు

ప్రజ్ఞాదృష్టిని నాకన్నయది మీ కెఱింగించితి విష్ణునిదివ్యవచనంబులచొప్పున నడచునది యప్పరమేశ్వరుం గొలువుండు వేదవాక్యంబులం దత్ప్రకీర్తనంబు సేయుం డనియె నేము నట్ల కాక యని ఋగ్యజుస్సామంబుల నాత్రిధాముం బ్రస్తుతించి మనంబుల నారాధించితి మని చెప్పి వైశంపాయనుండు వెండియు. 416

సీ. సర్వజ్ఞుఁ డగుపరాశరనందనునిచేత, భాషితం బైనయిప్పరమపుణ్య
వృత్తంబు సదివిన విన్నను విప్రుండు, వేదవేదియు రాజు విజయశాలి
యును వణిజుండు లాభోపేతుఁడును శూద్రుఁ, డత్యంతసుఖియును నగు నరేంద్ర
కన్య సద్వరకరగ్రహణంబు వడయు గ, ర్భిణి యైనకాంత సద్గుణునిఁ బుత్త్రుఁ
ఆ. గాంచుఁ బ్రసవకాలకలయందు నెఱి దప్పి, యున్న బిడ్డ గలుగు ననువిద సుఖక
రప్రసూతినిర్భరత నొందు వంధ్య సం, తానసిద్ధి సమ్మదంబు నొందు. 417

## భగవన్నామనిర్వచనప్రకారము.

వ. మఱియు నెవ్విధంబుమనోరథంబు లైనను సఫలంబు లగు ననిన విని జనమేజయుండు గూఢంబు లగువిష్ణునామంబులనిర్వచనంబులు వినవలతు వివరింపవే యనుటయు వైశంపాయనుం డమ్మహీనాయకునితో నర్జునుం డడుగం గృష్ణుండు వివరించిన నిజనామంబులనిరుక్తి తెఱం గెఱింగించెద నాకర్ణింపు మప్పార్థుని బోధించుటకై యద్దేవుం డి ట్లనియె. 418

తే. నరుఁడు నారాయణుండు ననంగఁ బరఁగు, నిత్యపురుషులు నీవును నేనుఁ జుమ్ము
భువనహితమాచరింపఁగాఁ బూని వేడ్క, వచ్చి [1]యిమ్మెయిఁ బుట్టినవారమనఘ.

వ. గూఢంబు లగుమదీయాభిధానంబులయర్థంబులు దేటపఱచెద నాకర్ణింపుము.

క. నారము లనఁగా జలముల, పేరయనం బనఁగ నెలవు ప్రీతిగ నాకున్
నారము లయనం బగుటను, నారాయణుఁ డండ్రు జనులు నన్నుఁ గిరీటీ. 421

క. వసియింతు నే జగముల, న్వసియించున్ జగము లెల్ల నాయం దిమ్మై
పొసఁగి వెలుంగుచు నుండుట, నసదృశగుణ వాసుదేవుఁ డనఁగఁబరఁగ దాన్.

క. వ్యాపించి రోదసీకుహ, రాపూర్ణత్వమున నునికి నధికక్రమణ
శ్రీపొలుపున విష్ణుం డను, దీపితనామంబునను బ్రతీతుఁడ నగుదున్. 423

తే. దమము నాఁగ లయుత్తమధర్మ మెడఁద, నలవఱిచినన్నుఁ గామించు నార్యజనము
దివియు భువియు నానడుమను తేజరిల్లు, నట్టు లగుట దామోదరుఁ డండ్రు నన్ను.

ఆ. అన్నమును జలంబు నమృతంబు వేదంబుఁ, బృశ్ని యనఁగ నొప్పు పేరఁ బరఁగు
నది మదీయగర్భ మగుట విద్వజ్జను, లనఘ పృశ్నిగర్భుఁ డండ్రు నన్ను. 425

క. ఇనరశ్ములుఁ జంద్రాంశులు, ననలశిఖలుఁ గేశసంచయము నాకుం గా
వునఁ గేశవాభిధానం, బునఁ గొనియాడుదురు ననుఁ బ్రబుద్ధజనంబుల్. 426

క. క్షత్త్రము బ్రహ్మము నై లో, కత్త్రాణన మాచరింపఁగా వలసి పృథా

---

[1] అ. యమ్మహిఁ.

పుత్త్రా యగ్నీషోములు, చిత్త్రస్థితి వెలుఁగుదురు ప్రసిద్ధా[1]కృతులన్. 427

వ. అని చెప్పి బ్రహ్మక్షత్త్రపదంబులు విప్రరాజనిర్దేశంబు లగుట దేటపడం బలికి విప్రులరాజులమహానుభావంబులు విలసిల్లినయెడలు నిదర్శనంబులుగా నిరూపించి యుపన్యసించి యవి యెల్ల నగ్నీషోమమాహాత్మ్యంబు గా నెఱింగించి.

తే. బోధనస్థాపనంబులు బుధవరేణ్య, యగ్నియును సోముఁడును జేసి యఖిలజగము
నఖిలహర్షముఁ బొందింతు రవ్యయప్ర,వర్తనత్వంబు దమయందు వఱలుచుండ.

క. అనఘా యగ్నీషోముల, ననుఁగా భావింప జగమునకు నెపుడు హితం
బొనరింతుఁ దత్సుకృతములఁ, బొనరినమద్భవ్యనామములు వివరింతున్. 430

ఆ. పరమవరద లోకభావనేశ్వర హృషీ
కేశ నామకము లహీనచిత్త
యనియు మఱియు నిట్టు లను యాగములభాగ
మాహరింతుఁ గాన హరియు నంద్రు. 431

సీ. గోవన మహి యది గుహలోనఁ బడకుండఁ, జెంది యెత్తుటను గోవిందుఁడనియు
[2]పీతంపురోమంబు చేత నొప్పార నా,విష్టుండ గుట శిపివిష్టుఁ డనియుఁ
గర్షణక్రియ భూమిఁ గావింతుఁ జాయయుఁ, గృష్ణంబు గావునఁ గృష్ణుఁడనియు
నలవడి సదసద్ద్వయంబును నాయందు, సమవేతమై యున్కి సత్యుఁడనియుఁ

తే. దాత్త్వికం బైననాకు జాతతత్త్వవికృతి, లేమి నజుఁ డనియును సది లేక పోయి
నపుడు తదనంతరక్షయ మందకునికి, బుధు లధోక్షజుఁడనియుఁ జెప్పుదురు నన్ను.

క. సత్త్వమువనుండి తొలఁగమి, సత్త్వము నాచేతఁ జేసి సత్తిఁ బొరయుటఁ జ
సత్త్వమయజన్ముఁ డగుటను, సాత్త్వతుఁ డనునామ మయ్యె జనవర నాకున్.

తే. చ్యుతము లే కున్కిఁ జేసి యచ్యుతుఁడ నాత
ముఖ్యధాతుత్రయాకారమున శరీర
ధారకుండనై యున్కిఁ ద్రిధాతువును న
నంగఁ బరఁగుదు మునివచనంబులందు. 434

క. ఘృత మర్చిస్సంపద యయి, ఘృతార్చిరభిధాన మొందెఁ గ్రీడి వృషము వి
శ్రుతధర్మము ధర్మమయ,స్థితికతమున వృషుఁ డనం బ్రసిద్ధి వహింతున్. 435

తే. ఆదిమధ్యాంతములు నాకు నరయ లేమి, నైయనాదియమధ్యుఁ డనంతుఁడనఁగఁ
జెల్లువేల్పులు శుచులు నా చెవులకింపు,లగుట మునులు శుచిశ్రవుఁ డండ్రు నన్ను.

ఆ. ఒక్కశృంగమునన యుర్వి యెత్తితి వరా,హావతారలీల యతిశయిల్ల
నట్టు లగుటఁ జేసి యార్యజనప్రియ, నాకు నేకశృంగనామ మయ్యె. 437

క. వినుత మగులోకరేచన,మునవన్ను విరించుఁ డండ్రు బుధనుత [3]రవియం
దనుపాధికవిద్యాస్థితి, నునికిం గపిలాభిధాన ముల్లసిత మగున్. 438

క. విను యోగంబు హిరణ్యం, బనఁ బరఁగును యోగగర్భుఁ డగుటను విద్వ
జ్జనములు హిరణ్యగర్భుం, డని ననుఁ గొనియాడుదురు మహాగుణశాలీ. 439
తే. నరుఁడు నారాయణుండు నవంగ లోకరక్షణార్థంబు గాఁగ ధర్మమున కేను
బుట్టినాఁడఁగావునఁ బాండుభూపతనయ, నాకు ధర్మజ్ఞుఁడనియెడునామమయ్యె.
వ. ఇట్లు పుట్టి గంధమాదనంబున నేను దపంబు సేయుచుండ నక్కాలంబునఁ గా
లాంతకుండు దక్షునియజ్ఞంబున కలిగిన వది భీతిం బఱతెంచి నాయురస్స్థలంబు
నొందిన మదీయకేశంబులు ముంజనిభంబు లగుటంజేసి ముంజకేశుం డనుపేరు
గలిగె నారుద్రుండు రౌద్రాకారంబున నయ్యజ్ఞంబు వెనుకొని నాపయిం గవి
సిన నొక్కయిషీక పరశురూపంబుగా నభిమంత్రించి యతనిపయిం బ్రయోగిం
చిన నతండు దాని [1]ఖండితధారంబు సేయుటంజేసి ఖండపరశు వనునభిధానం
బునుం గలిగె ననుటయు. 441

క. విని పార్థుఁ డిట్లు గలిగిన, యనియం దారుద్రునకొ జయము నికొక
ల్గెను దాని తెఱం గేర్పడ, వినఁ గౌతుక మొలసెఁ జెప్పవె విశ్వాత్మా. 442

శివకేశవులపరస్పరకోపప్రసాదములవిధము.

వ. అనిన విష్ణుం డర్జునున కిట్లనియె. 443
సీ. రుద్రనారాయణరూపప్రవర్తిత, మూర్తిద్వయము రణమునకు జొచ్చి
పరమసంరంభంబు వాటింప నుద్వేజితము లయ్యె నఖిలభూతములు శ్రుతులు
మునులకుఁదోఁపవయనలంబు లాహుతుల్ గొనవయ్యెఁ బగిలె దిక్కులు నభంబు
ధరణి వడంకె భూధరములు దిర్దిరం దిరిగె దేవతలకు దిగులు సొచ్చె
తే. [2]నాననము పల్లటిల్లంగ నజుఁడు గలఁగె, నిట్టులెందును సంక్షోభ మెసక మెసఁగ
నావిధాత మునీంద్రులు దేవతలును, దన్ను వేష్టింప వచ్చె సత్వరముగాఁగ.
వ. వచ్చి రుద్రునకుం బ్రణమిల్లి సంప్రార్థనంబు దోఁప ని ట్లనియె. 445
క. శివుఁడవు నీవు జగములకు, శివ మొనరింపంగ వలదె చేయుము క్రోధ
ప్రవిహతి విష్ణుం డనఁగా, శివుఁ డన నొకఁ డౌట దివ్యచిత్తమ యెఱుఁగున్.
తే. నిగమవేద్యమద్వంద్వంబు నిర్గుణం బ, మూర్తమని యెడుతత్త్వంబు మూర్తిభేద
కలనమున లోకమున ద్విధాకారి యయ్యెఁ, గాక హరియన నీవనఁ గలదె వేఱు.
వ. అని బోధించి వెండియు. 448

క. నరనారాయణు లనఁగాఁ, బురహర జగదాదియైన పురుషులు మనముం
బరికింపఁ దన్మయత్వ, స్ఫురితులము ప్రసన్నదివ్యబుద్ధిం గనుమా. 449
ఆ. తెలుపు మితని ననుదు దేటికోపంబువో, విడిచి నన్నుఁ దెలిచె మృదుఁడు పార్థ
యేను నతనితోడ ని ట్లంటి మృదుసత్య, [3]పథ్యమునిమనోజ్ఞభంగికముగ. 450
క. నిను నెవ్వఁ డెఱిఁగె నాతఁడు, నను నెఱిఁగినవాఁడ నిన్ను నమ్మిగ సేవిం

1. గ. ఖండీభూతంబు. 2. జ. నాసనము. 3. జ. పదము నురుమనోజ్ఞ.

చిన నదియు నన్నుఁ గొల్చుట, [1]యనువాదితలేదు భేద । మరయఁగ మనకున్.
క. శ్రీవత్సము శూలాంకిత, మై వెలయుంగాక యిప్పు । డీదిగ నాకున్
నీవును మత్పాణ్యంకో, ద్భావన శ్రీకంఠుఁ డనఁగఁ । బరఁగుము శర్వా. 452
వ. అని యివ్విధంబున. 453
క. ఇతరేతరమతిసంభా, వితలక్షణకలన మొంది । వృషవాహనుతో
నతినిర్మలసఖ్యము సే, సితి బ్రహ్మాదులును సంతసిల్లిరి విజయా. 454
వ. మదీయనామనిర్వచనంబులును రుద్రునితోడిరణంబున నైనజయంబు నెఱంగును
నీ కెఱింగించితి. 455
క. నానారూపంబుల ని, ట్లేను బ్రవర్తింతు జగము । లిన్నింటను నీ
శానుఁడు నభవుఁడు నమృతుఁడు, నైనశివుని నీవు గొలువు । మర్జున యెపుడున్.
తే. ఏను రక్షింప జయము నీ । కెసక మెసఁగె, సమరమున శూలపాణి నై । శత్రుకోటి
నీదుమునుమున వధియించు । నిరుపమాన, తేజు రుద్రుఁ గా నెఱుఁగుము । ధీరచిత్త.
వ. అనియె నని చెప్పిన విని జనమేజయుండు. 458
క. అరుదే సర్వేశ్వరుఁ డగు, హరి తోడుగ జయము గొనుట । యర్జునునకు న
ప్పురుషోత్తముబాంధవు లై, పరఁగిరి పెఱవినుతు లేల । పాండుసుతులకున్.
వ. అని పలికి యిట్లనియె. 460
క. నారదుఁడు పరమపురుషుని, కారుణ్యము వడసి వచ్చి । క్రమ్మఱ నరునిన్
నారాయణునిం గాంచుట, సారమతిం జెప్పి తీవు । సంయమివర్యా. 461

## నరనారాయణనారదసల్లాపప్రకారము.

వ. తదీయసల్లాపవిశేషంబులు విన వలతుం జెప్పు మనిన నప్పుడమిఱేనికి వైశం
పాయనుం డిట్లనియె. 462
క. నారదుఁడు వచ్చి నరునిన్, నారాయణుఁ గాంచి భక్తి । నమ్రుం డై నన్
వా రతనికి నాతిథ్యము, గారవమున నడపి యడుగఁ । గా వారలతోన్. 463
వ. అద్దేవముని యిట్లనియె. 464
క. శ్వేతద్వీపంబున భవ, దాతతకృపఁ గానఁ బోలె । నచ్యుతుఁ దద్రూ
పాతిశయము మీచందమ, యాతనికడఁ గంటి మిమ్ము । నద్భుత మెసఁగన్. 465
క. శ్వేతులు నింద్రియవర్జిత, చేతస్కులు నైననరులఁ । జెలువుగ [2]మహానో
పేతులఁ గంటి నచట వా, రాతేజోమూర్తికిని ద । యాపాత్రంబుల్. 466
వ. అద్దేవుండు వత్సలుం డయి వారలతోడం గూడి విహరించు చుండ నామీఁదం
గృపసేసి క్షేత్రజ్ఞప్రకారంబు సకలంబును దేటపడ ననుగ్రహించి యాగామి
నిజప్రాదుర్భావంబుల తెఱం గెల్ల నెఱింగించె శ్వేతద్వీపం బనునది శాంతిస్వరూ
పం బందు సూర్యసోమాంశువ్యాప్తియు వాయుసంచారంబును లే దాలోకనాథు

1. గ. యనుపాధిత; జ. యనువాసిగ. 2. క. మాని, వ్రాతలఁ.

నకు నేకాంతికజనంబులం గడచినప్రియులు లేరనికి యెఱింగి యేకాంతి నై యుండితి నవ్విభుండు వీడుకోలుప మీకడకు వచ్చితి నిచ్చట మీకుం గారుణ్యభాజనంబ నై యుండెద ననుటయు వార లతని కి ట్లనిరి. 467

తే. పడసి తద్దేవుఁ గానఁ దర్శద్భాషణములు, వింటి నీవు ధన్యుండవు గంటి మేము నచట నీయున్న తెఱఁగెల్లనిచటనునికి, మేల కాక యుండుము పరమేష్ఠితనయ.

క. దైవముఁ బిత్ర్యంబును ద,ద్దేవసమారాధనంబు దెల్లము శ్రుతిసంభావిత మది తత్పరత్వ, నీ వేకాంతి వయి నిలువు నిర్మలహృదయా. 469

ఆ. అనిన సంతసిల్లి యద్దేవముని వేయు,దివ్యవత్సరములు భవ్యతపము నియతి నాచరించెఁ బ్రియమునవారు ద, న్నాదరింపఁగాఁ దదాశ్రమమున.

వ. అట్లేకాంతి యై తపంబు సేసి యత్యంతశాంతి నొంది నారదుండు నరనారాయణుల వీడ్కొని హిమవన్నగంబునకుం జని తన[1]యాశ్రమంబునందు బృందారకాదివిశిష్టపూజితుం డై యుండె నని చెప్పిన విని సంప్రీతుం డై నజనమేజయుతో వెండియు వైశంపాయనుం డి ట్లనియె. 471

ఉ. పాండవవంశవర్య పటుపాపవినాశని యైనయిక్కథ నిండుమనంబుతో వినుట నీవు కృతార్థుఁడ వైతి శాశ్వతాఖండసుఖాత్ము విష్ణు నధికస్థిరభక్తి సమాశ్రయింపు నీకొండొకఁ డేల యిమ్మెయి మహోన్నతిఁ జేయు జగత్త్రయంబునన్. 472

క. లే వుభయలోకములు హరి,పై విద్వేషంబు గలుగుపాపాత్ములకుఁ భూవర యట్టిజనులపిత్రు, దేవతలకు నరక మగుటఁ దెలుపును శ్రుతులున్.

క. హరి యాత్మ యెల్లవారికి, నరవర తనయాత్మపై మనంబున దృఢతత్పరభావము లేనికుజనుఁ, బొరయవె యాపదలు వేఱ బోధన మేలా. 474

క. మునివరుఁడు గంధవతినం,దనుండు నాగురుఁడు కరుణ దఖుకొత్తఁగఁ జెప్పినవాక్యంబులయర్థము, లనఘా యివి నీవు వీని నలవఱుపు మదిన్. 475

శా. విద్వన్మోదవిధాయి నిర్మలవచోవిస్ఫూర్తివిఖ్యాతుఁ గృష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభుం నారాయణుంగా విపశ్చిద్వంద్యం బగుభారతాధ్యయనముం జేయంగ శక్తుండు ధర్మాద్వైతుండు సరోజలోచనుఁడ కా కన్యుండు తద్వాచ్యుఁడే. 476

క. బహువిధధర్మంబులు లో,కహితంబుగ నిట్లు సెప్పఁగా నిర్మలతామహనీయధిషణుఁ డగున,మ్మహాత్మునక తీరుఁ గురుసమాజవరేణ్యా. 477

హయగ్రీవదేవమాహాత్మ్యాభివర్ణనము.

వ. అనిన విని సవిశేషసమ్మదుం డై జనమేజయుండు వైశంపాయనుతో హయశిరోభాసితుం డగువిష్ణుండు వేధకు సన్నిహితుం డయ్యె నని చెప్పితి వప్పరు

1. క. యోగాశ్రమంబు.

షోత్తముం డప్పు డేమిటికై యామూర్తి వహించె న త్తెఱం గెఱింగింపు మని
యడిగిన నమ్ముని యమ్మనుజపతి కి ట్లనియె. 478

సీ. ప్రళయకాలంబున ♦ జలముల విష్ణుండు, యోగనిద్రారతి ♦ నొంది మేలు
కాంచి లోకంబులు ♦ గావింపఁ దలఁప న,హంకార మెసఁగె బ్ర♦హ్మాభిధాన
కలిత మై తన్నాభి♦కమలంబునం దొల్లు, జనియించి యాబ్రహ్మ ♦ సకలసృష్టి
కాదిభూతములుగ ♦ వేదముల్ నాలుగు, గలిగించె నప్పు డ♦క్కమలనాభు

ఆ. నందు మునుల ఖుంచి♦నట్టిగుణంబులు, మూఁటఁ దొలుత స త్త్వ♦మునకుఁ దోఁపు
కలిమి దాన నుండెఁ♦ గమలోద్భవుఁడు రజ, స్తమము లసుర ల య్యె♦ ధరణినాథ.

క. [1]విను కైటభుండు నా మధు, వనఁ బేర్చినయద్దురాత్ము ♦ లవ్వేదములం
గొని వేగ చని రసాతల,మున వై చిరి గాఢబంధ♦ములు సేసి నృపా. 480

వ. దాన నవ్వేధ విహ్వలించి. 481

క. లావును దృష్టియు గతియును, నా వేదచయంబ నాకు ♦ నవి యుడఁగిన నే
నేవిధి సృజింతు లోకము, లేవాఁ డీయెడరు దలఁగు ♦ నిం కె ట్లొక్కో. 482

వ. అని పలవించి. 483

ఆ. విష్ణు బహువిధముల ♦ వినుతింప నజ్జల, శాయి హయశిరంబు ♦ సకలవర్ణ
భాసురంబు నై న♦పరమాద్భుతంపురూ,పంబు దాల్చి వేద♦పరత నొంది. 484

క. పాతాళమునకుఁ జని యం, దాతత మై ప్రణవరూప ♦ మగునాదం బు
ద్ద్యోతితము సేసె నది యా,దై తేయులు విని పటు ప్ర♦తాపం బెసఁగన్. 485

క. ఆనాదము దెసకుం జన, దానవరిపుఁ డొండువలనఁ ♦ దా నరిగి తదీ
యానూనబంధపీడిత, లై న శ్రుతులు విడిచి తెచ్చి ♦ యజునకు నిచ్చెన్. 486

తే. ఇచ్చి యెప్పటియట్ల య♦హీంద్రతల్ప,శయనుఁ డై యుండెనటతమ♦చనినచోట
నెవ్వరిని గానకా దై త్యు♦లెచట శ్రుతులు,దారుమును వెట్టిరందుస♦త్వరముగాఁగ.

ఆ. అరిగి యచట వాని ♦ నరసి కానక రభ,సమునఁ గలయఁ దిరిగి ♦ శార్ఙ్గిఁ గాంచి
యుద్ధమునకుఁ బిల్వ♦నద్ధరణీధరుం, డడరి సమయఁ జూచె ♦ నసురయుగము. 488

వ. ఇట్లు విష్టరశ్రవుండు సృష్టికార్యంబు నిర్విఘ్నంబుఁ జేసిన విధాత యప్పని సు
నీతంబు సేసె నాఁటనుండియు హయశిరోమహిత యగునమ్మూర్తి దక్కనమూర్తు
లకంటె నెక్కు డయ్యె నాజగత్కర్తను వేదంబులు నాశ్రయించి యుండు నని
చెప్పి వెండియు. 489

క. హరి సత్త్వాదిగుణంబులఁ, బొరిఁబొరిఁ గలిగింపఁ బెంపఁ ♦ బొలియింపఁగ భూ
వర యవి యెక్కువఁ దక్కువఁ,బొరయుచుఁ బరివర్తనంబు♦బొందుచునుండున్.

1. గ. విను కైటభుండు మధువును నవఁ బేర్చిన.

క. గుణవంతుఁడు గుణరహితుఁడు, గుణకల్పనతత్పరుండు ♦ గుణనాశనసై
పుణశాలి గుణనిబద్ధుఁడు, గుణమోక్షణకరుఁడు శార్ఙ్గి ♦ కురుకులముఖ్యా. 491

క. విను నారాయణపరములు, జననాయక వేదములును ♦ జన్నంబులుఁ ద
క్కినపుణ్యసమారంభము,లును రసముఖగోచరంబు♦లును భూతములున్. 492

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనుతో నేకాంతికజనులు లోకోత్తరు
లని చెప్పి తద్యేకాంతికత్వం బెట్టిది యెఱింగింపవే యనుటయు నతం డతని
కి ట్లనియె. 493

ఆ. సాంఖ్యయోగపరమ♦సారభూతం బిది, మున్ను వింటి యుద్ధ♦మునకుఁ జేరక
కరుణ నార్ద్రుఁ డైన♦గాండీవి బోధింపఁ, గృష్ణు చెప్పినట్టి♦గీతలందు. 494

వైశంపాయనుఁడు జనమేజయున కేకాంతికధర్మ మెఱిఁగించుట.

క. నిర్మల మగునేకాంతిక,ధర్మము నారాయణోదిత♦ం బై క్రియలం
గర్మఠుఁ డగుబ్రహ్మమతిని, ధార్మికవర యొలసె నతఁడు ♦ దయ సిగు రొత్తన్.

క. దక్షునకు నెఱింగించిన, దక్షుఁడు బోధించెఁ దనదు♦దౌహిత్రు జగ
చ్చక్షుని నాసవిత్రుండు మ,నుక్షితిపతి కిచ్చె నవ్వి♦నుతధర్మంబున్. 496

క. మను విక్ష్వాకున కొసఁగె న,తనివలనఁ దదీయయోగ్య♦తాకలితులు స
జ్జనములు వడసి రనేకులు, విను నారాయణునిచేత ♦ విని నారదుఁడున్. 497

క. తగియెడుశిష్యుల కొసఁగెను, జగతీశ్వర యిట్టు లది ప్ర♦శస్తం బై యి
జ్జగములను గలిగె విను మ,య్యగాధధర్మంబు దుష్కృ♦తాప్రాప్య మగున్.

క. దాని కహింసయ మూలము, దానన హరి ప్రీతుఁ డగు న♦తం డన ధరణీ
జాని క్షేత్రజ్ఞుం డనఁ,గా నొక్కఁడ యగుట దెలియఁ♦గా వలయుఁ గడున్.

క. ఏకద్విత్రిచతుర్వ్యూ,హాకారతఁ దోఁచు చుండు ♦ హరి భక్తజనా
లోకమున వాసుదేవా,ద్యాకగ్రప్రాప్తముగఁ ద♦త్తదుచితస్ఫూర్తిన్. 500

తే. వాసుదేవుండు ప్రథమంబు ♦ వసుమతీశ
యొలి సంకర్షణుండుఁ బ్రద్యుమ్నుఁడును ద్వి
తీయకంబుఁ దృతీయంబుఁ ♦ దెల్ల మచ్చ
తుర్థ మనిరుద్ధుఁ డిట్లు చ♦తుర్విధములు. 501

క. ఈనెలవులఁ దోఁచును హరి, దా నొక్కఁడ యింద్రియప్ర♦తతి కందం డే
కానూనభక్తి కగపడు, దానికిఁ దపమును శమంబు ♦ దమమును వలయున్.

క. శాంతిపరినిష్ఠునకు నే,కాంతికధర్మంబు కరత♦లామలక మగుం
జింతాతంతుత్రుటనా,త్యంతవిదగ్ధంబు సూవె ♦ యది మనుజేంద్రా. 503

క. అనిన నతఁ డిట్టిధర్మము, గొనియాడక వ్రతము లొండు ♦ గోరి నడపఁగాఁ
బని యేమి యెఱింగింపుము, జనములచందంబు నాకు ♦ సంయమివర్యా. 504

క. అని యడిగిన వైశంపా, యనుఁ డతనికి నిట్టు లనియె ♦ సది గల దధిపా
వినుసాత్త్వికమును రాజస, మును దామసమును వికారములు మానసముల్.
తే. వికృతులందును సత్త్వస్థవిధము మేలు, దాన హరిఁ బొందవచ్చునంతండునడపుఁ
దత్ప్రకారులకుశలంపుఁదంత్ర మెల్ల, వార లేకాంతికులు పెఱవారి వినుము.
క. కలగొన రాజసతామస, ము లయినభావములు వికృతిఁ ♦ బొందింపఁగ మ
ర్త్యుల కేకాంతికవృత్తిని, నెలకొనఁగా నెట్లు వచ్చు ♦ నిర్మలధిషణా. 507
క. వారికిఁ బ్రవృత్తిలక్షణ, తారూఢం బైనధర్మ ♦ మలవడు హరికిం
గారుణ్యపాత్రములు గా, రారయ వా రస్యపథసమా శ్రితు లగుటన్. 508
క. ఏకాంతిజనంబులు సు, శ్లోకుం డగుహరిమనంబులో నుండుదు రా
లోకింప వారి కతనికి, నేకత్వము గలదు డెల్ల ♦ మిద వేదములన్. 509
క. ఈ తెరువు మద్గురుఁడు సం, ప్రీతిని దయ నన్ను నాదరించుచుఁ జెప్పెం
జేతశ్శుద్ధికలనమెయి, వీతదురిత మైనభంగి ♦ విస్సది యధిపా. 510
క. చాలిన నీవును హరి ని, ట్లాలోకింపుము నిరంతరానందశ్రీ
శాలి వగు దనిన నాభూ, పాలోత్తముఁ డాతపస్విపతి కిట్లనియెన్. 511
తే. వేదములు సాంఖ్యమును యోగవిధియుఁ బాశు
పతముఁ బాంచరాత్రంబు నా ♦ బహువిధములఁ
జెల్లు బోధసాధనముల ♦ కెల్ల నిష్ఠ
యొక్కటియొ యివి భిన్ననిష్ఠోదితములొ. 512
వ. నా కెఱింగింపవే వీనికిం బ్రవర్తకు లెవ్వరు వారలం జెప్పు మని యడిగిన జనమే
జయునకు వైశంపాయనుండు. 513
ఉ. ద్వీపమునం బ్రబోధపరిదీప్తుని వేదనిధానముఁ జగ
ద్వ్యాపకతేజు గంధవతియందుఁ బరాశరసంయమీశ్వరుం
డేపురుషోత్తముం [1]బడసి ♦ యీడ్యతమోన్నతి నొందె లోకశ
శ్వాపరు భారతాధ్యయనకారకుఁ గొల్చెద సన్మహాత్మునిన్. 514
వ. అనుచుం గృష్ణద్వైపాయనధ్యానపరాయణుం డగుచుం బలికె యాభూవిభున
కభిముఖుం డై. 515
క. వినుమీతంత్రంబుల కెల్లను నరయఁ బరాయణం బలఘుతరసంవి
త్తనుఁ డగునారాయణుఁడ య, తనిఁ బొందఁగ ఋజువు లగుపథము లివి యధిపా.
వ. వేదంబులకుం బ్రవర్తకుండు నారాయణనందనుం డపాంతరతముం డనుపేరం
బ్రసిద్ధుం డగువేదవ్యాసుండు సాంఖ్యంబునకుం గపిలుండును యోగంబునకు
హిరణ్యగర్భుండును బాశుపతంబునకు శివుండును బాంచరాత్రంబునకు విష్ణుం
డును బ్రవర్తకులు పాంచరాత్రంబు వైష్ణవం బనం బరఁగు ననిన విని యజ్ఞనప

1. క. బడసె ♦ నీడ్యతమోన్నతి నొప్పులోక.

తి యమ్మునిపతితో వేదవ్యాసుండు పరాశరపుత్త్రుం డని చెప్పి తప్పరమమునికి
నారాయణనందనత్వం బెట్లు వచ్చె ననుటయు నతం డతని కి ట్లనియె. 517

సీ. హిమవన్నగంబుపా✽దమున మహాభార,తం బొనర్చి పరి✽శ్రమంబు దోఁప
భావించి శిష్యులు ✽ గావించుపరిచర్యఁ, దద్వినోదనపర✽త్వమున నొంది
వారికి వేదార్థ✽భారతార్థంబులు, సాత్యవతేయుండు ✽ సదయబుద్ధి
నెఱిఁగించు చున్నట్టి✽యెడ నేను లోనుగాఁ, గొందఱు తత్పాద✽వందనంబు

తే. భక్తిఁ జేసి నారాయణ✽ప్రభవుఁ డండ్రు, నిన్నుఁ గృపఁ జెప్పవే మాకు✽నిర్మలాత్మ
యత్తెఱం గని యడిగిన✽నమ్మహాను,భావుఁ డత్యంతకరుణార్ద్ర✽భావుఁ డగుచు.

వ. మాతోడ ని ట్లనియె. 519

వేదవ్యాసునకు నారాయణనందనత్వంబు గలిగినప్రకారము.

సీ. ఆదికాలమునఁ బ్ర✽జాభిసర్గమునకు, నారాయణుఁడు నిజ✽నాభిపద్మ
మున బ్రహ్మఁ గల్పింప ✽ భూతసంఘమ్ముల, నెల్ల నాతఁడు సృజి✽యించె నతని
ముఖమున బహువేద✽ములు ప్రసరింపఁగఁ, జేసి వానికి మేలు✽సేఁత బుద్ధిఁ
దలఁచి యవ్విష్ణుండు ✽ నలఘుబోధుని నపాం,తరతముం డనియెడు✽తనయుఁ జిత్త

తే. మునన కల్పించి యతిభక్తి ✽ మ్రొక్కి నిలిచి
యున్నయక్కుమారుని శ్రుతు✽లన్నియును దృ
ఢావధానుండ వై విని ✽ నీవు వాని
నంచితవ్యాస మొందింపు ✽ మనియెఁ బ్రీతి. 520

ఆ. అనిన నట్లు కాక ✽ యని యయ్యపాంతర,తముఁడు వేదభేద✽నము నొనర్చె
దాని కవ్విభుండు ✽ దద్దయుఁ బ్రీతుఁ డై, వత్సలత్వగౌర✽వం బెలర్ప. 521

క. వేదవ్యాసుఁడ వ మ్మని, యాదరమునఁ బిలిచి నాకు ✽ నాత్మజుఁ డై సం
పాదించువాఁడ వధికా,హ్లాదము మన్వంతరంబు ✽ లన్నిటియందున్. 522

క. అని యానతిచ్చి మఱియును, జననంబులు నీకుఁ గల్గు ✽ సంయమిమాన్యా
యనియుఁ బలికి వెండియు ని,ట్లనియెను విష్ణుండు పేర్చు✽నర్మిలితోడన్. 523

క. నాచరితంబులుఁ ద్రైలో,క్యాచరణంబులును ధర్మ ✽ మఖిలంబు మదిం
జూచి త్రికాలజ్ఞత్వస,మీచీనత వెలయుమునులు ✽ మేటి యనంగన్. 524

క. ఉత్తరకాలంబున లో,కోత్తరుఁడు వసిష్ఠపౌత్త్రుఁ ✽ డుదితజ్ఞానో
దాత్తుఁడు పరాశరుం డను,నుత్తమసంయమికిఁ బుట్టు ✽ దుజ్జ్వలతేజా. 525

క. నీవలనన కలిగి కురు,క్ష్మావలయం బేలునట్టి✽జనపతు లన్యో
న్యావిష్టరోషు లై రణ,సేవనమునఁ గులము తఱుచు ✽ సెఱుతురు వత్సా. 526

తే. కాలములకీడుకతమునఁ ✽ గలఁగఁబడిన, వేదముల నీవు నాఁడును ✽ విమలబుద్ధి
నంచితవ్యాస మొందించి✽యఖిలదివిజ,మునిగణముల కొనర్తు ప✽రమ్మోద మనఘ.

తే. ధర్మసందేహములు నీవు ✽ నిర్మలంపు,వాక్యములఁ బాపి జగముల✽వార లెల్ల

నఖిలసంశయచ్ఛేత్త పుణ్యాత్మకుండు, లోకహితవాణి యనఁగ సుశ్లోకుఁడగుదు.

క. రాగిత్వము విడువదు నిను, రాగవిదూరుఁ డగుసుతుఁడు ప్రభవించును నీ
కాగమవిధానబుద్ధియు, యోగము సాంఖ్యంబు మది సరముదితంబు లగున్.

వ. అని నిర్దేశించి నీవు నిజేచ్ఛం బ్రవర్తింపు మని పలికి యద్దేవుం డంతర్హితుం
డయ్యె నిది మదీయనారాయణసంభవత్వంబు తెఱం గేను యమనియమనిరూఢి
నిర్మలతపఃకలనంబు చిరకాలం బాచరించి యప్పురుషోత్తముకారుణ్యంబు నా
మీఁద నంతకంతకు నెక్కుడగునట్లు సేసితి ననిమద్గురుండును త్రికాలవేదియు
నగు వేదవ్యాసుండు సెప్పె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయునితో
వెండియు నిట్లనియె. 530

సీ. అట్లు ధర్మజుఁడు నారాయణనారద, సంవాదకథ విన్నసమయమునను
నారదుఁ డచ్యుతుకారుణ్య మబ్బియుఁ, బడసి క్రమ్మఱి వచ్చి బదరికాశ్ర
మమున నారాయణుమన్ననతోడిసం, భాషణంబును గాంచి పరమతపము
దాఁ జేత నెఱిఁగించి తదనంతరంబ య, య్యమరమునీంద్రుఁ డేరమడిగినట్ల

ఆ. యడుగ ధర్మనందనాదులుఁ గృష్ణుండు, విననఁగ మద్గురుం డతనికిఁ జెప్పె
సురలు మోక్షధర్మపరులు గా కధ్వరా, యత్తచిత్తు లైనరయ స్తెఱంగు. 531

వ. ఇట్లు సెప్పి. 532

క. వేదవ్యాసుఁడు సుముఖత, నాద్వైతమునికిఁ జెప్పె హయశిరుఁ డగుదా
మోదరునిదివ్యలీల స, మాదరమున ధర్మనందనాదులు వినఁగన్. 533

వ. అని చెప్పి వెండియు. 534

క. నిజనామనిర్వచనములు, విజయుం డడుగంగ నెల్లవియు నెఱిఁగించెం
ద్రిజగద్భజనీయపదాం, బుజుఁ డగుకృష్ణుండు భరితపుణ్యాచరిత్రా. 535

వ. ఇట్లగుట ము న్నెఱింగించితి. 536

క. వేదాదు లైనపథముల, భేద ప్రాప్యంబు లగుట ప్రియ మెసఁగఁగ స
ద్వేదవ్యాసుఁడు సెప్పె స, మాదరమునఁ బార్థుఁ డడుగ సందఱు వినఁగన్.

క. ఏకాంతికధర్మము సు, శ్లోకుం డగునాతఁ డడుగ లోకోత్తర యా
లోకారాధ్యుఁడు సెప్పె ద, యాకరమతి కృష్ణధర్మజాదులు వినఁగన్. 538

క. దైవవశంబున నేఁడును, నీ వడుగఁగ నింతవట్టు నిస్సందేహం
బై వఱలఁగ నేఁ జెప్పితిఁ, బావన మిది యసదృశంబు పౌరవముఖ్యా. 539

వ. అని పలికి నారాయణనారదసంవాదాదికం బైన యి వ్వాఙ్మయం బంతయుం
బేర్కొని. 540

క. నారాయణీయ మగునీ, సారాఖ్యానంబు వినినఁ జదివిన సంప
త్త్వారోగ్యాయుస్సద్గతు, లేరికి నైనం గురుక్షితీశ్వర కలుగున్. 541

వ. అనిన విని యత్యంతాహ్లాదభరితాంతఃకరణుం డయినయక్కౌరవేంద్రుతో న

మ్మునీంద్రుం డి ట్లను నిట్లు సకలలోకసంభావనీయసత్కథ లాకర్ణించి సము
దీర్ణసంప్రీతుం డగునప్పాండవాగ్రజుంను. 542

తే. అమరతటినీసుతున కిట్టు లనియె రాజ,ధర్మముఖ్యంబు లగుసర్వధర్మముల ను
దాత్తకృప నెఱింగించి తత్యుత్తమంపు,ధర్మ మెయ్యది సెప్పుము ధర్మనిత్య.

వ. అనుటయు నాదేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లనియె, 544

చ. అరయఁగ ధర్మతంత్రములయందు నిరర్థము లే దొకండు నె
వ్వారిమది యెందు వ్రాలెఁ దగ వారలు దానిన పూని యాచరిం
తు రదియ వారి కిష్టఫల[1]దోహనకార్య మొనర్చు నెల్లెడం
బురుషులఁ జూడమే తమకుఁ బోలినధర్మములం దెలుంగఁగన్. 545

ఇంద్రునకు నారదుఁడు సెప్పినభృగునామకవిప్రునిచరిత్రము.

వ. అది య ట్లుండె నప్రతిహతగతి యై చరించుచుండి యొక్కనాఁడు నారదుం
డాఖండలుపాలికిం జనిన నతం డతనికి సముచితసత్కారంబు లాచరించి సుఖా
సీనుం డై యున్న యమ్మునివరునాననంబునం జూడ్కి నిలిపి నీవు మెలంగునెడ
నెద్దియేనియు నాశ్చర్యంబు గన్నయది గలదే యని యడిగిన నమ్మహితాత్ముం
డమ్మహేంద్రునకుం జెప్పినకథ సెప్పెద నది భవత్ప్రశ్నంబున కుత్తరం బై
యుండు దాని వినుము భాగీరథీదక్షిణతీరంబున మహాపద్మం బనియెడుపుర
వరంబునఁ గులశ్రేష్ఠుం డగుభృగుం డనువిప్రుండు గలం డప్పురుషవరుండు.

సీ. ధర్మనిత్యుండు సత్యవ్రతపరుఁ డహింసాశాలి యింద్రియజయవిభాసి
నిజకర్మతృప్తుండు నిష్కోపుఁ డంచిత,న్యాయసంప్రాప్తధనముల దేవ
పితృతిథిజ్ఞాతిమిత్రకార్యములు ని,ర్వర్తించు సువినయవంతు లైన
తనయులఁ గన్నాఁడు దన్నెల్లవారును, వినుతింప మన్నాఁడు దనమనమున

తే. నెట్టికృత్యంబు మేలొ యే నెద్ది సేసి
కృతపరాయణధర్మతాస్థితి వహింతు
నొక్కొ యన చింతఁ బొందుచు నుండు నాత్మ
నిష్ఠయలవాటు కాంక్షించి నృపవరేణ్య. 547

వ. ఇట్లుండ నొక్కనాఁడు. 548

తే. తనగృహంబున కతిథి యుదాత్తుఁడొక్క,బ్రాహ్మణుఁడువచ్చెవచ్చినఁబరమభక్తి
యుక్తినాతిథ్యమొనరించియున్నయప్పు, డమ్మహాద్విజుతోడనిట్లనియెభృగుఁడు.

సీ. అనఘ నీమధురవాక్యంబులఁజేసి మి,త్రత్వంబు వొందితి మహాభాగవతము
నీ కెఱింగించెద నీవు నెయ్యమెలర్ప, హిత ముపదేశింపు మేను నియతి
నాత్మావలోకన మాచరించెద నని, తొడఁగుదు నది యలవడదు నాకు
లోకసామాన్యగుణాకలనంబున, బద్ధుండ నగుట నెబ్బంగి నాత్మ

1. గ. దోహలకార్య.

ఆ. నాత్మయందకని య÷నామయత్వముఁ బొంది
ఖండరహిత మగుసు÷ఖమున మునిఁగి
యుండువాఁడ భూసు÷రోత్తమ చెప్పవే
యనిన నతని కిట్టు ÷ లనియె నతఁడు. 550

క. ఏనును నిట్టుల మోహా,ధీనుఁడ నై యాత్మ గాంచు÷ తెఱఁగు గొలయుటకుం
బూని పడుదు నెయ్యదియో, కానం బెరు వాశుభ ప్ర÷కలనంబునకున్. 551

ఉ. కొందఱు బ్రహ్మచర్యమునఁ ÷ గొందఱు భవ్యగృహస్థధర్మముం
బొందుటఁ గొంద ఱిద్ధతప÷ముల్ వనభూమిఁ దగం జరించుటం
గొందఱు నిష్క్రియత్వమునఁ ÷ గొందఱు యజ్ఞవిధానశాలితం
గొంద ఱనూనదానములఁ ÷ గోరి యొనర్తురు నిత్యసౌఖ్యమున్. 552

క. జననీజనకారాధన,మున గురుభక్తిని సువృత్తి÷మున శాంతిని దాం
తిని సత్యమున నహింసను, విను కాంతురు మోక్షపదము ÷ వేర్వేఱ జనుల్.

వ. ఇట్లు బహువిధంబు లగుధర్మద్వారంబులు గలవు గలిగినకలుచ నెల్లవారికి
నాత్మానందం బలవడ నేర్చునే యొకటి యుపదేశించెద నాకర్ణింపుము. 554

తే. నైమిశారణ్యమునయందు ÷ గోమతి యనఁ
బరఁగు నుత్తమనది మహా÷పద్మ మనఁగఁ
గలదు పుణ్యహ్రదము దాని÷యలఘుతటత
లంబు [1] నెలవుగా నుండు నా÷గం బొకండు. 555

క. ఆతీర్థోత్తమమున మాం,ధాతృఁడు మొదలుగ విశిష్ట÷తపముల నిహలో
కాతిశయముఁ బరలోక,ద్యోతనముం బడసినారు ÷ తొల్లి యనేకుల్. 556

వ. అప్పుణ్యక్షేత్రంబున. 557

తే. పద్ముఁ డనుపేరియన్నాగ÷పతి యుదాత్తుఁ
డఖిలధర్మజ్ఞుఁ డతులద÷యాన్వితుండు
సుజనసంభావ్యమానుఁ డ÷స్తోకపుణ్య
నియతనిత్యుఁ డాగంతుక÷ప్రియతముండు. 558

ఉ. ఆతనిఁ గానఁ బొమ్ము ప్రచు÷రాదరణంబున నీదుకోర్కి సం
ప్రీతిగఁ దీర్చు నాగుణగ÷రిష్ఠుఁడు నాపలు కూఁదు మన్న మో
దాతిశయంబు నొంది భృగుఁ ÷ డాధరణీసురవర్యుతో మహా
త్మా తెలి వొందె నామనము ÷ తావకపావనవాక్యసంపదన్. 559

క. అని పలికి యి ట్లనియె ని,ద్దినశేషము రాత్రియును మ÷దీయనివాసం
బున నిలువు నిలిచి మత్పా,వనుఁడవు గావలయు గౌర÷వశ్రీభరితా. 560

క. అనిన నతఁ డట్ల చేయ న,తనిఁ బూజించుటను మధుర÷తరసల్లాపం

1. 'తలమున నాగాహ్వ÷యం బొకండు' అని యచ్చుప్రతి.

బున ధర్మసత్కథావ,ర్తనమున నకాలమతిఁ దుర్వాత్తతఁ గడపెన్. 561
క. వేగిన నామంత్రితుఁడై, యాగుణనిధి వీడుకొలిపి యతఁడు ప్రయాణో
ద్యోగంబు సమీచీనవి,ధాగరిమప్రౌఢవృత్తి దగ నొనరించెన్. 562

—భృగుండనువిప్రుండు పద్ముండనుసర్పరాజుం గన వచ్చుట.—

వ. ఇవ్విధంబున నుద్యుక్తుండై భృగుండు బంధుమిత్రజనసమ్మతం బగు తెఱంగునం గదలి యెడనెడ బహుతీర్థసేవనంబు సేయుచుం జని పుణ్యం బగు నైమిశారణ్యంబు సొచ్చి గోమతీతీరంబు సేరి సుప్రసిద్ధం బగుమహాపద్మపురంబుతటంబునం బొలుచుభుజగేంద్రమందిరంబు గాంచి తగం బ్రవేశించె నట్టియెడ. 563
తే. భక్తితోడ నన్నాగేంద్రుపత్ని యెదురు,వచ్చి తోడ్కొనిచనియర్ఘ్యమిచ్చి మీర
లిందు రాకకుఁ గారణ మేమి సెప్పుఁ, డెద్ది పనిచినఁ జేసెద సిద్ధచరిత. 564
వ. అనుటయు నమ్మహీదేవుండు దేవీ భవదీయపతిం గానవచ్చితి నెచ్చో నున్నవాఁ డవ్విభుం గానిపింపు మనిన నతని కాభుజంగాంగన యి ట్లనియె. 565
క. తనకు నెలవరుస వచ్చిన, నినరథవహనమున కాతఁ డేఁగినవాఁ డే
డెనిమిదిదివసములకు నిట, సనుదెంచుం దథ్య మిది ప్రసాదప్రవణా. 566
క. అతని తెఱం గిట్టిది వాం,ఛిత మెయ్యది యిత్తు ననఘ చెప్పు మనుడు నా
సతి కి ట్లను భృగుఁడు భవ,త్పతిఁ గనుటయ కాక వాంఛ దక్కొను గలదే. 567
వ. అయ్యురగవల్లభువచ్చునంతకు నుల్లవనంబున నిలిచెద నవ్విభుండు వచ్చినప్పుడ మఱవక నా తెఱంగు గెఱింగింప వలయు నని పలికి పోయి భృగుండు గోమతీతటపుణ్యారణ్యంబున జప్యపరుండును నిరాహారుండును నై యుండె న ట్లుండ నాభుజంగపతిబాంధవులు తదీయపత్నీపుత్రసహితంబుగా నమ్మహీసురవరు పాలికిం జనుదెంచి మృదుమధురవాక్యంబుల ననునయించి నీ వాహారంబు గొనక నిలువం దొడంగిననాఁటికి నేఁ డాఱవదినం బయ్యె నే మతిథిపూజాపరులము మాకు ధర్మవిరోధంబు గాకుండ మాచేయునాతిథ్యంబు నాదరింపు మస్మత్ప్రార్థనంబున నన్నంబు ఫలంబు మూలంబు మఱియు నెయ్యది యైనను భుజించి మమ్ము రక్షింపవే యనిన వారలతో నాసువ్రతశీలుం డి ట్లనియె. 568
ఉ. ఇం తన నేల యేను భుజగేశ్వరురాకయ వార్చినాఁడ నా
కం తవునంతకుం గుడువ నాఁకలి నీళ్లును ద్రావఁ దృష్ణ యొ
క్కింతయు లేదు గా కలిగి యే యటవీస్థలి కేఁగుదెంచి యే
కాంతమ యున్నవాఁడ నియమాభిరతుండ నను నేఁప నేటికిన్. 569
క. మీకును ధర్మవిరోధము, గా కుండుట కేన పూఁట గారవమున నా
లోకింపుఁ డింక దివసయు,గాకలనముఁ గల్గ వ్రతసమాప్తియుఁ గలుగున్. 570
క. వినుఁ డష్టమ మగుదివసం,బున ముద మారంగ నిందు భుజగేంద్రుఁడు రా
కునికి గలిగె నేనియుఁ బర,దినమునఁ గుడిచెద భవన్మతిం బ్రియ మెసఁగన్. 571

వ. మీర లిత్తెఱంగున కనుజ్ఞ సేయ వలయు నని సంప్రార్థనీయస్వరంబునం బలికిన
వార లందఱు నొడంబడి నిజనివాసంబులకుం జని రయ్యష్టమదివసంబున. 572

క. వరుసదినంబులు [1]దీఱిన, నరవిందాప్తుండు దనకు ననుమతి సేయం
గురువంశముఖ్య తగ న,య్యురగాధీశుండు విభవ మొప్పఁగ వచ్చెన్. 573

ఉ. వచ్చిన[2]సంభ్రమంబుగరువంపుటెలర్పున [3]నుల్లసిల్లి మే
నచ్చుపడంగఁ జేయఁ జెలు వాభుజగేశ్వరుపత్ని యాతనిం
జెచ్చెరఁ దా నెదుర్కొని విశిష్టసమాదర యై యుపాయనం
బిచ్చి తదీయచిత్తమునకిం బెస లారఁగఁ బాద్య మిచ్చినన్. 574

వ. సంప్రీతుం డై సముచితప్రకారంబున నుండె న ట్లున్నయన్నాగేంద్రుండు
సమీపాసీన యైనయద్దేవి నాలోకించి. 575

తే. అతివ సేమమె తగ దేవతాతిథిప్ర,పూజనంబులు నడచునే పూర్వవృత్తి
నెడలి యేను లేకునికి నేమేని వికల, మయ్యెనో చెప్పు మనపురుషనామ్నగాత్రి.

ఉ. ఆతనితోడ ని ట్లనియె నంతయెఱుంగమి లేదు నీమహి
మాతిశయంబుకల్మి భుజగాధిప నాకుఁ దగన్ సమస్తదే
వాతిథిపూజనంబులు సమగ్రము లై నడచెన్ సుహృజ్జన
ప్రీతియు మున్నపోలె నవిభేదత యొప్పఁగ నిర్వహించితిన్. 577

వ. అని వెండియు. 578

సీ. గురుభక్తి శిష్యులకును వేదపరత వి,ప్రులకును జనరక్ష భూపతులకు
న్యాయార్జనంబు వైశ్యజనంబులకుఁ ద్రివ,ర్ణారాధనంబు శూద్రావలికిని
బతివాక్యకరణంబు భటులకు సర్వోప,కారక్షమం బైనసారభూత
మనఁగఁ బెంపొందుగృహస్థాశ్రమంబుపై, వారని ప్రియ మెల్లవారలకును

తే. లోక మేల యే నేల యి ల్లేకతంబ
యింద్రియంబులఁ గుదియించి యిచ్చ నడఁచి
యుండువాఁడఁ గా కనుమతి యోగికిని బ
తివ్రతాత్వంబు భార్యకు సువ్రతములు. 579

వ. కావున ధర్మసూక్ష్మసంవేది వగునీదుచిత్తంబున ఖేదం బొక్కింతయేనియుం దొ
డరునట్టివిధంబున వర్తింతునే యొకండు విన్నపంబు సేయం గల దవధరింపుము ప
రమపావనమూర్తి యొక్కమహీసురోత్తముం డిచ్చటికి వచ్చి యభ్యర్చితుం డై
భవత్పతి దర్శింప వచ్చితి ననియెఁ గార్యం బేమి యని యడిగిన నాకుం జెప్పకుం
డె నేను నీ వట ననుటం జెప్పిన విని యట్లైన నాభుజంగవిభుండు వచ్చునంతకు
నుల్లవనంబున నుండెద నతండు వచ్చిన నాతెఱం గెఱింగింపుమని చని యేడెనిమిది
నాళ్లేని జప్యపరుండును నిరాహారుండును నై యున్నవాఁడు నీ వచ్చుటి కరిగి

1. గ. జరిగిన. 2. జ. సంభ్రమంబు గరువంపుటెలర్పును. 3. క. నుల్లసిల్ల మే. జ. నుల్లసిల్లు మే.

యతని సంభావింపవలయు నని చెప్పిన నాసర్పగ్రామణి కుపితచిత్తుండై. 580

క. ఏనటు యొక్కెడ కొక్కరుఁ, గానఁగఁ బోదునటు దేవగణము నసురులున్ లోనుగ నన్నేచందము, మానుగ నడపుదురు తలఁపుమా చతురమతీ. 581

తే. అనిన నీరాకవార్చి మహాహితోడ, నున్నవిప్రునియభిలాష మొక్కభంగిఁ దీర్పకుండుట ధర్మవే ధీరశాంత, చిత్తసీయట్టియాచారవిత్తమునకు. 582

క. ధరణిసురునాస సెఱచినఁ, బొరసినపాపాగ్నిఁ గాల్పఁ బూనెదవే సీ పురుషార్థంబును సముచిత,పరత్వమును గృపయు ధర్మపాండిత్యంబున్. 583

క. విను మాశావిచ్ఛేదన,మునఁ బాటిలు బ్రహ్మహత్య భుజగోత్తమ ధర్మనిరూఢుండైనపురుషున,కును సద్విజునాస దీర్పఁ గోరుట వలదే. 584

క. మానమున దృఢజ్ఞానము, దానంబున నభ్యుదయము ధర్మనిరత యాశానిర్వాహణంబున నర, కానీకనిహరణసౌఖ్య మగు నండ్రు బుధుల్. 585

తే. చాతకము వానఁ గోరెడుచంద మొంద
నెదురుచూచుచు నున్నవాఁ డింద నీదు
రాక కక్కట యడవిలో బ్రాహ్మణుండు
రోష ముడుగుము ధర్మనిరూఢహృదయ. 586

వ. అని పత్ని బోధించిన. 587

చ. అనయముఁ దేఱి నాగపతి యక్కమలాననమోము సూచి యి
ట్లను నోరుఁ గానఁ బొమ్మనినయంతస రోషము వచ్చి యిట్టు లొ
ప్పనిపలుకుల్ సగర్వమునఁ బల్కితి దానికి శంక లేక చె
ప్పినజతనంపు[1]ధర్మమునఁ బేర్మియు నాకు నొనర్చె తుగ్మలీ. 588

ఆ. కార్తవీర్యదశముఖప్రముఖులు జమ,దగ్నితనయరాఘవాదు లైన పురుషవరులచేతఁ బాలియరే సక్రోధ,వృత్తిఁ గాన యలుకవిడుపు మేలు.

క. నీయట్టిభార్య గలుగుటఁ, దోయజదళనయన యిట్లు దొలఁగిలె దురితాపాయంబునఁ బొరయక యేఁ, బోయెద నవ్విప్రుకోర్కి పూర్ణముసేయన్. 590

క. అని పలికి సత్వరంబుగఁ, జని భృగునిం గాంచె వినయసంభ్రమములతో జనపాలోత్తమ యతఁడు న,తనిఁ గని యుల్లమునఁ బ్రియముదళుకొత్తంగన్.

పద్ముఁ డనుసర్పరాజు భృగుఁ డనువిప్రుం గానవచ్చుట.

వ. అంగంబులు వొదల నెదురుకొనియె నిట్లిరువురు సుసంగతులై సుసంగతపత్త్ర ప్రకరతరుచ్ఛాయాశీతలసికతాతలంబున సుఖాసీను లై రయ్యహీంద్రుం డామహీసురవరునితో మధురస్వరంబున నిట్లనియె. 592

తే. అనఘ నారాక వార్చి నీ వధికనిష్ఠ, నిట్టు లునికికిఁ గారణ మేమి గోర్కి యెవ్విధంబైన దాని నే నిపుడ నిర్వ,హించి పుచ్చెద నత్తెఱంగెఱుఁగఁ జెపుమ.

1. గ. ధర్మమును బేర్మియు నాకు నొనర్చె నుగ్మలీ.

వ. స్వజనంబులచేత నిచ్చట నీయునికి విని యభిగమ్యుండ వగునీకడకుం జనుదెంచి
తి ననవుడు నద్ధరామరవరుండు ధర్మారణ్యంబుననుండి నిన్నుం గాన వచ్చితి మా
ననీయమహీసురసూనుండ భాను నారాధింప నీచనుట భవదీయవల్లభవలన
నెఱింగి వాడినచేనివాఁడు వాన కెదురుచూచుసట్లు భవదాగమనంబు వార్చి ని
యతవృత్తి నున్నవాఁడ మదీయమనఃక్లేశంబు నిరసింప నీవ యర్హుండ వనుటయు.

తే. నీవు కల్యాణమూర్తివి ✽ నీమనోర,థంబు సఫలంబు సేసి క ✽ దా మదీయ
జననసఫలతఁగలిగింతు ✽ ననుభుజంగ, మాధిపతిమోముఁజూచియు ✽ ట్లనియె నతఁడు.

క. నాకోర్కి పిదపఁ జెప్పెద, లోకనుతా యొకటి యడుగ ✽ లోలత్వము చి
త్తాకలిత మయ్యెఁ బ్రార్థన, సేకొని యది నాకు మున్ను ✽ చెప్పఁగ వలయున్.

వ. అనుటయు నయ్యురగవల్లభుండది యెయ్యది యడుగు మనిన భృగుండు నీవు
రవిరథంబు వహింపం జనినయెడఁ గనినవినినయట్టియాశ్చర్యంబులు గలవేని వాని
నా కెఱింగింపవే యనిన నతం డతని కి ట్లనియె. 597

సీ. ఆశ్చర్యముల కెల్ల ✽ నాస్పదం బాదిత్యుఁ, డాతనివలనన ✽ భూతజాల
మఖిలంబుఁ [1]జరియించు ✽ నది యచ్చెరువుగాదె, యద్దేవుసంసుప ✽ లందుఁ బ్రీతి
నమరులు వాలఖి ✽ ల్యాదిమునీంద్రులు, సిద్ధులు శాఖలఁ ✽ జెంది యుండు
విహగకులంబుల ✽ విధమున వసియింతు, రంతకంటెను [2]నెక్క ✽ డద్భుతంబు

ఆ. గలదె యమ్మహాత్ము ✽ వలనన వాయువు, వెడలి యతనినడిమి ✽ విపులరశ్మిఁ
బొంది వృష్టి గురియు ✽ నెందును నట్టిచో,ద్యములు గలవె భూసు ✽ రాగ్రగణ్య.

క. రవి సృజియించును వర్షము, రవియ మగుడఁ గిరణతతుల ✽ రసమంతయుఁ దాఁ
దివుచును విస్మయకారక, మవనీసురవర్య దాని ✽ కధికము గలదే. 599

క. ఇనువేఁడిమి శోషించిన,జనములయం దాత్మనిష్ఠ ✽ శాశ్వతికత్వం
బున వెలుఁగు చుండు దానికి, ననఘా మిగులంగఁ జిత్ర ✽ మైనది గలదే. 600

తే. సూర్యువలనన బీజంబు ✽ ధార్యమాణ, మగుఁ జరాచరధారిణి ✽ యైనధరణి
చేత నంతకు మిగులఁ జ ✽ ర్చింప నక్క,జంబు లెందును గలవె ని ✽ ష్ఠానిరూఢ.

క. పరముండు నిరంజనుఁ డ, క్షరుఁ డజరుం డద్వయుండు ✽ శాశ్వతుఁ డగున
ప్పురుషుఁడు రవియంద వెలుఁగు, నరు దంతటికంటెఁ గలదె ✽ యగ్రిమవర్ణా.

వ. అని వెండియు. 603

## ఉంఛవృత్తిమహిమము.

క. విను మత్యాశ్చర్య మొకటి, మనుజోత్తమ యొక్కనాఁడు ✽ మధ్యాహ్నమునం
దనవెలుఁ గినునివెలుఁగుతో, నెనగా గగనమున నొక్కఁ ✽ డే తెంచె వడిన్. 604

క. [3]అంబరపాటనమునఁబో,లెం బెద్దయు మెఱయుతనదు ✽ లీలాగతి ✽
య్యంబరమణి యధికప్రమ,దంబున నభిముఖుఁడుగా న ✽ దగ్రస్ఫూర్తిన్. 605

1. గ. జనియించు ✽ నది. 2. గ. నొక్క ✽ యద్భుతంబు. 3. జ. అంబరపాటనమునుబో,లెం.

చ. కదియఁగఁ బాఱు తెంచిన వికాసవిభాసిముఖారవిందుఁ డై
యెదురుగఁ జేయి సాఁచె దివసేశుఁ డతండును లీలఁ గేలు నొ
ప్పిదముగఁ బట్టి రూపము లభిన్నతఁ బొందఁగఁ జొచ్చె బింబముల్
సదనముఁ జొచ్చునట్లు విలసద్గతి నిం కిట యేమి సెప్పుదున్. 606

వ. అట్టియెడ. 607

చ. అరదముమీఁద ముల్ పొలుచునాతఁడొ యిప్పటియాతఁడో దివా
కరుఁ డనుసందియంబు భుజగంబులచిత్తములందుఁ బుట్టి యొం
డొరువులతోడ వారు గడునొయ్యన పల్కఁగ నే వినీతిసు
స్థిరమృదుభాషి నై యడిగితిం బ్రభువుల్ ధరణీసురోత్తమా. 608

క. ఇతఁ డెవ్వం డని యమ్మెయి, నతిచకితాత్ముండ నగుచు నడుగుటయు నహః
పతి నామీఁదఁ గృపాసం,గత మగుతనచూడ్కి వోలయఁగా వత్సలుఁ డై. 609

సీ. సురయక్షగంధర్వగరుడోరగాదుల,లోన నెవ్వఁడు గాఁ డలోలుపాత్ముఁ
డుంఛవృత్తిమహీసురోత్తముం డస్ఖల,నియముండు ఫలమూలనీరమారు
తాహారుఁ డగుముని యాకాంక్ష సేయఁడు, ప్రాప్తంబు గానిపదార్థములకు
సర్వభూతహితత్వశాలి యిమ్మెయి సిద్ధిఁ, బ్రాపించె నని చెప్పెఁ బ్రకటఘణితి

తే. ననఘ యిట్టివిశేషంబు గనుఁగొనంగ, వినను గాంచితి ననిన నవ్విప్రవరుఁడు
ప్రమదమెదనిండిపొంగారఁ బాఁపఱేని,యాననముసూచియిట్లనుమానవేంద్ర.

క. ఇవి యన్నియు నాశ్చర్యము, లవుఁ దెరువును నాకుఁ జూపి తన్వర్థత నొ
ప్పువివిధశబ్దంబుల బో,ధవరేణ్యా పోయి వచ్చెదం బ్రియ మొందన్. 611

క. నను మఱవక పనుపం, దగుపను లెల్లను బనుపు శిష్యభావశుభము నా
కనఘా కలిగెను నీదెస, ననూనభద్రములు నీకు నయ్యెడు మెపుడున్. 612

చ. అన విని నన్నుఁ గాంచితి ప్రయత్నమునన్ వినిపింపు మీవు వ
చ్చినపని నాకు నీ కొకటి సేసితినే యిటు వృక్షమూలవా
సునిక్రియ లేచి పోక తగుచొప్పగునే భవదీయవాంఛ సె
ప్పిన నది యేను దీర్తు మఱి పెం పెసఁగం జను భూసురోత్తమా. 613

వ. అని చెప్పి వెండియు. 614

తే. అనఘ నాయందు నీవు నీయందు నేనుఁ, గలము నీకు నీసర్వలోకంబుఁ గలదు
చింత కవకాశమెద్ది నిశ్చింతభావ, మొందు మనియె నాదండశూకోత్తముండు.

వ. అనిన విని భృగుండు పద్మున కిట్లనియె. 616

తే. భోగివర యిది యిట్టిద భూతములును, నీవు నేనును సర్వగతావిశిష్ట
విధములము వేదితవ్యంబు విదిత మయ్యె,నిట్టిసందర్శనము వ్రతమింక నాకు.

క. ఈవిధమునిశ్చయము నే, భావింపఁగఁ గంటి నీకృపారతివలనన్
నీవు కృతార్థుఁడవు సుజన,సేవిత యామంత్రణంబు సేసినవాఁడన్. 618

వ. అని పలికి యివ్విధంబునఁ గృతనిశ్చయుం డై భృగుండు భుజంగవిభు వీడ్కొని దీక్షావిశేషకాంక్షం జేసి భార్గవకులపవిత్రుం జ్యవనుం గాంచి నిజవృత్తాంతంబు సెప్పి తత్కృతసంస్కారంబునం గృతకృత్యుం డయ్యె నిప్పుణ్యకథ యబ్భార్గవుండు జనకసదనంబున నారదునకు వివరించె నద్దేవమునివరుండు దేవతావరుల నకు వినిపించె నమ్మహాత్ముండు వసువులకుం జెప్పె జామదగ్న్యుతోడి సంగ్రామంబున నుద్దామచిత్తుండ నై నన్నుం దేర్చుట కై వసువులు సకలభూతసమదర్శిత్వసంపాదకం బైనయీయితిహాసంబు నాకుం జెప్పిరి నీవు పరమధర్మం బెయ్యది యని యడిగిన నేను నీకుం జెప్పితి సర్వసమతాసముపహితం బైనయనాకాంక్షిత్వంబు ధర్మోత్తమంబు నిరతిశయానందంబునకు నిదానంబు. 619

క. అని యిట్లు ధర్మసుతునకు, ననిమిషతటినీతనూజుఁ డుపధిక క్రమం
బునఁ జెప్పుట వైశంపా, యనుఁడును జనమేజయునకు నర్థిం జెప్పెన్. 620

వ. చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుతో నిత్తెఱంగునఁ బితామహుండు హితోపదేశంబు సేసిన నమ్మహీశుం డెవ్విధంబున శాంతివిశేషంబు నొందె మునీంద్రా చెప్పవే యనుటయు. 621

ఉ. ఆగమపుష్పసౌరభ శుభాంగ నివాసబుధాంతరంగ వి
ద్యాగృహమేధితాసుభగ తామహనీయ సురార్చనీయ ని
ర్భోగసభోగసంపదనిరూప్య సుసంవిదవాప్య భక్తిల
క్ష్మీగురునిత్యయోగిజన సేవిత శాంతిసుఖైకభావితా. 622

క. అభిమతఫలసంపాదన, విభవమహీయఃప్రసాద విశ్రుతవేదా
ఋభువిభువిలోచనాంబుజ, శుభదరవిత్త్వా హరిత్వ సుభగహరత్వా. 623

మాలిని. వరబహుమతవేదవ్యాస విఖ్యాతభాసా
నిరుపమతనులీలానిత్య సత్యాదికృత్యా
నిరతిశయసమత్వోన్నిద్ర కారుణ్యభద్రా
భరితభువనవర్గా భాస్వదానందమార్గా. 624

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము. 625

శ్రీమదాంధ్రమహాభారతమునందలి

శాంతిపర్వము

సమాప్తము.

# ఆనందాశ్రమగ్రంథరత్నమాల

సోల్ ప్రొప్రయిటర్సు:— రామా అండ్ కో - ఏలూరు-మద్రాసు.



## శ్రీమద్భగవద్గీత ప్రతిపదటీకా భాష్యవిశేషార్థ సహితము.

| | | |
|---|---|---|
| క్యాలికో బైండు గిల్టు పేరు గలది | 3 | 4 |
| ఆంధ్రతాత్పర్య సహితము, క్యాలికో బైండు | 1 | 4 |
| డిటో రేపర్ బైండు | 1 | 0 |
| ఆంధ్రవచనము చిన్నసైజు, క్యాలికో బైండు | 0 | 6 |
| డిటో డిటో రేపర్ బైండు | 0 | 5 |

## శ్రీమదాంధ్రమహాభారతము పద్యకావ్యము.

పెక్కు వ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణ శ్రద్ధతో వ్రాయింపఁబడి గ్లేజు కాగితములపై అచ్చొత్తించి మేలు క్యాలికోబైండు గిల్టుపేరు చేయఁబడియున్నది.

| | | |
|---|---|---|
| I. ఆది సభాపర్వములు గల సంపుటము. | 2 | 0 |
| II. ఆరణ్యపర్వము | 2 | 0 |
| III. విరాటోద్యోగపర్వములు | 2 | 0 |
| IV. భీష్మద్రోణపర్వములు | 2 | 0 |
| V. కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 2 | 0 |
| VI. శాంతిపర్వము | 2 | 0 |
| VII. ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములుగల సంపుటము | 2 | 0 |
| ఆదిపంచకం | 5 | 8 |
| యుద్ధషట్కం | 3 | 12 |
| శాంతిసప్తకం | 3 | 12 |

## శ్రీమదాంధ్రమహాభాగవతము

పోతనామాత్య ప్రణీతము. ఇది వఱకు ముద్రితములైన ప్రతులకన్న బాగుగ ముద్రించియున్నారము.

| | | |
|---|---|---|
| గ్లేజు కాగితములు క్యాలికో బైండు గిల్టు పేరు గలసంపూర్ణప్రతి | 5 | 8 |
| సంపూర్ణ ప్రతి రెండుసంపుటములుగ క్యాలికో బైండు గిల్టు పేరుతో | 7 | 8 |
| సంపూర్ణ ప్రతి 3 సంపుటములుగ ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ స్కంధములు క్యాలికో బైండు గిల్టుపేరు | 2 | 12 |
| పంచమ, షష్ఠ, సప్తమ, అష్టమ, నవమ స్కంధములు గల సంపుటము. క్యాలికో బైండు గిల్టుపేరు | 2 | 12 |
| దశమ, ఏకాదశ, ద్వాదశస్కంధములు. క్యాలికో బైండు గిల్టుపేరు | 2 | 12 |

## భాస్కరరామాయణము

| | | |
|---|---|---|
| అత్యుత్తమ ప్రతి క్యాలికో బైండు గిల్టు పేరుగలది | 4 | 0 |

## శ్రీరామకర్ణామృతము.

నాలుగాశ్వాసములు గలది. సంస్కృత శ్లోకములకు సరియైన శ్రీ చేకూరి సిద్ధకవికృత పద్యములతోను శ్రీ పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులవారిచే వ్రాయఁబడిన "ఆనందచంద్రిక" అను తాత్పర్యావళితోను నిమిడి అతిమనోహరమగు మేలి గ్లేజుకాగితములపై అచ్చొత్తింపఁబడినది. క్యాలికో బైండు గిల్టుపేరు గలది 1 8

## శ్రీకృష్ణకర్ణామృతము

మూడాశ్వాసములు, ఆంధ్రటీకాతాత్పర్య విశేషార్థములతోనుఆంధ్ర పద్యములతోను క్యాలికోబైండుఅతి సుందరమైన గిల్టుపేరు గలది 1 8

భర్తృహరిసుభాషితము
క్యాలికోబైండు పెట్టు పేరుగలది 2 0

నామలింగానుశాసనము అను
నామాంతరము గల
అమరకోశము
త్రికాండము - సటీకము
ఆంగ్లేయభాషాంతరపదములతోఁ
కూడినది.

20 రూపుల డెమ్మి గ్లేజు కాగితములు క్యాలికో బైండు 1 4

సాదా గ్లేజు కాగితములు అట్టబైండు 1 0

శ్రీ సహస్రనామ స్తోత్రము 28 అంశము లిందు గలవు. చిన్న సైజు అత్యుత్తమప్రతి చక్కనికూర్పు క్యాలికో బైండు 0 8
రేపరు బైండు 0 6

ఆదిత్యహృదయము-సటీకా తాత్పర్యము. 0 2

ముకుందమాలా - సటీకా తాత్పర్యము 40 శ్లోకములు గల యీ దేశమునందలి ప్రతులందు లేని క్రొత్త శ్లోకములు 6 అధికముగ చేర్చి ముద్రించియున్నారము. 0 4

నీతిశాస్త్రము, సటీకాతాత్పర్యము. సుమారు 100 పేజీలు గలది. గ్లేజు కాగితములపై చిన్నసైజున ముద్రించి యున్నారము. 0 2

శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రము. (శ్రీమచ్ఛంకర భగవత్పాద విరచితము) సటీకా తాత్పర్యము 0 2

లక్ష్మీసహస్రనామము. నామావళి సహితం చిన్నసైజు 0 2

గోపాలసహస్రనామము. నామావళి సహితము చిన్నసైజు 0 2

సప్తమస్కంధము, మూలము 0 3

తత్త్వత్రయమ్:-(పిళ్ళలోకాచార్యులచే ద్రావిడ భాషయందురచింపఁబడినది.) మణిప్రవాళ వ్యాఖ్యానములోను తెనుఁగు తాత్పర్యముతోను 2 0

భోగినీదండకము:—ఇది బమ్మెర పోతనామాత్య ప్రణీతము,తంజనగరం తేవప్పెరుమాళ్లయ్యగారిచే వ్రాయబడిన టీకతోను, పాఠాంతరములతోను కూర్పఁబడిచక్కఁగ ముద్రింపఁబడినది. ఇందు కవి తన కాలము నాఁటి వేంకటగిరి సంస్థానప్రభువగు సర్వజ్ఞసింగమ రాజును, ఆయననువలచిన యొక వేశ్యారత్నమును చక్కఁగావర్ణించియున్నాఁడు. వేశ్యాధర్మములన్నియు నిందు బొందుపఱుపఁబడినవి. 0 2

హరిశ్చంద్రోపాఖ్యానము, ద్విపద గౌరనమంత్రి ప్రణీతము. టిప్పణ సహితము 0 6

నలచరిత్రము:—ఇదిచక్రపురిరాఘవాచార్యప్రణీతమయిన ద్విపదకావ్యము. కఠిన పదములకు టిప్పణములతోముద్రించియున్నాము.0 6

## విజ్ఞప్తి

వేమూరి వేంకట కృష్ణమసెట్టి అండు సన్స్ వారిచే ప్రకటితములై, ఎ. కణ్ణన్ సెట్టి అండ్ కో., 286 ఎస్ప్లనేడు - మద్రాసు వారిచే ప్రచురింపబడుచుండెడి "ఆనందాశ్రమ గ్రంథ రత్నమాల" పుస్తకము లన్నిటికిని మేము సంపూర్ణ హక్కుదార్లమై యున్నాము.

పై తాలూకు గ్రంథములున్నూ మరియును ఏలూరులో రామా కంపెనీ పేరుతో మేము ప్రచురించుచున్న అన్ని గ్రంథములున్నూ యీబ్రాంచియందు కూడ దొరకును.

మీకు చెన్నపట్టణములో నుండు యేపుస్తకము కావలసియున్నను మేము శ్రమయనక మీకొరకు సప్లయి చేయుదుము. దయచేసి మీకు యేపుస్తకము కావలసినను మాకు వ్రాయ కోరుచున్నాము.

రామాఅండ్‌కో—, 286. ఎస్ప్లనేడ్, మద్రాసు-ఏలూరు.

# విషయసూచిక.



## ఆనుశాసనికపర్వము - ప్రథమాశ్వాసము.



## ఆనుశాసనికపర్వము - ద్వితీయాశ్వాసము.

## అనుశాసనికపర్వము - తృతీయాశ్వాసము.

## ఆనుశాసనికపర్వము – చతుర్థాశ్వాసము.



## ఆనుశాసనికపర్వము – పంచమాశ్వాసము.

## ఆనుశాసనికపర్వము - తృతీయాశ్వాసము.

పుట.



## ఆనుశాసనికపర్వము - చతుర్థాశ్వాసము.



## ఆనుశాసనికపర్వము - పంచమాశ్వాసము.

## అశ్వమేధపర్వము - ప్రథమాశ్వాసము.

## అశ్వమేధపర్వము - ద్వితీయాశ్వాసము.



## అశ్వమేధపర్వము - తృతీయాశ్వాసము.



## అశ్వమేధపర్వము - చతుర్థాశ్వాసము.

## అశ్వమేధపర్వము - ప్రథమాశ్వాసము.

## అశ్వమేధపర్వము - ద్వితీయాశ్వాసము.



## అశ్వమేధపర్వము - తృతీయాశ్వాసము.



## అశ్వమేధపర్వము - చతుర్థాశ్వాసము.

## ఆశ్రమవాసపర్వము - ప్రథమాశ్వాసము.



## ఆశ్రమవాసపర్వము - ద్వితీయాశ్వాసము.

## మౌసలపర్వము.

పుట.

## మహాప్రస్థానికపర్వము.



## స్వర్గారోహణపర్వము.





శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము, ప్రథమాశ్వాసము.



శ్రీమత్కటాక్షరోచి
ర్ధామసముల్లాసవిహితకనుస్థిరలక్ష్మీ
భూమానందితభక్త
వ్యామోహవిదూరయుక్త హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయునకి ట్లనియె నట్లు దివ్యజ్ఞానదేదీప్యమానుం డైన దేవవ్రతుండు వివరింప వివిధంబు లగుధర్మంబు లాకర్ణించి యజాతశత్రుం డతనికి సభక్తికప్రణామం బాచరించి వినయవిశేషవిభూషితుం డై. 2

సీ. అనఘ నా దగుచిత్తమునకు శమంబు గావించుట కై నీవు వివిధవిశద
భంగులఁ బరమకృపానిరతుండ వై, సకలధర్మోపదేశములుఁ జేసి
తిమ్మెయిఁ జెప్పఁగా వించుక యేనియు, శమము లే కున్నది చలముకొని య
నేకబంధుల వధియించితి నది యొక్కతలయు నీ కలిగినదారుణత్వ

ఆ. మొక్కతలయు నైనయుగ్రకర్మంబులు, చిత్తవృత్తిఁ దగిలి యుత్తలంబుఁ
జేయ శాంతి యెట్లు సిద్ధించు మునిమాన,నీయ యింక నేమి సేయువాఁడ 3

వ. దుర్యోధనుం డతిలోభంబున నాతోఁ బంచి కుడువ నోడంబడఁడ యేనును నాగ్రహంబున నతనికి రాజ్యం బిచ్చి తొలంగి నిలువను మా యిద్దఱికతంబున నింత పుట్టెం బశ్చాత్తాపం బెప్పాటనుం బ్రోపువడ దయ్యెడు. 4

### గౌతమీలుబ్ధకసర్పమృత్యుకాలసంవాదము.

చ. అనవుడు భీష్ముఁ డిట్టు లను నాతనితో నటూ వగంపఁగా
మనుజుఁడు కర్త గాఁడు వినుమా యితిహాస మొకండు చెప్పెద
న్మనుజవరేణ్య గౌతమి యనంగ శమాన్వితయొక్కభూసురాం
గన యురగంబుచే సుతుఁడు కాలవశత్వముఁ బొందియుండఁగన్. 5

చ. వగచుచుఁ జూడ నయ్యురగ । వల్లభు రజ్జునఁ గట్టి తెచ్చి య
మ్మగువకుఁ జూపి దీనిఁ దల । వ్రయ్యఁగ మోఁదెదఁ గోల నొండె రెం
డుగ [1]నఱగత్తి వ్రేసెదఁ గ । డుం జెడు గీపాడపాఁపపుర్వు నే
మిగతి వధింతు నంచు నొక । మేటికిరాతుఁడు రోషదీప్తుఁడై. 6

క. ఉన్నఁ గని యప్పుడఱితి యో,యున్న విడువు భుజగనాథు । ననవుడు నతఁ డీ
పిన్నాతనిప్రాణంబులు, గొన్నది యిది దీనియుసుఱు । గొనియెద ననియెన్. 7

వ. అనిన నక్కోమలి యక్కిరాతుం జూచి. 8

క. విధివశమున వచ్చినకీ, డధములు గొనియాడి వ్రేఁగు । లై విపులభవాం
బుధి మునుఁగుదురు మునుంగరు,సధర్ము లగునుత్తములు ప్ర । శాంతిఁ జులుకనై. 9

వ. అదియునుం గాక. 10

క. ఈపాముఁ జంప బ్రదుకునె. నాపుత్త్రుఁడు విడువు మజ్జ । నక నావుడు వాఁ
డీవేదమాట లెల్లను, గోపవివశుఁడై ననాకుఁ । గొలుపవు ముగ్ధా. 11

ఉ. కావున నెట్లుఁ జంపుదున । కాని భుజంగముఁ బోవనీనుజూ
నావుడు నింతి యర్జునక । నామను నికవదాతభంగికిం
గా వలదే మహీసురులు । గా దనుచోఁస్వనఁ దత్సహాయులుం
బోవరు గాదె యేల నినుఁ । బోఁటికిఁ గ్రూరత నాదుసన్నిధిన్. 12

సీ. హింసకు నోడఁబడ । నే నెట్లు ననవుడు, జనబాధకము లైన । జంతువులను
జంపినఁ బాపంబు । సమకూర దని పల్కె, బోయ వట్టినరిపుఁ । బొరిగొనంగ
వల దని చెప్పె న । వ్వనిత వాఁ డహిఁ దెగఁ, జూచి జనంబులఁ । గాచు టఱదె
వృత్రుఁ జంపఁడె దేవ । విభుఁడు యజ్ఞధ్వంస,నము సేయఁడే ఫాల । నయనుఁ డట్లు

తే. కావె ధర్మువు హింసలు । నీవు దీని, కియ్యకొను మని తఱిమె న । ట్లెంత దఱిమి
నను దయావతి యైనయ । న్నాతి పాప,మునకుఁ జొరదయ్యె బోయకి । ట్లనియెఁ బాము.

క. ఏ నేమితప్పు సేసితిఁ, గానవు నెఱి నీవు లెస్స । గా మృత్యుపరా
ధీనత బాలునిఁ గఱచితిఁ, గాని వినుము లేవు రోష । కామాదు లెదన్. 14

వ. అనుటయు నతండు. 15

క. విను మృత్యువునకుఁ దగుసా,ధనమ వగుటఁ జేసి నిన్ను । దండింపంగాఁ
జను ననవుడుఁ గుమ్మరికోలను సారెం బోలితిం ద । లఁచి చూడు మెడన్. 16

వ. ఈక్రియ నావశం బగునే యని పల్కినం బామున కర్జునకుం డిట్లనియె. 17

తే. ఏయువాఁ డుండ నమ్మెయి । సేయు ననకె, యోపి తక్షండనము సేఁత । పాప మంత్రె
యెవ్వ రేఁ బంపఁ గఱతు గా । కేమి క్రూరు, నిన్ను గీటడఁగించిన । నింద రాదు.

తే. అదియుఁ గాక విశేషించి । యరయ బుద్ధి, గలుగునట్టిసాధనములు । గారె మీరు
మృత్యువున కెట్లు గావున । మెలఁగ మిడుక,నీక పొరిగొన వలయు మి । మ్మెల్లభంగి.

---

1. అ. వరగత్తి.

వ. అనిన విని బోయకు భుజగం బిట్లనియె. 20

తే. బుద్ధి గల్గుసాధనముల ౼ పో హవిస్సు, లరసి వేల్తురు ఋత్విజు ౼ లాఫలంబు
గాంచు నధ్వరకర్తయ ౼ కాక వారి, కేమిపని యనఁగా మృత్యు ౼ వేఁగుదెంచె. 21

క. చనుదెంచి పామునకు ని, ట్లను నిను నేఁ గోరి పనిచి ౼ నట్టుల నన్నుం
బనిచెం గాలుం డీచా,వున కీవును నేను హేతు ౼ వులు గా మనఘా. 22

క. ఇనశశిపావకభూమిగ,గనజలపవనాదివస్తు ౼ తతు లెల్లను గా
లునియతిఁ జేతి వనినఁ ద,క్కినపని సెప్పంగ నేటి ౼ కని భుజగేంద్రా. 23

క. విను మిట్లగు టేర్పడ నెఱిఁ,గిన [1]నాపై నిడుమ వెట్లు ౼ కిల్బిషముం గా
లునిచెయిది నన్ను దూఱిన, నిను దూఱుట యుఱదె నాదు ౼ నిర్మాణమునన్. 24

ఆ. అనిన భుజగ మిట్టు ౼ లను నీవలన నేను, గుణము సెప్ప దోష ౼ గణన సేయ
నన్నుఁ బనిచె నంటి ౼ నామీఁది దోషంబుఁ, బాపికొనుట నాకుఁ ౼ బాడి గాదె. 25

క. [2]విను మఱి కాలునిదెసనై,నను దోషముకలిమి లేమి ౼ నా కాడంగాఁ
బని యేమి దోషగతిచిం,తనభాషణములకు నేను ౼ దగుదునె యనఘా. 26

వ. అని పలికి పాము బోయమొగంబు సూచి. 27

క. వింటే మృత్యువుమాటలు, గంటే నామీఁదఁ దప్పు ౼ గలిగించెద వి
ట్లింటం గట్టం దగునే, యంటకు నగి బోయ యిట్టు ౼ లనియె నరేంద్రా. 28

క. నీవును మృత్యువుఁ బాపస,మావేశితమతుల రొఱగ ౼ నాడినయంతం
బోవునె మీపై దోషము, లే వెఱతునె యిట్టు లనిన ౼ యింతన మీకున్. 29

వ. అనిన మృత్యువునుం బామును. 30

క. ఘనుఁ డగుకాలునివశమునఁ, జనియెడుమా కరయ దోష ౼ సంగతి గలదే
యనునెడఁ గాలుం డచటికిఁ, జనుదెంచెం బ్రీతి ధర్మ ౼ సంశయ ముడుపన్. 31

వ. చనుదెంచి యర్జునకు నాలోకించి. 32

క. పామును మృత్యువు నేనును, గా మీదారకునిమృతికిఁ ౼ గారణ మీతం
డేమేఁ గర్మముఁ జేసెం, దా మృతిఁ బొందించె నదియ ౼ తలకొని యితనిన్. 33

క. విను కర్మం బొనరించును, జననము మరణంబు నదియ ౼ సౌఖ్యము దుఃఖం
బును గావించుం దనచే,సినదానిం బడక పోవ ౼ శివునకు వశమే. 34

వ. అని చెప్పి. 35

---

1. క. గ. చ. నీపై నిడుదు రిట్లు. 2. అచ్చుప్రతులయందు 25-వ 26-వ పద్యములనడుమ ‘అనిన మృత్యువు పామున కిట్లనియె’ ననువచన మున్నది. దీనిచే 26-వ పద్యము మృత్యువు చెప్పిన దగుచున్నది గాన 27-వ వచనము ‘అని పలికినం బాము బోయ...’ యని యాప్రతులందు దిద్దఁబడి యున్నది. వ్రాఁతప్రతులం దాపద్యములనడుమ వచనము కానిపింపదు. కాన 26-వ పద్యము పాము చెప్పినదే యగుచున్నది. దీనిచే 27-వ వచనము ‘అని పలికి పాము...’ అని యున్నది. మూలమును వ్రాఁతప్రతులచొప్పున నే యుండుటం బట్టి యావచనము ప్రక్షిప్త మని పరిహరింపఁబడియె.

క. కావున నిందకు నుడుగుం, డీవాదం బనుడు బోయ కిట్లను ధరణీ
దేవాంగన దనయెఱుకయు, దేవాలాపములు నొక్కతెప వై యున్నన్. 36

ఆ. ఇట్టివనటఁ బొందుకనట్టిపాపము సేసి, వనిత లిట్లు యగుదు రనఘ యివ్వి
ధంబుమఱి మొఱఁగ దగుకిల్బిషంబున, బాలు రిట్లు [1]పోదు రెలకెలఁగి. 37

వ. అని వెండియు. 38

క. సకలజనంబులుఁ గర్మము నకు ననుగుణ మైన తెరువునం బోదురు దీ
నికి రోషవిషాదము లేటికి విడువుము పాము సంఘటింపుము శమమున్. 39

క. అన విని తెలిసి విడిచె నర్జునకుఁడు భుజగము నపాస్తరోషుం డగుచుం
జని రెలమిఁ బొంది కాలుండును మృత్యువుఁ గావునను శమువు మీ వడలున్. 40

తే. కారు దుర్యోధనుఁడు నీవుఁ గారణములు, బాంధవులరణమరణసంప్రాప్తి కనఘ
వారు దమతమకర్మముల్ కారణములు, గాఁగ నిట్లయి రేల శోకంబు నీకు. 41

వ. గౌతమీలుబ్ధకభుజంగమృత్యుకాలసంవాదం బనునియ్యితిహాసంబు తాత్పర్యంబు
మనంబునం బట్టుకొలిపి యీపుట్టినకలంకం దొలంగ జడిసి శమంబున సుఖివి
గ మ్మనినం గౌంతేయాగ్రజుండు సంతసిల్లి శాంతనవునితో ని ట్లనియె. 42

### అగ్నిదేవుఁడు సుదర్శన యనుకన్యకను వివాహంబు సేసికొనుట.

చ. అనఘ గృహస్థధర్మమునయందుఁ జరించి నరుండు మృత్యుసం
జనితభయంబు వాపికొనఁజాలునో చాలఁడో యన్న నాసరి
త్తనయుఁడు దానికిం దగువిధంబు దిరం బగునేనిఁ జాలు న
య్యను వెడఁగూడునట్టియితిహాసము విన్ము నరేంద్ర చెప్పెదన్. 43

మ. మనువంశంబునఁ బుట్టి సర్వజనతామందార మై నేల యె
ల్లను బాలించి జగత్త్రయీప్రణుతలీలం బొల్చె దుర్యోధనుం
డనురాజవ్విభునొప్పు నర్మదకుఁ గామావేశముం జేసినన్
వనితారూపము దాల్చి పొందె నతనిన్ వైదగ్ధ్యహృద్యంబుగన్. 44

క. ఆరమణికి నతనికిఁ గన్యారత్నం బుద్భవించె నమరపురంధ్రీ
శ్రీరామణీయకము నిస్సారం బగునట్లు గాఁగ జగతీనాథా. 45

క. విను దానికిఁ బేరు సుదర్శన యన్నరనాయకుండు సంప్రీతి మెయిం
బెనిచి తనయగ్నిహోత్రంబునపరిచర్యలకుఁ బనిచె బుజ్జనములతోన్. 46

వ. పనిచిన నప్పొలంతి యప్పనులవెంట మెలంగుచుండె నట్టియెడ. 47

సీ. అర్చించునప్పు డయ్యంగన కెంగేలి, జిగిసొంపు చిత్తంబు దిగిచికొనఁగ
నరసి కన్గొనునప్పు [2]డయ్యింతికనుఁగవ, పొలపంబు రాగంబు వొదలఁ జేయ
నన్యులఁ బనిఁ బంచునప్పు డమ్ముద్దియ, పలుకులతీపు గోర్కులఁ [3]గెరల్ప
నల్లన యీఁ దెడునప్పు డక్కొమ్మ వాతెఱ తావి ధైర్యంబుఁ ద్రిప్పికొలుప

1. యగుదు. 2. డయ్యింతికలికి కన్బొలపంబు. 3. దెరల్ప.

తే. మఱయు దోడ్తోడఁ దేఁకువ మాలి కదిసి, తూపుగముల క్రొవ్వాఁడిమి సూప నంత
కంత కగ్గల మగువలకు వంతఁ దూల,పోయెఁ బావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర.

వ. ఇట్లు మదనాగ్ని నుదిలకొని యగ్నిదేవుం డక్కాంతతో నేకాంతంబున నిట్లనియె.

సీ. చిగురుటాకుల గాసి సేయుచీయడుగుల,చెలువంబు సూడ్కులఁ జేర్చికొనియె
మారేడుపండులకారాము సెఱచునీ,మెలచన్నుఁగవ వేడుకలఁ బొనర్చె
నునుఁదీవఁ జికికిఁ గానననీమోఁ జేవ,నురిపంబు డెందంబు మరులుకొలిపె
నెఱసందురుని సిగ్గుకవుఁపంగఁ జాలునీ,నెమ్మోము దాలిమి వమ్ముసేసె

తే. నాతి నీకు నై పెక్కుబన్నములు వడితి, నంగజునిచేత [1]వల్లభ వగుము నాకు
నావుడును సిగ్గుగదిరి యాననము వాంచి,యలఁతియెలుఁగున నిట్లను నాలతాంగి.

క. కులకన్యకలకు వేఁడుకఁ, [2]దలవీడులఁ బరులతోడఁ దగుమాటలకుం
దలకొనఁ దగునే గురుజనముల కాక త్తెఱఁగువారు పురుషార్థనిధీ. 51

వ. అనిన విని హుతవహుం డట్లు కాక యనియె నాసమయంబున. 52

ఉ. ఆనరనాయకుం డొకమహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగాఁ
బూని మహీసురావలికిఁ బూజ లొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయ మారఁగా ననలుఁ డాతనిపాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదుపుత్త్రిఁ గృప యేర్పడ దానము గాఁగ నావుడున్. 53

వ. అవ్విభుండు. 54

తే. అన్యవర్ణుండు దీనుఁ డీయనకు నెట్లు
గూఁతు నీ వచ్చు నని మదిఁ గుత్స వుట్టి
యీఁడ ప్రార్థన మఫల మై యేఁగి యజ్ఞ
సమయమున నగ్ని దనమూర్తి సంహరించె. 55

క. కని యజ్ఞపతి బుత్విజులును దానును వెఱఁగుపడి విహ్వలోపము వాటి
ల్లెనొకో కర్మగతుల నని, మనమున నూహించి భవ్యమంత్రముఖరుఁ డై. 56

వ. పావకునిం బ్రస్తుతించు చుండ నద్దేవుం డాభూదేవతలకు నల్లన తనతెఱం
గెఱింగించిన. 57

తే. వార లానృపుతోఁ జెప్ప [3]గారవంబు, సంతసముఁ దలకొనఁగ నయ్యింతిఁ బెండ్లి
సేసె విప్రకుమారుఁ డై చెన్ను మెఱసి, యగ్ని వరియించె నచ్చెరువంద జనులు.

వ. ఇట్లు సుదర్శనావివాహోత్సవం బనుభవించి విభావసుండు విభాప్రభాసమానుం
డగుచు హుతంబులు పరిగ్రహింప దుర్యోధనుయాగంబును సుప్రయోగం బై
చెల్లెఁ బదంపడి. 59

క. అనలునకు సుదర్శనకును, జనియించె సుదాత్తగుణవిశాలుండు సుద
ర్శననామధేయుఁ డానృపుఁ, డనూనధర్మమునఁ దాల్చె నవనీభరమున్. 60

---

1. క. వల్లభి. 2. ఖ. గ. దలవీడ్లన వరుల. 3. జ. గారవమున సంతసంబును దలకొల్పి యింతి.

వ. [1](ఆసమయంబున.) 61

ఆ. అతని కోఘవంతుఁ । డనువాఁడు జనియించె, నుదితయశుఁడు వాని । కోఘరథుఁడు
నోఘవతియు ననఁగ । నుదయించి రయ్యోఘ,వతికి నావిభుండు । వరుని నరసి. 62

వ. ఒరుల మెచ్చక. 63

క. ఆలేమ సుదర్శనునకు, నాలింగా నిచ్చె నద్ద । హాననందనుఁడుఁ గ్రా
లోలతఁ గైకొని పరిణయ,కేలి నడపి విమలబుద్ధిఁ । గృతనిశ్చయుఁడై. 64

వ. గృహస్థధర్మానుష్ఠానంబునన మృత్యువు జయింతు నని ప్రతిజ్ఞ సేసి యోఘవతి యునుం దానును గురుక్షేత్రంబునకుం జని యందు రమణీయప్రదేశంబున విశాలపర్ణశాలఁ గావించుకొని యుండె నట్టియెడ నయ్యేలనాగతో నతం డిట్లనియె.

తే. అతిథిఁ బూజించువేడ్క నా । కగ్గలంబు, వెలఁది నీవును ననుకూల । వృత్తిఁ దాల్చి
సొలయ కప్పని నడపఁగా । వలయుఁ బూని, యే నిచటనున్నయప్పుడు । లేనియపుడు.

క. అతిథిజనులు దమతమవాం,ఛితము లనుభవించునట్లు । సేయం గనినం
గృతకృత్యతఁ బొందరె గృహ,పతియును గృహిణియును [2]ధర్మ । భారమువలనన్.

క. అతిథి నినుఁ గోరె నేనిని, మఱిఁ గింకిరిపడక యోల । మానగానక నీ
వతనికిఁ బ్రియంబు సల్పుము, సతికిం బతిపనుపు సేయఁ । జను నెల్లదియున్.

సుదర్శనునింటికి ధర్మదేవత యతిథి యై వచ్చుట.

క. అని యీఁది చెప్పి యొకనాఁ, డనఘ యతం డిధ్మములకు । నటవీస్థలికిం
జనినయెడ నతిథి యొక్కఁడు, సనుదెంచిన నాసనాది । సంభావనలన్. 69

క. అతివినయంబున సమ్మా,నితుఁ జేయఁగ నాలతాంగి । నెమ్మోమునఁ జూ
పతఁడు నిలిపి కామాతుర,మతి నైతిం బ్రియ మొనర్పు । మానిని నాకున్. 70

వ. గృహస్థధర్మప్రకారంబు నీయెఱుంగనియదియే యని పలికిన నప్పరమపతివ్రత వేఱొండుదెఱంగుల నభ్యర్థనీయంబు లయినవస్తువు లుపన్యసించిన నతం డవి యెవ్వియు నొల్ల ననుటయు. 71

క. సతి దనపతివచనంబులు, మఱిఁ జొనుపుం దెంపు మాను । మాన వెఱచు న
య్యతిథిపనుపు సేయక త్రో,చుతలం పలవఱుచుఁ జేయఁ । జూచుం దలరున్.

తే. ఇట్టు లురియాడుచిత్తంబు । నెట్టకేని, నాథుచెప్పినధర్మంబు । నకుఁ జొరంగ
నూలుకొల్పి నిర్ణయమునఁ । గీలుకొన్న,లజ్జవ్రేఁగునఁబోలె వ్రా । లంగ మోము.

క. తెఱవ యొడఁబాటుమాటం, బఱివ్రాయినకొంకుతోడ । బ్రాహ్మణుఁ గొని క
న్మఱుఁ గగునెడకు నరిగె న,త్తఱి వచ్చె సుదర్శనుండు । ధరణీనాథా. 74

ఆ. వచ్చి పర్ణశాల । వాకిట నిల్చి య,త్తన్విఁ బిల్చె నతిథి । దాని నల్ల
నూర కుండు మనియె । నువిదయు భూసుర,శాపభీతి నెలుఁగు । సూపకుండె. 75

---

1. కుండలీకరణములలోనివెల్ల వ్రాఁతప్రతులం గనుపట్టవు. 2. జ. గర్మభావమువలనన్.

సీ. పేర్కొని పలుమాఱుఁ బిలిచి యో యనుట లేకున్న నయ్యింటిలోఁ గన్నువఱపి
వల్లభుఁ గానక వహ్నితనూజుండు దలఁకొంది ప్రేముడిఁ బలుకు పలుక
నతని నుద్దేశించి యతిథి నాకాతిథ్య మొనరించుచున్నది వనిత నీవు
గృహధర్మవిదుఁడవు కినియకు మయ్య మ మ్మనుడు నప్పరమపుణ్యాత్మకుండు

తే. నీదుకతమున నేను సమ్మోదమగ్న
మానసుఁడ నైతి [1]నతిథులు మహితపూజ
నములు గాంచినగృహములు విమలతరము
లండ్రు బుధు లింత యెఱుఁగుదు నట్లు నడతు. 76

వ. అని పలికి వెండియు. 77

ఉ. నావచనంబునట్టుల మనంబును దీనికి సాక్షు లుర్వియుఁ
బావకుఁడుఁ జలంబును నభంబును వాయువుఁ జంద్రసూర్యులుఁ
నావుడు మ్రోసె నాకసమునన్ విశదంబుగ దివ్యవాణి సం
భావితుఁ డీతఁ డీక్షభునిపల్కు నిజం బని కౌరవేశ్వరా. 78

ఆ. అప్పు డతిథి ప్రీతి నతనిసన్నిధి కేఁగుదెంచి దుర్నిరీక్ష్యతేజ మడరఁ
దనదుమూర్తి యధికతరసమున్నతిఁ బొలుపెసఁగ నిల్చి యతని కిట్టు లనియె.

సీ. ధర్మదేవత నేను దగ నీదుచిత్తంబు నారయ వచ్చితి ననఘ నీవు
నిశ్చలవ్రతుఁడవు నీప్రతిజ్ఞకు హాని గలిగినఁ దెగఁజూడఁ దలఁచి తిరుగు
వెనువెంట మృత్యువు విను జయించితి దానిఁ గామరోషాదివికారసహిత
ముగ నంతరంగంబు మున్న గెల్చితి భవత్సతియుఁ బవిత్ర యస్ఖలితచరిత

ఆ. యొడలితోడ నీకు నూర్ధ్వలోకమునకు నరుగ వచ్చు నెప్పు డరుగుతలఁపు
దోఁచె నప్పు డిదియుఁ దోడిద యై ప్రీతి నరుగుదెంచు ననియెఁ గురువరేణ్య. 80

వ. అని వెండియు. 81

చ. నరవర పొల్చు నోఘవతి నా నది యై జనపావనాకృతిం
బరమతపంబులోనిసగపాలను నియ్యమ యున్నసామున
న్వ్యారవునఁ దొంటిమై నిలిచి నీకుఁ దగం బరిచర్య సేయు ని
చ్చరితము మీకు నిర్మలయశంబు నొనర్చుట కే నొనర్చితిన్. 82

వ. అని చెప్పి ధర్ముండు ధవళహయసహస్రంబు పూనినమాననీయరథంబునం జనియె నోఘవతి యద్దేవుని చెప్పినట్ల వర్తిల్లె సుదర్శనుండును బరమసంతోషభరితుం డయ్యెఁ బాండవాగ్రజా నీమనంబున నెక్కొలుపు మిక్కథ నభిప్రాయంబు. 83

ఆ. అతిథిపూజఁ గడచినట్టిధర్మువు గృహస్థులకు నొండు లేమి దెలుపు మన్న
యది సమస్తకిల్బిషాపహ మాయితి హాస మిచ్చు నెల్ల యభిమతములు. 84

క. అనినఁ బితామహుతో సజ్జనపతి బ్రాహ్మణ్య మవుల జాతులు మూఁటన్

1. క. నతిథుల...గావించుగృహములు.

జనియించినవానికి దొర,కొనునొకో యతివిమలకర్మగుణయోగమునన్. 85

వ. అని యడిగిన నతం డతని కిట్లనియె. 86

తే. బ్రాహ్మణత్వంబు గడు దుర్లభంబనేక, జన్మములఁ బొంది తిరుగంగ సంభవించి
నపుడు గనునది యున్నతమైనయప్ప,దంబు విను మెఱిఁగించెద దాని తెఱఁగు. 87

ఇంద్రమతంగసంవాదం బనుతిహాసప్రకారము.

వ. అది యింద్రమతంగసంవాదం బనునితిహాసంబు ప్రశంసించిన నెఱుంగ నగుం గావున
నక్కథ యుపన్యసించెద నొక్కవిప్రుని కొడుకు మతంగుం డనువాఁడు యజ్ఞార్థం
బై నపనికిం దండ్రిపనుపునం బోయిపోయి. 88

క. మదమునఁ బెలుచన యొకగా,డిదకొదమం గోల గొని యదల్చి చెనకిన నా
వ్వైదవి తనతల్లిఁ జేరఁగ, నది సని నన్నీతఁ డడిచెనని చెప్పుటయున్. 89

వ. ఆగార్దభి తనకొదమతో వీఁడు చండాలుండు ప్రచండస్వభావుండు గా నుండు నే
యనిశం బూర్వజన్మకర్మవిశేషంబునం దిర్యగ్జాతిభాషావిదుం డగుట నవ్విప్ర
పుత్త్రుం డప్పలుకులు విని యిది దూషణభాషణంబు గాదు నిరూపణాలాపం
బై యున్నది యట్లు గావున మాలతనంబు గలుగ నేర్చు నని నిశ్చయించి య
గ్గాడిదకడకుం బోయి. 90

క. తనకుం జండాలత వచ్చినకారణ మడిగి దానిచేతం గంద
ర్పునిచెయిది మంగలికి నిజ,జననికిఁ బొం దగుట విని విషాదముతోడన్. 91

వ. తనపోయెడుపనికిం బోవక మరలి సదనంబునకుం జని జనకుని కత్తెఱం గెల్ల
నెఱిఁగించి యతనితో శూద్రబీజంబున బ్రాహ్మణియందు జన్మించినవాఁడు
చండాలుం డగుటకు సందియం బేమి గార్దభి శాపజాతగా నోపు నని యున్న
రూప పలికె బ్రాహ్మణ్యంబు తపంబున సంపాదించెదం గాక యని పల్కి వీడ్కొని
వనంబునకుం బోయి. 92

క. పరమతప మాచరింపఁగ, సురపతి వృషమూపి యడుగు సువ్రత నీకుం
వర మిచ్చెద ననిన ధరా,మరత్వ మిమ్మనియె నతఁడు మది ముద మొదవన్. 93

చ. అనవుడు బ్రాహ్మణత్వము మహత్త్వ మెఱుంగవ యన్యజాతి కం
దున నది యొందు వేఁడు మది దోఁచిన మే లని మెచ్చ బలారి వాఁ
డనితరసాధ్యమైనతప మస్ఖలితంబుగఁ జేయుచుండెదం
జనుము మహాత్మ నీ వనిన సస్మితుఁడై యతఁ డేఁగె నేఁగినన్. 94

వ. మతంగుం డేకపాదంబున నూఱేండ్లు తపంబు సేసిన నింద్రుండు గ్రమ్మఱ వచ్చి 95

తే. ఏను వల దని చెప్పిన మాన వెన్ను, పరమదుర్లభపద మాసపడి కరంబు
మేలితప మాచరించె చండాలుఁ డిట్టి, దాన నశియించు నిది నీకుఁ దగదు విడువు.

వ. విను మిత్తెఱంగుతపంబునకుఁ బదిమడుంగులు సేసి చండాలుండు శూద్రుండగు
నూఱుమడుంగు లనుష్ఠించి శూద్రుండు వైశ్యుం డగు వేయుమడుంగు లాచ

రించి వైశ్యుండు క్షత్త్రియుం డగు (నప్పుణ్యాచరణంబునకుఁ) బది వేలుమడుంగులు
నిర్వర్తించి క్షత్త్రియుండు దుర్బ్రాహ్మణుం డగు (నానియమంబునకు) లక్షమడుం
గులు సల్పి శమదమసత్యాహింసల నమాత్సర్యంబున నార్యబ్రాహ్మణహృదయం
బులు సదయంబులు గావించి దుర్బ్రాహ్మణుండు సద్బ్రాహ్మణుం డగు నిట్లు
బ్రాహ్మణ్యం బలఁతులం బడయ వచ్చునే పడసియు నది సెడ కుండ నడప శక్యం
బగునే యనేకజన్మంబుల నొకప్పుడు బ్రాహ్మణజన్మంబు నొందియుం గొందఱు
ధనవాంఛావిషయలౌల్యాదులం దదాచారంబు దిగవిడిచి చెడుదు రిట్టిమహా
పదంబు గోరి నిన్ను నీవ యేల వినాశంబు నొందించుకొనియెద వీతపోనిష్ఠ
సాలించి తగునది యొక్కవరంబు వేఁడు మనియె ననిన వాఁ డూర కున్న
నాఖండలుం డరిగె వెండియు. 97

క. అంగుష్ఠ మొకటి మోపి మ,తంగుఁడు నూఱేండ్లు సేసెఁ దపము నియతిమై
నంగముతో లస్థులతో, సంగతముగఁ దోఁప వెక్కసముగా నరముల్. 98

ఆ. ఇట్లు సేసి శక్తి యెల్లను గడచన్న, నతఁడు నేల వ్రాలె నతిరయమున
వచ్చి యమరఁ బట్టి వాసవుఁ డక్కట, నీకుఁ జెప్పనయ్యె నెమ్మి నేను. 99

వ. క్షత్త్రియాదులచేతనుం బట్టు వడనిబ్రాహ్మణశార్దూలంబుతోడిమేలంబు దక్కు
ము నీకు నొక్కవరం బిచ్చెదం గైకొను మని పల్కుటయు నతం డొడఁబడినం
బరమాదరంబున. 100

ఆ. చండదేవుఁ డనఁ బ్రశస్తి వహించి ను,స్త్రీలు పూజనంబు సేయఁ గామ
రూపధారి వై నిరూపింప విహగభా,వంబు గల్గి ప్రముదవర్తి వగుమ 101

క. అని వర మిచ్చి మహేంద్రుఁడు, ననియె ననిన విని యజాతశత్రుఁడు గాంగే
యునితో బ్రాహ్మణ్యము వెఱ,జనులకుఁ బొందంగ నిట్లశక్యం బేసిన్. 102

### విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యంబు గలిగిన తెఱంగు.

వ విశ్వామిత్రుం డెట్లు వొందె నత్తెఱం గెఱింగింపవే యని యడిగిన నన్నరదేవు
నకు దేవవ్రతుం డి ట్లనియె. 103

సీ. జాహ్నవీదేవికి జనకుఁ డై వెలసిన,జహ్నునికులమున సంభవించె
గాధి నాఁ బ్రకటభూకాంతుఁ డాతనిపుత్త్రి, యగుసత్యవతిఁ దన కాలిఁ గాఁగ
ని మ్మని యర్థించె నమ్మహీశ్వరు ఋచీ,కుం డనుముని భృగుకులవరేణ్యుఁ
డతని కీ నొల్లకప్పతి దనకూఁతున, కుంకువగాఁ జెప్పె నొక్కకర్ణ

తే. మసితమై తెలుపారెడుహయములు వేయి, మానిసై భార్గవుఁడు దేరఁబూని వరుణుఁ
గానఁ జని యవ్విధము ఘోటకముల వేఁడె, నాతఁ డిచ్చుట కొడఁబడి యతనితోడఁ

క. నీవలసినప్పు డట్టిహ,యావలి ప్రభవించు నెచట నైన ననవుడుఁ
దీవించి యరిగి యమ్ముని, దేవతటినియుత్తరంపుఁదీరమునఁ దగన్. 105

వ. నియతుం డై తలంచినతత్క్షణంబ గాధి సెప్పినచందం బగుగుఱ్ఱంబులు వేయునుం

బుడమిం బొఱమి పొలిచి నిలిచె; దానం గన్యాకుబ్జంబున కనతిదూరం బగు
తత్ప్రదేశం బశ్వతీర్థం బనం బరఁగె; నమ్మునికుమారుం డత్తురంగంబుల నిచ్చిన
నచ్చెరువును సంతోషంబును శాపభయంబును ముప్పిరిగొనం దనపుత్త్రిక నుంకు
వగా నియ్యకొని. 106

తే. గాధి యమ్మునిపుత్త్రు ఋచీకుఁ బెండ్లి, సేసె; నిట్లు వరించి ఋచీకుఁ డధిక
సమ్మదమున గృహస్థధర్మస్థు నడపు, చుండి సంతానకాంక్ష నయ్యువిదతోడ.

వ. నీకుం బుత్త్రోత్పత్తి గావింపం జాలుచరువు సంపాదించెద నని యొండొల్లి దాని
తల్లి దన యల్లునిమహానుభావం బెఱుంగుటం జేసి యాసత్యవతితో నాకుం దన
యుండు గలుగ నను సేయునట్లుగాఁ బుణ్యకర్త యగునీభర్తం బ్రార్థింపు
మని పనుప నది గావున నమ్మాట యమ్మునిప్రియ యాతనికిం జెప్పిన నప్పరమధర్మపరుండు.

తే. రెండుచరువు లొనర్చి యొక్కండు బ్రాహ్మ
ణత్వ మత్యుజ్జ్వలముగ నొనర్చ నొకటి
రాజభావంబు నధికతీవ్రముగఁ జేయఁ
జాలునట్లుగ నిజతపశ్శక్తిఁ జేసె. 109

వ. ఇట్లు గావించి యారెంటిని సత్యవతికిం జూపి తత్ప్రభావంబు వేఱువేఱ యుప
న్యసించి క్షాత్త్రం బయినచరువు మీతల్లి కిచ్చి [1]బ్రాహ్మం బయినదాని నీవు
పుచ్చుకొనుము ఋతుకాలంబున నీతల్లి యశ్వత్థంబును నీ వుదుంబరంబును
నాలింగనంబు సేసి భక్తితో మీమీచరువు లుపయోగించునది యని నియో
గించె వారియుపయోగంబుసమయంబున విధివశంబునం జేసి. 110

క. చరువులు నమ్ముని చెప్పిన, తెరువులు పేర్వడియె సుతకుఁ దల్లికి నట్ల
య్యిరువురు నుపయోగింపఁగఁ, జరువులు దత్తత్ప్రకారకలితము లయ్యెన్. 111

వ. దివ్యబోధమహనీయుండు గావున. 112

ఆ. చ్యవననందనుండు సత్యవతీగర్భ, భంగి సూచి యకట బ్రాహ్మణుండు
గాఁడు తరుణి నీదుకడుపులోపలిబిడ్డ, క్రూరుఁ డైన రాచకొడుకు గాని. 113

వ. అని పల్కి చరుతరువ్యత్యాసంబున నట్లగుట దేటపడం జెప్పిన నబ్బోటి య
త్యంతవిషాదవేదనాదూయమానమానస యై. 114

క. నీకుం బుట్టెడికొడుకు వి, వేకనిధి బ్రాహ్మణత్వవిశదాంగుఁ డై నా
లోకము మెచ్చునె యట్టులు, గాకుండఁగఁ జేయు తపముగౌరవ మొప్పన్.

తే. నాకు నివ్వర మిమ్మని నమ్ర యగుడు, వీఁడు బ్రాహ్మణుఁ డగుఁగాక వీనికొడుకు
నందు రాజత్వసంపద యతిశయిల్లు, ననియెఁ గరుణార్ద్రచిత్తుఁ డై యత్తపస్వి.

వ. అట్లమ్ముని యావహించుటకతంబున సత్యవతీపుత్త్రపౌత్త్రు లైన జమదగ్నిపరశు
రాములు క్రమంబున బ్రహ్మక్షత్త్రతేజోవిరాజితు లయిరి గాధిభార్యకు జనియించి

1. క. గ. ట. బ్రాహ్మణ్యం బయినదాని.

విశ్వామిత్రుండు. 117

క. నరనాథుం డై యుండియుఁ, జరుతరగుణసంక్రమమున సద్బ్రాహ్మణతా
స్ఫురణంబు వడసెఁ గపనుఁడు, గర మధికం బతనియందుఁ గలిగెఁ గుమారా.

వీతహవ్యుం డనురాజునకు బ్రాహ్మణత్వంబు కలిగినప్రకారము.

వ. అనిన విని ధర్మజుండు వీతహవ్యుం డనురాజు బ్రాహ్మణత్వంబుఁ బడసె నని విందు నత్తెఱం గెఱింగింపు మనవుడు నతనికి శంతననందనుం డిట్లనియె మనుసంభవుం డై నశర్యాతిమన్వయంబున హైహయుం డనునొక్కజనపతి జనియించి వత్సదేశాధీశుం డయి పొలిచె నాతనికి వీతహవ్యనామంబునుం గలిగి యుండుఁ దదీయ భార్యలు పదుండ్రు వారలు వీరులుం బ్రబలుల నగుపుత్త్రుల నూర్వురఁ గాంచి రమ్మహారథులు విక్రమకౌతూహలంబున. 119

సీ. హర్యశ్వుఁ గాశీశు నాజిఁ బలిశించి, యొక్కయుమ్మడి లావు నుక్కు మెఱయఁ
బొదివి చంపిరి వానిపుత్త్రుండు పట్టంబు, గట్టి సుదేవుండు గ్రమ్మఱంగ
నురవడి నరిగి యుద్ధరణిఁ జనఁ దెగఁ, జంచి రాహైహయసుతులు గడిమి
నాతనినందనుఁ డగుదివోదాసుండు, రాజైన నమ్మహీరమణుమీఁద

ఆ. నడచి వారు ఘనరణం బొనరించి సైన్యంబుఁ ద్రుంచి రోడియతఁడు వాఱి
ప్రకటసంయమిని భరద్వాజమునిఁ గని, యధికభక్తి నతనినాశ్రయించి. 120

క. తనకులము వీతహవ్యుని, తనయులచేఁ ద్రుంపఁబడుట దగ నెఱిఁగింపన్
విని యతఁ డోడకు నీ కొక, తనయునిఁ గల్పింతు రిపువిదారణనిపుణున్. 121

వ. అని పుత్త్రకామేష్టి సేసినం బ్రభవించినపుత్త్రుం డప్పుడ పదుమూఁడేండ్లప్రాయంబువాఁ డయ్యెఁ బ్రతర్దననామధేయుం డగునక్కుమారుం డమ్మహాత్ముని యనుగ్రహంబున వేదంబులు ధనుర్వేదంబును వేగంబ యధిగమించి. 122

చ. ముని కృప నావహింపఁగ సముజ్జ్వలతేజముఁ బొంది ప్రీతిమై
జనకుఁడు యౌవరాజ్యపదసంగతుఁ జేసినఁ బేర్చి యవ్విభుం
డనుమతి సేయ నెత్తి చని యాజిముఖంబున వీతహవ్యనం
దనతతి నెల్ల గీటడఁచె దర్ప మెలర్పఁగ నస్త్రమంబునన్. 123

క. తనయులఁ దెగటార్చి వడిం, దనమీఁదం గవిసినం బ్రతర్దనుశౌర్యం
బున కలికి వీతహవ్యుం, డనయము వెసఁ బాఱె భృగువునాశ్రమమునకున్. 124

ఆ. పాఱి భీతి దోఁపఁ బల్కు నమ్మునిఁ దన, దైవశిష్యసమితిలోన నునిచె
నతనిఁ గాశిరాజసుతుఁడును వెనువెంటఁ, దగిలి యచటి కరిగి తగువిధమున. 125

క. మునిపతికిని వినయము సేసిన నిట రాకకుఁ గతంబు సెప్పు మనిమొ న
జ్జనవంద్యుఁ డక్కుమారుం, డనఘా మధ్యస్థవృత్తి వై విన వలయున్. 126

వ. అని పనికి తమకులంబు వీతహవ్యునికొడుకులచేత నశించినవిధంబు దాను వారల నందఱ ద్రుంచుటయును వీతహవ్యుం డాహవంబునం దనకు నోడి పాఱుట

యను జెప్పి మునీంద్రా యారాజట వచ్చె నాతనిం బొలియించుటకై వచ్చితి
ననిన నత్తపోధనసత్తముండు. 127

క. విను మిచ్చట నృపకులసం,జనితుఁడు లేఁ డింతయుం బ్రశస్తమహీదే
వనికాయము కనుఁగొను మని, తనశిష్యప్రతతిఁ జూపె దయ చిగురొత్తన్. 128

వ. చూపినం జూచి. 129

ఆ. అతఁడు నగుచు భృగునియడుగుల కెఱఁగి మ,హాత్మ దీన నేఁ గృతార్థవృత్తి
నైతిఁ జగతు నిట్లు జాతికిం బెడఁబాపి, గాసిగాఁగఁ జేయఁ గంటిఁ గాన. 130

క. కలుగునె యమోఘ మగునీ,పలుకున కనృతత్వ మేను బనివినియెద న
న్నలఘుకృపఁ జూడు మని తగఁ, బలికిన ముని ప్రీతి నానృపతి వీడ్కొలిపెన్.

ఆ. వీతహవ్యుఁడును మహాతపస్సందీప్తుఁ, డైనయమ్మునీంద్రు నప్రతర్క్య
భంగిభాషణములబ్రాహ్మణుఁడై గృత్స,మదసమాఖ్యుఁ గాంచెమహితసుతుని.

వ. తత్పుత్రపౌత్రక్రమంబున సుతేజసుండును వర్చసుండును విహవ్యుండును విత
త్యుండును సత్యుండును సంతుండును శ్రవసుండును దమసుండును బ్రకాశుండు
ను వాంగింద్రుండును బ్రమతియును రురుండును సముదుండును శునకుండును
శౌనకుండును నన మహాద్విజులు జన్మించి రిట్లు విద్యావార్త్తికశ్రేణివంశం బగు
మునివంశంబునకు మూలం బయి యవ్వీతహవ్యుండు భవ్యమూర్తి వడసెఁ బాం
డవాగ్రజా యింక నెయ్యది యడిగెద వడుగు మనుటయు నతండు దైవంబును
బౌరుషంబు నను రెంటియందు నెయ్యది యధికంబు సెప్పు మనిన నప్పురుషవరుం
డు దొల్లి యిట్లు వసిష్ఠుండు బ్రహ్మ నడిగిన నమ్మహాత్ముం డుపదేశించినవాక్యం
బులయర్థంబు లుపన్యసించెద నాకర్ణింపు మని యిట్లనియె. 133

### భీష్ముఁడు ధర్మరాజునకు దైవపౌరుషంబులతెఱం గెఱింగించుట.

క. క్షేత్రంబు పురుషకారము, ధాత్రీశ్వర బీజ మయ దైవము రెండున్
సూత్రపడఁ గూడె నేనిం, బాత్రం బగుఁ గర్మకరుఁడు ఫలమున కెందున్. 134

క. [1]విను పురుషుఁడు గావింపని,పనులకు దైవ మది యెట్లు ఫల మొసరించున్
జనములు కార్యము నడపఁగ, ననుకూలత నిచ్చుఁగాక యయ్యైఫలముల్. 135

తే. పౌరుషమ్ము దైవంబుతోడ్పాటు లేక, ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర
విత్తు సహకారి గాకున్న రిత్తనేల, వంధ్య మగుఁగాక తా ఫలవంత మగునె.

తే. మేలు రెండులోకంబులమేల తెచ్చుఁ, గీడు సేసినఁ దప్పదు కీడ యగుట
గాన పురుషవర్తనమునకానుకూల్య,శీల మగుదైవ మది ఫలసిద్ధిఁ జేయు. 187

క. అనలం బించుక యైనఁ బ,వనుచే వెలుఁగొందుమాడ్కి వర్ధనముం బొం
దును సత్కర్మాచరణం,బున దైవము నానుకూల్యము కురుప్రవరా. 138

క. నేయి పోలు పఱిన దీవియ, మాయుకరణిఁ [2]గర్మసిద్ధి మలఁగిన హీన

---

1. క. చ. జ. విను పురుషులు గావింపని, పనులను. 2. గ. చ. జ. గర్మశుద్ధి.

త్వాయత్తం బై తాను, మాయును దైవానుకూల్యమహిమ మహీశా. 139

తే. పరశురాముఁడు భృగుఁడును బలియు లోను
గాఁగ మహనీయపురుషులు కర్మసూక్ష్మ
భంగిఁ గలుపితదైవప్రభావితాత్ము
లైరి కర్మంబు దైవంబు నలఁతు లెట్లు. 140

క. విను పౌరుషమును దైవము, నన రెండును గార్యఫలము నందింపఁగ నె
ట్టన కారణములు గావున, జననాయక సదృశములు విచారింపంగన్. 141

వ. అనిన విని ధర్మతనయుండు సత్కర్మంబుల నభ్యుదయఫలంబులు విన వలతు
ననుటయు నక్కురుసత్తమునకు నక్కురుపితామహుం డి ట్లనియె. 142

సీ. అధ్వపరిశ్రాంతుఁ డగువింతవానికి, నన్నం బిడినఫల మట్టి దిట్టి
దనఁ బెద్ద యగ్నిసమారాధనమునకుఁ, బౌరుష శ్రేష్ఠత భవ్యదాన
ములకుఁ దత్తద్వస్తువులమహామహిమలు, మానంబునకుఁ బరిజ్ఞానశక్తి
యతులతపంబున కధికభోగము లహింసకు రూపబలచిదైశ్వర్యసిద్ధి

ఆ. బ్రహ్మచర్యమునకుఁ బరమాయు వుపవాసములకుఁ జిత్తశుద్ధి ఫలజలంబు
లాహరించి యునికి కాధిరాజ్యము పత్త్రిభక్షుతకు దివంబు ఫలము లధిప.

క. శ్రుతిపఠనమునకు నర్థప్రతిబోధంబునకు వరుస ఫలములు సౌఖ్య
స్థితియును సుగతియు సత్యవ్రతమునకు ఫలంబు ముక్తి వసుధాధీశా. 144

క. ద్రుమముల దళకుసుమఫలోద్గమముల క్రియఁ గర్మముల నొదవుఁ దత్ఫలముల్
దమతమతఱిఁ గర్తకు భోగ్యము లై నియతిని శుభాశుభాకారములన్. 145

146

వ. అని చెప్పి.

చ. వినుము జరానుబంధమున వెంద్రుకతండముఁ బండ్లు వీనులుం
గనుఁగవయున్ జరం బొరయుఁ గాని యెకప్పుడుఁ దృష్ణ జీర్ణ గా
దనయముఁ బేర్చి ప్రాణముల నన్నక పో దది రోగ మల్పబు
ద్ధి నరులు ద్రోవ లే రది మది జొరనీరు సుఖార్థు లై బుధుల్. 147

క. పాపంబుఁ బుణ్యమును దృష్టాపరులకు దుఃఖసౌఖ్యసంపాదు లగున్
భూపాల వితృష్ణులు నిర్లేపు లగుట వారిఁ బొంద లే వాఫలముల్. 148

వ. అని పల్కినం బాండునందను లందఱుం బ్రహర్షోత్కర్షంబు నొందిరి గంగా
నందనుండు ధర్మనందను నుద్దేశించి యీయర్థజాతంబు మునిప్రణీతం బయి
యధిగతం బైనది నీకు నుపదేశించితి నీ వింక నేమి విన వల తనవుడు నాభూ
వల్లభుండు నిజాశ్రయంబున కాస్పదం బయినపురుషునెడ భక్తజనంబు చరితం
బెట్టిది గావలయు నని యడిగిన నతం డతని కి ట్లనియె. 149

భీష్ముఁడు ధర్మరాజున కాశ్రయం బెప్పుడు నపరిత్యాజ్యం బని చెప్పుట.

క. విను కాశీశ్వరు దేశంబున నొకలుబ్ధకుఁడు వేఁట వోయినచోటన్

ఘనతరవిషదిగ్ధశరం,బున నేసిన మృగముఁ దప్పి భూజముఁ దాఁకెన్. 150

క. ప్రావులఁ గాయలఁ బెరిఁగిన యావృక్షము శుష్కమయ్యె నవ్విషమున ధా
త్రీనరు తదీయకోటర మావాసము గాఁగ నొకమహాశుక ముండున్. 151

క. ఆ తరువు విడిచి పోనక, హృదయంబున భక్తిపేర్మి నెండను గాలిన్
జెనరక స్మృతియై నయ్యెడఁ, గదలక యుండె ననుజీవిగౌరవ మెసఁగన్. 152

ఉ. దానియుదాత్తవృత్తము శతక్రతుఁ డాత్మ నెఱింగి వచ్చి బెం
డ్లై నది యిమ్మహీజము మహాతరువుల్ ఫలవృద్ధి నొంది యి
క్కానన ననేకముల్ గలుగఁగా నిటు లేటికి నింక నిల్వ నో
మానితకీరమా యనియె మానుషభంగికరూప మొప్పఁగన్. 153

వ. అనిన విని యాశుకంబు. 154

చ. అనయముఁ బండు చుండునెడ నాశ్రయ మొప్పిన నిల్చి యెండి పో
యినతఱిఁ బాసి పోక తగ వెల్లు కృతఘ్నత గాదె యివ్విధం
బనిమిషనాథ యన్న నగఁ బెచ్చెరు వంది పురాకృతోపసం
జనితవిశేష మిాఖగము జానుగ నన్ను నెఱింగె దీనికిన్. 155

వ. మే లొనర్చెదం గాక. 156

క. అని తలఁచి నీదుపలుకులు, విని మెచ్చితి వరము గోరు విహగోత్తమ నీ
వనిన శుకంబు మహీజం,బునకుం బేరెలమి వేఁడె భూపవరేణ్యా. 157

ఆ. అమరవల్లభుండు నమృతసేచనమున, భూజమునకుఁ దొంటిపొల్పుకంటె
మిగుల నెలమి సేసె మేలియాశ్రితు లిట్లు, మనుతు రధిపుఁ గురుకుమారవర్య.

**విభులకుం బాటింపవలయువారిని భీష్ముఁడు ధర్మరాజునకుఁ జెప్పుట.**

వ. అనిన నతం డెవ్వరిఁ బాటించుట విభులకు వలయు నని యడిగిన నాభూపతికి భీష్ముం డి ట్లనియె. 159

సీ. జననాథ విను తపస్స్వాధ్యాయముఖకర్మ,కరణత నుభయలోకముల వశగ
తములఁ జేయఁగఁ జాలుధాత్రీసురులు మన్న,నకుఁ బాత్రములు పతి నాతికెట్లు
రాజునకును నట్లు బ్రాహ్మణుం డొడయుండు, బ్రాహ్మణుం డనుమాట పావనంబు
హర్షించి శుభముల నలిగి యాపదల నిం,ద్రున కైనఁ జేయు విప్రుండు నృపతి

ఆ. గొడుకుఁబోలె నరయ గురుఁబోలెఁ గొలువంగ, నగ్నిఁబోలె నిష్ఠ నర్చితుఁడుగఁ
జేయ వలయు విప్రుఁ జెప్పెద వేదసం,వాద మేకబుద్ధి నాదరింపు. 160

వ. వేదంబులు తమలోనఁ గోష్ఠి సేయుసమయంబున. 161

సీ. బ్రాహ్మణజాతికిఁ బరిభవం బొనరింప, మున్ను చేసినపుణ్యములు నశించు
జపహోమముఖకర్మసంచయంబున కధికతరంబు విప్రముఖమున నిడుట
[1]భూసురార్చన మొకమాసంబు సల్పినఁ, బాపంబు లెల్లను బాసి పోవు

1. క. చ. జ. భూసురారాధనమున నొక్కమాసంబు పాపంబు.

నగ్రవర్ణులఁ గాంచి యాదరింపక యుండు, కంటెను గీడొండు గలుగ దరయ
తే. నని క్రమంబున ఋగ్వేదమును యజుస్సు, సామము నథర్వణమ్మును సారభూత
భవ్యసంభాషణము సేత దివ్యమునుల, వలన వింటివి కౌరవకులపవిత్ర.

భీష్ముఁడు ధర్మరాజునకుఁ బరమ మైనధర్మంబు సెప్పుట.

సీ. అని చెప్పి భీష్ముఁ డమ్మనుజేంద్రుతోఁ బర, మశ్రేష్ఠ మైనధర్మంబుఁ దెలియ
వినుమని పల్కి యిట్లను మద్రనాథుండు, సత్యవతీపుత్త్రుచరణములకు
నెఱఁగి కేలు మొగిడ్చి యెద్దాని నెఱుఁగుట, యెఱుకల కెల్లను నెక్కుడని స
భక్తిసమ్మతిఁ బ్రార్థించి యడిగిన, నమ్మహాముని దయ నతనిఁ జూచి
ఆ. విష్ణు నెఱుఁగు టధికవిమలబోధము యజ్ఞ, మూర్తి యజ్ఞకర్తృమూర్తి యజ్ఞ
కలనమూర్తి యజ్ఞఫలమూర్తి విష్ణుఁ డ, తండు కృష్ణుఁ డమలతరచరిత్ర. 163
వ. అని పల్కి యమ్మహాత్ముండు వెండియు శల్యున కిట్లనుఁ గృష్ణుండు వినుచుండఁ
గొందఱు బ్రాహ్మణు లతని నుపలక్షించి నాతో నిబ్బాలుండు యాదవుం డై న
వసుదేవునకుఁ గంసానుజ యైన దేవకియందు జన్మించినవాఁ డితని నీవు క్రతుపురు
షుం డని కొనియాడుటకుఁ గతం బేమి యని యడిగిన నన్నారాయణుండు నగుచు
నన్నుఁ గన్గొని వీరలప్రశ్నంబునకు నుత్తరంబు దగ నిత్తు గాక యనిన నద్దేవునకుం
బ్రణమిల్లి యే నిట్లంటి 164
ఆ. వేదమయుఁడు వేదవేద్యుండు వేదార్థ, విత్తమప్రియుండు విష్ణుఁ డితఁ
డిట్టిఁ డగుట యాత్మ నెఱుఁగుట యుత్తమ, బ్రాహ్మణత్వసిద్ధి భవ్యులార. 165
వ. అనిన విని వారలు సంభావనం గృతకృత్యు లై రని చెప్పిన మద్రవిభుండు మాన
సంబు మాలిన్యరహితంబును బ్రసాదసహితంబును నయి చరితార్థుం డయ్యెఁ
బాండవాగ్రజా నీకు నీయర్థంబు విజ్ఞాతం బగుట యెఱుంగుదు నైనను బ్రజ్ఞా
విశుద్ధికరణం బాచరించితి నని చెప్పుటయు నతం డత్యంతసంతుష్టాంతరంగుం
డయి గరుత్మంతుండు మహానుభావుం డని విందు నవ్విహగవిభునివృత్తాంతంబు
తెఱం గెఱుంగ విన వలతు వివరింపవే యనుటయు నతం డచ్యుతు నాలోకించి
యాసుపర్ణుండు నీవ కా విని యుండుదుం జెప్పెద ననవుడు నప్పుండరీకాక్షుండు విక
చనదనుం డై యట్లు చేయు మిక్కురుపతికోర్కి దీర్చుట కర్తవ్యం బని పల్కిన నా
దేవవ్రతుండు భూవల్లభున కిట్లనియె. 166

భీష్ముఁడు ధర్మరాజునకు గరుత్మంతునిచరిత్రంబు సెప్పుట.

సీ. కశ్యపుభార్యలు కద్రువ వినత నాఁ, గల రాతపస్వి వారలకు వరము
కరుణ నిచ్చెద నన్నఁ గద్రువ వేవుర, వినత యిద్దఱ వేఁడికొనిరి సుతుల
మునియు నట్లగుఁగాక యనియెఁ బదంపడి, యండముల్ వేయును నండయుగము
వరుసన యాకద్రువకు వినతకుఁ బుట్టె, నవి కుండముల నిడి యరసి యుండి
తే. రహిసహస్ర మేనూఱేండ్లు నంత నుదయ, మయ్యె నవ్వేయిగ్రుడ్ల నధిక బలముఁ

దేజమునుగల్గి యాసర్పరాజి యొప్పుచుండెనా రెండు విరియక యుండె మఱియు.

క. తనసవతి యైనకద్రువఁ, గని వగపున మత్సరంబుఁ గదిరెడుమదితో
వినత గడుఁ బేరగపడి, యనీతి నొకయండ మవియ నడిచె నరేంద్రా. 168

వ. అడిచిన నందు. 169

క. పులుఁ గొక్కఁడు పూర్వాంగము, గలిగి జనించుటయు వానిఁ గని యాసతి గ
న్నుల నశ్రుజలంబులు వె, ల్లొలుకఁగ శోకమున మునుఁగు నుల్లముతోడన్.

వ. నివ్వెఱపడి యుండ నయ్యండజంబు. 171

చ. ఇరువుర మేము వుట్టుదు మహీనపుమేనులతో మహాబల
స్ఫురణ వెలుంగ నవ్వెనుపుఁ బొందఁగనీ కవియించి తిట్లు మ
త్సరమునఁ జాపలంబునను దత్ఫల మందుము నీసపత్నికిన్
వరవుడ వై చరింపు మని వారని నెవ్వగ శాప మిచ్చినన్. 172

క. వెలవెలఁబాఱుచు వడఁకుచు, నలుకుచుఁ దనమోముఁ జూచుచునయ్యంగన న
ప్పులుఁగు కృపఁ జూచి తల్లీ, వలవ దడల నిది విధాతృవశ మయి వచ్చెన్. 173

వ. అని వెండియు. 174

శా. ఏనూఱేండ్లకుఁ బుట్టు నాయనుజుఁ డింకీయున్నయండంబు నె
ట్లైనన్ ధైర్యము గల్గి కావుము ప్రయత్నాసక్తివై వాఁడు ద
ర్పానూనుండు బలాభిరాముఁడు [1]మదీయస్ఫూర్తిమన్మూర్తి నీ
కానందంబుగ నీఁగు దాస్యము త్రిలోకాశ్చర్యసంపాది యై. 175

వ. అనియె నిట్లు ప్రథమపుత్త్రుండు వికలాంగుం డగుటకును శాపప్రాప్తికిని బరమ నిర్వేదనంబు నొంది వినతయు నవ్విహంగంబు నిర్దేశించినకాలంబు ప్రతీక్షించి యయ్యండంబు రక్షించికొని యుండం దత్సమయసమాగమంబున. 176

చ. ఘనతరకంధరుండు దృఢకాయుఁడు దీప్తముఖుండు రక్తలో
చనుఁడు మహోత్తమాంగకుఁడు చారుసుసంగతపక్షసారమం
డనుఁడు పరిస్ఫురద్ద్యుతివిడంబితబాలదివాకరుండు లో
కనయనపర్వనిర్వహణకారి సుపర్ణుఁడు పుట్టె భూవరా. 177

క. ఆసమయంబున నరుణో, ద్భాసితగాత్రుండు దొలుతపట్టి యరుణుఁ డు
ల్లాసి యగుచు రవిపరిచ, ర్యాసుఖ మెదఁ గోరి చనియె నంబరవీధిన్. 178

మ. జననిం బాసి జనించునప్డ తన యిచ్చం బక్షినాథుండునుం
జని పద్మోద్భవకల్పితంబు లగుభోజ్యంబుల్ శరీరంబు వ
ర్ధన మొందింపఁగ సిద్ధసాధ్యగణముల్ దన్ ముద్దు సేయంగఁ గ్రీ
డనలోలత్వమునం జరించుఁ బరితుష్టస్వాంతుఁ డై యెల్లెడన్. 179

1. చ. మహీయయనూస్ఫూర్తిమన్మూర్తి.

వ. అక్కాలంబున వినోదంబునకై యరిగి యొక్కయెడ. 180

సీ. చంచులఁ జిగురాకుఁ జించియాడుచు నలి, నెలుఁగించుగండుఁగోయిలలసొంపు
నలరుఁదేనియ గ్రోలియన్నుసోలంబుల, మురియు తేఁటులనునుమ్రోఁతయింపుఁ
దనిపండ్లరస మాని తమలోనఁ జెలఁగుచుఁ, బలికెడురాచిల్కపదువురంగుఁ
గొలఁకులకెలఁకులఁ గూడి క్రీడించు చుం, డెడునంచతండంబునడబెడంగుఁ

తే. దరఁగఁ దేలుచుఁ బూఁదీవఁదగులఁబడుచు, వచ్చుచిఱుగాలిసోఁకును మెచ్చి మెచ్చి
తగిలి కొనియాడుచును వినతయును గద్రు,వయును మున్నిటిచేరువవనమునందు.

వ. మెలఁగు చుండి రట్టియెడ. 182

చ. కరువునఁ బోసిరో విధునికాంతి సుధాబ్ధితరంగఁ దెచ్చి గం
డరు వొనరించిరో హరుజటాస్థలికిం దొడ వైనయేటిపె
న్నురువునఁ జేసిరో యన మనోజ్ఞసితచ్ఛవి నుల్లసిల్లుసుం
దరతురగోత్తమంబు దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్. 183

వ. నిజేచ్ఛమై వచ్చినయుచ్చైశ్శ్రవంబు నిట్లాలోకించి. 184

క. వినత హయ మింత యొప్పునె, యనూనధవళప్రభాఢ్య మై యని పలుకన్
విని కద్రువ యపరాంగం,బున నీలిమ దోఁచె ననియె భూపవరేణ్యా. 185

చ. అనవుడు నమ్మృగాక్షి యిటు లాడితి నవ్వుల కాడితో నిజం
బునకునొ నీదుచూపునకుఁ బోలినభంగియొ చెప్పు మన్న న
వ్వనిత దరస్మితస్ఫురితవక్త్రముతో నిది యేటిమాట న
ల్లనియెడ గాన రాదె తెమలం బలుకం బని యేమి నావుడున్. 186

వ. వినత దెలియం జూచి. 187

ఉ. కా దని పూని పల్కుటయుఁ గద్రువ పన్నిద మేమి దీనికి
న్వా దిది యేల రిత్త యనినన్ విని యాసతి నిక్కమేని నీ
వేది పణంబుగాఁ దలఁచి యేర్పడఁ జెప్పితి దాని కేను సం
వాదము సేయుదాన గరువంబుగ నొక్కటి నిశ్చయింపుమా. 188

వ. అనిన విని కద్రువ వినతవదనంబునఁ జూడ్కి నిలిపి. 189

తే. నీవు గెల్చిన దాస్యంబు నీకు నేను, జేయఁగలదాన నేను గెల్చినను నీవు
నాకుఁ జేయంగఁ గలదాన వీకడింది,పన్నిదము సఱ మని తెగఁబాఱి పలికె.

క. ఆపొలఁతి యట్లు వల్కిన, శాపము ప్రేరేప నరుణజననికి నుత్సా
హోపేత మయ్యెఁ జిత్తం, బాపన్నిదమునకు నేమి యనఁ గల దధిపా. 191

వ. ఇట్లు వినతయుం దెంపు సేసి యత్తెఱంగున కియ్యకొనియె నయ్యిరువురుఁ బంచ
మహాభూతంబులు సాక్షులుగాఁ బల్కి పన్నిదంబు సఱచిరి కద్రువ పతిపరిచర్య
కుం గాలం బయ్యె మఱి వచ్చి యశ్వంబు నాలోకింత మని నెపం బిడి యప్పటి
కిం జూపు దప్పించి యవ్విధంబున మగిడి యరుగుదెంచిరి తదనంతరంబ. 192

సీ. కుటిలంపుఁదలఁపునఁ । గొడుకుల రావించి, కద్రువ యిట్లనుఁ । గన్నునీరు
దొరఁగంగ వారల । తో నబ్ధిపొంతకు, వినతయు నేనును । వేడ్క నరిగి
యచ్చతెల్పునఁ గడు । నభిరామ మగునొక్క, యశ్వంబుఁ గాంచితి । మవ్వధూటి
కేవలధవళంబు । నా విని యెద్దార, మునకు నే నదె నల్ల । దనము గంటె
తే. వెనుకదెస నన్న వా దయ్యెఁ । గనలి పన్నిఁ,దంబు నఱచితి మోడిన । దాస్యవృత్తి
వచ్చు సవతికి నే నెట్లు । వరవుడంబు, సేయఁ దగుఁ దోఁక నల్లగాఁ । జేయరయ్య.
చ. అనవుడు వాసుకిప్రభృతు । లక్కట ధర్మువు గాదు నీవు సూ
చినతెరు వట్టిగెల్పు శుభ । సిద్ధి యొనర్చునె యట్లుఁ గాక య
వ్వినతయుఁ దల్లి గాదె [1]గరు । వంపుఁదనంబునఁ జూడ మాకు ని
ట్లనఁ దగునమ్మ యెట్లయిన । నయ్యెను బాపము సేయ వచ్చునే. 194
క. ఈవిధ మెమ్మెయి నైనం, గావింపఁగ వలయు ననుట । గల్గినఁ బరదే
శావాసుల మగుదుము మము, నీ వింకం దగదు తల్లి । నిర్బంధింపన్. 195
క. అని రట్టియెడం గొందఱు, జననిఁ దొఱఁగి యెక్కడేనిఁ । జని రాభంగిం
జనినతనూజులఁ [2]బేర్కొని, నెనరు విడిచి యానెలంత । నిష్ఠురమతి యై. 196

కద్రువ దనకొడుకులకు జనమేజయునివలన నాశంబు గల్గునట్లు శపించుట.

చ. అమృతకరాన్వయంబున మ । హాముని వేడ్క నరుండు పాండుభూ
రమణునిదేవి గొంతియుద । రంబునఁ బుట్టి ధనంజయాదినా
మముల వెలుంగుఁ దత్సుతుని । మన్మఁడు సంభృతధర్మ మైనపే
ర్మి మెఱయ నేల యేలు జన । మేజయనాముఁ [3]డరాత్యజయ్యుఁ డై. 197
ఉ. ఆతఁడు సర్పయాగ మను । నధ్వరముం గుపితాత్ముఁ డై పితృ
ప్రీతిగఁ జేయఁ దద్దహన । భీకరభూరిశిఖాప్రవేశసం
జాతదురంతతాపమునఁ । జావఁగలా రని శాప మిచ్చెఁ ద
త్పాతనవృత్తికిన్ వెఱచి । తక్కటినాగము లాభుజంగితోన్. 198
తే. నల్లగాఁ జేయువార మే । మెల్లభంగి, నాతురంగమపతివాల । మని రయమునఁ
బోయి వాలధిరోమముల్ । పొదివి నీల,రోమసంచయ మైరి కు । రుక్షితీశ. 199
క. కద్రువ గన్గొని సంతో,షద్రుతమతి యగుచుఁ బిలిచి । సవతికిఁ జూపెన్
భద్రాత్మక యవ్వినతయుఁ, దద్రోహం బెఱుఁగ లేమి । దైన్యము నొందెన్. 200
క. నగుచుం గద్రువ వరవుడ, వగుము విచారంబు విడిచి । యనుడు వినత య
ట్లగుఁగా కని లజ్జయుఁ బెను,వగయుఁ దొలఁగఁ ద్రోచి చేసె । వరవుడము దగన్.
వ. ఇట్లు కపటజయంబునఁ గద్రువ సత్యవినయాదిగుణవతి యయినవినతం దనకు

---

1. అ. 'గరువంపుఁదలంపున'. 2. గ. 'నెల్లన్, విని పేర్కొని. 3. వ్రాఁత ప్రతులందు 'అరాత్యజేయుఁ డై' అని యున్నది. 'క్షయ్యజయ్యౌ శక్యార్థే' అనుసూత్రముంబట్టి యజేయశబ్దమునకు శక్యార్థము లేకుండియుఁ బ్రౌఢకవిప్రయోగముల శక్యార్థము గానిపించుచున్నది.

దాసిం జేసికొని పరిహీనంబు లయినపరిచారికాకృత్యంబుల నిత్యంబు నలంచు చుండెం బదంపడి యప్పరమసాధ్వి దనయగ్రతనయుం డాదేశించినతెఱం గూహించి రెండవయండంబున జనియించినతనూజుం దలంచుచు నాసపాటు గదిరినహృదయంబుతో దాస్యం బనాలస్యంబున నడపు చుండ. 202

ఉ. యౌవనదర్ప మంది జవ ౯ మంతికుసంతతు నగ్గలింప మై
లా వధికంబు గాఁగ నుపలాలన సేయఁగఁ బద్మసంభవుం
డావిహగోత్తముండు హృదయంబున గర్వ మెలర్ప నుద్ధతుం
డై విహరింపఁ జూచి యొకయప్పుడు నారదుఁ డల్లఁ జేరినన్. 203

వ. అతఁడు భక్తిం బ్రణమిల్లి నిల్చిన నప్పక్షిపుంగవునకు నమ్మునిపుంగవుం డిట్లనియె.

తే. దాసి యై సవతాలికిఁ ౯ దల్లి పనులు, సేసి నలఁగంగ నద్దెసఁ ౯ జింత వంత
లేక నీ విట్లు దిరుగుట ౯ లెస్స యగునె, యద్భుతోజ్జ్వలతేజ కశ్యపతనూజ.

చ. అనుడు విహంగనాథుఁడు మనందంబున దాస్యము రాకకుం గతం
బనఘవిచార యెద్ది దెలియ న్వినిపింపవె యన్నఁ జెప్పె న
మ్మునివరుఁ డున్నరూపు హయమ్ముం గను టాదిగఁ గల్గుకశ్యపాం
గనలచరిత్ర మాతని కఖండపరిస్ఫుటభాషణంబులన్. 206

ఉ. చెప్పినఁ గోపము న్వగపుఁ ౯ జిత్తమునం గదురంగ మేలుమే
లప్పు హితంబు సేసెఁ జెలియల్ మను చున్నది పెంపుతోడ నం
చప్పుడ వాయువేగమున ౯ నయ్యెడకుం జని మాట యెద్దియుం
జెప్పక తల్లికిం బ్రణతి ౯ సేసె విషాదభరార్త మూర్తి యై. 207

వ. కద్రువపాలికిం బోయి. 208

చ. పరమవినీతి మై నెఱఁగి ౯ బాంధవ మారఁగ నల్ల ని ట్లను న్
గరుడుఁడు [1]దారితారి వగఁ ౯ గందుచు నీచెలియల్ చరించుని
[2]ర్వరవుడపుంజరిత్రమున ౯ వచ్చునె నీ కొక పేర్మి యీసతిం
గరుణ యెలర్పఁగా విడువ ౯ గౌరవసంపదఁ జేయు నెంతయున్. 209

ఉ. నీకును నేను బుత్త్రుఁడన ౯ నెమ్మిఁ దగ న్ననుఁ జూచి యైనఁ ద
ల్లీ కృప సేత పెద్దయును ౯ లెస్స యధర్మము ధర్మ మన్వగల్
నా కవి యేల దాస్యకృతి ౯ నాజనయిత్రికి నివ్విధంబున
న్రాకయు దైవకృత్యమ మనంబునఁ బొంగుదు విడ్పు గల్గినన్. 210

వ. అనిన విని మొగంబు ముఱకటించుకొనుచుఁ గద్రువ గరుత్మంతున కిట్లనియె. 211

మ. బలవంతుండవు నేర్పుచందములఁ జెప్పం జాలి యీరిత్తప
ల్కులఁ దేర్పం బని లేదు తల్లికి మదిం ౯ గూర్తేని వే పోయి లో
కులు నిన్నుం బ్రణుతింపఁ దె మ్మమృతము న్ ౯ ఘోరంపుదాస్యంబు నేఁ

1. గ. దాన చేరి. 2. 'వరువుడ' మనియే వ్రా. ప్ర.

దోలఁగం బెట్టెద మీ కనంత మగుసంతోషంబు సంధిల్లఁగన్. 212

చ. అన విని దాని కియ్యకొని యప్డు సుపర్ణుఁడు వోయి కశ్యపుం
గని తనభాషణంబులును గద్రువపల్కులుఁ జెప్పి తెచ్చువాఁ
డ నమృత మెట్లు నే నని యొడంబడి వచ్చితి నన్న నాతఁ డ
త్తనయునిఁ జూచి యుల్లము ముదంబును నచ్చెరువాటు నొందఁగన్. 213

క. అమృతంబు దుర్లభం బ,య్యమరుల కేనియు నతిప్రయత్నంబున గు
ప్తము సేసి యుండు వాసవుఁ, డమలచరిత నీకు [1]నగునె యట్టిది దేరన్. 214

వ. వినుము. 215

చ. ఉదకము రక్షకం బగుచు నుండఁగ నుజ్జ్వలవహ్ని యందునుం
బొదువఁ గృపాణశక్తిముఖభూరితరాయుధహస్తులై బలో
న్మదులు మహోగ్రకోపులు ఘనస్థిరకాయు లనేకరాక్షసు
లొప్పదిగొని కావ నిప్పవలలో నమృతంబు సురక్షితస్థితిన్. 216

క. ఉండు నని విని విహంగవి,భుం డల్లన నగుచు నీవు పుత్త్రస్నేహా
ధ్యుండ వయి పలికి తే బలి,యుండ నుపాయజ్ఞుఁడను మహోజ్జ్వలతేజా. 217

మ. అనుమానం బది యేల తెత్తు నమృతం బన్నం గడుం బొంగి యా
తనిఁ దాఁ గౌఁగిటఁ జేర్చి కశ్యపుఁడు పుత్త్రా నిశ్చయం బట్లయే
ని నిభంబుం గమఠంబునుం గలవు వానిం దిన్న లా వెక్కు నా
ఘనజంతుద్వితయంబు నీకు నెరగాఁ గల్పించితిం బోవనా. 218

వ. అనుటయు సంతోషించి గరుత్మంతుం డాగజకచ్ఛపంబు లెచ్చట నుండు నెబ్భం
గివి యని యడిగిన నమ్మునీంద్రుం డవ్విహగేంద్రున కిట్లనియె. 219

కశ్యపుఁడు గరుడునకు గజకచ్ఛపంబుల తెఱం గెఱింగించుట.

సీ. ప్రాక్పయోనిధిపొంతఁ బర్వతం బొక్కటి, ఘనశృంగకబళితాకాశ మగుచు
సురగనామంబున నొప్పు నచ్చేరువ, వసియించు నొకమహావారణంబు
దానితటంబునఁ దామరకొల నబ్ధి, ననుకరించుచు మధురాచ్ఛవారి
సంపద సొంపారు సమదలీలల నగ్గ,జం బానగంబుపై సంచరింప

తే. మిట్టిఁ బల్లంబు గట్టును మెట్టు నొక్క,మట్టమై యది [2]నునుపారుమహితమైన
యక్కొలన నీరు ద్రావఁగా ననుదినంబు, నరుగు నయ్యిభ వల్లభుఁ డనఘచరిత.

ఉ. అం దొకకచ్ఛపప్రవరుఁ డత్యధికం బగుకాయముఁ బలం
బుం దనరఁ వసించు జలముం గొనువాంఛ గజంబు వోయినం
జెందఁగ నీక సంగరముఁ జేయుఁ బెనంగుచు నీరు ద్రావు గా
రుం దెగి యుండు నిట్ల పగ రోష మెలర్పఁగ నాఁడునాఁటికిన్. 221

క. విను మధుకైటభు లనియెడు,దనుజేంద్రులు కచ్ఛపంబు దంతియు నై పు

1. చ. నెట్టు లది దేవచ్చున్. 2. క. చ. జ. నునుపారి.

ట్టినవారు దమ్మెఱుంగమిఁ, బెనఁగుదు రొండొరులతోడ భీకరభంగిన్. 222

క. ఒంటిమెయి నుండఁగా ము,క్కంటికి నాకచ్ఛపంబు గోరుం బట్టం
గంట యరిది యొక్కొకటన, రెంటిం బొదువంగ వలయు రే వెర వారన్. 223

వ. అనుడు వైనతేయుండు. 224

ఆ. ఒకటి గొలనిలోన నుండు నొక్కటి కొండ,మీఁద సంచరించు మీరు రెంటి
నడఁగ నొక్కమాట యడరి పట్టుట కృత్య, మనియెదరు వశంబె యట్ల చేయ.

వ. అనిన నది యట్టిద యుపాయంబు సెప్పెద నాకర్ణింపు మని యమ్మునివరుండు.

చ. కరిపతి నీరు ద్రావుటకుఁగాఁ జనుదెంచినఁ గూర్మరాజు సం
గర మొనరించుచుం చుండి తమకంబున నీళ్లలఁ బాసి వీఁకమై
దరి నడరంగఁ బట్టునది తత్సమయంబున రెంటిఁ గూడ నీ
వెరవున యూఁది చిత్తమున వేగిరపాటు లేక పొంచుమీ. 227

వ. అని యుపదేశించిన వీడ్కొనుటను వినతుం డయినతన్ను నత్యాదరంబునం
గనుంగొని యత్తపోధనసత్తముండు నీవు గజకచ్ఛపంబుల నాహారంబుగాఁ గొనిన
నీకుం ద్రిదశాహారంబు దేర దొరకొనుటకు సందేహంబు లేదనుపల్కు వల్కి
పరమాశీర్వాదంబు లిచ్చిన. 228

మ. విని యుత్సాహము కందళింపఁగ వియద్వీథీగతుం డై విమా
ననికాయంబులు దూలఁ బక్షతివితానస్ఫారదీప్తివ్రజం
బినరశ్మిప్రకరంబుఁ గీడ్పఱుపఁ బక్షీంద్రుండు చంచద్గతిం
జనియెం దా నురగాభిధాన మగునాశైలంబు వెందిప్పరున్. 229

క. చని యల్పశరీరుం డై, తను నెఱుఁగక యుండ మెలఁగి దానొగ్రగజేం
ద్రునిఁ గాచి నీరి కది వొ,యినయప్పుడు వెనుకఁ జనియె నెలమి దలిర్పన్.

ఉ. దంతి సనంగ భూరిమదధారలగాలి యెతింగి కూర్మ మ
త్యంతసముద్ధతిం గొలని కడ్డపడన్ వెస వచ్చె వచ్చినన్
దంతియు నీరువట్టున నుదగ్రపుఁగోపము సందడింప దు
ర్దాంతసముద్యమం బెసఁగ దానిపయిం గవిసెన్ మహోగ్రమై. 231

చ. కవిసి ఖరంబు లైన[1]మునికాళ్లను వ్రేయఁగ సాము నీరిలో
ను వెడల కుండి కూర్మ మతనుస్థిరతీవ్రనఖంబులం బదా
గ్రవిదళనంబు సేయఁగఁ గరంబున మోఁదఁగ వారణంబు దం
తవిహతి నొంపఁ గచ్ఛపము దారుణ మయ్యె రణంబు భూవరా. 232

ఉ. ఇమ్మెయిఁ బోరిపోరి మది నేపును గోపము నగ్గలింపఁ గూ
ర్మమ్ము గడంగి నీ ర్వెడలి మత్తకరిన్ వడి నాక్రమింపఁగా
గ్రమ్మన రెంటెనిం బొదివి కచ్ఛపమున్ వలకాల వామపా

1. క. చ. జ. మునుఁగాళ్లు.

దమ్మున వారణంబును ముƒదమ్మునఁ బట్టి తగిల్చె గోళ్లలన్. 233

వ. ఇట్టు వినతపట్టి వట్టిన నవి దమయంగంబులు వ్రేరలం బడ నడిచిపడుటయు నతండు. 234

మ. పెలుచన్ గోళుల నొత్తి యగ్గజముఁ దాఁƒబేలున్ వసం బేది మూ
ర్ఛల నొందన్ వెస నెత్తి మేఘయుగళీƒసత్కోల్లసద్దైరికా
చలవైహాయసకేలియో యన నభƒస్సంచారి యై యుబ్బున
గ్గలికన్ దవ్వగఁ బాఱి యొక్కఘనవృƒక్షుం బయ్యెడం దోఁచినన్. 235

ఆ. దానిమీఁద నుండి ƒ వాని రెంటిని భుజిం,పంగ మదిఁ దలంచి ƒ పంచయోజ
నములు నిడుపు గల్గుƒరమణీయశాఖపై, గరుడుఁ డెలమి నెఱఁగెఁƒగురువరేణ్య. 

క. ఎఱఁగినయప్పనుప్రేఁగున, విఱుగుటయును శాఖ చూచి ƒ విహాగేంద్రుఁడు గొం
దఱు మునుల నందుఁ గన్గొని, వెఱపున నాత్మీయచిత్తƒవృత్తి గలంగన్. 237

తే. అవనిఁ బడనీక శాఖఁ జంƒచువునఁ బట్టి
పట్టి వారలసుస్థితుల్ ƒ పల్లటిలక
యుండ వెరవున ధరియించి ƒ యొయ్య నెగయఁ
జూచి యవ్వాలఖిల్యులు ƒ చోద్య మంది. 238

వ. వైనతేయుం డగుట మనంబుల ననుసంధించి కరుణించి. 239

క. ఈతఁడు దక్కఁగ నొరులకు, నీతెఱఁగుబలంబు వెరవు ƒ నేల కలుగు నం
చాతరుశాఖ విడిచి చని, రాతని దీవించి యోగ్య ƒ మయ్యెడు నెడకున్. 240

వ. చనినన్ గరుత్మంతుండు సంతోషించె దదనంతరంబ. 241

ఆ. విపులశాఖ నిచట ƒ విడిచిన నిచ్చటి,జంతుకులము లెల్లఁ ƒ జచ్చు నింక
నేమి సేయువాఁడ ƒ నే నను నెవ్వగ, వుట్టె నవ్విహంగƒపుంగవునకు. 242

వ. అట్టియెడ. 243

తే. నిందితాచారయుతము పుƒళింద దేశ,మంబుధిప్రాంత మీశాఖ ƒ యందు విడువు
మమరవరులపం పిది విహాƒగాధినాథ,యను నెలుంగు నభంబునంƒదావహిల్లె. 244

క. విని సత్వరముగ నట గొని, చని యద్దేశమునఁ గల్గుƒజనములు మృతిఁ బొం
ద నతం డాచక్కటి నా,ఘనశాఖయు నెమ్మనంబుƒకలఁకయు విడిచెన్. 245

వ. విడిచి భరితలీలంబుగా నొక్కశైలంబువిశాలతటంబునకుం బోయి. 246

క. కరికచ్ఛపముల పెన్నె,త్తురుఁ గండలుఁ గ్రొవ్వు మెదడుఁ ƒ దుష్టిగఁ బక్షీ
శ్వరుఁ డాని యధికబలబం,ధురుఁ డై యమృతమున కేఁగెƒదుర్దాంతగతిన్. 247

వ. ఇవ్విధంబున. 248

క. చని దానిచుట్టు మండెడు,ననలంబును జూచి తన్మƒహాత్తరజిహ్వాల్
దనికిన నెఱకలు గమరునొ, యనుతలఁపున బ్రహ్మఁ గాన ƒ నరిగె రయమునన్.

వ. అరిగి తచ్చరణంబులకుం బ్రణతుఁ డై కేలు మొగిచి. 250

చ. వినతకు దాస్య మొందె నొకవెంటఁ దదీయనిరాసహేతు వై
యనఘవిచార నాకు నమృతాహరణంబు విధేయ మయ్యె న
ప్పని మెయి నగ్ని చేత నగుఁ బాటగు నన్నెఱితో భవద్దయా
వననిధి నాశ్రయించుటకు వచ్చితి నార్తశరణ్య కావవే. 251

వ. అనుటయు. 252

చ. అతనికి వత్సలుం డగుట నంబుజగర్భుఁడు వెన్న పై పయిన్
వితతము గాఁగ జిహ్వలకు వ్రేఁ గగునట్లుగఁ జాల వైచినం
బతగవరేణ్య మ్రుక్కఁబడుఁ బావకుఁ డయ్యెడఁ జొచ్చి నీదువాం
ఛితము ఫలింప సత్వరతఁ జేకొను మయ్యమృతంబు నావుడున్. 253

ఆ. ఆత్మఁ బొంగి మ్రొక్కి యతఁ డాలమందలు, పరవు లైనయెడల కరిగి యరిగి
కొండయంత వెన్న గూర్చి వేగమ కొని,పోయి యమ్మహాగ్నిఁ బొదియ వైచి.

గరుడుఁ డింద్రుని జయించి యమృతంబు దెచ్చి కద్రువకుఁ జూపుట.

శా. నీరుం బాయఁగఁ జల్లి రాక్షసులయున్మేషంబు మర్దించి హ్వా
త్స్వోదారుఁ డయోమయం బయినయజ్జాలంబు వే వ్రచ్చి దు
ర్వారస్వైరవిహార మొప్ప నమృతగ్రాహం బొడంగూడుడుం
దారావీథిఁ జనం దొడంగె మగుడన్ దర్పం బెలర్పన్ వడిన్. 255

వ. అంతయు నెఱింగి. 256

మ. అమరేంద్రుండు సముద్ధతిన్ వెడలి దేవానీకముల్ దోష్పడన్
సమరక్రీడకుఁ జొచ్చి పక్షిపతిచే సైన్యంబు లెల్లన్ విధూ
తము లైనం గనుఁగ్రేవఁ గెం పెసఁగ రౌద్రం బైనచిత్తంబుతో
డ మహోదగ్రతఁ బొల్చువజ్రము నవష్టంభోగ్రుఁ డై వైచినన్. 257

క. అది యొకఁడుఁ జేయఁ జాలక, విదళితశైల మగుతనదువిలసన మచటం
గుదియుట దనకుం దెలిసిన, మద మఱి గిరిభేదికడకు మగుడం జనియెన్. 258

క. చేయునది లేక నిర్జర,నాయకుఁడును వెఱఁగుపాటునను మ్రాన్పడుచుం
బోయెం గ్రమ్మఱి ధరణీ,నాయక నిజపట్టణంబునకు దీనగతిన్. 259

చ. అజునియనుగ్రహంబున విహంగమవల్లభుఁ డట్లు సాల న
క్కజ మగుశౌర్యసంపద ప్రకాశతఁ బొందఁగఁ గేలి సల్పి యిం
ద్రజయమహోత్సవంబున సుదాత్తయశఃపరిపూరితంబు లై
త్రిజగములున్ వెలుంగ నలిఁ దెచ్చె సుధారసపూర్ణభాండమున్. 260

తే. తెచ్చి డించి కద్రువ ప్రీతిఁ దేలఁ జూపి
తల్లిచెఱ వాపికొని పొంగి చెల్లునాగ
డమున మగుడ నయ్యమృతభాండంబు దాన

పుచ్చికొని యెడ గలుగంగఁ బోయి నిలిచి. 261

వ. తన్ను వెఱఁగుపడి చూచుచున్న కద్రువ నుద్దేశించి. 262

మ. జననీ నీ వమృతంబు దె మ్మనినయాసత్తోక్తి వాటించి యేఁ
జని నానావిధకర్మకర్మఠుఁడ నై సాధించి వే తెచ్చితిన్
విను నానీయెడఁబాటు సెల్లె జనులన్ విన్పించితిం దెల్లగా
వినతం దోడ్కొని పోయెదన్ మనమునన్ విభ్రాంతి లే కుండుమీ. 263

మ. అని ధర్మస్థితితోన మాటవెర వేపారం దగం బల్కి నే
ర్పునకున్ లోకము మెచ్చఁ గద్రువకుఁ బెంపుం గీర్తియున్ మాయ సొం
పునఁ దల్లిం దనయింటి కన్పి యమృతంబుం గ్రమ్మఱన్ గ్రక్కునం
గొని పక్షీంద్రుఁడు వోయి యింద్రుఁ డెలమిం గూరంగ నిచ్చెం దగన్. 264

వ. ఇవ్విధంబున నౌచిత్యంబు సంస్తుత్యంబుగా నమృతం బమృతాశనపతికి నొసంగి యెసకం బెసంగు తేజంబున విరాజితుం డయి యావృత్రవైరిని నూఱెల నున్న సుర లను మునులను గలయం గనుంగొని. 265

చ. కొడుకులఁ బంచి తె ల్పెసఁగుగుఱ్ఱమువాలమునందు నల్ల గ
ల్గెడుక్రియఁ దీర్చి పన్నిదము గెల్చినకద్రువ నేను మాటమై
నొడిచితిఁ దల్లి దాసి యగు టోర్వక తండ్రియనుజ్ఞ మీ కెరు
ర్పడినదురుద్ధతిన్ మఱచి బాంధవసత్కృతి నాదరింపుఁడీ. 266

వ. అని వెండియు. 267

క. వినుఁ డట్టులు పాపము సే,సినకద్రువసుతులఁ బొదివి చెండుదు మత్తుం
డనితాంతోగ్రవిహారం,బునఁ దండ్రియు మీరు ధర్మమును సాక్షులుగన్.

వ. అని పలికిన నతని నందఱు నభినందించి రమ్మునులు సురలునుం బురందరునితోడ నితనికి నొక్కవరం బొసంగ వలదే యనిన నతండు దలంచికొని దరహసితంబుతో వారల నాలోకించి మనవరంబునకు నాసపడియెదుకొలంచివాఁడు గాఁ డితండు సాత్త్వోద్విష్ణుండుకృష్ణుం డన శూరుఁ డనుయాదవధాత్రీశునకుఁ బౌత్త్రుం డై లోక హితార్థంబుగాఁ జరియింపంగలవాఁ డీమూర్తియు విడువండు వివిధవర్తనంబుల వినోదించుచుండు ననియెఁ దదనంతరంబ సముచితప్రకారంబున నాజంభారిని వారలను దా నామంత్రితులం జేసి. 269

సీ. అజుఁ డుపలాలింప నద్దేవుకావించు,వరభోజనంబులఁ బెరిఁగె నితఁడె
ఘనకాయజవసత్త్వగజకచ్ఛపముల నొ,క్కెత్తున లీలమై నెత్తె నితఁడె
విపులభూరుహశాఖ విఱిగిన మునిహితా,ర్థంబుగాఁ జంచునఁ దాల్చె నితఁడె
సురసేనతోఁ బురందరుని నిర్జించి యు,ద్దీప్తుఁ డై యమృతంబు దెచ్చె నితఁడె

తే. తల్లిదాస్యంబుఁ దనబాస దప్ప కుండఁ, బాపి యానుధ మరల నప్పాకశాస
నునకు దయ నిచ్చె నీతఁడెయనుచుసిద్ధ,సాధ్యు లగ్గింప గరుడుఁడుసనియె మగిడి.

వ. అని చెప్పి భీష్ముండు. 271

క. మానవలోకకలితబహు, లానందకరంబు నిష్కలావ్యయసుఖసో
పానము నగుసౌపర్ణా,ఖ్యానము విని పుణ్యతముఁడ వైతి నరేంద్రా. 272

వ. అనినం బాండవాగ్రజుండు సంతసించి విప్రున కెద్దియేనియు నిచ్చువాఁడుగా నొడంబడి యీనివాఁ డేమిగతిం బోవం గలవాఁ డని యడుగుటయు నతం డతనితో నొకనిదర్శనంబున నది యెఱింగించెద విను మని యిట్లనియె. 273

సీ. ఒక్కసృగాలంబు నొకవానరంబును, బ్రీతిమైఁ గూడి వర్తించుచుండుఁ
దొలుపుట్టువున మానవులును నెచ్చెలులునై, యుండుట గూర్చి నొండొంటి కొక్క
యెడ నొకనాఁ డవ్వానరుఁడు తోడ నా క్రోఁతి, గటకటా నీ కిట్లు గడును హేయ
మైనపీనుఁగునంజు డాహార మైనట్టి,భవము వాటిల్లు టేపాపమున నొ

తే. యనిన జాతిస్మరణవంత మగుటఁ జేసి, యది విషాదముఁ బొంది ధర్మామరునకు
నీ నొడంబడ్డధన మీన కాన యిట్టు, నీచతరజాతియందు జన్మింప వలసె 274

వ. అని తెలిపె నట్లగుటం జేసి యాన గొల్పి విప్రున కియ్య కున్కి యొప్ప దని చెప్పిన నప్పాండవాగ్రజుం డహీనగుణవర్ణ నీయుం డయినహీనవర్ణునకు మంత్రతంత్రాదు లుపదేశించుట ధర్మవిరుద్ధం బయి యుండునొకో యని యడిగిన నయ్యనిమిషనదీనందనుం డీప్రశ్నంబున కుత్తరం బగునది యొకయితిహాసంబు గల దాకర్ణింపు మని యిట్లనియె. 275

### బ్రాహ్మణుఁడు హీనవర్ణునకు వైదికమంత్రంబు లుపదేశింపఁ గూడ దనుట.

సీ. హిమగిరిమీఁద ననేకద్విజులు తప, మాచరింపంగ నయ్యాశ్రమమున
కొక్కశూద్రుండు ధర్మోపేతుఁ డేతెంచి, యమ్మునులకు గురుఁ డగుమునీంద్రుఁ
గని కృప నుపదేశ మొనరింపవే తపో,వృత్తికై నా కని వేఁడుటయును
జనదు వైదికము శూద్రున కుపదేశింప, నీవు శుశ్రూషమై నిలువు మనియె

తే. ననుడు వాఁడు శుశ్రూషకుఁడై వసించె
గుడిసె యొకదెసఁ గావించికొని ముదమున
నతిథిసురపితృపూజ లత్యధికభక్తి
తోడఁ జేయుచు నొక్కింత గీడు లేక. 276

క. నియతియు వినయముఁ జూచిన, దయ పుట్టెడునట్లు గాఁగ ధర్మనిరూఢ
క్రియ లొనరింపఁగ మునిపతి, ప్రియమునఁ గనుఁగొనుటకై యరిగె నచ్చటికిన్.

ఆ. అరిగి యతని చేయునయ్యనుష్ఠానంబు, లోనఁ గానివాని మానఁ జెప్పి
యనఘ యిట్లు సేయు మని యుపదేశించెఁ, గరుణ పేర్మిఁ బుణ్యకర్మగతులు.

క. అతఁడు దానికి నతిసం,ప్రీతాత్ముం డగుచు నడపి పిదపం గాలం
బై తెగి యొకనృపునకు సం,జాతుం డయ్యెను సమస్తసద్గుణములతోన్. 279

క. మునిపతియుఁ దఱిఁ గోడవ. గనుఁగొని యడిగి యాతనికిఁ ద్రికడఁ గా వి
ప్రునకుం బుట్టిన నేపా,ద్యనుపమవిద్యలకు నెల్ల నావాసం బై. 280

చ. పరపడి యక్కుమారకుఁడు పట్టము గట్టి పురోహితత్వమున్
విదితవిభూతితో నొసఁగె విప్రునిపుత్త్రున కవ్విభుండు న
వ్విదివెడుమోముతో నతని నోరలు వాఱఁగఁ జూచు నాతఁ డె
య్యది గత మొక్కొ నవ్వునకు నంచు మదిం దలపోయు భూవరా. 281

వ. ఒక్కనాఁ డవసరంబు గాంచి యప్పురోహితుం డాభూపతునితో దేవా నన్నుం గని నప్పుడు నవ్వెదు నావలన నేమికీడు గల దని యెఱిఁగింపవే యిదియ నాకు వరం బని వేఁడిన నజ్జనపతి దనకు జాతిస్మరత్వంబు గలుగుటం జేసి పూర్వజన్మంబు దెలిపి యక్కాలంబునం దనయనుష్ఠానంబున నేమేని విహితంబు లుపదేశించుట దేట పడం బలికి శూద్రవిషయోపదేశంబునం బరమగతి దప్పి యిప్పాట రాజసేవా త్మకం బై నపౌరోహిత్యంబు నడపుటకై నీకుం బుట్టినలసె నేను బుట్టు వెఱింగి పుట్టినవాఁడ నగుటం (జేసి యెఱింగి) నవ్వెదు నవ్వునకుఁ గతం బింతియ కాని నీ వెండు కల్మషంబు గలవాఁడవే మహాధర్మపరుండవు గుణుంత వాదుష్కర్మం బునకుం బ్రాయశ్చిత్తంబు సేసికొ మ్మని యనేకోపాయంబులం గనకరాసులను నొసం గిన నాభూసురోత్తముండు పురాతనజననకృతం బగుసుకృతంబునం జిత్తంబు నిర్మలం బై యుండు కతంబున నారాజు సెప్పినంత వట్టునుం గలవొలెఁ దనకుఁ దోఁచినం దోషితుం డై దానంబులం దీర్థస్నానంబుల మఱియు జప హోమాదిపుణ్యవిధానంబులం బాపంబులు వాపికొని యాపుట్టువు నీఁగికొని సంయమిసంతానజాతుం డై యెప్పటియాశ్రమంబునం దపం బాచరించి మహా పదంబు నొందెఁ గావున బ్రాహ్మణక్షత్త్రియవైశ్యులకుం దక్కఁ దక్కటివారికి నుపదేశించి బ్రాహ్మణుండు కల్మషభాజనం బగు బ్రాహ్మణాదులకుం బరిపాపూర్వ కంబుగా నుపదేశింప వలయు నని చెప్పిన నప్పుడమిఱేఁడు లక్ష్మి యెట్టిజనంబుల యందు వసియించు నని యడిగిన నాదేవవ్రతుం డతని కి ట్లనియె. 282

## లక్ష్మీనివాసస్థానములు.

క. నారాయణాంకతలమున, శ్రీ రాజిల్లంగఁ జూచి చిత్తం బలివి
స్మేరం బై రుక్మిణి వి,స్తారరుచిరనయన యగుచు సంభావనతోన్. 283

వ. నీ వెట్టిపురుషులయందు నెబ్భంగిభామలపాల వసియింతు వనిన నాదేవి మకర ధ్వజమాతకుం జెప్పినవాక్యంబులయర్థంబు లుపన్యసించెద దాన నీయడిగిన యది దేటపడు నాకర్ణింపుము. 284

సీ. నిత్యసత్యులు శౌచనిరతులు గురుభక్తు, లప్రమత్తులు దక్షు లనులమతులు
సత్కర్మపరులు విజ్ఞానముఁ దపము దా,నము బ్రహ్మచర్యంబు శమముఁ గల్గు
వారలు ప్రీతి నావసియించునిక్కలు, క్రూరు నాస్తికుఁ గృతఘ్నునిఁ గుబుద్ధి

వర్జింతు నెంగిలి ✽ వర్జించి [1]యిలువడి, ఘటశుద్ధి గలిగిన ✽ కాంతలందు
తే. నిల్తు వల్లభప్రతికూల ✽ నిష్ఠురాత్మ, నన్యమందిరగామిని ✽ నధికనిద్ర
యైనమానినిఁ దొఱఁగుదు ✽ నబ్జనేత్ర, లాకతరుపంచపుష్పవా ✽ టముల నిలుతు. 285
వ. అని చెప్పెఁ దత్ప్రకారంబులు బుద్ధిగతంబులు సేసికొ మ్మనిన గురుపతి పురుషుల పురంధ్రులసంగతియందు సంస్పర్శసుఖం బతిశయం బెవ్వరికిం గలుగు నని యడిగిన వియత్తటినీతనూజుం డివ్విషయంబున నొక్క యితిహాసంబు గలదు వినుమని యిట్లనియె. 286

భంగాస్వనుఁ డనురాజు స్త్రీ యై కుమారులం గాంచినప్రకారము.

సీ. అనఘ భంగాస్వనుం ✽ డనురాజు పుత్త్రార్థి, యై వజ్రికప్రియం ✽ బగుమఖంబు
సేసి పుత్త్రుల సవి ✽ శేషుల నూర్వురఁ, గని సంతసంబునఁ ✽ గ్రాలుచుండ
నాతఁడు వేటకై ✽ యరిగినచో వజ్రి, దిగ్భ్రాంతి పుట్టించి ✽ తెరకాఁడు
సనునట్లు సేయ న ✽ జ్జనపతి యెక్కిన, తురగంబుతో నొంటి ✽ దూర మైన
ఆ. కాన కేఁగి తృష్ణ ✽ గదిరిన నలుగడ, నరసి యొక్క పద్మ ✽ సరసి గాంచి
వెన్ను మునుఁగి హయము ✽ నచ్చిరఁ దిగిచి తాఁ, దనివుసొంపు మిగుల ✽ మునిఁగి లేచి.
క. భూనాథుఁడు తృష్ణ సెడం, బానక్రియ యాచరించి ✽ భామిని యై తన్
దాన కనుంగొని విస్మయ, మూనెడుమదితోడ సరసి ✽ నొయ్యన వెడలెన్. 288
సీ. వెడలి చింతించి యా ✽ యొడలితో నేభంగిఁ, దురగంబు నెక్కుదుఁ ✽ బురజనంబు
లేను బోయినఁ జూచి ✽ యేమని తలఁతురో, పోలఁతు లే మనువారొ ✽ పుత్త్రులేమి
గాఁగ నూహింతురో ✽ కానన యుండంగ, వచ్చునే పోవంగ ✽ వలయు నెట్లు
నని విచారించి పో ✽ యిన నెల్లవారును, నాశ్చర్య మందుచు ✽ నంతనంతఁ
ఆ. గనుఁగొనంగ మంత్రి ✽ గణము రావించి దిగ్భ్రాంతిఁ దాను బోయి ✽ [2]పద్మసరసి
యందు మునిఁగి వనిత ✽ యగుట యెఱిఁగించి, రాజ్యమునఁ దనూజు ✽ రాజి నిలిపి.
ఉ. కానకు నేఁగి తాపసులఁ ✽ గాంచి తపం బొనరింప నం దొకం
డానలినాక్షిఁ బొంది ప్రియుఁ ✽ డై నడచెం గ్రమవృత్తి నందనుల్
దానికిఁ బుట్టి రిద్ధబల ✽ దర్పులు నూర్వురు వారిఁ గొంచు న
మ్మానిని పూర్వపుత్త్రకస ✽ మాజముపాలికిఁ బోయి నెమ్మితోన్. 290
వ. తనకు నొక్క తాపసుండు ప్రియుం డగుటయు వానివలన నత్తనయశతంబు జనియించుటయు నెఱింగించి. 291
క. మగతనమునాఁడు మీరు, న్నగువతనమునపుడు వీరు ✽ నాయం దుదయం
బగుటను దోడంబుట్టువు, లగుదురు ధర పంచి కుడువుఁ ✽ డందఱు ననుడున్. 292
క. భ్రాతృస్నేహము గల్గి య, రాతులు భయ మందఁగా ధ ✽ రారాజ్యము సం
ప్రీతి ననుభవించిరి జను, లాతతహర్షమునఁ బొంద ✽ నందఱు నెమ్మిన్. 293

1. క. గ. చ. 'యిలువాడి' 2. గ. పద్మవనమునందు.

తే. దానిఁ గని పాకశాసనుఁ డేను వీని, కహితముగఁ జేయ నిది హితమై ఘటించె
నధికపుత్త్రసమృద్ధి రాజ్యాభివృద్ధి, నిమ్మహీపతిసమ్మదం బినుమడించె. 294

వ. దీని విఘటింపం జేయుదు నని భూసురాకారుం డై వచ్చి పూర్వులం గాంచి. 295

క. ఆరాజకుమారులమతి, నీరసము జనించునట్టు లెక్కడిజనకుం
డేరికి నేనియుఁ బుట్టిన,వారిం దోఁబుట్టువులుగ [1]వల్వం జనునే. 296

వ. అని మఱియు ననేకప్రకారంబులం జెప్పి వార లెఱుంగ కుండ నపరకుమారుల
కడకు [2]నేఁగి యితకరిమాటల మొత్తంబుల వారలచిత్తంబులను గలంచె. 297

క. అనిమిషవరుఁ డివ్విధమున, జనియింపఁగఁ జేసెఁ బగ యసంగతులై వా
రును దెగి యొండొరువులతో, నని బెట్టుగఁ జేసి చచ్చి రందఱు నధిపా. 298

ఉ. చచ్చిన నత్తపస్విసతి సన్నులు మోమును మోఁదికొంచుఁ బై
వెచ్చనికన్నునీ రడర వీడినవేనలితోడఁ బెల్చ వా
పుచ్చి తనూజులం బనుపఁ బొంచి కనుంగొని పోయె విప్రుఁడై
యచ్చటికిన్ సురాధిపతి యాతనిఁ జూచి లతాంగి వెక్కుచున్. 299

ఆ. కరుణ మొగమునందుఁ గనుఁగొని తాను ము, న్నర్థి వేఁటపోవుటాదిగాఁగ
సకలసుతులు నాజిఁ జచ్చుట తుదియుఁగఁ, గలుగువర్తనంబు దెలియఁబలికె.

క. విని యతఁ డే నింద్రుఁడ నా, కనిష్ట మగుక్రతువుఁ జేసి తది హేతువుగా
నినుఁ బఱచితి నిత్తెఱఁగున, ననుటయు సంభ్రమసమేతమైనభయమునన్. 301

క. ఇలఁ జాఁగి మ్రొక్కి యటు తన,యులకై సమ్మోహబుద్ధి నొనరించితిఁ ద
ప్పలఘుదయఁ జూడు నీకేఁ, జలమునకుం బాత్రమే విశాలయశోర్థీ. 302

వ. అని రామ యై యున్నరాజన్యుండు దైన్యంబు దోఁపం బలికిన బలసూదనుండు
ప్రసన్నుం డై. 303

ఇంద్రుఁడు భంగాస్వనునకుఁ గోరినవరంబు లిచ్చి యనుగ్రహించుట.

సీ. ఇచ్చెదఁ గొందఱ నెత్తఱిఁ గాంచిన,తనయుల నొసఁగుదు ననిన నతఁడు
కాంత నై యుండి యేఁ గనినవారల నిమ్ము, దేవ నావుడుఁ దొల్లి నీవుగన్న
ప్రజల నేలడుగవు నిజము సెప్పుము నాకు, ననియెఁ బురందరుం డవ్విభుండు
వెడసిగ్గుపాటుతోఁ బడఁతుల కర్మిలి, బిడ్డలదెసఁ గడుఁ బెద్ద యనిన

ఆ. సత్యవాది వైతి సకలతనూజులు, బ్రదికి నెగడువారు భామినీత్వ
దైన్య ముడిపి పురుషతయు నిత్తు నీకని, పాకశాసనుండు వల్కె నధిప. 304

క. విని యజ్జగతీనాథుఁడు, తనయుల నందఱును నీదుదయఁ బడసితి నే
వనిత నయి యిట్ల యుండెద, ననఘా యివ్వరము నొసఁగు మని పల్కుటయున్.

వ. విస్మితుండై యింద్రుండు దీనికిం గతం బేమి యని యడిగిన నాభంగాస్వనుం
డి ట్లనియె. 306

---

1. చ. జ. వాల్వం. 2. క. నేఁది మతకరిమాటల; చ. వచ్చి యాతకరిమాటల.

క. సురతంబునఁ గడు నెక్కుడు, పురుషులకంటెను సుఖంబు ♦ పొలఁతులకు సురే
శ్వర యట్లగుటను నాకీ, వెరవున రమియించి నిలువ ♦ వేడుక గలిగెన్. 307
ఆ. అనిన నట్టులేని ♦ నేఁ గాక యిమ్మెయి, విపులసౌఖ్య మొంది ♦ విహరణంబు
సలిపి నిలువు మనుచు ♦ శక్రుండు సనియె భం,గాస్వనుండుఁ బ్రీతి ♦ నట్లయుండె.
వ. అని చెప్పి భీష్ముండు పాండవాగ్రజా దీన నీయడిగినయర్థంబు దెలిసికొ మ్మనిన నమ్మనుజపతి బహువిధము లగుధర్మంబులు భవత్ప్రసాదంబున వినుచున్నవాఁడ నివి యెల్లను జన్మమరణాదిదుఃఖంబులం బాపం జాలునే యనేకజననీజనకులకుం బుట్టుచు సంసారచక్రంబునం దిరుగం జాల గర్భవాసం బన నరకం బన భేదంబు గలదె సచరాచరం బైనయిజ్జగం బస్థిరం బట్లుం గాక దీని విషాన్నంబుచందంబు గాఁ గనియెద భవమోక్షణం బగువైష్ణవధర్మం బుపదేశింపవే యిది యీ యుగంబునం దిరోహితం బగుట కృష్ణద్వైపాయనుండు సెప్పె మీ యనుగ్రహంబున నెఱింగెద భవదీయచరణంబులు శరణంబుగాఁ బ్రసన్నుండ నైతి నని ప్రార్థించిన నమ్మహాత్ముండు పగతురం దెగటార్చి పేర్చి పూజ్యం బగు సామ్రాజ్యంబు గైకొని తదీయంబు లగుసుఖంబు లనుభవించుచుండుట గీడుగాఁ జూడఁ గురుకులచూడామణి యగునీకుం జనుఁ గాక యావనస్థు లగురాజ్యపదస్థులతలం పులచొప్పె యిది మిథిలాపతి యగుజనకుండుంబోలెం బలికెద వని యుపలాలించి యమ్మహీపాలున కిట్లనియె. 309
క. పురుషాతిగ యై తోఁచుచు, నిరూపణము సేయ నూఁది ♦ నిర్దేశింపన్
వెరవుపడక శాశ్వతసుఖ,భరితత నిర్వాణ మనఁగ ♦ బడుఁ బ్రకృతి నృపా. 310
క. ప్రకృతులు పెక్కన్నింటికి, [1]నకృత యనం జనినయదియ ♦ యాద్య మహీపా
లక పురుషరూపిణియు నై, వికృతిం బొరయదు వివేక ♦ విజ్ఞాత యగున్. 311
క. విను సంసారపథమునకు, ననురూపతఁ దోఁచు చుండ ♦ నన్యప్రకృతుల్
దనతోఁపు భవనిరాసం,బునకుం గారణము కామ ♦ మునఁ బిహిత మగున్. 312
క. కావునఁ గామక్రోధము, లావిర్భూతములు గాని ♦ యట్లుగఁ దత్స
త్త్వావేశంబున [2]నూన్నము, భావం బివ్విధము విష్ణు ♦ పరత కుమారా. 313
క. నృప వైష్ణవధర్మము ని, కుపదేశించితిఁ బ్రసాద ♦ యుతుఁడ వగుచు సా
రపుఁదెరు వగునిది గనికొని, యపగతసంసారభయుఁడ ♦ వై నడవు తగన్. 314
వ. అనిన విని సంప్రీతుండై ధర్మజుండు భీష్మునితోఁ దత్త్వంబులు నధ్యాత్మంబులు నధిభూతంబులు నధిదైవంబులు ననుసర్వంబునకుం గర్తయు భర్తయు హర్తయు నగుచు సకలభూతంబులుం దన్నుపజీవింపం బెంపారువాని నెఱింగింపవే యనుటయు నతనికి నమ్మహాత్ముం డిట్లనియె. 315

1. గ. నకృతత యనఁ జనిన; అ. నకృతి యనం జనిన. 2. గ. మాన్నము; జ. నుసుప్తము. అ. దనుప్తము 3. క. సనాతనుండును.

క. సనకుఁడు సనందనుండును, సనత్కుమారుఁడు సనత్సుజాతుఁడు నలువుర్
తనయులు బ్రహ్మకుఁ బంచముఁ,డును షష్ఠుండును వసిష్ఠుఁడును శంకరుఁడున్. 316

ఆ. అనఘ విను మరీచి యనఁగ భృగుం డన
నంగిరసుఁ డనఁగ ననంతరంబ
యత్రి యనఁ బులస్త్యుఁ డనఁ బులహుం డనఁ
గ్రతు వనంగఁ బుట్టె సుతచయంబు. 317

వ. ఆసనత్సుజాతుం డంగుష్ఠప్రమాణమూర్తియుం బ్రజ్వలదనలస్ఫూర్తియు నయి లోకంబుల నెందునుం జరియించుచు నొక్కనాఁడు మేరుశిఖరంబున నారదుఁడు సన్నిహితుం డగుటయుఁ దదీయసల్లాపసౌఖ్యం బనుభవించు చున్నయెడ నిట్లపోలె నడిగిన నారదునకు నమ్మహాయోగీశ్వరుండు సెప్పినవాక్యంబు లితిహాసరూపం బునం జెల్లునవి యుపన్యసించెద భవత్ప్రశ్నంబున కుత్తరం బగు నాకర్ణింపుము.

**సనత్సుజాతుండు నారదున కుపదేశించినతత్త్వప్రకారము.**

క. దశకల్పసహస్రంబులు, నిశ యింతియ దివస మిది సునిద్రారతికిన్
విశదప్రబోధమునకు, న్వశగతకాలములు విష్ణునకు విమలమతీ. 319

క. అవ్యక్తం బనఁగాఁ దన,దివ్యాత్మన కలిగి యుండు ధీసారనిధీ
భవ్యాత్ము లభేదస్థితి, నవ్యాహతదృష్టిఁ గాంతు రయ్యమళమ్మున్. 320

వ. అప్పరమేశ్వరుండు. 321

క. రే నిద్రించుఁ బ్రభాతం, బైనన్ మేల్కని సృజించు నంబువులఁ దగం
దా నం దిడుఁ దనవీర్యము, దాన మహాండ మగు హేమతాన్స్ఫురితం బై. 322

వ. తదనంతరంబ. 323

తే. బ్రహ్మఁ గల్పించి దానికిఁ బతిఁగఁ జేయ
నమ్మహాత్ముఁ డహంకార మావహించి
మనసుఁ బదియింద్రియములు బుద్ధిని ఘటించి
చదలు మొద లగుభూతపంచకముఁ జేయు. 324

వ. అయ్యాకాశపవనాగ్నిజలభూము లగుభూతంబు లేనింటికి గుణంబులుగా శబ్దస్పర్శరూపరసగంధంబు లావహించుం గ్రమంబున దేవమునిదానవగంధర్వకిన్నర నరాదిజంతుజాలంబులం గల్పించు నన్నియు నహంకారవ్యాప్తంబు లయి యవ్యక్తసాగరంబున మగ్నోన్మగ్నంబు లగుచుండు. 325

క. విభుఁ డావిష్ణుం డేత,త్ప్రభవస్థితివిలయముల శుభము నశుభంబుం
బ్రభు వై తగఁ గాంచి నడపి, విభవ్రోజ్జ్వలకేలి సల్పు వినుము మహాత్మా. 326

తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము, లింద్రియంబు లహంకార మిద్ధతేజ
మనము బుద్ధి యవ్యక్తంబు సమహితవేద,వేద్యతత్త్వంబు లీచతుర్వింశతియును.

వ. అధ్యాత్మాదులు సెప్పెద నాకర్ణింపుము. 328

సీ. శ్రోత్ర మధ్యాత్మంబు సూవె శబ్దం బధిభూతంబు [1]దిక్కులు పురుషముఖ్య
యధిదైవతముల్ చర్మ మధ్యాత్మ మందలి [2]సంస్పర్శ మధిభూతసంజ్ఞకంబు
దానికి నధిదైవతంబు [3]విద్యుత్తు నేత్రంబు దా నధ్యాత్మకంబు రూప
మధిభూత మాదిత్యుఁ డధిదైవతము జిహ్వ యధ్యాత్మకము రస మారయంగ
తే. దానియధిభూత [4]మప్పతితదధిదైవతంబు ఘ్రాణ మధ్యాత్మంబు దలఁప గంధ
మనఘ యధిభూత మగుఁ దదీయాధిదైవతంబు [5]మారుత మంద్రు విద్వజ్జనమ్ము.
వ. ఇది బుద్ధీంద్రియప్రపంచంబు. 330
సీ. పాదపాయూపస్థపాణివాగ్వర్గంబు, కర్మేంద్రియము లివి నిర్మలాత్మ
యధ్యాత్మములు వాని కగు నధిభూతముల్, గంతవ్యమును విసర్గంబు నోలి
నానందమును విను మనఘ కర్తవ్యవక్తవ్యంబు లన నధిదైవతములు
వానుమిత్రప్రజాపతిశక్రవహ్నులు, మఱి యహంకారంబు మనను బుద్ధి
తే. పూజితాధ్యాత్మకము లధిభూతవృత్తి
వెలయు నభిమానమంతవ్యములును నిశ్చ
యంబు నధిదైవములు వేధ యమృతకరుఁడు
బ్రహ్మ మిది వేదవాక్యనిర్ణయవిధంబు. 331
✓క. ఇవి యెల్ల విష్ణునందు ద్భవము లయముఁ బొందుచుండు బహువీచిక ల
ర్ణవమునఁ బొడమి యడఁగుమాడ్కి విశేషము గల్గ దతనికిన్ విభుఁ డగుటన్.
క. విను మవ్యక్తం బనఁగాఁ, జను మూలప్రకృతి పురుషచైతన్యము నె
క్కొనినం జేతన యగుచు భువనతంత్రం బెల్ల నడపు వైభవ మెసఁగన్. 333
ఆ. [6]అట్లు లోకకర్త యగునంబుజాక్షుండు, పట్టుఁగొమ్ము భావభవహరుండు
హరునియనుమతమున నఖిలాబ్జజాండంబు లట్లు పుట్టఁ జేసి యడఁచుచుండు.
వ. ఇట్లు సెప్పి సనత్సుజాతుండు నారదుం జరితార్థుం జేసె నని చెప్పి భీష్ముండు
భీమాగ్రజుతో వెండియు. 335
ఉ. ఇంతకు మూలమై యిరువదే నగుతత్త్వ మనంగ వేదవే
దాంతపురాణవేద్యుఁ డగునప్పురుషుండు వెలుంగు వాఁడ కా
లాంతకుఁ డైనయచ్యుతుఁ డనంతుఁడు యోగిజనాంతరంగవి
శ్రాంతుఁడు విష్ణుఁ డద్వయుఁ డసంగుఁడు కౌరవవంశదీపకా. 336
వ. అనిన విని యజాతశత్రుండు సరిత్పుత్త్రునితో నియతు లయి యగ్నులు దమ
యంద సమాహితంబులు సేసికొని మహాత్ములు నిజాత్మల నప్పరమాత్ము నెట్టి
వానింగా భావింతు రెఱింగింపవే యనుటయు నతనికి భీష్ముం డిట్లనియె. 337
క. అమృతోత్పత్తిసమయమున, నమరులకును దానవులకు నని వాటిలె నం

1. చ. వాయువు; జ. దివియును. 2. క. స్పర్శన మధిభూత. 3. అ. మరుత్తు. 4. క. ముడుపతి; అ. ముదకము. 5. అ. మేదిని యంద్రు. 6. ఈపద్యము వ్రాఁతప్రతులలో లేదు.

దమరులు డప్పిం జేడ్పడి, కమలభవుని నాశ్రయింపఁగా నియతిమెయిన్. 338

వ. అతండు నారాయణు నాత్మయందు నిలిపి. 339

తే. భక్తవత్సల పరమాత్మ పద్మనేత్ర, సర్వభూతమహేశ ఋక్సామయజురు
పాస్య సాధుసంరక్షణపరవిహార, సురలు రిపులచే నలఁగిరి శరణ మగుము.340

వ. అని సంస్తుతిపూర్వకంబుగాఁ బ్రార్థించె నట్టియెడ. 341

క. జలదస్వనసన్నిభమై, యెలుఁగొక్కటి సదలఁ జెలఁగె నే నిదె మిమ్ముఁ
గెలిపింపఁగ వచ్చితి నను, విలసద్వర్ణములు గాఢవిశదంబులు గాన్. 342

వ. తదనంతరంబ యకుంఠితవిక్రముం డగువైకుంఠుండు. 343

క. గరుడారోహణలీలా, సరభసుఁడై చక్రగదలు శార్ఙ్గముఁ జంచ
త్కరముల వెలుంగ నదరి య,సురగణములఁ ద్రుంచె సురలు చోద్యం బందన్.

వ. ఇట్లు నిర్జించి తత్క్షణంబ యతం డంతర్ధానంబు నొందిన సంతసంబును నచ్చెరు
వును బెనంగొనుడెందంబులతో బృందారకబృందంబు లిమ్మహాత్ముం డెవ్వం డేమి
భంగివాఁ డెఱింగింపవే యని యడిగిన నజుం డితండు విష్ణుండు వైకుంఠాభిధానం
బగుమూర్తివిశేషంబున విహరించె విష్ణునివిధం బిట్టి దని యెఱుంగను నెఱింగిం
పను శక్యం బగునే యయిన నొక్క తెఱంగునం దెలిపెడునట్టియితిహాసంబు
గలదు వినుం డని పలికి వినిపించె ధర్మనందనా యానిర్మలవాక్యంబు లుపన్య
సించెద దాన నీయడిగినయర్థంబు దేటపడు నాకర్ణింపుము. 345

గరుత్మంతుండు మునులకు విష్ణుదేవునిమహిమాతిశయంబు సెప్పుట.

సీ. హిమగిరిమీఁద ననేకమునీంద్రులు, సిద్ధులుఁ గూడి గోష్ఠీసుఖంబు
ననుభవింపఁగ లీల నచటికి వచ్చి సు,పర్ణుండు వారికిఁ బ్రణతుఁ డగుడు
వా రభినందించి గారవంబున సుఖా,సీనుఁ గావించి యర్చించి ప్రీతి
నతనితో సల్లాప మాచరించుచు నుండి, యొక్కటి యడిగెద ముజ్జ్వలాత్మ

తే. యనిన నాతండు ధన్యుండ నైతి మీర, లెద్ది యడిగెద రేను నాయెఱిఁగినంత
యతులమతులార చెప్పెద ననుడు వార, లెలమి నవ్విహగేంద్రున కిట్టు లనిరి.

క. ప్రియభక్తుండవు భక్త,ప్రియుఁడును విష్ణుండు నీవు ప్రియుఁడై భక్తుం
డయి వర్తిం తావిభుకడ, దయఁ దెలియఁగఁ జెప్పవే యతని తెఱఁ గెల్లన్. 347

వ. అని యడిగిన నతండు వారల కి ట్లనియె. 348

క. స్థూలప్రకారమున నీ,త్రైలోక్యము గావఁ బూని దయ సిగు రొత్తన్
లీలఁ బ్రవర్తింపఁగ మన, మాలోకింతు మది గనుట యన వచ్చునొకో.349

ఉ. ఏనును మీరు నేల మఱి యెవ్వరు దక్షులు విష్ణుచందముం
బూని యెఱుంగ నవ్విభుఁడు భూరిదయారతి నాకు నేర్పడం
దాను మహాద్భుతంపుఁజరితంబులు సూపుచు భాషణామృతం

బానఁగఁ జేసె నాచెవుల నవ్విధముం దెలియంగఁ జెప్పెదన్. 350

సీ. అమరేంద్రు నిర్జించి యమృతంబు గొనిపోవు, నప్పుడు మీ తెంచె నాకసమున
మెచ్చితి విహగేంద్ర యిచ్చెద వరము నీ, కనుమాటయది విని హర్షమెసఁగ
నెవ్వారో యెఱుఁగ నిన్నెఱిఁగించి మఱి వర, మిమ్మంటి దానికి నెలమి నగుచుఁ
గాలంబుతోఁ గూడఁగా నెఱింగెదవు వా, హనమవు గమ్ము నా కనుచుఁ బురుషుఁ

తే. డొక్కఁ డుజ్జ్వలతేజోమయుండు దోఁచి, జరయు మరణంబు లేక యసురలసురల
నోర్వఁ జాలినబలముతో నుల్లసిల్లు, మని వరంబిచ్చె నిచ్చిన నధికభక్తి. 351

వ. ఏను దండప్రణామం బాచరించి. 352

క. నీవాహన మయ్యెద రథ, మీ వెక్కెనఁ గేతు వై వహింతుఁ బెనుపు నా
కీవరము నిచ్చి మనుపుము, నావుడు నవుఁగాక యని మనగప్రియ మెసఁగన్.

వ. పలికి యంతర్హితుం డయ్యె నంత సంతసంబు నచ్చెరువునుం బెరయుమనంబుతో
మదీయజనకునిపాలికిం జని యీవృత్తాంతం బెఱింగించిన నతండు వికసిల్లుచు నా
వదనంబు వీక్షించి ధన్యుండ వైతి వమ్మహాత్ముండు నారాయణుండు నీవలనియను
గ్రహంబున సల్లాపసౌఖ్యంబుఁ బ్రసాదించెఁ దపంబున నేకయోగసమాధినవలం
బించి యేను దన్నెఱుంగుటం గోరి యారాధించిన నాకు నీలశ్వేతపీతారుణపింగ
ళంబును బహూదరపాదపాణిశిరోనేత్రంబును నైనదివ్యగాత్రంబు సూపిసంగంబు
గలయంతరంగంబున నన్నెఱుంగ వచ్చునే నిస్సంగుండ వై యెఱింగెదవుగాక
యనియె నట్టియవ్విశ్వరూపునకు శాశ్వతపరిచర్య సేయం గలవాఁడ వగుటం
గృతార్థతం బొందితి బదరికాశ్రమంబున కరిగి యచ్చట సకలలోకసేవ్యుం డగునా
భవ్యమూర్తి సేవింపు మని యానతిచ్చిన నయ్యెడకు ముదంబునం బొదలుచుం
బోయి. 354

సీ. అచట నారాయణు నచ్యుతు హరిఁ బుండ, రీకాక్షు గోవిందు లోకజనకుఁ
గని భక్తిఁ బ్రణమిల్లి వినుతి సేయంగఁ బీ, తాంబరకలిత మై యష్టభుజము
శంఖచక్రగదాసిశార్ఙ్గధరంబును, నైనరూపము దాల్చి యవ్విభుండు
సిఱునవ్వుతోడ వచ్చితి మేలు సేసితి, రమ్మంచుఁ దా నుత్తరంపుఁదూర్పు

తే. దెసకు నల్లన పోవఁ బెంపెసఁగఁ గడఁగి, పాఱవలయు నాకెమ్మెయి బహుసహస్ర
యోజనంబులు నని వితతోజ్జ్వలాగ్ని, యద్భుతముగ ననింధన మై వెలుంగ.

వ. కని యప్పావకుం బావకద్యుతి యగునమ్మహాయోగి ప్రవేశించి యందు శివా
సహితుం డై శివుఁడు తపంబు సేయఁ దదీయసంవిత్సౌఖ్యం బనుభవించి య
య్యనలంబు గడచి యరుగుచుండ నేనును బధిశ్రమాభిభూతుండ నగుచు విడువక
వెనుకఁ బోవుచుండితి నిట్లు మఱియునుం బెద్దయు దవ్వు సని యద్దేవుండు భా
స్కరకిరణంబులకుం బ్రవేశంబు లేనిమహాతమంబు సొచ్చె నచ్చటం జూడ్కి సెడి
మూఢత్వంబు నొంది. 356

క. ఆదేవుఁ జిత్తమున నిడి, యాదిపురుష కరుణ నన్ను నరయు, [1]మోచటికో
యేది గతియొ నా కనఁగా, నీదెస రమ్మనుచుఁ దీపు వెలుఁగుం జూపెన్. 357

క. మది ఖేదము మై డప్పియుఁ, గదిరిన నే శరణు వేఁడఁగాఁ దను మెల్లం
మది వోయి లేక తక్కెను, హృదయానందకర మైన యెడ నై యుండెన్. 358

తే. పట్టపగలింటిసూర్యుని పగిది నతఁడు, దోఁచె సూర్యేందుతారకద్యుతుల కచటు
గోచరము గాదు దేవతాకోటి యాది, నైనజంతువులకు నగమ్యస్థలంబు. 359

క. దుందుభినిస్వనములు నా, నందనమృదుమధురగీతనాదములుఁ జెవిం
బొందె మకరందబిందు,స్యందికమలసుభగనదులు నచ్చటఁ దోఁచెన్. 360

క. సురలకు నిమ్మెయిఁ దేజ,స్స్ఫురణము లే దన్నయట్టిపోలుపున వెలుఁగన్
సరులం గొందఱఁ గాంచితిఁ, దరుణులనుం గంటి నద్భుతతమాకృతులన్. 361

తే. వారు పూజ లొనర్పంగ గారవంపుఁ
జూడ్కి నద్దేవుఁ డందఱఁ జూచు చరిగె
మఱియు నట తత్ప్రదేశంబు మహితవహ్ని
మయతఁ జేసి భయంకర మయి వెలింగె. 362

వ. అచ్చట నే నతనిం గానక. 363

క. భ్రమ గొని యద్దేవునిఁ జి,త్తమునం దిడి శరణు శరణు దయఁ గావుము స
న్నమితైశ్వర్య యనుడు శీ,తమధురలలితాక్షరముగఁ దా నిట్లనియెన్. 364

క. నిను నే మఱతునె నీ దగు, జనకునిచే నన్ను విని సుసంగతమతి నై
చను దెంచు టే నెఱుంగనె, వినతాసుత యిందు రమ్ము విడువుము భయమున్.

వ. నన్నుం గానమికిం గలంక వలవదు. 366

క. మమకారాహంకారము,ల మతిం జొరనీక నిశ్చలం బగుచూడ్కిన్
[2]సమవేతరూపు నన్నిన్, శమభరితాత్మకులు గంద్రు సారవిచారా. 367

తే. నీవు నామీఁది వేడుక నెఱయ నిష్ఠ,తోడఁ దలఁచుట మామకస్థూలరూప
దర్శి వై యుండు దనినన్ను దయ దలిర్ప, గారవించిననసలంబు క్రందువాసె. 368

వ. ఇవ్విధంబున సుఖం జేసి ననుం గొల్పించుకొని మఱియు దవ్వ సని యాకాశంబున
కెగసిన నేనుం దోన తగిలి పోవ నంతర్ధానంబు సేసె నిట రమ్మను నెలుఁగ యాధా
రంబుగా నాచక్కటికిం బోయి. 369

క. కమనీయహంసకులసం,గమశోభిత మైనయొక్క కమలాకరముం
బ్రమదమున దాన నవగా, హము సేయుచు నున్నతన్ను నచటం గంటిన్. 370

క. నాదిక్కు గనుంగొని తా, నాదరమునఁ బిల్చె నేను [3]నచటికిఁ జని యం
దా దేవునిఁ గానమికి వి,షాదం బందుమదితోడఁ జంచలదృష్టిన్. 371

చ. కలయఁగఁ జూడ నద్భుతము గాఁగ ననేకశతాగ్నిహోత్రముల్

---

1. గ. మోచటికిం బోదు గతి యెద్ది యనఁగా. 2. జ. సముపేతరూపు. 3. చ. నరిగితిఁ జని.

వెలుఁగుట గాన వచ్చె బహు వేదరవంబులు వింటిఁ దత్ప్రవ
క్తలఁ బొడగాన నట్టియెడ దారుణరూపసుపర్ణసంఘముల్
బలువిడి నాపయిం గవిసె భ్రాంతుఁడ నైతి భయంబు పెంపునన్. 372

ఆ. అట్లు భయముఁ బొంది యచ్యుత శివ సహ,స్రాక్ష వేదమయ యనాదినిధన
త్రిభువనైకనాథ త్రినయన గోవింద, పద్మనాభ హర కృపావిధేయ. 373

క. అని మఱియుఁ బెక్కుపేర్లన్, వినుతించుచు శరణు వేఁడి వినతశిరస్కుం
డును ముకుళీకృతహస్తుం,డును నై యేనుండ దేవుఁడు ప్రసాదమునన్. 374

క. తనుఁ జూపి యోడ కోడకు, వినతాసుత యనియె నపుడు వినుఁ డే మొదలం
గనినబదరికాశ్రమ మ,య్యె నచటు విష్ణుని ప్రభావ మే మన వచ్చున్. 375

ఉ. అప్పరమేశ్వరుండు లలితాష్టభుజం బగురూపు దాల్చి తా
నెప్పటియట్ల నిల్చెఁ గని యేను మనంబున నద్భుతంబుతో
ముప్పిరి యైనకౌతుకము మోదము నెక్కొన నాకు సత్కృపం
జెప్పెడుఁగాక యెట్లు నని చేరితి నంజలి మౌళిఁ జేర్చుచున్. 376

వ. చేరి వినయావనతుండ నయి దేవా యేను భవత్పాదభక్తుండనేని నీదయకు భాజనంబనేని నాకు వినం దగునేని దురధిగమసారం బైనభవదీయప్రకారం బిట్టి దని యెఱుంగునట్లుగాఁ జెప్పవే యనిన నాసర్వలోకశరణ్యుండు కారుణ్యామృతమయం బైనచూడ్కి నామీఁద నోలయ నిట్లనియె. 377

విష్ణుదేవుఁడు గరుత్మంతున కుపదేశించినయాత్మతత్త్వప్రకారము.

సీ. అనిమిషగంధర్వదనుజు లాదిగ నెవ్వ,రును విను నాయున్నరూ పెఱుంగ
రఖిలభూతములు నాయం దుద్భవించు వ,ర్తించు లయించు వర్తింప నేను
వానివశంబున వసియింతు సర్వంబు,నందును నాతత్త్వ మధిగమింప
నగు నగ్ని యాత్మ సమాహితంబుగఁ జేయఁ, గామవర్జిత మహంకారవిముఖ

తే. మజడ మపరిగ్రహం బహింసాను మోది, క్రోధరహితంబు నిర్మలబోధయుతము
నిత్యతృప్తంబు శాంతంబు సత్యభక్తి, యైనచిత్తంబు గలనియతాత్మకులకు. 378

వ. సాంఖ్యయోగయుక్తులు బహిర్దర్శను లై నిశ్చయరహితు లై రేని నస్మదీయ తత్త్వంబు గాన నేర రది మోహపంకమగ్నులగువారికి నుపవాసంబుల నియమంబుల వ్రతంబుల నెఱుంగ శక్యంబు గా దేకాంతికధ్యానపరుల కెఱుంగుట గలుగు రజస్తమోదూషితంబు గాక కేవలసత్త్వాధిష్ఠితం బయినజ్ఞానంబున నన్నవలంబించునది సూక్ష్మసరణి వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధనామంబులం జతుర్విధంబుల విభక్తుండ నై ప్రాణులయం దాత్మబుద్ధ్యహంకారమనోరూపవ్యాపకత్వంబు నొంది యుండుదు నిట్టిది మదీయస్థూలప్రకారంబు కశ్యపనందనా నీవు మన్మనస్కుండవు మద్భక్తుండవు మత్పరాయణుండవు నై మత్స్వరూపవేది వగు మనియె నని చెప్పి సుపర్ణుండు. 379

క. పురుషవరులార యద్భుత,తర మగుహరిదివ్యచేష్టితము నాకుం ద
త్కరుణం గోఁచినయట్టిది, పరిపాటిని మీకుఁ దేటపఱచితి భక్తిన్. 380

వ. అనిన విని యమ్మునిసిద్ధజనంబులు పరమాదరంబున నప్పుష్కి దేవు దీవించి యా
మంత్రణంబు సేసి హర్షోత్కర్షంబునం జిత్తంబులు జొత్తిల్లఁ దమలోన. 381

సీ. అక్కజం బగుచున్న యిక్కథ యితనిచే,విని కృతార్థుల మైతి మనిరి మఱియుఁ
బుణ్య మాయుష్యంబు భూతిప్రదము భక్తి, విననవిప్రుఁడు వేదవిద్య పెంపు
నృపవైశ్యశూద్రు లనుపమానజయధన, సౌఖ్యంబులను గంద్రు సర్వజనుల
కిహపరసిద్ధుల కిది సాధనం బగు, నని పల్కి యాత్మేచ్ఛఁ జనిరి దీని

తే. బ్రహ్మ సురలకుఁ జెప్పినభంగి వసువు, లవనిసురు లగు వచ్చి మాయమ్మపాల
నున్న నా కర్థిఁ జెప్పి రయ్యున్నరూపు, నీకుఁ జెప్పితిఁ గురుకులనృపవరేణ్య. 382

వ. అని చెప్పి దేవవ్రతుండు వెండియు నిట్లనుఁ బాండవాగ్రజా వైకుంఠసుపర్ణ
సంవాదం బగునీయాఖ్యానంబునకు నభిప్రాయం బాకర్ణింపుము. 383

తే. వివిధసంకల్పయజ్ఞముల్ విడిచి యాత్మ,యందు నిష్ఠమై నగ్ని సమాహితముగఁ
జేసి నిస్స్పృహుఁడై విష్ణుఁ జిత్తవృత్తిఁ, జేర్చువాఁ డవ్యయస్థితిఁ జేర నేర్చు.

వ. అని యిట్లు భీష్ముండు విష్ణుస్వరూపజ్ఞానప్రకారం బితిహాసరూపంబున ధర్మజు
నకుం జెప్పె నని చెప్పిన నప్పురుషవరులయడుగుటలును జెప్పుటలును లోక
హితంబులై యింత యొప్పి యుండునే యటమీఁదిసంభాషణవిశేషంబులు
సెప్పు మని యడుగుటయు. 385

చ. మునిహృదయాబ్జశాంతిమధుమోదవినోదిమరాళ గాథచ
క్రనిహతశూలనిర్మథితరాక్షసయూథ నితాంతభక్తిభా
వనరమణీయ [1]వేదపరివాదనిరర్గళసేవనీయ ని
త్యనిరుపమాననిర్మలనిరంజనఖేలన ధర్మపాలనా. 386

క. [2]సదయాపాంగా పరిణా,మదశాసంగమనిరాస మధురతమాంగా
మదశోకరహితచేత,స్సదనా సంజనితసముపసంహృతమదనా. 387

మాలిని. గరుడవృషపతాకా కల్పితాశేషలోకా
సురపరిషదుపాస్యా శుద్ధసంవిద్వికాస్యా
పరమమహిమసీమా భవ్యకారుణ్యధామా
నిరతిశయగుణాలీ నిష్కలానందశాలీ. 388

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబునయానుశాసనికపర్వంబు
నందుఁ బ్రథమాశ్వాసము. 389



1. గ. వేదపరిపాకనిరర్గళ-చ. దేవపరివారనిరర్గళ. 2. గ. సదయాపాంగపరిణామదశా.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అనుశాసనికపర్వము, ద్వితీయాశ్వాసము.





మయవక్షస్తలగా
రీమయవామార్ధ బం॰ధురీకృతసౌంద
ర్యామృతరస కీర్తనవి
ద్యామయ నిగమాంతవేద్య ॰ హరిహరనాథా 1

### అష్టావక్రుం డనుమునికుమారునిచరిత్రము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు నారాయణస్వరూప నిరూపణప్రకారంబు విని యజాతశత్రుండు సంజాతప్రీతుండై పితామహుతోఁ గన్యాదానంబునకు వరుం డెట్టివాఁడు గావలయు ననుటయు నక్కురువంశవరుం డీవిషయంబున నొక్కయితిహాసంబు గలదు విను మని యమ్మానవపతియాననం బాలోకించి. 2

సీ. అనఘ యష్టావక్రుఁ ॰ డను బ్రహ్మచారిస, త్తముఁడు వదాన్యుఁ డ॰న్తాపసోత్త
మునికూఁతు సుప్రభ॰యనుకన్యఁ బెండ్లిగాఁ, గోరి యాతని నడు॰గుటయునతఁడు
నీవు యోగ్యుండవు ॰ నీ కిత్తు నాపుత్రి, నంతకు నుత్తర ॰ మరిగి రమ్ము
నావుడు సంయమి॰నందనుం డెందుల, కరుగుదు నేపని ॰ యాచరింతుఁ

తే. బనుపు మనుడు వదాన్యుండు ॰ ధనదుపురము
గడచి హిమగిరి కరుగుము ॰ మృడునిగుఱిచి
గిరిజ తప మొనరించె న॰గ్గిరితటమునఁ
దత్ప్రదేశంబు పుణ్యంబు ॰ దానియందు. 3

క. ఆడుచుఁ బాడుచు గణములు, గూడి చరింపంగ గిరిజ॰కుం బ్రియముగఁ దా
వేడుక నమ్మృడుఁ డెప్పుడుఁ, గ్రీడించుచు నుండు మునులు ॰ కీర్తింపంగన్. 4

ఆ. అది పవిత్రదేశ ॰ మచ్చటు సూచుచుఁ, గడచి చనఁగ నీప॰కాననంబు
గాన వచ్చు నందు ॰ గట్టిప్రాయమునది, పుణ్యమూర్తి యమల॰బుద్ధి యోర్తు. 5

క. వసియించు నమ్ముదితఁ బ్రియ, మసలారఁగఁ గాంచి వచ్చు నప్పుడ ప్రమదం
బెసఁగఁగఁ బెండ్లి సేసెద, నసదృశరూపగుణవర్తనాన్వయవిద్యా. 6

సీ. అనిన నష్టావక్రుఁ డట్ల కా కని చని, బాహుదాతీరభూభాగవర్తి
యై రాత్రి గడపి ధనాధీశు ప్రోలికి, నరుగంగ నతఁ డమ్మహాత్ము రాక
విని యెదురేతెంచి వినయంబుతోడఁ దోడ్కొని పోయి మహితపూజన మొనర్చి
యూర్వశి రంభ తిలోత్తమ మొదలగు, నప్సరోవనితల యాటపాట

తే. లాదిగాఁ గలవివిధవినోదకృతుల, ననుదినంబు నారాధింప నందు నిల్చె
నమ్మునీంద్రుండు దగులు లే కభిమతప్రవర్తనంబుల నొక్కసంవత్సరంబు. 7

వ. పదంపడి ధనదుండు నీ కేమి సేయవలయుం జేసెదం జెప్పుమనిన నతండును సర్వం
బును సంపన్నంబ నీవు నిత్యసంపద నున్నతుండ వై యుండు మే నొక్కమునిపతి
సెప్పినపనికై పోయెద నీతోడి వేడుక నిల్చితి నింతియ కాని నా కభ్యర్థనీయం
బొండు లే దని పల్కి యట వోయి. 8

సీ. హిమశైలతట మెక్కి యీశ్వరక్రీడన, స్థలిఁ గాంచి మ్రొక్కి ప్రదక్షిణముగఁ
జని యట యరుగంగ మునివరు చెప్పిన, కడిమి లేమ్రాఁకుల యడవి దోఁచె
దానిఁ బ్రవేశింపఁగా నందు మణిహేమ, మయచిత్రరమ్యహర్మ్యము లనేక
ములు గాన వచ్చె నుజ్జ్వలసమున్నతరమ్య, హర్మ్యంబు వానిలో నధికవిభవ

తే. సార మై యున్నఁ జూచి తద్ద్వారభూమిఁ, జేరి లోనికిఁ దనపేరు సెప్పి పుచ్చఁ
గన్యకలు పఱతెంచిరి కాంతిరూప, విలసనము లొప్పఁ గొందఱు వినయ మెసఁగ.

వ. పఱతెంచి పరమాదరంబునం దోడ్కొని పోవునప్పు డప్పొలఁతుల యొప్పు సూడ్కుల
కుం జిత్తంబునకు వేడ్కలు సేయం జాలినను లోలత్వరాహిత్యంబున నత్యుదా
త్తుం డగుచుం జని యభ్యంతరమందిరంబున వివిధరత్నరశ్మివిరాజితం బైన పర్యం
కంబున నార్యమూర్తియు ధవళవసనాంగరాగయు రుచిరాభరణభూషితయుఁ బ్రౌ
ఢవయస్కయు నగు నొక్కవనితం గని మే లయ్యెడు మనుచు నిలిచిన నయ్యిందు
వదన యిందు రం డని పలుకుచుం బ్రత్యుత్థానంబు సేసి. 10

క. అమ్మునివరు నాపర్యం, కమ్ముపయిం బ్రీతి నునిచి గారవమునఁ బా
ద్యమ్మును నర్ఘ్యము శ్రుతివిహి, త మ్మైనవిధమున నిచ్చి తత్పార్శ్వమునన్. 11

వ. వే ఱొక్క సెజ్జం గూర్చుండె నమ్ముని గలయం గనుంగొని యక్కన్నియల విభ్ర
మవికారంబులు దనలోచనంబులకు గోచరంబు లగుటకు నొల్లక యిమ్మదవతీజనం
బు లిచ్చట నేల యనిన నక్కాంత యక్కన్యల నెల్లం బోవం బనిచి సముచిత
సల్లాపంబులు సేయుచుండె రాత్రి యగుటయు. 12

### ఉత్తరదిశ యష్టావక్రుని చిత్తశుద్ధిఁ బరీక్షించుట.

క. సీ తయ్యె ననుచు నల్లన, యాతనిశయనమున కరిగి యతఁ డెడ యీఁగా
నాతల్పంబున నొకదెసఁ, బ్రీతహృదయ యై శయించెఁ బృథ్వీనాథా. 13

క. పదపడి నయమున మెయిమెయిఁ, గదియించి లతాంగి చిక్కఁ గౌఁగిటఁ జేర్పం
[1]గదలనిచిత్తము గలిగియు, మద మేమియు లేక యతఁడు మ్రానై యుండెన్.

ఆ. అట్టు లున్నఁ జూచి యత్తన్వి మగవారు, భోగపరులు దాల్మి పొలఁతులందుఁ
గలుగు నవ్విధంబు గాక యేఁ గోరంగ, ననుభవింప కునికి యగునె నీకు. 15

క. సంపదయు దివ్యభోగము, నింపారఁ బరిగ్రహింపుఁ డే మీధన మై
పం పొనరించెద ననుఁ గా,రింపక కైకొని [2]వరింపరే యిచ్చోటన్. 16

సీ. అనిన నష్టావక్రుఁ డతిదూష్య మగుపర,దారాభిగమనంబు దగదు శూద్ర
సతి యైన నధికదోషంబు బ్రాహ్మణపత్ని, యగునేనిఁ బాతక మప్రమేయ
మదియును గాక నే నస్ఖలితబ్రహ్మ,చర్యంబునం దుండి భార్యఁ గోరి
యున్నాఁడ ననుడు నీ యొప్పునఁ దగిలితి, వనితలు కామార్తి వశతఁ బొంది

తే. వంశహాని దలంపరు వరున కలుక, రాత్మజులఁ జూడ రగ్రజు ననుజుఁ గొనరు
పురుషశతకంబుసంగమంబునను దృప్తి,సనరు దీని విచారింపు మనియె నువిద.
18

వ. అనిన నమ్మునివరుండు.

క. ఇది యేటికార్యముగ నా,మది కెక్కఁగఁ జెప్పె దిట్టి మాటలుఁ గలవే
మదవృత్తి మాను మేఁ బో,యెద నావుడు నామృగాక్షి యెలన వ్వాలయన్. 19

తే. కార్య మగుటయు సరిగెదు గాక పిదప, నిల్వు మంతకు ననుటయు నీవు నన్నుఁ
గదియ కుండెద వేని నిశ్చల సధర్మ,వృత్తి వగు మని వారించె నత్తపస్వి. 20

వ. ఇట్లు వారించి యిది శాపంబున [3]ముదురుఁదనంబు నొందినబృందారకసుందరి
గావలయు నట్లయ్యెం గాకుండె దీనితెఱంగు నా కెఱుంగఁ జాలిం బడ నేల
యని యాత్మ నూహించి యూర కుండె నంతఁ బ్రభాతం బైనం గాలోచిత
కృత్యంబులు దీర్పు మని పలికి యప్పొలంతి యుత్తమస్నానీయద్రవ్యంబులు
దెచ్చి యమ్మునియనుజ్ఞ వడసి మృదుకరతలంబుల మేను దొడసి కృతస్నానుం
జేసి యతండు సంధ్యావందనాగ్నికార్యంబు లాచరించిన నమృతోపమానంబు
లగునన్నపానంబుల నతనిం దృప్తునిం గావించి యుచితసంభాషణంబులం బ్రొద్దు
పుచ్చి నిశాసమయం బగుటయు శయనంబునకుఁ బిలిచిన నాసుశ్లోకుండు రాకున్న
నేనుం గన్యక నస్ఖలితబ్రహ్మచర్యంబునన చూవె పరిణతవయస్క నయితి స్వతం
త్రనై యుండుదుం బాణిగ్రహణమహోత్సవం బనుభవింపు మని పలికిన
నమ్మహాత్ముం డి ట్లనియె. 21

తే. బాల్యమునఁ దండ్రి యౌవనప్రాప్తి మగఁడు
వార్ధకంబునఁ దనయుండు వామనయన
నరసి నడపన కా కెందు నంగనలకు
వలసినట్లులు సేయఁగా వచ్చు నెట్లు. 22

1. గ. గఁదలనిచిత్తముతోడుత. 2. క. వసింపరే. 3. జ. ముదుకుఁదనంబు.

వ. కావున నీవు నన్నిచ్చినం బరిగ్రహించుట పాడి గా దనుసమయంబునం జూడం
జూడ నచ్చేడియ సుభగయౌవనసుందరాంగియు మనోహరవిలాసభంగియు నయ్యె
నైనను దానియందుం దగులనిచిత్తంబుతో నత్తపోధనకుమారుండు. 23

క. ఈయనృతవర్తనము లే,లా యున్ననిజంబు నీతఱలంపును నిన్నుం
దోయజలోచన చెప్పుము, పోయెదం బనులు గల వనిచిఱపుచ్చుము నన్నున్. 24

సీ. అనవుడుం బ్రీతయై ఱ యనఘ నిన్నారయు,తలంపునం జూవె వఱదాన్యుం డిందుం
బుత్తెంచె నేను నీఱయుత్తరదిశం జుమ్ము, నినిష్ఠం గాంచితి ఱ దీన నతండు
ఇనుమెచ్చు నాడెనఱమనమునం బ్రియమొందు,మరుగుముసుప్రభాఱపరిణయమున
కనిన సద్దేవికి ఱ వినతుండై వీడ్కొని, యరిగి యమ్మునిపతి ఱ యాత్మం గనియుం

తే. దన్ను నడుగంగ సకలవృఱత్తంబుం జెప్పి
యతనిపుత్త్రికం బెండ్లి యై ఱ యతులధర్మ
భోగగౌరవకీర్తులం ఱ బొంది జగతి
నతిశయిల్లె నష్టావక్రుం ఱ డధిపముఖ్య. 25

వ. అని యష్టావక్రదిశాసంవాదంబు సెప్పిన విని యప్పాండవాగ్రజుండు మునుల
వలన శూద్రజాతిభామలయందుం బ్రభవించినవారికి బ్రహ్మర్షిత్వంబు గల్గుట
యది యెట్లొకో యని వితర్కింతు నత్తెఱంగు నా కెఱింగింపవే యని యనిమిష
నదీనందను నడుగుటయు నక్కురుపతికిం గురుపితామహుం డి ట్లనియె. 26

సీ. నాలుగుజాతులఱనాతులు విప్రున, కొండ్రుగాం గైకొన ఱ నగు నృపునకుం
దనకులంబున నట ఱ తక్కువకులములు, రెంటను బరిణయఱశ్రీ వహింపం
జను వైశ్యునకు నాత్మఱజాతిశూద్రాన్వయం,బునం బెండ్లి గాం దగు ఱ భూపవర్య
శూద్రున కర్హంబు ఱ శూద్రకన్యకం బెండ్లి, యగుటయు నిది వివాఱహప్రకార

ఆ. కథితధర్మ మిట్టిఱ గతిం దప్పి ప్రతిలోమ,సరణి నైనం గల్గు ఱ సంకరంబు
తల్లి యెట్టికులము ఱ దానికులంబ యౌ, నన్నుతానులోమ ఱసంభవునకు. 27

వ. ఇది సకలజనసామాన్యం బయిన తెఱంగు విశేషించి మునిసత్తములయుత్తమతపో
జ్ఞానవిద్యాప్రభావంబులం జేసి తదీయబీజసంజాతులు యోని యెద్ది యైనను
బ్రాహ్మణుల యగుదురు మహాక్షత్త్రియులు ననులోమవృత్తి నాత్మప్రభావంబుల
నిజబీజసంజనితులకుం దమకులంబ కలిగింపం జాలుదురు నీవు వియోనిజాతు లని
శంకించి యడిగితివి వారల యేల పశుయోనిజాతులు నయోనిజాతులును లోను
గా సద్ద్విజులును రాజవరులు నగుట గన్నది గాదె కావున మునివరుల నృపవరుల
వలనం గలిగినజన్మంబు లెల్లను బీజప్రధానంబు లై యతిశయిల్లు వినుము
వసిష్ఠుండు ఋశ్యశృంగుం డగస్త్యుండు సత్యవత్యుద్భవుం డగుకృష్ణద్వైపాయ
నుండు మందపాలనందనులు మఱియు ద్రోణకృపాదులుం బ్రభవించినభంగులు
విందుమ కాదె వార లెట్టిట్టివా రయి రెఱుంగవే యివ్విషయంబున మను

వాక్యంబు గల దాకర్ణింపుము. 28

క. మునిజనుల నదుల సిద్ధుల, జననంబులు బుద్ధివృత్తిఁ జర్చింపఁగ నె
వ్వనికిఁ వశంబు గా వవి, దనతనయైనట్ల యై యుదాత్తతఁ బొందున్. 29

వ. అనిన విని యుధిష్ఠిరుండు. 30

ఆ. అనఘ దానపాత్ర మగుట విప్రుఁడు లింగి, యైననో యలింగుఁ డై చరించు
టనొ యెఱుంగఁ జెప్పు మనవుడు గాంగేయుఁ, డిట్టు లనియె నమ్మహీశ్వరునకు.

భీష్ముఁడు ధర్మరాజునకు దానపాత్రభూతుల తెఱంగు తెలింగించుట.

క. విను సద్ద్విజుండు నిజవ, ర్తనమునఁ జరియించుచున్న దానార్హత్వం
బున వెలుఁగు లింగి యైనను, మనుజేంద్ర యలింగవృత్తి మహితుం డేనిన్. 32

వ. అనుటయుఁ బాండవాగ్రజుండు. 33

తే. శ్రద్ధ సాలంగఁ గల్గినజనము లిచ్చు, భూరిదానముల్ దురితంబుఁ బొంద నేర
వేయెడల నని తలఁచెద నేను బుద్ధి, ననుడు నాతని కతఁ డిట్టు లను నృపాల.

క. నరవర దుర్దాంతు లయినఁ, బరిపూతులు శ్రద్ధ గల్గుభవ్యులుఁ దా రా
దర మొప్ప నిచ్చుదానము, దురితహరమ కాక కీడు దొడరు నె యెందున్. 35

సీ. అనుడు ధర్మాత్మజుఁ డతనితో దైవకా, ర్యమునప్డు విప్రుని నతిపరీక్షి
తునిఁ జేయ వలయునే యనఘ పైతృకమువి, ధంబున నన్న నాతండు నీవు
దలచినయట్టిద తగవు నావుడు నాన్ృ, పాలుం డపూర్వసంబంధిసూరి
యాజితపోనిత్యులందు సత్పాత్రము, లెవ్వార లనుటయు నింతవట్టు

తే. వారు సత్పాత్రముల వంశవర్య ధర్మ
భాషణము కాని తత్క్రియాపరత లేని
యట్టివానికి నరుఁడు హేమాదు లిచ్చి
పొరయుఁ బదియేండ్లు నరకానుభూతి ననియె. 36

వ. అని భీష్ముండు వెండియు. 37

క. ధరణియుఁ గాశ్యపవైశ్వా, నరమార్కండేయు లోలిన జగద్ధితవా
క్పరు లై రొక్కెడ వా రొక, మరి గోష్ఠీనిరతి నుండి మనుజాధీశా. 38

వ. అవ్వాక్యంబు లాకర్ణింపుము. 39

క. ఘనతర మగుహ్రీగౌరవ, మున మునిఁగినఁ బాప మఖిలమును రూపు సెడుం
బెనుపునయగ్గలికఁ బొగడు, గనినపయోరాశిఁ బడ్డగడ్డయుఁ బోలెన్. 40

తే. సత్కులంబునఁ బుట్టుట సకలవేద
ములుఁ బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రాభవములు గావు
శీలసామగ్రి లేనిదుశ్చేష్టితునకు. 41

ఆ. పలుసదువులు సదివి పండితమాని యై, తనదువిద్య నొరులఘనయశంబుఁ

దూలఁపుచ్చునట్టిదుష్టాత్మకుని బ్రహ్మహత్య వొందు సందియంబు లేదు. 42

తే. వాజిమేధముల్ వేయొక్కఁ డవలనఁ బెట్టి, యలఘుసత్యంబు దక్కఁ టివలనియందు
నిల్పి తులఁ [1]దూఁపఁగా సత్యనిష్ఠలోని, యర్థమున కెత్తు వచ్చె నయ్యధ్వరములు.

వ. అని యిట్లు వర్తిల్లునాలుగువాక్యంబులుం జెప్పి. 44

తే. బ్రహ్మచర్యంబుకంటెను బరము మద్య
మాంసములు రెండు నుడుగుట మనుజనాథ
లోకయాత్ర వాటించు [2]చరలోలుపతయు
శమముఁ గల్గి వర్తించుట శౌచవిధము. 45

వ. అనిన విని యజాతశత్రుండు ధర్మంబు నర్థంబును గామంబును నాచరించు కాలంబు
తెఱింగింపవే యనుటయు నాపగేయుం డతని కిట్లనియె. 46

తే. రేపకడయును బగలును మాపు వరుస, నర్థధర్మకామంబుల నాచరింప
వలయు వానియం దాసక్తి వలదు సక్తుఁ, డయ్యె నేనియు మేలు ధర్మాభిరతిని. 47

వ. అని మఱియును. 48

క. విను గురుపూజనవిప్రా,ర్చనము లధికపుణ్యములు ధరావల్లభ వి
ప్రుని నిందించుటయును న,గ్నిని వేదము విడుచుటయును గిల్బిషతమముల్. 49

సీ. అనుటయు ధర్మనందనుఁడు దానంబుల, కెవ్వరు పాత్రంబు లేర్పరింపు
మనిన సద్ధర్ములు నక్రోధనులు సత్యరతులు దాంతులును ధీరత్వయుతులు
నిజకర్మనిరతులు విజితేంద్రియులు సర్వభూతహితులు నలుబ్ధులును శుచులు
దానపాత్రములు వేదంబు సాంగంబుగాఁ, జదివి షట్కర్మనిష్ఠలఁ దొడంగి

తే. తత్త్వవిదులైనబ్రాహ్మణోత్తముల కీగి, విను సహస్రగుణం బగువిశ్రుతశ్రు
తంబుఁ బ్రజ్ఞయు శీలవృత్తములుఁ గలుగు, వారి కిచ్చుట వంశవిస్తారకంబు. 50

వ. అని నిర్దేశించి భీష్ముండు వెండియు. 51

ఆ. యోగ్యుఁ డైనవిప్రుఁ డొకరుండు సంతృప్తిఁ, బొంద నధికతృప్తిఁ బొందు దేవ
వితతి మునిసమూహపితృసమాజములు న, ట్లగుట వెదకి తెచ్చునది విశిష్టు. 52

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డతనితో దేవపితృమనుష్యపూజలకాలంబు తెఱిం
గింపవే యనుటయు నతండు. 53

క. నృపవర పూర్వాహ్ణంబును, నపరాహ్ణము దేవపితృసమారాధనవి
ధ్యుపదిష్టకాలములు మ,ధ్యపుసమయము మానుషార్చనార్హం బరయన్. 54

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 55

సీ. నరనాథ కాలహీనంబును నశుచిసం,స్పృష్టంబుఁ బరిభుక్తశేషమును న
మంత్రకంబును నీతతంత్రంబుఁ గీటకే,శప్రదుష్టంబు రాక్షసులు గొందురు
మానని యద్రవ్యమేనియు సురపితృ,క్రియల దురాత్మకు లయినవారు

1. క. చ. జ. దూన్పఁగా. 2. గ. చ. జ. చలోలుపత్వశమము.

గుడిచిన నట్ల యక్కుడుపులఁ జూనుపక, మత్తుని జడుని నున్మత్తుఁ బతితుఁ
తే. గ్లిబుఁ గుష్ఠి దేవలకుఁ జికిత్సకునిని, వీతనియమ నపస్మారి శ్విత్రి రాజ
యక్ష్మయుతునినర్తకునిగాయకునిసోమవిక్రయుని వేదవిక్రయువిడువవలయు 56
ఆ. నడ్డికిచ్చి కుడుచువాఁడు ననగ్నియుఁ, బ్రాణివిక్రయమున బ్రదుకునతఁడు
దైవపిత్ర్యములకుఁ దగరు సంధ్యోపాసనములు లేనివారు నరవరేణ్య. 57
వ. అనిన విని ధర్మనందనుండు శంతనునందనునితో దైవపిత్ర్యంబు లగుదానంబులకు నుత్తమపాత్రంబు లెవ్వరెఱింగింపవే యని యడుగుటయు నతం డతని కిట్లనియె.

—దైవపిత్ర్యంబు లగుదానంబులకుఁ బాత్రభూతుల నిరూపించుట.—

సీ. భోజనార్థులఁ దుష్టిఁ బొందించునతఁడును, దెరువాఁకువలనఁ దస్కరులచేతఁ
జేటొంది ధనము వాంఛించునతండు వ్రతంబున కుద్యాపనంబు సేయఁ
దలఁచి యర్థించునతండును గురుఁ దల్లిదండ్రుల సంక్లిష్టదారపుత్త్రు
లను బ్రోవఁ బడునతండును మహావ్యాధిని రాసంబు సేయంగ నాససేయు
తే. నతఁడు నిప్పాపుఁ డైనధర్మరుండు, నెపుడు భిక్షయ బ్రదుకగునేని నట్టి
యతఁడు దైవపిత్ర్యములకునతిశయంబుగల్గుపాత్రంబు లగుదురు కౌరవేంద్ర.
వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 60
సీ. సత్త్రంబు సాలయుఁ [1]జలిపందిరియు రచ్చకొట్టము వ్రచ్చుటగురుజనముల
నిందించు టాగమనింద తదీయవిక్రయవిధి తద్విలేఖనము గొండి
యము సంధిభేదన మన్యకర్మోపజీవన మకృతజ్ఞత [2]వాసదార
వృత్తి మంత్రసుశాస్త్రవిధ్వంసనము మదలోల ననాథను బాల వృద్ధఁ
తే. దాపసిని భీత వంచనఁ దలరఁ జేయు
టతిథిపుత్త్రభృత్యులకు నాహారకలన
మాచరింపక కుడుచుట యార్యకోటి
నిరయహేతువులుగఁ జెప్పు నృపవరేణ్య. 61
సీ. విషశస్త్రకేశముల్ విక్రయించుట శస్త్రములచేఁత కన్యాజనులను విప్ర
తతిని గోగణమును దఱిసి పోవుట యుపాధ్యాయు సభక్తికుం డైనభృత్యు
విడుపుమార్గముఁ గ్రంపనడిచికొయ్యలు ప్రాఁతి చెఱచుటనరకంబు సేయునం డ్రు
నేరమి లేకయు నెపమిడి యర్థంబు గొనురాజుఁ బ్రజరక్ష వినికి గలిగి
తే. యాచరింపనివిభుఁడును నప్పనంబు పలుకుబడి దప్పి కొనియెడుపతియు గోవు
ముక్కుఁ గుట్టెడువాఁడుఁ దన్ముష్కఘాతియగునతండు నధోగతి కరుగువారు.
సీ. ధర్మంబుభయమున దారిద్ర్యసంబాధమున రోగమును బాపములుఁ దొలంగఁ
జేఁతకు నైనఁ జేసినదేవకార్యార్థపశుహింసనంబును బరమతపము
శుశ్రూషయును గల్గి శ్రుతము సంపాదించి యప్రతిగ్రాహకుఁ డైన మద్య

1. క. జ. జలివిందిరయు. 2. గ. పారదార.

మాంసపరస్త్రీసమాగమవైముఖ్య,మున నాశ్రమస్థులఁ దనకులంబు
తే. వారి భరియించినను హేమవస్త్రమంది
రాన్నపానంబు లొసఁగిన నాశ్రయంబు
దీనులకు నిచ్చినను హింస మానినను స
మంచితస్వర్గలక్ష్మి సిద్ధించు నండ్రు. 63

సీ. రచ్చకొట్టంబు నారామంబుఁ గూపంబుఁ, బ్రపయుఁ గావించుట భయభరార్త
కోటి గాచుట కన్య గోవు వాహనము దా,సుని దాసి నిచ్చుట దనకుఁ గీడు
సేసిన సైఁచుట సెలులఁ జుట్టంబులఁ, బ్రోచుట పెక్కండ్ర పొంటెఁ గార్య
మునఁ బరాక్రమమున ధనమునఁ దా నల,జడిపాటు దుష్కర్మ సరణిఁ బొరయ
ఆ. కునికి నాకలోకమునకు నిచ్చెన లగు, నెక్కులమునఁ బుట్టి రేని బహుసు
తుండు నతికృపాన్వితుఁడు వేయునెలలపై, బ్రదికినతఁడుఁ గంప్రుత్రిదశపదము.

వ. అని నిర్దేశించి. 65

ఆ. నరకవాసకారణము నెఱింగించితిఁ, బుణ్యలోకహేతుభూతములును
దేటపడఁగఁ జెప్పితిని గురుసంతతి, శ్రేష్ఠ యింక నేమి సెప్పవలయు. 66

వ. అడుగు మనినం గాంతేయపూర్వజుండు శాంతనవుతో బ్రహ్మహత్యాసమంబులని
కొందఱు గొన్నికర్మంబు లుగ్గడింతురు హింస లేకయు నట్లయ్యెడునవి యెయ్యవి
వాని నేర్పడ నెఱింగింపవే యనుటయు నతం డతని కిట్లనియె. 67

సీ. దివ్యబోధాఢ్యు వేదవ్యాసమునినాథు, నడిగితి నొక్కనాఁ డధికభక్తి
నిట్లని యాసంయమీంద్రుండు కృప నాకు, నెఱిఁగించె ననఘ నా యెఱిఁగినట్టి
విధము లెఱింగింతు వినుము విప్రునిఁ గృశు,నామంత్రితునిఁ జేసి యతఁడు గుడువ
వచ్చినఁ బెట్టమి వరకులంబును సార,విద్యయుఁ గలవిప్రు వృత్తి గొనుట
తే. నీరు ద్రావంగ గోవు లేతేర విఘ్న, మాచరించుట బధిరపంగ్వంధధనము
లపహరించుట వేదశాస్త్రాదినింద, బ్రహ్మహత్య లెట్టులు పౌరవేంద్ర. 68

తే. అలుకఁ బురి నూర వనమున నగ్ని యిడుట, పాపశీలతమై బొంకి బ్రాహ్మణునకు
నధికతర మగుశోకంబు నావహించు, టంచితాచార బ్రహ్మహత్యాసమములు. 69

✓తే. రూపగుణశీలముల ననురూపుఁ డైన, వరున కీక కన్నియఁ దనవలసినట్లు
తగనివానికి నిచ్చుట ధర్మదేవ, తాతనూభవ బ్రహ్మహత్యాసమంబు. 70

భీష్ముఁడు ధర్మరాజునకుఁ బుణ్యతీర్థవిశేషంబుల నెఱింగించుట.

వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రుతోఁ బుణ్యతీర్థవిశేషంబులు వినవలతుం
జెప్పవే యనుటయు నమ్మహీపతికి నమ్మహాత్ముం డిట్లనియెఁ దొల్లి గౌతముం
డడుగ నంగిరసుండు తీర్థంబులు గొన్నింటి ప్రకారంబు సెప్పె నప్పరిపాటి సెప్పెద
నాకర్ణింపుము. 71

సీ. సప్తదినంబులు చంద్రభాగను విత,స్తను నూర్మిమాలినిఁ దగ వసించి

యాహారవిరహితుం డై యుండ మునిసమా,నుం డగుఁ గాశ్మీరమండలమున
నదులు గొన్ని మహావనము సొచ్చి పాఱు ది,వంబు సిద్ధించుఁ దదంబు సేవఁ
బుష్కరమ్ముఁ బ్రభాసమును నైమిశము నిం,ద్ర,మార్గంబు దేవికాస్వర్గబిందు
తే. లును సమవగాహనంబున జనుల నప్స,రస్సమేతవిమానవర్తనులఁ జేయు
నవనినాథ హిరణ్యబిందమువుఁ గుశేశ,యంబు నెల్లపాపంబుల నపనయించు. 72
వ. గంధమాదనసంగతమైనయింద్రతోయయుం గురంగదేశగతయగు కరతోయయుం
ద్రిరాత్రోపవాసోపేతస్నాతకులకు నశ్వమేధఫలంబు గలుగంజేయు. 73
తే. కనఖలమున గంగాద్వారమునను నీల,భూధరమునఁ గుశావర్తమునను బిల్వ
కమునసుస్నాతుఁడై పాతకములు దొఱఁగి,నాకలోకవిహారంబునరుఁడు వొందు.
క. భాగీరథి యెచట నుద,గ్భాగమునను శివుని నెలవుప్రాంతమునఁ జనున్
ధీగణ్యా [1]యచట నెలకు స,మాగతు లగుసురలఁ గం ద్రనాహారవిధిన్. 75
సీ. ఆహారముడిగి [2]మహాశ్రమంబున నగ్ని,హోత్రియై యొకమాసముండినరుఁడు
సకలసిద్ధులు మహైశ్వర్యంబుగాఁ గను, జననాథ భృగుతుంగ మనుమహాహ్ర
దమ్మున వాసరత్రయ ముపవాసి యై, బ్రహ్మవధంబుపాపంబుఁ దొఱఁగు
వినుము కన్యాకూపమున సాగ్ని హోత్రత, నున్నఁగీర్తితుఁడగు నుభయలోక
తే. ములను సుందరికాహ్రదంబునను దగఁగ
సకృదుపస్పర్శనము సేసి చారుమూర్తి
యై జనించు వైమానిక మనఁగఁ బరఁగు
భవ్యతీర్థంబు సేవించి పడయు దివము. 76
తే. కృత్తికాంగారసంసేవ కిల్బిషములఁ
బాపి నాకంబుఁ జేర్చు విపాశఁ ద్రిదివ
సములు కాలికాశ్రయ బ్రహ్మచర్యనియతి
తోడ సేవింప జన్మంబు దొఱఁగు నరుఁడు. 77
క. స్నానముఁ బితృతర్పణమును, మానితగుణ కృత్తికాశ్రమంబున నియతిన్
మానవులు సేసి శివుకొలు, వానందాత్మకతఁ గాంతు రండ్రు మునీంద్రుల్. 78
తే. ద్రోణశర్మపదంబున రూఢమైన,తీర్థమును శరస్తంబంబు దేవదారు
వనముఁ దమ్ము సేవించినమనుజు నెట్టి,వాని నైనను నప్సరోవరునిఁ జేయు. 79
తే. చిత్రకూటజనస్థానసేవనములు
రాజలక్ష్మి నొసఁగు వీతభోజనత్వ
మహితవృత్తుఁ డై శ్యామాశ్రమమున నొక్క
పక్షము న్న [3]నంతర్ధానఫలము గలుగు. 80
క. విమలమతిం గౌశికివా,లమున ననాహారమానలంపటుఁ డై యు

1. అ. యచట నెలకు నరు, లాగ. 2. క. చ. బింబాశ్రమంబున. 3. క. నంతర్ధానపదము.

న్న మనుజుఁ డిరువదియొక్కదినములం బరమగతిసాధనశ్రీ నొందున్. 81

సీ. పేర్చుమతంగవాపిక నేకరాత్రంబు, నిలిచి సిద్ధుం డగు నెల వసించి
నైమిశంబునఁ బొందు నరవర పురుషమేధఫలంబు నట్టివిధంబ యుత్ప
లావనంబునఁ జేయఁగా విను మశ్వమేధంబుఫలంబునర్థంబుఁ బడయుఁ
నరుఁడు గంగాయమునానాసంగమమ్మునఁ, గాలాంజనం బనుశైలమునను

తే. నియతి నాచరితస్నానుఁ డయి విముక్తి, తెరువు గాంచు వైవస్వతతీర్థసేవఁ
దీర్ఘభూతత్వ మొందు విధేయచిత్తవృత్తిఁ గౌరవవంశపవిత్రచరిత. 82

ఆ. విను ప్రయాగమునకుఁ జనుదెంచుఁ గోటిత్రయంబు దశసహస్రకంబుఁ దీర్థ
ములు సరేంద్ర దర్శమున నందు నెలనాళ్లు, లున్న నరుఁడు ముక్తికొడయుఁ డంద్రు.

క. విను గంగను బ్రహ్మసరం, బనుతీర్థమునందు నెల నిరాహారతనై
నునికిని మర్త్యుం డమృతాంశునిలోకంబున మహాయశుం డై యుండున్. 84

సీ. అనఘ యష్టావక్రమును [1]గలవింకము, దేవహ్రదము బ్రహ్మభావ మొసఁగు
నాచరితస్నానుఁ డగుమర్త్యునకు సర్వశీకృత్తికాయోగసిద్ధకీర్తి
యైనలౌహిత్యంబునందు సుస్నాతుఁ డై, పుండరీకాధ్వరమునఫలంబుఁ
బొందు రామహ్రదంబున నిరాహారుఁ డై, పండ్రెండుదినములు భరితనియతి

తే. నున్న సకలకల్మషములు నుజ్జగించి, నరుఁడు నిర్భంజనత నెలనాళ్లు దా మ
హాహ్రదావాసి యై జమదగ్ని గన్న, పుణ్యలోకంబుఁ గను మునిగణ్యుఁ డగుచు.

క. విను వింధ్యంబున నొక నెల, తనుతాపము నోర్చి చేయుతపమున జనరుఁ
జన సర్వప్రాయశ్చిత్తనిరూఢిం బొంది నరుఁడు ధర్మజ్ఞుఁ డగున్. 86

సీ. నర్మద నాడి భూనాథనందనుఁ డగు, జంబుమార్గంబున సంయతాత్ముఁ
డై మాసములు మూఁడు నట యొక్కనాఁడును, నిలిచిన సర్వసిద్ధులను బొందుఁ
గోకాముఖమునీరఁ గ్రుంకి తండులికాశ్రమమునకుఁ జని వల్కలము ధరించి
శాకభోజనుఁ డయి శాంతిమై నున్న న, న్నెలవున నున్నకన్నెలు పదుంద్ర

తే. కధిపుఁ డై యజరామరుం డయి సుఖించుఁ
గుల్యయందుఁ ద్రిరాత్రమ్ము గుడుపు దక్కి
శౌచి యై యఘమర్షణజపము సేసి
యశ్వమేధఫలముఁ బొందు ననఘ నరుఁడు. 87

వ. ఆర్ష్టిసేనాశ్రమంబున నుజ్జానకస్నాతుం డై మర్త్యుం డఖిలపాపంబులం దొఱంగుఁ
బిండారకంబున [2]నేకరాత్రంబు నిలిచి యగ్నిష్టోమఫలంబుం బడయు ధర్మారణ్యం
బున బ్రహ్మసరస్సు సేవించి పౌండరీకఫలప్రాప్తిఁ గాంచు. 88

చ. జనకుఁడు గౌరికిన్ వినుము శంకరుమామ హిమాద్రి సర్వర

1. జ. గపోతంబును. 2. జ. ద్విరాత్రంబు.

త్నని కరవిశ్వపుణ్యాభవ నంబు ప్రశాంతత నందు నిల్చి స
న్మునిగణసేవనంబుఁ దప ముఁ నడపంగ నరుండు సిద్ధుఁడై
వినుతికి నెక్కుఁ బొందు నర విందభవాంతికవాససంపదన్. 89

క. విను తీర్థసేవ కామం,బును క్రోధము మదము లోభ మును జేరనినె
మ్మనము గలిగి నడప వలయు, ననఘా ఫలసిద్ధి దాన నగుఁ బురుషునకున్. 90

క. *దమమును దపము నహింసయు, శమమును దీర్థముల వాన శౌచాతిశయం
బమలగుణ కల్గు దిత్తజ,లములం దోఁగిన శుచిత్వ లాభము గలదే. 91

క. *దొరకొననివానిఁ గోరక, దొరకొనినందున మమత్వ తుష్టహృదయతం
బొరయక విగతస్పృహు లగు,పురుషులు శుచు లేల తీర్థ ములు వారలకున్. 92

ఆ. అరయ దుర్గమములు నతివిషమంబులు, నైనతీర్థములు ధర రాధినాథ
యధికభక్తియుక్తి నాత్మఁ దలంచినఁ, జాలు నరులక ల్మషములు వాయు. 93

క. జనవర తీర్థవిధాశం,సన మగునీపుణ్యవాక్య చయము పవిత్రం
బనుపమము మాననీయం, బనిమిషపదవీప్రదము రహస్యము సుమ్మీ. 94

క. అనుగతుఁ డగుశిష్యునకుం, దనసుతునకుఁ జుట్టమునకు ధరణీసురము
ఖ్యనియతిపరద్విజాతుల,కును దగ నెఱిఁగించునది య కుంఠితకరుణన్. 95

క. నరవర గౌతమునకు నం,గిరసుఁడు సెప్పినది యిది య కిల్బిషబుద్ధిం
బరిపాటిఁ బఠించినఁ ద,త్పరత వినిన నపుడ పాయుఁ బాపము లెల్లన్. 96

క. మునులకు జప్యం బిది స,ద్వినుతము నిత్యముఁ బఠించు విమలాత్ములకుఁ
విను జాతిస్మరణముతో, జననం బతిపుణ్యపురుష సంతతిఁ గలుగున్. 97

అత్రిప్రముఖమహర్షులు శరతల్పగతుఁ డైనభీష్ముఁ జూడ వచ్చుట.

వ. అని చెప్పె నయ్యవసరంబునం బుణ్యవిశేషగణ్యుం డైనయగ్గాంగేయుం డట్లు గాండీవిశరంబులు శయ్యగా వీరశయనంబున నునికి నతని నీక్షింప నత్రియు వసిష్ఠుండును భృగుండును బులహుండును బులస్త్యుండును గ్రతువు నంగిరసుం డును నగస్త్యుండును గణ్వుండును గౌతముండును విశ్వామిత్రుండును జమద గ్నియు మొదలయినమహామునులు శిష్యవ్రాతంబుతో నేతెంచి తపఃప్రభావ స్ఫురితప్రభాపూరంబు భూనభోంతరంబున సంతతంబు లగుచుండ నిలిచి య ద్దేవవ్రతునియున్నతెఱంగు గలయం గనుంగొనిరి పాండవు లాశ్చర్యభరిత చిత్తు లగుచు నత్తపోధనవర్యులం బ్రస్తుతించుచుం బ్రణమిల్లి రప్పు డప్పరమ సంయము లంతర్ధానంబు సేసి రక్కౌరవులు నక్కురుపితామహుండును వారును వారలమాహాత్మ్యంబు లుగ్గడించుచుఁ దద్విషయం బైనసంభాషణం బొనర్చిరి తదనంతరంబ. 98

తే. తాతపాదపద్మములు మ స్తకము సోఁక, వినతుఁ డై ధర్మతనయుఁ డే జనపదంబు

* ఈ రెండుపద్యములును వ్రాఁతప్రతులం గనుపట్టవు.

లేనగంబు లేనదులు పుణ్యానుభావ,సమధికత్వంబు గలయవి జనవరేణ్య. 99

వ. అని యడుగుటయు. 100

భీష్ముఁడు ధర్మరాజునకు గంగాప్రభావంబు సెప్పుట.

సీ. అతనికి నాతఁ డిట్లను నివ్విషయమునఁ, గల దితిహాస మొకండు దాని
వివరింతు నీ కుంఛవృత్తిపరుం డగు, నొకవిప్రునింటికి నొక్కసిద్ధుఁ
డతిథి యై వచ్చిన నాతిథ్య మొనరించి, యతనితో సల్లాప మాచరింప
నమ్మహాత్ముండు నీయడిగినయట్టుల, యాసిద్ధు నడిగిన నతఁడు సెప్పె

తే. ననఘ యెవ్వానినడుముగా నరిగెఁ బావ,నాంబుపూర భాగీరధి యట్టిదేశ
భూధరాదిపదార్థముల్ పుణ్యతమము, లట్లు గాకయు గంగమహత్త్వ వినుము.

తే. త్రిపథగాసేవనమున సిద్ధించునట్టి,గతి జనములకు నియతకల్పితము లయ్యు
నధ్వరంబును బ్రహ్మచర్యంబుఁ దపము,సంపరిత్యాగమును జేయఁ జాల వనఘ.

క. మును పాపము లెన్ని యొన,ర్చినఁ బిదపను గంగ నాడఁ జీఁకటి రవి దోఁ
చిన విరియుగతి విరియు న,య్యనఘుఁ డిలాతలము దొఱఁగి యమరతనొందున్.

క. మే నించుక సోఁకిన గం,గానదితోయములు జనులకల్మషకోటిం
బో నడిచి పురందరలో,కానందముఁ బొందఁ జేయు నాగమవేదీ. 104

తే. ఎన్నియేఁడులు మనుజునియెమ్ము గంగ,వారియం దుండు నన్ని వేల్వత్సరములు
నాకలోకమహాసుఖశ్రీకి నాతఁ, [1]డుత్తుఁ డై యుండు నిర్మలచిత్తవృత్తి. 105

సీ. అనఘ సోమము లేనియధ్వరంబును శశి, లేనిరాత్రియు రవి లేనినభము
నాత్మధర్మము లేనియాశ్రమంబును బుష్ప,సంపద లేనిభూజమునుబోలె
హీనత నొందు గంగానది లేనిదే,శంబు చాంద్రాయణశతము లైన
గంగాపయఃపానకరణంబు గావించు,నిర్మలత్వముఁ జేయ నేర వగ్ని

ఆ. యందుఁ బడినదూదియట్లగు గంగావ,గాహనమునఁ బాతకంబు లఖిల
భూతములకు దుఃఖములు వాపికొనుటకు, నేవిధములు గంగ కీడు గాపు. 106

క. శరణంబు లేనిజనులకుఁ, బరమశరణ మండ్రు మునులు భాగీరథి ని
ర్జరులకు నమృతమునట్టుల, నరులకు గంగాజలం బనఁగ నే విందున్. 107

క. తలపై జాహ్నవివాలుక, యలికికొనిన ఫాలతటిఁ దదంతర్మృత్స్నం
కలితముఁ జేసినఁ బాపం,బులు దొలఁగు సుపర్ణుఁ గనినభుజగములక్రియన్. 10[illegible]

క. గంగాతరంగశీకర,సంగత మగుమారుతమునసద్యస్స్పర్శం
బంగీకరించు నెవ్వఁడు, భంగపఱుచు నతఁడు ఘోరపాపచయంబున్. 10[illegible]

తే. ఇవుల నేడుదరంబుల నవుల నేడు
దరములను బితృవర్గంబు నరుఁడు గంగ
నాడి శుచిఁ జేయుఁ జూచినయంతమాత్రఁ

[1] [illegible] కుశుఁ డై [illegible] నిర్మలయుక్తచిత్త.

బాచు వాఙ్మనఃకాయజపాపతతుల. 110

తే. వినిన వేడుక సేసినఁ గనినఁ జేత, నంటినను రెండుకులములయందుఁ గలుగు
పితృగణంబుల నెల్ల సద్గతికిఁ బుచ్చు, గంగ యెట్లు సేయునో యవగాహనమున.

క. విను గంగ గంగ యనుకీర్తనములతో నొండునీటఁ దగ మునిఁగినయ
జ్జనులు దురితములఁ దొఱఁగుదు, రని యార్యులు సెప్ప విందు నంచితచరితా.

సీ. అనఘ చూడ సమర్థుఁడగువాఁడు జాహ్నవిఁ, జూడక యున్నఁ బశుప్రతిముఁడు
సంధసమానుండు నగు నింద్రుఁ డాదిగా, సురలు గోరెదుగంగ నరులు గోర
వలదె చేకుఱు నపవర్గ ముత్క్రమణకా,లంబున గంగఁ దలంచి రేని
రాజభయంబుఁ జోరభయంబుఁ బాపభ,యంబును భూతభయంబు లోను

ఆ. గాఁగఁ గలుగుభయనికాయంబు గంగాప్ర,శంసనమునఁ బాయుశంభుఁ డర్థి
సతులపుణ్యయైనయద్దేవి దివినుండి, రా ధరింపఁడే శిరస్తలమున. 113

తే. మూఁడుపథములఁ జని లోకములకు మూఁటి
కుజ్జ్వలాలంకృతియుఁ బెంపు నొసఁగినట్టి
యమలతరమూర్తి యగుదేవి నాశ్రయించు
వాఁడు కృతకృత్యుఁ డిది నిక్కువము కృతాత్మ. 114

క. జనులకు నింద్రుఁడు గ్రహముల, కినుఁడును[1] బితరులకు నోషధీశుఁడుఁ బోలెన్
మనుజోత్తమ కడు నెక్కుడు, వినుము నదుల కెల్ల జాహ్నవి మహత్త్వమునన్.

ఆ. సగరనృపతిపుత్త్రచయము మునీంద్రశా, పమున భస్మమై యపారదురిత
కల్మషంబుఁ బొందఁగా గంగ నిజజల,సేక మొసఁగి యనిచె నాకమునకు. 116

తే. దేవతలఁ జిత్రతపమునఁ దెలచి గంగఁ
బ్రచురపౌరుషుఁ డగుభగీరథుఁడు దనదు
పూర్వులైనసగరనృపపుత్త్రులకు ను
దాత్తగతికయి తెచ్చె నిర్ధరణి కనఘ. 117

ఆ. విష్ణుపదమువలన విధునివలన సూర్యు,వలన మేరుకూపకలితుఁడైన
విష్ణువలనఁ ద్రిపురవిజయుమౌళివలన,నుండి హిమనగమున నొలసె గంగ.

క. విను తత్పరభావంబున, మనంబు నిశ్చలత నొంద మనుజుఁడు శరణం
బని యాశ్రయింప జాహ్నవి, సనాతనపదోపలబ్ధిసంపద నొసఁగున్. 119

వ. అని చెప్పి సిద్ధుండు వెండియు. 120

క. ఏ నెఱిఁగినంత సెప్పితిఁ, గాని యనంతమహిమంబు గంగాగుణసం
తానంబు శతానందము,ఖానిమిషప్రవరకీర్త్య మనఘచరిత్రా. 121

క. మేరువుమణులును వారిధి,వారికణంబులును నెన్నవచ్చు నగు గంగా
స్ఫారగుణంబులు దగుసం,ఖ్యారూఢంబులుగఁ జేత యతులవివేకా. 122

---

1. క. గ. చ. దారలకు.

వ. అని పలికి యి ట్లనియె. 123

ఆ. వేడ్క నీకు నేను ౯ వివరించినట్టిజాహ్నవీగుణములు ౯ సంతతంబు
మనసు వాక్కఁ దనువు ౯ ననఁ గలసాధనములు భజింపు భక్తి ౯ పూర్వకముగ.

తే. అట్టులైన గంగాప్రసా౯దాతిశయము వలన సిద్ధుండవై త్రిభు౯వనములందు
సర్వనీయసంక్రీడన ౯ మవిహతముగ, సంచరించుమాహాత్మ్యం౯బు సంభవించు.

క. నిజధర్మనిరతుఁడై తను, భజించుసజ్జనుని చిత్త౯పద్మము కృపఁ దా
భజియించి గంగ యతనిం, బ్రజనితచిరసౌఖ్యుఁ జేయుఁ ౯ బావనచరితా. 126

వ. అని యిట్లు గంగాగుణంబు లమ్మహాద్విజునకు వివరించి యాసిద్ధుండు గగనగమనం
బునం జనియె నవ్విప్రోత్తముండు నియతచిత్తుండై గంగాసంసేవనం బాచరించి
యనన్యసులభ యగుసిద్ధిం బడసెఁ బాండవాగ్రజా నీవును గంగాభజనంబునం
బరమశుభంబు నొందుము. 127

క. అని చెప్పి శాంతనవుఁ డి, ట్లను గంగాస్తోత్రసహిత౯మై పరఁగినయీ
వ్వీనుతేతిహాసముఁ బఠించిన వినినను రుజలు వాయుఁ౯ జెంద వఘంబుల్. 128

క. అనిన విని యన్నరేంద్రుం, డనుజసహితముగఁ బ్రభూత౯హర్ష సమున్మీ
లనకలనాసంవేశిత, మనస్కుఁడై యాతనికి న౯మస్కృతి సేసెన్. 129

వ. ఇట్లు పరమహర్షంబునం బ్రణతుండై ధర్మజుండు మందాకినీతనయుతో నెవ్వరు
సర్వజనపూజ్యు లెఱింగింపవే భవద్వచనామృతంబునఁ దృప్తి సనక యడిగెద ననిన
నమ్మహాత్ముండు వాసుదేవనారదసంవాదం బనునితిహాసంబు వినుము నీయడిగిన
యర్థంబు దేటపడియెడు నని పలికి యతని కి ట్లనియె. 130

వాసుదేవనారదసంవాదప్రకారము.

క. తనకడకు నారదుఁడు వచ్చిన సత్కారము దగంగఁ ౯ జేసి ముకుందుం
డను సమధికబహుమానం, బున నెవ్వారలకు నీవు ౯ మ్రొక్కెదు చెపుమా. 131

వ. అనిన నద్దేవముని యద్దేవకీనందనున కి ట్లనియె. 132

సీ. వరుణు సమీరణుఁ ౯ దరణిఁ బర్జన్యుని, సప్తార్చి నీశాను ౯ షణ్ముఖుని మ
హాలక్ష్మి విష్ణుని ౯ నజు బృహస్పతిఁ జంద్రు, జలముల భూమి నె౯జ్జనము లెపుడు
నతిభక్తి సేవింతు ౯ రట్టివారలకు నే, మ్రొక్కెదు వేదప౯రులుఁ దపోధ
నులు దేవతాపూజ౯నులు భూమిధనధాన్య, గోదానశీలురు ౯ నాదరంబు

ఆ. గల్గి యతిథిపూజ ౯ గావించువారలుఁ, బితృసమర్చకులును ౯ భిక్షితాన్న
పూతశాంతభావ౯ములు గలవారు స, త్యవ్రతులును బూజ్యు౯లనఘ నాకు. 133

క. వినుతత్రివర్గనిరతులు, ననహంకారమమకారు౯లగుజనులు సువ
[1]ర్తనయుతులు నలోలురు బో, ధనులు నమస్కార్యు లద్రి౯ధర విను నాకున్.

1. 'ర్తననియతులును నలోలురు, ననసూయులు వందనీయు ♦ లగుదురు నాకున్' అ. ప్ర.

క. నీవును మత్సంపూజ్యుజ, నావలెఁ జిత్తమున నెఱిఁగి | యర్చనమును సం
సేవనము నడపు భూరిశు, భావహ మగు సద్విధంబు | మాదవసింహా. 135

క. అనియెం గావునఁ గుంతీ, తనయాగ్రజ నీవు నిర్విరోధములజనములం
గొనియాడుము వారలు శో, భనము లొసంగెద రఘుంబుఁ | బాపుదురు కృపన్.

వ. అనిన విని యమ్మహీశ్వరుం డమ్మహాత్మున కిట్లనియె. 137

క. జనపతులకుఁ గర్తవ్యము, లనేకములు గలవు వాని | యన్నిటిలోనన్
వినుత ప్రధానకృత్యం, బనఘచరిత చెప్పవే దయం దెలియంగన్. 138

క. అనుటయు నతనికి నతఁ డి, ట్లను సామ్రాజ్యాభిషిక్తుఁ | డైన నృపతికిన్
విను కర్తవ్యతమం బగు, నని బ్రాహ్మణపూజనంబు | భవ్యవిచారా. 139

క. భూనాథ విప్రులు సమా, ధానంబున నున్నఁ బొదలు | ధరణిఁ శుభముల్
మానార్హు లగుట వారికి, మానక లే కున్న నలుఁగు | మనుజాధీశా. 140

✓క. దైవంబు నదైవముగ న, దైవము దైవముగఁ జేయు | ధరణీదివిజుల్
భూవర శక్తులు విను వా, రేవానికిఁ గూర్తు రతఁ డధికత నొందున్. 141

క. కోపమునఁ బ్రసాదంబున, నాపదయును సంపదయును | నప్పుడ తేవా
రోపుదు రింద్రున కైనను, శాపానుగ్రహము లాను | చరితులలీలల్. 142

క. ద్రవిడ కళిం గౌశీనర, యవన శక పుళింద నృపతు | లవనిసురపరా
భవమునఁ గాదే ధరణీ, ధవ పొందిరి తొల్లి శూద్ర | తాదైన్యంబున్. 143

క. సోమాత్మకు లీశ్వరతా, శ్రీమహితులు సర్వసౌఖ్య | సిద్ధిపరులు గో
త్రామరులు వారి నెప్పుడు, భూమీశ్వర పూజనములఁ | బోషింపు తగన్. 144

క. వినుతాచారుం డగువి, ప్రునకు సభక్తికము గాఁగ | భోజన మిడినన్
విను దేవపితృసమూహము, లనూనపరితృప్తిఁ బొందు | నతులచరిత్రా. 145

## వాసుదేవభూదేవీసంవాదప్రకారము.

వ. అని చెప్పి భీష్ముం డాభూపతితో వెండియు నిట్లను భూసురవిషయంబై వాసుదేవునకుం బృథివికి సంవాదంబు గలిగె నది యితిహాసరూపంబునఁ జెల్లు దానిఁ జెప్పెద నాకర్ణింపుము వాసుదేవుం డొక్కసమయంబునం బృథ్వి నాలోకించి. 146

క. లోకజనని వగుటన్ నిను, నోకాశ్యపి యడుగ వలయు | నొక్కటి దెలియన్
నాకుం జెపుమా పాపము, లేకృత్యము సేసి గెలుతు | రెల్లజనములున్. 147

ఆ. అనినఁ బృథివి యిట్లు | లను విప్రసేవను, విప్రపూజనమున | విప్రహితవి
ధానమునను బాప | తతి నోర్చు మానవ, ప్రతతి యెంచు నివి నృ | పాలుపనులు. 148

ఆ. అమరవిభుని భగస | హస్రచిహ్నునిఁ గాఁగఁ, జేసినదియు నేత్ర | భాసురుండు
గా నొనర్చినదియుఁ | గమలాక్ష విప్రుల, క్కయుఁ బ్రసాదసంప | దయును గావె. 149

క. అనిన విని మెచ్చి పృథివిం, గొనియాడె రథాంగపాణి | కురునృపవర నీ
వనిశంబు మిగులనుతిమ, న్ననలను విప్రులకుఁ బ్రియము | నొనర్పుము కృపతోన్. 150

క. అని మఱియు శాంతనవుఁ డి, ట్లను జననంబునన విప్రు నధిప మహాభా
గునిఁ గాఁ జెప్పుదు రార్యులు, జనులకు వంద్యంబు లతనిచరణాంబుజముల్. 151

వ. బ్రాహ్మణుల సృజియించి బ్రహ్మ వారలతోఁ జెప్పినవిధం బాకర్ణింపుము. 152

ఆ. అరయ మీకుఁ గృత్య మన్యంబు లే దాత్మ, కర్మ మూఁది యుక్తధర్మనిరతి
బ్రహ్మగోపనంబుఁ బాటింపుఁ డవ్విధ, మధికశోభనంబు నావహించు. 153

వ. బ్రాహ్మణ్యం బెల్లవర్ణంబులకుం దారకంబు బ్రాహ్మి యైనశ్రీఁ దపస్స్వాధ్యాయంబుల వెలుంగం జేయుం డనియె నట్లు గావున రాజులకు [1]బ్రహ్మవచనపరిపాలనంబు ప్రధానకర్తవ్యం బని చెప్పి వెండియు. 154

ఆ. అగ్ని నంట హిమవదచలంబుఁ గదలుప, గంగఁ గట్ట వచ్చుఁ గాని విప్ర
రాజిఁ బరిభవింప రాదు విప్రులకొల్వు, కల్పవృక్షసేవకరణి యధిప. 155

వ. ఏతద్విషయం బైనది శక్రశంబరసంవాదం బనునితిహాసంబు గలదు వినుము శక్రుండు జటాసురనందనుం డైనశంబరుకడకుం బోయి తదీయగోష్ఠి నుండి యతనితో నీ వేమిట నున్నతిం బొంది యుండు దనిన నతం డతని కిట్లనియె. 156

క. అలుకయు నసూయయును వి, ప్రులయెడ లే వనఘ వారిఁ బ్రోవంగం గాతుర
సాలయఁ దదీయారాధన, ముల కట్టులు గావునన్ విభూతి వహింతున్. 157

వ. దేవాసురయుద్ధంబున విప్రానుగ్రహంబు దేవతల గెలిపించుటగని మజ్జనకుండు సోమునితో భూమిసురులు మహానుభావులుగదే యనుటయు నమ్మహాత్ముం డతని కిట్లను వారలు తపస్స్వాధ్యాయసిద్ధు లై యుండుదురు వారి తెఱం గాకర్ణింపుము.

ఆ. అప్రవాసి యైన యవనీసురుని యుద్ధ, శాలి గానిధరణిపాలు నురగ
ముల బిలాంధకారమున నడంచినయట్లు, మెఱయనీక భూమి మ్రింగు సుమ్ము.

క. దాని నెఱింగి గృహంబున, మానిత మగుచదువు నంపు మనసు గొలుప కెం
దేనిఁ జని చదువుదురు శ్రుతు, లానంత్యమునకుఁ దపస్వు లగుదురు విప్రుల్.

వ. కావున వారలు సర్వాధికులు వారలయెడ బహుమానావమానంబు లెట్టివారికి శుభాశుభంబుల నొందించుటకు సందియంబు లే దనిన సోమునివాక్యంబులు పాటించి మజ్జనకుండు విప్రజనంబులం బూజించి తేజిష్ఠుం డయ్యె నేనుం దదాచారంబునం బెంపు వడసితి నని పలుకుటయు నయ్యసురేంద్రునివచనంబు లూఁది సురేంద్రుండు భూసురులకుం బరితోషంబు గావించి సవిశేషసమున్నతిం బొందె నని చెప్పిన విని గాంగేయునితోఁ గౌంతేయాగ్రజుం డపూర్వచిరసమాశ్రితదూరాగతులలోన నధికతమం బగుపాత్రం బెవ్వ రని యడిగిన నప్పుడమితేనికి నప్పురుషవరుం డిట్లనియె. 161

క. చెలులుం జుట్టలు సంబంధులు ఋత్విజులును బురోహితులుఁ దగుపాత్రం
బులు హింసాక్రోధేర్ష్యాదులు లేనిజనంబు లైన దురితవిదూరా. 162

1. క. బ్రహ్మవర్చసపరి.

క. దూరాగతులు నపూర్వులుఁ, గౌరవకులముఖ్య పూజఁ ॥ గనుటకు నర్హుల్
సారాచారము విద్యా,గౌరవముం గలుగఁ జూపు ॥ కరణీయ మగున్. 163

క. ఈమూఁడు దెఱంగులజను, [1]లామెయిఁ జూచినను నశుచు ॥ లైనను బాత్ర
శ్రీమహితుల నిజభృత్య,స్తోమముజీవనము నడపి ॥ చుమ్మీ యాగుల్. 164

క. అనిన విని ధర్మసుతుఁ డీ, ట్లను శంతనుసుతునితోడ ॥ నఘుకోటికి నె
ల్లను మూలము వనితల య,జ్జనముల తెఱఁ గెఱుఁగఁ జెప్పఁ ॥ జాతుర్యనిధీ.165

——— నారదపంచచూడాసంవాదం బనునితిహాసము. ———

వ. అనుటయు నతం డ(తని క ట్లనియె నా)తెఱఁగు నిచెప్పనట్టివార డీనికి నారదపంచ
చూడాసంవాదం బనం బరఁగునితిహాసంబు గలదు వనితాస్వభావవిషయంబయి
యుండు దాని నాకర్ణింపుము దేవమునివరుం డగునారదుం డెంతయును జరించుచుండి
పంచచూడ యనునచ్చరలేమ నొక్కెడం గాంచి. 166

క. ఏ నొక్కటి యడిగెదఁ జెపు,మా నలినదళాక్షి యనుడు ॥ మాకొలఁదులప
లైకొన నదుత్తర మిచ్చెద, నానతి యి మ్మనియె నది ప్రి ॥ యం బెసఁగంగన్. 167

వ. అనుటయు. 168

క. వనితాస్వభావ మిట్టిది, యని తెలియం జెప్ప మనుడు ॥ నల్ల నగుచు న
వ్వనిత దగునయ్య వనితకు, వనితలదుశ్చేష్టితములు ॥ వాక్రువ్వంగన్. 169

క. అనిన విని నిక్క మాడిన, విను తప్పించుకయు లేదు ॥ వివరింపు నిజం
బని ముని వల్కిన నయ్యం,గన యతనికి నిట్టు లనియెఁ ॥ గౌరవముఖ్యా. 170

వ. స్త్రీస్వభావంబులు నీ వెఱుంగనియవి లే వైననుం జెప్పెద నవధరింపుము. 171

క. కులమును సమ్మాన్యతయును, గలిగి యొకనిభార్య యై ॥ సరగారవలీలన్
మెలఁగుచు వెలిఁ జరియించు, న్లలన వలసినట్ల యే మగనం గల దనఘా. 172

వ. అని పల్కి వెండియు. 173

సీ. యోషిజ్జనంబులు ॥ దోషంబులకు నెల్ల, మూలంబు వారల ॥ నేల చెప్ప
నడిగితి గాన కరన్నంత సెప్పెద విను, పురుషులమేలిమి ॥ పొలఁతు లెఱుఁగ
రది గాక నిర్లజ్జ ॥ లై కుత్సితుల భజి,యింతురు కడిసినరయంతఁ జేసి
వర్జనీయులు లేరు ॥ వారల కెవ్వరు, దండభీతిన పాడి ॥ దప్పకునికి

ఆ. యగ్ని కాష్ఠముల మరహాంబుధి యేఱుల, నంతకుండు భూతరసంతతులను
వనజముఖులు పురుషులను దృప్తిఁ బొందుట, గలుగదం[డ్రు]కోవిదులుమునీంద్ర.

క. కల [2]దాకరహస్యగోపన, మలఘుమతీ వినుము పురుషు ॥ నన్యుం గనినం
బొలఁతులకు నేమి సెప్పుదుఁ, గలుగుఁ బదనుతోడి[3]కళలు ॥ కామగృహమునన్.

వ. అని వెండియు. 176

1. గ. జ. లేమెయిఁ... నశుచులేనియు. 2. గ. చ. దోకరహస్యదోషం, బల. 3. క. కడలు, చ. కదలు.

క. కుఱుచుట కట్టుట పూయుట, తొడుగుటయును వివిధధనతతులు | గూర్చుట యె
క్కుడు వేడ్క సేయఁజాలవు, పడఁతికిఁ బరపురుషుఁ గవయుఁ | బోలుటవోలెన్. 177

వ. అని చెప్పిన (విని నారదుండు నిజంబ పల్కి తని పంచచూడ ననిపి నిజేచ్ఛం జని
యె) నని చెప్పిన విని ధర్మజుండు సుందరీజనంబులం గాంచు తెఱం గెఱింగింపవే
యని యడిగిన నాపగాతనూజుం డతని కి ట్లను వారు మయశంబరాదుల కుహకుల
మాయలం గడచినమతకంబులు గలిగి నిరూపింప రాక యుండుదు రదియునుం
గాక వేఱొక్కవిశేషం బాకర్ణింపుము. 178

తే. తొల్లి నిర్దోషచిత్తత | నెల్లజనులు
వలచినప్పుడ దేవత్వ | వైభవంబు
నొందఁ జాలి యుండుదురు | దూరయోపయుక్త
వనితలకు లేక సాధ్వులై | యునికిఁ జేసి. 179

వ. దానికి దివిజు లసూయాగ్రస్తులై కమలయోనిం గానం జని నిజచిత్తప్రకారం
బెఱింగించిన నతం డతివల మాయావతులం గావించి వారికిఁ గామం బగ్గలంబు
గాఁ జేసినం బురుషులు వారిచిక్కులం బడి రోషాదిదుర్గుణదూషితు లగుటం జేసి
విగతానుభావు లైరి దేవతలును బ్రియం బంది రట్లు గావున. 180

క. వనితలు మాయావిను లై, యనిరూపితచిత్తవృత్తి | నంచితరక్షం
బనుపడ కుండుదు రైనను, వినినది కథ యొకటి నీకు | వినిపింతుఁ దగన్. 181

—— దేవశర్మ యనుమునివరుభార్య రుచి యనుదానిచరిత్రము. ——

వ. దేవశర్మ యనుముని భార్య రుచి యనునంగన సర్వాంగసుందరి యై యుండుఁ దదీ
యరూపాతిశయంబు దేవగంధర్వాదులకును లోభనీయంబు. 182

క. అతఁ డొకనాఁ డొకయెడ కొక, క్రతువున కుపదర్శనంబు | గావింపఁగఁ బో
వుతలంపు పుట్టి వికస, న్మతి యగుతనశిష్యు విపుల | నామకునిఁ దగన్. 183

వ. పిలిచి యేకాంతంబున నతని కి ట్లనియె. 184

క. రుచి నెపుడు వేచి తిరుగును, శచీవిభుఁడు దాని నెఱిఁగి | సంరక్షణ మే
నుచితంబుగ నొనరింతు వి,కచకమలనిభాస్యఁ జేరఁ | గానఁ డతండున్. 185

తే. నాకుఁ గ్రతువు సేయింపఁ జనంగ వలసి, యున్న యది పరదారసక్తముత్సుకుండు
శక్రుఁ డటు గాన రుచికి రక్షావిధాన, మాచరింపుము నీవు దృఢావధాన. 186

క. అనిన విని యట్లు సేసెద, నని విపులుఁడు గురునితోడ | నమరవిభుం డే
యనువునఁ జొచ్చునొకో పర,వనితాహరణమున కనియె | వసుధాధీశా. 187

క. అనుటయు ననేకమాయలు, పూనరుపంగా నేర్చు రూపములు పెక్కులు గై
కొనుఁ బక్షిమృగాదిత్వము, లొనరఁగ నని నియతి నరసి | యుండఁగవలయున్.

క. *రుచిమీఁదం గన్నిడి యా,శచీవిభుఁడు దిరుగు విను మసంశయముసుమీ

* ఈపద్యము పెక్కుప్రాఁతప్రతులం జూపట్టదు మఱియు నిది యిట యనవసరము.

యిచటికి నాతఁడు వచ్చుట, యచలితమతి నమ్మృగాక్షి ఱనరయఁగ వలయున్. 189

క. అని యప్పగించి యాగం,బున కమ్ముని సనియె నవ్విఱపులుఁడును జి త్తం
బున నవధానము దృఢముగ, వనితం గాచికొని యుండె ఱ వసుధాధీశా. 190

వ. అ ట్లుండి యొక్కఁయనువు విచారించుకొని. 191

క. ఆవేశించెద యోగ, ప్రావీణ్యంబున ముపేంద్రుఱ భార్యం దప్పె
యావిశ్రుతాత్మమనమున, కవిజ్ఞానంబు దోఁచుఱనే వెఱ పేలా. 192

వ. అని వితర్కించి యమ్మునిచాతుర్యకారుణ్యంబు లూఁది శంక దక్కి యక్కొమ్మ కింత సంత నాసీనుం డై యుచితకక్ష లోక్కింతసేపు సెల్లించి యోగమాయా బలంబునం జేసి నడపుటయు. 193

ఆ. పవనుఁ డాకసమునఁ ఱ బరఁగువిధంబున, నమ్మృగాక్షితనువుఱ నంపుఁ గలయ
విపులునాత్మ దగఁ బ్రఱ వేశించె నవ్వధూ, రత్నమునకు నెఱుఁగఱ రాకయుండ. 194

వ. ఇట్లు ప్రవేశించి యయ్యోగివరునాత్మయన్నాతిచైతన్యంబు జడంబుగాఁ జేసికొని యుండె నట్టియెడం బురందరుండతిసుందరంబగునాకారంబు దాల్చి యచ్చటికి వచ్చి విపులునిశరీరంబు సూచి నిద్రితునిం గాఁ దలంచుచు నున్మదుం డగుటం జేసి యొండు పరికింపక మునిపత్నిం జేర వచ్చి. 195

క. నీవు కతంబుగ నా దగు, భావంబును భావభవుఁడు ఱ వఱుచుట యరయం
గా వలదే యని పలికిన, భూవర యప్పొలఁతి మూఢఱబుద్ధిత్వమునన్. 196

క. సముచితముగఁ బ్రత్యుత్థా, నము సేయను దగినపలుకుఱనకుఁ జొరఁగను నే
రమి నూర కున్ననుం దమ, కము పెంపున నతఁడు మఱియుఁ ఱ గమలాననతోన్.

క. ఏ నమరేంద్రుఁడ నా దగు, మానముఁ గామశిఖ గ్రాఁచె ఱ మానిని దడయం
గా నేల నన్నుఁ దగ స, మ్మానింపుము నీకు సిగ్గుఱమా టిం కేలా. 198

వ. అనుటయు న త్తన్వితనువున నున్న విపులుండు దనయోగమాయం జేసి యవ్వనిత వాసవునితో నీకు నిందు రాఁ బని యేమి యని పలికి పరవశ యగునట్లుగాఁ జేసినం జూచి యతండు వ్రీడాభయభరితచిత్తుం డయ్యె నయ్యవసరంబున. 199

ఉ. అమ్మునిశిష్యుఁ డయ్యువిదఱయంగము వాసి నిజాంగవ ర్తి యై
యమ్మరుదీశుతో మఱచిఱ తా మును మూఁడినయబ్బ గాంకిత
త్వ మ్మొకభంగి నీఁగు టిది ఱ దై వతసంయమిసేవనీయభా
వమ్ము గలట్టినీకుఁ దగఱవా యిసిరో యని పల్కి వెండియున్. 200

తే. అవిజితేంద్రియబల కుత్సిఱ తాత్మ నీచ, యెట్లు పాపంబు దొడరుట ఱ కియ్యకొంటి
నాదుగురునికోపాగ్ని చే ఱ నీదు దేవ, గణవిభుత్వమహోన్నతి ఱ గ్రాఁగి పోదె. 201

వ. అనిన విని దివ్యబోధంబునవిపులుని యోగబలంబు తెఱంగెఱింగి వెలువెలం బాఱు నబ్బలవైరి నాలోకించి య త్తపోధనుండు. 202

క. ఏ నొల్లఁ గాక భస్మము, గా నిన్నుం జూతు నే విఱకారీ యనుడుం

దా నెదురుపలుక కంతర్ధానము వెసఁ జేసె నతఁడు ధరణీనాథా. 203

వ. తదనంతరంబ విపులుండు రుచిం బ్రబుద్ధం జేసెఁ బదంబడి దేవశర్మ వచ్చిన నా
శిష్యోత్తముండు వినయాచారంబు నడపి యేకాంతంబున నమ్మునితోడ. 204

తే. నాకపతి యిచ్చటికి వచ్చి నాకతమునఁ, జిక్కువడి మది భయమును సిగ్గు గదురఁ
జనియె ననవుడు నాతఁడు సంతసిల్లి, యభిమతం బగువర మిచ్చె నధిపవర్య. 205

వ. ఇచ్చినం బ్రీతుం డై యవ్విపులుండు విపులతపం బాచరించె దేవశర్మయు దేవేంద్ర
వలనిశంక దక్కి సుఖం బుండె నొక్కనాఁ డయ్యాశ్రమంబు చక్కటి చదల దేవాం
గన యోర్తు వోవ దానిచేతనుండి ప్రిదిలి భూరిపుష్పదామంబు. 206

ఆ. దివ్యపరిమళంబు నవ్యవికాసంబు, నుల్లసిల్ల వచ్చి యుర్విఁ బడినఁ
గాంచి రుచి యుదీర్ణ కౌతుకచిత్త యై, దానిఁ బుచ్చికొనియె మానవేంద్ర.

వ. తదవసరంబున నంగాధీశ్వరుండగు చిత్రరథుం డయ్యాశ్రమంబున కరుగుదెంచె
నతని దేవియు రుచియుం దోఁడంబుట్టువు లగుటం జేసి నిజగృహంబునం గలిగిన యుత్స
వంబున కతండు రుచిసహితంబుగా దేవశర్మం బ్రార్థించి పిలిచినఁ జంపానగరంబున
కరుగుచుండి రుచి కై సేసి యద్దివ్యకుసుమదామంబునం గేశకలాపం బలంకరించి
కొనినం దత్సమాగమసమాచారంబు నడపి తద్భగిని తదీయకుసుమపరిమళంబునకు
నచ్చెరు వంది. 208

ఆ. ఇట్టిసౌరభంబు నెన్నఁడు నెఱుఁగ ని, ప్పువ్వు లెచటఁ గలిగెఁ బువ్వుఁబోఁడి
యనినఁ గలిగె నస్మదాశ్రమంబున నని, పలికి దేవశర్మపాలి కరిగి. 209

వ. రుచి యప్పువ్వులకుం దన చెలియలు వేడుకపడుట యెఱింగించిన నమ్మహానుభావుండు
విపులు రావించి యత్తెఱంగు దేటపడం బలికి యిట్టికుసుమంబులు గొని రా
వలయు నని పలికిన నతం డప్పువ్వులు గనినచోటు రుచి నడిగి చెప్పించికొని గురు
ప్రభావంబును నిజతపశ్శక్తియు నూఁది యప్పని పూని చనియె దైవికం బయి
యచ్చట నెప్పటిచందంబు పుష్పదామం బున్నం బుచ్చికొని వచ్చునప్పు డొక్క
యెడ నారీపురుషు లొండొరులచెట్టలు వట్టికొని చక్రభ్రమణభంగిఁ దిరుగుచుండి
యొక ళ్లొకళ్లగతి యొప్ప దని పలికి కాలుదొడరితి కడువేగ తిరిగి తని వివాదంబు
పుట్టి యం దొకండే నట్లు సేసితి నేనిం బరలోకంబున విపులుని చన్నగతికిం జనుదు
నని శపథంబు సేసిన నమ్మాట వినుచు విపులుం డట సనం జన మఱియు మార్గం
బున నార్వురు జూదం బాడుచుండ వా రైన నొకం డట్ల యొట్టిడిన నప్పలుకు నా
కర్ణించి యత్తపోధనుండు చిత్తంబున విషాదంబు గదుర నేమిదోషంబు సేసితి
నొకో యని విచారించి రుచిశరీరంబునందుఁ బ్రవేశించుట గురునకు నెఱింగింపమి
గా నోపు నని తలంచుచు నరుగుదెంచి యక్కుసుమమాలిక యొప్పించినం గైకొని
యమ్మునివరుండు మఱఁదలి కొసంగి సంతోషం బొలయించెఁ దదనంతరంబ తమ
యంత నున్నయవసరంబున నగ్గురుం డాశిష్యునితోని ట్లనియె. 210

క. తెరువున నొకమిథునము జూ, దరులను గనుఁగొంటి నీ వధర్మము నీయం
దరసి కనినవారై పలి, కిరి వారల నెఱుఁగుదే యకల్మషచరితా. 211

తే. నీవు రుచిఁ గాచునప్పటి నిపుణవృత్తి, నాకు నెఱిఁగింప కునికి యన్యాయముగఁ ద
లంచిరో కాక దానిఁ గల్మషము గాఁగ, నేను దలఁచిన శాపమీ నెట్లు నీకు.

వ. అప్పని పాపంబు గాకుండ వరం బిచ్చితి నది మఱవు మమ్మిథునం బహోరా
త్రంబు లయ్యార్వురు ఋతువు లని పలికిన గురునిబోధంబునకు నాశ్చర్యంబును
బ్రసాదంబునకుఁ బ్రమోదంబునుం బొందుశిష్యునితో నతండు వెండియు. 213

తే. దినము రాత్రియు ఋతువులు మనుజుచేయు
సుకృతమును దుష్కృతంబును జూచుచుండుఁ
గాన యెంతరహస్యంబునఁ గార్య మైన
నోరు లెఱుంగరు నన్నని యునికి మోస. 214

వ. అని మఱియును. 215

క. స్త్రీరక్ష సూక్ష్మ మీవ, ల్లేరూపున నైన వంశహీనత మమ్ముం
జేరక యుండం దగఁ బరి, హారము సేసితది యేల యవగుణ మయ్యెన్. 216

వ. దాని తెఱంగు నా కెఱింగింప కున్న నేమి యనుపలుకు వలికి దేవశర్మ విపులు
నుల్లం బూఱడిల్లం జేసె నవ్వధూవరులును విపులుండును బుణ్యలోకంబులు వడసిరి
పాండవాగ్రజా తెఱవల తెఱం గెఱింగించితి వారి రక్షించుటయు నిట్లరిది యై
యుండు నని చెప్పి భీష్ముండు. 217

క. పలువురు క్రీడింతురు భూ, వలయాధిప యరయ మంచివారును గల ర
క్కులధర్మవతులకతమున, నిల నిరపాయత్వ మొంది యెసకం బెసఁగున్. 218

క. పాతివ్రత్యము గలిగిన, నాతి యనఁగ దైవ మన జనస్తుత వేఱే
యాతతధర్మార్థసుఖ, ఖ్యాతులు సద్భార్యవలనఁ గాదే కలుగున్. 219

భీష్ముఁడు ధర్మజునకు గాంధర్వాదివివాహంబుల తెఱఁ గెఱింగించుట.

వ. అనిన విని యజ్జనపతి జాహ్నవీనందనుతోఁ గన్యావరణప్రకారంబు విచారణీయం
బైనకృత్యంబు దాని తెఱం గెఱింగింపవే యనుటయు నతం డతని కిట్లనియె. 220

క. కులమును శీలము విద్యయుఁ, గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁగా
వలయు నుదకప్రదానా, కలితంబుగ బ్రాహ్మకర్మగతి యిది యధిపా. 221

ఆ. షౌత్ర మంత్రబుధులు కన్య పురుషుఁ గోర, నతఁడుఁ గన్యమీఁద నాస సేయ
నచల మగుపరస్పరానురాగము గని, ప్రమద మెసఁగఁ జేయు పరిణయంబు. 222

క. కన్ను మనంబును దనిసినఁ, గన్నియ యెవ్వానిఁ గోరు గాంధర్వం బా
యన్ను నతని కిచ్చుట వెల, వన్నుట యాసురము సూవె పౌరవముఖ్యా. 223

క. బలిమిమెయి వరుఁడు గన్నెకుఁ, గలవారిం బొడిచి కరము క్రౌర్యంబున న

ప్పాలఁతుక దుఃఖింపఁగ వా,రలు పొగులఁగఁ దెచ్చికొనుట । రాక్షసము నృపా.

వ. ఇట్లు సెప్పంబడునట్టి. 225

ఆ. అయిదు దెఱఁగులందు । నారయ మూఁడువి,ధములు ధర్మకృతులు । ధర్మపుత్త్ర
యాసురంబు రాక్ష।సాహ్వయంబును ధర్మ,దూరసంవిధాన।దూషితములు. 226

తే. మాతృపితృహీన యైనను । భ్రాతృరహిత, భావ మొందిన నబ్బాల । పరిణయార్థ
వరణమున కర్హ గా దని। కురుకులాగ్ర, గణ్య చెపుదురు పరిణయ। కల్పవిదులు. 227

ఆ. ఆత్మజాతియందు । నవులజాతులు రెంటఁ, గ్రమవివాహ మొప్పు । బ్రాహ్మణునకు
ననఘ శూద్రవనిత।యందు నాతని కప,త్యంబు గలిమి పాప । మనియుఁ గలదు.

తే. రాజునకు రాజవంశజ । రమణి యైన
వెనుక వైశ్య వరించుట । విహితవిధము
వైశ్యునకు శూద్రునకుఁ దమ।వంశములన
పరిణయంబు గాఁదగు నర। పాలవర్య. 229

వ. రాజునకు వైశ్యునకును శూద్ర కన్యావరణంబు సేయుటయును గలిగి యుండు నని చెప్పిన విని యక్కౌంతేయాగ్రజుండు శాంతనవుతో బ్రాహ్మణునకు శూద్రజాతి యందు భార్యాపరిగ్రహంబు సేయందగు నని విందు నతనికి భార్యలు మువ్వు రని నిర్దేశించితి రది యెట్లొకో యనుటయు నతం డమ్మహీపతి కి ట్లనియె. 230

ఆ. అనఘ విషమ మైన।యట్టికార్యంబు వా,టిలినఁ జూచి పెద్ద । వలచి యైన
లోభమునను శూద్రఁ । దా భార్యఁగాఁగొను,విప్రుఁ డధికపాప।వృత్తిగామి. 231

✓వ. అవ్విధంబు నొక్కొక్కయెడం గల్గి దూష్యంబు గాక చెల్లు నని చెప్పి వెండియు.

✓క. ధరణీసురరాజవణి,క్తరుణులకును విప్రువలనఁ । గల్గినతనయుల్
కురునాథా ద్విజు లనగాఁ, బరఁగుదు రది లేదు శూద్ర।భామసుతులకున్. 233

వ. అనవుడు ధర్మపుత్త్రుండు భూసురునివలన నాలుగుజాతులనాతులకును బ్రసూతు లైనసుతులకు నతనిధనంబునందు భాగం బె ట్లుండు నని యడిగిన. 234

సీ. విను జనమేజయ। మనుజేంద్ర యమ్మేది
నీశ్వరుతో భీష్ముఁ । డిట్టు లనియె
బ్రాహ్మణునర్థంబు । పదిపాళ్లుగాఁ జేయ
నాలుగు బ్రాహ్మణీ।నందనుండు
క్షత్త్రియాత్మజుఁడు భా।గములు మూఁడును వైశ్య
తనయుండు రెండు శూ।ద్రాతనూజుఁ
డొకపాలు గొనుటకు । నొడయులు దుదివాఁడు
వలచి పెట్టఁగఁ గొను।వాఁడు గాని

ఆ. తండ్రితోడఁ ద్రివిధ।తనయులతోడను, దనదుభాగమునకుఁ । బెనఁగి కొనఁగఁ
దగదు వారలకును । దగదు నిర్దయతఁ ద,ద్దశమభాగ మీక । తార కుడువ. 235

వ. అనిన విని పాండవాగ్రజుండు దక్కినవర్ణంబులవారిధనంబు లెట్లు గాఁగలయవి సెప్పు మనుటయు ననిమిషనదీనందనుం డతని కిట్లనియె. 236

సీ. క్షత్త్రియుధనము భాగము లెనిమిది సేయ, భూపాల వైశ్యుల పుత్త్రికలకు
శూద్రపుత్త్రికకును సుతు లైనయట్టివా, రోలి నాలుగుమూఁడు నొక్కటియును
గొనువారు పాల్లులు కురుముఖ్య వైశ్యుని, సొమ్మున వైశ్యకు సూనుఁ డైన
యతఁడు నాలుగును శూద్రాత్మజుఁ డొకటియుఁ, గాఁగ నైదుగ నంశకములు గొండ్రు

ఆ. పెనఁగి కొనఁగఁ దగమి విను శూద్రకొడుకున
కెందుఁ గలదు వాని కీక కుడువఁ
గామియును సమంబ యేమిజాతులవారి
కయిన నిట్లు దెలియు మంశకృతులు. 237

తే. ఆలు నిజజాతియందు శూద్రాలి కెల్ల
సమములుగఁ బంచికొండ్రు భాగముల శూద్ర
తనయు లెందఱు గల్గినఁ దండ్రిధనము
ధర్మసంగ్రహతత్పర ధర్మతనయ. 238

వ. అని నిర్దేశించి వెండియు. 239

క. విను హవ్యకవ్యములు మ,జ్జనభోజనములును విప్రజాతివనిత దాఁ
బనిసేయ నడపునది య,ప్పనులకుఁ బెఱసతులు గామి బ్రాహ్మణుఁడు నృపా.

### భీష్ముఁడు ధర్మజున కౌరసాదిపుత్త్రభేదంబు తెఱంగు సెప్పుట.

వ. అనిన విని యుధిష్ఠిరుండు. 241

క. కొడుకులు బహువిధు లని యె,ప్పుడు విందును వారితెఱఁగు పురుషవరా యే
ర్పడఁ జెప్పవలయు నా కని, యడిగిన గాంగేయుఁ డిట్టు లను నాతనితోన్. 242

తే. పరమసంస్కృత యగునాత్మభార్యయందు
ధర్మవిధిఁ గలిగించినతనయుఁ డనఁగఁ
దాన యౌరసుఁ డనునభిధాన మొప్పఁ
బరఁగు నుత్తముఁ డాతఁడు ప్రథముఁ డధిప. 243

తే. తగినవరునకు నిచ్చినతనదుదుహిత, గనినపుత్త్రు నయ్యిరువురు వినఁగ నియ్య
కొనఁగ వీఁడు నాకొడుకనఁ గొడుకు వాని, పేరు పుత్త్రికాపుత్త్రుండు పౌరవేంద్ర

తే. ధర్మపథమునఁ బనిచినఁ దనదుపత్ని, యర్హపురుషసంగతిఁ గన్నయాత్మజుండు
క్షేత్త్రజుం డనఁగా నిజపుత్త్రభావ, మొందు ధర్మప్రపంచాభినందితాత్మ. 245

క. జననీజనకు లుదకదా,ననిరూఢము గాఁగ నిచ్చినం బడసినసం
దను పేరు [1]దత్త్రిముం డని, మునిజనములు సెప్పుదురు విమోహవిదూరా. 246

ఆ. తల్లిఁ దండ్రిఁ బాసి తనయంత నెచ్చట, నేనిఁ దిరుగునట్టివానిఁ జూచి

---

1. గ. దత్తకుం డన.

యాత్మసదృశుఁ డైనఽ యాత్మజుఁ జేసికో, నంగఁ గృత్రిముండఽ నంగఁ బరఁగు. 247

తే. ఎవ్వనికిఁ బుట్టెనేనియు ఽ నెఱుఁగకుండ, నొక్కనికిఁ బరభార్యయంఽ దుదయమైన
సూనుఁ డాభార్యగలవానిఽ సుతుఁడువాని, పేరు గూఢజుఁ డనఁబడుఁ ఽ గౌరవేంద్ర.

క. విను తల్లిదండ్రు లొల్లక, తనయుని విడిచిన నొరుండు ఽ దనకుఁ దనయుఁ గాఁ
గొని నెమ్మి నడప నపవి, ద్ధనాముఁ డగు వాఁడు విమలఽ ధర్మప్రవణా. 249

ఆ. పెండ్లి గాకమున్నఽ పితృగృహంబునఁ గన్య, సూనుఁ గనిన వినుము ఽ దానిఁ జేపి
కొనినయతని కతఁడు ఽ గొడుకగుఁ గానీన, నామకమునఁ బరఁగుఽ నరవరేణ్య. 250

క. విను గర్భిణి యగు టెఱుఁగక, యును నెఱిఁగియుఁ బెండ్లి యైనఽ నుదయించిననం
దనుఁ డావరునకుఁ గొడుకగు, జననాథ సహోఢుఁ డనఁగఁ ఽ జను నండ్రు బుధుల్.

తే. విభునిఁ దానుఁ దొఱంగినఽ వెలఁది విభుఁడు
విడిచినట్టిసుమధ్యమ ఽ విధవ యక్షు
తాత్వదశ నెవ్వనికిఁ గనుఁ ఽ దనయుఁ డాతఁ
డతనికొడుక పౌనర్భవుం ఽ డనఁగఁ బరఁగు. 252

క. జననీజనకులు లేకు, న్నను వారలు దన్ను విడిచిఽ నం దాన తనుఁ
దనయుఁడుగ నొరుల కిచ్చిన, ననఘా యాతండు సను స్వఽయందత్తుఁ డనన్. 253

ఆ. తల్లిదండ్రు లమ్మఁ ఽ దనయుఁ గా నొక్కరుఁ, డాత్మసదృశజన్ముఁ ఽ డైనవాని
విలిచికొనినఁ బాండఽ వేయమహత్తర, యక్కుమారుఁ గ్రీతుఁ ఽ డండ్రు బుధులు.

క. అని భీష్ముఁడు వెండియు ని, ట్లను నాపన్నిరువురును ధఽ రాధిప యోగ్య
త్వనిరూఢు లెల్లకర్మం, బున కౌరసుఁ డందులోన ఽ ముఖ్యుం డరయన్. 255

ఉ. వానిన పోలు నండ్రు బుధఽ వర్యులు కౌరవనాథ పుత్త్రికా
సూనునిఁ దక్క నీవినినఽ సూనులు యోగ్యత గాంతు రుత్తమం
బైనకులద్వయంబును సఽ మాగత మై విధివత్ప్రయోగతా
నూనత గల్గెనేని నిగఽ మోదితకర్మకలాపయుక్తికిన్. 256

చ్యవననహుషసంవాదం బనునితిహాసము.

వ. అనిన విని ధర్మజుండు సంవాసంబునను దర్శనంబునను బుట్టెడిస్నేహంబు లెట్టివి వానిని గోవులమాహాత్మ్యంబును నెఱుంగ వలతుం జెప్పవే యని యడిగిన సప్పా డమితేనికి భీష్ముం డి ట్లనియె. 257

సీ. చ్యవనునినహుషునిఽ సంవాద మితిహాస, మై చెల్లు జగమున ఽ ననఘ నీకు
దానిఁ జెప్పెద విను ఽ దాన నీయడిగిన, యర్థముల్ దెలియు మఽ హాత్ముఁ డైన
భార్గవచ్యవనుండు ఽ భాగీరథీయము, నలు గూడినెడ కేఁగి ఽ యలఘునిష్ఠఁ
గ్రుంకి సుస్థిరుఁ డయి ఽ కూర్చుండి యతులస, మాధిపరుం డయిఽ మత్స్యకులము

ఆ. దనదుచుట్టు మెలఁగఁ ఽ దనువునఁ జెందంగ
మూరుకొనఁగఁ గృపయు ఽ ముదముఁ గదుర

భావవృత్తితోడఁ ర్ బం డ్రెండువర్షము
లుండె నట్టు లుండ ర్ నొక్కనాఁడు. 258

క. జాలరులు వలల నచ్చటి,మీలఁ దిగుచు చుండి యయ్యర్ మేయో గ్రతప
శ్శీలునిఁ గూడఁగఁ దిగిచి భ,యాలోలమనస్కు లగుచు ర్ నమ్మునిపతికిన్. 259

ఆ. చాఁగి మ్రొక్కి తప్పు ర్ సైఁపు మెఱుంగమి,నింత వుట్టె సంయర్మీంద్రమమ్ముఁ
బరమకరుణఁ జూచి ర్ పనుపుము దీనికి, నేమి సేయువార ర్ మింక ననుడు. 260

క. జలచరములపై నర్మిలి, గలిగెడుమదిఁ దాల్చి చేర్చి ర్ కారుణ్యము బో
యలమీఁద నించుకేనియు, నలుక వొడమనీక యుండె ర్ నతఁ డవికృతుఁడై.

వ. ఏటిదరికిం దిగువంబడినమీలడెస వారికిం జూపి వారితోడ. 262

తే. వీనితోడిసంవాసంబు ర్ మానసమునఁ, జాల నర్మిలిఁ బెనిచె నిర్మీలతోడఁ
గూడఁ బ్రాణంబువిడుచుటర్[1] గూడదండ్రె,జనులుగావుననటుసేయుఁర్డనఘులార.

వ. తగిన తెఱంగు సెప్పెద వినుండు. 264

క. ఇమ్మీలను నన్నును మీ, రమ్మికొనుఁడు సేయువెలల ర్ కనుటయుఁ గడుశీ
ఘ్రమ్మున నహుషుకడకుఁ జని, యమ్ముని తెఱఁ గెల్లఁ జెప్పిర్రలుకుచు బోయల్.

వ. చెప్పిన భయంబును సంభ్రమంబును బెనంగొన నమ్మనుజపతి మంత్రిపురోహిత సహితంబుగా నప్పరమమునిపాలికిం జనుదెంచి సాష్టాంగదండప్రణామంబు సేసి బోయలు సేసినయపరాధంబు నేమిభంగిసీఁగువాఁడ నని విన్నవించిన నద్దయాళుం డి ట్లనియె. 266

క. బోయలు నిజకులధర్మము, సేయుట యపరాధ మగునె ర్ చెప్పెద విను వీ
రాయాసపడిరి వీరికి, నాయొడలికిఁ దగినవెల జర్న స్తుత యీవే. 267

క. అనుటయు మునివరుమనమునఁ, గినుక యొకింతయును లేమిర్కిం బ్రీతుం డై
జనపతి [2]కిరాతులకు నిం, డని పనిచెను వేయుమాడ ర్ లాత్మసచివులన్. 268

వ. పనిచిన నప్పలుకులు విని యమ్ముని యమ్మనుజవిభునితోఁ దగ వెఱిఁగి యిత్తు గా కనవుడు నప్పుడమిఱేఁడు పదివేలు సెప్పిన నప్పరమసంయమి యప్పటిమాటయ యాడిన నారాజు లక్ష యుగ్గడించె దానికిం దపస్వి ముందటిపలుకు వలికిన నతండు కోటి యి మ్మనియె నమ్మాటకు నమ్మహాత్ముండు. 269

క. తల విసరి వెల దగఁగ బో,యల కీ వలదయ్య యనిన ర్ నన్నరపతి వా
రల కిల సగ మిచ్చెద నని, పలికిన నప్పలుకు ద్రోపు ర్ వడ ముని వల్కెన్.270

ఆ. రాజు దనమసకలర్ రాజ్యంబు బోయల, కిత్తు ననుడు నమ్మునిర్నీశ్వరుండు
నీవు మంత్రివరులుర్ నెయ్యురఁ దలపోసి, యుచితమైనమూల్యర్ మొసఁగు మనియె.

వ.అనిన విని విషాదంబుతో నహుషుం [3]డవులం జని సచివులుం దానును నింక నేమి సేయువాఁడ నని చింతిల్లుచున్నసమయంబున నయ్యెడకు గవిజాతుం డనుసంయమి

1. గ. గూడ దండ్రు...నటు సేయ ననఘులార. 2. క. కైవర్తుల కిం డని. 3. గ. డవుల సని.

సనుదెంచి వారలతో మీరు చింత విడువుఁ డే నిమ్మునిపతిమూల్యంబు నిశ్చయిం
చెద ననుటయు నయ్యవనీవిభుం డిప్పరివారంబింతటితో నాపత్ప్రయోధిమునుంగ
కుండునట్లుగా నన్నుం గావవే యనుపలుకు వలికిన నతం డతని కిట్లనియె. 272

తే. గోవులకు బ్రాహ్మణులకును । గుల మొకండె
కమలజుఁడు రెండుదెఱఁగులు । గా నొనర్చె
హవికిఁ బూర్వంబు కారణ । మఖిలమంత్ర
ములకధిష్ఠాన మపరంబు । భూపవర్య. 273

క. వివిధాగమాశ్రయం బగు, నవనీదేవునకు మూల్య । మని వాక్రువ్వఁ
శివునకును గాదు ధరణీ,ధవ గోవును వట్టి దగుటఁ । దగునది యొసఁగన్. 274

తే. అనినఁ బ్రియ మంది నృపతి సం । యమిసమీప
మునకు వచ్చి మహాభాగ । ననుఁ గృపార్ద్ర
దృష్టిఁ జూడుము భవదీయ । దేహమునకు
నింతవెల యన వచ్చునే । యేరికైన. 275

క. మునినాథ గోవు నిచ్చెద, ననవుడు వికచముఖుఁ డగుచు । ననుగుణమూల్యం
బున సంప్రీతిం బొందితి, నని భృగుకులముఖ్యుఁ డిట్టు । లను నహుషునితోన్.

క. గో వగ్నిమయ మమృతమయ, మోవసుధాధీశ వినుము । హోమవిధాన
శ్రీవాహిని నిచ్చెన త్రిద,శావాసంబునకుఁ బూజ్య । మమరుల కైనన్. 277

చ. అని యిటు లేర్పడం బలికి । యాతలఁ బెంతయు మేలు గోవు ని
మ్మనఘచరిత్ర యన్న విభుఁ । డట్టుల చేసిన బోయ లప్డు నె
మ్మనములు మోద మంద గరి । మంబున భార్గవుఁ జేరి మమ్ముఁ గ
న్గొనినది యాదిగాఁ గరుణ । గూరెద వొక్కటి విన్నవింతుమే. 278

క. అని ప్రీతిఁ బలికి యమ్ముని, యనుజ్ఞఁ గొని మమ్ముఁ గావు । మక్కటికమునం
గొనవయ్య గోవు మాచే, నన విని మొగమోట మనము । నార్ద్రితఁ బెనుపన్.

తే. వేఁడికొనినట్టికృపణుపై । వాఁడిచూడ్కి
యరయ నాశీవిషముచూపు । నట్ల కాన
చేయఁ బ్రార్థనాభంగంబు । మీ యభీష్ట
మాచరించెద నని గోవు । నతఁడు గొనియె. 280

వ. కొని యంత నిలువక. 281

తే. దర్శనప్రీతి వారిపైఁ । దగుల మీఁ, వలనియర్మిలి మనమున । దళముకొనఁగ
మీరు మీలును సమ్మోద । మార దివికి, నేఁగుఁ డని పల్కె భార్గవుం । డెల్ల వినఁగ.

వ. పలికినం దత్క్షణంబ. 283

తే. మీనములుఁ దారుఁ దనువుల । తోన నెగసి

నాకలోకంబునకుఁ బోవ । నహుషనృపతి
సపరివారంబు గాఁగ నాశ్చర్యపూర
మగ్నమానసుఁ డయి యుండె । నూపవేంద్ర. 284

వ. అప్పుడు. 285

క. చ్యవనుఁడు గవిజాతుఁడు న, య్యవనీశ్వరుఁ బిల్చి వరము । లడుగుము రెండేఁ
దివిరితి మనుడు నతఁడు మి, [1]యవిరళసంప్రీతికంటె । నర్థము గలదే. 286

తే. అనిన విని యగ్గలం బైన । యాదరమున, వారు ధర్మపరత్వంబు । వాసవాభ
వైభవము నయ్యెడును నీకు । వంశపావ, నాత్మ యనుచు నంతర్హితు లైరి వత్స.

క. మది సద్భుతంబుఁ బ్రమదముఁ, బొదలఁగ నమ్మునులమహిమఁ । బొగడుచుఁ జనియెం
దదనంతరంబ పతి నిజ, సదనమునకు నెల్లజనులు । సమ్మద మందన్. 288

వ. అని చెప్పి భీష్ముండు. 289

క. వినిపించితి సంవాసం, బున దర్శనమునను జిత్తమున । నధికస్నే
హానిరూఢి గల్గుటయు గో, వునందుఁ గలగౌరవముఁ । జెవుల కింపెసఁగన్. 290

చ్యవనకుశికసంవాదం బనునితిహాసము.

వ. అనిన విని యక్కురువంశవర్యుం డాధర్మధుర్యునితో నాకు నొక్కటి వినుటకుం గుతూహలం బెప్పుడుం గల్గి యుండు నుదాత్తబ్రాహ్మ్యనిధి యైనభార్గవాన్వయంబునం [2]జిత్రతరక్షాత్త్రచరిత్రుం డగుపరశురాముండు జనియించుటయు నుత్తమక్షత్త్రియత్వమహోష్మలం బైనకుశికకులంబునం బరమబ్రాహ్మణ్యవిశ్రుతుం డైనవిశ్వామిత్త్రుం డుదయించుటయును నది యెట్లొకో యనుచుండుదుఁ దొల్లియుఁ గొంత వింటి నిస్సంశయంబు గాదు మహాత్మా మదీయచిత్తాయత్తంబుగా నత్తెఱం గెఱింగింపవే యనుటయు నయ్యనిమిషనదీనందనుండు కుంతీనందనాగ్రజుతోడం జ్యవనకుశికసంవాదం బనునితిహాసంబు వినుము దాన భవత్సంశయంబు వాయుఁ జ్యవనుండు నిజవంశంబునకుం గుశికకులంబు కారణంబుగా సంకరంబు గలుగఁ గలయది యని యెఱింగి యక్కుశికకులంబునకు నుత్పాతం బాపాదింపం గోరి కుశికభూపాలుపాలికిం జనిన నతండు. 291

క. భార్యాసహితముగా న, య్యార్యవరుని కనుగుణంపుటర్చన విధివ
చ్చర్యాపూర్వముగ వినయ, ధుర్యత వెలయంగఁ జేసె । దోహల మమరన్. 292

క. పూజితునిఁ జేసి యతనికి, రాజవరుం డిట్టు లనియె । రాజ్యవిభుత్వ
భ్రాజిష్ణుఁడ వై భృత్యుని, యోజను నను నడపి యేలు । ముర్వి మునీంద్రా. 293

క. ఏనును భార్యయు బంధులు, నానాజనసహితముగ సనాథతఁ గని య
ట్లైనం బెంపుం బొరయం, గా నిలకుఁ బ్రమోద మొందఁ । గైకొను మమ్మున్.

1. క. యవిరళసంప్రియముకంటె నన్యము. 2. చ. జిత్రతరక్షాత్త్రమహిమాచరితుం డగు.

చ. అన విని యమ్మునిప్రవరుఁ డాతని కిట్లను రాజ్యకాంక్ష నా
మనమున లేదు సద్వ్రతము మానితవృత్తిఁ జరించువాఁడ నై
జనవర వచ్చినాఁడఁ బరిచారము నీవును నీదుపత్నియుం
గొనకొని చేయఁగా వలయుఁ గోరిక యింతియ తీర్పు మోపినన్. 295

వ. అనిన విని యాదంపతులు ముదమ్మునం బొదలి యట్ల చేయువార మనిరి తదనం
తరంబ. 296

క. అమ్ముని నభ్యంతరసద,నమ్మునకుం గొని విభుండు నాతియుఁ దానుం
సమ్మోదమ్మునఁ జని హృ,ద్యమ్మగునొకచోటు సూపి యాతనితోడన్. 297

ఆ. అనఘ యిచట నుండు మని పల్కి మృదులత
ల్పంబు నంచితాసనంబు నచటఁ
బెట్టఁ బనిచి యేము ప్రీతి నొనర్చెద
మిష్టభంగిఁ బనుపుఁ డెద్ది యైన. 298

వ. అనియె నంత నినుం డపరగిరి గడచనినం గాలోచితకృత్యంబు లాచరించి యమ్మ
హాత్ముం డాహారం బడిగిన నమ్మహీపతి మహితభోజనంబున నతనిం దృప్తునిం
గావించిన. 299

ఆ. అతఁడు సెజ్జఁ జేరి యధిపుతో నియ్యెడ, నిద్రవోదు నేను నృపవరేణ్య
మీరు నిదుర దక్కి మెలపున నాచర,ణంబు లొత్తుచునికి నాకుఁ బ్రియము.

క. ఏ నై మేల్కనునంతకు, భూనాయకవర్య నన్ను బోధింపకుఁ డీ
మానినియు నీవు నని ని,ద్రానిరతుం డయ్యె వారుఁ దద్దయుభక్తిన్. 301

తే. కుడుపు నిదురయు వర్జించి యడుగు లొత్తు
చుండి రమ్మునివల్లభుఁ డొక్కప్రక్క
నచలగాత్రుఁ డై నిద్రింప నద్భుతముగ
దినము లిరువదియొక్కటి సనియె నధిప. 302

వ. ఇరువదిరెండవనాఁ డమ్మునివరుండు దనయంతన మేల్కని. 303

క. ఇలు వెడలి పోయె నేమియుఁ, బలుకక యాదంపతులును బరమశ్రాంతా
త్మ లగుచు వెనుకన చని ర,క్కులపతి యించుకయు సరకుగొనఁ డవ్విధమున్.

ఆ. అట్లు వారివలన నాదరరహితుఁ డై, పురవరంబు వెడలి పోయిపోయి
యతఁడు సూడఁ జూడ నంతర్హితుం డైనఁ, బతియు సతియు మూర్ఛపాలువడిరి.

క. కొంతవడికిఁ దెప్పిఱి యెద, లెంతయు వగ నూనఁ బురికి నేతెంచి గృహా
భ్యంతరము సొచ్చి కని ర,య్యింతియును విభుండు నమ్మునీశ్వరు సెజ్జన్. 306

వ. మున్ను నిద్రించుప్రక్క దక్కి యొండుప్రక్క నిద్రించుభార్గవునట్లు గాంచి సం
తోషించి పరిశ్రాంతి దిగఁద్రావి యెప్పటిచొప్పున నడుగు లొత్తుచుండ మఱి
యు దినంబు లిరువదియొక్కటి సనినం బ్రబుద్ధుం డై. 307

సీ. అతఁడు తైలాభ్యంగ ॥ మడిగినఁ బతి గమ్మ,నూనియ దెప్పించి ॥ మేను శిరము
నభ్యక్తములు సేయ ॥ నమ్ముని నెడ నాడి, యంతర్హితుం డయ్యె ॥ నపరఘటికఁ
దోఁచి వికారంబు ॥ దోడరక యున్నరా,జును దేవ్రులను గని ॥ సుముఖుఁ డగుచు
నాచరితస్నానుఁ ॥ డగుటయు వారు మ,హార్హ్మంబు లగువివి॥ధాన్నపాన

ఆ. ములు ఘటించి కుడువఁ ॥ బిలిచినఁ జని వాని
నెల్లఁ గాంచి యెక్క॥డేనిఁ బోవు
వార లడలు గదుర ॥ నూరక యుండి రా
పగలు రేయుఁ గురున్ఫ॥పాలవర్య. 308

వ. ఆభృగువంశవరుండు. 309

సీ. వేగినఁ బొడసూపి ॥ నేగంబ యరదంబు, వన్నించు నీవు నీ॥ భామినియు వ
హింపఁగా రథికత ॥ యెసఁగఁ గాంచనరత్న,గోహయములు యాచ॥కులకు నిచ్చు
చును జనవలయు నా ॥ కనుడు భూపతి చేసు, నమకట్టి దాపటఁ ॥ జామ దాను
వలపటఁ బూని యా॥వస్తువు లెల్లను, గొని వచ్చి యా మంత్రి॥జనులఁ బనుప

తే. నెక్కి వారల నాసంయ॥మీశ్వరుండు
నిశితతర మగుమునికోల ॥ నెత్తు రొలుక
మోవుచును దీనకోటికి ॥ నాపదార్థ
చయము నెడనెడ నొసఁగుచుఁ ॥ జనుచు నుండె. 310

వ. పెక్కుదినంబు లాహారనిద్రలు లేమింజేసి డస్సిఁ దూలు నమ్మహీపాలు నమ్మహిషి నమ్ముని ములుకోలపోట్ల నట్లు వ్రూచినమోమువులచందంబు నొందింపఁ జూచి జనంబు లల్లన తమలోన నిట్టితపోమహిమయుం గలదే యిని యన్యాయ్యం బని యలుగను దగవు వలుకను దేఱిచూడను రాదయ్యెడు నీదంపతులధీరత్వంబును నిష్ఠాపరత్వంబును నింత యొప్పునే దుర్వహం బగుభారంబు నిర్వికారులయి వహించుచున్న వా రనుచు నుమ్మలింపుచుఁ బరివేష్టించి చనం జ్యవనుండు పురంబు వెడలి వారిమనంబుల వికారంబులు గానకయచ్చెరువును మెచ్చును జెనంగొనుహృదయంబుతో నరదంబు డిగ్గి వారలశిరంబులం గట్టినపగ్గంబులు విడిచి శరీరంబులు కరంబున సంస్పర్శించి యజ్జనపతియాననం బాలోకించి డస్సితి గదే వరం బిచ్చెద వగపు దక్కి పురంబునకుం జను మేను గంగాతీరవనంబున వ్రతచర్యాశేషంబు నిర్వహించెద నీవు మహిషీసహితంబుగా నెల్లి నాకడకుం జనుదె మ్మని పలుకుటయు నాకు వగ పెక్కుడి దని పలికి యవ్విభుండు. 311

క. తనతనువు వనితమేనును, గనుఁగొని యచ్చెరువు ముదముఁ ॥ గడలుకొనఁగ న
మ్మునితో భవత్ప్రభావము, గొనియాడఁగఁ దరమె మాకు ॥ గురుతరకరుణా. 312

వ. అని వెండియు. 313

తే. శ్రమము లేదు వ్రతోద్భవ॥ణములు లేవు

నాతియును నేను నెలజవ్వ|నంబుఁ గంటి
మిది మహాద్భుతతర మంచు| మే భవన్మ
హానుభావత్వ మేమి సే|యుదు మునీంద్ర. 314

వ. అని సవినయంబుగాఁ దానును దేవియు దండప్రణామంబులు సేసి యాసంయమి
వరు వీడ్కొని సాద్భుతచిత్తులై నసకలజనులుం బరివేష్టింపఁ బురంబుఁ బ్రవేశించి
ప్రమోదమయమూర్తులగుచు దివసవర్తనంబును రాత్రిచర్యయుం గడపి సూర్యో
దయం బగుటయు. 315

క. వారలు ప్రాతస్సమయా,చారంబులు నడపి భక్తి|సంపద లొదవన్
గారవమున మునినిర్ది,ష్టారణ్యమ్మునకుఁ బోయి| రవనీనాథా. 316

ఆ. అచట మణిమయంబు| నతిసుందరము దివ్య,సదననిభము నగువి|శాలరమ్య
హర్మ్య మున్నఁ జూచి| యచ్చెరు వందుచి,త్తములతోడఁ జనఁగ| దానిచుట్టు.

చ్యవనుఁడు దపోయోగబలంబునఁ గుశికునకు నాకలోకంబు సూపుట.

సీ. స్వాధ్యాయసంగీత|సాహిత్యవర్తన,మాననీయము లగు|మండపములుఁ
గోకిలశుకభృంగ|కేకులనాదముల నభి,రామంబులై నయా|రామములును
హంససారసరవా|త్యంతమనోజ్ఞంబు,లై సొంపు మిగులుప|ద్మాకరములుఁ
జారుమయూరకే|కారుతకలితంబు, లగుచు నొప్పారుక్రీ|డాచలములు

తే. వీనులకుఁ జూడ్కులకు నింపు| వెల్లిగొల్ప
నేర్పు గలిగినవిభవంబు| నెఱయ మెఱయఁ
గరము విలసిల్లు చునికి నా|కంబు వేడ్క
నయ్యెడకుఁ గాఁపు వచ్చిన|యట్టు లుండె. 318

క. సురలును గంధర్వులు న,ప్సరోనికాయములు వివిధ|సరసవిహారా
దరలీలల నందెడనెడఁ, జరించుచుండిరి నితాంత|సమ్మోదమునన్. 319

తే. అవ్విధంబున నారాజు| నంగనయును
మనము లద్భుతరసమున| మునుఁగు చుండఁ
గలయొకో యిది నిక్కమ| కానినాఁడు
మిగుల ననుభవగోచర| మగునె యిట్లు. 320

వ. అని వెండియు. 321

క. ఉత్తరకురుభూమియొ లో,కోత్తర మగునట్టినాక|మొకొ తనువులతో
నిత్తాపసవరునికరుణ, నిత్తెఱఁగున సంభవించె| నిచ్చోటు సొరన్. 322

వ. అనుచు నమ్మహనీయహర్మ్యంబు సొచ్చి యందు మణిమయపర్యంకంబునం బవ్వ
ళించియున్నయప్పరమమునిం గని రపరక్షణంబున నతం డంతర్ధానంబు సేసె నతని
తోడన యామేడయు మున్ను గన్నయశేషవిశేషంబులును నదృశ్యంబు లయ్యె
నయ్యిరువురు నిట్టట్టు మెలంగి యక్కానన నొక్కెడఁ గౌశబృసీసమాసీనుండును

జపపరుండును నైనయాసంయమివరు నాలోకించి రల్లు గాంచి భూవిభుండు భార్య
తో ని ట్లనియె 323

తే. ఉవిద మునియోగబల మిట్టు లుండునే య
మానరాజ్యంబు సులభంబు మానవులకు
బ్రాహ్మణత్వంబుఁ దపము దుర్లభము తపము
కలిమిఁ జేయుచు నున్నాఁడు వలసినట్లు. 324

చ. అనునెడ నిందు రం డని సమాదర మొప్పఁగ వారిఁ బిల్చె న
మ్ముని నరనాథుఁడున్ సతియు మోడ్చినచేతులతోడఁ జేరఁగా
జని ధరఁ జాఁగి మ్రొక్కుటయు సంయమి దీవన లిచ్చి రాజునా
ననమున సుప్రసన్ననయనప్రభ పర్వఁగ నెమ్మి నిట్లనున్. 325

ఆ. మనసు నింద్రియములు మనుజేంద్ర యింతవ,శ్యంబు లగునె నీకుఁ బరయఁగీడొ
కింత యైన లేదు సంతస మందితి, నిత్తు వరము వేఁడు మెద్ది యైన. 326

క. అనిన విని యగ్నికల్పుఁడ, వనఁ జనునీమది ప్రసన్న మగునట్టులుగా
మునిజనవంద్యా కొల్వం, గనుకంటెను మిగుల మేలు గలదే కోరన్. 327

వ. అని పలికి కుశికుండు వెండియు. 328

తే. ఒకటి యడిగెదఁ గృప సిగు రొత్తఁ జెప్ప
వలయు మీరు మాయింటికి వచ్చి యొక్క
ప్రక్క క్రిందుగ నిరువదియొక్కదినము
లనఘ నిద్రించి తది మొద లైనసీమ. 329

క. చరితం బద్భుతము మునీ,శ్వర దీనికిఁ గారణము విచారమున కగో
చర మెఱిఁగింపు మనుడు నా,ధరణీవల్లభునితో నతం డి ట్లనియెన్. 330

వ. సురలు మునులు సురజ్యేష్ఠుం గొలిచి యుండం బ్రసంగ(వశ)ంబున నప్పరమేష్ఠి
వారలతో భృగుకుశికవంశంబులకు బ్రహ్మక్షత్రంబులు దడంబడి సంకరంబు
వాటిల్లు నని చెప్పె నప్పు డే నచట నుండి వినుటం జేసి యాసంకరంబున కోర్వక
మీయన్వయంబు నిర్మూలంబు సేయువాఁడ నయి వ్రతంబు నెపంబిడి భవద్గృ
హంబు సొచ్చి యిన్నిపోకలం బోయితి నలసి డస్సి యెప్పుడేని మీర లడ్డ
మాడుదు రప్పుడ శపింతు నిట్టిద నాయెత్తికోలు మీయందు ధైర్యహానియు
శోకంబును గోపంబును లేమికి మెచ్చి వరం బిచ్చియుం దనివి సనక తనువుల
తోడన మీరు నాకలోకం బాలోకించునట్లుగా నీగంగాతీరంబున సంఘటించితి
దానిం గని నరేంద్రత్వంబుదెస నుదాసీనభావంబు నొంది బ్రాహ్మణ్యంబునందు
సస్పృహుండ వై తది యెఱుఁగుదు నీకు మూఁడవవాఁడు బ్రహ్మతేజోదీప్తుండయి
జనియించు వరంబు వేఁడుమనుటయు నమ్మానవపతి దీనికంటెను గడచినవరంబును
గలదే మదీయసంతానంబు బ్రహ్మత్వప్రాప్తమహత్త్వనిరూఢంబును గాఢధర్మ

తత్ప్రకారంబునంగా ననుగ్రహింపు మనిన నమ్మునియట్ల యయ్యెడు [illegible]
నీమనుమనుమండు త్రిలోకపూజనీయుం డని పల్కిన నప్పలికి వాఁ డమికతంబున
బ్రాహ్మణుం డగు నత్తెఱం గెఱింగింపవే యనవుడు నత్తాపసోత్తముండు విను
మస్మద్వంశంబున ఋచీకుం డనువాఁడు జన్మించి నీతనయుం డైనగాధి యనియెడు
వానిపుత్త్రి భార్యఁగాఁ బరిగ్రహించు నత్తపోధనునందనుం డగుజమదగ్ని
యందు సమస్తధనుర్వేదంబును నావహించు నవ్విశేషంబు తత్పుత్త్రునందు ఫలి
యించు నది యంతయు సకలక్షత్త్రియక్షయకారి యైనదైవంబుకృత్యంబు దాని
వలన ఋచీకగాధివధూజనానుష్ఠానపరివర్తనంబు గలుగునది కారణంబుగా నుగ్ర
క్షత్త్రధర్ముం డగుపరశురాముండు జమదగ్నికిం బరమబ్రాహ్మణ్యాగణ్యుం డయిన
విశ్వామిత్త్రుండు గాధికి జనియింతురు బ్రహ్మపలుకు సత్యంబ యున్నదన్వయంబు
భార్గవకులసంబంధంబున జనశ్లాఘనీయం బయి వెలయంగలయది గాన దీర్థంబు
నకుం జనియెద నీవు సుఖివై యుండు మని చెప్పుటయు నప్పుడమిఱేఁడు భార్యా
సహితంబుగ సవిశేషవినయం బగువందనం బాచరించి వీడ్కొని చనియెఁ జ్యవ
నుండును నిజేచ్ఛం జనియె నిది పరశురామవిశ్వామిత్త్రజన్మప్రకారంబు. 331

## భీష్ముండు ధర్మజునకు దానవిశేషముల నెఱింగించుట.

క. అని కురుపితామహుండు సెప్పిన విని ధర్మాత్మజుండు ప్రియ మందుచు నా
తనితో దానవిశేషము, లనఘా యెఱిఁగింపు మనుడు నతఁ డి ట్లనియెన్. 332

సీ. కాంస్యోపదోహయుఁ గాంచనచారుశృంగయు ధవళాంబరకలితయును స
దక్షిణయును నయి తగుగోవుఁ బాత్త్రత్వ, భవ్యవిప్రునకు సద్భక్తితోడ
నిచ్చిన దానికి నెన్నిరోమము లన్ని, దివ్యవత్సరములుఁ ద్రిదశలోక
మున వసింతురు కులంబున యేడుదరముల, జనముల సుగతికి ననుతు రధిప

ఆ. కన్య భూమి గృహము గనక మన్నము జల, మంబరంబు శయన మాసనంబు
వాహనంబు విప్రవరునకు నీఁగి లో, కములు రెంట సౌఖ్యకారి యండ్రు. 333

క. అనిన విని పాండవాగ్రజుఁ, డనఘా యిన్నింటికంటె నధికం బగుదా
ని నెఱింగింపు మనుడు న, జ్జనపతి కి ట్లను నతఁడు ప్రసన్నాత్ముఁ డై. 334

తే. అర్థి గోరినవస్తువు లర్థితోడ, నీఁగి యెల్లదానములకు నెక్కుడరయ
నఖిలభూతమ్ములకు నభయంబు నిచ్చు, టంతకంటెను మే లందు రార్యజనులు.

వ. అని చెప్పి విను మని మఱియు ని ట్లనియె. 336

తే. వీరశయనంబు మే లండ్రు వీనికంటె, మఱియుఁ గొన్నింటికంటెను మనుజనాథ
దానముల కావు వెదకిన దానిఁ బోల, లేవు పుణ్యకర్మములలో నేవి యైన. 337

వ. అనుటయు ధర్మజుండు దమ్ములదెసం గనుంగొనిన వార లతనిచిత్తం బెఱింగి
రణమరణస్తుతి సేయ నతండు సమరంబునం జచ్చినబంధుమిత్త్రజ్ఞాతిజనంబుల

వలనిశోకంబు వదలి సురవాహినీనందనవాక్యంబు లభినందించె నాదేవవ్రతుండు వెండియు. 338

క. అరియైన నేనుఁ డై తను, శరణం బని వేఁడినం బ్రసన్నాత్మత న
ప్పురుషునికోరిక దీర్చినఁ, బురుషోత్తముఁ డందు రతనిఁ బురుషవరేణ్యా. 339

క. అడుగక యున్నను నాలిం, గొడుకుల రక్షింప లేక కుతిలపడుచు నె
ప్పుడుఁ బేదతనము గలసరు, నెడ రుడుపఁగ వలయునది మహితగుణ మనఘా. 340

క. నిజదారపరులు సంతత, యజనరతులుఁ గామరోషహంతలు నగున
ద్విజుల నరసి ధన మిచ్చుట, త్రిజగత్పూజ్య మగు నండ్రు ధీరవిచారా. 341

వ. అనినం బాండవాగ్రజుండు యాచనాయాచనంబులలో నెయ్యది దానార్థం బగు నని యడిగిన నతనికిఁ బితామహుం డి ట్లనియె. 342

చ. అడిగిన నిచ్చుకంటెను నయాచకుఁ గాఁగ నెఱింగి యిచ్చు టె
క్కుడుఫల మిచ్చు దానవిధి కోవిద వేఁడుట సావు వేఁడఁగాఁ
బడు టది పెద్దసావు దగుప్రార్థన పూర్ణము సేయునాతఁ డా
యడిగినవానిఁ దన్నును దయారతిఁ గావఁగఁ జాలువాఁ డగున్. 343

వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 344

క. దానము యజ్ఞక్రియ నాఁ, గా నతులితధర్మవిధులు గల వందు ధరి
త్రీనాథోత్తమ యధికఫ, లానూనం బై వెలుంగునది యెయ్యదియో. 345

వ. విన వలతుం జెప్పవే యని యడిగిన నయ్యనిమిషనదీనందనుం డప్పాండునందనాగ్రజున కి ట్లనియె. 346

ఉ. భూసురకోటికిన్ వినయపూర్వముగా ధనధాన్యగోమణి
క్ష్మాసలిలాన్న ముఖ్యములు సమ్మతి నీగి సుయజ్ఞ మాసనో
ద్భాసితసత్క్రియన్ నడపు భవ్యుఁడు యజ్ఞములుం దపంబులుం
జేసినపుణ్యముం బడయుఁ జేయుము దానము లోపి నిత్యమున్. 347

క. అనవుడు నాతనితో ని, ట్లనుఁ గుంతీతనయముఖ్యుఁ డనఘా పెక్కుల్
వినఁబడు దానము లధికం, బనఁ దగియెడుదాన మెద్ది యన్నిటిలోనన్. 348

వ. అని యడిగిన నయ్యాపగాసూనుం డమ్మానవపతి కి ట్లనియె. 349

### భూదానమహిమాభివర్ణనము.

క. దానము లన్నిటికిని భూ, దానం బెక్కుడు సమస్తధాన్యములుఁ బ్రభూ
తానేకవస్త్రధనర, త్నానూనత్వమును భూమి నవుటకతమునన్. 350

క. కనకము రజతము వస్త్రం, బును ధాన్యము వివిధరత్నములు నిచ్చినయ
వ్వినుతఫలంబుల నెల్లను, గను నుత్తమభూమిదానకర్త నరేంద్రా. 351

సీ. భూమి కెంతాయువు భూదానకర్తయు, నంతకాలము సుఖ మందు చుండు
నమరలోకంబున నల్ప మైనను భూమి, యిచ్చిన బహుభూమి యేలు నతఁడు

రాజు విశేషించి రణమ్మృతి యొందెను, భూదానకర్తృత్వపుణ్య మొందెఁ
బడయంగవలయుఁ బాపఁగ నోపు బ్రహ్మహత్యాదిపాతకముల నైన భూమి
తే. దాన మెంతిపాపాత్ముచే నైన భూమి
గొనినఁ గల్మష మొందదు వినుము మహిత
మైనభూదానవిధియును నశ్వమేధ
యాగమును సదృశంబు లం డ్రాదిమునులు. 352

క. దారిద్ర్యముచేఁ గుందుచు, నేరిని నడుగంగఁ బోవ కెంతయుఁ గృశతం
గూరినవిప్రున కుర్వర, వారనిదయ నీగిఫలము వాగ్గోచరమే. 353

తే. యాగకర్తయు శాంతుండు నైనయట్టివిప్రుఁ బ్రార్థించి యైన నుర్వీప్రతిగ్ర
హంబు సేయించు టత్యధికంబు భూమిదానవిధివిశేషంబులలోన నెల్ల. 354

క. విను మర్త్యుఁ డైనవిప్రున, కనఘా గోచర్మమాత్ర యగుమేదిని ని
చ్చినఁ బోనియట్టిపాపము, నినుపొడువునఁ జెడనితమము నెందును గలవే. 355

క. అజిప్రాప్తమృతులు గురుపూజకులును మఱియు నెట్టిపుణ్యాత్మకులుఁ
రాజోత్తమ భూదాన,భాగ్జిష్ణునిఁ బోల రంత్రు పరమమునీంద్రుల్. 356

వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను భూదేవి జనులకు హితంబుగా నానతిచ్చిన
వాక్యంబులు భూగీత లనం బరఁగు వాని విని పరశురాముండు భూదానపరుం
డయ్యె నని విందుము పాండవాగ్రజా యవి నీ వాకర్ణింపుము. 357

క. నను నిండు రెండులోకములను జెడనియశస్సుఖంబులం బడయఁగఁ గో
రినయ ట్లియినను దీనికి, నెన లేవుసుఁడీ తలంప నేధర్మములున్. 358

చ. ఇతరులదానమేనిఁ దమయియాగియయేనిని నన్ను మార్తురే
మతి నరకాధివాసగతి మాన్పఁ దలంచుట గల్గినన్ సమం
చితముగ భక్తి నిచ్చుట కుశీలత మార్చుట నాకు హర్షభా
సితయుఁ బరాభవవ్యథయుఁ జేఁతసుఁడీ యిదె చాటి చెప్పెదన్. 359

క. వినుఁ డుభయలోకముల మే, లొనరింతుం గీడొకింతయును నిలువఁగనీ
క నిరాసంబు నొనర్తును, నను నిచ్చిన నెట్టిదుర్జనములకు నైనన్. 360

వ. అనియె నని యువ్వాక్యంబు లుపన్యసించి దేవవ్రతుం డన్నరదేవోత్తమునకు మ
ఱియుం జెప్పు నవ్విషయంబున నింద్రుం డడుగ బృహస్పతి సెప్పినవచనంబులు
వినుము చెప్పెద. 361

ఆ. భూమి రత్నగర్భ పురుహూత యటు గాన, కలుగు భూమిదానకర్త యైన
వాని కశ్వహస్తివనితాదిసర్వరత్నములు నిచ్చునట్టియమితఫలము. 362

క. వసుదాయిని యైనవసుధ, నొసఁగినతనిఁ దన్ను తన్న యొసఁగె ననుచు సం
తసపడు భూతము లన్నియు, నసమానము భూమిదాన మమరాధీశా. 363

క. విను రాజులకు నవశ్యంబును జేయఁగ వలయు నధికభూదానము రా

జనువాఁ డఘముల కాకర, మనఘా యది దక్క నొంట నది వ్యయ మగునే.

ఆ. పూర్వదత్త మైన భూమి నెవ్వఁడు వుచ్చి, కొనియె నతఁడు దనపురకులమువారి
నిరువదొక్కతరము నరకవాసులఁ జేయు, దాను [1]పడుము గాఁగ ధర్మనిరత.

క. మును దా విప్రున కిచ్చెద, నని భువి యీ కుండుకంటె నధికపుఁబాపం
బును నడుగ కిచ్చుటకు మిగి, లినపుణ్యము నెందు నరయ లే దండ్రు బుధుల్.

వ. అనిన విని యజాతశత్రుండు సురనదీపుత్రుతో దానపరు లయినమానవులకు దాతవ్యంబు లగువానివిశేషంబు లెఱింగింపవే యనుటయు నతం డన్నకనక పానీయప్రముఖంబు లైనపదార్థంబులవిశేషంబులు గల వవి యెఱింగించెద నొక్కనాఁ డన్నంబువిషయం బైనదానంబుప్రకారంబు. 367

క. ఏ నడుగఁగ నారదముని, మానితముగఁ జెప్పినట్టిమాటలు సువ్య
క్తానూనవృత్తిఁ జెప్పెద, భూనాయక యేకచిత్తమున విను వానిన్. 368

క. మునులును దివిజులు నన్నము, వినుతింతురు లోకతంత్రవిధి క్రతువులుఁ ద
క్కనుగలసర్వము నన్నం, బున నడచుం గాన యన్నము విశిష్ట మిలన్. 369

ఆ. అన్నదానసదృశ మగుదాన మెందు నెన్నఁడును లేదు గావున విధేయ
మన్నదాన మధికయత్నపూతంబుగాఁ, బూని దానిచేత పుణ్యాతమము. 370

సీ. ప్రాణంబులకు విధారక మన్న మింటిజ, నంబుల కుడిగి దైన్యమను సుభక్తి
నతిథికిఁ బెట్టుట యధికపుణ్యము శ్రాంతు, వృద్ధుఁ దాపసు బాలు వికలు వనితఁ
గడపఁ గా దాఁకలి గదిరి యర్థించిన, గృహమేధి కనమతి గినుక దగదు
కాలంబుతోఁ గుక్క మాలఁడు దుది గాఁగ, నాఁకొని వచ్చిన ననుగుణముగ

ఆ. నాచరింపవలయు నాహారకల్పన, మునుల దేవపితృసముత్కరముల
నన్నదానవిధుల నాదరంబుగఁ బ్రియ, మొందఁ జేతఁ బోల వొండువిధులు.

క. కులమును విద్యయు వృత్తము, నలఘుమతీ యన్న మిడుటకై యడుగంగా
వలవదు విప్రుని [2]నాదగ, మలరంగా నిడుట లెస్స యడిగినమాత్రన్. 372

వ. అని వెండియు. 373

తే. అజుఁడు కల్పాదియం దన్న మమృత మనియె, నన్నహాని బలాధికు లైన దుర్బ
లాత్ములగాఁ జేయుఁ గావున [3]నన్నభుక్తి, సకలధాతువృద్ధికి నయిజనము గోరు.

క. అని యతఁడు వల్కె ననియును, విని యన్నము సవినయముగ విప్రాదులకుఁ
మనుజేశ యిడుదు నీవును, మన మలరఁగఁ బెట్టుమీ సమస్తజనులకున్. 375

ఆ. అన్న మిడిన మణిమయావాసశయ్యాస
నములు నమృతభోజనంబు హృద్య
మాల్యలేపనములు మహనీయమహిళాను
భవముఁ జిరత నొందు దివమునందు. 376

---

1. క. మున్ను గాఁగ. 2. గ. నుదరం, బలరంగా. 3. జ. నన్నభక్తి.

నక్షత్రదానమహిమాతిశయనిరూపణము.

వ. అనిన విని యుధిష్ఠిరుండు నక్షత్రవిషయంబులైన దానంబుల తెఱం గెఱింగింపవే యనుటయు నిట్లు దేవకీదేవి యడుగ నన్నారీరత్నంబునకు నారదుండు సెప్పిన వాక్యంబులయర్థంబు లుపన్యసించెద నాకర్ణింపుము. 377

సీ. [1]కార్తెఁ బాయసమబ్జగర్భునితార నూపములు మాంసమ్ము నంజంగఁ గలుగు
నన్నంబు శశితారయందు గో వార్ద్రి నదితితారఁ బులగంబు నేపు గలయు
నట్టులు గురుతార నధిప సువర్ణ మాశ్లేష రూప్యము మఖఁ జెల్లు నువ్వు
తిలలు భగుం డధిదేవత యగుతారఁ జెఱకుఁ దేనియ నుపాసిక్త మైన

తే. భక్త ముత్తరఫల్గునిఁ బాలతోడ
షాష్టికాన్నంబు రవితార సకరిరథము
చిత్తనాఁడు శ్రీగంధపుఁ జెక్క స్వాతిఁ
దనకుఁ బ్రియ మైనయది మేలు దానమునకు. 378

సీ. అనఘ విశాఖ నెద్దనురాధఁ బైచీర, వినుము జ్యేష్ఠ దగఁ గఱివేము గూర్చి
ముల్లంగి మూల సమ్మూలఫలంబుఁ బూర్వాషాఢఁ బెరు వుత్తరాఖ్య మైన
యాషాఢ మాక్షికార్ద్రాన్నంబు హరినను, జలతారకమునఁ గంబళము గుజ్జు
లమరినబండియు [2]యవలుఁ బూర్వోత్తరా, [3]భాద్రపౌష్ణాశ్వినీభరణులందుఁ

తే. [4]గ్రొవ్వ గలమేఁకనంజుఁడు గోఁటియెఱచి
గంచుకుండతో మొద వశ్వకలితశకట
మతులతిలధేను లీఁ బాడి యఖిలతార
కముల నీగులు నూర్ధ్వలోకములఁ జేయు. 379

వ. అని యెఱింగించి యమ్మానవపతితో నమ్మాననీయుం డిట్లనియె. 380

క. అలఘుతరసకలకామ్యంబుల నిచ్చినయట్టిమహితపుణ్యం బైతా
వెలుఁగుఁ గనక మిచ్చుట యని, పలికెం గృష్ణుఁ డత్రి పరహితచరితా. 381

తే. కనక మాయుఃప్రదంబు పావనము భావ, శుద్ధి నొనరించు దాతకు సువ్రతమున
వేడ్కతో దాని నిచ్చుట వేఱ పొగడ, నేల యనియె హరిశ్చంద్రుఁ డిద్ధతేజ.

క. పానీయదాన ముత్తమ, దానం బని యఖిలధర్మతత్త్వదృఢపరి
జ్ఞానానూనుం డగుమను, మానవపతి సెప్పె నృపసమాజవరేణ్యా. 383

క. కావునఁ జెఱువులు నూతులు, బావులుఁ గొలఁకులును నెపుడుఁ బౌరవవర్యా
కావింప వలయు నవి గడుఁ, బావనములు పుణ్యలోకభాగిత నిచ్చున్. 384

క. అనఘా యెవ్వని కావిం, చినసలిలాశయమునందుఁ జెలఁగుచు గోవుల్
గొను నీ రాతనివంశం, బున కవి గావించు నూర్ధ్వభువనప్రాప్తిన్. 385

1. గ. కర్త్య. 2. జ. నగలుఁ. 3. అ. భాద్రలఁ బౌష్ణాశ్విభరణు. 4. అ. గొఱలు రాజమాషంబులు గోఁటియ.

తే. ఆఁక లేక యెవ్వాని జ । లాశయమున, మంచు వేసవి యందును । మనుజకోటి
యవభృథస్నానపానంబు । లాచరించు, నతఁడు వొందఁడు విషమదు । ర్గాభిగతులు. 386

క. యాగాదికర్మముల కుప, యోగింపంబడుటఁ జేసి । యుత్తమము ఘృతం
బాగురువస్తువు నిచ్చుట, యాగములకు నగ్నికిం బ్రి । యంబై యుండున్. 387

తే. గరగ లోఁగిన నరుఁడు భూ । సురులొనర్చు
నాచమనముఖకర్మంబు । లందు షష్ఠ
భాగఫల మొందు నెగడికిఁ । బాచనమున
కింధనము లిచ్చి ధనముల । నెసక మొసఁగు. 388

ఆ. ఛత్త్ర మిచ్చి కాంచుఁ । బుత్త్రులఁ బురుషుండు, సకలకామ్యదాన । సమము శకట
మిచ్చు టనఘ చెప్పు । లిచ్చినఁ గంటకు, లైనరిపులఁ ద్రొక్కి । యతఁడు దిరుగు.

క. తిలలు పితృభోజ్యములుగా, జలజభవుఁడు సేసెఁ బితృని । చయ మలరఁ గనుం
దిల లిచ్చిన శుచు లగుదురు. దొలఁగుం బర్వసురతాది । దోషము లెల్లన్. 390

తే. దివ్యముని యగు కాశ్యపు । భవ్యగాత్రముల జనించి భవ్యంబులై । తిలలు వెలయు
నట్లు గావునఁ దత్కృత । యజన మఖిల, వస్తుయజనంబుతో సరి । వచ్చు నండ్రు. 391

క. తిలదాన మఖిలదానం, బులకంటె విశిష్ట మెల్ల । మునులును నియతిం
దిల లర్హము లగుపాత్త్రం, బుల కిచ్చియ కాదె పెంపు । వొందిరి వత్సా. 392

వ. అని చెప్పి యాపగాతనయుం డొక్కవిశేషంబు వివరింప వలసి ధర్మజున కిట్లనియె.

ఉ. దానము లాదిగాఁ గలుగు । ధర్మము లెల్లను జేతకున్ నిజా
ధీనపుఁజోటు గావలయు । దేవతలున్ మునులుం జతుర్ముఖుం
గానఁగఁ బోయి యజ్ఞముఖ । కర్మసమాచరణార్థ మై తదీ
యానుమతిం దగం బడసి । యయ్యయిచోటుల నాచరింపరే. 394

క. కాననము గిరులు నదులును, నానాతీర్థములు భూజ । వంబుల కెల్లన్
భూనుత సాధారణములు, వానను ధర్మములు సేయ । వచ్చు నిజేచ్ఛన్. 395

ఆ. అధిప నామనమున । యందుఁ దోఁచినయది, యాచరింప వలయు । నర్థ మగుటఁ
జేసి దీని నీకుఁ । జెప్పితి గోదాన, శస్తమహిమ వినుము । విస్తరింతు. 396

సీ. గోవు లెక్కుడు తపో । భావితాత్ములకంటె
ననినఁ దద్ద్వారవం । బునకు మేర
గలదె సత్యాఖ్యలో । కంబున నవి సోమ
సంగతత్వంబున । సంచరించు
వినుతహోమముల కె । ల్లను బాలుఁ బెరుగు నే
యును నిచ్చుఁ గర్షనం । బునకు నొదవుఁ
దోలు శృంగంబులు । వాలంబు రోమచ
యము శకృన్మాత్త్రము । లఖిలవర్త

ఆ. నముల కుపచరించు ♦ శ్రమము శీతాతప,వ్యథయు లేమి నెపుడు ♦ నతిభరంపుఁ
బనులు సేయు గోవు ♦ బ్రాహ్మణుఁ డన నేక,తత్త్వ మగుటఁ బరపదంబుఁ గాంచు.

క. గోవుల విప్రుల కిచ్చిన, నేవిషమపుగతులఁ బొరయ ♦ కేరికి నరుగం
గా వశము గానిలోకము, లావాసంబులుగ నిలుతు ♦ రతిసుఖవృత్తిన్. 398

క. గోవులపా లమృతం బని, దేవేంద్రుఁడు సెప్పెఁ గాన ♦ ధీరత్వనిధీ
గోవు నొసఁగ నమృతము స,ద్భావంబున నిచ్చినట్టిఫల మొడఁగూడున్. 399

తే. అనఘ గోవులు ప్రాణంబు ♦ లని సమస్తమునులు సెప్పుదు రట్లు గా ♦ వునఁ దలంపఁ
బ్రాణదానవిధానసం ♦ ప్రాప్త మైన,ఫలము గోదానకర్తకుఁ ♦ గలుగుఁ జూవె. 400

క. క్రూరునకు నాస్తికునకు దు,రారంభున కిచ్చినం బర ♦ మసుఖమునుం
గూరును గోవది దాతను, నారకిఁ జేయుం బరీక్షణము గడు వలయున్. 401

ఆ. గొడ్డు బడుగుఁ దెవులు ♦ గొంటుఁ గ్రే పెడలిన,దాని నిచ్చు టేని ♦ నూన మైన
యట్టిదాని నొకట ♦ నాయాసపడి యున్న,దాని నీరు గోప్ర ♦ దానవిధులు. 402

క. విను పుణ్యలోకముల కా, వనఘా విప్రులకు గోచ ♦ యంబులఁ బెక్కి
చ్చిన నవి దాతకు మోక్షం,బును జేయఁగఁ జాలు నండ్రు ♦ పూర్వాచార్యుల్. 403

వ. అని చెప్పి గాంగేయుం డన్నపానీయదానఫలాతిశయంబులు వెండియు వినిపింప వేడ్క సేసి యవ్విభున కిట్లనియె. 404

సీ. అధిప యింకను విను ♦ మన్నంబు జలమును, నిచ్చుట యీవుల ♦ కెల్ల నెక్కు
డగుట నేఁ జెప్పెద ♦ నమృతసుధాస్వధా,నామముల్ సురలందు ♦ నాగకులము
నందును బితృకోటి ♦ యందును వర్తిల్లు, నన్నంబునకు నోలి ♦ నట్లుఁ గాక
యది ప్రాణ మండ్రు మ ♦ హాత్ములు గావున, దానిఁ బెట్టుట ప్రాణ ♦ దానసమము

తే. విను విశేషించి తత్పాక ♦ మునకు జల ము
పాశ్రయము చంద్రునకుఁ బుట్టఁ ♦ బట్టు నయ్యె
జలము చంద్రుండు గాఁడె యో ♦ షధులఁ బ్రోచుఁ
గాన యుత్తమ మన్నంబు ♦ కంటె జలము. 405

వ. అని పలికి మఱియును. 406

క. తనకుఁ గలయట్టియన్నము,నన సురపితృపూజనములు ♦ నరునకు నడపం
జను నతిథితర్పణము దా,నన తగ నొనరించువాఁడు ♦ నరవరముఖ్యా. 407

వ. అని నిర్దేశించి తిలదానం బత్యాదరణీయం బని ప్రసంగించి యది విననదియైనను నేమి తద్విషయంబున నొక్క యితిహాసంబు గలదు చెప్పెద విను మని పలికి యని మిషనదీనందనుండు కుంతీనందనాగ్రజుతో నిట్లనియె. 408

### తిలదానవిషయకయమబ్రాహ్మణసంవాదము.

సీ. మధ్యదేశమున గ్రా ♦ మంబు విద్వజ్జన,బహుళ మై యొక్కటి ♦ పర్ణశాల
యను పేర నొప్పారు ♦ నందుల విప్రుని, శర్మినామునిఁ బ్రీతి ♦ జముఁడు పిలువఁ

బనిచి దానముల కెల్లను దిలదాన మెక్కుడు తిలలకుఁ బితృకోటి వేడ్క
సేయుఁ బాపంబులు సెందవు తిలభక్షిఁ, బుణ్యకర్తృత్వంబు బుద్ధిఁ గోరు
తే. దేనిఁ దిల లెప్డు విప్రుల కిమ్ము భక్తి, ననియె వస్త్రదీపము లీగి యతులదాన
మనఘ చీరల దివియలనమరపితృస, మర్చనము సేత పరమధర్మ మని చెప్పె.
వ. అని యిట్లు యమబ్రాహ్మణసంవాదంబు వినిపించి శాంతనవుం డమ్మహీకాంతు
నాననంబు సవిశేషాదరంబున నాలోకించి. 410
క. విను పృథివియును సరస్వతి, యును గోవును దానవిధికి నొక్కంతలు గా
విని యుండుదు వీనిం బో, లినదాతవ్యములు నొండు లే వని వింమున్. 411
ఆ. రాజముఖ్య తగుసరస్వతి శిష్యున, కొసఁగ భూమిదాన మూర్జితముగఁ
జేసినట్టిఫలము సిద్ధించు ధేనువు, నిచ్చుటయును భూమి నిచ్చినట్ల. 412
క. అనయముఁ గొంచెపు వెలకుం, గొన వచ్చును సారభూత గోవును దానం
బున ఫల మధికము దానము, గొనినాతఁడు సుఖము దానఁ గొనుఁ జేసేతన్.
ఆ. దేవపితృసమర్చనావాసములు గోశ, కృత్ప్రలేపనమునఁ గీర్తనీయ
శుచితఁ బడయు ననిన సువ్రత గోవుల, భూరిమహిమ వేయి పొగడ నేల. 414
తే. కుడుపునకు ముంద రొడ్డులగోవునకు స
మంచితగ్రాసముష్టి నిత్యంబు నేడు
గాల మిచ్చిన నతఁ డెల్లకామ్యములును
బ్రాహ్మణుల కర్థి నొసఁగినఫలము వడయు. 415
క. గోదానవిధము సుపథగ, మై దాతకు నెల్లమేలు నాపాదించున్
వేదప్రియ యది దురితో, త్పాదక మగు నాతనికి విపథగత మైనన్. 416

నృగచరిత్రము.

తే. దుష్ట మైనగోదానంబు కష్టవృత్తిఁ, దెచ్చె నృగనాముఁ డగుజగతీవిభునకు
నత్తెఱం గితిహాస మై యవనిఁ బరఁగు, వినుము చెప్పెద దాని వివేకధుర్య.
క. ద్వారవతి నొక్కనూతం, దొరపుఁదను వక్కజ మగుతొండ నొకటి న
చ్చేరువ మెలఁగుజనులు గని, నీ రిది గలఁగించు నిట్లు నిలిచెన యేనిన్. 418
క. అని బలుమోకులు వేగమ, కొని వచ్చి తగిల్చి లావు గొని తిగువఁగ నా
ఘనజంతు వచలితం బై, యునికికి విస్మయము నొందుతనుల్లంబులతోన్. 419
తే. కృష్ణుపాలికిఁ బోయి యక్కౌట మున్న, తెఱఁగు సెప్పినఁ జని దానిఁ దిగిచె వెడల
నమ్మహాత్ముఁ డెఱింగియు నర్థితోడ, నడుగ నది యేను నృగుఁడఁ జుమ్మనియె ననఘ.
వ. అనిన విని యద్దేవుండు నీ వనేకగోసహస్రంబుల విప్రజనంబుల కిచ్చితని విందు
మిట్టిదుర్జన్మంబు నీ కేల పాటిల్లె ననుటయు నమ్మనుజవల్లభుండు. 421
సీ. ఉత్తమబ్రాహ్మణుం డొకనికి నొక్కనాఁ, డొకగోవు నిచ్చితి నుల్ల మలర
నతఁడును గొనిపోయె నది మేఁత కర్థి మా, కదుపులలోపలఁ గలసి వచ్చె

గోవుల మఱియును గోపాలకులు దానవిధికి నై తెచ్చుచో విధివశమున
వానిలో నదియును వచ్చిన నెఱుఁగక, దానంబు సేసితి దాని మున్న

ఆ. గొనినయతఁడు దడవి కని యిది నాదుగో
వని యెఁ బిదపఁ గొనినయతఁడు పెనఁగి
నాకు నృపతి యొసఁగె నా నిద్దఱకును వా
దైన నన్నుఁ గాన నరుగుదెంచి. 422

వ. తమముందటి తెఱం గెఱింగించి. 423

క. ఇచ్చినవారల కొనఁగా, వచ్చిన సద్ధంబు గలదె వసుధాధిప యం
చిచ్చఁ గడు నొచ్చి పలికిరి, వెచ్చనినిట్టూర్పు లడర విప్రు లిరువురున్. 424

వ. మఱియుం బోడముమాటల నమ్మోదవుపోకడ నాకుఁ దెల్లం బగుటయు. 425

ఉ. దానికి నేను జిత్తమునఁ దాపము నొందుచు మున్న గొన్నయ
మ్మానితవిప్రు వేఁడికొని మంచివి గోవులు నీకు నూఱు వే
యైనను నిచ్చెదన్ విడువవయ్య మహీసురవర్య నెమ్మి న
ద్ధేనువు నన్న నాస్యమున దీనత దోఁపఁగ నాతఁ డిట్లనున్. 426

తే. పాలుగడుఁబెక్కుదాని[1] సబాము లెస్స, పెయ్య కర్మిలి గలదు మత్ప్రియసుతుండు
పాల కేడ్చినయపుడ చ న్నట్టనిచ్చు, నేది ప్రొద్దైన నట్టిగో వెందుఁ గలదు.

క. శ్రీవోలె నింటిలో నా, గో వుండఁగఁ జూతుఁ గాని కోటిమొదవులుం
గావు సరి దాని కని భూ, దేవుఁడు వోవుటయు నేను దీనత దోఁపన్. 428

చ. కనకము ధేనువుల్ మణినికాయము లిచ్చెద నేమి యైనఁ ద
క్కను మది కిష్ట మైనయది గోరుము గోవున కంచుఁ జేరి త
క్కినధరణీసుపర్వునకుఁ గీడ్పడి యెమ్మెయి వేఁడికొన్న నేఁ
గొన భవదీయరాజ్యమును గుత్సితవృత్తికి నియ్యకొందు నే. 429

తే. అనియెఁ గాని నామాట కైకొనఁడ యాతఁ, డట్టియెడఁ గాలవశగతియావహిల్లి
యమునికడ కేఁగ నాతోడ నతఁడు వికచ, నలినలోచన యి ట్లనిపలికెఁ బ్రీతి.

చ. జనవర పుణ్యకర్మము లసంఖ్యము లీ వొనరించి తొక్కవి
ప్రునిధన మజ్ఞతం గొనుటఁ బొందె సకిల్బిషభావ మల్ప మి
ట్లొనరినరెంట నయ్యెడుమహోన్నతిదుర్గతులందు మున్న నీ
చను నెడ యెద్ది నావుడు [2]నసౌఖ్యపుఁజో టని సమ్మతించితిన్. 431

ఆ. అట్టు లియ్యకొనినమాత్రమాత్ర మ, స్తకము క్రిందుగాఁగ ధరణిఁ బడఁగ
వలసె నపుడు వింటి నలఘుకృకవార్ద్రవ, ణాలికలిత మైనయమునిపలుకు. 432

వ. అది యెయ్యది యంటేని. 433

1. క. గ. సభాము. 2. గ. నసహ్యపుఁజోటను.

తే. వాసుదేవుఁ డనేకసంవత్సరముల, కధిప నీయున్నచోటికి నరుగుదెంచి
యుద్ధరించు ని న్నట నిత్యసిద్ధసౌఖ్య, మైనలోకమునకుఁ జను దనఘ నీవు. 434

వ. ఇట్లు వినుచు నిలాతలంబునం బడి కృకలాసత్వంబు నొంది చరియించుచుండి నేఁడు దైవదత్తం బయినచిత్తవర్తనంబునం జేసి యిక్ష్వాకుపంబునకువచ్చినయపర క్షణంబునం గృకలాసంబులకు లేనిమేనిపెంపావహిల్లిన నుల్లంబు సవిస్మయంబగుచునుండ యమప్రసాదంబున నెప్పుడును మాయనిపరిజ్ఞానంబు వర్తిల్ల నున్నంతం బరమయోగీంద్రభావ్యం బగునీభవ్యసన్నిధి దొరకొనియె నని పలికె నప్పు డప్పు డమితేనికిఁ బూర్వాచరితపుణ్యకర్మానురూపం బగురూపం బావిర్భవించిన దానికిం బ్రమోదభరితుం డై యతండు. 435

నృగుఁడు శ్రీకృష్ణువలనఁ బాపవిముక్తుఁ డై పుణ్యలోకమునకుఁ బోవుట.

తే. దేవ నీ నిగుకారుణ్యదృష్టి యమృత
పూరమునుబోలె నామీఁదఁ బొలయుటయును
దీనదశ వాసె భవదనుజ్ఞానిరూఢి
నేను జనియెద నంచితస్థానమునకు. 436

క. అని సవినయప్రణామంబున నారాధించి వృష్ణిపుంగవుఁ దగ వీ
డ్కొని యానృగుఁడు విమానంబున నుత్తమలోకమునకుఁ బోయె నరేంద్రా.

వ. ఇవ్విధంబున. 438

క. భరితానందుఁ డగుచు నృగుఁ, డరిగిన లోకహితకారి యై కృష్ణుఁడు ని
ర్భరమధురతాతిహృద్యా, క్షరఁబుగా నిట్టు లనియెఁ గౌరవముఖ్యా. 439

క. ధరణీసురధనహరణము, దురితతమము నృపున కధికదోషము నృగగో
హరణము క్రియ విప్రస్వాహరణము భూపాలవరున కాపదఁ దెచ్చున్. 440

వ. అనియె నివ్వాక్యంబులు నీకుం జెప్ప వలవ దైన్న [1]నితిహాసావసానవర్తి యగుటం జేసి వినిపించితి నని చెప్పి యప్పాండవాగ్రజుతో భీష్ముండు వెండియు. 441

క. సత్సంగతి సజ్జనులకు, నుత్సవ మొనరించు నృగున కున్నతిఁ ద్రిజగ
ద్వత్సలుఁ డగుకృష్ణుండు స, ముత్సుకతం జేరఁ జనుట యొసఁగినమాడ్కిన్. 442

వ. అని పలికి మఱియును. 443

క. దానము సమగ్రఫలదము, భూనాయక గోవునెడ విరుద్ధత్వము గీ
డైనది గావున గోస, మ్మాననమే మఱక యుండు మది నేప్రొద్దున్. 444

వ. అనిన విని ధర్మజుండు గోవులయెడ విరుద్ధాచరణంబున నయ్యెడుదురితంబు తెఱంగెఱింగించితి గోదానఫలవిశేషం బింకను విన వలతుం జెప్పవే యనుటయు నని మిషనదీనందనుం డివ్విషయంబున నైనది యొక్కయితిహాసంబు గల దాకర్ణింపుమని యతని కిట్లనియె. 445

---

1. గ. నితిహాసానువర్తి.

గోప్రభావవిషయకం బగు నౌద్దాలకిపుత్త్రచరిత్త్రము.

సీ. [1]అనఘుఁ డౌద్దాలకి యనుమహాముని దన, తనయునిఁ బిలిచి యిధ్మములు దర్భ
కట్టయు జలపూర్ణకలశంబుఁ బువ్వులు, మఱచి వచ్చితి [2]నేటిమడుఁ గుమార
కొని రమ్ము వేగంబ చని యన్న నాచికే, తాహ్వయుం డగునతం డరుగునంత
వాహిని పొంగిన వన్నోడి యవి వోయెఁ, గానక యాతండు గ్రమ్మఱంగ

ఆ. నరుగుదెంచి కాన ననుటయు నాఁకలి, దనమకర్మవైకృతంబు సైఁపఁ
జాల కలిగి యొరి జముఁ జూడఁ బొమ్మని, శాప మిచ్చెఁ దండ్రి భూపవర్య.

వ. ఇట్లు శపియించిన నబ్బాలకుండు గేలు మోడ్చి ఫాలంబున మోపికొనుచుం బ్రసన్నుండ వగు మని పలుకు పలుకఁగా జేతనారహితుం డై పడుటయు నమ్ముని వరుండు. 447

క. కనుఁగొని పశ్చాత్తాపం, బున నుల్లం బెరియ నిట్లు పుత్త్రకు నే నే
పనికై చేసితి విగతా, సునిఁ గా నని మూర్ఛ మునుఁగుచుం బడియె ధరన్. 448

వ. పడి యొక్కింతసేపునకుం దేఱి [3]తనయుం దేఱిచూచి యశ్రు లొలుక నబ్బాలకు నురంబున మొగంబు మోపి చేష్ట దక్కి యుండ నద్దినశేషంబును నయ్యామినియునుం జనియె సూర్యోదయసమయంబున. 449

ఆ. అతనికన్నునీర నాప్లుతం బై నయా, శవము చేతనించి చలన మొంది
యొలమి నత్తపస్వి యీక్షించుచుండఁ గ, న్నెఱచె నిట్లు మగుడఁ దెలివి నొంది.

క. తనుఁ గనుఁగొనియెడిసుతుతోఁ, మునిపతి యి ట్లనియెఁ బుణ్యముల ప్రోకవు నీ
వనఘ చని పుణ్యలోకముఁ, గని మత్పుణ్యమున రాక గలిగెను మగుడన్. 451

క. నీ దగుతనువునదివ్యా, మోదము సాంద్రమయి తోఁచు ముట్టెడు నత్యా
హ్లాదమహాశ్చర్యసము, త్పాది యగుచు నీగతాగతములం జెపుమా. 452

వ. అనిన విని యమ్మునిపతికిం బ్రణమిల్లి యక్కుమారుం డి ట్లనియె. 453

సీ. నీయాజ్ఞఁ జని కమనీయవిశాల మై, మణిమయత్వంబున మహిత మగుచు
వెలిఁగెడుసమవర్తికొలువుకూటముఁ బ్రవే, శించితి నాతండు సేరఁ బిలిచి
యంచితాసనము వెట్టించి భవద్గౌర, వాతిశయంబున నర్ఘ్యముఖ్య
పరిపూజనముల సంభావించె నతనితోఁ, నేలోకమున వసియించువాఁడ

తే. ననఘ యానతి యిమ్ము నా కంటి ననిన
నీవు సావవు నీతండ్రి నిన్ను జముని
జూడఁ బొమ్మని పనిచినఁ జూచి తంద
యరుగు మమ్మునివగ పేద ననియె నతఁడు. 454

వ. అనుటయు నట్ల కాక మగిడి పోయెద నీకడకు వచ్చితి ధర్మమయుండ వగునిన్ను దర్శించితిం బుణ్యలోకంబులు దర్శింప వేడ్క పుట్టెడుఁ జూపవే యని విన్నవించిన.

---

1. గ. చ.జ. శ్వేతకేతుం డనువిశ్రుతముని. 2. అ. నేటిమడుఁగునొరఁ. 3. చ. తనయుదెసం జూచి.

ఉ. అంచితవాహనాకలితయానముఁ దేరఁగఁ బంచి నన్ను నె
క్కించి సహోధిరూఢుఁ డయి కేల్ దనకేల నమర్చి సత్కథా
సంచయవర్తనుం డగుచుఁ జారుముఖాబ్జవికాస మొప్ప వ
ర్తించుచుఁ బుణ్యలోకములు ప్రీతి యెలర్పఁగ నాకుఁ జూపినన్. 456

తే. నయనములకుఁ జిత్తమున కానంద మొసఁగు
నట్టిమణిగేహవాపికోద్యానములును
బరమభక్ష్యభోజ్యాత్మకగిరులు హృద్య
దుగ్ధఘృతమయఘనసరిత్తులును గంటి. 457

వ. మఱియు గంధమాల్యదివ్యాంబరాభరణప్రముఖంబు లగుభోగయోగ్యపదార్థం
బులు మహారాసు లై యుండ నాలోకించితి నీలోకంబు లేపుణ్యంబులు సేసినజను
ల కనుభావ్యంబు లని యడిగితి నడిగిన ధర్మరా జిట్టిట్టివారివని యెఱింగించి యిం
దధికవిభవంబు లై నయట్టిమానవనీయస్థానంబులు గోదానంబు లాచరించినవారల
యవి భక్ష్యభోజ్యగిరులును దుగ్ధఘృతనదులును వారివ యని చెప్పి వెండియు. 458

క. మానితపాత్రము సదను,స్థానంబును బ్రీతిభక్తిసంపన్నతలుఁ
ధేనువుమేలిమియుం గల,దానముఫల మిట్టి దనఁగఁ దరమె యజునకున్. 459

తే. బలము లేఁబ్రాయమును రూపుఁ గలుగునట్టి,గనపయెద్దు సద్ధర్మవిప్రునకునిచ్చి
నతఁడు సద్విధి గోదాన మాచరించి,నతనిపడసినగతిఁ గాంచు ననఘచరిత.

క. గోవులు సూర్యునియుజ్జ్వల,గోవుల య ట్లగుటఁ జేసి గోదానపరుల్
భూవినుతా సూర్యసదృశు,లై వెలుఁగుదు రిట్లు చెప్పు నాగమఫణితుల్. 461

క. అని పలికి వీడుకొలిపిన, మునివర యజ్ఞమునిచరణముల కెఱఁగి ముదం
బున వచ్చితి ననె జనకుని,మన మానందరసపూరమయతం బొంగన్. 462

ఇంద్రునకు బ్రహ్మ సెప్పినగోదానవిషయకవాక్యములు.

వ. అని చెప్పిన విని కుంతీతనయాగ్రజుండు గోదానకర్త లెందేని వసింతు రాలోకం
బెట్టి దెఱింగింపు మనిన నన్నరదేవునితో దేవవ్రతుండు దీనికి బ్రహ్మవాక్యంబులు
గల విట్లు యింద్రుం డడిగిన నతనికి బ్రహ్మ యి ట్లనియె. 463

ఆ. అడిగి మేలు సేసి తాలోక మెవ్వరు, నెఱుఁగ కునికి దెల్ల మేను సువ్ర
తాత్ము లైనమునులునతులపాతివ్రత్య,సతులు నెఱుఁగుదుము విశాలచిత్త, 464

క. విను మయ్యెడఁ గాలక్రమ,మును దప్పియు రోగములును ముదిమియు లే వ
వ్వినుతస్థానం బవ్యయ,మును గేవలసారసంప్రమోదకరంబున్. 465

వ. దాని పేరు గోలోకంబు. 466

క. గురుశుశ్రూషకులును స,త్యరతులు శమదమవినిర్మలాత్ములు దుర్భ
క్ష్యరహితులు నిల్తు రను,త్తర మగునచ్చోట గోప్రదానపరులతోన్. 467

వ. అని వెండియు. 468

ఉ. దాయధనంబు సంగరవిరోధాసముపార్జితముఁ సధర్మకో
పాయసమాహితంబును శుభప్రతిపాదనలబ్ధముఁ మరు
న్నాయక వెండియుం గలుగునాయపుఁజొప్పులసొమ్ములుం దగఁ
గోయజనార్థసత్క్రియలకుం బెఱసొమ్ముల నైనఁ గీడగున్. 469

క. విను గోలోకంబును గడ, చినలోకము గలుగ దూఁది చెప్పరఁ బుణ్యం
బును గోప్రదానవిధి మిగి, లినయట్టిది వత్స యొండు లే దరయంగన్. 470

తే. ఆగమాధ్యయనంబు వ్రతాభిరతియు
నైజకర్మశీలము గురుపూజనంబు
మాతృపితృరక్షణముఁ బాత్రమహిమ లప్ర
తర్క్యఫలదాయి యైనగోదానవిధికి. 471

క. అని నిర్దేశించిన న, వ్వనరుహసంభవునిదివ్యవాక్యంబులు నె
మ్మనమున నిడి గోయజ్ఞము, లనూనవిధి నడపె నింద్రుఁ డమలచరిత్రా. 472

క. నీవును నవధానముతో, గోవుల మన్నింపు పాత్రకోటి కొసఁగు స
త్సేవితపుణ్యాచరిత్రము, లావెరవునఁ బోల వెన్ని యైనఁ గుమారా. 473

క. అని యిట్లు గోవిశేషము, లనేకభంగులను బాండవాగ్రజునకు శం
తనుసుతుఁడు సెప్పె నన విని, మునివర యేభంగి వాక్యములు మఱి చెల్లెన్. 474

వ. అని యడుగుటయు. 475

శా. ధర్మాధర్మ[1]విదూరనీతిపరవిద్వచ్చిత్తయోగీ జగ
న్నిర్మాణస్థితితంత్రసంహరణధూర్నిర్వాహరాగీ మహా
శర్మాపాదనపాదపద్మసుతపస్స్వాధ్యాయసద్మా మనో
తర్మ్యద్రాలతికాఫలత్వలసితా దాంతిస్ఫుటోద్భాసితా. 476

క. ప్రమదవిషాదాదిద్వం, ద్వమలాపిహితాంతరంగవాసా విశ్వా
గమవేద్యసముల్లాసా, శమరమ్యవిభాస నియమజనితవికాసా. 477

మాలిని. అకలుషహృదయాంతర్యాగసంసిద్ధిమూర్తీ
వికృతిదశకషట్కస్వీకృతిప్రౌఢవర్తీ
సకృపలసదపాంగత్రాస్యమాణాశ్రితార్తీ
సకలనిగమచూడాచారురంగైకవర్తీ. 478

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబునయానుశాసనికపర్వంబు నందు ద్వితీయాశ్వాసము. 479

---

1. గ. విధూతనీతి-చ. విభూతినీతి.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అనుశాసనికపర్వము, తృతీయాశ్వాసము.





మహిమదానకరుణా
భూమోద్భాసి బహునామ ఽ పుణ్యస్తోమా
రామహృదయధామ వితత
ర్కామేయవిభూతిసీమ ఽ హరిహరనాథా. 1

### ధర్మజునకు భీష్ముం డనుష్ఠేయంబులఁ జెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు గోవులమహానుభావంబు విని పాండవాగ్రజుండు భీష్మునితో ధర్మంబులు దేటపడ ననుగ్రహించుచుం బుయిలోట వాపి నన్నుం గలిపికొని కృపకు భాజనంబుగాఁ జేయుటం జేసి కొంకక యింకను నడిగెదఁ దాత్పర్యంబున ననుష్ఠింప వలయునవి యెయ్యవి యెఱింగింపవే యనుటయు నతనితో నతండు. 2

సీ. విను నియమంబును ఽ వేదపాఠంబుఁ ద,ద్ధరణంబు దమము నఽధ్యాపనంబు
నప్రతిగ్రహమును ఽ నాత్మీయకర్మని,ష్ఠయు సకలేంద్రియఽజయము సత్య
నిరతియు శ్రుతదానఽపరతయు బ్రహ్మచ,ర్యముఁ బితృశుశ్రూషఽణమును మాతృ
శుశ్రూషణము గురుఽశుశ్రూషణము నను,కంపయు గోవ్రతఽసంపదయును
ఆ. వత్స యాచరింపఽవలయునట్టివి యని, పలుకుటయును నాన్నృఽపాలవరుఁడు
గోప్రదానవిధి యఽకుంఠితకృప నాకు, నెఱుఁగఁ జెప్పవే సఽమిద్ధబుద్ధి. 3

వ. అని యడిగినయక్కురుపతికిం గురుపితామహుం డిట్లనియె. 4

### బృహస్పతి మాంధాతకుఁ దెలిపినగోదానవిధిప్రకారము.

ఆ. తనియ మేసి నీరు ఽ ద్రావి మందకు వచ్చి
సౌఖ్య మెసఁగఁ బసులు ఽ శయన మొంది
యుండ నచట నియతి ఽ నుండి మాంధాత్రుండు
పరమభక్తి నమరఽగురునిఁ దలఁచి. 5

1. క. తసనామ.

వ. ఇట్లు యదుగంగలవాఁడై కరంబులు మొగిచి బహువిధంబులం బ్రస్తుతించిన
నాపురుహూతపురోహితుండు ప్రత్యక్షం బగుటయు నప్పుడమిఱేఁ డమ్మహాత్ముని
పాదంబులకుం బ్రణమిల్లి యడిగిన నద్దేవగురుం డన్నరదేవోత్తమున కిట్లనియె. 6

ఆ. పుణ్యదినమునందు భూసురానుజ్ఞతో, నుపవసించి గోవు లున్నమంద
కరిగి పరమనియతి నయ్యహోరాత్ర, మగ్గోష్ఠమున వసించి నిష్ఠతోడ. 7

వ. మఱునాఁడు. 8

ఆ. సంగవాభిధానసత్కాలమునఁ దన, యిచ్చుగోవుఁ బేర నెలమిఁ బిలిచి
యజుఁడు కరుణఁ జెప్పినట్టియవ్వాక్యర, త్నముఁ బఠించునది యుదాత్తచరిత. 9

ఆ. తల్లి గోవు వృషము దండ్రి గర్భప్రదే
శంబు దివము ధరణి సంప్రతిష్ఠ
యని పఠించి యోగ్యుఁ డగువిప్రు నర్చించి
పలుక వలయు నీగికలిమి దెలియ. 10

వ. తదనంతరంబ. 11

క. సారము లగుగోవులు మ,ద్ఘోరసకలకల్మషములఁ ద్రుంచును సౌమ్య
త్వారూఢంబుగ శాశ్వత,సారోదారపద మిచ్చి సౌఖ్యముఁ జేర్చున్. 12

క. అని పలికి గోవు నిచ్చితి, ననుచు నుదకధారఁ బ్రీతి నవ్విప్రుకరం
బునఁ బోయ వలయు నర్ఘ్యం, బని చెప్పుదు రజ్జలంబు నాదిమునీంద్రుల్. 13

క. విను శిష్యుఁడు వ్రతశీలుం, డనఘుఁడు శాంతుండు దాంతుఁ డక్రోధనుఁ డీ
వినుతప్రదానవిధికిని, జననాథవరేణ్య యెఱుఁగు సత్పాత్రంబుల్. 14

ఆ. ఇవ్విధమున గోవు నిచ్చినయాతండు, చంద్రలోకవసనసౌఖ్య మొందు
నని సురేంద్రమంత్రి యమ్మహీపాలుతో,నాదరమున నిట్టు లనియె మఱియు.

ఉ. మానవుఁ డొప్పి యాశ్వయుజమాసమురెండవునష్టమిం దగం
బూని దినత్రయంబు పరిపూజితగోష్ఠతలంబునన్ వ్రతా
ధీనతఁ బెండ యన్నమును ధేనువుమూత్రముఁ బాలుఁ బానముం
గా నియతిన్ వసించి బహుకామ్యఫలంబులఁ బొందు భూవరా. 16

వ. అని చెప్పె నట్లు బృహస్పతి నిర్దేశించినతెఱంగున మాంధాతృండు మహీసురులకు
గోవుల నిచ్చి యుభయలోకంబులను వినుతుండయి వెలింగెనవ్విధంబెఱింగి గోప్ర
దానపరులైనభరతదిలీపభగీరథదాశరథిప్రభృతిభూపతులుపుణ్యలోకంబులువడ
సిరి పాండవాగ్రజా నీవును దేవగురూపదిష్టంబు లగునివ్వాక్యంబులు భావగతం
బులు సేసికొని గోవిషయవిధిజ్ఞుండవై విప్రోత్తములకు నుత్తమగోప్రచయంబుల
ని మ్మనిన నమ్మనుమండు తాతకుం బ్రీతిం బ్రణామంబు సేసిన నమ్మహాత్ముండు
వెండియు నవ్విభున కిట్లనియె. 17

క. రేపకడ నీరు ద్రావక, మేపు గొనకమున్న గోవు మిక్కిలి భక్తిన్

భూపాల యిచ్చునది ది, వ్యాపారసుఖంబుఁ బడయ ॥ నాత్మఁ దలఁచినన్. 18

క. మొదవులలో నెల్లఁ గపిల, మొదవు వరిష్ఠంబు రాజ॥ ముఖ్య నియతిమై
నది విప్రున కిచ్చు టరయఁ, దుది దానంబులకు నజుకు ॥ మరితాటవులన్. 19

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు కపిలగోవున కీవిశేషం బెట్లు గలిగె నెఱింగింపవే యనుటయు గాంగేయుం డతని కిట్లనియె. 20

—— గోవులకుఁ గపిలత్వంబు సిద్ధించినప్రకారము. ——

సీ. దేవత లాఁకొని ॥ దేవతాజ్యేష్ఠునిఁ, గానంగఁ బోవ నా॥కమలజన్మఁ
డమృత మిచ్చిన ముద ॥ మారఁగాఁ ద్రావఁ ద, త్సురభిత్వసంపద ॥ సురభి పుట్టె
నది సౌరభేయుల ॥ నధిప యుత్పాదించె, నొకయప్డు హిమగిరి॥యుపరితల మ
లంకరించును నవి ॥ శంక యించుక లేక, యున్నెడ వానిలో ॥ నొకటి లేఁగ

తే. చన్ను గుడువఁ దదాస్యని॥ష్యందమాన, మైనదుగ్ధఫేనము పవ॥మాననిహతిఁ
దూలి తప ముగ్రముగఁ జేయు॥శూలిమాళిఁ, బడినన ద్దేవుఁ డధికకో॥పంబు గదుర.

క. చిచ్చుఱక న్నదరు లెగయ, విచ్చినఁ గపిలత్వ మొందె॥ విబుధప్రకరం
బచ్చెరు వందుచుఁ గన్గొన, నచ్చేరువ సౌరభేయు ॥ లమలచరిత్రా. 22

క. అవి బిట్టు బెదరఁ దక్కటి, యవియు నదరి బెదరె నిట్టు ॥ లగ్గోవులు వా
ఱె వెసను సోమునిపాలికి, నవనీశ్వర దాని నెఱిఁగి ॥ యజుఁ డేతెంచెన్. 23

సీ. ఏతెంచి నిభృతిమై ॥ నీశ్వరుచరణాంబు, జములకు నెఱఁగి హ॥స్తములు మొగిచి
యమృతసిక్తుండ వై తి ॥ వఖిలేశ గోవుల, కెంగిలి లే దిందుఁ ॥ డెట్టు లమృత
మొసఁగు నట్టుల గోవు ॥ లొసఁగు దుగ్ధంబులఁ, దద్వత్సపీతదు॥గ్ధంబు శుచియ
కాన కోపము దక్కి॥ కరుణింపు మని మొక్కి, కమనీయవృషభంబుఁ॥ గప్ప మిచ్చె

తే. శివుఁడు ప్రియ మంది దానిఁ గే॥తువును వాహ
నంబుఁగాఁ జేసి సకలజ॥నంబు నెలమి
వృషభ కేతనుఁ డనియును ॥ వృషభవాహ
నుం డనియుఁ బేర్కొ నఁగ నొప్పి ॥ యుండె నధిప. 24

వ. ఇట్లు ప్రసన్నుం డయి గోసంచారం బెందునుం గలుగునట్లుగా నను గ్రహించిన నా సౌరభేయీసముదయంబు మగుడ నన్నగంబునకు వచ్చి విచ్చలవిడి వర్తింపం జూచి తనచూపునం గపిల లయినగోవులకుం దక్కినవర్ణంబులగోవులకంటె నుత్తమత్వంబు గలుగ వరం బిచ్చి విరించిని వీడ్కొలిపె నట్లు గావునం గపిలగోప్రదానంబు గోదాన[1]కల్పంబున కంతకు నధికం బని చెప్పి. 25

క. ఈకపిలాఖ్యానము సు,శ్లోకము దీనిపఠనంబు ॥ శ్రుతముఁ గలిమలో
ద్రేకంబుఁ బాచి సుతుల న, నేకధనంబులను బెంపు ॥ నిచ్చు నరేంద్రా. 26

వ. అనిన విని ధర్మపుత్త్రుండును దమ్ములును సమ్మోదంబు నొంది భీష్మునకుం బ్రణ

1. క. కలాపంబున కంతకు.

మిల్లి గోప్రదానంబులు విధిసంపన్నంబులుగాఁ జేయువారై మనంబులం బూని
రప్పితామహుం డప్పాండవాగ్రజు నుద్దేశించి వెండియు నిట్లనియె. 27

సీ. సౌదాసుఁ డనఁగ నిక్ష్వాకుకులంబున, జనియించె నాతఁడు మునివరేణ్యుఁ
డైన వసిష్ఠుని నాత్మపురోహితు, వినతుఁడై యడిగెఁ బవిత్ర మెద్ది
యని దాని కాదర మతిశయిల్లఁగ నమ్మ, హాత్ముఁ డిట్లనియెఁ బుణ్యాత్మ వినుము
గోవు పవిత్రంబు గోవు హవిర్జన్మ, భూమి గో వరయఁగా భూతములకు
తే. నెల్ల నాధారభూత మానీడ్యవస్తు, వతులలక్ష్మికి మూల మత్యంతదురిత
జలనిధికి నోడ నిర్జరసద్మమునకు, ననఘ నిచ్చెన సురలకు మనికిపట్టు. 28

వ. అని చెప్పి మఱియును. 29

క. పదియును నూఱును వేయును, మొదవులు గలవారు దానములుగా నొకటిం
బదియింటి నూటి నిచ్చిన, నదియు నదియు నదియు సదృశ మగు ఫలము నెడన్.

క. విను గోవులను బ్రభాతం, బునఁ దలఁచుట తద్గుణములు నొగడుట భక్తిం
గనుఁగొనుట యధికపుణ్యము, లని యెఱిఁగించు జనములకుఁ నాగమభణితుల్.

ఆ. కిల్బిషంబు గోశకృన్మూత్రముల కేవ, పడుట సకలమాంసభక్షి కైన
ఘోరపాప మండ్రు గోమాంసభక్షణ, మబ్జసంభవాదు లైన సురలు. 32

క. జనములు దుస్స్వప్నంబులు, గని గోకీర్తనము సేయఁగాఁ దద్దురితం
బునఁ బొరయరు గోమయయుత, వినుతాంబుస్నాన మతిపవిత్రం బనఘా. 33

చ. సురభులు సౌరభేయులును సుస్థితి నాకడ నుండుఁగాత మేఁ
గరము వినీతి గోగణముఁ గన్గొను చుండెద నర్థి గోసము
త్కరమును నన్ను నెప్డుఁ గనుఁగావుత మం చెద గోవులం దలం
తురు బుధబోధితుల్ భయము దోఁచినచోటులఁ దత్ప్రశాంతికై. 34

వ. అని నిర్దేశించి వెండియు నమ్మునీంద్రుం డానరేంద్రున కిట్లనియె. 35

క. అరుణధవళమేచకధూ, సరవర్ణాకలితగోవిషయదానంబుల్
ఖరకరసురపాగ్నిపవన, వరలోకసుఖముల నిచ్చు వసుధాధీశా. 36

క. విను తక్కినవర్ణంబులు, జనవర గంధర్వసిద్ధసాధ్యాదినివా
సనితాంతసౌఖ్యదము లగు, ననిమిషయోషిత్ప్రియత్వ మన్నియు నిచ్చున్. 37

క. ధేనుప్రమాణ యగుతిల, ధేనువు నిచ్చిననరుండు దీప్తుం డగుఁ బు
ణ్యానూనలోకసంవా, సానందోన్నతిఁ జరించు నప్రతిహతుఁడై. 38

క. బహురూపవిశ్వరూపక, మహితసురూపత్వదివ్యమహిమ గలుగు గో
మహనీయమూర్తి మన్మతి, సహిత యగుంగాత మనుట సంపద లొసఁగున్. 39

క. అని ముని సెప్పిన సౌదా, సనరేంద్రుఁడు గోప్రదానసక్తాత్ముం డై
యనితరసులభావ్యయసుఖ, జనకస్థానంబు వడసె జనసంస్తుత్యా. 40

క. అని గంగాపుత్త్రుఁడు గో, వినుతమహిమఁ దెలియఁ జెప్ప విని ధర్మసుతుం

డనఘచరిత్రా యిట్లుం,డునె గోవులపెంపు నావ్రక్షుం దగ మఱియున్. 41

వ. అమ్మహాత్ముం డమ్మహీపతితో గోవిశేషం బింకను వినుమని యిట్లనియె. 42

వేదవ్యాసముని శుకునకుఁ దెలిపిన గోప్రభావప్రకారము.

సీ. సర్వజ్ఞుఁ డగుపరాశరనందనునిపాద,పద్మంబులకు దృఢభక్తి నెఱఁగి
[1]యతనినందనుఁడు సమంచితమతియును, నవుశుకుం డెల్లవస్తువులకంటె
నధికతమంబును యజ్ఞమూలంబును, నగునది యెయ్యది యతులకరుణ
నా కెఱిఁగింపవే నావుడు నమ్మహా,త్ముఁ డివ్విధముమహానుభావ
తే. మనఘ యెంచు నెక్కాలము నన్యవస్తు,వులకు లే దరయంగ గోవులకుఁ దక్కఁ
బుణ్యతమతయు యాగవిభూతిమూల,కారణత్వంబు వానికి కాక కలవె. 43

క. అని చెప్పి మఱియు నిట్లను, విను గోవులు పరమనియతి వేధఁ గొలువ నె
మ్మన మలర నతఁడు గనుఁగొని, మును వానికి లేనిశృంగములు గల్పించెన్. 44

వ. అట్లు గొమ్ము లొసంగి సురమునిలోకంబు నాలోకించి. 45

చ. పరమపవిత్రముల్ యజనభాజనముల్ దమ విన్నఁ జూచినన్
దురితచయంబులం దొలఁగఁ ద్రోవఁగఁ జాలుఁ బ్రదానకర్తకు
త్తరగతిలాభవైభవము తంగెటిజున్నుగఁ జేయు గోవు లె
వ్వరు దగ వీనిఁ గొల్తు రనివారణఁ జొత్తురు వారు నాకమున్. 46

వ. అనియె గోవులపావనత్వంబు విశేషించి చెప్పెద వినుము. 47

సీ. అమలాత్మ గోవుమూత్రముఁ బాలు నేయుని, బానార్హమగుపెండతోన వరుస
[2]మూఁడుదినంబులుమునుద్రావి మఱిమూఁడు,దివసంబులందు వాయువుభుజించి
యవలు నుగ్గుగ ధేనునివహంబుఁ ద్రొక్కించి, వెలవ నత్తెఱఁగునూకలన కాఁచి
నెలలు మూఁ డత్యంతనియతి నాహారంబు,గొన బ్రహ్మహత్యఁ బోలినవియైనఁ
తే. బాయుఁబాపముల్ దివిజులీ పావనక్రి,యావిధానంబునన కాదె యసురగణము
గెలిచి రావులనేయి విప్రులకు నిగి, దాని వ్రేల్చుట ద్రావు [3]టుదాత్తతరము. 48

క. విమలాంబువుల నుపస్ప,ర్శము నిర్వర్తించి గోప్రచయమధ్యమునన్
దమయుతముగ గోమతి చి,త్తమున జపించిన శుచిత్వధన మొడఁగూడున్. 49

తే. అగ్నిసన్నిధి గోనిచయంబునడుమ, బ్రాహ్మణులపాల గోమతీపఠన మాచ
రించినను విన్నఁ గోర్కి సిద్ధించు గోవుఁ, గడచినట్టిది లేదు జగత్త్రయమున. 50

క. అని యి ట్లుపన్యసించిన, జనకవచనరచనఁ గల్గుసార మఖిలముం
గని శుకుఁడు గోసమారా,ధనతత్పరచిత్తుఁ డయ్యె ధర్మతనూజా. 51

వ. అనిన విని పాండవాగ్రజుండు బ్రహ్మ విశ్వంబునకు విభుండు తదీయస్థానంబునకు
మీఁదు గోలోకం బని విందు నట్లుగాఁ గతం బేమి యని యడుగుటయు నాపగా

---

1. చ. జ. యతనినందనుఁడు సంచితమతియును నగు,శుకుఁ డెల్లపుణ్యవస్తువులకంటె. 2. గ. మూఁడేసిదినములుఁ; చ. మూఁడేనిదినములు. 3. గ. టుత్తారకమూలు.

తనయుం డతని నాదరభరితుం డగుచు నాలోకించి వినుము వివరించెద విశ్వకర్మ తపోనియతుండయి యజ్ఞార్థంబును మోక్షార్థంబునుం గా నమృతమయమూర్తియుఁ గామరూపిణియు నగుసురభి యనుకన్యకం దనమనోవృత్తిం గల్పించి మహాతేజోమయుం డగునొక్కపురుషుని సృజియించిన దేదీప్యమానుం డగునాతం డతిమనోహరాకృతి యగునయ్యతివం గనుంగొని కామమోహితుం డయి యార్తినొందుటయు నఖిలలోకపావనుం డైనచతురాననుండు సన్నిహితుండై మార్తో భవ యని పలికి యతనియార్తత్వంబు బుడిపి తనపల్కు కారణంబుగా మార్తాండనామం బొసంగి యన్నారీరత్నంబు నిచ్చి యిన్నెలంతకును నీకును జనియించినయపత్యంబులు యాగాపవర్గార్థక్షీరజనకంబులై మదీయలోకంబునకు నుపరిభాగంబున వర్తింప వరం బిచ్చితి ననియె నట్లొందినయయ్యిరువురకును బ్రభవించినసౌరభేయీకులంబు కమలాసనునిర్దేశించినట్టిదై సురాసురప్రముఖనిఖిలజనంబులకు నమస్కార్యంబును సపర్యాభాజనంబును నయి రాజిల్లు నని చెప్పి వెండియు. 52

క. అది కారణముగ గోవులు, దుది ముట్టినపెంపు గలిగి దురితహరగుణా
స్పదమయి తమ్ము సభక్తిక, హృదయు లగుచుఁ గొలుచువారి కిష్టము లొసఁగున్.

క. అని చెప్పినఁ బాండునృపతి, తనయుఁడు మార్తాండసురభిదాంపత్యమునన్
మును పుట్టినప్రజ యెయ్యది, విన వలతు మహాత్మ చెప్పవే నా కనుడున్. 54

వ. భీష్ముం డిట్లనియె. 55

తే. తపముపెంపున సురభి మార్తాండువలన
ధరణినాథ యేకాదశాత్మజులఁ బడసె
నిగమసంకీర్తనీయులు నిఖిలలోక
పతులు వారు బ్రాహ్మణులకుఁ బ్రకృతి సుమ్ము. 56

వ. వారల నేకాదశరుద్రులంగా నెఱుంగుము. 57

తరు. అనఘాత్మ యజపాదుఁ డనఁ నహిర్బుధ్న్యుఁ డనఁ గడువిలసిల్లి త్ర్యంబకుఁ డీతఁ
డనఁగ వృషాకపి యన నొప్పి శంభుఁ డనుపేరిపెంపున నమరి కపాలి
యనఁగ రైవతుఁ డన నతులానుభావమతిశయిల్లఁగ హరుఁ డన బహురూపుఁ
డనఁ గీర్తిఁ గని యుగ్రుఁ డన విశ్వరూపుఁ డనఁ బేర్చి యారుద్రు లర్చితులైరి.

వ. తదనంతరంబ సౌరభేయీప్రచయంబు ప్రభవించె నగ్గోకులంబువిశేషం బాకర్ణింపుము. 59

సీ. ఆననంబునను జిహ్వను శృంగముల బల, వైరి రంధ్రంబుల మారుతుండు
కకుదంబునందు శ్రీకంఠుండు పదముల, యందు మరుద్గణ మనఘ కుక్షి
వహ్నిచన్నులసరస్వతి పెండఁ బంచిత, మున లక్ష్మియును గీర్తియును గ్రమమున
రుధిరంబునందుఁ జంద్రుఁడు హృదయంబున, భగుఁ డనుదేవత పాల వేధ

తే. వెండ్రుకలయం దనుష్ఠాన। వితతి దోఁక
ధర్మఁ డక్షుల సూర్యుండు । చర్మమునఁ ద
పంబు సిద్ధి తేజము సంధి।పట్ల సిద్ధు
లునికి గలదట్టి గోవు నే । మనఁగ వచ్చు. 60

వ. మఱియు నొక్కటి యక్కజం బగునది గోమహానుభావప్రకటం బయినయితి
హాసంబు సెప్పెద వినుము. 61

సుమిత్రుఁ డనుమునిచేఁ బోషింపఁబడినగోవుల ప్రభావము.

తే. త్రిశిఖరం బనుపేరిధా।త్రీధరమును, పాంతమున రుద్రకల్పితం। బైనకూల
హాభిధానకల్లోలిని । శోభితోప,కంఠ మై యొప్పుఁ దత్తీర।కాననమున. 62

వ. భృగువంశసంభవులగుసంయమీశ్వరులు గొంద ఱాశ్రమంబులు గావించుకొని
తపగపరు లై యుండుదు రందు సుమిత్త్రుం డనుపేరం బరఁగి పరమాచార
భవ్యుం డగునొక్క భార్గవునకు నంగిరసుం డనునొక్కమహాద్విజుండు సఖ్యంబు
నను సౌజన్యంబునను గోశర్కర యొసంగిన నమ్ముని తనగోవు నయ్యోషధి
మేపి పోషించిన నది సుపుష్టయు సుస్వరయు సురూపయు నై యొక్కవృషభంబు
పొందు వడసి గర్భిణి యై మిథునంబు నీనిన. 63

క. అమ్మిథునము బహుసంతా,న మ్మయ్యెం బెరిఁగి క్రమము।నను గోనిచయం
బిమ్మెయిఁ బెక్కుసహస్రము, లమ్మునికిం గల్గె గోవు। లతఁడును వానిన్. 64

తే. వేడ్కఁ జూచుచు నెప్పుడు । వెనుకఁ దిరిగి
మేపు నీరును గలచోటి । కోపి వెలిచి
పాలు గ్రేపులు గుడువ స।ప్రమదుఁ డగుచుఁ
దాను గోస్తనఫేనంబు । ద్రావి యుండు. 65

క. దాననచేసి యతనికిన్, ఫేనపుఁ డనునామ మొసఁగెఁ । బ్రియమున మునిస
మ్మానితుఁ డగుగాతముఁ డి, ట్లానిర్మలబుద్ధి గోస।మారాధకుఁ డై. 66

వ. వర్తిల్లుచుండ నొక్కనాఁడు కామరూపిణు లగుగోవులు గొన్ని కాంతాకారం
బులు గైకొని కమనీయం బగుకొలన జలక్రీడలు సలుపు చుండఁ దోడిధేనువు
లచ్చట మెలంగి కనుంగొని మీ రెవ్వ రని మానుషభాషణంబుల నడిగిన
నయ్యంగనాజనంబులు. 67

తే. ఏము గోవుల మనవుడు । నిట్టియద్భు,తానుభావంబు మీ కెట్లు । లావహిల్లె
ననిన విని వానితోడ న।య్యతివ లిట్టు,లనిరి మా తెఱఁ గేర్పడ । వినుఁడుమీరు.

వ. హవ్యకవ్యంబులకు నతిథిపూజనంబులకు నిజాహారంబులకు సద్ద్విజావలి సంతో
షింప నిం పారుపాలు వారికిం గురియుదుము కృషిక్రియాసర్వనిర్వర్తనంబులకు
మాపుత్త్రులం బనుతు మాసుకృతంబుల నివ్విశేషంబులు గలిగె మాకును గోలో
కంబు సులభంబు మీ రాసుకర్మంబులు సూచి యసూయ సేయుదురు గావున. 69

క. క్రేపులు దోరా దుర్గతిఁ, బ్రాపింపఁగలార యిట్టి । భావిచరిత ము
ద్దీపితబోధమునం గని, మీపై కృపఁ జెప్పవలసె । మీకుం దెలియన్. 70

వ. అనుటయు నగ్గోవులు దీనాననలై. 71

క. గోవులకును గోవులు గతి, గావున మీ రరసి సుగతి । గలుగు తెరువు మా
కేవిధి నైనను జెప్పం,గా వలదే యనిన నట్ల । కా కని వారల్. 72

తే. రంతిదేవుండు వేవత్స । రములు సేయు
నధ్వరమునకుఁ బశువులై । యరుగుఁ డతఁడు
విశసనము సేయ గోలోక । విభవ మొందఁ
గాంతు రని నెమ్మిఁ బల్కిన । సంతసిల్లి. 73

సీ. అగ్గోవు లవ్విభు । నధ్వరంబునకుఁ బో, నుత్సహించుటయు నం । దొక్క గోవు
మనము సుమిత్త్రుని । ధన మాతఁ డనుమతి, సేయక యెట్లు వోఁ । జెల్లు ననిన
నాతనిఁ జంపుద । మతఁడును గోలోక,మున కేఁగుదెంచుఁగా । కని కడంగి
చని మునిఁ దేఱి చూ । డను జాల కంతంత, నతిభీతిఁ గ్రుస్సుటి । యరుగుటయును

తే. గొన్ని కపిలధేనువు లతి । క్రూరచిత్త, లేము వధియించెదము మాకు । నేమి మేలు
సేయువారలు దగ మీరు । సెప్పఁ డనిన, నన్ని మొదవులు నేకవా । క్యత్వ మొంది.

ఆ. సకలవర్ణధేను । సమితికి నెల్లను, గపిలగోవు శ్రేష్ఠ । గాఁగఁ గపిల
నీగి గోశతంబు । నిచ్చినయట్లుగా, వరము మీకు నిచ్చు । వార మనియె. 75

వ. అనిన విని కరంబు ప్రియంబునం గామరూపిణులై నయగ్గోవులు యాపాంతరంబులు గైకొని యాభృగువంశవర్యుపాలికిం బోయి యేము గోమాతలము నీ దగు గోసమారాధనంబునకు మెచ్చి వరం బిచ్చువార మై వచ్చితి మిష్టం బెయ్యది యడుగు మనుటయు నమ్ముని యిప్పటియట్ల యెల్లప్పుడును గోవులవలన భక్తి స్నేహంబులు గలుగ నిం డనియె నమ్మాటకు నవి యట్ల యయ్యెడుఁగాక యని పలికి వెండియు ని ట్లనియె. 76

క. ఈలోకం బేటికి మన,గోలోకంబునకు రమ్ము । కులవర యనుడుం
జాలుదు నే మద్గోర,త్నాలి విడిచి యందు రాక । కని ముని వల్కెన్. 77

క. విని యాధేనువు లాతని,తను వాకసమునకు నెత్తి । తమయోగబలం
బునఁ జైతన్యముఁ బాపి య,వనిమీఁదఁ గళేబరంబు । వైచి రయమునన్. 78

క. కొమ్ములఁ గాళ్లం బిండిగఁ, గ్రుమ్మి మగిడి పోయి పూస । గ్రుచ్చినగతి మున్
తమ్ముం బనిచినగోవుల, కమ్ముని తెఱఁ గెల్లఁ జెప్పి । హర్ష మొనర్చెన్. 79

వ. గోలోకంబునకు ముఖ్య లగుగోమాత లంతయు నెఱింగి తమకడకుం జనుదెంచిన సుమిత్త్రు నాదరించి సుదతులై విహరించినగోవులు మొనలుగా సకలగోవుల తెఱంగు నతని కెఱింగించి నీకు నిది మేల కాక యని పలికి యతనిం బ్రీతునిం

జేసి బ్రహ్మఘాతిక లయినయన్నిగోవులకును మీవంశం బశుచివదనం బయ్యెడు
మని శాపం బిచ్చిన నాధేనువులు రంతిదేవునికడకుం బోయి సుగతి వేఁడి తమ్ముం
బశువులుగా విశసింపు మని మానుషభాషణంబులం బ్రార్థించుటయు. 80

క. మిమ్ముఁ దెగఁ జూచి సద్గతి, కెమ్మెయిఁ బోవంగ నేర్తు । నే నని వినయా
ర్ద్రిమ్ముగ మ్రొక్కుచుఁ బలికిన, నమ్మానవపతికి నిట్టు । లను నగ్గోవుల్. 81

క. జ్ఞానుల యీపని కై నినుఁ, గానఁగఁ బుత్తెంచి రట్లు । గావున సుమనో
మానితగతి నీకును నగు, భానునిభా నీయశంబుఁ । బరఁగు జగములన్. 82

క. నావుడు మీలోపల నొక,గో వైనను మోహవశతఁ । గూరుటయు మఖం
బావేళఁ బరిసమాప్తము, గావలయును వినుఁడు సమయ । కల్పన దెలియన్. 83

క. అని యవ్విభుండు పలికిన, విని గోవులు సమ్మతింప । విశసించుచు వే
ల్చె నతఁడు యజ్ఞానలమున, ననేకగోచయములం గ్ర । మాకలనమునన్. 84

క. ఒకనాఁడు గో వొకటి లేఁ,గకుఁ జన్నిచ్చుచును దానిఁ । గనుఁగొని నీ విం
కకటా యెక్కడఁ జేరెద, వక్రూపులు వచ్చెదరు సంప । నని పల్కుటయున్. 85

గోవులు రంతిదేవుయజ్ఞపశువు లై గోలోకంబునకుఁ బోవుట.

వ. మహానుభావుండు గావున నప్పలుకులు విని రంతిదేవుం డయ్యాగంబు సుప్రయో
గంబుగా సమాప్తంబు గావించెఁ గొన్ని గోవులు గడమవడి పుడమిన నిలిచె నధ్వ
రోపయోగంబు వడసినగోగణంబులు గోలోకంబునకుం బ్రమోదంబునం బోయెఁ
దదీయచర్మాస్థిశ్రేణులు తటంబు లై తనరం బ్రభూతరక్తమేదక్లేదంబు లే ఱై
పాఱి చర్మణ్వతి యనుపేరం బరఁగె నారంతిదేవభూపతియును యజ్ఞసమృద్ధుం డై
వృద్ధశ్రవునితోడిసఖ్యంబునం బొలిచి యక్షయనాకంబున సుశ్లోకుం డై యుండె
ఫేనపాఖ్యుండును గోలోకంబున శాశ్వతుం డై వసించె నని చెప్పి భీష్ముండు
వెండియు. 86

సీ. మానవనాథ యీఫేనపాఖ్యానంబు, బదరికాశ్రమమున । బాదరాయ
ణుఁడు ప్రీతి నారాయణునకుఁ జెప్పిన నమ్మ,హాత్ముఁడు గోయజనార్థి యగుచు
నిది గొనియాడంగ । విదిత మై జగమునఁ, బరఁగెఁ బుణ్యతమంబు । పావనంబు
దీనిఁ బఠించిన । వీనుల నించిన, దురితవర్గంబులఁ । బొరయ వలదు
తే. పూరునృపకులభూషణ । పూతచరిత, నీవు నతిభక్తి గలుగుము । గోవులందుఁ
బరమనియతి నీతంత్రంబు । పఠనవిధియు, నేతదాకర్ణనంబును । నెపుడుఁ జలుపు.

క. అనిన విని యట్లు చేసెద, ననఘా గోమహిమ యిట్టు । లాకర్ణింపం
గనియును దనివి సనదు నా,మన మింకను జెప్పు నీవి । మలవాక్యములన్. 88

క. అని ధర్మతనయుఁ డడిగిన, ననయంబుఁ బ్రియంబుఁ బొంది । యమరనదీనం
దనుఁ డిట్లను సత్యవతీ,తనయునివాక్యములు సెప్పె । దను వినుము నృపా. 89

ఆ. గోవిశేష మర్థి । నీవు నన్నడిగిన,యట్ల శుకుఁడు దండ్రి । నడిగె దాని

కాత్మఁ బ్రియము బొంది యామహాసంయమి, యాసుబుద్ధి కిట్టు లనియె నధిప.
సీ. స్థావరజంగమాత్మక మైనభూతజా, తంబుసుస్థితి గోగణంబునాశ్ర
యమునన తత్సంభవమును గోవులయంద, యవి మూలసంతానమజున కట్లఁ
గాక సిద్ధులసాధ్యగణములమాత లి, ట్లగుట యెఱింగినయతఁడు బ్రహ్మ
లోకగోలోకాది[1]లోకాంతరములకుఁ, దనయింటి కరుగుచందమున నరుగుఁ
తే. బరమగతిఁ గోరువారలు పాదముష్టి, యష్టివాక్చిత్తముల గోవు నభిభవింప
కుండ వలయు నివ్విద్యఁ బద్మోద్భవుండు, సెప్పె నది యాత్మపావనశిష్టసేవ్య. 91
క. పావన మని శ్రుతి సెప్పిన, యేవస్తువు నాశ్రయించి యెక్కుడయిరి భూ
తావలులకు సుర లట్టిది, గోవు తదీయ మగుమహిమకుఁ గుఱి గలదే. 92
క. వీణాకాహళవేణు, క్వాణప్రతిమములు ధేనువర్గధ్వను ల
క్షీణసుకృతంబు నిర్మల, వాణి తదాకర్ణనంబు వర్ణనవిధమున్. 93
క. క్షీరము దధియును ఘృతము సు, ధారూపము లగుట దేవతాప్రీణనయ
జ్ఞారంభంబులు విమలా, చారా గోదోహనైకసాధ్యము లయ్యెన్. 94
ఆ. శ్రుతులు నౌపనిషదసూక్తులు గోస్వరూ, పంబు లని సరోజభవుఁడు సెప్పె
ధర్మపరత పరమతపము మహాధ్వర, మనఁగఁ బరఁగు గోసమర్చనంబు. 95
క. ఈవాక్యంబులు భూదే, వావలిసన్నిధిఁ బఠించునాతఁడు పుణ్యుం
డై వెలయు విన్నవారలు, పావనగుణ తత్క్షణంబ పాతు రఘములన్. 96
తే. గోఘృతంబు ప్రాశించియు గోకరీష
సువిహితస్నానుఁ డయ్యు భూదివిజుఁ డధిక
భక్తి నిత్యంబు గోమతీపఠన మాచ
రించియును గల్మషముల నిర్జించు ననఘ. 97
చ. అనిమిషులుం మహామునులు నయ్యయిపెంపులు గోమతిం బఠిం
చినసుకృతంబునం గనిరి శ్రీయును శత్రుజయంబుఁ బేర్మియుం
దనయసమృద్ధియుం గలుగుఁ దత్పఠనంబున బంధుకోటి బం
ధనమునఁ బాయు మార్గమునఁ దప్పు మృగార్తియుఁ జోరబాధయున్. 98
వ. అనిన విని యమ్మునిపతికి శుకుం డి ట్లనియె. 99

వేదవ్యాసముని శుకునకుఁ జెప్పినకపిలగోమహానుభావము.

క. తమజాతికిఁ దగుకర్మ, క్షమతలు లేకున్నయట్టిజనములు కపిలా
సమధికపూజనతద్దా, నము లొనరింతు రవి వాచు నాదురితములన్. 100
సీ. అనుటయు సందియంబది యేల కపిలఁ బూ, జించినఁ బ్రీతి నిచ్చినను జెడని
యఘములుఁ గల్గునే యనియెఁ బరాశర, తనయుఁ డవ్వాక్యంబు విని తదీయ
తనయుండు కపిల కంతటిపెంపు రాఁ గతం, బేమి నావుడు నమ్మునీశ్వరుండు

1. గ. లోకోత్తరములకు.

వినుమని యిట్లను । ననిమిషసంఘంబు, నొకకారణమునఁ బావకుఁడు మొఱఁగి
ఆ. యరిగి తనదుగుప్తి । యర్థించి గోవుల, నాశ్రయించె నవియు । నగ్నిగోప
నంబు సేసె నవ్విరోధంబున శిఖి యున్కి, సుర లెఱింగి రెల్ల।చోటు నరసి. 101
వ. ఎఱింగి కూడుకొని గోవులకడకు వచ్చి వానితో నగ్ని దాఁచుట యఖిలజగజ్జనం
బులకు సహితంబు సేయుట గాదె చూపకుండుట దగ దని పలుకుటయుఁ బుయి
లోడి గోవు లప్పావకుం జూపిన నాసుపర్వులు సంతోషించి వానికి వరం బీవలయు
నని యవ్వాయుసఖుం బ్రార్థించిన నతండు దా నగ్గోవులయందు డాఁగి యుండ నవి
కపిలచ్ఛాయం బ్రాపించి యునికిం గనుంగొని గోవుల కెల్లను గపిల యెక్కు డగు
టయుం దదీయారాధనంబునుం దద్దానంబునుం బుణ్యాతమంబు లై దురితంబుల
దమియించి యుత్తమలోకంబుల నిచ్చుటయు వరంబులుగా నిచ్చె నని చెప్పి
వెండియు. 102
తే. కపిల యిచ్చినవానిన । కాదు నిజమ, కొన్నవానిని బుణ్యాత్ము।కుఁడుగఁ జేయు
నీవుఁ గపిలాసమర్చనా।నిరతమాన,సుండవగు మెంతయును మేలు । సువ్రతాత్మ.
వ. అని చెప్పుటయు నప్పరమమునీశ్వరుతో నమ్మునికుమారవరుండు కపిలాలక్షణం
బెఱింగింపవే యనిన నతం డతని కిట్లనియె. 104

తే. కర్ణశృంగాక్షిఖురనాసి।కాపుటములు
కపిలములు గుత్తుకయును ముష్కములు గవిల
[1]పట్టు లొండు నెం దే నొక।పట్టు కపిల
మైనఁ గపిలాత్వగుణమున । కదియ చాలు. 105
క. మే నెల్లఁ గపిల మైనను, దానిం జెప్పంగ నేల । తగదు కపిలలక్
మానితగుణ పిదికి కుడువఁ,గా [2]నేబలి కైనఁ గాక । కట్టఁ బెఱికకున్. 106
ఆ. కాలఁ గేలఁ గోలఁ । గపిల దండించిన, నరకవాసమునకు । నరుగవలయుఁ
బూరి నీరు లెస్స । యారసి యగ్గోవు, సత్కరింప సుగతి । సంభవించు. 107
క. అనఘ కపిలాప్రదానం,బునకు ఫలం బిట్టి దనఁగఁ । బోలునె కమలా
సనుఁడు మహానందప్రద, మని వెఱచుచుఁ జెప్పె దాని । నట యే మందున్.
వ. అని వెండియు. 109
క. వసుధామరగాయత్రీ,వసంతములు సత్యగోసు।వర్ణంబులు నే
కసముద్భవంబు లని తా,పసవర్యులచేత విందుఁ । బావనచరితా. 110
క. కావున భూమియుఁ గనకము, గోవును దానార్హవస్తు।కోటికి నెల్లన్
ధీవినుతా యెక్కు డగుట, నీవిమలోదాత్తబుద్ధి । నెలవుకొలుపుమీ. 111
క. అని మునిపతి సెప్పినఁ ద,త్తనయుఁడు ప్రియ మందె ననుడు । ధర్మసుతుం డే
విని యుండుదు సిరి గోమయ,మున నుండుట దాని కేద్ది । మూల మగునొకో. 112

1. చ. పట్టు లెందు లేకయుఁ దొఁక♦పట్టు. 2. చ. జ. నేపని కైనఁ గాఁడి♦గట్టం బెఱికన్.

### గోశ్రీసంవాదము.

వ. అనుటయు గాంగేయుండు గోశ్రీసంవాదం బనునితిహాసంబు విను మయ్యర్థంబు దేటపడు నని పలికి యి ట్లనియె. 113

సీ. సిరి ధేనువులలోని ✽ కరిగిన నెవ్వత, వని యవి యడిగిన ✽ నమ్మహాత్మ
శ్రీ నేను మీలో వ✽సింపఁగా వచ్చితి, ననవుడుఁ జంచల ✽ వైననిన్ను
నొల్లము మాలోన ✽ నునుపఁగా ననియె న, గ్గోవులు దాని క✽ద్దేవి వగచి
యేను బాసిన సర్వ✽దానవకులముఁ గీ, డ్పడియెఁ బొందినసురల్ ✽ ప్రభుతనొంది
తే. రేను నచ్చట గోరి కా✽దే తపంబు, లాచరింతురు న న్నిట్టు ✽ లభిభవించు
టుఱవె మీకన్న నఘ్రివ✽ మొల్ల మనుట, యభిభవమె నీకుఁ బోలిన✽య దటి కరుగు.

క. అని గోవులు పలికిన సిరి, విని మీచే నిట్లు పరిభ✽వింపఁగఁబడి యోఁ
జనిన నను నెవ్వరును గై, కొనరు శరణ మగుఁడు వేఁడి✽కొనియెద మిమ్ముస్. 115

తే. మీసమీపమునం దున్కి ✽ మేలు దాని, నిందు నా కని యడిగిన ✽ నెంతయేని
నాదరంబున నగ్గోవు ✽ లంతవట్టుఁ, గూడి యి ట్లను లక్ష్మికిఁ ✽ గురునరేణ్య. 116

క. మామూత్రపురీషంబులు, భామా వేదంబు లెఱుఁగు✽పావనములు నీ
వీమేలివస్తువులు, ప్రియధామము లై యుండు మింపు ✽ దలకొన మాకున్. 117

తే. అనుటయును సిరి నాదుపు✽ణ్యమునఁ జేసి
కంటిఁ బడయంగ మీయను✽గ్రహము ననుచు
నట్లు వసియించె నిది గోమ✽య ప్రభావ
మూల మిట్టిది గోవున✽మోఘమహిమ. 118

వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద నాకర్ణింపుము. 119

ఆ. సురభి తపము సేయ ✽ సరసిజాసనుఁడు ప్రత్యక్షు మై మనోర✽థంబు సెప్ప
మిచ్చుకౌతుకమున ✽ వచ్చితి ననవుడు, నిట్టు లనియె నది మ✽హీశవర్య. 120

క. మీ రిట్లు ప్రసన్నమతిః, గారవమున వచ్చినంత✽కంటెను మే లేఁ
గోరంగ వలయునట్టిది, కారుణికప్రథమగణ్య ✽ కలదే నాకున్. 121

వ. అనిన నత్యంతసంతుష్టస్వాంతుం డై సురజ్యేష్ఠుండు సురభిం జూచి సురలోకాది దివ్యలోకంబుల కెల్లను గోలోకంబు మీఁదుగా వరం బిత్తుంగాక యని తలంచి యవ్విశేషంబు మున్న తనవలన సిద్ధం బగుట సంస్మృతిగోచరం బగుటయు. 122

తే. గోవులకు మేలు సేయంగఁ ✽ గోరు నాదు, చిత్తమున మద్వారంబున ✽ సిద్ధ మైన
తెఱఁగ యొలసె దైవికమ✽యుఁ దీని పెంప, యావహించెద నని యిచ్చె✽నవ్వరంబు.

క. వనరుహసంభవుఁ డత్తెఱఁగునఁ దమలోకంబుకంటె ✽ గోలోకము స
జ్జనవినుతచరిత మీఁదై, యునికి వెలుఁగఁ జేసె నది మ✽హోజ్జ్వలమయ్యెన్. 124

వ. అని చెప్పి. 125

క. గోవిషయవాక్యపఠన, శ్రావణసంశ్రవణములు ఫకరావర యాయు
శ్శ్రీవిభవకీర్తిసుగతిస, మావహములు తత్పరుండ వగు మిక్కఫలన్. 126

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో మహాత్మా గోవులమాహాత్మ్యంబు దేటపడం బెక్కుభంగులం జెప్పి నన్నుం గృతార్థుం జేసితి సర్వయజ్ఞంబులందును దాతవ్యం బత్యంతంబు సువర్ణం బని యిందు వేదంబులు సువర్ణదక్షిణ జేలివై యని చెప్పెడు భూమియు గోవులుం గాంచనంబును నీవిషయంబు లైనదానంబులు నుత్తమంబు లని వేదవ్యాసువచనంబులకలిమి నీవ చెప్పితి సువర్ణవిశేషంబు విన వలతుం జెప్పవే యనుటయు నతం డతని కి ట్లనియె. 127

భీష్ముఁడు ధర్మరాజునకు సువర్ణదానమహిమాతిశయంబు సెప్పుట.

సీ. శంతనునృపతి లోకాంతరగతుఁ డైన, విను తదీయశ్రాద్ధవిధి యొనర్పఁ
బూని గంగాద్వారమున కేఁగి మాతల్లి, గంగ సాహాయ్యంబు గారవమున
నాచరింపంగఁ గ్రియాకలాపం బెల్ల, నడపఁ బిండప్రదానంబునమయ
మగుటయు దర్భవిన్యాస మొనర్ప నం, దంగుళీయకకంకణాంగదములఁ

ఆ. గాంత మైనయొక్కకరము వొడమి యఱ, చేయి సాఁచుటయును జిత్త మద్భు
తంబుఁ బొంద దానిఁ దప్పక చూచి య, య్యధిపుబాహు వగుట నాత్మ నెఱిఁగి.

క. జనకుఁడు వేడుకఁ జే సాఁ, చినయంతన సంతసిల్లి చేతం బిండం
బనుమానింపక యేఁ బెట్టిన శాస్త్రవిధానగతి ఘటింపమి వచ్చున్. 129

తే. పితృకరంబునఁ బిండంబు వెట్టు మనదు
శాస్త్ర మంచిత మగుకుశాస్తరణమునన
పెట్టఁ జెప్పె న ట్లగుట నేఁ బెట్టఁ జేత
నని మనంబునఁ దలఁచి వంచనము సేసి. 130

క. అమలం బగుకుశసంస్తర, ణమునం బిండంబు వెట్టినం దోఁచినహ
స్త మదృశ్యమయ్యె మత్పితృ, సమితి ముదముమోములం దెసఁగఁ బొడసూపెన్.

క. పొడసూపి ధర్మమార్గం, బెడపక నీ విట్లు పిండ మిడుటకు హర్షం
బడరినఁ జనుదెంచితి మె, క్కుడుతృప్తిం బొందితిమి ప్రగుణ్యచరిత్రా. 132

వ. అని పలికి వెండియు. 133

క. భూమికి గోవులకును నై, హేమ మిడుట యస్మదీయహితమును దేవ
స్తోమప్రియముం బావన, తామహనీయంబుఁ జుమ్ము ధర్మవిధిజ్ఞా. 134

క. పావనము సువర్ణము వం, శావలికిం దనకు నిర్మలాత్మత నిచ్చుఁ
నీ వది యెఱిఁగి సకలయ, జ్ఞావసరములను సువర్ణయాజివ యగుమీ. 135

క. అని చెప్పి చనిన నా దగు, మనమ్ము సువర్ణప్రదానమహిమ కెలయఁ ద
ద్వినుతానుష్ఠానపర, త్వనిరూఢుఁడ నైతి నేను ధర్మతనూజా. 136

వ. అని పలికి యాభూవల్లభునితో భీష్ముండు వెండియు ని ట్లను నిది యేను గనినది

సువర్ణదానంబుమహిమ మఱియును వినినదియునుం గల దాకర్ణింపుము. 137

సీ. పరశురాముఁడు గిన్క నిరువదియొక్కమా, ఱదయుఁడై రాజుల వెదకివెదకి
వధియించి కృప పుట్టి వాజిమేధంబు ప్రా,యశ్చిత్తముగఁ జేసి యంతఁ దనివి
సనక వసిష్ఠాదిమునివరేణ్యులఁ గూర్చి, కల్మషపంకంబు గడిగి పురుషు
నత్యంతవిమలుఁ జేయంగ నెయ్యది యోపు, నని వసిష్ఠుఁ డిట్లనియె నతని

ఆ. కనఘ విను సువర్ణ మగ్నిమయంబు దేవతలు నగ్నిమయత సతిశయిల్లు
వారు గావునను సువర్ణదానంబు దేవతల నీగియట్లు శ్రుతులు సెప్ప. 138

క. కావున సువర్ణ మసదృశ,పావనతాస్పదము దాని భక్తిమెయిఁ వి
ప్రావలి కిచ్చినయతనికిఁ, బావనతం గొఱఁత గలదె పావనమూర్తీ. 139

—వసిష్ఠుఁడు పరశురామునకుఁ జెప్పినసువర్ణమహిమము.—

వ. ఏను బ్రహ్మముఖంబున వినినది సువర్ణవిషయం బైనవిశేషం బొక్కటి యెఱింగిం
చెద నవహితుండ వై విను మని పలికి యమ్మునిపతి యమ్మహాత్మున కిట్లనియె. 140

క. గిరిజయు గిరీశుఁడును నొం,డొరువులకై తప మొనర్చి యొకళు లొకళ్లఁ
బెరయం బడసి పరమసుఖ,భరితాత్మకు లైరి జగము ప్రమదం బందన్. 141

వ. కొండొకకాలంబునకు నయ్యాదిమగృహస్థుని తేజంబాపరమగృహిణినిమిత్తంబుగా
రేతోధాతురూపంబునం బ్రస్కన్నంబై యమ్మహేశ్వరుమానసవృత్తిం జేసియగ్ని
యందు నిలిచియుండ నత్తఱిం దారకుం డనునొక్కరక్కసుచేతం బెక్కువిధంబుల
బాధలం బడి యనిమిషులును మునులును గమలయోనిం గానం జని యద్దాన
వుండు దమ్ముం బఱచినపాటెల్ల నెఱింగించిన నద్దేవుండు వారితో దీని నెఱింగి
యేను మున్న మీకు శోభనం బయ్యెడు తెఱంగు సమకట్టినవాఁడ మీరగ్ని నాశ్ర
యించి మాకు శుభంబు సేయ వలయు నని సంప్రార్థనంబు సేయునది యతండు
కర్తవ్యం బెఱుఁగు నరుగుం డని నియోగించిన సంతోషించి యట్ల చేసెద మని
యవ్విధాత వీడ్కొని వార లగ్నికడకుం బోవ నుత్సహించి. 142

సీ. ఆతనియున్నెడ యారసికొని చను,నప్పు డాతండు నిద్రాతిశయము
నూని ప్రచ్ఛన్నుఁడై యుండుట వారలు,గానక యున్నంతఁ గప్పయొకటి
యగ్ని పాతాళంబునం దున్కి యెఱిఁగింప, నప్పావకుఁడు డాఁగి పిప్పలమున
కేఁగెడునెడ శాప మిచ్చె జిహ్వాస్ఫూర్తి, లేక రసాలివివేక మెడలి

తే. యుండెదుమ కప్ప లని బొక్క లెండ నెండి
చచ్చియును నీరు వచ్చినఁ జావు బొంకు
సేసి యెలుఁగులు సెలఁగఁగఁ జెలఁగ వరము
వారు గప్పల కిచ్చి రవార్యతేజ. 143

వ. ఇవ్విధంబున విబుధులు మునులు నమ్మండూకంబుమఱుకువ యుడిపి మఱియును.

క. అనలుని నన్వేషింపఁగ, వనగజ మొక్కండు రావివలను చతురతం

గను గీటి చూపవార, వ్వనస్పతిం జేరఁ జనఁగ వారనియలుకన్. 145

వ. అయ్యగ్నిదేవుండు గజంబులకు జిహ్వ దిరుగంబడ శపించుచు శమీగర్భనివాసి యయ్యె నది మొదలుగా నగ్నికి శమీగర్భంబునం దుత్పత్తి గలిగె నద్దివిజులును దాపసులును గజంబులు ప్రతీపజిహ్వంబు లయ్యును సర్వరసజ్ఞానంబు గలిగి మాననీయంబు లగువరంబులం జేసి రాజితంబులగునట్లుగా ననుగ్రహించి యగ్గజంబువిషాదంబు మాన్చి రంత నొక్కశుకం బెఱింగింప శమీగర్భంబున నగ్ని యునికి యెఱింగి యందఱుం గ్రందుకొనం గడువేగంబునం బొదివికొనిన నిదుర సెడుటకుం గోపించి. 146

ఆ. జిహ్వ మరలఁబడఁగఁ జిలుకల నగ్ని శపించె సురలు సెవుల కించునట్టి
పలుకు వాని కొసఁగి చిలుక నానందింపఁజేసి యాకృశానుఁ జేరఁ జనిన. 147

వ. అతండు వారి నాలోకించి మీవచ్చినకార్యం బేమి యని యడిగిన వారుఁ దారకదైత్యుచేయుబాధ లెఱింగించి వాఁ డేమియుపాయంబునం దెగటాఱు నత్తెఱంగాపాదింపు మని నిన్నుం బ్రార్థింప వచ్చితి మని పలికి వెండియు. 148

క. మాకుం గుశలము గోరుము, నీకును మే లివ్విధంబు నీమహిమ యీ
లోకంబు లెల్ల మనములఁ, జేకొని కీర్తించునట్లు సేయుము కరుణన్. 149

సీ. అనినఁ బ్రసన్నత నట్టులు సేసెద, నూఱడుం డని వారి నూఱడించి
తనయందు వెలుఁగుశంభునివీర్య మిడియె గం,గాగర్భరూపంబుగాఁగఁ నాతఁ
డది యతిపరివృద్ధ మగుటయు ధరియింప, నోర్వక నిర్జరపర్వతంబు
తటమున శరవణస్థంబుగా గంగ యు,త్సృష్ట మొనర్ప నాశిఖరి సతరు

తే. వల్లరీగుల్మకముగ సువర్ణమయత, వెలుఁగ బాలుఁ డై వెలిఁగె నవ్వీరగర్భ
మచ్చటికి వచ్చి కృత్తికలార్వురును మ,దీయపుత్త్రకుఁ డనుచు నెత్తికొనిరనఘ.

వ. ఇత్తెఱంగున నొక్కట నెత్తికొనుటయు నక్కుమారుండు షణ్ముఖుం డై యొక్కపెట్ట సకలకృత్తికాస్తన్యపానం బాచరించె నట్లగ్నిసంభవగాంగేయకార్త్తికేయత్వంబు లొందినయయ్యిందుమౌళితేజంబు పదంపడి బ్రహ్మాదిదేవతలు పూజింప దేవసేనాధిపతిత్వంబునం బేర్చి యర్చిర్మహిత యయినమహాశక్తిం దారకుం బరిమార్చి బృందారకమునిబృందంబుల కానందం బొనర్చె నని యి ట్లప్పరమముని పరశురామునకుం జెప్పి పురహరుం డగునప్పురుషుండు హిరణ్మయుం డగుటయు నద్దేవదేవుండు దాన తనూభవుం డై తోఁచుటయుం దథావిధరేతోధారణంబున వహ్ని హిరణ్యాత్మకరేతోమూర్తి యై హిరణ్యరేతుం డనం జనుటయు నతండు తద్రేతఃకలనంబునం దన్మయుం డగుటం జేసి పురహరునకు వహ్ని రేతుం డనునభిధానంబు గలుగుటయుం దేటపఱిచి యవ్విధంబున రూపవంతం బై నది గావున సువర్ణంబు జాతరూపనామకం బై పరఁగుటయు నెఱింగించి. 151

క. మహితాత్మక యేతాదృశ,మహిమంబు సువర్ణ మది సమంచితతేజో

మహనీయము తద్దానము, మహత్త్వ మాశివుఁడ యెఱుఁగు ♦ మాఁకుం జూడన్.

వ. అవ్విశేషంబున నశేషకల్మషంబులం బాసి నరుండు విభూమత్త్వంబున వెలుంగు శుచియునుం బోలె శుచిత్వసంపద సొంపారం బెంపారు నని యుపదేశించె సవ్వసిష్ఠమునివరువచనంబు లూఁది యమందాదరవర్ణనీయుం డై సువర్ణదానపరంపర లాచరించి. 153

క. ఆరాముండు శుచిత్వ, శ్రీరాజితుఁ డయ్యె నట్లు ♦ సేయుము నీవుం గౌరవముఖ్యా యది భవ, పారావారఘనయాన ♦ పాత్రముసుమ్మీ. 154

క. అని యనిమిషతటినీప్రియ, తనయుఁడు సెప్పుటయు ధర్మ ♦ తనయుఁడు హృదయం బునఁ బ్రమదము నిండార న, తనితో సతిభక్తివినయ ♦ ధాముం బగుచున్. 155

వ. పితృయజ్ఞప్రకారం బెఱింగింపవే యనుటయు నక్కురువరుఁ డన్నరనాథున కి ట్లనియె. 156

క. పితృపూజ సమగ్రము డై, వతపూజనమునకు మనుజ ♦ వల్లభ పితృదే వతలఁ గొనియాడుదురు దే, వత లాదిగఁ గల్గునెల్ల ♦ వారును భక్తిన్. 157

వ. విశేషించి మనుష్యులకుఁ బితృసమారాధనంబు సర్వశుభసాధనంబు. 158

—భీష్ముఁడు ధర్మజునకుఁ బితృపూజావిధానం బెఱింగించుట.—

క. అమవసనమవసఁ బితృయ, జ్ఞముఁ దగఁ బిండప్రదాన ♦ సహితముగా భక్తిమెయిం జేయునతఁడు ని, త్యముఁ జేసినవాఁడ యగు స ♦ మంచితచరితా. 159

వ. పితృయజ్ఞంబునకుఁ దిథివిశేషంబు సెప్పెద. 160

సీ. పాడ్యమిఁ బితృయజ్ఞ ♦ పరుఁ డైనఁ జారుకాం, తాపతి విదియఁ గాం ♦ తలకుఁ దండ్రి దదియను జవితిని ♦ దా [1]వాజిధనకుండు, పశుభాగి పంచమి ♦ బహుసుతుండు షష్ఠి [2]భానాత్ముండు ♦ సప్తమిఁ గృషిభాగి, యష్టమి వాణిజ్య ♦ పుష్టుఁ[3]డు వసు గజధర్మవిష్ణుచి ♦ త్తజతిథులం దేక, శఫజంతువులును గో ♦ చయముఁ గుప్య

తే. ములును దగ బ్రహ్మవర్చస్వి ♦ పుత్త్రకులును
ధనము గలవాఁడు విను చతు ♦ ర్దశి రణైక
భాగి పున్నమ నమవస ♦ భవ్యసర్వ
కామ్యఫలభాగి యగుఁజువ్వె ♦ కౌరవేంద్ర. 161

క. అపరం బగుపక్షంబును, నపరాహ్ణము మేలు పితృస ♦ మర్చనమున కా ద్యపుఁదిథి దశమి చతుర్దశి, నృపవర యప్పక్షమునను ♦ నింద్యతఁ బొరయున్. 162

క. అనిన విని ధర్మసూనుం, డనఘా యెద్దానఁ బితృస ♦ మర్చన మొనరిం చిన నధికఫలం బగు న, వ్వినుతద్రవ్యములఁ జెప్ప ♦ వే తెలియంగన్. 163

వ. అనుటయు దేవవ్రతుం డతని కి ట్లనియె. 164

---

1. క. వందిజనకుండు. 2. చ. హీనాత్ముండు. 3. చ. జ. దురక, ధర్మశివార్కచిత్తజతిథు.

క. తిలపాయసఘృతములు పితృ,కలనములకు నుత్తమములు గవ్యంబు మహా
ఫల మెద్ది యైన మత్స్యం,బులు మాంసము విహితవిధిఁ బ్రభూతఫలంబుల్.

తే. గొఱియనంజుడు ఖడ్గంబు నెఱచి గండ,మృగమునందలిపలలంబు మేఁకమాంస
మొక్కఁ డొకటికి ఫలమున నెక్కుడం,డ్రు, పితృసమర్చనవిధులై నపెద్ద లధిప.

వ. నక్షత్రవిశేషం బాకర్ణింపుము. 167

సీ. [1]కార్తెఁ జైత్రక మగు నకర్మ మొనర్ప ని,శ్శ్రుత రోహిణిఁ బుత్రలబ్ధి
శశితారకమున నోజగిప్రాప్తి యార్ద్రఁ గ్రూ,రపువర్తనము పునర్వసువుపొందఁ
గృషిఫలోదయ మని మిషగురుతార సు,పుష్టి యాశ్లేష నుత్కృష్టవీర
తనుజలాభము మఖఁ దనకులమున పెంపు, పుబ్బ సౌభాగ్యవిస్ఫూర్తిసిద్ధి

తే. యర్యమునితారఁ బెక్కుపత్త్యములపుట్టు, హస్తమునఁ గర్మసఫలత యవ్వలతార
సుందరాకారయుతు లగుసుతులకనుట,యనిలతార వాణిజ్యవర్ధనము గలుగు.

సీ. వినుము విశాఖ సత్తనయబహుత్వ మ
నూరాధ రాజాధికార మైంద్ర
మునఁ బ్రభుత్వము పెంపు మూలఁ బూర్వాషాఢ
నారోగ్యమును నుత్తమాతియశము
నుత్తరాషాఢ శోకోదయరహితత్వ
మభిజిత్తునందు విద్యాభియుక్తి
శ్రవణకాలమునఁ బరమగతిసిద్ధి ధ
నిష్ఠ రాజ్యము జలనిధిపతార

తే. మొదలుగాఁ దారకంబులు మూఁట నగద
కార్యఫలములు సదజావికములు గోవు
లవులమూఁటను గుప్యవృ[2]ద్ధ్యశ్వకాయు
వులు శుచిశ్రాద్ధకర్తకుఁ గలుగు నధిప. 169

వ. అనిన నప్పుడమిఱేఁ డప్పురుషవరునిం బితృపూజనంబులకుఁ బాత్రంబు లెట్టివి గా
వలయు నని యడిగిన నయ్యమరనదీనందనుం డి ట్లనియె. 170

క. దైవికకృత్యంబులకును, భూవర భూసురుల సూక్ష్మముగ శోధింపం
గా వలదు గాని పితృపూ,జావిధికిఁ బరీక్ష వలయు సమ్యగ్భంగిన్. 171

వ. కావున నీ వడిగి మేలు సేసి యాకర్ణింపుము. 172

తే. [3](కులవయోరూపశీలవిద్యల నుదాత్తు,లనఁగఁ దగువారు పంక్తిపావనులు తద్గు
ణమ్ము లారయ లేనిజనములు పంక్తి,దూషకులు పైతృకమునకు దోషదూర.

వ. మఱియును బంక్తిదూషకులం జెప్పెద నాకర్ణింపుము). 174

సీ. జూదరి గరముండు వేదంబు సదువని,వాఁడు వడ్డికి నిచ్చువాఁడు గాయ

1. క.చ. కర్త్య. 2.గ. ద్ద్యతిశయాయు. 3. ఈకుండలీకరణములోనిది కొన్నిప్రతులఁ గానిపింపదు.

కుండు గ్రామముపని। గొనుచునాతఁడు గృహ,దాహి కుష్ఠము గల। తనువునాతఁ
డృణముఁ జెప్పక గొన్నాతఁ। డఖిలవస్తువులును, నమ్మెడునతఁడు సోమమ్ము విక్ర
యించినయతఁ డబ్ధి। సంచారలాభోప,జీవకుం డుర్వీశ। సేవకుండు

తే. భార్యయును దాను బుత్త్రులఁ। బంచికొన్న
వాఁడు పసులఁ బెక్కిటి నేలు। వాఁడు కపట
కృత్యముల మ్రుచ్చిమిని శిల్ప। కృతుల బ్రదుకు
వారు పఙ్క్తిదూషకు లండ్రు। పౌరవేంద్ర. 175

వ. అని చెప్పి వెండియు. 176

క. తలఁ జీర సుట్టియును జె,ప్పులు దొడిగియుఁ జేసినట్టి। భోజనము ఫలం
బలఘుచరిత పద్మజుఁ డసు,రలభాగం బని విధించెఁ। బ్రకట[illegible]. 177

తే. పలుదెఱంగులవంటకం।బులఁ బ్రమాద
జాత మై యశుచిత్వంబు। సంభవించి
నప్పు డసురలు గొండ్రు క్రి। యాఫలంబుఁ
దిలలు పైఁ జల్ల నశుచిత। దొలఁగు నండ్రు. 178

క. శాంతుఁడు సువ్రతశీలుఁడు, దాంతుం డధ్యాపకుండు। దయ గలవాఁ డ
త్యంతప్రబోధసంప,ద్వంతుఁడు పావనులు భూప। వర పంక్తులకున్. 179

క. వ్యాకరణధర్మశాస్త్రవి,వేకములుఁ బురాణజాత। వేదిత్వము బ్ర
హ్మైకత్వబోధనము నధి,పా కలిగినవారు పంక్తి। పావనులు గడున్. 180

తే. మేలిగుణములు గనియు న। మిత్త్రజనము
శ్రాద్ధపాత్త్రంబుఁ జేయంగఁ। జన దమిత్త్ర
దత్త మైనది భస్మహు। తంబుఁ జౌట
నిడినవిత్తునుబోలె నై। చెడు నృపాల. 181

క. మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధం,బునకుం గైకొనుట మేలు। భూసురునిం గై
కొని యరసి కాఁ డనిన నా,తనియుమ్మలికంబు సెఱచు। ధార్మికు నైనన్. 182

క. ఈ తెఱఁగు లెల్ల నెఱిఁగి సు,నీతంబుగ శ్రాద్ధ మధిక। నియతి నడపుని
ర్ధూతదురితుండు నడచుఁ బ్రి,యాతిశయం బెసఁగ దేవ। యానమున నృపా. 183

వ. అని చెప్పి శాంతనవుండు కౌంతేయాగ్రజుతో మఱియు నిట్లను బ్రహ్మమానస
పుత్త్రుం డగు నత్త్రిమునీంద్రు వంశంబునకుం దొడ వగు దత్తాత్త్రేయనందనుండు
నిమినామధేయుం డగు సంయమికొడుకు శ్రీమంతుం డనుపేరివాఁడు మృతుం
డగుటయు. 184

క. నిమి యక్కుమారునకు శ్రా,ద్ధము సేయుచు నుండి భక్తిఁ। దలఁచినఁ గృప న
త్త్రిమునీంద్రుఁడు వచ్చి క్రి,యా,సమీక్షణము సేసె మది నె।సఁగు నర్మిలితోన్.

వ. అట్లు పావకక్రియాకలాపం బనుసంధించి యాసంయమివరుండు. 186

అత్రిమహాముని నిమి కెఱింగించిన శ్రాద్ధక్రియావిశేషము.

ఆ. పరిగ్రహీతులైన బ్రాహ్మణుల్ పంక్తిపావనవరిష్ఠు లగుట వారి కిడిన
దర్భవిష్టరములు దక్షిణావర్తంబు, లగుటఁ గ్రియలు తెలస మగ్ర లగుట. 187

క. అమలినతరదర్భన్యాసము లెంపను దక్షిణంబు సాఁగ నిడినయు
గ్రములు గలిగి యుండుట మంత్రము లమ్యైవిధుల కంచితముగ నడచుటన్.

ఆ. [1]మునగ యుల్లి యడవిమునగ దుర్మాంసము, లానుగమ్ము మలిన మైనయుప్పు
కఱియజీలకఱ్ఱ కఱివేము [2]కురుజ [3]యింగువ ప్రవర్జనీయకోటి యగుట. 189

క. శునకంబు రజస్వల యగువనిత పతితుఁ డంత్యజాతివాఁ డాక్రియప
ట్టున కే డిరువులఁ జేరక, చనఁ జేయుట నుగ్గడించి సంభావించెన్. 190

క. కావున శ్రాద్ధక్రియలకు, భూవల్లభ యట్టిభంగి పూజ్యత నిచ్చుం
దా వినిపించెం బితృదేవావలి నత్త్రి నిజవంశుఁ డగునిమికిఁ దగన్. 191

వ. అత్తెఱం గెఱింగించెద నత్త్రి నిమితో ని ట్లను శ్రాద్ధంబున సర్వవరుణసోమాగ్ను
లకు భాగంబులు బ్రహ్మ గల్పించె విశ్వ లగు దేవతలు పితృదేవతలతోఁ గూడం
దక్షిణయోపయోగ్యతం దోఁతురు వారలకును భాగకల్పనం బొనరించె దేవతల
యందుఁ గొంద ఱుష్మపు లయినమహాభాగులం బితృత్వనిర్దేశంబున నేర్పరించె నవ్వి
రించి వివరించిననామంబులు సెప్పెద వినుము బలుండు ధృతి విపాప్ముండు పుణ్య
కృత్తు పావనుండు పార్ష్ణిక్షేముండు సమూహుండు దివ్యసానువు వివస్వంతుండు
వీర్యవంతుండు హ్రీమంతుండు కీర్తిమంతుండు కృతుండు విద్యుద్వర్చసుండు సోమ
వర్చసుండు సూర్యశ్రీ సోమపుండు సూర్యసావిత్రుండు దత్తాత్ముండు పుండరీయ
కుం డుష్ణినాభుండు నభోదుండు విశ్వాయువు దీప్తి చమూహరుండు సురేశుండు
వ్యోమారి శంకరుండు భవుం డీశుండు కర్త కృతి దక్షుండు భువనుండు దివ్యకర్మ
కృత్తు గణితుండు పంచవీర్యుం డాదిత్యుండు రశ్మిమంతుండు సప్తకృత్తు సోమపూ
ర్వుండు విశ్వకృత్తు కవి యనుగోప్త సుగోప్త నప్త యీశ్వరుండు జితాత్ముండు
మునివీర్యుండు దీప్తరోముండు భయంకరుం డనుకర్ముండు ప్రతీతుండు ప్రదాత
యంశుమంతుండు శైలాభుండు పరమక్రోధి ధీరోష్ణిభూపతి స్రజుండు వజ్రి వరి
వీరలు భాగార్హు లని చెప్పి వెండియు. 192

క. గిరివనదుర్గములందును, సరిదుత్తరణంబునపుడు శ్రాద్ధవిధిసమా
చరణసమయమున వీరిం, బరికీర్తించినయతండు వడయు శుభంబుల్. 193

ఆ. పూరిపంట ప్రాలు [4]నారుగబియ్యంబు, జంబువునఫలంబు శ్రాద్ధకృతికిఁ
గావుతమ్మ నేడ్వఁగాదు శ్రాద్ధక్రియా, చరణసమయములఁ బ్రశాంతివలయు. 194

వ. అనియునుం జెప్పె నని చెప్పి సరిత్సూనుండు ధర్మజుతో మఱియు ని ట్లనియె. 195

1. చ. జ. మునుగ. 2. క. గ. జ. గురిజ. 3. గ. జ. యింగవు. 4. క. జ. ఆరిక.

సీ. ఒకతఱి మునివర్యు ǂ లొక్కటఁ బెక్కండ్రు, శ్రాద్ధముల్ సేయ భో ǂ జ్యములు పెక్కు-
లనుభవించుటఁ దమ ǂ కఱుగమి పుట్టుట,యును బితృదేవతల్ ǂ సనిరి సోము
కడ కట్లు సని తమ ǂ కాఱియ సెప్పిన, నతఁడు పద్మజుపాలి ǂ కరుగుఁ డనియె
వా రట్లు కా కని ǂ బోరన నరిగి ప,ద్మజునిఁ గాంచి యజీర్ణి ǂ దశ యెఱుంగ
తే. విన్నవించినఁ దనయొద్ద ǂ వెలుఁగు చున్న
యగ్నిఁ జూపి యిక్కీ డితఁ ǂ డపహరించు
ననిన నగ్ని మత్సహితు లై ǂ కొనిన నఱుగఁ
జేయువాఁడ నాహారముల్ ǂ సిద్ధ మిదియు. 196

క. అని పలికినఁ బితృదేవత, లనలుఁడు ముఖ్యుఁడుగ నెప్రుడు ǂ నాహారంబుల్
గొని సుఖజీర్ణ్యానందం,బు నొందుదురు సూవె భరత ǂ భూపవరేణ్యా. 197

క. కావున సాగ్నికుఁ డయి తగ, నేవాఁ డొనరించు శ్రాద్ధ ǂ మీడ్యం బది సం
భావింతురు పెద్దయుఁ బితృ,దేవత లసురులకు రాదు ǂ తేఱియుఁ జూడన్. 198

ఆ. అనఘ పితృపితామ ǂ హ ప్రపితామహ,పూజనములు శిష్ట ǂ పూర్వకముగఁ
జేయవలయు నియతి ǂ దాయ దొడ్గినజన్ని,దంబుతోడ భక్తి ǂ ధామ మగుచు. 199

తే. పిండసంబంధమునఁ బాయుఁ ǂ బ్రేతభావ
మది సుగతి నిచ్చు గయఁ బిండ ǂ మట్లు గాన
యరుగునో గయ కొకఁ డైన ǂ నని కదా య
నేకపుత్త్రులఁ గోరుదు ǂ రిద్ధచరిత. 200

క. గౌరి యగుకన్య వరదా,నారూఢం జేఁత నీల ǂ మైనవృషభముఁ
గారవమున విడుపు ముదం, బారంగాఁ జేయుఁ బితృచ ǂ యముచిత్తములన్. 201

క. శ్రాద్ధంబుప్రకారంబును, వృద్ధాచార్యోక్తభంగి ǂ వివరించితి నీ
బుద్ధిం దోఁచినదాని స,మిద్ధగుణోదార యడుగు ǂ మెయ్యది యైనన్. 202

క. అని నిర్జరాపగానం,దనుఁడు వలుకుటయుఁ బ్రియము ǂ దళుకొత్తఁగఁ బాం
డునృపాలునగ్రనందనుఁ, డనూనవినయమున సమ్మ ǂ హామతితోడన్. 203

క. తప మని యార్యులు సెప్పుదు, రుపవాసవ్రతము నదియొ ǂ యొండు గలదొ సా
రపుఁదపము తెఱఁగు నాకుం, గృప నెఱిఁగింపుము విధూత ǂ కిల్బిష యనుడున్. 204

ఆ. అమ్మహాత్ముఁ డిట్లు ǂ లనుఁ బెక్కుదివసంబు
లుపవసించి యునికి ǂ తపముచొప్పె
దాన విను తపస్వి ǂ గా నేరఁ డది యాత్మ
ఘాత మగుట నరుఁడు ǂ కౌరవేంద్ర. 205

క. సత్త్యంబు బ్రహ్మచర్యము, నిత్త్యశుచిత వకాన మతుల ǂ నియమము దయ శు
ద్ధత్త్యాగంబుఁ దపస్సం,పత్త్యాకృతు లండ్రు బుధులు ǂ పౌరవముఖ్యా. 206

వ. అనిన విని కురుపతి కురుపితామహునితో మహాత్మా దానశీలుని యప్రతిగ్రాహ

కునివిశేషం బెట్టిది యెఱింగింపు మనవుఁడు నాదేవవ్రతుం డీవిషయంబునకు సప్తర్షి వృషాదర్భిసంవాదం బనునితిహాసంబు గల దని చెప్పి యమ్మనుజపతి కిట్లనియె. 207

సప్తర్షివృషాదర్భిసంవాదం బనునితిహాసంబు ప్రకారము.

తే. కశ్యపాత్రి విశ్వామిత్ర । గౌతములును
వినుభరద్వాజ జమదగ్ను । లును వసిష్ఠుఁ
డును జగంబుల నెల్లఁ [1]బే । ర్కొనినఋషులు
వారి సప్తర్షిగణ మండ్రు । కౌరవేంద్ర. 208

వ. వసిష్ఠుని దేవి యగునరుంధతి యెంమను నతనితోడన తిరుగు నయ్యేండఱకుం బరిచారిక యై [2]గండ యనుచేడియ వర్తించుఁ దద్వల్లభుం డగుపశుసఖుం డును వారలకుం బరిచారకత్వం బాచరించు నప్పుడుండ్రును దపశ్చరణపరు లై ధరణిం జరించుచుండ నత్యంతఘోర యగునానావృష్టి దోఁచి జీవనసాధనంబు లగుపదార్థంబులు దుర్లభంబు లై జనంబులకుఁ బ్రాణంబులు రక్షించికొనుట దుష్కరం బై చెల్లెం గశ్యపాదులు నతిక్షుధార్తు లై యాహారం బన్వేషించు నెడ శిబిసూనుం డై నయాజ్యనామధేయుండు దొల్లి యజ్ఞదక్షిణార్థంబుగాఁ దనకొడుకు నీలుం డను వాని ఋత్విగ్జనంబుల కిచ్చినం దద్వశగతి నుండి కాలంబగుటయు మృతినొందినం దదీయశవంబు. 209

క. సొదపై నుండఁగ వారలు, పసుండ్రునుం జూచి దాని । భక్షింపంగా
మదిఁ గోరి చేరి చుట్టుం, బొదివినసమయమునఁ గాటి । పొంత తెరువునన్. 210

ఆ. వేఁట వోయి మరలి । విభుఁ డొక్కరుఁడు వృషా,దర్భినాముఁ డతుల । దానపరుఁడు
పోయి పోయి కాంచి । పోవక నిలిచి య,మ్మునులతోడ నధిక । వినయ మెసఁగ. 211

క. మీ రాఁకలి పెల్లున నా,హారంబుగ శవముఁ గొనుట । కడరితి రి ట్లే
లా రం డిచ్చెద మీ కా,హారంబులు వలసినట్టి । వని తా మఱియున్. 212

క. బహువిధములధాన్యములును, బహురసవర్గములు మీకు । భక్తి నొసఁగెదన్
బహుతురగశకటగోగణ,బహుళబహుగ్రామములను । బహుమతి నిత్తున్. 213

వ. అనిన వారల లతని కి ట్లనిరి. 214

తే. రాజవర రాజు దెసఁ బ్రతి । గ్రహము విషముఁ
గల్లుఁ గాఁ జూతు మిట్టులు । గాంచి యున్న
యట్టిమాకు నీ విచ్చెద । ననుట మావి
ధం బెఱుంగమి యింతియ । తప్పు గాదు. 215

క. అనుడు విషాదముతోడం, జని కృత్రిమవనఫలములు । సమకట్టి తగన్
జనపతి మంత్రుల ఋషులకుఁ, గొని పొం డని పంప వార । లకుంఠితభక్తిన్. 216

1. క. గ. జేర్కొనిన. 2. చ. జ. చండ.

వ. వానిం దెచ్చి యమ్మహాత్ములకు సమర్పించిన. 217

ఆ. వారు పట్టి చూచి వాని వ్రేఁగున హేమ,గర్భకంబు లగుట గాంచి [1]నవ్వి
పుచ్చుకొనక యున్నఁ బోయి భూపతికి న,త్తెఱఁ గమాత్యకోటి యెఱుఁగఁ జెప్పె.

క. విని యతఁడు రాజసంబునఁ, గనలు వొడమి కృత్తి వేల్వఁగాఁ దగువారిం
బనిచిన నప్పుడ హోమం,బున రాక్షసి యోర్తు పుట్టె భూపవరేణ్యా. 219

వ. పుట్టి యప్పుడమిఱేనిముందట నిలిచి పని యేమి యనుపు మనిన నతండు ప్రీతుండై
కశ్యపాదులం గనుపుగొట్టు మని పనిచిన నది వార లున్నెడ రోసి పోయె నంతకు
మున్న వారు వనంబున మూలంబులు ఫలంబులు వెదకి తిరుగుచుండ శున
స్సఖుం డనుపరివ్రాజకుండు వచ్చి వారిం గని వందనంబు సేసిన వార లభినం
దించి రతండు నమ్మునులం గలసి యేకార్థుం డై సంచరించె నట్లు చరించు నమ్మ
హాత్ము లతిక్షుధాన్వితు లై తామరతూండ్లు వుచ్చికొని సమలుటకై యొక్క
నలినాకరంబునకు సత్వరగతి నరుగుచు నున్న నారక్కసి యక్కొలని కడ్డంబుగాఁ
బోయి పొడసూపి నిలిచిన. 220

క. ఈకమలవనము చేరువ, నేకార్యము సేయఁ జూచె దీ వెవ్వత వం
చాకొలను సొరఁగ నమ్ముని,లోకము సేరుటయు నమ్మెఱుంత యెలుఁగెసఁగన్. 221

వృషాదర్భి పుత్తెంచినకృత్తి శునస్సఖునిచే మృతిఁ బొందుట.

వ. ఏ నెవ్వత నైతి నేమి యిక్కొలని కావలియున్నదాన ననుటయు నమ్మునులు వెల్ల
నై యాఁకట నలందురి యుపజీవింప నొండేమియు లేమిం జేసి యీసరోవరంబున
బిసంబులు వెతికికొని భక్షించువార మై వచ్చితి మనిన నవ్వనిత మీమీపేళ్లు
సెప్పి మఱి పద్మవనంబుఁ బ్రవేశించువా రని పలికిన నప్పరమమును లన్నాతి
యాతుధాని యగుటయుం గృత్తి యగుటయు వధింప వచ్చినది యగుటయు
నెఱింగి కశ్యపాదు లగుపదుండ్రును దానికి దుర్బోధత్వంబు దోఁచునట్లుగా నిర్వ
చనసహితంబుగాఁ దమ నామంబులు సెప్పి రప్పాపవర్తన వెఱఁగుపడి యుండ
శునస్సఖుండు దనయభిధానం బభివ్యక్తంబుగా నుగ్గడించినం గృత్తి నీపేరు
దెలియం జెప్పవిది యేమి యనవుడు నతండు దేటపడం జెప్పియుండం జెప్ప
వనియెద విట్లంట దప్పు గాదె యిట్టియుద్దండవు మత్త్రిదండంబుపాలు వడు మని
బ్రహ్మదండనిభం బగునిజహస్తగతదండంబున దానిశిరంబు బెట్టు వ్రేయుచుఁ
బాపకర్మురాలా పడుము భస్మంబ వగు మని నిష్ఠురాక్షరంబుగా నిర్దేశించిన
దుర్దశ యగుచుం బడి యారక్కసి భస్మీభూత యయ్యె నప్పు డప్పదునొకండ్రునుం
బ్రమోదంబునం బయోజషండంబు సొచ్చి. 222

తే. బిసము లాదట నందఱుఁ బెఱికి రొంపి
వోవ నీటఁ [2]దెమల్చి మోపుగ నమర్చి

1. అ. యవియు. 2. గ. విదిల్చి, కోపుగ.

తీరమునఁ బెట్టి నియమముల్ దీర్పఁ జొచ్చి
తీర్చి యాఁకలి [1]దముఁ గోసి తినఁగఁ గూడి. 224

క. కొలను వెడలి బిసము లిడిన, నెలవునకుం బోయి యచట నిర్గించినచూ
డ్కుల కవి దోఁపక యున్నను, గలయం బరికించి యెట్లుఁ గానక తమలోన్.

వ. ఒండొరుల శంకించి శపథంబులు వలుకుదము గాక యని నిశ్చయించి శున
స్సఖుని వినువానింగాఁ జేసికొని వసిష్ఠుం డత్రి యిట్లనియె. 225

తే. మొదవుఁ దన్నుట నవియభిముఖత దనకుఁ
గలుగ మూత్రపురీషమోక్షణము సేత
యధ్యయన మనధ్యయనమునందు నడపు
టను బిసంబులు ముచ్చిలినట్టి వైన. 226

వ. అనుటయు వసిష్ఠుండు. 227

క. శ్రుతి నమవమి సన్న్యాస, స్థితిఁ గామునకుఁ డగుటఁ సుకృతిఁ జేకొని తిరుగన్
మతి రోయమి నద్యైడున, గ్గతి యాఁకులు ముచ్చిలించునతఁ డనున్. 228

వ. అని వెండియు. 229

క. సుత నమ్మికొనుట శరణా, గతుఁ జేకొనకునికి నిచ్చునాతురికుదరి
ద్రుతఁ జూచియు వేఁడుటనగు, గతి బిసములు డాఁచికొనుట నగల్గినఁ గల్గున్. 230

వ. అనియెఁ దదనంతరంబ. 231

చ. పలలవృథోపభుక్తి [2]సభఁ బక్షముఁ బల్కుట దుష్టదాన ము
గ్గలి దివసంబునం గవయునష్టత విప్రజనంబు లుబ్ధతా
కులితముఁ జేత యెల్లసరనకుం గొని యమ్ముట కాదె తూఁడుతేఁ
గలపొది ముచ్చిలించు టని కశ్యపసంయమి వల్కె భూవరా. 232

వ. పదంపడి. 233

క. జ్ఞాతులయెడ గోవులయెడ, [3]గోతులయెడ ధర్మ మెడలి క్రూరుఁ డగుట కా
ర్యాతురవిప్రోపేక్షా, నీతి బిసము లపహరించునిపుణత యరయన్. 234

క. అని పలికి భరద్వాజుం, డను మఱియు హవిస్సు గ్రంపనయగ్ని నిడుట యొ
జ్జ నధగకరించి చదువుట, యనునివి సరి యా బిసాపహారణంబునకున్. 235

వ. అని పలుకుటయు. 236

తే. ముట్టునను భార్యఁ గవయుట మూత్రమును బు
రీషమును నీర విడుపు విద్వేషయుక్తి
యోషిదుపజీవనము మృణాళోత్కరంబు
ముచ్చిలుటఁ బోలుక ల్మషములె తలంప. 237

క. అని జమదగ్ని మఱియు ని, ట్లను ననోన్యాతిథిత్వ మసహాయపువై

---

1. క. దముఁ గొని తినఁగ; జ. దవ గొని తినఁగ. 2. న. కరిపక్షము. 3. గ. చ.జ. గోఁతులయెడ.

రనిరూక్షి పాఁడిమొదవుం, గనలి యడుచు టీఁడె బిసని।కరచోరతకున్. 238

న అనవుడు గౌతముండు. 239

క. ధృతవేదత్యజనానల,వితతివృథాత్యాగసోమ।విక్రయవృషలీ
పతితా[1]దుర్గ్రామాజీ,వితలు బిసస్తేయకష్ట।వృత్తికి నెనయే. 240

వ. అని నిర్దేశించిన విశ్వామిత్రుం డి ట్లనియె. 241

క. తగుభృత్యులఁ బ్రోవ కునికి, దగనిభటులఁ బ్రోపు కపట।ధార్మికవృత్తిఁ
జగతీపతిఁ గొల్చుట లె,స్సగఁ బోలఁగ నేర్చునే బి।సస్తైన్యంబున్. 242

వ. నావుడు నరుంధతి యుల్ల నవ్వుచు. 243

క. సతతంబు నత్తమాఱుటఁ, బతియెడ దుశ్చిత్త యగుటఁ। బరమాన్నము నొ
క్కతె సేవించుట నగున,గ్గతి బిసములు దాఁచికొన్న।కష్టుఁడు గలుగున్. 244

సీ. అనుఁడు వంటకము సే।సినయింతిదా మున్న, గుడుచుట పనియెడఁ।గుటిలయగుట
బొంకులు వలుకుట । పుత్త్రిక వెల గొని, యిచ్చుట సుజనుల । కెగ్గు సేఁత
యెట్టిదుర్గతిఁ దెచ్చు । నట్టిద కల్గు బి,సావలి మ్రుచ్చిలి।నట్టు లైన
నిట్లు గాకయుఁ బుట్టు । వెల్ల దాస్యంబు నిఁ,గక పోవు నక్కడు । గలనికృష్ట

తే. యనియె [2]గండ యసంతానుఁ । డగుట గర్భ
దాసుఁ డగుట దరిద్రత్వ।తప్తుఁ డగుట
చెందుఁ దూఁడులకట్ట మ్రు।చ్చిలినకష్ట
నరుని కని పల్కెఁ బశుసఖ।నాముఁ డధిప. 245

వ. అని యిట్లందఱుం దన కభిముఖు లై పలికిన వారితో శునస్సఖుం డి ట్లనియె.

క. ఛందోజ్ఞున కైనను దన,నందన నధ్వరధురీణు।నకు నైనను నా
నందముగ నిచ్చుటం బో,లుం దూఁడులకట్ట మ్రుచ్చి।లుట దలపోయన్. 247

తే. అనిన నయ్యందఱును బుణ్య।మైనకర్మ, మనఘ శపథంబునకు విష।యముగ నీవు
వలికి తటు గాన బిసలతా।ప్రతతి నపహ,రించినాఁడవు మమ్ముఁ గా।రింప కిమ్ము.

సీ. అనిన నిక్కం బిది । యందఱు నొండొరు, నే మనియెదరొ వీ। రీబిసముల
పొది యేను దాఁచి చూ।చెద నని దాఁచితి, నిదె కొనుఁ డని దాని।నిచ్చి మీకు
నలిగి వధించుట।కై హోమవహ్నిఁ బు,ట్టించి వృషాదర్భి । పంచెఁ గృత్తి
నది మున్న కాంచి ర।క్షార్థి నై వచ్చి యా,రక్కసిఁ జంపితి । నిక్కమునకు

ఆ. వాసవుండ లోభ।వర్జనముఖభవ,త్సద్గుణములఁ జేసి । శాశ్వతంపు
నెలవు గలిగె రండు । నెగయుండు పుణ్యలో,కముల కని సమాద।రమునఁ బలికె.

వ. అట్లు వలుకుటయు. 250

చ. అనయముఁ బ్రీతిఁ బొంది ముని। [3]లట్టుల చేసెద మంచు నింద్రుప
జ్జన తగ నేఁగి దేవపరి।షత్పరిపూజ్యపదస్థు లై వెలిం

1. క. జ. దుష్కృపా...బిసస్తైన్య కష్ట. 2. గ. ఁ జండ. 3. క. గ. లట్లన చేసెద.

గి నిఖిలలోకనిత్యపరికీర్తితమూర్తుల నొప్పి రింతయు
న్వినుమపరిగ్రహంబుమహానీయత నైనదిసూవె భూవరా. 251

క. కావున లోభము విడుచుట, కేవియు సరి గావు గుణము ♦ లీగుణము మహీ
దేవులకు వలయుఁ బెద్దయు, నీవిధమున కమరసంఘు ♦ మెంతయు మెచ్చున్. 252

వ. అని చెప్పి భీష్ముండు వెండియు. 253

ఉ. ఈయితిహాస మార్యసభ ♦ నెవ్వఁడు సమ్మతిఁ జెప్పు వాఁడు దీ
ర్ఘాయువు శ్రీయు ధర్మము సరమంచితకీర్తియు వృద్ధిఁ బొంద సౌ
ఖ్యాయతనాత్ముఁడై మను సురావలియుం బితృకోటియుం బ్రియ
శ్రీయలరారఁగీ డతనిఁ ♦ జెందక యుండఁగఁ జేయ నెయ్యెడన్. 254

—ఉపానద్దానవిషయకసూర్యజమదగ్నిసంవాదము.—

వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్త్రుతోఁ బిత్రుకార్యాదులయందు గొడు గులుఁ జెప్పులు నిడుట యుత్తమప్రకారం బని చెప్పుదురు వానివిశేషంబు తెఱం గెఱింగింపవే యనుటయు నమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లను సూర్యజమదగ్ని సంవాదం బనునితిహాసంబు వినుము దాన నియిడిగినయది దేటపడు జమ దగ్నిమహాముని క్రీడార్థియై శరాసనంబు ధరించి రేణుకాదేవి బాణంబులకట్టఁ గొని తనతోడం జనుదేర నివాసంబు వెడలి యొక్కబయల నయ్యంపపొది నిలువ వైపించికొని దూరాపాతనం బాచరింప నక్కుసుమకోమలి సని యమ్ము లేఱికొని వచ్చి యిచ్చుచుండు. 255

తే. ఇవ్విధమున వినోదింప ♦ నినుఁడు గగన
మధ్యగతుఁ డయ్యె నప్పు డరమ్మగువ యమ్ము
లేఱి తేరంగఁ బోయి యొరక్కింత దడసి
యరుగుదెంచిన నాతఁ డరయ్యబలతోడ. 256

క. లోలాక్షి యచట నిమ్మరి, యేల తడసి తనుడుఁ బేర్చురనిను తేజమునర్క
నేలకు వేఁడిమి దనికినఁ, జాలన వెసఁ ద్రొక్కఁ దలయుఁ ♦ జాలఁ దపించెన్. 257

క. ఇమ్మెయి నలంగి యొకవృక్షమ్మునక్రీనీడ నిలిచి ♦ చనుదెంచుట నా
కిమ్మరి దడయ వలసె నని, యమ్ముద్దియ సెప్పెఁ జెమట ♦ యడరఁగ మేనన్. 258

క. విని యేమేమీ నొంచెనె, యినుఁడు నినుం దప్పలంబు ♦ నిప్పుడ కుడువం
గనిమెడుఁ గా కస్త్రానల,మునఁ బొదివెద నతని నని యెరమునికోపమునన్. 259

ఉ. దాని నెఱింగి భూసురతఁ ♦ దాల్చి వెసం జనుదెంచి యర్కుఁ డ
మ్మానితసంయమిం గని యరమత్సరభావము దోఁప రోషముర్క
మానుము నావుడుం బలుకు ♦ మానుము నీ వటు వాయ మేసెదర్క
భానుని నేలఁ గూల నని ♦ పల్కె మునీంద్రుఁడు శోణితాక్షుఁడై. 260

చ. పలికిన బ్రాహ్మణుం డోడుఁగఁ ♦ బాఱక నిల్చి మునీంద్ర యట్టు లి

ట్టల మగుక్రూరవృత్తికిఁ గడంగుదురే సవిత్రుండు రశ్ములన్
జల మొసఁగంగ నోషధులసంపద [1]హవ్యమహత్త్వ మొంది వే
ల్పులకు బలంబు నిచ్చు నది లుప్తము గాదె యతండు నొచ్చినన్. 261

చ. అనినను శాంతి లేమికి భయంబు బెదఁ గూరఁగ మ్రొక్కి యాతఁ డే
నినుఁడ సహింపు నావలన నెగ్గులు గల్గెనయేని నీకు నె
మ్మనము దయామయం బని సమస్తజగంబులు సంస్తుతింపఁగా
విని ముద మందుదున్ శరణు వేఁడెదఁ [2]గావుము నన్మునీశ్వరా. 262

చ. అనినఁ బ్రశాంతుఁడై తపను నాభృగుముఖ్యుఁడు ప్రీతి గారవిం
చినఁ బ్రమదంబునన్ గొడుగుఁ జెప్పులు మానసవృత్తిఁ దెచ్చి య
మ్మునికడఁ బెట్టి యత్తరణి ము న్నివి లే వని పల్కి దీనమైఁ
దనుకదు వీనఁ బాదములఁ దాఁకదు నా దగువేఁడి యేమియున్. 263

మ. నయ మిట్లారఁగ నాతపత్రము నుపానద్ద్వంద్వముం జూపి చె
ప్పి యపూర్వం బగుసృష్టిఖేలనమునం [3]బెంపారునవ్వస్తువుల్
దయ సద్విప్రున కీగి యైహికసుఖాదాత్త్యంబు నాముష్మిక
ప్రియమున్ దాతకు సుస్థిరంబులుగఁ గల్పించున్ మునీంద్రోత్తమా. 264

మ. అనినన్ మోమలరన్ దినేశ్వరునిఁ దా నామంత్రితుం జేసి య
మ్మునిశార్దూలుఁడు వల్లభాసహితుఁడై మోదంబునం దేలుచుం
జనియెన్ నాఁడు జనంబు లెల్లను బ్రహర్షం బందుచున్ వానిఁ గై
కొని రవ్వస్తువు లిట్టి వేర్పడఁగ నీకుం జెప్పితిన్ భూవరా. 265

చ. దినకరచిత్తసృష్టములు దివ్యమునీశ్వరలాలితంబు లీ
వినుతపదార్థముల్ కరుణ విప్రులకున్ యతిసాధువృద్ధస
జ్జనులకు నిమ్ము నీ వది సుసారపుధర్మము సూవె దానఁ గ
ల్గును విను గోకులాకలితలోకము లోనగుపుణ్యలోకముల్. 266

క. దానప్రవణ యుపాన,ద్దానంబును నాతపత్రదానము సురస
మ్మాననభాజనము లగుట, నానాబుధజనులచే విననంబడు నెపుడున్. 267

క. అనిన విని పాండుభూవర,తనయోత్తముఁ డిట్టు లనియెఁ దాతకు శూద్రుం
డనఘా యెమ్మెయిచరితం,బున నిహపరపరమసౌఖ్యములఁ జెందఁ గనున్. 268

వ. అనుటయు నతం డతని కిట్లనియె. 269

శూద్రున కవశ్యానుష్ఠేయం బైనధర్మంబు నిరూపించుట.

క. లోకహితార్థంబుగ ముని,లోకోత్తముఁ డాత్మశిష్యలోకమునకు సు
శ్లోకుఁడు పరాశరుఁడు ధ,ర్మాకారము లెఱుఁగఁ జెప్పె నంచితచరితా. 270

వ. అవ్వాక్యంబులు సెప్పెద నందు భవత్ప్రశ్నవిషయం బయినయర్థంబు నవగతం

1. గ. హవ్యమయత్వ. 2. క. గావున సన్మునీశ్వరా. 3. క. బెంపారి యావ్వస్తువుల్.

బగు నాకర్ణింపుము.                271

సీ. కరుణాఢ్యుఁ డగుపరా।శరమునివరుఁడు శి,ష్యులకు నిట్లను విం।ద్రియోత్కరంబు
గెలిచి యంతశ్శత్రు।కుల మైనకామాది,వర్గంబు నోర్చి గ।ర్వంబు వదలి
త్రైవర్ణికులయెడ। భావంబు భక్తిమ,యంబుగా శుశ్రూష। నాచరించి
శూద్రుఁ డైహికసుఖ।సుగతులఁ బడయు వే,దాధీతితపముల। నాచరించె
ఆ. నేని నుభయలోక।హీనాత్ముఁ డగు భూమి,సురనృపాలవైశ్య।శూద్రులకును
నధ్యయనము బలస।మగ్రత వాణిజ్య, మనుచరత్వ మధిక।ధనము లరయ. 272

క. ఇవి శాస్త్రదృష్టమార్గము, లవనిసురప్రభృతు లీస।దాచారంబుల్
సువిహితములుగా నడపిన, భువనద్వయమునను బడయుఁ।బోలుం బెంపుల్. 273

తే. ఇట్లు గా కాత్మధర్మంబు। లెడల విడిచి
వర్ణములు నాలుగింట నె।వ్వార లైనఁ
దొలఁగఁ ద్రొక్కినఁ బాటిల్లు। దుష్టగతులు
మన్నకాలంబు పదపడి। చన్నయపుడు.                274

వ. అని పలికి శౌచవిధి యెఱింగింపం దలంచి యిట్లనియె.                275

క. మూత్రపురీషోత్సృష్టికి, రాత్రి పగలు దక్షిణో।త్తరదిశాముఖతా
సూత్రణము వలయునది సం,ధ్యాత్రయమును నుత్తరంబ। యగు నప్పునికిన్.

క. పలుక వలదు శౌచక్రియ, సలుపక మును సలుపునపుడు। జలములు దొడలం
జిలుకుట యొప్పదు మృత్తిక, వలయు నపానంబునం ద్రి।వారంబు లిడన్. 277

క. గుదతలము నొవ్వఁ దోమినఁ, గదురును రోగంబు లేప।గంధాపగమ
ప్రద మగుకొలఁదిన శౌచము, సదురుగ నాచెప్పినట్ల।చలుపఁగ వలయున్. 278

తే. అంబరంబున శౌచజ।లంబు వడుట, చెట్ట శౌచ మల్లల్లన। చేఁత మేలు
వామకరశుద్ధి దొత్తఁ ద్రి।హారమృత్తి,కాకలనమునఁ దద్ద చే।యంగ వలయు.

క. కుడిచేతఁ బిదప డాచేఁ, గడిగి పొరిఁ సప్తమృత్తి।కాకలనమునం
గడుగునది కరయుగము మఱి, కడుగ వలయు గుహ్య మల్ప।కమృదాకలనన్.

క. ఇమ్మెయి గుహ్యతలము శు,ద్ధమ్ముగ నొనరించి కేల్ ప।దంపడి జలధౌ
తమ్ముగఁ జేసి సముత్థా,సమ్ము పిదపఁ బాదశో।ధనము సేయఁ దగున్.                281

క. జనములు సూచుచు నుండఁగఁ, జనదు మలము మూత్రమును వి।సర్జింపఁగ న
ప్పనులకు శౌచాచరణం,బునకు నవశ్యంబు నోల।ములు గావలయున్.                282

క. ఆపత్సమయంబున శౌ,చాపాదన మిట్టిభంగి। నబ్బమి మలసం
లేపనగంధము వోవఁ గ్రి, యాపరుఁ డై చేయునది మృ।దాకలనంబున్. 283

సీ. బుద్బుదవిరహితం।బుగ వారిఁ గరమున
[1]గొనకొని పొరి డెంద।మునకుఁ జేరు

1. చ. గొని కొన్ని పోసి డెందమునఁ జేరు; జ. మినుపగిం జొగి మున్గననువు దోఁచు.

నట్లుగ నిశ్శబ్దమై యుండ మున్మాఱు
ద్రావి యిన్మాఱు తిర్యగ్విధమున
నాస్యంబు దొడసి నీ రంఘ్రుల శిరమునఁ
బ్రోక్షించి యోష్ఠసంపుటము ముట్టి
నాసికాపుటములు నయనముల్ సెవులు మూఁ
పులు హృదయము నాభితలము పూని

ఆ. ముట్ట వలయు హస్తములు పాదయుగమధ్య, గతములుగ నుదఙ్ముఖత్వ మొండెఁ
బ్రాఙ్ముఖత్వ మొండెఁ బ్రాపించి యిమ్మెయి, నాచమనముసేయుటార్యమతము.

సీ. మున్మాఱు జలపానమున నోలి ఋగ్యజు,స్సామ వేదంబులు సంతసిల్లుఁ
దొలితొలి వక్త్రంబు దొడయ నథర్వాహ్వ,యంబును రెండవసారి ధర్మ
శాస్త్రతోపేతిహాసప్రమోదపురాణ,సంప్రీతులును గల్గుఁ జరణయుగముఁ
బ్రోక్షింపఁ బుండరీకాక్షుండు ప్రియమందు,నయనంబు లంటినసలిలసహితుఁడు

తే. సమ్మదంబునఁ దేలు నాచమనసంప్ర,యోగ మిట్టిది వస్త్రయజ్ఞోపవీత
ధరణముల నన్నపానతంత్రముల మున్ను, సేసి పిదపను నిది యనుష్ఠింపవలయు.

తే. ఆస్యశుద్ధి యొనర్చిన[1]యపుడు నొక, భక్ష్యభోజ్యలవంబులు [2]పండ్లనడుమ
నిలిచి పదపడి పోవుటగలిగెనేని, నాచమన మాక్షణంబ చేయంగ వలయు. 286

వ. శౌచవిధి సమస్తవర్ణసామాన్యధర్మంబు శూద్రునకు నాచమనం బోష్ఠపుటం బొకమరి ప్రోక్షించుకొనుటయు దానిం గరంబున నడ్డం బొకమరి దొడయుటయు నింతియ. 287

క. తాను శుచిత్వం బేమిట, నైనను నేమఱక నియతి నతులితశుశ్రూ
షానిరతుం డై శూద్రుఁడు, మానితవిప్రులకు నోడి మనఁగా వలయున్. 288

సీ. అవనీసురుఁడు జపయజ్ఞుఁ డధ్యయనోప,జీవి తపశ్శోభి భూవరుండు
ప్రారంభయజ్ఞుండు పరమదండోపజీ,వకుఁడు పాలనశోభి వైశ్యుఁ డమల
హవ్యయజ్ఞుఁడు విక్రయాజీవి యాతిథ్య,పరిశోభి శూద్రుండు పరిచరత్వ
యజ్ఞుండు శుశ్రూషణాజీవి దక్షత్వ,శోభి యట్టులు గానిచొప్పు లఖిల

ఆ. వర్ణజాతులకు నవశ్యంబు నాలవ,వాని కెమ్మెయిం ద్రివర్ణభక్తి
వలయు నడప యతులవలన విశేషించి, నిత్యభజనపరత కృత్యమరయ. 289

క. యతి సర్వాశ్రమచరణ,స్థితులకు నుత్కృష్టుఁ డతని తెరు వూఁదిన శ
క్తత గలిగినవారు శ్రుతి,స్మృతివిహితాచారు లగుట మే లరయంగన్. 290

సీ. ప్రియవాదితయును శాంతియును దాంతియు ననా,లస్యంబునతులశీలంబుఁగలిగి
నా కిది వలయు దీన సుదుస్తరంబును, ఘోరంబు నైన సంసారజలధిఁ
గడతు నే నని భిక్షుకజనంబులకు నెవ్వి, హితము లప్పనులు సంతతముఁ జేయు

1. గ. యప్పు డొక్క భక్ష్య. 2. గ. పండ్లయెడల.

చదువు లొత్తుచు [1]నిష్ఠ మడుఁగుచు నీచత, ననుచరించుచు ధర్మమున నుపార్జి
ఆ. తంబు లైనయట్టి ద్రవ్యసంచయములఁ, దృప్తి సేసి దేహగుప్తి నడపి
పగలు రేయు నాకపరిచర్య లొనరించి, శూద్రుఁ డిహపరములసుఖము వడయు.

క. దానోపవాసముల స, న్మానితగతి లేదు శూద్రునకు యతిదెస స
మ్మాననమునఁ దత్పూజా, ధీనరతిం గాని యెన్ని తెరువులఁ జూడన్. 292

తే. తెరువుఁ దప్పి తూఁగాడుచు నరుగుదెంచు
యతిఁ గనుంగొని మనమున [2]నడలు వొడమ
నెదురుకొని దప్పి దీర్చి సమ్మదము సేఁత
శూద్రునకు ధర్మవిధి యని శ్రుతులు సెప్పు. 293

చ. యతి రుజఁ బొందినం దొఱఁగ నౌషధకృత్యముఁ బథ్యమై సమం
చిత మగునట్టిభోజనము సేర్చుటయున్ మలమూత్రముల్ జుగు
ప్సితములు గానిభంగి గలచిత్తముతో జలకార్య మోపి వ
ర్ణితముగఁ జేఁతయుం గలచరిత్రము శూద్రున కిచ్చు సద్గతిన్. 294

క. ఏవిధమున నోపిన యతి, భావముదుఃఖంబు వాపుపని సాదరచే
తోవృత్తిఁ బూని చేయం, గా వలయును శూద్రుఁ డది సుగతి నొందించున్. 295

సర్వవర్ణసామాన్యధర్మనిరూపణప్రకారము.

వ. అని చెప్పి సర్వజాతిసామాన్యంబు లగుధర్మంబు లెఱింగించునాదరంబున నమ్ముని
వరుం డి ట్లనియె. 296

సీ. పరధనంబుల కాసపడక యొడ్లను దన, యట్ల కాఁ జూచుచు నఖిలవస్తు
వులుఁ దోఁచునడఁగువీఁచులచందమున మెఱుం, గులభంగి నని కనికొనుచు నెందు
నాసక్తి లేక భూతాలిపై దయ గల్గి, నడచుట హితము దో నడచుఁ జేసి
నది మేల చేయుట చదురు గీడవశతఁ, దొడరఁ బ్రాయశ్చిత్తదోహలమున
తే. వేగ తొలఁగించు టొప్పెడు వెరవ యెమ్మె, లేనిజంతువుఁ జంపె త్రిస్నానములను
ద్వాదశప్రాణసంయమనాదరమున, నొక్కయుపవాసమునఁ బాపయుక్తి వాయు.

ఆ. అస్థి గలిగి హీనమగుజంతు వైనఁ ద, ద్ద్విగుణవృత్తి వలయుఁ బ్రగుణజంతు
వునకు నలుమడించుకొనునది నరమాత్ర, హింస యష్టగుణకృతీహఁ బాయు.

క. హీననరునట్ల గుజ్జము, నేనుఁగును మనుష్యవధ మనేకాబ్దికభి
క్షానిరతి ప్రభృతిసుక, ర్మానుష్ఠానములఁ గాని యఱుగ దలఁతులన్. 299

తే. కల్లు ద్రావుట గురుతల్పగమన మధిక, పాతకము లివి ప్రాణముల్ వాయఁ బెట్టి
చేయు ప్రతికారములఁ గాని చెడవు గోధ, రాద్యధికదానములనైన నఱుగ వండ్రు.

క. ఇవి యెఱిఁగి యెపుడుఁ బరలో, కవిభీతి మనంబునందుఁ గల్గి సకలభూ
తవిషయదయ నూనినయ, ట్టివాఁడు గీ డెల్లఁ బో నడిచి మే లొందున్. 301

1. జ. నిష్ట మడుఁగుచు. 2. జ. నరలు వొడమ.

క. ఈనెఱిఁ గనికొని శూద్రుం, డైనను గ్రమవృత్తి నవ్యయం బగుపదముం
గానం బడయుట గల్గును, వానికి నియమములత్రోవ వలవక యునికిన్. 303

వ. అని నిర్దేశించి యరిష్టంబు లెఱిగింప ననుకంప వుట్టుటయు. 304

సీ. పురుషు హిరణ్మయు నరుఁ డెవ్వఁ డుత్తర,మునఁ గాంచు దక్షిణముఖత నుండ
నతనికి వర్షత్రయమున మృత్యువు వచ్చు, రవిమండలంబు నిష్ప్రభముగాఁగఁ
గనిన రెండేఁడులఁ గౌముదిఁ దననీడఁ,దూఁటు సూచిన నొక్కయేఁట నది వి
హీని యై యున్న షణ్మాసమాత్రంబునఁ, గర్ణముల్ కరములఁ గదియమూసి

ఆ. కొనినయపుడు మ్రోఁత విన కున్న నెలనాళ్లఁ, గర్ణములును నాసికయును బట్టు
గదల వికృతవర్ణకత పండ్లఁగన్నులఁ, గలుగ నాఁడ మరణ మొలయు సంద్రు.

వ. అట్లు వర్తిల్లునరిష్టంబులం దెయ్యవి దోఁచినం గలంకం బొరయనియంతరంగంబు
తోడఁ దృష్ణాకలితం బైనసంసారంబునందలియాసంగంబు వదలి హృదయం బేకా
గ్రంబుగావించిమునీంద్రనిర్దిష్టనిర్మలధ్యానకర్మంబులం దగిలియుండెనేనింగాలాం
తక ప్రసాదంబు వడయుం దెలివికొఱంతం గాలగోచరత్వంబు నొంది వైశ్యరాజన్య
విప్రకులంబులం దత్త్రివిధసంపత్సమృద్ధంబులుఁ బ్రబుద్ధంబులు నగువంశంబులం
గ్రమంబున జన్మించి. 305

క. అయ్యైకర్మంబులదెస, నెయ్యం బెసలారఁ గలిగి నియమనిరూఢుం
డియ్యాన యన సుకృతంబుల,నయ్యెడు సౌఖ్యంబునిహమునందుఁబరమునన్. 306

తే. అనుభవించుచు గమనంబు నాగమనము
నాచరించుచు బ్రహ్మసభాంత మైన
పుణ్యలోకనికాయంబుఁ బొంది యెల్ల
నెఱిఁగి యూహించి యిట్లని యెదఁ దలంచు. 307

క. ఇవి యెల్ల నశాశ్వతములు, భవమరణాకలితములును బటుసంసారో
ద్భవదుఃఖయుక్తములు సుఖ,లవయుతములు వీనియందు లౌల్యం బేలా. 308

వ. అని తలంచి యపునర్భవకారియు ననధికంబును నచలంబు నగుధర్మంబునుగోరు
చుండు నకృతకర్మఫలంబు నొందను గృతకర్మఫలంబు దొఱంగను నెవ్వరికివశంబు
గామి ధ్రువం బగుటంజేసి కృతకర్మవిశేషంబున నతండు వాసవాదివరిష్ఠసహవా
సంబున వర్తించి. 309

తే. పుణ్యఫలకాలమునయంతమున నితాంత
సంప్రబుద్ధజనంబువంశమునఁ బుట్టి
బ్రహ్మసంస్కారముల నెల్లఁ బడసి యతిథి
దేవపితృకోటులకుఁ బరితృప్తి సేసి. 310

తే. భార్య పుత్త్రు లాదిగఁ గలపాశసంచ
యంబు నిరసించి యతిధర్మ మాచరించి

యిలు వెడలి గురుశుశ్రూష నలఘుసాంఖ్య
యోగశాస్త్రరహస్యైకయోగ మొంది. 311

సీ. పుణ్యంబు లైనయరణ్యంబులను శూన్య,గృహముల దేవతాగృహములందు
గుహలను నిలుచుచుఁ గుడుపు భిక్ష నొనర్చి, యొకచోటమరగకయొల్లమియును
వలపును నెడలి నిర్ద్వంద్వత వాటించి, మమత యహంకృతి మాని నిత్య
తృప్తాత్ముఁడును జనాధీనత్వరహితుండు, నై గమ్యదిశ యొక్కఁ డనఁగ లేక
ఆ. మెలఁగుచుండి పక్వఫలము గొడిమఁ బాయు,పగిది గుణచయంబుఁ బాసి యక్ష
యంబు నచలమును నిరామయంబును నగు,పదముఁ జెందు శుద్ధభావ మెసఁగ.

వ. అని చెప్పి. 313

క. భిక్షుకుఁ డిమ్మెయి నీడముఁ, బక్షి విడుచునట్లు మాయఁ బాసి యభేద్యం
బక్షర మనుతత్త్వంబును, సాక్షాత్కృతిఁ గూర్చి నిలుచు శాశ్వతపదవిన్. 314

వ. అమ్మహానుభావుండు సంసారసాగరంబు గడచుటయ కా దాశ్రితులనుం గడపం
జాలి యుండు. 315

ఉ. కావున భిక్షుఁ జెంది ప్రియకారిత శూద్రుఁడు గొల్చునేని సం
భావితుఁ డైనయాతనికృపారస మాని తదీయసంగవి
ద్రావితకల్మషుం డయి చిరక్రమవృత్తిత నూయి గ్రొచ్చి నీ
ర్వావిరి గన్నయట్టులు శివం బగుతత్త్వము గాంచు నెమ్మెయిన్. 316

తే. అఖిలజనులకుఁ బరమపదాభిలాష
వృత్తి సామాన్య యది యొండువెంట శూద్ర
జనములకు నెట్లు వొరలిన సఫల గాదు
దాని భిక్షుకసేవ సత్ఫలతఁ గూర్చు. 317

పరాశరముని ప్రణీతధర్మవిశేషంబు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట.

తే. వర్ణముల కెల్ల నింద్రియవ్యాప్తినిగ్ర
హంబు వలయు నియ్యది గన్నయంతఁ దృప్తిఁ
బొంది యొం డాసపడ కున్న నొందు సాధు
జనులు వెదకుననామయసత్పదంబు. 318

తే. పరమ మైనయీధర్మంబు వట్టి పాప
యోను లగుకామినులును వైశ్యులును శూద్ర
లును సుగతి గాంతు రనిన సజ్జనతఁ బరఁగు
బ్రాహ్మణులకు రాజులకును బ్రాతె సుగతి. 319

వ. అని చెప్పి వెండియు. 320

సీ. బోధ మక్షీణపాపునకుఁ గల్గదు సద్గు,రుండు సెప్పంగ సంశ్రుతము లైన
పనులఁ బాపంబులు వాసిన నిర్మల,జ్ఞానోదయం బగు దాన గర్వ

ముదయింప వచ్చిన నుడుపంగ వలయు గ,ర్వంబున గురుసమారాధనంబు
వదలిన నాబోధవైభవ మెడలిన,యంతటఁ బోక కీ డావహిల్లుఁ

ఆ. బరమబోధమునకు ఫల ముపశాంతిగా, నెఱిఁగి యెంతబోధ మెక్కు డయ్యె
నంతశాంతుఁడగుచు ననవరతంబును, గురునిఁ గొలిచి మేలు పురుషుఁడొందు.

సీ. రక్షించునది యుదరంబు శిశ్నము ధృతిఁ, బాణిపాదములు దృక్పాటవములు
వినుఁ డింద్రియంబుల మనమును మనమున, బుద్ధి నిల్పైనఁ బ్రబోధవికచ
హృదయస్థుఁడై ధూమ మెడలినశిఖివోలె, వెలుఁగు దేవునిఁ జూచు వెరవు గలుగు
యుక్తుండు గా కేల యొదవు మహేశ్వరుఁ, గనుట యుక్తాత్ముండు గను సుభక్తి

తే. నట్టిభంగికిఁ జాలిన యట్టిఁడైన
వికృతిషోడశకంబును బ్రకృతిసప్త
కంబు మూలప్రకృతిఁ జిత్తకలన నరయ
వికృతియును బ్రకృతియుఁ గాని విభునిఁ గాంచు. 322

క. ఇది సాంఖ్యానము దీనిని, మది కలవడఁ జేసికొనుచు మఱవక గురు ని
ర్మదుఁడై కొలువఁగఁ గేవల,పదము నతనికరుణపెంపు ప్రకటము సేయున్. 323

తే. భిక్షుభావంబుఁ బొంది యాశిక్ష యూఁది
మెలఁగునర్హత త్రైవర్ణికులకుఁ గలదు
శూద్రునకు భిక్షుసంసర్గసులభ మమల
పదము వానికి భిక్షుతఁ బరఁగఁ జనదు. 224

క. పరమజ్ఞానులయొద్దను, బరఁగిన నజ్ఞుఁడును బోధభరితుఁ డగు నిరం
తర మేరుసమీపస్థితి, హిరణ్యరుచిఁ గాక మెసక మెసఁగినపగిదిన్. 325

క. గురుశుశ్రూషామహిమం, గరుణఁ జతుర్వర్ణహితముగా నిమ్మాడ్కిం
బరివర్ణితంబు సేసెం, బరాశరమునీశ్వరుండు పౌరవముఖ్యా. 326

వ. అని సకలధర్మోపదేశధుర్యుండైనభీష్ముండు పరాశరమునివర్యువాక్యసంచయంబు సెప్పినం బరితుష్టుండయి పరమవినయంబునం బాండవాగ్రజుం డక్కురుకులాగ్రగణ్యుతో నరులు సురలకు వంద్యు లగువారును గల రని విందు వారలవర్తనం బెట్టి దెఱింగింపు మనిన నతం డతనికి ట్లనియె. 327

సీ. ఇట్లు మాతలి యమరేంద్రుని నడిగిన, ధర్మార్థకామముల్ ధర్మచరిత
వర్తనఁ జెల్లించువారు వామాక్షులు, గోరఁగాఁ దగురూపగుణసమృద్ధి
గలిగియు వర్జితకాము లయ్యెడువారు, విద్యాధనైశ్వర్యవిషయగర్వ
విరహితు లగువారు విజితేంద్రియులు నిజ,దారతృప్తులుఁ దపోధనము గాఢ

తే. తత్పరతఁ గూర్చుఘనులు సత్యవ్రతులును
బరమశౌచులు బహుకార్యపరత లేని

గూఢధర్ములు సన్న్యాసకోవిదులును
దనకు నభివంద్యు లగుట యంతయుఁ జెప్పె. 328

వ. అనిన విని ధర్మతనయుండు తటాకనిర్మాణరూపం బగుధర్మంబువిశేషంబు విన వలతుం జెప్పవే యనుటయును ననిమిషనదీనందనుం డాదరభరితుం డై. 329

భీష్ముఁడు ధర్మజునకుఁ దటాకనిర్మాణఫలవిశేషంబు సెప్పుట.

సీ. దేవతిర్యఙ్నరస్థావరాశ్రయము తటాకంబు విను మట్లుఁ గాక యందు
గోకులంబులు నీరు గొని దానికర్తకుఫలము నెల్లఁ బుణ్యలోకమున కనుచు
నీలోకమున శ్రీయు నెక్కుడు కీర్తియు, నతనికిఁ జేయు వర్షాగమమున
సీతున వేసవిఁ జెఱువులో నీ రున్న, నగ్నిహోత్రాదిమయజ్ఞవాజి

ఆ. పేయఫలము లోలి నాయన కగుఁ గట్టఁ, దగినతరువు లిడిన సుగతి గలుగు
నిహసుఖంబుఁ బొందు విహగాదిబహుభూత,వాససౌఖ్య మతఁడు సేసెఁ గాన.

క. సలిలాశయములు సేసిన, నలఘుప్రియ మందుఁ బితృచయము లూర్ధ్వగతుల్
గలుగును దానం దమ కను, తలఁపున నది గోరుచుండు ధర్మతనూజా. 331

తే. ఛాయ నతిథివర్గంబుఁ బుష్పముల సురగ
ణంబుఁ బండులఁ బితృనివహంబుఁ బ్రమద
మందఁ జేయు వృక్షంబు ల ట్లగుట వృక్ష
రోపణక్రియ మేటిధర్మువు కుమార. 332

క. అనిన విని ప్రీతుఁ డై య,జ్జనవిభుఁడు గృహస్థధర్మసాకల్యజ్ఞా
ననిరూఢి నాదుచిత్తం,బున నొలయింపు భవదీయపుణ్యభాషితములన్. 333

క. అనవుడుఁ దాత యలరి య,మ్మనుమనితో నిట్టు లనియె మహియును విష్ణుం
డును జేసినసంవాదము, విను మది నీకోర్కెఁ దీర్చు విశ్రుతకీర్తీ. 334

తే. నన్ను నీ వడిగినయట్లు వెన్నుఁ డర్థి
బుజ్జవంబులు మున్నుగ భూమిదేవి
నడిగె దానికిఁ బ్రియ మంది యమ్మహాను
భావ యిట్లని చెప్పెఁ దద్భావ మలర. 335

క. దేవా హుతవహపరిచ,ర్యావిధి యొనరించి బలిసమాచరణము భ
క్త్యావేశంబునఁ జేయఁగ, దైవతసంఘంబు సమ్మదంబునఁ దేలున్. 336

తే. అన్నమున దుగ్ధమునఁ బండ్ల నైన మూల
కోటి నైనను దను పారునీట నైన
నిత్యమును జేయునది పితృకృత్య మోపి
వైశ్వదేవ మవశ్యనిర్వాహ్య మనఘ. 337

క. ఆచేతపిదప దానం, బాచరణీయంబు శక్తి కనుగుణముగ భి
క్షాచర్య సేయువిప్రుల, వేచి యిడఁగ వలయు నెపుడు వేగమ భిక్షల్. 338

తే. అప్పటికి వారు లేకున్న నగ్ని[1] మగ్ని
ముఖమునం దైన నిడునది సఖుల బంధు
జనుల నతిథుల గురుల భోజనవిధాన
తృప్తులుగఁ జేసి బలివిధిఁ దీర్పవలయు. 339

వ. బలు లుభయప్రకారంబులు వానియందు[2] ధర్మార్థకామాధివనరక్షోజనాదివిషయం బైన శ్రౌతబలి యేను మున్ను నిర్దేశించినయది యిప్పుడు సెప్పినయది పశుపక్షి చండాలప్రభృతిగోచరం బగుస్మార్తబలి యని నిర్దేశించి వెండియు. 340

ఆ. విను గృహస్థధర్మవిధ మిది యీభంగి, నడపి పిదప భోజనంబు సేయ
వలయు విప్రుఁ డిట్టివాఁ డొందు నిహపర, సౌఖ్యసంపదలఁ బ్రశస్తచరిత. 341

క. అని చెప్పినఁ గృష్ణుఁడు నె, మ్మన మలర గృహస్థవిధిసమాచరణము ని
ష్ఠ నడపెఁ గర్మశ్రద్ధా, ఘన నీవును నట్ల నడపు గార్హస్థ్యంబున్. 342

క. అది దురితనిరాసము న, భ్యుదయానందంబుఁ జేయుఁ బుణ్యాయశస్సం
పద నిచ్చు నూర్ధ్వలోక, ప్రద మగు దానిఁ గొనియాడు భరతవరేణ్యా. 343

వ. అని యిట్లు భీష్ముండు భీమార్జునకుఁ గృహస్థధర్మప్రకారం బెఱింగించె నని చెప్పుటయు నప్పారవకులోత్తములసంప్రశ్నోత్తరంబులు మఱి యెత్తెఱంగునం జెల్లెం జెప్పవే యనుటయు. 344

చ. అపగతకామరోషహృదయాంతరఖేలనకల్య నిర్జపా
జపమహితవ్రతైకపరసంగధురాధికతాల్య చంద్రమ
స్తపనమయాక్ష కౌస్తుభనితాంతరుచిస్ఫురితాస్థిదామదీ
ప్తిపటలచారువక్ష మునిధీస్ఫుటభావిత దేవసేవితా. 345

క. సత్త్వాధిష్ఠాన కృతశు, భ త్త్వప్రకటాభిధాన భక్తాధీనా
తత్త్వంపదార్థరూపా, తత్త్వసదనదీప ధూతదైత్యాటోపా. 346

మాలిని. జగదవనవినోదా సత్యజాతప్రమోదా
సగుణవిగుణభంగీ సంయమారామసంగీ
విగతవికృతమూర్తీ విశ్వభూతప్రవర్తీ
సుగమగహనభూమా సోమఖింఛాభిరామా. 347

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున నానుశాసనికపర్వంబు నందుఁ దృతీయాశ్వాసము. 348



1. గ. నన్న మగ్ని. 2. చ. ధర్మార్థకామోపదివసరక్షో.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము, చతుర్థాశ్వాసము.





పరమమహిమనిశ్చల
తాపాదనకేళికౌతుకాతిశయమనో
వ్యాపారనిరూఢ స్తు
త్యాపాంగవిలాసలలిత హరిహరనాథా. 1

### ధూపదీపనైవేద్యంబులఫలవిశేషము భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. అట్లు గృహమేధిధర్మతత్త్వావగమము
దనకుఁ గలుగంగఁ జేసినతాత కెఱఁగి
మనుమఁ డూర్జితభక్తియు వినయగౌర
వంబు సమధికతావైభవంబుఁ బొంద. 3

వ. మహాత్మా సుమనోధూపదీపనైవేద్యంబు లుత్తమంబు లగుపూజాసాధనంబు లని వానిం గొని దేవతలం బూజింతురు తద్విశేషం బెఱింగింపవే యని యడుగుటయు నతం డాదరభరితుం డయి దీని శుక్రుండు బలిదానవేంద్రునకు బలి మనువునకు మనువు సువర్ణుం డనుతపోధనునకు సువర్ణుండు నారదునకుం జెప్పి రప్పరమముని నాకుం జెప్పె నత్తెఱంగు సెప్పెద నాకర్ణింపు మని పలికి యప్పుడమితేని కిట్లనియె. 4

సీ. ఓషధు లమృత మయ్యుత్తమవస్తుసం,తతిలోనఁ బుష్పవంతములు మేలు
పుష్పముల్ గొని సురపూజ లొనర్చిన,మానవులకు మంచిమనసు గలుగు
నట్లు గావున సుమనోభిధానము పుష్ప,ముల కయ్యెఁ దద్దివ్యపూజ లిచ్చు
నరులకోర్కులు సుమనస్కతఁ దీర్చుట, నమరులు సుమనస్కు లనఁగఁ జనిరి

ఆ. కంపు రూపుఁ దెలుపుఁ గలిగి యకంటక,భూరుహాదులందుఁ బుట్టినట్టి
పుష్పములఁ బ్రియంబుఁబొంది కైకొండ్రు ని,ర్జరులు పూజనములఁ గురువరేణ్య.

క. నలినంబులు జాజులునుం, దులసీదళములుఁ బ్రభూతతోషము గీర్వా
ణులకుం జేయును యక్షో,దులకు జలోద్భవము లెల్లఁ దుష్టి యొనర్చున్. 6

క. అరుణంబులును సకంటక,తరుభవములుఁ గటుకగంధధామములు నొన
ర్తురు శాత్రవాభిచారిక,కరణమున నథర్వమాంత్రికతఁ గుసుమంబుల్. 7

తే. భూతరక్షోగణములకు భూపవర్య
తీక్ష్ణగంధపుష్పంబులు తృప్తిఁ జేయు
నలఁప దీపు [1]వలచి పరిమళసుకాంతి
భరితములు నగుపువ్వులు నరులమెచ్చు. 8

క. విను దేవాలయమునఁ బిత్రు,వనమునఁ బుట్టుకుసుమములు వలదు వివాహం
బునకును శాంతికపౌష్టిక,వనితాజనరంజనాదివర్తనములకున్. 9

తే. కుసుమములగంధమున దేవకోటి వాని
దర్శనంబున యక్షులు తదుపభోగ
మున భుజంగప్రతాన మిామూఁడుదెఱఁగు
లను మనుష్యులు ప్రియ మందు టనఘ కలుగు. 10

క. దేవత లర్హకుసుమపూ,జావిధిఁ బ్రియ మంది యపుడ జనులయెడల సం
భావించి వారికోర్కులు, గావింతురు సఫలములుగఁ గౌరవనాథా. 11

తే. సల్లకీజాతనిర్యాస మెల్ల దేవ
తలకు మే లంతకంటె [2]గుగ్గిలము లెస్స
యగలు గంధర్వయక్షోరగాదులకుఁ బ్రి
యంబు ధూపదానము నెడ నధిపవర్య. 12

వ. ధూపదానంబులయందు నధికతరంబు కర్పూరధూపం బని చెప్పి మఱియును. 13

క. సమధురమును గటువును దీ,క్ష్ణము నగుగంధములధూపకలన వరుస హృ
ద్యములు సురయక్షరక్ష,స్సమితులకును దత్ప్రకారజాతులకు న్నృపా. 14

తే. తగినయట్టిధూపము దేవతలకు నిచ్చి
పరమపుష్టియు నాయువుఁ బడయుఁ గర్త
యక్షగంధర్వపన్నగరాక్షసులును
ధూపమున మెచ్చి కోర్కు లిత్తురు కుమార. 15

క. మలయజము నగలు మఱియుం, గలుగుసురభివస్తువులు నికామప్రియదం
బులు వైహారికధూపం,బులయెడ మానవులచిత్తములకు నరేంద్రా. 16

ఆ. [3]దైవతార్చలపుడు తామసభూతర,క్షోముఖంబు లైనకుత్సితంపు
జాతు లెల్ల దీపసన్నిధి నడఁగు న,ట్లగుట దీపదాన మధికఫలము. 17

క. ఆలోకదాన మన భూ,పాల పరఁగు దీప మిాగి భావము సద్ధ

1. గ. గలిగి. 2. గుగ్గులము. 3. క. దైవతార్చనపుడు.

ర్మాలోకనశీలం బగు, నాలెస్స యొనర్చినట్టియతనికి నధిపా. 18

తే. ఘృతము సాలమి వర్తి నికృష్ట యగుట
దగ సమర్పించి పెంచుట ధరణినాథ
కానియవి దీపదానవిధానమునఁ బ్ర
కాశవస్తువు దృఢదీప్తికముగ వలదె. 19

వ. అని వెండియు, 20

క. ఒరు లిచ్చినదీపం బప,హరించి తత్పాతకమున నంధుం డగు భూ
వర రథ్యాసభ గుడిపై, గిరి దీపం బిడి విభూతికిం బాత్ర మగున్. 21

తే. ఆలనేయి ముఖ్యము మహిషాదిమేష
జనితఘృతములుఁ దైలంబు మనుజనాథ
మధ్యమము లగు మేదోస్థిమాంసరసము
లరయ నింద్యముల్ దీపసమర్పణమున. 22

క. జ్యోతిస్సాలోక్యకులో,ద్ద్యోతనమహితప్రకాశయోగంబులు పు
త్త్రా తెచ్చు దీపదానము, దాత కొసఁగు నమరపూజితసుఖిత్వంబున్. 23

క. దేవతలకు నగ్రపుసం,భావన నుపహార మిచ్చి పదపడి కుడువం
గా వలయు నట్లు సేయని,ధీవిరహితుఁ డసుర యగుట దెల్లం బధిపా. 24

వ. కావున. 25

క. తనయింటఁ గలుగునన్నము, మును దేవతలకు నివేద్యముగఁ జేసి ప్రణా
మనియమసహితసమర్పణ,మునఁ గృతకృత్యుఁడుగ వలయుఁ బురుషుం డనఘా.

వ. పూజకుండు శక్తిసంపన్నుం డయి యొనర్చిన. 27

క. తిలపిష్టము దధిదుగ్ధం,బులు మఱియును ధూపములును బుణ్యపరిమళం
బులు నగుపదార్థములు విబు,ధులకుం బ్రియ మొసఁగు బలివిధులఁ గురుముఖ్యా.

క. ఉపహారసమర్చకుఁ డగు,సుపురుషు గృహదైవతములు శుభములఁ గూర్చున్
నృపవర తత్కర్మరహితుఁ, గృప లేక నితాంతవిఫలకృత్యుం జేయున్. 29

ఆ. రక్తమాంససహితభక్తపిండముల ను
ల్లసితలోహితాక్తలాజములను
సురను బలి యొనర్ప నురగయక్షాసుర
ప్రముఖభూతములు శుభంబు లొసఁగు. 30

క. సౌమ్యాసౌమ్యబలులు విను, సౌమ్యాసౌమ్యప్రకారజనకృత్యంబుల్
సౌమ్యనృపోత్తమ యట్ల్యె,కామ్యముఁ దత్తత్ప్రపూజ్యకరణిం జేయున్. 31

క. అగ్రప్రదాయి వర్ణస,మగ్రుఁడు బలయుతుఁడు బుద్ధిమంతుఁడు లోకా
నుగ్రహపాత్రము శాత్రవ,నిగ్రహశక్తుండుఁ దత్త్వనిష్ఠుండు నగున్. 32

వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రుతో సుమనోధూపదీపబలిప్రదానం

బులఫలవిశేషంబు లింకను విన వలతుం జెప్పవే యనుటయు నప్పురుషవరుం
డాకురువంశవరున కి ట్లను నహుషువృత్తాంతంబున నది విస్పష్టం బగు వినుము
చెప్పెద. 33

—భీష్ముఁడు ధర్మజునకు నహుషునిధూపదీపదానవిశేషంబు సెప్పుట.—

సీ. నహుషుఁడు భూపాల।నము సేయు చుండి రా,జన మించుకయు లేక । సత్త్వనిష్ఠఁ
బుష్పంబులను ధూప।ముల దీపముల నివే,ద్యంబుల నమరుల । కర్చ లిచ్చుఁ
బితృసంతతికి వీనఁ । బ్రీతి యొనర్చు రా,క్షసయక్షభూతభు।జంగమాది
తర్పణంబులు నర్హ।తానిరూఢములుగా, నివి గొని యొనరించు । నిట్లు నిత్య
తే. నిరతిఁ జెల్లించి తత్ఫల।పరిణతిప్ర
దీప్తతేజోవిశేషసం।ప్రాప్తదేవ
రాజ్యుఁ డై సురమునిగణ।పూజ్యభావ
మహిమఁ బొందియు దీనిఁ దా । మఱవఁ డధిప. 34
క. సురలఁ బితృదేవతలఁ ద,త్పరతను ము న్నెట్టు లట్ల । పన్నుగ సమ్య
క్పరితృప్తులఁగాఁ జేయుం, బరమకుసుమధూపదీప।బలిదానములన్. 35
తే. దానఁ జేసి తదీయమ।హానుభావ, మంతకంతకు నగ్గల । మగుటకతనఁ
దగియె మునివరవాహన।త్వంబు నమ్మ,హాద్యుతికి వేయు నేల య।నవద్యరహిత. 36
క. విను మనుజేంద్రుల కెవ్వరి,కిని లేనివిశేష మతని।కిం గలుగుట గ
ర్వనిరూఢి నొంది దుర్వ,ర్తనపరుఁ డై యాతఁ డజగ।రత్వముఁ బొందెన్. 37
వ. అట్టియెడనుబూర్వంబుననుం జేసినపుష్పాదిదానపుణ్యవిశేషంబులమహానుభావంబు
వలన నవ్వసుమతీశ్వరు శపించినమునీశ్వరుండు సదయుం డయి శాపమోక్షంబు
నిర్దేశించెఁ దత్ఫలవిశేషంబునన యశేషదోషనిరసననిపుణుండ వగునీ వప్పుణ్యాను
ష్ఠానంబున కొదవి తని చెప్పి వెండియు. 38
తే. పాండవాగ్రజ నహుషుండు । బ్రహ్మసభకు
నాత్మగృహమున కరిగిన।యట్ల యరిగె
నట్టిపెంపును జనవిభుం । డవ్విశిష్ట
దానఫలమునఁ జూవె పొం।దంగఁ బడసె. 39
క. అని పలికి భీష్ముఁ డి ట్లను, విను మెందును దీపదాన।విధి మే లనిశం
బును జేయ నూర్ధ్వలోకం,బును గర్తకుఁ బరమదివ్య।బోధము నిచ్చున్. 40
క. ఎన్నినిమిషములు దైవత,సన్నిధి వెలుఁగంగఁ జేయు । జనుఁడు ప్రదీపం
బన్నిసురవత్సరములు సు,ఖోన్నతి సన్నుతుల నాతఁ । డొప్పు దివమునన్. 41
క. అనిన విని ధర్మజుఁడు శం,తనుతనయునితోడ విప్ర।ధనము నపహరిం
చినయాతఁ డేగతిం జను, ననుటయు నతఁ డిట్టు లనియె । నన్నరపతికిన్. 42
క. దురితము లనేకములు గల, వరయఁగ లోకమున వాని।యన్నిటికంటెఁ

ధరణీసురధనము పాపపుఁ, దెరువునఁ గొను టధిక మంత్రు ధీరవిచారా. 43

క. భూసురధనాపహరణము, సేసినఁ గులనాశ మగుట సిద్ధము దానం
జేసి యగును జండాల,[1] త్వాసంగము నపరభవమునందు నరేంద్రా. 44

వ. ఒక్కయితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 45

ఆ. క్షత్రబంధుఁ డనఁగఁ గలఁ డొక్కనరపతి, యతఁడు మాలవాని నధికదుఃఖ
భాగిఁ గాంచె గాలి బఱచువిప్రక్షేత్ర,తలము రేణువునకుఁ దలఁగి చనఁగ. 46

క. కని యాధూళికిఁ గడు రో,సినకారణ మేమి యనుడుఁ జెప్పె నతని కి
ట్లని యమ్మాలఁడు దొలుబా,మున నే నొకవిప్రుకొడుక మునులు నుతింపన్. 47

ఆ. పరమనిష్ఠతోడ బ్రహ్మచర్యవ్రత, మాచరింతు భిక్షితాన్న మొక్క
నాఁడు వేడ్కఁ బుణ్యనదితీరమున భుజిం,పంగఁ దలఁచి చనఁగఁ బాప [2]మడరి.

క. ధరణీదేవక్షేత్రము, పరాగపటలంబు బహుళపవనంబుగతిం
బరఁగి నరనాథ నా దగు,కరంబునన్నమునఁ బట్టెఁ గడు సాంద్రముగన్. 49

క. ఆధూళితోడఁ గుడిచిన, నీదుర్జన్మంబు వచ్చె నిది యెఱిఁగెడుసం
వేదనము పూర్వపుణ్యఫ,లోదయమునఁ గలిగె నిన్న యొకకల గంటిన్. 50

వ. దానిం జెప్పెద నవధరింపుము. 51

క. ఒకవిప్రవరుఁడు నన్నుఁ గని, యకటకటా యనుచు నిలిచి యడలకు మీదుగ్ర
ఖకలాప మెల్లి వాయును, సకలంబును క్షత్రబంధుసంవాదమునన్. 52

క. అనియె నని చెప్పి వీడ్కొని, చని మృతుఁడై తొంటిబహుళసత్కర్మంబుల్
దను నుత్తమపదమునకుం, గొనిపోయిన నిత్యసౌఖ్యకుం డై యుండెన్. 53

వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రితో నాకలోకం బేకప్రకారమనోహరి
యైయుండునో బహుప్రకారప్రమోదియై వెలుంగునో యెఱింగింపవేయనుటయు
నతండు పుణ్యకర్మంబు లనేకవిధంబులు గావే కావునం దత్తదనురూపానేకస్థానం
బై నాకంబు నిశ్శోకంబును నస్తోకసుఖకరంబును నై కరం బొప్పుచుండు గౌతమ
శతక్రతుసంవాదం బనునితిహాసంబు విను మది భవదీయప్రశ్నంబునకుఁ బ్రాదేశ
విశదీకరణం బగునుత్తరం బై యుండెడు గౌతముం డనుమహాద్విజుండు వనంబు
నం దపంబు సేయు చుండి శుండాలశిశువుం దల్లి లేనిదాని నొక్కెడం గని
కారుణ్యంబు వొడమి పుత్త్రునింబోలెఁ బెనిచె నయ్యేనికకొదమ కాలక్రమంబున
మేటియేనుం గయి మెలంగుచుండె నక్కాలంబున భూపాలనంబు సేయుధృత
రాష్ట్రుం డనురాజునాకారంబు దాల్చి నాకపతి యయ్యెడకు వచ్చి యవ్వారణ
పతిం బట్టి తనకుం గొనిపోవువాఁ డై దీని నా కిమ్మని యమ్మునిపతి నడుగుటయు
నతండు. 54

తే. ఇధ్మములు దెచ్చియిచ్చు నేరనిచట లేని,సమయమునఁ గాచు నీపర్ణశాల మర్త్య

1. గ. త్వాసంగతి యపర. 2. క. మెడసి.

బుద్ధియుత మిది యీదంతిఁ | బుత్త్రుఁ బోలెఁ, బెనిచినాఁడ నీకీఁజాల | మనుజనాథ.

ఇంద్రునకు మతంగమహామునితో నైనసంవాదము.

వ. అనుటయు నాకృత్రిమజనవిభుండు. 56

చ. మునులకు నేనుఁ గోటికి న|మూల్యపుగోవులఁ బుచ్చికొమ్ము వే
యనఘ పసిండి నీవలసి|నంతయు నిచ్చెద నన్న శైశవం
బున నిది దల్లి లే కునికిఁ | బుట్టినయక్కటికంబు పెంపునం
బెనుచుటఁజేసి దీనిపయిఁ | బ్రేమము నామదిఁ గల్గు భూవరా. 57

క. కావున నొల్లను బదివే, ల్గోవుల నిచ్చినను నిష్క|కోటి యొసఁగినం
బోవయ్య యేను మొఱ యిడఁ, గా వారిఁ గొనంగఁ దగునె | కరిపతి నీకున్. 58

క. అని మునిపతి పలికిన న, జ్జనపతి వాహనము గాఁగ | సామజముం గై
కొనఁ దగవె రాజులకు ని, ట్లనఁ దగునే నీకు విడువు | హస్తిఁ బ్రియమునన్. 59

వ. అని రాజసంబు దోఁపం బలుకుటయు నప్పరమద్విజుండు పుఱిఁగోటు దక్కి యి
ట్లనియె. 60

తే. పుణ్యకర్మలు హర్షంబుఁ | బొందఁ గనుట, పాపకర్మలు శోకార్తి|పాలుపడుట
యెచటఁ గల్గు నజ్జముసభ | కేఁగుదెమ్ము, దంతి నచ్చట నిచ్చెద | ధరణినాథ. 61

వ. అనుటయు నతండు. 62

సీ. వినుము నాస్తికులు నసుర|జనులుఁ బాపాత్మకులును గాక యేను వ|రత్తునె మునీంద్ర
యచటికి నన్న న|య్యముఁడు పుణ్యుఁడు తదీ, యాదరం బొప్ప దే|యనియె విప్రుఁ
డమ్మాట కవ్విభుం | డప్పఁ బ్రోచునతండుఁ, దల్లికిఁ దండ్రికి | నత్యంతభక్తి
గలవాఁడు నమ్మేలు | గను నందు రా నొల్ల, నని పల్కఁ బల్కిన | నత్తపస్వి

తే. రమ్ము మందాకినికిఁ ద|త్తటమ్ముపొంత, హస్తి విడిచెద ననుమాట | యాడ నాతఁ
డతిథిశిష్టాన్నభోజులు|న ప్రతిగ్రహులును గంద్రదిసరకు సే|యుదు నెయచటు.

క. అనినను ముని మేరువనం, బున నీ కొప్పింతు గజముఁ | బోద మనుడు న
జ్జననాథవరేణ్యుం డా, తనిమోమునఁ జూడ్కి నిగుడ | దరహాసముతోన్. 64

క. మృదువులు సత్యోపేతులు, సదయులు భూతహితు[1]లందుఁ | జనుజనములు నా
కది యేల వేడ్క నిదె వ, చ్చెద నొండొకమంచిచోటు | సెప్పు మనవుడున్. 65

క. నారదమునినాయకునివి, హారస్థల మైనవనము|నం దిచ్చెద నీ
వారణము నచటు కిన్నర, ధీరమ్యం బప్సరోమ|తిప్రియ మనఘా. 66

సీ. అనిన గౌతముపల్కు | విని గీతనృత్యాది, చతురులై దేవతా|సన్మునీంద్ర
హర్షంబు గావించు|నట్టివా రచ్చటి, కరుగుదు రే నొల్ల | నచ్చ టనియె
నరపతి యుత్తర|కురుభూము లనిమిష, కమనీయములు సర్వ|కామ్యవర్షి
యగు నందు వాసవుఁ|డట వచ్చి కరి నొప్పఁ, గొను మని పలికె న|మ్మునివరుండు

1. క. లందు ♦ సనుజనములు,

తే. కామహింసారహితులకుఁ ✱ గాక నాకుఁ
దరమె తత్ప్రదేశం బని ✱ దర్పఫణితి
నాడెఁ బతి దాని కాభాసు✱రాగ్రగణ్యుఁ
డిందుగృహమున నిత్తు ర ✱ మ్మిభము ననుడు. 67

క. దానరతులు సత్తము లా, దానవిముఖు [1]లందుఁ బోవు✱తరముజనులు నా
కా నెలవు [2]సెలవు లే దని, మానవపతి వలుక ముని స✱మధురవచనుఁ డై. 68

వ. అన్నరనాథుతోడ. 69

సీ. రవిపాల నిచ్చెద ✱ రమ్ము కుంజరముఁ జే
కొనుటకు ననిన స✱జ్జనవిభుండు
నుతతపస్స్వాధ్యాయ✱రతులకు గంతవ్య
మచ్చోటు నా కేల ✱ యనుడు వరుస
పురిఁ గుంభిఁ గైకొను ✱ పొద మన్న మునిఁ జూచి
యగ్నిహోత్రము నిష్టి✱యజనములును
గలవా రరుగుదురు ✱ గాక యన్నెల వొల్ల
నని యాడె భూపతి ✱ యతని కాతఁ

తే. డింద్రుకడ మర్త్యకోటికి ✱ నిష్ట మచట, గారు నీ కిత్తు నని చెప్పె ✱ శూరయాజి
వేదిశతవర్ష పురుషులు ✱ వోదు రందు, దాని నేఁ గోర నని పల్కె✱ధరణివిభుఁడు.

వ. పలికిన నప్పరమతపోధనుండు. 71

క. రదిఁ గొను మచ్చోటను వే, పొద ప్రాజాపత్యలోక✱మున కనవుడు నా
కది యేల యశ్వమేధుల,పద మని యెం బతి తపస్వి✱పతి యాతనితోన్. 72

చ. అపగతమోహశోక మగు✱నట్టిది గోగణలోక మిత్తు మ
ద్విపవరు నందు నీ కనినఁ ✱ దీర్ఘనిషేవులు గోప్రదానపు
ణ్యపరులు బ్రహ్మచర్యనియ✱మాఢ్యులు నచ్చటి కేఁగువారు దా
నిపయిఁ బ్రియంబు నాదుమది ✱ నెక్కొన దక్కడ కేల వచ్చెదన్. 73

సీ. అని ధృతరాష్ట్రుఁ డా✱డిన ముని శీతోష్ణ,సుఖదుఃఖమిత్రారి✱ముఖము లైన
బహువిధద్వంద్వముల్ ✱పరఁగవు బ్రహ్మలో,కమున నయ్యెడ సామ✱జము హరింతు
గాని ర మ్మనుడు న✱రమ్మానవపతి యసం,గులుఁ గృతాత్ములు వ్రతా✱చలితమతులు
నధ్యాత్మనిరతులు ✱ నందుఁ బోదురు గాక, యచ్చటు గాన శ✱క్యంబె నాకు

తే. నవనిసురవర్య యన రాజు ✱ నతఁడు సూచి
మునిమహత్తరుఁ డే నిన్ను ✱ ననిమిషేంద్రుఁ
గా నెఱింగితి నెల్లలో✱కములఁ దిరుగు
దెచట నైన బొందదు గదా ✱ యెగ్గు నిన్ను. 74

---

1. క. గ. చ. లందు వోవు. 2. గ. నెలవు.

చ. అనవుడు మ్రొక్కి యింద్రుఁడు మహాత్మ మతంగజహేతువాదవ
ర్తను ననుఁ బంపు నీపనుపు దక్కొని చేసెద నన్నఁ బుత్త్రుఁ డీ
వనకరి నాకు సాధుజనవత్సల యిమ్ము కరంబు నెమ్మి దీ
ని ననియె సాంత్వనంబుగ మునిప్రవరుండు కులప్రదీపకా. 75

వ. అనిన విని యింద్రుం డిట్లనియె. 76

తే. కరి సెలంగి నీమీఁదఁ బుష్కరము సాఁచి
మూరుకొనియెడు నడుగుల మ్రోల నిల్చి
ముద్దు [1]గురియుచుఁ బలుమఱు మ్రొక్కు నిట్టి
దాని ని న్నేల పాపుదు మానసీయ. 77

మ. నను నే డాఁచెద నన్న నేబుధులుఁ గానం జాల రక్షీణబో
ధనసంపత్తి నెఱింగి తేర్పడ మునీంద్రా రండు నీవున్ భవ
త్తనయుం డీకరియున్ నితాంతసుఖనిత్యం బైననాకంబునం
దనపాయస్థితి మత్సఖత్వమునఁ బెంపారం బ్రవర్తింపఁగన్. 78

ఆ. అనుడు సంతసిల్లి యట్ల కా కనిన న,మ్మునివరుండుఁ గరియు మున్న గాఁగ
నేఁగ దివమునకు మహేంద్రుండు సమ్మోద,భరితుఁడగుచుఁ గురునృపాలవర్య. 79

క. అనిన విని భీష్ముతో న,జ్జనపతి యి ట్లనియెఁ దపము సారపుధర్మం
బని యూఁది మీరు సెప్పుదు, రనఘా లేకుండునే తదధికం బొకఁడున్. 80

వ. అనుటయు నాదేవవ్రతుం డానరదేవోత్తము నర్మిలి నాలోకించి. 81

భగీరథునకు బ్రహ్మతో నైనసంవాదప్రకారము.

సీ. వినుము ధర్మము లెల్ల వినుతకృత్యంబుల, తప మెన్ని యెన్నఁగా ధర్మ మెందుఁ
గలదు తపం బనఁగా నియతాశన,త్వము భగీరథుఁడు పద్మజునిసభకు
నరిగిన నతనితో నద్దేవుఁ డిందుల, కతులనిర్మలతప మాచరింప
కరుగుదేరంగ నెవ్వారికిని రా దెట్లు, వచ్చితో యనిన నవ్వసుమతీశుఁ

తే. డేను గోదానములును భూదానములును
గన్యకాదానములుఁ దీర్ఘకలనములును
రాజసూయాశ్వమేధాధ్వరములుఁ బెక్కు
సేసినాఁడ వచ్చుట దానఁ జేసి కాదు. 82

మ. అవనీదేవత లొక్కెడం గ్రతువిధివ్యాసక్తులై యుండఁ ద
త్ప్రవిఘాతంబులు దోఁచె నేను రణసంరంభంబునన్ వారి కు
త్సవ మొందించితి వానిఁ బాపి ముద మందన్ వారు నన్ బ్రహ్మపా
ల వరిష్ఠావ్యయసౌఖ్య మొందు మని లీలం జెప్పినన్ వచ్చితిన్. 83

తే. ఆఁకలియు నీరువట్టును నాదరింప

1. క. గ. గునియుచు.

కేను విప్రులపని సేసి యిట్టిమహిమఁ
గంటి నియతాశనత్వము కాక తప మ
నంగ వే ఱొండె ధర్మాభినంద్యహృదయ. 84

చ. అనుటయు బ్రహ్మ యవ్విభున కర్చన లిచ్చి తగంగ గారవిం
చె నధిప నీవు విప్రుల భజింపుము సంయమితాశనుండ వై
యని దివిజాపగాసుతుఁడు సాదరభాషణవృత్తిఁ జెప్పిన
న్విని ముద మంది ధర్మజుఁడు నెమ్మి దలిర్పఁగ నమ్మహాత్ముతోన్. 85

క. పురుషుఁడు శతాయు వను శ్రుతి, పురుషవరా బాలురైనఁ బొందుదురు మృతిం
జిర మగు నేమిట నాయు వ,చిర మగు నెద్దానఁ దెలియఁ జెప్పుము కరుణన్.

వ. అనుటయు నయ్యఖిలధర్మవేది యవ్విభున కిట్లనియె. 87

తే. అనఘ యాచార మాయువుఁ బెనుచు నదియ
కాదు శ్రీయును గీర్తియుం గలుగఁజేయు
విను దురాచారుఁ డాయువు పెనుపుఁ బొందఁ
డతని సర్వభూతంబులు నభిభవించు. 88

క. కావున నాచారపరత, భూవర మేల్ సాధుజనులు పోవుతెరువు సం
భావించుట యాచారము, దా వర్ణాశ్రమసమర్థితం బరఁగు నృపా. 89

ఆ. గురునిమాట సరకు గొనమి దుశ్శీలత
పిట్ట పుడుక గోరు పిసుకఁ ద్రుంపఁ
గఱవ మరగు టుదయకాలాస్తమయసమ
యముల భానుఁ జూచు టాయు వడఁచు. 90

క. విను క్రోధంబును హింసయు, ననృతంబును లేమి సంధ్య లైనం దదుపా
సనము సురపూజనము రే, పొనరించుట చిరతరాయు వొనరించు నృపా. 91

క. పరదారగమన మొప్పదు, పురుషున కది యెల్లపాపములకంటె నరే
[1]శ్వరవర యాయుస్సంక్షయ,కరంబు తద్వర్జనంబు గడు మే లరయన్. 92

క. [2]పరదారలయందును సఖి,గురువృద్ధనృపాలబాలకులబాంధవభూ
సురవైద్యభృత్యబుధనా,గరకులసతు లాయువునకుఁ గడుఁ జే టనఘా. 93

వ. అని చెప్పి. 94

క. మే లివి గీ డివి యని భూ,పాలక యేఁ జెప్పినట్టిపను లెఱుఁగుము నీ
వోలిన యాయువుఁ బెనుపం, జాలు ననియు నపహరింప శక్తము లనియున్. 95

తే. తగనియది యెద్ది యైన వ్రతంబు పూని
మాన నోపిన నాయువు మాల్పకుండు
నంతటన పోవ దాయు వత్యంతవృద్ధిఁ

---

1. చ. శ్వర పరమాయుస్సంక్షయ. 2. క. చ. జ. పరదారములందును.

జేయుఁ దగినది సేసినఁ । జెప్ప నేల. 96

వ. అని పరిభాషించి. 97

క. దేవగృహముకడ వీథిని, గోవాటమునందు రచ్చ।కొట్టముపాంతక్
భూవర సస్యములను వి,ష్ఠావిసృజన మొప్ప దండ్రు । చారిత్రవిదుల్. 98

ఆ. ప్రాఙ్ముఖుండు నార్ద్ర।పాదుండునై భోజ
నంబు సేఁత మే ల।నంగ విందు
నిలిచియుండి కుడుపు । నింద్య మమ్మెయి మూత్ర
సర్జనంబుఁ బాప।సరణి యండ్రు. 99

క. అనలము గోవును బ్రాహ్మణుఁ, జన దెంగిలితోడ ముట్టఁ । జంద్రార్కులఁ జూ
డను నమ్మెయిఁ దగ దాసన,మును గాంస్యము ననఘ భిన్న।ములు వర్జ్యంబుల్.

ఆ. వృద్ధు వచ్చునపుడు । విను బాలు ప్రాణంబు
లెగయఁ జూచు నతని । కెదురు లేచి
ప్రణతిఁ జేసెనేని । [1]బాదునఁ బడి యవి
దొంటియట్ల నిలుచు । దురితదూర. 101

తే. అధ్యయనమున మస్తకం । బంటుటయును
నిద్రయును నశుచితతోడ । నింద్యకోటి
శిరము గ్రోఁకంగఁ దగ దిరు।సేత మస్త
కంబు తైలంబుఁ బూయఁగాఁ । గాదు మేన. 102

సీ. వైరనిర్బంధంబు । వలవదు గురునితో, నతఁడు కోపించిన । ననుసరించి
తేర్చుట మేలు నిం।దించుట గురునెడ, ననృత మాడుట యాయు।వపహరించు
విప్రగోక్షత్త్రియ।వృద్ధదుర్బలభార,వహగర్భిణులకు నీ । వలయుఁ దెరువు
మాన్యభూదేవుని । మంగళంబుల వన,స్పతులను వలగొని । చనఁగ వలయుఁ

తే. బంచదశిని జతుర్దశిఁ । బద్మమిత్త్ర
వసుతిథుల జన్మతిథులందు । వలయు బ్రహ్మ
చర్య మడుగు లొండొంటితోఁ । జనదు తోమ
దోషములు గొండియముఁ గ్రూర।భాషణంబు. 103

తే. అంగహీను దరిద్రు వి।ద్యావిహీను, రూపహీనునిఁ దెగడుట । పాప మండ్రు
వేదదేవతానిందలు।వేతనార్థ,కముగ జోస్యంబు నడపుట । కల్మషములు. 104

సీ. దంతధావనము మూ।త్రపురీషసర్జనం,బులు మౌని యై చేయ।వలయు నుభయ
సంధ్యల నిద్రింపఁ । జనదు తండ్రికి రేపు, మ్రొక్కి యాచార్యవి।ప్రులకు వరుస
మఱి మ్రొక్కునది వీరి । కెఱుఁగుట దక్క దే,వార్చనంబునకు ము।న్నన్యుకడకుఁ
జనఁ గాదు గర్భిణీ।సంయోగ మొప్పదు, పరిణయంబునకు మున్ । సురతసుఖము

1. గ. బాటునఁ బడి.

తే. ననుభవించిన నవకీర్ణి యందు రట్టి, యఘము వోవఁ బ్రాయశ్చిత్త మాచరింప
నుత్తరము పడమర దలయుఁగ శయింపఁ, దగదు శీర్ణతల్పంబుని ద్రయును గీడు.

క. సితపీతంబులు ధార్యము, లతులమతీ కుసుమకోటి యందుఁ గృతస్నా
నత రే పాపము శుచితా, చ్యుతుఁ డగు సుస్నాతుఁ డేని నొడలు దొడసినన్. 106

తే. నీళ్ల నాడక మును పూఁత నిందితంబు, సీర తడితో విదిర్చుట సెట్ట యొరులు
గట్టి విడిచినవస్త్రంబు గట్టఁ గాదు, మడత మార్చు టొప్పదు [1]కడుమాపుడైన.

క. వలవదు వటపిప్పలముల, ఫలములు నమలంగ మేడిపండ్లను దగ దా
వుల మేఁకల నెమిళులయెఱ, చులుఁ గానివి యవిహితంపుఁజోటుల నధిపా. 108

క. విను [2]మొరుచూచిన మూచూ, చినభోజ్యము నింద్య మన్య చిత్తముతోడం
గొనఁదగ దాహారము పొ, త్తునఁ గుడుచుట యఘము గూడు దూషించుటయున్.

క. చేతఁ గొని యుప్పు [3]నమలుట, రాతిపయిని నుప్పు గొనుట రాత్రి దధిమధూ
పేతంబుగఁ గుడుచుట ధ, ర్మేతరములు రేయి సక్తు వెగ్గు నరేంద్రా. 110

క. ఒకళులు సూచినయది వా, రికిఁ బెట్టక నమలుటయును ప్రీతిం దనపం
క్తికిఁ దెచ్చినచుట్టలు వే, ఱొకభంగిం గుడువఁ గుడుపు నుఱు విషభుక్తిన్. 111

క. నేయి మధువు సక్తువు దధి, పాయసము జలంబు భుక్తపరిశిష్టము భూ
నాయక యేరికి నిడఁ దగ, దాయువు పెంపారఁ గోరు టాత్మఁ గలిగినన్. 112

తే. అంగుళాగ్రముల్ సిటికెనలందు మొదళు
లనఘ దేవర్షితీర్థము లనఁగఁ బరఁగు
వరుస వలకేలియుప్పలవాయి పైతృ
కంపుఁదీర్థంబు తర్పణకార్యమునకు. 113

క. ఆచమనపూర్వకంబుగ, నాచరణీయంబు సర్వమగుతర్పణముల్
వాచగిపరుషత కోరిధం, బాచారవిధిజ్ఞు లఘము లండ్రు కుమారా. 114

క. దినమునసురతం బెయ్యెడఁ, జనదు చెడిపఁ గన్యఁ గవయఁ జనదు పతిత నం
టనిదాని నగ్నఁ జూడం, జన దుమిసిన వార్ప కునికి సత్ఘుతుఁ డైనన్. 115

ఆ. అట్టియెడలఁ దనకు నాచమనము దొర
కొనక యున్న సూర్యుఁ గనుచుఁ బ్రణవ
కలనతోడఁ గూడ వలచెవి ముట్టుట
శుచిత నిచ్చు నండ్రు సూరిజనులు. 116

ఆ. భగిని గురుని మిత్త్రుఁ బండితు [4]వంశజుఁ, బేదవడినఁ దెచ్చి ప్రియముతోడఁ
దనగృహమునకల్మి కనురూపముగఁ బ్రోవు, పెనుపు సేయు నాయువునకు సిరికి.

క. పారావతములు శుకములు, శారికలును బుష్పలతలు జనవర పసిఁడిం
దారమున నైనముట్టులు, నారయ గృహమంగళంబు లాదర్శములున్. 118

1. క. గ. చ. 'కుఱుమాపుడైన'. 2. క. మా మాచిన; గ. మాన్పాచిన. 3. గ. నంజుట. 4. వంశ్యున

తే. గ్రువ్వ గ్రద్ద దివ్యారుపుఁ|బ్రువ్వ గూబ
యిల్లు సొచ్చిన శాంతి సే|యింప వలయుఁ
జదువుఁ గుడుపును సందెలఁ | జనదు రాత్రి
యైనఁ బిత్రుకార్యములు సేయు | టఘముఁ జేయు. 119

క. కులమును రూపము శీలముఁ, గలకన్య వరించి యందుఁ | గనినయపత్యం
బులకుఁ దగ నడపునది మం,గళములు కృతదైవపైతృ|కక్రియుఁ డగుచున్. 120

తే. వలయుఁ బ్రాఙ్ముఖోదఙ్ముఖ|త్వముల నొకటి
తారకంబులుఁ దిథులును | వారములును
జోస్యు లెఱఁగించినవి మేలు | సువ్రతైక
లోల మంగలిపనికిని | దైలమునకు. 121

క. వినుము సపిండీకరణ,మ్మున నేకోద్దిష్టమునను | భోజనవిధి వ
ర్జన మొప్పు నామతింపక, చన దామెతఁ గుడువఁ బోవ | సజ్జనవినుతా. 122

క. తల్లికిఁ దండ్రికి సుతులకు, నెల్లవిధంబులను వలయు | హితములు సెప్పన్
మల్లకుఁడు గాక కర్జము, [1]సల్లభ్యము గాఁగఁ జూచి | సౌజన్యనిధీ. 123

సీ. క్షత్త్రియుం డశ్వంబు | గజమును రథమును, నెక్క నేర్పులు గఁడుఁ|బెక్క గఱచి
నానాయుధాభ్యాస|నైపుణంబునఁ బొల్చి, యుద్ధతంత్రములకు | నోహటింప
కుండెడుమదిఁ బేర్చి | దండనీతికి బోధ,కం బగునట్టిశా|స్త్రంబు మొదలు
గాఁగ గాంధర్వంబుఁ | గామతంత్రంబు లో,నుగ శాస్త్రముల నెల్లఁ | దగినభంగి

ఆ. నలవరించి మున్న | యధ్యయనంబునఁ, [2]జోరవు గలిగి ధర్మ|చరణవేది
యై ప్రజాభిరక్ష|యధ్వరకరణంబు, వలను మెఱసి నడవ| వలయు నధిప. 124

క. విను వర్ణాచారంబుల, ననఘ యిచటఁ దెలుపఁ దొడఁగ | నైనను మును లీ
పను లాయుర్వృద్ధికరము, లనుటకతన వలసె నీకు | నై చెప్పంగన్. 125

సీ. అధిప రజస్వల | నంటుట కల్మష, మాచరితస్నాన | యైనసతిఁ జ
తుర్థదినంబున | దోషాసమయమునఁ, జెందంగఁ దగు నంద్రు | గొంద ఱార్య
లేనవనాఁ డొంద | నింతియు షష్ఠాహ,మునఁ బొంద మగవాఁడుఁ|బుట్టు వినుము
మఱియును సమవిష|మము లగుదివసంబు,లం దోలిఁ బురుషుండు | నంగనయును

తే. సంభవింతు రిట్టులు షోడ|శంబుదాఁక, నెల్లనాఁడును ఋతుశక్తి | యెడలకుండ
నెట్టికార్యము గల్గిన | ఋతుమతీస,మాగమము దప్ప నీ కున్న|నాయు వెక్క.

క. విను మాచార మవశ్యం,బును నడపఁగ వలయు ధర్మ|మున కది మూలం
బనఘా ధర్మం బాయువుఁ, బెనుచును లక్ష్మిని యశంబుఁ | బెం పొందించున్. 127

తే. ఇన్నియాచారములలోన | నెక్కుడండ్రు
సకలభూతంబులందును | సదయుఁ డగుట

1. క. గ. చ. సల్లాపముగాఁగఁ జూపి. 2. గ. జోరవ.

యాది మును లట్లు గావున ॥ నఖిలవర్ణ
ములకు దయకల్మి పెద్దయు ॥ వలయు గుణము. 128

క. ఈయాచారాధ్యాయం, బాయుశ్శ్రీకీర్తికారి ॥ యగుఁ బాపంబుల్
వాయం జేయును బృథివీ,నాయక సద్భక్తిఁ జదివి ॥ నను దగ వినినన్. 129

తే. అనినఁ బ్రీతుఁడై పాండునృ ॥ పాగ్రతనయుఁ
డమరతటినీతనూజుతో ॥ నన్నదమ్ము
లేమివిధమునఁ దమలోన ॥ నెనసి నడచు
వార లెఱిఁగింపు మనుటయు ॥ గారవమున. 130

వ. అతం డతని కి ట్లనియె. 131

క. విను భక్తియు వెఱపుఁ గలిగి, యనుజన్ములు పెద్దవాని ॥ నారాధింపన్
జనవర యతండుఁ దమ్ములఁ, గొనియాడన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై. 132

క. అనుజుఁ డొకఁడు వెంగలి యై,నను దప్పెడుఁ గాని పెద్ద ॥ నకుఁ గార్యజ్ఞా
ననిరూఢి లేక తక్కిన, ననుజన్ములు సిక్కువడుదు ॥ రవనీనాథా. 133

చ. జనవర యన్నదమ్ములు ప్రసన్నమతిం గలకల్మి పంచి కు
డ్చిన వినుతించు లోకమును ॥ శ్రీయుఁ బొరింబొరిఁ బెంపు నొందు లో
భనిరతిఁ బెద్ద కాసపడి ॥ పాడి దొలంగినఁ బ్రాణగొడ్డపుం
బను లగు నవ్విధంబు మన ॥ పడ్డది గాదె జగం బెఱుంగఁగన్. 134

తే. తండ్రిపిమ్మట నన్నయ ॥ తండ్రి పిన్న,వారలకు నెల్ల నాతని ॥ వనిత దల్లి
దల్లి గడచన్న నని చెప్పి ॥ తాత మఱియు, మనుమనికి నిట్టులనుచని ॥ మన్యుపౌత్ర.

క. మానవనాయక యగ్రజుఁ, డైనను ననుజన్ముఁడేని ॥ నన్యాయంబుం
బూని సహోదరులకుఁ గీ, డైన నతఁడు దండ్యుఁ డండు ॥ రవనీపతికిన్. 136

వ. అని సహోదరప్రకారంబు సెప్పి వెండియు. 137

క. విను మప్పుఁ దల్లియట్లుగఁ, గొని నడపఁగ వలయుఁ జన్న ॥ గుడిపి పెనిచె నె
వ్వనిత యదియు నాతనికిని, జననీసమ యండ్రు బుధులు ॥ సౌజన్యనిధీ. 138

క. జనకుం డధికుఁ డుపాధ్యా,యునకుం బదిమడుగు లెక్కు ॥ డుర్వీనాథా
జనకునకు దశగుణంబులు, జనని గురుత్వమున నిది ప్ర ॥ శస్తము శ్రుతులన్. 139

క. జననీజనకులచే నగు,జననం బాగమము తనువి ॥ నయ మని చెప్పన్
విను మాచార్యువలన నొం,దినపు ట్టజరామరంబు ॥ దివ్యంబు నగున్. 140

వ. కావున గౌరవంబున నాచార్యుండు సర్వాధికుండు. 141

క. అని యిట్లు సుప్రసంగం,బున గురుజనతారతమ్య ॥ ములు సెప్పినఁ దా
విని శంతనుతనయున కి, ట్లనుఁ బాండునృపాగ్రతనయుఁ ॥ డతులితభక్తిన్. 142

క. భూసురులకు నృపులకు, నుపవాసము దగుఁ గాని యన్య ॥ వర్ణులకుఁ దదీ
యాసక్తి గలిమి పెద్దయు, దోసం బని విందు ధర్మ ॥ ధుర్యస్వాంతా. 143

—భీష్ముఁడు ధర్మరాజున కుపవాసవిధివిశేషంబు సెప్పుట.—

వ. ఉపవాసవిధియోగ్యతయును దత్ఫలవిశేషంబును విన వలతుం జెప్పవే యనుట యు నప్పురుషవరుం డప్పుడనిమేనితో దీని నీవు న న్నడిగినట్ల యే సంగిరసు నడిగిన నమ్మునిపతి నాకుం జెప్పె న త్తెఱంగు సెప్పెద నాకర్ణింపు మని పలికి యి ట్లనియె. 144

క. రాత్రిత్రయంబు బ్రహ్మ, [1]క్షత్త్రియులకు నుపవసింపఁ జనుఁ దదధికముగా గాత్రస్థితిఁ దప్పింపని, మాత్ర [2]నయిన మేలు కురుసమాజవరేణ్యా. 145

క. విను వైశ్యులకును శూద్రుల,కును నాలుగుగుడుపు లుడుగుకోలఁదికి మిగులం జన దుపవసింప నుపవా,సనిరూఢత పెంపు కల్మషము వారలకున్. 146

ఆ. పౌర్ణమాసిఁ బూర్వపక్షాష్టమీచతు,ర్దశుల నుభయపక్షవశత వచ్చు షష్ఠిఁ బంచమిని సునిష్ఠమై నుపవాస,మున్న వివిధశుభము లొలయునండ్రు.

సీ. ఏకభుక్తవ్రత మెంతయు నిష్ఠ మా,సం బెల్ల నడపిన సద్ద్విజుండు సుభగాకృతియు రూపశోభితాంగనయు స,త్సుతులును ధనధాన్యతతులుభోగ ములు సద్గుణంబులు భూరియశంబును, మొదలైనబహుశుభంబులకుఁ బాత్ర మగు నేఁడుగాలమయ్యతులవ్రతముసల్పి,యఖిలభూలోకసౌఖ్యములుఁ ద్రిదివ

తే. మోదమునుఁ గండ్రు రెండును మూఁడు నాల్గు నీక్రమంబున నోపిన యెక్కినట్టి దినము లెడపెట్టి కుడుచుచు ధృతి నొకేఁడు నడపువారలతెఱఁగు లేర్పడఁగ వినుము. 148

క. ఎక్కుడుదినముల శుభములు, నెక్కు నఖిలవైభవములు నెక్కు దినమునం దక్కక యుండెడుకాలము, నెక్కు మహత్త్వతయు నెక్కు నిభపురనాథా. 149

తే. వత్సరం బెల్లఁ బక్షోపవాసనియతిఁ, గడపినతనికిఁ బుణ్యలోకంబు లెల్ల వాసభూములు మాసోపవాసవృత్తి,యైన బ్రహ్మలోకంబుసౌఖ్యంబుగలుగు.150

ఆ. ఎంతనిష్ఠ గలిగెనేనియు మాసంబు, లోనియెంద యెక్కు డైనదినము లధిప యుపవసింప నగుఁ గాని మాసాధి,కోపవాసవృత్తి పాప మండ్రు. 151

వ. యుగసామర్థ్యంబుననుం బురుషుమహానుభావవిశేషంబుననుం జేసి యుపవాసవ్రతంబు మహాధికకాలకృతం బయినను గీడుం జేయక యత్యంతఫలప్రదం బై యుండు. 152

తే. మాతకును వేదమునకు ధర్మంబులకును బరము లగుగురుశాస్త్రలాభములు లేవు తపము లే దుపవాసవ్రతంబుకంటె నధిక మైనది యండ్రు మహాత్ము లనఘ. 153

1. క. క్షత్త్రియులకు. 2. గ. మయిన మేలు.

తే. పావనంబులలో నెల్ల బ్రాహ్మణుండు, పరమపావన మను శ్రుతి పౌరవేంద్ర
యట్లు గావున భూదేవతార్చనంబు, భక్తిసంభృతముగ నడపంగ వలయు. 154

వ. అప్రసక్తం బైనను నీయర్థంబు విన వలయునట్టిది గావునం జెప్పితి నని పలికి
వెండియు. 155

చ. అనశననిష్ఠఁ జేసి సుర లాదిమునుల్ మహితానుభావు లై
రనఘ సహస్రవర్షసమనంతరకల్పిత మైనయేకభు
క్తనియమతంత్రమున్ నడపి గాధితనూజుఁడు బ్రాహ్మణత్వముం
గనియె మహోపవాసములఁ గానిఫలంబులు లేవు భూవరా. 156

క. కావున నుపవాసవ్రత,సేవనము శరీరమునకుఁ జిత్తంబునకుం
బావన మైహికమహిమయు, దేవనిలయసుఖము నిర్విరోధిన్ సమకూరున్. 157

క. పర మగునీవ్రతమున కం,గిరసుఁడు దర్శకుఁడు తత్సుగీతవిధమునన్
నరు లెవ్వరు దర్శకు లగు,దురు వారిం బొరయ వేమి యఘములు నృపా. 158

క. ఈతంత్రంబు పఠించినఁ, బ్రీతి వినినఁ బాయు బహుదురితములు తిర్య
గ్జాతులభాష లెఱింగెడు,నా తెలి వగు నపరభవమునందు నరులకున్. 159

వ. అనిన విని ధర్మజుండు సర్వధర్మజ్ఞానమాననీయునితో యజ్ఞకర్త యగుట మే లని
మీరు పెక్కుడలం జెప్పితిరి యజ్ఞంబు ధనధాన్యవిభవసహాయసంపన్నులకుం
దక్కం దక్కటివారలకుం జేయ శక్యంబు గామి దెల్లం బెల్లవారికి ననుష్ఠింప
నయ్యెడునట్టిపుణ్యకర్మం బెయ్యది యుపదేశింపవే యనుటయు నమ్మహీపతికి
నమ్మహాత్ముం డి ట్లనియె. 160

క. నరవర యర్థంబులునుం, బరివారము లేకయును శుభస్థితిఁ జేయన్
[1]దొరకొని యుండుట గని యం,గిరసుం డుపవాసముం బ్రకీర్తించెఁ దగన్. 161

క. ఉపవాసాయాసంబును, నృపముఖ్యా దుస్సహముగ నీవు దలఁచి య
జ్ఞపరత్వము దుర్ఘట మను,నెప మిడి యి ట్లడిగి తని మనీషం గంటిన్. 162

వ. అనశనవ్రతంబులందును జులుకని తెఱం గెఱింగించెద. 163

చ. పగలును రేయుఁ గుడ్చి జలపానము లోనుగఁ గుడ్చునష్ట తు
ష్టిగ నొనరించి మర్త్యుఁ డొకటిన్ నడుమన్ మఱి యెప్డు నంట కే
మిగతిని బాపముం బొరయమిం దలకొల్పుచు హోమకార్యముం
దగుమెయిఁ జేయుచున్న విను తంగెటిజు న్నగు నూర్ధ్వలోకముల్. 164

వ. ఇది మేలితెఱంగు గొందఱు దుష్కరంబుగాఁ దలంతు రట్టివారలు దమ
యోపినభంగుల నంగిరసుం డుపదేశించినయుపవాసవ్రతవిశేషంబు లనుష్ఠించు
వా రని చెప్పిన నప్పౌరవోత్తముం డయ్యుత్తమబోధనిధికి నమస్కరించి
యధ్యాత్మకవిద్యాబోధకప్రకారంబు లగువాక్యసంచయంబులు పెక్కుడలం

1. క. గ. చ. దొరకొనుపని గాదే యుం.

గృష్ణద్వైపాయనాదిమునీంద్రులును గృష్ణుండును నాకర్ణింప నుపన్యసించితిరి [1]కృష్ణశ్రోతృత్వంబు మహావ్రతమంబు కృష్ణునియున్నరూ పెఱుంగుటయు నత్యంతసంభావనీయంబు. 165

ఆ. ఎవ్వఁ డెఱుఁగఁబడిన నెఱుఁగంగఁ బాలివి, యైనయెల్లయవియు నవగతంబు
లగుట యీపరాశరాత్మజుఁ డాశ్రిత,కోటి కర్థిఁ గృష్ణుగుఱిచి చెప్పె. 166

క. కావున నధ్యాత్మకవా,క్యావలికిం జేరుగడ మహామహిమపదం
బై విలసిల్లెడుఁ గష్ణుఁడ, యే వినఁగా వలతు నమ్మహితవాక్యంబుల్. 167

వ. అని పలికి యింకను నధ్యాత్మవిద్యావివరణంబు లగువాక్యంబు లనుగ్రహింప వలయు నని సంప్రార్థనంబు సేసిన నప్పార్థివాగ్రగణ్యుతో నక్కురువరేణ్యుండు హరసనత్కుమారసంవాదంబు సెప్పెద నది యధ్యాత్మవిద్యోపకారప్రకారంబు లై నయుపన్యాసంబుల నొప్పి యుండు విను మని యి ట్లనియె. 168

హరసనత్కుమారసంవాదప్రకారము.

చ. హరుఁడు సనత్కుమారుకడ కర్థిమెయిం జనుదేర న మ్మునీ
శ్వరుఁ డుచితాసనాదు లుపచారవిధిజ్ఞతఁ దా నొనర్చి యా
దరభరితాత్ముఁ డై యభిమతం బగుకార్య మనుగ్రహింపు త
త్పరమతి నిర్వహింతుఁ దగ దానిఁ ద్రిలోచన మృత్యుమోచనా. 169

తే. అనిన నీతోడిగోష్ఠికి నర్థి వుట్టి
యరుగుదెంచితిఁ దమ్ముఁడ యని ప్రమోద
మెసఁగఁ బల్కి యప్పరమేశుఁ డిట్టు లనియె
నఖిలలోకార్చితుం డగునతనితోడ. 170

క. ధ్యానమున దర్శనీయం, బై నది యేవస్తు వెన్ని యనఘచరితస
మ్మానితతత్త్వంబులు సం,ఖ్యానము యోగంబు నెట్టిగతులం జెల్లున్. 171

వ. చెప్పుము మఱియు నధ్యాత్మవిషయంబు లగువిశేషంబులును వివరింపు మనుటయు నయ్యంభోజసంభవసంభవుం డయ్యుభవున కి ట్లనియె. 722

క. అరయఁగఁ దత్త్వము లనునవి, యిరువదినా ల్గండ్రు గొంద ఱిభదనుజహరా
యిరువదిమూఁ డనుటయుఁ గల, దిరువదియే నండ్రు వాని నే మె ట్లనినన్. 173

క. ఇరువదిమూఁ డనువార, ల్గిరిజేశ్వర ప్రాకృతుల్ మలీమసవిధ మ
త్తెరువు మనోబుద్ధులు వా, రరయఁగ నొక్కండ యందు రది య ట్లుండెన్. 174

క. ఇరువదినా ల్గనువారలు, నరసి మనశ్శుద్ధి బుద్ధియనుకాన్పున న
ప్పురుసునఁ బలికెద రేఁ గను, తెరువున విను తత్త్వవిధము దేవస్తుత్యా. 175

తే. పంచవింశ మధిష్ఠానభావ మొంది, విలసనము నిచ్చుఁ దగఁ జతుర్వింశతికిని
దన్న కని తనయందు డిందఁగఁ జేయు,[2] దాన నప్పిండు గలయది లేనియదియు.

1. చ. కృష్ణశాస్త్రితంబు. 2. క. గాని

వ. చతుర్వింశతత్త్వంబులు వివరించెద. 177

తే. అవధరింపుము భూతంబు లయిదుఁ దద్గు
ణములుఁ బదియింద్రియములు మనంబు బుద్ధి
యను మహేశ యహంకారమును బ్రకృతియు
నాఁగఁ దత్త్వంబు లిరువదినాల్గు వొలుచు. 178

వ. ఆచతుర్వింశతితత్త్వంబుల నధిష్ఠించి యుండుతత్త్వంబు నిర్దేశించెద. 179

క. [1]దేహం బని యెడ నెరవున, నూహించును బుధుఁడు దాన నుండుం గాఫ్త
స్వాహాప్రియుక్రియఁ బురుషుఁడు, సోఽహమనినవాన్ప్రరుద్రయతనిఁగనుటగున్.

క. ఈనెఱి నిలుచుట గలుగదు, మానేర్ష్యావంతు లైనమానవులకు ని
ష్ఠానూనతపోవర్తకు, లైనను గార్హస్థ్యబహుముఖాత్మకు లగుటన్. 181

వ. శ్రుతి పురుషు నమృతార్థతత్త్వం బనియు బ్రహ్మం బనియు నిర్దేశించి. 182

తే. అన్నితత్త్వంబులకు నమృతార్థతత్త్వ
మెక్కుడది యీశ్వరంబు నీశ్వరంబు
సత్యపాకంబు నతిరహస్యంబు దానిఁ
గనిన మృత్యుజాలముచిక్కు గడవ వచ్చు. 183

క. అనఘ యనులోమమునఁ దోఁపును బ్రతిలోమమునలయముపొందుటయును గ
ల్గును సర్వతత్త్వముల కవి, యెనయిక బ్రహ్మమును గలయు నేకత్వ మగున్. 184

తే. ఉత్తమశ్రద్ధ లేకున్నఁ జిత్త మేక,ముఖముగా కున్న నింద్రియములజయింప
కున్న వేదంబు సదువక యున్న నతని, కీపరిజ్ఞాన మీఁ దగ దిద్ధచరిత. 185

వ. అని చెప్పి తదనంతరంబ యధ్యాత్మంబుల నధిభూతంబుల నధిదైవతంబుల
నుపన్యసించె నాస్వనత్కుమారుండు తత్త్వపంచంబునారదునకుం జెప్పుట యేను నీ
కెఱింగించి యప్పరిపాటి నిన్ను మున్న వినిపించితి ధర్మనందనా యమ్మునిపతి
మఱియు నప్పశుపతితో ని ట్లనియె. 186

ఆ. సకలజంతువులకు సామాన్య మధ్యాత్మ, మాది గాఁగఁ గల్గునంతవట్టు
నిట్లుగాఁగ నెఱుఁగు తెలుఁగుట యొండుమైఁ, గనుట యెఱుక గాదు కామదమన.

క. విను మధ్యాత్మప్రభృతులు, గనికే మున్నమరదనుజగంధర్వులునుం
గనుటయుఁ గల్గునె బ్రహ్మం,బునయున్ననిజంబు తత్త్వబోధం [2]బసదే. 188

క. ఓంకారవాచ్య మది యన,హంకారనిరూఢభావనారాధ్యము ని
ష్పంక మశీత మనుష్ణము, శంకర మఖిలంబునకుఁ దృపాహరము శివా. 189

తే. అప్రమేయ మవిజ్ఞేయ మచల మాది,విరహితంబు నితాంతంబు విమల మవ్య
యంబు పుండరీకాక్ష మనఃకువిషయ, మచ్యుతము సదసత్పర మైక్యభాసి.190

క. అది నారాయణుఁ డొకనికి, విదిత మతనివలన సురలు వివిధమునులు ని

---

1. గ. దేహ మని యెట్టివెరవున- జ. దేహం బనియెడివెరవున. 2. క. గ. జ. బసుదే.

ర్మదసిద్ధసాధ్యగణములు, మొద లగునర్హులసుబోధ।ములపాల మయ్యెన్. 191

వ. అట్లయిన నాతత్త్వంబు దృశ్యత్వంబు నిరూఢంబు గా దెట్లనిన వినుము బంధవిముక్తుండు గదా కనువాఁడు. 192

చ. స్మరహర పొందు నింద్రియసమాజయుగంబు మనంబు బుద్ధియుం
బరువడిమై నహంకరణ।బంధము వాసినజీవుఁ డత్సము
త్కరసహితంబుగా నతఁడు।దాఁ బరతత్త్వమునందు లీనతం
బొరయును దాని నెవ్వరు ప్ర।బోధముగాఁ గనువారు సెప్పుమా. 193

క. భూతము లన్నియు నడఁగిన, యాతఱిఁ దనుఁ దాన కనుచు।నంజనరహిత
త్వాతిశయ మెసఁగ వెలిఁగెడు, నాతెలి వాతత్త్వమునకు।సమరు మహేశా. 194

ఆ. అని సనత్కుమారుఁ।డభవుతో మఱియు ని, ట్లనియె దేహవర్తు।లైనదైవ
తముల నెల్ల నాద।రమున నాకర్ణింపు, మేర్పరింతు యోగ।హితము గోరి. 195

సనత్కుమారుఁడు శివునకు దేహాంతర్గతదైవతములం దెలుపుట.

సీ. జిహ్వ సోముఁడు వాణి।శిఖి ప్రాణమున గాడ్పు, దానంబునందు శ।తప్రుదాలి
వ్యానస్తనాంతర।వర్తులై పర్జన్య, గగనముల్ బలమునఁ।గాళికుండు
మతి నపానమున స।మానంబునందు నీ, శానమిత్రాప్సర।స్సమితు లక్షు
లందు సూర్యుఁడు మేన।నంఘ్రులఁ జెవి భూమి, ధరణీధరుండు దిక్।క్తతి యుపస్థ

తే. మునఁ బ్రజాపతి బుద్ధియం।దనఘ బ్రహ్మ
యుండు నింతకు బుధ్యమా।నుం డనంగ
వెలుఁగునాత్మ యధిష్ఠాత।విను ప్రబుద్ధుఁ
డన నబుద్ధుండు నా నొప్పు।నతఁడు మఱియు. 196

క. ఈదైవతముల నన్నిటి, నాదరమునఁ గనుచు యోగి।యచలితనిష్ఠ
[1]వేదమయా మూర్ధగతుం, డై దక్షతపేర్మి నిలుపుఁ।బ్రాణము లచటన్. 197

తే. అపుడు బుధ్యమానునిఁ గను।నవ్వరిష్ఠ
తత్త్వ మవ్యక్త మండ్రు త।ద్దర్శి యగుఁ బ్ర
బుద్ధుఁ డాతని నతని న।బుద్ధుఁ డెఱుఁగు
చుండు నివి యాత్మదశ లతఁ।డొకఁడ యనఘ. 198

క. ఇవ్విధము గాంచుయోగికి, నెవ్వరు సరి గారు యతు ల।నేకు లచలులై
యవ్వస్తువు గోరుదు రది, దవ్వోరులకు యోగితతికిఁ।దక్క మహేశా. 199

ఆ. క్షరుఁడు నక్షరుండుఁ।బరుఁడును నందు ర, వ్వినుతదశలఁ బంచ।వింశకుఁడు ప్ర
బుద్ధనాముఁ డతఁడ।బుద్ధునిఁ [2]గనుఁబురు, షవిధము గను ప్రకృతి।సంగ మెఱుఁగు.

క. విను షడ్వింశుఁ డబుద్ధుం, డనఁ జను వాఙ్మనసములకు।నందక యునికిం
దనుఁ గా నాతత్త్వంబుం, గనిన ప్రబుద్ధుండ యతఁడు।కామధ్వంసీ. 201

1. క. వేదమయోర్ధ్వగతుం డై, ప్రాదక్షత. 2. క. గనియెఁ బూర్ణవిధము.

క. వేఱుగఁ గనినం బ్రకృతికిఁ, జూఱ విడిచినట్ల తనదుస్సుజ్ఞానము న
క్కాఱు విడిచి తనకంటెను, మీఱ నొకటి లేమి గాన్పు మెఱుకొనవలయున్.

వ. అని చెప్పి. 203

తే. తత్త్వమునఁ గల్గుమూఁడవస్థలను దెల్ల
ముగ భవద్భవ్యసన్నిధి నిగదనమునఁ
గూర్చు టఖిలేశ నీ వెఱుంగుటయు నాకు
నెల్లయోగిజనంబులు నెఱుఁగు టయ్యె. 204

వ. అని పలికి మునిజనకృత్యంబులు వివరించెద నవధరింపు మనుమాటయు సు
వ్యక్తంబుగా నాడి యాక్రీడాతపస్వికి నప్పరమయశస్వి యిట్లనియె. 205

క. ముని వనమున శూన్యాలయ,మున నైన గుహానికేతమున నేనిని నా
సనబంధధీరుఁ డై మన,మునఁ గొని యింద్రియమువిషయమునఁ బెడఁబాపున్.

క. గురునుపదేశము నడపుం, బురహర విణ్మూత్రవేగములఁ నాఁకలితోఁ
బోరయం డయ్యభ్యసనము, గురువుగ నాహార మెపుడుఁ గొనఁ జేచవులన్.

క. కుడిచినయప్పుడ యోగము, దొడఁగుటయును వలదు మనసు దూలకయుండన్
మృడ వినుము బుద్ధిఁ గొని యెక్కుడునిష్ఠను వలయు దానిఁ గుదియింపంగన్.

క. అది గుదిసిన విజ్ఞానము, గదలక నిర్వాతదీపకాంతియుఁబోలెం
బొదలును జిత్తంబును నుపలదశాసంప్రాప్తి నిశ్చలం బగు దానన్. 209

తే. అనఘ నిర్జననిశ్శబ్ద మైనయట్టి
చోటు హృదయస్థుఁ డగు దేవుఁ జూచుపనికి
వలయు లే కున్న శబ్దసంకలిత మేని
సజ్జనాన్వితస్థల మార్యసమ్మతంబు. 210

క. విను తమము నిస్తమముఁ జే, తనారహితచేతనాసుధామయ తాస్థా
ననిరూఢము నగుతత్త్వము, గను నిన్నియుఁ గలుగు యోగి కరుణామూర్తీ. 211

క. మదనహరా యోగనిరతు, లది గని దుఃఖములఁ దొఱఁగి యజరామరతా
స్పద మగు నెలవున నిలుతురు, పొదలుదు [1]రణిమాదిచయవిభూతిపదమునన్. 212

వ. మఱియును. 213

తే. యక్షగంధర్వసిద్ధసాధ్యాదిభూత
కోటికంటెను మిగిలి యోగులు నిజేచ్ఛఁ
బరఁగుదురు భవ్యయోగతత్పరుల మేము
నిట్టు లగుట యోగీశ నీ వెఱుఁగుపనియ. 214

వ. అని నిజసహజన్ము లయినసనక సనందన సనత్సుజాతులం దలఁపించినవాఁ డయి
వెండియు. 215

1. క. రణిమాదివరవిభూతచయమునన్.

తే. యోగధర్మంబుకంటెను నుత్తమంబు
గలుగ నేరదు ధర్మ మొక్కటియు నపున
రాగమం బగుపదమున కరయ నిదియ
మేటినిచ్చెన సంయమికోటి కెల్ల. 216

క. యోగంబు తెఱఁగు సెప్పితి, భోగివరాభరణ సాంఖ్యమును జెప్పెదఁ ద
ద్భాగు లగునైష్ఠికులు భవ,సాగరముం గడతు రైక్యసంబోధమునన్. 217

సనత్కుమారుఁడు రుద్రునకు సాంఖ్యయోగంబు తెఱం గెఱింగించుట.

వ. కావున నత్యాదరంబున నాకర్ణింపు మని పలికి యి ట్లనియె. 218

ఆ. ఇంద్రియములకంటె నీశాన మన మహం,కారతత్త్వ మంతకంటె దాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యెక్కు, డన్నిటికిని బురుషుఁ డెక్కు డరయ.

తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియము లిరుదెఱఁగు బాలేందుమౌళి
మన నహంకారబుద్ధు లి ట్లొనరి ప్రకృతిఁ
గలయఁ దత్త్వచతుర్వింశకత్వ మొందు. 220

క. చేతనుఁ డగుపురుషుని ని,శ్చేతన యగు ప్రకృతి వొంది చేతనతా ప్ర
స్ఫీత యగుం బెఱతత్త్వము, లాతత్త్వం బనుమహాబ్ధియందలితరఁగల్. 221

క. గుణములఁ బొందఁడు పురుషుఁడు,గుణమహితా ప్రకృతి యిచ్చుగుణముల[1] కేమే
గుణములు దానను గుణు లై, గుణిత్వ మానిర్గుణాత్మకున కొలయించున్.222

తే. వీని నెల్ల నసత్కోటిఁ గా నెఱింగి
కొనుచుఁ బ్రకృతి నుపేక్షించి తనకుఁ దాన
కాని యొం డెద్దియును లేమి గాంచినపుడు
పురుషుఁ డపగతధూమాగ్నిఁ బోలి వెలుఁగు. 223

తే. అట్లు గాక యహంకార మావహిల్లి
ప్రకృతి దా నని సృష్టికిఁ బ్రళయమునకుఁ
గర్త యైన వికారాత్మకత్వ మొందుఁ
బ్రకృతివికృతులు గానియా ప్రభువు [2]నపుడు. 224

క. ధృతి వూనమిఁ బ్రకృతికి వశ,గతుఁ డగుచుఁ దమోమయత్వకలితం బగున
వ్వితతాసుఖత్వమును సుఖ,మతి పురుషుం డనుభవించు మదనధ్వంసీ. 225

క. నేరమి దాని నుపేక్షుం, జేరువ షడ్వింశభావసిద్ధిఁ బొరయు గౌ
రీరమణ పంచవింశుఁడు, [3]సారామలనిపుణమతిఁ బ్రసన్నాత్మకుఁ డై. 226

క. [4]సత్త్వాశ్రయమునఁ బురుషుఁడు, తత్త్వాశ్రయమునను సత్త్వతత్త్వముల వివే

1. చ. కెలమిఁ. 2. జ. నడపు. 3. జ. సారామలనిపుణతా ప్ర◆సన్నా. 4. క. సత్త్వానాశ్రయ పురుషుఁడు, సత్త్వాశ్రయుఁడును నసత్త్వ◆సత్త్వము లై క, ర్తృత్వాలేపత్వ.

కిత్వాలేపత్వములన, విత్త్వము జిత్త్వంబు నొందు విశ్వాధారా. 227

క. నానాత్వైకత్వము ల,జ్ఞానజ్ఞానజము లనపరజయ కం(దు) బుధుల్
వాని నవిద్యయు విద్యయుఁ,గా నివి విను పంచవింశకస్థావస్థల్. 228

క. విద్యామయ షడ్వింశుఁడు, విద్యావిద్యావిభేదవిరహితుఁ డజరుం
డాద్యుఁ డనంతుం డచ్యుతుఁ, డవ్యతనుఁ డనాది కేవలాత్మకుఁ డరయన్. 229

ఆ. అని యుపన్యసించి యమ్మునిపతి యను, శంభుతోడ మఱియు సాంఖ్యయోగ
శిష్టమానసుల కరిష్టపరిజ్ఞాన,వైభవాతిశయము వలసి యుండు. 230

వ. ఎట్లనిన దృష్టారిష్టవికృతు లయి యాసుకృతు లవిచ్ఛిన్నాత్మానుసంధానంబునం దదీయదురవస్థం బ్రోవం జాలుదు రరిష్టంబు లవధరింపు మనుపలుకు వలికి వాని నెల్లను వివరించెద నని పరాశరసంయమీశ్వరుండు శిష్యుల కుపదేశించినవిధంబులై యుండు నంతవట్టును మును నీ వాకర్ణించితి నని యమ్మునివరుండు మఱియు నమ్మహాదేవుతో నరిష్టంబులంగాంచి యోగిజనంబులు సర్వాంగధారణసహితంబును బరమహితంబునునగున నేకత్వాకలనకృత్యంబునమృత్యువుజయింతురనిని ర్దేశించి.

క. జలమున మీను నుదుంబర,ఫలమున మశకములుఁబోలె బ్రకృతిం దా ని
మ్ముల నునికి దెలిసి వేర్పా, టలవఱిచినపురుషుఁ డవ్యయత్వముఁ బొందున్. 232

తే. కమలదళమున నున్న జలమువిధమునఁ
బ్రకృతి నుండి తదీయసంబంధవికృతి
లేనితనుఁ గని వెలుఁగు నిర్లేపనిశ్చ
లాజరామరపదవి జీవాహ్వయుండు. 233

ఆ. ప్రకృతి నిట్లు వాసి పంచవింశుండు ష,డ్వింశభావ మొంది విమలశివని
రంజనస్వరూపుఁ డై వెలుఁ గొందు న,త్తెఱఁగు ముక్తి యండ్రు దేవదేవ.

క. ఈపరిబోధం బభవా, కాపిల మస్మద్గురుండు కపిలుఁ డతని
తాపరిణతి బహుశిష్యులు, దీపితవిజ్ఞాను లైరి దృఢనిశ్చయతన్. 235

క. ఏనును శిష్యుల కీవి,జ్ఞానము పెక్కండ్రకుం బ్రసన్నమతిని గా
ఢానూనంబుగఁ దెలిపితి, మానిత మిది దివ్యమునిసమాజముచేతన్. 236

వ. గార్గ్యగౌతమకాత్యాయనాదులు దీననచేసి దీప్తబోధు లయి వీతాంతకులును విజ్వరులును నిర్లేపులును నిర్భరానందులు నైరని చెప్పి వెండియు నిట్లనియె. 237

క. సంగము బంధ మఖిలని,స్సంగత మోక్షంబు బహువిచారము లేలా
పింగజటాజూటకలిత, గంగాబాలేందుమహిత గౌరీసహితా. 238

క. అని యిట్లు శివునకును న,మ్ముని విజ్ఞాపించి గగనమున కెగసి వెసం
జనియె శివుండును నిజది,వ్యనిరర్గళచిత్తపథవిహారుం డయ్యెన్. 239

క. అని చెప్పిన భీష్మున కి,ట్లను ధర్మతనూజుఁ డెక్కు డై నశుచిత్వం
బొనరింపఁ జాలుతీర్థం, బనఘా యెఱిఁగింపవే దయం దెల్లముగన్. 240

సీ. అనవుడు నాతఁ డక్కర్మనుజవల్లభుతోడ, వినుము తీర్థము లెల్లఁ గవియును మేల
సత్యాభిధాన మై శౌచాతిశయముఁ జేయఁగఁ జాలు మానసం బైనతీర్థ
మది ధృతి యనుమహాహ్రదమున శోభిల్లుఁ,దమము రజస్సును దఱియఁ ద్రోచి
కొనుచుసత్యమునూఁతగొనిచొచ్చియాచరి,తస్నానుఁడై శుచిత్వమున వెలుఁగు
ఆ. పరుఁడు వీతరాగపరిహృతేంద్రియదృఢ,[1] వ్రతలసద్వివేకు లతిశయిల్లు
విమలతీర్థములు సవినయత వారలఁ, జెందుటయును దీర్థసిద్ధి యధిప. 241
క. దమమును దపము నహింసయు, శమమును దీర్థముల వాన శౌచాతిశయం
బమలగుణ కలుగు రిత్తజ,లములం దోఁగిన శుచిత్వలాభము గలదే. 242
వ. అని వెండియు. 243
క. దొరకొననిదానిఁ గోరక, దొరకొనినందును మమత్వతుష్టహృదయతం
బొరయక విగతస్పృహు లగు,పురుషులు శుచు లేల తీర్థములు వారలకున్. 244
క. అనినఁ బ్రియ మంది తాతకు, మనుమఁడు ప్రణమిల్లి బోధమహితా యేవ
ర్తనమున నుత్తమపదముం,గను నం ద్రది యెఱుఁగఁ జెప్పు కరుణ దలిర్పన్. 245
వ. మృతుండు మేను విడిచి యెయ్యది సహాయంబుగాఁ జను నదియును విన వలతు
నని యడిగిన నమ్మహానుభావుం డాభూవల్లభున కి ట్లనియె. 246
క. [2]నీయడిగినగూఢము లగు,నీయర్థము లెఱుఁగఁ జెప్ప నింద్రగురుఁడు గా
కేయెడల నొరుఁడు గలఁడే, యాయన యిట వచ్చు నిపుడ యడుగుము ప్రీతిన్.
క. అనుసమయంబున నయ్యెడ, కనిమిషగురుఁ డరుగుదెంచె నతనికిఁ గుంతీ
తనయాగ్రజుండుఁ దమ్ములు, జనపతులును గేశవుండు సద్భక్తి మెయిన్. 248
వ. ఎదుర్కొని ప్రణామపూర్వకంబుగా సముచితోపచారంబులం బ్రీతాత్ముం జేసి
యాసీనుం డై యున్నెడం గురుపతి యగ్గురునిం గురుపితామహు నడిగినయట్ల
యడిగిన నతం డతని కి ట్లనియె. 249

బృహస్పతి ధర్మజునకు ధర్మవిశేషంబులు సెప్పుట.

ఆ. తనకుఁ దాన కలఁడు జననంబునప్పుడు, మరణమునను సుగతి నరకమునను
దల్లి దండ్రి దక్కు నెల్లబంధులు శరీ,రంబు ననుగమించి క్రమ్మఱుదురు 250
క. ఉత్తమపథంబు ధర్మా,యత్తము ధర్మంబు మృతుల కధిప సహాయం
బెత్తెఱఁగున ధర్మక్రియఁ, జిత్తంబునఁ జేర్పవలయు జీవించుతఱిన్. 251
క. అది లేనివాఁడు నరకా,స్పదుఁ డగు నటు గాన ధర్మపరుఁ డగుటయ యొ
ప్పిదము మనుజునకు నేఁ జె,ప్పెద మఱియును వలయువానిఁ బ్రీతి నడుగుమీ.
వ. అనిన నజ్జనపతి శరీరంబు విడిచి చనియెడుజీవుని ధర్మం బె ట్లనుగమించు ననుట
యు నయ్యాంగిరసుండు. 253
తే. భూతపంచకశక్తులు బుద్ధియును స

1. క. వ్రతహసద్వివేకు. 2. ట. నీయడిగినరూఢము లగు.

ధర్మకంబుగ జీవుతోఁ దగిలి యరుగు
ననుచు నేతత్ప్రకార మెట్లనియె నృపతి
యతని కట్లని చెప్పె నయ్యమరమంత్రి. 254

తే. దేహగతభూప్రభృతిపంచదేవతలును, మనసు నన్నంత్ర్యాప్తిఁ బొందినన్నపాల
కల్గు నేతన్ను పురుషుండుఁ గామినియును, బొందఁగా నది గర్భత్వ మొందుఁజువ్వె.

వ. అని చెప్పి మఱియును. 256

తే. పుణ్యపాపానుగుణభంగిఁ బుట్టి సౌఖ్య, దుఃఖములయందు సంసరణముఁ బొందుచుండు
వినుము కేవలధర్మవర్తన సుఖైక, భాజనత నొందు ధర్మైకపరత మేలు. 257

క. జనవర కృమిగర్దభముఖ, జనవంబులఁ బొంది నరకసంవాసముఁ జెం
దు నధికపాపాత్ముం డగు, మనుజుఁడు కర్మవిశేషమహిమఁ జెప్పెదన్. 258

క. జననీజనకగురులయెడ, నొనరించినమేలుఁ గీడు నొదవించుసుఖం
బునకును దుఃఖమునకు సిం, తని కొలఁది యిడఁగ వశంబె యజునకు నైనన్. 259

క. మాతృపితృగురులు దక్కఁగ, నేతెరువునఁ బాప మొలసె నేనియు దానిం
బాతురు ప్రాయశ్చిత్తస్థితులు తద్విషయ మైనఁ జెడ దల్పములన్. 260

క. కొలు చపహరించునన్నరుఁ, డెలుకయుఁ బందియును నైనయాదుర్జననం
బులఁ బొందు నంతఁ బాపము, వొలియక యాతనికిఁ గుక్కపుట్టువుఁ గల్గున్.

క. పరదారగమనదోషము, వరుసన వృక కంక గృధ్ర వలిముఖ శవభు
క్తిరతంబు లైనభవములఁ, బొరయించుం గృమియుఁగాఁగఁ బుట్టించుఁ దుదిన్.

సీ. తనయ నొక్కని కిచ్చి మనసు మరలఁబడి, యన్యున కిచ్చినయట్టివాఁడు
కృమి యగు దేవకార్యము సేసి మఱి పైతృకంబు సేయక భోజనంబు సేయు
నతఁడు కాకం బగు నన్నఁ దిట్టినఁ గ్రౌంచ, మై పుట్టు బ్రహ్మకులాభిజాతఁ
గవసి శూద్రుఁడు నరకపుగుంటపు ర్వాగు, నంతకుకింకరు లంటఁ బట్టి

తే. కట్టి కొనిపోయి కోసియుఁ గాల్చియును గృ
తఘ్ను నుగ్రకంటకసముదయముమీఁదఁ
గ్రంద నదిమియు మఱియు దుఃఖములఁ బెట్టు
తెఱఁగు లెన్ని యన్నింటను బఱుతు రధిప. 263

క. ధనవాంఛ నిరాయుధుఁ జం, పిన గాడిద మొదలు గాఁగఁ బెక్కులు తిర్య
గ్జననంబులఁ బొందును శ, స్త్రనిహతిఁ దోత్తోడ మరణదశ వాటిల్లున్. 264

ఆ. ఆఁడుదానిఁ జంపినతఁ డేకవింశతి, దూష్యనరకవాసదుఃఖ మొందు
నన్నదధిపయోఘృతాపూపహరణముల్, మక్షికాదికీటమయత సేర్చు. 265

ఆ. ఫలము నినుము వెండిఁ బసిఁడి ముచ్చిలికొన్నఁ
గ్రోఁతి వాయసంబు గ్రువ్వ నీచ
కృమియు నగు సదంబరము హరించిన శశ

జనన మొందు నరుఁడు ✽ మనుజనాథ. 266

తే. నమ్మి యిల్లడ వెట్టిన✽సొమ్ము గొనిన
మీను లో నగునీచపు✽యోనులందుఁ
బుట్టు గంధవస్తువులు గొ✽న్నట్టివాఁడు
వినుము మఱుపుట్టువునఁ జుంచు✽తసము నొందు. 267

తే. వనిత లీపాపములు సేసి ✽ వానివాని, పత్ను లై జనియింతురు ✽ పాపభీతిఁ
దెరువు దప్పక నడచిన✽నరులు సౌఖ్య, మందుదురు రెండులోకంబు✽లందు నధిప.

వ. అని చెప్పి యి ట్లనియె నేనుం గొన్ని దెఱంగు లెఱింగించితి మఱియు ననేకపదార్థాపహరణంబులకు బహువిధంబు లగుఫలంబులు వాటిల్లు వాని నెల్లను శాస్త్రాంతర శ్రవణంబున నెఱింగెదు గాక యనిన విని యక్కురుపతి బృహస్పతితోఁ బాపంబులం బాపికొను తెఱం గెఱింగింపవే యనుటయు నతం డతని కి ట్లనియె.

క. విను దానంబులఁ బాపము, లనఘా చెడు దానములకు ✽ నన్నిటికిని స
జ్జనసేవ్య యన్నదానము, మును లధికం బండ్రు పాప✽ములఁ బాపు నెడన్. 270

క. న్యాయార్జిత మగునన్నము, వేయింటికిఁ బెట్ట వలయు ✽ విప్రజనము హ
ర్షాయత్తంబుగ దానం, బాయనిపాపములుఁ గలవె ✽ పౌరవముఖ్యా. 271

తే. తిరిసియేనియు నన్నంబు ✽ దెచ్చి [1]శిథిలు
లైనవిప్రులయాఁకలి ✽ యపహరించు
పురుషుఁ డూర్ధ్వలోకంబుల✽పురుషవరుల
కర్చనీయుఁ డై వెలుఁగుచు ✽ నంద యుండు. 272

క. వేదాధ్యయనార్థప్రతి, పాదనమున విప్రవరుఁడు ✽ బ్రహ్మవిషయస
ద్భ్యాదానంబుల నరపతి, యేదురితము లైనఁ గౌర✽వేశ్వర పాచున్. 273

తే. నేర్చి యలజడిఁ బడినవా✽ణిజ్యవిధులఁ, బడసి వైశ్యుఁ డన్నం బిడి✽పడయు సుగతి
సచ్చునంతలు వడి సిరి ✽ దెచ్చికొని చ, తుర్థు లన్నంబు వెట్టి కాం✽తురు దివంబు.

తే. దివము వంధ్యంబు గా కుండఁ ✽ దివిరి యన్న
పానదానంబు లొదవిన✽భంగిఁ జేసి
మఱి భుజించుటఁ బోలెడు✽మహితధర్మ
కార్య మొం డొకఁ డెందును ✽ గలదె యరయ. 275

తే. అన్నదానంబు ధర్మంబు✽లన్నిటికిని, ముఖ్య మింత యెఱుఁగు కురు✽ముఖ్య యనుచు
ననిమిషాధిపమంత్రికి ✽ నమ్మహీశుఁ, డి ట్లనియె భక్తివినయంబు ✽ లెసక మెసఁగ.

క. ధ్యానం బింద్రియవృత్తుల, మానించు టహింస గురుస✽మర్చనవిధి ని
త్యానుష్ఠానము తప మను, వీనఁ బరమసేవ్య మెద్ది ✽ వినఁగా వలతున్. 277

వ. వినిపింపు మనిన నమ్మహాత్ముండు. 278

1. క. శిష్టు లైనవిప్రుల.

క. ఈయాఱును మంచితెరువు, లై యుండు నహింస యున్నదయ్యెదిటికిఁ బవి
త్రాయతన మట్లు గాకయు, నేయుత్తమధర్మములను నిదె వెలిఁగించున్. 279
వ. అని పలికి యామంత్రణంబు సేసి వాసవమంత్రి యమరనగరంబునకుం జనియెఁ
దదనంతరంబ. 280

ఆ. ధర్మనందనుఁడు పితామహుతో సర్వ, దేవతలును భూమిదేవతలును
మునివరులు నహింస గొనియాడుదురు దాని, తెఱఁగు సెప్ప నాకుఁ దేటపడఁగ.
వ. అనుటయు నమ్మహనీయుం డమ్మనుజపతిం బరమాదరంబున నాలోకించి. 282

భీష్ముఁడు ధర్మజునకు నహింసాస్వరూపనిరూపణంబు సేయుట.

ఆ. దంతియడుగులోనఁ దక్కినజంతుచయంబునడుగు లెల్ల నడఁగియుండు
నట్ల ధర్మకోటు లన్నియు లోనగు, నిద్ధగుణ యహింస కింత నిజము. 283
వ. అదియును 284

క. అరయఁగ నాలుగువిధములఁ, బరఁగుఁ జతుష్పాదవృత్తిఁ బరఁగినగోవ్రజ
దారయుచు నం దొకఁ డెడలిన, నరవర సద్ధర్మవర్తనము గుంటువడున్. 285
తే. మనసునను వాక్కునను గాయమునను హింస
నడపు మాంసంబు దినుటతో నాలు గయ్యెఁ
దెఱఁగు లవియువ్వో హింస వర్తింపఁ జేయుఁ
గాన కడుఁ గీడు మాంసభక్షణము దలఁప. 286

క. ఈనాలుగుదెఱఁగులఁ దగ, మానుట యేఁ జెప్పినట్టిమహితాహింసా
నూనచతుర్విధములు మాం,సానేకరుచిప్రమగ్నుఁ డది యెట్లుడుగున్. 287
క. కావున మాంసముపైఁ దగు, లేవిధమున నుడుగుటయ యహింసారూపం
బై వఱలుఁజుమీ భూవర, నావుడు నక్కురువిభుఁడు వినయమయుఁ డగుచున్.
వ. మాంసంబు పితృదేవతలకుం బ్రియంబు శ్రాద్ధంబు మాంసముఖ్యంబుగా నడప
వలయు నని చెప్పుదురు వధింపక మాంసలాభం బెట్లు గలుగు ననుటయు ననిమిష
నదీనందనుం డానరనాథున కిట్లనియె. 289

తే. వాజిమేధంబుకంటెను బూజనీయ
కర్మ మందురు మాంసభక్షణమువిడుపు
వినుము సంపుటయును జంపఁ బనుచుటయును
గల్మషంబుల కెల్ల నగ్గలము లధిప. 290

క. పితృకార్యయజ్ఞముఖముల, శ్రుతిచోదితహింసఁ గీడు సొర నేరదు వి
శ్రుతగుణ మాంసముచవి గో,రి తినం బ్రాణిఁ దెగటార్చు క్రియఁ బాప మగున్.
క. తను నమలినవాని నమలు, నని మాంసము తెఱఁగు సెప్పు నాగమములు గా
వునఁ దద్భక్షణ ముడిగిన, ననఘ తపంబునకుఁ జాలు నది యొక్కండున్. 292
క. జనవర మాంసముచవిఁ గడచినచవు లరయంగ లేమి జేసి చవి యెఱిం

గినవాఁ డది యడిగిన నా,తని దేవసమానుఁ డం(డ్రు - ధర్మవిధిజ్ఞుల్. 293

ఉ. మ్రానను జాతనుం గలదె - మాంసము ప్రాణులమేనఁ గాక య
మ్మేనుల నొంచునప్డ దమ - మేనులు సోఁకినమాత్ర నెట్లుగుఁ
దానిఁ దలంపఁగా వలదె - తా నది మానిన హింస లన్నియుఁ
మానవె యంచు నుత్తముఁడు - మాంసము మాను దయార్ద్రచిత్తుఁ డై. 294

ఆ. మాంస మాన కునికి - మనుజేశ ప్రాణివ,ధాభిరతి దొఱంగు - టగుటఁ జేసి
యట్టివాని కభయ - మఖిలభూతంబుల,వలన నెపుడు నెందుఁ - గలిమి నిజము.

క. స్వాయంభువుఁ డనుమనువును, నీయర్థము సెప్పె లోక - హితముగ నార్కం
డేయాదులు మాంస ముడుగు, టాయుశ్శ్రీరూపకారి - యగు నని రధిపా. 296

క. విను మాంసము గోరునరుఁడు, దనుజుఁడచూవె మును దేవ - తలు మాంసంబుం
దిను టుడిగి కాదె దానవ,జనితభయముఁ బోవఁ ద్రోవఁ - జాలిరి వత్సా. 297

క. దానము ధర్మము తప మి,జ్యానిష్ఠ యనంగఁ గల్గు - సత్క్రియ లెల్లన్
మానవనాథ యహింసా,నూనాకృతు లండ్రు శ్రుతుల - నూనిన పెద్దల్. 298

క. శతవర్ష దుష్కరతపః,కృతి నంజుడు దినమి నగు సు - కృత మివి రెండున్
మతిఁ దలఁప నొక్కరూ పని, శ్రుతివేదులు సెప్పుదురు కు - రుక్షితినాథా. 299

క. తపముల దానంబుల బ్ర,హ్మపురినివాసంబు దప్ప - దన రాదు జనా
ధిప మాంసము నమలనివు,ణ్యపురుషునకు సులభ మందు - రానెల వార్యుల్.

తే. అధిప యాషాఢముఖ్యంబు - లైన నెలలు
నాలుగింటను మాంసంబు - నమల కుడుగు
టాయురారోగ్యబలకీర్తు - లనుఫలములు
నాలుగింటిని నిచ్చు న - న్నరున కండ్రు. 301

ఆ. సగరనలదిలీప - నృగభగీరథముఖ్య,నృపులు వార్షికంపు - నెలలు నాల్గు
మాంసభక్షణంబు - మానుట నుభయలో,కంబులందుఁ బెంపు - గాంచి రండ్రు.

వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్త్రుతో నిమ్మెయి మహనీయం బయిన మాంసవర్జనంబు వాటించి తక్కినయపూపాదులు ఫలప్రభృతులు నగుభక్ష్యంబు లాచరించి యేల వర్తింప రెల్లజనంబులు ననుటయు. 303

మాంసభక్షణమందలిరుచివిశేషంబు మానుట దుష్కరం బని చెప్పట.

సీ. అతనికి నతఁ డిట్టు - లను మాంసములచవి, మరగినవారికి - మాన వశమె
యట్లు గాకయు సుర - తాసక్తునకు బల, మొలయు నధ్వశ్రాంతుఁ - డుల్లసిల్లు
క్షతము శీఘ్రమున [1]లో - పిత మగుఁ గృశునకుఁ, బుష్టి వేగమ వచ్చు - భూపవర్య
విను మాంసభక్షణం - బున నపూపఫలాదు,లం దవ్విశేషంబు - లరయఁ గలవె

తే. మాంస మానినదోషంబు - మహితదాన

1. క. పోషిత మగు.

విధులఁ బాయు దివిజపితృ॥విధివిశిష్ట
మైనయెఱచి గీడొలయదు॥ యజ్ఞములకుఁ
బహువిధానంబు వేదంబు॥పనుపు గాన. 304

వ. ఇట్లు గాన నంజుడు నమలుటయు నధికదోషంబులు గావియెడలునుం గలిగి యుండు నగస్త్యుండు రాజులకు వేఁట విధించెం గావునం గుతూహలంబుఁ గోపంబు ననియెడుభావంబులం బొరయక లోకరక్షణార్థంబుగాఁ గ్రూరమృగ వధంబును స్వహస్తవిక్రమార్జితమాంసంబున దేవపితృప్రీణనం బొనర్చుటకుం గాఁ బక్షిమృగమారణంబును జేయుభూనాయకుండు దురితంబులం బొరయకుండు విశేషంబు వినుము. 305

ఆ. అన్యమాంసమున నిజాంగమాంసంబుఁ బో
షింతు ననుటకంటెఁ॥ జెట్ట లేదు
మాంసభక్షణంబు॥ మానుటకంటెను
మేలు లేదు కర్మ॥జాలకమున. 306

తే. మాంసభక్షణదోషంబు॥ మాను దాన
మహిమ ననుటయు మాంసంబు॥ మఱి భుజింప
కున్నఁ జూవె ధర్మము లెవ్వి॥యును దలంప
దయకు సదృశంబులే కురు॥ధరణినాథ. 307

తే. ఆత్మసదృశత ప్రాణభ॥యంబునందుఁ
బ్రాణులకు నెల్లఁ గని మాంస॥భక్షణంబు
మాను దయ నార్ద్రమానసుం॥ డైనపురుషుఁ
డాతనికి బ్రహ్మలోకాదు॥ లాటపట్టు. 308

క. భూతముల కలుగునతనికి, భూతము లఖిలములు నలుగు॥ భూతహితార్థీ
భూతముల కభయ మిచ్చిన,పూతాత్మున కభయ మిచ్చు॥ భూతావలియున్. 309

ఆ. దానమును దపంబు॥ ధర్మంబు యజ్ఞంబు, శౌచమంత్రతంత్ర॥సత్యములును
బుధు లహింసరూప॥ములు గాఁగఁ జెప్పుట, నెల్లకల్మి సు మ్మ॥హింసకలిమి. 310

క. నరనాథ యహింసాగుణ,పరిగణనము గొంతమాత్రఁ॥ బలికితి ధర్మో
త్తర యగునహింసమేలిమి, యరయం గడుఁబెద్ద దాని॥ నలవఱుపు మదిన్. 311

ఆ. అనిన సంతసిల్లి॥ యమ్మహీపతి దాత, కధికభక్తి మ్రొక్కి॥ యస్మదీయ
సంగరంబునందుఁ॥ జచ్చినవారల, కేది గతియొ నాకు॥ నెఱుఁగఁ జెప్పు. 312

క. బ్రతుకును జావును సుఖదుః,ఖదములుగా జంతుకోటి॥ కరుణామూర్తీ
మదిఁ దలచుఁ బ్రాణలాభము, వదలు టరిది గాన యట్టి॥వారి నడిగితిన్. 313

క. అనుటయు లెస్సగఁ దలఁచితి, విను మొకకీటంబునకును॥ వేదవ్యాసం
బున లోకహిత మొనర్చిన,మునికి నయినసత్కథనము॥ మునినుతచరితా. 314

వ. దాన నీయడిగినయర్థంబు దెల్లం బగు నని పలికి భీష్ముం డి ట్లనియె. 315

క. శకటపథంబునఁ గీటం, బొకటి వెసం బాఱఁ గాంచె యోగీంద్రుఁడు జం
తుకలాపమానసదశా, ప్రకారసంవేది బాదరాయణుఁ డధిపా. 316

వ. గాంచి నిరూపించి యాకృష్ణద్వైపాయనుం డక్కీటకంబుతో నీవు భయంబున రయం బెసఁగం బాఱెదవు కారణం బేమి యని యడిగిన నది యమ్మునీంద్రున కి ట్లనియె. 317

తే. తెప్ప దెరలంగ బండు లేతెంచుచున్న
యవి మహాత్మ తన్నేమిజాతారవములుఁ
గడఁక నెడ్లను దఱిమి రొప్పెడునరాలి
యులివు విని యుల్లమునఁ గడునులుకు పుట్టె. 318

వ. బ్రతుకును జావును బరమసుఖంబును నత్యంతదుఃఖంబునుం గాదె కావున. 319

క. క్రందున మేను సిదియు నను, గొందలపా టొంది ప్రాణగొడ్డ మగుటఁ ద
ప్పం దొలఁగఁ బాఱెదను ముని, బృందారక [1]యసదె ప్రాణభీతి దలంపన్. 320

చ. అన విని దాని కిట్టు లను నమ్మహితాత్మకుఁ డెంతలెస్స నీ
మనికి దలంప నింద్రియసమాజసుఖంబులఁ బొందఁ గీటము
ల్గను టది లేదు దుఃఖబహుళం బిది యీయొడ లేల చావు నీ
కనయము సౌఖ్యకారి యగు నత్తెఱఁ గీవు దలంచి చూడుమా. 321

వ. అనుటయు నక్కీటంబు. 322

తే. అనఘ కీటంబులకు విషయజము లైన
సౌఖ్యములఁ బొంద లే దను చదువు గలదె
వినుము దమతమ తెరువుల ననుభవింపఁ
గలదు చావును భీతికిఁ గారణంబు. 323

వ. నీవు నామనం బరసి తింతియ కాక యింత యెఱుంగవే యది య ట్లుండె నా తెఱంగవధరింపు మేను దొలుమేన నొక్కశూద్రుండ ధనవంతుండ. 324

సీ. ఆచారహీనత యతిలోభ మన్యథ, నాపేక్ష క్రూరత యవినయంబు
మొద లైనదుర్గుణంబులకు నెల్లను నెల, వై యుండి మాతకు నధికభక్తిఁ
బ్రీతి యెప్పుడు నొనరింతు బ్రాహ్మణమాత్రుఁ, డతిథి యొక్కరుఁ డొకయప్పు డరుగు
దెంచిన నతనిఁ బూజించితి నది కార, ణముగ జాతిస్మరణంబు గలిగె

తే. మంచికర్మము సుఖము నొందించు టిపుడు, గాన వచ్చె మునీశ్వరకరుణ నాకు
నత్తెఱం గెఱిఁగింపవే యతివిశదము, గాఁగ ననవుడు నాతండు గారవమున. 325

వ. ఆజంతువుం గనుంగొని నీవు సెప్ప నేల దుష్కర్మకోటివలనం గీటంబ వగు టెఱింగితి భవదాచరితంబు లైనసత్కర్మంబులుం గాంచితి నమ్మేలునకు సంతో

1. క. గ. చ. 'యసుదె'.

పించి కాదె నీతో సంభాషించితి మదీయతపోవిశేషంబున నీవు నరకీటత్వం బపన
యించెద విషాదం బపనయింపుము తపోబలంబును గడచిన బలంబులుం గలవే
మనుష్యజన్మంబు నొంది మే లొనర్చెద ననుకోర్కి నీకుం బుట్టుట మేలు మాన
వులకుం గర్మభూమికృతంబు లైన సదసత్కర్మంబులం జూవె దేవతలును గీటంబు
లు నగుట వాటిల్లెడు నని పలికి వెండియు. 326

క. సుకృతము లమ్మెయిఁ గల్గుట, నకట జనిస్మృతియుఁ గల్గె న సత్త్వోంద
ర్యకతయు నీకు నొదవె నో, డకు మున్నతపదము విచ్చు రటకు మొయికొంటిన్. 327

వ. అత్తెఱం గాకర్ణింపుము. 328

—— వేదవ్యాసుఁడు కీటంబునకు నుత్తమజన్మములు గలుఁగ ననుగ్రహించుట. ——

ఆ. నీచశూద్రవైశ్యనృపజన్మములఁ గ్రమ, వృత్తి నొందు మెపుడుఁ జిత్తమునకుఁ
బుట్టెఱుంగునట్టి పోఁడిమి నొసఁగితి, ధర్మపరుఁడ వగుము దానఁ జేసి. 329

క. అని సాత్యవతేయుఁడు కృప, నెనసి సుధాధారఁ బోలు నీక్షణముం ద
త్తనువున నిగిడించిన న, మ్మునిపతిఁ గీర్తించె భూతములు ప్రీతము లై. 330

క. అక్కీటంబును భక్తిన్, మ్రొక్కి శిరం బతనిపాదముల మోపి మనం
బెక్కుడు ప్రమోదమునఁ గడుఁ, జొక్కఁగ దదనంతరమ యసువులం దొఱఁగెన్.

వ. కారుణికత్వధుర్యుం డగునప్పారాశర్యుం డట్లవలీల మే లొనర్చి కీటంబుఁ గృతా
ర్థంబుం జేసి నిజేచ్ఛం జనియె నదియు నమ్మహానుభావునిర్దేశించినతెఱంగున జని
యించుచు ననేకపుణ్యంబు లాచరించుచు నృపజన్మంబునం బూజ్యం బైనరా
జ్యంబు నొంది. 332

సీ. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ, రాఁ దురంగంబులు [1]రమణ యొప్ప
గొడుగులుం [2]బడగలు ముడివడ గాయక, వందిపాఠకులరవంబు లెసఁగ
భూషణంబులరత్నపుంజంబుదీప్తులు, దిక్కుల నెల్లను దీటుకొనఁగ
సామంతకవిజనసీమంతినీముఖ, పరివారవైభవస్ఫురణ మలర
తే. దేవపతివోలె సాత్యవతేయునాశ్ర, మమున కేతెంచి తత్పాదకమల మాత్మ
ముకుటసంగతముగఁ జాఁగి మ్రొక్కఁ గరుణ, నాతఁ డెత్తి తన్మస్తకమక్కు సేర్చె.

వ. ఇట్లత్యాదరంబున సంభావించి శిష్యజనంబు నియోగించి. 334

క. రాజన్యసముచితం బగు, పూజావిధి యాచరించి పురుషోత్తమ నీ
వీజన్మంబున నమ్ముని, రాజికి వెఱఁ గగుతపశ్చరణ మొందవనా. 335

క. గోవులకై యొండెను వి, ప్రావలికై యొండె నిర్భరాహవకేలీ
ప్రావీణ్యము మెఱసి విడువు, నీ వసువులు దాన నధికనిర్మలత యగున్. 336

వ. ఇట్లు నిష్కల్మషత్వంబు సిద్ధించిన. 337

క. ధరణీసురజననమహిమ, దొరకొను నీ కని విధించి దుర్దాంతరిపు

---

1. క. రవణ మొప్ప. 2. క. నుదరిండ్లు.

స్ఫురణహరణపరిణతు స, న్నరపతి వీడ్కొల్పె మునిజనసంఘులు పొగడన్. 338

తే. అతఁడు నానందసంభరితాంతరంగుఁ, డగుచు దండప్రణామంబు లాచరించి
యరిగి యమ్మునిచెప్పినయట్ల చేసి, భూమిసురజన్మలాభంబుఁ బొందె నధిప. 339

వ. ఇవ్విధంబున సద్ద్విజుం డై. 340

క. పుణ్యస్థలముల నెల్ల న, గణ్యము లగుయూపములు ప్రకాశములుగఁ గ
ర్మణ్యతయు వివిధరత్నహి, రణ్యాదికదానములను బ్రస్తుతి కెక్కన్. 341

తే. అధ్వరంబు లనేకంబు లాచరించి
యతఁడు మఱియును బాదరాయణునిఁ గాంచె
సదయచిత్తత నప్పరాశరసుతుండు
వీడుకొలుపంగఁ జని యశోవిభవ మెసఁగ. 342

క. వ్రతశీలతఁ బరఁగి తుదిన్, శతమఖునకు నగ్గలంపుసఖుఁ డై యమరా
ర్చితసంస్తుతభవ్యపద, స్థితి నవ్యయపరమసౌఖ్యసిద్ధిం దనరెన్. 343

వ. అని చెప్పి భీష్ముండు. 344

క. మనుజేంద్ర కురుక్షేత్రం, బున నద్భుతఘోరసమరమున సమ్మాఙ్క్యం
దనువులు దొఱఁగిననృపులకు, ననంతసుఖగతులు గల్గు టనుమానంబే. 345

వ. భవదీయబంధు లందఱు నూర్ధ్వలోకప్రాప్తుల నీ వేమియు ననుమానింపకు మని పలికినం బాండవాగ్రజుండు పరమసంతోషభరితాంతఃకరణుం డై సురసరిత్సూనుతో విద్యాతపోదానంబులలో నెయ్యది విశేషం బెఱింగింపవే యనుటయు నమ్మహీపతి నమ్మహామతి గౌరవంబునం గనుంగొని. 346

తే. వ్యాసమైత్రేయపుణ్యసంవాద మనఘ, వినిన నీప్రశ్నమునకు నది విశద మైన
యుత్తరం బగు నేకాగ్రచిత్తవృత్తి, వగుము నీ వని పల్కి యిట్లనియె నధిప.

వ్యాసమైత్రేయసంవాదము భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట.

సీ. వ్యాసమునీంద్రుండు వారణాసీపురి, కరిగి మున్ మైత్రేయుఁ డచట నునికి
నాతనియున్నెడ కప్రకాశతఁ జన్న, నెఱిఁగి యమ్మహితాత్ముఁ డెఱిఁగి భక్తిఁ
బూజించి యుత్కృష్టభోజనంబునఁ దృప్తి, సేసిన నధికవికాసరుచిర
ముఖుఁడై నయమ్మహామునిఁ జూచి మోదమ, గ్గలమయి మీయందుఁ గానఁబడియెఁ

తే. గారణం బేమొకో యని గారవమున, నాతఁ డడిగిన నతఁ డధికాదరమునఁ
దపము శ్రుత మాదిగాఁ గలధర్మకోటి, లోన నెల్లను నధికంబు దాన మనియె.

వ. అని మఱియును. 349

క. దానార్హవస్తువులలో, మానిత మన్నంబ యన్నమయము లసువులున్
మేనుఁ దదీయబలంబును, గాన బుధులు దానిఁ దద్ద గైకొండ్రు మదిన్. 350

క. తప ముల్లముకల్మషముల, నపగతములఁ జేయు విద్య కాస్పద మగు నా
తపసి మహితదానంబున, నుపచిత మగువిద్య తపము నుత్కర్షించున్. 351

క. కాన తపంబును విద్యయు, దానౌదాత్త్యప్రవర్ధితంబులు విద్యా
మానత్వం బచ్యుతుఁ గను, దానికి దీపంబు సద్విశిత ప్రవణులకున్. 352

ఉ. కావున నన్నదానమునఁ గా కెటు లుండు మహాప్రమోద మ
త్యావిలచిత్తుఁ డైనను మఱి యుత్తరదానమునన్ విశుద్ధస
ద్భావత నొందు నిక్క మని పల్కె నరేంద్ర తపంబు విద్యయున్
దైవతపూజనీయములు దానము వానికిఁ బోషకం బగున్. 353

క. అని శాంతనవుఁడు సెప్పిన, విని కౌంతేయాగ్రజుండు విమలమతీ యం
గనలసమాచారంబులు, వినంగ నే వలతుఁ జెప్పవే తెలియంగన్. 354

వ. అనిన నతండు కైకేయీశాండిలీసంవాదంబున నిది దెల్లం బగుం జెప్పెద విను
మని యి ట్లనియె. 355

తే. సుమన యనియెడు కైకేయి యమరపురము, నందు శాండిలిఁ గని భవ్యమైనదివ్య
పదవి యేవర్తనమునఁ జొప్పడియె నీకు, నతివ చెప్పుము నా కని యడిగె నధిప.

వ. అని యడిగిన యాయమ కయ్యంగన యి ట్లనియె. 357

సీ. మామకు నత్తకు మార్పల్క దేవపిత్రతిథిపూజనములయందు సొలయ
[1]నిలువాడఁ దలవాకి లెప్పుడు నెఱుఁగక, పెలుచ నవ్వక శుద్ధి వెలయ విప్ర
భిక్ష [2]యొపిక గల్గి పెట్టుచు వర్తింతు, వలయు కార్యములకు వెలఁది మగుడఁ
బతి వచ్చునప్పుడు భక్తియు వేడ్కయుఁ, బొదల నాసనపాద్యములను సుముఖ

ఆ. భావమునను సేవ వాటింతు బిడ్డల, శిశు వదలఁ దిట్టఁ జెట్టఁ గనియు
నాకు వేఱ ప్రియ మఱనఁగ లేదు పతిమెచ్చు, వంటకముల చవిగ వండి యిడుదు,

చ. వరుఁ డొకవెంట నెన్నఁడు ప్రవాసగతుం డగు నాఁటఁ గొలె న
ప్పురుషుఁడు వచ్చునంతకును బూవులు పూఁతలు మేలిచీర లా
భరణము లెక్కుడుంజవులపాకవిశేషము లాదరింప నె
ప్పరుసునఁ [3]గొల్చుఁ గూడురువబంధులకుం దగ నెమ్మి సల్పుదున్. 359

క. గోవులు మొద లగుతిర్య, గ్జీవులసుఖవృత్తు లరసి చెల్లింతు గృహ
శ్రీవర్తనంబునకుఁ బతి, భావము సంకటపడంగ బలుక నొకటియున్. 360

తే. అగ్ని యోపి రక్షింతు రహస్య మైన
దాని వెలిపుచ్చ గర్భంబు దాల్చి యున్న
యపుడు వాచవు లెల్లను నవులఁ బెట్టి
దాని కెయ్యవి పథ్యముల్ వానిఁ గొందు. 361

క. అని చెప్పి యట్టిచందం, బున నడచిన సతికి లోకములు రెండును సౌ
ఖ్యనిరూఢి యొసఁగుఁ బొగ డొందు నరుంధతివోలె నవ్వధూటి నరేంద్రా. 362

క. నృప యీయాఖ్యానము ప, ర్వపుదినమున భక్తిఁ జదువువారలు విను పు

1. అ. 'ఇలువడి'. 2. క. లెక్కటి యేన పెట్టుచు. 3. జ. గొల్చి కూడుగురుబంధు.

ణ్యపురుషులును నాయుశ్శ్రీ, లపరిమితము లొంది యమరు | లగుదురు పిదపన్.

వ. అనిన విని ధర్మనందనుండు సర్వశాస్త్రసారంబై శ్రేష్ఠంబగు ననుష్ఠేయం బెయ్యది పితామహా యనుగ్రహింపు మని యభ్యర్థించిన నాపగేయుండు కృపావిధేయుండై నారదపుండరీకసంవాదం బాకర్ణింపుము దాన నీయడిగినయర్థంబు దెలియును దీర్ఘపరుండును జపతత్పరుండును బుండరీకాభిధానుండును నైనమహాద్విజుం డొక్కయెడ నారదమహామునిం గని భక్తిం బ్రణతుండై యిత్తెఱంగున నడుగ నతం డతని కిట్లనియె. 364

నారదపుండరీకసంవాదం బనుపరమేతిహాసప్రకారము.

సీ. పరమేష్ఠి సెప్పిన|పరమధర్మం బల్ల, ఫణితి మహార్థంబు | భవ్యమతికి
శ్రోతవ్యమును బరి|జ్ఞాతవ్యమును దాని, విను ప్రకృతికిఁ బర | మనఁగఁబడిన
యిరువదేనగుతత్త్వ | మరయంగ జీవాత్ముఁ, డాతండ సర్వభూ|తాత్మకుండు
నరుఁ డన వెలుఁగు న|ప్పురుషునివలనన, కలిగి నారము లన | వెలసినట్టి

తే. యన్యతత్త్వంబు లతనికి | నయన మగుట
నతఁడు నారాయణుం డన | నతిశయిల్లు
విశ్వమును దనయంద యా|విర్భవింప
విలయ మొంద నద్దేవుండు | విభుతఁ బొల్చు. 365

క. పరమబ్రహ్మం బనఁగాఁ, బరతత్త్వం బనఁగఁ బరమ|పద మనఁగా నీ
శ్వరుఁ డన విష్ణుఁ డన జగ, ద్భరితత నారాయణుండు | దా వెలుఁగొందున్. 366

ఆ. అతఁడు వాసుదేవుఁ | డన నాత్మ యనఁగ వే, దాంతవాక్యబోధ్యుఁ | డై వెలుంగు
నరుల కప్పదములు | నామాంతరంబు ల, ర్థాంతరంబు లేని|యట్టి వనఘ. 367

ఆ. సర్వశాస్త్రవాక్య|సమితి నాలోకించి, మఱియు దృఢవిచార|మహిమఁ దెలిసి
నిశ్చయింపఁబడియె | సిద్ధ నారాయణు, నెపుడుఁ దలఁపవలయు | నిది యొకండ.

వ. కావున. 369

క. పరమానుష్ఠేయం బిది, నరోత్తమా నీవు నెపుడు | నారాయణుఁ ద
త్పరతఁ దలఁపు పొరకు సవి, స్తరశాస్త్రార్థముల క్రందు|దలపోఁతలకున్. 370

క. విను మొకయించుకసేపై, నను నారాయణునిఁ దలఁచి|నను సుగతిఁ గనుఁ
మనుజుఁ డనిన మది నెప్పుడు, నునిచినయాతనికి బ్రాతె | యుత్తమధిషణా. 371

క. ప్రణుత యగునమోనారా, యణాయ యనునక్షరాలి | నంతప్రాప్తి
క్షణమున జిహ్వకుఁ దెచ్చినఁ, బ్రణవార్థంబైనపదముఁ | బడయుదురు నరుల్.

క. నారాయణపదవాచ్యం, బారయ బ్రహ్మంబు దాని | ననిశము వినియున్
సారమతిం దలఁచియు నిం, పారఁగఁ బొగడియు రమించు | టతులహిత మగున్.

తే. విందు నారాయణపరాయ|ణుండు పాతకముల గెలిచి వెలుంగుటె | కాదు దన్ను
నాశ్రయించినవారికి | నతుల మైన, వెలుఁగు నొసఁగంగఁ జాలుట|వేధచేత. 374

క. చతురాశ్రమములలోపల, నతులమతీ యెందు నిలిచి | నతనికి భక్తిన్
మతిఁ గేశవుఁ గూర్పక స,ద్గతి పెఱుకర్మముల నేల | కల్గఁగ నేర్చున్. 375

క. కను టరిది యొండుమొయి వి,ష్ణుని భక్తిం గనుము నీవు | సువ్రత యద్దే
వుని వినుము భక్తవత్సలుఁ, డనునామము గలిమి దృశ్యుఁ | డగు భక్తులకున్. 376

క. అని నారదుఁ డుపదేశిం,చిన నానైష్ఠికుఁడు నియత | చిత్తుం డై వి
ష్ణుని నర్చించు సభక్తిక,మనవిశేషమున నెపుడు | మనుజాధీశా. 377

తే. శంఖచక్రగదాధరు | [1]శార్ఙ్గుఁ బుండ,రీకదళసన్నిభాక్షుఁ గి | రీటకుండ
లాభిరాము శ్రీవత్ససం | శోభివక్షుఁ, గౌస్తుభోజ్జ్వలుఁ గలలోనఁ | గను నతండు.

క. చిరకాలంబున సాక్షా,త్కారణంబును గల్గు దానఁ | గానని పదముం
బొరయని శుభముం గలవే, కురువర నీవు నతిభక్తిఁ | గొలుపుము విష్ణున్. 379

క. అనిన విని హర్షపూరం,బునఁ జిత్తము దేల ధర్మ | పుత్త్రుం డాశం
తనుసుతునకుఁ బ్రణమిల్లెం, దనువునఁ బులకాంకురప్ర | తతి జాదుకొనన్. 380

వ. ప్రణమిల్లి యతనితో దానప్రియవచనంబుల రెంటియందును నధికరంజనం
బెయ్యది సెప్పవే యనుటయు నద్దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లను
రెండును మంచి తెఱంగుల యెదిరిచందం బెఱింగి నడపునది దానంబు రంజకం
బగుట దెలుప వలవదు సామవాదంబుగుణంబు దెల్లం బగునట్టియితిహాసంబు
వినుము సెప్పెద బుద్ధిసంపన్నుం డగునొక్కబ్రాహ్మణుండు విజనం బగువనంబు
నం గార్యవశంబున మెలంగఁ దన్మాంసం బాహారంబు గొనుటకయి దారుణుం
డగు దానవుం డతనిం బట్టికొనిన సాంత్వనభాషణంబులు ప్రయోగించువాఁ
డయి యవ్విప్రుండు గలంకయుఁ గొందలంబును లేనిచందంబుతో నద్దానవు
నాననంబు గనుంగొనిన నాధైర్యధుర్యుం గనుంగొని తదీయం బగునుదాత్త
త్వంబునం జిత్తంబు రంజిల్లి యద్దనుజుం డద్ధరాదివిజునితో మదీయం బగు
ప్రశ్నంబునకు సదుత్తరం బిచ్చితేని నిన్ను విడిచెద ననుపలుకు వలికి తనశరీరంబు
డయ్యుటకు వెలుకం బాఱుటకుం గారణం బేమి యని యడిగిన నమ్మహీసుర
వరుండు వేగిరపడక కొండొకసేపు విచారించి మహాపురుషా నీయట్టికృపావరుం
డడుగం దోఁచిన తెఱంగునం జెప్పుట మేలు గాదె యాకర్ణింపు మని సౌముఖ్యంబు
నొంది. 381

సీ. చుట్టాల నీ దగు | చెట్టతనంబునఁ, బాసి పశ్చాత్తాప | పరుఁడ వగుట
లేమి గల్గిన దుర్ల | భామేయధనములు, గోరుట మొగమోట | గూరి యొరుని
చేఁ బడ్డనిన్ను గె | ల్చితి నని యాతఁ డు,బ్బుట కృప నుపకార | మునకుఁ బాత్ర
ముగ నీవు సేసినఁ | బురుషుఁ డామేల్ దన,యలఘుపౌరుషమునఁ | గలిగె ననుట

1. జ. జారు, పుండ.

ఆ. కుమతిజనులు నీదు।గుణములు గొనియాడ, సిగ్గువడుచు బుధుల।చేతఁ బొగడు
గాన మరగు చునికి । వీనిలో నొక్కటఁ, గార్శ్యపాండురతలు । గలుగు ననఘ.

వ. అని వెండియు. 383

సీ. ఉచితంబుగా నెఱి । నుగ్గడించినమాట, సభ యియ్యకొనమి వ।ల్లభకు నీదు
తప్పు తెల్లం బయి । తాపంబుఁ బొందంగఁ, దేర్పంగ నేరక । త్రిప్పికొనుట
నీసొమ్మునకు నోరుఁ । డాసించు చుండంగ, దానికిఁ దగ రక్ష । దలఁచు చునికి
దులువ పిమ్మట నిన్ను । దూషించుపలుకులు, కులజులు నిజముగాఁ । గొనుట నీవు

తే. మానుషంబుల నడపంగ।మాయ కానిఁ, గాఁగఁ జెలులు గాంచుట వగ।కలిమి పేర్మి
దాని వెలిపుచ్చనోపమి।వీన నొకటఁ, గార్శ్యపాండురత్వంబులు । గలుగు ననఘ.

వ. అని మఱియును. 385

సీ. భార్య పుత్త్రకుఁ డల్లుఁ । డార్యవృత్తము లేమిఁ, గ్రమ్మరించుట జన।కుండు దల్లి
సోదరుల్ నవయుట । యుర్వీసురుని గోవుఁ, దొలు మేనఁ జంపుట । దుష్టబుద్ధి
భూసురదేవార్థ।ములు పుచ్చికొనుట యర్థము గోలుపోక బాం।ధవులచావు
బాలిశు మొగమోటఁ । బనిగొనఁగాఁ దన, యశమున కంతరా।యంబు గలిమి

తే. పెద్దకాలంబు యత్నసం।పీడ నొంది, చెల్లఁ జేసినపని యొక్క।పొల్ల పగతు
చే నసిద్ధతఁ బొందుట । వీన నొకటఁ, గార్శ్యపాండురత్వంబులు । గలుగు ననఘ.

క. అని యి ట్లేర్పడఁ జెప్పిన, విని యద్దనుజపతి మెచ్చి । విడిచెం గుంతీ
తనయాగ్రజ భూసురు సాం, త్వన మిట్టిది యడుగు మింక । వలసినదానిన్. 387

వ. అనిన నజాతశత్త్రుండు గంగాపుత్త్రువదనంబునం జూడ్కి నిలిపి మోడ్చినకరంబులు
శిరంబునం గదియించి. 388

తే. మమ్ము సంసారవార్ధిపా।రమ్ముఁ జేర్చు, యానపాత్త్రంబు నీకరు।ణాతిశయము
యఖిలకల్మషములఁ బాపు।నట్టిదాని, వినఁగఁ గోరెద నొకపురా।వృత్తమనఘ. 389

క. మునిమనుజపతులసన్నిధి, నిను నీకృష్ణుండు మాన।నీయచరిత వే
డ్క నుపాసించుచు నున్నాఁ, డనుత్తమప్రీతి దాని । నాకర్ణింపన్. 390

క. సమ్మోదమ్మున నేనుం, దమ్ములునుం దేల సత్క।థాకథనపర
త్వ మ్మాదరింపు మునివ, ర్గమ్ము నృపచయమ్ముఁ బులక।రాజి వహింపన్. 391

వ. అనుటయు భీష్ముండు. 392

క. పుణ్యం బగునితిహాస మ, గణ్యగుణా నీకుఁ జెప్పఁ । గనుసుకృతముఁ గా
రుణ్యనిధి సర్వలోకశ, రణ్యుఁడు కృష్ణుఁడు వినువ।రంబుఁ బడసితిన్. 393

క. పారాశర్యాదిమునులు, నీరాజన్యులును వినికి । [1]యెంతకు లే దీ
గారాము నాకుఁ బరమో, దారపదావాప్తి గాదె । ధర్మతనూజా. 394

వ. నీయడిగినయట్టిదానికి నొకయితిహాసంబు గల దది యుమామహేశ్వరసంవాదం

1. క. యెంతయు లే దీ గారాము.

బనం బరఁగుఁ బౌరవోత్తమా యప్పురావృత్తంబు ప్రవర్తించుటకుం గతంబైన కథ మున్ను సెప్పి మఱి దానిం జెప్పిన నొప్పి యుండుం గావున నప్పరిపాటిం జెప్పెద నవధానపరుండ వయి యాకర్ణింపు మని పలికి హరికిం బరమభక్తిం బ్రణమిల్లి యప్పాండవముఖ్యముఖచంద్రికం దనవిలోచనచకోరంబు లాన నమ్మానవపతికి నమ్మాననీయమతి యి ట్లనియె. 395

భీష్ముఁడు ధర్మజునకు శ్రీకృష్ణునిచిత్రచరిత్రంబు సెప్పుట.

క. తనయునిఁ బడయుటకై తప, మొనరింపఁగ రుక్మిణియు సముత్సుకవృత్తిం
దనతో రాఁ దుహినాద్రికిఁ, జనియెం గృష్ణుండు మునులుసంతస మందన్. 396

వ. ఇట్లు సని ద్వాదశవార్షికవ్రతక్లిష్టుం డై యున్నకృష్ణుం గాన మునీంద్రులు నారదపర్వతవ్యాసవాల్మీకిదేవలకాశ్యపప్రభృతులు శిష్యవర్గంబుతోవచ్చినవారలం బాద్యాసనాదిసముచితార్చనంబుల సంభావించిన వార లద్దేవునిం బరివేష్టించి పుణ్యగోష్ఠి నడపు చున్నసమయంబున. 397

తే. అతనిముఖమున వెడలి మహాగ్ని యమ్మ,హీధరమువిపినంబుల నేర్చెఁ బక్షి
మృగయుతంబుగ సిద్ధసాధ్యగణములు స,మాకులత్వంబుఁ బొందఁ బెల్లడరియధిప.

క. ఆకృష్ణుఁడు నిజసౌమ్యా,లోకనమున నాశిఖిని మఱలుగఁ జేసెం బూ
ర్వాకారత నవ్వనము ని,రాకులతం బొల్చె నది మహాద్భుత మయ్యెన్. 399

తే. దాని కమ్మును లెల్లఁ జిత్తమున భయము,విస్మయంబును బెనఁగొన వెఱఁగుపాటు
గదిరి చిత్రరూపంబులకరణి నుండ, వారిఁ గన్గొని రుక్మిణీవల్లభుండు. 400

వ. మీ రీయనలంబు తెఱం గేమిగా నెఱింగితి రున్నరూ పెఱింగింప వలయు ననుటయు వారలు సభక్తికంబు లగుచిత్తంబులతోడ. 401

క. దేవా విశ్వము గలుగుట, నీవలనన యడఁగుటయును నీయంద భవ
ద్భావాధీనమ సకల,స్థావరజంగమసమాహితత్వం బెల్లన్. 402

తే. నీవు మమ్ము బోధింపఁగా నేర్తు గాక, యిమ్మహానలస్ఫురణంబు నిట్టి దనఁగ
నేము నేర్తుమె యేమియో యెఱుంగ కునికిఁ,గాదె నివ్వెఱపడితిమి కమలనాభ.

వ. అనుటయు భవదీయచేతఃప్రసన్నత గాదె జగంబులవర్తనంబులకు నాధారంబు.

క. కావున మీకుం బ్రియముగ, నీవహ్ని తెఱంగు దెలియ నెఱిఁగించెదఁ జి
త్తావిలత విడువుఁ డని కమ,లావరుఁ డి ట్లనియె వారలకుఁ గురువర్యా. 405

క. ఒకదానవుఁడు జగన్నా,శకుఁ డిత్తఱిఁ గలఁడు వానిఁ జంపుట కేఁ బూ
నక యునికి గలిగె వాఁ డ,స్త్రకళావిదుఁ డగుట నాకతంబున నగుటన్. 406

క. కడుఁ గ్రొవ్వి వాఁడు లోకము, నుకుకులఁ బెట్టంగ విసివి యుగ్రతపమునం
గొడుకుఁ బడసి యద్దనుజునిఁ, బొడవడఁగింపం దలంచి భూరివ్రతమున్. 407

చ. నడప మదాత్మ యగ్ని యయి నావదనంబున నిర్గమించి మె
క్కుడుపడి పద్మగర్భకడకుం జనె నమ్మహితుండు మన్మథుం

గాడుకుగఁ బంచి వే తను [1]మఱుగుడ్పుఁగ వచ్చెఁ గడంగి పోవున
ప్పుడు వన మేర్చె నేను గృపఁ బూర్వవిధం బొడఁగూడఁ జూచితిన్. 408

వ. ఇది యద్దహాసంబు తెఱంగని చెప్పి యప్పరమపురుషుం డమ్మునివరులతో మఱి
యును. 409

సీ. లోకత్రయంబున మీకు నవిదితంబు, లేదు త్రికాలసంవేదులార
యుత్తమం బగుపురావృత్తంబు సెప్పి కృ,తార్థుఁ జేయుండు నన్ననిన వారు
సవినయంబుగఁ గృతాంజలు లయి మ మ్మింత, పెద్దసేయుదె నీవు పెద్దలకును
బెద్ద వయత్నసంభృతజగత్త్రయుఁడవు, విశ్వప్రకారసంవిదుఁడ వేము
తే. నీయెఱుంగనియితిహాస మేయుగమున, నెఱిఁగి చెప్పంగ మనపుడుఁ జెఱుతనగవు
మోమునకుఁ జెన్ను సేయ నమ్మురహరుండు, వారలకు నిట్టులనుఁ గురువంశవర్య.

క. మానుషయోని జనించితిఁ, గాన మదీయ మగుబుద్ధిగౌరవము తదీ
యానుగుణత్వోపహితము,గా నెఱుఁగుఁడు మీరు సెప్పుకత విను టసదే. 411

చ. అనుటయు వార లందఱుఁ బ్రియంబున దానికి నియ్యకొన్న నె
మ్మనములతోడ నీపనికి మాన్యచరిత్రుఁడు నారదుండ త
క్కినపెఱవారు సాలరు ప్రకీర్త్యవివేకుఁడు కృష్ణుఁ డర్థితో
వినఁగఁ బురాతనం బయినవృత్తము నిమ్ముని సెప్పు టొప్పగున్. 412

చ. అని తగ నేకవాక్యతఁ బ్రియంబున నాతనితోడ నీవు ముం
గనినది విన్నయట్టిది ప్రకామకుతూహలచిత్తుఁ డైనకృ
ష్ణుని వినిపింపు నావుడు మనోజ్ఞకథాకథనంబునందు వే
డ్క నిగుడ నమ్మునీంద్రుఁడు వికాసమునం మొగ ముల్లసిల్లఁగన్. 413

### ఉమామహేశ్వరసంవాదం బనునితిహాసము.

క. నారాయణసౌహార్దో,దారత్వవిభూతి మున్న తనకుఁ గలిమి న
న్నారాయణునిమనోరథ, మారం బూరించె శంకరాంబికలకథన్. 414

వ. అత్తెఱంగు వివరించెదనట్లు సమస్తసంయమిసంఘంబును బ్రస్తుతిపూర్వకంబుగా
నియోగింపం బ్రియంబునం బురాతనకథాకథనంబునకుం బూని యద్దేవముని య
ద్దేవకీనందనునకు వందనం బాచరించి తదభివందనంబు వడసి యవ్విభున కి
ట్లనియె. 415

తే. తీర్థభజనంబునకు నెందుఁ దిరుగు చుండి, యిత్తుషారనగంబున కేను వచ్చి
కంటి రమణీయ మగుకేళికావనంబు, సకలతరువల్లరీగుల్మచారుతలము. 416

క. కోకిలకులగంధర్వా,నీకధ్వను లెనసి బెరసి నిగుడఁగ నమరీ
లోకభ్రమరీమండలి,కాకలకలనాదములును గలసి చెలంగన్. 417

వ. ఒప్పునవ్వనంబునం గనకస్థలంబున శార్దూలచర్మవసనభుజగాభరణభసితాంగరాగ

---

1. క. గ. చ. జ. 'మగుడ్చిన వచ్చె'.

విరచితాలంకారచారుదివ్యదేహుండగుమహాదేవుండుసురసిద్ధసాధ్యవిద్యాధరముని
పుంగవభూతగణపరివృతుండయియున్న నప్పేరోలగంబున నేనునుసముచితప్రకా
రంబున నయ్యనిరూపణీయప్రకారుం గొల్చి యుండితి నట్టిసమయంబున. 418

సీ. పుణ్యాంగనాకార। ములు దాల్చి పుణ్యన,దీనివహంబులు । దిశలు గొల్చి
చనుదేర శంకర।సదృశపరిష్కార,కల్యాణతను వైన। గౌరి వచ్చి
వెనుకదిక్కున మెలు।పునఁ జేరి మోమున, కలఁతిన వ్వీనుమడి। చెలువు నొసఁగఁ
దమ్మిఱేకుల నుల్ల।సమ్మాడుతనమ్ము,కరయుగ్మమునను శం।కరునినేత్ర

ఆ. యుగ్మ [1]మల్ల మూసి । యున్నంత లోక మ
సర్కచంద్రతార।కాగ్ని వై మ
హాంధకారమగ్న। మగుటయు సంక్షోభ
మందె భూతసముద।యంబు లెల్ల. 419

ఉ. అప్పుడు ఫాలలోచనము । నప్పరమేశుఁడు విచ్చె విచ్చినం
గప్పెఁ దదగ్నిజిహ్వలు న।గం బఖిలంబును గౌరిదేవి య
ట్లొప్పమి దండ్రి కైనఁ గని । యుల్లము బెగ్గిల నీశునంఘ్రిలం
గప్పఁగ మౌళిభూషణము।కాంతి ప్రణామము సేసెఁ జేసినన్. 420

ఆ. హరుఁడు కరుణఁ జూడ । నాహిమవన్నగ,దాహ ముడిగి శోభి।తత్వ మొలసె
నార్య పరమవిస్మ।యముఁబొంది యాసర్వ,భువనకర్తతోడ।సవినయముగ. 421

సీ. నిటలంబుకను దెఱ।చుటకుఁ గారణ మేమి, సర్వేశ యిది రహ।స్యంబు గాక
యున్నేనిఁ జెప్పవే । యన్న నద్దేవుండు, కాంత నీ కెఱిఁగింపఁ । గానియట్టి
పని యెందుఁ గల్గునే। వినుము లోకాత్మక,త్వము నాకుఁ గల్గుట।వలనఁ జేసి
న న్నేది వొందిన । నన్నిలోకంబుల, నది వొందుఁ గాన నా।యంబకములు

తే. నీవు మూయంగఁ దిమిరంబు । నిఖిలలోక
చయముఁ గప్పిన భూతముల్ । భయముఁ బొందె
నీకరంబులు ద్రోవక । చీఁకటియును
జెఱచుటకు ఫాలనేత్రంబు । దెఱవ వలసె. 422

వ. అనిన విని యంబిక దనకు నడుగవలయునట్టివి యడుగుటకు నది యవసరంబుగాఁ
గనికొని యక్కపర్ది కి ట్లనియె. 423

క. నాలుగుముఖములు నీకు, న్ఫాలనయన కలుగఁ గార।ణం బేమి [2]మధు
శ్రీలాలిత్యాస్పదవా,క్యాలీకలనమున నాకు । నానతి యీవే. 424

వ. అనిన విని యమ్మహాదేవికి నద్దేవుం డి ట్లను దైత్యులు సుందోపసుందు లన
నిర్వురు గలరు వార లవార్యభుజవీర్యశౌర్యసంపన్నులు నస్త్రశస్త్రావధ్యులు

1. చ. మెలమి. 2. క. మృదుశ్రీ.

నై యుండుదురు వారలవినాశంబునకై మయుండు లోకంబులం గలయొప్పులం
దెల్ల నుత్తమసారంబులు తిల ప్రమాణంబు లాహరించి యొక్క కామినిం గావించి
తిలోత్తమ యనుపే రిడి నాకడకుం దెచ్చిన నచ్చెలువ నాకుం బ్రదక్షిణంబుగా
వచ్చునెడ నే నిది దేవకార్యంబు సేయ నోపుం బో మ్మనుతలంపుతోడ నత్తరుణి
దిరిగినదిక్కు దిక్కున కొక్కొక్క మొగంబు దాల్చి దానిం బరీక్షించితి నాఁటం
గోలెఁ జతుర్ముఖుండ నై యుండుదు. 425

చ. అన విని గౌరి నీకు భువన ఽ నాధిప కంఠమునందుఁ గప్పు గ
ల్గినకత యేమి నాకు నెఱిఁ ఽ గింపుము నావుడు దేవదైత్యు లం
బునిధి సుధార్థ మై తరువఁ ఽ బుట్టి విషంబు త్రిలోకభీకరం
బనితరసాధ్య మై యొదవిన ఽ త్తఱిఁ దాల్చితి దానిఁ గుత్తుకన్. 426

తే. అట్లు కంఠంబునందు మ ఽ హావిషంబుఁ, దాల్ప నీలత గల్గిన ఽ దానఁ జేసి
కమలజాదిసురులు నీల ఽ కంఠుఁడనుచు, నన్నుఁ గొనియాడిరప్పుడు ఽ నలినవదన. 427

వ. అని చెప్పి శంకరుం డింక నేమి యడుగ వల తడుగు మనుటయుఁ బినాకం బెల్ల
యాయుధంబులకంటె మెచ్చి పట్టుదు దీనికిం గతం బెయ్యది యని యడిగిన నా
మృడుం డామృడాని కి ట్లనియె. 428

సీ. ఆదియుగంబున ఽ నబల కణ్వుం డను,సంయమి తపము నిఠ ఽ స్థానిరూఢి
మెఱుఁ జేయఁ బెఱిఁగె వ ఽ ల్మీకంబు తనువు ము,నుంగ నప్పుట్ట వే ఽ ణువును బుట్టె
విను లోకసామాన్య ఽ ఘనత గా కుండ మ,హోద్భుతాయామంబు ఽ నధిక మైన
పరిణాహమును గల్గె ఽ బ్రహ్మ యమ్మునికిఁ బ్ర,త్యక్షు మై వర మిచ్చె ఽ నతనిమీఁదఁ

ఆ. బెఱిఁగియున్న వెదురు ఽ గర మర్థిఁ దాఁ బుచ్చి,కొని జగద్ధితంబు ఽ గోరి చేసె
నాకు విష్ణునకుఁ బి ఽ నాక శార్జ్గము లగ్ర,ఖండమున నొనర్చె ఽ గాండివంబు.429

వ. ఇవ్విధంబున విండ్లు మూఁడు గావించి లోకహితం బాచరించి యవ్విరించి య
మ్మూఁడవవిల్లు దాఁ గైకొని తనలోకంబునకుం జనియె నిది పినాకంబుసంభావ
నీయం బైన తెఱం గని చెప్పిన. 430

క. విని గిరితనూజ పెఱవా,హనముల నొల్లక వృషంబు ఽ నఖిలేశ్వర నె
మ్మనమునఁ గైకొని యెక్కుదు, వినఁగా నే వలతుఁ జెప్పు ఽ వే కారణమున్. 431

వ. అనిన నద్దేవుం డమ్మహాదేవి కి ట్లనియె. 432

సీ. హిమవన్నగంబునం ఽ దేను లోకహితార్థ, మైనమహాతప ఽ మాచరింప
గోవులు సుట్టుఁ దేఁ ఽ కువ సెడి తిరిగి నన్, సంకటపెట్టినఁ ఽ బంకజాక్షి
కోపించి చూడ సం ఽ తాపాకులత్వంబుఁ, బొందె గోకుల మర ఽ విందభవుఁడు
నమరులుఁ జనుదెంచి ఽ ప్రార్థించి వృషముఁ గా,నిక యిచ్చి కరుణ జ ఽ నింపఁ బలికి

1. క. ము,నుఁగఁ గప్పుటయును వే♦ణువును.

తే. నాకు గోపతి యనియెడు నామ మిచ్చి
రపుడు గోబాధ మాన్చి రయ్యమలవృషము
వాహనముఁ గేతువును గా శివప్రచార
మాచరింతు నెల్లెడ నది యాది గాఁగ. 433

వ. అనుటయు నంబిక యప్పరమేశుతో నీవు పరమశుచులును రమణీయంబులు నగు నివాసంబుల వసియింపక యశుచియుఁ గేశాస్థికపాలదుర్గంధదుర్దర్శంబు నైన శ్మశానంబున నునికికిఁ గతం బేమి యనిన నతం డిట్లనియె. 434

శివుఁడు పార్వతికిఁ దనశ్మశానవాసితకుఁ గారణంబు సెప్పుట.

ఉ. క్రూరపుభూతముల్ జనుల ఘోరవిధంబుల ముట్టి యెప్పుడున్
మారణ మాచరింపఁగ సమస్తజనంబులు నాశ మొందఁగా
వారిజసంభవుం డెఱిఁగి వచ్చి నను౦ దగఁ గాంచి తత్ప్రతీ
కారము సేఁతకై వినయగౌరవ మొప్పఁగ వేఁడె వేఁడినన్. 435

వ. నిశ్చితంబుగా నొక్కెడ నుండి లోకంబులు రక్షింప వలయు నని తలంచితి నట్టి యెడ. 436

తే. మోక్షపరులు శుచిస్థానముగఁ బ్రశంస, సేయుదురు విజనత్వవిశేష మెఱిఁగి
కాన యిం పై శ్మశానంబు మానసమున, నొలసెఁ గావున నయ్యెడ నునికి గలిగె.

చ. అచటన యుండి లోకముల నన్నిటి నాత్మఁ దలంచి రక్ష సే
యుచు విహరింతు భూతచయ మొక్కటఁ గూడి చరించు చున్కికిం
బ్రచురకుతూహలుండ నయి రాగముఁ బొందుదు నట్లు గాన నా
కచటు నివాస మయ్యె విను మన్యతలంబులు దానిఁ బోలునే. 438

తే. అనిన భసితాంగరాగంబు నస్థిఫణధ, రాభరణములుఁ బరశుశూలాయుధములు
నై మహోగ్రత భీకర మైనరూప, మభవ యేల కైకొంటి వీ వనియె గిరిజ.

వ. అనుటయు నమ్మహేశ్వరుం డాపరమేశ్వరితోడ. 440

సీ. లోకస్వరూపంబు లోలాక్షి రెండువి, ధమ్ములు శీత ముష్ణమ్ము నాఁగఁ
జను నివి రెంటను సకలంబు గ్రథిత మై, యుండు సౌమ్యాగ్నేయ యోగకలిత
మఖిలజగంబు సౌమ్యము విష్ణుఁ డాగ్నేయ, మేను వహింతు మయ్యిరు దెఱంగు
నెనయుటఁ గాని భరియింతు నే విశ్వంబుఁ, గావున నాగ్నేయ భావరూఢ
తే. మైనయాకృతి లోకహితార్థముగ వ, హించినాఁడ నిం కెయ్యది యీవు నన్ను
నడిగెదడుగుము నావుడు నార్య సోముఁ, దలఁ బ్రియంబున నేటికిఁ దాల్చితనియె.

చ. అనవుడు దక్షుయజ్ఞమున కల్గిననాఁడు సురాలి కేను బీ
డన మొనరించుచోట వికటంబుగ సోముని మేను ద్రొక్కఁగా
నను శరణంబు వేఁడిన మనంబున నక్కటికంబు వుట్టి చే
సినదురితంబు సోము నిటు సేయక పో దని మౌళిఁ దాల్చితిన్. 442

చ. అన విని కొల్చి యున్నమును ǂ లందఱు నీశుదయావిశేషము
న్మనముల మెచ్చి పొంగి యభి ǂ నందనపూర్వము గాఁగ భక్తియుక్
వినయము నుల్లసిల్లఁ బది ǂ వేలవిధంబులఁ బ్రస్తుతించి ర
య్యనుపమధాము గౌరి సమ ǂ యం బిది నా కని మోడ్పుఁగేలితోన్. 443

తే. లోలలోచనదీప్తులు ǂ బాలచంద్ర,భూషణునివదనంబునఁ ǂ బొలయ మునుల
మానసంబులు సంప్రీతి ǂ నూన సాంత్వ,నస్వరంబున ని ట్లను ǂ నలిననాభ. 444

క. వర్ణాశ్రమధర్మము లభి,వర్ణింపుము వేదనిరత ǂ వత్సల యవి నా
కర్ణములతో నఖిలజన,కర్ణంబులఁ బొంది పుణ్య ǂ కర్తృత యొసఁగున్. 445

వ. అనియె నని యిట్లు గౌరి లోకహితార్థంబుగా వర్ణాశ్రమధర్మంబులు పరమేశ్వరు నడుగుటయు నారదముని కృష్ణునకుం జెప్పిన తెఱంగు భీష్ముండు ధర్మజునకుఁ జెప్పుట యుపన్యసించిన నాకర్ణించి. 446

క. మునివర నా దగుచిత్తం,బునఁ గౌతూహలము సాల ǂ మొలతెంచి తలి
ర్పన [1]నెలరారెడు నేర్పడ, వినిపింపుము మీఁదికథ స ǂ విస్తారముగన్. 447

వ. అని యడుగుటయు. 448

మ. [2]స్ఫుటతత్త్వోదయసంభృతైకమధురా ǂ భూతైకరక్షాధురా
తటినీపింఛమనోజ్ఞమౌళిలలితా ǂ దాంతాత్మసంకీలితా
త్రుటితాతత్త్వసమున్నతా శ్రితజనా ǂ దూరాంజనా సువ్రతో
త్కటశీలావనలోలదివ్యహృదయా ǂ [3]ధర్మప్రసన్నోదయా. 449

క. దేహాభిమానసంభృత,మోహతమోనిరసనాభి ǂ ముఖభూరివివే
కాహీనమహాతత్త్వస,మాహితచిన్మాత్రరూప ǂ మధురిమసుభగా. 450

మాలిని. త్వరితవిహితగాఢ ǂ ధ్యాయిసమ్మోదవాదా
స్ఫురదరిదృఢశూల ǂ స్ఫూర్తిసంశస్తహస్తా
తరణిశశిమయత్వో ǂ దారతాచిత్రనేత్రా
పరమనియతినిష్ఠా ǂ భవ్యహృత్పద్మసద్మా. 451

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబునయానుశాసనికపర్వంబు నందుఁ జతుర్థాశ్వాసము. 452



1. చ. నలరారెడు. 2. క. స్ఫుటితత్త్వామలసంభృతైక్యమధురా. 3. గ. ధర్మప్రసంపద్ధయా చ. ధర్మప్రతీపాలయా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనికపర్వము, పంచమాశ్వాసము.





కాళీత్వాదరసు
శ్లోకాలోకనవిలాస[1]సుస్థిరభవనా
శోకముదాద్యవధూత్రి
వ్యాకోశవివేకభవన హరిహరనాథా. 1

### శివుఁడు పార్వతికి వర్ణాశ్రమాచారంబుల తెఱంగెఱింగించుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. అట్లు గంగాత్మజుండు ధర్మాత్మజునకుఁ, జెప్పి యిట్లనుఁ గౌరవశ్రేష్ఠ పద్మ
నాభుతో నవ్విధంబున నారదుండు, పార్వతీదేవిప్రశ్న ముపన్యసించి. 3

వ. ఇట్లనియె నప్పర్వతరాజపుత్త్రి ప్రార్థించిన నప్పరమేశ్వరుఁడు పరమాదరభరి
తుం డై. 4

సీ. అజుఁడు మున్ను లోకహితార్థంబుగా బ్రాహ్మణులను సృజించి రాజులను వైశ్య
లను శూద్రులను గ్రమం బొనరంగఁ గల్పించె, నాజాతులకు నోలినతనిముఖము
బాహులు నూరులుఁ బదములు సంభవస్థానంబు లగుటయుఁ దారతమ్య
భాగిను లగు నని పార్వతి కాతండు, తత్తదాచరణీయధర్మములును

ఆ. వినుము విస్తరించె విప్రులు లోకధారకులు వారియెడఁ బరాభవంబు
సేత యెల్లచేటుఁ జేయు సమ్మానదానములు సకలశోభనము నొనర్చు. 5

చ. ప్రియ మఱి యజ్ఞునేనియు దరిద్రునినేనియు విప్రుఁ గందఁ జే
త యుభయలోకసౌఖ్యములు దవ్వఁగఁ జేయుఁ దదీయ మైననిం
దయు నను బెట్టు దిట్టుట యధర్మత నాతనిసొమ్ము పుచ్చికొం
టయును మదర్థముం గొనుట డాఁపక చెప్పితి [2]నిక్క మింతయున్. 6

వ. అని పలికి యిట్లనియె. 7

---

1. క. సుస్థిరభువనా. 2. గ. దోష మింత.

సీ. అధ్యయనంబును యజనంబు దానంబు, నధ్యాపనంబును యాజనముఁ బ్ర
తిగ్రహంబును బ్రశాంతియుఁ దపస్సత్యశౌ,చంబులు విప్రధర్మంబు లాప
దలఁ దక్క నతనికి వలవదు వాణిజ్య, మగ్నికార్యంబు శూద్రాన్నవర్జ
నము నిజదారసంగమనియమంబును, నిరుప్రొద్దు గుడుపును హింస లేమి
ఆ. యును నివాసశుద్ధియును నతిథిప్రియ,త్వంబు బ్రాహ్మణులకు వలయుఁ దపము
పేర్మిసాధనముగ ధర్మమూలముగ వా,రల సృజించెఁ గాదె నలినభవుఁడు. 8
ఆ. క్షత్త్రియులకు విప్రసంరక్ష ముఖ్యధ,ర్మంబు ధరణి వారిరక్షణమునఁ
గాని బ్రదుక దమ్మహానుభావులపాల,నంబు సేయ శోభనంబు నొందు. 9
క. రమణీ యధ్యయనము యజ,నము దానము సాధుపోషణము దుర్జనులన్
దమియించుటయు సముత్సా,హముకల్మియు ధృతియు నృపుల కగుధర్మంబుల్.
తే. శస్త్రజీవికయును నరిషష్ఠభాగ,మాహరించుటయును భృత్యు నరయుటయును
బ్రజవివాదంబు వినుచోటఁ బక్షపాతి, గామియును రాజులకుఁ గృత్యకర్మకోటి.
సీ. వణిజులు లోకప్రవర్తనంబుల కెల్ల, నుపకారకులు కృషియును ననేక
భంగి బేహారంబుఁ బసులఁ బెంచుటయుఁ గృ,త్యంబులు వారల కధ్యయనము
యజనంబు దానంబు సర్వాకర్మంబులు, త్రైవర్ణికద్విజత్వమ్ముకతన
నాతిథ్యములు విధేయములు వారికిఁ దిల,గంధరసములవిక్రయము దగదు
తే. మూఁడుజాతులకు శుశ్రూషమూలకార్య,గతి తదుపయుక్తిశూద్రులకలిమి నడచు
వారు శుశ్రూషకులు విప్రవందనంబు,వినయమక్రూరులగుట తద్విహితకృతులు.
క. తనతనవర్ణంబునకుఁ ద,గినయాచారంబు నడపి కిల్బిషరహితుం
డనఁ బరఁగు నెల్లవారికి, విను మున్ననుజన్మసౌఖ్యవిభవము గల్గున్. 13
వ. ఇవి వర్ణధర్మప్రకారంబు లింక నాశ్రమధర్మంబులు వివరించెద నాకర్ణింపుమని
పలికి పార్వతికిఁ బరమేశ్వరుం డిట్లనియె. 14
సీ. బ్రహ్మచర్యవ్రతపరమనిష్ఠయు గురు, నాశ్రయించుటయు నధ్యయనకృతియు
నగ్నికార్యంబు గుర్వర్థసంచారంబు, భైక్షచర్యయుఁ గమలాక్షి బ్రహ్మ
చారిధర్మంబు లాశ్రమముల కెల్ల నా,శ్రయణీయ మై గృహస్థత్వ మొప్పు
శౌచంబు నిజదారసంతుష్టియును బంచ,యజ్ఞంబులును నిగమాభిరతియు
తే. దానహోమదయాతిథిమాననములు, వలయు గృహమేధికిని వనవాసవన్య
భోజనబ్రహ్మచర్యజటాజినప్ర,ధారణములు వానప్రస్థధర్మకోటి. 15
చ. కినియమి సంగవర్జన మకించనభావము దాల్మి విప్రవా
సనము ప్రశాంతి యార్జవము శౌచము సద్వ్రతనిష్ఠ భైక్షభో
జన మిల నిద్ర సేత కృప సంతతతత్త్వవిచింతనంబు మా
నిని యతిధర్మముల్ శ్రుతి గణించినభంగిన యేను జెప్పితిన్. 16
వ. అని యిట్లాశ్రమధర్మంబులు సెప్పిన విని యప్పరమేశ్వరుతోఁ బార్వతి తపంబు

తపం బనుచు మునిజనంబు లాచరింతురు దాని తెఱం గెఱింగింపవే యనిన
నద్దేవుం డి ట్లనియె. 17

శివుఁడు పార్వతికిఁ దపస్స్వరూపంబు సెప్పుట.

సీ. భోగార్థు లై తపంబునకుఁ జొత్తురు తపం, బనఁగ వానప్రస్థు లాచరించు
ధర్మంబు లింద్రియకర్మనిగ్రహముతో, నుభయకాలమునను యోగసేవ
ఫలకాంక్షఁ జేత తపస్స్వరూపంబుగా, నడపి కాలం బైన నాకమునకు
నరిగి తద్భోగంబు లనుభవింతురు పుణ్య, మవసిత మగుడు మర్త్యత్వ మొంద
తే. వత్తు రధికనియతి నుపవాసములను, జపముఁ బంచాగ్నిమధ్యవాసంబుఁ గలుగు
తపముఁ గలదప్సరఃప్రియత్వంబొనర్చుఁ, గర్తకదివాఁడుఁదుదివచ్చుఁగానిమరలి.
వ. అని చెప్పి మఱియు 19

ఉ. దారయుతంబుగా నడచు తాపసముఖ్యు లహింసపేర్మికై
కారుణికత్వ మగ్గలము గల్గి తలంతురు సర్వజీవులుం
దారును నొక్కరూపుగఁ బరిదంపడి పుత్త్రకళత్త్రయుక్తిఁ బెం
పారుదు రూర్ధ్వలోకమున నజ్జనముల్ మఱి వచ్చుఁ గ్రమ్మఱన్. 20
వ. అనిన భవాని వనవాసవ్రతవిశేషంబులుం దదీయఫలప్రకారంబులు నేర్పడ నాన
తీయవే యనుటయు నభవుండు భరితాదరుం డై. 21
సీ. ఉపవాసములు మౌన ముర్వీశయత్వ మా, సన మూర్ధ్వబాహుకస్థాపనంబు
నియమితాహారత్వనిష్ఠ క్రమంబున, శశిమరుద్యక్షవాసముల నిలుపు
గంధర్వదేవనాగస్థానముల నున్కి, యును బహుసౌఖ్యసంయుతము గాఁగ
నానాసహస్రాబ్దమాననీయంబుగఁ, గావించు సంక్షేపగణనఁ గొన్ని
తే. మహితనియతులు సెప్పితి మఱియు నేమి, వ్రతము సలిపినఁ బాపనిర్హరణ మగుటఁ
బుణ్యగతికల్మి దప్ప దరణ్యవాసి, కడుగు మింకను వలసినయట్టి వనుడు. 22
క. యాయావరుల నమరవం, ద్యా యేర్పడఁ జెప్పు మనియె నంబిక దేవుం
డాయమ కి ట్లనుఁ దీర్థప, రాయణు లుపవాసవిధిసమధికులు వారల్. 23
వ. అది యె ట్లం టేని. 24

క. నానాతీర్థసతతసు, స్నానంబులఁ బల్ల లై జడలును భిక్షా
నూనోపవాసకృశ మగు, మేనులు నై వారితపము మిక్కిలి మెఱయున్. 25
క. మాసోపవాసవిధులం, జేసి తృణజధాన్యభుక్తి సెల్లింతురు వా
రేసురలకు లేనిసుఖా, వాసమ్ములఁ జరితములను వఱలుదురు దుదిన్. 26
వ. అనిన విని యవ్వనితారత్నంబు వైఖానసులవిధంబు వివరింపు మనుటయు న
వ్విరూపాక్షుండు. 27
సీ. వైఖానసులు ఖరవ్రతు లెట్టు లంటేని, శిలఁ దృణధాన్యముల్ సిదుక నడిచి

కొండఱు పండులఁ గొఱికి కొండఱు [1]గన్న,గుఱుముల గువ్వలఁ దెఱఁగు దోఁపఁ
నప్పటికప్పటి కాననంబున వైచి,కొని కొంద ఱాకు లెండినవి యేఱి
కొని కొండఱంబువుల్ గొని కొంద ఱనిలంబు, గొంద ఱాహారంబుఁ గొందు రట్లుఁ

తే. గాక యాహారపరులును గలరు వార
లింద్రునకుఁ బూజనీయు లై యెక్కు డైన
పదవిఁ జిరకాలబహుసౌఖ్యభాగు లగుదు
రని మహేశ్వరుఁ డుమకు ని ట్లనియె మఱియు. 28

వ. ఇవి యెల్లను వానప్రస్థనియమనిష్ఠాభేదంబులు తపంబు తపం బని మును లాచ
రింతురు దాని తెఱం గెఱింగింపు మని నీవు దొల్త నడిగి(నవిధంబు)నం దొడంగి
నాచెప్పినవిధంబు లన్నియుం దపం బనుశబ్దంబున కర్థంబు లై యుండు నని చెప్పి
యంగుష్ఠప్రమాణదేహులు మృగాజినవసనులు నిర్ద్వంద్వులు నై వాలఖిల్యు
లను పేరం బ్రసిద్ధు లగుమునులు దినకరదీప్తులతోడం గూడి వర్తించుచుండుదురు
వారలతపోవైభవంబునం గాదె జగంబులు సుస్థిరంబు లై యున్నయవి యొండు
మెయి దుర్లభంబు లైనట్టివి తపంబున సులభంబు లగుం దపంబు గడచిన
ధర్మంబుఁ గలదే యని పలికి యాదరాతిశయంబున శివుండు శైలేంద్రతనయ
తోడ ధర్మంబులు మఱియు నెఱింగించెద నవహిత వై యాకర్ణింపు మని యి
ట్లనియె. 29

ఉ. అంబుజసూతి యేర్పడ గృహస్థసమర్థముగాఁ బ్రవృత్తిధ
ర్మంబు నొనర్చె నార్యజనమాన్యము దాని తెఱంగు సాల సూ
క్ష్మం బతికాంక్ష లేక తగుకాలమునన్ సముచితవృత్తి ని
త్యంబును ధర్మముఖ్యముగ నర్థముఁ గామముఁ జల్పు టొప్పగున్. 30

చ. అతఁడు నివృత్తిధర్మము ప్రయత్నమునన్ వివరించె మోక్షనో
ద్యత మది తత్ప్రకారములు దాంతియు భూతచయంబుపై దయా
రతియును సత్యదృష్టియు విరాగత యింద్రియకోటికిన్ దృఢ
స్థితముగఁ జేసి యోగనిరతిం బరిశాంతి యొనర్చికొంటయున్. 31

వ. అని మఱియును. 32

తే. క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి,యతిథి వచ్చినఁ బ్రియమున నతనిడప్పి
వోవునట్లుగ సముచితభోజనంబు, వెట్టు టెల్లపుణ్యములకుఁ బెద్ద దలఁప. 33

క. దీనికి నఖిలాశ్రమసువి,ధానంబులకును గృహస్థతయ నెల వగుటన్
దానిపదాఱవపాలిస,మానము గా దరయ నాశ్రమం బెయ్యదియున్. 34

క. అన విని గృహస్థునకు నే,పని ముఖ్యం బనియె గిరిజ పశుపతి జననీ
జనకారాధన మతనికి, ననుత్తమం బైనధర్మ మని రూపించెన్. 35

1. క. చ. ముక్కు, చెఱమల గువ్వల.

వ. అద్దేవుండు వెండియు. 36

క. పతిభక్తి ముఖ్యధర్మము, సతి కనవుకు దేవి నరుఁడు జననీజనకుల్
మృతులైనను నాతి విగతపతిత్వ మొందినను జేయుఁదపను లెయ్యవియో. 37

వ. అనుటయు నభవుండు వారివర్తనంబు లెఱింగించెద విను మని యిట్లనియె. 38

క. దేవాతిథిపితృపూజలు, గావించుట భావశుద్ధికలిమి నరునకుఁ
దేవీ వలయును నారికి, నేవిధమున బ్రహ్మచర్య మేమఱమి దగున్. 39

వ. అని నిర్దేశించి మఱియును. 40

ఆ. పంచపర్వసురతపరిహృతితో నిజదారతృప్తుఁ డగుచు ధాన్యకోటి
పక్షి యెలుక దినినఁ బ్రదుకుఁ గా కనుగ్రహపతికి సర్వమేధఫలము గలుగు. 41

వ. అని చెప్పి. 42

ఆ. ఎచట మెలఁగె నేమి యెట్లుండె నేమి దా, నేమి సేసె నేమి [1]యెల్లసంగ
ములను విడిచి కుడుపువలన నియతి గల్గు, యతికి మోక్షవిధి యాటపట్టు. 43

వ. అనిన విని సంప్రీతయై శైలరాజపుత్త్రి పురహరునితో రాజనువానికి భూజనంబులయట్ల శరీరంబును భోజనాదులును నట్ల యుండియు నతం డెల్లవారలచే మ్రొక్కఁ గొనుటకు నిగ్రహానుగ్రహంబులకుం జాలి సర్వాధికత్వంబున శోభిల్లు దానికిం గారణం బేమి యెఱింగింపవే యనుటయు నీశానుం డిట్లనియె. 44

శివుఁడు పార్వతికి రాజత్వమహిమాతిశయంబు సెప్పుట.

సీ. అధికపుఁదపమున నైనది రాజత్వ, మట్లు గావునఁ బేర్మి నతిశయిల్లు
జనములచే మ్రొక్కఁ గొనుటకు నిగ్రహం, బునకు ననుగ్రహంబునకు శక్తుఁ
డై యుండు నతఁడు తదీయసునీతియు, విను ముదమున రాజు వినయపరునిఁ
జేసి యెల్లజనంబు శిక్షించు నింద్రియజయమును నరివర్గజయముఁ బడయు
తే. నెఱిఁగి యుపధావిశుద్ధుల నిడు నమాత్య
పదవి కనురక్తసారవద్బలముఁ బ్రోచు
హితపరుల మిత్త్రులుగఁ గొను నిలకు మేలొ
నర్చు దుర్గంబు రక్షించుఁ గూర్చు ధనము. 45

వ. ఇవ్విధంబున సప్తాంగసంపన్నత్వంబు నొంది. 46

క. చేయఁ డపాత్రవ్యయములు, సేయుం బాత్రవ్యయంబు సేయుఁ నిజర
క్షాయత్న మెల్లతెఱఁగులఁ, బాయక ధర్మంబు సేయుఁ బాపము దొఱఁగున్. 47

ఆ. ఆచరించు దండ మక్రోధకాముఁ డై, చారదృష్టిఁ జూచు శత్రుకృత్య
ములను నాత్మదేశపురపరివారవిధముల సత్యభాషణముల నెగడు. 48

క. ఉద్యోగము ప్రియవాదిత, విద్యాపరినిష్ఠ సంధివిగ్రహవిహతా
వద్యత దీనానాథవిపద్యాపన మాజ్ఞ వెరవు వాటించుఁ దగన్. 49

1. క. యెల్లసౌఖ్యములును.

ఆ. కయ్యమునకు నెపుడుఁ । గాలుద్రవ్వఁడు దగ, వైరణము శూరుఁ । డై యొనర్చు
యజ్ఞదానవిధిప । రాయణుఁ డై యుండు, నిత్తెఱంగువృత్తి । యుత్తమంబు. 50

క. ఈనీతులకు విరుద్ధము, లైనపనుల నరకములకు । నరుగు నృపతి పా
పానీతదుఃఖ మొకతఱి, మాను నోరుల కతని కెపుడు । మానక యుండున్. 51

ఆ. భావశుద్ధి గలిగి । యీవినీతులఁ బూని, ప్రజల కెవ్వఁ డతుల । రక్షణంబు
సేయు నట్టివిభుఁడు । సిరియును గీర్తియుఁ, గాంచుఁ బుణ్యలోక । గతియుఁ బడయు.

క. అనుటయు ధర్మరహస్యము, వినఁ గోరెద ననిన శాంభ । వికి శంభుం డి
ట్లనియె నహింస రహస్యం, బనఁ బరఁగును ధర్మజాత । మఖిలమునందున్. 53

వ. అనిన విని యాజగన్మాత యవ్విశ్వధాతతో హింసావర్జనం బేజనులకుం జెల్ల
దని చూచెద నహింస తెఱం గెఱింగింపవే యనిన నద్దేవుం డది నీతలంచినట్ల
నేలం బిపీలికాప్రముఖంబుల నాకసంబున మశకాదుల మఱియుం బేను నల్లి
సీరపేను లోనైనజంతువులం జంపక యెవ్వరికి మాన రా దట్లు గావున. 54

చ. ఫలము దళంబునుం దొడిమఁ । బాయుట రాలినవానిఁ గోంచు నాఁ
కలి కెరసేసి గోరసము । కార్యము నట్టుల నిర్వహించి బు
ద్ధులు వెలి లేక నిశ్చలతఁ । దోయజపత్త్రనిభాక్షి చిత్రరూ
పులోకో యనంగ నుండుశమ । పుణ్యులు సూవె యహింసనాత్మకుల్. 55

తే. అదియ శ్రుతిచేత ధర్మర । హస్యమనఁగఁ, బడియెనని చెప్పి మఱియును । భవుఁడు దేవి
కిట్టు లను నట్లుఁగాక య । హింస తెఱఁగు, గలదు వినుము విశేషించి । కమలనయన.

తే. విధివశంబున మృతిఁ బొందు । వివిధజంతు, నిచయ మం దనహంకార । నిష్ఠుఁ డైనఁ
బురుషుఁ గల్మష మేమియుఁ । బొంద నేర, దెట్టు లంటేని విను మది । యేర్పరింతు.

సీ. దివియలోఁ బడుఁ బ్రువ్వు । దివియ యెత్తినవారిఁ, బాపంబు వొందు నే । యోపి దున్న
నాఁగేటిమొనఁ జచ్చు । నానావిధప్రాణు, లన్నరుఁ బొందు నే । యఘమువారు
దమపనుల్ సేయ వి । ధాతృవశమున నా, యువు దెగినట్టిజం । తువులు సచ్చు
నేము సంపితి మని । యించుకేనియు నహం, కారంబు వారికిఁ । గలుగ దట్లు

ఆ. గాన చూవె వారిఁ । గల్మష మొందదు, పుణ్యపాపములకు । బుద్ధి మూల
మని శివుండు మఱియు । నను హింసవోలె నై, యధికధర్మ మైన । విధము వినుము.

క. దైవగతిఁ జేసి తమకుం, జావ వలసి గోవు లొండు । సా వొల్లక స
ద్భావమున రంతిదేవుని, కావించుమఖమునఁ బశుతఁ । గైకొని నెమ్మిన్. 59

వ. అనేకసహస్రంబు లరుదెంచి. 60

క. తమ విశసించుట కాభూ, రమణుని వేఁడంగ నతఁడు । రాజీవాక్షీ
క్రమమున విశసింపఁగఁ జ, ర్మములు దరులు గాఁగఁ బాఱె । రక్తము నది యై. 61

క. ఆచర్మణ్వతి యనునది, గోచరమే వర్ణనమున । కుం బ్రియ మగుకం
పై చవి చేయం బొలిచి య, నీచమహితసలిల మయ్యె । నెత్తురు సుదతీ. 62

క. స్నానమునఁ బానమున నా, కానందము సేయు నమ్మహానది గోసం
తానము దివికి నరిగె న, మ్మానవపతిఁ జెప్ప నేల మధురాలాపా. 63

క. పరబలము పై నడరి నెత్తురు వఱ్ఱులు వాఱఁ జంపుదురు దురమున న
ప్పురుసఁదనంబును బుణ్యో, త్తర మని వేదములు సెప్పఁ దనుతరమధ్యా. 64

క. పోరులయందలిమరణము, మారణముం బుణ్యలోకమహితమహిమకుం
గారణ మెఱుఁగు మహింనా, కారం బిట్టి దని సివ కమలదళాక్షీ. 65

సీ. అని చెప్పి వెండియు హరుఁడు పార్వతితోడ, నిట్లను వేఁటకు నెలయు టఘము
గాదు సస్యములు మృగములచేత నశించు, జగ మెల్ల నిర్మనుష్యంబు గాఁగఁ
గోరు మృగము లది కారణంబుగ మృగ, హతి రాజులకు ధర్మ మయ్యె నట్లుఁ
గాక మృగములకుఁ గలుగు సద్గతి రాజు, చే మృతిఁ బొందినఁ జెలువ వినుము

తే. దండ్యు దండింప కుండు టదండ్యు దండ, నంబు గూర్చుట విప్రుమనంబు నొచ్చు
నట్టిపని సేఁత నపరాధి యైనయతని, తనువు నొంచుట సాహింస ధరణిపతికి.

వ. అని బోధించి. 67

క. భూసురుల కలుక వుట్టం, జేసి నహుషముఖ్యనృపులు సెడుట ప్రసిద్ధం
బాసురపతి విప్రులలుక, గాసిఁ బడఁడె తెలచి పడసెఁ గాదె నయనముల్. 68

క. కావున విప్రారాధకుఁ, డై వెలయు విభుండు రాష్ట్రమతనిధనము పై
న్యావలి బంధుత విప్రుల, దీవనలం బొదలు నింత డెల్లము దేవీ. 69

వ. అని నిర్దేశించి కపర్ది గౌరితో వెండియు. 70

ఆ. పరమమంత్రవిధులఁ బశువులు యూపంబు, లందుఁ గట్టఁబడి మహాశుచిత్వ
విభవ మొందు విహితవిశసనక్రియ మేను, విడిచి దివ్యసుఖము వడయుఁ బొలఁతి.

క. హోమవిధులఁ దన్మాంసము, లామిషములు గాఁగ నొసఁగి యమరుల నగ్ని
ష్టోమాదులఁ బ్రోవఁగఁ బర, మామితసౌఖ్యములు గల్గు యజమానులకున్. 72

క. శ్రుతివిహితహింస హింసగ, మతిఁ దలఁపఁగ రాదు మునిసమాజం బిది దు
ష్కృతతతిఁ బాపెడుపరమసు, కృత మని కొనియాడుఁ గాన గీర్వాణనుతా. 73

ఆ. అని యహింస తెఱఁగు లన్నియు నెఱిఁగించి, యింక నేమి వినఁగ నిచ్చ సేసె
దనిన రుద్రు నడిగె నద్రిజ జనులజీ, వనము తెఱఁగు లెల్ల వనజనాభ. 74

సీ. అడిగిన నద్దేవి కద్దేవుఁ డిట్లనుఁ, గాంత మానుష్యంబు కర్మభూమి
సుఖదుఃఖమూలముల్ సురతిర్యగాత్మక, త్వంబు లట్లగుట విత్తంబు వలయు
మనుజుల కెట్లన్న విను ధర్మకామముల్, విత్తసాధ్యంబులు విద్య వార్త
సేవ కారుత యర్థసిద్ధికి మూలముల్, విద్యవానికి ననవద్యతయును

ఆ. గర్షకునకు నేల కాల మెఱుంగుట, జట్టికాని కేది సంభవించె
నందువిలువ మొదలనగు లాభమును నెడ, వ్యయము గల్గుటయు శివప్రదములు.

క. పసులం బాలించునతఁడు, విసువక యేమఱక వానివిధము లెఱిఁగి ప్రో

చి సమర్థుం డగు వెరవునఁ, బసిఁ గనుసేవకుఁడు ధనముఁ । బడయుఁ బొగడుతోన్.

క. వంచనయును జాడ్యంబును, నించుకయును లేక ప్రభువు । నిష్ట మెఱిఁగి తాఁ
బంచినపని వెరవునఁ గా, వించినకర్మకరుఁ డొందు । విపులధనంబుల్. 77

వ. అని వెండియు. 78

క. [1]పరధనపరదారల నప, హరింపమియు దేవపితృస । మారాధనముం
గరుణయు నతిథిసపర్యయు, గిరితనయా యెల్లవారి । కిం గృత్యంబుల్. 79

శివుఁడు పార్వతికి వర్ణకర్మపరిపాకంబుల తెఱం గెఱింగించుట.

వ. అనిన విని యపర్ణాదేవి వర్ణంబులకర్మంబులు పాకంబుఁ బొందుప్రకారంబు సెప్పు
మని యప్పరమేశ్వరు నడిగిన నతం డిట్లనియె. 80

చ. తమతమకర్మముల్ దెరువు । దప్పక చేసినవారు దేవలో
కమున సుఖంబు నొందుదురు । క్రమ్మఱి వచ్చియుఁ బూర్వజాతిజ
న్మమున మహర్ధిఁ బొందుదురు । మానిని యిమ్మెయిఁ దప్పి యెట్టికృ
త్యములఁ జరించి రజ్జనుల । కట్టికులంబునఁ బుట్టు వాటిలున్. 81

క. ఎంతెంతమేలు సేసిన, [2]నంతంతియ కలము నెక్కు । డై సమకూరుం
గాంతా విప్రుఁ డయిన న, త్యంతానంద మగులోక । మతనికిఁ గలుగున్. 82

వ. అని చెప్పి మఱియును. 83

ఉ. ఆపదఁ దూలపోక సిరి । నంది మదింపక శౌర్యవృత్తిమైఁ
బాపుల గెల్చి యార్జవము । బంధుజనాలికి నార్యకోటికిం
జూపుచు దీనులం గరుణఁ । జూచి తగం గలమాత్రఁ బ్రోచుచుం
గోపము లేక మన్కి గలు । గుర్ దివిజాంశమునర్ జనించినన్. 84

క. అనిన విని గౌరి గొందఱు, మనుజులు సంపద సుఖించి । మనఁ గొందఱు లే
మి నలంగి దుఃఖపడుదురె, విన వలతుం గారణంబు । వినిపింపు శివా. 85

చ. అనుటయు శంభుఁ డిట్లను ద । యర్ బలి భిక్షము వెట్టి లేమిఁ గుం
దినచెలిఁ జుట్టముం బిలిచి । దీనత వాపి యపాపవృత్తిఁ జె
ల్లినతొలుబాము గల్గునరు । లెస్సగ [3]మంచు విధాత నిష్కృపా
త్ముని నతిలోభదూషితుని । దుర్గతి దుఃఖితుఁ జేయుఁ బార్వతీ. 86

క. విను మలుకయుఁ గూర్మియు లే, వనవద్యా యెజ్జనంబు । లందును విధికిన్
మును సేసినకర్మముఫల, మనుభవగోచరము సేయు । నంతియ తఱితోన్. 87

వ. అని యెఱింగించి వెండియు. 88

ఆ. ధనము గలిగి యుండి । ధవళాక్షి కుడువక, కట్టకుండుపరమ । కష్టజనము
లొరువు లొత్తి చెప్ప । నుపకారులై తొలు, పుట్టునందు మనిన । యట్టివారు. 89

ఆ. తమకు ధనము లేక । తగుభోగముల కెవ్వ, రైన నడప మనుసు । ఖాఢ్యజనులు

1. క. గ. చ. 'పరధనపరదారము లపహరింప, 2. గ. నంతంతయు. 3. గ. మన్న విధాత.

దొల్లి పేదవార౯ లుల్ల మర్థుల కెప్డుఁ, బెట్టఁ గోరుచుండి౯నట్టివారు. 90

సీ. ఆయాసపడ కుండ౯ నర్థంబు సేరెడు, వారు పాత్రజనంబుఁ౯ దార పిలిచి
తొలుమేనఁ బెట్టిన౯యలఘుదయాఢ్యులు, ధనసిద్ధి బహులయ౯త్నమునఁ గలుగు
మనుజులు పూర్వజ౯న్మమున నర్థులు దమ్ము, [1]నడుగ దాఁపక యిచ్చి౯నట్టివార
లాయాసమునను వి౯త్తాగమం బెడలెడు, జనులు ముందటిపుట్టు౯వునఁ గృపావి

తే. హీనులై యాచకుల నల౯యించి పిదప, నిడనిలోభులు ముదిసి ధ౯నేశుఁ డగున
రుండు ప్రాయంబునాఁడీక౯ గం డడంగి, తొంటిభవమున నీ౯కిఁ౯ దొడఁగినతఁడు.

తే. కలిగి యుండియుఁ దెవుళులకతన భోగ, ములు భుజింపఁగ లేనిమ౯ర్త్యులు గిరీంద్ర
తనయ తొలుమేన రోగముల్౯దనికిఁ జచ్చు, నపుడు దానంబు సేసిన౯యట్టివారు. 92

తే. అధిక సౌందర్యములు గల౯యట్టిజనులు
దొల్లి మాంసభోజనములు ౯ దొఱఁగి యున్న
వారు రూపవిహీనులు ౯ దారు రూపు
గలిగి తొలుమేనఁ గొనటులఁ౯ బలికినారు. 93

క. విను సౌభాగ్యసమేతుఁడు, మును నిజదారైకపరుఁడు ౯ ముందటిజన్మం
బున భార్యకుఁ బ్రీతి యొన, ర్పనిమనుజుఁడు సుభగతావి౯రహితతఁ బొందున్. 94

క. అమితజ్ఞానము విజ్ఞా, నముఁ గలిగియుఁ బేద యైన౯నరుఁడు సనినజ
న్మమున వినికి గలిగియు దా, నము తెరువునఁ బోనివాఁడు ౯ నలినదళాక్షీ. 95

క. తగుబుద్ధి లేక సంపద, మిగులఁ గలుగువాఁడు దొంటి౯మేనఁ గరుణమై
విగతప్రజ్ఞుం డయ్యును, దగ దీనులఁ బ్రోచినతఁడు ౯ దళితాబ్జముఖీ. 96

సీ. మేధావి యై విన్కి ౯ మిగిలి విద్యలఁ బొల్చు, నరుఁడు దొల్బ్యామున౯గురున కధిక
భక్తుఁ డై తన దైన౯పాండిత్య మొరులకుఁ, గావించు వేడుక ౯ గలుగుసుజనుఁ
డభ్యసింపంగ వి౯ద్యాయుక్తి లే కుండు, నాతఁడు దొల్లి వి౯ద్యాధికత్వ
మున గర్వి యై శిష్ట౯జనులకు సభ భంగ, మొనరించి కుందఁ జే౯సినయతండు

తే. భార్యయును బిడ్డలును దాను ౯ బహుధనముల
భోగు లై రోగములు లేక ౯ పొల్చువార
లమలినాచారపాత్రదా౯నములు సత్య
కరుణలును దొంటిభవమునఁ ౯ గలిగినారు. 97

ఆ. ఆలు బిడ్డ లొఱటు౯ లై లేమిఁ గుందుచుఁ, దెవులుచేతఁ బడుచు ౯ నవయుజనులు
మున్ను క్రోధలోభ౯ముల నాస్తికతఁ బర, పీడనంబు సేసి ౯ పేర్చినారు. 98

సీ. కాంతజాత్యంధుండు౯[2]గన్నులు సెడువాఁడు, దనయొప్పు మెఱయుచుఁ౯దగిలియొరుని
వనితఁ దొల్మేనఁ జూ౯చినవాఁడు కర్ణరో, గార్తుండు కటుకవా౯క్యములఁ దొల్లి
శిష్టు నొప్పించిన౯కష్టుండు గడుపునఁ, దెవు లైనతఁడు పూర్వ౯భవమునందు

1. గ. నడిగి తాఁకఁగ నిచ్చి. జ. నడిగి తాఱఁగ నిచ్చి. 2. గ. గడు సుందరుం డయి తన.

గరదుండు కోశ మ|శ్మరిని శర్కరను బా,ధితుఁ డగునరుఁ డన్య|సతిని గన్య
ఆ. మహిషి గోవుఁ దురగ|మదనాతురత మున్ను,గవిసినాఁడు శోషి | దివిరి యొరువు
లనుభవింపఁ దెచ్చు|కొనినమాంసము దొంటి,పుట్టువున హరించి|నట్టినీచు. 99
ఆ. ఉలుము గొన్నవాఁడు|దొలుమేన నాఘాత,బంధనముల నోరుల|ప్రన్నఁదనము
సెఱచినాఁడు పంగు | [1]వాఱవఁగఁ గాలుసే, విఱిచి సాధుజనులఁ|బఱచినాఁడు.
క. తిలకాదుల [2]గంతులచే, నలమటఁ బడువారు బడియ | నడిచియు ముష్టిం
జలమునఁ బొడిచియు సాధులఁ, దొలుబాముల నొంచినట్టి|దుష్టచరిత్రుల్.101
ఆ. పాదరోగు లశుచి|పదముల దేవాల,యములు మెట్టుటయును | నసదువారిఁ
దప్పు లేక ద్రొవ్వి | తన్నుటయును దొలు,పుట్టునందుఁ గలిగి|నట్టివారు. 102
చ. జ్వరమున గుల్మపీడ నతి|సారమునన్ బలుపుండులన్ మహో
దరమున వాతపిత్తకఫ|దారుణరోగములన్ నిరంతరా
తురు లగువారు నిర్దయతఁ | దొల్లి వినోదము గాఁగ జీవులం
దర మిడి [3]చంపినారు గురుఁ | దల్లడపెట్టినవారుఁ బార్వతీ. 103
తే. గూనివాఁడునుబిచ్చుక|కుంటు[4]గుజ్జుఁ, గొలుచు లమ్ముచోఁ[5]గ్రచ్చులు|గలిపిసరకు
దూఁచిపెట్టెడుచోటులఁ|దూన్కిదరపి,పూర్వభవమునలాభంబుఁ|బొందినారు.104
సీ. వెట్టులు దొలుమేన | వెడ్డున సాధుజ,నము మోసపుచ్చి ధ|నంబు గొన్న
జను లనపత్యులు | విను తొల్లి పితృకార్య,దూరులు బాలఘా|తులును జువ్వె
పొలఁతి నపుంసకుల్ | పూర్వభవంబున, నెద్దుఁ బట్టినవారు | నేమితప్పఁ
బొరయ కుండఁగఁ గోప|మునఁ ద్రికచ్ఛేదంబు, గావించినారును | గామసుఖము
ఆ. విఘ్నపఱిచినతులువలు | విధవ దొంటి
జన్మమునయందు భర్తృవం|చన మొనర్చి
ధనము గూర్చినయదియు మ|దంబుపేర్మి
నోర్తుమగని హరించిన|యది గ్మలియును. 105
తే. ప్రయతులై పుట్టి యేవంపు|బనులఁ గడుపు
బ్రోచికొనువా రహంకార|మునను గర్వ
మానమదదంభములఁ దొల్లి | మాన్యజనులఁ
బరిభవించినతుచ్ఛులు | పద్మనయన. 106.
సీ. దానత్వ మొంది య|దల్పులఁ దిట్టుల, నాటులఁ బడుచుండు|నట్టినీచు
లప్పాటఁ దొలుమేన | నతిగర్వులై ప్రల్ల,దమ్మునఁ బెక్కండ్రఁ | దప్పు లేక
తిట్టియు నడిచియుఁ | దిరిగినవార లా,పాలువలపైఁ గృప | గలిమి మేలు
ధనికగృహద్వార|మునఁ బ్రతిహారి ద, మ్మాఁగంగ నుండి దై|న్యమున దుఃఖ

1. గ. వఱవంగఁ-జ. వొఱవైన-గాళ్సేయి...బఱిచినాఁడు. 2. క. గ. జ. గ్రంతులచే. 3. గ నొంచినారు. 4. క. చ. జ. 'గునుకు'. 5. గ. జ. గ్రంచులు.

తే. పడుజనంబులు భోగైకపరతఁ దొల్లి, మానసీయుల కవసర మీనివారు
రాజదండితుఁ డకృతాపరాధుఁ గ్రూర,దండదూషితుఁ జేసినతండు సూవె.107

క. విను నష్టసకలధను లగు,జనములు నిక్షేప మిడినసరకులు దొలుబా
మున మగుడ నీక నెప మిడి, కొనినట్టియసత్యలోభకత్రింతు లతివా. 108

క. తమబంధులుఁ దారును నొ,క్కమరియ తెగటాఱువారు కరుణారహిత
త్వమునఁ దొలుమేన వెడపగ, నమేయనరవధము సేసినట్టిదురాత్ముల్. 109

వ. అని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో ని ట్లనియె. 110

సీ. ఇంతి నాచెప్పినయిప్పాపకర్ము లం,దఱకును నరకంబు దప్ప దండుఁ
బడుపాటు లెల్లను బడి వచ్చి నరు లైన,యప్పుడు వాటిల్లునట్టి తెఱఁగు
లివి యట్లు గాకయు నెక్కుడు గానిపా,పంబుల మానుషభవము గలుగు
[1]ని ట్లైన నమ్మేన నేకర్మమునఫల, మైనను మానవు లనుభవింప

ఆ. రోపి మునులు దేవయోనులు నత్తను,వునన తపముఫలము లనుభవింతు
రనిన దేవి యెఱుఁగనయ్యె మీఁదయఁ బెక్కు, లర్థములు కృతార్థనైతి ననియె.

వ. అని వెండియు నద్దేవునితో మనుజు లపరజన్మంబునం గాని కర్మఫలంబు లను
భవింప రంటిరి తప్పు సేసిననరుల నరపతు లిట్టితప్పున కిట్టిదండం బనునిరూపణం
బున దండించెదరది యక్కర్మంబుఫలంబప్పుట్టువునన యనుభవించుటగాదె యనిన
గౌరికి గంగాధరుం డి ట్లనియె. 112

సీ. జనపతుల్ దమరాజసంబున దండించి,నారు గా నొల్లక నరులతప్పు
లకుఁ దగుదండంబులన వారిఁ బఱతురు, తక్కొరు లెవ్వరుఁ దప్పు సేయ
వెఱచుటకై యట్టివిధి మూఁడు టది పూర్వ,కర్మంబువలనన కాని యపుడు
గల్గినతప్పునఁ గా దన్న నాదేవి, యవనీశదండితు డైననరున

తే. కఘము వాయునో పాయదో యనిన నీశ్వ
రుండు నృపదండితుఁడు యమదండమునను
బడఁడు లేనితప్పున నరుఁ బఱిచినతనిఁ
బఱుప కున్నాతనిని యమబాధ పొందు. 113

వ. అని నిర్దేశించి వెండియు. 114

క. విను తమచేసినకర్మం,బునఫల మెవ్వారికిఁ ద్రోచిపుచ్చఁగ రా దె
ట్లును గుడువక పో దది యన,విని పార్వతి యిట్టు లనియె విభునకుఁ గృష్ణా.115

తే. కర్మఫలములు గుడిచినఁ గాని పోవ, వంటి వానిఁ బ్రాయశ్చిత్త మపహరించు
నందు రశ్వమేధంబున నఖిలపాప,ములును జెడు ననఁగా విందు భూతనాథ.116

వ. అని పలికి యిది యెట్లొకో యనుటయు భవుండు. 117

1. చ. నష్టైన నమ్మేన నాకర్మములఫల.

ఆ. అతివ కామకృతము లైనకర్మంబుల, ఫలము లనుభవింప వలయు విను మ
కామకృతము సెడఁట గలుగుఁ బ్రాయశ్చిత్త, మాచరింప సంశయంబు వలదు.

క. కావునఁ గుడువక పోలియదు, దేవాసురమునుల కైన దేవీ కర్మో
ద్భావితఫల మీయర్థము, నీ వలవఱపుము భవన్మనీషఁ దిరముగన్. 119

వ. అని చెప్పి యప్పరమేశ్వరుండు వెండియు. 120

క. సుకృతముల నరుఁడు నాకము, నకుఁ జను నవి గొంచె మైన నరుఁడ యగును వా
నికి దివి కేఁగి డిగినయత, నికి మానుషవైభవములు నెఱయం గల్గున్. 121

వ. అని నిర్దేశించి యుద్దేశరూపంబునం గర్మంబుల తెఱం గెఱింగించి యింక నేమి యడుగ వల తడుగు మనిన నంబిక కర్మకరణంబు జంతువశంబు గ్రహవశంబు నా రెండు దెఱంగులం జెప్పుదు రం దెయ్యది దృఢం బని యడుగుటయు మృడుం డి ట్లనియె. 122

తే. నాతి విను గ్రహచారంబు హేతువులుగ
నశుభములు శుభములు నరుఁ డాచరించు
గ్రహము సేయించునే తాన కాక చేఁత
కొడయుఁ డటె గాన ఫలములు గుడువ వలయు. 123

వ. అనినఁ జా వనునది యేమి యని యుమ యడుగ నీశానుం డి ట్లనియె. 124

తే. నిత్యుఁ డాత్ముండు దేహ మనిత్య మతఁడు
ముదిమిఁ దెవులున వికృత మై యది వికలతఁ
బొందుటయు దానిఁ దొఱఁగి తాఁ బోవునట్టి
దశకు మరణ మన్వె రయ్యేఁ దనులతాంగి. 125

క. జీవుఁడు జీర్ణశరీరముఁ, బో విడిచి నవంబుఁ బొందఁ బు ట్టనుపేరం
దా వెలయుం దద్దశ జీ, వావలి వర్తించు నిటు గతాగతపర మై. 126

వ. అనిన విని పార్వతి శర్వునితో బాలురు సచ్చుటకును వృద్ధులు పెద్దకాలంబు బ్రదుకుటకును గారణం బేమి యనుడు నతండు. 127

తే. మేను జీర్ణముగాఁ జేయుఁ గాని మరణ
మొందఁ జేయదు విను కాల మెందు నరుని
పూర్వకర్మంబు లాయువుఁ బొదలఁ జేయ
సన్నముగఁ జేయ బ్రదుకును జావుఁ గలుగు. 128

వ. అని చెప్పిన నాయు వేమిటం బెరుఁగు నెద్దానం దఱుఁగు ననిన విని యుమకు నుమాపతి యి ట్లనియె. 129

శివుఁడు పార్వతికి నాయుర్వృద్ధిక్షయంబులకుఁ గారణంబులు సెప్పుట.

తే. క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
వలనిభక్తియు నాయువు పొలుపు నిచ్చు

నలుక బొంకు క్రూరత శుచి తాపగమము
గురువిరోధ మాయువుఁ గుఱుఁ గుండఁ జేయు. 130

తే. తపమునను బ్రహ్మచర్యవ్రతమున హితమి
తాశనమున రసాయనాభ్యాసమునను
బెఱుఁగు నాయు వాక్రియలపై నరుఁడు ప్రీతి
గలుగుటయుఁ బూర్వభవకృతకర్మఫలము. 131

క. తనలావున కధిక మయిన,పని సేయు [1]టయుక్తమును నపథ్యము నగుభో
జనములు హరించు నాయువు, వనిత యవియుఁ బూర్వకర్మవశతన కలుగున్. 132

వ. మఱియు నొక్క విశేషంబు సెప్పెద. 133

ఆ. సుకృతు లమరలోకసుచిరవాసులు నిట
దిగి చిరాయువులును నగుదు రితరు
లతిచిరముగ నరకగతు లయి తుది నాయు
వల్ప మగుమనుష్యు లగుట గలుగు. 134

క. నా విని భవాని పురుష,స్త్రీవిధములు రెండు గలవు త్రినయన వానన్
జీవుఁడు వర్తించు తెఱఁగు, నీ వేర్పడఁ జెప్పవే యనియెఁ గంసారీ. 135

వ. అనిన విని మహాదేవుండు మహీధరతనయ కి ట్లనియె. 136

క. తాత్త్వికము లైనపురుష,స్త్రీత్వంబులు లేవు పార్వతీ జీవున కా
తత్త్వమున కహంకృతిఁ గ,ర్మత్వ మొలసి భావ్యవిధమ మెయికొనుచుండున్. 137

వ. అని మఱియును. 138

ఆ. కర్మములకుఁ గర్త గాఁ డాత్మ డతని స,త్త్వము రజస్సుఁ దమము వాతపిత్త
కఫము లెట్లు మర్త్యకాయగతము లగు, నట్లు పొందుఁ గర్తలవియ చూవె. 139

తే. సత్యశౌచదయాదులు సాత్త్వికములు
రమణి లోభసంగాదులు రాజసంబు
లనృతహింసాపరత్వభయాలసత్వ
ధైర్యహానినిద్రాదులు తామసములు. 140

క. ఇవి నానాముఖములఁ బురు,షు వికారముఁ బొందఁ జేయుచుం బరఁగును హై
మవతీ కావున సర్వం,బు వినుము గుణకృత్య మిట్టిబోధం బొప్పన్. 141

తే. తన్వి సాత్త్విక రాజస తామసాత్మ
లైనవారలఁ బుణ్యలోకానుభవము
మనుజభావంబు నిరయపీడనముఁ బొందు
మోక్షలక్ష్మి నిర్గుణునకు మునుఁగ ముసరు. 142

వ. అని వెండియు. 143

---

1. చ ట. యుత్కటము నపథ్య.

సీ. ఎట్టివి కర్మంబు ౯ లట్టివ నరులకు, భాశుభసంప్రాప్తు ౯ లట్లు గాక
పరవిప్రియమున మేల్ ౯ వడయుటయునుగల్గుఁ, బతిభృత్యతతిఁబుటు౯ భర్త్సనముల
నొాజ్ఞ శిష్యులఁ దర్జ ౯ నోక్తుల వెజ్జ రో,గార్తుల నానావి౯ధౌషధముల
నలమటఁ బొందింతు ౯ రవ్విధంబులచేఁత, లన్నియు సుకృతంబు ౯ లై ఫలించు
ఆ. నని మఱియును జెప్పు ౯ నఖిలేంద్రియోపేత, మగు జరాయుజంబు ౯ నండజంబు
నువిద చోఁకు నెఱుఁగు౯ నుద్భిజ్జములు స్వేద,జముల కదియుఁ జూపు ౯ సంభవించు.
క. నరుఁడు జరాయుజములలోఁ, దరుణీ విను ముత్తముఁడు శ్రు౯తము లేకున్న౯
సరి నతఁడు బశువుఁ గావున, వరిష్ఠ మగునట్టినినికి ౯ వలయు నరునకున్. 145
క. ఇరుదెఱఁగు విను తమము శా,ర్వరమును దేహజము శార్వ౯రము తేజస్సం
స్ఫురణమునఁ బాయు శ్రుతమునఁ, బరిహృత మగు దేహజంబు౯ పర్వతపుత్రీ. 146
ఆ. బ్రహ్మయాతమంబుఁ ౯ బాపుటకై తపో,వ్యాప్తిఁ బడసె శ్రుతులు౯ నంగములును
గాన కార్యములు న౯ కార్యంబులును వానఁ, దెలిసికొనఁగ బుద్ధి౯ కలఁక దేఱు. 147
తే. క్రోధకామాదు లై నదు౯ర్గుణము లెల్ల, వాయుహతిమేఘపటలంబు ౯ వాయుపగిది
శ్రుతముచేఁబాయునరులలో౯ సురలకరణి, శ్రుతయుతులు దేజరిల్లుదు౯ రతిశయిల్లి.
తే. శ్రుతమునరునిఁబరిజ్ఞాన౯ యుతునిఁ జేయు, [1] వానిసుకృతమల్పమునున౯ నూనఫలము
నిచ్చు నజ్ఞానిసత్కర్మ౯ మెంతయైన, నఫలమగుఁగాన శ్రుతవంతుఁ౯ డగుటవలయు.
వ. అని నిర్దేశించి సర్వేశ్వరితో సర్వజ్ఞుం డి ట్లనియె. 150
సీ. మృతిఁ బొంది వేగ జ౯న్మించినఁ బూర్వదై, హికములన్నియు బుద్ధి౯ నెలయువాఁడు
జాతిస్మరుం డనఁ ౯ జను నయ్యెఱుక [2] పెద్ద,వాఁడు గాఁగాఁ జెపు ౯ వనిత వినుము
పుట్టెఱుంగుట కల్మి౯ బోధించు టగు నాస్తి,కులమును జన్మంబు౯ గలుగు తెఱఁగుఁ
జచ్చిపోయినవారు౯ వచ్చి యత్తనువొంది, మెలఁగుటొక్కొ౯ కచోటఁ౯ గలిగియుండు
తే. నట్టి తెఱఁగు వెంగలు లై న౯ యమునిదూత
లొరులఁ జని కొనిపోయినఁ ౯ గరుణతోడ
నమ్మహాత్ముండు మగిడి పొ ౯ మ్మన్న నరుగు
దెంచు టని నీ వెఱుంగు సం౯ దియము లేదు. 151

—శివుఁడు పార్వతికి స్వప్నాదుల తెఱం గెఱింగించుట.—

వ. అని తెలిపిన గౌరి కల యనునది యేమి యెఱింగింప వే యనుటయు నతండు. 152
ఆ. స్వప్న మనఁగ సుప్త౯ జనముమనశ్చేష్ట, [3] యనియుఁగాంచు మన మ౯ నాగతములఁ
గాన కలలు సూచ౯ కము లగు భావిశు, భాశుభోదయముల ౯ కనియుఁ జెప్పె. 153
వ. చెప్పిన విని భవాని భవునితోడ. 154
సీ. దైవంబొ కర్మవ౯ ర్తనము జనంబును, త్సాహంబొ యనిన న౯ తండు దైవ
మొాంబు సే౯ యుట లేదు దైవసం,కలన ఫలం బిచ్చుఁ ౯ గాని వినుము

1. గ. దాన సుకృత మనల్ప మనూనఫలము. 2. గ. పెద్ద,వాఁడు. 3. అ. యదియు... నొగి
వనా...కనుచుఁ జెప్పె.

దేవి పూర్వకృతంబు దైవనామకముఁ, బరఁగు నప్పటిచేఁత పౌరుషంబు
కృషివోలె నుండుఁ బౌరుషగతి వర్షస, ద్వ్యాయువులట్ల దైవప్రకార
తే. మెఱుఁగు ఖననమథనములనెట్లు జలముఁ, జిచ్చుఁ బుట్టు నమ్మెయి నరుచేష్ట దైవ
యోగమున సిద్ధిఁబొందు నుద్యోగరహితుఁ, డెత్తెఱంగున దైవసమృద్ధిఁ బడయు.
క. కావున నుద్యోగంబును, దైవంబును గారణములు తామరసాక్షీ
యేవిధమునఁ గర్మములఫ,లావాప్తికి దీన సంశయము వలదు సుమీ. 156
తే. అనిన నంబిక గర్భంబు నాత్మఁ డెట్లు, సొచ్చు నచవుడు నభవుఁడు సురతబీజ
రక్తదైవముల్ సూవె కారణము లాత్మ, గర్భసంవేశనమునకుఁ గమలనయన.
క. మాయారహితుఁ డహంకా,రాయత్తతఁ జూవె పుట్టు వనుచెఱఁ బడి నా
నాయాసంబులఁ బడు నా,జ్ఞాయుతుఁడై యాత్మఁ జింత చర్చింపు మదిన్. 158
సీ. అని చెప్పి దైవరహస్యంబు వినిపింతు, విను మని పలికి యి ట్లనియె శివుఁడు
దొల్లి మనుష్యులు దొలుమేనికర్మంబు, లెఱుఁగఁగాఁ జాలుట నెల్లవారు
మేలు సేయఁగ ననిమిషలోకమున నధి,కం బగుసందడి గాఁగ మనుజు
లమరులై పేర్చిన నజుఁడు వేల్పులసంక,టము వాయుటకు నుపాయము దలంచి
తే. మానవుల కయ్యెఱుకకల్మి మాన్చి కామ,కోపముల నొలయించిన కోపకృతుల
వారు నరకాదిసమ్మర్దకారు లగుదు, నదియుఁ గాదని చింతించి యనువు గాంచి.
క. సరిగా నా రెండెడలకు, నరులు ననుట గోరి మనమునం గానమియుం
బరలోకవిధము శాస్త్రము, వెరవునఁ గనుటయు నొనర్చె విధి వారలకున్. 160
వ. అనినం బార్వతి పునర్జన్మంబు గలదు లేదనుసంశయంబుతోన పొట్టుపొర లగు
దురు నరులు దాని తెఱంగు నిశ్చయింపవే యనుటయు నంధకారాతి యి ట్లనియె.
క. కలదో లేదో యనియెడు,తలపోఁతయె కాని నిశ్చితము గాదు సురా
దులకుఁ బునర్జన్మంబున,కలిమియు లేమియును నరులు గానమి దప్పే. 162
క. కల దది యూరక కానఁగ, నలవియె శ్రుతివాక్యసమితియర్థంబులపై
నిలిచినశ్రద్ధం గ్రమమునఁ, దెలి వొందినఁ గాక యెట్టిధీమంతులకున్. 163
వ. అనిన విని గౌరి గంగాధరున కి ట్లనియె. 164
క. మృతులైనవారలు నిరా,కృతులై యుండుదురు వారిఁ గినాశభట
ప్రతతి గొని చనుట యాపితృ,పతి శాసించు టవి యెట్టిభంగులు దేవా. 165
వ. అని యడిగిన నద్దేవుం డి ట్లనియె. 166
సీ. తఱి యైన మనుజులఁ దనువులు విడిపించి, మాయాశరీరసమన్వితులుగ
నొనరించి దూతలు గొని పోదు రందును, ధర్మవర్తుల సుగంధంబు మృదువు
నైనమార్గమున మధ్యపువారి నిర్బాధ,సరణిఁ బాపాత్ములఁ బరుసఁదనము
ముటికియుఁ గలపథంబున నడపింతు రి,ప్పరుసునఁ జని పితృపతికిఁ జూప
ఆ. నతఁడు పుణ్యలోకగతియును మానవ,త్వంబు ఘోరనరకవాసమును వి

ధించి పుచ్చు వారిఁ దెలిచి మన్నించి భ,ర్జించి వరుసతోడఁ జిగురుఁబోఁడి.

వ. అని చెప్పిన నగేంద్రతనయ చంద్రశేఖరునితోడ. 168

క. నరకం బెట్టిది కల్మష,కరులన్ జముఁ డెట్టిభంగిఁ గాఱియఁ బెట్టున్
వరదా చెప్పు మనుడు న,ప్పురహరుఁ డి ట్లనియె వృష్ణిపుంగవ ప్రీతిన్. 169

సీ. రౌరవం బనఁగ ధరాస్థలి క్రింద మ,హారౌరవం బన నవుల దాని
కావల విను కంటకావనం బన నుండుఁ, గ్రమవృత్తిఁ బేర్చు దుఃఖములు గలిగి
యగ్నికుండంబు నా నట పంచకష్టంబు, నాఁ గల వి ట్లున్న నరకతలము
లై దండుఁ గాపక్రియాతారతమ్యంబు,లూహించి యంతకుం డనుపఁ బనుచుఁ
తే. దగినయెడలఁ బాపాత్ములఁ దద్భటాలి
దహనకర్తనబంధనతాడనములఁ
బఱుప వారలఁ గుక్కలు గఱచుఁ గ్రిములు
దొలుచు గ్రద్దలు నొప్పించుఁ దుండనిహతి. 170

వ. మఱియును యమదూతవ్రాతంబు నానావిధవేదనలం బెట్టి దండించుచుండు. 171

ఉ. అమ్మెయిఁ బాపముల్ వొలియ నంతకు దుఃఖము లంది కీటజ
న్మమ్ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁ బొంది మృగత్వమానుష
త్వమ్ముల నోలిఁ బొందుదురు వా రిను మెంతయుఁ గ్రాఁగి కల్మష
త్వమ్ము దొఱంగుమాడ్కి నవతామరసప్రతిమానలోచనా. 172

వ. అనిన విని పార్వతి పాపంబు లనునవి యెట్టివి యెఱింగింపవే యనుటయు నీశానుం
డి ట్లనియె. 173

శివుఁడు పార్వతికి మానసవాచికకాయికము లను త్రివిధపాపములఁ దెల్పుట.

సీ. మానిని త్రివిధముల్ మానసవాచిక,కాయికంబులఁ బాతకంబు లందుఁ
బరధనాపేక్షణపాపానుమోదధ,ర్మద్వేషముఖములు మానసంబు
లనృతదారుణభాషణాదులు వాచిక,ములు వధంబును బంధమును నభక్ష్య
భక్షణంబును నన్యభామారతము మద్య,పానంబు మొద లైనపాపకృతులు
తే. కాయికంబులు విను మధికం బపేయ
పాన మది దుష్కృతంబులలోన నెల్లఁ
బానమున నిందతో వచ్చుఁ బ్రాణగోడ్డ
ములును జేటులు నరకాబ్ధి మునుఁగుటలును. 174

క. లోకము నిర్మర్యాద,త్వాకుల మై చెడదె సజ్జనావలి మధుపా
నాకాంక్ష దొఱఁగ కున్న గు,ణాకల్పా యేమి సేయ దక్కీఁడు నరున్. 175

క. కావున నేవిధమున సుర, సేవింపక యుడుగు టొప్పుఁ జెలువ సకలవ
ర్ణావలికి దానఁ గీర్తి, శ్రీ వైభవపుణ్యగతులు సేర్చికొన నగున్. 176

క. అన విని యంబిక సుకృతము, లనునవి యెట్టి వని యడుగ నద్దేవికి ని

ట్లనియెం జంద్రార్ధధరుం, డనుమోదోల్లాసి యగుచు ◊ నంబుజనాభా. 177

తే. ఔపరమికాభిధానంబు ◊ నంబుజాక్షి
నిరుపకరణాఖ్యమును సోప◊కరణనామ
కంబు నయి లోకమున సుకృ◊తంబు పరఁగుఁ
ద్రివిధముల వానిఁ దగ వివ◊రింతు వినుము. 178

సీ. ఔపరమిక మన◊నది పాపవర్జన, మకట కానఁగ నేర ◊ రజ్ఞజనులు
యత్నంబువలదు [1]వ్య◊యంబేమియును లేదు, పరలోకభీతిఁ బా◊పములఁ దొలఁగి
నంతన సుగతిసౌ◊ఖ్యం బొడఁగూడెడు, నదియు నాత్మాధీన ◊ మట్టిదాని
సుకరత్వ మెఱుఁగక ◊ చొత్తురు నరకంబు, వెరవరుల్ శ్రుతము◊నవృద్ధయోగ

తే. మునను ధృతికల్మి నింద్రియ◊వినియమమున
నది దమకుఁ గలిగింతురు ◊ యమ మనంగఁ
బరఁగు నది దాన నాకంబుఁ ◊ బడయ వచ్చు
ననినఁ జెప్పంగ నేల ధ◊ర్మాత్మభియుక్తి. 179

ఆ. నిరుపకరణ మనఁగఁ ◊ బరఁగు శౌచంబు స,త్యంబు శాంతి దాంతి ◊ యార్జవంబు
వ్రతనిరూఢి సముప◊వాసంబు బ్రహ్మచ,ర్యంబుకల్మినియమ◊మంద్రు దాని. 180

సీ. ఆభ్యంతరంబుబా◊హ్యమునన(ఁ)గా శౌచ, మిరుదెఱఁ గై యుండు◊హృదయసుకృత
మాభ్యంతరము విను ◊ మాహారశుద్ధియు, నంగశోధనము బా◊హ్యంబు సత్య
మన్నది గన్నది ◊ విన్నది యున్నయ,ట్లన నుక్త మగుట యం◊భోజవదన
శాంతి బుద్ధీంద్రియ◊సన్నివారణ దాంతి, కర్మేంద్రియముల యో◊గ్యప్రవృత్తి

తే. యార్జవము కుటిలుఁడు గామి ◊ యగు వ్రతంబు
మంచిపని పూని నడపుట ◊ యంచితోప
వాస మశనని గ్రహ మన◊వద్య మైన
బ్రహ్మచర్యంబు కామునిఁ◊బారిఁ బడమి. 181

ఆ. నాతి తీర్థసేవ◊నంబును నియమవి,శేష మగుట దానిఁ ◊ జెప్ప వలయు
సకలనదులఁ దీర్థ◊సంజ్ఞలు గల వబ్ధి, కరుగునట్టి విచ్చు ◊ నధికఫలము. 182

తే. వానియందును మునిపద◊మాననీయ, దేశములు నబ్ధిసంయోగ◊దేశములును
దెలియు మన్యోన్యసంగమ◊దేశములును, బరమతీర్థంబు లగుఁ బద్మ◊పత్త్రనయన.

క. వనధి మహాతీర్థం బం,దును సంయమివరులచేతఁ ◊ దొల్లి ప్రియమునం
గొనియాడఁబడినచోటులు, విను ముత్తమతీర్థములు వి◊వేకాభరణా. 184

క. వెలి శుచి యై మఱి తీర్థం,బులు సొచ్చుట మేలు నియమ◊ములు దీర్చి తగఁ
వెలలినయెడ దేవార్చన,ములు విప్రార్చన లవశ్య◊మును గృత్యంబుల్. 185

క. చేరువతీర్థముకంటెను, దూరపుఁదీర్థంబు మేలు ◊ తోయజవదనా

1. గ. ప్రయత్న మేమియు.

శారీరాయాసము త,త్కారణ మై వేదవాక్యగతి యి ట్లుండున్. 186

క. విను సోపకరణ మనునది, ధనధాన్యాదికసమగ్రతను గృహమేధుల్
గొనియాడు తెఱఁగు దానం,బున వైదికపైతృకాదిపుణ్యక్రియలన్. 187

సీ. న్యాయార్జితం బైనయర్థంబు వేదవి,త్త్వము శాంతి మొద లగువరగుణములు
గలవిప్రునకుఁ బుణ్యకాలపావనదేశ,కలితంబుగా భక్తి గలిగి యీఁగి
మేలిదానము శక్తి మిగులుట శక్తికిఁ, దగుట దానికిఁ గడుఁ దగమి యుత్త
మము మధ్యమము నధమము నగు దానివి,ధానంబు విను మిట్లు దైవికంబుఁ

తే. బైతృకంబును లోనైనపనులఁ దాను, వేడ్కసేయువస్తువుఁ గొనువిప్రుకోర్కి
కనుగుణం బగునదియును నర్థి నిచ్చు, టధికతర మైనఫల మిచ్చు నంబుజాక్షి. 188

తే. చేయు టెంతయుమే లైనఁ జేసి పిదప, వగచినట్టిదానము దనుఁ బొగడికొన్న
దానవిధి నిష్ఫలంబులు గాన రెండు, నుడుగుదాత మహాఫల మొందఁగాంచు.

వ. అనుటయు దాక్షాయణి దాతవ్యంబు లెయ్యవి సెప్పు మనిన భవుం డిట్లనియె.

శివుఁడు పార్వతికి దానఫలవిశేషంబుల నెఱిఁగించుట.

సీ. అన్నంబుఁ దోయంబు నఖిలజంతువులకుఁ, బ్రాణముల్ గాన యప్పరమవస్తు
వుల మేలు దాతవ్యములలోన నెల్లను, నతిథుల కవి యిచ్చు టమరలోక
చిరమహాసౌఖ్యంబుఁ జేయుఁ గాంచన మగ్ని, యగుటఁ దద్దాన మత్యంతపావ
నము సర్వకామప్రదము గోవు సద్విప్రు,నకు సీగి తద్రోమనికరసంఖ్య

ఆ. వరుస నాకలోకవాసంబు గావించు, నందుఁ గపిల నిచ్చునాతఁ డిరువ
దొక్కతరమువారి నూర్ధ్వలోకమునకు, ననుపఁ జాలు వికచవనజవదన. 191

క. విను భూమిదానకర్తకు, ననిమిషలోకమున నిలువ నగు సౌఖ్యంబుల్
దనరుచు నుండఁగ నెఱపెం,పున భూమి గలంతకాలమును గిరితనయా. 192

ఆ. భూమి నఖిల మగువిభూతివిశేషజా,తంబు గలుగుఁ గాన తత్ప్రదాన
మెల్లవస్తువులును నిచ్చినయ ట్లగు, దానఁ బోనిపాపతమము లేదు. 193

క. అతివా కన్నియ నిచ్చినఁ, బితృపతి ముద మందు సురలుఁ బ్రీతు లగుదు రం
చితగతి కర్తకు వారకును, నతితేజశ్శ్రీయశస్క మగు నబ్భవమున్. 194

తే. విద్య యిచ్చుట సత్పాత్రవిషయ మైన, నవ్యయానందపదముఁ జేయంగఁజాలుఁ
దగఁగ దక్షిణ యిచ్చి పేదలకు విద్య, యీనియోగించుటయుఁ దత్సమానకృతియ.

సీ. తిలరాశి యిచ్చినఁ గలుగు నగ్నిష్టోమ,ఫలము వాసోదానఫలము చిరత
రాయువు గొడు గీఁగి యఖిలపీడలఁ బాపు, దాసదాసీజనదానమహిమ
కర్మవిమోక్షంబుఁ గలిగించు దీపదా,నముఫల మాత్మాతివిమలభావ
మంబుప్రవాహంబు నధిగమింపఁగఁ జేత, నిఖిలవ్యసనముల నిస్తరింపఁ

ఆ. జేయుఁ దెరువు లెస్స సేయుట సంతాన, మిచ్చు నౌషధంబు నిచ్చు టెల్ల
తెన్నులుఁ బాపుసాదుఁ దెరువరి కునికిప,ట్లొసఁగుటొసఁగుఁ దనుసుఖోదయములు.

వ. అనిన విని యజ్ఞంబు తెఱం గెఱింగింపవే యని పార్వతి ప్రార్థించినం బరమేశ్వరుం డిట్లనియె. 197

సీ. విను మింతి వైదికంబును లౌకికంబును, నన రెండుదెఱంగులు యజ్ఞవిధులు
వర్ణయోగ్యార్జనవర్ధనాంచితధన, ధాన్యముల్ గొని దేవతలకుఁ దృప్తి
యగునట్లుగా ఋత్త్విగర్చన మొప్పఁగాఁ, గావించునది వైదికంబు దేవ
తలకు మహోత్సవంబులు సేయుటయు గీత, వాద్యనృత్తము లనవద్యములుగ
ఆ. సంఘటించుటయును సద్గంధమాల్యధూ,పప్రదీపభోజ్యభక్ష్యములు స
మాదరంబుతో నివేదించుటయు లౌకి,కంబు రెండు నమరగణహితములు. 198

తే. ధర్మములు దానములును సద్వ్రతచయంబు
సదృశములు గావు వినుము యజ్ఞమున కరయ
యజ్ఞకర్త లోకోత్తరుం డతని కిచ్చు
టతనిచేఁ గొను టధికపుణ్యములు చెలువ. 199

ఉ. మానసకృత్యముల్ సురసమాజ మెఱుంగఁగఁ జాలుఁ గావునన్
మానస మెక్కడేనిఁ జన మంచిగఁ జేసిరయేని యజ్ఞముల్
దానము నాది యైనసుకృతంబులు లగ్గ ఫలింప నీదు త
ద్ధ్యానపరత్వపూతసుకృతంబులకున్ ఫల మిచ్చు మెచ్చుచున్. 200

క. అని చెప్పిన హిమవద్గిరితనయ త్రిపురవైరితోడ దైవికవిధు లే
వినఁ గని సంతోషించితి, వినిపింపుము పైతృకంబువిధము వృషాంకా. 201

సీ. అనిన నాసర్వజ్ఞుఁ డద్దేవి కిట్లను, గయ కురుక్షేత్రంబు గంగ యాది
యగుపుణ్యదేశంబు లతిఫలదంబులు, మాఘభాద్రపదాఖ్యమాసములు బ
హుళపక్ష మపరాహ్ణ ముగ్మలి యమవస, [1]తేరసి నవమాద్యతిథులుఁ దుష్టిఁ
బితృదేవతల కిచ్చుఁ గుతపదౌహిత్రతిలలు నితాంతపవిత్రములు పితృక్రి
తే. యలకు శౌచ మక్రోధ మవ్యగ్రభావ, మర్హములు శుక్లపక్షపూర్వాహ్ణయుగ్మ
దివసజన్మదినములు నిందితము లాజ్య, ముద్గపాయసాపూపముల్ ముఖ్యకోటి.

క. శ్రోత్రియు లరోగు లవికలగాత్రులు పాత్రములు పైతృకములకు సచ్చా
రిత్రత్వము ముఖ్యంబు సగోత్రు మృతకళత్రు నన్యకులుఁ గొన రతివా. 203

ఆ. గంధపుష్పమాలికాధూపదీపవ,స్త్రముల నర్చ లిచ్చి తగఁగ భోజ
నములు నిర్వహించి క్రమవృత్తిఁ బిండప్ర,దానవిధి యొనర్చుటేను మెత్తు.

వ. అని యెఱింగించిన మేనకాత్మజ మృడునితో ని ట్లనియె. 205

క. మృతిఁ బొంది పునర్జన్మము, నతర్క్యగుణ జంతుకోటి యప్పుడ పొందుం
బితృపూజన మని యెవ్వరి, కితవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు శివా. 206

ఆ. అనుడు నచట నున్నమునిజను లెల్లను, నగతనూజ నాత్మఁ బొగడి యభవుఁ

1. అ. బారసి నవమియుఁ బరఁగఁగ దుష్టి—చ. దెరశిన నవమాద్యతిథులఁ దుష్టి.

డిచ్చునుత్తరంబు నేర్పడ వినువేడ్క, గదుర నుండి రవుడు కంసదమన.207

సీ. అంబిక కిట్లను హరుఁడు సందేహింపఁ, దగునది యిది గుహ్యా తమము వినుము
దివిజులట్టుల పితృ దేవతలును దేవ,బృంద ముత్తరదిశఁ బితృచయంబు
దక్షిణదిశ నుండుఁ దత్పూజనంబులు, వరుసన హవ్యకవ్యంబు లండ్రు
నచ్చినవారికి శ్రాద్ధంబు సేయఁగా, నాపితృసంఘంబు హర్ష మొంది

తే. యాయువును శ్రీయుఁగీర్తియు నాదియైన,యైహికంబులుసుగతియు నాదరమునఁ
గర్త కొసఁగు సురాసురగరుడయక్ష,తతులకును బూజనీయంబు పితృగణంబు.

వ. అని నిర్దేశించి వెండియు. 209

క. తమతమసారములకుఁ దగఁ, గమలాక్షీ చేయుదానకల్పనలవిశే
షము నొక్కరూప యగుఁ ద,త్ప్రమాణరూపణము సేసి పలికెదఁ దెలియన్.

క. విను మొకకుంచెఁడుధాన్యము, దన కాయతి గల్గునతఁడు దాని నొసఁగినన్
ధనకోటి గల్గువాఁ డ,ర్థన మొసఁగిన నొక్కరూప తత్తత్ఫలముల్. 211

క. పరుషత్వము లేకంతగ,కరణంబున శుద్ధి సాలఁ గలిగి ప్రియము పొం
పిరివోవఁ జేత దానము, పరమోత్కృష్టంబు పద్మపత్త్రనిభాక్షీ. 212

క. అని చెప్పికొన్ని ధర్మము, లనఘా యెఱిఁగింతు నీకు నవధానముతో
విను మని పలికి శివుం డి,ట్లను విశదము గాఁగఁ గూర్చి యంబుజనాభా.213

చ. తెవులులు గొన్నవారి కవి దీఱుట కౌషధ మీగి దుర్గతుల్
దవులుజనాలిఁ బ్రోపు సుపథంబుగఁ దైర్థికకోటి నన్ను బాం
ధవరహితత్వదీనశవదాహము దుఃఖితు లైనవారిఁ దే
ర్ప వెరవు నోర్పుఁ గల్మియును బ్రస్తుతి కెక్కినమేటిధర్మముల్. 214

వ. అని పలికినఁ బార్వతీదేవి పరమప్రియంబు నొంది. 215

## శివుఁడు పార్వతికి ధర్మవిశేషంబుల తెఱం గెఱింగించుట.

సీ. ధర్మంబు నానావిధంబులఁ బరఁగు నం,ద్రవి యెఱిఁగింపవే యనుడు హరుఁడు
వితతంబు లగుశ్రుతిస్మృతులచేఁ జెప్పఁగాఁ,బడినతెఱంగులు పడఁతి వినుము
జాతిధర్మములు దేశజధర్మములుఁ గుల,ధర్మంబులును గణధర్మములును
గాయంబువికృతులఁ గాలపర్యయముల, వచ్చునాపద్ధర్మవర్తనములు

ఆ. గాఁగ నిట్లు ధర్మగతు లైదు గల వని, చెప్పుటయును గౌరి శివునితోడఁ
బుణ్యలోకకలితభోగంబు లెట్లుండు, ననిన నిట్టు లనియె హరుఁడు కృష్ణ.216

సీ. ఎల్లపుష్పంబులు నెక్కాలమును దద్ద, విలసిల్లుఁ గల్పకవృక్షజనిత
మనులేప మాహార మమృత మంబరములు, నిత్యామలినములు నిరుపమాన
భంగి దీప్తంబు లాభరణముల్ వాన ర,మించుచు నన్యోన్యమిత్త్రభావ
మొప్పంగ మేనులయొప్పును మనముల,మార్దవంబును గుణమాన్యతలును

తే. గలిగి పురుషులుఁగాంతలుఁ గామహర్ష,లీల లెసఁగఁ గ్రోధాదులు లేక రుజయు

జరయు నెఱుఁగక నలిఁ జరింతురు దివంబు,నందు సంతతనిర్భరానంద మొంద.

వ. అనిన విని హైమవతి సుగతిదుర్గతులకుం జనం గలవారిం జూచి వీ రిట్టివా రని నిశ్చయింప వచ్చుట రామి యెఱింగింపు మనవుడు మృడుండు విను మని యి ట్లనియె. 218

చ. జనులకుఁ గీడు రోయక యజస్రము ధర్మరతిం జరించి స
జ్జనగురుపూజనంబులును సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును భూరిదయార్ద్రితయుం గలట్టివా
రనిమిషలోకగాము లని యాత్మ నెఱుంగుము మేనకాత్మజా. 219

చ. పరుసనిపల్కు బొంకు లగుపల్కులు నన్యధనాభిలాషముం
బరవనితావిలోలతయు బాంధవసజ్జనవిప్రియంబు దు
శ్చరితులతోడిమైత్రియును సంతతధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన ఘోరనరకంబున కేఁగెడివారిచిహ్నముల్. 220

క. అని చెప్పిన విని హిమగిరి,తనయ వృషధ్వజునితోడ ధర్మంబులు పె
క్కనుపమమూర్తీ పరమం, బనఁ జాలెడుధర్మ మెద్ది యన్నిటిలోనన్. 221

వ. చెప్పు మనిన నప్పరమేశ్వరుం డి ట్లనియె. 222

క. రమణీ వర్గత్రయధ,ర్మము లిచ్చు సుఖములు దుఃఖమయము లచిరముల్
గమనాగమకరములు ని,త్యమహాసౌఖ్యంబు మోక్షధర్మం బిచ్చున్. 223

సీ. కావున విను త్రివర్గంబుకంటెను మేలు, దలపోయ మోక్షంబు దానిఁ బడయు
తెఱఁ గెఱింగించెదఁ దెఱవ గృహస్థధ,ర్మంబున నిల్చి ఋణంబు లెల్లఁ
బాచి వనమునకుఁ బరమశాంతత నేఁగి, సద్గురుముఖమున సాంఖ్యయోగ
విదుఁ డగునది పంచవింశతి జ్ఞానంబు, సాంఖ్యంబు ధర్మనిశ్చలత యోగ

తే. మాసమాచారయుగళ మేకాధికరణ, మస్ఖలితముగ మది నది యలవరించి
ధ్యానపరుఁ డయి శీతోష్ణహర్షశోక,ముఖము లగువివిధద్వంద్వములఁ దొఱంగి.

ఉ. శౌచము బ్రహ్మచర్యమును శాంతియు లఘ్వశనంబు నై యిళం
జూచుచు నంతరాత్మ నెడ సొచ్చినవిఘ్నవిశేషముల్ ధృతిం
ద్రోచుచు భక్తియుక్తికి గురుండు ప్రమోదమయుండు గాఁగఁ ద
ద్గోచరతం జరింపఁగ నకుంఠితమోక్షసుఖంబు సొప్పడున్. 225

తే. అది సదాభ్యాసకలన నత్యంతనిర్మ,లంబు నవ్యయమును నచలంబు ఘనము
నై జరావ్యాధిమరణజన్మాదిదుఃఖ,బహుళసంసారచక్రంబుఁ బాప నేర్చు. 226

వ. అని యుపదేశించి వెండియు. 227

క. విను సంసారమునకు విసు,వనిమర్త్యుఁడు శోకమోహవశగతుఁ డై మో
క్షనిరూఢిఁ బడయ నేరఁడు, మనము విరక్తముగ విసివినమతి ముక్తిగనున్. 228

వ. అట్టిదశ చింతావివర్జనంబునను భూతాస్థిరత్వపరిజ్ఞానంబునను దృష్ణారాహిత్యం

బునను గాని కలుగదు గావున వానిభంగులు ప్రకటించెద. 229

సీ. ధనములు సెడిన బాంధవులు సచ్చినఁ దదీ,యము లగుగుణములయందు మనసు
వెట్టకయున్నది యెట్టన్న వగచినఁ, దాపంబు వొందుట దక్క నొండు
గలుగునే సుఖము దుఃఖంబును దోడివ, యవి మార్చి వచ్చును నరుగుచుండుఁ
గేవలసుఖము లే దావాసవున కైనఁ, జేటు దృశ్యములకు సిద్ధ మగుట

తే. మున్న కనియున్న వగచిత్తమున జనింప, దరయఁ గీడు పరిగ్రహమది సమగ్ర
మైనతఁడు పొత్తినూలిపురువ్వట్ల తాన, తనకు బంధంబు గావించికొను లతాంగి.

ఆ. విను ధనార్జనంబు ధనరక్షణంబు ధ,నవ్యయంబు ధనవినాశనముఁ బ్ర
గాఢదుఃఖదములు గావున దుఃఖభా,జనము ధనము గాల్పు మనఁగవలయు.

క. రమణీ తృష్ణాసమదుః,ఖమును బరిత్యాగసమసుఖముఁ గలవే కా
యము ముదిసిన ముదియదు ప్రా,ణము గొని పోఁజాలు తెవులనం జనుఁదృష్ణన్.

క. కామములు భోగములఁ దెగు,నే మెలఁతుక నేత నాఱునే చిచ్చు ధృతిం
గామములఁ దొఱఁగుసౌఖ్యము, నేమియు సౌఖ్యములుఁ బోలునే యరయంగన్.

క. విచ్చలవిడి నింద్రియముల, నెచ్చటి కైనను జనంగ నిచ్చిన నరకం
బచ్చుపడుచుఁ గుదియించినఁ, దెచ్చు సుగతి నరున కది సతీమౌళిమణీ. 234

తే. కామరసమున నతితృష్ణుఁ డై మనుష్యుఁ, డర్థతృష్ణాపరీతాంతరంగుఁ డైన
గొఱియ నడవిలో నెత్తెడుకోలుపులియుఁ,బోలె మృత్యువాతనిఁ గొనిపోవు దేవి.

వ. అని పలికి జరామృత్యువులఁ ద్రోవం జాలు మే లెయ్యది యంటేనిఁ జెప్పెద
నాకర్ణింపు మనుపలుకు వలికి యిట్లనియె. 236

తే. ధనములును దానములుఁ దపోధనము వాజి,పేయ రాజసూయంబులు వేయు నోపి
చేయుటలు గావు మోక్షదర్శిత్వ మొకఁడ, మందు జరకు మృత్యువునకు నిందువదన.

తే. జాములును దివసములు మాసములు నేండ్లు
నైనకాల మాయువుఁ గొని యరుగుచుండు
నెల్లి సేయుపనులు నేఁడ యింతి మాపొ
నర్చుపని రేప చేయుట నామతంబు. 238

తే. మేలు గడు వేగ చేయరు కాలపాశ,బద్ధు లై యేమఱుటఁ జేసి పడఁతి మనుజు
లింత యెఱుఁగుట సంసారమెడలఁ ద్రోచు,నట్టివిసువుటఁ బుట్టించునది హితంబు.

వ. ఇవ్విధంబున. 240

క. ఈ తెరువు లాదరింపఁగఁ, జేతోగతికిని విమర్శసిద్ధి యొదవుఁ ద
జ్జాతవిరక్తియు ముక్తికి, నా తెరువ సమీపవర్తి యచలేంద్రసుతా. 241

క. వైరాగ్యంబు ప్రశాంతికిఁ, గారణము ప్రశాంతి ముక్తిఁ గను మోక్షానం
దారాము జరామృత్యువు, లేరూపునఁ జేర నేర విద్ధచరిత్రా. 242

క. అని చెప్పి మఱియు శివుఁ డి,ట్లను హిమగిరిసుతకు సాంఖ్య మమలినహృదయా

విను వివరించెద సంసృతి, యనురోగంబునకు వైద్య మని యరయంగన్.243

శివుఁడు పార్వతికి సాంఖ్యప్రకారంబు దెలుపుట.

ఆ. జ్ఞానమున విముక్తి సాంఖ్యులు వడయుదు, రరసి చూడఁగా నిరర్థకంబు
ఘోరతరము నంద్రు శారీర మైనతపంబుఁ బంచవింశభజన మూఁది. 244

సీ. ప్రకృతి కవ్యక్తనామకమును గల దండు, మహదహంకారతన్మాత్రలును మ
నమునింద్రియములు భూతములు జన్యములుగా, నోలిన యిరువదినాలు గయ్యెఁ
బంచవింశకతత్త్వభావితక్షేత్ర మా, తత్త్వసంతానంబు సత్త్వమును ర
జస్సుఁ దమస్సు నాఁ జనునిజగుణములఁ, బ్రకృతి దాఁ గరణరూపములు గాఁగఁ

ఆ. గొని సృజించు లోకకోటి నయ్యవ్యక్త, మఱువు నిత్య మేక మక్రియం బ
హైతుకంబు చక్షురాదుల కగ్రాహ్య, మది ప్రధాన మనఁగ నతిశయిల్లు.245

తే. సౌఖ్యతుష్టిప్రకాశముల్ సాత్త్వికములు
మోదఖేదాదికద్వంద్వములు లతాంగి
రాజసము లప్రకాశసంత్రాసమోహ
ములును దంద్రయుఁ దామసములుగ నెఱుఁగు. 246

క. ధృతివిజ్ఞానశ్రద్ధలు, నతివ యసమ్మోహమును దయయు హర్షము నం
చితసత్త్వవృద్ధిఁ బరివర్ధితంబు లగు సత్త్వ మరుగఁ దెరలుం దారున్. 247

తే. క్రోధలోభకామానృతద్రోహచింత, తాపములకు రజోభివర్ధనము వృద్ధిఁ
జేయు వానికి నెల్ల సంక్షీణభావ, మావహిల్లు రజఃక్షయ మావహిల్ల. 248

తే. సంశయంబు విషాదంబు జడత నిద్ర, విను తమస్సు వర్ధింపఁగాఁ బెనుపు నొందు
నది విహీనతఁ బొందిన నవియు హీన, భావ మొందు వికస్వరపద్మనయన.249

సీ. ఒక్కఁడొక్కని చేత నెక్కుచుఁ దఱుఁగుచుఁ, ద్రిగుణంబులును బ్రవర్తించువీన
జనితంబు లగు ప్రీతిసంతాపమోహాదు, లొదవినఁ దద్గుణోదయములఁ
గని యుపేక్షించుచు మనము నూనఁగనీమి, కార్యంబు ధర్మార్థకామములకు
నమరమనుష్యతిర్యగ్జననములకు, మూలముల్ సత్త్వాదు లోలి నెఱుఁగు

తే. బుద్ధి యనఁగ మహత్తత్త్వమునకు నామ
మది వివేకవిజ్ఞానచిహ్నంబు భూత
జని యహంకారమునకు లక్షణ మహంక
రణము దొఱఁగుట మోక్షకారణము దేవి. 250

ఆ. అన్నియింద్రియముల నడరింప మగుడఁ జే, యంగ మనసు సాలు నవియు నదియు
భూతతద్వికారములును దేహము తద, న్యుండు దానఁ బరఁగియుండు దేహి.251

క. విను దేహియు దేహము వే, అనునిశ్చయదృష్టి గల్గునాతఁడు సాలున్
మనసు మగిడింప నది నిర్మనస్కతఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్.252

వ. అప్పుడు ప్రకృతిం దొఱంగి పంచవింశకుండు వెలుంగు నాతత్త్వంబు పరమహంసుం

డనం బరఁగుఁ దద్విజ్ఞానంబు శాంతిసాధ్యంబును బరమశాంతిప్రదంబు నై యుండు.

మ. రసగంధాదిగుణాలిలేమి నవికారత్వంబునన్ సర్వసం
వసనవ్యాప్తి నణుత్వభంగిని మహత్త్వస్ఫూర్తిఁ జతుర్గప్రభృ
త్యసమాలంబితఁ దేజరిల్లుపరమాత్మాఖ్యంబు పద్వంశకం
బు సమత్వంబునఁ జూచు శాంతుఁ డతివార్పొందున్ విమోక్షస్థితిన్. 254

వ. ఇది కపిలాదిపరమర్షిసేవితంబైనసాంఖ్యధర్మంబు యోగప్రకారంబు వివరించెద.

సీ. విను మింద్రియంబులు మనసును బుద్ధియు, నాత్మయు నొక్కటి యగుటఁ గాన్పు
యోగపరిజ్ఞాన ముగ్గలి యగ్నిస, మారాధనంబును నధికవాగ్వి
వర్జనంబును సత్త్వవత్త్వంబు దానాధ్య, యనములు శౌచసత్యములుఁ బాప
ములఁ బాపుఁ బాపనిర్ముక్తుఁడై మతి యోగ, మాచరింపఁగ యోగ్యుఁడగు నరుండు

తే. మనసు వట్టుట ముఖ్యపుటనువు దాని
కామిషము గాలగాని కెట్లట్ల శుచియు
నజనమును నగుచోట మృద్వాసనమునఁ
గాయమున కార్జవము భంగిఁ గలుగ నుండి. 256

క. మనమున నైదింద్రియములు, నునిచి మనం బాత్మ నల్ల నొదిఁగింపఁగ నె
క్కొని ప్రాణంబు నపానం, బును వశ్యత నిలుచు యోగమునసిద్ధికి నై. 257

తే. అవహితుం డయి తద్దశ యనుభవింపఁ, గా నపానమిశ్రప్రాణగతికి మూర్ధ
మతివ యమ్మెయి నెలవగునతఁడ చూవె, జీవుఁ డనఁ బరమాత్ముండునా వెలుంగు.

వ. అని వెండియు. 259

ఉ. ప్రాణు నపానునందును నపానునిఁ బ్రాణునియందు నిల్పి ని
ర్వాణము గోరి చిత్తము దిరంబుగఁ బట్టఁగఁ బ్రాణసంయమా
క్షీణత దేహమధ్యశిఖిఁ జిమ్మఁగఁ దత్త్రయ మొంది మూర్ధపా
రీణతఁ గోర్కి నల్పు నపరిచ్యుతిఁ దద్గతుఁ డైనయోగికిన్. 260

వ. అని చెప్పి వెండియు. 261

చ. అలసతయున్ విచిత్తతయు నత్యశనాదరణంబు రోగముం
గలయును లోభమున్ భయముఁ గామముఁ గ్రోధము లౌల్యమున్ విరో
ధులు విను యోగసేవకు నదుష్టతఁ బేర్చిన యోగ మిచ్చు సి
ద్ధు లెనిమిదింట నప్రతిహతుం డయి యోగి చరించు నెల్లెడన్. 262

ఆ. నిద్ర పెంపు నిద్ర నిగ్రహించుటయును, గొలఁది మీఱుకుడుపుఁ గుడువమియును
యోగి కొప్ప వతఁడు యుక్తవర్తనుఁడైన, నువిద దుఃఖహారి యోగ మొందు.

వ. ఇట్టిది యోగధర్మం బనిన నంబిక సాంఖ్యయోగశ్రవణంబునఁ బరిజ్ఞాతపర
మార్థ నైతి భవదీయసాయుజ్యంబు భక్తు లెట్టిపరిచర్యం బడయుదు రెఱింగింపవే
**యని యడిగిన మృడుండు మృడానికి ట్లనియె.** 264

శివుఁడు పార్వతికి నాత్మసాయుజ్యప్రాప్తిసాధనంబులు దెలుపుట.

క. విను మవిచింత్యుఁడ సురలకు, మునులకు నేనియును యోగ । మునుసాంఖ్యమునా
యొనరించినయవి యీశుఁడ, సనాతనుఁడ నవ్యయుండ । నత్యాత్ముండన్. 265

క. ఏను బ్రసన్నుఁడ నైనం, గానిది లే దర్చకులకుఁ । గావున మత్ప్ర
ధ్యానస్తుతివందనముఖ,నానాభజనముల వలయు । నైష్ఠికత శివా. 266

ఆ. నాలుగాశ్రమముల । నలువురు విప్రుల, కతివ పాశుపతమ । హావ్రతంబు
తెలుఁగు లేను దొల్లి । దెలిపితి శిష్యప్ర,శిష్యసరణి నది ప్ర । సిద్ధ మయ్యె. 267

క. మంగళరక్షాశుచితా,లింగార్చనయోగ్యతలు ఫ । లించుటకై భూ
తిం గావించితిఁ దల్లి,ప్రాంగులును గపాలధరులు । నై శాంతిమెయిన్. 268

తే. బ్రహ్మచర్యభిక్షాశన । పరత గలిగి, జటితయొండె ముండితయొండె । సంభరించి
మనసు నాయంద తిరముగా । నునిచి యొండు,వస్తువులదెస నొల్లమి । వర్తిలంగ. 269

క. చరియించుభక్తజనులకుఁ, బరమానందైకతానుభవ మొసఁగుదు న
వ్వారవున మత్సాయుజ్యము, దొరకొను వారలకు వికచ । తోయజవదనా. 270

వ. ఇది సాయుజ్యావాప్తిప్రకారం బని చెప్పి వెండియు. 271

క. శివలింగస్థాపనముఁ ద్రి,భువనములం బరమహిత ము । పొంబెం గరుణా
ధవళాక్షీ చేసితిం ద,త్ప్రవిమలలింగమున నన్ను । భావించు టుఱున్. 272

చ. కలమెయిఁ బాల నేత నుద । కంబుల నేని వరాభిషేకమం
గళము నొనర్చి భక్తిరతి । గంధము మాల్యము ధూపదీపసం
కలనములుం నివేద్యమును । గాఢసమర్పణ మొందఁ జేసి లిం
గలసితమూర్తియందు ననుఁ । గాంచి భజించిన ముక్తి సేకుఱున్. 273

క. అని పలికి నీవు దేవాం,గన లాదిగఁ గలత్రిలోక । కాంతలకును మ్రొ
క్కు నకుం బాత్రం బగుపద,వనజంబులు గల్గి యొప్పు । వరసతివి శివా. 274

క. చతురవు వివేకవిభవో,న్నతచిత్తవు వ్రతవిధాన । నైష్ఠికతాసం
యుతమతివి లౌకికజ్ఞా,నితామహిమసహజమతి వ । నిందత వరయున్. 275

క. కావునఁ గాంతాధర్మము, నీవలనం దెలియ వేడ్క । నెమ్మనమున నా
కావిర్భవించెఁ జెప్పం,గా వలయును దాని వికచ । కమలదళాక్షీ. 276

ఆ. అనిన సిగ్గుతోడ । యలఁతిన వ్వొలసిన,చెన్ను మొగము వింత । చెలువు దాల్ప
వాంచి యెత్తి గౌరి । వరునితో ని ట్లను, నేను మీకుఁ దెల్ప । నెంతదాన. 277

క. ఐనను మీ రడిగిన మ,న్మానసబోధంబుకొలఁది । మగువల తెఱఁగుల్
పూని వినిపింప కుండుట, దాన తగదు గాన చెప్పెద । నను సర్వజ్ఞా. 278

క. అని పలికి మఱియు ని ట్లను, నను నెప్పుడుఁ బాయ కుండు । నదు లెల్లను న
వ్వనితలతోడ సమాలో,చన మొనరించి మఱి చెప్పఁ । జను నిత్తెఱఁగున్. 279

వ. అని విన్నవించి గంగ యమున గోదావరి కౌశికి కావేరి కృష్ణవేణి పెన్న (నర్మద

బాహుదరేవతమస) మొదలైననదులు మున్న తనతోడన వచ్చియున్న నన్నా
తులగుఱించి యీశానుం డిట్లడిగెడు నెట్లు సెప్పెద మనిన గంగాదేవి నీకంటెనే
మెఱుంగుదుమె నీ వెఱింగిన తెఱంగున నంగనాధర్మం బెఱింగించి పతిం బ్రీతునిం
జేయు మేము భవదీయవాగమృతంబు వీనుల నినిచెద మనుటయుఁ బార్వతి ప్ర
సన్నచిత్తయై వల్లభువదనంబునం జూడ్కి నిలిపి. 280

క. దేవా నీదు ప్రసాద, శ్రీ వచ్చిన యెఱుక సుందరీవిధము భవ
ద్భావంబునకుఁ బ్రియంబుగ, సేవాధర్మంబుఁ దెలియఁ జెప్పెద ననియెన్. 281

తే. అనినవిని సురల్ మునులు ప్రియంబుఁ బొంది, రమరగంధర్వసిద్ధసాధ్యాంగనాజ
నంబు వినువేడ్క వచ్చి యన్నలినవదన, వెనుకదెసనుండె దేవకీతనయ యపుడు.

వ. అని చెప్పి యప్పురుషోత్తమువీనులు వికసిల్లుచుండ నారదుం డిట్లనియె. 283

పార్వతి శివునకుఁ బతివ్రతాధర్మంబుల తెఱఁగెఱిఁగించుట.

క. వనితలుఁ బురుషులుఁ బ్రియమునఁ, దను వినుతింపంగ శైలతనయ సమాక
ర్ణనకౌతుకి యగు నీశా, నునితో మృదురీతి నిట్లనుం గమలేశా. 284

సీ. ఋతుమతి గాక శుద్ధతయుఁ గల్గినయింతి
కన్య తత్పరిణయకరణమునకు
నొడయులు విను తల్లియును దండ్రియును దండ్రి
తోఁబుట్టినతఁడు మాతులుఁడు సోద
రుండును యోగ్యవరునిఁ జూచి వారిలో
నెవ్వరైనను బ్రీతి నిచ్చువారు
పతి యంతనుండియుఁ బ్రభువు దానికి నట్లు
గావున నాతండ దైవ మనుచు

తే. నతనిమత మూఁది దేవతాపితృసమర్చ, నములు నతిథిపూజనము స్మృతిసమాచ
రించుచును బతిహితము వాటించి నడపు, సతి పతివ్రత యిహపరసౌఖ్యమహిత.

వ. ఏతద్విషయం బయినయొక్క నిదర్శనం బవధరింపుము. 286

సీ. బ్రాహ్మణుఁ డొకనికి భార్య లిద్దఱు గల, రం దొకభామిని యతనిహితము
నడపెడునవధాన మెడలి యాతఁడు వంప, కయుఁ దాన సురపితృకార్యపరత
నడచుఁ దక్కటియింతి నాథుఁ బాటించుచుఁ, దన్మతంబునఁ జేయుధర్మవిధులు
వారు మువ్వురు విధివశమున నొక్కట, మృతిఁ బొంది రా పతివ్రత వరుండు

తే. సనిన సుగతికిఁ జనెఁ బెఱవనిత జముఁడు
నీకుఁ బో లేదు మరలుము నీశరీర
మునకు యని యాఁగె నది శోకమున సబాష్ప
యైనఁ గన్గొని యతఁడు దయార్ద్రుఁ డగుచు. 287

క. పతిమతము గొనక ధర్మము, సతివ నడపు టొప్ప దింకనైనను బతికిఁ

హితము లగువాని జేసిన, నతని గలయు దనికి జనియెడు గతియును మరలన్.
వ. కావునం బతికి ననువ్రత యగుట గృహిణికి ధర్మం బని పలికి వెండియు. 289
క. లలన యిలు వాడి నాథుడు, వలచినచవివంటకములు వండి యిడి తనుం
గలయ దలంచిన మెయికొని, యెలమిం గై సేసి హృదయ మిా వలయు శివా.
తే. పనులయెడ మాఱు వలుకక యనవధానుడై నపతి దలపించి ధర్మార్థకలిత
కృతులు నడపుచు సవతి గల్గినను బోరి,తంబు లేకొక్కటై యున్కి దగవు సతికి.
క. సవతాలికి బతి వలచిన, నవ్వగా కని యతనియిచ్చ కనురూపముగా
దివిరి నడచునతి దైవము, శివ యది దగు నెల్లజనములచే మొ్రక్కగొనన్.
క. తనచేతికి నిచ్చినవ, స్తునికాయము నిల్లురువ్రనచొప్పున మగుడం
గొన వచ్చి భార్య పతి దె, మ్మనినప్పుడ యిచ్చు టొప్పు నకపటవృత్తిన్.293
క. పతి దనకు నేమి యిచ్చిన, నతిముదమున బొంద వలయు నాత్మజు డైనన్
మతి గొంకక యేకాంత,స్థితి నేకాసనత నున్కి సెట్ట ప్రమదకున్. 294
క. ధని యధనుడు రూపసి యె,ప్పనివాడు వివేకి మూఢభావు డరోగుం
డనుగతిరోగు డనక యం,గన పతి బాటింప వలయు గామధ్వంసీ. 295
క. బలి భిక్షము గడప కిడ, న్వలయును దేవపితృపూజనంబులకాలం
బుల బతి శుభ మందుట ద,త్ఫలంబుగా గోరు టొప్పిదము సతికి శివా.
క. గతి పతియచువ్వొ భార్యకు, నతని గడచినట్టిసత్పరాయణము కృపా
యుత కలదే కావున దా, నతనికి భక్త యగు టిచ్చు నఖిలశుభంబుల్.297
వ. అని చెప్పి యప్పరమేశ్వరునకుం బార్వతి భార్యలయధర్మంబుల వివరించు
నది యై యి ట్లనియె. 298

పార్వతికి శివునకు బతివ్రత కసర్హంబు లగుధర్మంబుల దెలుపుట.

సీ. పరమేశ యాసురి పై శాచి రాక్షసి
యనుపేళ్లు గల వధర్మాంగనలకు
వ్యభిచారతత్పరత్వంబు వారికి నెల్ల
గల దసురాంశజ కౌర్యనిరత
దనయిచ్చ బొలియించు ధనధాన్యములు చల
హృదయ భోగపరాత్మ యీర్ష్యగలదు
పై శాచి క్రోధన భర్తృపుత్త్రులయందు
నిస్స్నేహ గృహకార్యనిపుణ గాదు
తే. కలహశీల రాక్షసి సయికంబు లేదు, బొంకు వల్కు నెప్పుడు నిద్రవోవు వీత
లజ్జ యిందఱు నాథునకలంబువారి,దురిత మొందించి పోదురునరకమునకు.299
ఆ. ఎఱుక గలిగి పిదపనేనియు బతిభక్తి, గలిగి ధర్మ మోపి చలిపి శాంతి
గలిగి యున్న మున్ను గలపాపములు వాసి, పురుషుతోడ దివికిబోవగండ్రు.

ఆ. అట్లుఁ గాక పతులయంతిమసమయంబు, నందుఁ జింత దక్కి యనుమరణము
చేసిరేని సుగతి సిద్ధించుఁ బతిసమేతంబు గాఁగ నన్నితంబినులకు. 301

క. ద్విజభామినికి సధర్మము, ప్రజఁ గాంచినపిదప నయ్యపత్యము శోకో
ద్విజితయుఁ బతిభక్తయు నై, త్యజించి యనుమరణనియత యగుట మహేశా.

క. అని చెప్పి గౌరి పతికి, ట్లను నా దగుచాపలమున నఖిలేశ్వర నిన్
వినిపించితి నేఁ గొన్నివ, చనముల నీతప్పు నాకు సైఁపుము కరుణన్. 303

క. అని సిగ్గునఁ జెన్నగునా, నన మించుక వాంచి యెత్తు నగతనయ శివుం
డును మునులును మునిపత్నులు, వినుతించిరి మధురవాక్యవిభవం బెసఁగన్.

క. సురగంధర్వఖచరకి, న్నరకింపురుషోరగాదినారీజనముల్
పరమప్రీతిని బొగడిరి, పరమేశ్వరి నెలుఁగు లడరఁ బంకజనాభా. 305

క. అని చెప్పి నారదుం డి, ట్లను నగ్గోవిందుతోడ నప్పుడు ప్రియమా
ననమునఁ బొదలఁగఁ బార్వతిఁ, గనుఁగొని సర్వేశ్వరుండు గౌరవ మొప్పన్.

క. నానీసంవాదము శుచి, యై నైష్ఠికజనుల కెవ్వఁ డాదర మెసఁగం
గా నలినాక్షీ చెప్పును, వానికి నిత్యామరత్వవైభవ మొదవున్. 307

క. మనసంవాదం బెవ్వరు, వినిరి నియతి నజ్జనులకు విభవముఁ దేజం
బును గీర్తియు నాయువు శ్రీ, యును నారోగ్యంబుఁ గల్గు నుత్పలనయనా. 308

క. అని నిర్దేశించి శివుఁడు, సనియె శివయుఁ గొలువుతోన చనె నిర్దెసకుం
జని రన వశమే యద్భుత, మనిరూప్యం బప్రతర్క్య మది శ్రీరమణా. 309

క. అని పలికి నారదుఁడు నా, వినినకనినయద్భుతంబు వినిపించితి నీ
కనియెం గృష్ణుని సభ్యుల, మనంబు లానందపూరమగ్నము లయ్యెన్. 310

వ. అని యిట్లు భీష్ముం డుమామహేశ్వరసంవాదం బనుపుణ్యకథ సెప్పిన ధర్మ
తనయుండు సోదరసహితంబుగాఁ బ్రమోదరసభరితుం డై. 311

భీష్ముఁడు ధర్మజునకుఁ బరప్రాప్తిహేతుభూతం బగుజపవిశేషంబు దెలుపుట.

సీ. అతనికిఁ బ్రణమిల్లి యనఘ పరప్రాప్తి, యెద్దాన సమకూరు నెఱుఁగఁ జెప్పు
మనిన నతండు నారాయణధ్యానపూ, జాస్తుతితత్కథాశ్రవణనిరతి
యమ్మేలు గావించు నధిప విద్వజ్జన, సంరక్షణము కల్మషములఁ బాపు
వేశ్య యొక్కతె దొల్లి విద్వాంసు నొకరుని, మ్రుచ్చని తలవరుల్ మోఁదఁ జూచి

తే. యితఁడు మావాఁడు మీ రిది యేటి కాగ, డంబు సేసెద రని మోక్షణంబు సేసి
యాసుకృతమున బ్రాహ్మణి యై జనించెఁ, దగఁగ నర్చింపు మీవు విద్వజ్జనముల.

వ. అనిన విని యుధిష్ఠిరుండు దారిద్ర్యవ్యాధిశోకంబులకు శాంతి సంపాదింపం
జాలుజపం బెయ్యది సెప్పవే యనుటయు ననిమిషనదీనందనుండు బ్రహ్మవిష్ణు
మహేశ్వరులను వినాయకవిశాఖవహ్నివాయుచంద్రాదిత్యులను శక్రవరుణ
యమకుబేరులను సురభిని సముద్రంబులను గంగాదిమహానదులను మరుదశ్వి

వసురుద్రాదిదేవతలను బితృదేవతలను వాలఖిల్యాదిసిద్ధులను వేదవ్యాసవాల్మీకి నారదాగస్త్యగౌతమకశ్యపాత్రికణ్వాదిమహామునులను రంభాద్యప్సరస్త్రీలను ధర్మతపస్సత్యములను నహోరాత్రంబులను దారాగ్రహంబులను నశ్విన్యాది తారకంబులను మాసర్తువత్సరంబులను వైనతేయకాద్రవేయులను గాశీక్షేత్ర కురుక్షేత్రాదిపుణ్యక్షేత్రంబులను నైమిశారణ్యదండకారణ్యాదిపుణ్యారణ్యంబులను మేరుహిమవత్కైలాసాదిప్రభూతశైలంబులను దిజ్నభోభూములను బుణ్యభూరుహంబులను భూసురులను జక్రవర్తులను రాజులను బరమభక్తిం దలంచి కీర్తించి నమస్కరించి యీసమూహం బంతయు నన్ను రక్షించి నాకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిపరమానందంబు లభినందనపూర్వకంబుగా నిచ్చుంగావుత మని యిచ్చఁ గోరి యోం నమో భగవతే వాసుదేవాయ నమః పురుషోత్తమాయ నమ స్సర్వలోకగురవే నమ స్సర్వలోకపిత్రే నమ స్సర్వలోకపితామహాయ నమ స్సర్వలోకప్రపితామహాయ నమ స్సర్వలోకప్రధానాయ నమ స్సర్వలోకేశ్వరాయ నమ స్సర్వలోకవిశిష్టాయ నమ స్సర్వలోకసుఖప్రదాయ నమ స్సర్వలోకకర్త్రే నమ స్సర్వలోకభర్త్రే నమ స్సర్వలోకహర్త్రే నమ స్సర్వలోకనిధయే నమ స్సర్వలోకనిధానాయ నమ స్సర్వలోకహితాయ నమ స్సర్వలోకహితకరాయ నమ స్సర్వలోకోద్భవాయ నమ స్సర్వలోకోద్భవకరాయ నమో విష్ణవే ప్రభవిష్ణవే యని పఠించుట మహాజపంబు. 313

క. పాపంబులును భయంబులు, నాపదలుం బాయు నిమ్మహాజపమున ధా
త్రీపాలోత్తమ శుభములు, ప్రాపించును ధర్మతత్పరత సిద్ధించున్. 314

వ. అని యిట్లు గంగాపుత్త్రుం డజాతశత్రునకు సర్వసిద్ధికరం బయినయిమ్మహాజపం బుపదేశించె నని చెప్పి తదనంతరసత్కథ లాకర్ణింపు మని పలికి జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 315

తే. మనుజనాథ యశేషధర్మములు సర్వ
పావనములు శాంతనవుఁడు బహువిధములఁ
జెప్ప నిమ్మెయి విని యుధిష్ఠిరుఁడు భక్తి
నమ్మహాత్మునిని ట్లని యడిగె మఱియు. 316

చ. అతఁ డొకరుండు లోకముల కన్నిటికిన్ మహనీయ మైనదై
వతముఁ బరాయణంబు నను వైభవ మెవ్వని కొప్పు నర్చన
స్తుతిరతి నెవ్వనిం గొలిచి శోభన మొందు జనంబు మేలు నా
నతిశయ మొంది నీకు మత మై చను నెయ్యది ధర్మకోటిలోన్. 317

తే. జపములం దెల్ల నుత్తమజపము నాఁగ, నంచితం బయి తన్ను జపించుజంతు
వునకు జన్మసంసారబంధనము లోపి, పావు నెయ్యది యెఱిఁగింపు పరమబోధ,

వ. అని యడిగిన నాభూపతికి భీష్ముం డి ట్లనియె. 319

భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రధ్యానం బవశ్యానుష్ఠేయం బని చెప్పుట.

సీ. అఖిలజగత్ప్రభు వగు దేవదేవు న,నంతునిఁ బురుషోత్తమాభిధాను
నంచితనామసహస్రకంబున సంస్తు,తించుచు సంతతోత్థితమనస్కుఁ
డై యజమానుఁ డవ్యయుఁ డైనయాతని, నర్చించుచును దృఢధ్యాననిరతుఁ
డగుచు నమస్కృతి యాచరించుచు ననా,ద్యంతు నవ్విష్ణు నధ్యక్షు నెల్ల
తే. లోకములకు బ్రహ్మణ్యుఁ ద్రిలోకకీర్తి,వర్ధనుని సర్వధర్మజ్ఞు బరదు లోక
నాథు భూతభవోద్భవు నమ్మి భక్తిఁ, గొలిచి సర్వదుఃఖంబులఁ దొలఁగఁ ద్రోచు.
తే. ప్రస్తుతులఁ బుండరీకాక్షుఁ బరమభక్తిఁ,దలఁచి యర్చించుట యనామతంబు సర్వ
ధర్మములకును సమధికతమము నైన,ధర్మ మింత యెఱుంగుము ధర్మతనయ.
సీ. పరమతేజంబును బరమపదంబును, బర మైన బ్రహ్మంబుఁ బరపరాయ
ణముఁ బవిత్రంబులు నాఁ దగువానికి, నెల్లఁ బవిత్రంబు నెల్లమంగ
ళంబులకును మంగళంబును నెల్లదే,వతలకుఁ బరమదైవతము భూత
సమితికి నవ్యయజనకుండు నగునట్టి,వాఁ డెవ్వఁ డెవ్వానివలనఁ దోఁచు
తే. నాదియుగమునాగమమున నంత్యవేళ, నడఁగు నెవ్వానియందుఁ జరాచరములు
విశ్వలోకప్రధానుఁ డవ్విష్ణు వేయు,భవ్యనామంబులును బాపభయహరములు.
తే. భూరిగుణయోగవిఖ్యాతములును ఋషిస
మాజపరిగీతములును నై మహిమఁ దనరు
నమ్మహాత్మునినామంబు లధికతరవి
భూతికై చెప్పెదను విను భూపవర్య. 323
వ. అని పలికి విశ్వంబు విష్ణుండు వషట్కారుండు భూతభవ్యభవత్ప్రభు వనునివి మొద
లై రథాంగపాణి యక్షోభ్యుండు సర్వప్రహరణాయుధుం డనియెడునివి తుదగాఁ
గలసహస్రనామంబు లుపన్యసించి. 324
ఆ. కీర్తనీయుఁ డైన కేశవుదివ్యనా,మంబు లివి భవద్ధితంబు గోరి
తరతరంబ కీర్తితంబు లయ్యె నశేష,భంగి వేయుఁ గురునృపాలవర్య. 325

భీష్ముఁడు ధర్మజునకు విష్ణునామప్రభావంబు దెలుపుట.

సీ. విష్ణునామంబులు వేయును నిత్యంబు, వినినఁ బఠించిన మనుజుఁ డిహము
నందుఁ బరమ్మున నశుభంబు నొందక, యత్యంతశుభముల ననుభవించు
విప్రుండు వేదాంతవిదుఁ డగు రాజు వి,జయ మొందు వైశ్యుఁ డక్షయధనంబు
వడయు శూద్రుఁడు సుఖభాగిత వెలయు ధ,ర్మార్థకామప్రజాభ్యర్థిజనులు
తే. గాంతు రమ్మెయి తెఱంగు లేకకాంతభక్తి,శౌచియై విని కీర్తించి సారయశము
నచలలక్ష్మియు వంశవర్యతయు మేలి,పెంపుసొంపునుగలిగి శోభిల్లు నరుఁడు. 326
సీ. పురుషోత్తమునినామములు వేయుఁ గీర్తించు,నాతఁ డొక్కెడ ననుభయంబుఁ బొందఁ

డమితవీర్యమునఁ దేజమునఁ గాంతిని బల,రూపగుణంబుల నూఢి కెక్క
రోగబంధాపదార్తులకుఁ బఠనమాత్ర, నయ్యయి దురితము లడఁగు వాసు
దేవాశ్రయుఁడు వాసుదేవపరాయణుం,డును నగుమర్త్యుఁ డర్వినుతనామ

ఆ. కము లుపన్యసించి కల్మషంబుల నెల్లఁ, దొఱఁగి దుర్గతులకుఁ దొలఁగి జన్మ
మరణములకు రోగజరలకు నందని,పరమ మైన బ్రహ్మపదము నొందు. 327

క. స్మృతిసౌఖ్యక్షాంతిశ్రీ,ధృతికీర్తులు గలుగు దుర్మతియుఁ గ్రోధము లు
బ్బతయును మాత్సర్యము లే, వతిపుణ్యాత విష్ణుభక్తు లైనజనులకున్. 328

సీ. చంద్రార్కనక్షత్రసహిత మైననభంబు
సచరాచరోర్వియు జలనిధులును
సురదైత్యగంధర్వగరుడయక్షోరగ
వ్రజములు హరివశవర్తనములు
బుద్ధియు నింద్రియములును మనంబు స
త్త్వంబును బలముఁ దేజంబు ధృతియు
క్షేత్రంబుఁ దద్గతక్షేత్రజవస్తువు
లరయఁగా వాసుదేవాత్మకంబు

తే. లాగమోదితాచారమయంబు ధర్మ
మచ్యుతుండు తత్ప్రభువు సాంఖ్యమును యోగ
తంత్రమును శిల్పవేదశాస్త్రములుఁ గర్మ
ములు జనార్దనువలన సముద్భవించె. 329

ఆ. విష్ణుఁ డొక్కరుండ విను మహాభూతంబు, దక్కభూతతతులు పెక్క గలవు
సరిఁ ద్రిలోకములను బరఁగి విశ్వంబు భూ,తాత్ముఁ డమ్మహాత్ముఁ డనుభవించు.

ఆ. వ్యాససంప్రణీత మైనయీవిష్ణుస్త,వంబు సకలశోభనంబులును సు
ఖములుఁ గోరుపురుషుఁ డమలినబుద్ధిఁ బ,ఠింపవలయు భక్తిపెంపుతోడ. 331

క. అజు విశ్వాధీశ్వరు స,ర్వజగత్ప్రభవాప్యయప్రవర్తనకరు నం
బుజలోచను నెవ్వారలు, భజింతురు పరాభవమునఁ బడ రప్పుణ్యుల్. 332

క. కావున విష్ణునిపే ళ్లగు, [1]నీవేయుఁ బఠింపు నీకు నెప్పుడు నాయు
శ్శ్రీవిభవారోగ్యంబులు, భూవర సిద్ధించుఁ బరమబోధముఁ గలుగున్. 333

క. అని యి ట్లుపదేశించిన, విని మోదము నెమ్మనమున వెల్లిగొనఁగఁ బాం
డునియగ్రసుతుఁడు గాంగే,యుని కభివందన మొనర్చి యుచితవినయుఁడై. 334

వ. పూజానమస్కారంబులకు నెవ్వరు భాజనంబు లెవ్వరికిఁ జెట్ట సేసినం జేటు
వాటిల్లు నెవ్వారలు సంతోషించిన శుభంబులు సొప్పడుం జెప్పవే యనిన
నతం డతని కి ట్లనియె. 335

---

1. క. చ. జ. 'నీవేయుఁ బఠింపు నీవు ♦ నిచ్చలు',

బ్రాహ్మణపూజానమస్కారంబులు పరమోత్కృష్టంబు లని చెప్పుట.

సీ. పూజానమస్కార✽ములకుఁ బాత్రములు బ్రా
హ్మణులు వారలకుఁ గీ✽డాచరించి
వాసవుండును జెడు✽ వారిసంతసమున
నఖిలశుభంబులు✽ నావహిల్లు
ధర్మసేతువు లోక✽ధారకం బఖిలశా
స్త్రప్రవర్తకము వి✽ప్రప్రవ్రజంబు
తపమును వాక్కును✽ ధనము విప్రుల కొక్క
కుడుపుమాత్రన పాప✽కోటిఁ బాతు

తే. రమ్మహాత్ములు సొప్పరు✽ లఖిలమార్గములకు విను దేవతలు దేవ✽తలకు బాలుఁ
డజ్ఞుఁ డన లేదు పూజకు✽ నర్హు లనిన, నధిప వృద్ధులఁ బ్రాజ్ఞుల✽ నడుగ నేల.

వ. అనిన నిని యజాతశత్రుండు బ్రాహ్మణులఁ బూజించుటవలన విశిష్టం బయిన శుభం బెయ్యది దృష్టం బయ్యె వారలయందు వర్ణనీయం బగువర్తనం బేమి గానంబడియె నీ విట్లు వారలం గొనియాడె దెఱింగింపవే యనుటయు నాపగాపుత్త్రుండు పవనార్జునసంవాదం బనునితిహాసంబు విను మది భవత్ప్రశ్నంబునకు సదుత్తరం బై యుండు నని పల్కి యజ్జనపతి కి ట్లనియె. 337

పవనకార్తవీర్యార్జునసంవాదంబు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట.

సీ. అధిప సహస్రబా✽హార్జునుఁ డేడుదీవులు నేలి యద్భుత✽బలపరాక్ర
మములఁ దనర్చి మ✽త్సము లెవ్వరును నెందు, లే రని యత్యవ✽లేపయుక్తి
నాడిన నొకభూత✽ మాకాశమున నుండి, యెఱుఁగక పలికెద✽ వెల్లవారి
కధికులు గారె ధ✽రామరు లనవుడు, నతఁడు వారలు రాజు✽ నాశ్రయించి

తే. నడపికొందురు మనుగడ✽ పుడమిజేనికంటె నెక్కుడై రట్లుఁ✽ గాక యేను
మనుతుఁగూర్చినఁజెఱుతున✽గ్నినసమస్తభూతములనన్న వెఱచియా✽భూతమరిగె.

వ. అట్టియెడం బవనుండు గగనంబున నుండి తన్నెఱింగించికొని యన్నరపతితోడ.

సీ. భూదేవశక్తిన✽ కాదె రాజులు ప్రజారక్ష యొనర్చుట✽ బ్రాహ్మణులకు
నధికులు గలరె య✽హల్యకై యింద్రుండు, గౌతముఁ డలిగిన✽ గాసిఁ బడఁడె
కుంభసంభవుచేత✽ నంభోధి యడఁగదె, యనలుండు భృగుశాప✽హతుఁడు గాఁడె
యన విని మఱుమాట✽యాడక యున్నయర్జునునకుఁ బవనుఁ డి✽ట్లనియె మఱియు

తే. నాంగిరసవంశసంభవుం✽ డగునుచథ్యుఁ
గోరి నిజపుత్త్రి సోముఁడు✽ గారవమున
నిచ్చె నాదంపతులు దమ✽యిచ్చ వనము
నందు వసియించి మునిహృద✽యంబు లలర. 340

వ. వర్తించునెడ నొక్కనాఁ డమ్ముని యమునానదీస్నానంబునకుం జనుటయు మున్న

యవ్వనితం గామించి వేచి తిరుగువరుణుండు. 341

క. ఎత్తికొని పోయి తనపురి, నత్తామరసాక్షి నునిచె । నమ్మునికడకుం
మెత్తన చని నారదముని, యత్తెఱం గెఱింగింప నాతం । డాతనితోడన్. 342

తే. తాన దిక్పతి దన కిట్లు । దగునె యొరుల, భార్యఁగొని పోవ సే వేగ । పలుకు మిట్లు
యనినఁజని నారదుండు సెప్పిననువిడువఁ, డయ్యెఁగామాంధుఁడై సత్రి । నబ్ధివిభుఁడు.

వ. విడువ కున్న నమ్ముని యుచథ్యుకడకు మగిడి వచ్చి. 344

సీ. ఇంతిఁ దా విడువని । యంతియ కాదు నన్, బెడతల వట్టి క్రోకపించె వరుణుఁ
డని చెప్పుటయు నల్గి । యతఁడు సర్వజలంబుఁ, దాఁగిన వరుణపు । రంబు ధూళి
మయ మైన భయ మంది । మానినిఁ గొనివచ్చి, యొప్పించి ప్రణమిల్లి । తప్పు వాపి
కొని మునికృప గాంచి । చనియె నాదిక్పతి, ధరణీశ రాజులో । ధరణిసురులొ

ఆ. యెక్కు డనిన వినియు । నక్కిల్లు వడి యున్న, యతనితోడ ననిలుఁ । డమరు లసుర
సమితి కోడి వచ్చి । శరణు సొచ్చిన నగ, స్త్యుండు విజయలక్ష్మి । నొసఁగుటయును.

వ. గంగాతీరంబునం గ్రతువు లొనరించుగీర్వాణులం బూర్వగీర్వాణులు గాసి చేసిన వసిష్ఠునికడకు వారలు వలియం బాఱుదేరం గోపించినయత్తాపసోత్తముని రోషానలజ్వాలలు [1]సాకారంబు లయి యాదైత్యలోకంబు నేర్చుటయుం జెప్పి యక్కుంభసంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠు లగుట రాజుల కొడఁ బాటు గాదో కదే యనినను బలుక కున్న యన్నరపతితోడం బవమానుండు మఱియు ని ట్లనియె. 346

పవనుఁడు కార్తవీర్యార్జునునకు నత్త్రిప్రభృతులమహిమ సెప్పుట.

సీ. ఒకతఱి దేవత । లకు దైత్యులకు మహా, రణ మయ్యె నప్పార । రాహుశస్త్ర
సమితిచే నర్కుండుఁ । జంద్రుండు సొలసిన, వెలుఁగడంగుడుఁ దమ । మొలసి వెగడు
పడినయద్దివిజుల । వడి నంటఁ దాఁకి య, య్యసురలు నొప్పింప । నత్త్రికడకుఁ
బాఱి మమ్ముం గావు । పరమదయాత్మక, యనుడు నతండు చం । ద్రార్కతనువు

ఆ. లక్షతములు సేసి । యసురసైన్యము రూపు, మాపె నిజకటాక్ష । మాత్రమునన
యతని నృపులకంటె । నధికుఁ డందమొ హీనుఁ, డందమో నిజంబ । యధిప చెపుమ.

సీ. అనిన నూరక యున్న । యర్జునుతోడ స, దాగతి యి ట్లను । ధరణినాథ
సురపతి యాశ్వినుల్ । సోమపానంబున, కర్హులు గా రన్న । నాశ్రయంబు
వాటించి వారికై । భార్గవచ్యవనుండు, దనమంత్రములబల్మి । ననిమిషులకు
నెగ్గు సేయంగ న । య్యింద్రుండు వోటున, వ్రేటున నాతని । గీటడంచు

తే. బుద్ధి నొకశైలమును వ । జ్రమును రయమునఁ
గొని మహోగ్రతఁ గవియ న । మ్మునివరుండు
జలము సల్లిన శైలవ । జ్రములుఁ దాను

---

1. క. గ. ట. సాయకాకారంబులై.

[1]ముదుఁగఁబడి యబ్బలారాతి ƒ మూర్ఛవోయి. 348

వ. ఒక్కింతసేపునకుం దెలిసె నంతకు నమ్మునివరుండు మదుం డనువాని శతయోజన దీర్ఘసహస్రదంతుని సృజించి పంచిన. 349

ఆ. వాఁడ సురగణంబు ƒ వాసవుఁ గబళింప, వారు శరణుశరణు ƒ వరమునీంద్ర
యనిన వారిఁ గాచె ƒ నమ్ముని వా రిచ్చి,రపుడు సోమపాన ƒ మాశ్విసులకు. 350

క. నీ వాచ్యవనుండును ధా,త్రీవరుసరి గామి యెట్లుఁ ƒ దెలుప కుడుగుదే
నా వినియు నొక్కమాటయు, నావిభుఁ డాడండ దాని ƒ కలయక మఱియున్. 351

వ. వాయుదేవుం డన్నరదేవువలనికరుణంజేసి యతనిచే టోర్వనివాఁ డై. 352

సీ. అకట దత్తాత్రేయుƒనకు భక్తి శుశ్రూష, సేసి కాదే యివ్విƒశిష్టబలప
రాక్రమంబుల నొంది ƒ రాజుల కెల్లను, నెక్కుడై తాకృత ƒ మేల మఱవ
వినుమి మొకండవే ƒ యనిమిషాదిసమస్త,భూతంబులును వృద్ధిƒబొందు టవని
దివిజులకృపన యీƒతెఱఁగెల్లజనములు, నెఱిఁగినపని శాంతిƒ గొఱలి విప్ర

తే. కులము దైవస్వరూపం బƒగుట మనంబు,నందు దృఢముగ నిల్పి తƒదాశ్రయమున
నెలయువాఁడవై నను మేలుƒవినుమునాదు, బుద్ధియనపుడునతఁడు ప్రƒబోధ మొలసి.

క. నీపనుపు సేసి బ్రదికెద, నేపు నహ్వాంకృతియు విడిచి ƒ యెల్లవలన మే
లాపాదించుచు విప్రుల, శ్రీపాదము లాశ్రయించి ƒ చెందెద శాంతిన్. 354

ఆ. అనిన సంతసిల్లి ƒ యనిలుఁ డానృపు బుద్ధి, గలిగి బ్రదుకు మనుచుƒగారవించి
వీడుకొల్పి చనియె ƒ విప్రులపెం పిట్టి, దని యెఱుంగు కురుకుƒలాగ్రగణ్య. 355

### భీష్ముఁడు ధర్మజునకుఁ గృష్ణుని ప్రభావం బుపన్యసించుట.

వ. అనుటయు నవ్విభుండు బ్రాహ్మణమహానుభావం బింకను విన వలతుం జెప్పవే యనుటయు నప్పుడమిఱేనికి భీష్ముండు దనకు నింద్రియంబులును వాఙ్మనసంబులును నపుడు దుర్బలంబు లగుట యెఱింగించి యినుండు దక్షిణాయనంబు తుది సేరుచు వచ్చె దేహన్యాసంబు తడవు లేమి దోఁచు చున్నది కృష్ణుండు నీకు విప్రజనవిశేషంబు వివరించువాఁ డని పలికి యిట్లనియె. 356

తే. ఏను గృష్ణు నెఱుంగుదు ƒ మానవేంద్ర, యెత్తెఁ గ్రీడావరాహ మైƒయిద్ధరిత్రి
నిది యొకండును జెప్పఁగాƒనేల కృష్ణు,లీలఁ గాదె భూమ్యాదిభూƒతాలి గలిగె.

వ. కృష్ణుండు. 358

తే. బొడ్డుతామరయం దొక్కƒపురుషుఁ డుద్భ,వించునట్లుగఁ [2]జేసి తƒద్విరచనాని
భమున నఖిలచరాచరƒప్రభవ మయ్యె, నరయ సామాన్యమేకృష్ణుƒపరమలీల.

క. విను మెత్తఱి ధర్మంబులు, దనుజులచే బాధఁ బొందుఁ ƒ దత్సమయమునఁ
జనియించి యద్దురాత్ములఁ, దునుముం గృష్ణుండు ధర్మƒధుర్యులఁ గాచున్. 360

క. శూలియునుం దాన దిశా,పాలురునుం దాన విశ్వƒపతియును గురుభూ

1. క. ముడిఁగిపడి. 2. జ. జేసెఁ దద్విరచనావిభవము నఖిల.

పాలవర తాన కృష్ణుఁడు, కాలము దిక్కులును దాన కలఁ డఖిలములన్. 361

ఆ. అరయఁ గృష్ణుఁ డధ్వరాత్మకుఁ డఖిలాగ,[1] మోక్తమంత్రతంత్రయుక్తి నతనిఁ
బ్రస్తుతించి మేలు వడయుదు రధ్వర,కర్తలైనజనులు కౌరవేంద్ర. 362

క. చయనంబుల ఋగ్వేదం, బయమహితసువర్ణనాముఁ డగుకృష్ణుగుణో
దయము వినుతించు యజ్ఞ,క్రియానిరతులైనసురలు ప్రీతిం బొందన్. 363

క. విను ఋగ్వేదము కృష్ణుని, వినుతించుట యుఁడె యఖిలవేదంబులుఁ ద
జ్జనితవిలాసంబులు వే,దనిరూపితవస్తువు నసఁ దాన కుమారా. 364

తే. అగ్నులును యజమానుఁడు నాహుతులును
యాగఫలరూపమును గృష్ణుఁ డని యెఱుంగు
మినశశాంకతారకముల నెసఁగుతేజ
ములును గృష్ణమయంబుల భూపవర్య. 365

క. పరమజ్యోతి యనఁగ నిర్జరామరపదం బనంగ సత్యం బన భూ
వర యమృత మనఁగ దేవకి,వరసుతుఁడు వెలుంగు వేదవర్గముతుదలన్. 366

క. అని యిట్లుపదేశించిన, విని మోదము నొంది పాండువిభునగ్రసుతుం
డనిమిషతటినీసుతునకు, వినతుండై నెమ్మనమున వేడ్కఁ డలిర్పన్. 367

కృష్ణుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట.

వ. కృష్ణునకుఁ బ్రణమిల్లి దేవా భూదేవమాహాత్మ్యంబు విన వలతు నాన తీయవే
యని వినయసంభృతుం డగుచుఁ బ్రార్థించిన నప్పార్థివుని మీఁదఁ గరుణామృతమ
యం బగునాలోకనం బొలయ నద్దేవుం డాదరభరితుం డై యిట్లనియె. 368

క. ననుఁ బ్రద్యుమ్నుం డివ్విధ,మున నడిగిన వాని కేను ముద మందుచు నా
తనిహితము గోరి కుంతీ,తనయాగ్రజ యున్నరూప తగ నిట్లంటిన్. 369

సీ. వర్గత్రయము నపవర్గంబు సాధింప, నమరపితృప్రీతు లాచరింప
నైహికసుఖము లుపార్జింప వలసిన,వారికి విప్రుల చేరుగడలు
దివిజుల కైన నాయువు శ్రీయుఁ గీర్తియుఁ, దనరుట తత్ప్రసాదమునఁ జూవె
యలిగి భస్మము సేయ వలచి పెం పొసఁగంగ, నవనీసురులు శక్తులట్టు లగుట

తే. వారిఁ గోపింపఁ జేయక వారలకుఁ బ్రి
యంబు సేయుచు వారు ప్రహర్ష మొందఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండు రెండు
భువనములయందుఁ బెంపును బొగడుఁ బడయు. 370

దుర్వాసుఁడు కృష్ణునిమనశ్శుద్ధి పరీక్షించి యనుగ్రహించినప్రకారము.

వ. నాకనినయాశ్చర్యంబు సెప్పెద నాకర్ణింపుము స్వతంత్రప్రవర్తనుం డగుదుర్వా
సుండు మనమందిరంబునకు వచ్చి మందహాసంబు సేయుచుఁ గోపించుచు సుము

1. క. చ. జ. మోక్తమంత్రతతుల భక్తియుక్తి.

ఖుం డగుచు విముఖత్వంబు నొందుచుఁ గుడువనొల్ల ననుచుఁ బెక్కండ్రకుం గావిం
చినకూడుగూర దా నొక్కరుండ భుజించుచు సెజ్జ నిద్రించుచు భూమి శయనిం
చుచు నెందేనిం బోవుచు మరలి వచ్చుచుఁ బ్రవర్తించుచుండి యొక్కనాఁడు
కృష్ణా నాకుం బాయసంబుమీఁద వేడుక పుట్టెడుఁ బెట్టింపవే యనఁ దత్క్షణంబ
కావించినం గొంత గుడిచి కొంత దనయొడలం బూయు మనినం బూసితి నచ్చెరువ
నున్నరుక్మిణిం జూచి కొంత యక్కాంతమేనం దాన పూసి రథ్యరూపంబుగా
రథంబున నప్పొలఁతిం బూన్చి రథారోహణంబు సేసి వీథికి వెడలి యమ్ముద్ది
యను ములుకోలం బొడుచుచు రథంబు నడపింప నాకుం గోపంబు నీర్ష్యయు
నించుకయు జనియింప కుండె నేనుం జూచుచుం దోడన నడచితి నప్పుడు
యాదవు లాశ్చర్యకోపభయాయత్తచిత్తులై యనేకప్రకారంబులం దమలోఁ బలు
కుచుం జేయునది లేక కెలంకుల వచ్చుచుండ. 371

ఆ. రథము దివిచి డస్సి ǂ రమణి మేదినిమీఁద, మ్రొగ్గతిలఁగఁ బడిన ǂ డిగ్గ నుఱికి
దానిమీఁద ధూళి ǂ దాఁ జల్లి వెసఁ బాఱె, నమ్మునీశ్వరుండు ǂ యామ్యదిశకు.

క. పాఱిన నాతనివెనుకన, పాఱితి సంప్రార్థనాప్ర ǂ భాషణములతోఁ
దేఱి మరలి యమ్ముని మముఁ, గాఱియ వెట్టితిఁ గదే య ǂ కట యనుచు దయన్.

వ. నన్నుం గనుంగొని నీవు కోపంబు జయించితివి నీకు వరం బిచ్చెదఁ గైకొనుము.

ఆ. ఎల్లవారుఁ దమకు ǂ నెంత గూర్తురు నీకు, నంత గూర్చి నిన్ను ǂ ననుసరించు
వారుగాత లోక ǂ వంద్యుండవై యెందు, మాఱు లేక యతుల ǂ మహిమ మనుము.

వ. అని నిర్దేశించి మఱియు నిట్లనియె. 376

క. నాయంగంబుల నెల్లం, బాయస మతిభక్తిఁ బూసి ǂ పాదతలమునం
బూయవు గావునఁ గలుగు న,పాయం బఱకాల నీకు ǂ నవిలంఘ్యం బై. 377

క. విను పరమపదప్రాప్తికి, ననుగుణ మై యుండుఁ గాన ǂ యదియును నశుభం
బన రాదు నీవు బ్రాహ్మణ,జనములయెడ నడపు మిట్టి ǂ చందమ యెప్పుడున్. 378

వ. అని పలికి రథవహనపరిశ్రాంత యగుమీతల్లిం జూచి నీవు సౌందర్యసౌభాగ్యం
బుల నప్రతిమాన వై మాననీయత్వంబునం గృష్ణునిషోడశసహస్రాంతఃపుర
కాంతలకంటె నెక్కు డగు మని దీవన యిచ్చి యమ్ముని యంతర్హితుం డయ్యె.

ఆ. రుక్మిణియును నేను ǂ రుచిరసంపద నప్పు, డతిశయిల్లునస్మ ǂ దంగకములఁ
జూచికొనుచు మిగులఁ ǂ జోద్య మందుచుఁ బ్రియ, మెడఁద నెలకొనంగ ǂ నింటికరిగి.

ఆ. అందు వస్తుచయము ǂ ముందటికంటెను, బహుళమును మనోజ్ఞ ǂ భంగికంబు
నగుటఁ జూచి యద్భు ǂ తాయత్తచిత్తుల, మైతి మిట్టివార ǂ లవనిసురులు. 381

క. కావున వారికి భక్తుఁడ, వై వెలయు కుమార యనిన ǂ నతఁ డట్టిఁడ యై
తా వెలసె నీవు నట్టిఁడ, వై వెలయఁగ వలయుఁ గౌర ǂ వాన్వయముఖ్యా. 382

వ. అని చెప్పినం బ్రముదితమానసుం డగుచు నమ్మానవనాథుండు మాధవుతో దుర్వాసుండు శర్వాంశసంభవుం డని విందు శర్వునిమహిమ వినవలతుం జెప్పవే యనిన నప్పురుషోత్తముండు భరితాదరుం డై. 383

కృష్ణుండు ధర్మజునకు శివునిమహిమ చెప్పుట.

ఆ. అడుగవలయుదాని నడిగితి నీవు న, న్నధిప నామనము ప్రియంబుఁ బొందె
శివునిఁ దలఁచి మ్రొక్కి శివుదివ్యమహిమ సె, ప్పెద నితాంతవిమలహృదయకమల.

వ. ఏకాగ్రచిత్తుండ వై యాకర్ణింపు మని ధర్మజున కిట్లనియె. 385

క. శతరుద్రీయము నేనరుఁ, డతిభక్తిని శివుని మనమున నిలిపి యుం
చితమునఁ బఠించు సులభం, బతనికి సర్వంబు నిందు నందు నరేంద్రా. 386

వ. అని వెండియు. 387

సీ. అమరు మహాదేవుఁ డనుపేరు శివునకు, నప్పరమునకు మీఁ దరయ లేదు
తత్త్వోపద్యుక్తుల ధర్మవిరుద్ధపు, జాతుల నెల్లను సమయఁ జేయు
దేవతల్ మునులు నతిప్రయత్నంబునఁ, గావించుదక్షయాగమున శివుని
మఱచిన నయ్యజ్ఞ మఱవఱ లై పోదె, భగనేత్రనాశ మాదిగ ననేక

తే. భంగములు రావె వారి కాప్రభువుచేత, శరణు వేఁడినఁ గావఁ జేకరుణ నట్టి
వారి నీశు పెంపే మన వచ్చు మఱియు, వినుము తద్దివ్యలీలలు మనుజనాథ.

సీ. ప్రబలదైత్యులు పురత్రయనాయకులు జగ, త్త్రయము నప్రతిమప్రతాపలీల
బాధింప దివిజులు ఫాలలోచనుఁ గాంచి, కావుము కృప దేవదేవ మమ్ముఁ
బశువుల మగువారిఁ బశుపతి వైననీ, వనుచు మహాక్రోశ మాచరింప
నప్పురంబులు మూఁటి నస్త్ర మొక్కటన భ, స్మముగాఁగఁ జేసి యశ్మార్గణంబు

తే. నంకమున నిడ నది బాలుఁ డైన నీతఁ
డెవ్వఁ డని సూప వెఱఁ గంది యెల్లసురలు
వినుతి సేయ బ్రాహ్మణమూర్తి వెలుఁగునతని
కిడియె [1]దుర్వాసుఁ డనునామ మీశ్వరుండు. 389

తే. అతఁడు నూవె మాయింటికి నరుగుదెంచి, యంత సేసినాఁ డనవుడు నచ్చెరువును
భక్తియునుమదిఁ బెరిగొనఁ బాండునగ్ర, సుతుఁడు నిభృతిమై దేవకీసుతునితోడ.

క. శివముఖ్యనామములు ప్ర, స్తవనకృతిఁ భోగమోక్షదము లగు నని విం
దు విమలబోధ యెఱింగిం, పవె వానినిరుక్తి ననినఁ బరమప్రీతిన్. 391

వ. అతం డిట్లనియె. 392

క. శివదేవు ముట్టఁ గొల్వఁగ, నవనీశ్వర యతనిపేళ్ల యర్థ మెఱిఁగి సం
స్తవనకృతిఁ గూర్ప నాకై, న విధాతకు నైన నరిది నామదిఁ జూడన్. 393

వ. అయినను. 394

1. చ. దుర్వాసనామ మా♦యీశ్వరుండు.

క. నీ విట్లు నన్ను నడిగితి, గావున నాయెఱింగినట్టిరీతిఁ జెప్పెద న
ద్దేవాదిదేవువరనా,మావలి విను మచల మైన మతి యవధానముతోన్. 395

ఆ. అగ్నివాయువాసవాదిత్యవసుమరు,దాదిదేవతాము లాత్మఁ దైన
శివునిమహిమఁ బ్రీతిఁ జెప్పుట వినుట స,ర్వార్థసాధకంబు లగు నృపాల.

కృష్ణుండు ధర్మజునకు శివనామనిర్వచనంబు సెప్పుట.

క. వినుము నరేంద్ర మహత్త్వం,బున నుండను నీశ్వరత్వమున నఖిలమహా
మునిజనములును మహేశ్వరుఁ, డని కొనియాడ హరుఁ డొప్పు నప్రతిముం డై.

సీ. ఉగ్రత్వమునఁ బ్రతాపోన్నతి రుద్రనా,మముఁ దాల్చె దేవసంఘమున కెల్ల
మహతి నాఁ బోలు పారమహనీయదేవత, గావున విను మహాదేవుఁ డయ్యె
నఖిలసత్కర్మఫలాకారశుభములు, సేయువేడుకకల్మి శివుఁ డనంగఁ
జనియె సుస్థిరతేజమున వెలుఁగొందుట, నంచితస్థాణుసమాఖ్యఁ బరఁగె

తే. జంగమస్థావరాత్మకసకలభూత
రూపబహుళత నొందుట బహురూపనామ
ధేయుఁ డై యొప్పె ధూమ్రపుంజాయజటల
వలన ధూర్జటి యనుపేర వఱలె హరుఁడు. 398

ఆ. వినుము విశ్వు లనఁగఁ జనుదేవతలు దన,యందు పొడమి రట్టు లగుట విశ్వ
రూపనామకమున దీపితుం డయ్యె నా,త్రిపురమర్దనుండు నృపవరేణ్య. 399

సీ. బహునేత్రములు మేనఁ బ్రజ్వరిల్లుట సర్వ,తశ్చక్షురాహ్వయోదాత్తకీర్తిఁ
బరఁగు భూతము లెల్లఁ బశువులు దాఁ బతి, గావునఁ బశుపతి నా వెలుంగు
విషమస్థుఁ డై యున్కి వృషవాహనుఁడు మృత్యు,వనఁ జనుఁ బ్రాణపాలాఖ్యసమత
నొంది వహించు వేదోక్తాభిధానముల్,మఱియుఁ బెక్కులు వానిమహిమ వేద

ఆ. వేత్త లైనవారు వివరించి యన్యోన్య,బోధకత్వమునఁ బ్రభూతసౌఖ్యు
లగుచు సంతతము శివారామతానిరూ,ఢాత్ము లై చరింతు రధిపముఖ్య. 400

క. ఈనామనిర్వచనములు, మానవుఁడు పఠించినను సమాహితమతి యై
వీనుల నించిన సౌఖ్యము, నానందము నిందు నందు నతనికిఁ గల్గున్. 401

వ. అని చెప్పి మఱియును. 402

క. వ్యాసమహాముని లోకహి,తాసక్తిని శివునివిషయ మై పథ్యముగాఁ
జేసె నుపస్థాన మొకటి, యాసమధికపుణ్యవాక్చయము విను మధిపా. 403

సీ. సర్వజగన్నిత్యసాక్షి లోకైకశు,భావహమూర్తి నిరామయుండు
ప్రథమభూతములకుఁ బ్రథమతమంబు ను,దాత్తంబు నయినభూతంబు శివుఁడు
దనముఖంబున నగ్ని జనియించెఁ దను సభ,క్తికసమారాధనక్రతుల నియతిఁ
బాటించువారికి భవమోక్షణంబు గా, వించువేడుక మది నించువాఁడు

తే. వితతచతురాత్మకత్వవిశ్రుతి వహించి, కరుణఁ దత్తత్పదస్థిరాకలనకల్యు
లగుసపర్యారతులకు నద్వైవిధంబు, సిద్ధ్యపదవ్రల నొసఁగు మహేశ్వరుండు. 404

తే. ఈయుపస్థాన మచలితహృదయవృత్తి
నరుఁడు శివలింగసన్నిధానమున వాఙ్ని
రూఢముగఁ జేసి యాయురారోగ్యసకల
కామ్యవైభవైశ్వర్యముల్ గలిగి నెగడు. 405

భీష్ముఁడు ధర్మజునకు ధర్మసూక్ష్మప్రకారంబు సెప్పుట.

వ. అనిన విని యత్యంతసంతోషంబు నొంది కుంతీతనయాగ్రజుండు శాంతనవుతో ధర్మంబులు బహుప్రకారంబులు గలవు పరమానుష్ఠేయం బగుప్రకారం బెయ్యది దాని నెఱింగింపవే యనుటయు నజ్జనపతికి జాహ్నవీనందనుం డిట్లనియె. 406

ఆ. ధర్మములకు సంజ్ఞ తద్వేదు లగుమహా,త్ములు దగంగఁ జెప్పుదురు నరేంద్ర
వినుము కాలపాకమున నది యన్యథా,త్వంబు గలిగి యవిశదత్వ మొందు. 407

వ. ఎట్లంటేని. 408

క. అనఘ యధర్మము ధర్మం, బనుమతిఁ బుట్టించుఁ దృణసమావృత మై ప్ర
న్ననితలముచందమునఁ దోఁ,చిననూయుంబోలె సూక్ష్మచిత్తత లేమిన్. 409

క. తప్పక కాన్పఁగ లేమిం, జెప్పెడువారలును దద్విశేషము దప్పం
జెప్పఁగ ధర్మంబు తెరువు, దప్పు నది క్రియాపరులకు దైన్యము దెచ్చున్. 410

వ. కావున ధర్మంబుసూక్ష్మప్రకారంబు. 411

క. శ్రుతముఁ బరిత్యాగముఁ గల,మతిమంతుల నడుగు లోభమదమోహసమా
వృతబుద్ధులు గానిసమం,చితచరితులవలనఁ దెలియు శీలనిరూఢా. 412

క. కామార్థంబులు మోహా,ద్దామతకృత్యంబు లని యెఱదం గని ధర్మ
స్తోమమునఁ దగులుజనముల,చే మేలుగ నెఱిఁగికొనుము సిద్ధవివేకా. 413

తే. అనఘ యంచితస్వాధ్యాయమునను యజ్ఞ
మునసమాచారమున నిష్ఠ పొనుఁగుపడక
యుండు నెవ్వారలకు వార లోపి నడవు
నదియ కనుము ధర్మముసూక్ష్మపదవి గాఁగ. 414

క. అన విని యుధిష్ఠిరుఁడు నా,మన మిప్పుడు మీరు సెప్పుమాటల సందే
హనిరూఢ మయ్యె ధర్మము, గనికొన వలయుటకు బహుముఖత్వముకల్మిన్. 415

క. పారంబు లేనిధర్మా,చారంబున మునుఁగుమాదృశక్షుద్రులకుం
దీరం బిట్టిది యని తెలి, వార భవాదృశుల తగుదు రర్మిలిఁ జెప్పన్. 416

తే. ఆగమోక్తవిధంబుఁ బ్రత్యక్షమును స,మాచరణముఁ బృథగ్విధవ్యాకులములు
ధర్మసూక్ష్మత యిమ్మాటఁ దథ్య మిట్టి, దనఁగ రానియట్లున్నది యనఘచరిత,

వ. అనిన నాపగేయుండు కౌంతేయాగ్రజుతో ని ట్లనియె. 418

క. ఇవి మూఁడు దెఱంగులు ధ,ర్మవుసూక్ష్మత నిశ్చయింప । ముఖ్యపదంబుల్
దివిరి కొని యివియ చూచుట, యవనీశ్వర పూర్వమునుల । యందుఁ గలుగుటన్.

క. అనుమానింపకు మంధుం,డును నిశ్శంకాత్ముఁడును జ । డుండునుబోలెఁ
జననాథ యేను బల్కెద, విని దృఢముగ నూఁదు మింక । వేయును నేలా. 420

క. విమలాత్మ యహింసయు దా,నము సత్యముఁ గ్రోధవర్జ । నంబును విను ము
త్తమధర్మ రాశి యిది ధ,ర్మునపరమసీమ దీని । మరవుము మదికిన్. 421

తే. బ్రాహ్మణారాధనమునఁ ద । త్పరుఁడవగుము, తక్కుమొందువిచారముల్ । ధర్మపుత్త్ర
యనిన మానస మానంద । మంద నాఁత, డతని కతిభక్తి వందనం । బాచరించి.

వ. ఎవ్వరు ధర్మంబు నెడ నసూయ సేయుదు రెవ్వరు దాని నుపాసింతు రెఱింగింపు వారివారిపొందుగతులను విన వలతుం జెప్పు మనిన నప్పౌరవోత్తమునకు న ప్పురుషసత్తముఁ డి ట్లనియె. 423

సీ. వినుము రజస్తమో । వికృతులఁ దగిలిన, మానసంబులు గల । మానవులకుఁ
గలుగు ధర్మద్వేష । కలనంబు వారలు, నరకవాసార్హులు । ధరణినాథ
సత్త్వపరాత్ములు । సతతంబు ధర్మ ము, పాసింతు రూర్ధ్వలో । కాధివాస
మునకు వా రుక్తులు । మునుమును పుట్టిన, సుతుఁడు ధర్మము పద్మ । జునకు దాని

తే. పాకసంపద సుమతు లు । పార్జితగ ను, పాసనము సేయుదురు తియ్య । పంటిపరువ
మాదరించి తదుపచార । మాచరించు, వెరవు గలయట్టిజనముల । విధము దోఁప.

వ. అనినం గౌంతేయాగ్రజుండు శాంతనవుతోడ సాధులు నసాధులు నన నెట్టివారు సెప్పు మనుటయు నమ్మహాత్ముం డి ట్లనియె. 425

భీష్ముండు ధర్మజునకు సాధ్వసాధుజనుల నిరూపించి చెప్పుట.

సీ. తమయంత నెఱుఁగరు । ధర్మంబు సదుపదే, శమునను గాన ర । సాధుజనులు
ధర్మబోధం బివ్వి । ధంబులు రెంటను, గలిగెడువారు సా । ధులు తదీయ
చరితంబు విను విడు । వరు మలమూత్రంబు, లర్ఘంబు గానిచో । నధిప యతిథి
భోజనశిష్టాన్న । భోజులు దెరు విచ్చి, తగినవారలకుఁ బ్ర । దక్షిణముగ

తే. నరుగుదురు నడపుదురు స । త్యార్జవములు
శరణు సొచ్చినఁ గాతురు । సురతగుప్తి
పరులు నిజదారతృప్తులు । గురువినీతు
లమలహృదయులు సంతోష । మారఁ గలరు. 426

వ. అని వెండియు. 427

తే. సాధు లింద్రియవిభ్రాంతి । సంహరింతు
రఘము దెలిసి ప్రాయశ్చిత్త । మాచరింతు
ర ప్రకాశంబుగా ధర్మ । మాచరింతు

రఖిలభూతదయాళుత్వ ॥ మార్యఁ గలరు.        428

వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్త్రుతో సప్రయత్నులకు నర్థంబు సిద్ధించుట గలుగు ధర్మపరులును నీతివిదులునై సబలవంతులుబహుమార్గంబు లగుసదుపాయంబుల నర్థంబు లాకాంక్షింప సిద్ధింప కుండెడుఁ గొందఱకు సిద్ధించియు నవి భోగంబుల కుపయోగ్యంబులు గా కుండు శిక్షలు పెద్ద లేకయుం గొన్నిచిత్తంబులందు విద్య లలవడ శిక్షితు లయ్యును నిర్విద్యు లగుటయునుం గలుగుఁ దెవుల్లేనోసియుం బోట్లం బడియును గొందఱు సావరు పూరిపుడుక దాఁకి బలాధికులు సచ్చుట చూచెద మిట్లు గాఁ గతం బేమి యెఱిఁగింపవే యనుటయు నమ్మహీపతి కమ్మహాత్ముం డి ట్లనియె.        429

—శుభాశుభంబులు పూర్వజన్మకృతపుణ్యపాపంబులచేఁ గల్గు నని చెప్పట.—

క. మొలవం బెట్టనియట్టిది, మొలచునె తొలుమేనిదానకర్మముల నానార్థంబులు సిద్ధించుఁ బ్రయత్నంబులు లేకయు నింత నిజము ॥ భూపవరేణ్యా.        430

తే. అలఘుతపములు దొలుమేనఁ ॥ గలిగెనేని
వెదకికొని వచ్చు నన్నరు ॥ విపులభోగ
ములు పురాకృతవృద్ధసేవల ఫలించు
బుద్ధికలిమియు విద్యలఁ ॥ బొలుచుటయును.        431

క. తొలుమేన నహింసారుచి, గలిగిన దీర్ఘాయు వొందుఁ ॥ గారణభూతంబులు భూవర యివి యీగుణములు లేమియ కీడులకును ॥ మూలం బరయన్.

వ. కావున.        433

తే. వినుము దానంబుఁ దపమును ॥ వృద్ధసేవ
నము నహింసయు నియతకృత్యములు సర్వ
జనుల కిమ్మహాగుణములు ॥ మనమునందు
దృఢముగా నిల్పి నడపుము ॥ ధీరవర్య.        434

వ. అని యుపదేశించి యాపగానందనుండు వెండియుఁ బాండవాగ్రజున కి ట్లనియె.

సీ. ఎప్పుడు ధర్మంబు ॥ నెడ నాదరము గలవానికిఁ గాలంబు ॥ దాన యిచ్చు
ధర్మతత్త్వప్రబోధముఁ బరిస్ఫుటముగాఁ, గావున సుస్థిర ॥ భావశుద్ధి
సహితతపశ్శ్రితస్నానదానజపంబులను దేవతాపూజలను నమోఘ
కాలుఁ డై వర్తింపఁగా ధర్మయోగంబు, సమకూరు ధర్మంబు ॥ సాధనత్వ

తే. మొంది చేయించికొని చెప్పఁ ॥ బొందు నిర్మ
లాత్మకుండు సంసారపారాత్మకంబు
సత్య మజరామరము బోధనిత్య మచ్యు
తము పరానంద మగుసప్పదంబు నసఘ.        436

వ. అని నిర్దేశించి మఱియును.        437

తే. కనువెలుంగు వేదవ్యాసమునివరుండు
నధిప కృష్ణుండు నీకుఁ బరాయణంబు
చింత దిగఁద్రావి పాలింపు శాంతవృత్తిఁ
బ్రజల సర్వంబునందును విజయి వగుము. 438

క. అని యిట్లుపదేశించిన, యనిమిషతటినీతనూజునతులవచనముల్
విని మోమలరఁగఁ బులకలు, తనువున జాదుకొన నొప్పె ధర్మజుఁ డధిపా. 439

సీ. అపుడు వీక్షించి సత్యవతీసుతుండు శం,తనునందనునితోడ ధర్మజుండు
తెలివొందె భవదుపదేశామృతంబున, ననుజులుఁ గృష్ణుండు నాప్తసకల
రాజన్యులును ధృతరాష్ట్రుండుఁ దానును, దగ నిన్నుపాసించి దయకుఁ బాత్ర
మయ్యె వీడ్కొలుపు మియ్యవనీశుఁ దజితోడఁ, గ్రమ్మఱ నితఁడు నీకడకు వచ్చు
ఆ. వాఁడు గాక యనిన వాత్సల్యమున నార్ద్రి, మైనచూడ్కి సమ్మహాత్ముఁ డతనిఁ
జూచి పురికిఁ జనుము శుభపరంపరలకు, భాజనంబ వగుము రాజముఖ్య. 440

భీష్ముఁడు ధర్మజు నూఱడించి కరిపురంబునకుఁ బంపుట.

వ. అని యనుజ్ఞ సేసి వెండియు. 441

సీ. నీబుద్ధి ధర్మైకనిష్ఠ గావుత మ,సమగ్రదక్షిణబహుయజ్ఞములు య
యాతిచందమున శ్రద్ధాన్వితంబుగఁ జేయు, రాజధర్మంబుగఁ బ్రకృతిరంజ
నము నాచరింపు చుట్టములును జెలులును, బండినవృక్షంబుఁ బక్షికులము
లెట్లట్ల నిన్నాశ్రయించి సుఖించువా, రర్కునియుత్తరాయణము వచ్చు
తే. టరసికొని యుండి నాకడ కరుగు దెమ్ము
పొమ్ము తల్లియుఁ దమ్ములు భూవరుండు
నీవు సుఖులరై యుండుఁడు నృపవరేణ్య
యనుడు నానంద మొంది ధర్మాత్మజుండు. 442

వ. అట్లు చేయువాఁడ నని సవినయంబుగాఁ బలికి దేవవ్రతునకు దండప్రణామం
బాచరించి యిట్లు వీడుకొని. 443

క. మును లనుపఁగఁ గృష్ణాదులుఁ, జను దేరఁగఁ దోడఁ బురికిఁ జనియె ముదితులై
జను లెదురుకొనఁగఁ బుణ్యాం,గనలును విప్రులును వచ్చి కని దీవనతోన్. 444

క. సేసలు సల్లఁగ మహిమో,ద్భాసితుఁడై యిట్లు వోయి ధర్మజుఁడు నిజా
వాసంబు సొచ్చి గాంధా,రీసంభావన మొనర్చి ప్రియము దలిర్పన్. 445

ఆ. తల్లి కెఱఁగి ముదము ద్రౌపది కొనరించి, సకలపౌరజనుల జానపదుల
నెలమి యొలయ వీడుకొలిపి భూసురులకు, దానవిధుల సమ్మదం బొనర్చి. 446

వ. విపతులైన సతులకు సమగ్రధనంబు లొసంగి ధృతరాష్ట్రునిం బ్రభూతపూజా
కరణంబునం బరితుష్టునిం జేసి. 447

తే. తమ్ములును గృష్ణుఁడును బ్రమోదమునఁ దేల

నమ్మహీశ్వరుఁ డపుడు రాజ్యాభిషేక
మంగళము నొందినట్లు నెమ్మదిఁ దలంచి
గట్టిదైనయూఱట పెంపుఁ గాంచి పొలిచె. 448

వ. అట్లు శోభిల్లి వారల నుచితప్రకారసమాచరణంబులకుం జన నియోగించి య
భ్యంతరమందిరంబున కరిగె నట్లజాతశత్రుండు[1] సమ్యగంగీకృతసామ్రాజ్యుండయి
జనసంపూజ్యం బగుచరితంబున సంప్రవర్తిల్లుచుండఁ బంచాశద్వాసరానంతరంబ
వాసరపతి యుత్తరాయణగతుం డగుటయు. 449

ధర్మజుఁడు కృష్ణాదులఁ దోడ్కొని భీష్మునియొద్దకుం బోవుట.

సీ. అక్కురువరేశ్వరుం డప్పుడు గదలి గాంధారిని ధృతరాష్ట్రధరణివిభుని
గొంతిని మున్నిడుకొని కృష్ణుఁ దమ్మునిఁ, దనతమ్ములను విదురుని యుయుత్సు
సంజయులను గృపాచార్యధౌమ్యుల మంత్రకోవిదు లగుయాజకులను దోడఁ
గొని వస్త్రచందనాగురుపుష్పఫలఘృతకుండముల్ వట్టించుకొని యనేక

తే. రత్నములుఁ గాంచనంబుఁ దోరాఁగ నగ్ని
యంచితంబుగఁ దా సంఘటించి యోగ్య
జనసమానీతముగఁ జేసి సకలపరిజ
నంబుఁ గొల్వ మహావిభవంబు మెఱయ. 450

వ. చని భీష్మునివీరశయనస్థానంబున కనతిదూరంబునం దేరు డిగ్గినం గృష్ణాదులును
రథావతరణంబులు సేసిరి తానును వారును బారాశర్యనారదదేవలప్రభృతిపరమ
సంయమిసముపాస్యమానుం డగునమ్మాననీయుం జేర నరిగి మునిజనంబులకు విన
తుం డయి తదభినందితుం డగుచు నాధర్మనందనుం డయ్యమరనదీనందనునకు నభి
వందనం బాచరించి సమీచీనధ్యానతత్పరుం డైనయద్దేవవ్రతు నుద్దేశించి. 451

తే. అనఘ వచ్చితి ధర్మనందనుఁడఁ బ్రణతి, యాచరించెద నాపలు కవధరింప
నవసరం బేనివిను సమయంబు వార్చి, యగ్ని మొదలుగఁ దేఁ దగునట్టివాని. 452

సీ. తెచ్చితి బుత్విజుల్ వచ్చిరి హరియు నీతనయుఁడు ధృతరాష్ట్రుఁడును సమస్త
బంధులుఁ గలమహీపతులు విప్రులుఁ బౌరజనులు నేతెంచిరి సదయహృదయ
వీరిఁ జూడుము కను విచ్చి నావుడు నమ్మహాత్ముఁ డందఱఁ జూచి యానృపాలు
కేలు దెమల్చుచు మేలు సేసితి దైవయోగంబు గాదె నీ వొదవు టరయ

ఆ. మనుజనాథ [2]మాఘమాసంబుశుక్లపక్షంబు నామనమున సంప్రమోద
మావహిల్లఁ జేసె నని యభినందించి, యతని కధికహర్ష మావహించె. 453

వ. తదనంతరంబ ధృతరాష్ట్రునితో ని ట్లనియె. 454

తే. వేదశాస్త్రపరిజ్ఞానవృద్ధసేవనములు గలిగి యశేషధర్మములు నెఱిఁగి

---

1. గ. సమ్యగ్భంగీకృత. 2. జ. పుణ్యమాసంబు.

వ్యాసమునిపతి దేవరహస్య మర్థిఁ, జెప్ప విని నిష్కళంకత నొప్పి తనఘ. 455

క. కావున భవితవ్యములకు, నీ వడలఁగ వలదు పాండునృపపుత్త్రులు స
ద్భావమునఁ జూడ నేర్చిన, భూవర తగ నీవు గన్నపుత్త్రులు గారే. 456

క. వీరిం బరిపాలింపుము, వీరలశుశ్రూషఁ జిత్తవృత్తి ముదమునం
గూరఁగ ధర్మసుతునిపైఁ, గారుణ్యము గలిగి పనులు గఱపుము నెమ్మిన్. 457

తే. ఏ నెఱుంగుదు నితఁడు నీయెడఁ బ్రియంబు
భక్తియును గల్గి యక్రూరభావుఁ డగుట
నీవు వత్సలత్వమున నీనృపతిఁ బంచి
పనులు గొనుము కౌరవకులభారధుర్య. 458

క. విను నీతనయులు దుర్యోధను లవినీతిపరు లధర్మజ్ఞులు క్రో
ధను లతిలుబ్ధులు వారల, మనమున నిడి వగవ వలదు మనుజాధీశా. 459

వ. అని పలికి కృష్ణు నాలోకించి. 460

భీష్ముఁడు శరీరంబు విడుచుటకు శ్రీకృష్ణునను జ్ఞ గొనుట.

తే. దేవదేవ జీవాత్మక దేవవంద్య, శంఖచక్రగదాపద్మచారుహస్త
వాసుదేవ త్రివిక్రమ వరద పరమ, పురుష ప్రణతి యొనర్చెదఁ గరుణఁ జూడు.

వ. అనుచు నమస్కరించి. 462

ఆ. బలము నీవ నాకు భక్తుండ నీయెడ, నాలు బిడ్డ లేనియట్టివాఁడఁ
గావు నన్ను నధికకారుణ్యమున ని మ్మనుజ్ఞఁ గమలదళమనోజ్ఞనయన. 463

వ. అని వెండియు. 464

సీ. మాధవ పాండుకుమారవర్గమునకు, గతి నీవ రక్షింపు కరుణ మెఱయ
దుర్బుద్ధి యైనయాదుర్యోధనునితోడఁ, గృష్ణుఁ డెక్కడ నుండు గెలుపు గలుగు
నక్కడ కంటి నేఁ బెక్కుమాఱులు నట్లు, సెప్పఁగా నాపంపు సేయ కతఁడు
దమవారి నెల్లను సమయించి తానును, సమసె నిన్నెఱుఁగుదు నమితమహిమ

తే. నరుఁడు నారాయణుఁడు ననుపరమమునులు
జగము రక్షించుటకుఁ గేలిజన్మ మొంది
సంచరించెద రని పరాశరసుతుండు
నారదుండును జెప్పిరి నాకుఁ దొల్లి. 465

వ. అనిన విని వాసుదేవుండు దేవవ్రతువదనం బత్యాదరంబున నాలోకించి. 466

ఆ. కీడొకట్టు లేదు కృతపుణ్యుఁడవు తండ్రి, వలనిభక్తి పెంపు గలవు దానఁ
గాదె బంటుఁబోలె గాంగేయ మృత్యువు, నీవశమున నిలిచె నిర్భరముగ. 467

భీష్ముఁడు శరీరంబు విడిచి నాకలోకగతుం డగుట.

వ. నీకు నే ననుజ్ఞ యిచ్చితి వసువులం బొందు మనినం బరమానందంబునం బొంది
పాండునందనులను ధృతరాష్ట్రునిం దక్కటివారలనుం గనుంగొని విూచేత

ననుజ్ఞాతుండన కదా యని పలికి యందఱం గౌఁగిలించుకొని యానృశంస్యంబును
సత్యంబును నిత్యంబులుగాఁ బాటించి బ్రదుకుఁ డని చెప్పి తాను దొల్లి రాజుల
గెల్చి తెచ్చినధనంబులు విప్రజనంబుల కిచ్చి ధర్మతనయుం జూచి యెల్లబ్రాహ్మ
ణులునుం బూజనీయులు ఋత్విజులు నాచార్యులు వృద్ధులు విశేషించి పూజింప
వలయువా రని నిర్దేశించి యూరకుండి ధారణాక్రమంబున సమాహితాత్ముం
డయి వాయువుల సన్నిరుద్ధంబు సేసిన నవి యూర్ధ్వగతిం గైకొనియె నమ్మహాత్ముం
డవయవంబులం బ్రాణంబులు వాపికొనుచు వచ్చునయ్యెఁ జోట్లు శల్యరహితంబు
లగుచుండె నట్లగుటం గాంచి కృష్ణాదు లగునఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃక
కరణు లగుచుఁ గీర్తించి రాసంయమచతురునిచే సర్వాయతనసన్నిరుద్ధం బై
యాత్మ మూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంతద
వ్వరిగి యంత నంతర్హితం బయ్యె నప్పుడు పుష్పవృష్టి గురిసె దేవదుందుభులు
మొరసె నంబరంబున సిద్ధులు సాధ్యులుం బొగడుచుం బ్రమోదంబు నొంది రిట్లు
దేవవ్రతుండు దివంబునకుం జనుటయు. 468

పరలోకగతుం డైనభీష్మునకు నగ్నిసంస్కారంబు సేయుట.

సీ. ధర్మపుత్త్రుండును దమ్ములు విదురయు, యుత్సులు నగురుకాష్ఠోత్కరంబుఁ
జందనదారుసంచయమును గొని సము, స్థలి సముంచితచితి యలఘుభంగి
విరచించి రయ్యుధిష్ఠిరుఁడును ధృతరాష్ట్రుఁ, డును నమ్మరున్నదీతనయుపుణ్య
గాత్రంబు సుస్నానకలితంబు విహితాను, లేపంబుఁ బుష్పదామోపశోభి

తే. తంబు నుత్తమక్షౌమావృతంబు నుజ్జ్వ, లాభరణభూషితంబుఁ గా నధికభక్తిఁ
జేసి రప్పుడు సామంబు సెలఁగ హోమ, మాచరించిరి యాజకు లగ్ని యలర.

క. కనకములు మణులు భూసుర, జనసంఘంబున కజాతశత్రుఁడు శ్రద్ధా
వినయప్రీతియుతంబుగ, ననేకములు వేడ్క నొసఁగె నవహితమతి యై. 470

వ. తదనంతరంబ. 471

క. తలదిక్కు గవలుఁ బాదం, బుల దెస ధృతరాష్ట్రపాండుభూపాగ్రతనూ
జులుఁ బట్టి యధికవిభవో, జ్జ్వల మగుపాడెపయి నిడిరి శవరత్నంబున్. 472

వ. అమ్మెయి నన్నలువురును వహించిరి భీమసేనార్జునులు ధవళచామరంబు లిడిరి
యుయుత్సుం డుత్తమచ్ఛత్త్రంబు వట్టె వృద్ధ లగుకౌరవస్త్రీ లాలవట్టంబులు
వట్టిరి ధౌమ్యుండు క్రియాకలాపంబు నడపె నట్లు సొద సేర్చి దేవవ్రతుని
దేహంబు శ్రౌతాగ్ని కాహుతి సేసి బహుకుండంబు లెత్తి ఘృతంబు ప్రయో
గించి ప్రజ్వలింపఁ జేసి రివ్విధంబునం బితృమేధంబు విభవమహితంబును విధి
విహితంబునునుం గా ననుష్ఠించి యక్కౌరవు లపసవ్యంబుగాఁ దిరిగి కృష్ణ
ద్వైపాయన నారద దేవలప్రభృతు లనుగమింప భాగీరథికిం జని సర్వభరత

భార్యాసమేతంబుగా నగ్గాంగేయునకుఁ దిలోదకప్రదానంబు లాచరించి రట్టి
సమయంబున. 473

పుత్త్రశోకాతుర యైనగంగాదేవి కృష్ణాదులం గనుంగొని దుఃఖించుట.

సీ. ఉదకంబులందుండి - యుత్థిత యై శోక,విహ్వలత్వంబున - వికలగమన
యగుచు నెమ్మోముపై - నశ్రులు గ్రమ్మఁగాఁ, జనుదెంచి కౌరవ-సమితియెదుర
నిలిచి భాగీరథి - యలఘుండు దనకొడు, కిలఁ బరికింపఁగా - నెట్టిభంగి
వాఁ డయ్యెఁ జరితంబు-పోఁడిమి మీ రెల్ల, నెఱుఁగుదు రైనను - నేను గొంత
తే. సెప్ప వినుఁడు దృఢవ్రత-శీలుఁ డమల,బుద్ధి రాజవృత్తాఢ్యుఁడు-భూరికృపుఁడు
కార్యసంవేదిపితృభక్తి-ధుర్యుఁ డార్య,సమ్మతుండువిద్యాపరి-శ్రమఘనుండు. 474
తే. కాశిరాజకన్యకలకుఁ - గాఁ బెనంగి, వానిచే గాసి యైరి భూ-వరులు పలువు
రంబకై పూని వానిమ-హాబలంబు, జామదగ్న్యుండుఁ దెరలుపఁ-జాల కరిగె. 475
వ. అని విలాపంబు సేసి వెండియు. 476
తే. అంతవాఁడు శిఖండిచే - నట్టు లగుట
గనియుఁ బెక్కులు పఱియలు - గాక యునికి
కతనఁ జేసి వజ్రమయంబు - గాఁగ నోపు
నని తలంచెద నాడెంద - మన్నలార. 477
వ. అని వగచిన గంగాదేవికి దేవకీనందనుం డి ట్లనియె. 478

పుత్త్రమరణదుఃఖిత యగుగంగను గృష్ణద్వైపాయనుం దూఱడించుట.

తే. నీవు శోకంబు దక్కుము - నీసుతుండు, పరమగతి నొందె శాపసం-ప్రాప్తిఁ జేసి
వసువు మర్త్యుఁ డై వర్తించె-నసదృశప్ర,భావుఁ డాతఁడు వగ పేల - దేవి నీకు.
చ. అతని శిఖండి యేల యమ-రాధిపుఁడున్ సమయింపఁ జాలునే
యతఁడు నిజేచ్ఛఁ జేసి నరు-నంచితదివ్యశరంబు లంగసం
గతములు సేసి పాన్పుగ సు-ఖస్థితి మృత్యువు మాన్చి యుండి కీ
ర్త్యతిశయ మొంది తా వలచి-నప్పుడు వోయె విషాద మేటికిన్. 480
వ. అని యూఱడిల్లం బలికెఁ గృష్ణద్వైపాయనమునివరుండును బరమాదరణీయతత్పర
వచనంబుల నజ్జాహ్నవీదేవికి నానందం బాపాదించెఁ దదనంతరంబ యాత్మీయసలిల
సాంగత్యంబు నొందునమ్మందాకినిచేతం గృష్ణాదులు నందఱు జనపతులును నను
జ్ఞాతు లాశీర్వాదప్రీతులు నై మునులునుం దోడ నడవ నది వెడలి రని యిట్లు
భీష్మనివృత్తాంతంబు వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పిన నప్పుడమిఱేఁ
డిత్తెఱంగున నత్తాతకు వలయువిధానం బాచరించి చరితార్థుం డైనయప్పార్థివ
ముఖ్యుండు మఱి యెట్టిచందంబునం బ్రవర్తించె మునీంద్రా యెఱింగింపవే యని
యడుగుటయు. 481
చ. సకరుణదివ్యచిత్త పరి-శాంతమనాత్త్వవిధానవిత్త ని

ర్వాకృతవిలాసహృద్య శ్రుతివిస్తరవిస్ఫురన్నైకవేద్య పా
వకబహుభవ్యానన పరివర్ధనసంకుచదుదారధామ వి
శ్వకలితతోషణా సుభగసాత్త్వవతేయవచోవిభూషణా. 482

క. [1]సత్సేవ్యచరణ శమవ,ద్వాత్సల్యాభరణ ధర్మతత్త్వోద్ధరణా
హృత్సంగతభక్తికదంబ,తాత్కారణదుర్వృత్తద్విట్చయాదివిసరణా. 483

మాలిని. స్మయవిరహితపూజ్యా! మంత్రనీతాఖిలాజ్యా!
నయనహిమమయూఖా! నైష్ఠికశ్రేణిముఖ్యా!
దయితభువనరక్షా! [2]దాంతిసంపద్యతాక్షా!
నియమనికటవర్తీ! నిష్కళానందమూర్తీ. 484

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున ననుశాసనికపర్వంబు నందు సర్వంబును బంచమాశ్వాసము. 485

శ్రీమదాంధ్రమహాభారతము నందలి

అనుశాసనికపర్వము సమాప్తము.



1. క. సత్సేవ్యాచరణ సముద్యాత్సల్యా. 2. గ. దాంతి-సంవిత్సమక్షా - జ. దాంతి సంపత్సమక్షా - ట. దాంతి సిధ్యత్ప్రమోక్షా.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, ప్రథమాశ్వాసము.





నాయకపార్వత్యభి
ధానకమాధుర్యధుర్య। తత్త్వశ్లేషా
పానీతనిరంతరసాం
ద్రానందప్లావితాత్మ। హరిహరనాథా. 1

### శోకమగ్నుం డగుధర్మజునిఁ గృష్ణాదులు ప్రబోధించుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లమరనదీసందనున కుదక
కర్మం బాచరించి ధర్మనందనుండుధృతరాష్ట్రపురస్సరంబుగ భాగీరథి యుత్తరించి
తత్తీరదేశంబున. 2

ఉ. ఉమ్మలికంబునం బొగులు। నుల్లముతోఁ బొరి లోచనంబులం
గ్రమ్మఁగ నశ్రువారి ధృతి। గౌరవ మేద మహోగ్రబాణపా
తమ్మున మ్రొగ్గునేనుఁగువి। ధమ్మున నేలకు వ్రాలఁ బట్టె వే
గమ్మ వృకోదరుండు మురః। ఘస్మరుపంపున నమ్మహీశ్వరున్. 3

ఆ. పట్టి యతఁడు దనదు। పైచీర యాస్తర,ణంబు సేసి భూస్థ। లంబునందుఁ
బెట్టె మానసములు। పెద్దయు నలఁదురి, యర్జునాదిసోద। రాలి వాడివె. 4

వ. కృష్ణుం డుచితవచనంబుల నాభూపాలుం బ్రబోధించె నప్పుడు ధృతరాష్ట్రుండు
గదిసి కూర్చుండి యక్కురుపతితోడ. 5

సీ. క్షత్త్రధర్మంబునఁ। గైకొంటి మేదని, యుమ్మలికింపక। యెమ్మె వత్స
యనుజవర్గము నీవు। ననుభవింపుము శోక,కాలంబు గా దిది। యేల వగవ
నని పల్కి విదురహి। తాలాపములు దన,వినకుండుటయు సుయో। ధనునికీడు
నద్దుష్టబుద్ధిఁ దా। ననుసరింపఁగ ధర్మ, మెడలినకతమున। నింత పుట్టె

ఆ. ననియుఁ దెలియ నాడిరి తనకు గాంధారికి, వగలుఁ బొగులఁ బొగులన్ వలయుటయును
నుగ్గడించి మమ్ము నొంటివడ్డులఁ గనుఁ, గొనుము వంత దీర్పు మనిరి యధిప. 6

వ. అనిన విని యూరకున్నం గని శౌరి యక్కురవపతితో బంధువులు శోకంబు నొం
దిన మృతకోటికిం బరితాపంబు వాటిల్లు నట్లుం గాక భవదీయజ్ఞాతులు సమరం
బున ననివర్తులై యూర్ధ్వలోకవర్తులైరి వారికి శోకింపం బని లేదు శోకిం
చిన వారలు మగిడి వత్తురే యని పలికి వెండియు. 7

క. విన వలయువాని నెల్లను, జననాయక వింటి నీవున్ శాంతనవునిచే
వనట యుడుగు మింక దుర్మతి, యనుబోలెను వగచుచుండుట యుచితమె నీకున్.

వ. వ్యాసనారదాదులును నిన్ను బోధించిరి వారివాక్యంబు లూహింపుము. 9

చ. అతులితదక్షిణాన్వితమహాధ్వరకర్తవు గమ్ము దేవతా
పితృనివహంబులం గరమున్ బ్రీతియు భక్తియు నుల్లసిల్ల న
ర్చితములు సేయు ముర్విఁ బ్రజన్ జేకొని రక్ష ఘటింపు బంధుసు
స్థితు లొనరింపు మెప్పు నతిరథవ్రజపూజ లొనర్పు భూవరా. 10

వ. అనిన విని ధర్మనందనుండు సాత్యవతేయుమొగంబు గనుంగొని దేవా భవదీయ
దయాప్రేమంబులు నాపై నెప్పుడు నత్యంతగాఢంబులై యుండు నన్నుఁ బెక్కు
భంగుల రక్షించితి రిట మీఁద వనంబున కరుగ ననుజ్ఞ యిచ్చుట నాకుం బ్రియం
బరుగని యట్లయినం బితామహకర్ణులం జంపించిన క్రూరకర్మునకు శాంతి యెట్లు
గలుగు నమ్మహాకల్మషం బేమిటం బాయు నయ్యనుష్ఠానంబు విధియింపుం డని
పలుకుటయు నాధర్మధుర్యునకుఁ బారాశర్యుం డిట్లనియె. 11

సీ. నిష్ఠించి యిబ్భంగి నీ కేము సెప్పిన, వాక్యంబు లెల్లను వఱదఁ గలసి
పోయెనే నీ దగుబుద్ధి యింతొప్పదో, కాక మర్త్యుఁడు గాఁడు కర్త యీశ్వ
రునినియోగమున మేలును గీడు నొనరించుఁ, గాన నీ మదిఁ బాపకర్మశంక
గలిగెనేనియును యాగముల దానంబుల, నది వాపికొన రాదె యశ్వమేధ

తే. మధికదక్షిణాన్వితముగ ననఘ చేయు
మంతతో భవదీయచిత్తానుతాప
మంతయును బాయు రఘురామునట్లుఁ బూరు
భరతులునుబోలె దానతత్పరుఁడ వగుము. 12

చ. అన విని యమ్మునీశ్వరున కానృపుఁ డిట్లను నశ్వమేధయా
గనిరతి భూమిపాలు గతకల్మషుఁ జేయఁగఁ జాలు నాఁగ ము
న్నును వెడ వింటి సజ్జనమనోజ్ఞవచోమహనీయ నీవు సె
ప్పినపలు కూఁది యాక్రతువు ప్రీతి నొనర్చెద నెల్లభంగులన్. 13

వ. అని పలికి మునీంద్రా యొక్కవిన్నపం బవధానంబుతో నవధరింపు మశ్వమేధం
బధికదక్షిణాన్వితంబు గావలయు ననుట దెల్లంబుగా మీరు నాన తిచ్చితిరి నా

కర్థంబు లేదు కయ్యంబున మృతు లయిననరపతులసుతులు శిశువులును శోకా
క్రాంతులునుం గావున వారలవలన ధనాహరణం బత్యంతాకరణీయంబును దుర్ల
భంబును నైనది దొల్లి దుర్యోధనుండు మాతోడియీసునం జేసి పెక్కండ్రు
రాజులను ముక్కడిమూఁకలనుం గూడఁ బెట్టి ధనంబు వ్యయపెట్టి భూమియు
బండారంబునుం బాడుచేసె నివ్విధంబున నిర్ధనత్వంబు వాటిల్లె ధనార్జనంబునకు
నొండొకవెరవు దొరకొన దిట్టిది కర్తవ్యం బని యెఱుంగ కున్నవాఁడ మంత్రుల
రై నాకుఁ గార్యం బెఱింగింప వలయు నని ప్రార్థించిన నమ్మహాత్ముం డమ్మహీపతిం
బరమాదరంబున నాలోకించి కొండొక విచారించి. 14

సీ. అనఘ మరుత్తుండు * యజ్ఞంబు సేసి మ, హాధనరాసుల * నవనిసురుల
కిచ్చె వా రవి గడు * నెక్కు డై యుండుటఁ, ద్రవ్వితండంబులు * దమగృహముల
నిడికొని పెఱధన * మెల్లను నిధియుఁ గా, ని మ్మైన నెలవున * నిడుచు నుండి
యందఱు నేకవా * క్యత దీని నెవ్వరు, గనినను నిది వారి * ధనము యనిరి

ఆ. మానవేంద్ర యమ్మ * హానిధానము దెచ్చి, వలసినట్లు నీవు * వ్యయము సేయు
మనిన ధర్మతనయుఁ * డతఁ డెట్లుపార్జించె, నంతకాంచనము మ * హాత్మ చెపుమ.

క. అనుటయు నాసత్యవతీ, తనయుండు మరుత్తుపుణ్య * తరచరితంబుల్
వినఁ గోరుట మే లెంతయు, వినిపించెద వీను లలర * వినుము నరేంద్రా. 16

వ. అని పలికి యి ట్లనియెఁ గృతయుగంబున దండనీతిప్రవర్తకుం డగుమనువునకుఁ బ్ర
జాని యనుతనయుం డుదయించె నతనికి క్షుపుం డుద్భవించె నాతనికి నిక్ష్వా
కుండు ప్రభవించె నాభూపతికి నూర్వురు సుతు లుదయించి రం దగ్రజుం డగు
వింశునకు వివింశుం డుదయించె నప్పుడమితేనికిం బదినేవురు గొడుకులు పుట్టిరి
వారిలోనం బెద్దవాఁ డగుఖనీనేత్రుం డధికబలశౌర్యుండును నకార్యపరుండును
నై సోదరులం గలిపికొని నడవక పదునలువురం జెఱచి సామ్రాజ్యంబుఁ గైకొని
యుండి. 17

సీ. మంత్రివిద్వేషంబు * మాన్యపరాభవం, బును బ్రజాపీడనం * బులును గలిగి
మొక్కలీఁ డగుటయు * ముచ్చిలి మంత్రు లా, తనిఁ బాపి యతనినం * దనుని రాజ్య
మునకుఁ బట్టము గట్టి * కొని రక్కుమారుండు, దమయయ్య చేఁటుచి * త్తమునఁ దలఁచి
సచివప్రభృతు లగు * సర్వజనంబుల, యాత్మల ననురాగ * మావహిల్ల

తే. సత్యమును బాడియును నొప్ప * నిత్యధర్మ, పరత వర్తిల్లె నమ్మహీ * శ్వరుఁడు సతత
దానతత్పరుఁ డై కల * ధనము లెల్ల, విప్రులకు నిచ్చి దారిద్ర్య * వికలుఁ డయ్యె.18

క. దానఁ గడు డస్సె నాతని, సేన యరాతు లది యెఱిఁగి * చెచ్చెర బలసం
తానముతోడం బైకొని, యానరపతిఁ జెఱిచి రాతఁ * డాప్తులుఁ దానున్. 19

క. [1]వనమునకు నేఁగె సంయమి, జనములు నచ్చెరువు నొందు * చందంబున న

1. చ. వనమునకు నేఁగి...చందంబున ను, గ్రనియతి శోభిల్లం దప.

జ్జనవిభుఁడు నియతి నట తప, మొనరించి మహాప్రభావ మొందె కడంకన్. 20

క. అమలమతిఁ గరముఁ గ్రాలఁగ, నమరిచి మానితతపోమహాధికతన్ క్రూ
ధమన క్రియ యొనరించిన, దమితగుణా చెప్పఁ జిత్ర మయ్యెను దానన్. 21

వ. ఆకర్ణింపుము. 22

క. భటతురగసామజరథో,ద్భటసేనాసముదయములు బహుళరుచిరము
క్తాటకాంచనరాసులు న,చ్చటఁ బొడమెం జూడ నక్కజం బగు భంగిన్. 23

వ. ఇట్లు బలంబును ధనంబునుం గల్గుటయును. 24

క. ఆనరపతి రయమున రిపు,భూనాథులమీఁద నడచి పోరుల నాకీ
సేనాయుతముగఁ జంపియుఁ, గానలకుం దోలియును బ్రకాశత నొందెన్. 25

క. కరధమనంబున నాతఁడు, కరంధముఁ డనఁగఁ బరఁగి గౌరవమునకు
స్ఫురణము విభవము శౌర్యముఁ, గరుణయు ధైర్యంబు నెలయఁగా నిల నేలెన్.

తే. శమము దమమును సత్యశౌచములుఁ గలిగి, యజనశీలత నశ్వమేధాధ్వరంబు
లంగిరసుఁ డుపదర్శకుం డై నయింపఁ, జేకొనె నెల్ల లోకములు సంప్రీతిఁ బొడఁగ.

వేదవ్యాసమునీంద్రుండు ధర్మజునకు మరుత్తునిచరితంబు చెప్పుట.

క. అతనిమనుమఁడు మరుత్తుం, డతులయశుఁడు విష్ణుసదృశుఁ డనఁ దగు నాగా
యుతబలుఁడు ధర్మతత్త్వ,స్థితివిదుఁడు సమిద్ధబహుళతేజుం డధిపా. 28

ఉ. అమ్మనుజేశ్వరుండు విభవాతిశయంబు వెలుంగ నశ్వమే
ధ మ్మొనరించుచుండి వివిధస్ఫురితాలయముల్ ప్రదీప్తధాం
డమ్ములు సత్పదార్థము లెడం దగుతక్కును గల్గుసిద్ధపా
త్రమ్ము లసంఖ్యముల్ పసిఁడి బ్రస్తుతి కెక్క ఘటించె భూవరా. 29

వ. అట్లు సమకట్టి యతండు. 30

చ. హిమగిరిసానుదేశమున నెక్కుడువైభవ ముల్లసిల్ల య
జ్ఞము దగఁ జేసి భూమిసురసంఘము లెల్లను దృప్తిఁ బొంద హే
మ మొసఁగెఁ గుప్పఁగూరలు సమగ్రకుతూహలుఁ డై కనత్సువ
ర్ణమయగృహక్రియోపకరణప్రకరంబులు నిచ్చె భక్తితోన్. 31

వ. అని చెప్పి యిది మరుత్తునియాభిజాత్యంబును దదీయవిత్తవిశేషంబును నెఱిం
గించుట యవ్విత్తం బతనికి దొరకొనిన తెఱంగును నెఱింగించెదఁ దదంచితక్రతు
క్రియాప్రకారంబును జెప్పెద విను మట్లు కరంధముఁ డనఁ బరఁగి మనువంశ
దీపకుం డై పేర్చినయాభూపతి నిజతపఃప్రభావంబునను మహానుభావుం డగు
నంగిరసుండు దన కుపద్రష్ట యయి యనేకాశ్వమేధంబులు సేయించుటం జేసి
యావహిల్లినమాహాత్మ్యంబునను మహీపతు లెల్లఁ గొలువం బూజ్యసామ్రా
జ్యం బనుభవించి తనవలచినయప్పుడ తనువుతోడనయూర్ధ్వలోకంబునకుంజనియె
నమ్మనుజపతితనయుం డవిక్షిన్నామధేయుండు ధరాభారధౌరేయుం డై యతనిన

పోలి ప్రజలం బాలించె. 32

చ. అతనిసుతుండు సూవె మనుజాధిపసత్తమ యమ్మరుత్తుఁ డా
పతి దనతండ్రి పిమ్మటఁ గృపాపరతుం డార్యుఁడు దండనీతివి
శ్రుతమతి దానశీలుఁ డన రూఢికి నెక్కె తదీయరాజ్యసు
స్థితి వెలుఁ గొంచె వాసవునిఁ జీరికిఁ జేకొనఁ డీసుపెంపునన్. 33

క. వాసవుఁడును నవ్విభునెడ, నీసు గలిగి తన్ను మిగులనీ నని తచ్చిం
తాసక్తుం డై మంత్రిని, వాసమునకుఁ జనియెఁ బూరువంశప్రవరా. 34

వ. చని యతనితోడ. 35

సీ. అనఘ మరుత్తుండు నిను వరింపఁ దలంచుఁ, దనయజ్ఞమున కుపద్రష్ట గాఁగ
నమరాధిపతి యగునట్టినాకును జేసి, యుపదర్శనం బింక నొక్కమర్త్యు
నకుఁ జేఁత నీపెంపునకు హాని కాదె నక్, విడిచి యాతనియజ్ఞవిధులు నడపుఁ
డాతనిఁ దొఱఁగి మహదాప్తత మెఱయు పె, క్కాడంగ నేటికి ననుఁడు నతని

తే. పలుకులకునవ్వి యాబృహస్పతి మహాత్మ, యెఱుఁగ నేనిన్ను నన్ను నీ వింత సెప్ప
నేల సర్వలోకముల కధీశుఁ డైన, నీగురుం డొరు నాశించునె మహేంద్ర. 36

వ. అని వెండియు. 37

ఆ. అగ్ని సల్లనైన నబ్జమిత్రుఁడు మైల, పడ్డ నుర్వి వొరలఁ బడిన మేరు
నగము సంచలించినను బొంకు పొరయునే, నాదుపలుకు నెమ్మనమున నమ్ము. 38

క. అన విని ప్రమదంబునఁ దే, లినచిత్తముతోడ సమదలీలం జనియెం
దనమందిరంబునకు సుర, లనురాగముఁ బొంద నింద్రుఁ డమలచరిత్రా. 39

సీ. అది యంతయును విని యమ్మరుత్తుఁడు త్రిద, శాచార్యుకడ కేఁగి యతనితోడ
నీకు నెఱింగించి నీపంపునన యేను, సంభారముల నెల్ల సంఘటించి
యజ్ఞాచరణమున కమరి యున్నాఁడ నీ, వుపదర్శనంబు సేయుటకు రమ్ము
నావుడు నింద్రుండు ననుఁ దనయాగము, నకు మున్ను వరియించినాఁడు నాకు

తే. నెట్లు రా వచ్చు ననియె నాయింద్రమంత్రి, యట్లు వలికిన మాటాత్మ కనఘునీదు
తండ్రి సంప్రీతితో నుపద్రష్టయయ్యె, నట్ల కృపసేయు మని పల్కె నవ్విభుండు.

చ. విని ధిషణుం డమర్త్యులకు విన్నను వొప్పఁ గ్రతుప్రయోగముల్
మనము దలిర్పఁగా నడపి మర్త్యునియాగమునొజ్జఁ గాఁగఁ జా
ల నిది నిజంబ యింక ననులాప మొనర్పక పొమ్ము వేఱ యొ
క్కని నుపదర్శనంబునకుఁ గైకొను మారసి నీవు నావుడున్. 41

వ. అజ్జనపతి లజ్జితుం డై మగిడి వచ్చి యెదుర నారదుం గని వినయం బెసంగ వినతుం డై నిలిచిన నమ్మునిం యతనిం గనుంగొని యెట వోయి వచ్చె దేల విన్ననై యున్నవాఁడవు నీ తెఱం గెఱింగింపు మెవ్విధంబున నైన నీవిషాదంబు మాన్చెద ననుటయు నమ్మనుజవరుండు మదీయాధ్వరంబునకు నాంగిరసు నుపా

ధ్యాయుంగా వరియింపం బోయితి నద్దేవగురుండు నన్ను నాక్షేపించి మర్త్యుంజే
నింక నేటి బ్రదు కని పలికిన నప్పరమసంయమి యప్పుడమిఱేనితో బృహస్పతి వి
న్నెల్ల కన్న నేమి యంగిరసునిపిన్నకొడుకు సంవర్తుం డగ్రజుచేత ధిక్కరింపం
బడి సకలంబును విడిచి వెడలి వైరాగ్యంబునొంది దిగంబరుం డై యెందుం దిరుగు
చున్నవాఁ డతనిపాలికి నరుగు మమ్మహాత్ముండు భవత్కార్యంబునకు నుపదర్శనం బా
చరించు ననవుడు సంతసిల్లి యాభూవరుం డి ట్లనియె. 42

క. మునివర బ్రదికితి సంవర్తుని నెచ్చటఁ గాంతు నెప్పగిదియునుం దగ నా
డిన నతఁడు ద్రోపు సేయక, కనుఁ గైకొను నెఱుఁగఁ జెప్పఁగదె నాకుం గరుణన్. 43

వ. అని ప్రార్థించినయప్పార్థివోత్తమునకు నత్తపోధనసత్తముం డి ట్లనియె. 44

సీ. భూపాల యతఁడు కాశీపురిఁ బాయక, వర్తించు నున్మత్తవర్తనమున
నతని నెఱింగెడునట్టియుపాయంబు, వినుము పురద్వారమున శవంబు
నిడికొని నీ వుండు మేతెంచి చూచి నివర్తించువాని సంవర్తుఁ గాఁగ
నెఱుఁగుము మరలి య ట్లేఁగంగ వెనుకన పొమ్ము నిశ్చలభక్తిపూర్వకముగ

ఆ. నచట నైన నీకు నేకాంత మొదవిన, నతని గారవమున వినయభరితవృత్తి
నాదుగుఱుతు సెప్పి నా రెవ్వ రనినను, జెంద నారదుండు సెప్పె ననుము. 45

మరుత్తుఁడు సంవర్తునిఁ దనయజ్ఞమున కుపద్రష్టగా వరియించుట.

సీ. ఇప్పుడు నారదుం డెం దున్నవాఁ డని, యడిగిన యట్లైన నతఁడు నాకు
ని న్నెఱింగించి యగ్నిప్రవేశము సేసె, ననుము శంకింపక యనుడు నమ్మ
హీపతి వారాణసీపురంబున కేఁగి, దిక్కుమాలినపీనుఁ గొక్కచోటఁ
బడి యున్నఁ గని దానిఁ బట్టించికొని పురద్వారప్రదేశంబు సేర నరిగి

తే. యచట నక్కుణపము నిడి యంతనంత, వేచికొని యుండఁగా నొక్కవెఱ్ఱివాఁడు
వచ్చి శవముఁ గనుంగొని వాటువడ్డ, పసరమునుబోలెఁ గ్రమ్మఱఁ బాఱుటయును.

వ. వాని సంవర్తుం గా నెఱింగి యజ్ఞపతి యతనిపజ్జన చనం జన నతండు మరలి
చూచి పై ధూళి సల్లియు నుమిసియు వేఁదుఱుచందంబు భావింప నాభూ
వల్లభుండు. 47

క. వినయముతోఁ గేల్ మొగుచుచు, ననుగమనం బుడుగ కరుగ నాతండును ని
ర్జన మగుప్రదేశమునకుం, జని యొకవటవిటపినీడఁ జదికిలఁబడియెన్. 48

వ. డప్పి భావించుకొని యమ్మహాత్ముం డ ట్లు గూర్చుండుటయు. 49

సీ. ఆరాజు సేరి సాష్టాంగప్రణామంబు, సేసి నిల్చిన ననుఁ జెప్పి నిన్ను
ననఘ పుత్తెంచినయతని పే రెఱిఁగింపు, నిజ మైన సిద్ధించు నీమనోర
థంబు బొంకగునేనిఁ దల యేడువ్రయ్యలై, పడు దని యమ్మునిపలుకుటయును
నారదుఁ డెఱిఁగించె నాకు మిమ్మని నిజ, మాడిన సంవర్తుఁ డాతఁ డెచట

తే. నేమి తెఱఁగున నున్నవాఁ ♦ డెఱుఁగ వలయుఁ
జెప్పు మనుడు మీ పెఱఁ గెల్లఁ ♦ జెప్పి నన్ను
నిందఁ బుత్తెంచునపుడ య ♦ ఖర్వోద్యధర్మ
పరుఁడు సోదఁ జొచ్చె నని చెప్పె ♦ నరవరుండు. 50

వ. చెప్పిన నప్పరమముని యప్పుడమితేనియాసనం బంగీకరించి. 51

క. ననుఁ గానఁగ నీవచ్చిన, పని యెయ్యది యనిన నా న్నృపతి నాయజ్ఞం
బునకుఁ గృప మీఱ నుపదర్శనముం జేయంగ వలయు ♦ నంయమినాథా. 52

వ. ఏను మరుత్తుం డనువాఁడ భవదీయజనకుం డుపాధ్యాయుండు గాఁ గ్రతుకర్త
యైన కరంధమునిపౌత్త్రుండ ననుటయు సంవర్తుండు సంప్రీతి నాతనితో నీవు
నీకార్యంబు నాకుం జెప్పితి నా తెఱంగు వినుము మాయన్న యగు బృహస్పతి
దనతపోబలంబున నన్ను నవమానించిన మదీయగృహధనాదివస్తువు లెల్లను
విడిచి యిట్లు దిరిగెద ననుబోటిపీనుంగు నీ కుపద్రష్ట యైన నయ్యెడు పెంపునుం
గలదె యమ్మహాత్ము నీవు వరియింపు మట్లు గాక నేను గావలయు ననుతలంపు
గలదేని. 53

ఆ. అన్న నాకు మాన్యుఁ ♦ డాతండు వనుపంగ, నాచరింతు నిదు ♦ యాగమునకు
నొజ్జతనము వేగ ♦ ముర్వీశ యగ్గురుఁ, గని యనుజ్ఞ వడయు ♦ మనిన విభుఁడు. 54

సీ. ఆతనికడకు ము ♦ న్నరిగితిఁ గృప వుట్టఁ, బలికితి నతఁడు నా ♦ పలుకు నరకు
గొనక యమర్త్యయా ♦ జనము ననుష్ఠించు, నేను మర్త్యనియోజ్య ♦ నేల యగుదు
ననియె నాతోడియీ ♦ సున వాసవుఁడు గురు, నుడిపినకతమునఁ ♦ గడఁగి గురుఁడు
నను ధిక్కరించె నిం ♦ క నఘ యందే మని, పోదు మీమాహాత్మ్య ♦ మున నను వాస

ఆ. వుని నతిక్రమింతు ♦ నని నమ్మి యున్నాఁడఁ, గైకొనంగ వలయుఁ ♦ గరుణ వెలయ
ననిన మునియు నట్ల ♦ యయ్యెడుఁ గాక ని, పలికె మఱియు నా న్నృపాలుతోడ.

వ. ఏను నీయధ్వరంబున కుపదర్శనంబు సేయుచుండ సద్దివస్పతియు బృహస్పతియుఁ
బ్రద్వేషించి రోషంబు వాటింతురు దానికి నులికి నీవు సంచలించిన మదీయశా
పంబునం గీడు వచ్చు నింత దలంచి సుస్థిరనిశ్చయుండవు గావలయు విచారించుకొ
మ్మనిన నమ్మహానీయుతో నమ్మహీనాథుండు. 56

సంవర్తుండు మరుత్తునియజ్ఞమున కుపద్రష్ట యగుట.

సీ. నీకృప గాంచితి ♦ నాకు నిం కొండువి, చారంబు లేటికి ♦ సంయమీంద్ర
యాదివస్పతియు బృ ♦ హస్పతియును నేల, పశుపతి విద్వేష ♦ పరతఁ గలఁచె

---

"తే. అయ్యెడుం గాక యిపుడు నీ ♦ కనుచు నీవు, సంచలించినయప్పుడ ♦ శాప మిత్తు
నీకుఁ గీడును బాటిల్లు ♦ నింత దలఁచి, సుస్థిరుండవు గావలె ♦ సుజనవర్య."
ఈపద్యము 55-వ పద్యమునకుఁ దర్వాత ముద్రితగ్రంథములో నున్నది. వ్రాఁతప్రతులందుఁ
జూపట్టదు. ప్రక్షిప్తం బని తోఁచెడిని.

నేనియుఁ గలఁగుదునే యని పలికి పిమ్మ,సంగతి వాసిన సరసిజాప్త
చంద్రతారకకులాచలములు గలయంత,కాలంబుఁ బుణ్యాలోకములు లేక
తే. పోవు నని శపథము శుద్ధభావవృత్తిఁ
బలుకుటయు మెచ్చి యమ్మునిపతి మహేంద్రు
గంటె నిను ధనవంతునిఁ గా నొనర్చి
క్రతువు నడపుద మని చెప్పి ప్రమద మెసఁగ. 57

వ. మఱియు నిట్లను నెత్తెఱంగున నేను ధనవంతుండ నగుదు నంటేని వినుము హిమవంతంబునుత్తరభాగంబున ముంజవంతం బనుపర్వతంబు గల దందు శివుండు శివాసహాయుం డై సురసిద్ధగరుడగంధర్వాదిసమస్తభూతజాలంబు సేవింప విహరించుచుండు. 58

క. మరణజరారోగము ల,[1]గ్గిరి యొడిరువులను లే వఖిలగుల్మలతా
తరువులఁ గుసుమఫలంబులు, గర మొప్పుచు నుండు నెల్లకాలములందున్. 59

తే. ఆనగంబుపార్శ్వంబుల నరుణకిరణ,రుచివితానంబు ననుకరించుచు వెలుంగు
శుద్ధకాంచనమయశిలాస్థూలవాలు,కాప్రభాజాల మాశ్చర్యకారి యగుచు. 60

వ. మన మయ్యెడకుం బోయి. 61

సీ. శ్రీకంఠు రుద్రుని శివుఁ బూషదంతఘ్ను,హరునిఁ గపర్ది శంకరుని నంత
కాంతకు వరదుని నాదిదేవునిఁ ద్రిలో,చను సహస్రాక్షుని శాంతమూర్తిఁ
[2]జీరవాసుని ధన్వి సిద్ధు దండధరు మృ,గవ్యాధు నుష్ణీషిఁ గనకబాహుఁ
బశుపతి వృషు భూతపతి మాతృభక్తుని, నజు నగ్నివక్త్రుని నభవు భవుని
ఆ. భక్తిఁ బ్రస్తుతించి ప్రణతులఁ దేల్చి త,త్కారుణ వడసి పసిఁడి త్రవ్వితండ
ములు నృపాల పెక్కుమోపులు దెత్తము, రమ్ము భారవహులఁ దెమ్ము చాల. 62

క. అని పలికి యమ్మహాత్ముఁడు, గొనిపోవంగఁ బోయి శివునకుంశితకరుణం
గనక మసంఖ్యముమోపులు, గొని వచ్చె నతండు మంచుకొండయిఱువులకున్. 63

వ. ఇట్లు మహాధనవంతుం డై మరుత్తుండు సువర్ణమయంబులుగా యజ్ఞవాటంబును భాండప్రముఖసకలక్రియాసాధనంబులును శయ్యాసనాదులుం గావించుకొని తత్ప్రదేశంబున నతిమానుషం బగువిభవం బెసంగ యజనంబున కుపక్రమించుటయు బృహస్పతి యంతయు నెఱింగి యంగంబు కృశం బై వెలరువాఱునట్టి వగం బొందిన సంక్రందనుండు సూచి యవ్వాచస్పతి కిట్లనియె. 64

ఆ. తెలివి వొంది యున్నదియె నీదుచిత్తంబు,సురలబ్రదుకు తెరువు లరసి నడపు
చున్నవాఁడవే సముత్సాహమున వారు, నీకుఁ బ్రియ మొనర్చి నేర్చి మంద్రె.

వ. అనుటయు నాచార్యుండు సర్వంబు సంపన్నంబ యనిన ననిమిషపతి యతనితోడ.

క. నీయొడలు డస్సి వెలువెల,నై యున్నది నీకు నిట్టియధికపువగపుం

---

1. క. గ. చ. జ. గ్గిరియం దెయ్యెడల. 2. క. గ. జ. ట. 'భీతవాసుని ధన్వి ♦ విసదంతు సిద్ధు మృగ.

చేయంగ నెఱవని నీచులఁ, జేయుదు దండితులఁ గాఁగఁ । జెప్పుము వారిన్. 67

వ. అనవుడు నాచార్యుం డట్టిది లేదు మరుత్తుండు మహనీయం బగుమఖం బొనరింప నుద్యోగించినవాఁ డతనికి మద్విరోధి యగుసంవర్తుండు యాజకుం డై యది నడపువాఁ డయ్యె నని వింటి మద్విషాదంబునకు మూలం బిది యట్లు గాకుండం జేయ వలయు నజ్జననాయకు నియమించి సంవర్తుని యాజకత్వంబు నవశ్యంబును మాన్చునది యని పలికినం బాకశాసనుండు పార్శ్వంబున నున్న యగ్నిదేవు నాలోకించి నీవు మరుత్తుపాలికిం బొ మ్మతండు క్రతుకరణంబున నుత్సహించినవాఁడు తదీయం బగునుపదర్శనంబు బృహస్పతి యాచరించువాఁడుగా సంఘటించి రమ్మని నియోగించిన. 68

ఆ. అట్లు సేయువాఁడ । నని యగ్ని నిజతనుస్ఫురణ మతిశయిల్ల । సరగ నటఁ జనియును
నుల్ల మచ్చెరువున । నూన మరుత్తుండు, ప్రణతి యాచరించి । భక్తితోడ. 69

అగ్నిదేవుం డింద్రసందేశము మరుత్తున కెఱింగింప వచ్చుట.

సీ. సంవర్తుఁ బిలిచి యాసనపాద్యము లర్ఘ్య, చరణముల్ నడపించి । పరిసరమున
నున్న నయ్యనలుఁ డయ్యుర్వీశ్వరునితోడ, బలవైరి పనుప నీపాలి కనఘ
యరుగుదెంచితి దూతనై యన్న నవ్విభుం, డవ్వాసవుండు సౌఖ్యమున వెలుఁగు
చున్నాఁడె యమరసముత్కరం బతనికిఁ, బ్రియ మాచరించి వర్తించుచున్నె

తే. యాదరంబు గలదె । నాదెస నాసహస్రాక్షు నెమ్మనంబునందు హవ్య
వాహ యనుడు నతఁడు । వసుమతీపతికి ని, ట్లనియెఁ గౌరవాస్పదయాగ్రగణ్య.

క. సురనాథుఁడు దద్దయు సుఖి, సుర లాతనికిం బ్రియంబు । [1]సొలయక యొసరిం
తురు నీదెస నాదర మ, ప్పురుషవరున కగ్గలంబు । భూపవరేణ్యా. 71

వ. నావచ్చినపని సెప్పెద నాకర్ణింపుము. 72

క. నీజన్మమునకు ధిషణుఁడు, యాజకుఁ డై మర్త్యు నిన్ను । నమరత్వదశా
భ్రాజిష్ణుఁ జేయు నమ్మెయి, రాజితముగ నాచరింపు । క్రతుకార్యంబున్. 73

వ. ఇది యింద్రుండు నీతోడం జెప్పు మన్నకార్యం బనుటయు నమ్మనుజనాథుం డమ్మహాత్ముతోడ. 74

ఆ. అనఘ యేను మ్రొక్కఁగలా బృహస్పతికి మ్రొక్కెద నతండు నన్ను । నదయవృత్తి
నపహసించి తాను । యాజకత్వమునకు, నెట్లుఁ జొరక యున్న । నేను బోయి. 75

క. అనుజుం డతనికి ననుపెను, పొనరిన సంవర్తు భక్తి । నొడఁబఱచి తగం
గొని వచ్చితి మత్క్రతుయాజన మీయోగీశ్వరుండ । చాలుం జేయన్. 76

ఆ. అనిన నగ్నిదేవుఁ । డమరగురుం డుప, ద్రష్ట యైన వజ్రధరుఁడు నీకు
నలఘుపుణ్యలోకములు సులభ్యములుగ, లీలఁ జేయు నట్లు । మేలు గాదె. 77

వ. అనవుడు సంవర్తుఁడు గడుఁ గనలి యనలుతోడ నిట్టిగతి నీ విం కా

1. క. గ. సొలవక.

స మద్దారుణదృష్టిని, నినుఁ గాల్తుక్ మగుడ మిప్పనికిఁ దిరుగకుమీ. 78

ునుటయు భీతి నగ్ని యమరాధిపుపాలికిఁ బోయి యే మరు
్తునిఁ గని నెమ్మి నీ దగు క్రతుక్రియకుక్ గురు యాజకుండు గాఁ
ాను మని చెప్పితిక్ విని యకుంఠితనిశ్చయుఁ డైనయవ్విభుం
నిమిషమంత్రికిక్ వెఱతు నాతనితమ్ముని గోరి తెచ్చితిన్. 79

ఈయోగీశ్వరుండు మదీయాధ్వరంబునకు యాజకుం డనుపలుకు వలికి సంవర్తుం
ాపె నే నంత నిలువక పురుహూతునకుం బ్రియం బొనరించిన నీకుం బుణ్య
ోకంబులు సిద్ధించు నట్లు సేసిన మే లని తఱిమి చెప్పినను నప్పుడమిఱేఁ డొడం
డండ. 80

ని విని యింద్రుఁ డి ట్లనియె నగ్నికి నిమ్మరి పోయి చెప్పు మ
నపతితోడ నాపలుకు సమ్మతిఁ జేయక తక్కె నేని నేఁ
ని చెద వజ్రముక్ జముని పాలికి నన్నరనాథు వేగమే
నుచుట కింత యెల్లిద మె యాతనికిక్ మనయాజ్ఞ యారయన్. 81

ని పలుకుటయుఁ బావకుండు పాకశాసను నాలోకించి. 82

ంక వచ్చిన దారుణేక్షణదగ్ధుఁ గా, వింతుఁ జుమ్మీ యని విపులకోప
మూర్తియై పలికె సంవర్తుండు గావున, వెఱతు నే నట పోవ వేఱొకండు
ోవుఁ గాక నవుడు దేవేంద్రుఁ డన్యుల, నీవు దహింతు గా కేవిధమున
ారులు నిన్ను దహింతురో పేదమాట యి,ట్లాడు దే యనుటయు నగ్ని వలుకు
మూఁడులోకములును వాఁడిమ గంటిమి, నేలు చున్నవాని నెట్లు వృత్రుఁ
ాక్రమించె నిన్ను నదియును గాక ప,ర్జన్య మఱియు వినుము బ్రహ్మబలము. 83
యయ్యాతి క్రతువున నయ్యాశ్వినుల సోమ,పానంబు నీ కోడఁ బాటు గాక
ాయంగఁ బెట్టిన భార్గవచ్యవనుండు, వారికిఁ గా సురవర్గసహిత
ముగ నిన్ను బాధితుండుగఁ జేసె నిజమంత్ర,బలమున దాని కీ వలిగి వజ్ర
మే త్తెఱఁ గొని యమ్మునీశ్వరు [1]సాధింపఁ, గడఁగిన నగుచు బెట్టడఁచెఁ గాదె
మతఁడు పుడిసెఁడునీర నయ్యప్పు డతనిఁ, దెలచి సోమ మాశ్వినులకుఁ గలుగఁ జేసి
రయ నెందును బ్రహ్మబలాతిశయముఁ, గడచినట్టిబలంబులుఁ గలవె యనఘ.
నవుడు బ్రహ్మబలము గడు,ఘన మగు టెఱుఁగుదు మరుత్తుఁ గాఱియఁ బెట్టం
నదే నా కని శక్రుఁడు, పనిచెను గంధర్వలోకపతి ధృతరాష్ట్రున్. 85

పనుచునప్పు డతని కి ట్లనియె. 86

ప్పు పోయి మరుత్తుని నెమ్మిఁ గాంచి, గురుని నీకు యాజకుఁడుగఁ గొనఁగవలయు
నట్లు చేయక యున్న వృత్రారి క్రోధ,దీప్తుఁ డై కులిశంబుఁ బు త్తెంచు ననుము.
ఈమాట సంవర్తునిసన్నిధిన యాడు మని పలికిన నాధృతరాష్ట్రుం డియ్యకొని

1. గ. ( బ్రహరింప.

చని సంవర్తసహితుం డై యున్నమరుత్తునిం గని తాను గంధర్వుం డనియును
ననిమిషపతిపంపున వచ్చితి ననియునుం జెప్పి యప్పుడమిఱేనితో సురపతియు ని
ట్లనియె. 88

చ. వినుము మదీయబుద్ధి పృథ|వీవర యాజకుఁ గాఁగ నీవు ఖం
బునకు బృహస్పతిం గొనుము | పూర్వదిశాపతి కవ్విధంబు ప్రీ
తి నొసఁగు నట్లు సేయ కవ|ధీరణ చేసితయేని వజ్రముం
బనుచు నతండు నీపయి స|భాసదులుం విన జాటి చెప్పెనిన్. 89

సీ. అనిన మరుత్తుఁ డ|య్యమరగురుండు నా,యాగంబు నడపుట | కాత్మఁ గోరి
రా కున్న సంవర్తుఁ | బ్రార్థించి తెచ్చితి, నింక నట్టులు సేయ | కెట్లు నడప్పు
ననఘ మిత్రద్రోహ|మధికపాపముగాదె, యిది నీవెఱుంగుద|రయ్యింద్రుఁ డెఱుఁగు
సిద్ధసాధ్యాదిప్ర|సిద్ధులు నెఱుఁగుదు, రిమ్మాట గురునకు | నియ్యకోల
తే. యనుడు గంధర్వుఁ డదె విన|నయ్యె వజ్ర
ఘోరనాదంబు నీ కోర్వఁ | గొలఁది యగునొ
కాదొ నీవ యెఱుంగుదు | మేదినీశ
యనుటయును నృపుఁ డాలించి | విని భయమున. 90

వ. సంవర్తున కెఱింగించి. 91

క. కులిశము వచ్చుచు నున్నది, యలుకొందెడు నామనంబు | ననఘచరిత్ర స
భ్యులు సంత్రాసము నొందిరి, తలకొని రక్షింప వలయు | దయ మన్నింపన్. 92

వ. అనిన విని యమ్మహాయోగీశ్వరుండు. 93

సీ. ఇంద్రుని దెస భయం|బించు కేనియు వల, దతఁడు న న్నెఱుఁగఁ డే|యధిప వినుము
సంస్తంభవిద్యాప్ర|శస్తవైభవమున, వజ్రంబు నతఁడు న|వ్వాసవాది
దైవతంబులయాయు|ధంబులు నాచేతఁ, బ్రతిహతిం బొందు ద|ర్పవనచండ
వృష్టిప్రముఖమహా|వికృతుల బాధింతు, ననుడు మ్రోయుచుని బె|యరుగుడంచె
ఆ. భిదుర మెవ్విధమున | భీతి దొఱంగుదు, ననియె నృపతి యాతఁ | డల్ల నగుచు
దాని నరకుగొనకు | తగువర మడుగు నా,తపము పేర్మి నిత్తు | ధరణినాథ. 94

చ. అనిన మరుత్తుఁ డిట్లనియె | నాతనితో భయ మెల్లఁ బాసె నే
నిను వర మర్థి వేఁడెద మ|నీష విరోధము దక్కి యధ్వరం
బున కిట వచ్చి దైవతవి|భుండు నిజోచితహవ్యభాగముం
గొనియెడునట్లు గాఁగ ముని|కుంజర చిత్తమునం దలంపవే. 95

క. తమభాగంబులు దక్కిన,యమరులునుం బ్రీతిఁ గొనఁగ | యాగంబు ప్రయో
గము సుప్రణీత మయి లో,కమనోజ్ఞము గాఁగ వలయుఁ | గారుణ్యనిధీ. 96

క. అనుటయును మదాహ్వానం,బున నింద్రుఁడు సోమపాన|మున కేతెంచుం
జను దెంతు రతనితోఁ ద,క్కినయమరులుఁ దొడఁగు యజ్ఞ|కృతికి నరేంద్రా. 97

మరుత్తునియజ్ఞంబున హవిర్భాగంబులు గొన నింద్రాదులు వచ్చుట.

వ. అని పలికి దవ్వులన యవ్వజ్రంబు వారించి గంధర్వునకు వీడుకోలు సేయించి యమ్మహాయోగీంద్రుండు దేవేంద్రుని దేవతలనుం బిలిచె నమ్మహాత్మునిమహనీయమంత్ర శక్తి నాహూతులు నైనయప్పురుహూతప్రభృతిబృందారకులు ప్రియంబున నరుగుదేర నమ్మునిపతి యజ్ఞపతి వారల నెదుర్కొను తెఱంగు నడపి తానును గూడ నడచి వారికి నర్ఘ్యపాద్యాదిపూజనంబులు విధివిహితప్రకారంబునం జెల్లించె నమ్మహాత్ముండును మరుత్పతికిం బ్రణమిల్లి దేవా నీవు విజయంచేసి నాజన్నంబు సఫలంబు సేసితి కృతార్థుండ నైతిం గృపాధామ నామీఁదియలుక మాని నన్నుం జల్లనిచూడ్కిఁ జూడుము మఱి ప్రార్థించి సంవర్తుం జూపి యుత్తాపసపతి బృహస్పతి సహోదరుండు కావునం గ్రతువునకు యాజకుండుగాఁ బ్రతిగ్రహించితి నని విన్నవించుటయు ననిమిషనాయకుండు సునాసీరుం బ్రీతిం బొందితి నీతం డయ్యమరగురున నుజుం డతని యట్లగుటను నందియుం బేమి యనుచు వికచవదనుం డై కనుంగొనిన నమ్ముని వరుం డాదివిజవరున కిట్లనియె. 98

ఆ. అఖిలలోకభర్త వగు దేవేంద్ర నీ విట్లు, లాదరమున వచ్చు టరయ నాకు
తపముఫలము గాదె పావనమూర్తి యీ, రాజుక్రతువుఁ బుణ్యరాశి యయ్యె.

ఉ. సకలవిధానదక్షుఁడవు సర్వము నారసి చేయఁ బంపు నీ
సత్కృపనిట్టకృత్యములను ¹సార్థము లై క్రతుమంత్రతంత్రముల్
వికలత లేక చెల్లు జనవిశ్రుతుఁ డీనృపుఁడున్ భవద్దయన్
సుకృతులు పోనిపొంపు గని చూడఁగనుం దగఁ బుణ్యలోకముల్. 100

వ. అని యిట్లు నిర్భరుండై యభివర్ణనపూర్వకంబుగా సంభాషణం బాచరించిన.

సీ. భాగహవిర్భాగంబులఁ బొంది పురందరుం, డమృతాశనులఁ గలయంగఁ జూచి
యజ్ఞవాటం బుదాత్తాభిరామంబుగఁ, జేయింపుఁ డప్సరస్స్త్రీజనంబు
నాట గంధర్వులపాటఁ జెల్లింపుఁడు, నావుడు వా రట్ల నడపి మఱియు
సకలకర్మములకు సాహాయ్య మాచరింపంగ వేడ్క యగ్నిభంగి వెలిఁగి

తే. లసితసముచితపీఠ మలంకరించి, వేడ్క సంవర్తముని హవిర్విధి యొనర్ప
యాగముజ్జ్వలమును సుప్రయోగకంబు, నగుచు నొప్పారె భరతకులాగ్రగణ్య.

తే. ²ప్రీతిఁ బేర్వారఁ బిలిచి చేసేత సోమ, మమ్మహాయోగి యంది యారఁ నెమ్మిఁ బాన
మాచరించి సహస్రనేత్రాదు లైన, యమరు లానందమునఁ దేలి రధిపముఖ్య.

వ. ఇట్లు మరుత్తుండు మరుత్పతికిం బరమతృప్తి గావించి యామంత్రణంబు సేయ నయ్యందఱు నభినందించి నిజనివాసంబులకుం జని రజ్జననాథుండు. 104

చ. యజనము సెల్లుకాలము సమాప్తతఁ బొందిన నాఁడు దద్దయు
క్కజ మగుభంగిఁ బ్రస్ఫురితకాంచనరాసు లనేకముల్ బహు

1. గ. సాధ్యము లై. 2. చ. ప్రీతి రెట్టింపఁ బేర్వారఁ ♦ బిలిచి సోమ.

ద్విజులకు భక్తియు శక్తియును ♦ వేడుకయును వినయంబు నొప్ప సం
భజనపరాత్ముఁడై యొసఁగెఁ ♦ బౌరవవంశపయోధిచంద్రమా. 105

తే. అంతఁ బోవక హేమమయత్వమహిత,యజ్ఞవాటభాండాదిపదార్థములును
బ్రాహ్మణావళి కిచ్చె నప్పాట నతఁడు, హిమగిరిప్రాంతమునఁ గ్రతువెలమిఁ జేసి.

వ. సంవర్తునిచేత ననుజ్ఞాతుండై నిజపురంబునకు నరుగుదెంచి వార్ధివేష్టితవసుంధ
రావలయంబుం బుణ్యాపరత వెలయం బాలించె బ్రాహ్మణులుఁ దమయోపినంత
యుం బసిండి ద్రవ్యఖండంబులు దెచ్చుకొని తక్కినదాని నచ్చట నొక్కెడ నిధిగా
నిక్షేపించి దీనిం గాలాంతరంబున నెవ్వరేనిం గని రిది యక్కినవారిధనంబ యని
రమ్మహాకాంచనసంచయంబు గొని వచ్చి విచ్చలవిడి నశ్వమేధయాగంబున సకల
దేవతలం దృప్తులం జేయు మనియె నట్లు వేదవ్యాసమునీశ్వరుండు సెప్పినవచనం
బులు వినియును బంధువిషయశోకంబునం గ్రమ్మఱం దెలివి నొందియు నొందక
ధూమంబు వొదవినయనలంబునుంబోలె నున్న పాండవాగ్రజుం గనుంగొని కమల
నాభుండు. 107

తే. వంక మైనతలం బెల్ల ♦ వసుమతీశ, యరయ మృత్యుపదం బగు ♦ నార్జవాన్వి
తంబు బ్రహ్మపదం బింత ♦ తథ్య మేల, యీఱతాఱతలంపుల ♦ బీఱు వాఱు. 108

క. కర్మానుష్ఠానంబును, నిర్మలముగ నడపఁబడదు ♦ నీచే విను మో
ధర్మతనూభవ వగయును, నిర్మూలము సేయ విది మనీష కలిమిదో. 109

వ. వగ [1]నిర్మూలము సేయమి యెట్లంటేని నీ వంతశ్శత్రుల నెఱుంగవు గావున
నేతద్విషయం బైనయొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. 110

శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు మనస్తాపోపశమంబు సేయుట

సీ. అవని యెల్లను వృత్రుఁ డాక్రమించి తదీయ,గుణ మగుగంధంబు ♦ గొనిన వజ్రి
వానిపై వజ్రంబు ♦ వైవఁ గ్రమంబున, నంబుతేజఃపవనాంబరముల
యందుఁ బ్రవేశించి ♦ యందులరసరూప,సంస్పర్శశబ్దముల్ ♦ చండవిక్ర
ముం డైనయతఁడు సమ్ముద్ధతిఁ గొనఁ గొనఁ, దోడ్తోడ నమ్మహేంద్రుండు కులిశ
తే. నిహతి వెలువరింప ♦ నిర్భరవేగుఁ డై, యతనిలోను సొచ్చె ♦ నసుర దాన
మూర్ఛవోయె దివిజముఖ్యుండు బోధితుఁ, జేసె మంత్రవిధి వసిష్ఠుఁ డతని. 111

వ. ఇట్లు వసిష్ఠప్రయుక్తమంత్రశక్తిం బ్రబుద్ధుండై నవృద్ధశ్రవుండు శరీరాంతర్గతుం
డైనవృత్రు నదృశ్యం బైనవజ్రంబున వధియించె నవ్వాసవుం డీధర్మరహస్యంబు
తెఱంగు మునుల కెఱిఁగించె మునులు నాకుం జెప్పిరి మానవేశ్వర దీని నీవు
దెలిసికొను మని పలికి యప్పాండవాగ్రజునితో నప్పుండరీకాక్షుండు వెండియు
ని ట్లనియె. 112

. శారీరమును మానసంబును నా రెండు,దెఱఁగు లై వ్యాధి వర్తించు నందు

1. గ. నిర్మూలము సేయు మది యెట్లంటేని.

వినువాతమును బిత్తమును శ్లేష్మమును సమత్వంబుఁ బొందినయప్డు స్వస్థుఁడగునరుఁ డవి మూఁడును నొక్కొం డైన వికృతి నొందిన శరీరవ్యాధి యనఁగఁబరఁగు
సత్త్వరజస్తమస్సమత సుస్థితి విషమత మనోవ్యాధి యీద్వితయమునకు
నొంటి నొంచు నెపుడు నొదవ దన్యోన్యసంజనకజన్యభావసత్తఁ జేసి
వికృతి కాల మొకట నొకటి దోఁచు నది వాతాదులందు గుణములందు నధిప.
ఇది సూక్ష్మకర్తానుష్ఠానప్రకారంబు దీని నీ వలవరింపవు గావునం గర్మానుష్ఠానంబును నిర్మలంబుగా నడపంబడ దంటి నని పలికి మఱియును. 114
వాతాదులందు గుణములు, నీ తెరువునఁ దక్కు వగుట యెక్కుడగుట నీ[1]చేతఃప్రశక్తిఁ దోఁచి నృపా తెలియఁగ వలయు సమత యపరశాంతికి నై. 115
అట్లుగాక వాతాదులు సత్త్వముఖ్యములును దివిచినఁ గలఁగు దేని
నది నీస్వభావ మేమనఁ గల దింకను, జెప్పెద నవధానమొప్ప వినుము
సభ నేకవస్త్ర రజస్వలఁ బాంచాలిఁ, గొని రాక మఱవు కానసములోన
నిమ్మనులు గుడుచుట నెడ్డఁ బెట్టకు జటాసురసైంధవాదులదురితకృతులు
దలఁపకుము మాత్స్యపురమున దైన్యపడుట, బుద్ధిసేయకు భీష్మాదియుద్ధతంత్ర
మూరయంగ యుద్ధంబు గాదు దండుఁ బుట్టు, కీడు మే లేమియును జిత్తగింపకుండు.
దాని నెట్లు యుద్ధంబు గా దనియె దం టేని నది మిథ్యాయుద్ధంబు సత్యయుద్ధంబాకర్ణింపుము. 117
అట్లయి బంధుమిత్త్రులసహాయతకల్మి ప్రయోజనంబు లే
దమ్మహనీయయుద్ధమున దాత్మయ తోడు మనంబు శత్రుఁడీ
వెట్లయి నైన శాంతి ఘటియింపుము లోపగఁ దీర్పు మందు శాం
తమ్ము చుమీ మనోవిజయి వై వెలుఁ గొందుము శాంతబుద్ధి వై. 118
అంతరంగునిక్కయ్య మధిప గెలువ, కిట్లు యోగతిఁ బోయెదో యెఱుఁగ దీని
నీవ కనికొని సద్బుద్ధినిశ్చయప్రవీణుఁడవు గమ్ము మాటలు వేయు నేల. 119
అని చెప్పి కౌంతేయార్జునితోఁ గృష్ణుండు వెండియు నిట్లను రెండక్షరంబులు మృత్యువు మూఁడక్షరంబులు బ్రహ్మం బవి యెయ్యవి యం టేని వినుము మమ యనునవియును నమమ యనునవియును నై యుండు భూతంబులచేతం గానంబడక యాబ్రహ్మమృత్యువులు వోరు చుండు. 120
తత్త్వ మనశ్వర మశరీరత్త్వంబునఁ బరఁగు భూతరాశి నియతనా
శిత్త్వంబు హింసకత్వము, తాత్త్వికమై లేదు దేహదళనమున నృపా. 121
శరధిపరివేష్టితక్షితిఁ, బరిపాలించినను దానిపై దృఢమమతం
బొరయక వర్తించిన న, ప్పురుషుని దురితంబు లెట్లు పొందఁగ నేర్చున్. 122
వనమున వన్యాహారంబున వర్తించినఁ బదార్థములపై మమత

---

1. క. చేతఃప్రసక్తిఁ దోఁచి నృపా తెలిఁ గెలుఁగ నగు సమత.

మనమున విడ కుండిన స,మ్మనుజుఁడు మృత్యుముఖవ ర్తి యనుబుధాగ్రణీ. 123

క. వెలిపగఱగెలుపు గెలుపే, యలఘుమతికి గెలువవలయు నభ్యంతరశ
త్రులఁ దద్విజయము మోక్షమ, సలవఱుపం జాలు నొంట సమ్మోదముగ నే. 124

క. విను మంతశ్శత్రులలో, ఘనుఁ డగుఁ గాముఁడు నిరస్తకామం బగువ
ర్తనము విరళ మధ్యయనయ,జనదానంబులును గామసహితములు గదా. 125

వ. ఇవ్విషయంబునం గామగీత లనువాక్యంబులు గలవు వాని నాకర్ణింపుము కాముండు లోకంబు నుద్దేశించి యి ట్లనియె. 126

క. అనపాయుం డగు నెవ్వం,డును నను బాధింపఁ జాలఁడు ప్రయత్నము సా
ధన మగు నె వేదవేద్యుం,డ నయి పరఁగుచున్న నాయుదను విపులాత్మ నై. 127

క. [1]ధృతి నెవ్వఁడు నన్నుం బ్రవి,హతుఁ జేయఁగఁ జూచు [2]భావ మగుదునతని కే
నతఁ డది యెఱుఁగఁడు గాన వి,హతి బొంకై పోవఁగా జయము లేకుండును. 128

క. ననుఁ దపమునఁ బ్రహరించెద, నని యెవ్వఁడు దొడఁగు నతని కాతపమున్నలం
బున దెసఁ గోరిక నై యే, జనియింతుం జెఱపఁగా వశమె యెవ్వనికిన్. 129

క. నను మోక్ష మూఁది చెఱచెద,నని యెవ్వఁడు దలఁచు వానికయ్యది మోక్షా
ర్థనమై యునికి నవధ్యుఁడ, సనాతనుఁడఁ ద్రోవ నొకఁడుఁ జాలఁడు నన్నున్. 130

క. అని యివ్విధమునఁ గాముఁడు, దనుఁ జెఱపఁగ రామిఁ జెప్పఁ దలఁపొందినఁ జె
ప్పినభంగి నెదను దోఁచెను, విను మవధానమునఁ బాండవేయ ప్రవరా. 131

సీ. పనివడి పూఁచి పట్టమి సబంధురధైర్యము నిర్వహింతు నే
ననుమతి సొన్న కుండుట సమగ్రతపంబునతత్పలేచ్ఛ లే
కునికి విమోక్షతృష్ణభర మొందమి కాము నడంచుఁ గాన యి
య్యనువులు లేమి సువ్వె యనపాయత గా నతఁ డాడె భూవరా. 132

క. విను పెక్కు లేల కోరిక, మనమునఁ జొరనీక యున్న మడియుం గాముం
డనవద్య యశ్వమేధం, బొనరింపుము గోర కుండు మొక్కటియు మదిన్. 133

ఆ. అశ్వమేధమఖము నం దట్ల యనఘ య,లోలుపత్వగుణవిశాలబుద్ధి
శాలి వై ఫలాభిసంధి లేక కర్మము, ధర్మ్యగాఁ బొనర్పు ధర్మతనయ. 134

క. చచ్చినబంధులఁ గొని రా,వచ్చునె తలఁపకుము నీవు వారిం గ్రతువుల్
విచ్చలవిడిఁ జేయుము నిను, మెచ్చు జగంబు సమకూరు మీఁద సుగతియున్. 135

వ. అని యిట్లు కృష్ణుండు సెప్పెఁ బారాశర్యుండు బోధించె దేవస్థానుండు నారదుండును హితవచనంబు లుపదేశించిరి భీమాదులు నలువురును ద్రౌపదియును దగిన మాటలు సెప్పిరి శాస్త్రచక్షుర్మహితు లైనమహీసురులు యోగ్యవచనంబు లుపన్యసించి రివ్విధంబున నందఱవాక్యంబులు నాకర్ణించి శోకంబు విడిచి యాభూకాంతుండు ధరణీపాలనాధ్వరకరణంబుల కియ్యకొని యశుచిత్వనివృత్తి

1. గ. ధృతిమెయి నెవ్వఁడు ననుఁ బ్రతి. 2. భావ మగుదు.

లై గంగాతీరంబునఁ గొన్నిదినంబులు నిలుచువాఁ డయి మునివర్గంబునకుఁ బ్రద
క్షిణంబును బ్రణామంబునుం జేసి. 136

. మీకారుణ్యంబున నా, శోకం బంతయును బాసె ♦ సుమనస్కత సు
శ్లోకాత్మ్యులార కలిగెఁ, నాకుఁ విచ్చేయుఁ డింక ♦ నను మఱవకుఁడీ. 137

వ్యాసనారదాదిమునులు ధర్మజు వీడ్కొని స్వస్థానములకుఁ బోవుట.

. అని పలికి విశేషించి వేదవ్యాసమునివరుపాదంబుల కెఱఁగి భవత్ప్రసాదంబునం గనుసువ గనినకనకమ్ము మిమ్ముం బురస్కరించుకొని పోయి చేకొనం గలవాఁడ నిప్పటికి నన్నిధి సేయువలయు నిప్పన్నిధికి నాశ్రయం బైనహిమగిరి మహీధరంబులలోపల నెల్లను బరమాశ్చర్యనిధి యని సవినయంబుగాఁ బ్రార్థించి నాపైఁ బెక్కులు కల్యాణకరణకల్యంబు లగుమాట లాడితిరి మహాభాగ్యవంతులకుఁ గాక యిట్టివారికారుణ్యంబు దొరకొనునె మీకరుణయ నన్ను భాగ్యవంతుం జేసి నిలిపెను అని [1]బహుప్రకారంబులం బ్రస్తుతి సేసె నట్లామంత్రితు లై యమ్మహాత్ము లందఱుఁ గృష్ణార్జునామంత్రణంబు గైకొని యంతర్ధానంబు సేసిరి పదంపడి భీష్మునకుం బరలోకక్రియలు ధృతరాష్ట్రసహితుం డై యాచరించి కర్ణప్రభృతికురుప్రకరంబునకు నూర్ధ్వలోకసాంద్రసౌఖ్యసిద్ధ్యర్థంబుగా నానావిధదానవిధులు నిర్వర్తించి కృతకృత్యుం డై కతిపయదినంబుల కచ్చోటు గదలి పాండవాగ్రజుండు పాండునృపాగ్రజు నగ్రేసరుం గావించుకొని కరినగరంబున కరిగి యతనిం బూజించి తదనుజ్ఞాశోభితుం డగుచుఁ గృష్ణుండును భీమాద్యనుజులును మోదంబు నొంద జనులు నభినందింపఁ బెం పారి [2]వసుంధరాపరిపాలనధురంధరుం డయ్యె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 138

ధర్మజుఁడు ధరణిం బాలించునపుడు కృష్ణార్జునులవర్తించువిధము.

తే. ఇవ్విధంబున ధర్మజుం ♦ డెలమి ధరణి, పాలనము సేయఁగాఁ గృష్ణ ♦ పార్థు లెట్టి
తెఱఁగువారలై యెచట వ ♦ ర్తించి రెఱుఁగఁ, జెప్పవే నాకు సజ్జన ♦ సేవనీయ. 139

వ. అని యడిగిన వైశంపాయనుం డిట్లనియె. 140

సీ. ధర్మజుం డిమ్మెయి ♦ ధరణిఁ బాలింపంగ, ననఘ యింద్రప్రస్థ ♦ మున వసించి
కృష్ణుండుఁ గ్రీడియుఁ ♦ గ్రీడాపరత సరి, త్కాననపర్వత ♦ సానుదేశ
ములఁ జరించుచు విప్ర ♦ పూజలఁ బుణ్యక, థాశ్రవణముల స ♦ త్కావ్యగోష్ఠిఁ
బ్రొద్దు పుచ్చుచుఁ దమ ♦ పూర్వవృత్తము లైన, సమరతంత్ర ప్రముఖ ♦ ములఁ జెప్పి
తే. కొనుచునుండుదు రాత్మీయ ♦ తనయు నరుఁడు, దలఁచి వగచినశోకంబు ♦ దలఁగునట్టి
వాక్యసంతతి నావృష్ణి ♦ వరుఁడు దేర్చు, సముచితోక్తుల ధర్మజు ♦ శాంతి వొగడు.
క. [3]విను మయకృతసభఁ గ్రొత్తగఁ, గని యచ్చో నొక్కయెడ ♦ సకౌతుకనానా

1. క. సూనృతప్రస్తుతి సేసె. 2. ట. పృథివిం బాలించె నని చెప్పిన 3. జ. విను మామయసభ.

జనపరివృతుఁ డై యుండుదు, రనూనవిభవమునఁ బ్రమద - మీఱంగ వారిన్. 142

వ. ఒక్కనాఁ డప్పుండరీకాక్షుండు గాండీవితో ని ట్లనియె. 143

సీ. సమరంబు ధర్మవి - జయపరికీర్త్యంబు, గాఁ జేసి భూమి ని - ష్కంటకముగఁ
బాలించుచున్నాఁడు - ప్రజ ప్రీతి నొందంగ, విద్వజ్జనంబులు - వివిధసుఖము
లనుభవించుచుఁ దన్ను - వినుతింప నెగడెడు, శాంతియు సమతయు - సకలజనముఁ
గొనియాడు సిద్ధులు - మునులు సేవింతురు, ధర్మనందనుఁ డి ట్లు - దాల్మిఁ దగు నె
తే. యతని కున్నతి గావించి - యనిలజుండుఁ, గవలు నెంతయు నీచేత - గాంచిరం బు
లీల గల్గి మహాధర్మ - శాలి సత్య,నిత్యుఁ డమ్మహీపతి కృత - కృత్యుఁ డయ్యె. 144

వ. అని యగ్గించి యతనియాననం బాలోకించి. 145

ఉ. నీవలనన్ మహాత్మ విను - నిర్భరచిత్తుఁడ నైతిఁ జూడఁగాఁ
బోవుతలంపు పుట్టెడుఁ బ్ర - భూతగుణున్ బలదేవు వత్సలన్
దేవకి నార్ద్రచిత్తు వసు - దేవుని మద్గతరాగసాంద్రస
ద్భావుల సర్వయాదవులఁ - బార్థ సనుం దగ నన్పి పుచ్చవే. 146

క. ద్వారకకుఁ బోయి వచ్చెదఁ, గౌరవపతి కిత్తెఱంగు - [1] కార్యజ్ఞానో
దారుఁడ వగు నీ వొచ్చి, త్యర్థము గాఁగఁ జెప్పు - మగునమయమునన్. 147

తే. అవ్విభుఁడు పోయి వత్తు గా - కనక పోను
మేనుఁ బ్రాణంబుఁ దనయులు - మిత్త్రగణము
బంధులును నర్థచయము న - ప్పార్థివేంద్రు
సొమ్ము తదనువర్తనము వ్ర - తమ్ము నాకు. 148

వ. కావున. 149

క. మనము కరినగరమునకుం, జని పుణ్యాత్ముని నజాత - శత్రుని నెలమిం
గని తగునవసరమున ని,ప్పని విజ్ఞాపించి యతని - పనిచినభంగిన్. 150

క. నడతము పోద మనుడుఁ గ,వ్వడి గొండొకవడి విచార - వ్యాసక్తుఁడై
కడు మే లటు సేయుద మని, యొడఁబాటుం బలుకు వలికి - యొయ్యన పిదపన్.

వ. అమ్మహాత్ముతో ని ట్లనియె. 152

చ. అనికిఁ దొడంగునప్పుడు మ - దాత్మ గలంగినఁ గొన్ని తత్త్వబో
ధనమహనీయవాక్యములు - దాత్తకృపం దగ నీవు సెప్పి తే
మనమున వానియర్థములు - మాధవ నిల్పఁగఁ జాలనైతి న
వ్వినుతవచస్సుధారసము - వీనుల నిం కొకమాఱు నింపవే. 153

క. అనిన నగుచు నొకకేల న,తనిఁ గౌఁగిటఁ జేర్చి బుద్ధి - తత్త్వవిహీనుం
డును శ్రద్ధారహితుఁడు నై, తని దూఱి ముకుందుఁ డిట్టు - లను నాతనితోడన్.

తే. [2] బ్రహ్మపదవేదనమునకుఁ - బరమహేతు

1. గ. కార్యవిధిజ్ఞోదారుఁడ. 2. చ. బ్రహ్మపదవిత్త్వమునకును.

భూతములు నాఁటివాక్యముల్ బుద్ధిఁ దన్న
సత్త్వములు నిల్చునై తె శక్యంబె యింక
నవ్వచనములు సెప్పంగ నలఘుశౌర్య. 155

—శ్రీకృష్ణుం డర్జునునకుఁ దత్త్వజ్ఞానస్థిరీకరణము సేయుట.—

వ. తద్విషయం బగునది యొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము నాకడకు నొక్క విప్రోత్తముండు వచ్చిన నేనును దత్త్వజ్ఞానంబు తెలియం గుపదేశింపవే యనుటయు నతండును కాశ్యపనామధేయుం డగునొక్కధరామరుం డొక్కెడ విజితేంద్రియుండును జ్ఞానవిజ్ఞానశాలియుఁ ద్యక్తసంసారపరిగ్రహుండును బ్రబుద్ధసేవితుండును నగునొక్కసిద్ధునిం గాంచి సంభృతవినయుండై శిష్యత్వంబున భక్తి నాశ్రయించిన నమ్మహాద్విజునకు నమ్మహానీయుండు సెప్పినవాక్యంబులు సెప్పెద నవధానంబుతో వినుమని పల్కి మదీయవదనంబునం జూడ్కి నిలిపి యిట్లనియె. 156

ఆ. ఇట్లు భక్తిఁ దన్ను నాశ్రయించిన శుచి, తాపాధికుండు నిర్మలాత్మకుండు
నతులవినయపరుఁడు నగువిప్రవరుని వీక్షించి యిట్టు లనియె సిద్ధవరుఁడు. 157

సీ. పుణ్యంబు లగుకర్మముల నెప్పుడును జేసి, యింపారు చుండునైహికసుఖంబుఁ
బ్రదినంబుఁ బడసితి ధీయుత యత్యంత,యత్నలబ్ధం బైనయట్టిపదము
పడపడి యొకమాత్ర భ్రంశంబు నొంది కా,మక్రోధముఖచిత్తమలవిశేష
ములఁ బోరిఁబోరి జన్మమును మరణంబును, గలుగంగ నేను దల్లులను దండ్రు
తే. లను సహోదరులను బుత్త్రలను ననేక,జాతికలితులఁ గాంచితిఁ జన్నుఁబాలు
వివిధభంగులఁ ద్రావితి సుహృద్వి,యోగధననాశదుర్దశ లొందఁ బెక్కు.

క. మానసశారీరము లగు,నానావేదనల వివిధనరకగతుల దుః
ఖానేకత్వ మొనర్చువి,మాననవధబంధనప్రమర్దనకృతులన్. 159

వ. అనుభవించుచు నుండి విసివి లోకతంత్రంబు పరిత్యజించితిఁ బదంపడి యాత్మప్రసాదంబున నిట్టిసిద్ధి వడసితి నింక లోకంబుల నాలోకింప నాకుం బ్రజాసర్గంబు గలయంతకాలంబును శుభంబ నిరంతరం బై కలుగుచుండు నే నంతకంతకు నెక్కుడు లెస్స యగుదశలన పొందుదు బ్రహ్మానందంబు సులభంబ యని పలికి మఱియును. 160

ఉ. ప్రీతుఁడ నైతి నీదెసఁ బరిస్ఫుటభంగిని జెప్పు మెద్ది నా
చేత నుపాస్తిమైఁ బడయఁ జేరితి నీ కది గల్గునట్లుగాఁ
జూతు నవశ్యముం వినయసుందర నన్ను నెఱింగి వచ్చి తీ
వీ తెలి వస్మదీయమతి కించిన నిన్నుఁ బరిగ్రహించితిన్. 161

క. అనుడు నతఁడు హర్షించుచు, ననుఁ బరతత్త్వప్రబోధనమునఁ గృతార్థా
త్మునిఁ జేసి జన్మమృతిదుః,ఖనిరాస మొనర్చు పరమకారుణ్యనిధీ. 162

వ. అనుచుం దచ్చరణంబులు గరంబుల నవలంబించి ప్రణతి యాచరించి కేలు మొగిచి యున్న నయ్యుర్వీసురోత్తముతో నాసిద్ధసత్తముండు నీకుం బరిపాటిం జెప్పెద సావధానమానసుండ వై యాకర్ణింపు మని యిట్లనియె. 163

ఆ. ధర్మసాధనంబు దనువు ధర్మము పరిజ్ఞానదాయి యట్లు గాన తనువు
నోమ వలయు మర్త్యుఁ డేమిట నేమఱ, కాత్మహితము గోరి యనఘచరిత. 164

వ. ఏమఱుటల తెఱంగు వివరించెద. 165

సీ. తనసత్త్వమును బలంబును దన కయ్యెడు, కాలంబు నారయక గాఁ దలంపఁ
డాహారములు గొను నవియును నగునవి, గానివి యనువివేకంబు బుద్ధిఁ
బొనుపఁడు బహుళభోజన మొకమరి సేయు, నొకమరి దుర్నిష్ఠ నుపవసించు
గతకాలమును నపక్వంబును గురుమృష్ట, [1]విషమవిరుద్ధము విపులరసము

తే. నైనయన్నము దా నరయక భుజించుఁ
గుడుపుపైఁ గుడుచు దినని ద్ర గూరు సురత
పరత నొందుఁ బెల్లాయాసపడు నిమూఢుఁ
డతని బాధించు దోషత్రయంబుఁ గెరలి. 166

వ. అని చెప్పి. 167

శ్లేష్మాదిరోగవికారంబుల నిరూపించుట.

ఆ. అన్నకర్మలోప మవచయ మొనరించు, ననఘ దేహమున నసన్న వేగ
ధారణములు రోగతతి జనింపంగఁ జేయుఁ, గామగోపములనుగాఁచు మెడలు.

క. అత్యంతప్రబలంబులు, పైత్యవికారములు రేఁగి ప్రాణములకు నీ
ఘోరాత్యయముం జేయు మహా, ధత్యంబున నెలవు వెడలఁదఱిమి నుచరితా. 169

తే. అవ్వికారంబు లెక్కుడై యడరి యెచ్చ
లొచటు భిన్నంబు సేయు నయ్యెడలు మర్మ
నామకంబులు మర్మభిన్నత్వ మెట్లు
సేయ కుండుఁ బరిచ్యుతి జీవమునకు. 170

క. వినుము తెలియంగ శ్లేష్మం, బనుదోషం బారఁ బరఁగి యవయవములు జా
డ్యనిరూఢంబులుగాఁ జేయును లోపలిబయలు నెల్ల నొయ్యన కప్పున్. 171

వ. పదంపడి. 172

క. కుత్తుకకు నడ్డపడు నూ, ర్పొత్తిలి పోసీక యాఁగు నూర్ధ్వశ్వాసం
బెత్తఁగఁ జేయును జీవుం, డత్తనువున నుండ నేర కంతట వెడలున్. 173

క. స్రోతోమార్గంబులఁ జూ, పే తమ కర్మంబు లైనవిషయంబులఁ బ్ర
స్ఫీతమతిం జాతుర్యా, పేతము లై యింద్రియంబు లేనును బుట్టున్. 174

క. స్రోతోమార్గములు కఫము, చేత నిరుద్ధంబు లైనఁ జెడు నింద్రియజా

1. క. విషమవిరోధుల విపులరసము.

తాంతనాశోక్తులు బొసను, వీతము లగుఁ జేష్టితములు | విను మనుజులకున్. 175

తే. వాయు వంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి
నొవ్వఁ బనులును బుట్టించుఁ | గ్రొవ్వ సెఱచు
నందు లెడఁబాయుచుఁ గ్రమమున | నెందుఁ బరఁగి
తనువు [1]వ్రానుగఁ జేసి జీవుని వెలార్చు. 176

క. నాలుక నూడుట కేలుం, గాలు ముడుఁపఁ జాఁప నగుట | కాయంబునయం
దీలీలలు వాయుగతుల్, [2]మే లే నివి గలుగుఁ దక్కు | మే లమలాత్మా. 177

క. ఎక్కడిది పుట్టవి దోషము, లొక్కొక్కమరి రెండుమూఁడు | నొదవి పెరయుఁ దా
నక్కొను నన్నిపాతం, బక్కజముగఁ దనువుఁ బాపు | నది జీవాత్మున్. 178

క. ఈవిధమున వడపి చనిన, జీవుఁడు నిజకర్మజాల | సిద్ధగతులకుం
బోవుం దద్భవసుఖదుః, ఖావేశముఁ బొందుచుండు | నయ్యెడలన్. 179

క. కృతకర్మఫలము లొగఁ గుడిచి తనకుఁ దగినట్టిపుట్టు | నెందు మగుడ ని
ట్టి పలుగుడ జీవాత్ముఁడు, గతాగతము లనుభవించుఁ | గల్మషరహితా. 180

క. పాపాత్ములు నరకముఁ బుణ్యోపేతులు దివము విధినియుక్తి నవశతం
బ్రాపించెదరు గావున ని, ర్లేపం బగు మోక్ష మొందరు | లే రట్టిజనుల్. 181

తే. ఊర్ధ్వగతి కేఁగుమానవు | లుండునట్టి, నెలవు లార్యులు శాస్త్రను | నిశ్చయమునఁ
గని యెఱింగింతు రవి నీకు | వినుము నీకుఁ, దెలియునట్లుగఁ జెప్పెద | ధీసమగ్ర.

తే. సోముఁడనఁ దారకములన | సూర్యుఁడనఁగఁ, గలుగు తేజస్విమూర్తుల | నెలవులందు
ధర్మపరులుండుదురు తార | తమ్యములకు, మనసు లెరియునట్టివి గడు | మంచి వగునె.

క. అదియును గాక ఫలంబులు, దుది ముట్టఁగఁ గుడిచి వెడలఁ | ద్రోవఁ బడుదు ర
ట్టిది సౌఖ్య మగునె శాశ్వత, పదంబు మోక్షంబ కాక | భవ్యవిచారా. 184

వ. అని చెప్పి గర్భావాప్తిప్రకారం బెఱింగించెద విను మని పలికి సిద్ధుం డా భూసురున
కి ట్లనియె. 185

తే. అశుభములును శుభమ్ములు | నైనకర్మ, ములఫలంబులు గుడువక | పోవఁ గాదు
మన్యువశగతమైనయా | త్మకు నుదాత్త, చరిత యదికారణమును వ్వో | జన్మమునకు.

క. ఎనయఁగ శుక్లము శోణిత, మును బెరసి వెలందిగర్భ | మున నెలకొను న
ప్పుని బ్రహ్మశక్తి బీజ, త్వనిరూఢిం బొనరు నవి వా | రదలుఁ బిండం బై. 187

క. విను మాబీజము పిండము, తనువునఁ జైతన్యరూప | తం బరఁగి శిరం
బును గేలుఁ గాలు నుదరం, బు నురము వెన్ను నను నంగ | ముల నేర్పఱుచున్. 188

వ. అని చెప్పి. 189

క. జననార్హావేళ వెలువడి, తనతొల్లిటికర్మములకుఁ | దగినవివిధవ
ర్తనములఁ బొందు నవి దెగినఁ, జని మఱియుం బుట్టుఁ గర్మ | సంతతికిఁ దగన్. 190

1. గ. మానుగ. 2. చ. ల్మే లైనం గలుగు డక్కు ♦ లే వమలాత్మా.

క. నరుఁ డెంతకాలమేనిం, బరమం బగుముక్తిపదముఁ ♦ బడయక యుండున్
బురుషవర యంతకాలముఁ, బొరిఁబొరి నిబ్బంగిఁ జావుఁ ♦ బుట్టువు నొందున్. 191

సీ. కావున ముక్తికిఁ ♦ గారణం బగుదాని, నేర్పడఁ జెప్పెద ♦ నెఱిఁగికొనుము
దానంబు శమమును ♦ దమమును బ్రహ్మచ, ర్యంబును వ్రతపరి♦రక్షణంబు
దయయును బరధన♦దారవర్జనమును, [1]నియమయమేంద్రియ♦నిగ్రహములు
జననీ జనక గురు♦జనపూజలును దేవ, తాతిథి పితృదేవ♦తార్చనములు

తే. సత్యమును శౌచమును శుభ♦సంవిధాన
నిరతియును ధైర్యమును గ్రౌర్య♦నిరసనమ్ముఁ
గలిమి పుణ్యవృత్తం బిది ♦ గలుగునరుఁడు
మొనయు దీని నూఁతగఁ గొని ♦ మోక్షమునకు. 192

క. పదపడి ధర్మాచరణము, మొదలుం దత్త్వాత్మనిధము ♦ బుధజనులకడం
గదలక నిలిచి యెఱింగికొన, విదితం బగు వారిశీల♦వృత్తములఁ గనున్. 193

క. వారలు సెప్పెడిశాంతో, దారవచనసమితి వినఁగఁ ♦ దద్గతబహుళగు
ధీరార్థము లంతఃకర, ణారూఢము లైనఁ బొరయ ♦ వాపద లెందున్. 194

సీ. వ్రతపరినిష్ఠమై ♦ వర్తించు చుండియుఁ, గ్రియవిజయమును శాంతి♦యును గలిగి
బ్రహ్మైకభజనత♦త్పరుఁ డగు చుండెడు, నతనికి బ్రహ్మంబు ♦ హుతవహుండు
సంస్తరంబును యోగ్య♦సమిధలు జలమును, మంత్రంబు గురుఁడును బ్ర♦హ్మంబ యట్టి
సచ్చరణంబు సూ♦క్ష్మబ్రహ్మచర్యంబు, దీనియం దుత్తమ♦స్థిరత గలుగు

తే. వాఁడు హర్షశోకోద్దామ♦వాయుహతుఁడు
గాఁడు మేదురమోహాంధ♦కారమున వె
డంగుపడఁడు సంసారని♦స్సంగసిద్ధిఁ
బొందుఁ గాలక్రమమున న♦ప్పురుషవరుఁడు. 195

వ. అని చెప్పి మఱియును. 196

### తత్త్వజ్ఞానవిశేషప్రదర్శనము.

సీ. ఆదిసృష్టిఁ బ్రధాన ♦ మనుతత్త్వ మంబుజా, సనుఁడు గల్పించె చే♦తన మొనర్చె
క్షర మండ్రు దానిఁ ద♦త్పర మగుతత్త్వంబు, నక్షర మనియును ♦ నమృత మనియు
నార్యులు సెప్పుదు ♦ రమ్మిథునంబున, యందు సంపన్నంబు ♦ లఖిలభూత
జాలంబులకును సం♦జనకంబు లైనబీ, జము లిది శ్రుతివాక్య♦సంభృతార్థ

తే. మతఁడు గలిగించె గమనము ♦ నాగమనము
జీవరాశికిఁ గావున ♦ నావిధమున
నది భ్రమించుచు నుండుఁ బు♦ణ్యాతిశయము
కతన జీవాత్మ డొకఁడు దర్ ♦ గాంచినపుడు. 197

1. క. నియమంబు నింద్రియ♦నిగ్రహంబు.

విను సుఖదుఃఖము లచిరము, లనియుం దను వశుచి యనియు సఖిలపదార్థం
బును నశ్వర మనియుం గ,ర్మనిరూఢత జాడ్య మనియు మది నూహించున్. 198

ఊహించి తన్నుఁ గప్పెడు, మోహావేశంబు ద్రోచి మోక్షపదప్రా
ప్తిపైను సంసారాబ్ధ్యవ,గాహనముం జేయ కుండు గతకల్మషుఁ డై. 199

అని పలికి వెండియు. 200

జనిమజ్జరామరణములు, గని ప్రకృతివిధంబు లెస్సగా నెఱుఁగుటఁ ద
జ్జనితక్లేశములను విసి,విసమర్త్యులు పరమపదము వెదకుదు రనఘా. 201

ఇట్టివా రిట్టివా రగుట మేలు గనికొని, యజనంబుఁ బూతంబు నైనచోట
నాసీనుఁ డై స్వపదరయుంబున నొకచింత,యును లేక యూఱడి యుండి యడరి
తోఁచుతోఁపుల నెల్లఁ ద్రోఁచ్చి యడంచి ని,రాలంబనుం డై సరయతఁ డొకండు
సర్వమిత్త్రుండును సర్వసహుండును, నిర్జితేంద్రియుఁడును నిర్భయుఁడును

తే. గామకోపవిహీనుఁడు శమధనుఁడు నైన
యతఁ డొకండు మానాభిమానాపగమము
సర్వభూతాత్మకత్వదర్శనముఁ గలుగు
నతఁ డొకండు వీరలు గందు రనఘ ముక్తి. 202

బలయుతులాభాలాభములఁ బ్రియద్వేషంబు,లును సుఖదుఃఖములును సమంబు
లై యుండు నెవ్వని కాసపాటును నవ,జ్ఞతయు నెందును లేక సర్వధర్మ
తంత్రలోలుండును ధర్మశీలుండునుఁ గాఁ, డెవ్వఁడు గూర్చువా రొవ్వ రుండు
వా రని తనకు నెవ్వరును గల్గక త్రివ,ర్గేచ్ఛ యెవ్వనిచేత నీఁగ విడువఁ

తే. బడు సకర్మభావంబుఁ బాపత్త్రయాప
గమము వైరాగ్యసుస్థిరత్వమును గల్గు
నరయ నెవ్వనియం దేని నతఁడు నతఁడు
నతఁడు నతఁడును గందు రవ్యయపదంబు. 203

అసమాలంబ మశబ్దము, రసగంధస్పర్శరూపరహిత మగుణ ము
ల్లసితగుణ మగు వెలుఁగు న,భ్యసననియతిపరుఁ డొకండు వడయుం బుత్త్రా. 204

తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ, బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పు
నతఁ డనింధనానలమునట్లల్లఁ బొందు,వికృతవర్జితమైననిర్వృతి కృతాత్మ. 205

అని నిర్దేశించి యోగిజనానుభావ్యం బైన నెల వెఱింగించెద నని పలికి యోగులు
దాన నాత్మదర్శనానందంబు నొందుదు రవధానంబున నాకర్ణింపు మని యి
ట్లనియె. 206

అనఘ ముంజగర్భ మగునిషీక నిదర్శ,నంబు గాఁగఁ గనుఁగొనంగ వలయుఁ
దనువు ముంజ మాత్మ తదిషీకనిష్కర్ష,విధము సుమ్ము యోగవిదుని వెరవు.

తనువువలన నిష్కర్షం, బొనర్చి జీవాత్ముఁ గాంచు యోగివరుం డ

య్యును వాదవి యట్లు దన్నుం, గనినప్పుడు జననమరణగతులం దొఱఁగున్ .208

క. ముక్తుండు జరామరణవి, యుక్తుం డై హర్షశోకయోగ మెడలి స
ద్భక్తులకును నప్పద మీ, శక్తుం డగుఁ జువ్వె బ్రహ్మచర్యము పేర్మిన్ . 209

ఆ. ఒడలియస్థిరత్వ మూహించి యాత్మయం, దధికనిష్ఠ గలుగునతఁడు సకల
భూతకోటివలనఁ బొందఁడు భయము రా, గాదిదుఃఖములకు నగపడఁడు. 210

క. విను యోగయుక్తునకు శ, స్త్రనిపాతి జలబాధ యగ్నిదాహము మొద లై
చనునవ్వికారములు లే, వనఘ యతఁడు గోరఁ డైంద్రపదము నపద [illegible] .211

క. తనయందు దన్ను లెస్సగఁ, గనుటం గడచినసుఖంబు గలుగదు లోకం
బున నెందు దాని కయ్యెడు, వినుతానుష్ఠానమునకు విసువని [illegible]. 212

వ. అయ్యనుష్ఠానం బెట్టి దనిన. 213

క. తనయెఱిఁగిన తెరువున నె, మ్మన మంతర్వర్తిఁ జేసి [illegible]
జననీ కుండఁగ నదియెం, దనువునఁ బడు నిలుపవలయు నప్పటి దానిన్ . 214

వ. అది యెట్లనిన. 215

తే. దంతములు జిహ్వ కుత్తుక తాలుతలము
కంఠనాళంబు హృదయంబు గణ్యచరిత
మఱియు [1]లోపల నెచటికి మనసు మెలఁగఁ
దాఁ గదల్పక యచటన యాఁగవలయు. 216

వ. అని చెప్పె నని చెప్పి నాతో శిష్యుం డని మఱపున బలికి తలంచికొని కొండొక
నవ్వుచు నవ్విప్రుండు నా మొగంబు సూచి యచ్యుతా యోగసిద్ధుం డనువాఁ డతండ స
కదా నీ యెఱుంగనియదియునుం గలదె మఱియు నక్కాశ్యపనాముఁ డడిగిన
తెఱంగు దానికి నుత్తరంబు నా యిచ్చినవిధంబును విను మని యిట్లనియె.217

ఆ. కేలు మొగిచి వినయశాలి యమ్మేధావి, విశదకరుణఁ జెప్పవే మహాత్మ
పరమమోక్షకరణపరిణతం బైనయు, దాత్మసూక్ష్మసుకరధర్మ మనియె. 218

వ. అనిన నవహితుండ వై యాకర్ణింపు మని పలికి యిట్లంటి. 219

ఆ. పాలకడవ పెక్కుపసులలో డించిన, యాతఁ డెట్లు దాని నరసికొనుచు
నుండు నట్లు లోన నునిచినమనసు నే, మఱక యాత్మ నెదకు టెఱుఁగు మేలు.

క. ఈ తెఱఁగున నుద్యుక్తుం, డై తెలి వొందినమనంబు నతులవివేక
ఖ్యాతి మరగించి శశ్వ, ద్ద్యోతిత మగు బ్రహ్మముం జతురయోగి గనున్ . 221

తే. అయ్యనాదితత్త్వము చక్షురాదికంబు, లైనయింద్రియములకు గ్రాహ్యంబు గాదు
సకలమలనిరాసాజ్యప్రసన్నతరమ, నఃప్రదీపంబు తద్దర్శనం బొనర్చు. 222

క. కలయంగ నెల్లయెడలం, దలలును లోచనములును బదంబులు హస్తం
బులు నై యాత్మతత్త్వం బు, జ్జ్వలభంగి వెలుంగ యోగవంతుఁడు గాంచున్ .223

---

1. చ. లోపట్ల...మలఁగ.

క. తను నేర్పరించి కేవల,మును శాంతము నైనతత్త్వ।మును సంతతముం
గనుచున్నఁ దన్ను నెఱుఁగం, గనుఁ జీఁకటిఁ బాపువెలుఁగు। గలుగుం బుత్త్రా.

వ. బ్రహ్మవిద్యారహస్యంబు సర్వంబు నీకుం జెప్పితి నీ వింక సుఖవి గమ్ము పొమ్ము నేనుం బోయెద నని యామంత్రణంబు సేసిన నపాస్తసంశయుం డయి యాశిష్యుం డరిగె నిట నిన్ను దర్శింప వచ్చితి నని పలికి యమ్మహాద్విజుం డంతర్హితుం డయ్యెఁ బరమహితం బైనయీవాక్యసంతానంబు సమవధానంబున వినం బడియె నే పాండవమధ్యమా నాఁడు రథస్థుండ వయిన నిన్ను నేతదీయం బయిన యర్థజాతంబు వినిపించితి నని యప్పురుషవరుతోడం బురుషోత్తముండు వెండియు ని ట్లనియె. 225

సీ. వ్యాసపుత్త్రునకి యనుర।క్తునికి సత్కృతాత్ముఁ, డైనవానికి నవ।ధానరహిత
చేతస్కు నకు నిది। చెప్పంగ రా దేఁ దొల్లి, వలియుంగఁ జెప్పితి। దేవతలకు
గాండివి నీవు దక్కఁగ నిది మర్త్యలో,కర్ణింపఁ దగువారు। గలరె యొరులు
పరమరహస్య మిం।పరిపాటి దీని న,య్యమృతవస్తువు గని। యఖిలమునకు

ఆ. ములుఁ దొఱంగి నిత్య।ముక్తత వెలుఁగొందు,నరుఁడు వైశ్యులైన। నాతులైన
శూద్రులైనఁ గంద్రు।సువ్వెయిమ్మెయిముక్తి,బ్రాఁతె బ్రాహ్మణులకు।రాజులకును.

క. వినిపించితి నిను బోధం,బునకు నుపాయంబు ఫలస।ముదయము మోక్షం
బును సౌఖ్యనిర్ణయము ని,క్కనుట గడవ సుఖము లొండు।గలవే యరయన్.

ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహసంగంబు, నీడ విడిచి యెవ్వఁ।డీయుపాయ
ముల భజించు వాఁడు। మోక్షలక్ష్మికిఁ బతి, యగు నొకింతసంది।యంబు వలదు.

క. చెప్పం గలయది యెల్లను, జెప్పితి నీ కింత గడవఁ। జెప్ప నొకఁడు లే
దిప్పాట నెలల నాఱిటఁ, జొప్పడు యోగంబు నియతి।శుద్ధాత్మునకున్. 229

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణునకు నధ్యాత్మవిద్యావిషయంబు లగువాక్యంబులు సెప్పె నని చెప్పిన వినియన్నరనారాయణులు మఱియు నెవ్విధంబున వర్తించి రని యడుగుటయు. 230

చ. గుణసమతానుభూతిహృతి।కోవిదసారవివేకభవ్య చా
రణసురసిద్ధసాధ్యఖచ।రప్రముఖాఖిలభూతసేవ్య వీ
క్షణకలనాకృతార్థముని।సార్ధబహుస్తుతివాక్యరత్నభూ
షణమహనీయఖేలన ని।సర్గకృపాకృతలోకపాలనా. 231

క. నవ్యత్వపురాణత్వద,శావ్యపనయదుర్నిరూప।సౌందర్యా వే
దవ్యాసవాక్ప్రకాశిత,దివ్యధురాధుర్య యోగి।ధీసత్కార్యా. 232

మాలిని. భువనభవనదీప।స్ఫూర్తి తేజోవిలాసా
సవితృశశిమయత్వ।స్ఫారచక్షుర్వికాసా

వివిధనిగమవిద్యాశ్రీవేద్యసూక్ష్మప్రభాసా
పవనవిజయలీలాశ్రీప్రౌఢచేతోనివాసా. 233

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబయిన శ్రీమహాభారతంబునయశ్వమేధపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 234



శ్రీ



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, ద్వితీయాశ్వాసము.





సుఖనిష్పాదనకే
లీసక్తపదారవిందలీలా సతతా
ఖ్యానవికాసిసమాధిస
మాసాదితశాంతిలోల హరిహరనాథా. 1



బ్రాహ్మణగీతలు

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

ఆ. అట్లు శౌరి పార్థు సంచితబ్రహ్మవిద్యాప్రబోధకంబు లైనయట్టి
వినుతవాక్యములు సవిస్తరముగ విని, పించి యతనివలని ప్రీతిఁ జేసి. 3

వ. వెండియు నిట్లని బోధించు. 4

సీ. భర్తృభార్యాకృతప్రభవ్యసంవాదంబు, సభయనామకము నై యతిశయిల్లు
నట్టిది యొకయితిహాసంబు విను పార్థ, జనసుతసమధికజ్ఞానవర్ణి
తాత్మకుఁ డైనమహాద్విజుఁ డొకఁడు వివిక్తప్రదేశసేవిత్వనిరతి
నున్నెడ నల్ల నాసన్నయై వినయంబు, భక్తియు నెసఁగఁ దత్పత్ని ప్రణతి
తే. యాచరించి మహాత్మ యధ్యాత్మబోధ,భరితఁగాఁ జేయవే నన్నుఁ గరుణ పల్ల
వింప నని దయ పుట్టంగ వేఁడుటయును,మందహాసవిభాసి యై మగువఁ జూచి.

క. ఈమాటకుఁ జారుముఖీ, నామది ముద మందెఁ గాన నాతికి నిది యే
లా మేటితలం పనుత్రో, పేమియు లే దోపి వినుము హితవచనంబుల్. 6

వ. నా యెఱింగినభంగిఁ జెప్పెద నని పలికి యయ్యతులవ్రతుండు పతివ్రత కిట్లనియె.

సీ. వినను గానను జేయ వెర వైనయవి కర్మ,ములు వానిఁ గర్మకర్తలు సమస్త
సిద్ధిప్రదము లని చెప్పుదు రజ్ఞాన,తిమిరాంధు లై విను ధీరచిత్త
జగమున లేదు నిష్కర్మత్వ మెందేనిఁ, గలిగె నేనియును మా ఖ్యముగ దాని
నిందింతు రెక్కుడు నెల వది యాత్మ నేఁ, గందు బ్రహ్మంబు నిష్కళత నందు

తే. వెలుఁగు నగ్నితో సోముండు గలసి మిథున
ధర్మమం దెప్డు నడపి భూరితములఁ దాల్చు
నజుఁడు మొదలుగ నక్షరోపాస్తి యందుఁ
జేయుదురు శాంతి నింద్రియజిత్త్వ మొంది. 8

వ. అక్షరంబు తెఱం గెఱింగించెద. 9

సీ. స్పర్శంబు రసము రూపంబును శబ్దంబు, గంధంబుఁ గా నున్కి గారణముగఁ
ద్వక్కున జిహ్వ నేత్రమున శ్రోత్రంబున, ఘ్రాణంబునను బరిగ్రహవిధాన
మాచరించుటకు లోనై యుండ దాత్మ, [1]మమలినబుద్ధ్యుపగమము దానిఁ
బ్రాపించుఁ బ్రాణాదిపంచవాయువులును, విను దానివలన నర్థనముఁ బొందు
తే. నంద డిందుఁ బ్రాణంబు నపానమును స
మాననామకవ్యానమధ్యమున నడచు
మెలఁగుచుండుఁ బ్రాణాపానములకు నడిమి
దెస నుదానంబు శ్రుతి యిట్లు దేటపఱిచె. 10

క. నెలకొని ప్రాణాపానం, బులఁ బురుషుఁడు సుప్తుఁ డైనఁ బొలఁపు విడివడం
బు లగు సమానవ్యానం, బులు యోగులు సంశయంబుఁ బొందరు దీనన్. 11

క. విను తెలియంగ నుదానం, బున సుప్తుం డైనఁ బ్రాణము నపానంబున్
వనజనిభలోచనా పురు, షుని విడువవు యోగిజనులు చూపట్టిందునన్. 12

అంతర్యాగప్రకారంబు నిరూపించి చెప్పుట.

వ. ఇవ్వాయువు లేనును మనంబును బుద్ధియుం గూడ నేడ్వురును వైశ్వానరునకు జిహ్వలు వైశ్వానరుం డనఁ బ్రాణులదేహంబులం దగ్నిరూపంబున వెలుంగుచున్న యాత్మ౦డు ఘ్రేయంబును భక్ష్యంబును దృశ్యంబును స్పృశ్యంబును శ్రావ్యం బును మంతవ్యంబును బోద్ధవ్యంబును నగుసీసప్తసంఖ్య సమిధలు ఘ్రాతయు భ క్షయితయు ద్రష్టయు స్ప్రష్టయు శ్రోతయు మంతయు బోద్ధయు నగునయీ యేడ్వురును వరుసన ఘ్రేయాదు లయినహవిస్సు లేడింటిని వేల్చుబుత్విజు లిది సప్తహోతృవిధానప్రకారంబు వైశ్వానరువదసంబులు పదియు [2]దిగ్వాయు సూర్యచంద్రపృథివీపావకశక్రవిష్ణుప్రజాపతిమిత్రాత్మకంబులు శబ్దస్పర్శరూపరస గంధవక్తవ్యకర్తవ్యగంతవ్యవిసర్గానందంబులు హవిస్సు లీపదింటిని గ్రమంబున నాహుతులు సేయుహోతలు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూ పస్థంబు లయినదశేంద్రియంబు లిత్తెఱంగు దశహోతృవిధి యీరెంటిని నెఱింగి యిం దేవిధంబున నేనియు జీవాత్ముం డుపద్రష్టగా నంతర్యాగంబు నడపు యోగిజ నంబులు జననమరణవిముక్తు లగుదురు బహిర్యజ్ఞపరులు గమనాగమనభ్రమణం బులం బొందు చుండుదు రని చెప్పి వెండియు. 13

1. క. మమలినబుద్ధ్యుపగమము. 2. చ. దిగాకాశసూర్య.

క. విను ప్రాణవాదికరూపత్వనియోగిం బుట్టు వాక్కు దాని వెనుచనుఁ
మనము పురుషార్థబుద్ధిం, [1]బనుపడి యని చెప్పె సతికి బ్రాహ్మణుఁ డనఘా. 14

క. విని యావిప్రునితో ని, ట్లను నయ్యేలనాగ మన మనఘ ప్రేరేపం
గ నెగయు వాక్కు తదనువ, ర్తనము మనంబునకు నెవ్విధంబునఁ గలుగున్. 15

వ. అనవుడు నతండు. 16

చ. మనసు నుదానవాయువును మానిని గూడి వెలార్చు వాక్కు నా
త్మనివలనన్ భవద్వచనముఁ జనతానుభవంబుచొప్ప నై
నను విను కార్యముఁ గుఱిచినం దగ వాగనువర్తనంబు సే
యున వలనన్ మనంబునకు నమ్మెయి గల్గుట నట్లు సెప్పితిన్. 17

వ. అని పలికి మఱియు నమ్మహీసురోత్తముం డిట్లనియె. 18

క. మనసును [2]వాక్కును నాలో, ననఘచరిత యెక్కు డెవ్వ రని యంభోజా
నను నడిగిన నతఁ డెక్కుడు, మన మనవుడు వాణి యక్కమలభవుతోడన్. 19

వ. ఏను నీకుం గామదోహిని నయి యుండ ననెట్లు దక్కువగాఁ బలికి తనిన నతండు స్థావరంబును జంగమంబును నన నాకు రెండుమనస్సులు గల వందు స్థావరంబు నాయొద్దను జంగమంబు నీకడను నిలుచు భవద్గోచరత్వంబునం బరఁగువర్ణంబు మంత్రంబు స్వరంబు జంగమమనస్సుగా నెగడు దానికంటె నీ వెక్కుడు నీకంటె నెక్కుడు స్థావరమనస్సు గావున నిమ్మాట యాడం గల దానవు గా వని నిర్దేశించె. 20

క. విను మమ్మెయి నిర్దేశం, బున నవ్వాగ్దేవి మూర్ఛ వోయిన యట్లో
మిని బలుక కుండి పదపడి, వినయంబున నజుని శరణు వేఁడె లతాంగీ. 21

వ. అనిన బ్రాహ్మణి పతితో బ్రహ్మమాటకుం గొలివోయినవాణి యేమిటం దేఱె
నని యడిగిన బ్రాహ్మణుం డిట్లనియె. 22

క. ప్రాణాపానంబులయెడ, వాణి నిలువఁ గాన ప్రాణవాయువు వొందవి త
త్త్రాణత్వ ముడిపె నది గీ, ర్వాణజ్యేష్ఠప్రభావవాసిత యగుటన్. 23

వ. ఇట్టి వని వాఙ్మనసప్రకారంబు లెఱుంగుట మోక్షంబునకు మూలం బింకను
వాణీమనస్సుల తెఱంగు సెప్పెద వినుము. 24

తే. ప్రాణుఁ బొందువుట వాణి యపానుఁ జెంది
తా నుదానభూతాత్మయై తనువు విడిచి
వ్యానచేష్టితసర్వసంవ్యాప్తి నొంద
మనసు సుస్థితి నొందు సమానునందు. 25

వ. మనసు సుస్థితిం బొందుట ముక్తికిం గారణం బని చెప్పి వెండియు. 26

సీ. ఘోషిణి నాఁగ నఘోషిణి యన రెండు, దెఱఁగులు గలిగి వాగ్దేవి వరఁగు

---

1. క. బనుపడ నని. 2. గ. వాకును దమలో.

నం దఘోషిణి గరియసి యుత్తమరసంబు, గోవుచందంబునఁ గుఱియుచుండు
నవ్యయరూపదివ్యప్రభోజ్జ్వల, బ్రహ్మవాదిని యిట్లు బ్రాహ్మివిధము
గనుట మహానందకర మని చెప్పి యవ్విప్రుండు మఱియు సర్వ్వోలఁదితోడ

తే. వినుము ఘ్రాణాదికము లైదు మనసు బుద్ధి
యొకయధిష్ఠానమున నుండియును నెఱుంగ
వబల యొం డొంటివిషయంబు సలమికొనఁగ
ననిన వివరింపు మా తెఱం గనియె నింతి. 27

వ. అనుటయు నయ్యవనీదేవుం డయ్యువిద కిట్లనియె. 28

సీ. గంధంబు ఘ్రాణంబ కాని తక్కినయవి, సధిగమింపఁగ నోప వధిగమించు
రసము జిహ్వయ యితరము లాపనికిఁ గావు, రూపంబుఁ జక్షుస్స యొండు నెఱుఁగఁ
బెఱయవి యెఱుఁగవు తెఱవ సంస్పర్శంబుఁ, గాంచుఁ జర్మంబ తక్కినవి గావఁ
జాలవు శబ్దంబుఁ జాలుఁ బట్టంగ శ్రోత్రంబ యన్యమును దక్కరణమునకు

తే. వెరవు లేవు సంశయితసంవేదనంబు
మనసుకృత్యంబ యిక్కార్యమునకు నొండ్లు
సొరవు నిష్ఠ బుద్ధిన యగుఁ జొరఁగ నేర
వి త్తెఱంగున కపరంబు లెఱిఁగికొనుము. 29

ఇంద్రియమనఃపరస్పరసంవాదప్రకారము.

వ. అని చెప్పి మనస్సునకు నింద్రియంబులకుం దొల్లి గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మింద్రియంబులు మనస్సుతో నేము నీవు నొక్కరూప యనుటయు మనస్సు వాని కిట్లనియె. 30

చ. చన దిటు లంట గం పెఱుఁగఁ జాలదు నాసిక జిహ్వయుం జవుల్[1]
గొన నెర వేదు రూపు గనుఁగొంటకుఁ గన్ను వలంతి గాదు సో
కు నెఱుఁగుశక్తి చర్మమునకుం బ్రభవింపదు శబ్దజాతము
న్వినఁ జెవి కల్ప మేనియును నే నొప్పెడఁగూడదు నేఁ దొలంగినన్. 31

వ. నిజంబుగా నేను దొలంగితినేని. 32

ఆ. అప్రయోజనంబు లై యుండు నాఱిన, నిప్పులట్లు శూన్యనిలయములును
బోలె మీస్వరూపములు గాన మనలోన, నెక్కుడేన చూవె యింత నిజము.

వ. అనిన విని యింద్రియంబులు మనంబున కిట్లనియె. 34

సీ. ఇంతవట్టిట్టిద యి ట్లైనయంతన, కలుగ నేర్చునె యధికత్వ మేము
వెలి గాఁగ నీ వొకవిషయంబు నేనియు, ననుభవించితవేని నధిక మగుట
గానంగ వచ్చు మాలో నొకం డడఁగిన, ననుభవింపుమ తదీయార్థ మట్లుఁ

1. క. జిహ్వకుం జవుల్ గొన నెర లేదు.

గాక ఘ్రాణంబున గంధంబు జిహ్వ రసంబు చక్షువున రూపంబు వినుము

ఆ. చర్మశక్తిఁ జేసి సంస్పర్శవిషయంబు, శ్రోత్రయుక్తి శబ్దమాత్రకంబు
కాని యొంట నొంటిఁ గబళింపఁ జాలవె, ట్లధికతానిరూఢిఁ గానఁబడితి. 35

క. మును మే మాలంబించిన, వెనుకఁ గదా నీకు ననుభవింప వశం బో
మనసా [1]నీ వెంగిలి కా, దనుమా యవ్విషయ మెక్కడ యయ్యెడు మనలోన్. 36

క. నీ వడఁగినను బ్రాణముఁ, గానఁగ మాయందు బోధకం బగు ద్రవ్యం
బూన ధరింపఁగ నేర్చుట, గావించును నీకుఁ దెలివిఁ గనికొను మిదియున్. 37

సీ. అట్లు గావున ట్లని యనుశాసనము సేయఁ, గడునేర్చు శిష్యులకడకుఁ బోయి
వినిపింపఁ గోరఁగి యవ్వినుతార్థములు వార, లుగ్గడింపఁగఁ గనునొజ్జవోలె
మునుముఁ గొని విషయోత్కరము నీవు భోగ్యంబుఁగాఁ జేసికొందు నీవకలలు గన్న
యప్పుడును మాలేమి నవ్విషయంబు వొం, కైన వాకిలి లేని యాలయంబుఁ

ఆ. పొంది మరలినట్లు సేడ్పాటు వోరయుదు, గాక సత్యభక్తి గలదె నీకు
నింతవట్టుఁ గాన్పు మేమును నీవును, గలసి పరఁగ భోగకలన గలుగు. 38

వ. అని యివ్విధంబున మనంబును నింద్రియంబులును సంవాదంబు సేసె నని యప్పురుషవరుం డావరవర్ణినితో వేఱొక్కండు విను మని యిట్లనియె. 39

సీ. ప్రాణప్రభృతు లగుపవను లంభోరుహ, గర్భుని నొక్కటఁ గానఁ బోయి
యెక్కుడు మాలోన నెవ్వఁడు నావుడు, నవ్విభుం డెవ్వార లడఁగ నడఁగు
దురు పెఱవార లెవ్వరికిఁ బ్రవర్తన, మొందిన నెల్లవారును జరింతు
రధికు లందఱకును నట్టివారలు మీరు, నను డని పలికినఁ జనక నిలిచి

ఆ. ప్రాణుఁ డాది గాఁగ [2]నందఱుఁ దమతమ, వలన నవ్విధంబు గలుగఁ దెలుప
నాతఁ డే నెఱుంగనా యది యట్టిద, వినుఁడు మీవిశేషవృత్తిభంగి. 40

తే. ఎప్పు డెవ్వారివలన నేర్చొప్పు గలుగు
నపుడ వా రెక్కు డగుదు రన్యోన్యమిత్ర
భావమునఁ దాల్చుఁ డొండొరుఁ బవనులార
పోరిఁ బరస్పరభావనాపరుల రగుఁడు. 41

వ. ఇత్తెఱంగున మీకు భద్రం బగుం బొం డని పుచ్చె నట్లుపదేశించిన బ్రహ్మవాక్యంబుల వాయువులు సమత నొందె నని చెప్పి వాయువిషయం బైనయది నారదదేవమతసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మని బ్రాహ్మణుండు బ్రాహ్మణి కి ట్లనియె. 42

తే. దేవమతుఁ డనువిప్రుండు దేవమునివ, రేణ్యుఁ డగునారదుని నొక్కపుణ్యభూమిఁ
గాంచి వినతుఁడై యాతనికరుణవడసి, భక్తిరసముప్పొంగారఁ దత్ప్రాంతమునకు.

సీ. అల్లన చన నాతఁ డాదరంబున నిందు, రమ్ముండు మనుచుఁ గరమునఁ జూపు

1. అ. 'నీవ యెఱిఁగి కా దనుమా'. 2. క. ఁ బవనులు దమతమ.

నెడ సమాసీనుఁ డై కడు వినయంబున, హస్తముల్ మోడ్చి దయాయానసమగ్ర
మెఱుఁగింపు పవనంబు లేనింటియందును, జాయమానం బగుజంతువునకుఁ
దొలితొలి యెద్ది దాఁ దొడఁగు వర్తింపంగ, ననవుడు నారదుం డతనితోడ

తే. వాయు వెయ్యది గర్భసంవాసమునకుఁ, బోనుపు జీవునిఁ దజ్జంతుజననవేళఁ
దొలుత దాని కనంతరకలితమైన, మారుతంబు ప్రవర్తించు మఱియు వినుము.

తే. పురుషునందు సమానంబుఁ బొలఁతియందు
వ్యానమును జువ్వ పొడమించు వరుస ననఘ
శుక్లమును శోణితంబును జూలు గల్గు
సయ్యోగంబును విధిచెప్పు సమరఁ బొంద. 45

క. విను సృష్టశోణితంబునఁ, బనుగొను శుక్లంబువలనఁ బ్రాణుఁడు దగ వ
ర్తన మొందుఁ బ్రాణశుక్లము, లనుపమ చేతువులుగా సమానుఁడు నడచున. 46

క. చనుఁ బ్రాణుఁ డధోగతి నూర్ధ్వనియోగి సమానుఁ డివ్విధము గలుగుచుం
టను నగ్నిమయోదానంబును వ్యానంబును సమానమును వర్తించును. 47

ఆ. పావకుండు సర్వదేవాత్మకుండు ప్రాణంబునకు సమానమునకు
నంతరమున వెలుఁగునాభవ్యమూర్తి యు, దానరూప మంత్రు తజ్జ్ఞజనులు. 48

సీ. విను మహోరాత్రంబులును శుభాశుభములు
సత్యానృతంబులు సదసదాహ్వ
యములును నైనద్వంద్వములు ప్రాణాపాన
ములకు నామాంతరంబులు తదీయ
మధ్యవర్తిత నొప్పుమహనీయవహ్నియు
దానంబు దాని నిర్ద్వంద్వభావ
మాంతరయోగవిద్యాప్రవీణులు గండ్రు
పరమశాంతి యనంగ బ్రహ్మ మనఁగ

తే. నరయ భేదంబు లేదన్నయట్టు లుండు, నమ్మహావస్తువును నుదాత్తాకృతియ య
నంగఁ జెవి యార విందుముదలినగర్భ, చేతననిదివ్యముని యిట్లు సెప్పెఁ గరుణ.

వ. అనిచెప్పి యింద్రియమనఃపవనంబులభంగులు గనుంగొనుటయును తత్త్వంబులనుఁ
బరమం బయినతత్త్వంబు గనుటకుఁ గతం బై యుండు నని పలికి యధ్వరామరుం
డారామారత్నంబును సదయంబుగా నవలోకించి యుత్తమరహస్యంబు సెప్పెద
నాకర్ణింపు మని యి ట్లనియె. 50

## జీవాత్మస్వరూపనిరూపణప్రకారము.

సీ. కరణంబు కర్మంబు కర్త యన్నేతద్వి, రాజితకారకత్రయముచేత
నఖిలంబునంవ్యాప్తమైయుండుఘ్రాణాదు,లునుమనంబునుబుద్ధియును బ్రవరులు
కరణహేతువు లండ్రు, గంధాదివిషయసంతతియు మంతవ్యబోద్ధవ్యములును

గర్వహింసాగుప్తు లగుటఁ । గంపు గొనఁగ నానఁ, గాన ముట్టఁగ వినఁ।గాఁ దలంప

తే. నిశ్చయము దగఁ జేయంగ । నేర్పు [1]లేదు
గలవు జీవాత్మునకు నవి । కర్తృహేతు
భూతములు [2]వాని విషయాను।భూతి నతఁడు
దొలఁగునిష్ఠలు మోక్షహే।తువులు సుమ్ము. 51

వ. కరణకర్మకర్తృకారకాత్మకుం డగుజీవాత్ముండు భోక్త యగుట దక్కి వివిధ విషయమూర్తు లగుహవిస్సుల నుదాసీనత్వస్రుగ్గతంబులు సేసి వేల్చునిష్ఠ నాత్మస్వరూపం బగుననలంబు ప్రజ్వలితం బయి యవిద్యాధూమరహితం బగుచుం బొలుచు నది మోక్షప్రకారం బట్లు గాక భోక్త యగునేని నట్టిద బంధప్రకారం బని నిర్దేశించి ముక్తభావంబునకు మూలం బయినయోగ యజ్ఞంబునకుం దేను బ్రవృత్తుండ నై యున్నవాఁడ దానికి సర్వపరిత్యాగంబు దక్షిణ దాని సకలాత్ముం డగునారాయణుండు ప్రీతుం డై స్వీకరించు నద్దానిపేరు మునులు ముక్తి యని చెప్పుదు రని చెప్పి యవ్విప్రుండు వెండియు. 52

సీ. శాస్త్ర మొక్కండ త।చ్ఛాసనంబున నయోం, జరియింతు నొక్కండ । గురుఁ డతండు
చెప్పనయర్థంబు । చిత్తంబులో నుంతు, శ్రోత యొక్కండ త।జ్జాతబుద్ధి
నగుదు నొక్కండ । వగవంగ విద్వేష్ట, వాని ప్రాల్చినదిక్క । ప్రాలి యెడరుఁ
గడపుదు గడవంగఁ । గారణ మయ్యెడు, తెలుఁగు పెద్దలచేత । నెఱిఁగినాఁడ
ఆ. వినుము దేవతలును । మునులును బరమేష్ఠి, యొద్ద కరిగి మాకు । నెద్ది హితము
యనిన నావిధాత । యక్షరోపాసన, మనియెఁ గాన దుర్గ । మబల కడతు. 53

వ. ఇంక నెక్కడ గడచెద మున్న కడచితిఁ గ్రోధతిమిరంబును లోభవ్యాళంబును గామదస్యుదూషితంబును నగుదుర్గంబు గడచి యొకవనంబు ప్రవేశించితి ననిన విని యవ్వనిత యవ్వనం బెట్టి దని యడిగిన నమ్మహాద్విజుం డిట్లనియె. 54

ఉ. అంతకుఁ బిన్నలున్ వెదక । నంతకుఁ బెద్దలు లేవు దుఃఖ మ
త్యంతముఁ జేయ సౌఖ్య మెస । లార నొనర్పఁగ నొండొకంటియం
దంతటి నేర్పు లేదు వెఱ । పన్నది యేమియు నవ్వనంబు ని
శ్చింతతఁ జొచ్చి యున్నరుఁ । జెందదు నిర్వృతి నెందు నుగ్మలీ. 55

తే. కొన్నిటికిఁ బంచవర్ణముల్ । కుసుమఫలము, లందుఁ గొన్నిటి కేకవ।ర్ణాంచితంబు
లవనిజములుగొన్నిటికిన।వ్యక్తవర్ణ, కములు సౌరభ్యమాధుర్య।సమధికములు. 56

వ. అవ్విపినంబున. 57

క. వృక్షంబులకుం గలుగును, దీక్షాగుణములును నతిథి।తృప్తికృతియుఁ బ
ద్మాక్షీ యతిథులు బ్రహ్మన, దృక్షులు సౌఖ్యంపునిట్టఁ । దేలుదురు మునుల్. 58

1. గ. లేదు కలదు జీవా. 2. గ. వానివిషయానుభూతి.

ఆ. కెలఁకులకును మింటికిని మేర లివి యన, రాదు గాన యయ్యరణ్యభూమి
వెలుఁగు లొండ్లు సారవు వినుము క్షేత్రజ్ఞుండు, రవి తదీయసేవ భవముఁ బాచు.
క. మృగనయన బ్రహ్మసంభవ, మగుజలము వహించుచుండు సంసారసాలుక
నగములు విను దానఁ దప,స్విగణం బవ్యయపదంబుఁ జెందఁ గాంచున్. 60
వ. ఇట్టి దవ్విపినంబు. 61
ఆ. మాననీయనియతిమహితతపోధన,వంతు లైనయట్టివారు శాంతి
దాంతినిస్స్పృహతలు దలకొనసుసమాహి,తాత్ము లై వసింతు రందు సాధ్వి. 62
వ. అని చెప్పి మఱియును. 63
సీ. వినుము మూర్ఖుఁడు జవిగొన దర్శనస్పర్శ,నము లాచరింప నిరసంగ నలయు
నేమిసంకల్పంబు నెడఁ జేర్ప నిష్టార్థ ములను[1] ననిష్టార్థములను గోరు
టయును నొల్లక త్రోచుటయును స్వభావకృ,త్యము లవి గనుఁగొంచు నబలవానఁ
బొరయ నెట్లన్న మేల్ దారకొనుఁ గోరక,యును బోదు కీడు త్రోచినను దీని
తే. నెఱిఁగి యేను స్వభావంబు నెడఁ బయోజ,పత్రగతజలబిందువు భంగిఁ దాల్తు
నని యెఱింగించి బ్రాహ్మణుఁడతివతోడ, మఱియు నిట్లను శాస్త్రవరమనసకల్య.
వ. ఒక్కయెడ నధ్వర్యునకు యతికిం గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మధ్వ
ర్యుండు పశువుం బ్రోక్షించుచుండ యతి నిరీక్షించి యిది హింస గాదే యనిన
నతండు. 65
తే. ఛాగ మిది యరయంగ నాశంబుఁ బొంద,దూర్ధ్వలోకసుఖంబులఁ బొందుఁ గాన
శ్రుతులవాక్యముల్ నీ కెక్కసూనృతంబు, లగున యేని నీ విట్లంట యనుచితంబు.
వ. అని వెండియు నప్పశువు నుద్దేశించి. 67
క. భూతములు నింద్రియంబులు, నాతతగుణ యాత్మ యోనులందుఁ గలయఁ బిం
డేతరుఁ డగుజీవుఁడు సౌ,ఖ్యాతిశయం బొందు నధ్వరాతిశయమునన్. 68
క. అని పలుకుటయును యతి యి,ట్లను ఛాగము పుణ్యగతికి నరిగెడుఁ బోఁగు
ప్పని నీ కెవ్విధము ప్రయో,జనంబు సిద్ధించుఁ జెపుమ సమ్యక్ఫణితిన్. 69
వ. అనుటయు నధ్వర్యుం డతని కిట్లనియె. 70
క. ఆగమము పశువిధిం దగ, యాగ మొనర్చినఁ ద్రివిష్టపానేకమహా
భోగానుభూతిభవ్యస,మాగమ మది యనుట బొంకె యాగమవేదీ. 71
చ. అనవుడు హింస పాప మని యాగమవాక్యములంద కాదె యేఁ
గని యిటు లంటి నన్న యతిఁ గన్గొని నీవు సమాధిఁ బ్రాణరో
ధనము మనోలయంబు సుకృతంబులుగా నొనరించి వెండి యో
గనిరతిఁ బొందె దత్తెఱఁగు గాదొకొ హింస దలంచి చూడఁగన్. 72
వ. అని పలికిన నయ్యధ్వర్యునకు నయ్యతిముఖ్యుం డి ట్లనియె. 73

1. గ. ములను గోరుచు నున్కి ♦ మొదలఁ గోరు.

చ. పరమతపంబు గాఢపరిపాకము [1]నొందినఁ జిత్సుఖాత్మకా
[2]క్షరము నచిత్తభూతగుణజాలతనుఙ్ క్షరముఙ్ వివేకితా
పరిణతిఁ బాపి చూచి యనపాయసుఖస్థితి నూఁది పొల్లలం
బొరయక త్రోపు హింస యనుబుద్ధి విమూఢత గాక బోధమే. 74

చ. అనవుడు నాతఁ డార్యవచనామృత మానినవాఁడు గీడు మేల్
గనుఁగొనఁ జాలు నేను బశుకార్యమునప్పుడు మీ రనుగ్రహిం
చిన క్రియఁ జూడ నేర్తుఁ జిదచిద్ద్వయముఙ్ విభజించి దాన హిం
సనము నొకింతయుం బొరయ జన్నము సేయుదు మేలు నొందుదున్. 75

క. అనుటయు నతనికి యతి యి, ట్లనుఁ బశుయజ్ఞమునకంటె ననఘ తపోయ
జ్ఞనిరూఢి మేలు గావున, వినిపింపఁ దలంచి యంటి వేయును నేలా. 76

వ. అనవుడు నమ్మాటకు నయ్యధ్వర్యుం డొడంబడియె నని చెప్పి యాభూసురవర్యుం డాభామినితో నీయర్థంబున కొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము సహస్రబాహుం డగునర్జునుండు దుర్జయప్రతాపంబున నఖిలద్వీపంబులు నేలి ప్రాలి తనకు నెదురు లేకున్న విజృంభించి పరశురాముం డొడరి యతనికి నత్యంతం బప్రియం బాచరించిన నతండు బహుశాఖోపశాఖాశోభితం బయినపాదపంబు నుఱుముగా నఱికి పడవైచినచందంబునం బరశుఖండితసర్వాంగునిం జేసె నంత నిలువక తత్పక్షంబురాజులుం గూడికొని తదీయతనయులుం దారు నారాముని యసన్నిధి నతనిజనకుం డగుజమదగ్నిం జంపినం బెంపారుకోపంబున నాటోపం బెసంగ నాజామదగ్న్యుండు రాజుల నెల్లం దర మిడి యిరువదియొక్కమాఱు పరశుధారపాలు సేసిన నతనికిఁ బితృదేవతలు సన్నిధి సేసి. 77

ఆ. పరశురామ నీవు బ్రాహ్మణుండవు నరే
శ్వరులఁ జంప నేల వలవ దుడుగు
మయ్య యనుడు నాతఁ డట్లన కుండఁ డీ
రేను రాజపశువిధానమునను. 78

క. సారనియతిఁ బాటించి మ,హారోషాగ్ని పరితృప్త మగునట్టులుగా
వీరాధ్వరంబు సేసెద, వారింపక యరుగుఁ డనిన వా రాతనితోన్. 79

క. యజ్ఞంబులలోనఁ దపో,యజ్ఞం బుత్తమము దాని నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ చేయుము స,ర్వజ్ఞుఁడు ప్రీతుఁ డగు శాంతరస మొప్పఁ జుమీ. 80

వ. అని చెప్పి మఱియు ని ట్లనిరి తొల్లి యలర్కుం డనురాజు మనస్సృష్టంబు లగునింద్రియంబుల కలిగి దివ్యాస్త్రంబులు ప్రయోగింపం జూచిన నవి యయ్యవనిపతితో నయ్యస్త్రంబులుం దారు సెడ ననియును రోషావేశంబునం బ్రయోగించిన నతండ చెడు ననియునుం బలికి యోపు దేని నీతపోమయంబు

1. గ. నొందినచిత్సుఖా. 2. జ. క్షరమునఁ జిక్కి భూతగణజాలతనుక్షరముఙ్.

లై నయస్త్రంబులు[1] సంధింపు మనిన నతండు క్రోధంబు దక్కి యోగంబున శాంతి నొంది వానిం దదూర్జితతపఃఫలాస్త్రసాధితంబులం జేసె నీవునుం దపంబున నంతశ్శత్రుజయసౌఖ్యం బనుభవింపుము బాహ్యశత్రుజయంబు జయంబుఁ గాఁ గొనకుము. 81

క. అని నిష్ఠించి పలుక న, వ్వినుతచరిత్రుండు శాంతివిభవంబున నూ
నినమనసుతోడ మునిమా, ననపాత్రం బైనతపమున నన మే లొందెన్. 82

సీ. అని చెప్పి బ్రాహ్మణుం డయ్యింతి కిట్లనుఁ, దాక్షిణ్యాదిగుణములు దగ్గ కలవు
స్తంభాతిమానహర్షంబులు సాత్త్వికములు క్రోధసంరంభములును రాజ
మను రాజసంబులు మోహతంద్రాస్వప్నములు తామసము లిట్టు లగుణగణములఁ
దునుమ నేయస్త్రంబు లను వగు వాని న, య్యాంతరశత్రువర్గయంబు నల్లఁ

తే. దునిమి యేనింద్రియంబుల మనము నోర్చి
శాంతి నొంది శ్రేయస్సిద్ధిసాధనం బొ
నర్చునది ముఖ్యవైదికనిర్ణయముఁ జేయు
నంబరీషగీతలు విను మంబుజాక్షి. 83

వ. అంబరీషుం డనురాజు రాజనీతిపరత్వంబునం బరమప్రభుత్వంబు నొంది యారాతుల నెల్ల విగతాసులం జేసి పూజ్యం బగురాజ్యంబు పరిపాలించుచుండి యొక్క నాఁడు విద్వజ్జనంబులతో ని ట్లనియె. 84

తే. అరుల నెల్ల జయించియు నది జయంబు, గాఁ గొనక యున్నవాఁడ సర్గ్గలస్ఫురం బగ జ
యింప కున్కిఁ దద్విజయవిహీనుఁ దృష్ణ, జనిజరామృత్యువశగవర్తనునిఁ జేయు.

క. అంతటిలోభము గెలువక, శాంతి గలదె యని తదీయశక్తి నడఁచి ని
శ్చింతత్వ మొంది యాభూ, కాంతుఁడు సామ్రాజ్యమున సుఖస్థితి నడసెన్. 86

—— జనకునకు విప్రరూపధరుం డైనయమునితో నైనసంవాదము. ——

వ. అని వెండియు నవ్విప్రుం డిట్లను, జనకచక్రవర్తికి నొక్కబ్రాహ్మణునకుం గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపుము జనకుండు దనకట్టెదుర బ్రాహ్మణుండు గోఅగామి సేసిన నతనితో నీవు నావిషయంబున వసియింప వలదు పొమ్మనిన నతండు. 87

క. నీవిషయ మెంతవఱ్ఱది, యే విని పరవిషయమునకు నేఁగెదఁ దెలియం
గా వినిపింపు మనుడు నా, భూవల్లభుఁ డూర కుండెఁ బుణ్యచరిత్రా. 88

ఆ. ఊర కుండి మూర్ఛ నూని యొక్కింతసే, పునకుఁ దేఱి యిట్టు లనియె నాదు
తాతతండ్రితరము ధరణి మద్వశ్యత, నుండ నాకు మమత యొలయ దండు.

వ. మిథిల నెప్పుడు వసియించెద నిప్పురంబును మదీయం బని యంగీకరింపంబడదు కావున నిది నావిషయం బన లేమిం జేసి మున్ను నీతో నాడినమాటం బుట్టినవగ

పెంపున మూర్ఛ వచ్చె ననిన విని యవ్విప్రుం డాభూవిభునాననం బాలోకించి. 90

క. నరనాయక నీ యేలెడు, పురమున భూమిని మమత్వబుద్ధి గలుగ కె
ల్లర వై యుండుటకుం గతం, బరయంగ నెద్ది వినిపింపు మది విశదముగన్. 91

వ. అనుటయు నజ్జనపతి యతని కిట్లనియె. 92

తే. అరయ నివి [1]యెట్లుం జెడియెడునవియ కాన
వినుము మద్ధన మిది యని వీనిలోన
నొకటియందును సంగీకార మొలయ దెల్ల
విషయమును నాయదియ యనువిధము గలదె. 93

వ. ఎట్లంటేని ఘ్రాణాదులకు గోచరంబు లయినను గంధాదులు నెడం గలయవి గా
వున నాయవి యన కుండుటం జేసి భూమ్యాదిభూతంబులు నాచేత నిర్జితంబు లై
[2]మద్వశగత్వంబు నొంది యుండు. 94

చ. అనవుడు బ్రాహ్మణప్రవరుం డల్లన నవ్వుచు నిన్ను నారయ
న్మనమున వేడ్కఁ బుట్టి నరనాయక వచ్చితి నేను ధర్ముఁడం
బనుపడునివ్వివేకపరిపాకము గాఢనిరూఢభావ మొం
టి నిలుచుఁగాత నీ దగుమదిన్ సతతంబును శాంతికారి యై. 95

వ. అని ధర్మదేవత జనకునకు వరం బిచ్చి యంతర్ధానంబు సేసె నని చెప్పి యాధరణీ
సురోత్తముం డయ్యుత్తమాంగనతో హితోపదేశంబు సేసెద నవహిత వయి
యాకర్ణింపు మని పలికి యిట్లను సంసారవర్తనంబు వదల విడిచి యే నేక
తంబ యున్నయెడ నీవు మ్రుచ్చిలి వచ్చి మదీయవైరాగ్యంబు మాన్పం దలంచి
నాకు నధ్యాత్మబోధంబు గలుగం జేయు మని యభ్యర్థించిన నీతలం పెఱింగి
యు నెఱుంగనివాఁడపోలె నధ్యాత్మవిద్యాబోధకప్రకారంబు లైనవాక్యంబులు
నెప్పితి నే నింక లోకంబులం గలసి చరించువాఁడం గాను నిక్కపుబ్రాహ్మణుండ
నయితి బ్రహ్మచారి నయితి జీవన్ముక్తుండ నయితి మిముబోంట్లకొలఁదిగా నన్నుం
జూచెద వది నా తెఱం గెఱుంగమి యేను జగంబు సమస్తంబును వ్యాపించి
యున్నవాఁడ నాయున్నభంగికి నాబుద్ధి సకలపృథ్వీరాజ్యంబును నాకలోకాధి
రాజ్యంబును సరిగా వని తలంచునాబుద్ధియ నాకు ధనంబు [3]దారువుల నగ్ని
యున్నచందంబున సర్వజంతువులయందును నంతర్గత యై సిద్ధి యున్నది గురు
వాసగృహవాసవనవాసపరు లగుబ్రాహ్మణుల కెల్లను శ్రేయఃప్రాప్తికిం దెరు
వొక్కండ యందఱునుసరిత్తులుసాగరంబుఁ బ్రాపించిన తెఱంగునఁ బరతత్త్వంబు
నొందుదురు బుద్ధి నిమ్మార్గంబు నధిగమింప నగుఁ గాని శరీరంబున వశంబు
గాదు కర్మంబు లాద్యంతవంతంబులు శరీరంబు కర్మబంధనకరం బింత యెఱుం
గుదుం గాన నాహృదయంబునం బరలోకభయంబు లేదు నాచెప్పినయధ్యా

1. చ. యెల్లఁ. 2. చ. మద్వశగతంబు లై యుండు. 3. జ. తరువుల.

త్మవిద్యావిషయవాక్యంబులతాత్పర్యంబు చిత్తంబున నెలకొలిపి భావనానిరత
వయి యుండుము నన్ను పోలెదు వెఱవకు మనినఁ బత్ని సాష్టాంగదండప్రణామం
బాచరించి కేలు మొగిచి. 96

సీ. నీవు సెప్పినమహార్హనీయవాక్యనికాయ, మతిగహనం బకృతాత్ములకును
నర్థగ్రహణశక్తి యనఘ కల్గునె కృతాత్ములకైనఁ [1]గ్రమ్మనఁ దెలియ వచ్చి
యుండ దయ్యెఱుకకు నుదయింపఁ బట్టైన, యట్టియుపాయంబు నాదరమున
నాకుఁ బ్రసాదింపవే కరుణాకర, నావుడు నాతఁ డన్నాతితోడ

ఆ. నరణి బ్రాహ్మణుండు గురుఁ డుత్తరారణి, తపము శ్రుతము నిర్మథనమున సర్వ
జ్ఞానవహ్ని పుట్టు మానిని యని చెప్ప, వనిత యిట్టు లనియె వల్లభునకు. 97

క. జనవినుతచరిత బ్రాహ్మణుఁ, డనఁగా క్షేత్రజ్ఞుఁ డగుట యల్పము నాకుఁ జిత్త
మనమున నతని నరణి గాఁ, గొను టన్వస్తువు నెఱిఁగికొను పగిదిఁ గదా. 98

వ. అనిన నతం డి ట్లనియె. 99

ఆ. అతనిఁ దోఁపఁ జేయునట్టిసాధనము లే, దింద్రియముల కందఁ [2]దేని లక్ష
ణములు లేవు నిర్గుణత్వనిరూఢుం డహంత లేమిఁ దోఁచుఁ గానఁ గనుము.

వ. అని నిర్దేశించుటయు క్షేత్రజ్ఞవిషయసంశయంబు వాసి మద్బుద్ధి శాంతి
వొందె నని గోవిందుండు సెప్పిన గాండీవి యీబ్రాహ్మణుండును బ్రాహ్మణియు
నిట్టివా రగుదురె వా రెచ్చటివారు వారల నా కెఱింగింపవే యని యడిగిన
నద్దేవుం డతనియాననం బాలోకించి. 101

క. నామనసమును బుద్ధియును గ్ర, హామహితా బ్రాహ్మణుండు బ్రాహ్మణియు వ్యాపీ
కామేయ మైనక్షేత్ర, జ్ఞామలవస్తు వన నేన యనియె నరేంద్రా. 102

గురుశిష్యసంవాదంబు కృష్ణుం డర్జునున కెఱింగించుట.

వ. అనిన విని యర్జునుం డచ్యుతునితో భవత్ప్రసాదంబున మదీయమతి యతి
విశదయును సూక్ష్మగ్రాహిణియు నయి యున్నయది పరమం బైనవేద్యం బగు
బ్రహ్మంబు నెఱింగింపవే యనుటయు నాకృష్ణుండు గురుశిష్యసంవాదం బను
నితిహాసంబు విను మది నీప్రశ్నంబునకు నుత్తరం బయి యుండెడు నత్తె
ఱంగున మేధావి యగునొక్కశిష్యుండు సంశితవ్రతుం డయినగురు నడిగిన
నగ్గురుండు[3] ప్రజాపతిభరద్వాజ భార్గవ గౌతమ కాశ్యప వసిష్ఠాత్రివిశ్వామిత్ర
ప్రముఖు లగుమునిజనంబు లాంగిరసుం బురస్కరించికొని విరించికడకుం జని
తచ్చరణంబులకుం బ్రణమిల్లి హితం బెయ్యది తత్ప్రాప్తికి సుపథం బెట్టిది
వివరింపవే యని విన్నవించిన నన్నలినాసనుండు కృపాధురీణం బైనచిత్తంబుతో
నత్తపస్విసత్తముల కెఱింగించిన తెఱంగు నీకుం జెప్పెద నవహితుండ వయి

యాకర్ణింపు మని పలికి యిట్లనియె. 103

ఆ. ఆదరార్ద్రుఁ డగుచు నలరినమోముల, కాంతి వింత గాఁగఁ గమలగర్భుఁ
డాతపస్విజనుల యాననంబులు గల, యంగఁ జూచి యిట్టు లనియె వత్స. 104

తే. సత్యమున సకలభూతంబులు సంభవించు, నంద వర్తించు దానన యడఁగు నిది గు
ణత్రయాత్మకసత్యచరిత్ర మమల, బుద్ధులార సత్యంబు ప్రసిద్ధి వినుఁడు. 105

క. శ్రుతి యనఁ దప మనఁగఁ బ్రజా, పతి యన సత్యంబునకు నపరనామంబుల్
ప్రసులాఁగ సత్య మనస, ద్వితతమహిమ [1]మైనపర మవేద్యము సుండీ. 106

క. కావునఁ గామక్రోధస, మావేశము లెడల విడిచి యనవగతంబుల్
సేవింపఁగ సత్యము దృఢ, భావాకలనమున యోగపరినిష్ఠాత్ముల్. 107

వ. అది హితంబు తత్ప్రాప్తికి సుపథంబు సెప్పెద వినుండు. 108

క. చతురాశ్రమములును జరణ, చతుష్టయము గాఁగ వర్ణసముదయసంసే
వ్యత నొప్పుసుధర్మము సుం, డతులంబు శివప్రదంబు నగుపథ మరయన్. 109

వ. నాలుగాశ్రమంబులకు సామాన్యంబ యధ్యాత్మవిత్త్వంబు లేక పరతత్త్వంబు
నొందరాదు మారుతాదిత్యేంద్రప్రజాపతులకును లోనుగా నిట్టిద యధ్యాత్మ
దర్శనం బనఁ జతుర్వింశతితత్త్వావలోకనంబు గావునఁ దత్త్వంబులు వివరించెద.

తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియము లిరుదెఱఁగు మునీంద్రులార
మన మహంకారబుద్ధు లిట్లొనరి ప్రకృతి
గలయఁ దత్త్వచతుర్వింశకత్వ మొందు. 111

క. వినుఁడు ప్రభవవిలయజ్ఞా, ననిరూఢము గాఁగ వీని నైజ మఖిలముం
గనిన భవమోహ మొందఁడు, గనుఁ బరతత్త్వంబు నతఁడు గతకల్మషుఁడై.

వ. అని నిర్దేశించి యద్దేవుండు వెండియు. 113

క. వ్యక్త మనిర్వాచ్యం బ, వ్యక్తము సుస్థిరము ధ్రువము వ్యాపిత్వధురా
యుక్తము కలితగుణత్రయ, శక్తి నవద్వారపుర మసాధ్యము సుండీ. 114

క. తత్సాధనంబు తద్గత, చిత్సులభత్వప్రసిద్ధిఁ జేయుఁ ద్రిగుణసం
పత్సారవంత మది [2]గుణ, జిత్సువ్రతు లైనవారిచే సాధ్య మగున్. 115

సీ. సంయమివరులార సత్త్వరజస్తమో, నామరూఢములు గుణంబు లవియు
నన్యోన్యమిథునత్వ మన్యోన్యసంశ్రయ, మన్యోన్యసంకలితానువృత్తి
భావ మన్యోన్యోపజీవనాచరణంబు, గలిగి దుర్భేదత్వగాఢభంగు
లై యుండుఁ దమము నియమిత మైనరజస్సుఁ, దన్నియమమున సత్త్వంబు నడచు

తే. సత్త్వ మడఁగినచోఁ దమశ్చరిత మెసఁగు
లోభశోకసమ్మోహనిద్రాభయములు

1. గ. మైనపద మవేద్యము. 2. క. గ. చ. గుణ, చిత్సువ్రతు.

వికృతిమద్ధ్యానమౌఢ్యపాపప్రకృతికోప
శాఠ్యమాత్సర్యములు తమస్సంభవములు. 116

ఉ. పాములుఁ దేళ్లునుం బసులుఁ బందులుఁ గుక్కలు మీలుఁ గోళ్లులుం
జీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలుఁ గొంగ నక్కలు
న్దోమలు మ్రాఁకులుం బూదలు నోవ్రులఁ బీడలఁ బొందువారు మున్
తామసభాగు లట్లు మఱి తద్విధజంతువు లెన్ని యన్నియున్. 117

క. ఇవి తామసంబు లని గుణనివహములోఁ గీడు వాప నేర్పునఁ గాంచు త
ద్ద్వివిధవికృతినిరసనహేతువివేకము గలుగఁగా సద్యోగతి దలఁగున్. 118

చ. బలమును శౌర్యముం మదముఁ బ్రాభవముం సుఖదుఃఖభోగతా
కలనముఁ జెల్మి సేఁతయును గాంక్షయు నొల్లమియుం బ్రకోపముం
గలహము నీర్ష్యయుం బహువికల్పప్రభాషలుఁ గామినీజనం
బుల యెడ గాఢరాగతయు బొంకును నుబ్బు రజఃప్రభూతముల్. 119

చ. అవి దొలుబామునం గలుగు సట్టిజనంబులు నీతు లిట్టి వి
ట్టివి యవినీతు లన్మతిప్రతిష్ఠత గల్గి త్రివర్గవర్తనం
బు వెరవు నొంది యర్థములఁ బొంపిరి నొవ్వుచుఁ గామసౌఖ్యసం
భవములఁ గ్రాలుచుం మనుజభావనిరూఢతఁ బొల్తు రెంతయున్. 120

క. రాజసగుణములకుం గల నైజ మెఱుఁగువారు తజ్జనకవైకృతముల్
ధీజితములు గావింపఁగ నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్. 121

సీ. సంతోషమును బ్రకాశత్వంబుఁ బ్రియమును నానందమును గరుణాభిరతియు
క్షమయును సత్యంబు శౌచంబు ధృతియు నకార్పణ్యమును దితిక్షయు నహింస
యును నార్జవంబును ననసూయయును గ్రోధరాహిత్యమును నసంరంభతయును
సమత దాక్షిణ్యంబు శ్రద్ధధానతయు నక్రూరభావంబు హ్రీగౌరవంబు

తే. సత్త్వజాతంబు లివి పూర్వజన్మసంకలితము లైనట్టివా రహంకృతి మమత్వ
మర్థతృష్ణ [1]కామార్తి లేక తులబోధభరితు లై యూర్ధ్వలోకవైభవము గందురు.

క. వినుఁ డా గుణంబు లన్నిటిఁ గనికొని తత్తదనువర్తి గలుగని వాఁడ
ప్పనిచే భుజింపఁగాఁబడఁ డనఘాత్మకులార మ్రింగు నతఁ డా రాశిన్. 123

వ. అని చెప్పి యప్పరమేష్ఠి మఱియును. 124

సీ. వేర్వేఱ యుండవు వినుఁడు గుణంబు లన్యోన్యసంకలితంబు లగుచుఁ బరఁగు
సంగతత్వమునన సంసారయాత్రాప్రవర్తనం బొసరించు వానిలోన
నెయ్యదిమిగులఁ దోఁపెచ్చె దజ్జన్యంబు లోలయుఁ బాయుటయు నొక్కొక్కమాఱు
గలుగు [2]దమం బెఱుఁగగలి యధికం బైన స్రోత స్సధోముఖస్రుతి రజస్సు

ఆ. పెరిఁగినపుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ బొంద నూర్ధ్వవృత్తిఁ బొందు వీని

1. క. కామార్థి. 2. అ. దమంబు పేర్కొని యధి.

మును ¹ప్రకారభేద। మున నెఱింగించితి, నవి ²సదుత్తరంబు। లనఘులార. 125

క. స్రోతస్సన ³జీవగమన, హేతు వగుదశావిశేష। మీగుణమునఁ దా
నీ తెరువు నొందు నని కనుఁ, డాతతమతులార కరణ। మగు నది త్రోవన్. 126

వ. గుణత్రయంబునం గ్రోచుట మే లది గ్రోపువడునట్టివితృష్ణత్వంబు లేకుండునేని.

క. సాత్త్వికులకు దివము రజో, నుత్త్వకలితవర్తనులకు। మధ్యభువనవా
సత్త్వముఁ దామసులకు నీ, చత్త్వకరాధోజగంబు। సంప్రాప్త మగున్. 128

క. ధర్మార్థకామగోచర, కర్మములకు సాత్త్వికాది। కప్రకరవికా
రోర్ములు హేతువు లగు ని, ష్కర్మత కేతద్వ్యపోహతి। కారణము సుఁడీ. 129

క. క్రమమునఁ బ్రాణంబు సపా, నము సత్త్వంబును ⁴రజస్సు। నాకుం జూడఁగా
యమివరులార యుదానము, తమ మిట్టుల శ్రుతియు సువిది। తంబుగఁ జెప్పెన్. 130

క. జపమును దానము యజ్ఞముఁ, దపమును గర్తృజనచిత్త। దశలను సత్త్వా
ద్యుపహితములగుట నడచుం, ద్రిపథంబుల సాత్త్వికపుగ। తియ మే లెందున్. 131

క. వినుఁ డెక్కువ దక్కువ లే, కనయము నెనసినగుణత్ర। యంబునుజూరే
వినుతావ్యక్తం బనఁగాఁ, జనుతత్త్వము శివ మచలము। శాశ్వత మరయన్. 132

క. సదసత్ప్రకారనిత్యం, బది దాని తెఱం గెఱుంగు। నాతఁడు విజ్ఞా
నదశావధూతగుణుఁడై, యదీనగతిఁ బొందఁ గను ని। రామయపదమున్. 133

వ. అని యుపదేశించి విరించి వెండియు. 134

## మనోబుద్ధ్యహంకారాదితత్త్వప్రకారము.

సీ. అవ్యక్తమునను మహ। త్తత్త్వ ముదయించు, నది బుద్ధి మతి ధృతి। ఖ్యాతి సంవి
దుపలబ్ధినామంబు। లొంది యెందును గని, విని చని కావించి। విభుత నొప్పు
దాన నహంకార। తత్త్వంబునకుఁ గల్గుఁ, బ్రభవంబు వినుఁడు త। ద్భావితాత్మ
కం బై ప్రవర్తించుఁ। గార్యనీతుల లోక, మఖిలంబు వర్ణత్ర। యప్రజనితు
తే. లధ్యయనమును వ్రతమును। నధ్వరంబుఁ
దపము మొద లైనక్రియ లందుఁ। దగిలి నడచు
నెల్లఁ దద్వ్యాప్తిఁ జేసియ। యెల్ల నింత
జగము రంజిల్లు దాని తే। జంబువలన. 135

క. వినుఁ డాతత్త్వంబుల సం, జనితము లగు మేదినియును। జలమును దేజం
బును వాయువు నాకాశము, ననఁగ మహాభూతములు ని। రతిశయమహిమన్. 136

తే. తద్గుణంబులుసూరె గం। ధంబు రసము
రూపసంస్పర్శశబ్దముల్। రూఢభంగిఁ
బరఁగునవ్విషయములఁ బా। ల్పడ్డమనసు
గలుగుజంతువు మోహాంధ। కార మొందు. 137

1. గ. ప్రకాశభేదములనెఱిం 2. గ. సుదుస్తరంబు 3. చ. ద్రిదివగమన 4. గ. రజస్సనకుఁజూడఁగసంయామి.

క. దీన సకలజంతువులును, లీనము లగు చుండుఁ దనునుకలిసిన స్వాత్మోద్ధా
ర్యానూనం బగునిర్మల,మానసమునఁ జూరయసీరు మహాత్మాన్యజనుల్. 138

క. విషయంబులు నశ్వరములు, విషసన్నిభములు సనుగ్రహనిక్షిప్తజసనిమల్
ధిషణాగుణముల నెల్లఁ గ,లుషములుగాఁ జేయు మోహశోభకరము లై. 139

ఆ. మాంసశోణితాస్థిమయశరీరంబులఁ, దాగు గాఁగ [1]లగ్నతలఁచుసట్టి
కృపణజనులు వీనికీడు గానఁగ లేక, చిక్కి చెడుదు రింగె నిన్ను వంబు. 140

వ. పండితులు వీనిచేతం జెడ రని పలికి పద్మసంభవుండు వెండియు. 141

తే. అంతరాత్మ యనంగఁ బ్రాణాదిపంచ,కమును వాఙ్మనోబుద్ధులుఁ గా నిసూక్ష్మ
గలుగు నీయష్టకంబు లోకమున కెల్లఁ, దా నుపాదానకారణత్వమున వహించు. 142

వ. ఇవ్విధంబునం గనుంగొనుట బోధంబునకు నిదానంబు. 143

సీ. వినుఁ డహంకారసంజనితంబు లగుచక్షు,రాదికబుద్ధీంద్రియములుఁ జాయు
ముఖ్యకర్మేంద్రియములును మనంబును, నేకాదశేంద్రియనామసిక మిూక
డిందిసందడిఁ బడి [2]కుందక యుంచి, యింపేనిఁ దనువంక నీడ్వఁ జాలు
బుద్ధితత్త్వము గల్గుశుద్ధాత్మకుఁడు పర,తత్త్వంబు గనుటకుఁ దా వలంతి

తే. యనియెఱింగించి మఱియునిట్లను నజుండు, స్వేద ముద్భేదనుండ మస్వీసఁ బుట్టు
నధమమధ్యమోత్తమదశలై నభూత,ంసు లత్యుత్తమములు జరాయుజములు. 144

వ. భూతతారతమ్యజ్ఞానంబు మానసీయంబగుటనిట్లు సెప్పితి సధ్యాత్మాదులెఱిఁగెప్పుడఁ
దద్వేదిత్వంబు విద్యామూలం బై యుండు నవధానంబుతో వినుండు. 145

క. అంబర మాది యనిలతేజోంబుధరలు వరుసతోడ సగుఁజూరె ద్వితీ
యంబుఁ దృతీయంబుఁ జతుర్థంబును బంచమము భూతతతి యిట్లుండున్. 146

వ. అధ్యాత్మాదులు భూతాధిష్ఠానంబులు గావున భూతంబులము న్నుపన్యసించితి. 147

సీ. శ్రోత్ర మధ్యాత్మంబుసూరె శబ్దం బధి,భూతంబు దిశలు ప్రబుద్ధులార
యధిదైవతము చర్మ మధ్యాత్మ మందలి,సంస్పర్శ మధిభూతసంజ్ఞకంబు
దానికి నధిదైవతంబు విద్యుత్తు నే,త్రంబు దా నధ్యాత్మకంబు రూప
మధిభూత మాదిత్యుఁ డధిదైవతము జిహ్వ,యధ్యాత్మకము రస మారయంగ

తే. దానియధిభూత ముడుపతితదధిదైవ,తంబు ఘ్రాణ మధ్యాత్మంబు దలఁప గంధ
మంచితాధిభూతము తదీయాధిదైవ,తంబు మారుతమం డ్రువిద్వజ్జనములు. 148

వ. ఇది బుద్ధీంద్రియ ప్రపంచంబు. 149

సీ. పాదపాయూపస్థపాణివాగ్వర్గంబు, కర్మేంద్రియములు సత్కర్ములార
యధ్యాత్మములు వాని కగునధిభూతముల్, గంతవ్యమును విసర్గమును శుక్ర
మును గ్రమవృత్తిమై వినుఁడు కర్తవ్యవ,క్తవ్యంబులును నధిదైవతములు
బభ్రుమిత్త్రప్రజాపతిశక్రవహ్నులు, మఱి యహంకారంబు మనసు బుద్ధి

1. క. నాత్మ దలఁ. 2. జ. మందక యొడఁగిలి యిన్నింటిఁ దన; ట. కుందక యొడఁగిలి యింపని నత.

తే. పూజితాధ్యాత్మకము లధిభూతవృత్తి
వెలయు నభిమాన [1]మంతవ్యములును నిశ్చ
యంబు నధిదైవతము [2]రుద్రుఁ డమృతకరుఁడు
బ్రహ్మ మిది వేదవాక్యనిర్ణయము తెఱఁగు. 150

ఆ. ఇట్లు దెలియ నెఱిఁగి యింద్రియంబులనింద్రియార్థము లనుభూతసార్థమును దె
మల్చి చిట్లకుండ మనసున నోదిఁగించు, టనఘులార భవనిరాసకంబు. 151

వ. అని నిర్దేశించి నీరజాసనుం డాసంయమివరులతో సూక్ష్మభావత్వసంపాదినియు
శివయు నగునివృత్తి తెఱం గెఱింగించెద ననుమాట మున్నాడి యిట్లనియె. 152

సీ. కమఠంబు దనయంగకముల నెట్లట్లు కామముల విద్వాంసుండు మరలఁ దివుచుఁ
గామంబుల నుఱల్పఁగా నోపుధీరుఁడు, విరజస్కుఁడై ముక్తి తెరువు గాంచు
నింద్రియంబులు పనియుంటని గుదియించు, నెక్కుడువెర వది యింధనముగ
నాత్మాగ్ని వెలుఁగుభూతావలి నాత్మఁ గాంచిన సూక్ష్మతత్త్వదర్శనము గలుగు

తే. భూతపంచకజలధి రోగాతిశోక,సహితభోగలవాంశకాశ్రయము దీని
విభులు కాముండుఁ గ్రోధుండు వీరి గెల్వ, వచ్చినప్పుడ యది గడవంగవచ్చు.

ఆ. మనసు మనసునందు మడఁచి యాత్మని నాత్మ, యంద కాంచునట్టియతఁడు సర్వ
విదుఁడు సకలభూతవితతియందును దనుఁ, గనుచు నుండు నిర్వికల్పకముగ. 154

తే. ఆత్మతత్త్వ మేకంబ దీపాంతరములఁ
[3]గలుగఁ జేయుప్రదీపంబుకరణి నావ
హించు రూపాంతరముల నయ్యేలమియును బు
ధుండు గనుఁగొని భ్రమయక యుండు నొకట. 155

తే. ఆపరంజ్యోతి పేళ్లు లర్యముఁడు వరుణుఁ
డనిలుఁ డగ్ని సోముఁడు విష్ణుఁ డజుఁడు శివుఁ డ
నంగఁ బరఁగుశబ్దములు సన్నుతులు దానిఁ
బ్రయతు లయి భజియింతురు నియతులార. 156

వ. అని చెప్పి యచ్చతురాననుం డమ్మానసీయులతో మఱియు నిట్లను ధర్మంబునకు
నహింస లక్షణం బధర్మంబునకు హింసయు దేవతలకుఁ బ్రకాశత్వంబును
మనుష్యులకుఁ గర్మంబును నాకాశంబునకు శబ్దంబును వాయువునకు స్పర్శం
బును జ్యోతిస్సునకు రూపంబును జలంబునకు రసంబును బృథివికి గంధంబును
భారతికి శబ్దంబును మనంబునకుఁ జింతయు బుద్ధికి వ్యవసాయంబును దదీయ
మహత్త్వస్వరూపంబునకు ధ్యానంబును నవ్యక్తంబునకు [4] సాధుత్వంబును
యోగంబునకుఁ [5] బ్రవృత్తియును జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణంబులు
లక్షణజ్ఞానంబు పరతత్త్వపరిజ్ఞానంబునకు హేతుభూతంబు. 157

1. గ. సంకల్పములును 2. గ. వేధయమృత 3. చ. గనఁగఁ జేయు 4. చ. సమత్వంబును. 5. క. చ. ట. వృత్తంబును

ఆ. జ్ఞానపూర్వమైనకర్మసన్న్యాసకలనంబు, పరమగతి యొసఁగు భవ్యులార
ద్వంద్వరహితుఁడై సతతని జరామృత్యుని,స్తరణకరణమైనసాధనము. 158

అవ్యక్తనామతత్త్వనిరూపణప్రకారము.

సీ. అవ్యక్తనామకంబగుతత్త్వ మరయ స,లింగంబు పురుషుఁ డలింగుఁ డతఁడు
క్షేత్రంబు నెఱుఁగుటఁ క్షేత్రజ్ఞుఁడనఁ జను,క్షేత్రంబు నాఁగఁ బ్రకృతియ సంగ
నవ్యక్తమునకు నానామాంతరంబులుగుణ,ప్రభవమాతత్త్వనామ ప్రభావుగుణము
లెఱుఁగవు చేతనాహీనముల్ గాన య,వ్యంతరాత్ముఁడు తన్ని ప్రపంచ
ఆ. మెఱుఁగు నిట్టు లగుట యెఱిఁగి గుణమ్ముల, విడిచి నిలిచి తత్త్వవేది యంత
రాత్మవేశనమున నచలనిరామయా,వ్యయపదంబు గను ననఘులార. 159
వ. అని వెండియు. 160
సీ. జ్యోతిస్సులందు వర్యుఁడు రవి భూతంబు,లం దగ్ని వరుఁడు నిర్జరులఁ బ్రధాన
సావిత్రి దేవతాసమితిఁ బ్రజాపతి, ఘనుఁడు వేదముల ముఖ్యంబు ప్రణవ
మనిలచయమ్మునఁ బ్రాణ[1]మగ్ర్యముఛంద,ములకు గాయత్రి యగ్గలము పసువు
లకు మేటి యజ మఖలచతుష్పదములకు, ధేనువు మిక్కిలి నరులకును
తే. బ్రాహ్మణుండు వరిష్ఠుండు పక్షులందు, శ్యేన మధికంబు యజ్ఞవిఘాతముల హు
తంబు పెద్దయుగములఁ గృతంబు మేలు,ధాతువర్గములోన సువర్ణము పసిఁడి.
సీ. యవ లోషధులలోన నన్నంబు భక్ష్యభో,జ్యములందు జలము పేయములలోన
నమరాచలము పర్వతములలోఁ బ్లక్షంబు, తరువులలోన నూర్ధ్వంబు దిశల
జాహ్నవి నదులందు సాగరంబు సరస్సు,లందు గృహస్థత్వ మాశ్రమముల
నెక్కుడౌ రయ నెక్కుఁడేను బ్రజాపతు,లం దచింత్యాత్మునం డైనయట్టి
తే. విష్ణుఁ డెక్కుడు నాకంటెఁ విభుఁడు తెలియ, నీశ్వరుఁడు దేవతావలి కెల్ల నెక్కు
డతఁడు నానేననఁగ విష్ణుఁడనఁగ వస్తు,వొక్కఁడ మూర్తిత్రయంబునఁ దనుల్లసిల్లు.
క. నెఱయఁ బ్రధానపదార్థము, లెఱుఁగుట పరిబోధమూల మెఱుకల కెల్లన్
మెఱుఁ గిడుట మమ్ము మువ్వుర,గుఱుకొని యొకఁడుగ నెఱింగికొనుట దలంపన్.
క. దివసము రాత్రియునుం బోరిఁ, బ్రవర్తనముఁ బొందుచుండుపగిదిని సుఖసం
భవదుఃఖజననములు జం,తువులకుఁ గలుగు వల దుబ్బ [2]దురపిల్లంగన్. 164
తే. పొదలుఁ దఱుఁగుటకై పొడ [3]వొదవుఁ బడుట
కై [4]కడను జేరుఁ బాయుటకై జనించుఁ
బొలియుటకు నై సుఖంబును బొందు దుఃఖ
మందుటకు నై పదార్థము లఖిలములును. 165
క. జ్ఞానము సవిశేషస్థితి, దానికి నాశంబు లేదు దానిఁ దెలియుటకా
మానాహంకృతిమమతలు, మానిననిర్మలుఁడు మోక్షమార్గముఁ గాంచున్. 166

1. చ. మాద్యము. 2. జ. దురపిల్లంగన్. 3. జ. వెదుగు. 4. కడుం జేరు.

వ. అని వివరించి యాసమంచితాచారులతోడ నాశ్రమప్రకారంబు లెఱింగించెద
నని పలికి యిట్లని యుపన్యసించె. 167

సీ. గురునకుఁ బ్రియహితకరుఁ డయి వేదాధ్యయన మొసరించుచు [1]నశన మమల
భిక్ష [2]నొనర్చుచు బిల్వపలాశదండములలో నొకటి ధార్యముగఁ జేసి
స్నానశీలుఁడు బ్రహ్మచర్యపరుండును, నియమితేంద్రియుఁడును నిత్యశుచియు
యజ్ఞోపవీతియు సబహులభాషియు మేఖలాఢ్యుండు నై శయనాసనప్ర
తే. చారవిధములు సముచితా[3]చరితములుగ, సత్యధర్మనిరూఢుఁ డై శాంతి గలిగి
వేల్మి యిరుప్రొద్దు నడపుచుఁ గల్మషంపుఁ బనుల కెలయక వర్తించు బ్రహ్మచారి.

సీ. అర్హప్రకారసమానవర్తనుం డగుచు, నిజదారనిరతుండు నిర్మలప్ర
చారుండుఁ బంచయజ్ఞపరుండు నతిథిశిష్టాశియు శుక్లవస్త్రాన్వితుండు
శక్త్యనుగుణదానశాలియు నచపలేంద్రియుఁడును శుచియు మైత్త్రీపరుండు
స్వాధ్యాయశీలుండును సద్వ్రతనిష్ఠుండు, నై యాజనంబు నధ్యాపనంబు
ఆ. శక్య మైనఁ జల్పి యశము గల్గి సత్ప్రతి, గ్రహ మొనర్చి మిత్త్రులహితు లనక
మాటకార్యము సను మధ్యస్థుఁ డై గృహస్థుండు నడచు దురితదూరుఁ డగుచు.

సీ. గ్రామంబు దొలఁగి యరణ్యస్థలంబునఁ
బర్ణశాలావాసపరత నొంది
స్నానతంత్రము రెండుసంధ్యల నడపుచు
బ్రహ్మచర్యవ్రతభాసి యగుచుఁ
బూరిపంటలు ఫలంబులు మూలములు శాక
సముదయంబును నశనముగఁ గొనుచు
నజినంబు వల్కల మంబరంబుగఁ గొని
శయనకృత్యంబు భూస్థలి నొనర్చి
తే. యతిథులకు నెడ మిచ్చి యాహారములను
భక్తి నాత్మీయములలోనఁ బంచి పెట్టి
యధ్యయనహోమశీలుఁ డై యన్నియింద్రి
యముల గెలిచి వానప్రస్థుఁ డతిశయిల్లు. 170

క. ఈమూఁ డాశ్రమములలో, నేమిట వర్తించువార లేనియు ముక్తిం
గామించినఁ జొరఁ దగు వి, ద్యామూలాచార మైనయత్యాశ్రమమున్. 171

సీ. సర్వభూతదయానుషంగంబు గలిగి య, తీతవస్తువులఁ జింతింప కెద న
నాగతంబులమీఁద నాస సేయక వర్తమానలబ్ధము లుపేక్షానిరూఢిఁ
గూర్చు చంగంబులఁ గూర్మి మెట్లట్ల యింద్రియముల లోనికిఁ దిగిచికొనుచు
సముచితకాలభిక్షాచర్య దొరకొన్న, యంతన నిజదేహయాత్ర నడపి

1. చ. నన్న మమల. 2. చ. జరించుచు. 3. గ. చారములుగ, నాచరించుచు స్త్రీజన♦త్యాగ మొంది, ప్రేల్మి.

తే. గ్రాస మాచ్ఛాదనంబు దఽక్కంగ నెవ్వఁ, డర్థి నెయ్యది యిచ్చినఁ ఽ నంద కేక
వారభోజి యగుచు నమఽస్కారసఖ్య,నుతినిరాకృతిరహితుఁ డైఽ యతి వెలుంగు.

క. అనసూయయు నక్రోధం,బును దమమును బ్రహ్మచర్యఽమును ఋజుభావం
బును సత్యంబు నపైశున,ము నహింసయుఁజూరె యతికిఽ ముఖ్యవ్రతముల్. 173

తే. వృక్షమూలనదీతీరఽవిజననిలయ,విపినగిరిగుహానిత్యవిఽవిక్తదేవ
సదనవాసి యై కౌటిల్యఽ[1]సాధ్యవస్తు,సంచయనము లుడిగి యతి ఽ సంచరించు.

క. తనమేలు ప్రకాశింపక, తనుఁ గనుఁగొనునట్టిజను లుఽదాసీనత్వం
బునికికిఁ దగియెడుచందం,బున వర్తించుయతి సర్వఽముక్తత నొందున్. 175

వ. అని యెఱింగించి మఱియును. 176

సీ. సన్న్యాస మనఁ దపఃశ్చరణంబు పేరు తే, పోజ్ఞానము క్రప్రఽబుద్ధ యైన
జనము లచింత్యం బఽజర మమృతంబు నా, వెలుఁగుతత్త్వము గని ప్రఽ పిదప త్యా
సము నవధూతరాఽజసము నై శుద్ధస, త్త్వాశ్రయం బగుహృదఽయంబు గలుగు
వారు తపోవృత్తిఽవలన సుక్షేమమా,ర్గంబున సుపేరు రేఽకత్వశోభి

తే. మహితనానాత్వ మనఁగ సఽమస్తభూత
సముదయస్థ మై యున్నతఽత్త్వము ప్రకాశ
మగుట నఖిలగతులఁ దోఁచుఽనవ్విధంబు
గలుగుబుధుఁడు నిర్ద్వంద్వుఁ డై ఽ కాంచు ముక్తి. 177

వ. అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహంకారవిటపంబును మహాభూతో
పశాఖంబును నింద్రియకోటరంబును [2]సంతతాశాపల్లవంబును శుభాశుభ ఫలం
బును నై సంసారవృక్షం బొప్పు చుండు. 178

క. జ్ఞానాసి నది నఱికి యభి, మానాహంకారదూరఽమతి యగుపురుషుం
డానంత్యము ప్రస్ఫుటముగఁ, గానంగా నేర్చు విగతఽకల్మషులారా. 179

ఆ. నిమిష మైనఁ బరమఽనియతి నాత్మ్ముని నాత్మ
యంద కనినఁ దెలివు ఽ [3]నారఁ బడసి
బోధమహితమునులఽపొందునవ్యయగతిఁ
బొందఁ గంద్రు ప్రకృతిఽపొందు దొఱఁగి. 180

ఆ. పరమనియతి యనఁగఁ ఽ బ్రాణసంయమనంబ, యది క్రమాభివృద్ధి ఽ నలవరింప
గాఁ బ్రసాదసిద్ధి ఽ గలిమి ధ్రువం బవ్వి, శేషకలన మిష్టఽసిద్ధిఁ జేర్చు. 181

క. అవ్యక్తతత్త్వజాతము, భవ్యము సత్త్వంబు దురితఽపంకహరం బై
యవ్యయ మమృత మనింద్రియ, భావ్యం బగుతత్త్వ మొందఁఽ బ్రాఁ కగుఁ జూండీ.

వ. కావున. 183

తే. సత్త్వభావనకంటెఁ బ్రఽశస్త మైన,కృత్య మరయంగ లే దండ్రు ఽ నిత్యవస్తు

సమ్యగధిగమసిద్ధికి । సంయమప్రసిద్ధు లాగమతంత్రప్రసిద్ధులార.　　184

క. వినుఁడీ సత్త్వస్థుఁ బురుషుఁ, గనుఁగొను టనుమానకలనఁ । గాని మనము ద
క్కిన పెఱఁ గేమిట నైనం, గనుఁగొనియెద మనుట వెరవు । గా కుండుఁ జుఁడీ.

సీ. ఇట్లగు నెట్లనిన । యెదరేని సత్యంబు, సంతోషమును నహింసయును ధృతియు
క్షమయు నార్జవమును । సన్న్యాసమును బరి, త్యాగంబు విజ్ఞాన । యోగదశయు
సాత్త్వికంబులు గాన । తత్త్వవిజ్జనము లీ, యనుమానమునఁ బురు । షాధిగమముఁ
బడయుట యొప్పెడు । పదమంద్రు సత్త్వంబుఁ, బురుషుండు నొకఁ డను । బుద్ధి గొంద

తే. ఱార్యు లూఁదుదు ర ట్లేల । యగు నుదుంబ
రమున మశకమ్ము వారి మీ । నము వసించు
నట్లు సత్త్వంబునం దంత । రాత్ముఁ డుండుఁ
గాక యనియెడివారు పెక్కం । డ్రు గలరు.　　186

వ. అనిన విని యమ్మును లమ్మహితాత్మునితో ధర్మంబు లనేకవిధంబులు వీనిలో నెవ్వం డెయ్యది యవలంబించె నదియ వాఁడు మే లను నే మన్నింటిమీఁదనుం బరఁగిన బుద్ధులు గలిగి యనిశ్చయదర్శనుల మయి యుండుదు మిది ప్రధానానుష్ఠేయం బని యుపదేశింపవలయు సత్త్వపురుషసంబంధప్రకారంబును బ్రస్ఫుటంబుగా నెఱింగింపు మనుటయు వారికి వారిజాసనుం డి ట్లనియె.　　187

సత్త్వం బవశ్యానుష్ఠేయంబుగా నిరూపించుట.

సీ. సకలధర్మములలో । సర్వభూతాహింస, మేటి యహింసాప । మేతుఁ డైన
వానికి నుత్తమ । జ్ఞానోదయం బగు, నది మోక్ష మొనరించు । ననఘులార
కోరికమెయిఁ గర్మ । కారి యయ్యెడువాఁడు, పొందు గతాగతం । బుల ఫలాభి
లాషంబు లేక ని । ర్దోషత మే లాచ, రించిన ముక్తి సి । ద్ధించు వినుఁడు

తే. విషయి పురుషుండు సత్త్వంబు । విషయ మిట్లు
భోక్తృభోజ్యత్వసంబంధ । మునఁ బొసంగి
యుండియును బద్మపత్త్రప । యోలవంబు
కరణి నతఁడు తత్సంగంబుఁ । బొరయ కుండు.　　188

క. సత్త్వము ప్రదీప మాపర, తత్త్వముఁ గాంచుటకుఁ గాన । తత్సాధనతా
[1]తత్త్వము వదలక చిత్తసు, ఖత్వాకలిత మగు నెలవు । గంద్రు కృతాత్మల్.　　189

చ. అది సదుపాయ మెందును ను । పాయసమగ్రత లేమి సేర్ప ద
భ్యుదయము దూరమార్గమునఁ । బొందెడుభద్రము వాహనాఢ్యుఁడుఁ
నది నెఱి నుత్తరించి కను । నందము నౌసహితుండుఁ గాంచునొ
ప్పిదము విసాధనుం డయిన । బే లెటు లొందఁగ నేర్చుఁ జెప్పుఁడా.　　190

వ. ఇట్లు లగుట యెఱిఁగి । యెఱిఁగియేనియును నెఱుంగ కేని బలిమి । నొచ్చు నడిగి

1. గ. పత్త్వము...చిత్త్వసుఖ.

చేయుపని ఫలంబు సిద్ధింప కుండుట, కొలఁదిఁ బోక సుఖముఁలును గలుగు. 191

క. స్థలపథమునఁ బోతమ్ము, జలమార్గమునందు వాహనము నిని యోజ్యం
బులు గా విమ్మెయి సాధన, కలనవిభాగజ్ఞుఁ డైనఁ గడచు నసతిమముల్. 192

వ. అని చెప్పి. 193

తే. తటినిఁ దగ నుత్తరించునంతకును బోత
మాదరించి తక్కొల్లనియట్లు పురుషు
దర్శనము సంభవించునంతకును సత్త్వ
మూఁది పిదపఁ దత్సంబంధ ముడుగుఁ డనియె. 194

వ. ఇట్లుపదేశించి మఱియు నిట్లను నవ్యక్తంబుగుణంబు మహత్తత్త్వంబు మహత్తత్త్వగుణం బహంకారం బహంకారగుణంబులు మహాభూతంబులు మహాభూతగుణంబులు శబ్దాదు లం దాకాశంబునకు శబ్దంబు గుణంబు వాయువునకు శబ్దస్పర్శంబులు గుణంబులు తేజస్సునకు శబ్దస్పర్శరూపంబులు గుణంబులు జలంబునకు శబ్దస్పర్శరూపరసంబులు గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరసగంధంబులు గుణంబులు శబ్దంబు మృదుఖరాదిబహువిధభేదంబులు గలిగి యుండు స్పర్శంబు శీతోష్ణముఖ్యవివిధప్రకారంబులం బరఁగు రూపంబు శుక్లకృష్ణప్రభృతినానావిధంబులం జను రసంబు మధురతిక్తాదిప్రచురభంగుల నడచు గంధంబు సురభితీక్ష్ణప్రముఖానేకవిశేషంబుల వర్తించు నిట్లు పెక్కు చందంబులం జెల్లువిషయంబులతెఱం గెఱుంగుట వానిఁ దొలంగుటకుం దోడ్పడం జాలునని చెప్పి వెండియు. 195

ఆ. భూమిముఖచతుష్కమునకంటె దివి యహంకారతత్త్వ మంతకంటె దాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యెక్కుడన్నిటికిని బురుషుఁ డధికుఁ డరయ.

క. భూతములతారతమ్యము, చేతోగత మైనయట్టిశిష్టజనము ప్ర
ద్యోతితుఁ డగుపురుషుఁ గని ని, రాతంకావ్యయపదంబు ప్రాపింపఁ గనున్.

సీ. పంచభూతంబులఁ బరఁగింపఁ గుదియింపఁ, జాలుదక్షత వాని నేలు ప్రభుతఁ
దనరు మనంబు రథ్యముల సారథి యెట్టు, లట్లిం ద్రియంబుల నాఁగ నడప
నదియ వలంతి భూతాత్మకంబును బుద్ధి, సన్నాహమును మనస్సారథికము
నింద్రియాశ్వము నైనయాద్యరథంబున, నభిమతగతి సంతతాత్ముఁ డెందు

తే. నెలమివర్తించునిట్లుగ నెఱుఁగుబుధుఁడు, ఘోరసంసారమోహావారగురకులోను
గాక నిర్గుణపథమునఁ గ్రాలి కను ని, రామయము నవ్యయంబును నగుపదంబు.

వ. అని పలికి మఱియును. 199

క. శరనిధితరఁగలభంగిం, బొరిఁబొరి నవ్యక్తమునన పుట్టు నడంగున్
సురనరధరణీరుహముఖ, చరాచరానేకభూతజాలము లెల్లన్. 200

క. అవ్యక్తాదికసకలము, నవ్యయుఁ డగుపురుషుఁ డాశ్రయంబుగఁ బరఁగున్

సువ్యక్తంబుగ నిది గను, భవ్యులు వడయుదురు మోహబంధవిముక్తిన్. 201

క. వినుఁ డక్కనుటకు మూలం, బనఘం బగుతపము యగుట నతినిష్ఠఁ దపో
ధనసమ్యగ్విధసముపా, ర్జనం బవశ్యంబు వలయు సన్మతులారా. 202

సీ. భూరితపంబునఁ జూరె ప్రజాపతుల్, బహువిధసృష్టినిర్వాహణనిపుణు
లైరి వన్యంబు లాహారంబులుగఁ దప, మాదరంబునఁ జేసి కాదె మునులు
కాలత్రయంబు లోకత్రితయంబును, గాంతురు విద్యల గౌరవంబు
లొదవుఁ దపంబున నొండువిధంబులఁ, బడయంగ రానిమోక్కుడుపదంబు

తే. లచ్చ మైనతపంబున వచ్చుఁ బడయ, బ్రహ్మవధమద్యపానాదిపాతకంబు
లెల్లఁ బాయుఁ దపగకృతి నిద్ధతపము, పేర్మి సర్వభూతంబులుఁ బ్రీతిఁ బొందు.

క. మమతాహంకృతిసహితత, పమునఁ బ్రజాపతిసమీపభవ్యపదము సం
యమి వొందు నిందు సందే, హ మొకింతయు లేదు నిర్మలాత్మకులారా. 204

క. మమతాహంకారవిము, క్తము శుద్ధము నైనయచలితధ్యానముతో
సమవేతం బగుతపమున, యమి గను సకలోత్తరావ్యయపదప్రాప్తిన్. 205

వ. అని చెప్పి వెండియు. 206

క. తమము రజస్సుఁ దొఱఁగి స, త్త్వమునన రమియించి యగుణతత్త్వము గని స
త్త్వమును దిగవిడుచు వైరా, గ్యమహితుఁ డగు మునివరుం డకల్మషులారా. 207

క. పరమం బనంగ వేదాం, తరహస్యాత్మత వెలుంగుతత్త్వము నిక్కం
బరయఁగ క్షేత్రజ్ఞుఁడ యను, పరిణతి గలయతఁడు సర్వపదవిదుఁడనుఁడీ. 208

క. వృత్తివిశేషమునఁ జనిన, చిత్తము వెనుకఁ జని యందుఁ జేర్చి మనసు దా
నెత్తెఱఁగునకుం దివియమి, యుత్తమపురహస్య మంద్రు యోగమున మునుల్.

క. వినుఁ డవ్యక్తాంతం బగు, పని యెల్ల నవిద్య నొలయు బంధము మమతం
బనుపడిన మృత్యు వమృతం, బనఁ జనునది నిర్మమత్వ మారఁ గలిగినన్. 210

సీ. కర్మముల్ మేలంద్రు కర్మతత్పరులు బు, ద్ధాత్ములు విద్య వర్యత నుతింతు
రవి షోడశవికార యగుమూర్తిఁ గల్పించు, నది నిత్యుఁ డగ్రాహ్యుఁడన వెలుంగు
పురుషునిఁ [1]దోఁపించు నరయంగఁ గర్మ, మ, యత్వంబు లేమి విద్యామయత్వ
మతనికి నైజ మై యతిశయిల్లుట శ్రుతి, సాటు నిత్తెఱఁగునుజ్ఞాన మేమ

తే. హాత్మునకుఁ గల్గి యుండు నయ్యార్యవర్యుఁ
డఖిలసంకల్పములఁ బాచి యాత్మ నాత్మ
యంద కాంచి యనామయ మజర మమృత
మనుపదమ్ముఁ బ్రాపించుఁ గృతాత్ములార. 211

వ. [2](అని యిట్లు కమలగర్భుండు.) 212

క. జ్ఞానపరినిష్ఠితాత్మకు, లైనవిముక్తిపదనిర్ణయజ్ఞులచే స

1. క. దోఁతెంచు. 2. ఈవచనము పెక్కిటఁ గానరాదు.

మ్మానిత యగుగతి యిది [1]క,ర్మానుగతివిరక్తజనసమంచితసుండీ. 213

వ. అని నిర్దేశించి వెండియు. 214

క. కోరికలకుఁ జోరక యసం,గారూఢత గలిగి యెల్లయందును సమతం
గూరినచిత్తంబులు గల,సారాత్మకు లీపథమునఁ జనుటకు శక్తుల్. 215

క. చెప్పితి సర్వంబును నీ, [2]చొప్పున నడవుఁ డెడ నొండు సొరనీకుఁడు మీ
రొప్పెడు తెరు విధి దీనం, దప్పదు పరమపదసిద్ధి ధార్మికులారా. 216

క. అని యిట్లు కమలగర్భుఁడు, మునులకుఁ దత్త్వోపదేశము జేసిన వా
రనవద్యసమాధికులై, యనితరసులభ మగుసౌఖ్య మందిరి వత్సా. 217

వ. అని పలికి గురుం డాశిష్యునితోడ. 218

క. నీవును నివ్వాక్యంబులు, భావంబున నెలవుకొలిపి [3]పరమసమాధి
శ్రీ వాటింపుము నిత్యప,దావాప్తి ఫలించు నీ కనాయాసమునన్. 219

క. అని గురుఁడు ప్రబోధించిన, మనమునఁ జెలి వొంది తత్సమంచితమార్గం
బున నడచి పొందె శిష్యుం, డనామయం బజర మమృత మనియెడిపదమున్.

చ. అని వసుదేవసూనుఁడు సమాదరమేదురచిత్తవృత్తిఁ జె
ప్పిన విని వారియుల్లములఁ బెంపిటు లుండునె వార లెవ్వరో
వినుటకు నాదుడెందమున వేడ్క జనించె నెఱుంగఁ జెప్పవే
యనుటయుఁ బార్థుమోముఁ గృప నమ్మహితాత్ముఁడు సూచి నవ్వుచున్. 221

క. అనఘ విను మే గురుఁడ నా,మనంబు శిష్యుండు విమలమానస నీపైఁ
బనుపడు ప్రీతిం జెప్పితి, ననితరసులభాతిగుహ్య మగునిప్పదమున్. 222

క. విమలము నచలము నగుచి,త్తము నాపెస నేకభక్తితత్పరముగఁ జే
యుము నిత్యము నీయధ్యా,త్మము ననుసంధింపు పాసెదవు దురితములన్. 223

క. సమరమునప్పుడు నీ కీ,యమృతపదప్రాప్తిహేతు వగుసమ్యగ్బో
ధము వివరించితి నచలత, రమింపు మిం దెపుడు శమధురాధుర్యుఁడవై. 224

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణున కధ్యాత్మవిద్య వివరించె నని చెప్పినఁ బరమగురుం
డును విశిష్టశిష్యుండును నగునప్పురుషవరులు మఱియు నెవ్విధంబునం బ్రవర్తించి
రాకర్ణించుకౌతుకంబు నామనంబున నెసకం బెసంగెడు మునీంద్రా యెఱింగిం
పవే యని యడుగుటయు. 225

చ. పరమదయావిధేయ పరిపాలితవేదకలాప [4]పక్వని
ర్భరశమసూక్ష్మతాతనువిభాసిత పన్నగతల్పభూషణా
దరభరితా పవిత్రపదతామరసస్మరణా పరాపర
త్వరహిత పద్మజాదిసురవందిత పశ్చిమనాళనందితా. 226

క. వినుతచతుర్వర్ణకసం, జనకముఖభుజోరుపాద ౹ సంవిదభేదా
మునిహృత్కమలమరాళా, జననమరణహరణచరణ౹సరసిజలీలా. 227

మాలిని. పదనమదమరాళీ ౹ భక్తసంపోషశాలీ
విదళితసురవైరీ ౹ విశ్వలోకైకధారీ
మదరహితహితైషీ ౹ మాన్యయోగప్రతోషీ
సదవనపరచిత్తా ౹ సర్వనిర్మాణవేత్తా. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబునయశ్వమేధపర్వంబునందు ద్వితీయాశ్వాసము. 229





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, తృతీయాశ్వాసము.





నగసుతాత్మమహితవి
ధానుతశశ్వల్లసల్లతా వేష్టసహే
లానిత్యశాడ్వలతరు
త్వానుగుణఫలప్రదత్వ హరిహరనాథా. 1

### తాను ద్వారక కరుగవలయు నని యర్జునునిఁ గృష్ణుఁ డడుగుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ఫల్గును నఫల్గువిద్యా
విశారదుం జేసి శౌరి యతనితోడ. 2

క. నాచిత్తము వసుదేవునిఁ, జూచుట గోరియును నీవు సుమనోవృత్తిం
జూచి యనుమతి యొసర్చుట, వేచినయది నన్నుఁ బుచ్చువే ద్వారకకున్. 3

చ. అనవుడు నక్కిరీటి దగ నయ్యదువంశవరేణ్యుతోడ ని
ట్లను నటులేనిఁ బో వలయు హాస్తిపురంబున కిత్తెఱంగు చె
ప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్పి పుచ్చు న
య్యనుమతి గల్గునట్లు దగ నాడెద నవ్విభుపాల నచ్యుతా. 4

వ. అనిన విని దామోదరుండు దారుకు రావించి రథంబు పూన్పు మని నియోగించెఁ
దదనంతరంబ ధనంజయుండు దమతోడం జనుదేరం దగుపరివారంబు సమకట్టం
బడవాళ్లం బనిచె నొక్కింతసేపునకు దారుకుండునుం దేరాయితంబు సేసి తేరం
బడవాళ్ళునుం బరిజనంబుల సన్నద్ధులం గావించి సన్నిహితుం జేయ నాకృష్ణార్జు
నులు ప్రయాణోచితాలంకారాలంకృతులై రథం బెక్కి కరినగరంబుపథంబు
గైకొని చనుసమయంబున. 5

సీ. వినయ మారంగ గోవిందున కిట్లను, గాండీవి దేవ నీకరుణఁ జేసి
కౌరవసైన్యసాగర ముత్తరింపంగఁ, గంటిమి గురుభీష్మకర్ణముఖ్య

దుర్జయవీరుల నిర్జించితిమి నీవు, శాత్రవయోధుల సమయఁ జేయ
వెనుక నేము జయంబుఁ గొనుచు వచ్చితిమి తేజంబును బేరు సౌఖ్యంబు నతుల

తే. మైన భవదీయసుప్రసాదాతిశయము, కతనఁ బడసితి మప్రతిహతమహార్ధి
రాజ్యసంపూజ్యుఁ డయ్యె ధర్మజుఁడు సంశ్రితాభిరక్షణ వ్రతనిరతాంతరంగ. 6

క. నీమహిమ పొగడఁ గొలఁదియె, దామోదర విశ్వసంవిధాతవు భవదీ
యామలతేజమ యగ్నిష్టోమము కాలాత్మకత్వశోభివి కృష్ణా. 7

క. భవదీయశ్వాసము వాయువు నీక్రోధముఁ బ్రసాదయోగంబును మృ
త్యువు లక్ష్మియు నీవలనన, యవుఁ బ్రీతియు మరణమును మహానందంబున్. 8

క. స్థావరజంగమమయజగ, దావిర్భావస్థితిక్రియావిలయంబుల్
నీవలనన యగుచుండును, భావాతీతుఁడవు సర్వపతివి ముకుందా. 9

వ. అని వెండియు. 10

కృష్ణుఁడు నింద్రప్రస్థమునుండి హస్తినాపురంబునకు వచ్చుట.

క. నారదదేవలకౌశిక, పారాశర్యాదిమునులపలుకుల భీష్మో
దారవచనముల నిను నఘ, దూరా యే నెఱిఁగి యుండుదును సకలముగన్. 11

వ. కావున. 12

క. నావలని కరుణ పెంపున, నీవు ప్రసాదించినట్టి నిరవద్యకవి
ద్యావిస్తారంబున దృష, తావిశదమతిఁ రమించెద క్రతుపురుషా. 13

వ. అని యిట్లు సభక్తికంబుగా సంభాషణంబు సేసిన వాసుదేవుండును వితతా దరవాక్యంబుల నభినందించె నప్పురుషవరు లిట్లు సల్లాపంబులు సేయుచుం బోయి తమరాకకు సమలంకృతం బైన సామజపురంబు ప్రవేశించి ధృతరాష్ట్ర మందిరంబున కరిగి యక్కురువృద్ధుని గాంధారినిం బ్రణామవినయవిశేషంబులం బ్రీతులం జేసి కుంతీసమారాధనం బాచరించి విదురధౌమ్యయుయుత్సు సంజయులదర్శనంబులు సముచితప్రకారంబుల నడపి కౌంతేయాగ్రజు నత్యంత భక్తిపూర్వకంబుగా సమంచితవిధంబునం గాంచి తదాలింగనాద్యాదరణంబులు వడసి రప్పద్మనాభుండు నాఁడు సవ్యసాచిసదనంబున నతనిచేయు పూజావిధానంబుల మానసం బలర వసియించి మఱునాఁడు మహనీయాస్థాన మండపంబున నున్న యన్న రేంద్రుకడకు నయ్యింద్రసుతుండు దోడన చనం జని సుఖగోష్ఠి నుండె నట్టియెడ నగ్గాండీవి యప్పాండవపూర్వజునాననంబునం జూడ్కి నిలిపి నిభృతుం డై. 14

తే. కమలనాభుండు పెద్దయుఁగాల మిచట
నున్నవాఁడు దండ్రియును సహోదరాది
సకలబంధులు నితనిదర్శనము గోర
నుండుదు రే వారిఁ జూడ నీతండుఁ గోరె. 15

క. ద్వారకకు నిమ్మహాత్ముఁడు, మీ రనుమతి సేయఁ జని యశేషయదుబాలు నా
సీరిని వసుదేవునిఁ గని, గౌరవ మెసఁగంగఁ దల్లిఁ గాంచి ముదమునన్. 16

క. తక్కటిసోదరుల సుతుల, నక్కనఁ బ్రియ మారఁ జేర్చి యప్పురజనులన్
మిక్కిలిమన్నన మక్కువ, నెక్కొనఁగా నాదరించి నిలుపన మగుడన్. 17

సీ. దేవర యిప్పని దివ్యచిత్తంబునఁ, జూచి మీ కెట్టులు సూడఁ బోలె
నట్టుల యుత్తరం బానతి యిత్తురు, గాక నా వుడు సగౌరవప్రియమున
మాతులుఁ గాంచి యిమ్మాధవదేవుండు, మనసూఱఁ గాఁగ నమస్కృతులను
నాలింగనంబులు నాచరించి హలాయుధుని దేవకీదేవిఁ గనినయపుడు

తే. భక్తి మనకు నై పూజించి బంధుజనుల, సందడిను దత్తఁగాంచి సత్కారమభినుతముగ
నాదరించి వారలకుశీలానుయోగ, విధము సస్నిగ్ధప్రౌఢమ్ముగ విస్తరించి. 18

క. పరిజనయోగక్షేమము, లరసి పురజనముఖ్యులకుఁ బ్రియము వెసఁగఁగ వా
క్యరచనలుం గార్యసమా, చరణములు నొనర్చి సహప సఫలసత్కృతులున్. 19

తే. మఱియు వలయుకృత్యంబులుఁ బట్టఁగుపఱుప
వలసినన్నిదినంబులు నిలిచి యశ్వ
మేధమునకు బాంధవజనమిత్రభృత్య
వర్గసహితుఁ డై చనుదెంచువాఁడు గాక. 20

క. అని ధర్మజుండు పలికిన, విని కృష్ణుఁడు సంతసిల్లి వినతుఁ డై గొం
తిని ద్రౌపదిఁ దగుమెయి వీడ్కొని తాను సుభద్రఁ దోడుకొని పోవుటకున్.

వ. గొంతి యెంతయుం బ్రియంబున ననుజ్ఞ సేయుటయు నర్జును ననుమతియుం గొని. 22

తే. వివిధవాహనారూఢులై విభవ మెసఁగఁ, బాండవేయులుఁ దక్కునబంధుజనులు
ననుపఁ రాఁగ సాత్యకిదోడ నరుగు దేరఁ, బురము వెడలి యొక్కెడ నిల్చి కరము నెమ్మి.

క. సముచితభంగుల నందఱఁ, గ్రమమున వీడ్కొని పథంబు గైకొని తనచి
త్తము దృష్టియుఁ బాండవమ, ధ్యముపై నోలయంగ నల్ల నరుగుచు నుండెన్. 24

ఆ. అట్లు మరలిమరలి యర్జునుం జూచుచుఁ, జనఁగ నతఁడు చూడ్కి సనినయంత
దవ్వుఁ జూచుచుండె నవ్విధంబున సితాం, బురుహలోచనుండు వోవునపుడు. 25

క. సరసన సాత్యకి రుచిరపు, టరదంబునఁ జనియె వెనుక నలఁతిరథముపై
నరిగె సుభద్రయు నిమ్మెయి, నరుగఁగ హరిమీఁద నింద్రుఁ డలరులు గురిసెన్.

క. పవనుం డనుకూలత మెయిఁ, బ్రవర్తితుం డయ్యె నతిశుభప్రదభంగుల్
వివిధములు మఱియు ధరణీ, ధవ తోఁచె నిమిత్తములు నిరంతస్ఫుటతన్. 27

శ్రీకృష్ణుఁ డుదంకాశ్రమంబునకుఁ బోవుట.

వ. అట్లు వోయి పోయి మార్గంబు కెలనం జేరువ నున్నయుదంకాశ్రమంబు గని యందుఁ జని వినయం బొప్ప నమ్మునిం గని యతనిచేయు నతిసత్కారంబులం బ్రియం బంది యతనిపాల నాసీనుం డయి

కి ట్లనియె. 28

చ. భరతులపాలి కేఁగి తగఁ పాండవకౌరవబంధుభావనం
గరము దృఢంబు సేసియు సుఖస్థితి రాజుల వారివారివి
స్ఫురితమహాధిరాజ్యముల చొప్పుల నిల్పితె పక్షపాతితా
దురితము లేనినీవు జనతోషవిధానవిశారదుండ వై. 29

వ. అని యి ట్లెఱుంగనివాఁ డయి యడిగెడునట్లపోలె నిందాగర్భంబుగాఁ బలికినం బద్మనాభుండు దానును దాని నెఱుంగమి భావించి యాభార్గవునాననం బాలోకించి. 30

చ. కర ముచితంబుగాఁ బలికి గర్వపుమాట నదల్చి భీతికిం
దెరు వగునట్లు చెప్పి కడు దీనత దోఁపఁగ నాడి సంధి క
క్కురుపతిఁ దమ్ముప్రోవు మొనకొల్పఁగఁ జాలన నాకు భీష్ముఁడు
న్గురుఁడును దోడుచెప్పిరి మునుల్ బహుభంగుల నొత్తి రత్తఱిన్. 31

వ. అతిలోభంబునం జేసి వంశధర్మంబు విడిచి యెవ్విధంబులను సంధికిం జొరక కురుకుమారులు పాండవులతో భండనం బొనర్చి సబంధుపరిజనంబుగా మరణంబు నొంది యుత్తమలోకంబుల కరిగి రిక్కడఁ బాండునందనపంచకంబు దక్కం దక్కటివా రెల్ల నట్ల పోయిరి కాలనియతి గడవ నెవ్వరికిని శక్యం బగునే యనిన విని గోపకపాయితంబు లగుతారకంబు [1]లుద్వృత్తంబులు సేయుచు నత్తపోధనసత్తముండు. 32

క. కౌరవకులమున మిథ్యాచారుఁడ వై త్రుంచి తకట శక్తుఁడ వయ్యుం
గేరిమి మైఁ జేయవ పాం, దారఁగ నిక్కిల్బిషమున కంతటికిఁ దగన్. 33

వ. ఘోరప్రకారం బగుశాపంబు నీ కిచ్చెద ననిన నచ్యుతుం డామునితో నామాటలు దేటపడ విని తగినయట్లు సేయుదుగాక యని పలికి యి ట్లనియె. 34

చ. కినియుట మాను మేలె మునికిం గుపితత్వము శాంతవృత్తి నా
యనునయ మాదరింపు విను మల్పతపంబులచేతఁ గోలుపో
దు నె మఱి యట్లుఁగాక యతిదుష్కర మైనతపంబు సంచితం
బనఁ దగుబ్రహ్మచర్యమును నాఱడిఁ బోవె కటా శపించినన్. 35

వ. అనిన విని యుదంకుండు శ్రీవత్సాంకు నవలోకించి. 36

క. అగుఁగాక నీవు సెప్పెడు, తగ వెయ్యది సెపుమ వినియెదం బోలిన నే
మగిడించెద శాపోన్ముఖ, మగుమన్మానసము ననుడు నల్లన నగుచున్. 37

చ. తమము రజస్సు సత్త్వము నుదంక మదీయవశప్రవర్తమా
నములు మరుద్వసుప్రభృతినాకిచయంబు మదుద్భవంబు స
ర్వమునను నేను నిల్తు సుఖవాసత నట్ల దగఁ జెంది నిల్చు స

1. గ. లఁ దిరుగం బెట్టుచు నత్తపో.

ర్వము విను మేన చూవె యపరంబు పరం బనఁ గల్గుతత్త్వముల్. 38

తే. ప్రణవముఖవేదములుఁ జతుర్వర్ణములుఁ జ
తుర్విధాశ్రమములును దత్సర్వకర్మ
జాతములును సమంచితస్వర్గమోక్ష
ములును మన్మయముల కాఁగఁ దెలిసికొనుము. 39

క. క్రతుపరులు నన్ను దగ సం,స్తుతించి ఫల మందఁ గంద్రు సోమయాజులు స
మ్మతిఁ బ్రాయశ్చిత్తంబులఁ, గృతాత్ము లగుదురు మదీయకీర్తనపరులై. 40

క. మానసు మదగ్రపుత్త్రిం,గా నెఱుఁగుము ధర్ముని జగద్రక్షకు న్న
యే నభిమతకాలములను, [1]మానితజన్మముల నొంది మనుజులఁ దపస్వీ. 41

క. భవవర్ధనవిలయంబుల, నవలీలన వరుస బ్రహ్మ యన విష్ణుఁ డనన్
శివుఁ డన నిర్వర్తింతును, భువనంబుల నేస చూవె భూరిమహిమలన్. 42

క. ధర్మంబుకలఁకఁ గాంచి య,ధార్మికులం బొలియఁ జేసి ధార్మికులను బే
రర్మిలి రక్షింతు నుచిత,కర్మాచరణముల నే జగద్ధితమునకై. 43

వ. అట్టివాఁడ నయి యుండియు నధర్మపరు లగుధార్తరాష్ట్రుల సత్యంతధార్మికు లగు ధర్మనందనాదులతోఁ గలుపుటకుం బలుదెఱంగులం బడితి నది దివ్యజ్ఞానదేదీప్యమాను లగుపారాశర్యప్రభృతిమునివరులచిత్తంబుల కెక్కె నక్కౌరవులు దమ దౌరాత్మ్యంబున మాహాత్మ్యవంతు లగునాకౌంతేయులం దొడరి ధర్మసమరంబున సమసిరి నాచేసినపని యిట్టిది నన్ను నుదంక నీ వింక నే మనియెద వను మని పలికిన నతండు వినతుం డగుచు ని ట్లనియె. 44

ఉ. ఇప్పుడు నీమహామహిమ యేర్పడ సమ్యగనుగ్రహంబునం
జెప్పినయీసమంచితవిశేషము లెల్ల నెఱుంగుదున్ మదిం
గప్పినయీదురాగ్రహపుగర్వము నీ వొసఁగంగ నాకు ముక్
చొప్పడియెన్ సుధాసదృశసూక్తులఁ దేర్చితి వీవ యచ్యుతా. 45

వ. అని వెండియు. 46

ఆ. అతుల మైననీదయామహిమకు నేను, బాత్ర మగుదు నేనిఁ బద్మనాభ
యనుపమానతావకాకృతిఁ జూపవే, నాకుఁ జూడ్కియును మనంబు నలర. 47

### కృష్ణుఁ డుదంకునకుఁ దనవిశ్వరూపంబుఁ జూపుట.

చ. అనుడు దయాళుఁ డైనహరి యర్జునుచూచినదివ్యమూర్తిఁ జూ
పినఁ గని సంప్రమోదమును భీతియు విస్మయముం బెనంగొనన్
మునిపతి పాణిపద్మములు మోడ్చి నమః పురుషోత్తమాయ తే
యనుచు వినీతి నమ్ర మగునంగము నివ్వెఱ నిశ్చలంబుగన్. 48

వ. ఒక్కింత నిలిచి నిభృతస్వరంబున. 49

సీ. పుండరీకాక్ష యీపుడమి యంతయును భ, వత్పాదపంక్తిసంవ్యాప్త మయ్యె
నంబరం బెల్లను నావృత మయ్యె నీ,మహితసముజ్జ్వలమస్తకముల
నంతరిక్షము దావకాద్భుతకుక్షి దే,శంబులచేత సంఛన్న మయ్యె
భవదీయమహనీయబాహార్గళానిచ,యాపిహితము లయ్యె నన్నిదిశలు

తే. బహుచరణముల బహుశిరోభాగములను
బహుజఠరముల బహుభుజాప్రకరములను
దేవ యిట్లు సర్వంబును నీవ యైత
నర్చి తిది నాదుకన్ను మఱనంబుఁ దనిపె. 50

వ. విశ్వరూపా యీరూపం బుపసంహరించి నీ దగునెప్పటియాకారంబు గైకొనవే యనిన నప్పరమేశ్వరుండు వరంబు గోరు మని యానతిచ్చిన నమ్మహాత్ముండు సంశ్రితార్తిహర నీమూర్తిఁ గంటి నింతకంటె మిక్కిలివరంబులును గలవే యనుటయు. 51

క. ఆదేవుఁ డతనితో నట్టు, గాదు ననుం గనుట శుభము గావింపక పో
దేది ప్రియ మడుగు మిత్తుఁ బ్ర,మోదంబుగ నీకు ననిన ముని యిట్లనియెన్.

వ. అవశ్యంబును నాకట్లు గావలయు నని యవధరించితేని దేవా యిది మరుదేశం బిచ్చట జలంబు దుర్లభంబు నాకు జలసన్నిధి యెప్పుడుం గలుగఁ బ్రసాదింపుము. 53

క. అనుటయు నంబుజనాభుఁడు, దనయెప్పటిలలితమూర్తి ధరియించి మునీం
ద్రునితోడ నన్నుఁ దలఁపఁగ, ననఘా దొరకొను జలంబు లని పలికి తగన్. 54

వ. వీడ్కొని చనియెం బదంపడి యాభృగువంశవరుం డొక్కెడ మెలంగు చుండి తృషితుం డయి హృషీకేశుం దలంచిన. 55

సీ. కుక్కలు సుట్టి రా నొక్కమాతంగుండు, బాణబాణాసనపాణియును ది
గంబరుండును మలినాంగుండు నగువాఁడు,దోఁచె నచ్ఛజలంబు దొరఁగుచుండు
మేనితో నమ్ముని వానిఁ దప్పక చూడ, వాఁ డోయుదంక యివ్వారి డప్పి
వోఁ ద్రావు మనుడు నాభూసురాగ్రణి యొల్ల,నని పల్కెఁ బల్కెనవినుము నీవు

ఆ. నీరువట్టు శ్రమముఁ గూరిన నీమీఁది,కరుణ వచ్చినాఁడఁ గాదు నాక
యర్థిఁ ద్రావు టొప్పు నని యె నాచండాలు, నలుక మెయి నదల్చెన తపస్వి. 56

వ. అదల్చిన నతండు సారమేయంబులుం దాను నంతర్ధానంబు సేసె నాసంయమి వెఱఁ గుపడియొక్కింతవిచారించియిక్కపటప్రచారంబు కృష్ణసంపాదితంబుగావలయు నని యూహించుసమయంబున నయ్యెడకుం కృష్ణుం డరుగుదెంచుటయుం గనుంగొని యమ్మహాత్మునితోడ నమ్మునివరుండు. 57

క. జలము నినుఁ దలఁపఁగా నిటు, గలుగునె చండాలునొడలఁ గాఱెడునీ రే
నలఘుగుణ త్రావుదునె యే,కొలఁది శ్రమం బైన వరము గుచ్ఛిత మయ్యెన్.

చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్టు లను నాఱడిఁబోయెఁ బ్రయత్న మెల్ల నీ
వనఘ యెఱుంగవైతి సమయం బొకఁ డిమ్మెఱుఁ గల్గె నేర్పడ
న్వినుము నిలింపవల్లభుని నీకయి వేఁడితి నే సుధారసం
బనితరసాధ్య మైనశుభ మయ్యెడుభూతి నొలంగ సక్కటా. 59

వ. అది యె ట్లం టేని. 60

క. ఏను సుధ యడుగుటయు హరి, మానవులకు నేల యగు సకానుర్త్వము మే
లైన తెఱఁ గొండు గోరుము, దానిం దగ నిచ్చెదక మునిదం బొనఁగన్. 61

వ. అనిన నయ్యనిమిషపతియానసనం బాలోకించి. 62

క. నిను వేఁడుట మోఘముగాఁ, జను నే యెట్లన నాఁకుచసాపు సంపు న
మ్మునిపతికి నమృతరస మి, మ్మని ప్రార్థించిన మహాత్మ్య యిదియాతెఁడు నాలోకన్. 63

వ. సమయంబు సేసికొని వచ్చె నత్తెఱం గాకర్ణింపు మస్మద్ధిత సౌజన్యగన్యుండను. 64

శా. మాతంగత్వము దాల్చి నే నరిగి సత్వమ్మానించి యూఘ్రాన్తవృం
ప్రీతుం జేసెద నట్టు లిచ్చిన సుధక్ హీనదూషితస్వాంతుఁ డై
యాతం డొల్లక యున్న నేమి విను నా కన్యాయ్యవృత్తంబు గా
దీతంత్రంబున కీవ సాక్షి యని తా నే తెంచె నిక్ గానఁగన్. 65

వ. నీవు ప్రత్యాఖ్యానంబ చేసిన నతం డంతర్ధానంబు సేసెం గావున్ము దాని కేమి
సేయ వచ్చు నా యిచ్చినవరంబు బొంకు గాకుండ నీకు జలం బెప్పుడుం గలుగం
జేసెద. 66

చ. అనఘ జలంబు నీవలసినప్పుడ మేఘము లీమరుస్థలం
బున నొసఁగుక్ భవద్యశము పొంపిరివోవ నుదంకమేఘనా
మనుతవిహారముల్ గలిగి మాన్యత నెప్పుడు నియ్యెడం జరిం
చును జలదంబు లింక నను సువ్రత దూఱకు పోయివచ్చెదన్. 67

క. అనినం బ్రీతుం డయ్యెను, ముని యంతర్ధానకలనమునఁ గృష్ణుండుం
జనియె నని చెప్పి మఱియును, జనమేజయనృపతితోడ సంప్రీతిమెయిన్. 68

వ. వైశంపాయనుం డి ట్లనియె. 69

ఆ. మనుజనాథ యెప్పుడును మరుదేశంబు,నందు నియతవృత్తి నద్భుతంబు
దలకొనంగ నయ్యుదంకమేఘంబు లొ,క్కొక్కపుణ్యతిథులనొలసి కురియు. 70

వ. అనిన విని జనమేజయుండు మునీంద్రా యుపేంద్రుని శపించుటకు నుత్సహించిన
యుదకుం డేమివిధంబుతపంబున నమ్మహానుభావంబు నొందె నెఱింగింప వే యనుడు
నావిభునకు వైశంపాయనుం డి ట్లనియె. 71

జనమేజయునకు వైశంపాయనుఁ డుదంకునిచరిత్రంబు సెప్పుట.

సీ. అతనికి గురుభక్తికతనఁ జొప్పడియెన, త్తెఱఁగు పెంపదివిను తెలియ నతఁడు

దనగురుం డైన గౌ।తమునకు శుశ్రూష, నియతిమైఁ జేయ స।స్నేహభక్తి
కంబుగఁ బెద్దయుఁ।గాలంబు సనిన నా,సంయమిపతి శిష్య।సమితి కెల్ల
వివిధవరము లిచ్చి । వీడ్కొల్పి పుచ్చి యు,దంకునిదిక్కును । దలఁపకుండె

ఆ. నత్తపగపరాత్ముఁ । డతినిష్ఠఁ బరిచర్య, నడపు చొక్కునాఁడు । గడునువ్రేఁగు
గలుగునట్టివంట।కట్టియమో పట్టు, గుదియ మోచి తెచ్చెఁ । గురువరేణ్య. 72

క. అట్టు మోచి తెచ్చి యం దొక,జట పెద్దయుఁ దగిలి యుండ । సరభసముగ వై
చుటయుఁ దెగి మోపుతో ముం,దట నది పడియెనుజరాసి।తచ్ఛవి మెఱయన్. 73

సీ. దాన నన్నియతుండు । దనవయఃపాకంబు, నెఱిఁగి శోకంబున । నేడ్వ నమ్మ
హాముని యశ్రువు । లంజలిఁ బట్టంగ, నిజపుత్త్రిఁ బనిచె స।న్నిరజాక్షి
రయమునఁ బట్టి క।రంబులు వేఁడిమి, నెరిసిన విడిచిన । ధరయుఁ దలరె
నమ్ముని యాశిష్యు । రమ్మని చేరంగఁ, బిలిచి నీ వేటికి । నలఁతఁ బొందె

ఆ. దనిన నతఁడు శిష్యు । లందఱపైఁ గల,కరుణ మీకుఁ బెద్ద।కాలమేని
మునివరేణ్య నావ।లస లేద దానికి, నుమ్మలింప కెట్లు । లుండవచ్చు. 74

వ. అనుటయుఁ గృప చిగురొత్తుచిత్తంబుతోడ. 75

క. ఎలప్రాయ మిచ్చితిని నీ, కలఘుమతీ యిచ్చెదను మ।దాత్మజ నుల్లం
బలరఁగఁ బెండిలి గమ్మని, పలికి మఱియు నాతపస్వి।పతి యిట్లనియెన్. 76

క. నీతేజంబు సహింపఁగ, నీతామరసాక్షి దక్క । నెవ్వరికిఁ దప
స్స్ఫీతా శక్యము గా దిది, చేతోగతిఁ జూచి తగవు । సిద్ధించుటకై. 77

వ. ఇమ్ముద్దియకును. 78

క. తను వొండుగఁ జేసెద నది, జననాంతర మెట్టు లట్ల । సజ్జననుత నీ
వనుమానము దక్కుము యౌ,వనమును గైకొనుము కన్య । వరియింపు తగన్.

వ. అధర్మంబు గా కుండునట్లుగా వరం బిచ్చితి నని యనుగ్రహించి యక్కన్యకా
రత్నంబునకును. 80

చ. తనులత యొండు సేసిన న।దంకుఁడు యౌవనలక్ష్మిఁ దాల్చి య
వ్వనిత వివాహ మయ్యె నృప।వర్య పదంపడి యమ్మునీంద్రుతో
ననుఁ బని గొండు మీరలు మ।నంబున నెద్ది దలంచి వేడ్క సే
సిన నది దెత్తు మీకరుణఁ।జేసియ కల్గెడు నాకు శక్తియున్. 81

క. అని విన్నపంబు సేసిన, విని దక్షిణఁ బ్రీతి యగుట । వే ఱొరులకుఁ గా
కనఘ భవదీయచరితం,బునఁ జూవె నాకు ననియె । ముని మనుజేంద్రా. 82

తే. అంత నిలువక మునిపత్ని । కతఁడు భక్తి, నెఱఁగి తల్లి మీ రానతి।యిండు మీకు
వలయునట్టిపదార్థ మ।వశ్యమును స,మాహరింతు నే ననుటయు । నయ్యహల్య.

చ. వలవదు లాఁతివాఁడవె భ।వద్గుణతోషితగౌతమాంచితో
క్తులు మది నూఁదు మన్నను న।కుంఠితచిత్తత నొత్తి పల్కె న

య్యలఘుతపస్వి యాసతి ప్రియంబున మిత్రసహాఖ్యు దేవికుం
డలములు దెమ్ము నాకుఁ బ్రకటంబుగఁ బెంపు వహింపు మమ్ముఁడా. 84

వ. అని యిట్లు పనిచిన నాతండు ప్రీతుం డగుచు నప్పనికిం జనియెఁ బదంపడి గౌతముం డుదంకునిం బొడగానక యెచట నున్నవాఁ డని యహల్య నడిగిన నాభృగువంశవరుం డరిగిన తెఱం గెఱింగించిన నద్దేవి యాననం బాలోకించి. 85

క. ఆసౌదాసనరేంద్రుం, డాసురచరితుండు శాప సూతని సటగాఁ
జేసినయది మానుషమాం,సాసక్తుం డగు టెఱుంగఁ డమ్ముని యతనిన్. 86

సీ.[1] అకట యెట్లగునొక్కొ యనుపల్కు కృపదోఁప, బలికినసమ్ముగ్ధ భయముగొనుచు
నెఱుఁగ ని ట్లగుట మునీశ్వర నామీఁది,దయ చిగు రొత్త నాతనికిఁ గీడు
రా కుండునట్లుగాఁ జేకొని కావవే, యనిన నాసంయమి యను నెలవ
నేల యే నతనికి నెడరు రానీ నని, తగ నూఱడించె నుదంకుఁ డరిగి

ఆ. మనుజరక్తసిక్తతనువును గోరమీ,సములు వృత్తలోచనములు నైన
యుగ్రమూర్తితోడ నొక్కశూన్యాటవి, నెలమి నున్నయన్నరేంద్రుఁ గాంచె.

క. ముని యట్లు నెమ్మిఁ గాంచినఁ, గని యతఁ డాఁకొనుటఁ జేసి గాసిలి యెచ్చోఁ
గనువాఁడనొ తగుభక్ష్యం, బనుచుండఁగ వచ్చితివి ప్రియంబుగ ననుమున్. 88

వ. ఉదంకుం డతని కి ట్లనియె. 89

క. గురుకార్యంబునకై భూ,వర నిన్నుం గాన నేను వచ్చితి గుర్వ
ర్థరతులు హింస్యులు గా రి, ట్లరయక యాఁకటఁ దయధర్మ మగుమాట నృపా.

వ. అనుటయు. 91

క. దినమున మూఁడవయామం, బునయపరార్థంబు యోగ్యముగ నాహారం
బునకుం గల్పించిరి నా, కనిమిషు లటు గాన మాన నాఁకలి నుత్తున్. 92

సీ. అని పల్కె సౌదాసుఁ డమ్ముని యిట్లని, నధిప మద్గురుకార్య మాచరించి
వచ్చెద మగుడ నవశ్యంబు నామాట, నసృతంబు సొరదు సీ వర్థికోటి
కిష్టపదార్థంబు లిత్తు పాత్రమ యేను, గురులకుఁ గాఁగ నాకోరుకోర్కి
నీవ తీర్తని కృతనిశ్చయత్వంబున, నరుగుదెంచినవాఁడ ననుడు నృపతి

ఆ. యట్ల కాక యేమి యర్థించి వచ్చితి, చెప్పు మనిన నతఁడు చిత్త మలర
ననఘ నీమపత్ని యర్థిమై ధరియించు,కుండలంబు లని యతండు సెప్పె. 93

---

1. 'వ. అక్కట యె ట్లయ్యెడునే యనుచుం బలికిన నమ్ముద్దియ భయంబు గొనుచు.
సీ. ఎఱుఁగ ని ట్లగుట... మనుజాశిరక్తంపుఁ♦దనువును గోరమీ,సములును వృత్తలో♦చనము లైన
ఆ. యుగ్రమూర్తితోడ♦ నొక్కశూన్యాటవి, నెలమి నున్నయన్న♦రేంద్రుఁ గాంచె
ఘోరవికృతభయద♦ఘూకవిరావ మై, ప్రచుర మైనకోప♦రాశి యనఁగ.''
యని పాఠాంతరము కొన్నిటఁ జూపఁబడి.

వ. చెప్పిన విని యమ్మనుజవరుం డొరులధనం బిచ్చువారలుం గలరె కుండలంబు లడుగ కొం డెద్దేనియు నడుగు మనుటయు నాసంయమి నీవు నెపం బిడి త్రోవం గలవాఁడవు గా వే నన్యవస్తువు లొల్ల నని పలికిన నాభూవల్లభుం డమ్మాట కియ్యకొని యన్నాతి యున్నచోటికిం జను మేఁ బుత్తెంచితి నని చెప్పి నీవాంఛితం బెఱింగింపు మని నియోగించిన నమ్ముని యద్దేవి యెచ్చోట నున్నయది యని యడిగిన నప్పుడమిఱేఁ డల్లదె తన్నివాసప్రదేశం బని చూపినం బోయి. 94

సీ. అద్దేవిఁ గని యతం డట్ల చెప్పిన ముని,వల్లభ నా కానవాలు దెమ్ము
నృపుపాల ననియె న న్నెలఁత యుదంకుండు, ననుదెంచి విభు నభిజ్ఞాన మడిగె
నాతెఁ డీగతి సేమ మగు నని నిషింపఁ,గా దిది వెలి గాఁగ లేదు వేఱ
గతియును ననుపలు కతివకు నాయిచ్చు,వర్ణితాభిజ్ఞాననిర్ణయముగఁ

ఆ. జెప్పు మనిన సంతసిల్లి యమ్మదయంతి,కడకు నరిగి తత్ప్రకారమునన
పలుకుటయును భర్త పనుపున నిచ్చెదఁ, గుండలములు నీకు గురుహితార్థి. 95

వ. అని యక్కొన్క యమ్మహితాత్మునితో మఱియును. 96

సీ. సురలు గంధర్వులు నురగులు నిక్కుండ,లములకుఁ బెక్కుపాయముల వేచి
తిరుగుదు రెంగిలి వారసిన నేమఱి, నీవు నిద్రించిన నేల నిడిన
నపహరింతురు భక్తి నర్చించి యివి దాల్ప, నాఁకలి నీరువ ట్టగ్నిభయము
విషవికారము భూతవేతాళబాధలు, వొరయవు వినుము బాలురకు నైనఁ

ఆ. బెద్దవారి కైనఁ బెట్టిన నయ్యాయి,కొలఁది నమరి యుండుఁ గురియుఁ బసిఁడి
వీని నప్రమత్తవృత్తిమైఁ గొని చను,మయ్య గురులు నిన్ను నభినుతింప. 97

—ఉదంకుండు మదయంతివలనఁ గుండలంబులు పుచ్చికొనుట.—

వ. అని చెప్పి యప్పరమపతివ్రత భక్తిప్రీతివినయంబులు మనంబున నంకురింప నుదంకునకు నక్కుండలంబు లొసంగినం బ్రమోదం బెసంగ నాశీర్వాదంబు సేసి యాసంయమివరు డబ్బామచేత నామంత్రితుండై భూమీశ్వరుపాలికి వికాసలసితవదనారవిందుం డగుచు నేతెంచి యక్కుండలలాభంబు ప్రకటించి దీవించి దేవా నీవలనం గృతార్థుండ నైతి నని పలికి నా కానవాలుగా నీవు సెప్పినవాక్యం బత్యంతగూఢంబు తదభిప్రాయంబు నెఱుంగ వలతుం జెప్పం దగి యుండునేనిం జెప్పు మని యడిగిన నతం డతనితోడ. 98

సీ. బ్రాహ్మణజనముల రాజులు పూజింతు, రటు గాన యేను విప్రార్చనంబు
సేయుదు విప్రునిచేతన యిట్లైతి, వెడదప్పు నన యొండువెరవు నాకు
దురితంబు వాపంగ దొరకొన దది కారణముగ భూసురపూజనంబు దుష్క
రము దీన మేలు గంకదు మనంగ రా దిది, గా దన్న వేఱొండు గలదె మార్గ

తే. మని యభిజ్ఞానముగ మదయంతి చెప్పుడు, చెప్పె నుచ్చితి నిట్లు వినఁజెప్పి తన్న
మయమహాకుండలము లిచ్చె మాన్యుఁ డగుచు, నీకతమున ననుతలఁపు నెఱిఁగి నవద్య. 99

వ. అనిన నా భృగువంశవరేణ్యుని పుణ్యాసన్నిధిం జేసి యా సౌదాసునకుఁ బ్రసన్న
[1]సంప్రాప్తసమాధానసూతసత్త్వంబు గలుగుటకతంబునం గాన్యదర్శనంబును
గుండలదానశ్రద్ధయు శాంతవచనంబునుం గలిగెఁ దదీయవచనశ్రవణానంత
రంబ యుదంకుం డతనితోడి మిత్రత్వంబు సంభాషణమాత్రసిద్ధం బగుటం బోధ
వృద్ధులు సెప్పుదు రేను నీవలనం గృతార్థుండ నైతిఁ బోయివచ్చెదఁ జనుగిడి
వచ్చెద నని పలికితి బోంకు వడ కుండ వత్తు ననినఁ గృతార్థుం డయ్యె నట్లు గాఁ బగు
చుండ నాభూపతి యత్తాపసోత్తమునానసం బాలోకించి. 100

ఉ. చంపెడునట్టినాకడకు సంయమివల్లభ నట్టిరయ్యు నీ
పెంపున నిక్కముం దెలిసెఁ బ్రీతుఁడ నైతి నుదారకీర్తి సౌ
స్సంపదఁ జేసి పాపు మని సంస్తుతిఁ బల్కి నవీనులంబుగాఁ బె
రిం బోలయం బ్రసన్నత వరించఁగఁ బుత్త్ర ముదంకుఁ డట్లనున్. 101

ఉ. ఏమిట నైన నొప్పమి నరేంద్ర సుచిత్తులఁ బొందనేనియుఁ గా
వే మరలుఁ భవద్గుణము వీతకళంకునిఁ జేసె నిన్ను సాం
ద్రామలకీర్తి గౌతమమహాముని నల్లనిచిత్తవృత్తి నీ
పై మలఁగించెఁ గావలయుఁ బార్థివసత్తమ పొందు మున్నటిన్. 102

క. అని పలికి మఱియు బలుదీవన లిచ్చి యతండు గారవమున నతని మో
దనకరముల నివిరి ప్రియం, బొనర్చె నిర్గరితుఁ డైనయుర్వీపతియున్. 103

వ. భక్తివినయసంభరితుం డయి యప్పరమమునిం బ్రస్తుతించి నమస్కరించి
యామంత్రణంబు సేసిన నమ్మహాత్ముండు కుండలంబులు కృష్ణాజినంబునం బది
లంబుగా ముడిచికొని గౌతమాశ్రమంబునకు రయంబునం బోయిపోయి పక్వ
ఫలంబులం బెరిఁగినబిల్వంబుం గని యాఁకటి పెల్లునం దదీయవిటపంబున
సకుండలం బగునయ్యజినంబు దగిల్చి యమ్మహీరుహంబెక్కి ఫలంబులు గోసి
కొను చుండె. 104

సీ. గాలి నవ్విటపమార్గలోల మగుడుఁ దగు, లెడలి యయ్యజినంబు పుడమిఁ బడినఁ
గని యొక్కనాగంబు గ్రక్కునఁ జనుదెంచి, వెసఁ బుచ్చికొని కడుఁ వేగ పఱవఁ
గాంచి యుదంకుండు గ్రమ్మన దిగదాఁటి, వెనుకొనునంతకుఁ గనపపుట్టఁ
జొచ్చెనయ్యురగమార్గసువ్రతపరుఁడుతీ, వ్రముఖకాష్ఠముగొనిక్రన్నఁ దోడఁగ

తే. దాని సైరింపఁ జాలక ధరణి దలరె, విప్రుఁడై వచ్చి గీర్వాణవిభుఁడు గొయ్య
కోలఁ ద్రవ్వినమాత్రఁ బాతాళయాన, మేల సిద్ధిప నేర్చు మునీంద్రవినుము.

వ. పాతాళభువనం బిచ్చటికి [2]సహస్రయోజనంబుల నున్నది కుండలంబులు గొని

1. క. సంప్రాప్తసమాధానసత్త్వంబు. 2. గ. చ. జ. సహస్రయోజనంబు లగు నది.

పోయినభుజంగం బైరావతాపత్యం బనిన విని యమ్మునిశిష్యుండు. 106

క. పాతాళంబున నున్నను, వే తెత్తుం గుండలములు విను మప్పని నా
చేతం గాకున్న నను, వ్రతము విడువంబడు నిది ధ్రువం బని పలికెన్. 107

చ. పలికిన సత్తపస్విదృఢభావ మెఱింగి సురేంద్రుఁ డొండుప
ల్కులపని నిల్పి కాష్ఠమునకుం గులిశంబునఁ గల్గువాఁడియుఁ
బలువును నిచ్చి వజ్రి సనె బాంధవ మేర్పడఁ జెప్పి భీతిమై
నిల పెరు విచ్చె నమ్మునియు నేర్తెఱఁ జొచ్చె భుజంగలోకమున్. 108

వ. చొచ్చి యనేకప్రకారప్రాకారపరిరక్షితంబును బహురత్నదీప్తిజాలదేదీప్యమానంబును నైనయమ్మహనీయలోకం బాలోకించి దశయోజనాయామంబునుం బంచయోజనవిస్తారంబును నగుతద్ద్వారంబు గని యతండు కుండలాహరణంబు దుర్లభం బనుతలంపున డిల్లపడియె నయ్యెడ నరుణవదనంబును నసితాంగంబును సితవాలంబును నై వెలుంగుతురంగం బతని కిట్లనియె. 109

ఉ. ఆతత మైసనాదగునపానము నూఁదు మొకింతయుఁ జుగు
ప్సాతురవృత్తి నీదుహృదయంబునఁ జొన్పకు లోకవంద్యుఁ డ
గ్గౌతమునాశ్రమంబున నఖండితభక్తి నుపాస్తి సేసి నన్
బ్రీతునిఁ జేసినాఁడవు వరిష్ఠతపోధన యట్లు గావునన్. 110

వ. నీకుం బొడసూపి యైరావతసుతుం డపహరించినసమంచితకుండలంబులు మగుడం జేరెడునుపాయం బుపదేశించితి ననిన నుదంకుం డేను నిన్ను నెఱుంగ నుపాసించుట యెట్లు గలిగెఁ దెలుపు మనుడు నయ్యశ్వం బతనితోడ భవద్గురునకు గురుండం బావకుండ నీవు శుచివయి సభక్తికంబుగా నిత్యంబును నన్ను నియతిం బూజించి తత్తెఱం గెఱుంగవే యని పలికినం బ్రీతి నొంది యతండు తదీయోపదిష్టప్రకారం బాచరించిన. 111

సీ. ఘోటకోత్తమరోమకూపంబులం దెల్ల, నొక్కట ఘనధూమ ముద్గమించి
కవిసి పాతాళలోకం బంతయును గప్పె, వాసుకిప్రభృతినివాసభూము
లుపరుద్ధభావంబు నొందె నైరావతా,వాసంబు హాహారవంబుతోడ
నాకులం బయ్యె నట్లతిదారుణం బైన, పెనుఁబొగ నెంతయు భీతి నొంది

ఆ. యమ్మునీంద్రుకడకు నహివరుల్ రయమున, వచ్చి భక్తి నర్చ లిచ్చి వినతు
లై తదీయకార్య మడిగి యెఱింగి వే, తెచ్చి కుండలంబు లిచ్చి రధిప. 112

ఉదంకుండు గుండలంబు లిచ్చి యహల్యను సంతోషపఱచుట.

చ. అతఁడును వారిఁ బోఁ బనిచి యగ్నికి భక్తిఁ బ్రదక్షిణంబు సే
సి తగ నమస్కరించి విలసిల్లఁగఁ దేజము ప్రీతచిత్తుఁ డై
యతలము నిర్గమించి రయ మారఁగ వచ్చి యహల్యఁ గాంచి తె
చ్చితి నివె కుండలంబు లని చే నిడి భూస్థలిఁ జాఁగి మ్రొక్కినన్. 113

తే. ఆయమయు గౌతముండు నత్యాదరమునఁ, గౌఁగిలించుచు దీవించి గారవింప
నతఁడు నమ్మునిపతికిని నయ్యమకును, బెక్కుమాఱులు భక్తిమై మ్రొక్కి నిలిచి.

క. మీకరుణఁ గాక తగునె యి, నీకుండలములు పరిగ్రహించుట సహసమ్య
వైకృత మొలసినఁ దలఁగుట, నాకొలఁదియె యనియు వినయసమగ్రుం డగుచున్.

వ. అనిన విని వార లత్యంతసంతుష్టాంతరంగులై రగ్గౌతముం డతని కిట్లనియె. 116

ఉ. నీచరితంబు చిత్రమహనీయము మిత్రసహక్షితీశ్వరు
నీచతఁ బాప నాగ మపనీతము సేసినకుండలద్వయం
బాచతురత్వ మాబలిమి యాదృఢనిశ్చయ మట్లు లొప్ప గ
ర్వోచితలీలఁ దేర నొరుఁ డోపునె యేను నిజంబ పల్కితిన్. 117

వ. అనియె నయ్యుదంకుం డట్లు దనమహాతపంబుబలిమిం బరాక్రమించి యనన్య
సులభంబు లగుకుండలంబు లాహరించి గురుజనమనోరథసిద్ధిం గావించె నా
భృగువంశమహోత్తరుమహానుభావం బట్టిదని విని జనమేజయుం డప్పుణ్యాత్మునకు
వరంబొసంగి చనినవాసుదేవునంతరవృత్తాంతంబు మునిసత్తమా యెఱింగింపవే
యని యడిగిన నవ్విభునకు వైశంపాయనుం డిట్లనియె. 118

సీ. ఆభార్గవోత్తము నట్లు వీడ్కొని కృష్ణుఁ, డరిగి యలంకృతమైననిజపు
రము సొచ్చునప్పుడు రైవతకాచల, యాత్రామహోత్సవ మఖిలజనులుఁ
గొనియాడుచుండి యగ్గోవిందుసందర్శ, నంబున నుత్సవాసక్తభావ
మిమ్మడియై ప్రమోదమ్మునం దేలి ర, ద్దేవదేవుఁడు వసుదేవుఁ గాంచి

తే. దేవకీదేవి బలభద్రదేవుఁ దక్కఁ, గలుగువృద్ధబాంధవులను గని వినీతిఁ
దత్తదుచితమనోజ్ఞవిధానమంచి, తాచరణములు పడెఁ బ్రియం బెలర్ప. 119

వ. వార లందఱకు ధర్మనందనుచెప్పినచొప్పునఁ బ్రణామాదియోగ్యోపచారంబు
లాచరించె ననుజతనుజామాత్యభృత్యులు దన్నుం గనినం బ్రీతివాత్సల్యసంభా
వనాబహుమానంబులు మెఱయ నాదరించె సాత్యకిసుభద్రలం దగుకొఱంగులం
దగినవారలం గానిపించె నట్లు సకలజనప్రమోదావాదియైనదామోదరు నత్యంత
సమీపాసీనుం జేసికొని వసుదేవుండు భారతరణప్రకారంబు యాతాయాతజనం
బులచేత వింటిం బ్రస్ఫుటంబుగా విన వలతుం జెప్పవే యని యడిగిన నచ్యుతుం
డతని కిట్లనియె. 120

క. అది యతివిస్తారము పెక్కుదినంబులు సెప్పఁ బట్టుఁ గొంత దగం జె
ప్పెద నేఁ బ్రధానపురుషస, ముదయసమరవిధము లఘుతరోక్తులఁ దెలియన్.

సీ. కౌరవసైన్య మేకాదశాక్షౌహిణీ, కలితంబు దానికిఁ గర్త వీర
పట్టంబు భీష్ముఁ డాప్రభువున కెదు రొడ్డి, రలమిమైఁ బాండుపుత్త్రులు శిఖండి
నక్కడ సప్తసంఖ్యాక్షౌహిణీక మ, నీక మిమ్మాడ్కిఁ బన్నినబలద్వ
యంబును ఖేచరు లచ్చెరువడఁ బోరెఁ, గాండీవి దోడ్పడఁగా శిఖండి

తే. యన్నదీనందనునిఁ బదియవుదినంబు, నందుఁ గూలిచె నుత్తరాయణము వచ్చు
నంతకును మృతిఁబొందక యాతఁ డుండె, నధిప శరతల్పములఁ గడు నద్భుతముగ.

క. గురుఁ డైదుదివసములు ని,ర్భరసమర మొనర్చి నవనిఁ బరిమార్చఁగ నా
వెరవున నర్జును ప్రాపున, దొరకొనియె హుతాగ్నిభవుఁడు ద్రుపదసుతునకున్.

క. గండున రాధాతనయుఁడు, రెండుదినంబులు పెనంగి గ్రీష్మసమయసూ
ర్యుండుం బోలె వెలింగెడు, గాండివధరుశరకరోష్మఁ గ్రాఁగె నరేంద్రా. 124

చ. విను మఱునాఁడు శల్యుఁ డతివిక్రమతన్ సమరం బొనర్చి య
ద్దినము సగంబు సెల్లఁగ యుధిష్ఠిరుచేఁ దెగుడున్ బలంబు గై
కొని యని సేయఁగా శకునిఁ గూల్చె వడిన్ సహదేవుఁ డంతతో
మనమునఁ జీవ దక్కి తనమానము డిగ్గఁగఁ ద్రావి హీనుఁ డై. 125

వ. దుర్యోధనుండు దనతమ్ముల భీమసేనుండు సంగ్రామంబునం దెగటార్చి యుండ భంగంబున కోర్చి పలపలనిమూఁక విడిచి గద చేతం గొని పాదచారి యయి యొక్కఁడునుం బాఱి యొక్కమడువు సొచ్చి నీళ్ళు (పాషాణమయము గా) మంత్రించికొని డాఁగియుండెఁ బాండవు లెఱింగిపోయి పొదివికొని మర్మభేదంబు లగుదూషణభాషణంబుల నొప్పించిన. 126

ఆ. అతఁడు మడువు వెడలి యనిలనందనుతోడఁ, దగఁ బెనంగి తద్గదావినిహతిఁ
దొడలు విఱిగి కూలి విడిచెఁ బ్రాణంబు లి,బ్భంగి జయముగొనిరి పాండుసుతులు.

క. గురుసుతుఁడు పాండుతనయశి,బిర మారే యడరి పొదివి భీషణవృత్తిం
బొరిగొనియెం గరిఘోటక,నరనిచయము నెల్ల నే మనం గల దధిపా. 128

వ. ఆరాత్రి యేనును బాండుసుతులు నచ్చట లేమి నంత పుట్టె నిట్లు పదునెనిమిది దివసంబులు సెల్లినసంగ్రామంబున నే మార్వురము సాత్యకియునుం దక్క మా దిక్కున సమస్తజనంబులు నస్తమించిరి కౌరవులదెస నశ్వత్థామకృపకృతవర్మలు మువ్వురు బ్రదికిరి యుయుత్సుండు మున్న పాండవుల నాశ్రయించుటం జేసి చావునకుం దప్పె నిది భారతరణప్రకారంబు. 129

క. అని చెప్పెఁ గాని యభిమ,న్యునిచా వేర్పడఁగఁ జెప్ప నొల్లఁడ వసుదే
వునకు వగ మిగులుటకు నె,మ్మనమునఁ దా నోర్వకునికి మాధవుఁ డధిపా. 130

వ. దాని నెఱింగి సుభద్ర గద్గదస్వరంబున గోవిందునితోడ నీయల్లుం డభిమన్యుండు దెగుట మీతండ్రికిం జెవు లారం జెప్పు మన్నా యని వసుదేవుండు వినం బలుకుచుం బుడమిం బడిన వసుదేవాదియాదవజనంబులు మనంబులం గదిరినక్రొత్త నెవ్వగలం బలవించినం బద్మనాభుండు వారల నెల్ల నూరార్చి వారణపురంబున సుభద్రయు నుత్తరయు నభిమన్యునిదెస నెత్తినశోకంబున నాకులత్వంబు నొందినచందంబును గొంతి దగుమాటల వారిఁ దేర్చిన తెఱంగును నెఱింగించి పాండవు లేవురును వేర్వేఱ యభిమన్యునకై మఱి కాంచనగవాదివస్తువులు

విప్రప్రకరంబులకొసంగుటయు మఱియుం దటాకకరణాదిధర్మంబు లాచరించుట
యునుం జెప్పి మఱియు దురంబునం బెరలక సుగలకీర్తి యోధాగ్రణులు రౌద్ర
మూర్తులై దుర్యోధన ద్రోణ కృప ప్రాణి కృతవర్మ కర్ణాదివీరవ్రాతంబుఁ
గలంచి యనేకనృపలోకంబు యమలోకంబునకనిచి యనివిముఖులుగాక యుత్త
మలోకంబున కరిగి సుఖులై యున్నవారు వారికి వగవ నేల యనియుం బలికి
యిట్లుపశాంతి గావించి. 131

ఆ. బంధులోకమునకుఁ ✽ బరమప్రియం బైన, యుచితవర్తనమున ✽ ననుగుడఁ గృష్ణుఁ
డని సవిస్తరంబు ✽ లగువాక్యములఁ బ్రీతి, నిగుడఁ గోర్కె నిట్లు ✽ సప్పు మఱియు.

వ. కరిపురంబునం బుట్టినవిశేషంబులు విను మని పలికె వైశంపాయనుండు జనమేజ
యున కిట్లనియె. 133

వ్యాసుఁడు పాండవుల నశ్వమేధయాగోన్ముఖులఁ జేయుట.

సీ. చుఱచుఱఁ దనచెవుల్ ✽ సూఁడినయట్లుగ, నభిమన్యునం స్తుతి ✽ నైనవాక్య
యము ప్రసంగాధీన ✽ మై బంధుజనులందుఁ, బొడముటయును గృతి ✽ యుడలి తలరి
యుత్తర విలపింప ✽ నత్తన్వియలమట, గనుఁగొని పాండుసుం ✽ దనులు వసటఁ
గూరిన నచటికిఁ ✽ గారుణ్యమూర్తి వేదవ్యాసుఁ డేతెంచి ✽ తగినమాట

తే. లాడి వారలవగ మాన్చి ✽ యశ్వమేధ, విషయవిధులు ప్రసంగించి ✽ వేగఁ గొడఁగుఁ
డని నియోగించి వారెల్ల ✽ నట్ల కాక, యనిన నాతఁ డంతర్హితుం ✽ డయ్యె నధిప.

క. అన విని జనమేజయుఁ డమ్ముని యిట్లు హితోపదేశ ✽ ముం జేసినఁ బాం
డునృపాగ్రతనయుఁ డెమ్మెయి, ననఘ తొడఁగె నశ్వమేధ ✽ యాగంబునకున్. 135

క. అని యడిగిన వైశంపాయనుఁ డాతని కిట్లు లనియె ✽ నప్పుడు కుంతీ
తనయాగ్రజుండు దమ్ములఁ, గనుఁగొని యుత్సాహలక్ష్మి ✽ గనుఁగవ నొప్పన్. 136

సీ. వ్యాసమహాముని ✽ వత్సలత్వంబున, నానతి యిచ్చిన ✽ మాననీయ
వాక్యంబు వింటిరే ✽ వసుధ యిత్తఱి వసుహీన యై యున్నది ✽ దానఁ జేసి
భూదేవనిహితధ ✽ నాదాన మావశ్య, కం బయ్యె దానిక ✽ ర్తవ్యమును హి
మాచలయాత్రాస ✽ మాచరణప్రకారమును విచారణీ ✽ యములు గావె

ఆ. యనుడుఁ బవనతనయుఁ ✽ డతనితో నీశ్వరుఁ, బరమనియతిఁ గొలిచి ✽ కరుణ వడసి
ప్రమథగణము నెల్ల ✽ భక్తిఁ బూజించి య, త్తలమునందు భూత ✽ బలు లొసర్చి.

క. తెత్తము గాక నగేంద్రమ, రుత్తకలిత మైనదాన ✽ రూపము సుమహో
దాత్తస్థితి నున్నకనక, మిత్తఱి నిలదెసఁ దలంప ✽ నేటికి మనకున్. 138

వ. అప్పనికి సముచితసైన్యసమేతంబుగా దేవర విజయంచేయ వలయు ననిన
నర్జునుండును గవలును నట్ల పలికిరి దానికి ధర్మనందనుండు ప్రియం బంది
కృతనిశ్చయుం డయి ధృతరాష్ట్రుకడకుం జని యశ్వమేధయాగోపక్రమోత్సవ
శ్రవణంబునం బుత్త్రులం దలంచి శోకసంతాపసమాక్రాంతుం డయి యున్న

యన్నరపతిచరణంబుల కెఱఁగి వేదవ్యాసువచనంబులు గాంధారియు వినుచుండ
నతనికిం జెప్పి యతని నయ్యజ్ఞాచరణంబునకు ననుజ్ఞ వడసి యయ్యిరువురను
దండప్రణామపూర్వకంబుగా వీడ్కొని గొంతిపాలికిం బోయి సంతోషవికచ
వదన యయి యున్నయద్దేవి యధ్వరవిధానంబునకు ననుమతిసేయం దదీయ
పాదంబులకుం బ్రణమిల్లి తదామంత్రితుం డై యాస్థానమండపంబునకు నరు
గుదెంచి యుయుత్సు రావించి కార్యంబు తెఱం గెఱింగించి నీవు నగరరక్షకు డై
నిలువు మని నెయ్యం బలర విదురసమేతంబుగా నిలిపి బలంబుల సంఘటింపం
బడవాళ్లం బనిచి నియతుం డయి సురపితృపూజనంబులు దీర్చి మహేంద్రార్చనం
బొనర్చి మహితావధానుం డై. 139

క. నానావిధబహుళాంచిత, దానము లొనరించి యర్చితం బగునగ్నిన్
దానియధికారి ధౌమ్యుం, దాను బ్రదక్షిణవిధాయితం గొలిచి తగన్. 140

క. సితలేపనసితభూషణ, సితమాల్యసితాంబరములఁ జెన్నుగ సమలం
కృతుఁ డై సితాతపత్ర, ప్రతతి మెఱయఁ బూర్ణచంద్రుపగిది వెలుఁగుచున్. 141

వ. షోడశశ్వేతశ్వవ్యూఢరథారూఢుం డై. 142

క. భూదైవతదత్తాశీ, ర్వాదంబులుఁ బుణ్యగానరవములు రోదో
మేదురమంగళతూర్యని, నాదంబులుఁ జెలఁగ బుధజనస్తుతు లెసఁగన్. 143

చ. వెడలుడు నమ్మహీవిభునివేడ్క యెఱింగి వృకోదరుండుఁ గ
వ్వడియును బిన్నతమ్ములును వైభవ మొప్ప నలంకరించి యొ
క్కడు మెఱయం బ్రధానభటఘోటకదంతిరథప్రతానముల్
[1]దడిగలుఁ గుంచెలున్ గొడుగుతండములున్ విలసిల్ల వచ్చినన్. 144

క. కని యానృపుఁ డలఁతినగవు, నిను పారెడిచూడ్కి వారినెమ్మొగములపైఁ
దను పారుచుఁ బొలయం జనఁ, జన రాజులు గూడుకొనిరి సైన్యంబులతోన్. 145

వ. ఇవ్విధంబున నరిగి యక్కురువంశవరుండు సముచితప్రయాణంబుల గిరిసరిదరణ్యం
బులు గడచి హిమశైలంబు సేరి ధౌమ్యాదిపురోహితులఁ బురస్కరించికొని తదీ
యతలం బధిష్ఠించి యొక్కయుచితప్రదేశంబున విడిసె నట్టియెడ. 146

### వ్యాసుఁడు హిమవత్పర్వతంబున నున్నపాండవులకడకు వచ్చుట.

శా. బాలార్కద్యుతిపుంజపింజరజటాభారంబుఁ బ్రావృడ్ఘన
శ్రీలీలం బ్రహసించునంగమును రోచిస్స్ఫారదండంబు ను
న్మీలన్నీలమృగాజినాంబరము నై నిర్వాణదానక్రియా
శీలుం డై నపరాశరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁ డై. 147

వ. ఇట్లు సన్నిహితుం డయిన వేదవ్యాసమునీశ్వరునకుం బాండవులు పరమభక్తిం బ్ర
ణామపూర్వకంబుగాఁ బూజించి కర్తవ్యం బెయ్యది యాన తిం డనిన నమ్మాన

1. గ. చ. జ. 'దడి గుడిగుంచెలున్'.

చ. మఱియును సన్నిధిం గలస ♦ మంచితకాంచనరాశి బండులం
బెఱికల మోపులం గొలఁది ♦ వెట్టఁగఁ బెక్కుగుబారువుల్ జనుల్
వెఱఁగుపడంగ ఖేచరులు ♦ వెక్కస మందఁగ శత్రుకోటికిన్
నెఱి పొసరించువార్త పృథి ♦ విం బరఁగన్ నడపించె భూవరా. 157

ఆ. ఏరు నేలకొలఁది ♦ నెడనెడ విడియుచుఁ, బోవ వలసి యుండె ♦ భూరిభార
వహులడప్పి యెఱుఁగుక ♦ వాఁ డగునాథర్మ,నందనునకు ధరణి ♦ నాథవర్య. 158

వ. అంత నక్కడఁ గృష్ణుండు, 159

తే. ద్వారకానగరమునకుఁ ♦ దన్నుఁ బుచ్చు,నవుడు ధర్మజుఁ డశ్వమే ♦ ధాధ్వరంబు
సమయమగుట ప్రతీక్షించి ♦ సకలబంధు,యుక్తముగ రమ్మనిసమధు ♦ రోక్తియూఁది.

—కృష్ణుండు సకలబంధుసహితుండై కరినగరంబునకు వచ్చుట—

వ. అరసికొని యుండి యప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు సేయుట
చారులు సెప్ప నాకర్ణించి సతూహలోన్నిద్రుండై బలభద్రసాత్యకికృతవర్మ
ప్రద్యుమ్నచారుదేష్ణసాంబాదియాదవసమేతంబుగా వసుదేవదేవకీసమనుజ్ఞాతుండై
సుభద్రం దోడ్కొని కరినగరంబున కరుగుదెంచిన ధృతరాష్ట్రుండును గాంధా
రియు గొంతియుం బనుప నుత్సుకుండై యుయుత్సుండు విదురుం బురస్కరించి
కొని యప్పాంచజన్యధరు నెదుర్కొని పరమభక్తిం దోడ్కొని వచ్చిన. 161

తే. మున్ను ధృతరాష్ట్రుకడకు నా ♦ వెన్నుఁ డేఁగి
యతని గాంధారిఁ బ్రణతిపూ ♦ ర్వాతిమధుర
వాక్యములఁ బ్రీతి నొందించి ♦ వచ్చి గొంతిఁ
గాంచి ప్రణమిల్ల నద్దేవి ♦ గాఁగిలించి. 162

వ. పెక్కుభంగుల దీవించె బలదేవాదులుం దగిన తెఱంగున నప్పాండురాజమహిషిం
గని రక్కులపాలికాతిలకంబు పులకంబులం బెరిఁగిన మేనితో మాననీయచరిత్రుం
డగున ద్దేవకీపుత్త్రు సంభావించి. 163

క. ప్రమద మెసఁగ విదురుఁ బనిచి, సముచిత మగునర్చనంబు ♦ సంకర్షణపూ
ర్వము గాఁగ నడపి యదునిక,రమునర్చలు సంభృతాద ♦ రంబున నడపెన్. 164

వ. సుభద్ర దన్నుం గనినం బరమప్రియంబున గారవించి యభ్యంతరమందిరం
బునకుం బుచ్చెఁ బద్మనాభప్రభృతు లగునాబంధుజనంబు నెల్లను నగరిచేరువ
శోభిల్లుమందిరంబుల విడియింప యుయుత్సు నియోగించె నట్లయ్యెఁదఱు
నభినందితులై యున్నసమయంబున. 165

ఉ. ఉత్తరపుణ్యగర్భమున ♦ నుండి భవజ్జనకుండు పూరువం
శోత్తరుఁ డాదిరాజగుణ ♦ యోగి పరిక్షితుఁ డుద్భవించినం
జిత్త మెలర్పఁ బుత్త్రిఁ డని ♦ చెప్పిరి నెవ్వలివారి కింటిలో
నత్తఱి నున్నవృద్ధసతు ♦ లార్చె జనం బఖిలంబు నుబ్బునన్. 166

క. బాలుఁడు మృతజాతుం డని, యాలోనన యేడ్పు పెరయ నలమట నచ్చో
నాలలన లుగ్గడించినఁ, దేలిరి శోకమున జనులు ధీరవిచారా. 167

వ. అత్తఱి రోదనధ్వనులు గలయం జెలంగిన విషాదవేదనాయత్తంబు లయిన చిత్తాంగంబులతో శౌరి సాత్యకి యనుగమనంబు సేయ సత్వరంబుగాఁ గొంతి యున్నెడకుం జనుదెంచె నప్పు డాకుంతిభోజనందనయు ద్రౌపదియు సుభద్రయు నార్తనాదంబు లెసంగం దనకడకు రయంబున రా నేసారి నయ్యాదువీరుండు గాంచి శోకసమాకులమానసుం డయ్యె నప్పాండురాజపత్ని పురుషోత్తముతో డగ్గుత్తిక నెలుంగు దగుల నిట్లనియె. 168

పరిక్షిత్ప్రాణదానంబునకై కుంతీసుభద్రలు కృష్ణుఁ బ్రార్థించుట.

క. గతి నీవె నాకు మత్సం, తతికిని నీయల్లుఁ గుఱ్ఱ తనయుఁడు పుట్టెన్
మృతుఁడై క్రూరుం డగుగురు, సుతునియిషీకాస్త్రవహ్నిఁ [illegible]. 169

సీ. దేవకీపుత్త్ర సంజీవితుఁ జేయవే, యబ్బాలు నద్ద్రౌణిశస్త్రసంప్ర
యోగంబునపుడు కృపాగరిష్ఠుండ వై, చేసితి ప్రతిన గాచెద నమోఘ
మును నుత్తరాగర్భజనితు నే నని బాలు, బ్రదుకుతోఁ జెద నాసుత బ్రదుకు ద్రుపద
తనయాసుభద్రలు ధర్మజుం డనుజులు నా, శిశువు సంజీవితుఁ జేయు మన్న

ఆ. బ్రదుక రన్వయమున కుదకపిండప్రదా, నంబు లెడలు మఱియు నందనయును
నూఱడింపఁబడియె నోకనాఁడు నీచేత, దానియార్తి గరుణఁ దలఁగఁ జెయ్యి. 170

వ. దేవా నీ విక్కులంబు గలిగించినవాఁడ విఁకను నీవ దీని బ్రదికింపవే యని పల్కుచుం బుడమిం బడిన గొంతి నగ్గోవిందుం డనునయవచనంబుల నూఱార్చి యెత్తె నట్టియెడ సుభద్ర యమ్మహాత్మునితో నిట్లనియె. 171

క. గురుసుతుఁడు భీమునకునై, పరమాస్త్రం బెట్టె దానిఫల మందంగా
నరుఁడును దత్పత్నియుఁ గాం, చిరి తుది నే నీకు నేమి సెప్పుదుఁ బ్రభువా. 172

క. నీమఱఁది యాకొడుకుపైఁ, బ్రేమం [1]బెప్పుడును బెంపఁ బ్రేలెడి మనుమం
డీమెయి వమ్మయి పోయిన, నేమి యగునొ యెఱుఁగ నీవ యెఱుఁగుదు దీనిన్.

సీ. ధర్మజుం డెమ్మెయి [2]ధరియించు నెవ్వగ, పవననందనుఁడును గవలు నేమి
వెరవున నుపశమింతురు దీని విను దేవ, యస్త్రప్రయోగంబు సేసినపుడు నీవు
గురుసుతు నదలించి కుచ్చిత నిన్ను మో, ఘాస్త్రునిఁ జేసెద నంటి దాన
నూఱడి యుండుదు ముజ్జ్వలతేజ నీ, మహితానుభావత మాకు నెల్లఁ

ఆ. దెలిసి యుండుఁ గాన [3]యులుకము సత్యద, యాశ్రితాభిరక్ష లఘు నీకు
నైజములు శిరఃప్రణతి నేను వేఁడెదఁ, గరుణ నిక్కులంబుఁ గాచికొనుము. 174

తే. ఏవిధంబునఁ గోలుపోనీవు నీవు, పాండవుల నీదుసన్నిధిఁ బాపకర్మ
శీలుఁ డైనయశ్వత్థామ గోలుపుచ్చె, వాని నే మనఁ గలము దుర్వార తేజ. 175

1. క. బెప్పు వగపుఁ బెంప. 2. గ. దరియించు. 3. చ. యులుకము.

వ. అని వెండియు. 176

చ. భువనము లొక్కపెట్ట మృతిఁ । బొందిన జీవము లావహింప నే
ర్తు వలచినట్టు లైన గుణ।రూఢుఁడు మేనమఅందిపౌత్త్రుఁ జా
వ విడుచె వంతపెంపున న।వారణ నీయెదురం బ్రలాపముల్
వివిధము లే మొనర్చితిమి । వెట్టుల మై యిటు భక్తవత్సలా. 177

తే. అనినఁ గృపయును శోకంబు । నగ్గలింప, వనజనాభుండు జను లర్థి । వినఁగఁ బిన్న
వాని బ్రదికింతు వగవంగ । వలవదనియె, నెలుఁగుజలదస్వనమ్మున । నెల్లసకమెసఁగ.

వ. ఎల్లవారును బ్రమోదంబు నొంద నట్లు వలికి సూతికాగృహంబునకుం గుంతీ ప్రభృతులు దోడ రా నతండు వోవునప్పు డది ధవళకుసుమసితసర్షపలాజపూర్ణ కుంభప్రముఖమంగళవస్తువులను బ్రజ్వలితపావకప్రదీప్తశస్త్రపిచుమందపల్లవాది భూతపరిహారకపదార్థంబులను జతురవృద్ధాంగనాచికిత్సకదక్షపరిచారికాముఖ్యహిత కారిపరివారజనప్రవర్తనంబులను బరిశోభితంబయి యుండెనమ్మందిరంబాగోవిం దుండు ప్రవేశించె నట్టియెడ నంతకమున్న. 179

సీ. కడచి ద్రౌపది సని । యడలునఁ బడి యున్న, మాత్స్యనందనతోడ । మాధవుండు
సనుదెంచె వీఁడె న।వినయంబుగాఁ గను, మనవుడు నుత్థిత । యై వికీర్ణ
వేణీభరంబుతో । వినతి యొనర్చి భ, క్తార్తి వాపుట నీకు । నతిదృఢవ్ర
తంబు కదే దేవ । దయ వెలయంగ నీ, శిశువు సంజీవితుఁ । జేయవయ్య

తే. నీవు గూర్తేని మేనల్లు।నికిఁ దదీయ, పుత్త్రు ద్రోణునిపుత్త్రుండు । బొలియఁ జేయు
వాఁడె పతిహీన యగుపాప।వతికిఁ బుత్త్ర, హీనతయును బాటిల్లిన। నెట్లు బ్రదుకు.

ఉ. నందనుచావు నిక్క మయి।నం జను టప్పుడ కల్లు దేవకీ
నందన యెల్లభంగి నర।నందనుపాలికి [1]నాజి కేచి పో
వం[2]దనతోడి తెంపునకు । వారక యిచ్చినబాస దప్పె నిం
కం దనుఁ గన్న దెప్పు నొడి।కాఁ డని కొంకెదఁ గాని యచ్యుతా. 181

తే. పద్మనాభుండు వచ్చిన। బాలుఁ జంకఁ, బెట్టికొనిపోయి మ్రొక్కింతుఁ । బ్రీతి యెసఁగ
నని తలంచుచు నుండితి। నమ్మనోర, థంబు విఫలంబుగాఁ జేసె । ద్రౌణి పేర్చి. 182

వ. అని యంత నిలువనివలవంతపెంపున బాలశవంబు నెత్తికొని యంకతలంబున నిడి కొని తదాననం బాలోకించి. 183

ఆ. తాత లోకగురుఁడు। దామోదరుఁడు వచ్చి, యుండ లేచి మ్రొక్క । వుజ్జ్వలాంగ
ధర్మవేది యైన। తండ్రికిఁ బుట్టి య, ధర్మపరుఁడ వగుట । తగునె నీకు. 184

క. కను విచ్చి గొంతిఁ జూడుము, ననుఁ జూడుము ద్రుపదనృప।తనయఁ జూడుము నీ
జనకునితల్లి సుభద్రం, దనయా చూడు తల యెత్తి । దరహాసముతోన్. 185

చ. అని పలవించి యాసరసి।జానన మూర్ఛ మునింగి నేల వ్రా

1. క. నాఁటి కేచి. 2. క. దనతోడి పెంపునకు.

లినఁ గరుణాంబుపెంపున విరలీనతఁ బొందుమనంబులుఁ సబా
ష్పనయనయుగ్మకంబులును ర బాడఁబోయెడు మోములు నై సకౌరవాం
గనలయలంతఁ గాంచిన వగల్ మిగులం బగవాఁగ నీనిఁగనున్. 186

వ. ఒక్కింతసేపునకుం దెలివొంది విరాటనందన ధరాతలంబునం బడి యున్న భంగిన ఫాలతలంబునం గేలు మొగిచి గోపాలదేవునకు మ్రొక్కుచు నొక్కుచు శరణు శరణని పలికిన నప్పరమకృపాపరుం డోడ కోడకు మనుచుఁ బాదప్రక్షాళనోపస్పర్శనంబు లాచరించి యశ్వత్థామప్రయుక్తంబును బ్రహ్మశిరోనామకంబును నగు నమ్మహాస్త్రం బుపసంహరించి యబ్బాలశవంబు శిరోమస్తకంబునఁ జెట్టి బనిచి దర్పోల్లసితు లైన యెల్లవారలం గలయం గనుంగొని. 187

కృష్ణుఁడు మృతజాతుం డైన పరీక్షిత్తు లబ్ధజీవితుం జేయుట.

తే. మీఁద బొంకకగుమాట యేను నీరు విసఁగ, నాఁడని బ్బాలు బ్రదికింతుఁ బ్రభుఁడ సభల
జనులు నిప్పుడ తేలుందురు సంతసమున, దీని విని పాండవులు ప్రీతిఁ బొందువారు.

వ. అని ప్రతిజ్ఞ సేసి యిట్లనియె. 189

తే. పగఱయెడనైన నే బొంకు పలుక నేని, సమరముఖమున నెన్నఁడుఁ జలితవృత్తిఁ
బిఱిఁది కడుగిడ నేని నిక్కపున్న వాని, యంగమున జీవ మిప్ప్రద్రుత యంతవహిల్లు. 190

క. ధరణీసురకులము నెడం, గర మెక్కుడు ప్రియము నాకుఁ ర గలదేని సధ
ర్మరతుఁడ నయేని యియ్యు, త్తరాసుతుఁడు లబ్ధజీవితత్వము నొందున్. 191

క. నరుని యెడ నామనంబున, విరోధ మెన్నఁడును నేమి ర విధమున నైనం
బొరయమి నిజమేనియు సుస్థిరముగ నిబ్బాలుమేన ర జీవము నిలుచున్. 192

క. నిక్కపుధర్మువునన యే, నక్కంసాదుల వధించు ర టారసి మాఁదక
నిక్కువ మై యార్యజనుల, కెక్కసగానిన నసువర్గ ర మీశిశువు గనున్. 193

తే. మహితసత్యంబుఁ బరమధర్మంబు గాఁగ, నిర్మలబ్రహ్మచర్యంబు ర నిత్యసుప్ర
తిష్ఠితంబు లై నాయందుఁ ర దేజరిల్లు, నేని నిబ్బాలునకు జీవ ర మిపుడ వచ్చు.

వ. అని యిట్లప్పురుషోత్తముండు వలికిన. 195

సీ. బాలునిమేనికిఁ ర బ్రాణముల్ వచ్చిన, నల్లన కదలెఁ దరదంగకములు
మఱి కను విచ్చె నర త్తెఱఁగు దెల్లంబుగాఁ, గని గొంతి మొదలైన సకౌరవాంగ
నలు మనంబులు నిండి ర [1]యలువులఁ బాఱెడు, నానందపూరంబు రలసఁ గఁబొల్చు
హర్ష బాష్పములు రోమాంచకంచుకితదే, హంబులు నై యలరారు సభల

తే. జనసమూహమ్ములును సంతసమునఁ దేల, గగనమున దివ్యవాణియు ర క్కమలనాభుఁ
బొగడె మీఁదం డ్రి యున్న యప్పుణ్యగృహము, గరము శోభిల్లె నప్పుడు ర కౌరవేంద్ర.

ఉ. ఉత్తర బిడ్డ నెత్తికొని ర యొయ్యన మోము మలరంగ వచ్చి [2]య
త్యుత్తమతేజుఁ డైన పురుషోత్తమునంఘ్రిలపొంత భూస్థలిం

1. క. యలవుల దిగఁబాఱు నానంద. 2. 'యయ్యుత్తమతేజుఁ డైన పురుషోత్తము' నని పెక్కుప్రతులు.

జిత్త మెలర్పఁగాఁ దనదుచెన్నగుఫాలము సేర్చినన్ ముదా
యుత్తమనస్కుఁ డై యతఁడు సాదరభాషల గారవించుచున్. 197

క. వినుతబహురత్నవిస్ఫుర, దనేకభూషణనికాయ మబ్జాలున కి
చ్చినఁ దక్కటియదువీరులు, జననాయక యొసఁగి రక్కజం బగుతొడవుల్. 198

వ. అప్పుడు. 199

తే. ఆత్మకులము పరిక్షీణ మైన జనన, మొందెఁ గాన యియ్యభిమన్యునందనునకు
నర్హ మగుఁ బరిక్షిన్నామ మనియెఁ గృష్ణుఁ, డఖిలజనములు వినఁ బౌరవాధినాథ.

వ. అట్లు పుండరీకాక్షుండు పాండవసంతానంబు గలిగించె నట్లప్పరమపురుషుచేతం
బ్రత్యుజ్జీవితుం డైన భవజ్జనకుం డేకమాసవయస్కుం డగుకొలంది నొక్కపుణ్య
దివసంబున. 201

సీ. ధర్మసుతుండును దమ్ములు నమ్మహా, కనక మ ల్లెత్తించికొని యుదాత్త
వైభవ మొసఁగంగ వచ్చినఁ గృష్ణుని, యుక్తు లై విదురయుయుత్సు లర్థిఁ
గస్తూరినీళ్లుల కలయంపులను గప్పు, రంపు ముగ్గుల బహురత్నతోర
ణములఁ దోరపుముత్తియముల నొనర్చిన, ప్రాలంబమాలికాపంక్తులను బ

తే. సిండిపూర్ణకుంభముల విశిష్టమరక, తప్రకరమయకదళికాస్తంభములను
గరము దోరంబుఁ జిత్రరేఖంబుఁ గా న, లంకరించిరి పురముఁ గురులప్రదీప. 202

వ. సకలజనంబులుం గయిసేసి కలయం బొలయ నప్పు డప్పురంబు చంద్రోదయ
ఘూర్ణమానం బయినయర్ణవంబు ననుకరించె నయ్యచ్యుతుండును బలదేవ
సాత్యకిప్రద్యుమ్నప్రముఖులు ప్రమోదంబునం బొంపిరివోవుచుం బెంపారు
నలంకారంబుల నభినవోదారచారుత్వంబు వహించి యెదురుచని పాండవు
లం గని రయ్యిరుదెఱంగులవారలును సౌహార్దంబును సౌముఖ్యంబును సౌజన్యం
బును నత్యంతంబును మెఱయ నర్హంబు లగునాచారంబులు నడపి రట్లు కృష్ణ
సమేతు లై మీ తాతలు హర్షోల్లాసభాసమాను లగుచు నానసమగ్రకాంచన
సంచయంబుఁ బురస్కరించుకొని పురప్రవేశం బాచరించి. 203

క. తొలుత ధృతరాష్ట్రగాంధా, రులఁ గని మఱి గొంతిఁ గాంచి ప్రోన్మీలచ్ఛ
త్తులుఁ బ్రమదసంభరితచి, త్తులు నయినయుయుత్సునిన్ విదురునిం బ్రీతిన్. 204

వ. కానిపించికొని సంభావించి సంభృతాహ్లాదు లగుచుం గృష్ణాదియాదవలోకంబు
నుం దారు నొకరమ్యమండపంబున నుండి రట్టియెడ. 205

వ్యాసుఁడు కృష్ణసహితు లై యున్నపాండవులయొద్దకు వచ్చుట.

సీ. తగువారిఁ గాంచి యత్యద్భుతం బగుభవ, జ్జనకు తెఱంగు విస్తార మొప్పఁ
జెప్పిన వార లచ్చెరువాటు సంతసం, బును నెమ్మనంబులఁ బెనగొనంగఁ
బద్మనాభు ననేకభంగుల వినుతించి, యిట్టివి వింత లే యెల్లనాఁడు
నిట్టుల కాక మాయెడ నీదుకరుణపెం, పని యభినందించి రట్లు గలసి

తే. నెమ్మిఁ దారును గృష్ణుండు సమ్మదమున, నుచితవర్తనకలితుఁ డై యుండెఁ గొన్ని
దివసములకు సంప్రీతి నేతెంచె బోధ, భాసితుం డైనసత్యవతీసుతుండు. 206

క. ఏతెంచిన గోవిందన, మేతంబుగ నెదురుకొని మహీపతి యనఘున్
బ్రీతునిఁ గావించి యతని, మీఁతాతలు గొలిచి యుండి రిమ్ముని ననుచున్. 207

వ. సముచితగోష్ఠి నడపి రప్పాండవాగ్రజుండు మునిజనాగ్రగణ్యుం డగు భగవత్పాదం బునం బడసినయమ్మహాధనంబు మహనీయంబుగా నశ్వమేధయాగంబునకు నుప యోగంబు నొందింపఁ గోరెద ననుజ్ఞ యీవే యనిన నమ్మునిముఖ్యుండు గోవిందు నుపలక్షించి యమ్మహీ వరుం డి ట్లనియె. 208

ఆ. తురగమేధ మఖిలదుష్కృతహరము నీ, వది సమగ్రదక్షిణాన్వితముగఁ
జేసి నిర్మలత్వభాసమానుండ వై, నెలయు మమ్ము నెక్కుడుకీర్తిఁ గీర్తి. 209

చ. అనవుడుఁ బ్రీతి నొంది యతఁ డచ్యుతుఁ గన్గొని ధన్యుఁ డీతఁడున్
ప్పని దగ నిట్లు సేయు మని పన్నుము తల్లియుఁ దండ్రియుం గురుం
డును సచివుండు నిష్టసఖుఁడుం గరుణాకర నీవ మాకు నీ
యనుపమముఖ్యవృత్తి జగ మంతటికిం గతి వేయు నేటికిన్. 210

వ. అనిన విని యంబుజనాభుం డతని కి ట్లనియె. 211

ఉ. వ్యాసులు పంచినట్ల నియమాఢ్యతఁ జేయుద నశ్వమేధముం
జేసి కృతార్థతం బొరసి చిత్తము నెవ్వగ యెల్లఁ బాచి కో
మ్మా సుకృతంబు ధర్మనిచయప్రవరం బని యేను చెప్పి తా
దే సుగుణాభిరామ నిను దీనికిఁ జొన్పితి మున్న దృఢంబుగన్. 212

చ. అనుమతి యింక వేఱ పడయం దలఁ పేటికిఁ గౌరవేంద్ర స
న్మనుపుము వాజిమేధకరణంబున కేపని సేయువాఁడ నీ
యనుజులు నల్వు రే నొకఁడ సధ్వరకార్యము లెల్ల నీమన
మ్మనమున కెక్కఁ జేయుదుము మాన్యచరిత్ర యొనర్పుము మానకన్. 213

సీ. అన విని సమ్మోద మారినచిత్తంబుతో నభినందించి యనఘ నరేంద్ర
వరుఁడు పారాశర్యువలను గనుంగొని, దీక్షకు సమ్యగ్దివసము నిర్ధారు
సూచి యాసంస్కార మాచరింపుఁడు దయ, ననవుడు నమ్మునియాజ్ఞ వల్కుఁడ్యుఁ
బేర్కొని పైలునిఁ బ్రీతి నెఱింగించి, వారును నేనును వసుమతీశ

ఆ. నడపవలయుపనులు నడపువారము చైత్ర, మాసకలితపౌర్ణమాసి నిప్పు
డరయఁ బనుపు మేధ్య మగుతురంగముఁ దజ్జ్ఞు, లైనయట్టిజనుల సంచితాత్మ.

క. వేదోక్తవిధిసహితభ, వ్యాదరమున విడువఁ బడినయయ్యశ్వం బీ
మేదినిఁ గలయం దిరుగును, నీ దగునిర్మలయశంబు నెఱియ మెఱయఁగన్. 215

వ. సర్వసంభారంబులును సమకట్టింపుము స్రుక్స్రువాదిక్రతుసాధనంబులు గ్రొత్త

లుగాఁ గనకంబునం గావింపం బనుపు మని చెప్పిన నప్పుడమిఱేఁడు. 216

క. తురగపరీక్షావిదు లగు,పురుషులఁ బిలిపించి యశ్వ।పుంగవుఁ గని తెం
డరయుఁడు మసకొందమలలో, నిరుపమలక్షణముఁ గీర్త।నీయంబును గాన్. 217

వ. అని పలికి కర్మాధికారులం గలయం గనుంగొని యజ్ఞంబునకు వలయునట్టి భాండ ప్రముఖంబు లయినసాధనంబులును స్రుక్స్రువాద్యుపకరణంబులును సువర్ణ మయంబులుగా వేగంబ చేయింప వలయు నని నియోగించిన నట్ల కాక యని చని వారును బడంపడి. 218

క. తురగంబును సంభారో,త్కరమును గొని వచ్చి చూప।ధర్మజుఁడు పరా
శరసుతునకు వాని విసయ,పరత సమర్పించెఁ గురునృ।పాలవరేణ్యా. 219

క. ముని యశ్వముఁ జూచి కరం, బనురాగముఁ బొంది మేధ్య।మగు నిది దీనిన్
వినుతవిధానమున విమత, మనవుము నతఁ డతనితోడ।నాదర మలరన్. 220

తే. దీని రక్షింప నర్హుం డ।మానసీయ,బోధ యెవ్వండు నీదుస।ద్బుద్ధి నరసి
యిట్టివాఁ డని యూనతి।యిమ్ము నాకు, ననిన నమ్మునినాథుఁ డ।య్యధిపుతోడ.

క. దివ్యాస్త్రవిదుఁడు ధిషణా,భవ్యుఁడు శౌర్యోత్తముండు।పార్థుఁడు దగు న
శ్వవ్యాపనక్రియకు నితఁ, డవ్యాహతి నాచరించు।నక్కార్యంబున్. 222

వ. భీమసేనుండును నకులుండును మనరాష్ట్రంబు రక్షించువారు భవదీయకుటుంబ కార్యంబులు సహదేవుండు నడపువాఁ డని నిర్దేశించిన. 223

ధర్మజుం డర్జును యజ్ఞాశ్వరక్షణంబునకు నియోగించుట.

సీ. అమ్మహీవల్లభుఁ।డర్జునుఁ బిలిచి య,ధ్వరయుక్త।మైనయి।త్తురగరత్న
మనఘ సంరక్షణీ।యంబు నీ కొరులకు, నిప్పని శక్యంబె।యెల్లభంగి
నిక్కార్యమునకు నీ।వేఁగంగవలయు నీ,యంచితాశ్వము చరి।యించుచుండ
నెడనెడ రాజుల।కే నశ్వమేధదీ,క్షితుఁడనై యుండుట।చెప్పు ముచిత

తే. కరణనియతి నిరోధంబు।గాకయుండ, నడపు మని చెప్పి భీముని।నకులు రాష్ట్ర
గోపనమునకు సహదేవుఁ।గులకుటుంబ,సమితిరక్షకుఁ బనిచి యు।త్సాహ మెసఁగ.

వ. మఱియునుం గలయులంతిపనుల కర్మజనంబుల నియోగించి గాంధారీధృతరాష్ట్రుల యనుమతి వడసి కుంతీసమనుజ్ఞాతుం డయి యశ్వమేధమఖంబున కున్ముఖుం డయ్యె నని యిట్లు ధర్మపుత్త్రపుణ్యచరిత్రంబు సెప్పిన నప్పరమధార్మికుండు సకల లోకమనోజ్ఞం బగుయజ్ఞం బెవ్విధంబున నిర్వహించె విను వేడ్క నాచిత్తంబునం జిగు రొత్తెడుఁ జెప్పవే యనుటయు. 225

ఉ. మానమదాదిదోషపరి।మార్జననిర్మలచిత్తభక్తస
న్మానసలోల వీతపరి।మాణవిభూతివిశాల శాంతతా
హీనవిదూర విశ్వహిత।హేలవిచార నిరామయావ్యయ

స్థానకసిద్ధిమంగళవిధాయక [1]వేదసభైకనాయకా. 226

క. అనపేక్షితఫలతాశో,భనమహనీయక్రియావిపాకాత్మకసూ
పనితాంతధూతసంశ్రిత, జనపాపా పరమమిత్రసత్యాలాపా. 227

మాలిని. తరుణజరఠభావద్రావణోదారమూర్తీ
హరణకరణనిస్తారలానతాభ్యంతరార్తీ
మరణజననదుఃఖోన్మాదహృత్పుణ్యకీర్తీ
చరణకమలపూజాశాలిచిత్తానువర్తీ. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబునందు దృతీయాశ్వాసము. 229



1. గ. వేదముఖైకనాయకా.—జ. వేదసదేకనాయకా.




హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, చతుర్థాశ్వాసము.





విద్యాశాంతకృతి
ప్రావీణ్యా [1]నిరూఢిగణ్యా ! పాదసతతసం
సేవనతత్పరహృత్కమ
లావాసకృతప్రమోద ! హరిహరనాథా. 1

ధర్మజుం డశ్వమేధదీక్షం బూని హయంబుం బుడమిం దిరుగ విడుచుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లశ్వమేధయాగోద్యోగ
ప్రద్యోతితుం డయినపాండవాగ్రజుదీక్షకు నర్హం బయినదినంబు సంప్రాప్తం
బగుటయు మౌహూర్తికదత్తశుభముహూర్తంబునం గృష్ణద్వైపాయనాదు లైన
ఋత్విజులు వేదవిహితవిధానమహితంబుగ నక్కురుక్షితిపతి దీక్షితుం జేసి
రవ్వసుంధరావల్లభుండు సంవీతక్షౌమకృష్ణాజినుండును దండపాణియు నయి
ఋత్విగ్జనంబులు బలయం బరమసంయమిపరివృతప్రజాపతిప్రఖ్యుండును గన
త్కాంచనాభరణభూషితుండు నయి బహుళప్రభలు నిగుడ సందీప్తపావకసన్ని
భుండును నగుచు వెలింగెఁ దత్తుల్యాకల్పకల్పనంబున ఋత్విగ్జనసమాజంబునుం
దేజరిల్లె నావేదవ్యాసమహామునిచేత శాస్త్రోక్తప్రకారంబున ముక్తం బయి
హయోత్తమంబు వెడలె నప్పుడు. 2

సీ. వివ్వచ్చుఁ డాగమ ! విధివంతముగ ధర్మ,నందను నామంత్ర ! ణంబు వడసి
గాండివపాణి యై ! కవదొనల్ ధరియించి, తేజోవిశేషంబు ! రాజితముగ
నయ్యశ్వరత్నంబు ! ననుసరింపఁగఁ బ్రజ, బాలురు వృద్ధులు ! భామినులును
లోనుగాఁ బఱతెంచి ! లోలత [2]నతని నా,హయమును గనుఁగొను ! నప్పు డగ్గ

తే. లంపుసందడి నూష్మ జ ! నింప నాజ,నంబు లవ్వీరునకు దీవ ! నలఁ బొగడ్త
లను బ్రమోద మొనర్చిరి ! వనధిరవము,ననుకరించె నయ్యులివు నృ ! పాగ్రగణ్యా.

---

1. క. నిరూఢగణ్యాపాతసతత. 2. గ. నతని వా,హము ను గనుంగొను.

వ. ఇవ్విధంబునం జనునాకవ్వడితోడ యజ్ఞకర్మకుశలుం డైనయాజ్ఞవల్క్యశిష్యుం డశ్వవిధానంబులకయి మాననీయవిప్రజనసహితంబుగాఁ జనియె నప్పరమతురంగంబు ధరణిం బ్రదక్షిణరూపంబునం దిరిగి యుత్తరాభిముఖం బై యల్లనల్లన యరుగుచుండ నర్జునుం డనుసరించి పాలసపడుం డగుచుం బ్రవర్తింపం ద్రిగర్తదేశంబునందు. 4

అర్జునుతోఁ ద్రిగర్తదేశాధిపతులు యుద్ధము సేయుట.

సీ. ఉద్ధతులై త్రిగర్తోర్వరాపతిపుత్త్ర, పౌత్త్రు లయ్యశ్వంబుఁ బట్టువారు
గాఁ బూని తేరులు గడురయంబునఁ దోలి, కొని యడ్డముగ వచ్చుటయు వారలకు
నలుగక నరుఁ డన్నయానతి దలఁచి యా, రాజకుమారవర్గంబుతోడ
ధర్మజునశ్వమేధంబున కపకార, మాచరించుట పాపమనియుఁ గాక
తే. యేము మీరును బాంధవమొనక మొనఁగ, నడచు టొప్పదె పగయేల యెసఁగ వారు
సూర్యవర్మనామకుఁ డగుశూరతమకు, మారుఁ డగ్రణి గాఁగ నుద్దామలీల. 5
చ. కవిసిన వారితో మఱియుఁ గవ్వడి యిట్టు లనుం దయానుపా
ప్రవణుఁ డజాతశత్రుఁడు తురంగమరక్షకు నంపునప్పు భూ
పవితతి యెల్లనుం దెగియె భారతయుద్ధమునందు పాలుగం
దివిరి వధింపఁ గాదు కృపఁ దిన్నఁదనం బెసఁగం జరింపుమీ. 6
చ. అవినయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిర యేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్కి యనిఁ దప్పఁగఁ ద్రోవుము కిన్క నాను మ
న్నవచనవృత్తి నా దగుమనంబున నెక్కొని యున్కిఁ జేసి యా
హవమున కొల్లనయ్యెదఁ బ్రియంబులు గావొకొ మీకుఁ బ్రాణముల్. 7
చ. వలవదు పొం డనంగ నిలువం బడ కేవురు సూర్యవర్మ య
బ్బలియునిమీఁదఁ గ్రూరశరపఙ్క్తి నిగిడ్చినఁ ద్రుంచె నప్పుడు
మ్ముల నది యెఱ్ఱనవ్వ తనమో మనుతమ్మికి లేఁతయెండ ద్యు
[1]చెలువము చెన్ను వింతలుగఁ జేయఁగ నావిజయుండు భూవరా. 8
వ. అట్టియెడ. 9
తే. సూర్యవర్మనితమ్ముండు శూరవరుఁడు, కేతువర్మ గాండీవిపై శాతబాణ
వృష్టిఁ గురియుచు నుద్ధురవేగ మొప్ప, నన్నఁ గడచిబెట్టడరిన నన్నరుండు. 10
చ. అతని నొదుంగ సేయుటయు నాతనితమ్ముఁడు చండవిక్రమో
ద్ధతి ధృతవర్మనాముఁ డతిదారుణసాయకపఙ్క్తి సత్వరా
తతగతిఁ బర్వఁ జేయుచుఁ బృథాసుతుఁ దాఁకిన మెచ్చు వచ్చి య
య్యతిరథవర్యుఁ డప్పుడు తదంగము లేయఁగ నొల్ల కుండుటన్. 11
చ. శరములు ద్రుంప నాతఁడు వెస౯ బలునారసముల్ నిగిడ్చె న

1. చెలువముఁ జెన్ను.

న్నరుపయి నాబలిష్ఠుఁడు మనంబునఁ గొండొక యల్క పుట్టి య
న్నరవరసూతి పేరురమునం బదితూపులు గ్రుచ్చె దానికిం
బెరలక యక్కుమారుఁడును దీవ్రశరంబులఁ జేయి నొంచినన్. 12

ఆ. ముష్టి సడలి చోద్యముగను గాండివ మిలఁ, బడిన నాత్రిగర్తబలము దెసలు
సెలఁగ నార్చె [1]నందుఁ జేయంగఁగల యోధు, లక్కుమారవర్యు నవులఁ ద్రోచి. 13

తే. ఇంద్రధనువుచందంబున నెసక మెసఁగు
గాండివము పాటుఁ గంటిరే చండవిక్ర
మాభిరాముండు గాండీవి యన్నపలుకు
లకు మహోగ్రత సూప నొల్లండు గాక. 14

ఉ. నిక్కపుఁ గిన్క వచ్చిన నరునిన్ నొసలం గను సూపు [2]వింటిపా
టక్కట రిత్త వోవునె నృపాత్మజులం దెగటార్చు నీతఁ డిం
దొక్కఁడుఁ ద్రిక్కు కుండ మన మొప్పమి సూడఁగ నేల మున్న పే
రుక్కునఁ దాఁకు టొప్పు నని యొక్కట నర్జును నాక్రమించినన్. 15

క. అట మున్న గాండివం బుత్కటరయమున నెత్తి కోపదహనుం డత్యు
ద్భటమూర్తిఁ దాల్చె నన మిక్కుటమై కడగంటికెంపు గొమరారంగన్. 16

వ. ఆబీభత్సుండు. 17

క. పిడుగులు వడిఁ బెక్కొక్కటఁ, బడియెడు ననఁ దొరఁగఁ జేసెఁ బటువిశిఖము ల
ప్పుడు మేదిని దోఁపద చెప్పెడుకొలఁదియె రథికవరులఁ బీనుఁగుఁబెంటల్. 18

శా. ఆయుగ్రోద్ధతి సూచి పెల్కుటి త్రిగర్తానీకముల్ నల్గడం
బాయం బాఱెఁ దదాప్తు లేము దగ నీపం బోపి సద్భక్తిమైఁ
జేయంగాఁ బనిగొమ్ము పేర్మిగ మముం జేకొమ్ము సమ్యగ్దయా
శ్రీయుక్తా యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారి నెల్లం గృపన్. 19

వ. అట్లు వెనుకొనక నిలిచి యెలుం గెత్తి వారలతో మీ రిట్లు ప్రాణంబులు గాచి కొనుండు నాపంచినపని సేయం బూని బుద్ధి గలిగి సుఖుల రై యుండుం డని పలికి యయ్యశ్వంబు ననుసరించె నది క్రమగతిం బ్రాగ్జ్యోతిషపురపరిసరంబునకుం బోయిన దాని తెఱం గాకర్ణించి. 20

సీ. భగదత్తతనయుండు బాహుగర్వంబున, బాల్యసిద్ధం బగులౌల్యమునను
బురి నిర్గమించి యత్తురగంబు వెలిపించి, కొనిపోవఁ గాంచి యర్జునుఁడు గాండి
వము సజ్యముగఁ జేసి వాలమ్ము లొక్కట, నక్కుమారునిమీఁదఁ బెక్కు గురియ
నవ్వజ్రదత్తుండు నొవ్వ దక్కిన దాని, నచ్చట దిగఁ ద్రావి చొచ్చెఁ బురము

తే. సత్వరంబుగ నటు సొచ్చి సామజంబుఁ, బన్నఁగాఁ బంచి వెస నెక్కి బలముఁ జలము
వీఁకయును నొప్ప నన్నరుఁ దాఁకి శాత, ఘనశరంబులు వరఁగించెఁ గారవేంద్ర.

1. గ. నందు సేయంగ. 2. జ. వింటివాఁ డక్కట.

క. నడుమన వానిం బార్థుఁడు, వాఁడిగా నేయంగఁ గనలి భూపకుమారుం
డడరించెఁ దోమరంబులు, గడుఁ బెక్కువి మిణుఁగురుగతిఁ గనియంగన్. 22

ఆ. అనలశిఖలువోని యమ్ములగమి వాని, రూపు మాపి యన్నరుండు వాఁడి
లేనిదొడ్డతూపు లేనింటఁ దొడి రాచ, కొడుకు నేసెఁ దూలి పుడమిఁ గూల. 23

క. కూలియు నీడంబోవక, బాలుఁడు రయ మార దంతిపైకిం జని నా
ర్లీల మెఱయ నరుఁ బటుశర, జాలంబులఁ బొదివె గగనచరు లగ్గింపన్. 24

చ. అతఁడును దీవ్రబాణముల నా భగదత్తతనూజు దంతి నా
వృతముగఁ జేసె నట్లు పృథివీవరనందను గోమి నప్పుడా
శతమఖపుత్త్రుతోడ [1]దివసత్రయ ముగ్రరణంబు సల్పె న
ద్భుత మెసఁగం జతుర్థదినమునం బగుసంతికిఁ బోర ధీరతన్. 25

వ. [2](తెగియెడుసమయంబున.) 26

ఆ. అక్కుమారుఁ డేచి యర్జును నర్జును, గోను గలుగ నేసి నంగఁ బోవ
వచ్చు వృద్ధుఁ డైనవాఁడు గావునఁ దండ్రి, సమయ నట్లు నన్ను [3]సమయ నేల.

వ. అని యదల్చి. 28

క. పెనుసెలయేఱులు వాఱఁగఁ, దనరుగిరియుఁబోలె బహుళమదంబులు సోరఁగం
గనుపట్టుకుంజరము సిం, హనిభుం డగుపార్థుమీఁద నడరం జేసెన్. 29

క. అది [4]ఘూత్కారము సేసిన, నొదవినకరశీకరముల నుర్వీవరయుం
బుదముక్తసలిలధారలు, వొదివినగిరివోలె నింద్రపుత్త్రుం డొప్పెన్. 30

చ. కరి యిటు లేపునం గవియఁగా భగదత్తసుతుండు దీప్తని
ష్ఠురశరపంక్తి నాహవపటుత్వము సూపిన నల్పకోపనుం
డరుఁ డగుచుం గరుండు శతధారనిభం బగునారసంబు భీ
కరగతి నేయఁ గూలె నది కౌరవనాయక పర్వతాకృతిన్. 31

క. కూలిన నేలకు వచ్చిన, బాలుం గని నాకలోకపతిసుతుఁడు దయా
లోలుం డై మార్దవహృ, ద్యాలాపము లొప్ప నిట్టు లను నాతనితోన్. 32

వ. ధర్మతనయుం డశ్వమేధదీక్షితుం డయి యిత్తురంగంబుపజ్జ నన్నుం బుత్తెంచు
నప్పుడు. 33

క. చంపకమీ రాజుల నను, కంపాతిశయంబు మెఱయఁగా నడవుము నీ
పెం పనుకుసుమమునకు నా, పం పొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ. 34

క. అనిమెం గావున నీపైఁ, గినుక వొడమ దలుక విడువు గీతయశుం డా
జనపతియాగంబునకుం, జనుదేరఁగ వలయు బంధుజనములు నీవున్. 35

ఆ. అధిపతనయ నిన్ను నామంత్రితునిఁ జేసి, పోవుచున్నవాఁడ నీవు హస్తి
పురికి భావిచైత్రమునఁ బున్నమకు ముద, మొదవ నరుగుదెంచుటొప్పఁ జేయు.

---

1. క.చ.ట. దివసద్వయ...దృతీయదినముం. 2. ఇది పెక్కింటలేదు. 3. గ. సవితె. 4. చ. ఘీంకారము.

క. అనిన సతం డట్లు కాకని, వినతుం డగుటయును బ్రీతి విజయుం డభినం
దన మాచరించి యశ్వము, వెనుకం జనియెం బూరుకులపవిత్రచరిత్రా. 37

—అర్జునుఁడు సింధుదేశాధీశులతోడ యుద్ధంబు సేయుట.—

వ. అది సింధుదేశవర్తియగుటయు భారతరణహతు లయినసైంధవయోధులపుత్త్ర
పౌత్త్రులు పూర్వవైరంబు వాటించి యాటోపంబున ననేకసహస్రసంఖ్యలరథి
కులు రాజనందనులుం గూడుకొని క్రీడిపై నడచి రట్టియెడ. 38

సీ. అరుణాంబుదంబులు వరఁగి పెన్నెత్తురుఁ, గండలుఁ గురిసె మార్తాండబింబ
మసితారుణచ్ఛాయ మయ్యె నుల్కాతతుల్, వెల్లదిక్కులఁ బెల్లు డుల్లె నశ్వ
సహితంబుగా సవ్యసాచిఁ జుట్టును ముట్టి, యతనిపై నయోధవితతి యొక్క
పెట్ట శస్త్రాస్త్రముల్ బెట్టుగాఁ గురిసిన, నప్పాండవుఁడు పెనుపడప్పి సోలె

తే. నేమి సెప్పుదు నీకు నుద్దామవిక్ర
మాభిరాముండు నాఁ జనునక్కిరీటి
కరము గరము బెం డగుటయు గాండివంబు
వడియెఁ బుడమిపైఁ గురునరపతివరేణ్యా. 39

చ. అనిమిషులుం మునీశ్వరులు నప్పుడు శోకమునం మునింగి య
ర్జునజయకాంక్షులై నియతి శుద్ధి [1]వహించి సవీర్యమంత్రసా
ధనపరులైరి తెప్పిటి యతండు ధనుర్ధరుఁడుం సముల్లస
త్తనువిభవోజ్జ్వలుండు సముదగ్రమనస్కుఁడు నయ్యె భూవరా. 40

వ. ఇట్లు తెలివొంది విజృంభించి. 41

శా. నారాచప్రముఖాస్త్రజాలపటువిన్యాసంబు తీవ్రత్వరా
ఘోరంబై విలసిల్లఁ జేయ సమరక్షోణీతలం బంతయుం
వైరివ్రాతశవావృతం బగుడు గీర్వాణుల్ మునుల్ సిద్ధు ల
వ్వీరుం బ్రస్తుతి సేయుచుం బొదలి రుద్వేలప్రమోదంబునన్. 42

వ. హతశేషంబైనయాసింధురాజకుమారసైన్యంబు దైన్యంబు నొంది నలుదిక్కుల
విచ్చియు నొచ్చియు విప్పచ్చుండు రణధరణిం బొలిచి నిలుచుటఁ జూచి మాత్స
ర్యధుర్యంబై మగుడం బోరికిం బూని యడరిన నప్పురందరనందనుం డందలి
రథికముఖ్యులతోడం దమయన్న సెప్పినవాక్యంబు లుపన్యసించి మీ రేల జాలిం
బడియెదరు ప్రాణంబులు మీ కింతసేఁ దయ్యనేయని పలికినను నిలువక పైపయి
వా రురవణించిన. 43

క. నవ్వుచు నానాశరముల, నవ్వీరులఁ బొలియఁ జేయ నంతయు విని తా
నెవ్వగతో దుశ్శల యా, కవ్వడిఁ బౌత్త్రాన్వితముగఁ గానఁగ వచ్చెన్. 44

సీ. వచ్చి కన్నీళ్లలు వదనంబుపై వెల్లి,గొనఁ రోదనంబు సేసిన నతండు

1. గ. వహించినవీర్యమంత్ర.

దయ నిలనిడియెం గోదండ మప్పుడఁ దుక, పౌత్త్రునిఁ జూచి యుబ్బశ్యాలుఁ గావు
మిత్తఁడు మీయల్లునిసుతుఁ డన్న సప్పార్థుఁ, జెప్పుము నాయుల్లుఁ। జచ్చె నున్న
వాఁ డని యడిగిన। వనిత వెక్కుచు సతం, డాత్మీయజనుకుఁ జంప్రాప్తమున

తే. నసఘు నీచేతఁ దెగుట దా। విని నితాంత, శోకమగ్నుఁ డై యుండి సైరింపక బిట్టు
వినుట బెగ్గిలిప్రాణముల్। విడిచె ననుచు, నెలుఁగు గదలుకొనంగఁ [1]పొక్కెఁ బ్రసభిప.

వ. అప్పుడు శోకాక్రాంతుం డయి గాండీవి వదనంబు వాంచి యుండ సంయుగ్యగ్రతి
యతని నుద్దేశించి. 46

సీ. ధార్తరాష్ట్రులకీడు। దలఁపక సైంధవు, కొడుకుగాము లెల్లను। నుఱుంచి తంత్రి
లేనియీశిశువుపై। నూనితం బైనసీ, యక్కటికంబు జూడ। దలఁపఁగ నీవు
మాశ్రితవత్సల। యనుచు సభ్యాలునిఁ, జరణానతునిఁ జేసి। శరణు శరణు
కృప నన్ను రక్షింపు। కీర్తియు ధర్మంబుఁ, జేకొను మనసున్న। నాస్తి [2]మనుజల

తే. రాచకొల మిది గాల్ప నేరక। కోర్యమూల, మని తలంచుదు నాతఁ డెఱుయ్యనివహోద
నధమవృత్తిసుయోధను। డంతకంటె, నేముఁ గొడుకుగాము నుంచేత। నంతకన్న.

క. అనుపలుకు వలికి బహుసాంత్వనముల నూఱార్చి యనుసుదతిని స్తకముం
దనయక్కునఁ జేర్చి యబల, చనుము వగపు దక్కి యని ప్రసాదభరితుఁ డై. 48

వ. వీడ్కొలిపిన దుశ్శల దనమనుమనిం దమబలంబులం గొని ప్రియంబునం జనియె
నయ్యనిమిషపతిసుతుండును గ్రతువిషయంబు లయిన వలయుసనుష్ఠానంబులు విధి
వంతంబులుగాఁ జలుపుచుఁ దురంగంబు వెనుకం దా రమ్యగానుసారి యయిన
పినాకపాణియుంబోలెఁ బోవుచుండ నదియును నిజేచ్ఛ సకలదేశంబుల సుఖ
సంచారంబునం బ్రవర్తిల్లుచుఁ గ్రమంబున [3]మణిపూరపురంబునుపాంతంబునకరి
గిన నన్నగరంబుపతి యైనబభ్రువాహనుండు నిజజనకుం డగుటనయర్జునురాక యా
కర్ణించి. 49

ఆ. వినయ మెసఁగ నార్య। జనసమేతంబుగా, నరుగుదెంచి యతని। చరణములకుఁ
బ్రీతి నెఱఁగ నక్కి। రీటి యన్నరపతి, నాదరింప కుండె। మేదినీశ. 50

వ. అట్లుండి తనయనాదరంబునకుం గారణం బెఱుంగక సవిచారుం డై యూరకున్న
యక్కుమారునితో ధనంజయుం డిట్లనియె. 51

ఉ. యాగవిముక్త మై చనుహ। యంబున కడ్డము వచ్చి పట్టి కా
కీగతి మెత్తఁబాటు దగు। నే నృపధర్మవిహీనతం రణో
ద్యోగము లేక తక్కి భయ। ముల్లముఁ జేరఁగ నిచ్చు రాజు రా
జే గుణహీన పొమ్మనిన। నేమియుఁ బల్క కతండు గ్రమ్మఱన్. 52

సీ. అరిగి పట్టనవీధి। నల్లన చనుచుండ, నర్జునుం డతనితో। నాడినట్టి

1. గ. క. చ. బెట్టేడ్చె. 2. ట. మురిలి; మురియ. 3. మూలమునను దెనుఁగునను 'మణలూర
పుర' మనియు 'మణిపూరపుర' మనియు రెండుపాఠము లున్నవి.

తెఱఁ గెల్లఁ దన దగుదివ్యబోధంబునఁ, గని భుజంగోత్తమతనయ సదయ
వృత్తిఁ బాతాళంబు వెలువడి యన్నరా, ధిపునిపాలికిఁ జనుదెంచి యేను
మీతల్లి నాగేంద్రసూతి నులూపి నా, పేరు హితంబు సెప్పెదుమనీష

తే. నరుగుదెంచితి వినుము మీయయ్యవనుపు
దలకొనుము రాజులకు నర్హధర్మ మైన
యని యొనర్పుము దనతోడఁ బెనఁగు టధిక
సమ్మదము సేయు నక్కురుసత్తమునకు. 53

క. అనిన సభక్తికముగ న, వ్వనితకుఁ బ్రణమిల్లి యాహవము జనకునితోఁ
జనునె యొనర్పఁగ నని య, ప్పనికిఁ జొరక వచ్చితిని శుభప్రదమూర్తీ. 54

క. నీ వింత దెలిపి పలికెద, వావిభుఁడును మున్న నన్ను ననుమతుఁ జేసెం
గావునఁ దల్లీ మీకుం, గావించెద నిద్దఱకు నఖండప్రియమున్. 55

బభ్రువాహనుం డర్జునునితో యుద్ధంబు సేయుట.

చ. అని నిజమందిరంబునకు నయ్యెలనాగఁ దగంగఁ బుచ్చి య
మ్మనుజవరుండు సాధనసమంచిత మైనరథం బుదాత్తరే
ఖ నెఱయ నెక్కి యర్హపరికల్పితభూషణలేపనాంబరం
బును సమరోత్సవోద్ధతవిభూతియు నై తనమే నెలర్పఁగన్. 56

ఆ. ఎక్కి హంసకేతు వేడ్తెఱఁ గ్రాలంగ, నరిగి యశ్వమునకు నడ్డపడఁగఁ
జూచి మెచ్చి సవ్యసాచి మార్కొనుటయుఁ, గురిసె నతఁడు నిశితశరచయంబు.

శా. వానిం దా నవలీలమైఁ దునిమి దుర్వారోద్యముం డద్రిభి
త్సూనుం డొక్కట నాత్మసూనునొడలం దూపుల్ నిగిడ్చెం బదా
ఘానిశ్శంకుఁడు బాహుసారమద మేపారంగ నవ్వీరుమేన్
వే నారాచము లై దునాలుగులు పృథ్వీనాథ నాటించినన్. 58

చ. మదిఁ గొనియాడి యాగిపువిమర్దనుఁ డంచసిడంబు ద్రుంచి యో
షాదవఁగ మేను నొంప నచలోద్ధతి నాతనిజత్రు వేసె బె
ట్టిద మగునారసంబునఁ గడిందిమగం డగుబభ్రువాహనుం
డది వడిపేర్మి శోణితజలార్ద్రిత నొందక యుచ్చి పోయినన్. 59

క. అమ్మేటిమగఁడు దనచా, పమ్మూఁతగ నిల్చి సోలి పదపడి తెలివు
ల్లమ్మున నొలసిన నారా, యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్. 60

తే. పొగడి యేఁ దీవ్రశరములు నిగుడఁ జేయు
నుద్ధతికి మంచిబంట వై యోర్వ వలయుఁ
జుమ్ము రా యని పలికి వాలమ్ము లధిక
రయము మెఱయంగఁ బరఁగించె రాజముఖ్య. 61

ఆ. మొనసి వాని నతఁడు ముత్తునియలు గాఁగఁ, జేయ మత్సరంబు చిత్తవృత్తిఁ

వ. అని పలికి పతిచరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి యాసీన యై యూరకుండె నట్టియెడ బభ్రువాహనుండు దెప్పిఱి లేచి యప్పొలంతిం జూచి. 72

చ. ఇంచుక గానియుర్వ వనట ॥ నెన్నఁడుఁ బొందనితల్లి నేఁడు నా
మంచితనంబునం బిలుకు ॥ మాలిననాథుని నుగ్రశత్రులన్
మంచు నినుండువోలెఁ బరి ॥ మార్చుమహాబలుఁ జూచి యిట్లు దుః
ఖించుచు నుండఁ జూచితి స ॥ కిల్బిషచిత్తున కింత పెద్దయే. 73

క. గాదిలితనయుఁడ నగునేఁ, గా దన కిక్కురుకులాగ్ర ॥ గణ్యుని నిమ్మే
దినిఁ గూల్చితి మణికిర,ణోదాత్తం బైనమకుట ॥ మువ్విం బొందన్. 74

వ. అని విలాపంబు సేసి వివ్వచ్చుతోడం గూడ యజ్ఞతురంగానుసారులై వచ్చిన యాజ్ఞవల్క్యశిష్యప్రభృతిబ్రాహ్మణజనంబులు నయనపథప్రాప్తు లగుటయు. 75

సీ. అధ్వరహయవిహ ॥ రయంబుగా వీ రేమి, పని సేయువారొక్కొ ॥ పార్థుఁ డిట్లు
పడి యున్నవాఁ డని ॥ పలవించి జనకుని, నిట్లు సేసినపాపుఁ ॥ డెవ్విధమున
నాచరించునొకో ప్రా ॥ యశ్చిత్త మని పల్కి, పండ్రెండువర్షముల్ ॥ భైక్షవృత్తి
నిమ్మహాత్మునికపా ॥ లమ్మున నడపంగ, వలయుఁ గాకొం డెద్ది ॥ గలుగ నేర్చు

ఆ. నని యులూపిదిక్కు ॥ గనుఁగొని నీవు ప, న్పంగఁ దండ్రి నిట్లు ॥ భండనమున
విగతజీవితుఁడుగఁ ॥ దెగఁ జేసితివి నింక, నెలమిఁ బొందు భరత ॥ కులపవిత్ర. 76

వ. అని వెండియు. 77

క. జనకునిఁ దెగటార్చినపా, పునకుం బ్రాణంబుతోడి ॥ [1]పొత్తు మనంగా
మనమునఁ దాలిమి గలుగునె, చనుఁగాక యతండు సనిన ॥ సద్గతిక తగన్. 78

వ. అని యుగ్గడించి స్థావరంబులుజంగమంబులు నగుభూతంబులువిన భుజంగపుత్త్రియు నాకర్ణింపఁ జెప్పి [2]వ్రతంబు నిష్ఠం బూనెద మాతండ్రి లేకునికి నిజం బగునేనిఁ బ్రాయోపవేశంబ యుత్తమకృత్యంబు వీరవధంబు పాపం బంతకంటెను రాజవధం బెక్కుడంతకంటెఁ గడునగ్గలంబు ధార్మికవధంబు జనకవధపాతకం బింతయని కొలంది యిడ రాదిట్లుండ వీరుండును రాజును ధార్మికుండును జనకుండును నైన యిమ్మహాత్ముని వధియించినమహాపాతకుని కేతద్వ్రతానుష్ఠానంబు దక్క నొండుమెయి నిష్కృతి గల్గునే దీని నడపెద నని పలికి యప్పరమనియతుం డుపస్పర్శనం బాచరించి పలుకు లుడిగి కూర్చుండె నప్పుడు. 79

ఉలూపి సంజీవనమణిచేత నర్జును బ్రదికించుట.

ఆ. అట్లు దెంపు సేసి ॥ యాసీనులైనయా, తల్లిఁ గొడుకు నవనిఁ ॥ ద్రెళ్లి యున్న
విజయుఁ జూచి పాఁప ॥ వెలఁది సంజీవన, మణిఁ దలంచెఁ గురుస ॥ మాజముఖ్య. 80

వ. తలంచిన భుజంగమంబులకుం బరాయణం బైనయమ్మణి యమ్మహాభాగహస్త

1. 'పొత్తున మనఁగా' అని కొన్నిప్రతులు. 2. గ. వ్రతం బనుష్ఠింపం.

తలంబునకు వచ్చిన నాభామిని బభ్రువాహనునాననం బాలోకించి. 81

సీ. విజయుండు వచ్చునే వేఁడుకొలార యింద్రునిచేత నైన సీకొనిక నొక్క-
ప్రియము సేయంగఁ గోరియును నీకోలఁది యా, రయుబుద్ధినీతండు రణ మొనర్పఁ
దలఁచిన నివ్వీరుతలఁపు సిద్ధింపంగఁ, జేయుటకును నింత సేయ వలసె
నాకుఁ గావున మోహనం బగుమాయాప్ర, యోగంబు సిడిసతి నుజ్జ్వలాత్మ

తే. నరుఁడు నారాయణుఁడు మహత్తరము సువ్వె, యితని తేజ మెవ్వరికనిన నట్లుదాసి
నార్పవచ్చు మీవగ పెల్లఁ దీర్ప నిపుడ, యుత్థితుం డగు నీకొరవో త్తముండు. 82

వ. మాయాప్రయోగంబ వేఱొండు గాదు నీకు మీఁతండ్రితోడి భండనంబు సేయ
బుద్ధి పుట్టించితి నింతమాత్ర యని తత్ప్రదేశంబున నున్న యెల్లజనంబులు నుల్లం
బుల నానందంబు నొందఁ బలికి యమ్మణిపూరపురపతికరతలంబున నున్న మణి యిడి
దీని నిమ్మహాత్మునిహృదయదేశంబున మోపు మనుటయు నతం డట్లు చేయుటయుం
బార్థుండు ప్రత్యుజ్జీవితుం డై. 83

తే. లేచి కూర్చుండి కలయంగఁ జూచి మెల్ల
నెరలకాంతియు దంతరుచియును బెరయ
నతిమనోహరముగఁ దనసుతునితోడ
మనుజనాయక కుశలమే యనుడు నతఁడు. 84

సీ. వినయ మారంగ నాతనిచరణంబుల, కెఱఁగి భవత్ప్రసాదమున
నఖిలంబుఁ గుశలంబ యనిన నిజ్జనముల, మొగములయం దుల్ల నగవు దోఁచి
యచ్చెరువాటును హర్షంబుఁ గదిరెడు, నిది యేమి సెప్పవే యెఱుఁగు దేని
నాచెప్పినట్ల రణంబున కేతెంచి, తీవు చిత్రాంగద గోల వచ్చె

ఆ. నిచ్చటికి నులూపి [1]యేమిటి కిపుడు స
న్నెంచె ననుడు భక్తినిర్భరముగ
నతఁడు సాఁగి మ్రొక్కి హస్తముల్ మొగిచి య
య్యహితనూజఁ జూపి యతనితోడ. 85

వ. అంతయు నిమ్మహానుభావ సడుగుం డనిన గాండీవి యమ్మహాభాగవదనం బాలో
కించి కురువంశనిస్తారకా నీరాకకుం గారణం బేమి యిమ్మణిపూరపురనాథుని
దెస నావలన భవదీయచిత్తంబు ప్రసన్నం బయి యున్నయది యె యిన్నరపతి
యును నేనును జిత్రాంగదయును నీ కేమియు నపరాధంబు సేయము గదా
యనుటయును. 86

ఉలూపి యర్జునునితో వసువులకోపప్రసాదంబుల నెఱింగించుట.

సీ. అల్లన నవ్వుచు నయ్యింతి యతనితో, నాథ నీయందు దోకనాఁడు నెగ్గు
గలదె నాపుత్త్రునివలనఁ గీ డెక్కడి, యది వినీతాత్మ చిత్రాంగదయును

1. గ. యేటికిఁ జను దెంచె, ననుడు నచలభక్తివినయగతుల.

గినియక విను మేను ǂ వినతోత్తమాంగ నై, చెప్పెద నీసుతుǂచేత నీకు
నావహిల్లె నశుభ ǂ మాహవంబున నీవు, గంగాతనూజు శిǂఖండి నెపము

తే. గాఁగఁ బెగటార్చి తది పాతǂకంబు దాని, కనఘ నిష్కృతి సేయకǂతనువు విడిచి
తేని నరకవాసమునకుఁǂబోన వలయుఁ, గాన నిష్కృతి సేసితిఁǂగడఁగి వచ్చి. 87

వ. అది యెట్లంటేని నాకర్ణింపు మే నొక్కనాఁడు సఖీసమేతంబుగా సురనదీ
స్నానంబునకు వచ్చి యుండ వసువు లక్కడ కేతెంచి యింత నంత నొక్క
రేవునం దోఁచి కృతస్నాను లై నిజరూపంబున సన్నిహిత యైనగంగాదేవితోడ
గాండీవధరుండు శిఖండిం బురస్కరించికొని గాంగేయుం జేయ కుండం బరమ
సాయకంబుల నతనిం గూల్చె నట్లు కుత్సితజయార్జనం బొనర్చినయయ్యర్జును
నేము శాపసంతాపితుం జేయుదు మని చెప్పిన నప్పరమానుభావయు దాని
కొడంబడినపలుకు వలికె నంతయు విని తత్క్షణంబ. 88

సీ. అరిగి యేఁ దండ్రికి ǂ న త్తెఱం గంతయు, నెఱిఁగించుటయు నతం ǂ డెసక మెసఁగ
భయమున రయమునఁǂబఱతెంచి వసువులఁ, బెక్కువిధంబులఁǂబ్రియము వుట్టఁ
బిలిచి ప్రార్థించిన ǂ నలుక వోవిడిచి వా, రతనితో విను సమǂయం బొకండు
సేసెద మనిలోన ǂ వాసవిఁ దత్సూనుఁ, డగుబభ్రువాహనుం ǂ డస్త్రవితతిఁ

ఆ. బఱపి కూల్చెనేనిఁ ǂ బాయు నక్కిల్బిష, మనిన మగిడి వచ్చి ǂ యాభుజంగ
నాథుఁ డెల్లఁ జెప్పె ǂ నాకు నిప్పని దగ, నిట్లు దీర్చితిని సǂమిద్ధతేజ. 89

వ. తీర్చిన తెఱంగు నెఱింగించెద నని పలికి బభ్రువాహను నుపలక్షించి యి
క్కుమారుండు నీతో సమరంబు సేయ నొల్లక నీకు నమస్కరించి మరలి
మందిరంబునకుం బోవు చున్కి బుద్ధిం గని సమయకార్యంబునకు నిది యవ
సరం బని యూహించి రయంబున నితనికడకు వచ్చి రణంబు మీతండ్రికిఁ
బ్రియంబును ధర్మంబు నని చెప్పి యితనిం బోరికిం బురికొల్పి యివ్వీరునియందు
వసువులు సెప్పినవిధంబు గలుగునట్లుగా విక్రమవిశేషం బావహించితి. 90

క. అనినఁ బ్రియ మంది దేవీ, యనఘుం బగునీచరిత్ర ǂ మస్మత్కులవ
ర్ధనకారి యగుట యెప్పుడుఁ, గనినది గాదె యని పలికె ǂ గాండీవి నృపా. 91

ఆ. పలికి సాదరముగ ǂ బభ్రువాహనుఁ జూచి, మానితాగమిష్యǂమాణచైత్ర
మాసపౌర్ణమాసి ǂ మహితాశ్వమేధకా,లంబు దాని దెసఁ దǂలంపు గలిగి. 92

క. నీవును దల్లులు బంధుజ,నావళియుం బరిజనములు ǂ హస్తినగరికిన్
రా వలయు ధర్మజునిసం,భావనముం బడయు టొసఁగుఁ ǂ బరమశుభంబున్. 93

చ. అనవుడు నట్ల చేసెద నుǂదాత్తచరిత్ర పురంబు సొచ్చి యి
వ్వనితలు నీవు నావలనిǂవత్సలతం గొనియాడు చియ్యెడన్
మన మలరంగ నిల్చి జనǂమాన్యునిఁ గా ననుఁ జేసి ప్రీతి నే
ననుపఁగ వచ్చి చేయు మనుǂయానము యజ్ఞతురంగరక్షకై. 94

వ. అనుచుం బ్రణతుండై బభ్రువాహనుండు ప్రార్థించినఁ బార్థుం డప్పార్థివునితో నేను దీక్షితుండ నగుట యెఱుంగవే నాకుం బురప్రవేశంబు సేయం జనదు పోయి వచ్చెద మీరును సుఖుల రగుచు నుండుం డనిన నట్ల కాక యని యతం డుచితప్రకారంబునం బూజించి యామంత్రణంబు సేయ సబాష్పాంబుచేత ననుజ్ఞాతుం డై యమ్మహాత్ముండు యజ్ఞాశ్వంబు ననుసరించు నదియు నిచ్ఛ నఖిల దేశంబులం బ్రవర్తిల్లె నట్టియెడ. 95

క. రాజగృహపురముకడ న,వ్వాజి యరుగు టెఱిఁగి సంహారమునకుఁ బిలిచెన్
రాజత్కీర్తిధనుం డగు,నాజిష్ణుని మేఘసంధి యనువాఁడు జనపా. 96

వ. అట్టు లప్పురంబుపతి యగుజరాసంధపౌత్త్రుండు బాల్యంబునం దన్ను నెదిరి నెఱుం గమిం గవ్వడిం గయ్యంబునకుం బిలిచి పుచ్చి తోడన కల్పితరథారూఢుం డై వెడలి యవ్వాసవికి నడ్డపడి. 97

సీ. వనితలలోపలఁ జని యెదుచాడ్పున, నివ్వాజిఁ గొని యేఁగుచుంటి కేని సంక
లేక పోయెదవు పోరనీక యేఁ బట్టెద, దీనిఁ గయ్యము సేసి దేనిఁ జేయు
మనుడు నవ్వుచు నతం డప్పుడు మగధేశుతో, విఘ్నకర్తల నేను వెరపునొందు
మాన్పింతు వినుము నాకమసమునఁ గిన్క లే, దది యెట్టు లనిన మాయగ్రజుండు

తే. [1]సామమునన కర్జము నీవు సక్కఁబెట్టి, కొందుగాని యెవ్వరియెడఁ గ్రూరవృత్తి
వలవ దని నాకుఁ జెప్పిన వాఁడు గాన, యట్లు సేయుదు నీ యిష్ట మాచరింపు.

అర్జునుఁడు జరాసంధపౌత్త్రునితో యుద్ధంబు సేసి ఓడించుట.

చ. అనవుడు నేమియుం బలుక కాన్నృపపుత్త్రుఁడు నిర్జరేంద్రపు
త్త్రునిపయి నుజ్జ్వలంబు లగుతూపుగముల్ వరఁగింప వాని నె
ల్ల నతఁడు శాతభల్లతతులం దునుమాడియు నొల్లఁడయ్యెఁ ద
త్తను వొకబాణ మేనియును దాఁకఁగ నేయ నరేశ్వరోత్తమా. 99

వ. అగ్గాండీవికృప యే మని చెప్పుదు. 100

క. తనమీఁద మగధుఁ డేయఁగ, జననాయక రథ్యములను సారథి నైనం
గొనకొని నొప్పింపక యు,ల్లన శరనికరంబు పైఁ గలయ నిగిడించెన్. 101

క. అది బలహీనతగాఁ గొని, మద మేపారంగ నక్కుమారుఁడు లీలం
గదిసి బలునారసంబులు, తదంగమునఁ గ్రుచ్చె నతఁడు దాన నలిగియున్. 102

వ. ఆసహదేవపుత్త్రుగాత్త్రంబు దాఁక కుండునట్లుగా శరంబులు నిగిడించి. 103

ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబుఁ బగిల్చి కేతువుం
జీరి శరాసనంబుఁ బొడి చేసిన నమ్మగధుండు ధీరతో
దారగతిన్ సముజ్జ్వలగదాభ్రమణంబున బాహు వొప్ప న
వ్వీరవరేణ్యుపైఁ గవిసె విక్రమ మాకృతి దాల్చి పొల్చె నాన్. 104

1. క. చ. జ. "సామమునఁ గర్జమున నీవు'.

వ. అట్లు గవియుటయు. 105

తే. అప్పుడును మత్సరంబున కతఁడు భాజ
నంబు గా కుండెఁ గాన యన్నరుఁడు వెడఁద
వాతియమ్ముల గద పలువ్రయ్యలై మ
హీతలంబునఁ దొరఁగంగ నేసె నధిప. 106

వ. అ ట్లేసిన. 107

సీ. నివ్వెఱపడినయానృపనందనునితోడ, నయ్యతిబలుఁడు మాయన్న యొకని
ప్రాణంబునకును దప్పకు మయ్యా యని [1]యూఁస,తిచ్చినకతన నే నేయ కున్న
నీ వింతవడి పోర నిలువఁ జాలితి విను, మది యట్టు లుండె రాజార్హమైన
ధర్మంబు వాటించి తాఁకితి నన్ను నిం,తియ చాలు నింక శాంతియ నరేంద్ర

తే. తగినయది యని పల్కె నతండు నిజము, నట్ల కా కని యూహించి యమ్మహాత్ము
పాదపరిసరమున భక్తిఁ బ్రణతుఁ డైన, గ్రుచ్చికౌఁగిటఁ జేర్చియ క్కురువిభుండు.

వ. వచ్చుచైత్రమాసంబునం బున్నమనాఁడు పాండవాగ్రజునశ్వమేధం బనుసంధిం
చుటకై బంధులు నీవును రావలయు ననిన నవ్వసుమతీపతి యట్ల చేసెద నని
యత్యంతవినయంబున నవ్విజయుం బ్రియపూర్వకంబుగాఁ బూజించి యామంత్రి
తుం జేసిన నాతండు ప్రీతుం డయి యభినందించి యమ్మగధపతిం బురంబునకుం
బోవం బనిచి యశ్వరత్నంబు ననుసరించె నదియును వంగ పుండ్ర మ్లేచ్ఛదేశం
బులం జరియింప నయ్యైరాజులు పెనకినం దేజోధనుం డగునాధనంజయుండు
జయించుచుఁ జన నత్తురంగంబు. 109

సీ. చేదిదేశంబు సొచ్చిన శిశుపాలుని,తనయుండు శరభుండు దనదుశుక్తి
పురము వెల్వడి యుద్ధపూర్వకంబుగఁ జేరి, యమ్మహావీరున కర్చ లిచ్చె
నతని వీడ్కొల్పి యయ్యతులతేజుఁడుఘోట,కము వెన్కఁ జనుచుఁ డేంకణకిరాత
ముఖదేశనృపతులు ముట్టినఁ దగ గెల్చి, గొనుచుఁ గ్రమంబునఁ గోసలులను

ఆ. గాశులను జయించెఁ గ్రమ్మఱి యత్తురం,గము దశార్ణదేశగామి యయ్యె
జిష్ణుఁ డనుసరింపఁ జిత్రాంగదుం డని, సేసి యోడి పూజ సేసె నధిప. 110

వ. ఇట్లు దశార్ణపతి పార్థునిం బూజించి యాతనియాదరణంబు వడసి పోయెఁ బదంపడి
తురంగంబు నిషాదాధీశదేశంబునకుం జనిన నేకలవ్యనందనుండు పాకశాసననందను
మీఁద నైపాదసేనాసమేతుం డై తోఁతెంచిన. 111

చ. అతనిబలంబుఁ గ్రూరవిశిఖార్చుల నేర్చిన బాహుసారగ
ర్వితుఁ డగునన్నిషాదపతి వీఁక నెదుర్కొనినం గిరీటి యా
తతపటుబాణదీధితులఁ దన్మదసంతమసం బడంచె వాఁ
డతివినయంబునన్ వినతుఁ డై తగ నర్చితుఁ జేసె నాతనిన్. 112

---

1. గ. యప్పగించినకతన నేఁ ♦ గినియకున్న.

వ. అట్లేకలవ్యనందనుం దనవశంబు సేసికొని ధనంజయుండు హయంబు ననుగమించె నది మరలి మఱియును దక్షిణాభిముఖం బయి చని తిరుగఁ జోళాంధ్ర ద్రవిళ కేరళ కర్ణాట దేశాధీశుల ననాయాసంబున వశగతులం గావించికొని యక్రమంబున సౌరాష్ట్రంబు సొచ్చి గోకర్ణసమీపంబునఁ బ్రవర్తించి పదంపడి. 113

సీ. ద్వారకానగరంబుఁ జేరువ ఘోటకం, బరుగంగ శ్రీకృష్ణుఁ డంత యదుకుమారు
లాలపుటాలంబున ననువున సంక్రంద, నందనుఁ గని పూజనం బొనర్చి
నభినందనము సేసె నవ్వీరుఁ డపరాబ్ధి, తీరదేశంబులం దిరిగి పంచ
నదముపైఁ జని మావు నరనాథ గాంధార, దేశంబు సొచ్చి వర్తింప శకుని

తే. నందనుఁడు బాల్యకలితదుర్నయము పేర్మిఁ
దనదు సేనలఁ గూర్చి యుద్దామగతిఁ గి
రీటిఁ దాఁకిన నతఁడు వారించి పాండ
వాగ్రజుని యాజ్ఞ దెలుపంగ నంతఁ బోక. 114

క. పొదివినఁ గనుఁగవ వెడ కెం, పొదవఁగఁ జతురంగముల నసత్కారములఁ దాఁ
బొదివె విజయుఁ డని వడియుం, జెదరియు సన్నంబులైనఁ జిత్తము లొసఁగన్. 115

ఉ. మత్సర మెక్కఁగా సుబలుమన్మఁడు దుర్దమలీలఁ గిట్టి బీ
భత్సునిపై నిశాతశరపంక్తి నిగుడ్పఁ దదీయబాహుసం
పత్సముదీర్ణతం దనదుభావమునం గొనియాడి యంతయున్
వత్సలుఁ డైనయన్నరుఁడు వానికి నిట్లనుఁ గౌరవోత్తమా. 116

క. రాజులఁ జంపకు మని మా, రాజాసతి యిచ్చె నుగ్రతరతనే ననిస
వ్యాజ విడిచినఁ బైనఁ బ, రాజితుఁగా నన్ను సద్ధరాపతి దలఁచున్. 117

అర్జునుఁడు గాంధారదేశాధీశునితో యుద్ధంబు సేసి జయించుట.

ఉ. కావున నేఁ గడంగ వినుఁ గయ్యము నీ కిది యేల తమ్ముఁడా
నా వినియున్ వడిన్ శకునినందనుఁ డయ్యమరేంద్రనందనుం
దా విశిఖంబులం బొదివెఁ దానికి ²నవ్వుచు వానిశీర్షకం
బా విజయుండు బల్విడిఁ దయమ్మున నేలఁ బడంగఁ జేసినన్. 118

వ. అచ్చిత్రము సూచి యచ్చోటం గలయట్టి. 119

క. ఎల్లజనులు నివ్వెఱం, డొల్లఁడు గా కుత్తమాంగ మురివి నీటుల వే
డొల్లఁగ నేయఁడె వలసినఁ, జెల్లం బో యితనికరుణ చెలువి ట్లున్నే. 120

వ. అనుచు నక్కుమారుం జేరి యతని తేరు మరల్చికొని పోవం బోవ. 121

తే. దురభిమానము పేర్మి నన్నరవరుండు
మరలి నరుమీఁద నడవ మున్ దెరలి చనిన

1. జ. మాన్య నరనాథ. 2. జ. నప్పుడు తచ్ఛిరస్త్రకం.

బలము గ్రమ్మఱి యయ్యింద్రుఁ బట్టెఁ జుట్టు
బలసి శస్త్రాస్త్రచయములు పరఁగఁ జేయ. 122

చ. అవి నిశితాస్త్రపంక్తిఁ దునుమాడి రయం బెసఁగంగఁ గప్పె నా
హవతల మంతయుం దలర నప్పటువిక్రమశాలి యమ్మహో
గ్రవిహరణంబుసం గలఁగి కన్కనిఁ బాఱె బలంబు లక్కుమా
రవరునిఁ గాచికొంటకు ధరావర మంత్రులు వానితల్లియున్. 123

వ. అర్ఘ్యంబు గొని రయంబున శరణు శరణనుచు వచ్చిన నవ్వివ్వచ్చుండును నవ్వె
లంది నభినందించి మంత్రులకు మాననీయవచనంబులం బ్రియం బొనర్చి [1]య
బ్బాలునితో సాంత్వనస్వరంబున ని ట్లనియె. 124

ఉ. నీ వీటు వన్ని నాపయి ననింద్యపరాక్రమ రాక సూచి మ
ద్భావము ఖేద మొందుటయు ధర్మజుపం పిది రాజకోటి నే
నేవిధి నైనఁ జంప నని యెల్లజనంబు వినంగఁ జెప్పనే
కావున నీబలంబులన కాని నినుం దెగటార్ప కుండితిన్. 125

వ. విశేషించి గాంధారీధృతరాష్ట్రులం దలంచి నాకు నీదెస నిట్లు గా వలసి యుండె.

ఆ. అట్టు లగుటఁ జేసి యవనీశనందన, యింత ప్రొద్దుఁ బోరి యింక శాంతిఁ
బొందు టొప్పు ధర్మపుత్త్రునితోడిపొం, దొప్ప దయ్య నీకు నుదితశౌర్య. 127

వ. అని చెప్పి యాగామి యయినచైత్రంబుపున్నమనాఁ డన్న రేంద్రచంద్రు నశ్వమే
ధయాగంబున కనురాగం బెసంగ రమ్మీ యనియునుం బలికి యప్పాండవమధ్య
ముండు మేధ్యాశ్వంబు ననుసరింప నది కరిపురంబుదిక్కు మొగం బయి యరుగం
జొచ్చె నట్టియెడ నతండు వివిధదేశంబులం దిరిగిన తెఱం గెల్లనుం జారులచేత విని
యజాతశత్త్రుం డప్పురుహూతపుత్త్రుం డశ్వరక్షణం బట్లు ధర్మప్రకారంబున
నిర్వహించుటకుం బ్రీతి వహించె నద్దివసంబు. 128

ఆ. మాఘమాసపౌర్ణమాసి యై యుండె నా, ధర్మనందనుండు పేర్మి వెలయ
నెలమి మిగులఁ బెద్దకొలువున నుండి త,మ్ముల సగౌరవముగఁ బిలువఁ బనిచి. 129

వ. అనిలనందనునాననం బాలోకించి. 130

క. నీతమ్ముఁడు తురగముఁ గొని, యేతెంచుట వింటిఁ జైత్ర మింకఁ దడవు లే
దీతఱి మునులను నృపసం,ఘాతంబును బిలువఁ బంపఁగా వలయుఁ దగన్. 131

వ. యాగశాలయు శిల్పిజనులం గొని కల్పింపుము తగువారలకు విడియం దగియెడు
వివిధగృహంబుల నొనరింపు మని పనిచిన నతండు. 132

ఆ. యజ్ఞవాటమును జనాధిపులకు ముని,వ్రాతములకు విడియ వలయునట్టి
మందిరములుఁ గనకమణిమయంబులు గా నొ,నర్చెఁ దజ్జ్ఞమగుజనంబు పొగడ.

1. క. యబ్బాలుని సాంత్వవచనంబుల.

క. ధరణీసురులను బనిచెను, ధర నెందును దిరిగి మునుల । ధాత్రీశుల న
ధ్వరమునకుఁ బిలువఁ బని యమ్మరుత్సుతుఁడు వారుఁ జని సముచితభక్తిన్.

చ. పిలిచిన రాజులున్ మునులుఁ । బ్రీతి యెలర్పఁ బలోత్కరంబు శి
ష్యులుఁ దమతోడ రా మనము । లువ్విళు లూరఁగ యజ్ఞవర్తనం
బులు గనుఁగొంటకై సకలభూవలయంబునఁ గల్గునట్టివా
రలు సనుదెంచినం గురుధరాపతి చిత్తము వేడ్కఁ నూనఁగన్. 135

క. ఎదురుకొని వీడుఁబట్టకు, ముద మారఁగఁ దాన యనిచి । మొక్కలములు నిం
పొదవించునట్టివియుఁ గాఁ, బదార్థములు [1] ప్రజదలమునఁ । బొలిచించి తగన్. 136

క. భోజనశయనాసనములు, రాజిల్లెడునట్లు గాఁగ । రాజుల కెల్లం
దేజోధనుఁ డా ధర్మతనూజుం డిడఁ బనుచు జనవినుతానుపరిగ్రన్. 137

చ. మునులకు నెల్లఁ గందములు । మూలములున్ ఫలకోట్లును బ్రియం
బొనరఁగఁ దాన పోయి మధురోక్తులతోడ సమర్పణంబు సే
యు నిటుల సంవిధానము లనూనము లై విలసిల్లఁ జేయు న
య్యనిమిషనాథవైభవుఁ డహంకృతివర్జనసంస్తుతుండు గాఁగన్. 138

తే. యజ్ఞవాటంబుఁ దక్కటియాలయములు
లలితభంగి రమ్యములు సకలగుణములుఁ
గా నొనర్చినశిల్పినికాయమునకుఁ
బసదనం బిచ్చె సంతసం । బెసక మెసఁగ. 139

సీ. పాండవాగ్రజుఁ డట్లు । పవనసందనుఁ బంచి, యజ్ఞశాలాసరణాను లైన
కృత్యముల్ నడపుట । గృష్ణుండు గనుఁగొని, కడుఁ బ్రీతిఁ బొంది నాగతస్వపాలు
రచ్చెరు వొంది రయ్యమృతాంశువంశని, స్తారకుం దర్శించెఁ । దేరఁ బసుప
ననవద్యపశువుల । నఖిలజాతులవానిఁ, గొని వచ్చి రత్యంతకుశలపరిజ

ఆ. నంబు లన్నపర్వతంబులు నాజ్యవా, హినులుఁ గల్గి విప్రజనపరంప
రలు భుజించుపేర్మి యొలసి యాగారంభ, సమయమద్భుత ప్రకాశక మయ్యె. 140

క. విను లక్షభూసురులు గుడిచిన నొకమరి మ్రోయుభేరి । సెలఁగుచు నుండున్
జననాయక యెప్పుడు నే, మని చెప్పుదు నశ్వమేధయజ్ఞవిభూతిన్. 141

చ. శరధిపరీతభూమిఁ గలసర్వజనంబును దోఁచె నమ్మహా
ధ్వరమున భూపతుల్ మకుటపంక్తులు భూషణరాజిఁ జక్కఁగాఁ
బొరిఁబొరిఁ ద్రోచికొందు మదిఁ । బొంపిరి వోయెడు వేడుకం బనుల్
వెరవులు లావులున్ మెఱయ । వేయువిధంబులఁ జేయు చొప్పఁగన్. 142

సీ. కలయంగ రాజులఁ । గనుఁగొని ధర్మసందనుఁడు భీమునిఁ బిల్చి । మనుజపతుల
కెల్లను వే పూజ । లిమ్మన్న నమ్మరు, త్తనయుఁడు దగఁ దనతమ్ముఁ డోయి

1. అ. పసదనములఁ.

నెలమిఁ గూర్చికొని మహీశుల సబహుమానంబుగఁ బూజించె నలిననాభుఁ
డప్పుడ సీరిసాత్యకిముఖయాదవసహితంబు గాఁగఁ బ్రసన్నవదన

తే. కమల మొప్పంగఁ బాండవాగ్రజునికడకు
వచ్చుడును బ్రియ మలర సర్వవసుమతీశుఁ
డాబలుండును నతఁడును నాదిగా స
మస్తయాదవులకు నధికార్చ లిచ్చె. 143

వ. నారాయణుండు నరునిం బ్రసంగించి పాండవాగ్రజుమొగంబు గనుంగొని ద్వారవతినుండి యాప్తుండును విచక్షణుండును నగువాఁ డొక్కరుండు వచ్చె వివ్వచ్చుం డప్పురంబుపరిసరంబునఁ బోవం జూచితి ననియె వివిధసంగరంబులం దదంగంబు కృశం బై యున్నయది యనియుం జెప్పె నప్పార్థుండు సేరువకు నరుగుదెంచెం గాఁగోచితక్రియాకలాపంబునకుం దొడంగు మనవుడు నప్పుడమిఱేఁ డప్పురుషోత్తమునితోడ. 144

క. నీపంపునఁ బోవుట నుద్దీపితబలశౌర్యధైర్యతేజోయుతుఁ డై
యాపార్థుఁడు యోగక్షేమాపేతుం డయ్యె నదవు ముచితింపుఁబనుల్. 145

కృష్ణుఁడు ధర్మజునితో నర్జునుసందేశంబు సెప్పుట.

వ. అనిన నవ్వారిజనాభుండు ద్వారకనుండి వచ్చినవాఁ డగ్గాండీవి దనతోడం జెప్పె నని చెప్పినమాటల తెఱం గాకర్ణింపుము. 146

ఆ. నాదువిన్నపముగ నరనాథునకు విన్నవింపు రాజు లెల్ల వేడ్కతోడ
జన్నమునకు వచ్చుచున్నారు మున్నట్టి వార లైనఁ బూజ వలయు ననుము. 147

వ. విశేషించి మదీయపుత్త్రుండు. 148

క. మణిపూరపురాధీశుఁడు, గుణగణవిభ్రాజితుండు గురుహితుఁడు విచ
క్షణపరుఁడు బభ్రువాహనుఁ, డణుమాత్రముఁ గీడు లేనియట్టిం డెందున్. 149

క. మీచరణసరసిజంబులు, సూచుటకై రాక దనకు సువ్రతముగ మున్
వేచి యునికి వచ్చుఁ గృపాగోచర మగుచేతకుం దగును మీ కనుమీ. 150

వ. అని చెప్పె ననిన విని యవ్వాక్యంబు లభినందించి ధర్మనందనుండు గోవిందుని తోడ. 151

సీ. ఏ వింటి విజయుఁ డనేక యుద్ధంబుల, నలజడి వడుట యల్లతఁడు నాఁడు
నక్కట ద్రోణభీష్మాదులతోడి యెక్కుడుఁబోర నిడుమలఁ బడియె నేఁడు
నిత్తెఱంగునఁ బడియెడు నాకుఁగా నిన్నిపాటులు వడునె యప్పరమసౌఖ్య
యోగ్యదేహుండు నిన్నొక్కటి నడిగెద, నతనిమేను సులక్షణాన్వితంబు

తే. నామదికి నెక్క నీవు గన స్వాఱపి కన్న, యట్టికీడు తదీయంబు లైనయవయ
వముల నెందేనిఁ గలిగెనే యమితదుఃఖభాగి యగుటకు మూలమై పద్మనాభ.

క. తెలుపఁ దగునేనిఁ గరుణం, దెలుపుము నాకనుడు వాసుదేవుఁడు నీకుం

నెగడునె యింకను బుట్టరు, జగతిని [1]గాండీవితోడ | సరి వచ్చుమగల్. 161

క. మానుషము దైవమును నగి, నే నే నని కార్యసిద్ధి | నెలయింపఁగ ని-
-త్యానందుఁ డయ్యె ధర్మజుఁ, డీనిర్మలభాగ్యమహిమ | యెరికిఁ గలదే. 162

క. విను మట్లు సెలఁగఁగ ఘూర్ణన మొందినయర్ణవం బనఁగఁ బొంగారెన్
జననికురుంబం బాపెం, పనఘా చూడ వినఁ బడయ | మఖిలజగములన్. 163

వ. మఱియును. 164

సీ. నృపు లోహటింప జం|త్రపుమీను నేసి చే,కొనియెఁ బాంచాలుని|కూఁతు నితఁడె
సుర సేసతోఁ బురం|దరు గెల్చి భుజగర్వ, మే పార ఖాండవం | బేర్చె నితఁడె
యెక్కటిబవరాన | నీశాను మెప్పించి, పాశుపతాస్త్రంబుఁ | బడసె నితఁడె
యొంటిమై భీష్మాది|యోధుల కురుపతి,ధృతిఁ బాపి గోవులఁ | [2]దెచ్చె నితఁడె

తే. ప్రతిన సేసి విషమసమ|రమునఁ బ్రొద్దు
గ్రుంక నీ కాఁగి సైంధవుఁ | గూల్చె నితఁడె
యనుచు సందడిగాఁ గ్రమ్మి | యఱ్ఱు లెత్తి
చూచె జనలోక మాసవ్య|సాచిఁ బ్రీతి. 165

క. ఆవాక్యము లెల్ల వినుచు, భావ మలర నర్జునుండు | భాసుర మగున
మ్మా వగ్రేసరముగ యజ్ఞావాసంబునకు వచ్చె | నంచితలీలన్. 166

వ. అట్టియెడ ధర్మనందనుండును భీమాదులును గృష్ణుండును బలదేవప్రభృతులును ధృతరాష్ట్రుం బురస్కరించికొనుచు నప్పార్థు నెదుర్కొని రతండు వారల నెల్ల సముచితాచారసంప్రీతులం గావించి గాంధారిని గుంతినిం గాంచి యీఁతకాఁడు తీరంబు గనినచందంబు నొంది యందఱు నభినందించుచుం బొదివికొని యుండ నొక్కరమ్యప్రదేశంబున నుండె నాసమయంబున. 167

సీ. బభ్రువాహనుఁడు వై|భవ మొప్పఁ జిత్రాంగ
దయు నులూపియుఁ బ్రమ|దంబుతోడఁ
దోడ రా ధర్మపు|త్త్రునిమందిరమునకు
నరుగుదెంచుటయు న|క్కురువరేణ్యుఁ
డును దమ్ములును గృష్ణుఁ|డును బలభద్రాది
యాదవులును బ్రీతు | లై తదీయ
సందర్శనము నర్హ|సత్కారచరితార్థ
ముగఁ జేసి రతఁడును | దగినవిధుల

తే. నందఱకుఁ బ్రియ మొనరించి | యాంబికేయు
నతనిభార్యను గని నమ|స్కృతు లొనర్చి
గొంతిఁ గాంచి యాయమయడు|గులకు నెఱఁగి

---

1. క. సరివచ్చుమగలు ♦ శతమఘుజునకున్. 2. గ. దెల్చె.

డెద్దియేనియు దుఃఖ మొలసినఁ జనుదెంచి, యది నిస్తరింపక యరుగునతఁడు
తే. మందునకు [1]వెదకినను లేఁ డంద మొంద, నరసి కుడువుఁడు కట్టుఁ డిచ్ఛానురూప
వస్తువులు గైకొనుఁడు దురవస్థ దెలిపి, పాపికొనుఁ డని భీముండు పలుకుచునికి.
ఉ. ఆయతులాధ్వరంబున వ్రతాభిరతత్వము లేనివాఁడుపా
ధ్యాయుఁడు గానివాఁడు నిగమాంగకషట్కము లేనివాఁడు లేఁ
డేయెడఁ జూచినన్ సభ నరేశ్వర యట్టిసదస్యులమ్మరు
న్నాయకుకొల్వుదివ్యమునినాథులు దక్కఁగఁ గల్గ రెచ్చటన్. 177
వ. అట్లుం గాక. 178
సీ. కనుఁగొను కౌతుకంబునఁ గూడి చనుదెంచి, దివ్యమునీంద్రు లతిప్రియమున
నభినందనము సేయ నఖిలగంధర్వులు, నానందనము లగుగానములను
నప్సరఃస్త్రీలు హృద్యము లైననృత్యవి, శేషంబులను నుల్లసిల్లుచుండ
సిద్ధవిప్రజనంబు సేసలు సల్లుచు, బహువిధాశీర్వాదపరతఁ బరఁగ
తే. నాద్యు లై పేరు గలుగుపూర్వ దార్వరవని
వరులయాగంబులకు సరివచ్చు మిగులుఁ
గాని యిది వట్రుపడ దనఁగా వెలుంగు
ధర్మతనయునియశ్వమేధము నరేంద్ర. 179
వ. పసిఁడియిట్టికలం జతుశ్చిత్యంబు నష్టాదశకరాత్మకంబును గరుడాకృతియును గా
యజనం బొనర్చి మహనీయం బై యొప్పుచుండుయూపక్రియాసమయంబున
ఖాదిరంబు లాఱును బైల్వంబు లాఱును పాలాశంబు లాఱును దేవదారు
మయంబులు రెండును శ్లేష్మాతకతరుకల్పితం బొకండును గా నిరువదియొక్క
యూపంబులును దక్కను శోభనార్థంబుగా ననేకకాంచనయూపసంచయంబును
శాస్త్రోక్తప్రకారంబున యాజకులు నిలిపి వానియందు. 180
క. నలుగాలివానిఁ బక్షుల, జలచరముల విధియుతముగ సంయోజింపం
బొలిచెం బశువులు మున్నూ, అలఘుయశోమహిత యమ్మహాయజనమునన్. 181
క. వరయూపసుయోజిత మగు, తురంగమముచుట్టుఁ బశుతతుల నిల్పినసుం
దరభావము దక్షమఖ, స్ఫురణం బిట్టి దని చూపుపోలిక మెఱసెన్. 182
తే. ఆగమోక్తంబు దర్శనీయంబు నైన, యాసుతంత్రంబు నొనరించుయాజకోత్త
మావలికిఁ దా నలంకార మై పరాశ, రాత్మజునిశిష్యకోటి యొప్పారె నధిప. 183

ధర్మరాజు వ్యాసునకు యజ్ఞదక్షిణగాఁ దనరాజ్యం బంతయు నిచ్చుట.

వ. సర్వపశు[2]శ్రపణంబు లాచరించి ఋత్విగ్జనంబు లశ్వాలంభసమయంబున
యాజ్ఞసేని సన్నిహితం జేసి యశ్వంబునవయవంబులమాంసంబు లయ్యై దేవత
లకు నాహుతు లిడునప్పు డమ్మహాదేవి నిజహస్తంబునం జేయం దగియెడు

1. క. వెదకిన లేఁడు ♦ నంద. 2. గ. విశసనంబు లాచరించి.

హుతంబులు సేయించిరి తదనంతరంబ యశ్వవపాహోమంబునం బరఁగు
గంధం బాఘ్రాణించి ధర్మనందనుండు దమ్ములుం దానును బగపహాసందంబునం
బొందె శేషించినయశ్వావయవంబు లర్హప్రకారంబున ఋత్విజులు వేల్చి రిట్లు
సాత్యవతేయుండు యుధిష్ఠిరునశ్వమేధం బఖిలలోకహితంబుగా నిర్వహించి
యాతనిఁగుఱించి యుదాత్తనాదం బెసంగ నాశీర్వాదంబు సేసె సమస్తదేవ
మునులును దీవన లిచ్చి రప్పుడు కౌరవవంశపావనుం డగుభూవరుండు. 184

తే. అలఘుభక్తిసదస్యుల కెలమి నొసఁగ, మొసఁగఁ గోటివేల్ నిష్కములిచ్చి తనదు
వసుధ యంతయు నొసఁగె దివ్యప్రబోధ, ఘనత నొప్పు వేదవ్యాసమునివరునకు.

క. విను ఋత్విగాధ్యుఁ డగున, మ్మునిపతి యట్లు నసువంశమునఁ బూర్వుఁ డొసఁగ మే
దిని సంప్రమోదమునఁ గై, కొని యిట్లను నానరేంద్రుగనుఁగొనెన్. 186

ఆ. జగతి ఋత్విగర్థముగ నిచ్చి తేము వి, ప్రస్వభావకలనఁ బసిఁడి నొసఁగఁ
గోరెదము కరంబు గారవంబున బ్రాహ్మ, ణాభిలషితదాయి వగుట మేలు. 187

వ. అని వెండియు. 188

క. ఇలకు వెలగా హిరణ్యం, బలఘుమతీ మాకు నొసఁగు మనుటయు ధరణీ
శులు వినఁగా నప్పౌరవ, కులపతి యావేదరతుల కిట్లని యనెన్. 189

ఆ. అశ్వమేధమునకు నార్యులు దక్షిణ, ధరణి యండ్రు గాన నగుని చేత
విజితమైనధరణి ప్రజనితప్రీతిన్మై, ఋత్విగర్చనముగ నిచ్చినాఁడ. 190

వ. అని మఱియును. 191

చ. వనమున కేఁగి యందు సుఖవాసత నుండఁగలాఁడఁ గాక యీ
ననఘవిచార బ్రహ్మధన మక్కట కొందునె యన్నఁ బ్రీతితో
ననుజులు యాజ్ఞసేనియును నట్టిద యాపని యొంగి చెప్ప నిం
డనుటయు హర్షబాష్పపులకాంకురముల్ ధరియించి రందఱున్. 192

వ. అప్పుడు. 193

తే. దివ్యవాణి కీర్తించెఁ గౌరవ్యవరుని
నఖిలజనములుఁ బ్రస్తుతిముఖరు లైరి
తానుఁ బొగడి వేదవ్యాసుఁ డానరేంద్ర
చంద్రునకు నిట్టు లను విప్రచయము వినఁగ. 194

క. ఏ మమ్మెద మనినఁ బృథివి, యో మనుజాధీశ కొనుట యొప్పెడు తెరు విం
దేమియును నెగ్గు లే దీ, భూమిసురులకోర్కి దీర్చి పుచ్చుము ప్రీతిన్. 195

క. అని పలికినఁ గృష్ణుం డి, మ్మునినాయకుపనుపు సేయుము నరేశ్వర నీ
వని చెప్పిన నొడఁబడి తన, యనుజులతో నట్ల కాక యని యతఁ డర్థిన్. 196

తే. కోటికోటులు మాడలు గుప్పవోసి, ధరణివెల యని చెప్పి యప్పరమసంయ
మాధిపతికి సమర్పించె నతఁడు ఋత్వి, గావలికిఁ బంచిపెట్టె నయ్యతులధనము.

వ. మఱియును. 198

తే. అతులకనకమయములై సన్యజ్ఞవాట, వేదికాయూపతోరణన్వివిధభాండ
దండశయ్యాసనాదులన్ ధరణినాథుఁ, డొసఁగె విప్రచయంబులన్ గుల్ల మలర.

తే. అట్లు విప్రుల కిచ్చి యన్నంతరంబ
రాజులకు వైశ్యులకు శూద్రన్రాజి కన్య
జాతులకు మ్లేచ్ఛులకును బ్రన్భూతధనము
ద్రవ్యితండంబు లిచ్చె నాన్ధరణివిభుఁడు. 200

క. ఇమ్మెయి సకలజనులు హే, మమ్మునఁ బరితృప్తులై యన్మంద మ్మగుమో
దమ్మునఁ దేలుచు నిజవా, సమ్ములకుం జని రజాతన్శత్రుఁ బొగడుచున్. 201

క. రెండవమరుత్తుఁడై య, ప్పాండవముఖ్యుండు సేయున్పరమవితరణం
బొం డొకయెడఁ గల్గునె యె, న్నండును జూడ విన సజ్జన్నస్తుతచరితా. 202

క. తనయంశమైనకనకము, విను కుంతీదేవి కిచ్చె న్ వేదవ్యాసుం
డనఘా యది యంతయు న, వ్వినుతచరిత ధర్మకృతులన్ వినియోగించెన్. 203

తే. సకలబాంధవభూపతిన్సంయుతముగ, నానరేశ్వరుఁ డవభృథన్స్నానపూత
గాత్రుఁడై చిత్తగతసర్వన్కల్మషములఁ, బాచి నిర్జితస్వర్గ త్వన్భాసి యయ్యె. 204

వ. అట్లొప్పి యప్పుడమిఱేఁడు పరాశరనందనుచరణారవిందంబులు దనవెడంద
నొసలు సోఁకఁ జాఁగి మ్రొక్కి యక్కులపతిం బెక్కుభంగులం బ్రస్తుతించి
యామంత్రితుం జేసిన నామునిశ్రేష్ఠుండు శిష్యసంఘసహితంబుగా నంత
ర్ధానంబు సేసె నట్టియెడ. 205

ధర్మజుఁడు యజ్ఞంబునకు వచ్చినరాజుల నెల్ల సత్కరించి పంపుట.

క. అనుజులు నఖిలనృపాలురుఁ, దనుఁ బరివేష్టింప నొప్పెన్ దారలలోనం
బెను పొందుచంద్రుగతి న, మ్మనుజాధీశ్వరుఁడు కురుకున్మార ప్రవరా. 206

తే. క్రతువుఁ జూడ నేతెంచినన్రాజవరుల, కందఱకు మణిభూషణన్హస్తివాజి
వారకాంతాచయముల నన్వసుమతీశుఁ, డొసఁగె ధనదునికై వడిన్ నెసక మెసఁగ.

ఆ. బభ్రువాహనునకుఁ న్ బరమవిశేషంబు, మెఱయ గారవించి న్ మేలివస్తు
కోటు లొసఁగి ప్రీతిన్ గూరినమనముతో, నతనిఁ దత్పురమున న్ కరుగఁ బనిచె.

క. చిత్రాంగదయు నులూపియు, వృత్రారితనూజుపాలన్ విభవమహితలై
గోత్రావర నిలువఁగ న, ద్ధాత్రీశుఁడు సనిచె సమ్మన్దం బెలరారన్. 209

తే. మున్న చనుదెంచి ప్రీతిమై న్ నున్నయట్టి
దుశ్శలకుఁ బెంపు గలుగఁ దన్త్పుత్రపుత్త్రు
సింధుదేశంబునకు నభిన్షిక్తుఁ జేసె
దోహలమున నజాతశన్త్రుఁడు నరేంద్ర. 210

క. తమతమ దేశంబుల భూ, రమణులు నెల్లను నిజ [illegible] ¹ న
య్యము నెఱయ నిలిపెం బాండు, క్ష్మారమణుని పెద్దకొడుకు [illegible] సమున్నత్య. 211

వ. ఇత్తెఱంగున నెల్ల రాజులయుల్లంబులు ప్రమదంబునం [illegible] చేసి సీమకొలిపి కృష్ణునకు సత్యోత్తమవస్తువిస్తారమహోదారం బగునుపహారం బిచ్చి దేవోపచారంబుల నారాధించి కృతార్థత్వంబు నొంది యుష్మత్పార్థివోత్తముండు బలభద్రునకు భక్తియుక్తంబును వివిధరత్నరాజితంబును నగునుపాయన విశేషంబునం బరమసంతోషం బావహించి సాత్యకిప్రభృతియాదవలోకంబునకు నిలోకంబు లగునానావిధపదార్థంబు లొసంగి యమ్మందఱు దనచేత నుచితప్రకారంబుల నామంత్రితులై ద్వారకానగరంబున కరుగం దాను నుత్సేకము సనేకదేశాగతులైనజనంబుల నన్నపానంబులం గనకవస్త్రాదిదానంబుల ననుగ్రహ్యులం గావించి మహారావంబున దిశలు పిక్కటిల్లం జెలంగుమంగళతూర్యంబులును ధరియుం బుణ్యాహకరవంబులు నానందసగానంబులు వినుచు మందిరంబునకుం జనుదెంచె నని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె. 212

ఆ. అనఘ యుత్తిర్వాతామహునియశ్వమేధయా, గంబుసమయమునఁ గరంబు విస్మ
యంబుఁ జేయఁజాలునట్టిది యే మేనిఁ, గలిగెనేని వినఁగ వలతుఁ జెప్పుము. 213

వ. అని యడిగినయమ్మహీనాయకునకు వైశంపాయనుం డిట్లనియె. 214

క. అమ్మెయిఁ బ్రభూతధనలా, భమ్మున భూమిం గలయట్టి బ్రాహ్మణు లెల్లన్
సమ్మద మొందఁగ హయమే, ధ మ్ముజ్జ్వలభంగి నొప్పెఁ దత్సమయమునన్. 215

తే. అఖిలజనములు సచ్చరితవంద ధర్మ, నందనునిమానసమున నానంద మొలయ
నతనిపై మకరందధారాభిశోభి, కుసుమవర్షంబు పెల్లుగఁ గురిసె నభము. 216

వ. అట్టియెడ. 217

—— సక్తుప్రస్థచరిత్రంబు నకులంబు బ్రాహ్మణులకుం జెప్పుట. ——

సీ. ఒక్క బిలంబునందుండి వెల్వడి యొక్క, నకులంబు విప్రజనంబులెదుట
నిలిచి సక్తుప్రస్థునలఘుధర్మంబు నేమియుఁ బోల దీయశ్వమేధ మనిన
నవ్విప్రు లతివిస్మయం బంది యమ్ముంగిఁ, గనుఁగొని మంత్రవర్తనముఁ దంత్ర
గమనికయును వివిధము లైనదానవిధులు బహుళత్యాగములును లోక

తే. సంస్తుతము లయ్యె భక్తియు శ్రద్ధయును బ్రి
యంబు వినయంబు సురమునిహర్ష మావ
హిల్లఁ జేసె నీ వేమిట నిమ్మహాధ్వ
రంబుఁ గీడంటి చెప్పుము ప్రస్ఫుటముగ. 218

వ. అనుటయు నన్నకులంబు వారల కిట్లనియె. 219

సీ. వినుఁడు ధర్మక్షేత్ర మన రూఢ మైనకు

1. క. సైన్యమున నిలిపెం బాండుక్ష్మారమణుని పెద్దకొడుకు తుదరాజప్రవరా.

రుక్షేత్రమునయందు రోషకామ
విరహితుం డొకమహాద్విజుఁ డుంఛవృత్తిమై
నుండు భార్యయుఁ దనయుండు నతని
పత్నియు సహచరభావంబు నొంది వ
ర్తింతు రట్టులు తపశ్శ్రీ వెలుంగ
నున్నెడఁ [1]బులుపంట లన్నియు నత్యంత
వికలంబు గా ననావృష్టిదోష
తే. మావహిల్లిన నతని కాహార మొనరఁ
జేసికొనుట దుర్ఘట మయి చెల్లు చుండఁ
దారు నలువురుఁ జని తృణధాన్య మల్ప
మేఱి కొని వత్తు రాఁకలి దీఱ కుండు. 220

వ. అట్టియెడ నొక్కనాఁ డయ్యందఱును రేపు దొడంగి పడమటిజామునకు వెదకి తెచ్చినపూరికొలుచు ప్రస్థమాత్రంబు సక్తు వయ్యెం గర్తవ్యానుష్ఠానంబులు నడపి యనంతరంబ యాకుంచెఁడు పేలపిండియుఁ జెఱి మానెండు (నలుఁవురును సమంబుగాఁ) బంచికొని యుపయోగించువా రై యున్నసమయంబున. 221

యముఁడు సక్తుప్రస్థునికడ కతిథి యై వచ్చుట.

తే. అతిథి యొక్కఁడు ధరామరుం డరుగుదెంచెఁ
గని ప్రియంబున వా రెదుర్కొని సభక్తి
కముగఁ బర్ణశాలాభ్యంతరమున కతనిఁ
దోడికొనిపోయి యాసనస్థుఁడుగఁ జేసి. 222
చ. అడుగులు గడ్గి ప్రీతి యెసలారఁగఁ దద్దయు నెమ్మిఁ బల్కి ర
ప్పుడు మది పల్లవింప మునిపుంగవుఁ డాతని కాత్మభాగ మె
క్కు డగువినీతిఁ జూపి బుధకుంజర నిర్దరితార్జనంబునం
బడసినయట్టిసక్తువు కృపారతి నాఁకలి దీనఁ దీర్పవే. 223
వ. అని సమర్పణంబుసేసిన నమ్మహీసురోత్తముం డాసక్తు వుపయోగించె దాన నతండు తృప్తిం బొందకునికి యమ్ముని గనుంగొని యేమిట నితండు తృప్తుం డగు నెట్లు సేయుదునొకో యనువిచారంబు వొడమి డోలాయమానమానసుం డయ్యెం దదీయభార్య తదింగితం బూహించి యతనితోడ. 224
క. నాపాలిసక్తు విచ్చెద, నీపురుషునిఁ దృప్తుఁ జేయు మీ వనిన నతం
డాపాలఁతిడప్పియును సం,దీపితజఠరాగ్ని యైన తెఱఁగును గనుచున్. 225
వ. ఇట్లనియె. 226
క. మృగములుఁ బక్షులు లోనుగఁ, దగునాహారములు దెచ్చి తమప్రియలకు నిం

1. క. బలుపంట.

పుగ నిచ్చు నాకుఁ గొనఁగాఁ, దగునె భవద్భోజ్య మొసఁగ దయ్యుఁ దగునే. 227

క. స్త్రీ సంతోషించు తెఱంగా, సపడనిమనసు గలుగుట సత్క్రియయగుటన్ ।
చొచ్చె నడిఁ గనుఁ జని యచ్చో, గాసింబడు జముని భీతి గాల్చదు సత్యన్. 228

వ. అనిన విని యవ్వనిత యతనివదనంబునం జూచి యిట్లనియె. 229

తే. పతియ చుట్టంబుఁ బక్కంబుఁ । బతియ చెలియుఁ
బతియ తల్లియుఁ దండ్రియుఁ । బతియ గురుఁడుఁ
బతియ దైవంబుఁ గావున । సతులపాలి
నర్చ్చటయ చూవె ధర్మంబు । నాతి కనుము. 230

వ. అట్లుం గాక. 231

క. మానితగుణ నీ వాఁకలి, తోనుండఁగ నేటికాలు । గోపము నేల యి
ట్లే నాహారము గొందునె, యీనిర్మలమతికి నీవు । నిమ్ముగ నిమ్మా. 232

చ. అని తనసక్తు విచ్చినఁ బ్రియముగ నమ్ముని యున్న సత్క్రియన్
గనుఁగొని దప్పితో దిదియుఁ । గ్రక్కున మున్న సతిచ్చి త్రుంచిన
క్కొన భుజియించి వెండియును । గూడఁడ తృప్తిఁ దదంతరంగము
గనుఁగొని యత్తపస్విపతి । క్రమ్మఱ నెమ్మదిఁ జింత నొందినన్. 233

వ. తదీయతనయుండు తద్దశావిశేషం బెఱింగి. 234

సీ. తనపాలిసక్తువుఁ । దండ్రికిఁ జూపి యీ, యతిథికి దృప్తినిఁ జేయుమనుచు దీనఁ
దనయుండు దండ్రిచిత్తమున నెక్కొనిసక్తు, త్యాగంబొనరించుట । యన్నధర్మ
మన విని యమ్మహాముని యంతప్రాయంబు, ననినను విను జనకనుచు సుతుఁడు
బాలుండ యాఁకలి । బాలుర కగ్గల, మట్లు గావున నిది । యనుచితంబు

తే. నావుడును దాన పుత్త్రుఁ డనంగ వింటె
నన్నుఁ గాచుట యరయంగ । నిన్నుఁ గాచి
కొనుట యిప్పుడి యిమ్మహాత్మునకు నిచ్చి
కావవే నన్నుఁ గారుణ్యభావితాత్మ. 235

వ. అనినం గొడుకుమాటలకు నమ్మహితాత్ముండు ప్రీతాత్ముండై యానక్తు వాయతిథి కిచ్చినం బుచ్చికొని యతం డుపయోగించు దాసను నాఁకలి వోని తెఱంగు దోఁచినయట్లుచితవ్రతుని డెందంబు గుందు నొందినం గోడలు తదాకారప్రకారంబు గని తనయంశం బైనపిండి మామముందటికిం దెచ్చి. 236

సీ. ఇదియును నతిథికి । నిం డన్న నక్కట, యాఁకటఁ దలఁకి నీకాయంగకములు
శిథిలంబు లైనవి । నేడ్పడి యున్నది, చిత్తంబు దీనిఁ బుచ్చికొని నిన్ను
దప్పితో నుండంగ । నెప్పాటఁ జూడఁగ, లాఁడ నే ననుడు నాకలలన మీరు
మద్గురుగురులరు । మహితశుశ్రూషకుఁ, గాదె ప్రాణములు నంగకములుఁ గలిమి

తే. విహిత మిటు సేఁత నా కనువృత్తిశీలఁ

గాఁగఁ జేయుండు నన్ను మీకరుణ యలర
ననిన సంయమివరుఁ డియ్యకొని యతనికి
నచ్చెలువపాలిసక్తువు నర్థి నిచ్చె. 237

ఉ. ఇచ్చినఁ బ్రీతిఁ బుచ్చుకొని యిం పెసలార భుజించి తృప్తిమై
నచ్చుపడంగ మెచ్చున ముఖాంబురుహం బలరంగ నిట్లనుం
[1]బొచ్చెము లేక యయ్యతిథి భూరిగుణోత్తర నిన్నుఁ జూడఁగా
వచ్చితి నేను ధర్ముఁడ భవద్వ్రతశీలతఁ జూచి మెచ్చితిన్. 238

క. భక్తియు వినయము శ్రద్ధా,యుక్తియునుం దాల్మితోడ నొప్పను గరుణా
సక్తియు నతిథులయెడ ననురక్తియు నీయంద సుస్థిరత్వముఁ బొందెన్. 239

క. నీదానంబున విస్మితు, లై దైవతయక్షసిద్ధు లభివర్ణన మ
త్యాదరమునఁ జేసెద రిదె, రోదసి సమ్మర్దముగ నరుగుదెంచి తగన్. 240

క. అని చూపి పల్కు నవసర,మునఁ బర్జన్యుండు గురిసెఁ బుష్పాసారం
బనవద్యహృద్యనాదం,బున మ్రోసెను దేవదుందుభులు గగనమునన్. 241

వ. అప్పు డయ్యతిథి వెండియు. 242

యముఁడు సక్తుప్రస్థుని బ్రహ్మలోకంబునకుఁ బో నియోగించుట.

క. నినుఁ జూచువేడ్క నేడ్వురు, మునులమనంబుల సమగ్రమునఁ గదిరెడు స
జ్జనకీర్తనీయ దివికిం, జనుదెమ్ము ప్రియాసుతస్నుషాసహితముగన్. 243

తే. క్షుధ హరించుఁ బ్రజ్ఞాపరిశోభనతలఁ, దృష్ణ గుందించుఁ గృప నీవు దెలిసి వాని
ననఘ నిర్జించి తాలు బిడ్డనక యతిథి, పూజనం బిట్లు నడపినపుణ్యమునకు. 244

క. తగుప్రియమున సకుటుంబం,బుగఁ దనసభ [2]కీవు రాక బుద్ధిం గని బ్ర
హ్మ గడున్ వేడ్క విమానం,బు గురువ్రతశీల శీఘ్రమునఁ బుత్తెంచున్. 245

చ. వినుము ప్రభూతదానములు విశ్రుతయజ్ఞములున్ సధర్మతా
వినుతికి నెక్కఁ జాలవు వివేకనిధీ పరిశుద్ధిశోభితా
ర్జనమునఁ దెచ్చికొన్నది వరం బగుఁ బాత్రము నర్హకాలముం
గని లఘువస్తువేని నొసఁగం గను టుజ్జ్వలధర్మ మారయన్. 246

క. అని పలుకుచు దివ్యం బగు,తనయాకారంబు సూపె ధర్ముండు కన
త్కనకమణిమయవిమానము, వినువీథిం దోఁచె మునులు విస్మయ మందన్.

వ. అప్పుడు సక్తుప్రస్థుండు పరమప్రీతిం దానును దనవారును ధర్మదేవతకు దండప్రణామంబు సేసి నిలిచిన. 248

తే. ధర్మదేవత యతనితో ధర్మనిరత
కంటె బ్రహ్మ పుత్తెంచినఘనవిమాన
మనఁగ నది భూమి కవతరించినఁ బ్రమోద

1. క. గ. జ. ట. 'బొచ్చము' 2. గ. కిపుడ రాక.

దొడఁగ మహామునిస్తోమములును
సురసంఘములుఁ గూడి కురుముఖ్య ఋత్విగ్గ
ణముల నేర్పఱిచి సొం పమర వేదిఁ
గల్పించి తగ నగ్నికార్యంబు నడపంగ
సర్వాలు పశునిచయంబుఁ దేర
సమ్మునుల్ గనుఁగొని యధికదయార్ద్రంబు
లగుచిత్తములతోడ నమ్మహేంద్రు

ఆ. నాసనంబు సూచి యక్కట హింస ధర్మంబు గాదు కృతయుగంబు సొచ్చె
ననఘ వత్సరత్రయము ప్రాఁతగిలినబీజంబు లివుడు యజనసాధనములు. 255

క. వేదోదితప్రకారం, బాదర మెసఁగంగ నడపు మది యుత్తమధ
ర్మోదయము సేయు నీకు ద,యాదృష్టిం జూడు పశుగణార్తి మహాత్మా. 256

ఆ. అనిన వారిమాట లాదరింపక యుండె, వాసవుండు దాన వాదు వుట్టె
సమ్మునీశ్వరులకు నతనికి సురసంఘ, మతనిఁ గూడ వాద మతిశయిల్లె. 257

వ. అట్టియెడం గర్మకాండవిదుం డగునుపరిచరవసువు సన్నిహితుం డగుటయు
నయ్యిరుదెఱంగులవారును నారాజన్యుని సాక్షిగాఁ గోరిన నతండు దేవతా
పక్షపాతంబునఁ బశువిశసనంబు కర్తవ్యం బని పలికి యధఃపాతంబు ప్రాపించెం
గావున హింసారహితం బయినయజనంబు పూజనీయం బగుటకు సంశయింప
వలవ దట్లుం గాక. 258

ఆ. ఉంఛవృత్తి యైనయుర్వీసురోత్తముం, డట్లు ప్రాణరక్ష కై ఘటించి
స్వజనములును దాను భుజియింప నుండి యా,సక్తు వతిథి కిచ్చెఁ జనదె పొగడ.

వ. అనిన విని జనమేజయుం డది యట్టిద మునీంద్రా నీవచనంబుల కొడంబడితి ధర్మ
మార్గగతం బైన ద్రవ్యం బింతభవ్యంబు గదే యవ్వస్తువు దానంబునకుం బ్రధా
నం బగుట యింకనుం బ్రస్ఫుటంబుగాఁ బ్రకీర్తింపు మనవుడు నాసంయమి య
వ్యాసవపౌత్త్రపౌత్త్రు నాలోకించి యి ట్లనియె. 260

## అగస్త్యమహామునిద్వాదశవార్షికయజ్ఞప్రభావము.

సీ. ఇవ్విషయంబున నెందుఁ బ్రసిద్ధతం, బరఁగెడునట్టిది ధరణినాథ
విను తేతిహాసంబు వినుము చెప్పెద నగ,స్త్యుండు పండ్రెండేండ్లు సువ్రతాభి
రతిఁ జేయుమహితాధ్వరమునకు దివ్యాను,భావంబు గలయట్టిపరమమునులు
వేడ్క ఋత్విజు లయి వెలయ నిజప్రౌఢి, నఖిలతంత్రంబులు నాచరింప

తే. నాసమయమున వర్షింపఁడయ్యె నింద్రుఁ
డోషధులు వికలత్వంబు నొందె దానిఁ
జూచి యుత్తపోధను లగస్త్యునకు నన్న
దానవిధు లెట్లు సెల్లునో తగువిధమున. 261

వ. ఇతండు ద్వాదశవార్షికం బైనదీక్షావిశేషంబు నొందినవాఁడు ధర్మమార్గాగతం బయినద్రవ్యంబు దక్క నొండు వినియోగింపఁడు వానియందుఁ గొఱయ దని ముచ్చిరి తమలోఁ [1]బలుకుపలుకులు ప్రతాపని[illegible] కుంభసంభవుం డాలించి వారలతో నిట్లనియె. 262

ఉ. న్యాయము గల్గి యధ్వరము।నందు విఘాతము పుట్టకుండఁ దాఁ
దోయదకోటిఁ బన్ని హరి। తుష్టిగ వృష్టి యొనర్ప కున్న నే
[2]నాయమరేంద్రతం గొని మ।హోన్నతవృత్తి జగంబుఁ బ్రోవదా
మీయెడఁ జింత దక్కుఁడు స।మిద్ధతపఃపరులార నావుడున్. 263

క. కాదేనిఁ ద్రిజగముల బహు, ళోదార ద్రవ్యకోటు। లున్నవి [illegible]
పాదములపరిసరమునకుఁ, దే దొరకొను సత్రమునను। [illegible]. 264

తే. అంత సేయంగ వలయునే। యన్న సమఘు
లార యుత్తరకురుభూము। లారఁ బండి
యున్నయవి యోగకాలోచి।తాన్నమునకు
వలయుధాన్యముల్ దలఁపున। వచ్చు నిందు. 265

వ. అని పలికి వెండియు. 266

క. ఆజాలి యేల నిర్మల, బీజహవిస్తంత్ర మేను। బ్రీతి నొసంగం
గా జగతి వఱపునం జెడు, నే జన్నము విఘ్నపడు నె। [illegible] వగవన్. 267

సీ. అన విని నీవు ధ।ర్మాగతిసంసిద్ధ, వస్తుచాయివి నిర।వద్యతపము
వ్యయముగా నీ కేల। వాసవుప్పైకిన్క, నఖిలజగద్ధన। మాహరించి
కొన నేల యుత్తర।కురుభూములందలి, ధాన్యంబు లేల స।ర్వాన్నబీజ
హుతములందు ఫలేచ్ఛ।యోజింప నేల మా, కై యున్ని [illegible]
తే. నీదుచిత్తంబు దీని వి।నిశ్చయముగఁ
జేసి సుఖి వగు మేము మా।చేసినట్టి
సుకృతములఁ దెచ్చికొందుము। సులభములుగ
వలయునాహారములు లోక।వందనీయ. 268

మ. అని సల్లాపము సేయుచుండఁగ న।నేకాంభోదజాలంబులం
బనిచెం బెల్లుగ వర్షముల్ గురియఁగాఁ। బర్జన్యుఁ డాప్రొద్ద తా
నును నాచార్యుఁ బురస్కరించికొని న।న్నుం గావవే యంచు న
మ్మునిశార్దూలునిఁ గాన వచ్చె వినయం।బుల్ భక్తియుం దోఁపఁగన్. 269

ఉ. వచ్చిన గారవించి యన।వద్యపుటర్చన లిచ్చి సంయము
ల్మెచ్చఁగ శాంతసద్వచన।లీలఁ బ్రమోద మొనర్చి యాతనిం
బుచ్చె సురేజ్యయుక్తముగఁ। [3]బోఁడిగఁ గ్రమ్మఱ వేల్పువీటి కా

1. క. బలుకుపలుకులకుఁ బ్రతా... సంభవుండు రోషించి. 2. గ. నాయమరేంద్రు రీతిని. 3. గ. ప్రోదిగ.

సచ్చరితయుండు లోకమును ♦ సంతస మందె వెలింగె జన్నమున్. 270

తే. క్రతుసమాప్తిసమయమున ♦ నతఁడు వినయ
భరితుఁడై యోగ్యభంగి సద్విప్రముసుల
కర్చ లిచ్చి యామంత్రణ ♦ మాచరింప
వారుఁ బ్రీతి నేఁగిరి నిజా♦వాసములకు. 271

జమదగ్నిమహాముని పితృదేవతలశాపంబున నకులంబై పుట్టినకథ.

వ. ఇవ్విధంబున హింసారహితంబుగా మహితయాగంబు సుప్రయోగంబు సేసి యగ్గస్త్యుండు పరమప్రశస్తి నుజ్జ్వలుండయి వెలింగెం గావున ధర్మమార్గాగతద్రవ్యకృతంబై తపోమయం బగుయజ్ఞంబు ప్రాజ్ఞజనమనోజ్ఞంబై వెలయు నని చెప్పిన విని జనమేజయుం డి ట్లనియె. 272

తే. అనఘ నకులరూపంబున ♦ నట్లు దోఁచి
బ్రాహ్మణులతోడ మానవ♦భాషణముల
నెవ్వఁడేనియు నొక్క య♦హీనబోధ
ఘనుఁడు సల్లాప మొనరించె ♦ నని తలంచి. 273

తే. ఆతఁ డెవ్వఁడో యని నిన్ను ♦ నడుగఁ జూచి
వెండియును బ్రస్తుతోక్తుల ♦ విందు నను మ
నంబుతో నూర కుండితి ♦ నాకు నతనిఁ
జెప్పఁ దగు నేని బోధన♦శీల చెపుమ. 274

క. అనుటయు వైశంపాయనుఁ, డనూనపుణ్యప్రదీప్తుఁ ♦ డగునీ కెందుల్
వినఁ దగనియదియుఁ గలదే, వినిపించెద ముంగివిధము ♦ విను తెలియంగన్. 275

సీ. జమదగ్ని పితృకార్య♦సంకల్ప మత్యంత,నియతాత్ముఁడై చేసె ♦ నిష్ఠ యొప్పఁ
జారునూతనకల♦శంబున హోమధే,నువుఁ దాన పిదికి గౌ♦రవముతోడ
నిమ్మైన యెడఁ బది♦లమ్ముగా డించిన, నతనిచిత్తము తెలం ♦ గరయుబుద్ధి
సాకారవృత్తిఁ గ్రో♦ధాధిదైవము వచ్చి, ప్రామాదికం బను♦భంగి దోఁపఁ

ఆ. గుండతోడిపాలు ♦ గూల్చినఁ గినియక, యూర కుండె నాస♦ముజ్జ్వలాత్ముఁ
డప్పు డాత్మ మెచ్చి ♦ య ద్దైవ మతనికి, నిట్టు లనియెఁ గురుమ♦హీశవర్య. 276

క. భృగువులు క్రోధను లనఁగా, జగతిఁ బరఁగు వాద మది [1]మృ♦షాపరికలితం
బగుట దెలిసె నోడితి నీ, కగణిత మగునీతపమున ♦ గలి కెద ననఘా. 277

వ. అని వెండియు. 278

క. నా దెసఁ బ్రసన్నుఁడవు గ, వ్మాదరమునఁ జూడు మైఁపు ♦ మపరాధము వి
ద్యాదయిత యనిన నమ్ముని, యాదైవముఁ జూచి శాంతి ♦ యలవడ నెమ్మిన్. 279

వ. నాయెడ నిప్పుడు. 280

1. క. మృషాపరికల్పం బగుట.

క. నీ వేమితప్పు సేసితి, త్రోవుము నింకాభయంబు నొందంగ నని సం
ల్లావిలతకు నలుగుట పితృ,దేవతలకుఁ గలుగుఁ బొమ్ము నిదిగ్గన ననుచున్. 281

వ. భీతి నాభూతం బంతర్ధానంబు సేసెం దదనంతరంబ యాజమదగ్ని పితృదేవ
తలు కోపించి పొడసూపి యతనితో నీవు శ్రాద్ధంబునకు సంకల్పించి యుండి
తద్వైకల్యంబు వుట్టిన నూరకుండితని పలికి ముంగి వలయు వుట్ట మని శపించిన
నతండు వారలకు దండప్రణామంబు సేసి తపస్వికి నలుగందగ దని యపరా
ధంబు గనియునుం గ్రోధాధిదైవంబునకు నలుగ న్నతి. 282

ఆ. తప్పు సైంచి నన్ను దయఁ జూచి శాపమోక్షము ననుగ్రహింపుఁ డమితతేజు
లార యని వినీతిఁ బలంపటుం డగుచుఁ బ్రార్థించుటయును వారు [illegible]

వ. విదగ్ధవిప్రసమూహం బొడంబడునట్టియుచితవాక్యంబులు [illegible]
ధర్మంబు గీ డని యాడితి నాఁడు నీకు శాపమోక్షం బగు [illegible]
రన్నకులంబును సక్తుప్రస్థునికతంబునం దగినమాటలు [illegible]
ధర్మనందనునశ్వమేధంబు నధిక్షేపించి విగతశాపత్వ [illegible]
బయ్యె నని యిట్లు జనమేజయునకు వైశంపాయనుండు [illegible]
ధంబువిధంబు విస్తారప్రస్తవనీయంబుగా వివరించుటయు. 284

శా. భక్తిస్మేరమునీంద్రచిత్తకమలప్రస్ఫీతసౌరభ్యసం
యుక్తా [2]రూఢతరప్రకాశతనురూపోల్లాస రాగాదిని
ర్ముక్తా కాంతిజనైకతారసిక చిన్ముద్రాసనోన్నిద్ర శ్రీ
శక్తిస్వైరవిహారదూర లలితా సద్భావనోస్మిలితా. 285

క. అజరామరపదకరపద, భజనా సంసారజలధిపారీణస్తో
త్రజనా స్వమూర్తివైదిక, యజనా పాశ్చాత్త్యనాదికార్ద్రవ్యజనా. 286

మాలిని. త్రియుగకమలవీథీదీప్తసంచారలీలా
నియమితపవనాత్మాగ్నిప్రభాస్నిగ్ధసంగా
స్మయవికచమహాబ్జస్వైరమాధ్వీకధారో
దయమయ మధురాత్మా దర్శితానందవర్త్మా. 287

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునయశ్వమేధపర్వంబునందు
సర్వంబును జతుర్థాశ్వాసము. 288

శ్రీమదాంధ్రమహాభారతమునందలి
యశ్వమేధపర్వము సమాప్తము.

---

1. క. దనియు నపరాధం బల్పంబనియుఁ గ్రోధా. 2. గ. గూఢతర ప్రకాశతమరూపోల్లాస-చ. రూఢ
తరప్రకాశితమహాప్రోల్లాస-జ. రూఢతరప్రకాశతమహాసోల్లాస. 3. క. గ. చ. మధురత్వాదర్శిత.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆశ్రమవాసపర్వము, ప్రథమాశ్వాసము.





సాహసపదపద్మో
పాసనవిద్యాసమగ్రపరతానిత్యా
భ్యాసజనహృద్య వేద
వ్యాసవచోవిభవవేద్య హరిహరనాథా. 1

### యుధిష్ఠిరాదులును గాంధారీధృతరాష్ట్రులను నొండొరులయెడల నడచికొనినప్రవర్తనము.

వ. దేవా జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె నట్లు పితృపితామహక్రమ
ప్రాప్తం బయినసామ్రాజ్యంబు జగత్పూజ్యప్రకారంబునం గైకొని మహాధ్వర
ప్రముఖధర్మకార్యధుర్యులును సముపాసితార్యులును దయావిధేయులు నగుపాండ
వేయులు ధృతరాష్ట్రువలన నెవ్విధంబువారై నడచిరి హతపుత్రమిత్రామాత్యుం
డును గతైశ్వర్యుండు నగురాజును యశోమహిత యగుగాంధారియు నెట్టిభంగి
వర్తించి రత్తెఱంగు నాకెఱింగింపుము. 2

సీ. అనవుడు నమ్ముని యమ్మహీపతికి ని, ట్లనుఁ బాండునందను లాంబికేయు
నెడ భక్తివినయంబు లెసఁగంగ వర్తింతు, రతనియోగక్షేమ మరసి యెపుడుఁ
దత్సమీపంబునఁ దగ నిల్చి తమకు నె, య్యది యైన నెఱిఁగించు నట్లు గాఁగ
నుందురు విదురయుయుత్సుసంజయులు దా, రును నిత్యమును వచ్చి వినతిఁ జేసి

తే. కొలిచి కూర్చుండి యానృపు నలఘుకార్య
విధము లేర్పడ నడిగి య వ్విభుని చెప్పి
నట్ల చేయుదు రతఁడును నాదరంబు
గాఢవత్సలత్వంబును గలిగి యుండు. 3

ఉ. కౌరవనాథ కుంతియును గౌరవ మొప్పఁగ వచ్చి కొల్చు గాం
ధారి నతిప్రయత్నమున ద్రౌపది తాను సుభద్రయున్ ముదం

తే. వారలకు శ్రీయు నాయువు • వైరిజయము
మాసనమున నాశాసించు • మానవేంద్ర
యతని కొంటివ ర్తనముఁ దర్తత్సుతునికీడు
నాత్మఁ దలఁపఁ డెన్నఁడు ధర్మాత్మజుండు. 14

క. విను మతని పెలుఁ గెలిఁగి పరిజనములతో నాంబికేయుచరితము దుర్యో
ధనుకొలఁగానియు నెవ్వారును వాక్రువ్వంగ వెఱతురు కురుప్రవరా. 15

సీ. రాజ్యాధిపత్యసంపూజ్యత్వమున ధృతరాష్ట్రి పాండుసుతాంతరంబు గాన
లోకములు జానపదోత్కరమునఁ బౌరవర్గంబునందును • వసుమతీశ
యమ్మెయి నడపెడునప్పాండవాగ్రజువలన నిజాత్మజులవలనికంటె
నక్కురురాజు ప్రియం బందు నట్లున్న యక్కాలమునఁ బవనాత్మజుండు

తే. సన్నిహితుఁ డైనయప్పు డర్జునవిభుండు
నతనిమాటలఁ దలఁచి సంతాప మందు
నతనిఁ గనుఁగొని యబ్బిముఁ • డతనిసుతులు
దమ్ముఁ బఱచినపాటులు • దలఁచి యలుగు. 16

తే. హృదయములు నొండొరులపైన • నిట్టివార
లయ్యు నతఁడు నతండు పరస్పరాన్యభాష
ణములయప్పుడు మృదులవిన్యాస మొప్ప
నాడుదురు చుట్టములు మెచ్చునట్లు గాఁగ. 17

వ. ధృతరాష్ట్రుం డేకతంబ యున్నయెడ వృకోదరుం డతనికి వింత నంత నుండి
గాంధారియు విను చుండ. 18

సీ. అంధునికొడుకులయం దొక్కరునిఁ దప్పి, పోనీక త్రుంచితి • భూరిశక్తి
దర్పితం బైనమద్బాహుపంజరము సొచ్చినరిపురాజన్యసింహములకు
వెడలంగ వచ్చునే • వెంగలు లై వారు, గయ్యంబు సేసిరి • గాక నన్ను
నెఱిఁగినఁ దొడరుదు • రెట్టులు దుర్యోధనాదుల నని దెగటార్చినట్టి

తే. నాదుదోర్దండములఁ జందనం బలంది
కుసుమదామముల్ సుట్టి మ్రొక్కుదు మహోప
కారు లరయంగ దైవముల్ • గావె యనుఁ ద
[1]దీయమర్మంబు లెల్ల భేదిల్ల నధిప. 19

వ. దీని ధర్మనందనుండు ధనంజయుండునుం గుంతియు ద్రౌపదియు నెఱుంగరు
గవ లొక్కొక్కమా టిమ్మాటలు విని సంతసిల్లుదురు ధర్మనందను తెఱం గెఱుంగు
టం జేసి పుయిలోడి తా రేమియు నాడరు ధృతరాష్ట్రగాంధారులుం గాల
పర్యాయంబు గనికొని డెందంబులు గంద నూర కుండుదు రట్టిభంగిఁ బంచదశ

1. గ. దీయమర్మమర్మములు భేదిల్ల.

వత్సరంబులు సనియె నంత నొక్కనాఁ డయ్యంధనృపతి బంధుజనంబులం గూర్చి ధర్మనందను రావించి యతండు విను నుండ గద్గదస్వనంబున వారల తోడ. 20

ధృతరాష్ట్రుఁడు ధర్మజునితోఁ దనమనోగతంబు దెలుపుట.

సీ. నాకతంబునఁ జేసి యాకౌరవులకు నాశంబు వాటిలుట యెల్లజనులు నెఱుఁగ
జనుఁ గ్రూరు నతిలోభి జ్ఞాతిజనద్రోహకరుఁ జేసితిని గురుసరిత్సు
కచ్యుతుఁ జెప్పినయమలవాక్యంబులు, వినఁ జేర్ననైతి నాశ్రయించి
ఘనతరస్నేహంబునను మొగమోటను, దగియుండుటయుఁ దలఁపక యుండి
తే. యాడ కుండితి భీష్ముండు నస్త్రగురుఁడు
విదురుఁడును సంజయుండును వేవిధముల
నాకుఁ జెప్పిరి గాంధారి సన్నుఁ దూఱి
చెప్పె నమ్మాట లేఁ బెడచెవులఁ బెడితి. 21
వ. ఇత్తెఱంగు నంతరంగంబున శల్యంబై యున్నయది యని చెప్పి వెండియు. 22
క. సుతులు సమరమునఁ దిరుగక, మృతులై సద్గతికిఁ జనిన మేలిమి యున్న
న్మతిఁ దలఁచి వరక్షత్రచరిత యని యప్పనికి నగవఁ బ్రీతియ కలుగున్. 23
వ. అని పలికి పాండవాగ్రజుఁ జేరం బిలిచి యతని తోడ. 24
సీ. నీ వరయంగ సుఖావాప్తిఁ గొఱఁత లే, కుండితిఁ జనపును నుజ్జ్వలంపుఁ
దేజంబుఁ గలిగి వర్తించితి దానంబు, లుచితములుగఁ జేసి కాంక్షతీఱఁ
గంటి శ్రాద్ధంబులు గాంధారిసుతులకుఁ, బలుమాఱుఁ జేసితిఁ బరమధర్మ
శీల పాంచాలికిఁ జెట్ట సేసి రగణ్య, పుణ్యుండు వగునిమ్మహాభుజుఁడు
తే. నపహరించి రద్దుర్యోధనాదు లట్టి
కష్టచరితులఁ బాడిమైఁ గయ్యమునను
నిహతులుగఁ జేసి తక్కురునికర మూర్ధ్వ
భువనగతిఁ గాంచి సుఖ మందె భూపవర్య. 25
క. కావున నేమియుఁ జేయం, గా వలవదు వారికయి యకారణకరుణా
శ్రీవిలసితుఁ డగునీతోఁ, నావిధముం జెప్ప వలసె నరవరముఖ్యా. 26
సీ. ఏకార్య మైనను నెవ్వఁడేనియుఁ జేయఁ, దొడఁగునప్పుడు విను పుడమిఱేని
చే ననుజ్ఞాతుఁడై కాని తొడంగఁ గా, దట్లు గావున వార్ధకాభిలేఖ
మైనమదీయకార్యమునకు సంస్కార, మాచరింపఁగఁ దద మాచరించు
పనికి భూపాల నీయనుమతి వడయంగ, వలసి చెప్పెద రాజవంశజునకు
ఆ. సమరమరణమొండె విమలతపమునకుఁ, జొచ్చి యందు నిలిచి చచ్చుటొండె
వలయు నస్మదీయకులముఖ్యు లిట్టుల, నడపి రనుపు నన్ను నడవి కనఘ. 27
క. రాజు గురుఁ డెల్లవారికి, రాజోత్తమ గురునియాజ్ఞ రంజిల్లఁగఁ బే

గోజం జేసినకృత్యము, సూ జగములు రెంటియందు । శోభన మిచ్చున్. 28

తే. ఏను గాంధారియును దపో । మానసీయ, మునులచేరువ వల్కల । ములు ధరించి
కందమూలఫలముల నాఁ । కలి హరించి, నిన్ను దీవించు చుండెద । మన్న నతఁడు.

క. ధరణీరాజ్యము నాకును, నరవర సౌఖ్యంబుఁ జేయు । నా నీ విమ్మై
మరపిల్లి దుష్కరం బగు, నరణ్యవాసమున కేఁగి । నట్టిద యైనన్. 30

తే. గాఢబుద్ధి వై నమ్మించి । కురువరేణ్య, యే నెఱుంగక యుండంగ । నిట్లు శోక
వనధిఁ దేలుచునుండి ని । వ్వసట గంటి, నింక రాజ్యంబు నా కెట్టు । లించుఁ జెపుమ.

ఉ. తల్లియుఁ దండ్రియుఁ గురుఁడు । దైవము నా కరయంగ నీవ భూ
వల్లభ నీవు కాననని । వాసము గోరి చనంగ నెట్టు లే
నుల్లము వట్టి హాస్తిపురి । నుండఁగ నేర్తు యుయుత్సుఁ బెంపు శో
భిల్లఁగ రాజుఁ జేయు నినుఁ । బ్రీతి యెలర్పఁగఁ గొల్చి వచ్చెదన్. 32

క. అతఁ డౌరసుండు నీ కీ, క్షితి కొడయుఁడు దుర్యశంబు । చేఁ గుందుట భూ
పతివర [1]కని కని దూ ఱి, ట్లతిమాత్రము సేయఁదగునె । యక్కట నాకున్. 33

సీ. నీవు రాజవు గాక । నీ కేను రాజనే, గురుని మహారాజుఁ । గురువరేణ్య
నిటు సేయు మని పంప । నే నొడయుండనే, దుర్యోధనాదుల । దుష్కృతములు
నామదిలో నిల్ప । నేమును వారును, [2]విధిమోహమున నైన । విరసభావ
మావహిల్లినఁ బుట్టె । సంతలు పనులు గాం, ధారియు గొంతియు । గారవమున

ఆ. నాకు నొక్కరూప । మీకుఁ గాననవాస, మెల్లభంగిఁ గలుగు । నేని నేనుఁ
దగిలి తోన వత్తుఁ । దగుమాటగా నాట, గాదు నాదుహృదయ । గతియు నిట్ల. 34

క. పలికెద నే సత్యము నా, కిల ప్రీతిం జేయ దధిప । యీ వి ట్లయినం
గులముకలఁక దైవకృతం, బలఘుమతీ విడువు శోక । మరయుము నన్నున్. 35

తే. నీకు శుశ్రూష యొనరించి । నృపవరేణ్య, చిత్తతాపంబు మానంగఁ । జేసికొందు
ననితలంచునఁ విడువంగ । నగునె యవన, తుండనై నిన్ను వేఁడెదఁ । దొఱఁగువగలు.

క. అనుచు నతనిచరణంబులు, దనఫాలతలంబు సేర్చి । ధర్మతనయుఁ డా
తని గ్రుచ్చి యెత్తి కౌఁగిట, నెనయంగాఁ జేర్చి యాతఁ । డి ట్లను నధిపా. 37

తే. నీవు శుశ్రూష చిరకాల । నియతిఁ జేసి, తేను వృద్ధుండ నైతి నా । కింకఁ దపము
వలవ దయ్యు రాజును బాలి । వాఁడ యెవ్వ, రేమి సేసినఫలముల । యెడ నృపాల. 38

వ. అని పలికి విదురకృపసంజయుల నుద్దేశించి తనకు ముఖశోషయుం దనుగ్లానియుం గలిమి నుగ్గడించి నాలుక దొట్రువడ వారలతో మీర లనునయవచనంబుల నజాతశత్రుం దెలి వొందం జేయుం డని చెప్పి డప్పి యెక్కుడు గదిరిన గాంధారి తనువున మేను సేర్చి మూర్ఛిల్లుటయు నార్తి నొంది యక్కుంతీనందనాగ్రజుం డిట్లని పలవించె. 39

1. క. కనికని - మీ రి ట్లతి; అ. కనుకనిఁ దుది ని ట్లతి. 2. గ. విధిమోహితుల మయి విరస.

క. కరిదశసహస్రబలవి,స్ఫురితుఁ డగువిచిత్రవీర్యపుత్త్రుఁ డొకనాఁ
డరి నూఁతగొనియె విధి యెవ్వరి హీనులఁ జేయఁ డకట కట నస్త్రం బెట్టన్. 40

చ. అనిలజుమేనిచంద మగునాయసరూపము చూర్ణితంబు సే
సినబలమాననీయుఁ డొకచేడియ నక్కట యొత్తుగుంచ నే
మనఁ గల దవ్విధాత్మ నని [1]యాతనికీసును మానసంబునన్
జొనుపమి లావ పేరుకొని శోకము ధర్మజుఁ డొందెఁ జూడఁగాన్. 41

సీ. అప్పుడు గాంధారి యల్లన ధర్మజు,జోడించి యింతి చిత్తమునందు
తోడిసంతతచింతఁ గూడు నొలంగి తా, నుండునే యాతనియందు నోపు సునికి
నిట్లయ్యె ననవుడు నెవ్వనికతమున, నిట్టిపాటునఁ బుత్త్రులెల్ల సుక్ష్మ
[2]నట్టినామనువు నే మనఁగల దంచు నా,తండు శీతజలము నీరు గ్రమ్మఁ బుచ్చి

తే. కొని యతనిమోమునందు నక్కున విదిర్చ
సమయమున విదురుండును సంజయుండు
నఖిలభరతభార్యలు నేడ్చి రవ్విభుండు
నివిరెఁ జలికేల నానృపునవయవములు. 42

క. నివురంగఁ దెలిసి యతనిం, గవుఁగిటిలోఁ జేర్చి మస్తకము మూర్కొనుచో
రవవృద్ధు నతఁడు నాశ్లేషవిశేషంబున నొసర్చె సంప్రీతుసిఁగన్. 43

వ. అట్లు దెలి వొంది ధృతరాష్ట్రుండు ధర్మరాజుతో నా కెట్లును దపంబునకయి కాననంబునకుం బోవ వలయు ననిన సజ్జనపతి నీ వారగింపు మప్పుని మఱి సెప్ప ద నని త్రోపుమాటగాఁ బలికిన నయ్యాంబికేయుండు పెక్కుమాటలాడ శక్తి లేదు న న్నింక నలజడిఁ బెట్టకుము తపశ్చరణంబునకు నీ యనుజ్ఞ నడసి కాని కుడువ ననియె నయ్యవసరంబున సాత్యవతేయుండు కృపావిధేయుం డై యచ్చటికి వచ్చి సకలజనంబులవినతులు గైకొని దీవన లిచ్చి యాధర్మతనయునా ననం బాలోకించి. 44

—వ్యాసుఁడు ధృతరాష్ట్రువనవాసంబునకు ననుజ్ఞ యిచ్చుట.—

సీ. ఆంబికేయుఁడు సెప్పినట్టుల చేయుము, వృద్ధుఁడు నాత్మజవిరహితుండు
నై నయీతఁడు తప మాచరింపఁగఁ గోర, కున్న గాంధారి శోకోపశమము
దాలిమి నొదవి యింతదాఁకఁ బ్రవర్తించె, నింక నియ్యముకును నిదియ తలఁపు
గావున నీకు నీకార్యంబు సెప్పంగ, వచ్చితి వీరిఁ బోనిచ్చు టొప్పు

తే. ననఘ పూర్వరాజన్యులు సనినయట్టి, సౌఖ్యపథమున నీరాజు సనుట మేలు
గాన యీతనికాననగమనమునకు, ని మ్మనుజ్ఞ విచారంబు లెల్లఁ దక్క. 45

క. నీవినయము భక్తియు సం,భావనమును వీరివగలఁ బాపఁగ శుశ్రూ
షావశవర్తిత నడచితి, భూవర చిరకాల మింకఁ బోనిమ్ము తగన్. 46

1. గ. యాతనికిం దనమానసం. 2. చ. నట్టినామనము నే మనఁ.

చ. అన విని యాకురుప్రవరుఁ డమ్మునివల్లభుమోముఁ జూచి యి
ట్లను మహితాత్మ మాకు గురుఁ డన్నను ధర్మవిధోపదేష్ట య
న్నను బరదైవ మన్నను మనఃప్రియకార్యకలాపకర్త య
న్నను విను నీవ నీదువచనంబున కడ్డము పల్కువాఁడనే. 47

ఆ. అనిన నమ్మహాత్ముఁ డను రాజులకు రణ,మరణ మొండె దృఢసమాధిఁ దనువు
విడుచు టొండెఁ గాక వృద్ధులై రోగత,ల్పమునఁ జావు మేలె భరతముఖ్య. 48

వ. అనిన విని ధర్మతనయుం డొండు వలుక వెఱచి యిట్లనియె. 49

క. అనఘా యిక్కురుముఖ్యున, కనుజ్ఞ యే నిచ్చితిని మహత్తర మగుమీ
యనుమతియుఁ బడసెఁ జనుఁ గా, క నిజేచ్ఛను నాకు విఘ్నకరణము దగునే. 50

సీ. అనుటయుఁ బ్రియమందిరయమ్మహాముని యమ్మ,హీశ్వరుతోఁ బాండుఁ డీనృపాలు
గద్దియ నిడికొని క్రతువులు సేయించి, యవిరళభోగానుభవము నడపి
యీతనివారలఁ బ్రీతి నీక్షించి తా, శిష్యుండపోలె సంసేవనంబు
భక్తమై నొనరించెఁ బదపడి నీవును, దిగ్విజయాదులఁ దేజ మితని

తే. నొందునట్లుగఁ జేసితి వొకటఁ బిదపఁ, దాన పదుమూఁడువర్షముల్ ధరణి యేలె
నీవు శుశ్రూష [1]యిత్తఱి నియతి నడపి,తితని మది లేదు కలఁక యొక్కింత యేని.

క. కేవలతపఃక్రియాసం,సేవనతాత్పర్య మిపుడు చిత్తంబునయం
దావేశించినయది యీ,భూవరునకు నితని ననిచి పుచ్చు మడవికిన్. 52

ఆ. అనిన ధర్మతనయుఁ డట్టుల కాకని, పలికెఁ దత్క్షణంబ పరమయోగి
వంద్యుఁ డయినసత్యవతికొడుకు కాత్మత,పోవనమున కరిగె భూపవర్య. 53

సీ. తదనంతరమ ధర్మతనయుండు ధృతరాష్ట్రు,తోడ నీ కెట్టులు సూడఁ బోలె
విదురుండుఁ గృపుఁడు నెయ్యాదికృత్యమని విని,శ్చయ మొనరించిరి సంజయునియు
యుత్సునిమనముల నొలసినకర్తవ్య, మెద్ది దానిన చేయు టెంతయేని
నాకుఁ బ్రియంబు భూనాథ యానతుఁడ నై, వేఁడెద నొకటి నీవిశదబుద్ధి

ఆ. నేమి సేయఁ దలఁచితేని నీ వక్కట, యారగించి చేయు మయ్య యనుడు
నరిగె నానృపాలుఁ డభ్యంతరావాస,మునకుఁ దోన సుబలతనయ సనఁగ. 54

వ. ఇట్లు కురువృద్ధుండు వృద్ధసామజంబుచందంబునం జనునప్పుడు విదురుండును యుయుత్సుండును గృపాచార్యుండును సంజయుండును వెనుకన చని రజ్జనపతి దివసకృత్యంబు లాచరించి భూమిసురులం బూజించి యాహారతంత్రంబు నిర్వర్తించె గాంధారియుం గుంతీప్రముఖభరతభార్య లనునయింప భోజనవిధి యొనర్చెం దదనంతరంబ విదురాదులుం బాండవేయులును వనితాజనంబులుం గృతాహారు లయి యావైచిత్రవీర్యుం బరివేష్టించి యుండఁ బాండవాగ్రజు నప్పాండునృపాగ్రజుం డేకాంతస్థానంబునకుం దోడ్కొని పోయి యతనితోడ

1. చ. తఱి నెప్డు నియతి.

క. పనులయెడ మేలు గాంచిన, మనుగడ యగ్గలము సేసి మన్నింపుము రా
జనయజ్ఞ భృత్యకోటిం, గొనియాడుము సేఁత పేరు గ్రుచ్చి కొలువునన్. 64
క. నీవలనను భక్తిస్నేహావేశము గలిగి శూరుఁ డై యలజడికిం
దా విసువనిసత్కులజుం, గావింపుము సైన్యవిభునిఁగాఁ గురుముఖ్యా. 65
సీ. ఆత్మరంధ్రము లించు కైనను నొరులకు, నెఱుఁగ రాకుండఁగ మఱువుసేయు
మన్యరంధ్రంబుల నారసి కనుము శత్రులకడ బుద్ధియు బలువుఁ గలుగు
వారల నెఱిఁగి భూవర యొక్కమై నీగి, మన్నన నెఱపి తన్మానసములు
నీయెడ నార్ద్రంబు లై యుండఁ జేయుము, చేరువనృపులకు వైరబంధ
ఆ. మొల్లు గలుగు దాని నేమఱ కుండుము, వారియవుల నున్న వారు మిత్రు
లగుదు రెల్లభంగి సధిప యుదాసీను, లట సమీపవర్తు లై సవిభులు. 66
క. వీరలసప్తాంగంబులు, నారసికొని యునికి కార్య మవనీశ సదృ
క్సారబలుఁ డైనన్నృపుతో, గారవమున సంధి సేయఁగా వలయుఁ దగన్. 67
తే. దైవమానుషబలములు దఱిఁగి యుండు
నెవ్వరికి నెప్పు డప్పుడ యెసక మెసఁగ
వైర మతనితోఁ బాటింప వలయుఁ జెఱచు
టప్పనము గాను టర్వాత్మ మరసి నడపు. 68
క. నడపునఁ గొల్పుచ్చఁగ నగు, నెడయు విడిసి యుండి చెఱచునిక్కయు నీ వే
ర్పడఁ గనుఁగొని యందర్హము, నడపుము నిజసైన్యరక్షణము వలయుఁజుమీ. 69
క. ప్రెగడలమనసులు విరసము, లగుగతి నడపురిపురాజ్య మరసి విభిన్నం
బుగఁ జేసి కలఁచి పైకొని, జగతీవర కొనఁగ వలయు సౌకర్యమునన్. 70
ఆ. బలము లెసఁగ దైవబలమును గలిగి లో, గుట్టుచేటు లేనియట్టినృపతి
వలన మత్సరంబు వలదాశ్రయంబుచం, దంబు పొందు వడయఁదగునృపాల. 71

ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు శత్రురాజుల జయించు తెఱంగు సెప్పుట.

ఆ. కుడువ నిచ్చుతఱియుఁ గురువర [1]క్రక్కించు, నవసరంబు నెఱిఁగి యరినృపాలు
నీవు ధీరవృత్తి నిడుఁ ద్రాటఁ బోనిమ్ము, క్రమ్ము కపిల యనఁగ గ్రమ్మి [2]చెఱుపు.
సీ. ఉత్సాహశక్తియు నుర్వీశ మంత్రశక్తియుఁ బ్రభుశక్తియుఁ గెలనివాని
కిని నీకు నిట్టివి యని తారతమ్యముల్, వెరవునఁ బరికించి వేర మెత్త
వలయుట నెఱిఁగల్గి పలుకక యుండంగఁ, దగుట యూహించు టుత్తమవిధంబు
మూలబలంబును మొత్తాలవారును, మిత్రబలంబును శత్రుబలముఁ
ఆ. గానసంబుబలముఁ గైజీతగాండ్రును, నై నయట్టిబలము లాఱు నరసి
యుచితకాలదేశయుక్తంబులుగఁ బన్ని, కొనఁగ వలయు వానికొలఁదు లెఱిఁగి. 73
తే. సంపదల నాపదల నొక్కచంద మగుట.

1. జ. శంకించు. 2. గ. చెఱుము.

వికృతి నొందుట యాబల ♦ వితతులందుఁ
గాంచి యెల్లప్పుడును హిత ♦ కారి వైన
బలము నెక్కుడుగాఁ బ్రోవు ♦ భరతముఖ్య. 74

క. [1]పరుల గెలిచి నిర్భయముగ, ధరణిఁ బ్రజం గాచి నెరపు ♦ ధర్మపథమునం
బరిపాలించిన వెలయుం, గురువర కృప సంపద ♦ వదలకనుము ప్రజలయెడన్. 75

క. వినికి గలిగి రక్షించుచు, ననువున దయతోడఁ బాడి ♦ నాయకు లెల్లం
గొనుచుఁ దగ నేలి పొగడొం, దినరాజున కుర్వి కామ ♦ ధేనువ కాదే. 76

సీ. ధర్మమార్గంబున ♦ ధరణిఁ బాలించిన, నైహికసుఖములు ♦ నగ్గలంపుఁ
బొగడును బరలోక ♦ భూరిసౌఖ్యములును, సిద్ధించు విపులద ♦ క్షిణలు వెట్టి
యశ్వమేధప్రముఖా ♦ ధ్వరంబులు పెక్కు, లాచరించుటకంటె ♦ నధిక మంత్రు
మేదినీప్రజల న ♦ త్యాదరంబును గరు, ణాతిశయంబు న ♦ వస్యస్థలమును
తే. గలిగి బిడ్డల నరసిన ♦ కరణి గాచి, రక్షణం బొనరించుట ♦ రాజనీతి
వినుము తమ్ముల నీగిమ ♦ విన్నవల ననుచు, నంబుఁ గొనియుండు నారాయ ♦ ణుండు గాఁగ.

చ. నరవర రాజనీతులు జ ♦ నస్తుతుఁ డైన సదీతినూజుఁడున్
హరియుఁ బరాశరాత్మజుఁడు ♦ నాదిగఁ గల్గిన పెద్ద లెల్ల సి
కరయఁగఁ బెక్కు సెప్పిరి మ ♦ హాత్ముఁడు నీ యెడఁ బ్రీతి [2]పెద్దయుం
బొరయుట నేనుఁ గొన్ని యిటు ♦ వోలినభంగి నెఱుంగఁ జెప్పితిన్. 78

క. [3]నిత్యవిధిసద్వివేకము, సత్యవ్రతశీల ధర్మ ♦ సారజ్ఞ భవ
న్మత్యాకలితమ యైనను, నిత్యంబును వృద్ధసేవ ♦ నిష్ఠఁ జలుపుమీ. 79

సీ. అన విని ధర్మజుం ♦ డంబికాపుత్త్రుతో, నాపగాసుతుఁడు లేఁ ♦ డబ్జనాభుఁ
డాత్మపురంబున ♦ కరిగె [4]వాత్సల్యత, నీవు దక్కఁగ నాకు ♦ హితము సెప్ప
నొడయఁ డెవ్వఁడు భవ ♦ దుపదిష్టపథమున, నిష్ఠమై నడచెద ♦ నెమ్మనమున
నీవు ప్రీతిని బొందు ♦ నృపముఖ్య నావుడు, నాతఁడు నంతన ♦ మంటి యతని
ఆ. నధిప విశ్రమింపు ♦ మధికశ్రమంబు నా, తనువునందుఁ బెండ ♦ ననిన తగంగఁ
బోవఁ జెప్పి బాంధ ♦ వావళి కభిముఖుఁ, డయి నిజాలయముల ♦ కరుగఁ బనిచి. 80

వ. తాను నభ్యంతరగృహంబున కరిగి సుఖాసీనుం డై యున్న నన్నాగనగనాథుతో గాంధారి దేవా వనంబున కెపుడు విచ్చేయువాఁడ వని యడిగిన నాభూవల్లభుం డద్దేవి కి ట్లనియె. 81

క. మాతండ్రి పరాశరసుతు, చేతం బడసితి ననుజ్ఞ ♦ శీలపరత్వో
పేతుఁ డగుధర్మతనయుఁడుఁ, బ్రీతి నొండంబడియె బంధు ♦ బృందయుతముగన్. 82

ఆ. ఇంకఁ దడయ నేల ♦ యింతి వే వెడలుద, మట్లు గల్లజూద ♦ మాడి పావ

1. గ. అరుల. 2. క. బద్ధముం-ట. బంధముం. 3. గ. నిత్యము వినికి వివేకము-జ. నిత్యవినీతి వివేకము. 4. ట. వత్సల నీవు, దక్కంగ నాకు హి♦తంబు సెప్ప

భాగులైననీకు [1]పట్టుల సుగతికి, ననుచువాఁడఁ దపము ననతిశయమున. 83

ధృతరాష్ట్రుండు వనవాసంబునకుం బురజనులచే ననుజ్ఞ గొనుట.

వ. అని పలికి యమ్ముగువదిక్కు మొగం బయి వారికి సుగతి గల్గునట్లుగా నిప్పుడును గొన్నిపుణ్యక్రియ లజాతశత్రు ననుమతితో నాచరించి పోదము గాక యని నిశ్చయించి తనకుం దపోవనగమనంబున కై పౌరులయనుజ్ఞ గొన వలయు నని పాండవాగ్రజునకుం జెప్పం బనిచిన నతండు దగుపురజనుల నెల్లను [2]బడి సేసి వెలార్చికొనుచు నఖిలబంధుమిత్త్రులునుం దానును వచ్చి ధృతరాష్ట్రమందిరద్వారపురోభాగంబున నిలిచె నయ్యాంబికేయుండు గాంధారియును దోడ రా వెడలి వారిసన్నిధికిం జని బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రసంకులంబై నయన్నగరజనప్రకరంబు నుద్దేశించి. 84

సీ. కౌరవకోటియు మీరుఁ బెద్దయుఁ గాల, మనఁగి పెనంగి యన్యోన్యసంభృ
తాధికస్నేహుల రై ప్రవర్తించితి, రనఘవర్తనులార వినుఁడు నాదు
పలుకు వృద్ధునకుఁ దపశ్చరణంబున, కై వనంబున కేఁగు టర్హకర్మ
ముచితకృత్యంబుల యోజ మీ రెఱిఁగిన, యదియు కా మది ముదమార మీర
ఆ. లెల్ల నాకనుజ్ఞ యిచ్చి కానకుఁ బుచ్చుఁ, డనుడు సర్వజనులు నశ్రుపిహిత
దృష్టు లగుచు గద్గదిక నెలుం గెడలఁగ, నార్తి దోఁప నేడ్చి రధిపముఖ్య. 85

వ. విని ధృతరాష్ట్రుండు వారి కి ట్లనియె. 86

సీ. ప్రజ ముద మొందంగఁ బాలించెఁ బుడమి శం
తనుఁ డనంతరమ శాంతనవుచేత
రక్షితుఁ డగుచు మీరలు ప్రీతిఁ బొదల వి
చిత్రవీర్యుండు నిద్ధాత్రి యేలెఁ
బదపడి పాండునృపాలుండు మీరు హ
ర్షింపంగ భూమి రక్షించెఁ బిదప
ధర్మనందనునిచందము మీ రెఱింగిన
యది సత్యధర్మాత్ముఁ డైనయితని
తే. ననుసరింపక యన్యాయ మాచరించి, దుర్ణయంబున నిల యేలి త్రుంచెఁ గులము
నుర్విఁ గలభూపతులను దుర్యోధనుండు, వానిదుశ్చేష్టలకు మూల మేన కాదె.

వ. అది మీమనంబులం బెట్టక. 88

క. మహి లెస్సగ రక్షించిన, మహితగుణులయన్న కొడుకు మనుమం డని నా
కు హితంబు గోరి కరుణా, సహితుల రై యిం డనుజ్ఞ సద్వ్రతమునకున్. 89

వ. అని యప్పు డజ్జనంబులమనంబుల లే కున్నను దన కీళ్లుగ్గడించి యరణ్యగమనానుజ్ఞాకరణంబునకుం బ్రార్థించి యవ్విభుండు వెండియు. 90

1. గ. పట్ల సద్గతికిని. 2. చ. బిండు సేసికొని వెలార్చి.

క. అడ లెడఁబడఁగా మమ్మును, విడిచితి గురు వైనశోక - వేదన యే మిం
కుడిపికొనునప్పటికిం దో,డ్పడు నీ దగుసద్గుణములు - బంధులువోలెన్. 99

ఆ. ధాత్రి శంతనుఁడు విచిత్రవీర్యుఁడుఁ బాండు,రాజు నేర్చు లట్ల - రాజరాజు
ప్రజకు సంతసముగఁ - బాలించె నీయందు, నతనియందుఁ గలదె - యధిప యెగ్గు.

వ. భీష్మద్రోణకృపద్రౌణికర్ణకృతవర్మశల్యు లొక్కదిక్కును భీమార్జుననకులసహదేవద్రుపదవిరాటసాత్యకు లొక్కదెసయు నై విధిప్రేరణంబునం బోరిరి వారివలన నఖిలక్షత్త్రియసంక్షయం బావహిల్లె నది యొక్కదుర్యోధనుచేతన యయ్యె నె యట్లుం గాక రణంబు రాజుల కుత్తమధర్మంబ కాదె యందులమరణంబును సుగతికరణకల్యంబు నీసుతుండు సహాయులుం దానునుం బుణ్యలోకసౌఖ్యంబునం బొంది యున్నవాఁడు ధర్మాచరణశాలి వగునీకును సుగతిప్రాప్తి సులభంబ యగు నిట మీఁదటికి మా భాగ్యంబునం జేసి పరమకృపాభరితు లైనపాండవులు మాకు రక్షకులుగాఁ బడసితి మాకర్ణింపుము. 101

తే. స్వర్గ మైనను బాలింపఁ - జాలువారు, వీరలకు భూమిపాలన - విధి యనంగ
నెంతపని వీరిచేతికి - నిచ్చి తిపుడు, మమ్ము నెల్లవిధంబుల - మనిచి తధిప. 102

సీ. ధర్మపుత్త్రుఁడు దీర్ఘ - దర్శి మహోదాత్త,సచివుండు బంధుర - క్షణపరుండు
రిపునెడ నైనను - గృప పెద్ద భావసం,శుద్ధియుఁ బ్రతిభయు - సువ్రతంబు
నితనికి వెన్నతో - నిడినవి యొరులను, దనయట్ల కాఁ జూచుఁ - దమ్ము లెల్ల
సన్నుతి కెక్కిన - సకలగుణముల ని,మ్మహితాత్ము చందాన - మమ్ముఁ బ్రోచు

తే. మాత్రమే దేవవిషయ - మంచితాగ్ర,హారసజ్జనమాన్యంబు - లైనగ్రామ
ములు దగంగ రక్షింతురు - వెలయఁ దారు, నిత్తు రూళ్లులు దేవమ - హీసురులకు.

క. మృదువులకుఁ జాలమృదువులు, విదితయశా వినుము పాండ - వేయులు గడుబె
ట్టిదులు బెడిదంపువారికి, మదలోభిత్వములు లేవు - మందున కైనన్. 104

క. శూరులు శాంతస్వాంతులు, పౌరజనప్రకరజాన - పదచయనిత్యా
పారప్రమదాపాదన,పారగు లతులగురుభక్తి - పరతంత్త్రాత్ముల్. 105

తే. గొంతిదేవికిఁ గోడండ్ర - కును మనములఁ, గరుణ యగ్గల మై యుండు - ధరణినాథ
పౌరులందును జనపద - ప్రజలయెడను, నాడుదురు మేలు దమ క - గ్గ మైనయపుడు.

తే. వీర లెప్పుడు మము నీవు - గారవించు
తెఱఁగి మన్నింతు రమలిన - హృదయ కలఁక
దక్కి ధర్మజుపై రాజ్య - తంత్రభార
మిడి మనంబున నూఱడి - యిచ్చ సలుపు. 107

వ. అని చెప్పె నిట్లవ్విప్రముఖంబునం బౌరులభాషణంబులు విని ధృతరాష్ట్రుండు ప్రీతుం డయి సముచితప్రకారంబుల నజ్జనంబులం గ్రమంబున వీడుకొలిపి కౌంతేయాదిబంధువులను మిత్త్రులను నిజనివాసంబులకుం బోవం బనిచి

గాంధారీసమేతుం డై యభ్యంతరమందిరంబున కరిగి యద్దివసశేషంబును రాత్రి
యుం దగువర్తనంబులం గడపి మఱునాఁడు విదురుని రావించి స్వర్గగతు లయిన
బాంధవుల కెల్లను సవిశేషశ్రాద్ధంబులు సేయుతలంపు పుట్టె కొన్ని దివసంబులు
పయనంబు మానితి మానితమాననీయచరిత్రుం డగుధర్మపుత్త్రునకుం బోయి
నీ విక్కార్యంబు సంఘటింపు మని పనిచిన నతం డట్లు సేసెద నని చని యనుజ
సహితుం డై యున్నయన్నరేంద్రునిం గాంచి. 108

సీ. మీతండ్రి సురనదీసూతిబాహ్లికులకు, సోమదత్తునకుఁ దత్సూనునకును
దుర్యోధనాదిసుతులకును దక్కను, గలుగుబంధులకు నుత్కృష్టసుసంగ
శ్రాద్ధముల్ సేయువిచారంబు దోఁచిన, మనసులోఁ గార్తికవిస్తరమున
వనమున కరుగఁ దప్పని నీకుఁ బోలిన, యట్టులు గావింపు మనుచు నన్ను

తే. డెంతయును వేడ్క నమ్మాట కియ్యకొనియె
నర్జునుండును బ్రీతుఁ డై యర్థి మనియె
భీముఁ డపుడు [1]గమర్చినమోముతోడ
విదురువదనంబు సూచుచుఁ బెదవు లదర. 109

వ. ఏమేనిం బలుకం జూచిన బీభత్సుండు మెలుపున నతని వారించి యుల్లసయి
ట్లనియె. 110

సీ. రాజు వృద్ధుఁడు ధృతరాష్ట్రుండు భీష్మము,ఖ్యజ్ఞాతులకు శ్రాద్ధకర్మ మాచ
రింపఁ దలంచి యర్థించె భవజ్జిత,ధనధాన్యములు నీవు దాని కియ్య
కొనమి యశంబునకును ధర్మమునకు వి,ధ్వంసంబు సేయుటే ఘనత యయ్యు
తలఁచినపని విఘ్నితము సేయఁ దగునయ్య, మనకు నయ్యంబికాతనయుఁ డొల్లి

ఆ. వేఁడికొందు మతఁడు వేఁడెడుఁ గానకు, నేఁగుచుండి మనల నిప్పు డింత
సూడ వలదె యొండు లాడక యప్పని, సలుపు మొప్ప బాహుశాలి నీవు. 111

క. అని చెప్పఁగఁ జెవి [2]దారిచి, విని ధర్మతనూజుఁ డంత విజయునిఁ బొగడన్
మనమున నమ్మాటల క,య్యనిలతనయుఁ డిట్టు లనియె నన్నరుతోడన్. 112

భీముఁ డర్జునునితో ధృతరాష్ట్రునుద్యోగంబునకుఁ బ్రతికూలించి చెప్పుట.

క. మును చేసినయవి చాలవె, విను గాంగేయాదిబంధువితతికిఁ దగ నిం
కను శ్రాద్ధంబులు వలసిన, మనము దగమె చేయ దుష్టమతి యతఁ డేలా. 113

క. మఱచితె యాతఁడు మనలం, బఱచినబన్నములు భీష్మబాహ్లికముఖు ల
త్తఱి నెట వోయిరి వారల, నెఱుఁగమె మన మట్టిబంధు లేటికి మనకున్. 114

వ. వారివిషయం బైనమేలునకు మాఱాడుట యొగ్గు గా దాకర్ణింపుము. 115

తే. కర్ణునకుఁ జేయవలసినగారవమున, గొంతి యింకను శ్రాద్ధ మత్యంతవిభవ
ముల్లసిల్లంగఁ జేయుఁ గా కుచితనిరతి,యావిధమునకు మాఱాటసూవె యొగ్గు.

1. క. గనలిన. 2. గ. వాలిచి.

వ. అని పలికి వెండియు. 117

సీ. పాంచాలి వనవాసపరిపటిచిన తెఱఁగును, నయ్యంతి వెనుక రా నడవిఁ గలయ
ధర్మజుచన్న చందంబును మది గీటి, [1]యుండక మఱి పెట్టు లోలసె నీకు
గాంబికేయుఁడు దండ్రి యసుట నాఁ డేట వోయె, భీష్ముండు మొదలగు పెద్దవారి
బాంధవంబే మయ్యెఁ బార్థ యావిదురుఁ డెఱుంగఁడే వారలభంగి యనిన

ఆ. ధర్మజుండు భీముఁ డగు వచనముల నదల్చె నరుఁడు మఱియుఁ దగఁడె పూజ
గాంబికేయుఁ డిట్టు లనకుము మనకు నగ్రజుని పనుపుసేత వ్రతము గాదె.

క. అని భీము నదిమి విదురునిఁ, గనుఁగొని మాతండ్రి పుణ్యకర్మము లెమ్మెఁ
దనబంధులకై చేయఁగ, మనంబునం దలఁచె నాసమంచితభంగిన్. 119

క. నాయింటిధనము గైకొని, చేయఁగలాఁ డమ్మహీశుచిత్తము సంతో
షాయత్తంబుగ వేగమ, పోయి యనఘ చెప్పుమవ్విభుఁడు ప్రియ మందన్. 120

చ. అన విని మెచ్చి ధర్మసుతుఁ డర్జుననిం గొనియాడి యాదరం
బున విదురుం గనుంగొని ప్రభూతవిధానములన్ నిజేచ్ఛ నా
ధనమును నర్జునార్థమును దాఁ గొని శ్రాద్ధము లాచరించువాఁ
డనఘ కురూద్వహుం డిది మదాత్మకు నిం పని విన్నవింపుమీ. 121

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 122

క. వనవాసాయాసంబుల, ననయంబును నలఁగి దాని నాత్మ నిడి మరు
త్తనయుండు పెక్కు లాడెఁ ద, గనిమాటల దీన రాజుఁ గనలకు మనుమీ. 123

క. ఇతఁ డేమి యన్న నే మగు, ధృతరాష్ట్రుఁడు మాకుఁ బరమదేవత విను స
మ్మతిఁ దత్ప్రసాదముం బడ, సితి మేమును దత్కృతాభిషిక్తుల మనఘా. 124

వ. అని పలికి యప్పుడమితేఁడు వికచవదనుం డగుచు. 125

క. మాతండ్రి నిష్టవిధములఁ, బైతృకవిధు లాచరింపఁ బంపుము [2]రథ్య
వ్రాతకనకగోగజములఁ, జేతి కొదవ నర్జునుండుఁ జేర్చుచు వచ్చున్. 126

క. గ్రామములు దేవతలకును, భూమిసురులకును గురుప్రభువు నిమ్మనుమీ
పో మసలితి చెపు మాతని, కీమాటలు వలయుపనుల కీవు మెలఁగుమీ. 127

క. అనినఁ బ్రియ మంది విదురుఁడు, సని యానృపుతో నజాతశత్రుకడకు నీ
పనిచినపనికిం బోయితి, వినిపించితిఁ దెఱఁ గతండు విని మోదమునన్. 128

క. నరువలను సూచె నతఁడుం, బరమప్రియభరితుఁ డయ్యెఁ బార్థివవర య
య్యిరువురుఁ బ్రాణంబులు డాఁ, పరు నీకును ధనము డాఁచుపని గలిగెడినే. 129

క. చేయుము విచ్చలవిడి గాం, గేయప్రముఖులు నిరస్తకిల్బిషులై మో
దాయత్తచిత్తులుగ భూ, నాయక శ్రాద్ధములు జగముసం బొగడఁగన్. 130

చ. కనకము మేలిరత్నములు గ్రామములున్ హయగోవ్రజంబులుం

---

1. జ. యుండఁగ. 2. ట. రత్నవ్రాతకనకగోహయములఁ, జేతోరతి నర్జునుండు.

దనియఁగ నిమ్ము సర్వవసుధాసురకోటులకుం బిశిష్టస
తనయులు పుణ్యలోకసుఖధాములునై విలసిల్లువారుగా
ననుటయు నాంబికేయుహృదయంబున మోద మెలర్చె భూవరా. 131

చ. పదపడి భీముమాట లోకభంగి నెఱుంగఁగఁ జెప్పి వాయుసు
ర్తుఁడు డవి పాటి గావు కురురాజమహాత్తర పట్టి నీయను స
హృదయమునందు వాని నని యేర్పడ ధర్మజునొంపువాక్యముల్
విదురుఁడు సెప్పె సంతసము వెల్లిగొనంగ ననేకభంగులన్. 132

ఆ. అట్లు సంతసిల్లి యధిప కార్తికపౌర్ణ, మాసి సవ్యసాచి మాపుచెంపు
దేవకోటి నెల్ల రావించి యంచిత, శ్రాద్ధఁ జేయఁ జేసెఁ గ బ్రాహ్మణులకు. 133

సీ. కనకాదివస్తువుల్ గడువేడ్క ధర్మసు, తనుఁడును పుత్త్రిన సుతులు గలుగఁ
బాహ్లికునకు గంగపట్టికి సోమద, త్తునకుఁ దదీయపుత్త్రునకుఁ బోలగాని
[1]నంచితశ్రాద్ధంబు లాచరించె సుయోధ, నాదులకును గండుకొనను
జేర్వఁగ గ్రియ[2]లు నిరప్సితవిధంబులఁ దగ, నొనరించె సింధురాజకుడును దస్యుఁ

ఆ. గలుగుబంధులకును వలయురాజులకును, బ్రాహ్మణులకును బుద్ధిఁ గరఁగిచినట్టి
యిష్టజనములకు నహీనభవ్యప్రకారములఁ గాలయోగ్యకము లొసఁగ్చి. 134

చ. అతులితరత్నకాంచనగవాశ్వవిభూషణవస్త్రకన్యకా
క్షితిముఖవస్తుదానములు కీర్తన కెక్కఁగ సవ్యసాచి సు
వ్రతుఁ డయి చేసెఁ బంచదశవాసరముల్ నిజదానలౌల్య సు
ప్రతిహతవృత్తిఁ జెల్ల విని పాండుసుతాగ్రణి ప్రీతిఁ బొందఁగన్. 135

ఆ. భూమిదానవిధులు భూవర యొకమాత్ర, సంధికాలమునను బ్రాపరింప
నంతఁ బోక యూళ్లు లగ్రజన్ములకు నీ, సతనిఁ బసిచెఁ బాండవాగ్రజుండు. 136

—— ధృతరాష్ట్రుఁడు గాంధారీసహితుండై వనంబునకుఁ బోవుట. ——

వ. పనిచినం బ్రియంబు పెంపున హృదయంబు పల్లవింప నాభూవల్లభుం డనేక
గ్రామంబు లగ్రహారంబులు గావించె గాంధారరాజు మొదలగునిజబంధు
వులకు బహుళదక్షిణలుఁ గాఁ బారలౌకికక్రియలు సేసె నిట్లు ధృతరాష్ట్రుండు
భారతరణంబున మరణంబు నొందినబంధులోకంబునకుం బుణ్యలోకసౌఖ్యాతి
శయపదంబు లగుపరమశ్రాద్ధంబులు నిర్వర్తించి కృతకృత్యుం డై సర్వకృత్యం
బులుం జలిపి పాడ్యమినాఁడు రేపకడ బుత్విక్సమేతుం డై యిష్టి సడపి పాం
డవులను దక్కటిబంధువులను మిత్త్రులను రావించి వనవాసంబునకు సంక
ల్పంబు సేసి సకలభృత్యజనంబులకు నర్థధనంబు లిచ్చి గాంధారీసమన్వితుం
డై వల్కలాజినంబులు ధరియించి యక్షతగంధపుష్పంబుల గృహాంబుఁ బూ
జించి సర్వపదార్థంబులుం బరిత్యజించి యద్దేవియుఁ గదిసి నడవ యాజకు

1. క. నర్థిమై శ్రాద్ధంబు. 2. జ. లతిస్ఫీతవిధంబుల నొనరించ.

లగ్నులు నుపకరణంబులును ధరియించి ముందటం జేరువ నరుగ నగరు వెడలె నట్టియెడ నేతెంచి. 137

క. గొంతి మొదలైనకౌరవ,కాంతాజను లెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ బ
ర్యంతంబుల బాష్పసలిల,సంతానము లురలఁ దోన చనుదేరంగన్. 138

వ. అజ్జనపతి సనుచుండె 139

తే. పాండవాగ్రజుఁ డక్కురుభర్తవలను, శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి
హామహారాజముఖ్య యెందరిగెదనుచు, నొడలు కంపింపఁ జదికిలఁబడియెనధిప.

క. సరుఁ డనునగుంచె వెస న,న్నరపతి నెత్తుచును దా నసనయముగ్ వనటం
బురపురఁ బొక్కెం గురుభూ,వర యద్దెస తెఱఁగు రాదు వాక్రువ్వంగన్.141

వ. భీమసేనసకులసహదేవులును గృపయుయుత్సుసంజయులును ధౌమ్యాదిధరణీసురులును శోకవ్యాకులత్వంబు నొందిరి గొంతి యడలుచు గాంధారికరంబు నిజస్కంధంబున నిడికొని నడవ నయ్యంధనృపతి గాంధారీస్కంధభాగకలితబాహుండై పోవుచుండె నప్పుడు పాంచాలియు సుభద్రయుఁ జిత్రాంగదయు నులూపియు సపుత్త్ర యగునుత్తరయు మఱియుం గలయట్టిమగువలుం గురరీనిచయనాదంబులచందంబు దోఁప నాక్రందనంబు సేసి రయ్యవస్థ జూదంబునాఁడు పాండవులు పురంబు వెలువడినప్పటిదశం బోలి యుండె నట్లు ధృతరాష్ట్రకాననగమనంబు నిశ్చితం బగుటయు నాబాలవృద్ధంబుగాఁ బురజనంబు గనుంగొనం జనుదెంచిన. 142

ఆ. వచ్చి రెండకన్ను వానకన్నును నెఱుం,గనిపురంధ్రు లెల్లఁ గరమువంతఁ
దలరునంతరంగములతోడ నక్కురు,వృద్ధుఁ జూడ నార్తివికలగతుల. 143

క. నేలను హర్మ్యంబులపై, నోలి నిలిచి చూచుమానవోత్కరములకో
లాలాపవిలాపంబులు, నేలకు మింటికిని నడుమ నిండి చెలంగెన్. 144

వ. ధృతరాష్ట్రుండును బురద్వారంబు నిర్గమించుచుండి సకలపౌరజనంబుల నిలువం బనిచె విదురుం డక్కురువృద్ధునితోడ వనంబున కరుగుట దృఢనిశ్చయుండై పలికె సంజయుండు నవ్విధంబువాఁ డయ్యెఁ గృపాచార్యుండును యుయుత్సుఁడు నత్తెఱంగుమాటలాడిన నాంబికేయుండు వారిని వారించి ధర్మనందనున కప్పగించి నిలిపి కోడండ్ర నెల్లను సముచితవచనంబుల మరల నియమించిన వార లావైచిత్రవీర్యునకు గాంధారికిం బ్రణమిల్లి బాష్పంబులు వదనంబున వెల్లిగొనుచుండ వీడ్కొనియును బాండురాజమహిషిం జూచికొని వెనుకం జనుచుండి రాసమయంబున నజాతశత్రుండు గొంతి కిట్లనియె. 145

క. మాయయ్య కాననమునకుఁ, బోయెడు నే నితనితోడఁ బోయెద శుశ్రూ
షాయత్తుఁడనై యుండెద, నీయువిదలఁ గొనుచు మగిడి యేఁగుము తల్లీ.146

చ. అనుటయు గొంతి యక్కురుకులాగ్రణి కిట్లను నీవు దోడఁ గా

వనమున కేఁగుదెంచుట జగన్నుతపావనచరిత్రుఁ డవ్విభుఁ
డనుమతి సేయునే యుడుగు మాపని యియ్యెను యత్న మాతని
మనుజవిభుండు మామ గరిమంబుగ వీరలఁ గొల్చి పోయెడిన్. 147

తే. ఇతని కియ్యమకును విను మేన చుట్టి, వలఁతి శుశ్రూష సేయుఁగ నన్న మీర
లాపనికి నేర్తురే వీర లడవి కరుగ, నింట నుండంగ నేమును నియ్యకొనవె.

వ. అనిన నాధర్మపుత్త్రుండు దమ్ముల నుచితవచనంబుల నోదార్చి సద్గుణ యగ్ర
తనయుం గనుంగొని. 149

క. వీరలయెడఁ గొడుకా [1]యుపచారంబులు వలుకుటయు నీకు దాసత్వము నీవు
నేరూపంబున నిలువన, గారవమున నిది వ్రతంబు కాంక్షఁగ కొంటివి. 150

వ. అని పలికి నిజస్కంధంబున నున్న గాంధారికరంబుఁ గరంబు నయంబునం బాపి
యతనిదిక్కు మొగం బై. 151

క. నీ వేమియు ననకుము సహదేవుని నేమంబుక యునికియు విను గనుగొనుటెల్ల
భావమునఁ దలఁపు మే నా, దేవసమునివృత్తి పడఁ చింతించి గపటమునకున్. 152

క. అది పాపము దానికి నా, మది నెప్పుడు వగలు విమలమనమున యున్న
డు దొలంగునట్లుగా సత్పదార్థదానములు సేయుము తలఁపకవ్యయమునన్. 153

ఆ. అవ్విధమునఁ గర్ణుఁ డాఅడిఁ బోయిన, నాదుమానసంబు నవసి నుగ్గు
పఱియ లై తలంప బలుఱాతఁ జేసిన, వారు గాఁగ వలఁగు నంతవట్టు. 154

క. నీవును దమ్ములు భక్తిభరావేశముతోడఁ దలఁపుఁ డిట్టిదె నిత్యము
ద్రోవది నెప్పుడు దృఢసంభావన మన్నింపు మయ్య భారసముద్రా. 155

క. భీమార్జుననకులమనసిజసమాంగులు సఫలతాప్రకాశంబులు గా
భూమీశ యరసి యొసరుపు, మేమిట నేమంబుకు ధర్మ మిల యరయుము నడుమన్. 156

వ. అని పలికి నానిశ్చయంబు శిథిలంబు గాదు మీరు మరలుం డని పలికినం బాండ
వాగ్రజుండు విషాదం బంది యూరకుండె భీమాదులు దుఃఖంబులు గొండలం
బంద నశ్రు లోలుకం దలలు వాంచి రిట్లు మొత్తంబుగ మనంబు [2]గుదివడుచు
మందం బై చెల్ల ధృతరాష్ట్రుండు [3]గొండొకయెడ గలుగం జనియె నాధర్మతన
యుండు దల్లియాననం బాలోకించి. 157

ధర్మరాజు కుంతిని వనంబునకుఁ బోవల దని ప్రార్థించుట.

సీ. ఇది యేమి సేయంగ నెత్తికొంటిమ్మాట, యాఁడకు మేను నిన్నడవి కేఁగఁ
బనుతునే మముఁ దొల్లి పనిచి పనుల్ గొను, భంగిన సామ్రాజ్యభారనిర్వ
హణము తెలంగును నప్పటికప్పటి, కిట్లని యానతి యిచ్చినదపఁ
బంపక యున్న నోరప్పుమి రాదె మాకు ము, న్నీవును గృష్ణుండు నేవిధమున

తే. నడపితిరి కార్య మెఱుఁగవే యడలు వెల్లి

1. క. యుపచారంబులు. 2. గ. సుడివడుచు. 3. గ. గొండుకయెడ.

మమ్ముఁ బాంచాలి నిటు ముంచి యమ్మ యడవి
నెట్టు లుండెద వనఁగ నయ్యింతి బాష్ప
పూర్ణనయన యై యూరక పోవుచుండె. 158

ఉ. అయ్యనలాత్మతోడఁ బవనాత్మజుఁ డిట్లను ధర్మపుత్త్రు నీ
వెయ్యది యుక్తహేతువుగ నిమ్మెయిఁ బాసెదు నీదుపన్పునం
గయ్యము సేసి భూపతినికాయములం బరిమార్చెఁ దల్లి నీ
కియ్యన లక్ష్మి నూఁది [1]చరియింపక యిప్పుడు వాయఁ బాడియే. 159

క. మనమునఁ దోఁచినదానము, లనుదినమును జేయుచును సమాశ్రితజనులం
బెనుచుచు బంధులఁ బ్రోచుచు, జననుతచరితమునఁ బరఁగు సౌజన్యనిధీ. 160

క. వనమున మాద్రీపుత్త్రులు, [2]వెనుఁబడుటకుఁ దలరి తట్లు విక్రమమునకుం
గొనకొల్పి తిట్లు వీరల, ననూనదుఃఖముల ముంచి యరుగం దగునే. 161

వ. అనియె నట్టియెడ. 162

క. ద్రోవదియు సుభద్రయు శో,కావేశం బడర మోము లశ్రులఁ దోఁగం
గా వెక్కి వెక్కి యేడ్చిరి, భూవర పాండుక్షితీశపుత్త్రులు నేడ్వన్. 163

క. పరిజనములు గన్నీళ్లులు, దొరఁగఁగ [3]నడ లొంది వారితోడం జని రి
ప్పురుసునఁ దనదుతనూజులు,మరలమికిం బాండురాజమహిషి మఱుఁగుచున్. 164

వ. తెగ నాడ కున్నఁ బోవ రని కన్నీరు దుడిచికొని వారలం గలయం గనుంగొని వా
రలు విను చుండం దత్పరిజనంబులతోడ. 165

సీ. దుర్ద్యూతమునఁ దారు దూలపోవుటయును, నాసభ నపకీర్తి యగు తెఱంగు
వాటిల్లుటయుఁ బెక్కుభంగుల నడవుల, నిడుమలఁ బడుటయు నే సహింపఁ
జాలక కార్యంబు చర్చించి సంధిమై, నొవ్వనివా రెల్ల నవ్వఁ దలలు
వంచి కౌరవులలో వర్తింప నే లని, హరితోడ నాడితి నవ్విధమున

ఆ. మానసీయు ధర్మసూను నాగాయుత,బలుని భీము శత్రుభంజనైక
శీలుఁ బార్థు శౌర్యలోలురఁ గవల ద్రై,న్యంబు నొందఁ జూచు టర్హ మగునె.

వ. అని ధర్మతనయువదనంబు వీక్షించి పాంచాలిం జూపి. 167

సీ. గారవంబున సుకుమారత్వమున నొప్పు,నిప్పొల్తిఁ దల వట్టి యీడ్చి తెచ్చి
సభలోన నట్లు దుశ్శాసనుం డవమాన,పెట్టంగ నచ్చటిపెద్ద లెల్లఁ
బలుకక యుండ నబ్బన్నంబునకు నోర్వ, వలసె మీ కప్పటి కలఘుతేజ
నీతేజ మట్టులు నీఱయి పోయినఁ, బాండునికులము సెప్పంగఁ జూప

తే. లేక [4]పోదె యబ్బంగిఁబల్కితి ముకుందు,తోడ నేను మీ రెమ్మెయి రూడికెక్కి
వెలుఁగఁ గోరుటకతమునఁదలఁచిదాని,ననిలసుతుఁడెత్తిపెట్టె నేమనఁగఁగలదు.

1. గ. చరియింపఁగ నిప్పుడు. 2. క. చ. ట. 'వెనుఁబడుటకు...విక్రమము మెయిం గొనివచ్చి తిపుడు వీరల'. 3. గ. నడ లాడ వారి. 4. గ. పోక కబ్బంగి.

వ. అనిన విని ధర్మసుతుండును భీముండును సిగ్గువడి రిత్తలు వలికి నోరి యున్నంతటను భీముచిత్తం బెట్లగునో యనుతలంపున ధర్మసుతుండు తల్లి కిట్లనియె. 169

ఉ. నామది నొండు లేదు విను నీ సవ్విరి నీతని త్రోసి నీవులు
ద్దామమహామఖ మనం బలరం జేసితి నుత్తమవ్రతముల్ జన
స్తోమనుతంబుగా నడపం జూచితి జన్మము గన్నలార నిం
కేమికొ యింత నా కుడుగ నెట్లును బోవు వరణ్యవృత్తికిన్. 170

తే. రాజ్యఫలము గామింపం బుత్త్రసమగ్రతపమునకు ఫల మైనయట్టి ప్రస్తుతగతి ప్రసిద్ధి గోరుదు వది గల్గ నేఁజేత కిట్టి, త్రోవ నునికి నాకుం గలుగునే నీ దురితదూర. 171

క. కురురాజునకును దేవికిఁ, బరిచర్య యొనర్చుచుం దపంబును గ్రమముతో
భారయుతనువుతోఁ గడపెదఁ, గరమునియమి నింకఁ గలుగుకాలము వత్సా. 172

వ. మీరు మరలుం డనియె నట్టియెడ నప్పాండురాజమహిషి దనుతోడ వనవాసంబున కై వచ్చుటకుం గడంగుటయు దాని కొడంబడక పాండవులు దగుపలుకులం బ్రార్థించుటయు నెఱుంగుం గావున ధృతరాష్ట్రుండు ధర్మతనయున కిట్లు సెప్పె నట్లు సేయు మని విదురసంజయులచేత నద్దేవికిం జెప్పి పుత్త్రులు దానిచిత్తంబు వోవరాదు వేరఁ దెంచి యబ్బంగి సెప్పినను వదలక వారిపలుకు లాయమ విచారించి దృఢనిశ్చయంబునం గొడుకులం గోడండ్రను దక్కటిబంధుజనులను సర్వభగరభార్యలను బరిజనంబులను గలయం గనుంగొని యిట్లేల వచ్చెదరు నిలువుండు సుఖుల రై యుండుం డనుటయు. 173

క. హృదయములు దలర నందఱుఁ, బ్రదక్షిణము గాఁగ నేస్పుచు గ్రందుకొలుఁగు తెల్లదెసలఁ జెలఁగఁ దిరిగి త,త్పదంబులకు నెఱఁగి వంతఁ దనుపులు దూలన్. 174

వ. నిలిచి రందుఁ బాండవు లేవురుం బాండురాజమహిషి ననుప మఱియు జని యాయమను ధృతరాష్ట్రగాంధారులను గలపి వారల నిరుపుర నుద్దేశించి మీరు వనంబునకుం బోయి తానును లే కున్న మా కెట్లు కాలంబు గడప వచ్చు నను తలంపునం దన్ను నెంత ప్రార్థించినను గొంతి నిలుచుట కొడంబడ దయ్యె నీసాధ్వికి బుద్ధి సెప్పికొనుచుం బరిచర్య సేయించుకొం డని యప్పగించి యారాజునకు నద్దేవికిం గుంతికిం బ్రదక్షిణంబు సేసి దండప్రణామంబు లాచరించిన దీవించి వా రామంత్రణంబు సేయ నాధర్మపుత్త్రాదు లశ్రుప్లావితంబు లగువదనంబులతోడ మరలి వనితాజనంబులం దోడ్కొని. 175

తే. పొగులుచును నల్లనల్లన పురికి నరిగి
[1]రదియు నుమ్మలికంబు ప్రోవై నయట్లు
నూడఁ గూడక యుండంగఁ జొచ్చి రాత్మ
మందిరము లందఱును బుధమాన్యచరిత. 176

1. గ. వ్యథయు నుమ్మలికంబు.

వ. అట్లు పురప్రవేశంబు సేసి ధర్మనందనుండును దమ్ములుం దగినవర్తనంబుల నుండి రట యక్కురువృద్ధుండు నిశ్చింతుం డై గాంధారియుం గుంతియు విదురసంజయులు నగ్నిహోత్రంబునకు వలయుఋత్విగ్జనంబులతోడ నరుగుదేర నలయక భాగీరథీతీరంబునకుం బోయి యొక్కయోగ్యప్రదేశంబున విడిసెం దదనంతరంబ యతండు. 177

క. స్నానాదికవిహితానుష్ఠానంబులు నడపి శ్రుతివిశారదభూదే
వానీకప్రణయనమున, మానితరుచి వెలుఁగు చున్నశమహితాగ్నులకున్. 178

తే. అర్చలిచ్చి హోమంబు సక్రమంచితముగఁ, జలిపి యెల్లవారలకు భోజనము సంఘటించి యాహారవిధి యాచరించి విదుర,సంజయులయొనర్చినదర్భశయ్యనుండె.

—ధృతరాష్ట్రుండు శతయూపరాజర్షి యాశ్రమంబున వసియించుట.—

వ. ఆశయ్యకు ననతిదూరంబునం గల్పితం బై నతల్పంబున గాంధారియుం దదనంతరసన్నిహితశయనంబున గొంతియు నింతనంత విదురసంజయులును జుట్లం దమకుం జూడం బోలినచోటుల యాజకజనంబును విశ్రమించి రట్లద్దినశేషంబు ననిన సాయంతనకృత్యంబులు నలిపి రయ్యామిని యచ్చటం గడపి సూర్యోదయసమయంబునం గాలోచితకరణీయంబులు నిర్వర్తించి యాంబికేయుండు దనవారును దానును గంగానది యుత్తరించి చని కురుక్షేత్రంబుఁ బ్రవేశించి యొక్కపుణ్యాశ్రమంబునుపాంతంబునం దరుచ్ఛాయాశీతలం బై నసికతాతలంబున నాసీనుం డయ్యె న ట్లక్కురురాజు నిజాశ్రమప్రదేశంబునకు వచ్చుట శతయూపనామధేయుండును గేకయవంశవర్యుండును దపోధుర్యుండును నై నరాజర్షిసత్తముండు విని యయ్యెడకు వచ్చి. 180

క. కని గారవంబునం దోడ్కొని చని యర్ఘ్యాదివిధు లకుంఠితవినయంబున నడపిన నయ్యాశ్రమ,మున నతఁడు వసింపఁ గోరె భూపవరేణ్యా. 181

క. కోరిన విదురాదులు నా,కౌరవపతితలఁపు మేలుగాఁ గొని తగ న
చ్చేరువను బర్ణశాలలు, వే రచియించి రుచితంపువిధమున నధిపా. 182

వ. అం దక్కురువిభుండు దానును గాంధారియుఁ జీరాజినవసనులును సువ్రతపరులు నగుచుఁ గుంతీవిదురసంజయులతో వసియించి తపం బాచరింప యాజకులు నిజకృత్యంబులు నడపుచుండి రిట్లు నియమనిష్ఠ లతిశయిల్ల నాభూవల్లభుం డచ్చటి మును ల(చ్చెరు వంద న)చ్చెరువ నతితీవ్రతపశ్చరణంబున నిజాంగంబు నిర్మాంసత్వంబునం జర్మాస్థులు గదియునట్టికార్శ్యంబు దనకు నొప్పుగా వర్తిల్లె నని యిట్లు ధృతరాష్ట్రువృత్తాంతంబు సెప్పిన విని యవ్విచిత్రవీర్యనందనుండు వదంపడి యెట్టివాఁ డయ్యె మునీంద్రా యెఱిఁగింపు మనుటయు. 183

శా. ఆశాపాశవిమోచనోపకరణవ్యాకోచహృద్ధామ సం
క్లేశోత్సారకదివ్యనామ వరదృగ్లీలాప్తనిస్సీమ ల

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము

## ఆశ్రమవాస పర్వము, ద్వితీయాశ్వాసము.





క. శ్రీసంబంధానుగ్రహ
తాసిద్ధిదచరణపద్మ దాంత్యస్మిల
ద్ధీసద్మ శాంతిసేవ్యా
వ్యాసాదిమునీంద్రభావ్య హరిహరనాథా. 1

ధృతరాష్ట్రునిపాలికి నారదుండు మునులతో వచ్చి యత్తపోవనమహిమ సెప్పుట.

వ. వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు వైచిత్రవీర్యుండు పరమతపోధుర్యుం డయి యుండె నంత నొక్కనాఁడు నారద పర్వత దేవల మహాంజాయను లక్ష్మీనాయకుం జూచువేడ్క నయ్యాశ్రమంబునకుం జనుదెంచిన. 2

క. శతయూపుఁడు నయ్యెడకుం, గుతుకంబున వచ్చె వారిఁ గుంతి వినయసం
భృత యై యందఱను సమర్చితులుగఁ జేసినఁ బ్రహృష్టచేతసు లగుచున్. 3

వ. ధృతరాష్ట్రుకడకుం బోయిన నతండును వినయసంభ్రమంబులతో వినతుం డైన దీవన లిచ్చి యతని పెట్టించినదర్భాసనంబుల నాసీను లై యుచితసల్లాపంబులు సేయుసమయంబున నారదుం డన్నరనాథుతో [1]శతయూపనామధేయుం డయిన ధరాధిపుపితామహుం డగుసహస్రచిత్యుఁ డనుమహారాజు దనపెద్దకొడుకు డైన శతచిత్యునందు రాజ్యభారం బిడి యియ్యాశ్రమంబునకు వచ్చి తపశ్చరణంబున దుశ్చ్యవనసఖత్వంబు నడసె మఱియును బృషధ్రుండును శైలాలయుండును బురుకుత్సుండు నిందుఁ దపంబు సేసి యింద్రలోకంబు నడసి రా రాజర్షిసత్తముల నెల్లను నే నీలోకంబున మెలంగుచుండి యియ్యెడం గంటి నయ్యెడం జూచితి నిది యితరదుష్ప్రాప్యం బయినపుణ్యప్రదేశంబు నీకుం గృష్ణద్వైపాయనుప్రసాదంబున నిచ్చట వసియింప సంభవించె నని పలికి వెండియు. 4

సీ. ధరణీశ యిచ్చటికేతపమున నీవు నా, నృపులయట్టుల విశిష్టపుఁబదంబుఁ

---

1. జ. శతజిన్నాను...ధరాధిపునష్ట యగుసహస్ర.

గంధు నీతోడన గాంధారియును వచ్చు, మీరు సుశ్రూష యొనరింపు భక్తిఁ
జేసి కుంతియుఁ బతిఁ జేరంగ నరుగు న, ప్పాండుభూపతి సురనికేతనవాస
మున నుండి యెప్పుడు నిన్నుఁ దలంచు నతఁడు, పోయెదవు నీవును గలయంగ నీవు

ఆ. ధర్మమూర్తి యైన ధర్మసూనుఁడు దన, మూర్తి గాన విదురుఁ డున్న రీతి
వినుతతనువుఁ దగఁ బ్రవేశించు సంజయుఁ, డతిశయలోకంబు గనిన వెలుఁగు. 5

వ. అనిన విని యాంబికేయుండు గాంధారీకుంతీసమేతుండుగా సంతోషించుచు నానంద
నచ్చటియందఱును బ్రీతాత్ములై రప్పుడు. 6

క. శతయూపుఁడు నారదుతో, నతులజ్ఞానాభిరాముఁ డగు మునివరుఁ డన్నుఁ
గుతుకంబున నొక్కటి నీ, వితతకృపం బలియఁ జెప్పవే యని యడుగున్. 7

వ. ఆదేవముని నీయడుగఁ దలంచినది యెయ్యది యనుము నీవు నడిగెదవు ధృతరాష్ట్రుని
సుగతి గను నని నిర్దేశించితి తద్విశేషంబు విను వలయునేని వినుమని చెప్పె. 8

నారదుఁడు శతయూపునితో ధృతరాష్ట్రాదులు సుగతిఁ బొందుదురని చెప్పుట.

సీ. ఆసంయమీశ్వరుం డాతని కిట్లను, విప్రలు నేను మహేంద్రసదనమున
కరిగి సంభాషణ మాచరించుచు నుండ, నాసభ నిక్కువ మైనవార్తను
వలనివార్తలు పుట్టి యలఘుతపోవృత్తి, నిస్తారిత యనుమ వచ్చెను బుధప్ర
డవ్యాసవుఁడు సెప్పె ననఘ నాతో ముని, జాలుఁడు ధృతరాష్ట్రధరణీశ్వరుండు

తే. తపము మూఁడేఁడులొనరించి తానుసతియు, దేహములు వ్రచ్చి విపినవాసమున వరిమి
నతిశయిల్లు దివ్యాభరణాభిరాముఁ, డై విమానమధిరోహించి స్వర్గమునకుఁ జనుచు. 9

క. అని పాండునిమది ప్రమదం,బునఁ దేలఁగఁ జెప్ప నమును వాఁడవుడు ధృతరా
ష్ట్రుని నెమ్మనమున నిండా, రె నఖిలజనచిత్తములను బ్రియము జనింపన్. 10

వ. ఇట్లు సద్గోష్ఠి నడపి యత్తాపసోత్తము లక్కురుతిలకుల సభికులం జేసి యామంత్ర
ణంబు సేసి నిజనివాసంబులకుం జని రక్కాలంబున. 11

సీ. పాండుపుత్త్రులు దల్లిఁ బలుమఱుఁ దలఁచుచు, వగతోడ ధృతరాష్ట్రవరనందనుల
నందనదేశను మఱచం బిడి చింతింతు, రట్లు పౌరులు నంత నాసఁ గూడి
వృద్ధుండు ధృతరాష్ట్రవిభుఁడు సుభాగ్యుఁడు, విగతజనంబైన విపినభూమి
నెత్తెఱంగున వసియించు గాంధారియుఁ, గుంతియు నత్యంతకోమలాంగు

తే. లడవి నుండంగ నెట్లోర్తు రకట యిట్టి
కొడుకులను రాజ్యసౌఖ్యంబు విడిచి యట్లు
సనునె యక్కుంతిభోజునికతనయ జనని
దొఱఁగి పోవుట కెంత గుందుదురొ వీరు. 12

క. ఆయాసంబున విదురుని, కాయము సంజయుని మేనుఁ గందక యున్నె
పోయిరి ధృతరాష్ట్రమహీ, నాయకుపై భక్తిఁ గానసమున వసింపన్. 13

క. అని యొండొరువులతోడ, న్వనట యెసఁగఁ బలుకుదురు మనసంబులఁ గుంతీ

తనయులు మాతృవియుక్తత, కనయము నడలుదురు కౌరవాన్వయముఖ్యా. 14

సీ. ధర్మపుత్త్రాదు లందఱు నొక్కచో నుండి, ధృతరాష్ట్రు నాతని దేవిఁ బేరు
కొని వారికొడుకు లెల్లను ద్రుంగి రని వార, లతివృద్ధు లెమ్మెయి నడవిఁ గలసి
యున్నా రనియు నింక నెన్నాళ్లు లుండెడి, గొంతి వనంబునఁ గూర దినుచు
ననియును బంధుల నదయతఁ దునిమితి, మలుక ధైర్యంబున నడఁపమైతి

తే. మనియు నభిమన్యు వీరుని నతనితమ్ముఁ
గుఱ్ఱలను గర్ణు నాఱడిఁ గోలుపోయి
గెలుచితి పడితి మనియుఁ గడు నుమ్మలంపు
మాట లాడుదు ర్పరిజనుల్ మఱుఁగుచుండ. 15

వ. ఇట్లనుదినంబును ఘనచింతాక్రాంతు లై యలంత నొందుదురు. 16

చ. విదురుని సంజయుం దలఁచి వేదనఁ బొందుదు రట్లు నెవ్వగల్
హృదయముఁ గుందఁ జేయఁ జెలు వేది మనోజ్ఞము లైనభోగము
ల్వదలి వినోదముల్ సలుపులాలసితం బెడఁబాసి రాజ్యసం
పద నరయం దలం పెడలి పాడఱి యుండుదు రేమి సెప్పుదున్. 17

క. ద్రౌపదియు సుభద్రయు సం,తాపం బందుదురు పాండుతనయులు దలరన్
భూపాల భవజ్జనకుని, చూపం దఱిమానసముల శోకము నడుమున్. 18

ఆ. పరమధీరు లైనపాండుతనూభవు, లిట్లు ధైర్యసార మెడలి వికల
బుద్ధు లగుచు నుండి పోవం గడంగి ర, య్యంధనృపతిఁ జూడ నధిపముఖ్య. 19

వ. అట్టియెడ సహదేవుండు పాండవాగ్రజునకుం బ్రణమిల్లి భరితవినయుం డై. 20

క. ఏను మును చెప్ప వెఱచితిఁ, గాని యధిప గొంతిఁ జూడఁగాఁ జను టర్హం
బైనపని యింత కేదెస, దా నొందునొ విపినవాసదౌస్థిత్యమునన్. 21

తే. గొంతి ప్రాణంబుతో నుండఁ గురువరేణ్య
యచ్చటికిఁ జని యొకమరి యమ్మహాను
భావ దర్శింప వలవదె బావ నప్ప
ననుసరించుచు నెట్లున్న యదియొ సాధ్వి. 22

క. ధృతరాష్ట్రుఁడు గాంధారియు, నతిమృదులాంగకులు వల్కలాజినధరు లై
వ్రతచర్యల వన్యాహా,రత నలఁగుచు నున్నవారు రాజవరేణ్యా. 23

ఉ. వారలఁ జూడఁ బోఁ దగు నవశ్యము దుర్దశ వుట్ట కుండ ముం
మీ రని చెప్ప నప్పుడు సమీపమునం జెవి దార్చి నెవ్వగం
గూరుచు నున్న ద్రౌపది యగుం గరణీయము బంధుదుఃఖసం
తారక మీకు నీతఁ [1]దుచితంబుగఁ జెప్పినకార్య మెమ్మెయిన్. 24

తే. గొంతికొడుండ్రు రెల్లను గురువరేణ్య, యెత్తినడుగుల నున్నవా రత్తపస్వి

1. గ. దుచితజ్ఞత.

ఆ. ననుసరించి రజ్జనాథుఁ డయ్యాంబికేయునాశ్రమంబు డాయఁ జనుచు
సచివజనుల [1]నడిగె నయ్య వేఁడీ యని, గద్గదిక నెలుంగు గడలుకొనఁగ. 31

వ. అడిగిన వార లప్పుడమితేనితోడ. 32

క. యమునాస్నానంబునకును, సుమతోయాహరణమునకు సువ్రతుఁ డాసం
యమి సనియె ననుచుఁ దన్మార్గము సెప్పిరి నెమ్మిఁ దెలియఁ గౌరవముఖ్యా. 33

—పాండవులు కురుక్షేత్రంబున నున్నధృతరాష్ట్రగాంధారీప్రభృతుల దర్శించుట.—

సీ. చెప్పినఁ బాండవు లప్పథంబున భక్తి, నరుగుచు నెమురుగ నరుగుదెంచు
సంయమికాంగనలఁ బోదిగాఁ గలవారిఁ, గని రప్పు డన్నలఁ గడచి శీఘ్ర
గాములై పని తల్లికాంక్షఁ బైఁ బడి గోష్ఠ్ఁ, సహదేవుఁ డధికబాష్పప్లుతాస్య
యగుచు సబాష్పిణిని వగచుచు నాతని, నెత్తి తాఁ గౌఁగిట నిఱియఁ జేర్చె

తే. పొగడుచుఁ జెప్ప నతని గాంధారి కంతఁ
గుంతి యతఁ డసను దారు సక్కురకుమారు
లన్య సోదర్యులు సన్నియత్తాత్మ దేవిఁ
గాంచి గనుఁగొన్న తెఱఁగింపఁ గౌరవేంద్ర. 34

చ. కని యపుడు తల్లిపాదములఁ గ్రందుగఁ జేర్చిరి మస్తకంబు ల
వ్వనితయు నందఱం బొదివి వత్సలతం మన మార్ద్రభావ మొం
ద నుగలు నశ్రుబిందువుల దందడిఁ జిక్కఁగఁ గౌఁగిలించి వా
రిసయునవారి చేఁ దుడిచి ప్రీతిగ దీవన లిచ్చె భూవరా. 35

తే. అట్టియెడఁ బాండవాగ్రజు నధికవినయ, భరితుఁడై కాంచి భీమునిఁ బార్థుఁ గవలఁ
గనియె సంజయుఁ డెంతయుఁ గౌరవమున, నాదరించి రేవురు నతనిఁ బ్రీతి. 36

సీ. ద్రోవదిఁ దొట్టి వధూజనంబులుఁ దక్కఁ, గలయట్టి భరతభార్యలుఁ గ్రమమునఁ
గాంచిరి కురువృద్ధుఁ గాంధారిఁ గొంతిని, వారలు గొని వచ్చు వారికలశ
ములు పాండురాజపుత్త్రులు పుచ్చుకొని భరియించిరి పురజను లెల్ల నధిక
వినయత నమ్మువ్వురను గని రవ్వేళ, నందఱు ముద మంది రట్లు దగిన

ఆ. వారు బలసి యునికి వారణపురమున, నున్నయట్లు కాఁగఁ దన్నుఁ దలఁచె
మదిఁ గురూద్వహుండు తదనంతరంబ ని,జాశ్రమమున కెలమి నరుగుదెంచి.

ఉ. తారకశోభితాంబరవిధంబునఁ బొల్పెసఁగంగ నాశ్రమో
దారతలంబు బంధుజనతాకలనంబునఁ దాను జంద్రునో
ప్పార వహించి విస్ఫురితుఁడై తనరెం గురుభర్త వచ్చి ర
చ్చేరువఁ గల్గుతాపసులు సెచ్చెరఁ బార్థులఁ జూచువేడుకన్. 38

వ. వచ్చినం గని వారల నెల్లను సవినయప్రణామంబులం బ్రీతులం జేసి పాండవు
లలరుమొగంబులతో ధృతరాష్ట్రుం బరివేష్టించి యుండిరి వనితాజనంబులు

1. క. నడిగె ♦ నయ్య యేఁడీ యని; నయ్య ♦ యెచట నున్నాఁడని.

నొక్కవలన నిలిచి రుచిరాసనంబుల నున్నయమ్మునులు సంజయు నాలోకించి
ధృతరాష్ట్రబంధుజనంబుల సందఱిం బేరువేర నేర్పడ నెఱిఁగింపవే యని
యడిగిన నతండు వారల కి ట్లనియె. 39

సీ. జాంబూనదచ్ఛాయ≀చందంబువర్ణంబు, గలిగినపలుచని≀గసపు మేను
నుచితదీర్ఘత్వ≀మున్నతఘ్రాణంబు, నిమదనై సనిశాల≀నేత్రములును
గంభీరవంబు రే≀ఖయు నొప్పఁ జూడ్కికి, నెంతయుఁ బ్రియ మగు≀ నాతఁడు ధర్మ
తనయుఁ డెఱ్ఱఁదనంబుఁ ≀ దనరినయూరువు, లాయతస్నిగ్ధంబు≀ లైన బాహు

తే. వులును వెడఁదయురంబు నై ≀ పొలుచువాఁడు
భీముఁ డుజ్జ్వలసుందర≀శ్యామతనుఁడు
వారణేంద్రునకై వడియును ≀ వారిజములఁ
యట్టికనుదోయుఁ గలయితఁ ≀ డర్జునుండు. 40

తే. సుందరాకారమునఁ దమ ≀ కెంచ సదృశు
లొరులు లేమి దెల్లం బగు ≀ చుండ నొండొ
యుభయపార్శ్వంబులందుఁ ≀ గూర్చున్నవిష్ణు
శతమఖోపముల్ వినయభూ≀షితులు గవలు. 41

సీ. నీలోత్పలచ్ఛాయఁ ≀ బోలుమైచాయయు, నవపద్మదళములఁ ≀ జవమునఁ గెలువఁగఁ
గనుదోయి మధ్యత్వ≀మునకుఁ బ్రవేశించు, ప్రాయంబు సత్యభి≀రామమూర్తి
యలవడఁ గైకొన్న≀యతులితసంపద, చందంబు దోఁపించు≀చాలఁ గర్వ
వంబును గలుగునీ≀వనిత పాంచాలి యి, య్యింతిపార్శ్వమునఁ గ≀నుపట్టుమేను

తే. వనజసన్నిభముఖము నై ≀ మనుచునిమహిమ, యుజ్జ్వలాకృతి దాల్చి స≀ర్వమున్నయుగాల
తాంగి నారాయణుని చెలి≀యాలు సుభద్ర, నరునివల్లభ సంయమి≀నాథులార. 42

ఆ. [1]వీరి కెలనఁ గనక≀గౌరమధూకాభ
తనువు లొప్పఁ జున్న≀వనిత లురగ
పాండ్యసుతలు నరుని≀భార్య లులూపి చి
త్రాంగద యనఁ బరఁగు ≀ నాహ్వయములు. 43

సీ. ఇందీవరచ్ఛాయ ≀ కెన యైనచాయ నొప్పినమేను గలుగునీ≀భీతహారిణ
నయన భీముని భార్య ≀ నవ్యచంపకదామ, గౌరాంగి యైనయీ≀కమలవదన
సహదేవుగృహిణి మే≀చకనవకువలయ, వర్ణంబునకు సరి≀వచ్చుకాంతిఁ
జెలు వైనతనువునఁ ≀ బొలుచుచున్నలినాయ, తాక్షి మాద్రీదేవి≀యగ్రతనయ

తే. పత్ని వీరలకెలనఁ బా≀పటలు లేక, ధౌతసితవస్త్రపరిధాన ≀ లైన తనువుల
నిభృతి దోఁపఁగనున్నయి≀న్నెలఁత లాంబి, కేయుకోడండ్రు కరుణావి≀ధేయులార.

తే. వీరిచందంబ యైన కడు≀గారవమునఁ, దను సుభద్ర వొడువ నున్న≀తరుణి ద్రోణ

1. జ. కదిసి వీరి కెలనఁ ◆ గనకమధూకాభ.

కర్ణముఖయోధవీరులఁ గలఁచి తెగిన, యట్టియభిమన్యుప్రియ యుత్తరాభిధాన.

వ. అని చూపి చెప్పె నప్పు డాంబికేయుండు కౌంతేయాగ్రజున కిట్లనియె. 46

సీ. కుశలి వై యుందువే కురువంశసత్తమ, పౌరజనులు జానపదులుఁ దెఱఁగు
తో నిన్ను ననుసరింతురె తమ్ము లందఱు, సుఖ ముందురే నీసఖులు సుఖులె
బంధులు సంతోషభరితులే యిష్టభృ, త్యులు దమ కైనకార్యములు ఫలింపఁ
గ్రాలుదురే హర్షలీలలఁ బూర్వరా, జన్యునినడవడి సలుపఁబడునె

ఆ. నయముతోడియప్పసముల భండారంబుఁ, బెనుచె యగ్రహారజనులమీఁద
గాలి యైన సుడియఁగానీక యరయుదే, యనఘ పుణ్యకీర్తు లతిశయిల్ల. 47

క. మిత్రసరపేసుల శాత్రవ, ధాత్రీశుల నెమ్మిఁ బరుసఁదనమున వశతా
పాత్రములుగఁ జేయుదె సుచ, రిత్ర యుదాసీననృపపరీక్ష నడచునే. 48

క. దేవతల కతిథులకుఁ బిత్రు, దేవతలకుఁ బూజనములఁ దృప్తి యొనర్తే
యీవసుధఁ జతుర్వర్ణజ, నావలులు నిజోచితక్రియలఁ దగ మనునే. 49

తే. బాలురకును దుర్బలులకు భామినులకు, వృద్ధులకును మనంబుల వెఱపు లేని
యట్టిమెలఁకువ గలిగెడునట్లుగాఁగ, నడచునే యాజ్ఞ పురమునఁ బుడమియందు.

క. అనిన విని యానృపతి య, జ్జనపతితో నిట్టు లనియె జగతీశ్వర నీ
వినుతోపదేశమున భవ, దనుయుక్తము లెల్ల నడచు నవికలభంగిన్. 51

వ. అని పలికి యిట్లనియె. 52

క. ఆయాసము సైరింపని, మీయొడలు తపఃక్రియలకు మెయికొనియెనె భూ
నాయక శుశ్రూష దగం, జేయునొకో గొంతి డప్పిఁ జెందక మీకున్. 53

క. మాపెద్దతల్లి యలజడి, కోపి తపోవృత్తి గడపు చున్నదియె సుత
వ్యాపాదనకారుల మముఁ, బాపాత్ములఁ దలఁచి యెట్లు వలుకునొ మీతోన్.

ఆ. సంజయుండు తపముజాలికిఁ జాలి వ, ర్తిల్లు చున్నవాఁడె ధీరచిత్తుఁ
డిచట లేఁడు విదురుఁ డెచటి కేఁగినవాఁడొ, యతనిఁ జూడవలయు నధిప నాకు.

వ. అనుటయు ధృతరాష్ట్రుఁడు ధర్మతనయుతోడ. 56

సీ. ఏఁ దపంబున కోర్తు నెంతయు శుశ్రూష, యలయక గొంతి మా కాచరించు
వినుము గాంధారియు ననఘచరిత్ర త, పోనిష్ఠ కోర్చు నిమ్మానసీయ
మిముఁ దలంచినయష్టు మెచ్చి దీవించు సం, జయుఁడు ప్రాజ్ఞుఁడు తపశ్చరణమునకు
విసువఁడు మముఁ బాసి విదురుఁ డెచ్చట నేనిఁ, జరియించు మునిజనాశ్చర్యకారి

ఆ. యగుచు జలము లనిల మాహారముగఁ గొను
నవియు నదియుఁ గొనక యయిన నుండు
శూన్యవిపినమున విదైన్యస్వతంత్రసం
చారి యై వసించుఁ గౌరవేంద్ర. 57

క. ఒక్కొకమరి డబ్బాటీ, చక్కటిఁ గాన నగు ననియె జనవర తోఁచెన్

గ్రక్కున నప్పుడ విదురుం, డక్కొంతేయాగ్రజుని నిజసాధుహారమునన్. 58

వ. కాంతారధూళిమలినాంగుండును జటీభూతకేశపాశుండును దిగంబరుండును నగు విదురుం డట్లు దోఁచి యయ్యాశ్రమంబున నున్నజనంబులం గని మగిడి పోవం జూచి ధర్మతనయుం డనయానుచరుల నిలువ్వుం డనుచుఁ దా నొక్కరుండును సత్వరంబుగా నవ్వినుతప్రభావుని వెనుకం జనియు నతండు గుర్వాంతరితుం డగుచుం దోఁచుచుఁ బోవం బోవ నవ్వెంటనే వాగ్రజుం డెలుంగెత్తి యోవిదుర యోవిదుర నిలు నిలు మేను యుధిష్ఠిరుండ నిన్నుఁ గాను నచ్చితి నని పలుకుచుం బాలిన నమ్మహాత్ముం డనవలి కనుంగొని పవిత్రస్థలంబున నొక్కపాదపంబు సేరి నిలిచిన. 59

విదురుఁడు యోగమార్గంబున ధర్మగాఁబనంబుఁ గలయుట.

సీ. ధర్మతనూజుండు ✽ తత్సమీపంబున, కేఁగి యయ్యోగనిష్ఠునిగ నిలిచి
యాతండు నయనంబు ✽ లర్ధమీలితములై, యుండంగ నంగనిశ్చయున్నఁ గాంచి
నిర్మలాత్మక యోను ధర్మసూనుఁడ నన్నుఁ, గను విచ్చి చూడు మేవయును నతఁడు
తెప్పల నెగయించి ✽ యప్పాండవోత్తముఁ, దప్పక చూచి యుత్తమ యోగ

తే. బలము గైకొని యింద్రియములను బ్రాణ
ములను నింద్రియములఁ బ్రాణములను గలపి
నిజశరీరంబు విడిచి యానృపతితనువు
సొచ్చెఁ దేజోమయత్వవిస్ఫూర్తి నొలయ. 60

ఆ. వినుము ధర్మపుత్త్ర ✽ తనువునఁ గొంతియు, లొంపు నప్పు డగ్ని లైనవారు లయ్యె
నోలసె బుద్ధి యధిక ✽ బలమట్టులగు టతఁ, డెలిఁగి చోద్యమునఁ ✽ దలఁచునొంటె.

క. తదనంతరంబ యప్పతి, విదురశవము ప్రాణ సెంది ✽ విశ్వతరహితంబై
నిదురమెయి నొఱగి యున్నప, గిది నుండం జూచి యగ్నికృత్యము నడపన్. 62

చ. తలఁచిన మింట నొక్కెలుఁగు ✽ ధర్మతనూజ యతిత్వగౌరవా
జ్జ్వలునికళేబరంబునకు ✽ వహ్నివిధాన మొనర్పు టర్హమే
వల దని మ్రోసె నమ్మనుజవల్లభుఁ డప్పుని దక్కి పోయి భా
తలకును దండ్రికిన్ సువిదితంబుగ సంతయునుం గ్రమంబునన్. 63

వ. ఎల్లవారును విను చుండం జెప్పిన నందఱు నద్భుతరసంబున మునింగిరి పదం పడి ధృతరాష్ట్రం డామంత్రణంబు సేయ మునిజనులు నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబ యాంబికేయుండు ధర్మనందనునితోడ. 64

సీ. భరతకులోత్తమ ✽ ఫలమూలముల నుప, యోగింపు మొసఁగెద ✽ మొదవి తమకు
నెయ్యాది యాహార ✽ మయ్యె నాతిథ్యంబు, దానన నడపుట ✽ ధర్మసరణి
యనవుడు నట్ల కాక కని ఫలంబులు మూల, ములు నుపయోగించె ✽ మోదభరితుఁ
డగుచు నప్పాండునుత ✽ తాగ్రణి యబ్బంగి, నఖిలజనములు నాహారకలన

తే. మాచరించి రయ్యందఱు నవనిశయన
మొంది యారాత్రి నిద్రించి రుదితసూర్య
కాల మగుటయు సముచితకర్మకరణ
మనుజులును దాను నడపె నమ్మనుజవిభుఁడు. 65

వ. అట్లు కాలోచితకృత్యంబులు నడపి సహోదరసహితుండును దారోపేతుండును సర్వపరివారానుగతుండును నై యాశ్రమపథంబు గలయ మెలంగి పావనస్నానహవనార్చనజపధ్యానాదితాపసధర్మచర్యావిధంబులు నానామృగనిర్భయసంచారప్రకారంబులు వివిధపక్షికులనిశ్శంక[1] కేళీవిభవంబులు నాలోకించి కృతప్రాతస్సవనకరణీయుం డై యున్నకురువృద్ధుకడకు వచ్చి వందనాభినందనవచనంబుల నతనియుల్లంబు పల్లవింపం జేసి యతండు వనుపఁ బవిత్రాసనోపవిష్టుం డై. 66

చ. అనుజులుఁ దాను భక్తిమెయి సమ్మహనీయునిఁ గొల్చి యుండ న
య్యునికిఁ గనుంగొనంగఁ గర ముత్సుకతం శతయూపుఁ డాదిగా
మునివరు లేఁగుదెంచినఁ బ్రమోదమునం గుశపీఠరాజిపై
నునుపఁగఁ బంచె గాఢవినయోక్తుల నాధృతరాష్ట్రుఁ డందఱన్. 67

వ. అట్లున్నయమ్మునిజనంబులును బాండుపుత్త్రులునుం బరమధర్మమయసంభాషణంబులు సేయుచుండ నినుండు నభోమధ్యగతుం డయ్యె నప్పు డాంబికేయుండు సవినయంబుగా సత్తాపసోత్తములతో మీకు మధ్యందినకృత్యంబు లాచరింపవలయు విజయంచేయుం డనిన వారలు నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ కౌంతేయుల మాధ్యాహ్నికకరణీయంబులు నిర్వర్తించుట కరుగుం డని పనిచె నని చెప్పిన విని జనమేజయుం డప్పాండవేయు లవ్విధంబున వనంబున నెన్నిదినంబులు వసియించి రని యడిగిన వైశంపాయనుం డతనికి ట్లనియె. 68

సీ. ధరణీశ పాండునందను లట్లు సాంతఃపురంబును సపరివారంబుఁ గాఁగ
నడవికి నేఁగి యయ్యంబికానందనుఁ, గాంచినదినమునఁ గరమునియతి
ఫలమూలసమితి నాఁకలి వుచ్చి భూమిశ,యనమున నిద్రించి రాగరిష్ఠుఁ
డమ్మహితాత్ముల కర్థితో మఱునాఁ డ,నుజ్ఞ యిచ్చిన సుమనోజ్ఞములును

ఆ. సన్నుతములు నై నయన్నపానాదుల, ననుభవించి మృదులహారితల్ప
ముల శయించి రట్లు నెలనాళు లయ్యెడ, నతనిఁ గొల్చి యుండి రధిపముఖ్య.

వ. పదంపడి యొక్కనాఁ డెప్పటియట్ల పాండుపుత్త్రులు గాంధారీకుంతీసముపాసితుండయి యున్నవిచిత్రవీర్యపుత్త్రుఁ బరివేష్టించి యుండ నవ్విశిష్టగోష్ఠికై శతయూపప్రభృతిమునివరులు సనుదెంచిన నక్కురువృద్ధుం డర్ఘ్యంబు లగునాసనంబులు

1. క. కేళీభంగులు.

వ. అనిన విని వైచిత్రవీర్యుం డప్పారాశర్యునకుఁ బరమవినయంబున నిట్లనియె. 79

సీ. వనవాస మించుకయును నాకు దుఃఖంబు, సేయదు దేహంబుఁ జిత్తమును ద
పఃక్రియలకుఁ బనుపడియున్నయవి నన్ను, గాంధారిఁ బుత్త్రశోకం బొకింత
యేనియుఁ బొందంగనీఁడు సభక్తిక, మైనవృత్తమున ధర్మాత్మజుండు
మునివర యితనిపై ననుజులకొఁ దవ,త్సలము నాహృదయ మీధరణివిభుఁడు

ఆ. దేవతాత్ముఁ డగుట దెల్ల మై యునికి మ
ద్వచనవర్తనములవలన నితఁడె
యెఱిఁగి యుండు గొంతి తెఱఁగు శుశ్రూషయు
నద్భుతంబు ముదము నావహించు. 80

వ. నాకుం బరిజ్ఞానంబును మానసనిర్మలత్వంబును భవత్ప్రసాదంబునం గలిగెడుఁ గాక యనియె నాసమయంబున ద్రౌపదీసుభద్రలును దక్కునుం గల్గునంగనాజనంబులును బారాశర్యసందర్శనప్రవణత్వంబునం జనుదెంచి సభక్తికప్రణామంబు లాచరించి యంతంత నిలిచి రయ్యలఘుజ్ఞానమాననీయుండు ధృతరాష్ట్రుతోడ. 81

ఉ. మీమదిఁ జింత వాయఁగ సమీహితబుద్ధి యొనర్పఁ గోరి యే
నీయెడ కిన్డు వచ్చితి సమీప్సితము వేఁడుము శంక దక్కి భూ
నాయక యెల్లభంగిని మనఃప్రియముం దగ నిత్తు నన్నఁ గొం
తేయు లెలర్చి రవ్వసుమతీపతి మోదము నొందె నెంతయున్. 82

వ. వ్యాసుండు వెండియు. 83

చ. అనఘ యమానుషం బయినయట్టిద యైనను నాతపంబు పెం
పునకు మునీంద్రు లద్భుతముఁ బొందఁగ మీ కవలీల నిత్తు నే
ననుటయు నాకురుక్షితిపుఁ డాదటఁ గోరఁగ మీర లిందు వ
చ్చినకరుణామయాదరవిశేషముకంటెను మేలుఁ గల్గునే. 84

క. మానుష మైన నమానుష, మైనను బ్రార్థనకు విషయ మైనది భవదీ
యానూనకృపకు నెక్కుడు,గా నొక్కఁడుఁ గాన నేను గారుణ్యనిధీ. 85

ఆ. సంయమీంద్ర నాదుజన్మంబు సఫలతఁ, బొందె మీరు విమలబుద్ధి నింత
యాదరించినపుడ లే దింకఁ బరలోక,భీతి ధన్యతముఁడ నైతి నేను. 86

వ. అట్లయినను మీ రొక్కటి గోరు మనిన నామనంబున నెప్పుడుం గలయది యెఱింగింపవలసె విన్నవించెద. 87

సీ. దుష్టచిత్తుం డగుదుర్యోధనుండు ని,ష్పాపస్వభావులఁ బాండుసుతులఁ
బరిభవించి సమస్తనరనాథు లనిఁ గరి,తురగయుతంబుగాఁ దుంగఁ జేసి
ధరణిరాజ్యము గోరి గురుభీష్మకర్ణాది,సత్పురుషుల నెల్లఁ జంపికొనియె
నన్నిచునకుఁగా మహారాజు లాంద్రను, బిడ్డల విడిచి యభేద్యధైర్య

వ. అమ్మాట దనమనంబునకు రానిచందంబు మొగంబునం దోఁప నత్తాపసవరుండు నరనంబెల్లభంగి నొసంగక పోవ నడుగు మనుటయు వెఱచియు నాదు వేడ్కతె ఱఁగెల్ల యనుటయును బుత్త్రుం గోరితిఁ గోరిన నమ్మునిపతి యొకమంత్రం బను గ్రహించి దీని నీ వావహించిన దేవతలు భవద్వశగతులై సుతజన్మంబులు గలిగింతురు విశేషించి ధర్మునకుఁ దల్లివి గాఁ గలదాన వని పలికి యంత ర్ధానంబు సేసిన. 96

ఆ. అద్భుతముసఁ బొంది యమ్మంత్రరూపము, ల్లమున నెప్పుడును దలంతు నొక్క నాఁడు మేడమీఁదఁ బోఁడిమి నేనుండి, కంటిఁ బొడుచుచున్న కమలమిత్త్రు. 97

క. కని యిది కన్యక దోషం, బని తలఁపక బాల్యసంభృతాజ్ఞానము వే డ్కను సర్వ నావహించితి, మునిమంత్రబలమున సూర్యు మునినాథవరా. 98

తే. ఆవహించిన సద్దేవుఁ డాక్షణమున, నాత్మమూర్తి నర్తింప మూర్త్యంతరంబు దాల్చి నాకడ కేతెంచె దక్షిణంబ, నాదుచిత్త మాశ్చర్యమగ్నంబు గాఁగ. 99

వ. ఇట్లు సనుదెంచి. 100

సీ. అడుగు మిచ్చెద వరం బనిన వడంకుచుఁ, గేలు మొగిడ్చి పొం డేల యిచట ననిన వృథాహ్వాన మాచరించుట దప్పు, నిన్నును నెవ్వఁడు నీకు మంత్ర మిచ్చె నాతని శపియింతుఁ జుమ్మీ యని, పలికె నయ్యర్కుఁ డే నలికి గురుని నిరపరాధుని శాపనిహతుఁగాఁ జేయుట, కోర్వక పుత్త్రకు నొసఁగు దేవ

తే. కృప భవత్సము ననిన సర్వప్రమేయ
తేజుఁ డాత్మతేజమున నా దృఙ్ముఖేంద్రి
యములు మనసును సమ్మోహితములు సేసి
యపుడు తనయుండు పుట్టెడు మనియెఁ బిదప. 101

వ. అని నిర్దేశించి. 102

తే. నీకుఁ గన్యాత్వవికలత గాక యుండ, వరము నిచ్చితి ననుచు దివమున కరిగె జనకముఖబంధుచిత్తవంచనమునడపి, గూఢమందిరాంతరమునఁ గొడుకుఁ గంటి.

క. కని యేటిలో నిడితిఁ గలఁ, గనిన ట్లయి యుండెఁ దత్ప్రకారం బిది మీ కనినయది దివ్యబోధం, బున నత్తెఱఁ [1]గంతరంగమునఁ గొని కాలున్. 104

తే. పాప మయ్యెఁ గాకుండె నప్పనిఁ దలంచి
యళుకు చుండుదు మద్భయ మపనయింపుఁ
డతులకరుణ నిక్కరువృద్ధ సభిమతమును
సఫలముగఁ జేయుఁ డివి నాకు సద్వరములు. 105

వ. అనిన విని యమ్మునీంద్రుం డమ్మానిని కిట్లనియె. 106

సీ. నీచెప్పినది యెల్ల నిక్కంబు కోడల, యెగ్గు నీయందు లే దేల వెఱవ

---

1. క. గంతరంగముం గొని కొల్చున్.

త్సరిదుపకంఠతలమునకు, నరిగిరి కౌతుకము మనములందు నెలకొనన్. 116

వ. అట్లు పౌరజానపదసహితులై సకలజనంబులుం జని సాత్యవతేయుండు ననుప భాగీరథీతీరంబున విడిసి రవ్విచిత్రచరిత్రుండు దనచేయం బూనినపని మఱునాఁడు ప్రకటంబు సేయువాఁడుగాఁ బలికిన నయ్యెండలు నద్దినశేషంబు నాయామినియును శతసంవత్సరంబులుంబోలె నుండ సూర్యోదయసమయం బగుటయుఁ గాలోచితకృత్యంబు లాచరించి ధృతరాష్ట్రుండు బాండుతనయులుం దపోధనులు నప్పారాశర్యుపాలికి నరిగి యమ్మునివరుం బరివేష్టించిరి గాంధారీప్రముఖభామినులు నేతెంచి యొక్కెడ నతనిం గొలిచి యుండిరి సర్వజనులుఁ దెట్టు లెత్తికొని యంతంత నిలిచిరి తదనంతరంబ. 117

వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణమృతుల రావించి చూపుట.

సీ. సాత్యవతేయుండు జాహ్నవీసలిలావగాహన మొనరించి గారవమున
నింపారు నెలుఁగున నిందు రం డనవుఁడు, నీ కేమి సెప్పుదు నీటియందు
రవ మగ్గలముగ రాజరాజుఁ దమ్ములుఁ దత్కుమారవర్గము నభిమన్యుఁ డాది
యగుపాండుపౌత్త్రులు సర్కజుండును బాహ్లికప్రముఖాఖిలకౌరవులును

తే. ద్రుపదమాత్స్యులు వారిబంధులును శకుని
యును దదీయానుజులును నాతనితనూజ
రాజియును భీష్మగురులుఁ బురస్కరించి
కొనుచుఁ దమదివ్యదేహముల్ గొమరు మిగుల. 118

ఆ. దివ్యమాల్యములును దివ్యాంబరంబులు
దివ్యభూషణములు దివ్యలేప
నములుఁ జెన్నుఁ జేయఁ దమమిత్త్రసుభటసం
దోహములును దారుఁ దోఁచి రధిప. 119

వ. అట్టియెడ. 120

క. తగ నాకురువృద్ధునకు నొసఁగె నాఁటికి దివ్యదృష్టి సాత్యవతేయుం
డగణితతపఃప్రభావంబు గని యధికవిస్మయంబుఁ బొందఁగ జనముల్. 121

వ. అవ్విశేషంబు విని యద్భుతప్రమదభరిత యై నిజనయనంబుల బంధించినపట్టం బపనయించి గాంధారియును గనుంగొనుచుండ. 122

క. అవ్విధమునఁ దోఁచిన మఱి, నవ్వుచుఁ దెగడుచును బెరసి నరవర పగ లే
కవ్వీరవరులు నెయ్యము, నివ్వటిలఁగ విలసనములు నెఱయ మెఱయఁగన్. 123

తే. చతురగంధర్వు లప్సరోజనులు గాన
ములఁ బ్రమోద మొనర్పంగఁ బొగడ వంది
సమితి నిరహంకృతులు హృదయములగౌర
వములు దెల్లంబు సేయంగ వచ్చి రొప్పి. 124

తేజు సత్యవతీతనూజు మున్నిడికొని, యప్పు డమ్మునిపతి యతనితోడ
తే. నీవు వేదశాస్త్రార్థముల్ భావితాత్మ, లగుమునీంద్రులచేఁ జెప్పఁగలార వింటి
కంటి నయముల నీకన్న ఁ గంటె నొప్పి, యుండుదురు వారు దివిసౌఖ్య యోగ మెసఁగ.
ఉ. కావున నింక వారికయి కౌరవసత్తమ యుస్సలింప కా
త్మావిలభావముం దపమునగ్గలికం బెడఁబాపు నిన్ను నం
భావనఁ గొల్చి యొక్కనెల పాండవముఖ్యుఁడు నిల్చె నిష్ఠమై
నీవనభూమి నీవసుమతీశ్వరుఁ బొమ్మనఁ గాదె వీటికిన్. 131
వ. అని చెప్పిన నప్పరమోత్తముం డట్ల చేసెద నని పలికి యమ్మునిసత్తమునకుం బ్రణ
మిల్లి భవదీయకృపావిశేషంబునకుం గృతార్థుండ నైతి నని యతనినామంత్రితుం
జేసినం బాండవులుం దగ నప్పరమముని వీడ్కొని రయ్యందఱను దీవించి యమ్మ
హాత్ముం డంతర్హితుం డయ్యెఁ దదనంతరంబ. 132
సీ. అంబికేయుండు ధర్మాత్మజుఁ జిత్తసం, ప్రీతి మోమునఁ దోఁపఁ బేరఁ బిలిచి
వసుమతీకార్యనిర్వహణంబు పెద్దకొ, ల్వున నుండి నీ వనుదినము నడప
కునికి కర్తవ్యమే వినుకులు భీష్మాది, మహితులచేత సమగ్రభావ
మొందినయవి యింక నుపదేశ మేమియు, వలవదు రంధ్ర మొవ్వనిజనంబు
తే. నేచు ననుజానుగతుఁడవై వేగ పొమ్ము, దారయుతముగఁ బురికి నుదారచరిత
నీకతంబున మున్న నా శోకమెల్లఁ, బాసెఁ దేజంబు సౌఖ్యానుభవముఁ గంటి. 133
చ. తపము నెడఁ మదీయమతి తత్పర గావున దాని కోర్తు నీ
వపగతఖేదమానసుఁడవై నను నిం దతినిష్ఠ నొందఁ బం
చి పురజనంబు సమ్మదముఁ జెందఁగ సైనికు లుల్లసిల్లఁగా
నృపవర యేఁగి రాజ్యభరనిర్వహణం బొనరింపు నావుడున్. 134
సీ. ధర్మతనూజుఁ డాతనితోడ నిట్లను, నధిప భీమాదుల నరుగఁ బనుపు
పుడమి రక్షింప నీయడుగులకడ నేను, నిలిచి మాతల్లుల నిన్నుఁ గొలిచి
యంచితతపమున కనుగుణం బైనట్టి, శుశ్రూషణము సేయుచును దపోని
యతితోడ నుండెద నవుడు గాంధారి, యిట్లనఁ దగునన్న యీవ కాదె
తే. కురుకులమునకు సంరక్షకుఁడవు నీవు
దండ్రులకుఁ బిండ మొసఁగఁ గర్తవు భవజ్జ
నకునిపంపు సేయుము భూజనము దలంక
కుండఁ బొమ్మది ప్రియము మాయుల్లములకు. 135
వ. అని పలికిన నప్పాండవాగ్రజుండు పాండురాజాగ్రజమహిషితో నిట్లనియె. 136
ఆ. ఇట్లు మీరు నన్ను నెంతయుఁ దఱిమిన
విపినభూమి మిమ్ము విడిచి పోవ
నియ్యకొనదు నాదుహృదయంబు మునువోలెఁ

గలుగ దిపుడు రాజ్యకాంక్ష నాకు. 137

క. విను పాంచాలురు మాత్స్యులు, వనితాజనశేషు లొగి నీ వారలు పేర్మిం
జననీ శూన్యం బై తోఁచినయది రాజ్యంబు నాకుఁ జిత్తంబునకున్. 138

వ. అట్లుం గాక. 139

క. సమరము దీఱినఁ గోలెను, శమనిరతాత్మునకు వనంబు సాగరపరిమితధా
రమియింపఁ గోరు యుష్మత్సమధికతపమునకు నేను సహాయుఁడ నగుదున్. 140

సీ. అన విని సహదేవుఁ డతనితో నేఁ డప, మానపరించెద నీవు తండ్రులను
శుశ్రూషసేయు చిరయాత్రమంబున నున్న, నన్ను నచట నుండ నుండ ననుమతింపు మన్న నిచ్చి
వలవదు మీరు రావలయు తల్లిని నమ్మి, భక్తిని వనమునఁ గొలువుఁ డింక
వలుక మీయునికి తపమునకు విఘ్నంబు, కాని యెక్కడ గ్రంథ మగునె నాకు

ఆ. మాకు నియమవిధిసమాచరణములపై, నింత యేమి నిలిచి నీవు పల్లవింప
నరుగుటొప్పుఁ గాని కురుకులోద్వహులు మాటలు, గొనక యునికి నమరునె యింక మాకు.

వ. మీకు సర్వకార్యంబులయెడను శుభంబు లయ్యెడును బోయి రండు మనిన నజాత
శత్రుండు మఱి యెండు వలుకక యిట్లు సెప్పి యా తల్లికి నమస్కరించి దపోమయా
నీయు లైనమిమ్ముం గొలిచి గతకల్మషుండ నైతి మీయనుజ్ఞాపనంబు దల నిడి
కొని పురంబునకుం బోయి వచ్చెద ననుటయు నన్నుఁగుఱుచఁగా నెత్తి దీవిం
చుచు నాలింగనంబు సేసి భీమసేను సాంత్వనవచనంబుల బ్రేమం గావించి
కౌఁగిలించుకొని గాండీవిం గొనియాడి నకులసహదేవుల సంభావించి
పరిరంభణంబు నిర్వర్తించిన నయ్యేవురు నతనిపాదంబులకుఁ బ్రణమిల్లి యాశీ
ర్వాదంబులు వడసి. 142

సీ. అతిభక్తి గాంధారియడుగుల కెఱఁగిన, నద్దేవి వారల నన్నుఁ జేర్చి
దీవించె వారుఁ గుంతీచరణంబులు, ఫాలముల్ సోఁకంగ బ్రణతు లైనఁ
దప్పక త్రుచ్చి యంతరంగ నొక్కకౌఁగిటఁ బొదివి యాశీర్వాదములు క్రమమున
నర్మిలి పెంపున నలరుమనంబుతో, వేర్వేఱ యిచ్చె నాశ్రమవిరచని

తే. ద్రుపదపుత్త్రికాప్రభృతివధూజనములు, దగు కోడండ్రుల మామ మఱఁదిళ్ళలను వీడు
కొనిరి వారును వారు నర్గ్గురుజనముల, నల్ల వలగొని చనిరి స్వకపాశ్రగణ్య. 143

క. చని పరిజనములుఁ బౌరులు, ననుమోదముతోడఁ గొలువ నరిగిరి నగరం
బునకుం గన్నులపండువు, జనపదముజనం బొనర్ప జనసంస్తుత్యా. 144

వ. అరిగి సముచితవర్తనంబుల నుండిరి కొంతకాలంబు సనిన నొక్కనాఁడు
నారదమునీంద్రుం డనుజసహితుం డై యున్నధర్మతనయుకడకుఁ జనుదెంచిన
నజ్జననాథుండు దమ్ములుం దానును నమ్మహాత్మునకు భక్తిం బ్రణమిల్లి యాస
నార్ఘ్యపాద్యాదిసత్కారంబు లొనర్చి తదీయసమీపంబున నాసీను లై
రతనివదనంబు విలోకించి వినయం బెసంగ నమ్మహీపతి మహాభాగ యెందుండి

రాక యీదేశంబులఁ జరించితి నేను మీకు నేమిపని సేయుదుఁ జెప్పుం డనిన నప్ప
రమసంయమి యప్పుడమితేనితోడ. 145

నారదుఁడు పాండవులకు ధృతరాష్ట్రాదులనిర్యాణంబు సెప్పుట.

సీ. భూపవరేణ్య తపోవనంబుననుండి, వచ్చితిఁ దీర్థసేవాపరత్వ
మున నేను బహుదేశములఁ జరించితి నినుఁ, గని పెద్దకాలంబు గాన చూడఁ
దివిరి యిందులకు నేతెంచితి ధృతరాష్ట్ర, చరితంబు జాహ్నవీపరిసరంబు
జనములచే వింటి ననిన నజ్జనపతి, యారాజవరుఁడు గాంధారి గొంతి
తే. సంజయుండును సమాధానసహితులై శ, రీరములవింత వుట్ట కున్నారె యనియె
ననుడు నద్దేవముని వారియఖిలవర్త, నంబువినుముసుస్థిరహృదయంబుతోడ. 146
వ. అని పలికి యిట్లను మీరు వోయి కాంతారంబున నక్కురువృద్ధుం గొలిచి యుం
డి యతం డనుమతి సేయ నిట వచ్చితిరి మఱికొన్నిదినంబులకు. 147
సీ. ఆరాజు నియతి గాంధారియుఁ గొంతియు, సంజయుండును దోనఁ జనఁగ నగ్ని
హోత్రంబు గొని యాజకోత్కరం బగ్రేస, రం బయి పో నిజాశ్రమము విడిచి
యరిగి గంగాద్వారపరిసరారణ్యభా, గమునకు నందు దుష్కరతపంబు
వాయుభక్షతఁ బూని చేయఁ దొడంగె గాం, ధారియు నీళ్ల నాహారకలన
తే. మోపియొనరించెఁ గొంతిమాసోపవాస, నియమమూఁదివర్తించె సంజయుఁడు షష్ఠ
భోజనాంతరితం బగుభోజనంబు, వ్రతము గాఁగఁ జరించెఁ గౌరవ్యముఖ్య. 148
తే. యాజకులు దారయక్కురురాజుభక్తి, యుక్తినొద్దనుండఁగనగ్నిహోత్రహోమ
మాచరింతు రొక్కొకమరి యతఁడు పర్ణ, శాల వెడలి శూన్యాటవిసంచరించు.
వ. విషమప్రదేశంబుల నవ్విభునకు సంజయుండును గాంధారికిఁ గుంతియుం గన్నై
మెలంగుదు రొక్కనాఁడు వార లందఱు గంగాద్వారంబునఁ గృతస్నానులై యా
శ్రమంబునకు వచ్చుచుండ మహావాతోద్ధూతం బై. 150
సీ. పటుతరం బగుఛటచ్ఛటరవ మెసఁగంగ, మ్రాఁకులుఁబొదలును గ్రాఁచికొనుచుఁ
గమరును నార్తనాదములును బెల్లుగ, నఖిలమృగంబుల నాఁగికొనుచు
లాఁగలఁ బుట్టల లోఁగినశిఖల భు, జంగమకులముల మ్రింగికొనుచు
వెగడొందియఱచుచు నెగయుబల్లులుఁగులఁ, బొగనూర్ధ్వకీలలఁబొదివికొనుచు
తే. దెసల నన్నిటఁ దనసముదీర్ణగతులు, దారుణస్ఫురణమున విస్తార మొంద
ఖేచరులకును భయముగ నేచి పరఁగె, నద్భుతోద్భవం బైనమహానలంబు. 151
వ. ఇట్లిరగలిచిచ్చు గవిసి చుట్టు ముట్టిన నమ్మనుజనాథుండును నన్నాతులు నిరాహా
రులై యునికిం జేసి యొక్కచోటఁ దఱియ నుఱికి తొలంగి పోవ లావు లేరై
రట్టియెడ నారాజర్షిసత్తముండు సంజయుతోడ. 152
సీ. ఒక్కింత దెఱపి నీ వెక్కడనైనను, గనుఁగొని పొమ్మగ్ని దనుక కుండ
నని చెప్పి తలఁగి పోఁ దనకు గాంధారికిఁ, గుంతిభోజాత్మజకును నశక్య

మగుటయుఁ జెప్పినఁ బడ లేచి యాసూత, సుతుఁడు మీఁగాను నొకవిధి నేఁటి వెడలి
పోవుట గలిగినఁ బోదుఁ గాకే దవాగ్నికి నిమ్ము నిది నీకు యుచితము పోను
ఆ. నే మహాత్మ యనుచు నిలు వాసి యిట్లున్న, జనుల కెవ్విధమును సమయుగు టుగ్గు
గాదు నీకుఁ బోవఁ గా వచ్చి యుండంగఁ, బోవ నీకు పాపమును బట్టు. 153
వ. అని పలికి యతనిం బోవ నొడంబఱిచి యప్పారనసత్తముండు నను హితచిత్తుం
డై ప్రాఙ్ముఖాసీనుం డయ్యె గాంధారియుం గుంతియు ననిర్విణ్ణలై కూర్చుండి
రప్పుడు సంజయుండు ధృతరాష్ట్రుతో యోగయుక్తుండవు గమ్మని యు సమాధి సేసె. దదనంతరంబ. 154
ఆ. ఒక్కటెఱపి సంజయుఁడు సని హిమశైలము, మొక్క సంతి సాగి వచ్చి
వాదివికొనియె నిట్లు వోయి రమ్మువ్వురుఁ, బుణ్యలోకగమనము సుఖించె. 155
సీ. పదపడి నృప యేను భాగీరథీతీరమున వచ్చు చుండి యనేకులైన తపస్వి
మునులచే మీరట సని క్రమ్మఱంగ వచ్చినది యిందు నిన్నకథ సంక్షేపముగ
మును నేర్పడఁగ వింటి మూఁడు కళేబరములుఁ గంటి నని కన్నీరు నింపుచు
భార్యయుఁ బాండుసుపత్నియు సద్గతి నొందిరి నీ వింక వినుమనుచు
ఆ. కుందు మనిన శోకము మొదవి యాతఁడు బోసలు, తత్త్రియులుఁ బలుగు వేడ్కఁ దమ్ము
లడలు గదిరి యేడ్చి రవ్వార్త సంతతమును రమున రోదనార్తరవము చెలఁగ. 156
వ. అవ్విశేషంబు. 157
క. విని పౌరజనసమూహము, లనయంబును వనట మునిఁగి హాహారవముల్
వినువీథి ముట్ట రోదన, మొనరిచె నవ్వేళఁ గరుణ ముత్కటము సుస్యూ. 158
క. నారదుఁ డుపశమఫణితులఁ, గౌరవసత్తముని దేర్పఁ గ్రమమున నాక్రం
దారవము లుడిగె బంధుజనారబ్ధము లైనయనుసరణాలాపములును. 159

—ధర్మరాజు ధృతరాష్ట్రప్రభృతులు మృతు లగుటకు శోకించుట.—

వ. అట్లు సమస్తజనంబులును విగతరోదను లై రప్పుడక్కౌరవనాథుండు నారదముని
యాననం బాలోకించి యిట్లనియె. 160
సీ. ఎఱుఁగంగ వచ్చునే యెవ్వరి కెత్తఱి, నేదన యగునో మునీంద్ర మనము
గలుగంగ దెస లేనిపులుమానిసికిఁ బోలె, నక్కురువృద్ధున కట్టిచావు
వాటిల్లె సముదీర్ణబాహుదర్పోజ్జ్వలు, లైనపుత్త్రులు నూర్వు రట్లు గలిగి
బలము నాగాయుతప్రాణసమం బగు, నమ్మహారాజు నట్టి యడవి చిచ్చు
తే. వలనఁ దెగటాఱె నేమన గలదు కమల, ముఖుల తాలవృంతానిలముల సుఖించు
ప్రభువె కంకగృధ్రావలీపక్షవాయు, వడర నిలఁ బడి యున్నవాఁ డక్కటకట.
క. కలమృదుమాగధగానం, బుల మేల్కను రాజు గృధ్రములునుం గాకం
బులు నఱవఁగ నిడుదనిదుర, నొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడు గదే. 162
సీ. వల్లభుం డొక్కఁడు దవ్వితముఁ బూనినఁ దానుఁ, దద్వ్రత మూని గాంధారి యతని

పోఁడుసగతిఁ బోయె ◆ నాయమకై యంత, వగవఁ బుత్త్రులరాజ్యవైభవంబు
విడిచి [1]మేయోమక ◆ యడవికిఁ బోయిన, తల్లికి వగచెద ◆ ధర్మసుతుఁడు
భీమసేనుండును ◆ బీభత్సుఁడును దన, కడుపునఁ బుట్టినకొడుకులట్టె
తే. [2]యెగ్గతంబునఁ దానుఁ గారగ్గిఁ గాలె, నట్టి యనాథ యై దీనికి ◆ నంతరంగ
మలఁదురక తల్లడిల్లక యారటమున, నుడుక కలమటఁబడక యెట్లుండుఁ జెపుమ.
క. విను ఖాండవదహనంబునఁ, దనకుఁ బ్రమోదంబు శక్రతనయుఁ డొసఁగె నా
తనితల్లిఁ గాల్పఁ దగునే, యనలునకుం గటఁ గృతఘ్నుఁడయ్యె మునీంద్రా. 164
సీ. మఱియొక్క నెవ్వగ ◆ మనమున జనియించె, నాంబికేయుండు గారగ్గి నెరిసె
దానికి నెయ్యది ◆ యేను జేయుదునొక్కొ, యనవుడు నారదుం ◆ డానృపాలు
తోడ నబ్భరతవృద్ధుఁడు శాంతి యెక్కుడై, సవిశేష మైనపూజావిధాన
ములు నుపాసించి తగినయిష్టి సేసి య, గ్నులఁ దొలునాఁడ వీడ్కొనియె ననియు
తే. నపుడు యాజకజనము లయ్యగ్నిచయము
నడవిలోన నుద్వాసించి ◆ [3]యరిగె ననియుఁ
జేర్చి యది యవ్వనం బెల్ల ◆ నేర్చె ననియు
వింటి నాత్మాగ్నిఁ గాలె నావిభుఁడు వత్స. 165
ఉ. కావున నెవ్వగం బొరయఁగాఁ బని లేదు నరేంద్ర గొంతియుఁ
బావకు నప్పుకుం గరము ◆ భక్తిఁ దగం బరిచర్య సేసి దే
వావలి ప్రస్తుతింపఁగ నిరామయలోకము నొందె వారికిన్
నీ పుదకంబు లీ వలయు ◆ నిష్ఠమెయిం దిలసంయుతంబుగన్. 166.

యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రాదులకుఁ దిలోదకప్రదానంబు సేయుట.

క. అనుజన్ములు నంతఃపుర, వనితాజనములును నీవు ◆ వసుధేశ్వర వే
చని నడపుఁ డుదకవిధి నీ, జనకునకును జననులకును ◆ జాహ్నవిలోనన్. 167
ఆ. అనిన లెస్స గాక ◆ యని ధర్మసుతుఁ డేక, వస్త్రధరణనియతి ◆ వఱల నెల్ల
వారు నట్ల యేఁగుదేరఁగఁ బౌరులు, బలసి చనఁగఁ జనియెఁ ◆ బౌరవేంద్ర. 168
వ. ఇట్లు సని గంగాస్నానం బాచరించి యమ్మహీపతి మొదలగు నర్హజనంబులు ధృతరాష్ట్రునకు గాంధారికిం గుంతికిం దిలోదకప్రదానంబులు నిర్వర్తించి నివృత్తులై యశుచిత్వం బపనయించుటకుం బురబహిరంగణంబునఁ బటకుటీర ప్రకరంబుల వసియించి రట్టియెడ. 169
సీ. ఆంబికేయాదులయస్థిపుంజముల గం, గాద్వారసలిలసంగమవిశిష్ట
సంస్కారమునఁ గూర్పఁ ◆ జాలెడుసంశుద్ధ, జనముల రావించి ◆ సబహుమాన
ఫణితుల వారి కప్పని యేర్పడఁగఁ జెప్పి, పనిచె నక్కౌరవజనవిభుండు
శ్రాద్ధాహ్న దినమున ◆ వృద్ధానుమతి నతం, డక్కురువృద్ధున ◆ కతనిసతికి

1. చ. మెయ్యాడక ◆ యడవికి. 2. గ. యనదతనమునఁ దాను. 3. గ. యరిగె రనియు.

తే. గొంతికిని రత్నకాంచనఽగోతురంగ,హస్తికన్యాగృహక్షేత్రఽమహాదిదాన
విధుల సర్వజనంబులుఽవిస్మితులుగ, నియతి మీఱఁగఁ బారలౌకికఽక్రియలొనర్చి.

ఆ. మునిజనములు వచ్చి ఽ యనుమోద మందంగ, సకలబంధుజనులు ఽ సంతసిల్ల
నన్నపర్వతముల ఽ నాజ్యనదులఁ బెట్టి, మేధ ముల్లసిల్లె ఽ మేదినీశ. 171

క. ద్వాదశదినములు నారదుఁ, డాదరమున నొద్ద నుండి ఽ యంతయుఁ గని స
మ్మోదంబుతోడ నాశీ,[1]ర్వాదం బొనరించెఁ బాండుఽవంశప్రభునకును. 172

వ. అమ్మునీంద్రునిం దక్కనుం గలుగు తపస్విసత్తముల సముచితోక్తులం గావించి యుధిష్ఠిరుం డామంత్రితులం జేసిన నాసంయమివరులు నిజనివాసంబులకుం జని రా నృపకుంజరుండు బంధుమిత్త్రసహితంబుగ హస్తిపురంబు ప్రవేశించె నిత్తెఱంగున నాంబికేయునకు భారతరణంబు పిదప నానావిధపుత్త్రక్రియాకలాపకరణంబులం బురంబునం బదియేనును దపోనియమంబున వనంబున మూఁడునుంగాఁ బదునెనిమిది సంవత్సరంబులు సనియె నివ్విధంబున నైన చిత్త్రవీర్యుని [2]సంసేవన సమస్తప్రకారంబుల సంఘటించి కృతార్థతానందంబు నొందిన ధర్మనందనుండు జనంబు లభినందించు చందంబున సామ్రాజ్యంబుఁ బాలించె నని యిట్లు ధృతరాష్ట్రుని యాశ్రమవాసంబు విషయం బైన సమర్థనంబు వైశంపాయనుండు సెప్పిన విని జనమేజయుండు మహాత్ముఁ డిట్లు కృతకృత్యతం బొందిన పాండవాగ్రజుండు భూభారంబు నిర్వహించుచుండఁ బదంపడి పుట్టినవిశేషంబు లెఱింగింపవే యనుటయు. 173

శా. కారుణ్యాత్మకదృక్ప్రచార గతసంఽకల్పాంతరంగస్థితి
స్మేరాకార పతంగమధ్యమమరీఽచివ్యాప్తిమూర్ఛత్సుధా
ధారారూపవిహార నిర్మితజగఽ[3]త్సంసార నానాగమ
క్షీరోద్యన్నవనీతలాలసిత నిఽశ్చిత్తత్త్వ[4]సంభాసితా. 174

క. నిర్మలసంవిదుపాస్యా,[5]ధర్మకరణదుర్వికాస్య ఽ దైత్యశ్రేణీ
నిర్మథనకేళినిర్జర,శర్మకృతివిహారశీల ఽ సంయమిలోలా. 175

మాలిని. సమదవిమదదూరాఽసన్నరత్నప్రసన్నా
శమశుభమయమూర్తిఽస్ఫార దుర్లక్షసారా
దమవిభవసముద్యఽద్ధామ నిస్సీమభూమా
సమహృదయలసత్సంఽసర్గ [6]సానందవర్గా. 176

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునయాశ్రమవాసపర్వంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము. 177

---

1. క. ర్వాదంబుల నొసఁగెఁ. 2. గ. సమస్తప్రకారంబుల నారాధించి కృతా. 3. గ. త్సంహారనానా. 4. క. సంభావితా. 5. గ. ధర్మాన్వితదుర్వికారదైత్య. 6. చ. సమ్యక్త్రివర్గా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## మౌసలపర్వము, ఏకాశ్వాసము.





ధర్మకామహృదయస
నూరాధానాధాసకారక కాంఘ్రిసరోజా
బోధఘనవ్యాసపరస
మాధిసమాలీఢతేజ హరిహరనాథా. 1

### ధర్మజురాజ్యంబున నుత్పాతంబులు దోఁచుట.

క. దేవా జనమేజయధా,త్రీవల్లభునకు నుదాత్తతేజోదీప్తం
డావైశంపాయనుఁడు ప్రి,యావేశస్మేరచిత్తుఁడై యిట్లనియెన్. 2

సీ. భారతసంగ్రామపారీణుఁడై జయ,రమ యుల్లసిల్ల సామ్రాజ్యమునకుఁ
బాండవముఖ్యునిఁ బట్టంబు గట్టిన,యది యాదిగాఁగ ముప్పదియు నైదు
సంవత్సరంబులు సన ననంతరవత్స,రంబునఁ బ్రజకు భయంబొనర్చు
నుత్పాతములు పుట్టె నుర్వీశ విను మహా,వాయువు శర్కరావర్షి యగుచు
ఆ. వీచు సర్కునుదయవేళల బింబంబు, బలసి తోఁచు ఘనకబంధసమితి
నీరదములు లేక నిర్ఘాతపాతముల్, గలుగు నుల్కలెల్లకడల డుల్లు. 3

క. పరివేషము లినరజనీ,కరులకు నతిరూక్షరుచులు గలిగి కలుగు నం
బర మెల్లఁ గప్పి వేసవిఁ, బరఁగుం బెనుమూడమంచు పౌరవముఖ్యా. 4

సీ. ఇట్లనుదినమును నెన్నియేనియును మ,హోత్పాతములు పుట్టుచుండఁ గొంత
కాలంబుపోవంగఁ గౌంతేయముఖ్యుండు, వినియె నొండొరులతోఁ బెనఁగి సర్వ
యాదవులును దెగి రంబుజనాభుండు, హలధరుండును దక్క నని నరేంద్ర
విని భీమసేనుని వివ్వచ్చు నకులుని, సహదేవు రావించి సంభృతార్తి
తే. యగుచు నవ్వార్త యెఱిఁగించె నందఱికును, వారలేవురు నెవ్వగ గూరుమాన
సములు గలఁగ నత్యంతవిషణ్ణులైరి, సకలజనకోటులును శోకజలధి మునుఁగ. 5

ట్టిద మగు శాపం బిచ్చుట, విదిత మయిన సజ్జనములు వెఱచుచు నుండన్. 15

క. కాలం బగుటను గురుభూ, పాలోత్తమ యాదవేంద్రపట్టణమున హా
హానిక లబహ్వసమాపాదన, శాలిమహోత్పాతముల్ ప్రజాతము లయ్యెన్. 16

తే. అరుణములు ఘూర్ణితంబులు నైన లోచ
నములు మెఱయ మహోగ్రదండము ధరించి
తిరుగు నొక్కొక్కచోటను దృశ్యుఁ డగుచు
నంతకుం డెట యట తోఁచె ననఁగ నధిప. 17

## ద్వారకాపురంబున మహోత్పాతము లనేకములు పుట్టుట.

తే. నీలపింగళదేహ మూర్తిశీలభంగి, కముగ నమ్మెయి వర్తించు జముఁడు సకల
వృష్ణిభోజాంధకోత్సాదివిస్తరణమున, మునులశాపంబు ప్రేరేప మనుజనాథ.

సీ. చిలుకలు గూబలయ్యెలుఁగులచందంబు, దోఁపంగ నఱచు రాత్రులను దివము
లందును సక్కలయట్లు మేఁకలు గూయు, మొదవు పిండునకు గాడిదలు పుట్టు
ముంగుల కుదయించు మూషికంబులు గుక్క, లెల్లను బిల్లుల నీను బలుఁదు
హారియును దక్కఁగ యాదవనివహంబు, బ్రాహ్మణప్రతతికి బాధసేయు

తే. గురుల కవమాన మొనరించుఁ దిరుగు లజ్జ
విడిచి యభిలాషములవెంట విభులపంపు
సేయ కున్మార్గములఁ దమచిత్తములకు
వచ్చినట్లు వర్తింతురు వనిత లధిప. 19

క. అనలములు హోమకాలం, బున నానాభూతవర్ణములతోడ శిఖల్
మనుజేశ్వర వామావ, ర్తన మొందఁగ నుగ్రగంధరౌద్రంబు లగున్. 20

క. విను సూడుగూరపాకము, గనుఁగొని ప్రాయి వాపి డింపఁగా నప్పుడు సం
జనితము లై పుర్వులు గల, గొన మిలమిల మెదలు నందుఁ గురుకులముఖ్యా. 21

సీ. అనుదినంబును నిట్టు లశుభసూచకములు, దోఁపంగ సర్వవిదుండు కృష్ణుఁ
డంతరంగమున సమాలోచనము సేసి, గాంధారి పుత్త్రశోకమునఁ జేసి
కోపంబు గదిరిన శాపంబు ముప్పది, యాఱవునేఁ డెల్లయాదవులకు
నాశ [1]మన్యోన్యహననమున నగుటకు, నిచ్చె నిష్ఠించి యయ్యేఁడు వచ్చెఁ

ఆ. దప్ప దది ఫలించు దానికిఁ దీర్థస, మీపభూమి యైన మేలు గాదె
యని నరేంద్ర యమ్మహాత్ముఁ డీభంగి నూ, హించి తెఱఁగు నిశ్చయించెఁ దివిరి. 22

ఆ. అట్లు నిశ్చయించి యాదవనివహక్ష, యంబు దివ్యబుద్ధి నరసి యపర
దివసకలిత మగుటఁ దెల్లంబుగాఁ గని, కొని యతండు పెద్దకొలువులోన. 23

ఉ. జాతర సేయఁగా వలయు సర్వజనంబులు నంబురాశికిన్
బ్రాతిగ భక్తితోడ నని బంధుల కెల్లను జెప్పి పీట వి

1. క. మన్యోన్యహ♦నన మగుటకు నిచ్చె, నిష్ఠించి యయ్యేఁడు ♦ నేఁడు వచ్చె.

వ. *అంత బలుండును బోవ నిశ్చయించి చెప్పిన. 34

చ. పలుకక మ్రొక్కి వీడుకొలుపంగ వనంబున కప్పురోహితుం
డలఘువినిశ్చయంబు వగ పంతయు మాన్పఁగఁ బోయె నాతనిన్
హలధరుఁ డన్పఁ బోయి వినయంబును భక్తియుఁ దోఁప నయ్యనా
కులు నట పుచ్చి యొక్కెడ నకుంఠితనిర్ణయశాంతచిత్తుఁ డై. 35

క. విను మొక్కఁడు నొకభూరుహ,మునమూలంబున నిరస్తమోహాంధత్వం
బున నెలుఁగుబుద్ధివిజ్ఞే,యనిరూఢతఁ జేసి యుండె నాసీనుం డై. 36

ఉ. భూమిసురావళీమహితభోజనతంత్రముఁ దీర్పఁ బూని హృ
ద్యామలరాజితంబు లగునన్ల సరించినకూడుగూర లా
కోసులు లాఁగఁగాఁ గడఁగి క్రోఁతుల కన్నియుఁ బంచి పెట్టి రు
ద్దామవిహారలీల వసుధావర యాదవు లేమి సెప్పుదున్. 37

చ. పదపడి గీతవాద్యగతిబంధురనృత్యము లుల్లసిల్లఁగా
నుదధికి సంచితాక్షతమహోత్తరగంధవిశిష్టపుష్పసం
పదలు బహుప్రకారములఁ బ్రస్తుతి కెక్కఁగఁ బూజసేసి పెం
పొదవ నివేద్య మిచ్చిరి సముజ్జ్వలహృద్యపదార్థకోటులన్. 38

చ. విను తదనంతరంబ మదవిహ్వలభావము సేయఁ జాలి యిం
పొనరిసయాసవంబులు సముత్సుకతం గనకంపుఁగోరలం
గొని హరిసన్నిధానమునఁ గ్రోలిరి యాదవు లంతరంగమో
దసకరణంబు లై సయుపదంశములం గొనుచున్ మహీశ్వరా. 39

తే. సాత్యకియుఁ గృతవర్మయుఁ జారుదేష్ణు
డును గదుండును బ్రద్యుమ్నుఁడును మొదలుగఁ
గలుగుయాదవు లెల్లను గాంక్షఁ బాన
విధి యొనర్చిరి పెల్లుగ విధివశమున. 40

తే. వృష్ణిభోజాంధకులు కురువీర యిట్లు, రేఁగి మద్యపానం బొనరించి మదముఁ
బొంది కేకిసలాడుచుఁ బొందు వడని,పలుకు లెసఁగంగఁదిరిగి నవ్వులు సెలంగ.

సాత్యకికృతవర్మలకు రోషజనకంబుగాఁ గలిగినసంవాదము.

సీ. ఉన్మార్గవర్తు లై యుండిరి విను మట్టి,యవసరంబున ఘూర్ణితారుణంబు
లయిననేత్రముల సాత్యకి కృతవర్మని, వదనంబు గనుఁగొని మద మెలర్ప
నొద్ద నిల్చున్నప్రద్యుమ్నుచే సఱచుచు, నవమాన మేర్పడునట్టిభంగిఁ
బెలుచ నవ్వి యరాతిబృందంబు నిద్రావ,శత్వంబుఁ బొందుటఁ జావువోని

తే. దుష్టదశ నొంది యుండంగఁ దుచ్ఛుఁ డేని
నడరి వధియింపఁగాఁ జొరఁ డనిన రాజ

* ఈవచనము వ్రాఁతప్రతులఁ గానిపింపదు.

సూవఖురు లైనభోజులును సంధకవీరులు నొక్కటై దెసల్
సెవుడు వడంగ నార్చి యతిశీఘ్రత సాత్యకిఁ జుట్టుముట్టి ర
స్త్ర విమలబోధుఁ డాహరి కరడుంగన లొందియుఁ గాలవేదితన్. 50

ఉ. తమ్మునిఁ గాచునట్టినముకద గ్రత గైకొన నొల్లఁ డయ్యె వే
గమ్మున రుక్మిణీసుతుఁ డకఖండపరాక్రమ మొప్పఁ గిట్టి శౌ
ర్యమ్ము భుజాబలమ్ము మెఱయం గని సాత్యకి సంతసిల్లి ద
ర్పమ్మునఁ జేర్చె నెచ్చెలిసి ప్రస్తుతి సేసిరి చూచు ఖేచరుల్. 51

చ. కనుఁగొని వృష్ణివీరులు నిరాకామసముజ్జ్వలరోషవహ్ని నె
మ్మనమున నుత్థితంబుగ సమత్సరశౌర్యము విక్రమోద్ధతిం
గెనుపఁగ వార లిద్దఱకుఁ బ్రీతి యెలర్పఁగ సింహనాదము
ల్ఘనపథ మెల్ల నిండఁగ బలంబుఁ జలంబును నుల్లసిల్లఁగన్. 52

క. భోజాంధకసంగమనవి, రాజిత మగునబ్బలంబు రౌద్రోద్రేక
భ్రాజితమునఁ ద్రాఁకె పెనఁగి, రేజాలియు లేక కృష్ణుఁ డీక్షింపంగన్. 53

క. అయ్యిరుదెఱఁగుల కప్పుడు, కయ్యమునకుఁ బరమసాధకంబుగఁ గలిగెన్
మయ్యంచుతఱుంగ యచ్చట, దయ్యము నేర్పు విను మెప్పెరదం గురునాథా. 54

చ. మునివరశాపసంభవదమోఘగతిన్ ముసలంబు సాద్భుతం
బును నతిదారుణంబు నగుభూరిసముద్భటశక్తిఖేలనం
బున ముసలత్వవిస్ఫురణముం గలిగించెఁ బ్రవేశలీలఁ గై
కొని సమరప్రవర్తనము ఘోరతరంబుగ నెల్లతుంగలన్. 55

క. పొడి గాఁగఁ జేసి యమ్మెయి, జడనిధిలో వృష్ణివరుఁడు సల్లించినను
నెడ దయ్యె మునివరులయె, క్కుడుశక్తిని ముసలశక్తి కురువంశవరా. 56

సీ. యాదవవీరుల కాసమయంబున, మద్యపానోద్భూతమదము పేర్మి
మునివరామోఘవచనదివ్యశక్తినిఁ, జేసి కల్గద తుంగ వ్రేసినంత
టన ప్రతిభటునకుఁ దనుపీడ గలుగునే, యనువివేకము దానిఁ గొని విరోధి
నడిచినయప్పుడు మిడుక లేకిలఁ బడఁ, గని యిది యెట్లొకో యని తలంచు

తే. టయును గావున సమర మిరట్టలవుభంగిఁ, జెల్లెఁ గృత్రిమముసలచంక్రమోల్లసనము
లతిశయిల్లంగ వారి కరన్యోన్యవధవి, హారదుర్వారసంచారఘోర మగుచు. 57

ఆ. తండ్రి పుత్త్రుఁ డన్న దమ్ముఁడు నాక య, య్యిరుదెఱంగువారు నేపు రేఁగి
మఱియ మోఁద గాలిబడుమ్రాఁకుగములతె, ఱంగు దోఁచె నేమనంగఁగలదు.

క. మునిశాపము వారలమది, ననయము నస మెక్కఁ జేయ నం దొకఁ డైనన్
విను మరలుట చెరలుట లే, కని బెట్టుగఁ జేసి రధిప యార్పులు సెలఁగన్. 59

తే. అట్టియెడ విను భోజులు నంధకులును
జాలఁ గలుగుటఁ బ్రబలుండు సాత్యకియు స

తే. భవ్యతపమున నాబలభద్రుఁ గూడి, యేను దప మాచరించెద నింక మీర
లరసికొనుఁడు సర్వంబును నరుఁడు వచ్చు, నిందు మీపంపుసేఁతకై యెల్లి నేఁడు.

క. అనుచు సతిని పాదంబులు, దనఫాలతలంబు సోఁకఁ దాత్పర్యమునన్
వినతి సడఁప నంతకమును, వినిమె జనులచేత సమరవిధ మతఁ డధిపా. 70

చ. విని బలుజీవి వోయి మది విహ్వలమై మెయి మ్రానుపాటు నొం
ద నుసికి మీఁదఁ గేశవుఁడు దానును రాముఁడు నిల్లు వాసి కా
ననమున నుండువార మని నైష్ఠికతం బలుకంగ నున్నచే
తనయు సడంగఁ జేష్టితము దక్కి శవాకృతి నుండె నత్తఱిన్. 71

క. తనమాటలు సజ్జనసా,ధునవస్థయు వినియుఁ గనియు దురపిల్లి సతీ
జను లొక్కటఁ బెల్లాక్రం,దన మొనరించిన మురారి దయ మది నొలయన్. 72

సీ. అందఱ నూరార్చి యర్జునుం డిప్పుడ, వచ్చు నిచ్చటికి మీరవంత లెల్లఁ
దీర్చు నక్కురుకులదీపకుం డని యుప,శమవాక్యములఁ దేర్చి జనకుపాల
నాసీనుఁ డగు తదీయాంఘ్రిపద్మంబులు, దనచారుపాణిపద్మముల మెత్త
మెత్తన యొత్తుచు మెలుపొందఁ గర్జంపుఁ,బలుకులఁ జిత్తవిభ్రమము మాన్చి

తే. మఱియుఁ బార్థుని రాక పల్మఱును జెప్పి
యన్నయాఘ్యుఁడు పని సేయ నున్నవారిఁ
గరితురంగాదికముల మీ రరసికొనుఁడు
వినుఁడు కర్తవ్య మిట్టిది వేయు నేల. 73

క. అని తగఁ బలికి యతని వీ,డ్కొని రామునికడకుఁ జని యకుంఠితభక్తిన్
వినతుం డయి మనజనకుని,యనుమతి వచ్చితి మహాత్మ యనిమె నరేంద్రా. 74

బలరాముఁడు శరీరంబు విడిచి యనంతునియందుఁ గలయుట.

సీ. తదనంతరంబ యద్దామోదరుఁడు రాము,వదనసరోజంబువలన వెడలఁ
గనియె మహాభుజంగము నరుణచ్ఛాయ, మై పొల్చువక్త్రసహస్రకంబు
మణుల వెలింగెడుఫణములఁ దెలుపారి, పర్వతాభోగనిభంబు నైన
మేనిపెంపును గలదాని నట్లు బల,భద్రుండు నిజయోగబలము పేర్మిఁ

ఆ. దనదుతనువు విడిచి చనియె వియద్వీథి, నంబునిధికి నమ్మహాత్ము నెదురు
కొనియె వరుణుఁ డధికవినయంబుతో నాగ,కులము లెల్ల వచ్చి కొలిచె భక్తి.

ఆ. అహికులాగ్రగణ్యుఁ డైనవాసుకియుఁ గ,ర్కోటకుండుఁ దక్షకుండు వారు
ణుండుఁ గుంజరుండునుం గుముదుండును, దుర్ముఖుండునుం బృఘుశ్రవుండు. 76

తే. హ్రాదుఁడును వక్రదంతుండుఁ గ్రోధనామ
కుండు శంఖుండుఁ బుండరీకుండు మిశ్రి
యును నజేయుండు ధృతరాష్ట్రుఁడును మొదలుగ
నరుగుదెంచిరి యద్దేవు నర్థిఁ గొలువ. 77

ఆ. పరమకౌతుకంబు భవ్యభక్తియు నొలయంగ వచ్చి కొలిచె నాగసంఘ
గంగ యాది గాఁగఁ గలమహానదులును, ముజ్జ్వలాభిరామమూర్తు లొంది. 78

క. అంతయును దివ్యదృష్టి, క్రాంతి యగుమునులు గనుఁగొనిరి సమస్తా
ర్త్యంతరము గలపికొనియె న, నంతుఁడు దనపరమమహిమ నతిశయమున నవ్వెన్. 79

సీ. అట్లు గ్రుంగుఁడు సన్న నచ్చటు వాసి యం
తంతఁ గ్రుమ్మరుచు మునులు సకల
లోకపాలనకు భూలోకంబునందుఁ దా
బుట్టంగ వలసినయట్టిమేటి
పను లెల్లఁ దీఱుట మనమునఁ దలపోసి
తనువిముక్తికి నిమిత్తంబు దలఁచి
మునులవాక్యము తెలియఁగను దొల్లి దుర్వాసు
నవయవసమితిఁ బాయసము పూయు
తే. నప్పు డఱకాలఁ బూయమి నత్తపస్వి
యచట [1]నవిలంఘ్యమై యపాయంబు గలుగు
ననినమాటయుఁ జర్చించి మనసు నింద్రి
యములు నడఁగించి గాఢసమాధి నొంది. 80

క. జలనిధిశయనుండు మహీ, స్థలశయనుం డయ్యె సత్త్వసముదయమును దా
నలుకుచుఁ దత్కాంతార, స్థలి కల్లన నరుగుదెంచె జగదీశుమున్. 81

ఆ. అరుగుదెంచి యచటఁ దిరిగుచు నొకవేఁట, కానిఁ గాంచి వాఁడు కమలనాభు
నొడలు సూచి యుంకి యున్న [2]యేణంబను, నట్లు సేసి మాయ గూఢవహించె.

మ. ధరణీనాథ యతండు శాతశర ముద్యద్వృత్తి సంధించి యు
ద్ధురభంగిం దెగ నిండఁగాఁ దిగిచి [3]యత్యుగ్రంబుగా నేసె నా
హరి శ్రీపాదతలంబుఁ దూరఁ గొని యయ్యస్త్రంబు మీఁగాల ని
ష్ఠురవేగంబున నుచ్చిపోయె వెస వాఁడుం జేరెఁ గ్రక్కొంటకున్. 83

క. చేరి తెలియఁ గనుఁగొని పెం, పారుపురుషుఁ డగు టెఱింగి యత్యంతార్తిం
గూరి వడఁకి తచ్చరణాం, భోరుహములఁ దనశిరంబు పొందం బడియెన్. 84

క. పడి యేడ్చినఁ గృష్ణుఁడు దగు, నొడువుల నూరార్చి తనమనోరథ మిమ్మై
నొడఁగూడిన మానుష మగు, నొడలు విడిచి నిజపదంబు నొందుట కరిగెన్. 85

శ్రీకృష్ణుఁడు శరీరంబు విడిచి పరమపదంబునకుఁ బోవుట.

సీ. ఊర్ధ్వలోకమునకు నూర్జితతేజస్కుఁడగుకృష్ణుఁ డరిగిన నచటిదివ్య
మునివరులును సిద్ధులును రుద్రవసుమరు, దాదిత్యవిశ్వముఖామరులును
సంక్రందనుండును సంభృతసంభ్రము, లగుచు భక్తియు వినయంబు నెఱయఁ

1. క. నవిలంఘ్యమగునపాయంబు 2 గ. యేణముసవియట్ల-జ. యేణము నవునట్ల. 3. క. యత్యుగ్రంపుఁ జేసెను.

గాఁ నెమ్మనమ్మున చరణానతు లై పర, మస్తుతివాక్యముల్ । విస్తరిల్ల.
ఆ. బలసి రంగను దేవ।పతి యల్లఁ జేరి శ,రములు మొగిచి ధర్మ।రక్షణమున
కై దయానిధీయ । సకలఫలసంగ్రహ, నవని నవతరించి । తాదిపురుష. 86

ఆ. అవతరించి కంసుఁ । డాదిగాఁ గలదేవ,శత్రుకోటి నెల్ల । సమయఁ జేసి
భరతకులముకసంబు । వాపి సంశుద్ధప్ర,తిష్ఠఁ గూర్చి యరుగు।దెంచి తీశ. 87

క. అమృతం బజరం బవ్యయ, మమలం బవితర్క్య మచల । మాగమగమ్యం
బు మహాత్మ భవత్పద మ,య్యామేయతత్త్వంబుఁ బొందు । మనిరూప్యగతిన్. 88

క. కృప నిట్లు యవతరింపుము, ప్రపన్ను లగువారియార్తిఁ । బాపుట కై య
జ్ఞపురుష యుగయుగమున న,త్యపరిమితగుణాఢ్యరూప । మభినుతి నొందన్. 89

క. అని సంభ్రమతిఁ బలుకఁగ సువ,చనముల నత్యాదరం బెస।ఁగ వినినముకుం
దుని పైఁ బెల్లు గురిసె స,య్యనిమిషపతి పుష్పవర్ష । మతులితభక్తిన్. 90

ఉ. అప్పుడు బ్రహ్మ వచ్చి హరి।యంఘ్రిలకుం బ్రణమిల్లి భక్తిమైఁ
దప్పక చూచుచుఁ మది ము।దంబునఁ దేల సలక్షణస్వరం
బొప్పి చెలంగ నాగమిక।సూక్తులఁ బ్రస్తుతి సేసెఁ బ్రీతుఁ డై
యప్పురుషోత్తముండు కరు।ణార్ద్రనిరీక్షణముల్ నిగుడ్పఁగన్. 91

సీ. అప్పరమేశ్వరుం । డయ్యంబుజుని జూచి, యనిరుద్ధనామకం।బై నయదియుఁ
బ్రద్యుమ్నతాప్రతి।భాసమానమును సం,కర్షణభావ[1]వి।కాసితంబు
వాసుదేవాత్మక।[2]వరరూపమున నేక,తావిభవత్సమా।ధానసిద్ధి
నొందించుకొంటి నా।నందబోధనిరంజ,నామేయమత్పద।ప్రాప్తి పరమ
ఆ. మంగళానుభూతి । నంగీకరించెద. సుఖుల రగుఁడు మీరు । సుకృతులార
యనినవచనసమితి । యతిమృదుమధురత, నింపు నొసఁగ నలరి।రెల్లవారు. 92

క. ఆదేవదేవుఁ డత్యం,తాదరసంభాషణంబు । లమ్మెయి బ్రహ్మేం
ద్రాదులతోడ నొనర్చి య,నాదినిరవసాననిజప।దాస్థితుఁ డయ్యెన్. 93

తే. ఇంద్రియాగోచరుం డైన।యీశు నపుడు
బుద్ధిఁ జూచుచు నిర్భరా।ద్భుతకరంబు
లగుతదీయగుణమ్ముల । నభినుతించు
చరిగి రాత్మవాసముల క।జాదు లెల్ల. 94

దారుకుఁడు పాండవులకు సకలయాదవక్షయంబు సెప్పుట.

సీ. అవనీశ విను మంత । నద్దారుకుఁడు సని, పాండవేయులఁ గని । పరమమునులు
యాదవకులముఁ బేర।లుకమైఁ దొల్లి శ,పించుట మును దలఁ।పించి పిదప
జలధితీరమున నా।సవపానమత్తు లై, వృష్ణిభోజాంధక।వీరు లెల్ల
మునివరనిర్దిష్ట।ముసలాత్మకము లైన,ముయ్యంచుతుంగల । మోఁదులాటఁ

1. గ. వికాసతయును. 2. గ. వరరూపమును నేకతావిభవత్వ మాధానసిద్ధి.

తే. చేర్చి యొండొరువులఁ బరిమార్చుటయును
రామకృష్ణులయునికియు - నామురారి
దన్నుఁ బుత్తెంచుటయు సవిస్తారభంగిఁ
జెప్పె వారలు పెనువగఁ - జేష్టడంగ. 95

తే. సర్వయాదవసంఘంబుచావు విన్న
ద్రౌపదీప్రముఖాఖిలాంతఃపురాంగ
నలును శోకించి యాక్రందనములు సేసి
రతికరుణముగఁ బురజను - లార్తిఁ బొంద. 96

సీ. దారుకుం డత్యంతధర్మవిపత్తి నైన, నర్జునుతోడ నన్న - నమ్మయోధు
నినుఁ దోడి తెమ్మని - పనిచిన వచ్చితి, నని చెప్పఁ జెప్పిన - నచటఁ గాంచి
యాదవకులవిషయం బైనయొప్పని, పలుకు నాపినులఁ - బలుకునను ల్ట
యచటికి వేగంబ - యరుగక యునటఁ గాఁ, ద్విన్న యమున్నదేమనట్టిదృగ్గతి మనముఁ

ఆ. గలదు నాకు నీవు - పిలువ నేలని పల్కి, యన్నతోఁ దగఁగ - నానతి దగాతఁ
డక్కులాగ్రగణ్యు ననుమతితో ద్వారవతికి నరుగ శీఘ్రగతి నరేంద్ర. 97

చ. అరిగి మగండు వచ్చినకులాంగనయుం బతి గ్రుంకినట్టిశ
ర్వరియును బోల్పఁ బట్టగుచుఁ - వారిజనాభుఁడు లేనిదీనతం
బొరసి కృపైకభాజనతఁ - బొందినయప్పురిఁ జూచి మానసం
బెరియఁగఁ జొచ్చె నేటి కెదు - రీఁదినచాడ్పున నేటు నప్పనుడు. 98

క. దారుకుఁడు దోడఁ జనుదేఁ, బౌరజనము లంతఁ దన్నుఁ - బరమాశ్వాసం
బారెడుమనములతోడను, గారవమునఁ జూడఁగా నరగరికిం జనియెన్. 99

చ. చనుటయుఁ గ్రొత్తపేరడలు - నై పఁగ లేక మురాంతకప్రియాం
గనలు పదాఱువేలును మొగంబులఁ గప్పఁగ బాష్పవారి నో
దనరవముల్ సెలంగఁగఁ బదంబులు దొట్రువడంగ దైన్యముల్
తనువులు దాల్చినట్టు వెరలం జనుదెంచిరి పార్థుపాలికిన్. 100

ఉ. వారలఁ గాంచి శోక మనివారణఁ జిత్తము పెల్లగింప న
క్కౌరవసత్తముం డెలుఁగు - గద్గదికం దగులంగ నేడ్చుచుం
దే రొకభంగి డిగ్గి యిలఁ - ద్రెళ్లినయద్దురవస్థఁ జూచినన్
వైరుల కైన డెందములు - వ్రయ్యలుగా వగ దాఁకు భూవరా. 101

తే. రోదనధ్వను లెసఁగంగ - రుక్మిణియును, సత్యభామయు నప్పుడు సవ్యసాచి
కడకు నేతెంచి పుడమిపైఁ బడిరి వనట, వెల్లి మునిఁగి యుల్లంబులు వెగడు నొంద.

క. తక్కను గలమహిషీజను, లక్కుంతీతనయుచుట్టు - నవని నొఱగి లో
నెక్కొనినవగలఁ బొగిలిరి, దిక్కెవ్వరు మాకు ననుచు - దీనత దోఁపన్. 103

క. వినుము ధనంజయుఁ డప్పుడు, దనుఁ దాఁ దేర్చికొని యెల్లతరుణుల నూరా

ర్చె నతనిఁ దోడ్కొని హరిజనకునికడకుం జనియె దారుకుం డట్టియెడన్. 104

వ. మునిదత్తులు సమసిన సయ్యాదవుల నడలుచుం, దమ కాక యివ్వనితాజనంబు
నందిన ప్రస్త్రముం గోల్పడి యత్యంతశోకసమాకులత్వముం దోఁచె నస్మదీయ
మగుచిత్తమును వీరియాతురత్వము గన్న, యంతన కొందల మతిశయిల్లెఁ
గాని విశేషంబు గల్లదు కృష్ణుని, దశ యెట్టిదో యను తల్లడంబు

తే. నవ్వ... దీని నెఱిఁగించువా రను, నెవ్వగయును గదిరెఁ గవ్వాడికిని
సహాపదారుకునకు సట్లయ్యు నానృపు, కడ నెఱుంగువారుగాఁగఁ దారు. 105

అర్జునుఁడు సకలస్వజనక్షయదుఃఖితుం డగువసుదేవునిం గాంచుట.

క. తలఁకుచుం జని యతనిం గనఁ, బలువగలం బొగిలి సెజ్జపై మే నిడి య
శ్రులు గ్రమ్మ నున్నయవ్విభుఁ, డలమట గ్రొత్తయయి మనసు నలమికొనంగన్.

తే. లేచి యడలి సవ్యసాచిఁ గౌఁగిటఁ జేర్చి, గద్గదిక నెలుంగు గడలుకొనఁగ
నడరి పలుచ నేడ్చె నాఱడిఁ బోయిన, ప్రజలఁ బేరు గ్రుచ్చి పనవి పనవి. 107

క. మనుజాధిపుఁ డమ్మెయి రో,దన మటు సేయంగ నరుఁ డతని నూరార్చెన్
విను మవ్వసుదేవుం డి,ట్లను నాలుక దొట్రువడఁగ నాతనితోడన్. 108

చ. మనుజులమాత్ర గాక సురమాన్యపరాక్రమ ముల్లసిల్లఁగా
దనుజులఁ దాఁకి గీటడఁచుదర్పమునం బెను పొంది మాఱు లే
క నెగడి రట్టిబిడ్డల కకారణరోషమునం బరస్పరా
హననము గల్గి [1]చా వలసె నందఱ కొక్కట దైవ మల్గినన్. 109

క. విను నీశిష్యులు సాత్యకి,యును బ్రద్యుమ్నుండు నిమ్మహోగ్రపుసమరం
బునఁ దొలుపీనుఁగు లైరని, వినియు బ్రదికినాఁడ నేన వీరుఁడ జగతిన్. 110

క. తొలితొలి సాత్యకికృతవ,ర్మలు రేపఁగఁ బుట్టె సంగరము దానను వా
రల దూఱ నేల మునిము,ఖ్యులశాపం బిట్టిచేఁతకుం [2]దగి యుండన్. 111

చ. వలసిన నెట్టికార్యమును వావిరి నెట్టుగ నైనఁ జేయఁగా
నలఁతి మృతుం బరిక్షితుని వత్సలతన్ బ్రతికించె శౌరి మొ
క్కలమున యాదవుల్ పెనఁగఁగాఁ గని మాన్పఁ డుపేక్ష సేసె నీ
పొలియు టవశ్యభావ్య మని బుద్ధిఁ దలంచుట గాన నయ్యెడున్. 112

క. ఇది విధివశత్వమున నై,నది యని శోకంబు దొఱఁగు నట్టివివేకం
బొదవదు ఫల్గున యాఱడి, యదువంశం బెల్ల సమసె ననువగపేర్మిన్. 113

వసుదేవుఁ డర్జునునకు యాదవనాశంబు తెఱఁ గెఱిఁగించుట.

క. అనునెడఁ గ్రీడి యితఁడు కృ,ష్ణునుపేక్షయ చెప్పెఁ గాని శోక మడరియుం
బనవఁడు కృష్ణునిఁ గావున, ననుమానము వలవ [3]దమ్మహాత్మునునికికిన్. 114

సీ. అని మదిఁ జర్చించె నప్పు డవ్వసుదేవుఁ, డతనితో ననియె సమస్తయాద

1. క. చా వొలసె నందఱు కొక్కట. 2. ట. దెగి యుండన్. 3. గ. దమ్మహాత్మునిగతికిన్.

సి వగసికొనుము బాహు, శ్రీవిశ్రుత కృష్ణుపనుపు సెల్లింపవనా. 123

సీ. అని విని ఫల్గునుం డావృష్ణిపతిహృదయము దేహనిరపేక్ష మగు టెఱింగి
శోకంబు నెవ్వగం బొంద నిమ్మేదినీ, రమణుతోం గృష్ణవిరహిత మైన
యుర్వీశమున వసియించంగ నాకుం జి, త్తము గొల్పునే ధర్మతనయభీము
లును నేను మాద్రీనందనులును బాంచాలి, యును నేకచిత్తుల మనఘ వినుము

తే. ధర్మతనయుండు డీకార్యంబు దలంచి యున్న
నిశ్చయించి బాలురను నెలంతపిండుం
దగుధనమును నింద్రప్రస్థనగరమునకుం
దీర్పవలయుట మా కెల్లం జెప్పినాండు. 124

ఉ. కావున నప్పురంబున సుఖస్థితి నుండెదు నల్లు గాంగ బృ
థ్వీవర సంప్రయత్నమున వీరల నందఱ నంద పెట్టెదన్
సిన్ను పురస్సరుండ వగుచు నెమ్మిం జనం గొనిపోయెదన్ భవ
ద్భావము నుత్స్థలంబుం బెడంబాపుము తప్పునె దైవకృత్యముల్. 125

క. అని పలికి దారుకునిం గనుం, గొని యాతనిచిత్తవృత్తి గుందుట బుద్ధిం
గని యుట్లనుం గృష్ణునిపో, యినవంక నెఱింగి పోద మేనును నీవున్. 126

ఉ. ఇప్పటికార్యముల్ నడపుం డి ట్లని నెమ్మి నమాత్యకోటికిం
బొచ్చెము లేక చెప్పి మఱి పోవుట యుక్తము నిల్చి వారలం
బుచ్చుట కీవ పొమ్మనిన దిగ్గన నాతండు పోయి యందఱం
దెచ్చె సుధర్మ యన్సభకు దేవపతిప్రియసూనుం డుండంగన్. 127

సీ. అమ్మండపమ్మున కరిగినయమ్మంత్రి, వర్యు లక్రూరవరవంశవర్యు
వినయ మారంగం బరివేష్టించి రమ్మహా, త్ముండుం గరమును నార్ద్రుండగుచు
గారవంబున వారిం గలయం గనుంగొని, యంతరంగంబు శోకాగ్ని నెరియ
వారలతో నిష్ఠు పౌరజనంబుల, నెల్లను బిలిపింపుం డేను మీకు

తే. వారికిని నెఱింగింపంగ వలయునట్టి, పనులు గల వని చెప్పిన విని రయమున
వారు బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రు, లాదిగాం బ్రజ రావించి రధిపముఖ్య.

తే. అరుగుదెంచి యాప్రజ లుచితాసనమున
నున్నయయ్యింద్రనందనుం గన్న నతండు
గరము నెమ్మి నయ్యందఱం గలయం జూచి
యి ట్లనియె మోమునను దైన్య మెసక మెసంగ. 129

క. వననిధి నేంటికి నేడవు, దినమున నిప్పురము ముంచు దివిజులు గగనం
బుననుండి చెప్పంగా నే, విన్నది యిది వెడలవలయు వేగమ మనకున్. 130

క. వినుం డింద్రప్రస్థపురం, బునకు నధీశుండుగ వజ్రుం బోండిమితో నే
నునిచెద మీ రెల్ల నతండు, మనుపంగాం దొంటియట్ల మనుం డచ్చోటన్. 131

క. సరకులు భారవహులకును, భరియింపఁగఁ గొలఁది యగు [illegible] భండారముల్
వెరవుపడఁగఁ గట్టించుఁడు నె,చ్చెర శకటము లాయితంబుగ సేయుఁడు మీరల్. 132

ఆ. వాహనములు వానికి[1] వానిముట్లులు నొక్క,వంకఁ గాన నొప్పఁ [illegible]
కట్టి వెడలి పోవుకనట్టి తెఱంగున, కనువు గాఁగఁ జేసికొనుఁడు వేగ. 133

క. ఈదేశము ప్రజ ధర్మజు,నాదరసంభావనముల నాజ్ఞానిధిఁ [illegible]
యాదవవీరుల కలనాఁ, డేది తెఱంగట్టిమునికి నయనేఁ [illegible]. 134

క. అని చెప్పి పురజనులఁ బోఁ, బనిచి సచివకోటికెల్ల నిర్ణయము [illegible] వా
హనముల సవరణ బెరయం, గొని తాఁ దగసపరిచారకులు [illegible]. 135

క. నియమింపుఁడు నగరిసరకు, లయినవి యిట్టిట్టిభంగి [illegible]
యెయిదం గలవారలఁ గని, పయనము [illegible]. 136

క. సుందరులకు బాలురకును, నందలములు వేసడములు [illegible]
గందక కుందక చనువిధ, మొందఁగ సమకట్టుఁడు[2] [illegible]. 137

తే. గతము లయినకార్యంబులు గ్రస్తరింప, [illegible] గలఁడు
శేషజనరక్షకొడయనిఁ జేయవచ్చు, వాసుదేవునిమనుమని [illegible]. 138

క. అని వారి నిండ్లకును బోఁ, బనిచి మదిని వగలు [illegible]
యనవద్యచరిత కృష్ణుస,దనమున వసియించు సముచితోపచారముల. 139

చ. తెలతెల వేగునప్డు వసుదేవుఁడు నిర్మలయోగనిష్ఠ మే
నిల నిడి వర్ణనీయగతిఁ గేఁగినఁ దత్సదనాంతరంబునం
జెలఁగె ననేకరోదనవిశేషము లవ్వసుదేవవల్లభల్
నలువురు నెమ్మిఁ గూడి మరణంబునకై కయిసేసి రర్థితోన్. 140

వసుదేవుఁడు శరీరంబు విడిచి పరమగతికిఁ బోవుట.

సీ. ఆసమయంబున నర్జునుఁ డచటికి, నేతెంచి వైభవ మొసఁగ నొసఁగఁ
బ్రాలంబమాలికాకపంక్తులఁ గదళికా,స్తంభంబులను హాటకకుంభకలశ
శిఖరంబులను బెంపుఁ జెలువును విలసిల్ల, యానంబు గల్పించి యానకదుంద్రు
శవము సుస్నాతంబుఁ జందనచర్చాస,మేతంబుఁ జీనాంబరాభిశోభి

తే. తంబు నాభరణస్ఫురితంబు మాల్య,యోజితంబును గాఁ జేసి యాజకప్ర
యుక్తమంత్రతంత్రస్ఫుటయోగమింపా,నర్పనేతెంచె సామగానంబు సెలఁగ.

క. విను దేవకియును రోహిణి,యును భద్రయు మదిరయును సముచితవిధానం
బున నొనరించినయానము, లనూనపరికర్మరుచిర లయి యెక్కి రొగన్. 142

క. చెలులుం జుట్టలు దాపట, వలపట నేతేరఁ దెలివు వదనసరోజం
బుల నొప్పం దగియెడుమా,టల వారలవగలు మాన్పుటలు నుతికెక్కన్. 143

క. ఆనృపునివల్లభలు శవ,యానంబుపిఱుంద నిట్లు యరిగిరి విధిస

1. గ. వానిముట్టును నొక్క. 2. జ. డోడకుండుఁడు.

నా[illegible] సముం[illegible]చి, ప్రాసికము చనియె నుజ్జ్వలాగ్నులు గొంచున్. 144

తే. ద్వారకావాసు లెల్లను దల్లడంబు, నుల్లములఁ గప్పు మోముల నురుల బాష్ప
ధారలు [illegible] హాహారవంబు, లెసఁగ నేఁగిరి [1]వెనుకను నిరుదెసలను. 145

సీ. ఇట్లు [illegible] యమ్మునీంద్రుఁడు వేడ్క, మెలఁగెడుతోఁటలోపల సమగ్ర
[illegible] ముల మున్న కావించినపాదకు సద్విధియుతముగ
[illegible] యర్జునుఁ డమ్మ్యాద, వేంద్రుని పితృమేధ మెల్ల జనులు
[illegible] సేయుఁగ సచ్ఛ్రీయుం దాళవంబు నారోపింపఁ బనిచి యగ్ని

తే. [illegible] దేవకీప్రముఖులు నలువురు నప్పు డాశిఖిఁ బ్రవేశ
[illegible] బాలవృద్ధ, మైనసకలజనంబులు నార్తి నొంద. 146

క. [illegible] ప్రజహవ్యశిఖలరవము నా
[illegible] హాహారవంబుఁ గలసి చెలంగెన్. 147

క. తదనంతరంబ [illegible], ముద లగుపురుషులు సతీసమూహముఁ దగు మై
నుదకప్రదానవిధ య, య్యనుముఖ్యన కాచరించి రన్వయముఖ్యా. 148

తే. అప్పు డందఱు బంధుల నాదరమునఁ, దనదు సముచితాలాపసంతానకలన
ననునయించి పురంబున కరిగెఁ దాను, వారు వగ మదిఁ గదుర విశ్వాచ్చు డధిప.

తే. ఇట్లు [illegible]గున సత్క్రియా[2]యత్తుఁ డైన, యర్జునుఁడు పితృమేధము నభినుతముగఁ
జలిపె వృష్ణిభోజాంధకసమరధరణి, తలమునకు బుధజనసహితంబు గాఁగ. 150

సీ. అపరదినంబున సరిగె నప్పుడు వృద్ధ, బాలకాంతాజనప్రకరములకు
ననిసిర్గతప్రాణులై పడి యున్నభో, జులను సంధకుల వృష్ణులను గలయఁ
జూడఁగ నుత్కటశోకంబు గదిరిన, నటిముటి మేదిని నొఱగువారు
విప్రలాపంబు నానాప్రకారంబులఁ, జేయువారును నిరుచేయు నెత్తి

తే. యలఁత నాక్రందనములు హాహారవముల
తో నొనర్చువారును నైన నానరుండు
దద్ద యడలి దారుకుభాషితములఁ దేటి
యఖిలజనులకు నుపశమ మావహించె. 151

క. తదనంతరంబ రణమృత, యదుసంఘములకు సమంచితానలసంస్కా
రదశాపూతత్వము నా, విదితయశుఁ డొనర్చె విప్రవితతిఘటకుఁ డై. 152

ఆ. నిఖిలబంధుజనుల కఖిలమృతులకును, దగఁ దిలోదకప్రదాన మాచ
రించునట్లు గాఁగఁ బంచి యలుప్తక్రి, యత్వ మొనర నడపె నక్కిరీటి. 153

క. ఇవ్విధమున విశ్రుతముగఁ, గవ్వడి నియతుఁ డయి బంధుకార్యము లెల్లన్
నెవ్వగలు దనమనంబున, నివ్వటిలఁగ నాచరించె నృపసంసేవ్యా. 154

1. క. వెనుక నిర్దెసల నధిప. 2. క. వృత్తుఁ డైన.

క. అను నర్జునుఁ గని భూసురు, లనునయవచనములఁ దేర్ప నతఁ డంకిలి దే
లిసినమునములఁ బ్రస్తుతు లొనరి, యును గ్రమ్మంగ రతలమున నొత్తుచుఁ జూచున్.

సీ. పనిపడి నిట్టు లయ్యెనా కొ యున్నహితాత్ముఁడు డంచు నున్నిప
ద్భావనము ప్రసన్నయుగములఁ దాఁ గలయం బరికించి యోగిహృ
ద్భావ్యములపాదపద్మ గతి మైనవిశేషము సూచి రుద్రతే
జోమయుఁ డైనసంయమినరేంద్రుగతిఁ గాంచి సువిస్మితాత్ముఁ డై. 165

క. ఆనిక్కపుమును సుచిరము నై, యవయవములు నిదురవోయినప్పటిక్రియ నుం
డ నలుకృష్ణుని దేహము, బవిరతచక్షురభిముఖత నాలోకించెన్. 166

ఉ. అప్పుడు నూరకుండ కనుగుండుజనమ్ములు పెక్కు లాడి చి
త్తమ్ముకలంక దేర్చి యుచితక్రియకుక్ మొగకొల్పి బంధుసం
ఘమ్ముల నింతఁ దత్తమె వికారవిదూర యుపేంద్రభవ్యదే
హమ్ముట గాంచుఁ బోదమె సమర్థవిధం బాకఁ దేర్పరింపుమా. 167

చ. అని యడుగంగ దైవగతి నంబుధి పట్టణ మాక్రమించు నె
ట్టిసమునునాకొక్క యన్వగ మదిం జొనిపెం గురునాధ యప్పు డ
ట్టినుతగుణాభిరాముఁ డడవిం దమత్రిమ్మటఁ జన్నప్రొద్దు ల
య్యనుదరకోటితోడఁ జెలియం దలపోయఁగ లెక్క దోఁచినన్. 168

క. మఱునాఁడె యగుట లెస్సగ, నెఱిఁగె నినుం డపుడు వేఁడి యెడలినదీప్తుల్
దూఱఁగలిగొనఁ బశ్చిమగిరి,చఱికి నసతిదూరమున విశదుఁ డై తోఁచెన్. 169

సీ. దాని కజ్జనములఁ దాను నుత్తల మంది, చర్చించి కార్యంబుచాయఁ గాంచి
మనము కృష్ణునిఁ గని చనుదెంచినార మై, పురమున నివ్వార్త వుట్టకుండ
నడఁచి[2] యచ్చటిమాటలవికొన్ని ఘటియించి, చెప్పియీ రేయి పెచ్చెరఁ బ్రయాణ
మునకుఁ గృత్యము లగుపను లెల్ల సమకట్టి, వేగంగ గ్రక్కున వెడలవలయుఁ

ఆ. గాని వెడల కున్న భానూదయంబున, వనధి పురము ముంచికొనిన గణన
సేయరానియట్టి సేగియు వ్యయ్యుభావంబు వగయు నెల్లభంగిఁ గలుగు. 170

అర్జునుఁడు రామకృష్ణులకు నగ్నిసంస్కారంబు సేయుట.

ఉ. కావున వేగ మగ్నియును గాష్ఠములుక్ సమకూర్చి సద్విధి
శ్రీ విలసిల్లఁ గృష్ణునిశరీరము సంస్కృతిఁ గూర్చి క్రమ్మఱం
బోవుట బుద్ధి యంచు మఱి భూసురకోటియుఁ దాను గాఢసం
భావనతోడఁ జేసె దృఢభక్తికుఁ డై పితృమేధభద్రమున్. 171

చ. హలధరునిం దలంచి మును లాడినమాట తెఱంగు దప్ప దం
చలయక తత్ప్రదేశమున నారసి కాంచి తదీయదేహముక్
వలయు తెఱంగునం బరమవహ్నికి నాహుతి సేసె నయ్యనా

1. గ. మైనవిభేదము సూచి. 2. గ. యప్పటిమాట గణియించి.

కులహృదయుండు భూమిసుర - కోటియుఁ దానును సత్వరంబుగన్. 172

సీ. అబ్బంగిఁ గృతకృత్యుఁ - డై నయప్పార్థుండు, యాదవపురమున - కరుగుచున్న
యెడ ననుచరులతో - నిట్టికార్యంబును, నడపక తక్కిన - నాఁగుచున్న
గతికిఁ బోవుటకునై - కడఁగెడురుక్మిణీ, ప్రభృతుల మనసు ని - ర్గల్పంగ వశమొ
రే యెల్ల నిప్పని - సేయువిధములక, వ్యయ మగు సంతకు - వచ్చు సిద్ధి

ఆ. మేలు సేయఁ బోయి - యీలోక మంతయుఁ, దిట్టునట్టికీడు - దెచ్చికొనఁగ
వచ్చునే స్వదేశ - వర్తుల మై చూచి, కొండ మెల్ల పనియు - రండు వేగ. 173

తే. అనుచు నరిగి తాఁ దలఁచిన - యట్ల యెల్ల
తెఱఁగుపనులు నారాత్రిలోఁ - దీర్చి ప్రొద్దు
పొడుపునకు మున్న వెడలించెఁ - బురముసకల
జనములను జీవధనముల - సరకు నతఁడు. 174

సీ. అప్పుడు కృష్ణుని - యంతఃపురాంగనా, జనము షోడశసహ - స్రమ్ము సతిని
మహిషీజనుల రాము - మహిళల నుచితవా, హనముల నిడికొని - యగ్నపురుషు
లేతేరఁ దేరుల - సేనుంగులను గుఱ్ఱ, ములను దత్పరిచార - కులు ప్రయత్న
మున సవరణతోడఁ - గొనిరా నగరిసర, కులుఁ దదీయాధికా - రులు బహుప్ర

ఆ. కారశకటములను - గావళ్ల నెత్తించి, యరసికొని కడంక - నరుగుదేర
విగతనాథ లైన - మగువల గారాము, సెడక యుండునట్లు - నడపికొనుచు. 175

క. విను వజ్రముఖ్యయాదవ, జనము నుచితవృత్తి నడపి - సర్వంబున క
య్యనఘుండు దాన దిక్కయి, చనియె నరదమునను మది వి - షాదము గదురన్.

క. ఇమ్మెయి నరుండు సకలజ, నమ్ము వెడల నినుఁడు పూర్వ - నగ మెక్కను వే
గమ్మున ముంచుకొనియె నగ, రమ్ము పయోరాశి భరత - రాజనరేంద్రా. 177

ద్వారకానగరంబు సముద్రమున మునింగిపోవుట.

క. వననిధి పురంబు ముంపఁగ, మనుజేశ్వర యెల్లజనులు - మరలఁబడి కనుం
గొని రద్భుతరసపూరం, బున పెన్నిట్టఁ దమచిత్త - ములు మునుఁగంగన్. 178

తే. అపుడు రెండవజలనిధి - యనఁగఁ జాలి
యద్భుతోద్భూతవాక్యచ - యంబు పేర్మి
మ్రోయునాజనసంఘంబు - మురవిరోధి
మఱఁది నడపించె దర్శిత - మార్గుఁ డగుచు. 179

క. నడపించి పంచవటమున, విడియించెను వీడు చోర - వీరులు గని య
క్కడుధనములు గల వీ, మ్రుక్కడి ప్రజలో లేరు దీనిఁ - గావఁగ యోధుల్.

క. కవ్వడి యొక్కఁడ కంటిరె, చివ్వనఁ జేరుద మితండు - సేడ్పడఁగా నిం
దెవ్వరుఁ గడంగ లే రివి, ద్రెవ్విపడినధనము లెఱిఁగి - తిమి లోఁ దెల్లన్. 181

క. అని వారొండొరువులతో, మనముల నుత్సాహ మెసఁగ - మానితధనముల్

గొనుసగ్గలికం బలుకుచు, ననేకబలకోటు లగుట | నలు కేది వడిన్. 182

క. శౌలురు వృద్ధులుఁ జుండీ, యాలమునకుఁ గడఁగ నొక్కఁ | డయినను లేఁ డీ
స్త్రీలం గొనుపుద మనుచును, నేల యవిసి మూఁగినట్లు | నిర్భరభంగిన్. 183

క. ఏ పెనఁగ రేఁగి య ట్లప్పాపాత్మక మగుకిరాత | బలము సమగ్రా
టోపమునఁ గవిసి వివిధధనాపహరణ మాచరింప | నారంభించెన్. 184

బోయ లర్జును నోర్చి యాదవాంగనలసొమ్ముల నపహరించుట.

సీ. కనుఁగొని జంభారి | తనయుఁ డోరోరి యీ
ప్రజ కేనచుండ సం | రక్షకుండఁ
దొలఁగి పొం డడియాస | దొద్దకుఁ జొచ్చినఁ
దల లేఱి యుర్వికి | బలి యొనర్తు
నని యదల్చినను వా | రఱవాయి గొనక య
ప్పలుకు లన్నియును ర | జ్జులుగఁ గొనుచుఁ
జాపల సచటన | చ్చట నొల్చికొనఁగ నా
లోకించి యవ్వీర | లోకవరుఁడు

తే. గాండివం బెక్కు వెట్టి ప్ర | చండబాణ
నికర మక్కిరాతులమీఁద | నిగుడఁజేయ
నలఘుచర్మసంవృతగాత్ర | లగుచుఁ దుచ్ఛ
బాణపాషాణలగుడముల్ | పరఁగఁ జేసి. 185

క. ఆబోయలు నిర్భయమతులై బీభత్సుపయిఁ గవియ | నతఁడు మహాస్త్ర
ప్రాబల్యంబును మెఱయుటఁ, దా బుద్ధిఁ దలంచి మంత్ర | తతి దోఁపమికిన్. 186

క. ఇది దైవవిరోధం బని, మదిఁ దా నూహించి ప్రకృతి | మార్గణములు బె
ట్టిదముగ నేయఁగ నవియుం, దుదిముట్టఁగ రిత్తలయ్యె | దొనలు నరేంద్రా. 187

సీ. అప్పుడు కాలప | ర్యయమున కాశ్చర్యమును విషాదముఁ దన | మనములోనఁ
బెరిగొన బాహువి | స్ఫురణకోదండదండమున నాబోయల | సమదవృత్తి
నెట్టకేలకు నొక | యెడ మాన్పి రుక్మిణి, యాదిగాఁ గలకృష్ణు | నగ్రమహిషు
లనమంద్ర బలదేవు | వనితల మఱియును, గతిపయయాదవాం | గనలఁ గాచెఁ

తే. దక్కఁగలయింతిగముల నా | దస్యు లడరి, పట్టికొని యేచి వీ డెల్ల | బన్నపడఁగ
దొద్దగొని రథకుంజర | తురగతతులు, దమకు వలవకునికి దిగఁ | ద్రావి చనిరి. 188

క. ఇమ్మాడ్కిం బఱివోయిన, యమ్మొత్తము నడపికొనుచు | నతిదైన్యము చి
త్తమ్మలఁ పంగఁ గురుక్షేత్రమ్మునకుం జనియె నరుఁడు | ధరణీనాథా. 189

క. చని యచటనచటఁ దన్నుం గనునాప్తజనంబుతోడఁ | గాలవశత్వం
బున బొందినయద్దశఁ దగ, వొనర నతఁడు సెప్పెఁ బొచ్చె | [1]మురివినమదితోన్.

1. గ. మురిలినమదితోన్.

సీ. కోపించి గాంధారి శాప మిచ్చినయది, యాదవసంక్షయ మగుట యెట్లుఁ
దప్పదు మనము తద్బాలవృద్ధస్త్రీజ, నంబుల నెల్ల సర్వాంబు లైన
తావుల [1]సత్ప్రతిష్ఠావిశోకంబులఁ,గాఁ జేయవలయు నకాలమునకు
[2]నోదవి యత్తెఱఁగున నుత్సహించుట కృత్య, మర్జున నీ కనియాడుచుండుఁ
ఆ. బలుమఱును దలంచి పాండవాగ్రజుఁ డది, కారణముగ నతని కరుణ పెంపు
నొప్పు నెఱుఁగుఁ గాన యప్పార్థుఁ డయ్యాదు,నికరశేషజనుల నెమ్మి నిలిపె. 191
సీ. నిలిపిన తెఱఁగెల్ల నృపవర చెప్పెద, విను కృతవర్మనందనునిఁ జూచి
నీతల్లియును నీవు నీతోడఁబుట్టిన, వారును మృత్తికావతపురమున
నిలుఁ డని బహుసంపదలఁ బొల్చునప్పట్ట,ణంబుఁ దదీయదేశంబు నిచ్చి
యభిషిక్తుఁ జేసిన నాతండు నిజపరి,జనములుఁ దాను హర్షం బెలర్ప
తే. నందుఁ బోయె సరస్వతి యనఁగఁ బరఁగు
ఘననగరమున సాత్యకితనయు నట్ల
నెయ్యమును గారవంబును నెఱయ నిలిపి
యనుప ముదమున నందుల కతఁడు సనియె. 192
సీ. తక్కటివారి నింద్రప్రస్థనగరంబు,నకుఁ గొని చని వజ్రు నాథుఁ గాఁగ
నందుఁ బట్టము గట్టి హస్తితురంగర,థంబుల విభజించి తగినభంగి
నమ్ముఖ్యవరకును సమర్పితంబులు సేసి, యయ్యాయిబంధుల నందు నందు
నందును నిలుచున ట్లొందంగ నియమించి, యక్రూరుభార్యల నాత్మజులను
తే. వజ్రునకు నప్పగించె నవ్వాసుదేవు,పౌత్త్రుఁ డతివినయంబునఁ బట్టువఱుప
వారు నిలువక పోయిరి వలచునెడకు, దాని విని యూరకుండె భీమానుజుండు.

## అర్జునుఁడు రామకృష్ణులనిర్యాణంబును యాదవస్త్రీల కెఱిఁగించుట.

. యాదవకుటుంబముల న,త్యాదరమున నట్లు నిలిపి హలధరుఁడును దా
మోదరుఁడుఁ దెగుట వారల,గాదిలిపొలఁతులకుఁ జెప్పఁగాఁ దలఁచె మదిన్. 194
ı. తలఁచి యతండు మందగతిఁ దానును సర్వజనోత్కరంబు వా
రలకడ కేఁగి శోకవిధురం బగుచిత్తముతోడఁ దారు గా
నల కటు వోయి పంకరుహనాభుని రాముని రోసి పల్దినం
బులు భ్రమ సంచరించుటయు బోయ దముం గని యార్ద్రచిత్తుఁ డై. 195
కందువచోటికిఁ గొనిపో,వం దా రరుగుటయుఁ జెప్పి వనట గదిరిన౯
డెందము గలంగఁ గన్నీ, రందంద మొగంబుమీఁద నగ్గల ముఱులన్. 196
తల వాంచి యేమియుఁ బలుకక యప్పార్థుఁ,డున్న నయ్యువిదలు వెన్నుఁ డూర్ధ్వ
గతి కేఁగు టెఱిఁగి శోకము మూర్తు లొందిన, తెఱఁగునఁ బొగిలియు ధీరభావ
మాత్మల నెలకొన్న నన్నీ విం తేల, యడలెదు కాలపర్యాయము నుడుప

1. క. సంప్రతిష్ఠావిశేషంబులఁ. 2. జ. నొదవిన తెఱఁగున నుత్స.

వశమె యెవ్వరికిని వార్తలకొలఁదిఁ జెప్పమి మాకు ననుఁడు సర్వప్రాణ్యాచరితుఁ
ఆ. డడవిలోన నేము దడసినదినము లన్నియు గణించి యంబునిధి పురంబు
రేపకడయ ముంచు నేపాట నిమ్మెయి, వచ్చునెడరు దలఁగువార మొక్కొ. 197
చ. అనుతలఁ బాత్ర నొందుటయు నప్పటి కద్దెస మీకు నెల్లఁ జె
ప్పిన నుచితంపుభంగులకుఁ బెద్దయుఁ బ్రొద్దు సనంగ నప్పురం
బునఁ గలవిప్రముఖ్యజనముల్ పయనంబున కర్హ మైనవ
ర్తన మొనరింప లేమి జలరాశి మునుంగుడు రట్లు గావునన్. 198
చ. హరికిని రామదేవునకు నర్హవిధానము లాచరించి యె
వ్వరికిని జెప్ప కెల్లపరివారముఁ బౌరులు సామజాదులున్
సరకులు నాయితంబు లగుసంఘటనం బొనరించి నాఁటికిం
గర మవధానయుక్తి సమకట్టితి నెవ్వగతోఁ బ్రయాణమున్. 199
తే. వినుఁడు యాదవభామినీవృద్ధబాల,జనుల నందఱ నుచితవర్తనముతోడఁ
బ్రొద్దువోడువక ముందరపురజనప్ర,యుతముగాఁ బురి వెలువరించితిఁ గడంగి. 200
ఆ. దానఁ జేసి మీరు నేనును బ్రియ్యఁ బ్రాపంబు లేక వెడలఁబడితి మిదియ
తల్లులార కరముతప్పయి తోఁచుట, నుల్ల మలఁత పేర్మి నురియుచుండు. 201
శ. వినుఁ డీతప్పున దోషము, దనుకక యుండంగ నన్ను దయతోఁ జూడుం
డనుచు నిలఁ జాఁగి మ్రొక్కినఁ, గని యందఱు నెత్తి యతని గారవ మెసఁగన్.
క. ఊరార్చి యింక నుచితా,చారంబులు నడపుటయ యిచటఁ గృత్యము దు
ర్వారం బగువిధిచేఁతకు, నేరికి నడ్డపడ వశమె యేల యలఁదురన్. 203

రుక్మిణీదేవి మొదలగుకృష్ణభార్య లగ్నిప్రవేశము సేయుట.

సీ. అని పల్కి రప్పిండునందు రుక్మిణియు జాం,బవతియు లోనగుపద్మముఖులు
గొందఱు గోరిరి కురునాథ యనుమర,ణమునకు బంధుజనంబు లెల్ల
శోకార్తులై రోదనాకులత్వము నొంది, రనుమృతికలనకు నమరి యున్న
యాబలదేవమురాంతకమహిషుల, కతివిభవం బైనయానకల్ప
తే. నంబు నాకల్పరచనంబు నడపి నరుఁడు, చందనాగురుమయచితాసంవిధాన
మాచరించియర్హప్రకారాగ్నివిధియొ,నర్చె మహనీయవిప్రజనంబుఁ బనిచి. 204
క. విను సత్యభామ లోనగు,వనితాజను లధికనియతి వనములకుఁ దపం
బొనరింపఁ బూని కొందఱు, సని రవ్విధమున నలుప్తసత్కార్యుం డై. 205
తే. అఖిలబంధుజనంబుల నాప్తజనుల, నర్హవాక్యప్రయుక్తి నూరార్చి యుచిత
మార నామంత్రితులఁ జేసి యశ్రులురులఁ, బోయె నాక్రీడి సాత్యవతేయుఁ గుఱిచి.

అర్జునుఁడు వేదవ్యాసునొద్దకుఁ బోయి యాదవక్షయంబు సెప్పుట.

సీ. పోయి మరున్నదిపొంతయాశ్రమమున, నర్హాసనమున నేకాంతనిరతి
నాసీనుఁ డై యున్నయమ్మహాత్ముని గని, యత్యంతభక్తి సాష్టాంగవినతి

యాచరించినఁ జూచి । యమ్మహనీయవి, ద్యానిధి సేరంగ । నతనిఁ బిలిచి
తనసమీపంబున । నునిచి తద్వదనమ్ముఁ, గనుఁగొని ని న్నెఱుఁ । గంగ రాదు

తే. వెడమొగంబైన దిది యేను । విజయ యెట్టు, కేలకెఱిఁగితి నిది యేమి । గినుకవాఁడవి
వధమునకు నయోగ్యుఁ డగు । వానిఁ జంపి, తే పరాజితుఁ డైతె నీ । తెఱఁగు సెపుమ.

చ. అనవుడు నాతఁ డిట్టు లను । నమ్మహితాత్మునితోడఁ బద్మలో
చనుఁడు నవాంబుదప్రతిమ । చారుతనూలసితుండు దేవకీ
తనయుఁడు రామదేవుఁడును । దానును మేను దొఱంగి పోయె నే
మనఁ గల దెల్లయాదవులు । నాఱడిఁ బోయిరి సంయమీశ్వరా. 208

క. మహితాయుధసంప్రహతులు, సహించుదృఢదేహధృతులు । సడిసన్నమహో
త్సాహులు యాదవవీరులు, నిహతు లయిరి దుంగలను మ । సపిప్రవరా. 209

తే. అట్లు రామకృష్ణులు సర్వ । యాదవులును, దెగినఁ జిత్తంబు పొగులంగ । మగువపిండు
బాలవృద్ధులఁ గొనిరాఁగఁ । బథమునందు, నన్ను బోయలు దాఁకిన । నగుచు నేను.

చ. ఘనతరబాహుశక్తియును । గాండివశక్తియు నస్త్రశక్తియు
న్మనమున నచ్చి యప్డు ముని । నాథ కడంగితి నెట్టకేల క
ద్ధనువు గుణంబుఁ గూర్చితి నుర । దగ్రతబాహుల లేక యుండె న
స్త్రనికరమంత్రతంత్రములు । సంస్మృతిఁ బొందవ యేమి సెప్పుదున్. 211

క. బోయలసంహృతికిఁ బ్రకృతి, సాయకసంపాతనములు । సాలవె యని యే
నేయఁ దొడఁగ దొనలు సెనటు, లై యుండె నొకండుఁ జేయు । నది లేదయ్యెన్.

క. నెవ్వగయు నచ్చెరువు మది, నివ్వటిలఁగ నప్పు డేను । నివ్వెఱపడితిం
జి వ్వన ముసరి కిరాతులు, గ్రొ వ్వెసకం బెసఁగఁ జూఱ । గొని రజ్జనులన్. 213

ఆ. చాపదండనిహతి । నోపినభంగిఁ గి, రాతకోటి నాఁగి । రామకృష్ణ
వల్లభాదు లైన । వనితలఁ గొందఱ, వృద్ధబాలకులను । వెరవుతోడ. 214

క. తాచికొని వచ్చి తగ నా, నేచినయ ట్లచటనచట । నిలిపితి మునినా
థా చేటును భంగంబును, నై చిత్తము శోకమునకు । నగ్గం బయ్యెన్. 215

తే. పడనిపాటు వాటిల్లిన । వెడమొగంబు, వడక యె ట్లుండ వచ్చుఁ దప । ప్రకీర్త
నీయ యింకిట యే నేమి । సేయువాఁడ, నెసఁగుదయతోడ నానతి । యిమ్ము నాకు.

వేదవ్యాసుఁ డర్జునునకు హితోపదేశము సేయుట.

సీ. అన విని యమ్మహా । ముని క్రీడి కి ట్లను, సంయమిదత్తోగ్ర । శాపనిహతి
నఖిలయాదవులును । న శ్లైరి దానిక, నడలంగఁ బని లేదు । హరి యెఱుంగు
మున్న యాసంక్షయ । మన్న చెప్పెద విను, ప్రాప్తకాలం బగు । పనిక నడ్డ
పడనేల యని యాత్మ । భావించి యతఁ డుపే, క్షాపరుఁ డై యుండెఁ । గాక మూఁడు

తే. భువనములు నన్యథాత్వంబుఁ । బొందఁ జేయఁ

జాలువాఁడు కణ్వాదులశాప ముడుప
శక్తి లే కుండెనే యవశ్యంబు భావి
యైనయది గాన యదునాశ మయ్యెఁజువ్వె. 217

ఉ. నీ వని సేయ నీవలని నెయ్యమునం గృప నన్యసైన్యముం
దా వధియించు శూలధరతాస్ఫురణం బెసఁగంగ ముంద ర
ద్దేవుఁడు దానిఁ గాంచు భవదీయసమంచితదృష్టియున్ నినుం
గావఁడ యామురాంతకుఁడు కాలవిపర్యయ మావహిల్లుటన్. 218

చ. ధరణిభరంబు వాప నవతారము నొందినవిష్ణుఁ డత్తఱిం
గరుదుగ నిర్వహించి యజరామరనిష్కలనిర్వికారభా
స్వరనిజసత్పదంబు నుపశాంతిపరుం డయి పొందె దానికిం
గురుకులవర్య శోకమునఁ గుందుదురే మిముబోఁటిబోధనుల్. 219

మ. అవనీభారము వాపి తా హరికిఁ దోడై భీమసాహాయ్యగా
రవదుర్దాంతపరాక్రమంబునఁ గృతార్థత్వంబునం జేసి య
స్త్రవితానంబును నిన్నుఁ బాసి చనియెన్ దైవప్రకారజ్ఞ నీ
దువరిష్ఠాచరణంబునన్ సురలు సంతోషించి రప్పౌరులన్. 220

క. బలమును బుద్ధియుఁ జేవయు, నలఘుమతీ యుల్లసిల్లు నగుకాలమునం
బొలియుం గాలవిపర్యయ,కలనంబున బుధుల కుబ్బుఁ గలఁకయుఁ గలవే. 221

తే. కాలమూలంబు సర్వంబుఁ గాన దీని, కొండుతలఁపులు దక్కి మీ రుత్తమంపు
గతికిఁ జనుఁడు [1]నిశ్చింతవికారతనులు, విడిచి యార్యజనంబులు వినుతిసేయ 222

సీ. అన విని శోకమోహంబులు వాసిన, డెందంబు నిర్భరానంద మొంద
నధికభక్తియు వినయంబును దలకొన, నర్జునుఁ డమ్మహితాత్ము వీడు
కొని వారణపురికిఁ జనుదెంచి ధర్మజుఁ, గని తనపోయివచ్చిన తెఱంగు
వినిపించె సర్వంబు నని యిట్లు సంయమి,నుతుఁడు వైశంపాయనుండు రామ

తే. కృష్ణు లాదిగఁ [2]గల్గినవృష్ణిచయము, భోజసంతతి యంధకరాజి నూత్న
వృత్తములు జనమేజయవిభునకిం,పు [3]సెవులఁదళుకొత్త నేర్పడఁ జెప్పుటయును.

శా. కాలస్వైరవిహారభంజనకళాకౌతూహలస్తవ్య దు
శ్శీలాంతఃకరణావిభావ్య కరుణాశ్రీమందిరాపాంగ మం
త్రాళీవాచ్యసుధామయాంగ పవనవ్యాపారరోధక్రియా
శాలిస్వాంతసముల్లసద్విహరణా సంసారనిస్తారణా. 224

క. హృదయకమలమధురూపా, విదారితదురంతతాప వేదస్తోమా
స్పదపారాశర్యమన,స్సదనా దివిజశుభకృద్వచనపరవదనా. 225

1. క. నిశ్చింతవికారచిత్త-చ. నిశ్చిత్తవికారచిత్త, తనువు లార్యజనంబులు. 2. క. గలయదు వృష్ణిచయము. 3. క. చెలువు.

మాలిని. అమరగణవిరోధిశ్వ్యాపదాపాదికోపా
శమితవినతచిత్తాసంగిగాఢత్రితాపా
యమనియమవికాసిధ్యానగేహప్రదీపా
దమశమకలితానందప్రకాశస్వరూపా. 226

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునందు మౌసలపర్వంబు సర్వంబును నేకాశ్వాసము. 227





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## మహాప్రస్థానికపర్వము, ఏకాశ్వాసము.





¹పదసీమావాప్తిస
మాపాదనకేళికౌతుకాధీనదయా
వ్యాపార సకలవేదో
హాపోహాతీతసార హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె నట్లు కృష్ణునిపరమానంద పదప్రాప్తియు బలభద్రునియనంతత్వసిద్ధియు సకలయాదవమౌసలాహవప్రకారంబును నెఱింగి పదంపడి పాండవు లెత్తెఱంగున వర్తించిరి మునీంద్రా యెఱింగింపుము. 2

క. అని యడిగిన వైశంపా,యనుఁ డక్కురువంశవరుసమాదరణంబున్
వినయంబుఁ గౌతుకము పెం,పును సంభావించి యవ్విభున కిట్లనియెన్. 3

సీ. అర్జునుం డమ్మెయి నచ్యుతరామాది,యాదవజనులవృత్తాంతములును
దనదు తెఱంగు సత్యవతీతనూభవు,హితభాషణంబులు నేర్పడంగఁ
జెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబు,నకు మది యొలయ నన్నరునితోడ
నఖిలభూతంబుల ననఘ పాకంబుఁ బొం,దించుఁ గాలుండు మఱదీయబుద్ధి

తే. కర్మసంత్యాగకలనంబు కార్య మిప్పు
డనువినిశ్చయ మొందె నీమనము నరయ
నిదియ మేలుగఁ గనుచున్కి విదిత మయ్యె
నాకు ననవుడు నయ్యింద్రనందనుండు. 4

వ. అన్నరేంద్రున కిట్లనియె. 5

క. కాలము నేమన వచ్చును, గాలముఁ గాలంబ పోలుఁ గా కొంటికి నే

1. గ. పరసీమా.

లీలలు గలవే లెస్సగ, నాలోకించి తిది హితము ౯ నభిమతము నగున్. 6

చ. అని తనమాట కియ్యకొను౯నన్నరుపల్కుల కిచ్చ మెచ్చి య
జ్జనపతి భీమునిం గవలఁ ౯ జయ్యనఁ బిల్వఁగఁ బంచి యత్తెఱం
గు నెఱి నెఱుంగఁ జెప్ప నను౯కూలత వారలయందుఁ దద్ద గ
ల్గినఁ దెలి వగ్గలింప నెఱిఁ౯గించె యుయుత్సున కవ్విశేషమున్. 7

క. ఎఱిఁగించి రాజ్యతంత్రము, తెఱఁగుపఱిచి నడపువెరవు ౯ తేటపడంగాఁ
గఱపి గృహాంతశ్చరితము, నెఱి నుపదేశించె నధిప ౯ నెయ్యం బలరన్. 8

క. ఆయనుజుని నట్లు మహా,నాయకుఁగాఁ జేసి భటజ౯నముఁ గూర్చి మహీ
నాయకుఁ డార్యులు కీర్తన, సేయఁ బరిక్షితుని రాజుఁ ౯ జేసె ధరణికిన్. 9

వ. ఈట్లభిమన్యుపుత్త్రు నభిషిక్తుం జేసి యతనికిం బూజ్యసామ్రాజ్యపరిపాలనప్రకా
రంబు లుపదేశించికురుకులపవిత్రసముచితచరిత్రభద్రయగుసుభద్ర కిట్లనియె.

మ. [1]భవదీయాత్మజునాత్మజుండు కురుభూ౯భారోద్వహుం డయ్యె యా
దవవంశోత్తరుఁ డైనవజ్రునకు నిం౯ద్రప్రస్థరాజ్యంబు గా
రవదీప్తంబుగ నిచ్చినాఁడ సుచరి౯త్రా రక్షణీయంబు లై
నవి యీయిండులు రెండు నీవు దృఢధై౯ర్యం బొప్ప రక్షింపుమీ. 11

క. విను శేషించినయాదవ,జనులకు నావజ్రనృపతి ౯ సంరక్షకుఁ డా
తనిఁ బోషించుట ధర్మం, బనఘా యది లేమి ధర్మ౯హాని యగుఁ జుమీ. 12

క. అని తారు గృహంబు దొఱఁగి, చను నెడ నవ్వనిత పిఱుఁదఁ ౯ జనుదేకుండ౯
జననాథ యతఁడు నియమిం,చినవాఁ డై యాఁడిల్లెఁ ౯ జిత్తములోనన్. 13

చ. పదపడి భారతాజిమృత౯బాంధవకోటికి మాసలాజి ను
న్మదు లయి పడ్డయాదవజ౯నంబులకుం బరలోకసౌఖ్యసం
పద కయి చేసె నక్కురునృ౯పాలవరిష్ఠుఁ డనేకదానముల్
రదనితురంగగోకనక౯రత్నమయంబులు గా ముదంబునన్. 14

క. భూదానంబులునుం గ,న్యాదానంబులును జేసె ౯ నన్నరపతి వా
సోదానంబులు నత్యం,తాదరమున నాచరించి ౯ యరదము లిచ్చెన్. 15

తే. ఇట్లు ధౌమ్యాదివిప్రుల ౯ కెల్లఁ దృప్తి
యెసఁగ బహువస్తుకోటుల ౯ నొసఁగి కృపుని
ధనమునను బహుమానంబు౯నను బ్రమోద
భరితుఁగాఁ జేసెఁ గురుపతి ౯ కురువరేణ్య. 16

వ. శేషించినకాంచనరత్నాదు లాక్షితిపతి పరిక్షితునకుఁ బరమాదరంబున సమ
ర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యుంగా నప్పగించి పౌరజానపదప్రవర

1. క. భవదీయాత్మజసంభవుండు.

జనంబుల రావించి. 17

సీ. [1]ఆపార్థపౌత్త్రునిఁ జూపి మాయేపుర, మాఱుగా మీ రిక్కుమారవరునిఁ
గైకొని తగ నెల్లకార్యజాతంబును, నడపుచు ననురక్తి నాఁడునాఁటి
కెక్కుడగుచు నుండ నీతనియుల్లంబు, రంజిల్ల సమ్యగారాధనంబు
సందు సంప్రపణులరగుఁడయ్య యని పల్కి, తమనిశ్చయంబు నుదాత్తభంగిఁ

తే. జెప్పుటయు వారు మొగములు సిన్నఁబోవ
మము నుపేక్షించి యిటు సేఁత సముచితంబె
నీమచిత్తంబు కారుణ్యనిలయ మేము
దరతరంబ యాశ్రితులము ధర్మశీల. 18

వ. అని గద్గదకంఠు లగుచు నాడినమాటలకు నమ్మనుజేంద్రుండు దగు తెఱంగున మఱుమాట లాడి తమగమనంబులకు నజ్జనంబుల నియ్యకొల్పె నప్పు డందు గోనం గొందఱు గొందఱని వేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు కలియుగంబు ప్రవేశించుటంజేసి కాదే యిట్టివి పుట్టెడు నని, తలంచి నవ్వి నరనాథునకుం జెప్పిన నప్పౌరవోత్తముండు నవ్వుచు మనమనువులు సాలు నని పలికి సర్వాభరణంబులు నూడ్చి వల్కలాజినంబులు ధరియించినం దమ్ములు ద్రౌపదియు నట్ల చేసి రందఱుం దత్కాలోచితంబు లగునిష్టావిధానంబు లాచరించి యగ్నుల నంబుగతంబులు సేసి మొగంబులం దెలి వగ్గలింప గృహంబు వెలువడి రప్పుడు ద్రౌపది షష్ఠత్వనిష్ఠం బోవ సప్తమం బై యొక్కసారమేయంబు వారలవెనుకఁ జనియె నప్పుడు. 19

సీ. పౌరజనంబు లాబాలవృద్ధంబుగా, వచ్చి రక్కురువంశవరులఁ జూడఁ
దత్సమయంబు జూదమునాఁడు వెడలి వా, రరిగెడునయ్యవసరముఁబోలె
భటసమేతముగ నప్పాండుతనూజుల, తోన యుయుత్సుండు దాను నరిగె
భవదీయజనకుఁ డభ్యంతరసతు లెల్ల, ననుగమించిరి వారి మనుజనాథ

తే. యిట్లు కరిపురి వెలువడి యేఁగె ధర్మ, తనయుఁ డందఱు నెంతయు దవ్వు గాఁగ
సొలయ కేఁగి రొక్కళ్లనుఁ జూచి నిలువు, మనఁడు తలవాంచియారాజు సనుచునుండె.

చ. తనువులు దూల నందఱుఁ బ్రదక్షిణముల్ వినుతప్రణామముల్
వినయసమేతు లై నడపి వీడ్కొని రాన్నృపతిం గ్రమక్రమం
బున నిటు లుమ్మలంబు మనముల్ పొగిలింపఁగ వచ్చి చొచ్చి ర
జ్జనములునుం బరిక్షితుఁడు సామజపట్టన మస్ఫురద్గతిన్. 21

వ. ఆసమయంబున. 22

తే. జనకుకడకు నులూచి భుజంగలోక, మునకుఁ బోయెఁ జిత్రాంగద తనతనూజుఁ
డైనబభ్రువాహనుపాలి కరిగెఁ దక్కుఁ, గలుగుసతు లెల్లనీతం డ్రికడననిలువ.

1. క. ఆపార్థనప్త్రునిఁ జూపి.

వ. అప్పుడు. 24

సీ. కృపుఁడు ధౌమ్యుండు నా నృపతినిఁ దగువారి, నర్మభాషణముల ననునయించి
యెలమి చిత్తంబులఁ దలకొల్పి పౌరులఁ, దగఁ దేర్చి పనుల నుత్సాహ మెసఁగ
వర్తింపఁ జేసిన వారణపురి పూర్వ,భంగి సంపత్పరిభరిత మయ్యె
నట ధర్మజుండు ముందటఁ జనఁ గ్రమమున, ననుగమించిరి పవనాత్మజుండు
తే. నర్జునుఁడు నకులుఁడును దాదవరజుండు, ద్రౌపదియు నిట్లు సనుచుండఁ దగిలి వారి
వెనుక విడువక శునకంబుఁ జనియె నవ్వి,ధమునవారు మహాపథగమనమునకు.

వ. పూని యుపవాసవ్రతపరులై భాగీరథితీరంతకుం జని యంతనుండియుఁ బ్రాఙ్ముఖ
వర్తనంబు గైకొని యోగబలంబున నరిగి గిరిసరిదరణ్యంబు లనేకంబులు గడచి
పూర్వసముద్రంబుతీరంబు సేరి రట్టియెడ. 26

క. దిక్కులు మేఘపథంబును, బిక్కటిలఁగ నవయవములు భీషణములుగా
నొక్కయెడ నగ్నిదేవుం, డక్కౌరవవంశవరుల యగ్రతలమునన్. 27

—అగ్నిదేవుఁ డర్జునుచేతిగాండివంబు సముద్రంబున వైపించుట.—

సీ. నిలిచి బీభత్సుండు నిర్భరస్నేహంబు,కతమున విడువక గాండివంబు
గొనివచ్చుచున్న నాతనితోడ నవ్వాయు,సఖుఁ డో ధనంజయ శౌరిచక్ర
మెన్నఁడే దివమున కేఁగె నీ వేల గాం,డీవంబు విడువవు దేవకార్య
మునకుఁగా వరుణదేవునిచేత నేను దె,చ్చినయది యీధనుశ్శ్రేష్ఠ మమ్మ
తే. హానుభావుని కొప్పింపు మనిన లెస్స, యట్లు సేయుదుఁగా కని యక్కిరీటి
యగ్రజానుజులకుఁ జెప్పి యాదరమున,నాతఁ డచ్చాప మంబుధి యందుఁ బెట్టె.

వ. తదనంతరంబ కృశానుం డంతర్ధానంబుసేసె నయ్యోగపరాయణులు పదంపడి.29

ఆ. దక్షిణాభిముఖతఁ దలకొని యిలకుఁ బ్ర,దక్షిణంబు గాఁగ దమమనములు
దద్ద ముదము నొంద నద్దెస వార్ధియు,పాంతమునకు నేఁగి రధిపముఖ్య. 30

వ. అచ్చటనుండి. 31

క. పడమరమొగ మై పశ్చిమ,జడనిధితీరంబు సేరఁ జని యుత్తర మె
క్కడునియతి నడచి వారిధిఁ, బొడ వడఁగినయాదవేంద్రుపురి సేరువగన్. 32

చ. అట సని యశ్రమంబున హిమాచలముల్ సమతిక్రమించి వా
రటవులు భూములుల్ నదులు నద్రులునుం గడుఁ బెక్కు లంచితో
త్కటదృఢయోగసేవనని తాంతనిరాకులవర్తనంబు నొం
దుట గతఖేదులై కడచి తూలక మేరుసమీపభూమికిన్. 33

—ద్రౌపది మొదలగువారు గతప్రాణులై పడుట.—

సీ. చనునప్పు డయ్యేడ్వురును నతిస్థిరయోగ,సాధనపరు లయి సత్వరముగఁ
బోవంగఁ బాంచాలభూపపుత్రిక యోగ, మెడలిన మేదినిఁ బడియె నధిప
పడిన సమీరణుకొడుకు గనుంగొని, యన్నతోఁ జెప్పి యయ్యతివవలనఁ

గాన మెన్నఁడు ధర్మ।హాని యిట్లగుటకు, నరయంగఁ గత మేమి। యని విషణ్ణుఁ
తే. డగుచు నడిగిన నాతఁ డి।మ్మగువ యింద్ర,తనయుదెసఁ బక్షపాతిని। దానఁ జేసి
సుకృతములు ఫలియింపమిఁ।జూవె దీని, కిట్టిదురవస్థ వాటిల్లె। నీడ్యచరిత. 34

క. అని పలికి సమాధానము, దనబుద్ధిం దిరము సేసి। ధైర్యస్థైర్యం
బున వికృతి లేనిగతి నా,వనితశవము విడిచి కౌర।వవిభుం డేఁగెన్. 35

సీ. భూవర యమ్మెయిఁ। బోవంగ సహదేవుఁ, డపగతప్రాణుఁడై। యవనిఁ బడినఁ
గని వాయుజుఁడు ధర్మ।తనయున కెఱిఁగించి, యితఁ డనహంకారుఁ। డెపుడు నీకు
నతిభక్తి శుశ్రూష। యాచరించుచు నుండు, మాలోన నెల్ల సు।న్మార్గ వర్తి
యితనికి నేలొకో। యిద్దెస వాటిల్లె, ననిన నమ్మనుజేంద్రుఁ। డతనితోడ
తే. వీఁడు దనకంటెఁ బ్రాజ్ఞుండు। లేఁడు జగతి, నెందు నని సంతతమ్ముఁ దా। నెడ్డఁ దలఁచు
దాన నిట్లయ్యె నంచు పే।ర్కొనె నిగూఢ,బుద్ధి నరుగుచునుండె న।ప్పురుషవరుఁడు. 36

క. అనిలజుఁడు నరుఁడు నకులుఁడు, శునకంబును దోన నరుగ। సుస్థిరమతి యై
మనుజేంద్రవర్య యట్ల,జ్జనపతి సన నకులుతనువు। జగతిం బడియెన్. 37

క. విను ద్రుపదనందనయుఁ దన,యనుజన్ముఁడు నంతనంత। నవనిఁ బడుటఁ దాఁ
గని ధృతి దూలినయట్లు వ,డిననకులునిఁ జూచి యడలు।డెందముతోడన్. 38

సీ. అనిలసూనుఁడు ధర్మ।తనయున కెఱిఁగించి, యవ్విభుతో సుంద।రాకృతియును
శౌర్యంబు ధైర్యంబు। సౌజన్యమును గురు,సంఘమునన కాదు। జగతి నెందు
నితనికిఁ బోలె న।హీనత మెఱయునే, యెవ్వరి కైనను। నిట్టిపుణ్యుఁ
గుత్సితదశ యెట్లొ।కో పొందె నక్కట, యనవుడు నక్కౌ।రవాగ్రగణ్యుఁ
తే. డతని కిట్లను నీతండు। నాత్మసదృశుఁ, డఖిలజగముల లేఁడు రూ।పాతిశయము
దనక కలదని యెపుడుఁ జి।త్తమునఁ దలఁచు, నయ్యహంకృతి నిట్టికీ।డయ్యెఁ జువ్వె.

క. అని ధృతిసారం బూఁది య,తనితనువు నుపేక్షఁ గూర్చి। ధర్మతనూజుం
డనఘ చనుచుండెఁ దక్కటి,యనుజులుఁ గుర్కురముఁ దోన।యరుగుచునుండన్ .40

సీ. ద్రౌపదిపాటును। దనయనుజన్ముల,పడుటయుఁ గనుఁగొని। పార్థుఁ డాత్మ
యలమట మునిఁగిన। నిల విగతాసుఁడై, పడినఁ గుందుచుఁ జూచి। బకవిరోధి
యన్నకుఁ జూపి యీ।యమలచరిత్రుని,యం దెన్నఁడును నస।త్యంబుఁ గాన
మిటు వడుటకుఁ గత। మేమి నావుడు నీతఁ, డక్కౌరవుల నెల్ల। నొక్కనాఁడ
తే. యాహవంబునఁ దెగటార్తు। ననియె నట్లు
సేయఁ డయ్యెఁ బ లొక్కటి। సేఁత యొకటి
యగుట సాల దోషము విను। మదియుఁ గాక
యెల్లకోదండధరుల గ।ర్హించు చుండు. 41

ఉ. దానను దాన నిట్లగుట। దప్పునె ధ్యాంచుఁ దదీయ మైనఘ..

మ్లానితదేహముఁ విడిచి యా మానవనాథుఁడు దాల్మిఁ జేసి బ
ద్ధానిరతాత్ముఁడై యరిగె నత్తఱి వాయుజుఁ డార్తి నెంతయున్
దీనతఁ బొంది ధైర్యలత ద్రెవ్విన నేలకు వ్రాలె భూవరా. 42

క. అప్పుడు దగ ని ట్లను నతఁ, డప్పారవవరున కోధరాధిప కనుఁగొ
మ్మిప్పా టేమిట వచ్చెం, జెప్పు మెఱుఁగుదేనిఁ గరుణ సిగు రొత్తంగన్. 43

చ. అన విని యాతఁ డి ట్లనియె నాతనితో భవదీయ మైనభో
జన మతిమాత్ర ముద్ధతిఁ బ్రచండుఁడ వై భుజశక్తి నెవ్వరిం
గొనక కడంగి రజ్జుపలుకుల్ గడుఁ బెక్కులు వల్కు దెప్పు నీ
వనుపమశౌర్య యిప్పుడుట కత్తెఱఁగుల్ గత మెల్లఁ జెప్పితిన్. 44

క. అని పలికి నిరీక్షింపక, చనుచుండె నతండు ధైర్యసారోదారుం
డును నిశ్చయమహితుఁడు నయి, వెనుక శునక మధికభక్తి విడువక చనఁగన్. 45

తే. ఆసమంచితసారమేయంబు పొందు, ధరణినాయకున గ్రమతనయుపిఱుఁద
నధికభక్తియుక్తంబుగ నరుగుచునికి, పలుమఱునునీకుఁ జెప్పితిఁ దలఁచియుండు. 46

వ. అని పలికి వైశంపాయనుండు జనమేజయున కి ట్లను నట్లు నిష్ఠాగరిష్ఠుం డయి
యుధిష్ఠిరుం డరుగు చుండ. 47

ఇంద్రుఁడు రథంబు గొని ధర్మరాజు నెదురుకొనుట.

సీ. దివ్యదేహోద్గతదీప్తిసంతానంబు, దిశలు పదింటను దీటుకొనఁగ
రథసమాగమనసంరావంబు మేరుగ, హ్వారములఁ బ్రతిరవోత్కారము నీస
నచ్చటిసిద్ధసాధ్యమునీంద్రగణముల, నానావిధస్తోత్రనాద మెసఁగఁ
దత్ప్రదేశంబుబోధస్ఫీతకల్పవృ, క్షంబులు పుష్పవర్షములు గురియ

తే. నింద్రుఁ డేతెంచి యాదర మెసక మెసఁగ, నక్కురుక్షితిపాలున కగ్రభాగ
వర్తి యగుటయు నతఁ డభివందనంబు, సేసె సవినయభక్తివిశేష మొప్ప. 48

వ. అట్లు ప్రణతుం డయిన నభినందించి యప్పురందరుం డతని దివ్యస్యందనం బెక్కు
మని పలికిన నతండు శోకసంతప్తుం డగుచు నతని కి ట్లనియె. 49

శా. తోడంబుట్టువు లందఱుం బడినయాదుఃఖంబు చిత్తంబు సం
పీడం బెట్టెడు సౌకుమార్యవతి డప్పిం గూలెఁ బాంచాలి వా
ర్లోడై వచ్చిరి వారు లేక యిట మీతో రాను వా రెల్ల నా
తోడం గూడఁగ వచ్చునట్లుగఁ గృపాధుర్యాత్మ కావింపవే. 50

చ. అన విని యింద్రుఁ డి ట్లనియె నక్కురుభర్తకు శోక మేల నీ
యనుజులు ద్రౌపదీసహితు లై తనువుల్ దిగఁద్రావి చన్నవా
రనఘ యమర్త్యలోకమున కక్కడఁ గాంచెదుగాక వారలం
దనువు దొఱంగంగా వలదు ధర్మమయాత్మక నీవు రావనా. 51

### ధర్మరాజసురరాజులకుఁ గుక్కురవిషయముగా జరిగినవివాదము.

సీ. అనుటయు ధర్మజుం డమరేంద్రుతో నన్న, నత్యంతదృఢభక్తి నాశ్రయించి
పుర మేను వెడలునప్పుడు మొదలుగాఁ దోన, చనుదెంచె నీభవ్యసారమేయ
మిది యట [1]రావలదే నామనంబు ని,ష్ఠురవృత్తి కోర్వ దస్తోకపుణ్య
నిరతాత్మ నావుడు దరహాస మొప్ప న,బ్బలవైరి యిట్లంట పాడియే య
తే. మర్త్యభావము గుక్కకేమాడ్కిఁ గలుగు, [2]ననఘ నీచింత తెలియంగ శక్యంబు దీని
విడిచి చను మేల నిష్ఠురవృత్తి యయ్యె,నిచటఁ దడయంగ నేటికి నెక్కు రథము.

వ. అనిన నమ్మనుజేంద్రుం డింద్రునితోడ సవార్యంబును దుష్కరంబును నగు కా
ర్యం బేనియు నార్యుండును బ్రభుండును నై ననీయట్టిసత్పురుషుండు సంశ్రితుల
కై సంఘటింప వలదె భక్తపరిత్యాగంబు సేసి పడయుసిరి నాకు నెంతయుం బ
య్యెడు ననుటయు నయ్యనిమిషనాథుండు. 53

చ. అలుక హరించు ధర్మముల నట్లగుటం గురువంశవర్య నీ
వలుగక విన్ము కుక్కలకు నావసథంబు త్రివిష్టపంబునం
గలుగునె నీకు నిష్ఠురత గల్గదు దీనిఁ బరిత్యజించినం
జలము కొనంగ నేల శుభసంగమనం బెడసేఁత కృత్యమే. 54

సీ. అనవుడు ధర్మనందనుఁ డమ్మహాత్ముతో, విను భక్తియుక్తుని విడుపు బ్రహ్మ
హత్యఁ బోలెడిపాప మని చెప్పుదురు పెద్ద, లట్లు గావున దీని నఖిలధర్మ
సారజ్ఞ విడుచుట సనదు దివ్యసుఖంబు,నకుఁ గాఁగఁ బాపంబునకుఁ జొరంగఁ
జాల నావుడును వాసవుఁడు వ్రతస్థుండు, గుక్క నంటిన వాని కోరిచేయు
తే. సుకృతమునకు నాశం బగు సువ్రతాత్మ, యింతయొప్పని నిర్బంధ మేల చెపుమ
విడువు మీశునకము దీని విడువఁ బడుట,నాకలోకసౌఖ్యంబు నొనర్చు నీకు. 55

చ. జనులు నుతింపఁగా సుకృతసంపదఁ జేసి యమర్త్యభావముం
గనియును జెందకిట్లునికి కార్యమె ద్రౌపది భీమసేను న
ర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రత చాలితి చాలవయ్యె దీ
శునకము విడ్వ నిత్తెఱఁగు సూరినుతుం డగునీకు నర్హమే. 56

సీ. అన విని ధర్మజుం డఖిలలోకములకుఁ, బతివి ధర్మమునకుఁ బ్రభువ విట్టి
నీకంటె నెఱుఁగుదురే సదసత్ప్రకా,రము లట్లుఁ గాక వాదము మహాత్మ
లయినవారలతోడ నగునె చేయంగ నై,నను విన్నవింపఁ దగిన తెఱంగు
విన్నవించుట దోషవిధము గా దనియెడు,బుద్ధిఁ జేసెద నేను బూని విన్న
తే. పంబు భీమముఖ్యులును ద్రౌపదియుఁ జచ్చి, రేను వారల విడువక యేడ్చుచున్న
వత్తురే తోడ వచ్చి చావని శునకము, విడువకుండుట తప్పు గా నుడువఁ దగునె.
చ. అనఘచరిత్ర విన్ము శరణాగతుఁ జేకొన కున్కి శుద్ధమి

1. క. రావలవదె నామనంబు. 2. గ. ననఘచిత్త యిత్తెఱఁగశక్యంబు.

త్తు నియెడఁ జేయుద్రోహము వధూటి వధించుట విప్రుసర్వముం
గొనుట యనంగఁ గల్గునివి ♦ గూడి సమం బగు నాకుఁ జూడ భ
క్తు ననపరాధునిన్ విడుచుదోషముతో నిది యోర్వ వచ్చునే. 58

ఉ. కావున నాకలోకపుసుఖం బటు లుండఁగనిమ్ము దేవ నీ
భావము నిల్పు నాదెసఁ గృపాభరితంబుగ సారమేయసం
భావనచేత దోసముగఁ ♦ బట్టమి నాకు వరంబు నీవు పా
వ్నావనభూమి నుండెద సమిద్ధతపంబున నిన్ను గొల్చుచున్. 59

వ. అని పుయిలోడక పలికెఁ బౌరవోత్తమా యాకర్ణింపుము. 60

సారమేయరూపంబున వచ్చినధర్ముండు ధర్మరాజునకుఁ బ్రత్యక్షం బగుట.

సీ. అట్లతిదృఢనిశ్చయంబుగఁ బలికిన,తనపుత్త్రుఁ గనుఁగొని ♦ ధర్ముఁ డధిక
సంప్రమోదముఁ బొంది ♦ సారమేయాకృతిఁ, బాసి తా నాత్మరూపంబుఁ దాల్చి
పరమసంభ్రమకృతప్రణతియు నానంద,భరితుండు నగునాన్నృపాలుతోడ
నీపుణ్యవృత్తంబు ♦ నిర్మలమేధయు, నఖిలభూతంబులయందుఁ గలుగు

తే. దయయు నాదుచిత్తముఁ బ్రమదమునఁ దేల్చె
వత్స భూలోకమున నిట్టివారుఁ గలరె
తొల్లియును ద్వైతవనమున ♦ దోషదూర
మయిననీమనమున తెఱం ♦ గరసినాఁడ. 61

క. విను నీరు రోసి నీదగు,ననుజులు మృతు లయిన [1]వచ్చి ♦ యందఱలో నొ
క్కనిఁ గోరుము బ్రదికించెద, నని పలికితి నేను నిర్మలాత్మక నీతోన్. 62

ఉ. దానికి నీవు చిత్తమునఁ ♦ దల్లుల నిద్దఱనుం దలంచి మా
లోన నొకండఁ గల్గితి నకులు ప్రత వారలయందుఁ గల్గి లోఁ
కానుమతంబు గాదె నకులార్థిత ధర్మువు నాకు నన్మతిన్
వీనుల కింపుగా నకులు ♦ వేఁడితి తద్విధ మెందుఁ గల్గునే. 63

క. భీముని నర్జును విడిచియు, నీమది నకులు బ్రదికింప ♦ నిగుడుట పుత్త్రా
నామనమునఁ బాయదు ని, న్నే మన వచ్చు నఖిలంబు ♦ నింద్రుం డెఱుఁగున్. 64

క. విను భక్తియుక్త మిది యని, శునకముఁ జేపట్టి నీవు ♦ సురపతి కొనివ
చ్చినయరద మెక్క నొల్లవ, యనఘా సరి నీకు దివమునందును గలరే. 65

ఉ. ఇంతటిపెంపు గల్గుట మహేంద్రుఁడు నీదెసఁ గాంచె నీవు ని
శ్చింతత మేనితోఁ జనుము ♦ సిద్ధపథంబునఁ బుణ్యలోకముల్
వింతలు గాక యుండఁ బృథివీవర నీకు నుదారసౌఖ్య మ
త్యంతము నవ్యయంబు నగు ♦ నందలిమాన్యులు సంస్తుతింపఁగన్. 66

సీ. అనియె నప్పుడు పరమాహ్లాదమునఁ జను,దెంచి గంధర్వులు ♦ దేవమునులు

1. క. (వచ్చినందఱలో.

మరుదశ్వివసువులు మహితాదరంబున, ధర్ముండు నింద్రుండుఁ దారు నమ్మ
హాత్ముని నెత్తి రథారూఢుఁగాఁ జేసి, తమవిమానములు పార్శ్వముల నడపి
కొని చన నిఖిలదిక్కులఁ దన తేజంబు, వెలుగంగ సిద్ధులు వినుతి సేయ

తే. దైవతావాసమునకు నాధర్మజుండు, ననియె నయ్యవసరమున సర్వలోక
సమ్మతుఁడు బోధఘనుఁడు ప్రసన్నఫణితి, సారతోదారుఁడును నగునారదుండు.

వ. ఎల్లవారును విన సంపూర్ణస్వరంబున ని ట్లనియె. 68

ఉ. దానములం దపంబులను దద్దయుఁ జేర్కులయట్టివారలన్
మానవనాథులన్ వినమె మానెఁ దదీయయశంబు లెల్ల నీ
మానితకీర్తికీర్తులు సమస్తజగంబులయందుఁ బర్వెట
న్మానులతోడ వా రిటులు నేర్చిరె రా నమరత్వసిద్ధికిన్. 69

చ. అన విని ధర్మరాజసుతుఁ డాతని కి ట్లను నాదుతమ్ములం
గనుఁగొనునంతకున్ సుఖముగాఁ గొనన య్యెద ని త్తెఱంగు నా
కు నకట చూపరే పవనుకొడ్కును నింద్రసుతుండు మాద్రినం
దనులును నున్నచోటు సుఖదం బయినన్ సుఖహీనమేనియున్. 70

వ. వారలను మదీయపక్షప్రాప్తు లయినభూపతులను జూచువేడ్క యెల్లలోకంబుల
మీఁదను గలుగువేడుకకంటెను మిగిలి యున్నయది యనుటయు నమరేంద్రుండు
దనమనంబున నితనితోడ సముచితసంభాషణంబులు సేసెద నివ్విధంబు కటుకవచ
నత్వంబు గా దని యూహించి యి ట్లనియె. 71

చ. తనువు దొఱంగ కిట్లు సుకృతంబులపెంపున వచ్చి తిప్పదం
బునకు మహాత్మ యిచ్చటను బోవదు నీమదిఁ బాసి మర్త్యతం
బనుపడియున్న నెయ్యము సభాసదులన్ శుభదృష్టిఁ జూడుమా
మునులను సిద్ధులం దగునె ముందటిచందము నొంది యుండఁగన్. 72

చ. ఒరులకు నందరానిపద మూర్జితపుణ్యనిరూఢిఁ బొందఁగా
దొరకొని యున్కి నీవికృతదూరమనస్కుతఁ గాదె నీసహో
దరులు భవన్మహోన్నతపదస్థితి కర్హులె తొంటి నెయ్యముం
బొరయునె దేవతాత్మకుల బుద్ధి నెఱుంగుము నీవిశేషమున్. 73

క. అని యి ట్లాడినసర్వభు, వనపతియు బుధుండు నైన వాసవుతోఁ దా
ననియెం దగ వెండియు ధ,ర్మనందనుఁడు భరతవంశమహిమాధారా. 74

ఉ. మీ రిటు లేమి సెప్పిన నమేయభుజాబలభగ్నదైత్య యే
గారవ మొప్పఁ దమ్ములను గాంతను బుత్త్రుల మిత్త్రకోటిఁ గ
న్నారఁగఁ జూడ కుండుటకు నక్కట యోర్తునె యెల్లభోగముల్
వారలఁ జూచి క్రమ్మఱఁగ వచ్చి సుఖస్థితిమై భుజించెదన్. 75

త్త్రునియెడఁ జేయుద్రోహము వ।ఘాటి వధించుట విప్రునర్థముం
గొనుట యనంగఁ గల్గునివి । గూడి సమం బగు నాకుఁ జూడ భ
క్తు ననపరాధునిఁ విడుచు।దోషముతో నిది యోర్వ వచ్చునే. 58

ఉ. కావున నాకలోకపుసు।ఖం బటు లుండఁగనిమ్ము దేవ నీ
భావము నిల్పు నాదెసఁ గృ।పాభరితంబుగ సారమేయసం
భావనసేఁత దోసముగఁ । బట్టమి నాకు వరంబు నీవు వా
మ్మావనభూమి నుండెద స।మిద్ధతపంబున నిన్న కొల్చుచున్. 59

వ. అని పుయిలోడక పలికెఁ బౌరవోత్తమా యాకర్ణింపుము. 60

సారమేయరూపంబున వచ్చినధర్ముండు ధర్మరాజునకుఁ బ్రత్యక్షం బగుట.

సీ. అట్లతిదృఢనిశ్చ।యంబుగఁ బలికిన,తనపుత్త్రుఁ గనుఁగొని । ధర్ముఁ డధిక
సంప్రమోదముఁ బొంది । సారమేయాకృతిఁ, బాసి తా నాత్మరూ।పంబుఁ దాల్చి
పరమసంభ్రమకృత।ప్రణతియు నానంద,భరితుండు నగునాస్య।పాలుతోడ
నీపుణ్యవృత్తంబు । నిర్మలమేధయు, నఖిలభూతంబుల।యందుఁ గలుగు
తే. దయయు నాదుచిత్తముఁ బ్రమ।దమునఁ దేల్చె
వత్స భూలోకమున నిట్టి।వారుఁ గలరె
తొల్లియును ద్వైతవనమున । దోషదూర
మయిననీమనమున తెఱం । గరసినాఁడ. 61

క. విను నీరు రోసి నీదగు,ననుజులు మృతు లయిన [1]వచ్చి । యందఱులో నొ
క్కనిఁ గోరుము బ్రదికించెద, నని పలికితి నేను నిర్మ।లాత్మక నీకున్. 62

ఉ. దానికి నీవు చిత్తమునఁ । దల్లుల నిద్దఱనుం దలంచి మా
లోన నొకండఁ గల్గితి న।లుత్తత వారలయందుఁ గల్మిఁ గో
కానుమతంబు గాదె నకు।లార్థిత ధర్మువు నాకు నస్మతిఁ
వీనుల కింపుగా నకులు । వేఁడితి తద్వ్యథ మెందుఁ గల్గునే. 63

క. భీముని నర్జును విడిచియు, నీమది నకులు బ్రదికింప । నిగుడుట పుత్త్రా
నామనమునఁ బాయదు ని, న్నే మన వచ్చు నఖిలంబు । నింద్రుం డెఱుఁగున్. 64

క. విను భక్తియుక్త మిది యని, శునకముఁ జేపట్టి నీవు । సురపతి కొనివ
చ్చినయరద మెక్క నొల్లవ, యనఘా సరి నీకు దివము।నందును గలరే. 65

ఉ. ఇంతటిపెంపు గల్గుట మ।హేంద్రుఁడు నీదెసఁ గాంచె నీవు ని
శ్చింతత మేనితోఁ జనుము । సిద్ధపథంబునఁ బుణ్యలోకముల్
వింతలు గాక యుండఁ బృథి।వీవర నీకు నుదారసౌఖ్య మ
త్యంతము నవ్యయంబు నగు । నందలిమాన్యులు సంస్తుతింపఁగన్. 66

సీ. అనియె నప్పుడు పర।మాహ్లాదమునఁ జను,దెంచి గంధర్వులు । దేవమునులు

---

1. గ. ఁ జచ్చినందఱిలో.

మరుదశ్వివసువులు గ మహితాదరంబున, ధర్మండు నింద్రుండుఁ గదారు నమ్మ
హాత్ముని నెత్తి రథారూఢుఁగాఁ జేసి, తమవిమానములు పార్శ్వముల నడపి
కొని చన నిఖిలదిక్కులఁ దనతేజంబు, వెలుగంగ సిద్ధులు గ వినుతి సేయ

తే. దైవతావాసమునకు నాధర్మజుండు, సనియె నయ్యవసరమున గ సర్వలోక
సమ్మతుఁడు బోధఘనుఁడు ప్రసన్నఫణితి, సారతోదారుఁడును నగునారదుండు. 68

వ. ఎల్లవారును విన సంపూర్ణస్వరంబున నిట్లనియె.

ఉ. దానములం దపంబులను గ దద్దయుఁ జేర్కొలయట్టివారలన్
మానవనాథులన్ వినమె గ మాసెఁ దదీయయశంబు లెల్ల నీ
మానితకీర్తికీర్తులు సమస్తజగంబులయందుఁ బర్వెట
న్మేనులతోడ వారిటులు గ నేర్చిరె రా నమరత్వసిద్ధికిన్. 69

చ. అన విని ధర్మరాజసుతుఁ గ డాతని కిట్లను నాదుతమ్ములం
గనుఁగొనునంతకున్ సుఖముగాఁ గొనవయ్యెద నిత్తెఱంగు నా
కు నకట చూపరే పవనుకొడుకు నింద్రసుతుండు మాద్రినం
దనులును నున్నచోటు సుఖదం బయినన్ సుఖహీనమేనియున్. 70

వ. వారలను మదీయపక్షప్రాప్తు లయినభూపతులను జూచువేడ్క యెల్లలోకంబుల
మీఁదను గలుగువేడుకకంటెను మిగిలి యున్నయది యనుటయు నమరేంద్రుండు
దనమనంబున నితనితోడ సముచితసంభాషణంబులు సేసెద నివ్విధంబు కటుకవచ
నత్వంబు గా దని యూహించి యిట్లనియె. 71

చ. తనువు దొఱంగ కిట్లు సుకృతంబులపెంపున వచ్చి తిప్పదం
బునకు మహాత్మ యిచ్చటను గ బోవదు నీమదిఁ బాసి మర్త్యతం
బనుపడియున్న నెయ్యము సభాసదులన్ శుభదృష్టిఁ జూడుమా
మునులను సిద్ధులం దగునె గ ముందటిచందము నొంది యుండఁగన్. 72

చ. ఒరులకు నందరానిపద గ మూర్జితపుణ్యనిరూఢిఁ బొందఁగా
దొరకొని యున్కి నీవికృతదూరమనస్కతఁ గాదె నీసహో
దరులు భవన్మహోన్నతపదస్థితి కర్హులె తొంటినెయ్యముం
బొరయునె దేవతాత్మకుల గ బుద్ధి నెఱుంగుము నీవిశేషమున్. 73

క. అని యిట్లాడినసర్వభు,వనపతియు బుధుండు నైనవాసవుతోఁ దా
ననియెం దగ వెండియు ధ,ర్మనందనుఁడు భరతవంశమహిమాధాయీ. 74

ఉ. మీ రిటు లేమి సెప్పిన నమేయభుజాబలభగ్నదైత్య యే
గారవ మొప్పఁ దమ్ములను గ గాంతను బుత్త్రుల మిత్త్రకోటిఁ గ
న్నారఁగఁ జూడ కుండుటకు గ నక్కట యోర్తునె యెల్లభోగముల్
వారలఁ జూచి క్రమ్మఱఁగ గ వచ్చి సుఖస్థితిమై భుజించెదన్. 75

వ. నాకత్తెఱంగు పరమానందకరం బనియె ననియిట్లు మునీంద్రమాననీయం బగున పాండవేయమహాప్రస్థానప్రకారంబు జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు. 76

శా. పారాశర్యవచఃపయోనిధిసుధాభంగీ దయాసంగి నా
ర్వారాశేషవిపద్విదారణవిహారా చిన్మయాకార వి
స్తారోదారగుణత్రయస్ఫుటవిశేషా నిర్గుణాశ్లేష మా
గారీతోజ్జ్వలతత్త్వభాస్వర [1]నిజాగారాత్మకశ్రీశ్వరా. 77

క. ప్రణవైకభావ్య సురరక్షణకేళీస్తవ్య జనస్యసకలద్రవ్యా
[2]గణనాతీతా పోష్య ప్రణతత్రాతా నిరీహభక్తప్రీతా. 78

మాలిని. అమృతవికిరణక్రీడాభిరామా త్రిధామా
దమితసకలదైత్యోత్సాహ విజ్ఞానదేహా
సుమహదుపనిషత్ప్రస్తుత్యభిశ్రావ్య సేవ్యా
[3]శమనరమణశీలా సంభృతానందలీలా. 79

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునందు మహాప్రస్థానికపర్వంబు సర్వంబు నేకాశ్వాసము. 80



1. క. నిజాకారాత్మవర్తీశ్వరా-జ. నిజాగారాత్మకీర్తీశ్వరా. 2. క. గణనాతీతప్రేష్యప్రణతత్రాతా. 3. క. శమవదవనశీలా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## స్వర్గారోహణపర్వము, ఏకాశ్వాసము.





వర్ధనాయురభివృ
ద్ధ్యావహచరణశతపత్ర యమనియమాది
ప్రావీణ్యపూర్ణమిత్ర మ
హావిద్యోన్మేషగాత్ర హరిహరనాథా. 1

వ. దేవా జనమేజయుండు వైశంపాయనుతోడ మత్పూర్వపితామహు లగుపాండవులును ధార్తరాష్ట్రులును స్వర్గం బారోహించి యెట్టెట్టినెలవుల నిలిచి రెట్లు వర్తించిరి చెప్పవే తదాకర్ణనకౌతుకంబు మదీయచిత్తంబున [1]నుత్తరంగం బగుచున్నయది నీవు సర్వవిదుండ నేను భవదీయసదయవాక్యసంభావనకు సర్హుండ నని ప్రార్థించినం బ్రచురదివ్యజ్ఞానమాననీయుండును బరమకృపావిధేయుండును నైనసాత్యవతేయునిసారకరుణావిశేషంబున సంపోషితం బైనబోధంబున సాధుజనస్తవ్యుం డైనయాభవ్యమునివరుం డక్కురువంశవరున కిట్లనియె నట్లు బంధుదర్శనంబు గోరి పలికినపాండవాగ్రజుతలంపున కనుకూలుం డై యాఖండలుండు. 2

సీ. తగువాని రావించి ధర్మనందనునకుఁ, దమవారిఁ జూడఁ జిత్తమునఁ గోర్కి
దనికినయది నీ వికతని నట గొనిపోయి, యఖిలబంధులఁ జూపు మనుడు నతఁడు
గారవం బెసఁగంగ నారాజసత్తముఁ, దోడ్కొని పోవఁ గుతూహలమునఁ
దోడన నారదాదులు గొంద ఱరిగి ర, ట్లేఁగెడుచోటఁ గట్టెదురఁ దోఁచె

తే. నున్నతాసనాసీనుఁ డభ్యుదితసరసిజాప్తసంకాశుఁ డమృతాశనాంగనాది
వృతుఁడు వీరలక్ష్మీవిరాజితుఁడు సతత, యుక్తసుఖసాధనుండు దుర్యోధనుండు. 3

వ. ఇట్లొప్పి యున్నయతనిం గనిధర్మనందనుండు దేవమునివరుల మొగంబు లాలోకించి.

---

1. క. నుత్తలం బగు.

వ. నాకర్ణింపఁగు బరమానందకరం బనియె ననియిట్లు మునీంద్రమానసేయం బయిన పాండవేయమహాప్రస్థానప్రకారంబు జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు. 76

శా. పారాశర్యవచఃపయోనిధిసుధాశ్రీభంగి దయానంగి నా
ర్వారాశేషవిపద్విదారణవిహారా చిన్మయాకార వి
స్తారోదారగుణత్రయస్ఫుటవిశేషా నిర్గుణాశ్లేష మా
కారితోజ్జ్వలతత్త్వభాస్వర [1]నిజాకారాత్మకత్రీశ్వరా. 77

క. ప్రణవైకభావ్య సురరక్షణకేళీస్తవ్య జన్యశసకలద్రవ్యా
[2]గణనాతీతా పోష్య ప్రణతవ్రాతా నిరీహశభక్తిప్రీతా. 78

మాలిని. అమృతవికిరణక్రీడాభిరామా త్రిధామా
దమితసకలదైత్యోత్సాహ విజ్ఞానదేహా
సుమహదుపనిషత్ప్రశస్తుత్యభిశ్రావ్య సేవ్యా
[3]శమనరమణశీలా శసంభృతానందలీలా. 79

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబునందు మహాప్రస్థానికపర్వంబు సర్వంబు నేకాశ్వాసము. 80



1. క. నిజాకారాత్మవర్తీశ్వరా-జ. నిజాగారాత్మకీర్తీశ్వరా. 2. క. గణనాతీతప్రేష్యప్రణతత్రాతా. 3. క. శమవదవనశీలా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## స్వర్గారోహణపర్వము, ఏకాశ్వాసము.





వర్ధనాయురభివృ
ద్ధ్యాపహాచరణాంతపత్రీ యమనియమాది
ప్రావీణ్యపూర్ణమిత్త్రీ మ
హావిద్యోన్మేషగాత్రీ హరిహరనాథా. 1

వ. దేవా జనమేజయుండు వైశంపాయనుతోడ మత్పూర్వపితామహు లగుపాండవులును ధార్తరాష్ట్రులును స్వర్గం బారోహించి యెట్టెట్టినెలవుల నిలిచి రెట్లు వర్తించిరి చెప్పవే తదాకర్ణనకౌతుకంబు మదీయచిత్తంబున [1]నుత్తరంగం బగుచున్నయది నీవు సర్వవిదుండ వేను భవదీయసదయవాక్యసంభావనకు నర్హుండ నని ప్రార్థించినం బ్రచురదివ్యజ్ఞానమాననీయుండును బరమకృపావిధేయుండును నైనసాత్యవతేయునిసారకరుణావిశేషంబున సంపోషితం బైనబోధంబున సాధుజనస్తవ్యుం డైనయాభవ్యమునివరుం డక్కురువంశవరున కిట్లనియె నట్లు బంధుదర్శనంబు గోరి పలికినపాండవాగ్రజుతలంపున కనుకూలుం డై యాఖండలుండు. 2

సీ. తగువాని రావించి ధర్మనందనునకుఁ, దమవారిఁ జూడఁ జిత్తమునఁ గోర్కి
దనికినయది నీ వితని నట గొనిపోయి, యఖిలబంధులఁ జూపు మనుడు నతఁడు
గారవం బెసఁగంగ నారాజసత్తముఁ, దోడ్కొని పోవఁ గుతూహలమునఁ
దోడన నారదాదులు గొంద అరిగిర, ట్లేఁగెడుచోటఁ గట్టెదురఁ దోఁచె

తే. నున్నతాసనాసీనుఁ డభ్యుదితసరసి, జాప్తసంకాశుఁ డమృతాశనాంగనాది
వృతుఁడు వీరలక్ష్మీవిరాజితుఁడు సతత, యుక్తసుఖసాధనుఁడు దుర్యోధనుండు. 3

వ. ఇట్లొప్పి యున్నయతనిం గని ధర్మనందనుండు దేవమునివరుల మొగంబు లాలోకించి.

1. గ. నుత్తలం బగు.

ధర్మజుఁడు దుర్యోధనుం జూచి యసూయాపరుం డైన నారదుఁ డతనిం దేర్చుట.

సీ. ఇతఁ డతిలోభోప।హతమానసుఁడు దీర్ఘ,దర్శి గాఁ డితనికా।రతమునఁ జేసి
నిఖిలదేశంబుల।యఖిలనృపాలురుఁ, ద్రుంగిరి దంతితు।రంగసహిత
ముగ ననవద్యాంగి । విగతకల్మష ధర్మ,చారిణి సాధ్విఁ బాం।చాలి నార్య
జనములు గనుఁగొన । సభలోన నవమాన,పెట్టినతులువ యే । యిట్టివాని

ఆ. తోడఁ గలసి మెలఁగు।దు నె మహాత్ము,లార యెచట నున్న।వారు భీమ
ఫల్గునులును గవలుఁ।బాంచాలియును నన్ను,నచటి కనుపవల యు।ననుచు మరలె.

వ. మరలినఁ జూచి నారదుండు నవ్వుచు నతని కి ట్లనియె. 6

సీ. ఓధర్మనందన । యీధరణీవిభుం, డాహవసంపరి।త్యక్తతనుఁడు
దేవతాసంభావ్యుఁ । డై వెలింగెడుఁ బుణ్య,కర్ము లెల్లను గడు । గారవింతు
రితని నితండు మ।హాశుల నుజ్జ్వల,క్షత్త్రధర్మంబునఁ । గాఁడ ద్రుంచె
నది పాప మే లగు । ననఘ పాంచాలి యీ,తనిచేతఁ బడుటయుఁ । దక్కఁ గలుగు

తే. నెగ్గులును నింక నిచ్చట । నేల తలఁప
నిచ్చోటు పుణ్యలోకము మది । నీసు రోష
మనుమనోవికృతులు దగు।నయ్య వాని
విడిచి సమత నొందుము లోక।వినుతచరిత. 7

వ. అని వెండియు. 8

క. జూదమునఁ గయ్యమున నీ, కేదురితంబులు నితాంత।హృదయక్లేశా
పాదకములు వాటిల్లె న,నాదృతములు సేయు వాని । నన్నిటి ననఘా. 9

చ. అన విని యమ్మునీంద్రునకు । నవ్విభుఁ డి ట్లనుఁ బాపశాలి స
జ్జనసతతాపచారి కుల।సంక్షయకారణరోషభాగి యి
మ్మనుజవరాధముం డితఁ డ।మర్త్యుల కెల్లను మాననీయుఁ డై
మనున టె పుణ్యలోకమున । మాటలు వేయును నేల సంయమీ. 10

తే. అతని న ట్లుండ నిమ్ము నా।యనుజతనుజ,మిత్త్రజనములఁ బాంచాల।పుత్త్రి నా క
వశ్యమును నభివీక్షింప।వలయుఁ జూపఁ, బనుపు వారల యున్నెడ। భవ్యచరిత. 11

వ. అని మఱియుం గలుగుమునీంద్రులఁ గలయం గనుంగొని. 12

ధర్మజుఁడు దేవమునులను గర్ణాదిస్వజనులఁ జూప వేఁడుకొనుట.

సీ. సంగ్రామమృతులై న।సకలబంధులకుఁ ది,లోదకం బే నిచ్చు।చుండ వచ్చి
కుంతి కర్ణుఁడు దన।కొడు కని చెప్పి నా, కతనిజన్మము తెలి।యఁగంతవట్టు
విదితంబుగాఁ జేసె । నది మొదలుగ నమ్మ,హావీరుఁ దలఁచిన।యప్పు డెల్ల
నుల్లంబు సంతాప । మొందుఁ దదీయపా,దంబు లద్దేవిపా।దంబులట్లు

ఆ. యుని సభ త్రికముగ । నర్చితంబులు సేయఁ, గాన కునికి కేను । గరము వగతు

సతఁడు నేను నైన।సమరేంద్రుఁడును మమ్ముఁ, జెనయునే త్రిలోక।సేవ్యులార.

చ. అతని నెఱుంగ కుండి విను। మర్జునుఁ బంచితి నమ్మహాత్మునిన్
మృతుఁడుగఁ జేయఁగా నది శ।మింపదు శోకము నావహించుచున్
మతికి నలంత సేయు గుణ।మాన్యుని నాతనిఁ జూచుకౌతుకం
బతిశయ మొందుచున్నయది। యాయన యెచ్చట నుండుఁ జెప్పరే. 14

వ. ద్రుపదవిరాటయుధామన్యులు శంఖప్రభృతితదీయజ్ఞాతులును రణాగ్నికిం బ్రాణహవిస్సులు వేల్చినవారు వారల నాకుం జూడ వలదె ప్రాణసముం డగుజగత్ప్రాణనందనుని సంక్రందనతేజోవిరాజితుం డగుశ్వేతాశ్వుని నశ్వుల ననుకరించునకులసహదేవులను సహజసద్గుణశాలిని యగుపాంచాలినిఁ జూడక నిలువంజాలుదునె వారి కెవ్వరికిని నాకలోకనివాసంబు లేకతక్కెనేని సోదరరహితస్వర్గంబునందు స్వర్గత్వబుద్ధి పుట్టదయ్యెడు వార లెచ్చోట నుండి రచ్చోట యేను బుణ్యలోకంబుగాఁ దలంచెద నయ్యెడ కనిచి పుచ్చుం డనిమిషవర్యులారా యని పలికిన నప్పాండవాగ్రజుతో నద్దేవమును లి ట్లనిరి. 15

ఆ. అట్ల చేయువార। మమలాత్మ నీదుచి,త్తమున నేది దోఁచె। దాని నాచ
రింప వలయు నని ని।లింపేశ్వరుండు వా,టించి మాకు నప్ప।గించినాఁడు. 16

సీ. అని దేవదూతునిఁ। గనుఁగొని యిమ్మహి,తాత్ముని భీమసే।నార్జునాదు
లున్నచోటికి నన్ను। మన్న నప్పురుషుఁ డా,దర మెసఁగంగ నా।ధర్మతనయు
నిందు ర మ్మనుచుఁ దా। ముందటఁ జన నమ్మ,హానుభావుఁడు వాని।ననుగమించె
నట్లు సనంగఁ గే।శాస్థిసాంద్రంబు దు,ర్గంధంబుఁ బరుషత।రంబు దంశ

ఆ. మశకనిబిడమును ద।మఃకలితముఁ గ్రిమి,కీటరక్తమాంస।కూటకుణప
ఘోరవిసము శాత।దారుణచంచువా,యసరవాన్వితంబు। నయ్యెఁ బథము. 17

వ. అప్పథంబునఁ బాండవాగ్రజుండు సని చని [1]యారం గ్రాఁగిననూనియవోలెం దెరలుచున్నజలంబులు గలిగి యాయసకంటకదుస్స్పర్శం బగుచుఁ దటంబున నిశితాసిపత్త్రవనంబు శోభిల్ల వైతరణి యనుపేరఁ బరఁగినయేఱును దత్ప్రదేశంబున ననేకప్రకారయాతన లనుభవించుపాపకర్ములనుం జూచి దేవదూతునితో మనకుఁ బోవలయుచోటింక నెంత దవ్వు గల దియ్యెడయును దేవతాధీనం బై యుండునే యని యడిగిన నప్పురుషుం డతనితోడ. 18

తే. ఈనెలవులు బృందారకా।ధీన మిదియు, మనకు రావలసినచో।టనిన నతం డ
సహ్యదుర్గంధఘోరద।ర్శనత నచోటు, చిత్త మతిదుఃఖితంబుగ।జేయుటయును.

వ. మఱలి పోవం జూచిన నయ్యెడఁ గొన్ని యెలుంగులు. 20

తే. [2]భవ్యజనన నీగాత్ర।ముదివ్యసౌర
భంబు బెరసినగాడ్పు మా।పైఁ గరంబు

1. క. తార కాఁగిన–చ. దూరం గాఁగిన. 2. ట. దివ్యజన నీదుగాత్రంబు.

ధర్మజుఁడు దుర్యోధనుం జూచి యసూయాపరుం డైన నారదుఁ డతనిం దేర్చుట.

సీ. ఇతఁ డతిలోభోపహతమానసుఁడు దీర్ఘదర్శి గాఁ డితనికతమునఁ జేసి
నిఖిలదేశంబులయఖిలనృపాలురుఁ, ద్రుంగిరి దంతితురంగసహిత
ముగ ననవద్యాంగి విగతకల్మష ధర్మచారిణి సాధ్విఁ బాంచాలి నార్య
జనములు గనుఁగొన సభలోన నవమానపెట్టినతులువ యే నిట్టివాని

ఆ. తోడఁ గలసి మెలఁగుదునె మహితాత్మకులార యెచట నున్నవారు భీమ
ఫల్గునులును గవలుఁ బాంచాలియును నన్ను నచటి కనుపవలయు ననుచు మరలె.

వ. మరలినఁ జూచి నారదుండు నవ్వుచు నతని కిట్లనియె. 6

సీ. ఓధర్మనందన యీధరణీవిభుం డాహవసంపదత్యక్తతనుఁడు
దేవతాసంభావ్యుఁ డై వెలింగెడుఁ బుణ్యకర్ము లెల్లను గను గానివింత
రితని నితండు మహీశుల నుజ్జ్వలక్షత్త్రధర్మంబునఁ గాంచ త్రుంచె
నది పాపమే లగు ననఘ పాంచాలి యీతనిచేతఁ బడుటయుఁ దక్కఁ గలుగు

తే. నెగ్గులును నింక నిచ్చట నేల తలఁప
నిచ్చోటు పుణ్యలోకము మది నీవు రోష
మనుమనోవికృతులు దగునయ్య వాని
విడిచి సమత నొందుము లోకవినుతచరిత. 7

వ. అని వెండియు. 8

క. జూదమునఁ గయ్యమున నీ, కేదురితంబులు నితాంతహృదయక్లేశా
పాదకములు వాటిల్లెన, నాదృతములు సేయు వాని నన్నిటి ననఘా. 9

చ. అన విని యమ్మునీంద్రునకు నవ్విభుఁ డిట్లను బాపశాలి స
జ్జనసతతాపచారి కులసంక్షయకారణరోషభాగి యి
మ్మనుజవరాధముం డితఁ డమర్త్యుల కెల్లను మాననీయుఁ డై
మనునటె పుణ్యలోకమున మాటలు వేయును నేల సంయమీ. 10

తే. అతని నట్లుండనిమ్ము నాయనుజతనుజమిత్త్రజనములఁ బాంచాలపుత్త్రి నాక
వశ్యమును నభివీక్షింపవలయుఁ జూపఁ, బనుపు వారలయున్నెడ భవ్యచరిత. 11

వ. అని మఱియుం గలుగుమునీంద్రులఁ గలయం గనుంగొని. 12

ధర్మజుఁడు దేవమునులను గర్ణాదిస్వజనులఁ జూప వేఁడుకొనుట.

సీ. సంగ్రామమృతు లైనసకలబంధులకుఁ దిలోదకం బే నిచ్చుచుండ వచ్చి
కుంతి కర్ణుఁడు దనకొడుకని చెప్పినా, కతనిజన్మము తెలియఁ గంతవట్టు
విదితంబుగాఁ జేసె నది మొదలుగ నమ్మహావీరుఁ దలఁచినయప్పు డెల్ల
నుల్లంబు సంతాప మొందుఁ దదీయపాదంబు లద్దేవిపాదంబులట్లు

ఆ. తమి సభ క్లిశముగ నర్చితంబులు సేయఁ, గాన కునికి కేను గరము వగతు

నతఁడు నేము నైన | నమరేంద్రుఁడును మమ్ముఁ, జెనయునే త్రిలోక | సేవ్యులార.

చ. అతని నెఱుంగ కుండి విను | మర్జునుఁ బంచితి నమ్మహాత్మునిన్
మృతుఁడుగఁ జేయఁగా నది శ | మింపదు శోకము నావహించుచున్
మతికి నలంత సేయు గుణ | మాన్యుని నాతనిఁ జూచుకౌతుకం
బతిశయ మొందుచున్నయది | యాయన యెచ్చట నుండుఁ జెప్పరే. 14

వ. ద్రుపదవిరాటయుధామన్యులు శంఖప్రభృతితదీయజ్ఞాతులును రణాగ్నికిం బ్రాణహవిస్సులు వేల్చినవారు వారల నాకుం జూడవలదె ప్రాణసముం డగుజగత్ప్రాణనందనుని సంక్రందనతేజోవిరాజితుం డగుశ్వేతాశ్వుని నశ్వుల ననుకరించునకులసహదేవులను సహజసద్గుణశాలిని యగుపాంచాలినిం జూడక నిలువంజాలుదునె వారి కెవ్వరికిని నాకలోకనివాసంబు లేకతక్కె నేని సోదరరహితస్వర్గంబునందు స్వర్గత్వబుద్ధి పుట్టదయ్యెడు వార లెచ్చోట నుండి రచ్చోట యేను బుణ్యలోకంబుగాఁ దలంచెద నయ్యెడ కనిచి పుచ్చుం డనిమిషవర్యులారా యని పలికిన నప్పాండవాగ్రజుతో నద్దేవమును లిట్లనిరి. 15

ఆ. అట్లు చేయువార | మమలాత్మ సీమచి,త్తమున నేది దోఁచె | దాని నాచ
రింప వలయు నని ని | లింపేశ్వరుండు వా,టించి మాకు నప్ప | గించినాఁడు. 16

సీ. అని దేవదూతునిఁ | గనుఁగొని యిమ్మహి,తాత్ముని భీమసే | నార్జునాదు
లున్నచోటికి నన్ను | మన్న నప్పురుషుఁ డా,దర మెసఁగంగ నా | ధర్మతనయు
నిందు ర మ్మనుచుఁ దా | ముందటఁ జన నమ్మ,హానుభావుఁడు వాని | ననుగమించె
నట్లు సనంగఁ గే | శాస్థిసాంద్రంబు దు,ర్గంధంబుఁ బరుషత | రంబు దంశ

ఆ. మశకనిబిడమును ద | మఃకలితముఁ గ్రిమి,కీటరక్తమాంస | కూటకుణప
ఘోరవిధము శాత | దారుణచంచువా,యసరవాన్వితంబు | నయ్యెఁ బథము. 17

వ. అప్పథంబునఁ బాండవాగ్రజుండు సని చని [1]యారం గ్రాఁగిననూనియవోలెం దెరలుచున్నజలంబులు గలిగి యాయసకంటకదుస్స్పర్శం బగుచుఁ దటంబున నిశితాసిపత్త్రవనంబు శోభిల్ల వైతరణి యనుపేరఁ బరఁగినయేఱును దత్ప్రదేశంబున ననేకప్రకారయాతన లనుభవించుపాపకర్ములనుం జూచి దేవదూతునితో మనకుఁ బోవలయుచోటింక నెంత దవ్వు గల దియ్యెడయును దేవతాధీనం బై యుండునే యని యడిగిన నప్పురుషుం డతనితోడ. 18

తే. ఈనెలవులు బృందారకా | ధీన మిదియు, మనకు రావలసినచో | టనిన నతం డ
సహ్యదుర్గంధఘోరద | ర్శనత నచోటు,చిత్త మతిదుఃఖితంబుగ | జేయుటయును.

వ. మరలి పోవం జూచిన నయ్యెడఁ గొన్ని యెలుంగులు. 20

తే. [2]భవ్యజనన నీగాత్రము | దివ్యసౌర
భంబు బెరసినగాడ్పు మా | పైఁ గరంబు

---

1. క. తార కాఁగిన-చ. దూరం గాఁగిన. 2. ట. దివ్యజన నీదు-గాత్రంబు.

ధర్మజుఁడు దుర్యోధనుం జూచి యసూయాపరుం డైన నారదుఁ డతనిం దేర్చుట.

సీ. ఇతఁ డతిలోభోప।హతమానసుఁడు దీర్ఘ,దర్శి గాఁ డితనిక।తముసఁ జేసి
నిఖిలదేశంబుల।యఖిలనృపాలురుఁ, ద్రుంగిరి దంతితు।రంగసహిత
ముగ నసవద్యాంగి । విగతకల్మష ధర్మ,చారిణి సాధ్విఁ బాం।చాలి నార్య
జనములు గనుఁగొన । సభలోన నవమాన,పెట్టినతులువ యే । నిట్టివాని

ఆ. తోడఁ గలసి మెలఁగు।దునె మహాత్ములార యెచట నున్న।వారు భీమ
ఫల్గునులునుగవలుఁ। బాంచాలియును నన్న,నచటి కనుపవలయు।ననుచుమరలె.

వ. మరలినఁ జూచి నారదుండు నవ్వుచు నతని కి ట్లనియె. 6

సీ. ఓధర్మనందన । యీధరణీవిభుం, డాహవసంపరి।త్యక్తతనుఁడు
దేవతాసంభావ్యుఁ । డై వెలింగెడుఁ బుణ్య,కర్ము లెల్లను గను । గారవింతు
రితని నితండు మ।హీశుల నుజ్జ్వల,క్షత్త్రధర్మంబున । గాంచ త్రుంచ
నది పాప మే లగు । ననఘ పాంచాలి యీ,తనిచేతఁ బడుటయుఁ । దక్కఁ గలుగు

తే. నెగ్గులును నింక నిచ్చట । నేల తలఁప
నిచోటు పుణ్యలోకము మది । నీసు రోష
మనుమనోవికృతులు దగు।నయ్య వాని
విడిచి సమత నొందుము లోక।వినుతచరిత. 7

వ. అని వెండియు. 8

క. జూదమునఁ గయ్యమున నీ,కేదురితంబులు నితాంత।హృదయక్లేశా
పాదకములు వాటిల్లె న,నాదృతములు సేయు వాని । నన్నిటి ననఘా. 9

చ. అన విని యమ్మునీంద్రునకు । నవ్విభుఁ డి ట్లనుఁ బాపశాలి స
జ్జనసతతాపచారి కుల।సంక్షయకారణరోషభాగి యి
మ్మనుజవరాధముం డితఁ డ।మర్త్యుల కెల్లను మాననీయుఁ డై
మనునె పుణ్యలోకమున । మాటలు వేయును నేల సంయమీ. 10

తే. అతని న ట్లుండనిమ్ము నా।యనుజతనుజ,మిత్త్రజనములఁ బాంచాల।పుత్త్రి నా క
వశ్యమును నభివీక్షింప।వలయుఁ జూపఁ, బనుపు వారలయున్నెడ।భవ్యచరిత. 11

వ. అని మఱియుం గలుగుమునీంద్రులఁ గలయం గనుంగొని. 12

ధర్మజుఁడు దేవమునులను గర్ణాదిస్వజనులఁ జూప వేఁడుకొనుట.

సీ. సంగ్రామమృతు లైన।సకలబంధులకుఁ ది,లోదకం బే నిచ్చు।చుండ వచ్చి
కుంతి కర్ణుఁడు దన।కొడు కని చెప్పి నా,కతనిజన్మము తెలి।యంతవట్టు
విదితంబుగాఁ జేసె । నది మొదలుగ నమ్మ,హావీరుఁ దలఁచిన।యప్పు డెల్ల
నుల్లంబు సంతాప । మొందుఁ దదీయపా,దంబు లద్దేవిపా।దంబులట్లు

ఆ. యుని సభ త్రికముగ । నర్చితంబులు సేయఁ, గాన కునికి కేను । గరము వగతు

నతఁడు నేము నైన నమరేంద్రుఁడును మమ్ముఁ, జెనయునే త్రిలోకసేవ్యులార.

చ. అతని నెఱుంగ కుండి విను మర్జునుఁ బంచితి నమ్మహాత్ముని౯
మృతుఁడుగఁ జేయఁగా నది శమింపదు శోకము నావహించుచు౯
మతికి నలంత సేయు గుణమాన్యుని నాతనిఁ జూచుకౌతుకం
బతిశయ మొందుచున్నయది యాయన యెచ్చట నుండుఁ జెప్పరే. 14

వ. ద్రుపదవిరాటయుధామన్యులు శంఖప్రభృతితదీయజ్ఞాతులును రణాగ్నికిం బ్రాణహవిస్సులు వేల్చినవారు వారల నాకుం జూడ వలదె ప్రాణసముం డగుజగత్ప్రాణనందనుని సంక్రందనతేజోవిరాజితుం డగుశ్వేతాశ్వుని నశ్వుల ననుకరించునకులసహదేవులను సహజసద్గుణశాలిని యగుపాంచాలినిం జూడక నిలువంజాలుదునె వారి కెవ్వరికిని నాకలోకనివాసంబు లేకతక్కె నేని సోదరరహితస్వర్గంబునందు స్వర్గత్వబుద్ధి పుట్టదయ్యెడు వార లెచ్చోట నుండి రచ్చోట యేను బుణ్యాలోకంబుగాఁ దలంచెద నయ్యెడ కనిచి పుచ్చుం డనిమిషవర్యులారా యని పలికిన నప్పాండవాగ్రజుతో నద్దేవమును లి ట్లనిరి. 15

ఆ. అట్లు చేయువార మమలాత్మ నీదుచిత్తమున నేది దోఁచె దాని నాచ
రింప వలయు నని నిలింపేశ్వరుండు వాటించి మాకు నప్పగించినాఁడు. 16

సీ. అని దేవదూతునిఁ గనుఁగొని యిమ్మహితాత్ముని భీమసేనార్జునాదు
లున్నచోటికి నన్పు మన్న నప్పురుషుఁ డాదర మెసఁగంగ నాధర్మతనయు
నిందు ర మ్మనుచుఁ దా ముందటఁ జన నమ్మహానుభావుఁడు వానిననుగమించె
నట్లు సనంగఁ గేశాస్థిసాంద్రంబు దుర్గంధంబుఁ బరుషతరంబు దంశ

ఆ. మశకనిబిడమును దమఃకలితముఁ గ్రిమికీటరక్తమాంసకూటకుణప
ఘోరవిఘము శాతదారుణచంచువాయసరవాన్వితంబు నయ్యెఁ బథము. 17

వ. అప్పథంబునఁ బాండవాగ్రజుండు సని చని [1]యారం గ్రాఁగిననూనియుఁ బోలెం దెరలుచున్నజలంబులు గలిగి యాయసకంటకదుస్స్పర్శం బగుచుఁ దటంబున నిశితాసిపత్త్రవనంబు శోభిల్ల వైతరణి యనుపేరఁ బరఁగినయేఱును దత్ప్రదేశంబున ననేకప్రకారయాతనల ననుభవించుపాపకర్ములనుం జూచి దేవదూతునితో మనకుఁ బోవలయుచోటింక నెంత దవ్వు గల దియ్యెడయును దేవతాధీనం బై యుండునే యని యడిగిన నప్పురుషుం డతనితోడ. 18

తే. ఈనెలవులు బృందారకాధీన మిదియ, మనకు రావలసినచో టనిన నతం డ
సహ్యదుర్గంధఘోరదర్శనత నచోటు, చిత్త మతిదుఃఖితంబుగఁ జేయుటయును.

వ. మరలి పోవం జూచిన నయ్యెడఁ గొన్ని యెలుంగులు. 20

తే. [2]భవ్యజనన నీగాత్రముదివ్యసౌర
భంబు బెరసినగాడ్పు మాపైఁ గరంబు

1. క. తార కాఁగిన—చ. దూరం గాఁగిన. 2. ట. దివ్యజన నీదు గాత్రంబు.

హృద్యమై వీచుటయు దుఃఖ । మెల్లఁ బాసె
భూరిసౌఖ్యంబు నొందుచు । న్నార మేము. 21

క. నినుఁ జూడఁ గనుటఁ-బటుయా, తనలం దొఱఁగితివి పరమ । ధర్మాత్మక నీ
వనయము దయ నిచ్చట నిలిచిన బ్రతుకుదు మింకఁ గొంత । సేపు నిలువవే. 22

ధర్మరాజు నరకమున నున్నయన్నదమ్ముల నెఱింగి పరితపించుట.

వ. అని దుఃఖభారకృపణంబు లగుచు వీతెంచినఁ గౌంతేయాగ్రజుం డహహా యెంతబెట్టిదంబు లైనయిడుమలం బడియెదరో వీర లని కారుణ్యం బొలయ నిలిచి వెండియు నార్తలగుమాటలు విని మీ రెవ్వ రని యడిగినఁ గర్ణుండ భీమసేనుండ నర్జునుండ నకులుండ సహదేవుండ ద్రౌపదిని ధృష్టద్యుమ్నుండ ద్రౌపదేయుల మనుపలుకు లెసంగుటయు. 23

సీ. ధర్మనందనుఁడు చి । త్తమ్మున నుద్వేగ, మావహిల్లఁగ దైవ । మకట యిట్లు
సేసెనె కీ డేమి । సేసిరొకో వీర, లిన్నరకమునకు । నేఁగు దేగ
వలసినయట్టిది । వాసవాద్యమరులు, నీచులొకో వీరి । సేవిచారగ
మించుకయును లేక । యిట్టికష్టపుటిడుమలఁ బెట్టెడిదె ధర్మ । మహిమ యిట్లు
తే. మాలితే నీవు సజ్జన । మాన్యు లలఘు, సత్యపరులు దయాఢ్యులు । నిత్యదాన
రతులు బహుదక్షిణాంచిత । క్రతువితాన, పాలితాత్ములు సర్వంపుఁ । బాటు వడిరి. 24

చ. ఒకటను మేలు సేయనిసు । యోధనుఁ డమ్మెయి దేవపూజ్యుఁ డై
సకలసుఖానుభూతియు న । జస్రము పెంపు వహింప నొప్పె దు
ష్టికిఁ గడు ద్రేక నై [1]తనదు । చెల్వాలుఁ జుట్టలుఁ దాను సంతసం
బుకలిమి నేచి మిన్నడిచి । పుణ్యపదావృతుఁ డై వెలింగెడున్. 25

ఆ. ఈఁగ కాలియంత । యేనియుఁ బాపంబు, వీరివలనఁ గనుట । వినుట గలుగ
దొక్కనాఁడు నట్టి । యుత్తములకు విధి, పాడి మాలి యిట్టి । పాటు దెచ్చె. 26

సీ. అని యగ్గలపుఁజింత । మునిఁగి కలంక మ,నోవికారము నాకు । నావహిల్లఁ
గత మేమియొకొ యిది । ఘనమాయ యొకొ, గనుట యో యరయ ని । క్కంబు చిత్త
విభ్రాంతిఁ జేసి వి । వేకింప నేర రా, దయ్యెడు నని పర । మాకులేంద్రి
యుఁడు శోకదుఃఖమ । యుండు నై కొండొక, ప్రొద్దూరకుండి స । ద్బుద్ధిఁ దలఁచి
తే. యలుక యింద్రుపైఁ బొడమిన । నమ్మహాత్ముఁ
డప్పురుషుఁ జూచి మగుడ నీ । వరుగు మార్య
వర్య యెవ్వరిదూతవు । వారికడకు
ననుచుఁ బలికి వెండియు నిట్టు । లనియె నధిప. 27

ఇంద్రుఁడు నరకంబుకడ నున్నధర్మజునొద్దకు వచ్చి యాతని సంభాషించుట.

క. నాయనుజులు దుఃఖార్దితు, లై యున్నా రట్టు లగుట । నచటికి రా నిం

1. క. తనదుసిల్లులు.

నీయెడన నేను నిలిచెదఁ, బాయక యని చెప్ప నాకృపానిరతునకున్. 28

చ. అనుటయు దేవదూతుఁడు ఱయంబున నిర్జరనాథుపాలికిం
జని తెలియంగఁ జెప్పఁ గురుసత్తమ ధర్మజునిశ్చయంబు న
య్యనఘచరిత్రభాస్వరుని యాడినమాటలు నాతఁ డంతయుఁ
విని చనుదెంచె నయ్యెడకు వేగమ సంయమిదేవయుక్తుఁ డై. 29

ఆ. ధర్మజుఁడును మహామోదంబున నిజపుత్త్రుఁ, డగునజాతశత్రు ననునయించి
రక్షణం బొనర్పఁ బ్రకటవాత్సల్యత, నరుగుదెంచెఁ గురుకులాగ్రగణ్య. 30

వ. అప్పుడు. 31

సీ. వివిధపాపాత్ములు వికృతశరీరులై, యాతనాబాధితు లగుట నూనె
దుర్గంధమును గృధ్రవర్గాదిపలలాశి, పక్షిపంక్తులుఁ గుణపవ్రజంబుఁ
దోఁపవ మెఱచి నెఱత్తురు కేశపటలంబు, లస్థిపుంజము లదృశ్యంబు లయ్యెఁ
గ్రూరాసిపత్త్రఘోరారణ్యయుక్తవై, తరణి లేకుండె సరిత్పరివహంబు

తే. నింపుఁ జేయుసోఁకును [1]సాగియించుతనువు
నార వీతెంచి సమ్మోద మావహించె
నమృతమయ మిది యనఁ దగి యనిల మధిక
విశదభావంబుఁ బ్రాపించె దిశలు పదియు. 32

వ. ఆసమయంబున వాసవుతోడం జనుదెంచినట్టి. 33

మహాస్రగ్ధర. వసురుద్రాదిత్యగంధర్వగరుడభుజగవ్రాతముల్ వైభవం బు
ల్లసనం బొందంగ సిద్ధల్మనముల ముదముల్ పల్లవింపంగ సాధ్యుల్
హసితస్వాంతంబులం బెల్లలమికొనఁగ [2]సత్యాదరోత్కర్షముల్ పాం
డుసుతోపాంతంబునం బిండుగొని నిలిచి చూడ్కుల్ తదంగంబు గప్పన్. 34

వ. ఒండొరులతో నక్కురుమూర్తిగుణంబు లుగ్గడించి యగ్గించుచుండ సంయమి
సురసమేతంబుగా నయ్యాఖండలుండు నయ్యఖండయశోమండితుం జేరం జని
సాంత్వనస్వరంబున ని ట్లనియె. 35

క. నీ విచ్చో నునికికి ని, ద్దేవత లందఱును వగచి ధిషణాగుణసం
భావిత నిన్నుం దోడ్కొని, పో వచ్చినవారు గినుకఁ బో విడువ వనా. 36

క. సిద్ధియు నవ్యయలోకస, మృద్ధసుఖావాప్తియును [3]శమితవికృతియు స
ద్బుద్ధియు నుదాత్తభంగిని, సిద్ధించెను నీకుఁ గుణవిశేషముకతనన్. 37

క. విను మొక్కటి సెప్పెద రా, జనువానికి నెల్లఁ దప్ప దవనీశ్వర యె
ట్లును నారకస్థలంబుం, గనుఁగొనవలయు టిది వేదకథితము సుమ్మీ 38

సీ. పుణ్యంబులును బాపములు రెండు [4]జోకలై, యుండుఁ బుణ్యంబుల నొదవు నాక

1. క. సాకియింపుఁదనువు. 2. గ. సంగాదరోత్కర్షముల్. 3. చ. శమితనికృతిహసద్బుద్ధియు
4. చ. బ్రోవులై; జ. బ్రక్కలై.

హృద్యమై వీచుటయు దుఃఖ। మెల్లఁ బాసె
భూరిసౌఖ్యంబు నొందుచు।న్నార మేము. 21

క. నినుఁ జూడఁ గనుటఁ బటుయా,తనలం దొఱఁగితిమి పరమ।ధర్మాత్మక నీ
వనయము దయ నిచ్చట నిలి,చిన బ్రతుకుదు మింకఁ గొంత।సేపు నిలువవే. 22

ధర్మరాజు నరకమున నున్నయన్నదమ్ముల నెఱింగి పరితపించుట.

వ. అని దుఃఖభారకృపణంబు లగుచు వీతెంచినఁ గొంతేయుం డగ్రజుం డా మహా
యంతబెట్టిదంబు లైనయిడుములం బడియెదరో వీర లని కారుణ్యం బొలయ నిలిచి
వెండియు నార్తంబు లగుమాటలు విని మీ రెవ్వ రని యడిగినఁ గర్ణుండ భీమసేనుండ
నర్జునుండ నకులుండ సహదేవుండ ద్రౌపదిని ధృష్టద్యుమ్నుండ ద్రౌపదేయుల
మనుపలుకు లెసంగుటయు. 23

సీ. ధర్మనందనుఁడు చి।త్తమ్మున నుద్వేగ, మావహిల్లఁగ ద్రవ। మనక యిట్లు
సేసె నెక్కే సేమి। సేసిరొక్కో వీర, లిన్నరకమునకు। నేఁగుదేగ
వలసినయట్టిది। వాసవాద్యమరులు, నీచులుగా వీరి। నేవిచాగ
మించుకయును లేక। యిట్టికష్టపుటిడు,మలఁ బెట్టుడిచె ధర్మ।వమా[illegible]

తే. మాలితే నీవు సజ్జన।మాన్యు లలఘు,సత్యపరులు దయాధన్యులు। నిత్యదాన
రతులుబహుదక్షిణాంచిత।క్రతువితాన,పాలితాత్మలసర్వాంగు।లీభులు వడిరి. 24

చ. ఒకటను మేలు సేయనిసు।యోధనుఁ డమ్మెయి దేవపూజ్యుఁ డై
సకలసుఖానుభూతియు న।జస్రము పెంపు వహింప నొప్పి దృ
ష్టికిఁ గడు ప్రేఁక నై [1]తనదు।చెల్వలుఁ జుట్టలుఁ దాను సంతసం
బుకలిమి నేచి మిన్నడిచి। పుణ్యపదావృతుఁ డై వెలింగెడుస. 25

ఆ. ఈఁగ కాలియంత।యేనియుఁ బాపంబు, వీరివలనఁ గనుట। వినుట గలుగ
దొక్కనాఁడు నట్టి।యుత్తములకు విధి, పాడి మాలి యిట్టి।పాటు వచ్చె. 26

సీ. అని యగ్గలపుఁజింత। మునిఁగి కలంక మ,నోవికారము నాను। నావహిల్లఁ
గతమేమియొకో యిది।ఘనమాయ యొకల,గనుట యోయరయని।కన్గొంచి చిత్త
విభ్రాంతిఁ జేసి వి।వేకింప నేర రా,దయ్యెడు నని పర।మాకులేంద్రి
యుఁడు శోకదుఃఖమ।యుండు నై కొండొక,ప్రొద్దారకుండి స।ద్బుద్ధిఁ దలఁచి

తే. యలుక యింద్రుపైఁ బొడమిన। నమ్మహాత్ముఁ
డప్పురుషుఁ జూచి మగుడ నీ। వరుగు మార్య
వర్య యెవ్వరిదూతవు। వారికడకు
ననుచుఁ బలికి వెండియు నిట్టు। లనియె నధిప. 27

ఇంద్రుఁడు నరకంబుకడ నున్నధర్మజునొద్దకు వచ్చి యతని సంభాషించుట.

క. నాయనుజులు దుఃఖార్దితు,లై యున్నా రట్టు లగుట। నచటికి రానిఁ

1. క. తనదుసిల్లులు.

కీయెడఁ గోను నిలిచెదఁ, బాయక యని చెప్పు మాకృపానిరతునకున్. 28

. అనుటయు దేవదూతుఁడు రయంబున నిర్జరనాథుపాలికిం
జని తెలియంగఁ జెప్పఁ గురుసత్తమ ధర్మజునిశ్చయంబు న
య్యనఘచరిత్రభాస్వరునియాడినమాటలు నాతఁ డంతయున్
విని చనుదెంచె నయ్యెడకు వేగమ సంయమిదేవయుక్తుఁ డై. 29

. ధర్ముఁడును మహామోదంబున నిజపుత్త్రుఁ, డగునజాతశత్రు ననునయించి
రక్షణంబొనర్పఁ బ్రకటవాత్సల్యత, నరుగుదెంచెఁ గురుకులాగ్రగణ్య. 30
31

. అప్పుడు.

. వివిధపాపాత్ము లై వికృతశరీరు లై, యాతనాబాధితు లగుట మాని
దుర్గంధమును గృధ్రవర్గాదిపలలాశి,పక్షిపంక్తులుఁ గుణపవ్రజంబుఁ
దోఁపక యెఱచి నెత్తురు కేశపటలంబు, లస్థిపుంజము లదృశ్యంబు లయ్యెఁ
గ్రూరాసిపత్రఘోరారణ్యయుక్త వై,తరణి లేకుండె సత్పరిమళంబు

తే. నింపుఁ జేయుచుఁ గను [1]సాగిరయించుతనువు
నార వీతెంచి సమ్మోద మావహించె
నమృతమయ మిది యనఁ దగి యనిల మధిక
విశదభావంబుఁ బ్రాపించె దిశలు పదియు. 32
33

వ. ఆసమయంబున వాసవుతోడం జనుదెంచినట్టి.

మహాస్రగ్ధర. వసురుద్రాదిత్యగంధర్వగరుడభుజగవ్రాతముల్ వైభవం బు
ల్లసనం బొందంగ సిద్ధుల్ నముల ముదము ల్పల్లవింపంగ సాధ్యుల్
హసితస్వాంతంబులం జెల్లలమిగొనఁగ [2]సత్యాదరోత్కర్షముల్ పాం
డుసుతోపాంతంబునం బెండుగొని నిలిచి చూడ్కుల్ తదంగంబు గప్పన్. 34

వ. ఒండొరులతో నక్కురుమూర్తిగుణంబు లుగ్గడించి యగ్గించుచుండ సంయమి
సురసమేతంబుగా నయ్యాఖండలుండు నయ్యఖండయశోమండితుం జేరం జని
సాంత్వనస్వరంబున ని ట్లనియె. 35

క. నీ విచ్చో నునికికి ని, ద్దేవత లందఱును వగచి ధిషణాగుణసం
భావిత నిన్నుం దోడ్కొని, పో వచ్చినవారు గినుకఁ బో విడువ వనా. 36

క. సిద్ధియు నవ్యయలోకస,మృద్ధసుఖావాప్తియును [3]శమితవికృతియు స
ద్బుద్ధియు నుదాత్తభంగిని, సిద్ధించెను నీకుఁ గుణవిశేషముకతనన్. 37

క. విను మొక్కటి సెప్పెద రా, జనువానికి నెల్లఁ దప్ప దవనీశ్వర యె
ట్లును నారకస్థలంబుం, గనుఁగొనవలయు టిది వేదకథితము సుమ్మీ. 38

సీ. పుణ్యంబులును బాపములు రెండు [4]జోక లై, యుండుఁ బుణ్యంబులనొదవు నాక

1. క. సాకియింపుఁదనువు. 2. గ. సంగాదరోత్కర్షముల్. 3. చ. శమితనికృతిహసద్బుద్ధియు
4. చ. బ్రోవు లై; జ. బ్రకట లై.

సుఖము పాపంబులఁ ద జొప్పడు నరకదుఃఖము విను మున్న నాకంబుసుఖము ననుభవించినయట్టియతఁడు పదంపడి, యధికనారకపీడ ననుభవించు మున్న నారకదుఃఖమునఁ బడ్డవాఁ డనంతరమ నాకమునఁ దాఁ బొరయుసౌఖ్య

తే. మల్పపుణ్యుండు దొలితొలి యమరతాసు
ఖంబు గయికొని మఱియు దుఃఖముల నొందు
భూరిపుణ్యుండు మునుమును ఘోరనిరయ
యాతనల నొంది వెండి సౌఖ్యంబు లొందు. 39

క. ఇట యేను నిన్నుఁ బుత్తెంచుట యుత్తరకాలదివ్యసుఖసంగమసం
ఘటనకుఁ గాదే నీకట, కటఁబడుటకు దీనిఁ దెలుపఁగా రా వలసెన్. 40

సీ. కర్ణుఁ డుత్తమసిద్ధిఁ గాంచి వెలింగెడు, నమ్మహాభుజునకు నైన కరంబు
దుఃఖంతు నీ వెళ్లఁ దుదిముట్టి యున్నాఁ డ, తండు నిజోజ్జ్వలస్థాన మొంది
సర్వాస్త్రవిదుని నాజలజాప్తనందనుఁ, గనుఁగొని చిత్తంబు కలఁక విడువు
మనిలనందనుఁడు నర్జునుఁడును నకులుండు, సహదేవుఁడును భవత్తైన్యరూప

తే. వర్తిసర్వమహీపతివర్గములును, ద్రౌపదియు ద్రౌపదేయులు రాజవర్య
దీప్తనిజధామసంప్రాప్తిఁ దేజమలరి, యుండఁగాఁ జూచిసమ్మోదయుతుఁడవగుము.

ఆ. దైవవిహిత మగుటఁ దప్పింప రాకున్న, యట్టియల్పదుఃఖ మనుభవించి
తింక నిట సుఖంబు లేపార నాతోడ, విహరణం బొనర్పు విమలచరిత. 42

క. మానితసువ్రతములకుఁ, దానకరణమునకు ననుగుణం బయినశుభం
బే నీకుం గావింపంగా నుజ్జ్వలవృత్తిఁ బరఁగు కౌరవముఖ్యా. 43

తే. రాజసూయాశ్వమేధాధ్వరములసంచితంబు లయినయుదాత్తలోకంబు లనుభ
వింపు మాధిక్యమహనీయవిభవ మెసఁగ, నక్షయోదారసౌఖ్యంబులావహిల్ల.

సీ. మహితవర్తను లైనమాంధాతృనలహరి, శ్చంద్రదిలీపదుష్యంతభరతు
[1]లొందినకీర్తనీయోన్నతి నొందుము, నినుఁ గొనియాడంగ మునినిలింప
గంధర్వగరుడోరగప్రధానులు సిద్ధసాధ్యసత్తములును నకుతుకముగ
వచ్చినవా రని వారి నెల్లను జూప, నతఁడు వినయసంభృతాంగుఁ డగుచు

తే. నాదరముగఁ బ్రత్యుద్గతి యాచరింప, వార లెంతయుఁ బ్రీతిమై గారవంపుఁ
బలుకు లెసఁగంగ నధికసంభావనంబు, సేసి రాననములు వికసిల్లుచుండ. 45

వ. అమ్మహేంద్రుఁ డమ్మహానుభావునితో మఱియు ని ట్లనియె. 46

క. ఆకాశగంగ యిదె పుణ్యాకృతి యున్నదిఁ బరిప్లుతాంగుఁడ వై సు
శ్లోకా నాచెప్పినన్నృప, లోకంబును మిగులు మమరలోకసుఖములన్. 47

1. గ. లొందినకీర్తి నయోన్నత పొందుము.

యముఁడు ధర్మరాజు నుచితవచనంబుల సంభావించుట.

సీ. అనియె నప్పుడు ధర్ముఁ డభిరామమూర్తి [1]ము, ఖప్రసాదంబునఁ గరము వెలుఁగ
నారాజవర్యునిఁ జేరంగ నరిగి ని,స్సీమగౌరవ పరీక్షింపఁ గంటి
నిన్ను ముమ్మా అరణిప్రసంగంబున, ద్వైతవనంబునఁ దగిలి కుక్క
తో వచ్చినప్పుడు దైవతగిరిపొంత, ననుజవర్గమువిషయంబు గాఁగ
తే. నిప్పు డిచటను జలన మొకప్పుడైన, నీదుమది నించు కేనియు లేదు దమము
శమము సత్యంబు మద్గతసారభక్తి, నీకు నగ్గలములు మహనీయచరిత. 48

వ. పరిశోధితుండ వయితి కలంక దొఱంగి సుఖివి గ మ్మని పలికి రాజునకు నవశ్యంబును నరకంబు సూచుట గలదు గావున న త్తెఱంగున కయి యేనును వాసవుండును నిన్నుం గడుఁగీ డగునచ్చోటు సొనిపితిమి సగార్యతనయపవననందనాదులనరక దుఃఖానుభవంబులు మాచేసినవెడమాయంబు లగుట నీకుఁ దెలిసె వారు పుణ్య లోకవాసు లయి యునికియు వాసవువాక్యంబులఁ దేటపడియె నని చెప్పి. 49

క. నీ వియ్యాకాశనదీ,పావనసలిలముల మునుఁగు భవ్యాత్మ భవ
ద్భావంబు విడుచు మానుష,భావవికారములశోకబంధము లడఁగున్. 50

చ. పరమసుఖంబుఁ బొంది యతిభాస్వరులై విహరించునీదుసో
దరు లగుకర్ణముఖ్యుల ముదం బెసలారఁగఁ జూచె [2]దీమహో
త్తరబహుసౌఖ్యనిర్మలపదంబున దివ్యవిహారలీలలం
బరఁగెద వేల యిం కిచట బాంధవరక్షక రమ్ము చెచ్చెరన్. 51

ధర్మజుఁ డాకాశగంగావగాహంబుఁ జేసి దేవభావంబు నొందుట.

సీ. అని పల్కి ధర్ముఁ డర్తనయునిఁ దోడ్కొని, యయ్యింద్రుఁడును దోడ నరుగుదేర
నాకాశగంగయుపాంతంబునకుఁ బోవ, నప్పుణ్యనది నమ్మహానుభావుఁ
డార్యసంస్తవనవాక్యంబులు సెలఁగ భ,వ్యస్నానమంగళ మాచరించి
మానుషతనువు నమ్మాత్రన విడిచి ది,వ్యం బగుమహిత దేహంబు దాల్చి
తే. వైరమత్సరస్నేహసం[3]వాసలౌల్య,గర్వశోకాదు లైనహృద్గతవికార
ములఁదొఱంగినిర్ధూమతత్వమునవెలుంగు,పావకుఁడుఁబోలెశోభిల్లెఁబారవేంద్ర.

వ. ఇవ్విధంబున నొప్పి మీతాతధర్మనందనుండుబృందారకనాయకనారదాద్యుదార పురుషుల నభినందించుచు ధర్ముండును దారును దో నరుగుదేర దివ్యశక్తి నట నని మనోహరం బయినయొక్కయెడ. 53

సీ. విస్ఫురద్బహురత్నవితతికనత్కన,కాత్మకం బయినమహాసనమున
దేదీప్యమాన మై దివ్యావయవదీధి,తిప్రతానం బెల్లదిశల వెలుఁగఁ
జక్రగదాద్యస్త్రసంతతి యుజ్జ్వలా,త్యంతసుందరపురుషాకృతులును

1. క. యై, వదనవికాసంబుద వఱలు చుండ. 2. గ. దవ్యయోత్తరబహు-ట. దామహోత్తర బహు. 3. క. వాదలౌల్య.

జారుమాళిస్థలీ।[1]సమవేతనిజరూప, ములుఁ గల్గి భక్తిమై। బలసి కొలువఁ

తే. దనదుచూడ్కికి నెంతయుఁ। దగు లొనర్చి
మున్ను సూచినయట్లగు।మూర్తి యొప్ప
నరుఁడు కేవలసవినయ।పరత వెలుఁగఁ
బొలుచునారాయణునిఁ గాంచె। భూపవర్య. 54

వ. కని మది నమ్మహాత్ముఁ డధి।కప్రమదంబు వహించె నొండెడం
గనుఁగొని యెంతయుం బ్రియం బెసఁగఁ। గౌరవవంశవరేణ్య దీప్తిభా
ముని రవిపంక్తిలోనఁ బదు।మూఁడవమూర్తి వెలుంగుచుండఁ గ
ర్ణుని మఱి భీమసేనుని మ।రుద్గణమధ్యగతత్వశోభితున్. 55

తే. అంగములభంగి దొల్లింటి।యట్ల యై యనూనతేజోవిరాజితు।లైనవారిఁ
గనియె [2]నశ్విసమీపవ।ర్తనులఁ దత్సమానమూర్తులవీక్షించె।మాద్రిసుతుల. 56

వ. ఉదితరవిచ్ఛవిం దరుణి। నుత్పలగంధి నుదాత్తమూర్తి ద్రౌ
పది నచో సెల్లనుం దనప్ర।భ వెలుఁగొందఁగఁ జేయుదాని స
ద్విదితయశుండు సూచి మది। విస్మయ మందఁగ నింద్రుతోడ ని
మ్మదవతి యెవ్వ రార్యజన।మాన్యచరిత్ర యెఱుంగఁ జెప్పవే. 57

ఇంద్రుఁడు ధర్మజునకు దేవత్వంబు నొందినస్వజనంబులఁ జూపి చెప్పుట.

ఉ. అనవుడు నతనితో। నాతఁ డీభామ మహాలక్ష్మి ద్రౌపది। యసఁగ ద్రుపదు
నికిఁ గూఁతురై యయో।నిప్రభవం బగు మానుషరూపంబు। మహితలీల
ముగఁ దాల్చి భవదను।భూతి సెల్లించె గౌరీశ్వరునాజ్ఞ వ।హించి వచ్చె
నని చెప్పి యల్లర।మ్యాకృతు లేవురు, గంధర్వవరులు ని।క్కమలనయన

తే. యందు మీకు జన్మించిన।యక్కుమారు, లల్లవాఁడె మీతండ్రికి। నగ్రజుండు
ప్రకటగంధర్వపతిధృత।రాష్ట్రనాముఁ డిందునతఁ డంచుఁ జూపెన।రేంద్రముఖ్య.

వ. ఇట్లు ద్రౌపదీద్రౌపదేయాంబికేయుల తెఱం గెఱింగించి వెండియు నాఖండలుండు
పాండవాగ్రజునకుఁ గర్ణుం జూపి భవదగ్రజుండు సూర్యునపరశరీరంబు కౌంతే
యుం డయి రాధేయుం డనం బరఁగినవాఁడు సుమ్ము సూడు మని పలికి సిద్ధసాధ్య
విశ్వదేవగణంబులతో నున్నవారు తత్తదంశప్రభూతు లయి వాసుదేవానుచరణ
పరాయణు లగుచు వర్తించినసాత్యకికృతవర్మాదియాదవుల నాలోకింపుము. 59

క. అని చెప్పి చూపి యభిమన్యునిఁ జూచితె చంద్రుభంగి। నుజ్జ్వలకాంతిం
దనరెడుఁ దదంశజాతుం, డనూనధృతిశాలి వీఁడె। యంచుం జూపెన్. 60

వ. చూపి తదనంతరం బమ్మహాత్మునితోడ. 61

ఆ. పాండురాజు వీఁడె। బహురత్నఖచితవిమాన మెక్కి గొంతి। మాద్రి తనయు
పాంతభాగమున సుఖాసీనలుగ నాదు, వలను వచ్చుచున్న।వాఁడు గంటె. 62

1. క. సమభేదనిజ. 2. క. నశ్వినిసామీప్యగతులఁ దత్స.

క. అట భీష్ముఁడు వసువులకడఁ, గదిసి యెలమి నున్నవాఁడు • గంటే ద్రోణుం
డిటు దివిజగురునిపాలఁ బ్ర, మద మెసఁగ వసించినాఁడు • మాన్యచరిత్రా. 63

వ. అని పలుకుచుఁ జూపి గంధర్వయక్షగుహ్యకగణంబులలో ద్రుపదవిరాటులను దదీయానుజతనుజవర్గంబులనుం దక్కనుం గలుగు కేకయపాండ్యప్రభృతి నానాదేశాధీశులను వేరువేరం జెప్పుచుఁ జూపుచు భవదీయం బగుసమరంబునం బరిత్యక్తశరీరు లయి యుత్తమలోకంబులు వడసి యున్నవారల నవలోకింపుమని చెప్పె ననిన విని జనమేజయుండు వైశంపాయనుతో మునీంద్రా యిప్పుడు నీచెప్పినసుయోధనశకునిసైంధవులును గర్ణుండును గర్ణకుమారకులును వెండి యుం గలతత్పక్షభూపతులును ఘటోత్కచాదు లయినపాండవులవారును నీచెప్పినసకలజనంబులు నాలోకంబున నెప్పుడు నుందురో యట్లు గాక కొంతకాలంబు నిలిచి క్రమ్మఱ మనుష్యాదిజన్మంబులు నొందుటకై యరుగుదెంతురో యుత్తరంబు విన వలతుం జెప్పవే యని యడిగిన మ్మునిపతి యమ్మనుజపతితో ని ట్లనియె. 64

సీ. కురువర యిది దేవగుహ్యంబు మునివరుఁ
డైన వేదవ్యాసుఁ • డతులకరుణఁ
జెప్పినయది నీకుఁ • జెప్పెద సమవధా
నంబుతో వినుము సనత్కుమారుఁ
గలసెఁ బ్రద్యుమ్నుఁ డనన్యులకు దురాసదం
బయినకు బేరలోకానుభవము
ధృతరాష్ట్రుఁ డొందెను • సతియుఁ దానును నింద్రు
భవనంబునన నిల్చెఁ • బాండునృపతి

తే. యాంద్రు రిరువురుఁ దో నిల్వ • నమృతకరునిఁ
గూడె నభిమన్యుఁ డనిమిషగురుని నొందెఁ
దత్ప్రతీకాశుఁ డయినకోదండగురుఁడు
ద్వాపరాత్మకుఁ డయ్యె గాంధారవిభుఁడు. 65

క. రారాజు నాకనరకో, దారసుఖాత్యంతదుఃఖధామంబులఁ బెం
పారియు హీనత నొందియుఁ, గౌరవకులనాథ పిదపఁ • గలియం దొందెన్. 66

వ. అట్లుపోలె నాకనరకంబు లనుభవించి. 67

ఆ. అతనితమ్ము లెల్ల • యాతుధానావలిఁ, గలసి రాత్మజనకుఁ • గలసె సూర్యుఁ
గర్ణుఁ డధిప వసువు • గావున వినుము గం,గాత్మజుండు వసువులందు నిలిచె. 68

వ. ద్రుపదుండును విరాటుండును ధృష్టకేతుండును భూరిశ్రవుండును శల్యుండును శంఖుండును నుత్తరుండును విశ్వనామదేవతలఁ గలసిరి ధృష్టద్యుమ్నుండు హుతవహునిఁ గూడికొనియె నని చెప్పి యప్పరమసంయమి యప్పుడమిఱేనితో

వెండియు నిట్లనియె. 69

తే. వినుము ధర్మనందను పుణ్యతనువు సందుఁ
దగఁ బ్రవేశించి యున్న విద్యామయాత్ముఁ
డైన విదురుండు నమ్మహితాత్మబోధ
శాలియును ధర్ముఁ గూడిరి సచ్చరిత్ర. 70

సీ. కమలగర్భునినియోగంబున నిజయోగ, బలము గైకొని బలభద్రదేవుఁ
డంబుధి కరిగి యనంతుఁ బరమమూర్తిఁ, గలసె నత్తెఱఁగు మున్నలఘుకీర్తి
ధన నీకుఁ జెప్పితిఁ దక్కటివృష్ణిభో, జాంధకు లెల్ల గుహ్యకగణంబుఁ
గూడిరి కృష్ణుసంక్రీడకుఁ బాత్రంబు, లైనషోడశసహస్రాంగనలును

తే. విధినియుక్తకాలంబున విను సరస్వ, తీజలంబుల మునిఁగి యుత్కృష్ట మగుని
జాప్సరోభావ మొందినారాయణునియు, పాంతచారిణు లైరి ప్రహర్ష మెసఁగ. 71

చ. అనుమరణంబునం దగ మురాంతకు రుక్మిణి సెందె లక్ష్మి స
వ్వనరుహనేత్రు తక్కఁ గల వామవిలోచన లేడ్వురుం దదీ
యనుతతనుప్రవేశనసమాచరణం బొనరించి రవ్వరాం
గనలును లక్ష్మి యంశములు కావునఁ గౌరవవంశవర్ధనా. 72

వ. అని చెప్పి యమ్మహాయుద్ధంబున మృతులైనయట్టివారును నేను మున్ను ప్రసం
గించినయట్టివారును బ్రసంగింపనివారును నిట్టిట్టిగతిం బ్రాపించి రని నాచే
తం జెప్పంబడినవా రెల్లను నిజార్హప్రకారంబుల సురాసురయక్షగుహ్యకగంధర్వ
బృందంబులం జెందిరి కురునందనా నీయడిగిన తెఱం గెఱిఁగించితి నని వెండియు. 73

తే. వినుము పాండవకౌరవవిషయ మైన, యట్టియితిహాస మే నుపాఖ్యానజాత
సహిత మగునట్లుగా సమస్తంబు మహిత, విస్తరంబుగఁ జెప్పితి విశదభంగి. 74

వ. కృష్ణద్వైపాయనమునీంద్రుండు సత్ప్రసాదభరితుం డై యాజ్ఞాపింప నట్లు తదీ
యానుజ్ఞ వడసి తద్దయాలబ్ధప్రజ్ఞావిశేషుండ నై యశేషంబును వివరింప నమ్మ
హాత్ముకారుణ్యంబున నిమ్మహనీయేతిహాసంబు [1]సమాధానమానసుండ వై యా
కర్ణించి నీవును బహుళపుణ్యాత్ముండవుఁ గృతార్థుండవుఁ బరమార్థవిదుండవు
నైతి వని యిట్లు సాంద్రానందసంపాదనశీలుం డై. 75

క. శ్రీనిత్యత్వప్రమదా, ధానకుతూహలనిరూఢతాస్తవ్యాపాం
గా నిర్భర వేదవ్యా, సానేకవచోనుషంగ హరిహరనాథా. 76

వ. దేవా వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పె నట్లు సర్పయాగసమయ
ప్రవృత్తం బైనమహాభారతం బంతయుఁ దత్సభాగతుం డైన రోమహర్షణనామ
ధేయుండును సాత్యవతేయశిష్యుండును బండితప్రవరుండును నగుసూతుని

1. క. సమాధానమానసీయుండ వై.

పుత్త్రుం డైనయుగ్రశ్రవుం డనియెడుకథకుండు సమ్యగవధానంబున నాకర్ణించిన
వాఁ డగుటను సమాశ్రితవత్సలుం డైనయాకృష్ణద్వైపాయనుననుగ్రహంబునఁ
దత్కథాసాకల్యవివరణవిశారదుం డై యుండు నతండు నైమిశారణ్యపుణ్యక్షే
త్రంబునందు శౌనకుం డనుకులపతి మొదలుగాఁ గలకొండఱు మహామునులు
సత్త్రయాగం బాచరించుచుండ నయ్యెడకుం జని వారలం గాంచినఁ బుణ్యకథా
శ్రవణకౌతుకాధీనమానసు లై యమ్మానసీయులు పుణ్యాత్మకుం డైనయక్కథ
కునకు సముచితార్చనంబులం బ్రియం బొనర్చి కథాకథనంబుఁ బ్రసంగించినం
బ్రీతుం డై యాతం డేమి తెలుంగుకథ వినం గోరెద రనుటయు నప్పరమార్థపరా
యణు లతనితోడ నెయ్యది హృద్యంబును నపూర్వంబును సమగ్రజ్ఞానప్ర
దంబును నఘనిబర్హణంబును నై నయది యక్కథ మాకు విన నిష్టం బని పలు
కుటయు. 77

క. అతఁ డింతటిది మహాభా, రతంబ యనునిశ్చయము దిరంబుగ మతిసం
గతి మగుడు నమ్మహాత్ముల, కతివిశదము గాఁగ నిమ్మహాకథ సెప్పెన్. 78

వ. చెప్పి యిట్లనియె నట్లు జనమేజయుండు సర్పయాగకర్మానుష్ఠానంబులయెడ వైశం
పాయనువలన నవ్వినుతేతిహాసంబు విని విస్మితుండును బ్రమోదభరితుండును
నయ్యె నక్కాలందిం దదీయయాజకులు యజనసమాపనవిధి యనుష్ఠించి రయ్యుధి
ష్ఠిరానుజపుత్త్రపౌత్త్రుఁ డత్తెఱంగున భుజంగంబులయాపద దీర్చినయాస్తీకు నభ్య
ర్చనంబున నత్యంతసంతుష్టునిం జేసి యతనినివాసంబునకు ననిచిపుచ్చి ఋత్విజు
లాదిగా నఖిలబ్రాహ్మణులకు బహుధనంబు లొసంగి వినయం బెసంగ నామంత్రి
తులం జేసిన వారలు నిజనివాసంబులకుం జనిరి వైశంపాయనుఁ బెంపారుసవిశేష
పూజనంబులఁ బరితోషితుం గావించి దేవోపచారంబులఁ గృష్ణద్వైపాయనము
నీంద్రుం బూజించి యజ్జనపతి సకలజనంబులు ప్రస్తుతింప విభవంబు శోభిల్లఁ
బురంబుఁ బ్రవేశించె. 79

సీ. అని చెప్పి యాశౌనకాదిమునీశ్వర, గణముతో మఱియు నక్కథకుఁ డింపు
మిగులంగ ని ట్లను మేటిమునీశ్వర, సంఘంబులో నెల్ల సత్యదర్శి
సర్వవిధిజ్ఞాత సర్వవిజ్ఞానభ, వ్యాత్ముండు సర్వేంద్రియప్రబోధ
శాలి సర్వజ్ఞుండు శౌచశాంతిక్షమా, దాంతితపోనిత్యతావిభాసి

తే. యాప్తసర్వవిధైశ్వర్యుఁ డఖిలసాంఖ్య, యోగభేదవిదుండు ధర్మోపదేశ
చతురవాగ్విలాసుండు నిరస్తతత్త్వవస్తు, వేది సాత్యవతేయుండు వేదమయుఁడు. 80

వ. పాండవులకీర్తిం బ్రకటించుటకును మఱియుం గొండఱు జనపతులచరిత్రంబులు
జనుల కెఱింగించుటకును దేవదేవుం డగువాసుదేవునిసంక్రీడావిశేషంబులు వివ
రించుటకును సర్వదేవజాతులజన్మంబులును దదీయసాయుజ్యంబులును దేటపఱుచుట
కును సకలధర్మంబులునుం దెలుపుటకును గాఁ బంచమవేదం బయిపరఁగు నిమ్మహా

భారతసంహిత యొనర్చె నిమ్మహితేతిహాసంబు సంవత్సరత్రయకృతంబు దీనివిశే షంబు వినుండు. 81

తే. అమలధర్మార్థకామమోక్షములగుఱిచి
యొలయు తెరు [1]వెద్దియును నిందుఁ గలుగు నదియ
యొండెడలఁ గల్గు దీన లేకుండుచొప్పు
దక్కొకంటను లేదు వేదజ్ఞులార. 82

సీ. పూతాత్ములార యీపుణ్యేతిహాసంబు, జనమేజయుఁడు సేయుసర్పమఖము
కాలంబునం దట్లు కారుణికోత్తముఁ, డైనవేదవ్యాసుఁ డాదరమున
నాజ్ఞాపనము సేయ నతనిశిష్యుఁడు లోక,నుతుఁడు వైశంపాయనుండు సెప్పె
నన్నరేంద్రుఁడు విన నాసభ నిలిచి స,వినయభక్తికముగ వినిసవాఁడఁ
తే. గధనశక్తియు నమ్మునికరుణవలనఁ, గలిగె నాకిప్పుడంగుస గారవించి
మీరు వినుచుండఁ జెప్పెదు మేటిపదము, గంటి మంటి మీఁదయ పెంపునతసఁ జేసి. 84

వ. [2](అని పలికి వెండియు).

ఫలశ్రుతి.

క. అలఘుమతులార పర్వం,బుల నీయితిహాసరత్నమును వినిన నఘుం
బులు వాయు నాకలోకము, గలుగును సిద్ధించు ముక్తి కాంక్షిత యైనన్. 85

క. ఆద్యంతంబును నీయన,వద్యకథ వినంగఁ గనినవారికిఁ బాయున్
సద్యంబ బ్రహ్మహత్యా,వద్యము మొదలైనపాపవర్గం బెల్లన్. 86

క. సురపితృకార్యంబుల భూ,సురులకు దీని వినిపించుసుకృతాత్ముఁడు త
త్కారణఫలంబుల నధిక,స్ఫురితంబుగఁ బడయు మహితబోధనులారా. 87

క. మానసముల నింద్రియముల, నేనియుఁ జేయంగఁబడినయేనగపుంజం
బీనిర్మలేతిహాసము, వీనుల నొక్కింత సిలుక విరియు సకలమున్. 88

ఉ. భ్రాజితవృత్తిమైఁ బరఁగుభారతసంహిత సంయమీంద్రులా
రా జయనామకంబునను రాజితభంగి జగత్త్రయంబునం
బూజితకీర్తియై నెగడుభూరిజయోన్నతిఁ గంద్రు దీనిచే
రాజు లిలాసురుల్ మఱి యరాతుల గెల్తురు విన్నయంతటన్. 89

ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువుం
భూరియశంబునుం బ్రమదముం దృఢవిద్యయుఁ గల్గు వారి కే
కోరిక లైన వేగ మొనఁగూడు సుపుత్త్రునిఁ గాంచు సద్వరుం
గారవ మొప్పఁగాఁ బడయు గర్భిణియుం వరుసం గుమారియున్. 90

ఉ. శిక్షితచిత్తులార శుభసిద్ధులు వొందు ననేకజన్మపా

1. వెద్దియే నిందుఁ గలుగునదియు, యొండెడలఁ గల్గి దీన లేకుండుచొప్పు, దక్కొకంటను లేదు
2. ఇది వ్రాఁతప్రతులఁ గానిపింపదు.

పక్షపణంబునన్ వెలుఁగు భారతసంహిత కెల్లఁ బుండరీ
కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని విన్నమానవుం
[1]డక్షయపుణ్యలోకములయందు రమించు నిరామయస్థితిన్. 91

ఉ. వ్యాసమునీంద్రసారకరుణాతిశయంబున భారతార్థము
ద్భాసితమైనయట్టినుతభాగ్యునకున్ సకలాగమార్థసం
వాసన మావహిల్లు జనపంక్తులు కీర్తన సేయ శశ్వదు
ల్లాససుఖానుభూతి నచలస్థితి నొప్పు నతండుదాత్తుఁడై. 92

వ. అని యిట్లు సమస్తపురాణపారీణుండైనసూతుండు. 93

చ. పరమపదాప్తిహేతు వగుభారతసంహిత శౌనకాదిభూ
సురవరు లింపునం గరఁగుచొప్పునఁ జెప్పిన వారు మోదసం
భరితతఁ బొంది యక్కథకు బ్రాతిగ నర్చితుఁ జేసి రర్మిలిన్
హరిహరనాథ సర్వభువనార్చిత నన్ దయఁ జూడు మెప్పుడున్. 94

ఉ. పావన దుర్దశాపహ శుభప్రదమూర్తి సుధానుభూతిసం
జీవితభక్తలోక తులసీదళదామకపాలమాలికా
భావిభవాభిరామ పరిపక్వతపఃఫలరూప సాంఖ్యవి
ద్యావహయోగశక్తివిశదాద్భుతఖేలన లోకపాలనా. 95

క. దేవాదిచతుర్విధభూ,తావాసా సుకృతహృదయహారివిలాసా
కేవలభావానందమ,యా వేదవ్యాసవర్ణనారూఢదయా. 96

మాలిని. అకృతకమధురోక్తివ్యాప్తసందీప్తసారా
సకలభువనరక్షాశాలిశుంభద్విహారా
శుకజనకమనీషాశుద్ధబుద్ధానుభావా
[2]సకృపకృతవిలాసా సంభృతానందభావా. 97

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతమునందలిస్వర్గారోహణపర్వంబు సర్వంబు నేకాశ్వాసము. 98

శ్రీమదాంధ్రమహాభారతము

సంపూర్ణము.

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తు తే ॥

శ్రీకృష్ణార్పణమస్తు.

---

1. గ. డక్షయసౌఖ్యసత్పథమునందు. 2. క. సకృదకృతనతారీ- గ. సకృతిసుకృ[illegible].

Formes G 5 to G 51 Printed at the Kesari Printing Works, Madras